శ్రీమద్ధన్వంతరయే నమః

శ్రీ బసవరాజు గారిచే
రచియింపబడిన

# బసవరాజీయము

## ఆంధ్ర తాత్పర్య సహితము

స్వకృతాంధ్ర తాత్పర్యమును బరిశోధించు విషయమున
శ్రీరంగపట్టణం - ఘూర్జర - జయకృష్ణదాసు గారియు
సహాయము బొందిన

శ్రీవత్స గోత్రోద్భవ శ్రీమత్పువ్వాడ వంశమౌక్తికాయ మాన
లేట్ శ్రీమద్వేంకటరాయ పుత్రులగు
(లేటు) పువ్వాడ సూర్యనారాయణ గారిచే
బరిష్కృతము కావింపబడినది

ప్రకాశకులు :

A. B. S. పబ్లిషర్సు

మెయిన్‌రోడ్ రాజమండ్రి (A P.)

 1989

# హెచ్చరిక

ఈ పుస్తకము యొక్క కాపీరైటు మొదలగు సర్వాధికారములు శ్రీ పబ్బా రంగయ్యగుప్త వారివలన మాకు చెందియున్నవి. కావున మా అనుమతి లేనిదే యితరులు అచ్చువేయుటగాని యితర భాషలలో తర్జుమా చేయుటగాని జరిగినయెడల మాచే నొనర్పబడు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యిందుమూలముగ తెలియ జేయడమైనది.

ఇట్లు

**A. B. S. పబ్లిషర్సు**

పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు.

మెయిన్ రోడ్ - రాజమండ్రి

ప్రకరణమున అర్శోపదంశశూకదోషాండవృద్ధినిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యములును, పంచదశ ప్రకరణమునందు వంధ్యార్తవయోనిదుర్మాంసపుష్పావరోధరోగ నిదానములును, తచ్చికిత్సలును, గర్భిణీచికిత్సాను క్రమపథ్యాదులును, షోడశప్రకరణమునందు అసృగ్దరాస్థిస్రావ యోనివ్యాపత్తి యోనికంద గర్భపాత మూఢగర్భ యోనిసంహరణస్తన సోరు గర్భిణీరోగ లక్షణ తత్సాధ్యాసాధ్యములును, తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును చర్చింపఁబడియున్నవి.

సప్తదశప్రకరణమునందు నేత్రరోగనిదానములు, తల్లక్షణములు, సాధ్యాసాధ్యతలు, చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును, అష్టాదశప్రకరణమున స్థౌల్యమేదోవృద్ధిమదాత్యయ నాసాశిరోరోగలక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును, ఏకోనవింశ ప్రకరణమున గుల్మశూలరోగనిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సాను పానపథ్యాపథ్యంబులును, వింశప్రకరణమునందు ఉన్మాదాపస్మారలక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును కూర్పంబడినవి.

ఏకవింశ ప్రకరణమున భగంధర వ్రణాగంతుక వ్రణ నాడీవ్రణాగ్నిదగ్ధవ్రణ లూతవ్రణ మర్కట్యర్బుదగళగండ గండమాలకర్ణముఖ దంతజిహ్వా తాలుగత కంఠగత దంతవ్రణ తుండివ్రణకూపజంతి రాజస్నాయుకస్తనవ్రణ గళగ్రంధి గళకీలాస్య స్ఫోటకీలక కాలస్ఫోటాదిక శ్లీపద రోగనిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును, ద్వావింశప్రకరణమున అజగల్లి కాంధాలజీవి వృతాదిపిటికకచ్ఛపిక వల్మీకపనసిక జాలగర్దభాది సర్వక్షుద్రరోగలక్షణ తచ్చికిత్సానుపానంబులును చేర్చఁబడినవి.

త్రయోవింశప్రకరణమున విషలక్షణ తచ్చికిత్సానుపానాదులును, చతుర్వింశ ప్రకరణమున జ్వరాతిసార సంగ్రహణ్యర్శోరోగ పాండురోగ కామలా రక్తపిత్తక్షయరోగ కాసహిక్కాశ్వాసారుచి ఛర్దిరోగతృష్ణా దాహోన్మాదాపస్మార వాతరోగాజీర్ణశూల కర్ణశూల శూలానాహోదావర్త గుల్మహృద్రోగ మూత్రకృచ్ఛ్రాశ్మరీరోగ ప్రమేహోదరశోఫగళగండ గండమాలశ్లీపదమస్తక వ్రణభగందరోపదంశ ముఖకర్ణరోగ కర్మవిపాక తచ్ఛమనోపాయంబులును, పంచవింశ

ప్రకరణమున రస గంధకాది ద్రవ్యశుద్ధులును, సర్వలోహశుద్ధి తద్భస్మసిందూర క్రమంబులును, మృతలోహామృతీకరణంబును, తద్భస్మగుణాగుణంబులును, నవరత్నశుద్ధి తద్భస్మగుణాగుణంబులును గలిగియున్నవి.

ఇట్టి యీసర్వోత్కృష్టమగు వైద్యప్రకరణమగు బసవరాజీయమును పెక్కేండ్లక్రిందట కీర్తిశేషులయిన శ్రీ పువ్వాడ సూర్యనారాయణరావుగారు చక్కని తెలుగుటీకతో సవరించి ముద్రించిరి. దీనిని మేము సర్వాంగసుందరముగాఁ తిరిగిముద్రించి ప్రకటించితిమి.

ఈ గ్రంథముయొక్క కాపీరైటు మొదలగు సర్వాధికారములు శ్రీ పబ్బా రంగయ్యగుప్త వారివల్ల మేము హొందియున్నాము.

ఇట్లు,

రాజమండ్రి
23-2-89

A. B. S. పబ్లిషర్స్
మెయిన్‌రోడ్ - రాజమండ్రి



శ్రీ ర స్తు.

# అ వ త ర ణి క.

శ్రీమత్కమలాసన పురందరాది బృందారక సందోహ మకుట తటీజాజ్వల్యమాన మణిప్రభాసీరాజిత చరణారవింద జగజ్జన్మస్థేమ భంగకారణీభూతుఁడు నగు పరమేశ్వరునిచే సృజింపఁబడిన ప్రపంచస్థ శరీరధారులు తరించుటకు ధర్మాదిరూప పురుషార్థచతుష్టయంబు లాది మూలంబు దానిలో శ్రుతి, స్మృతి, పురాణాగ మోక్త నిత్యనైమిత్తి కాది సకలధర్మంబులు; పరమపురుషార్థ మోక్షమునకు సాక్షాత్తుగ నేని, పరంపరగనేని సాధనంబులు. అర్థకామంబులు! ధర్మమూల సాధనంబులు. అట్టిపరమపురుషార్థ మోక్షసిద్ధికిఁ దత్త్వజ్ఞానము సాక్షా త్తుగఁ గారణంబు; మఱియు నిత్యానిత్యవస్తువివేకాదులు శమదమాది గుణంబులు, బుద్ధి, మనశ్శుద్ధి, నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానంబులు, గురు దేవ, భూదేవాద్యర్చనము, దీర్ఘకాలజీవనము, శరీరారోగ్యము మొదలగునవి పరంపరగసాధనంబులు; కావున ధరను జనించెడు శరీర ధారికి "ధర్మార్థకామమోక్షాణాం శరీరం సాధనంయతః" అనువాఖ్యా నుసారంబుగఁ బురుషార్థచతుష్టయముల సాధించుటకు శరీరమేయాది మూలంబు; అది రక్త మాంసాస్థి చర్మ సిరాదియుక్తంబై "పూర్వ జన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే" అను వచనానుసరణి సప త్న్యాది రోగవ్యాజంబులఁ బూర్వజన్మకృతపాపములవలనఁ బలుదెఱం గులగు రోగంబులచేఁబీడింపఁబడు; కావున మేనఁ బ్రాణముండువఱకు దానిం గాపాడికొనక తప్పదు; అట్లు గాకున్న నెంతటి మనోనిశ్చల త్వముగలవారికైన రోగపీడచేఁ జలనంబుగలిగి తన్మూలంబున మోక్ష సాధకకార్యవిఘ్నం బగు. ఎంతధనవంతుఁడైననేమి. ఎట్టి సుందరా కారుఁడైననేమి, ఎట్టివిద్యావంతుడైననేమి, ఎట్టియోగియైననేమి, శరీరా

గ్యము లేకున్న సాధన సౌందర్య విద్యాయోగములుఁ గాల్పనా? రోగపీడితుండై సదాదుఃఖించుచుండుటకంటే నొకపెట్ట నట్టెగిట్టుట మెచ్చని యెల్లరు నుల్లంబుల నెంతురు; కావున దేహారోగ్యసంపద నార్జింపకుండువారల తపో ధన సౌందర్య విద్యాదులు నిరర్థకంబులు. దానంజేసి పురుషార్థ చతుష్టయ సాధనానుష్ఠానమునకై శరీరారోగ్య దీర్ఘాయువుల జగతిజనులెల్ల నార్జించుట సకలధర్మంబులలోనం బ్రథమ ధర్మంబు.

అట్టి శరీ రారోగ్య దీర్ఘాయువులు పృథ్విం గల సకల వైద్య శాస్త్రంబులకు నాదియైన యాయుర్వేదాధీనంబై యుండు. శరీరేంద్రియ బలజీవులకు దీర్ఘకాలమవలకుఁ బరస్పరసంబంధము గలిగి యుండుటయే దీర్ఘాయువనంబడు. అట్టిసంబంధమును దెలుపునదియే యాయుర్వేదము. దానిని జగత్సృష్టి పరిపాలనాదికర్తయగు హిరణ్యగర్భుండు ప్రజలహితార్థమై కల్పించి యాయురారోగ్యముల దాని యధీనము చేసె. అది సర్వలోకములయందు వ్యాపించుటకై తొలుత హిరణ్యగర్భుండు స్వాయంభువమనువునకు నుపదేశించె; పదంపడి యతనివలన నశ్విని దేవతలు నెఱింగిరి; వారివలన నింద్రుడు గ్రహించె; నతనివలన స్వర్గవాసులగు దేవతల జరాజాడ్యమృత్యువులను వారింపం జేయునట్టియాది దేవుండైన ధన్వంతరిపడసె.

ఇటుల నాయుర్వేదము దేవలోకమునందే ప్రఖ్యాతిం జెందియుండ ధర్మహీనతవలనఁ బురుషార్థ చతుష్టయములకు శత్రుప్రాయంబులగు రోగములు భూమండలమునవ్యాపించి ప్రాణుల బీడింపందొడంగ నాయురారోగ్యంబులులేక వివిధవేదనలచేఁ బీడింపఁ బడుచుఁ బుత్రమిత్రకళత్రాదులంగూడియు ననాథలంబోలివిలపించుచుఁ జరించుటను మహాపుణ్యాత్ములును, బ్రహ్మజ్ఞాన యమనియమప్రాణాయామకృచ్ఛ్రచాంద్రాయణాదిరూప తపోవంతులును నై బ్రహ్మతేజస్సుచే జ్వలితాగ్ని

వలెఁ బ్రకాశించుచుండు వసిష్ఠ కశ్యప, జమదగ్న్యాది మహర్షులు గాంచికృపా రసపరిపూర్ణులై పుణ్యక్షేత్రములలో నుత్తమంబగు హిమవత్పర్వతస్థిత తపోవనంబునం జేరి యొకకథ నుపక్రమించిరి తెలంగెట్లనిన—శ్రుతిస్మృతి పురాణాగమోక్తస్వర్గాది సాధకాగ్ని హోత్ర స్నానసంధ్యావందనాది సకలపురుషార్థములసాధించుటకు నారోగ్యము ప్రధానంబు అట్టిదానికి శత్రుప్రాయంబులగు రోగములు భూమండలమున జనించియున్నయవి. కావున వాని నివర్తకోపాయంబు నెఱింగి జగతీజనుల కారోగ్యాది సకలసిద్ధులు వాటిల్లునటులఁ జేయుటకై తపోవిశేషముచే ధ్యానము సేయుచుండొడంగ వారలకు దేవేంద్రుడు ధ్యానచక్షువులయందు గోచరింప నితండు రక్షకుండని నిశ్చయించి మహర్షులందరు మనలో నెవ్వాఁడు దేవేంద్రుని మందిరమునకేగి రోగశమనోపాయము నెఱింగి రాగలఁడని చింతింపఁదొడంగిరి. అట్టిసమయంబున ఋషిశ్రేష్ఠుండగు భరద్వాజమహాముని వారలఁగాంచి యోమహాత్ములారా! నన్ను మీరలందఱును గ్రహించివంచిన దేవేంద్రుని కడకేగి సాధించుకొనివచ్చెదననివచింపః దపస్సంపన్నుండగు నా భరద్వాజ మహామునిం గడుఁబ్రేమచేఁబనిపిరి. అంతనతండు దేవేంద్రునిచెంతకేగి జయాశీర్వచనంబులఁ బొనర్చ నతండుకడుసంతుష్టుండై యత్తాపసోత్తమునకు హేతులింగౌషధాత్మక త్రిస్కంధజ్ఞానహేతు భూతాయుర్వేదమునంతయు నుపదేశింప దాని బాగుగ నెఱింగి యాభరద్వాజుండు భూమండలమునకేతెంచి యంగిరస్సు మొదలగు మహర్షుల కుపదేశించె వారలలో నొక్కండగు ఆత్రేయమహాముని సర్వభూతకృపారసపరిపూర్ణహృదయుండై అగ్నివేశుఁడు, పైలుఁడు, జాతుకర్ణుఁడు మొదలగువారల ధ్యయనముసేయింప వారలు నాయాయుర్వేదమంతయుం బాగుగ నెఱింగి కాలదేశవయోరోగ బలశరీర దార్ఢ్యౌషధప్రభావాద్యానుగుణ్యంబుగ ననేకసంహితలు రచియించిరి. అందు చరకము, మాధవకల్పము, బాహటము, సిద్ధరసార్ణవము, భేషజ

కల్పము, మాధవీయము, అశ్వినీయము, అయుర్వేదము, సిందూర మణిదర్పణము, పూజ్యపాదీయము, నిత్యనాథీయము, రసరత్నాకరము, వైద్యచింతామణి, మాధవనిదానము, ఆయుర్వేదాశ్రయ భాష్యము మొదలగునవి యనుభవమునందుండు గ్రంథంబులు; ఇవిగాక కన్నగాధిపునికైన నెన్న సామాన్యముగాని పెక్కువైద్యగ్రంథంబు లెన్నియేనియుం గలవు.

ఐననేమి, "క్వచిచ్ఛాస్త్రే క్రియానాస్తి క్రమసంఖ్యానచక్వచిత్ మాత్రాయుక్తిః క్వచిన్నాస్తి సంప్రదాయోనచక్వచిత్ । క్వచిద్రోగనిదానాని పథ్యాపథ్యంచనక్వచిత్ । తేనసిద్ధిర్నతత్రాస్తిరససేవాథరసాయనే" అను వచనానురూపముగ నవియన్నియు రోగనిదానతల్లక్షణ సాధ్యాసాధ్య పథ్యాపథ్యలక్షణాది విహీనంబులై యుండు.

మఱియు "యుగక్రమా ద్ధర్మబలస్యనాశ స్తథాక్రమా జ్జీవగతిశ్శరీరే । కృతేయుగేప్యస్థిగతశ్చ జీవ స్త్రేతాయుగేమజ్జగతోవిధేయః। ద్వాపారగే మాంసగతశ్చజీవః కలౌయుగే త్వగ్గతిచాన్నపానే" అను వాక్యప్రమాణంబున శరీరమునందలి జీవుండు కృతయుగమున అస్థిగతముగ, త్రేతాయుగమున మజ్జాగతముగ, ద్వాపరయుగమున మాంసగతముగ, కలియుగమున ననుపానాశ్రితముగనుండుటచేత "కృతేతు చరకః ప్రోక్త స్త్రేతాయాంతురసార్ణవః। ద్వాపరేసిద్ధవిద్యాస్యాత్కలౌ బసవకస్స్మృతః" అనువచనప్రకారము చరక రసార్ణవ సిద్ధవిద్యాభూ మొదలగు వైద్యగ్రంథములు అస్థిగత, మజ్జాగత, మాంసగత, జీవోక్తయుక్తచికిత్సామయంబులై యుండుటచేనవి యన్నియుం గృత, త్రేతా, ద్వాపరయుగోపయుక్తంబులనిస్పష్టమగుచున్నయవి. దానంజేసి "యః తోమందాగ్ని యోహ్రస్వా హుసస్త్వానరాః కలౌ" అను వాక్యానుసారిగ "కృతేతుమానవాధర్మా స్త్రేతాయాంగౌతమాస్స్మృతాః ద్వాపరే శంఖలిఖితాః కలౌపారాశరాస్స్మృతా ॥" అనువచనభంగిపరా

శర్మలవారుకలియుగమునందలి ప్రాణుల శరీరదార్ఢ్యాద్యనుగుణ్యముగ నాచారప్రాయశ్చిత్తాముల సంకోచపఱచి పరాశరస్మృతిని రచియించిన తెలుంగుననే "శ్రీనీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావార్య భోగవిహారపారీణ నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ నమశ్శివాయ సత్పుత్రపవిత్ర కవితా చాతురీధురీణ వైద్యజనశిరోభూషణమనుబిరుదుచేవాసికెక్కినవాఁడును వైద్యశాస్త్రపారీణుండునునగు బసవరాజు" ఆయుర్వేదము మాధవనిదానము, భైరవకల్పము జాతుకర్ణము, చింతామణి, శారీరసూత్రము, నందినాడీయము, కర్మవిపాకము, సింధూరమణిదర్పణము, దేవసిద్ధకల్పము మొదలగు సర్వవైద్యశాస్త్రంబుల బాగుగఁబరిశీలించి వానియందలి సారమునంతయుఁగొని కలియుగమున నన్నపానమూలకంబుగజనించు సర్వరోగనిదానతల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యలక్షణయుక్తంబుగ వైద్యగ్రంథములకన్నిటికిశిరోభూషణంబగువృషరాజీయమను నామాంతరముచేఁ బ్రసిద్ధిఁజెందిన "బసవరాజీయమును" నీ గ్రంథము నిరువదియైదు ప్రకరణంబులు గలదిగ లోకహితార్థమై రచియించె. అందు బ్రథమప్రకరణమున అష్టధాతునిదాన జ్వరనిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యలంఘన వివరణంబును, ద్వితీయప్రకరణమున త్రయోదశ సన్నిపాతసప్తవిధదోష లక్షణ తత్సాధ్యాసాధ్య దినప్రమాణ తచ్చికిత్సానుపానంబులును, తృతీయప్రకరణమునకాయమనోదోషనిదాన మూత్రపరీక్షతత్సాధ్యాసాధ్యంబులును, చతుర్థప్రకరణమున క్షయరోగనిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును, పంచమ ప్రకరణమున పాండు. శోఫ కామిలారోగనిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్యతచ్చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును,షష్ఠప్ర వాతరోగ నిదానతల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికి

లంఘన వివరణములును, ద్వితీయప్రకరణమునందు త్రయోదశ విధములగు సన్నిపాతములు సప్తవిధదోషలక్షణములు, తత్సాధ్యాసాధ్యములు, దినప్రమాణ తచ్చికిత్సానుపానములును వివరింపఁబడినవి.

తృతీయప్రకరణమునందు, కాయ మనోదోషనిదానమూత్ర పరీక్షలును, తత్సాధ్యాసాధ్యతలును, చతుర్థప్రకరణమునందు క్షయరోగనిదానములు, తల్లక్షణములు, తత్సాధ్యాసాధ్యములు, తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యంబులు, పంచమప్రకరణమునందు పాండు, శోఫ, కామిలారోగనిదానములును, తల్లక్షణములును, తత్సాధ్యాసాధ్యతలు, తచ్చికిత్సానుపానములు, పథ్యాపథ్యములును, షష్ఠప్రకరణమునందు అసిత వాతరోగనిదానములును, తల్లక్షణ తత్సాధ్యాసాధ్య చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును వివరింపఁబడియున్నవి.

సప్తమప్రకరణమునందు చతుర్వింశతి పిత్తరోగములును, ఛర్దిమూర్ఛారోగముల నిదానములును, తల్లక్షణములు, తత్సాధ్యాసాధ్య చికిత్సానుపాన పథ్యాపథ్యములును, అష్టమప్రకరణమునందు కాసశ్వాస హిక్కారోగనిదానములును, తల్లక్షణములును, వానిలో సాధ్యాసాధ్యతలు, చిక్సిత్సానుపాన పథ్యాపథ్యములును, నవమ ప్రకరణమున, మేహ, మేహవ్రణ, మూత్రకృచ్ఛ్ర, మూత్రా ఘాత, అశ్మరీరోగ నిదానములును, తల్లక్షణములును, సాధ్యాసాధ్యములును, చికిత్సానుపాన పథ్యాపథ్యములును, దశమప్రకరణమునందు గ్రహణ్యతిసారరోగ నిదానములును తల్లక్షణములు తత్సాధ్యాసాధ్యతలు, తచ్చికిత్సానుపానపథ్యాపథ్యములును కూర్పఁబడినవి.

ఏకాదశప్రకరణమునందు ఉదర, ఆనాహ, ఉదావర్త, విద్రధిరోగనిదానములును, తల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపానపథ్యాపథ్యంబును, ద్వాదశ ప్రకరణమునందు తృష్ణాదాహ హృద్రోగవిషూచ్యలసక, విలంబికాగ్నిమాంద్యాజీర్ణరోగలక్షణములును తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును సంగ్రహింపఁబడియున్నవి.

త్రయోదశ ప్రకరణమునందు కుష్ఠ విసర్పి విస్ఫోటకరోగనిదానములును, తల్లక్షణ సాధ్యాసాధ్యతలును, చికిత్సానుపానపథ్యాపథ్యంబులును, చతుర్దశ

ధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్యంబులును, వింశ ప్రకరణమున ఉన్మాదాపస్మారలక్షణతత్సాధ్యాసాధ్యతచ్చికిత్సా నుపానపథ్యాపథ్యంబులును, ఏకవింశ ప్రకరణమునభగందరవ్రణాగంతుకవ్రణనాడీవ్రణాగ్ని దగ్ధవ్రణ లూతవ్రణ మర్కట్యర్బుద గళగండ గండమాల కర్ణముఖ దంత జిహ్వాతాల గత కంఠగత దంతవ్రణ తుండివ్రణ కూపజంతిరాజ స్నాయుక స్తనవ్రణ గళగ్రంథి గళకీలాస్య స్ఫోటకీలక కాలస్ఫోటాదిక శ్లీపదరోగనిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపానపథ్యాపథ్యంబులును, ద్వావింశప్రకరణమున అజగల్లి కాంధాలజీవి వృతాది పిటిక కచ్ఛపిక వల్మీక పరసిక జాలగర్దభాది సర్వక్షుద్ర రోగలక్షణ తచ్చికిత్సానుపానంబులును, త్రయోవింశప్రకరణమునవిషలక్షణతచ్చికిత్సానుపానాదులును, చతుర్వింశప్రకరణమునజ్వరాతిసారసంగ్రహణ్యర్శోరోగపాండురోగ కామలా రక్తపిత్తక్షయరోగకాసహిక్కా శ్వాసారుచి ఛర్దిరోగ తృష్ణా దాహోన్మాదాపస్మారవాతరోగాజీర్ణశూల కర్ణశూల శూలానాహోదావర్త గుల్మ హృద్రోగమూత్రకృచ్ఛ్రాశ్మరీరోగ ప్రమేహోదరశోఫ గళగండగండమాల శ్లీపదమ స్తకవ్రణ భగందరోపదంశ ముఖకర్ణరోగకర్మవిపాక తచ్ఛమనోపాయంబులును, పంచవింశప్రకరణమున రసగంధకాదిద్రవ్యశుద్ధులునుసర్వలోహశుద్ధి తద్భస్మసిందూరక్రమంబులును మృతలోహమృతీకరణంబునుతద్భస్మ గుణాగుణంబులును నవరత్నశుద్ధి తద్భస్మగుణంబులును గలిగియుండు, అది సర్వగ్రంథములయొక్క సారమంగలది యగుటం జేసియు నిక్కలి కాలంబున జనించునట్టి సర్వరోగనిదానాదులును దోషదూష్యబలముకు నెచ్చుక తగ్గక సరిపోలియుండునట్టి యౌషధ వీర్యవిపాకశక్తులతో గూడిన చికిత్సలును గలదియగుటం జేసియు "కలౌ బసవకః స్మృతః" అనువచనరీతిని కలియుగమునకీబసవరాజీయమున కేశ్రేష్ఠత్వమనాదిగం బూర్వులచే గల్పింపంబడియె. అందలికథామృతము కుతుకాస్పదంబు

విషయంబుల శేషసందేహ విశేషనివారకంబులు. వివరణము భువి సమానరాహిత్యము. చికిత్సలు సకలరోగహరసాధకంబులు. కావున నిట్టలంబుగఁ గన్పట్టం జేసినట్టులఁ బెక్కువైద్యగ్రంథంబులు లెక్కకు మీఱియుండుటం జేసి వానియం దీగ్రంథమును నిజబుద్ధివై శేష్యంబు పగిదిజగతీజనులు నిజశరీరరక్షణార్థంబై యభ్యసించిననారోగ్యలక్ష్మిని జూఱఁగొందురు. సకలపురుషార్థసిద్ధి దాని వెనువెంటనంటియుండు.

అట్టియభ్యాసలోపంబున వైద్యులపాదములఁబట్టునావశ్యకము తటస్థించు. ఇపుడు సర్వసాధారణంబుగ వైద్యశాస్త్ర మెఱింగినవారికి ననుభవము కొఱవడియుండు. అనుభవ ముండువారికి శాస్త్రజ్ఞానము శూన్యమైయుండు ఈరెంటినెఱింగి సమయోచితముగఁ జికిత్స సేయు వాఁడే రాజవైద్యుఁడు. శాస్త్రపరిజ్ఞానవిహీనుండగు వైద్యుం డమృత తుల్యంబులగు నౌషధముల నొసంగిన నవిశస్త్రము, పిడుగు, విషము, అనువానింబోలి రోగంజంపు; కావున మనహిందూదేశమునందిపుడుగల వైద్యులలోఁ గొందఱు మొఱకులు శాస్త్రానుభవముల రెంటియందు నొకదానినైన నెఱుంగక యుదరపోషణార్థంబై బూటకిమాటలచేఁదమ బోఁటి జ్ఞానధాటిగల రోగులకోటిని నమ్మించి నెక్కుడుబాధను కలుగం జేయుచు "యమాద ప్యధికో వైద్యోయమః ప్రాణహరో మతః। ధన ప్రాణ హరో వైద్యః పాపినంతం వివర్జయేత్ ॥" అనువచనప్రకారము వారి యర్థప్రాణముల నపహరింతురు. అట్టివారలయమకింకరులకంటెఁ గష్టాత్ములనుటకుఁ గొంకనేల అక్కటా! "వైద్యంబును సంగీతమును దెలియనివార లెవ్వరును లేరు" అను లోకోక్తి యేల కల్లయగు? ఎక్కడఁజూచినను లెక్కకు నెక్కుడగు పెక్కండ్రు వైద్యులుపిక్కటిల్లె దరు గాని యందు నిజమారసిన నూటి కొక్కండైన నిక్కంపు వైద్యుండు చిక్కుట మిక్కిలి యక్కజంబు.

పృథివ్యాది పంచభూతాత్మక పురుషునకు మిథ్యాహార విహార మూలకంబున ధాతువైషమ్యంబు గలిగి దానివలన జనించు సంకటమే రోగ మనంబడు. ఇది ఆగంతుకము, శారీరము, మానసికము, స్వాభావికము అని నాలుగువిధంబులు; అం దభిఘాతాదులవలన జనించునది ఆగంతుక మనియు అన్నపానాదిమూలంబులగు వాతపిత్త శ్లేష్మ రక్త సన్నిపాతముల వికారంబున నుత్పన్నంబగునది శారీరమనియు, క్రోధ భయ దుఃఖ సంతోష విషాదాసూయ దైన్య మాత్సర్య కామ లోభేచ్ఛా ద్వేషాదులవలనం బుట్టునది మానసికమనియు, క్షుత్పిపాసా జరామృత్యునిద్రాదులవలన జనించునది స్వాభావికమనియుఁబలుకంగు. కావున నీచతుర్విధరోగభేదంబుల బాగుగ నెఱింగి శారీరజ రోగముల కీగ్రంథమున వివరింపంబడిన శారీరజ చికిత్సలను మానసికరోగముల మనోహరకరంబులగు గానాదిశబ్దముల నాలకింపించిన రోగనాశనంబై సుఖకరంబగు. తక్కిన యాగంతుక స్వాభావిక జనితరోగములయం దాయా కాలానుగుణ్యముగ నుపచరింపందగు.

ఇవియునుంగాక కాలసంభవంబులగు గాలి, గాలిలేమి, యెండ, నీడ వెన్నెల శీతము వుష్ణము వర్షము రాత్రి పగలు పక్షము మాసము ఋతువు అయనము సంవత్సరము మొదలగునవి స్వాభావికముగదోషముల గుంపుఁజేర్చుటకును వృద్ధిఁజెందించుటకును శమింపంజేయుటకును ప్రతీకార మొనర్చుటకును గారణభూతంబులై యుండు. మఱియు వర్షాశరద్ధేమంత వసంతగ్రీష్మప్రావృట్టులన నారుఋతువులు వెలయు. అవి వాతాదిదోషవృద్ధియు తత్ప్రకోపంబును తచ్ఛాంతియుంజేయ సమర్థంబులై యుండు. ఋతుకల్పమెట్టులన్న భాద్రపదాశ్వయుజంబులు వర్ష ఋతువనియు కార్తీక మార్గశీర్షంబులు శరదృతువనియు పుష్య మాఘంబులు హేమంతమనియు ఫాల్గుణచైత్రంబులు వసంతమనియు వైశాఖజ్యేష్ఠంబులు గ్రీష్మమనియు ఆషాఢశ్రావణంబులు ప్రావృట్టని

యుంబఱుంగు. అందు వర్ష ఋతువున సస్యాద్యోషధులు జనించి యల్ప సారవంతంబులుగ నుండు. ఉదకంబు స్వచ్ఛంబుగాక భూమాలిన్య ముతోఁ గూడియుండు. ఐన నట్టియుదకమునువిధిలేక పానంబొనర్చు టచే జనుల కనారోగ్యము గలుగు ఆకాశం బెప్పుడును మేఘాచ్ఛా దనము గలిగి యుండు; దానఁజేసి భూమి యెల్లపుడు నార్ద్రంబుగ నుండుఁగాన నీ ఋతువున సకలప్రాణులార్ద్రభావముఁజెంది శీతవాత ములవలన బ్రతిబద్ధ జఠరాగ్నిపీడితులై యుష్ణంబులేక విదాహంబు గలిగి పిత్తాధిక్యతం జెందుదురు. శరత్తున నాకాశంబు మేఘవిరళం బగుటంజేసి భూమి యార్ద్రరహితంబగు. పూర్వోక్త పిత్తప్రకోపము సూర్యకిరణోద్రేకమై నానావిధ పైత్తరోగంబుల జనింపంజేయు; హేమంతంబునఁ బూర్వోక్తౌషధాద్యాదులు కాలభేదముచే సారవం తంబులును బలకరంబులునగు ఉదకంబు స్వచ్ఛమై స్నేహముతోఁ గూడి బరువుగనుండు. ఇట్టి యుదకౌధులం బ్రాణులుపయోగించుట వలనను సూర్యుండు మందకిరణంబులఁ బ్రకాశించుటచేతను హిమ వాతము వీచుటంజేసి శరీరాంతఃకరణములఁ స్తంభించి యుష్ణసం పర్కము లేక జిడ్డు శీతలము బరువు జిగటగ నుండుటచేతను ప్రాణు లకు శ్లేష్మవృద్ధియగు. వసంతంబునఁ బై శ్లేష్మము సూర్యకిరణో ద్రేకమై ప్రాణుల స్తబ్దదేహుల జేసి శ్లేష్మవ్యాధులం గలుగఁజేయు. గ్రీష్మంబున నోషధులు నిస్సారంబులై రూక్షగను వుదకము చులకనగ నుండు. వీనిని సేవించుటచేతను సూర్యకిరణ ప్రతాపముచేతను ప్రా ణులు శోషంజెంది శరీరాంతఃకరణంబులకు రూక్షయు లఘుత్వంబును నిర్మలత్వంబునుగలిగి వాతాధిక్యంబగు. ప్రావృట్కాలంబున భూమి జలంబుచే నార్ద్రంబై యుండుటంజేసి ప్రాణులకు నార్ద్రత్వము గలిగి శీతవాతావర్షాధిక్యముచే వాతవ్యాధులు జనించు.

మఱియు వర్షాహేమంత గ్రీష్మఋతువుల సంచితంబులగు రోగ దోషంబులు శరద్వసంత ప్రావృట్కాలంబులను ద్రేకించుంగాన వానికి

దగు చికిత్సలం జేయ నావశ్యకము. అందు బిత్తధాతువై మద్యాంబునం గలిగిన వ్యాధులకు హేమంతంబునను శ్లేష్మసంబంధంబగు వానికి గ్రీష్మంబునను వాతజనితములకు శరత్తునందును జికిత్స నేయం దగు.

ఇంతియకాదు; వసంతంబునం బూర్వాహ్ణంబునను గ్రీష్మంబున మధ్యాహ్నంబునను ప్రావృట్కాలంబున నపరాహ్ణంబునను వర్షాకాలంబున బ్రదోషకాలంబునను శరత్తున నర్ధరాత్రంబునను హేమంతంబున నుషఃకాలంబునను రోగలక్షణంబులం బరీక్షింపవలయు. దీనిం బట్టి సంవత్సరాంతమువఱకు శీతోష్ణలక్షణదినంబులచే నయ్యై రోగదోష వృద్ధిక్షయంబుల నెఱుంగనగు.

నిర్దోషంబులగు ఋతువులయందునోషధులునుదకంబును దోషరహితంబులై యుండుంగాన వాని భక్షణంబునను పానంబునను బ్రాణులకు ఆయువును బలంబును వీర్యమునుగలిగి యోజోవృద్ధియై యారోగ్యంబు గలుగు. ఐనను బ్రాణులకు బ్రారబ్ధవశంబున రోగంబులు జనించు. మఱియు శీతోష్ణవాతవైపరీత్యంబులచే నోషధులకును నుదకంబునకును దోషములు జనించు. ఆరీతియ కాలగతిచే దుష్టంబులగు నోషధులను నుదకంబు నుపయోగించికొనుటచే నానావిధరోగంబులును మరణంబును గలుగు.

అక్కటా! నిర్దోషంబులగు భక్షణంబును నుదకపానంబును జేసి సుఖంబుగనుండినను యక్షరక్షః పిశాచ క్రోధాధర్మంబులు దేశాదుల నాక్రమించుటచేతను రోగంబు లుత్పన్నంబులగు; మఱియు విషప్రదంబులగు నోషధీలతాపుష్పంబులగాలి దేశంబులపై వీచుటచే దద్దోషంబున దగ్గు పుబ్బసము వాంతి భ్రాంతి స్ఫోటకము జ్వరము మొదలగునవి గలుగు. గ్రహనక్షత్రచారములవలనను గృహము భార్య శయనము ఆసనము యానము వాహనము రత్నంబులు మొదలగు నుపకరణ దోషంబులవలనను రోగములు జనించుంగాన నట్టిరోగంబులకు

నిజనివాసస్థానంబును వదలుట రోగశాంతులు ప్రాయశ్చిత్తము మంగళకరక్రియలు గాయత్ర్యాది మంత్రజపంబులు నవగ్రహ హోమాదులు దేవతాబలిహరణము యాగము దేవతానమస్కారముకృచ్ఛ్ర చాంద్రాయణాదితపస్సులు నియమము దయ దానము దీక్ష దేవ బ్రాహ్మణగురుభక్తి మొదలగువానిం జేసినవిపరిహారంబులై సౌఖ్యావహంబులగు.

మఱియుఁ బై జెప్పంబడినప్రకారము దేశకాల ఋతుభేదముల వలన నోషధులకుఁ గలుగు గుణదోషంబులును తత్తద్దేశజనిత మనుజ శరీరప్రకృతి భూసారౌషధీ బలాబలదోషముల నెఱింగి చికిత్ససేయుట అల్పబుద్ధిగల నిక్కలికాలపుజనుల కసాధ్యం బగుటచే సర్వదేశకాల ఋతుశరీరప్రకృతుల కనుగుణంబులై సర్వఋతువుల నిర్దుష్టంబులై తీవ్రముగ కార్యసాధనకరంబులై యుండుటంజేసియు "గుణహీనం భవేద్వర్షా దూర్ధ్వంత ద్రూపమౌషధమ్ । మాసద్వయా త్తథా చూర్ణం హీనవీర్యత్వ మాప్నుయాత్ । హీనత్వం ఘుటికాలేహౌ లభేతే వత్సరాత్పరమ్ । హీనాస్స్యు ర్ఘృతతైలాద్యా శ్చతుర్మాసాధికాస్తథా । ఓషధ్యో లఘుపాకాస్స్యు ర్నిర్వీర్యా వత్సరాత్పరమ్ । పురాణాస్స్యుర్గుణై ర్యుక్తా హ్యానవా ధాతవోరసాః॥" అను వచన ప్రకారము చూర్ణములు రెండుమాసములకుఁబైన ఘుటికాలేహ్యౌషధ లఘుపాకంబులు సంవత్సరమునకుఁబైన ఘృతతైలములు నాలుగు మాసములకుఁబైన సత్త్వహీనంబులగుటంజేసియు దుత్తులు స్వర్ణాది ధాతుభస్మములు రసాయనములు రసౌషధములు పాతవి యవు కొలంది గుణాధిక్యముగలవై యుండుటంజేసియు బసవరాజను వైద్య శిఖామణి లోకహితార్థంబై రసప్రధానాద్యౌషధమయంబుగ నీ గ్రంథమును సర్వరోగహార సాధకంబుగ రచియించె; కాన దాని సకలవైద్యశాస్త్రంబులం బెద్దగఁ బెద్దలు తద్దయు నెన్నుదురు.

ఇట్టిగ్రంథమును గొందఱు వైద్యశాస్త్రసంస్కృతాంధ్రపద పదార్థ జ్ఞానవిహీనులై లోభప్రేరితులై శాస్త్రజ్ఞానసంపన్నులగువారికి దాని నగపఱిచిన విషయంబులం దెలిసికొని తమఫలమును వారలు పొందెద రను భీతిచే విషయగ్రాహకసత్త్వసర్వులగు వారలవలనఁ దాళపత్రలిఖితంబులఁ జేయించుచుండిరనుటకు దానికిఁ గాలక్రమము నఁగలిగిన దుర్దశయే సాక్ష్యంబు అక్కటా! ఇట్టి లోకోత్తరగ్రంథంబునకు "యదాయదాహి ధర్మస్యగ్లాని ర్భవతి భారత। అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥" అను న్యాయాను సరణింగలిగిన దుర్దశ నపనోదించుటకై మైసూరు సంస్థానాధిపతులు గారు పెక్కుదేశంబులనుండి యనేకప్రతులఁ దెప్పించి పరిశోధించి ముద్రాక్షరాంకితము జేయించునటులఁ బండితుల కాజ్ఞాపింపవారలు సాంగముగ వాని నవలోకించి పరిశోధించెడి శ్రమంజెందుటకంటె మఱియొక నూతనప్రబంధమును రచియించుట కడుసులభంబని వాకుృచ్చి తత్ప్రయత్నమును వదలినటుల నేను వినియెదను.

ఇటుల బసవరాజుయొక్క నామధేయగ్రంథంబు లీలోకంబున బ్రసక్తిలేక సముద్రంబునండాఁగిన గట్టుచూలివలె నెట్టివారికైనం బట్టు వడకుండుటకుఁ దగిన సూచకంబు లగపడుటను వారింపంజేయవలయు నని స్వమతగ్రంథాభిమానులును జ్ఞానసంపన్నులును నగు వారలలో ముఖ్యులగు పూటుకూరు సంస్థానపునకీలగు మహారాజశ్రీ, శ్రీరాముల శేషాచలంగారివలనను బసవరాజుయొక్కనామధేయగ్రంథములీలోకంబున నింకఁ గొంతకాలమువఱకు శాశ్వతముగనుండి తన్మూలంబున జగతీజనుల కారోగ్యాదులు వాటిల్లి ధర్మార్థకామమోక్షరూప పురుషార్థ చతుష్టయసిద్ధి గలుగవలయుననెడి జగదీశ్వరునియొక్కసంకల్పముచేతను ప్రేరితుండనై "లోకోపకారార్థ మిదంశరీరమ్" అను వాక్యపద్ధతి నేతద్గ్రంథ జీర్ణోద్ధారణమువలనఁ గలిగెడు శరీరక్లేశ కాలక్షేప

ధనవ్రియాదుల మతినెంచక "సంతోషంజనయే త్ప్రాజ్ఞః" అను గీతాశాస్త్రానుసరణి లోకహితార్థంబై నీమహాత్కార్యమునందు నేఁ బ్రవర్తించునటులఁ దటస్థించినందున ననేక విదేశీయ తాళలిఖిత బసవరాజీయగ్రంథముల సంగ్రహించి యవలోకింపనవియన్నియుఁ దఱచుగ సంస్కృతాంధ్రవిద్యా పరిపూర్ణు లగువారి సాంగత్యరాహిత్యము వలనఁ బ్రతిశ్లోకార్థమునందు సంఘటిల్లిన పదవిభక్తి వచన లింగాది స్ఖాలిత్యములచే నపరిశుద్ధంబులై పెక్కుస్థలములఁ బరిశోధనానర్హంబులై యుండుటం గనుంగొని నీగ్రంథారంభమున బ్రతిజ్ఞ జేసిన గ్రంథములలోఁ గొన్నిటి గడుఁబ్రయత్నముచే సంగ్రహించితత్సహాయమువలనను పండితసహాయమువలనను శ్రీమచ్చన్నపురి కణ్వాశ్రమస్థిత శ్రీమహావిష్ణ్వపతావతారభూత శ్రీమద్యోగీశ్వర యాజ్ఞవల్క్య జగద్గురు కటాక్షంబువలనను గీర్వాణమును పరిశుద్ధపఱచి యథాశక్త్యనుసారముగ నెల్లరకు సులభముగ గ్రాహ్యంబగునట్లు లాంధ్రతాత్పర్యమును స్వయముగ రచియించి నెఱవేర్చినాడను.

ఇట్టి మహాగ్రంథ పరిశీలనవిషంబున మూఁడువత్సరముల కాలముగఁ గలిగిన శ్రమచే సహించి శ్రీకణ్వశాఖాధ్యయనపరుండును శ్రీవత్సగోత్ర పువ్వాడవంశ క్షీరాంభోధిరాకానిశాకరాయమాణ శ్రీపత్సామరాజు ప్రపౌత్రుండును పేరయరాజు పౌత్రుండును అష్టాదశ మహాపురాణ జీర్ణోద్ధారణ నిర్వాహక బిరుదాంకిత శ్రీమద్యాజ్ఞవల్క్యచరణ సరోజ చంచరీకాయమాణ స్వాంతులునగు శ్రీమద్వేంకటరాయపుత్రుండునైన శ్రీసూర్యనారాయణరావు అను నాచే నెల్లరకుఁ దెల్లంబుగ గ్రాహ్యంబగునట్లు లాంధ్రతాత్పర్యము రచియించి గ్రంథము,జీర్ణోద్ధారణము చేయంబడియె.

ఈ బసవరాజీయ గ్రంథము, 1. శ్రీరాముల శేషాచలంగారిచే మాకుఁ బంపఁబడిన మాతృక, 2. శ్రీరేకము మణవాళయ్యగారిచే

మూకు నివ్వబడ్డ మాతృక; 3. త-సుబ్బరాయలు నాయని వారిచే నివ్వబడ్డ మాతృక; 4. పి-వీరరాఘవయ్యగారిచే నివ్వబడ్డమాతృక; ఈ నాలుగింటిని గవర్న్మెంటుకాలేజిలోని- ప్రతులతోడ సంప్రతించి ముద్రింపబడియున్నయది.

శ్రీరాముల శేషాచలంగారు ముఖ్యప్రేరకులై గ్రంథసహాయము జేసినందున వారికి వందనము లొనర్చెదను.

ఇట్లు
పువ్వాడ సూర్యనారాయణరావు.



శ్రీ ర స్తు.

# యంత్రాధ్యాయము.

## విద్యాధరయంత్రము.

శ్లో॥ అథస్థాల్యాం రసంక్షిప్త్వా నిదధ్యాత్తన్ముఖోపరి । స్థాలీమూర్ధ్వముఖీంసమ్యఙ్నిరుధ్యాన్మృత్స్నయా । ఊర్ధ్వస్థాల్యాంజలంక్షిప్త్వా చుల్ల్యామారోప్యయత్నతః । అథస్తాజ్జ్వాలయేదగ్నిం యావత్ప్రహరపంచకమ్ । స్వాంగశీతా త్తతోయంత్రాద్గృహ్ణీయాద్రసముత్తమమ్ । విద్యాధరాభిదం యంత్రమేతత్తజ్జైరుదాహృతమ్ ॥



తా॰ రెండుకుండల గ్రహించి యందొకదానిలో పాదరసమునుబోసి దానిపై రెండవకుండ నూర్ధ్వముఖముగ మూసి యా రెండుకుండలు జేరుస్థలమున చీలమన్ను లేపనముజేసి పైపాత్రనుదకముచే నింపించి పాదరసంబుండు పాత్రను పొయిమీదనునిచి యైదుఝాములు పాకముజేసి స్వాంగశీతలమున యా యంత్రమునందుండు రసమును దీసికొనవలయు. ఇదియ విద్యాధరయంత్రమనంబడును.

## టంక యంత్రము.

శ్లో॥ భాండకంఠా దధశ్ఛిద్రే వేణునాళం వినిక్షిపేత్ । సమానాంకరకాం వాపి భాండవక్త్రే నివేశయేత్ । సంధింలిప్త్వా చనాళాగ్రే కాచభాండం నిధాపయేత్ । అథస్తాత్ప్రస్రివేద్దాస్యం టంకయంత్రమితిస్మృతమ్ ॥



తా. ఒకకుండను గ్రహించి దాని కంఠమున రంధ్రముజేసి యందు వెదురు గొట్టమునుజేర్చి యాకుండమూతికి సరియైన మఱియొకకుండనుజేర్చి వానిసంధులను చీలమన్ను లేపనము జేసి యెండించి పొయిమీద నునిచి గొట్టముయొక్క నోటివద్ద గాజుపాత్రనునిచి పాకముచేసిన దానిలోని యౌషధము నళికెనుఖము వలన పతనంబగు. ఇదియు టంక యంత్రమనియు గ్రంథాంతరేణ ఊర్ధ్వనలికాయంత్రమనియు జెప్పంబడు.

## వాలుకాయంత్రము.

శ్లో॥ భాండే వితస్తగంభీరే మధ్యే నిహితకూపికే।
కూపికా కంఠపర్యంతం వాలుకాభిశ్చ పూరితే।
భేషజం కూపికాసంస్థం వహ్నినా యంత్ర పూజితే।
వాలుకాయంత్ర మేతద్ధి యంత్రతంత్ర బుధైః స్మృతమ్॥



తా. జానెడునిడుపు జానెడువెడల్పుగల మంటిపాత్రను గ్రహించి దానియడుగుయొక్క మధ్యభాగమున డబ్బనముతో లావుగ బెజ్జము జేసి దానిపై యౌషధకుప్పెనునిచి దానికంఠమువరకు నిసుకబోసి పొయిమీదనునిచి యోగములో జెప్పబడియుండు కాలమువరకు పాకము జేయవలయు. ఇదియె వాలుకాయంత్రమనంబడు.

## భూధరయంత్రము.

శ్లో॥ వాలుకాసు సమస్తాంగం గతంమూషా రసాన్వితా।
దీప్తోపలై స్సంవృణుయా ద్యంత్రం భూధరనామకమ్॥



తా. మూసలో పాదరసమునుబోసి దానినోరును బంధించి యిసుకచే పూరింపబడిన జానయుం దామూసను సంపూర్ణముగ బూడ్చి యిసుకపై పిడకలతో పుటం బిడవలయు యిదియు భూధరయంత్ర మనంబడు.

## కోష్ఠ యంత్రము.

శ్లో॥ హస్తప్రమాణం దీర్ఘార మష్టసంఖ్యాంగుళం సమమ్ । తిర్య
క్సమభూభాగే ఘటితంవృత్తం మృత్కర్మ సంపన్నం వాతా
యనద్వితయవృత భస్త్రీముఖ తుల్యమిత్యథోభాగేప్రథమే
పశుం వశనాళై ర్భస్రాభిర్వ్యాభః సత్వార్థ మిదమేవ కోష్ఠ
యంత్రపూర్ణం విద్యాద్యథో చితాంగారైః ॥



తా. మూరప్రమాణముగల గొట్టమును జేసికొని దాని నెనిమిదంగుళముల ప్రమాణముగల సమమైనభూమిలో నొకింత నిమ్నోన్నతముగ బూడ్చి యా గొట్టముయొక్క యిరుపార్శ్వపు ముఖముల దెరచి యునిచి దానిదాని ముఖమువద్ద ఒటువుగ నొకపల్లము జేసి యాపల్లమును మన్నుతో బాగుగనలికి గొట్టముయొక్క పైభాగపు మూతియందు తోలుతిత్తిని దగిలించి పల్లమునకు తగుమాత్రముగ బొగ్గులవైచి తిత్తి నూదవలయు.

## డోలాయంత్రము.

శ్లో ॥నిబద్ధం సౌషధంసూతం భూర్జేతు త్రిగుణాంబరే । రసపోట
లికాంకాష్ఠే దృఢంబధ్వా గుణేనహి । సంధాయ పూర్ణకుం
భాంతః ఖావలంబనసంస్థితామ్ । అధస్తా జ్జ్వాలయే దగ్నిం
తత్తదుక్త క్రమేణహి । డోలాయంత్ర మిదంప్రోక్తం స్వేద
నాఖ్యంత దేవహి । సాంబుస్థాలీముఖేబద్ధే వస్త్రే స్వేద్యంనిధా
యచ । విధినాపచ్య తేయత్ర తద్యంత్రం స్వేదసంస్మృతమ్ ॥



తా. ఔషధముతో గూడియుండు పాదరసమును భూర్జ పత్రములో జుట్టి మూడుమడతలుగల వస్త్రమునమూటగట్టి దారమునబంధించి యాదారము నొకవెదురుపుల్ల మధ్యమునగట్టి యొక కుండలో పాచన ద్రవ్యములబోసి పైప్రకారము దారముతో బంధింపబడిన యౌషధము కుండలో వ్రేలాడునటుల కుండనోటి యందా వెదురుపుల్లనడ్డముగ నిడియోగములో జెప్పబడియుండు కాలప్రకారము పొయిమీదనునిచి పాకము జేయవలయు. ఇదియె డోలాయంత్రమనియు లేక స్వేదనాయంత్రమనియు జెప్పంబడు, లేక పాత్రనోటి

యందు వస్త్రమునుగట్టి దానిపై స్వేదనసంస్కారము జేయునట్టి ద్రవ్యములనునిచి దానిపై మూసి పాకము జేయుటయు స్వేదన మనంబడు.

## తులాయంత్రము.

శ్లో॥ వృంతాకాకారమూషే ద్వే తయోః కుర్యాదధః ఖలు । ప్రాదే
శమాత్రాం నళికాం మృదాలిప్తసుసంధికామ్। తత్రైకస్యాం
క్షిపేత్సూత మన్యస్యాం గంధచూర్ణకమ్ । నిరుధ్య మూష
యోర్వక్త్రే వాలుకా యంత్రకే క్షిపేత్ । గంధాధో జ్వా
లయేదగ్నిం తులాయంత్ర ముదాహృతమ్ । తాళగంధా
శ్మసారాణాం జారణార్థ ముదాహృతమ్ ॥



తా. వంకాయయొక్క యాకారముగల రెండుమూసల జేయించి వానినోటియందు బెత్తెడు ప్రమాణముగల గొట్టమును దగిలించి వానిసంధులను చీలమన్ను లేపనముజేసి అందొకమూసలో పాదరసమును మఱియొకమూసలో గంధపుచూర్ణమును వైచి వానిముఖముల మూసి వాలుకా యంత్రమునందుంచవలయును. ఇదియె తులాయంత్రమనంబడు. ఈతులాయంత్రము తాళకము గంధకము లోహము వీని జారణార్థ ముపయోగించును.

## గర్భయంత్రము.

శ్లో॥ స్థూలభాండస్య గర్భేతు ఇష్టకాం స్థాపయేత్తతః । పాత్రం
స్థాప్యంచేష్టికోర్ధ్వం ద్రవ్యంస్థూలేచభాండకే । పశ్చాన్న్యుబ్జే
చాన్యభాండం ఘటికాసదృశందదేత్ । సంధిలేపంతతఃకృత్వా
జలందత్వోర్ధ్వపాత్రకే । అగ్నిం ప్రజ్వాలయేన్మందం తప్తం
నీరంపునస్త్యజేత్ । పునశ్శీతం చ దత్వా తప్తంచైతత్త్యజే
త్పునః । ఏవంకృతేచోర్ధ్వభాండే లగ్నం తైలాదికంస్రవేత్ ।
అంతస్థేసూక్ష్మపాత్రేచ తచ్చగ్రాహ్యం ప్రయత్నతః । గర్భ
యంత్ర మిదంఖ్యాతం సుగంధ్యర్కాది సాధనే ॥



తా. ఒక గొప్పభాండమును పొయిమీదనునిచి దానిలో యిటికెతాయినిడి యాయిటికె తాయిపై గాజు మొదలగువానిచే జేయబడిన గిన్నెనునిచి యాగిన్నె కంఠమువరకు నౌషధ ద్రవ్యముల నునిచి యాభాండపుమూతిని మరియొక కుండయొక్క అడుగుభాగముచే మూసి సంధులకు చీలమన్ను లేపనము జేసి భాండముపైమూసి యుండుకుండలో నుదకముబోసి మందముగ నగ్నిని జ్వలింపంజేయవలయు. కుండలోని యుదకము కాగిన దానిందీసివేసి మరల శీతోదకమును బోయవలయు. ఇట్లేయిట్లుగున జేయుచుండిన పైనమూసియుండు భాండముయొక్క అడుగున నావిరిజేరి గిన్నెలో తైలాదులుస్రవించు, వానియుక్తిచేగ్రహింపవలయు. ఇదిగర్భయంత్రమనంబడు.

## కచ్ఛప యంత్రము.

శ్లో॥ ఖర్పరం పృథులంసమ్య గ్విస్తారం తస్యమధ్యతః। ఆలవాలం పుటీకృత్వా తన్మధ్యే పారదంక్షిపేత్ । ఊర్ధ్వాధస్తు బిడం దత్వా మల్లేనారుద్ధ్యయత్నతః । ఊర్ధ్వం దేయంపుటంతస్య యంత్రంకచ్ఛప సంజ్ఞికమ్ । జారణార్థం రసస్యోక్తం గంధాదీనాం విశేషతః ॥



తా. పెద్దవెడల్పునోరుగల బానను జేసికొని దాని మధ్యమున సుమారు మూడువ్రేళ్ళపొడవుగల పాదినిజేసి దానియందు బిడాలవణమునవేసి దానిపై పాదరసమునునిచి దానిపై మరల బిడాలవణమునువేసి యాపాదితగినటుల యొకింత పల్లముగనుండు మూకుడుతో దానినిమూసి చీలమన్ను లేపనముజేసి యాబానను పిడకలచే నిండించి పుటంబిడినరసగంధములు జారణంబులగు. ఇదియ కచ్ఛపయంత్రమనంబడు.

## జలయంత్రము.

శ్లో॥ ఉపర్యాప స్థలే తాపో మధ్యేచ రసగంధకౌ । జలయంత్రమిదంగోప్యం యంత్రంశ్రేష్ఠం సమీరితమ్ । అస్మిన్ స్వర్ణాదిభూసత్వ గంధకాదిచ జారయేత్ । కృత్వాలోహమయీం పాత్రీ మధోముఖసమన్వితామ్ । ముఖమధ్యే క్షిపేద్రస్యం పాత్రవక్త్రంనిరోధయేత్ । లోహచక్రికయా రుద్ధ్వా తత్సం

ధింసాధు లేపయేత్ । తస్మిన్నోష్ఠే క్షిపేదష్ట భాగలోహ రజోన్వితమ్ । పునఃపునశ్చసంశుష్కే పునరేభిశ్చ లేపయేత్ । లోహవత్త్వచ్ఛబబ్బూల క్వాథేన పరిమర్దితమ్ । జీర్ణేష్టకారజస్స్నాత్స్న గుడచూర్ణ సమన్వితమ్ । లేపయేత్ఖలుతత్ప్రోక్తం దుర్భేద్యంసలిలైః ఖలు । ఖటికాపటుకిట్టైశ్చ మహిషీ దుగ్ధమర్దితైః । యత్తమూమ్యృత్స్నయారుద్ధో నగంతుంక్షమతేరసః । విదగ్ధవనితాప్రౌఢ ప్రేమ్ణాబద్ధఃపుమానివ । తతోజలం వినిక్షిప్య వహ్నిం ప్రజ్వాలయేదధః । అథవాకారయేన్మూషాం పాత్రిలగ్నా మధోముఖీమ్ । లోహనామ సురూపాశ్చ తస్యామూషా ముఖరోధకమ్ । దత్త్వాచాన్యాం తయోస్సంధిం విలేప్యాజ్యాస్సృగాదిభిః । జలమూర్ధ్వంవినిక్షిప్య నిస్సందేహం విపాచయేత్ । జలయంత్రంతు బహుబిర్ధినై రేవహిజాయతే॥



తా. ఊర్ధ్వమున జలముక్రింద యగ్నిజ్వాల మధ్యమున రసగంధకాదుల నునిచి పాకముజేయుటయ జలయంత్రమనంబడు. ఇది శ్రేష్ఠంబగుటచే రహస్యముగ నునిచి కొనవలయు. ఇది స్వర్ణాదిభూసత్వ గంధకాది జారణముల కుపయోగించు. ఎట్లనిన—లోహముతో నొక పెద్దబానను దానిలోపల లోహముతో నొక మూసను జేయించి దానియందు స్వర్ణ రసగంధకాదుల నునిచి యా మూస మూతికి తగినటుల లోహముతో నొక మూకుడును జేయించి దానిచే యామూసమూతిని మూసి భాండములోనునిచి మేకనెత్తురుతో లోహకిట్టమును బాగుగనూరి ఆమూస ముఖమున దానికడుగున పలుమారు బాగుగ లేపనముజేసి పలుమారు నెండించవలయు. ఇత్తెరంగుననే యామూసకు క్రిందిభాగమున పైభాగమున తుమ్మచెక్కకషాయముతో ప్రాత ఇటికతాయిచూర్ణమును బెల్లమును నూరి పలుమారు లేపనముజేసి యెండించవలయు. ఇటులంజేసిన ఉదకము దానిని భేదింపకుండు. మఱియు తెల్లమన్ను ఉప్పులోహకిట్టము వీనిని యెనుపపాలతో నూరి లేపనముజేసిన "ప్రియురాలగు స్త్రీయొక్క ప్రేమచే నాయకుడు బంధింపబడుభంగి" పాదరసము బంధింపబడు. పిదప యాపాత్రయందుదకముబోసి క్రిందమంట వేయవలయు. లేక పెద్దభాండమును జేయించునపుడే దానినిమూసతోడజేయించి పైప్రకారముమూతమూసి లేపనాదులజేయవలయు. ఇదియుజలయంత్రమనంబడు. ఇదిదీర్ఘకాలముమీద సిద్ధించు.

## గారీయంత్రము.

శ్లో॥ గారీయంత్రంప్రవక్ష్యామి సుఖదంజారణావిధౌ । అష్టాంగుళో
చ్ఛ్రియా కృత్వా చతురస్రంస మేష్టకామ్ । సూతనామా
త్సముత్కృత్య మధ్యేచూర్ణేనలేపయేత్ । శ్లక్ష్ణాం వస్త్ర
కృతాంపిష్టిం కృత్వాసాగ్నిబద్ధతాభ్రజామ్ । రూప్యజాంహే
మజాంవాపి సత్వేనాపివినిర్మితామ్ । నివేశ్యతత్రచోర్ధ్వాధో
బలేశస్యార్ణంవిధాయచ । తస్యాఃపిష్టాశ్చతుర్థాంశం వారం
వారంవిశోషయేత్ । వస్త్రేఖర్పరచక్రేంతు దత్వాలేప్యవిశో
ష్యచ। ఊర్ధ్వంహాయఖురాకారంపుటందద్యాల్లఘూత్పలైః ॥



తా. జారణవిషయమున సుఖకారియగు గారీయంత్రమును వచించెద; — ఎనిమిదంగుళములపొడవు వెడల్పుగల యొకయిటికరాయిని జేయించి దానిమధ్యమున మూషాకారముగ పల్లముజేసి దానికి సున్నము బూసి నున్నగజేసి యెండించిన పిదప వెండి బంగారు అభ్రకము అనవాని సత్వములనూరి యిటికెరాయి మూసలోబోసి ఆసత్వమునకు నాలవభాగము గంధకమును యిటికెరాయి మూసకుక్రిందపైన నునిచి మధ్యమునపైజెప్పబడిన రసాదిద్రవ్యముల నునిచి మూసనోటిపై ప్రమిదెనుమూసి చీలమన్ను లేపనముజేసి యెండించి గుఱ్ఱపు గిట్టల ప్రమాణముగల చిన్నచిన్న యేరుపిడకల పేర్చి పుటంబెడవలయు. ఇదియు గారీయంత్రమనంబడు.

## వజ్రమూష.

శ్లో॥ వర్తులా గోస్తనాకారా వజ్రమూషా ప్రకీర్తితా ।
ద్వాభాగాతుష దగ్ధస్య ఏకో వల్మీకమృత్తికా ।
లోహకిట్టస్య భాగైకం శ్వేతపాషాణ భాగకమ్ ।
నరకేశ సమంకించిచ్ఛాగీక్షీ రేణ పాచయేత్ ।
యామద్వయం దృఢంమర్ద్య తేనమూషాంచ సంపుటిమ్ ।
శోషయిత్వా రసంక్షిప్త్వా తత్కల్కైః స్సంధిరుచ్యతే ।
వజ్రమూషా ఇయంఖ్యాతా సమ్యక్సూతస్య మారణే ॥



తా. ఉముక రెండుభాగములు బూడిదె పుట్టమన్ను 1 భాగము లోహకిట్టము 1 భాగము. తెల్లరాతిచూర్ణము 1 భాగము ఒకింత ననుజాని వెంద్రుకలు వీని నేకముజేసి మేకపాలుబోసి యుడికించి రెండుఝాములునూరి గుండ్రముగా పాడవుగ నొక మూసను పైమూకుడును జేసి యెండించి మూసలోగసము బోసి పైన మూకుడును మూసీ చీలమన్ను లేపనముజేయవలయు. ఇదియ వజ్రమూషయనంబడు. ఇది రసమారణమునం దుపయోగించు.

## పాతాళయంత్రము.

శ్లో॥ హస్తం ప్రమాణాం నిమ్నంచ గర్తంకృత్వా ప్రయత్నతః ।
తస్మిన్ భాండంచ సంస్థాప్య తథాన్యం పాత్రమాహరేత్ ।
తస్మి న్నౌషధవర్గంచ దత్వాన్యంచ శరావకమ్ ।
ముఖే సంస్థాప్య ఛిద్రాణి కృత్వాచైవ శరావకే ।
శరావసహితం పాత్రం గర్తస్థే భాజనే న్యసేత్ ।
సంధిలేపం తతః కృత్వా గర్త మాపూర్య మృత్స్నయా ।
పశ్చా దగ్నించ ప్రజ్వాల్య సాంగశీతం సముద్ధరేత్ ।
పశ్చా త్తత్పాత్రమధ్యస్థం పాత్రంయుక్త్వా సమాహరేత్ ।
తదంతస్థంచ తత్తైలం గృహ్ణీయా ద్విధిపూర్వకమ్ ।
పాతాళాఖ్య మిదం యంత్రం భాషితం శంభునా స్వయమ్ ॥



తా. ఒకమూరలోతుగల పల్లమును ద్రవ్వి అందు వెడల్పు నోరుగల భాండమునునిచి మఱియొకకుండలో నౌషధమునునిచి యౌషధముండు కుండనోటియందు రంధ్రములుగల మూకుడు నునిచి ఆ మూకుడుతోడనే యాకుండను పల్లములోని పాత్రపై నునిచి సంధి లేపనముజేసి యాపల్లమును మట్టితో మూసి దానిపై నగ్ని నునిచి మూకుడుయొక్క రంధ్రమువలన క్రిందిభాండములో తైలముగాని ద్రావకముగాని స్రవించు. దానిని సాంగశీతలమున యుక్తిచే గ్రహింపవలయు. ఇది యపాతాళయంత్రమనంబడు. ఇది ఈశ్వరునిచే జెప్పంబడు.

## తే జో యం త్ర ము.

శ్లో॥ భాండేచార్ధ ప్రమాణేన ద్రవ్యంస్థాప్యం ప్రయత్నతః ।
తన్ముఖే ద్వినలీయంత్రం సంస్థాప్యచ నిరోధయేత్ ।
పశ్చాత్ప్రజ్వాల్య మందాగ్నిం జలం దత్వోర్ధ్వ మత్రకే ।
తత్తప్తం నళికాద్వారా నిస్సార్యంచ పునఃపునః ।
నీచస్థనళికావక్త్రే భాండస్థాప్యం ద్వితీయకమ్ ।
తస్మి న్నర్కశ్చ సంధార్యో గృహ్ణీయాత్తు విశేషతః ।
తేజోయంత్ర మిదం ఖ్యాతం తథాన్యై ర్లంబికంమతమ్ ॥



తా. పెద్దభాండమును జేసికొని దాని కర్ధభాగమువరకు ఔషధద్రవ్యములనునించి దానినోటియందు రెండుగొట్టములుగల యంత్రమును దగిలించి సంధిలేపనముజేసి పైభాండములో నుదకముబోసి క్రింద మందాగ్నితో పాకము జేయవలయు. ఆయుదకము కాగి యుష్ణంబైన నళికాముఖముగ దానిం దీసి వేసి మరల శీతోదకమును బోయుచుండవలయు. క్రిందనుండునళికాముఖమున గాజు మొదలగు పాత్రల నునిచి ద్రావకమును దీసికొనవలయు. ఇదియ తేజోయంత్ర మనంబడు. దీనినే మఱికొందరు లంబికాయంత్రమనియు వచించెదరు.



శ్రీరస్తు.

# బసవరాజీయము.

## —పుటాధ్యాయము.—

### మహాపుటము.

శ్లో॥ ఘనచౌరసకే గర్తే హస్తద్వితయమాత్రకే। కరీషైరర్ధపూర్ణేచ ముద్రితంచ శరావకమ్ । సంస్థాప్య చాన్యకారీషైః పూరితే శుభగర్తకే । అగ్నిం ప్రజ్వాల్య శీతేచ గృహ్ణీయాత్తు శరావకమ్ ఏత న్మహాపుటంచోక్తం కృతభిః పూర్వసూరిభిః ॥

తా. 2 మూరలు చదరముగ 2 మూరలు లోతుగనుండు పల్లమును త్రవ్వి అందు సగమువరకు యేరుపిడకల బరచి దాని మధ్యమున యౌషధశరావమును గాని మూసను గాని వునిచి దానిపై యేరుపిడకల బరచుటచే నా పల్లమును నిండించి యగ్ని నునిచి పుటంబిడి సాంగశీతలమైన యౌషధమును గ్రహింపవలయు. ఇది మహాపుటమని పూర్వీకులచే జెప్పంబడియె.

### గజపుటము.

శ్లో॥ ఘనచౌరసకేసార్ధ హస్తే చైవతు గర్తకే ।
పూర్వవద్వితయే చాగ్ని స్తత్పుటం గజసంజ్ఞితమ్ ।
మాహిషం వేత్తిసంజ్ఞేయం సూరిభి స్సముదాహృతమ్ ॥

తా. $1\frac{1}{2}$ మూర చదరము $1\frac{1}{2}$ మూర లోతుగల పల్లమును ద్రవ్వి దానిలో పైక్రమప్రకారము పుటంబిడుటయే గజపుట మనంబడు. దీనినే మహిషపుట మనియు పెద్దలు వచించెదరు.

### వరాహ పుటము.

శ్లో॥ అరత్నిమాత్రే గర్తేయ ద్దీయతే పూర్వవత్పుటమ్ ।
కరీషా గ్నాతు తత్ప్రోక్తం పుటం వారాహసంజ్ఞితమ్ ।

తా. మూరప్రమాణముగల పల్లమును త్రవ్వి దానియందు మునుపటివలెనే పుటంబిడుటయ వరాహపుట మనంబడు. దీనియం దేరుపిడకల నుపయోగింపంజను.

## కుక్కుట పుటము.

శ్లో॥ వితస్తిమాత్ర గర్తేయ త్పుట్యతే తత్తు కౌక్కుటమ్ ॥

తా. జానెడు చదరము జానెడులోతుగల పల్లమును త్రవ్వి దానిలో పై ప్రకారము పుటంబిడుటయ కుక్కుటపుట మనంబడు.

## కపోత పుటము.

శ్లో॥ వితస్తి మాత్రకే గర్తే నస్తభిర్వాథ చాష్టభిః ।
వనోత్పలైః పుటందత్తం తత్తుకాపోతసంజ్ఞితమ్ ॥

తా. జానెడు చదరమును జానెడు లోతుగల పల్లమునుత్రవ్వి అందు 7 లేక 8 పిడకలతో పుటంబిడుటయు కపోతపుట మనంబడు.

## గోవర పుటము.

శ్లో॥ చూర్ణీకృత కరీషాగ్నౌ భూమావేవతు యత్పుటమ్ ।
దీయతే తత్తు కృతిభి ర్గోవరం సముదాహృతమ్ ॥

తా. పిరుపిడకల చూర్ణమును భూమిపైబోసి దాని మధ్యమునం దౌషధము నునిచి చేతితో బాగుగనదిమి యగ్నినునుచుటయ గోవరపుట మనంబడు.

## కుంభ పుటము.

శ్లో॥ మృద్ఘటస్యతుఛిద్రాణి కృత్వాంగుళసమానివై । చత్వారిం
శత్తత స్తస్మిన్ శీతముష్ణం చూర్ణకమ్ । అర్ధమాపూరయి
త్వాచ ముఖే దద్యాచ్ఛరావకమ్ । కర్పటేన మృదాలిప్త్వా
ఛాయాశుష్కంచ కారయేత్ । తస్మిన్నంగారకాన్ క్షిప్త్వ
చుల్ల్యాం వహ్నేష్టకానుచ । నిధాయ త్రిదినాచ్ఛీతం గృహీ
త్వౌషధ మాహరేత్ । ఏతత్కుంభ పుటంజ్ఞేయం కథితం
శాస్త్రదర్శిభిః ॥

తా. మంటికుండకధోభాగమున 1 అంగుళప్రమాణముగల 40 ఛిద్రములు చేసి యాకుండకర్ధభాగమువరకు బొగ్గులబోసి దానిపైనౌషధమునునిచి యాకుండమూతి ప్రమిదెతో మూసి చీలమన్ను లేపనము జేసి నీడనెండించి పొయిమీదనునిచి యాకుండ ప్రమిదెపై నగ్నినిడి 3 దినములు పొయి క్రింద మంటవేయవలయు. మంట చల్లారి పిదప స్వాంగశీతలమున నౌషధమును గ్రహింపవలయు. ఇదియ కుంభపుటమనంబడు

శ్రీ ర స్తు.

## తాళపత్రలిఖిత బసవరాజీయముయొక్క తెనుగుతాత్పర్యములోని మాత్రాప్రమాణవివరము.

చతుర్వల్లం = 8 గురిగింజలయెత్తు లేక 3 చిన్నములయెత్తు

నిష్కైకం = మాడయెత్తు

వల్లద్వయం = 4 గురిగింజలయెత్తు

మాషం = మినుపగింజయెత్తు

2 పలములు = 2 మాడలయెత్తు

5 పలములు = 5 మాడలయెత్తు

పల్లయుగ్మం = 4 గురిగింజలయెత్తు

పలం = పాపుసేరు

పలాష్టకం = 2 సేర్లు

షోడశపలం = 4 సేర్లు

శాణం = 10 చిన్నములు

నిష్కార్ధం = 5 చిన్నములు

కర్షం = 4 మాడలయెత్తు

కుడవం = 4 పలములు

నిష్కం = మాడయెత్తు

ప్రస్థం = 4 సేర్లు లేక 10 పలములు

అక్షం = తానిగింజప్రమాణము

మాషద్వయం = 5 చిన్నములు

కర్షం = ముప్పాతికయెత్తు

ఆఢకం = 32 పలములు

కుంభం = తూము

అర్ధ శలశం = ఇద్దుము

షోడశపలం = 6 పాపుసేర్లు

నిష్కద్వయం = 2 మాడలు

అక్షం = 4 మాడలు

ద్రోణము = 4 తూములు

ప్రస్థం = తూము

కర్షం = 4 మాడలు

బిడాలపతకం = పిల్లియడుగంత

సేరు = 1 పలములు

తులమన = 100 పలములు

ద్విపలం = చేరెడు



శ్రీ ర స్తు.

# గ్రంథాంతర ప్రమాణ మాత్రావివరము.

---

## పరమాణువు మొదలగువాని వివరణము.

శ్లో॥ జాలాంతర గతే భానౌ యత్సూక్ష్మం దృశ్యతే రజః ।
తస్య త్రింశ త్తమోభాగః పరమాణు స్సఉచ్యతే ॥

తా. సూర్యకిరణములు కిటికి మొదలగువానిలో ప్రసరించునపుడు అందు గానంబడెడి అణువులో 30 వ భాగము పరమాణు వనంబడు.

శ్లో॥ త్రసరేణు ర్బుధైః ప్రోక్త స్త్రింశద్భిః పరమాణుభిః ।
త్రసరేణుస్తు పర్యాయ నామ్నా వంశీ నిగద్యతే ॥

తా. 30 పరమాణువు లొక త్రసరేణు వనంబడుమఱియు నీ త్రసరేణువును వంశియను నామాంతరముకూడా గలిగియుండు.

శ్లో॥ జాలాంతర గతై స్సూర్య కరై ర్వంశీ విలోక్యతే ।
షడ్వంశీభిర్మరీచిస్స్యా త్తాభి ష్షడ్భిస్తు రాజికా ।
తిసృభీ రాజికాభిశ్చ సర్షపః ప్రోచ్యతే బుధైః ॥

తా. కిటికి మొదలగువాటియందు ప్రసరించెడి సూర్యకిరణములచే గానంబడెడి నలుసువవంశి యనంబడు. అట్టి 6 వంశు లొకమరీచియనియు 6 మరీచు లొక రాజిక యనియు 3 రాజి లొక సన్నయావగింజయొ త్తనియు బలుంగు.

శ్లో॥ యవోష్ట సర్షపైః ప్రోక్తో గుంజాస్యాత్తు చతుష్టయమ్ ।
షడ్భిస్తు ర త్తికాభిస్స్యా న్మాషకో హేమధాన్యకౌ ॥

తా. మఱియు 8 ఆవగింజ లొక యవగింజయనియు 4 యవగింజ లొకగురిగింజయొ త్తనియు 6 గురిగింజ లొక మాషమనియు జెప్పంబడు. మఱియు నీ మాషమునకు హేమమనియు ధాన్యకమనియు నామాంతరంబులు గలిగియుండు.

శ్లో॥ మాషైశ్చతుర్భి శ్శాణస్స్యాద్ధరణ స్సనిగద్యతే ।
టంక స్సఏవ కథిత స్తద్వయం కోల ఉచ్యతే ।
క్షుద్రభో వటకశ్చైవ వంక్షణంస నిగద్యతే ॥

తా. మఱియు 4 మాషములు నొకశాణమనియు ధరణమనియు టంకణమనియు జెప్పంబడు. 2 శాణములు నొకకోలమనియు క్షుద్రభమనియు వటకమనియు వంక్షణమనియు బఱంగు.

శ్లో॥ కోలద్వయంచకర్ష స్స్యాత్సప్రోక్తః పాణిమానికా । అక్షం పిచుః పాణితలం కించిత్పాణిశ్చ తిందుకమ్ । బిడాల పదకం చైవ తథా షోడశికామతా । కరమధ్యోహంసపదం సువర్ణం కబలగ్రహమ్ ఉదుంబరంచ పర్యాయైః కర్ష ఏవ నిగద్యతే॥

తా. మఱియు 2 కోలములు నొక కర్షమనియు పాణీమానికయనియు అక్షమనియు పిచువనియు పాణితలమనియు కించిత్పాణియనియు తిందుకమనియు బిడాల పతకమనియు షోడశికయనియు కరమధ్యయనియు హంసపదమనియుసువర్ణమనియు కబళగ్రహమనియు వుదుంబర మనియు జెప్పంబడు.

శ్లో॥ స్యాత్కర్షాభ్యా మర్ధపలం శుక్తి రష్టమికా తథా ।
శుక్తిభ్యాంచ పలంజ్ఞేయం ముష్టి రామ్రం చతుర్థికా ।
ప్రకుంచ షోడశీబిల్వం పలమేవాత్ర కీర్త్యతే ।

తా. మఱియు 2 కర్షములు నొక అర్ధపలమనియు శుక్తియనియు అష్టమికయనియు 2 శుక్తులు నొకపలమనియు ముష్టియనియు ఆమ్రమనియు చతుర్థికయనియు ప్రపంచమనియు షోడశీబిల్వమనియు జెప్పంబడు.

శ్లో॥ పలాభ్యాం ప్రసృతిర్జ్ఞేయా ప్రసృతశ్చ నిగద్యతే ।
ప్రసృతిభ్యా మంజలిస్స్యాత్కుడ వోర్ధశరావకః ।
అష్టమానంచ సజ్ఞేయం కుడవాభ్యాంచ మానికాః।
శరావోష్ట పలం తద్వత్ జ్ఞేయ మత్ర విచక్షణైః॥

తా. మఱియు 2 పలములు నొక ప్రసృతయనియు ప్రసృతియనియు 2 ప్రసృతులొక యాంజలియనియు కుడువమనియు అర్ధశరావకమనియు అష్టమానమనియు 2 కుడవము లొకమానికయనియు శరావమనియు అష్టపలమనియు బఱుగు.

శ్లో॥ శరానాభ్యాం భవేత్ప్రస్థ శ్చతుఃప్రస్థై స్తథాఢకమ్ ।
భాజనం కాంసపాత్రంచ చతుష్షష్టి పలంచ తత్ ॥

తా. మఱియు 2 శరావము లొక ప్రస్థమనియు 4 ప్రస్థము లొక ఆఢకమనియు భాజనమనియు కాంసపాత్రమనియు జెప్పంబడు. ఆఢకమన 64 పలములు.

శ్లో॥ చతుర్భి రాఢకై ద్రోణః కలశో నల్వణోన్మనా ।
ఉన్మానశ్చ ఘటోరాశి ద్రోణపర్యాయ సంజ్ఞకాః ॥

తా. మఱియు 4 ఆఢకములు 1 ద్రోణమనియు కలశమనియు నల్వణమనియు వున్మనమనియు వున్మానమనియు ఘటమనియు రాశియనియు బఱుగు.

శ్లో॥ ద్రోణాభ్యాం శూర్పకుంభౌన చతుష్షష్టి శరావకః ।
శూర్పాభ్యాంచ భవేద్ద్రోణివాహోగోణీచ సాస్మృతా ॥

తా. మఱియు 2 ద్రోణము లొక శూర్పమనియు కుంభమనియు 2 శూర్పము లొక ద్రోణియనియు వాహమనియు గోణియనియు జెప్పంబడు. ద్రోణియన 64 శరావములు.

శ్లో॥ ద్రోణీ చతుష్టయం ఖారీ కథితా సూక్ష్మబుద్ధిభిః ।
చతుస్సహస్ర పలికా షణ్ణవ త్యధికాచ సా ॥

తా. మఱియు 4 ద్రోణులు 1 ఖారియని జెప్పంబడు. ఖారియన 4096 పలములు.

శ్లో॥ పలానాం ద్విసహస్రంచ భార ఏకః ప్రకీర్తితః ।
తులాపల శతంజ్ఞేయం సర్వత్రై వైషనిశ్చయః ॥

తా. 2000 పలము లొక భారమనియు 100 పలము లొక తులమనియు జెప్పంబడు. కావున ముందు జెప్పంబోయెడి ప్రమాణంబులనన్నిటిని యిదేప్రకారముగా నెఱుంగందగు.

శ్లో॥ మాష టంకాక్ష బిల్వాని కుడవః ప్రస్థమాఢకమ్
రాశి ద్రోణీ ఖారికేతి యథోత్తర చతుర్గుణాః ॥

తా. 4 మాషము లొక టంకమనియు 4 టంకములు నొక అక్షమనియు 4 అక్షములు నొక బిల్వమనియు 4 బిల్వములు నొక కుడవమనియు 4 కుడవములు నొక ప్రస్థమనియు 4 ప్రస్థములు నొక ఆఢకమనియు 4 ఆఢకములు నొక రాశి యనియు. 4 రాసులు నొకగోణియనియు 4 గోణులు నొకఖారియనియు తెలియంగ వలయు. ఇక పచ్చివిగనుండు ద్రవ్యపరిమాణంబుల వచించెద.

శ్లో॥ గుంజాది మానమారభ్య యావత్స్యాత్కుడవస్థితి ।
ద్రవార్ద్ర శుష్కద్రవ్యాణాం తావన్మానం సమం మతమ్ ॥
ప్రస్థాది మాన మారభ్య ద్విగుణంతు ద్రవార్ద్రయోః ।
మానంతథా తులాయాస్తు ద్విగుణం నక్వచిత్ స్మృతమ్ ॥

తా. పైజెప్పిన పరిమాణంబులలో గుంజాప్రమాణము మొదలుకొని కుడవ ప్రమాణమువరకు రసార్ద్రశుష్కద్రవ్యంబులను సమాంశంబులుగను ప్రస్థాదిపరిమాణంబులకు రసార్ద్రద్రవ్యంబులను శుష్కద్రవ్యంబులకన్న ద్విగుణంబుగను స్వీకరింప వలయు. ఐనను తులమను ప్రమాణము ద్విగుణంబుగ జెప్పంబడదయ్యె.



శ్రీరస్తు





| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| **ప్రథమ ప్రకరణము.** | |
| ఇష్టదేవతా ప్రార్థన | 1 |
| గ్రంథారంభప్రతిజ్ఞ | 2 |
| యుగోపయుక్తగ్రంథములు | 3 |
| ఆయుర్వేదప్రశంస | ,, |
| గ్రంథాధ్యయనఫలము | 4 |
| గ్రంథస్థవిషయములు | ,, |
| జ్వరోత్పత్తి | 5 |
| అష్టధాతుస్థానములు | 7 |
| సిరాదిస్వరూపము | 8 |
| నాడీపరీక్ష | ,, |
| నాడీస్పర్శనవిధి | ,, |
| స్త్రీపురుష నాడీభేదము | 9 |
| హస్తగళ నాడీపరీక్ష | ,, |
| హస్తనాడీపరీక్ష | ,, |
| కంఠనాడీపరీక్ష | ,, |
| నాసానాడీపరీక్ష | 10 |
| శుభ నాడీపరీక్ష | ,, |
| వాతాదినాడీపరీక్ష | ,, |
| వాతాదినాడీలక్షణము | ,, |
| వాతాధిక్యనాడీలక్షణము | 11 |
| పిత్తాధిక్యనాడీలక్షణము | 11 |
| శ్లేష్మాధిక్యనాడీలక్షణము | ,, |
| ప్రకారాంతరనాడీలక్షణము | 12 |
| వాతపిత్తనాడీలక్షణము | ,, |
| వాతశ్లేష్మనాడీలక్షణము | ,, |
| పిత్తశ్లేష్మనాడీలక్షణము | ,, |
| సన్నిపాతనాడీలక్షణము | 13 |
| అసాధ్యనాడీలక్షణము | ,, |
| మృత్యునాడీలక్షణము | ,, |
| అజీర్ణనాడీలక్షణము | 14 |
| బాలవృద్ధాదులనాడీలక్షణము | ,, |
| త్రికాలనాడీలక్షణము | ,, |
| నాడీగతవాతసంచారకృత్యము | 15 |
| నాడీపరీక్షానిషేధకాలము | ,, |
| నాడీజ్ఞానహీనవైద్యదోషము | 16 |
| స్పర్శలక్షణము | ,, |
| రూపలక్షణము | ,, |
| శబ్దలక్షణము | 17 |
| జ్వరస్వరూపము | ,, |
| జ్వరాతిభేదములు | 18 |
| ఆహ్నికజ్వరలక్షణము | 19 |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| శీతజ్వరలక్షణము | 20 |
| శీతజ్వరములకు పాశుపతాస్త్రరసము | ,, |
| శీతజ్వరములకు మహాపాశుపతాస్త్రరసము | 21 |
| ద్వ్యాహికజ్వరలక్షణము | ,, |
| త్రిరాత్రజ్వరలక్షణము | 22 |
| రసప్రతాపమార్తాండరసము | ,, |
| త్రిరాత్రజ్వరమునకు జ్వరాంకుశము | ,, |
| సర్వజ్వరములకు మహాజ్వరాంకుశరసము | 24 |
| త్రిరాత్రజ్వరమునకు త్ర్యాహికారిరసము | 25 |
| త్రిరాత్రజ్వరచికిత్స | ,, |
| చాతుర్థికజ్వరలక్షణము | ,, |
| చాతుర్థికాది సర్వజ్వరములకు మహాదగ్ని కుమారము | 26 |
| శీతజ్వరానుపానములు | ,, |
| ఆహికజ్వరనస్యములు | 27 |
| మసూచికాజ్వరలక్షణము | ,, |
| అసాధ్యమసూరికాజ్వరలక్షణము | 29 |
| స్ఫోటకజ్వరచికిత్స | ,, |
| క్రిమిరోగలక్షణము | 30 |
| క్రిమిరోగచికిత్స | 31 |
| క్రిమిరోగములయందుపథ్యము | 32 |
| క్రిమిరోగములయందు అపథ్యము | ,, |
| జంతుజ్వరలక్షణము | 33 |
| జంతుజ్వరములకు కీటమర్దనరసము | ,, |
| జ్వరాతిసారలక్షణము | ,, |
| జ్వరాతిసారచికిత్స | 34 |
| రక్తాతిసారజ్వరలక్షణము | ,, |
| రక్తాతిసారజ్వరచికిత్స | ,, |
| దోషాతిసారలక్షణము | ,, |
| జ్వరితునియొక్క విషయములు | 35 |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| పునరావృత్తిజ్వరకారణము. | 35 |
| జ్వరము కలక్షణము | ,, |
| జ్వరమంత్రము | 37 |
| జ్వరసంప్రాప్తికారణము | ,, |
| జ్వరలక్షణము | ,, |
| జ్వరపూర్వరూపము | ,, |
| వాతజ్వరలక్షణము | 38 |
| పిత్తజ్వరలక్షణము | 40 |
| శ్లేష్మజ్వరలక్షణము | 42 |
| వాతపిత్తజ్వరలక్షణము | 43 |
| శ్లేష్మవాతజ్వరలక్షణము | ,, |
| శ్లేష్మపిత్తజ్వరలక్షణము | 44 |
| ద్వంద్వజ్వరలక్షణము | ,, |
| సన్నిపాతజ్వరలక్షణము | 45 |
| దాహజ్వరలక్షణము | 46 |
| అజీర్ణజ్వరలక్షణము | ,, |
| భూతజ్వరలక్షణము | 47 |
| అభిఘాతజ్వరలక్షణము | ,, |
| విషమజ్వరలక్షణము | ,, |
| విషమజ్వరోత్పత్తికారణము | 48 |
| విషమజ్వరభేదము | 49 |
| సంతతజ్వరోత్పత్తిక్రమము | 50 |
| సంతతజ్వరకాలప్రమాణము | ,, |
| సంతతజ్వరక్రమము | ,, |
| దోషక్షయవృద్ధులచే విషమజ్వరోత్పత్తికారణము | 51 |
| సంతతాదిజ్వరనిదానము | ,, |
| తార్తీయిక, త్ర్యాహికజ్వరనిదానము | 52 |
| శుక్లగతజ్వరలక్షణము | ,, |
| శుక్లగతజ్వరచికిత్స | 53 |
| ఆమజ్వరలక్షణము | ,, |
| పచ్యమానజ్వరలక్షణము | 54 |
| నిరామజ్వరలక్షణము | ,, |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| ఆహారాదిజ్వరకాలప్రమాణము. | 54 |
| త్వగ్గతాదిజ్వరలక్షణము | 55 |
| అంతర్గతజ్వరలక్షణము | ,, |
| రక్తగతజ్వరలక్షణము | ,, |
| మాంసగతజ్వరలక్షణము | 56 |
| అస్థిగతజ్వరలక్షణము | ,, |
| కాలజ్వరలక్షణము | 57 |
| చర్మగతజ్వరకాలప్రమాణము | ,, |
| రక్తగతజ్వరకాలప్రమాణము | ,, |
| మాంసగతజ్వరకాలప్రమాణము | 58 |
| రసగతజ్వరలక్షణము | ,, |
| రసగతజ్వరకాలప్రమాణము | ,, |
| ఆగంతుకజ్వరనిదానము | ,, |
| అభిన్యాసజ్వరలక్షణము | 59 |
| కామజ్వరలక్షణము | ,, |
| అసాధ్యజ్వరలక్షణము | ,, |
| సంగమదోషజ్వరలక్షణము | 62 |
| విషూచిజ్వరలక్షణము | ,, |
| విషూచిజ్వరచికిత్స | ,, |
| విషూచిజ్వరములకు అగ్నికుమారము | 63 |
| కామిలాజ్వరలక్షణము | ,, |
| మేదోగతజ్వరలక్షణము. | 64 |
| మజ్జాగతజ్వరలక్షణము. | , |
| జీర్ణజ్వరలక్షణము | ,, |
| గంభీరజ్వరలక్షణము | ,, |
| తరుణాదిజ్వరప్రమాణము | 65 |
| బాలురకుజనించు నీరుచవ్వల లక్షణచికిత్స | ,, |
| నూతికాజ్వరలక్షణము | ,, |
| స్వేదభేదములు | 66 |
| స్వేదచికిత్స | ,, |
| జ్వరితునిమారకోపద్రవములు | 67 |
| జ్వరదశావస్థలు | ,, |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| జ్వరరోగసాధ్యాసాధ్యోపద్రవములు | 68 |
| జ్వరదినప్రమాణము | ,, |
| జ్వరపాకక్రమము | 69 |
| జ్వరితపథ్యలక్షణము | 70 |
| లంఘనక్రమము | ,, |
| పథ్యక్రమము | ,, |
| పథ్యోపయుక్తశాకములు | 71 |
| అపథ్యద్రవ్యాదులు | 72 |
| పురాణజ్వరములకుమాలినీవసంతరసము | ,, |
| పురాణజ్వరములకు రసకల్పములు | ,, |
| కఫరిశుద్ధి | 75 |
| జ్వరమురారి | ,, |
| సర్వజ్వరాదిహరఘుటికలు | 76 |
| జ్వరవైరివటుకములు | ,, |
| జ్వరగజకేసరి | 77 |
| జ్వరములకు పంచాననరసము | ,, |
| జ్వరగజాంకుశము | ,, |
| సర్వజ్వరములకు నారసింహరసము | 78 |
| జ్వరములకు చండభానురసము | ,, |
| జ్వరనాశనరసము | 79 |
| తరుణజ్వరారిరసము | 80 |
| నవజ్వరేభసింహరసము | ,, |
| నవజ్వరములకు త్రిపురభైరవరసము | 81 |
| జ్వరములకు వైష్ణవీరసము | ,, |
| సర్వజ్వరములకు శీతభంజీరసము | 8 |
| మహాపార్తములో జ్వరమును హరించెడి శీతభంజీరసము | , |
| జ్వరములకు స్వచ్ఛందభైరవము | 8 |
| త్రిదోషజ్వరములకు జ్వరాంకుశము | 81 |
| అష్టవిధజ్వరములకు జ్వరాంకుశము | ,, |
| విషమజ్వరములకు జ్వరాంకుశము | ,, |
| శీతజ్వరాంకుశము | ,, |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| జ్వరములకు రాజచండీశ్వరరసము | 84 |
| జ్వరములకు సూతరాజీయము | 86 |
| జ్వరములకు కాలాగ్నిరుద్రరసము | ,, |
| జ్వరములకు నవరత్నాగ్నికుమారము | 87 |
| జ్వరములకు సిద్ధాగ్నికుమారము | ,, |
| జ్వరములకు లఘ్వగ్నికుమారము | 88 |
| పురాణజ్వరములకు త్రిలోచనరసము | ,, |
| సర్వజ్వరములకు సింహప్రతీపాలనము | 89 |
| సర్వజ్వరములకు ఆనందభైరవము | 90 |
| మహూర్తములోనవజ్వరములను హరించెడి రత్నగిరిరసము | ,, |
| సర్వజ్వరములకు చండేశ్వరరసము | 91 |
| సర్వజ్వరములకు శ్రీజయమంగళరసము | 92 |
| సర్వజ్వరములకుమృత్యుంజయ రసము | 93 |
| తరుణాద్విజ్వరములకు ప్రళయానలరుద్రరసము | 94 |
| సర్వజ్వరములకు తరుణార్కరసము | 96 |
| అసాధ్యజ్వరాదులయందు కల్పతరురసము | ,, |
| జ్వరములకు అర్ధనారీశ్వరరసము | 97 |
| ఆమజ్వరాదులకు అగ్నికుమారరసము | 98 |
| సర్వజ్వరాతిసారములకు మేఘనాదరసము | 99 |
| చాతుర్థికజ్వరములకు చాతుర్థకారిరసము | 100 |
| సర్వజ్వరములకు చింతామణిరసము | 101 |
| సర్వజ్వరహరకషాయము | ,, |
| శీతజ్వరహరకషాయములు | ,, |
| శీతజ్వరమునకు క్షుద్రాదికషాయము | 102 |
| సర్వజ్వరములకుభూనింబాదికషాయము | ,, |
| విషమజ్వరములకు దార్వ్యాదికషాయము | 103 |
| శ్లేష్మజ్వరాదులకు దశమూలకషాయము | ,, |
| కఫరోగమునకుకట్ఫలాదికషాయము | 104 |
| కఫాదిజ్వరములకుశృంగ్యాదికషాయము | ,, |
| త్రిదోషజజ్వరమునకు క్షుద్రాదికషాయము | ,, |
| అష్టవిధజ్వరాదులకు వృద్ధక్షుద్రాదికషాయము | 105 |
| అజీర్ణాదిజ్వరములకు కిరయాలపంచకకషాయము | ,, |
| వాతపిత్తజ్వరములకు పంచభద్రకషాయము | ,, |
| వాతజ్వరమునకు శర్యాదికషాయము | 106 |
| శ్లేష్మజ్వరాదులకు బృహచ్ఛర్యాదికషాయము | ,, |
| వాతజ్వరమునకుపటోలాది కషాయము | ,, |
| వాతకఫజ్వరమునకు వృద్ధముస్తాదికషాయము | 107 |
| పిత్తజ్వరమునకుగుడూచ్యాదికషాయము | ,, |
| పిత్తజ్వరమునకు త్రాయమాణాదికషాయము | ,, |
| పిత్తశ్లేష్మజ్వరమునకు వృద్ధత్రాయమాణాదికషాయము | ,, |
| విషమజ్వరమునకు వా[illegible]కషాయము | 108 |
| ఏకాహికజ్వరమునకు పటోలాదికషాయము | ,, |
| త్ర్యాహికజ్వరమునకు గుడూచ్యాదికషాయము | ,, |
| పురాణజ్వరములకు మహాలవంగాదిచూర్ణము | 109 |
| పురాణజ్వరక్షయాదులకు ఏలాదిచూర్ణము | ,, |
| ఏకాహికాదిజ్వరములకు నింబాదిచూర్ణము | 110 |
| జ్వరములకు సుదర్శనచూర్ణము | 111 |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| సర్వజ్వరములకుజ్వరభైరవచూర్ణము | 112 |
| సర్వజ్వరములకుఆమలక్యాదిచూర్ణము | 113 |
| దుష్టజ్వరములకు హారీతక్యాదిచూర్ణము | ,, |
| దుష్టజలజనితజ్వరమునకు కిరాతాది చూర్ణము | 114 |
| జ్వరములకు లాక్షాదితైలము | ,, |
| శీతజ్వరములకు హస్తికర్ణికతైలము | ,, |
| సర్వజ్వరములకు అంగారకతైలము | 115 |
| జ్వరములకు లాక్షాదితైలము | 116 |
| విషమజ్వరములకు మహాలక్షాదితైలము | ,, |
| శీతజ్వరమునకు కట్వరతైలము | 117 |
| ఏకాహికాది విషమజ్వరములకు మహాకట్వరతైలము | ,, |
| విషమజ్వరములకు బృహత్పిప్పల్యాది తైలము | 118 |
| ఏకాహికాది జ్వరములకులాక్షా భూతాంకుశతైలము | 119 |
| జ్వరములకు హస్తికర్ణికతైలము | 120 |
| జ్వరాదులకు క్రముకాదిరసాయనము | 121 |
| జ్వరములకు ఎఱ్ఱవాలుఁడులేహ్యము | 122 |
| సహదేవిఘృతము | 123 |
| క్షీరషట్పలఘృతము | ,, |
| దశమూలషట్పలకఘృతము | ,, |
| **ద్వితీయ ప్రకరణము.** | |
| సన్నిపాతోత్పత్తికారణము | 125 |
| త్రయోదశ సన్నిపాతసామాన్య నిదానము | 126 |
| సన్నిపాత సామాన్యలక్షణము | 137 |
| అసాధ్యసన్నిపాతసామాన్య నాడీలక్షణము | 129 |
| మృత్యుధాతులక్షణము | ,, |
| సన్నిపాతజ్వరసామాన్యప్రమాణము | ,, |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| సన్నిపాతనామతత్సాధ్యాసాధ్యములు | 130 |
| సంధికసన్నిలక్షణము | 131 |
| తాంద్రికసన్నిలక్షణము | 132 |
| ప్రలాపసన్నిలక్షణము | 133 |
| చిత్తవిభ్రమసన్నిలక్షణము | 134 |
| జిహ్వాకసన్నిలక్షణము | 135 |
| కర్ణికసన్నిలక్షణము | 136 |
| పూర్వోక్తసన్నిపాతసాధ్య నాడీలక్షణము | 137 |
| సాధ్యసన్నిపాతవివరణము | ,, |
| అసాధ్యసన్నిపాతవివరణము | ,, |
| రుగ్దాహసన్నిలక్షణము | 138 |
| అంతకసన్నిలక్షణము | 139 |
| భుగ్ననేత్రసన్నిలక్షణము | 140 |
| కంఠకుబ్జసన్నిలక్షణము | 141 |
| రక్తష్ఠీవిసన్నిలక్షణము | 142 |
| శీతాంగసన్నిలక్షణము | 143 |
| అభిన్యాససన్నిలక్షణము | 144 |
| సన్నిపాతభేదములు | 145 |
| శీతాంసన్నిపాతవివరణము | ,, |
| దాహోద్యగ్ర సన్నిపాతవివరణము | ,, |
| సన్నిపాతదినప్రమాణము | 146 |
| త్రయోదశసన్నిపాతవిశేషములు | 147 |
| విస్ఫారకసన్నితపాతలక్షణము | ,, |
| ఆశుకారిసన్నిపాతలక్షణము | 148 |
| కంపనసన్నిపాతలక్షణము | ,, |
| బభ్రుసన్నిపాతలక్షణము | ,, |
| శీఘ్రకారిసన్నిపాతలక్షణము | 149 |
| భల్లసన్నిపాతలక్షణము | ,, |
| కూటపాలకసన్నిపాతలక్షణము | ,, |
| సంమోహసన్నిపాతలక్షణము | 150 |
| పాలకసన్నిపాతలక్షణము | 151 |

షాం భక్తికాజ్వరఉచ్యతే । శార్దూలానాంచసర్వేషాం శ్రమోజ్వరఇహేరితః । మానుషేషుచధర్మజ్ఞ మిథ్యాహారాది సేవనమ్ । జన్మస్యంతేచవన్యానాం స్వభావాజ్జాయతేజ్వరః । ఏవమాహేశ్వరంతేజో జ్వరనామానుదారుణః॥

తా. ఏనుగులకు కలిగెడి జ్వరము పాకలమనియు పర్వతములకు కలిగెడి జ్వరము శిలాజిత్తనియు పాములకు కలిగెడి జ్వరము నిర్మోకమనియు ఉదకమునకు కలిగెడి జ్వరము నీలికాయనియు ఆవులకు కలిగెడి జ్వరము శీతికాయనియు భూమికి కలిగెడిజ్వరము ఊషరమనియు కుక్కలకు కలిగెడి జ్వరము అళర్కమనియు పులులకుకలిగెడిజ్వరము దృష్టిప్రత్యవరోధమనియు గుఱ్ఱములకు కలిగెడి జ్వరము అపస్మృతియనియు నెమళ్ళకు కలిగెడిజ్వరము శిఖోద్భేదమనియు కొంగలకు కలిగెడి జ్వరము ప్రవాహతమనియు పిల్లులకు కలిగెడుజ్వరము పృష్ఠభేదమనియు రోమనాశమనియు పందికొక్కులకు కలిగెడుజ్వరము దర్దురమనియు చిలుకలకు కలిగెడిజ్వరము భిత్తికాయనియు శివంగి మొదలగు జంతువులకు కలిగెడిజ్వరము శ్రమమనియు జెప్పబడును మనుజులకు మిథ్యాహారాదులవలనజ్వరముకలుగును. ఏనుగు మొదలగు అడవిజంతువులకు అంత్యకాలమునందు స్వభావముగానే జ్వరము కలుగును. ఇటుల అనేకవిధములను దారుణమైన జ్వరములు మహేశ్వరునియొక్క కోపస్వరూపము కలవై యుండును.

## ఆహ్నికజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అథోత్తరంప్రవక్ష్యామి చాహ్నికజ్వరలక్షణమ్ । శీతంసపులకంగాత్రం దాహసంతాపహృద్గదమ్ । శిరోరుజాంగవైకల్యం కుక్షిపార్శ్వేచశూలకృత్ । అపథ్యవాంఛాతంద్రాచ పాదహృన్ముఖశోఫతా । గాత్రంపాండురవర్ణంచ పీతవర్ణంచలోచనమ్ । అక్షిరక్త విహీనంచా ప్యతిసారశ్చ జాడ్యతా । కరపాదవిదాహశ్చా ప్యాహ్నికజ్వరలక్షణమ్॥

తా. ఇక ఆహ్నికజ్వరలక్షణముల వచించెద. శరీరము చలిబెట్టుట శరీరము పులకరించుట విదాహము సంతాపముకలుగుట ఱొమ్మునొచ్చుట తలనొచ్చుట అంగములు శైథిల్యమును జెందుట కడుపు పార్శ్వములు శూలించుట అపథ్యములయం

దిచ్చకలుగుట * తంద్రము కలుగుట పాదములు బొమ్మ ముఖమువాచుట శరీరము పాండురవర్ణముగ నుండుట! నేత్రములు పసుపుబారియుండుట నేత్రములు రక్తహీనములై తెలుపుబారియుండుట అతిసారము శరీరజాడ్యము కలుగుట చేతులు కాళ్లు మండుట ఈలక్షణములుగలది ఆహికజ్వరమని తెలియవలయు.

## శీతలజ్వర లక్షణము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] దేహన్యశీతతాకంపో రోమహర్షశ్చగా
యితా । తంద్రాభ్రమూర్ఛభ్రమశ్చైవ శీతజ్వరస్యలక్షణమ్॥

తా. శరీరము చల్లగ నుండుట వణకుట గగుర్పొడుచుట పాడుట తంద్ర మూర్ఛ భ్రమ యీ లక్షణములు గలది శీతజ్వరమని తెలియవలయు.

శ్లో॥ [మతాంకరే] త్వక్స్థౌ శ్లేష్మానిలౌశీత మాదౌ జనయతోజ్వ
రమ్ । తయోః ప్రశాంతయోఃపిత్తం మంతేదాహంకరోతిచ॥

తా. శ్లేష్మవాతములు రెండును తోలుత రసధాతువు నాశ్రయించి వణకును చలిని గలుగ జేసి పిదప జ్వరమును కలుగ జేయును. ఆ శ్లేష్మవాతములు శాంతిజెందినపిదప పిత్తము ప్రకోపించి విదాహమును గలుగ జేయును. ఈలక్షణములు సామాన్యముగాశీతపూర్వజ్వరంబుల కెల్ల కలవని యెఱుంగవలయు.

## శీతజ్వరములకు పాశుపతాస్త్రరసము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసభస్మతామ్రభస్మ గంధకంచమనశ్శిలా ।
పాషాణద్వితయంచాథ భృంగినిరేణమర్దయేత్ ।
ద్విదినంవాలుకాయంత్రే చండాగ్నౌచద్వియామకమ్ ।
ద్విగుంజంభక్షయేన్నిత్యం మార్ద్రికంచానుపానకమ్ ।
పాశుపతాస్త్రనామాయం సర్వాహికజ్వరంహరేత్॥

తా రసభస్మము తామ్రభస్మము శుద్ధిజేసినగంధకము శుద్ధిజేసిన మణిశిల శుద్ధిజేసిన ఉల్లిపాషాణము శుద్ధిజేసిన గౌరీపాషాణము వీనిని సమభాగములుగా

* తంద్రయన సోమరితనములేక కునికిపాటు.

గ్రహించి ఖల్వములోనునిచి గుంటగలగర రాకురసముచే 2 దినములు యెడతెగక మర్దించిమాత్రలుజేసి గాజుకుప్పెలోబోసి వాలుకాయంత్రములోనునిచి 2 ఝాములు (గంధకము జీర్ణంబగువరకు) తీక్ష్ణాగ్నిచే వండి స్వాంగశీతలమునదీసి ప్రతిదినము 2 గురిగింజలయెత్తు ఔషధమును అల్లపురసానుపానముతో సేవింపుచుండిన సకల ఆహికజ్వరములు నశించును. (ఇదియ పాశుపతాస్త్రరసము).

## శీతజ్వరములకు మహాపాశుపతాస్త్రరసము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] ద్విభాగంశ్వేతపాషాణం రసంనేపాళమ్లేచ్ఛ
కమ్ । ప్రత్యేకమేకభాగంతు ఖల్వమధ్యేవినిక్షిపేత్ । కృష్ణ
దుత్తూరతోయేన మర్దితంయామమాత్రకమ్ । ముద్గప్రమాణ
మాత్రేణ త్వార్ద్రకంచానుపానకమ్ । ఐకాహికంద్వ్యాహి
కంచ త్ర్యాహికం నాశయేజ్జ్వరమ్॥

తా. శుద్ధిజేసిన ఉల్లిపాషాణము 2 భాగములు శుద్ధిచేసిన కఫరి శుద్ధిచేసిన నేపాళములు శుద్ధిచేసిన ఇంగిలీకము ఇవి దినుసొకటింటికి ఒక్కొక్క భాగము ఇత్తెరంగుం వీనినెల్లి గ్రహించి ఖల్వములోవైచి ఒక ఝాము నల్లఉమ్మెత్తాకు రసముతోడ బాగుగామర్దించి పెసరగింజలంతేసిమాత్రలుచేసి యందొకదానిని చలివచ్చినతోడనే అల్లపురసములో సేవింపవలయును. ఇటుల మూడుపూటలు సేవించిన ఐకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక శీతలజ్వరములు హరించును. (దీనియందు చప్పిడిగంజిని త్రాగవలయును. మఱియునీయౌషధమును వరుస త్రిరాత్రజ్వరములయందును సేవింపవలయును. ఈ పాశుపతాస్త్రరసములు శీతజ్వరములను హరింపచేయుట యందు కడు ప్రసిద్ధిజెందినవి.)

## ద్వ్యాహికజ్వర లక్షణము.

శ్లో॥ [బాహటే] కరపాదవిదాహశ్చ ముఖేపాండురశోఫతా ।
అంతర్దాహోబహిశ్శీతం ద్వ్యాహికజ్వరలక్షణమ్॥

తా. చేతులు కాళ్లు మండుట ముఖము పాండురవర్ణమై శోఫయుక్తముగ నుండుట కడుపులో మంట కలుగుట వెలపట శీతలముగనుండుట ఈ లక్షణములు గలది ద్వ్యాహికజ్వరమని తెలియవలయు. (ఈ ద్వ్యాహికజ్వరమునందు పైజెప్పిన పాశుపతాస్త్రరసమును సేవింపవలయును).

## త్రిరాత్రజ్వర లక్షణము.

శ్లో॥ [పూజ్యపాదీయే] దేహా చశ్యామలంవర్ణం కంఠశోషశ్చదా। హృకృత్।గాత్రంతుశీతలంగ్రాహ్యం త్రిరాత్రజ్వరలక్షణమ్ ॥

తా. శరీరమునకు నల్లవర్ణము కంఠముశోషించుట శరీరము చల్లనైయుండుట ఈలక్షణములు గలది త్రిరాత్రజ్వరమని తెలియవలయును. (ఈత్రిరాత్రజ్వరమునకు జ్వరము వచ్చుటకు ముందుదినము కడుపు కలుపుటకై యిక జెప్పబడు రసప్రతాప మార్తాండరసమును గుడపానకయుక్తముగా సేవింపవలయును).

## రసప్రతాప మార్తాండరసము.

శ్లో॥ రసహింగుళనేపాళం పృథ్వీదంత్యంబుమర్దితమ్ ।
దినార్ధేనజ్వరంహన్యా గ్గుడేనసితయాసహ ।
చతుర్వల్లమిదంఖాదే త్సర్వజ్వరప్రశాంతయే ॥

తా. శుద్ధిచేసినరసము 1 భాగము శుద్ధిచేసిన ఇంగిలీకము 3 భాగములుశుద్ధిచేసిన నేపాళములు 4 భాగములు ఇటుల వీనిని ఖల్వములోవైచి నెలదంతి చెక్కరసముచే 2 ఝాములు బాగుగా మర్దించి 4 వల్లములు (అనగా 8 గురిగింజలయెత్తు మాత్రలుచేసి యందొకదానిని బెల్లపురసముచేగాని పంచదార పానకముచేగాని సేవించిన కడుపుకలిసి సర్వజ్వరములు హరించును. (ఈరసప్రతాప మార్తాండరసమును సేవించిన మరుదినంబున త్రిరాత్రజ్వరమునకు యిక జెప్పబడు జ్వరాంకుశమును ఒక మండలము సేవించవలయును.)

## త్రిరాత్రజ్వరమునకు జ్వరాంకుశము.

శ్లో॥ సూతంగంధంవిషంతుల్యం ధూర్తబీజం త్రిభిస్సమమ్ । చతుర్ణాంద్విగుణంవ్యోషం చూర్ణయేద్దినమాత్రకమ్ ॥ జంబీరస్యరసైర్మర్ద్య మార్ద్రకస్యద్రవేనచ । గుంజాద్వయంప్రదాతవ్యం వాతజ్వరహరంపరమ్ । ఇదంజ్వరాంకుశంనామ్నా సర్వజ్వరవినాశనమ్ । ఐకాహికంద్వ్యాహికంచ త్ర్యాహికంవా

చతుర్థకమ్ । విషమంవాత్రిదోషంవా హంతిసత్యం నసం
శయః॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన గంధకము శుద్ధిజేసిన నాభి ఇవి సమభాగములు ఈ 3 సమము శుద్ధిచేసిన ఉమ్మెత్తువిత్తులు ఈ నాలుగింటి యిమ్మడి శొంఠి పిప్పలి మిరియాలు ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి ఖల్వములోనునిచి నిమ్మపండ్ల రసముచేఒకదినము బాగుగా మర్దించి 2 గురిగింజలంతేసి మాత్రలుచేసి యందొకదానిని అల్లపురసముతో సేవించిన వాతజ్వరము హరించును. ఇది వాతజ్వరమును హరింపజేయుటయందు కడు శ్రేష్ఠంబైనది. మఱియు దీనిని అల్లపురసముతో నలువదిదినములు సేవించిన ఐకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికజ్వరములు విషమజ్వరములు త్రిదోషజ్వరము మొదలగు సర్వజ్వరములు నిస్సంశయముగ హరించును. ఇదియ జ్వరాంకుశమనబడును. (ఈజ్వరాంకుశముమ పావుశేరు ఖర్జూరపండ్ల అనుపానముతో నేని లేక పావుశేరు నేలతాటిగడ్డల చూర్ణానుపానముతో నేని లేక పావుశేరు గుడానుపానముతో నేని ఒకమండలము ప్రత్యహము సేవింపుచుండిన త్రిరాత్రజ్వరమునశించును.)

శ్లో॥ [అన్యశాస్త్రే] తామ్రంతోద్విగుణంతాళం మర్దయేత్స్నపవీద్రవైః । ప్రపుటేద్భూధరీతే వజ్రీక్షీరేణమర్దయేత్ । ప్రపుటేద్భూధరేపశ్చాత్పంచగుంజామితంభజేత్ । ఆర్ద్రికస్వరసేనైవ సర్వజ్వరనికృంతనః । ఐకాహికంద్వ్యాహికంచ త్ర్యాహికంచతురాహికమ్ । విశమంచాపిశీతాఢ్యం జ్వరంహంతి జ్వరాంకుశః॥

తా. తామ్రభస్మము 1 భాగము శుద్ధిచేసిన తాళకము 2 భాగములు ఇటుల వీనిని ఖల్వములో నునిచి కాకరాకు రసముచే ఒకఝాము మర్దించి బిళ్ళజేసి యెండనెండించి భూధరయంత్రములో పుటంబిడి సాంగ శీతలమునదీసి జెముడుపాలచే మరల మర్దించి మరల భూధర యంత్రములో పుటంబిడి 5 గురిగింజల ప్రమాణమును అల్లపురసముతో సేవించిన ఐకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థిక జ్వరములు విషమజ్వరములు సీతజ్వరము మొదలగు సర్వజ్వరములు హరించును. (ఇదియును జ్వరాంకుశ మనబడును.)

## సర్వజ్వరములకు మహాజ్వరాంకుశరసము.

శ్లో॥ [గ్రంథాంతరే] పారదంగంధకంతామ్రం హింగుళంతాళమేవచ । లోహంవంగంహేమమాక్షీకంచ ఖర్పరంచమనశ్శిలా । మృత్రాభ్రకంగైరికంచ టంకణందంతిబీజకమ్। సర్వాణ్యేతానితుల్యాని చూర్ణయిత్వావిభావయేత్ । జంబీరతులసీచిత్రవిజయాతింతిడీరసైః । ఏభిర్దినత్రయం రౌద్రే నిర్జనేఖల్వగహ్వరే। చణమాత్రాంవటీం కృత్వా ఛాయాశుష్కాంచకారయేత్ । మహాగ్నిజననీచైషా సర్వజ్వరవినాశినీ । ఏకజంద్వంద్వజంచైవ చిరకాలసముద్భవమ్ । ఐకాహికందార్వ్యాహికంచ తథాత్రిదివసజ్వరమ్ । చాతుర్థికంతథాత్యుగ్రం జలదోషసముద్భవమ్ । సర్వాన్ జరాన్ నిహంత్యాశు భాస్కర స్తిమిరంయథా । నాతఃపరంకించిదస్తి జ్వరనాశనభేషజమ్ । మహాజ్వరాంకుశోనామ రసోయం మునిభాషితః॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన గంధకము తామ్రభస్మము శుద్ధిజేసిన ఇంగిలీకము శుద్ధిజేసిన తాళకము లోహభస్మము వంగభస్మము శుద్ధిజేసిన హేమమాక్షికము శుద్ధిజేసిన కపరిశుద్ధిజేసిన మణిశిల అభ్రకభస్మము కావిరాయి వెలిగారము నేలదంతివిత్తులు వీనిని సమభాగములుగాచూర్ణముజేసి ఖల్వములోవైచి నిమ్మపండ్లురసముతులసిరసము చిత్రమూలరసము తక్కెడరసము చింతాకురసము వీనిలో ప్రతిదానిచేమూడేసి దినములచొప్పున భావనజేసి పిదప పైరసముల నన్నిటిచే ఖల్వమును నిండించి 3 దినములు నిర్జనప్రదేశములో ఖల్వముతోడ యెండనెండించి సెనగగింజలంతేసి మాత్రలు జేసి నీడ నెండించి యందొకమాత్రను అల్లపురసముతో సేవించిన అగ్ని దీపనము గలుగుటయేగాక వాతపిత్తశ్లేష్మజ్వరములు ద్వంద్వజ్వరములు పురాణజ్వరములు ఐకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికజ్వరములు అత్యుగ్రజ్వరము జలదోషమువలన జనించిన జ్వరము యీ మొదలగు సర్వజ్వరములను "సూర్యుడు చీకటిని బోకడచుచందంబున" బోకడచు. జ్వరములబోకడచుటయందు దీనికంటె శ్రేష్ఠంబైన యౌషధం బెద్దియులేదు. ఇది మహాజ్వరాంకుశ రసమని మునీశ్వరులు వచించిరి.

### త్రిరాత్రజ్వరమునకు త్ర్యాహికారీ రసము.

శ్లో॥ [మాధవనిదానే] రసకేన సమంశుద్ధం శిఖిగ్రీవంచపాదికమ్ ।
గోజిహ్వాయాజయంత్యాచ తండులీయైశ్చ భావయేత్ ।
ప్రత్యేకంస ప్తసప్తాథ శుష్కంగుంజాచతుష్టయమ్ ।
జరణేనఘృతేనాద్యా త్ర్యాహికజ్వరశాంతయే ॥

తా॥ కఫరి శంఖము యివి సమభాగములు మైలుతు త్తము ¼ భాగము వీటిని ఎద్దునాలుక తక్కెడు చిట్టికూర వీని రసములలో ప్రతిదానిచే 7 పర్యాయములు భావనచేసి మర్దించి మాత్రలుచేసి నీడ నెండించి 4 గురిగింజలయెత్తును ప్రాతనేతితో నిప్పించిన త్ర్యాహికజ్వరము నివర్తించును.

### త్రిరాత్రజ్వర చికిత్స.

క॥ ఇలఁదమ్ములమున నల్లుల ।
విలసితముగ వరుసతోడ విడియముసేయన్ ।
జలిబెట్టు త్రిరాత్రజ్వర ।
కులబొల్లను ద్రుంచుటరుదె గోపతిగమనా ॥

తా. త్రిరాత్రవరుసదినమున నైదునల్లులను రెండవవరుసదినమున నేడునల్లులను మూడవవరుసదినమున తొమ్మిదిఁనల్లులను తమలపాకులో బాదిగ విడెము సేయవలయు. ఇటులజేసిన త్రిరాత్రజ్వరము హరించు. (త్రిరాత్రజ్వరములో పైజెప్పిన పాశుపతాస్త్రమును కూడా బ్రయోగించవలయు.)

### చాతుర్థికజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శీతంసపులకంగాత్రం శిరోభ్రమణకంపనే
హరిద్రానేత్రకాంతిశ్చ చాతుర్థ జ్వరలక్షణమ్

తా, చలిబెట్టుట శరీరము పులకరించుట తలదిరుగుట వణకుట నేత్రము పచ్చనై యుండుట యీ లక్షణములుగలది చాతుర్థికజ్వరమని తెలియవలయు.

శ్లో॥ [భావహాతే] చతుర్థకోమలేమేదో మజ్జాస్థ్యన్యతమేస్థితే ।
మజ్జన్య ఏవస్వాపరే ప్రభావం సతుదర్శయన్ ।

ద్వితీయకోధేన జంఘాభ్యాం నపూర్వ శ్శిరసోనిలాత్ ।
చతుర్థక స్సాధు కార్యస్స త్రైహాంతరసంభవః ॥

తా. మేదస్సు మజ్జ వీనిలో దేని నేని దోషము ఆశ్రయించి యుండునపుడు చాతుర్థికజ్వరము కలుగును. మజ్జధాతువు నాశ్రయించియుండునపుడు చాతుర్థిక జ్వరము కలుగునని కొందరాచార్యులమతము.

చాతుర్థికాది సర్వజ్వరములకు మహదగ్ని కుమారము.

శ్లో॥ [చింతామణౌ] రసంవిషంచాభ్రగంధం తాళకం హింగుళం విషమ్ । శుల్బభస్మ సమంతుల్యం మర్దితం భృంగవారిణా । కాచకుప్యాంవినిక్షిప్య మృత్తికాం లేపయేద్బహిః । వాలుకాయంత్రకేపాచ్యం దినైకం మందవహ్నినా । సాంగశీతలము ద్ధృత్య దాతవ్యం చణమాత్రకమ్ । అనుపానవిశేషేణ చాతుర్థిక జ్వరంహరేత్ । సన్నిపాతం నిహంత్యాశు సర్వజ్వరహరం పరమ్ । మహదగ్నికుమారోయం సర్వవ్యాధివిదారణమ్ ॥

తా, శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన వసనాభి అభ్రకభస్మము శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన తాళకము శుద్ధిచేసిన యింగిలీకము శుద్ధిచేసిన వుల్లిపాషాణము తామ్రభస్మము వీనిని సమభాగములుగా ఖల్వములోనునిచి గుంటగలగరాకు రసముచే 1 దినము బాగుగా మర్దించి గాజుకుప్పెలో బోసి దానిపై చీలమన్ను లేపనముచేసి 4 దినము వాలుకాయంత్రములో మందాగ్నిచే పాకముచేసి సాంగశీతలమున దీసి గుంటగలగరాకురసముచే మరల మర్దించి సెనగగింజలంత మాత్రలుజేసి 40 దినములు అల్లపురసానుపానముతో సేవింపుచుండిన చాతుర్థికజ్వరము సన్నిపాతజ్వరము త్రిరాత్రవరుసజ్వరము ఆహికజ్వరము పురాణజ్వరములు యివి మొదలగు సర్వజ్వరములు హరించు. (దీనిని చాతుర్థిక జ్వరమున పంచమూలకషాయానుపానముతో సేవింపవలయు. ఇదియు మహదగ్ని కుమార మనబడును.

శీతజ్వరానుపానములు.

శ్లో॥ [మాధవనిదానే] కణాభయంవాకణజీరకంవా నశర్కరంకేవలజీరకంవా । ఉష్ణాంబుపీత్వా సహసానిహన్యా చ్ఛీతస్య కంపం పరితాపముగ్రమ్ ॥

తా. ఆహికజ్వరములయందు పిప్పలి కరక్కాయనుగాని లేక పిప్పలి జీలకర్రను గాని లేక పంచదార జీలకర్రనుగాని అనుపానముగా గ్రహించి వుష్ణోదకముతో పానము చేయించవలయు. మఱియు ఔషధమును అల్లపు రసయుక్తముగా నొసంగవలయు. ఇటుల జేసిన చలి వణుకు వుగ్రతాపము వీనితోగూడి యుండు ఆహికజ్వరములు శీఘ్రముగా నశించును.

ఆహికజ్వర నస్యములు.

శ్లో॥ [మాధవనిదానే] గిరికర్ణిక యోర్మూలం మరీచం లశునం
యుతమ్ । నస్యం శీతజ్వరంహంతి ఏకద్విత్రి చతుర్థకమ్॥

తా. * తెల్లగంటెనవేరు నల్లగంటెనవేరు మిరియాలు వెల్లుల్లిపాయలు వీనిని సమభాగములుగా నూరి నస్యముజేయించిన ఐకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థిక శీతజ్వరములు నశించు.

శ్లో॥ [ఆయుర్వేదే] నర కేశాభ్యంగ తైలే కాక చూర్ణంసపిప్పలమ్ ।
నస్యంశీతజ్వరంహంతి చాహికంహరతిక్షణాత్॥

తా. మనుజుడు అభ్యంజనము చేసికొనిన పిదప అంటకలికాసరవేళ్లు పిప్పళ్లు నూరి నస్యముచేయించిన శీతజ్వరములు ఆహికజ్వరములు తత్క్షణమున నశించును.

శ్లో॥ అజామోదంసైంధవంచ మరీచం లశునంసమమ్ ।
అర్కపత్రరసేనస్య మాహిక జ్వరనాశనమ్ ।

తా. ఖురసాని ఓమము సైంధవలక్షణము మిరియాలు వెల్లుల్లిపాయలు వీనిని సమభాగములుగా గ్రహించి జిల్లేడుకొనలరసముచే నస్యముచేయించిన ఆహికజ్వరములు కూతవేసిపడే మూర్ఛరోగములు నశించు.

మసూరికాజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] వాతపిత్తకఫజా మసూరికా శైలికాభిషగ మంతుమానుషాః । గంభీరాత్రి దినముత్థితాతథా సన్నిమోహనచతుర్థనాడికా । ఈశ్వరప్రళయడుగ్రరూపిణీచాష్ట కేనవద శేషుశోషణమ్ । శక్తిరూపమథవాప్తమేజ్వరం దోషధాతు నవమేప్రలుప్యతే । ఈశ్వరప్రళయముగ్రముద్భవంవైద్యనాథ

* ఇదే దింటనవేరనియు జెప్పబడు.

మితికథ్యతేశ్శృణు । మషురమసూరికాపిత్తజాతి । కృష్ణమర్కట దద్రువిషమాకఫజాతి । దోషజిహ్వకమనిలగ్రహదోషజాతి । హరనయన సముద్భవాగ్నివ త్రిధాతు వేష్టితముగ్రమారణమ్॥

తా. మసూరికాజ్వరము వాతపిత్తశ్లేష్మములవలన మనుజులకు శిలలకు జనించుననియు వానికి చికిత్సజేయుట కడునసాధ్యంబనియు మనుజులు దెలిసికొనవలయు. మఱియు దానియందు 3 దినములు గంభీరజ్వరము గలిగియుండు టయేగాక సన్నిపాత చాతుర్థికజ్వరములవలెనే నాడియు నాడును. మఱియు నది యీశ్వర ప్రళయమువలెనే వుగ్రరూపముగలదై 8 లేక లేక 10 దినములకు శరీరమునుండి జారి పొక్కులుకట్టును. ఇది శక్తిస్వరూపము గలది. మఱియు నిది వాతపిత్తశ్లేష్మములను రసాదిసప్తధాతువుల నాశ్రయించుటచే 8 లేక 9 వ దినమున జ్వరము శమించు. మఱియు నిది ప్రళయము వలెనే వుగ్రమైన యుత్పత్తి గలదిగ నుండు దానంజేసి దాని స్థితి నెఱుంగుటకు వైద్యుల కశక్యం. స్ఫోటకములు నట్టునలై నేత్రముల కెంపుగనుండిన పిత్తధాతుజనితమనియు నల్లకోతి వెంట్రుకలవలె దద్దులుగలవై విషముగ నుండిన శ్లేష్మధాతుజనితమనియు దోషగ్రస్తమైన నాలుకవలె నుండిన వాతధాతుజనితమనియు యీ 3 ధాతువులు లేకమైయుండిన వాడు జచ్చుననియు తెలియవలయు.

శ్లో॥ [ఆయుర్వేదే] ఉగ్రరూపం మహాతేజ స్త్రిశూలం డమరుకం తథా । క్రోధాగ్నిదంష్ట్రాసహితంశక్తిజ్వరసంభవమ్॥

తా. ఉగ్రరూపము మహాతేజస్సు త్రిశూలము డమరుకము క్రోధము నేత్రములయందు నిప్పులురాలుట పెద్దకోరలు ఇవిగలది మహాశక్తి జ్వరస్వరూపమని తెలియవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] దాహజ్వరంసంతతదాహతృష్ణా మూర్ఛాస్యదోషం వమనంచతంద్రా । స్ఫోటకజ్వరం * జంతువికారకారి మసూరికాచ జ్వరమష్టసంభవమ్॥

తా. దాహయుక్తజ్వరము యెల్లప్పుడు ఆకలి దప్పి మూర్ఛ ముఖదౌర్గంధ్యము వాంతులు తంద్ర కడుపులోశూల యీ లక్షణము గలది మసూరికాజ్వరమని తెలియవలయు. ఈ మసూరికాజ్వరము 8 విధంబులుగ జనించు.

* వ్యాధివికారకారి

## అసాధ్య మసూరికాజ్వర లక్షణము.

శ్లో॥ [అశ్వినీప్రోక్తే] దద్రుంచ కుండలందీర్ఘ మంతర్వేగం చతుర్విథమ్। కృష్ణంచరక్తం శ్వేత మతివృద్ధిశ్చనాశనమ్। తృష్ణాతిసారః కంపశ్చ శ్వాసకాసాది విభ్రమః। హిక్కా-మూర్ఛా జ్వరందాహ మసాధ్యంచ వివర్జయేత్ ॥

తా॥ స్ఫోటకములు దద్దులుయొక్క అకారము వర్తులాకారము దీర్ఘాకారము అంతర్వేగము గలవియని 4 విధంబులు. అవి కృష్ణవర్ణంబులుగనేని రక్తవర్ణంబులుగనేని శ్వేతవర్ణంబులుగనేని తఱచుగనేని నుండినను తఱుచుగా దప్పి అతిసారము శరీరకంపము శ్వాసకాసలు డగ్గుత్తి తబ్బిబ్బుమాటలు ఎక్కిళ్లు మూర్ఛ జ్వరము దాహము అనువానిలో దేనితోనైనను గూడియుండినను మరణము కలుగునని తెలియవలయు.

## స్ఫోటక జ్వరచికిత్స.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] మహామయంసర్వ మనేకరూపం మూర్ఛాత్రిదోష జ్వరసన్నిపాతైః। ఇదంపరాశక్తిరుజామనుష్యే ష్వనేకరూపం బహుళంచికిత్సతమ్। ధూపంచయంత్రం తిలకం మనుష్యే వక్ష్యేచతాని స్ఫుటమేపసంగ్రహాత్ ॥

తా॥ సమస్త స్ఫోటకజ్వరములు కడుపరాక్రమము గలవిగ మూర్ఛ త్రిదోష సన్నిపాతములచే పలురూపంబులు గలవిగ నున్నయవి మనుజులకు జనించెడి ఇవ్విధ శక్తిరూపముగల స్ఫోటకజ్వరములకు ధూపములు యంత్రములు తిలకములు మొదలగు ననేక చికిత్సలు గలవు. వానిని సంగ్రహముగా వచించెద. వానిని మనుజులాచరించవలయు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] దృష్టంహారీతాత్రేయకసంహితాయాం హరిద్రవిశ్వౌషధ వాసకేషికాః। గుడూచినింబా తులసీదలంచి సజీరకం ధాన్యకపర్పటీచ। విళంగతక్కోల త్రిజాతకంచ పాఠాదురాలా భువినింబపత్రమ్। బిల్వైశ్చపుంఖి షశుగంధదారుణాం ఏత్సమాంశం హరతేమసూరికామ్ ॥

తా. వాతపైత్యశ్లేష్మజనిత మసూరికొజ్వరములకు పసుపు కొంతి అడ్డసరపు యీనెలు తిప్పతీగె వేపాకు తులసియాకు జీలకఱ్ఱ కొతిమెర్లు పర్పాటకము వాయువిడంగములు తక్కోలపుట్లు * లవంగపుచెక్క ఏలకులు ఆకుపత్రికె చిరుబొద్ది † రేగటిదూల నేలవేపాకు మారేడుములు వెంపలి వావిలి వీనిని సమభాగములుగా గ్రహించి ఉదకముతో మర్దించి దాని రసమును సేవించిన మసూరికొజ్వరములు హరించు. దీనిని హారీతాత్రేయాది సంహితలజూచి వచించినాడ.

శ్లో॥ [మాధవనిదానే] ఉశీరంనింబపత్రంచధాత్రీమధుకధాన్యకమ్ ।
ముస్తాసౌవీరకంఛిన్నాం మంజిష్ఠాతివిషాతథా ।
ఏతానిసమభాగాని తుల్యంచూర్ణంతుకారయేత్ ।
క్వాథమష్టావశేషంచ మసూరీజ్వరనాశనమ్ ।

తా. వట్టివేళ్ళు వేపాకు ఉసిరికెపప్పు ఇప్పపువ్వు కొతిమెర్లు తుంగముస్తెలు రేగుపలుసులు తిప్పతీగె మంజిష్ఠి అతివస వీనిని సమభాగములుగాదంచి చూర్ణముజేసి దీని కెనిమిదింతలు నీళ్ళుబోసి అష్టావశేషముగా కషాయముకాచి సేవించిన మసూరికొ జ్వరములు హరించు.

శ్లో॥ మధుకంచసమంజాజి దేవదారు చిరాయుతమ్ ।
గుళూచిబిల్వమూలంచ వాలుకం ము స్తకంతథా ।
క్వాథమష్టావ శేషంతు మసూరీ జ్వరనాశనమ్ ॥

తా. ఇప్పపువ్వు జాజికాయ దేవదారు ఊరకాకర తిప్పతీగె మారేడువేరు కురువేరు కూతురుబుడమ తుంగముస్తెలు వీనిని సమభాగములుగా దంచి యందుదకము బోసి అష్టావశేషముగా కషాయముకాచి సేవించిన మసూరికొజ్వరములు హరించు. (మఱియు మాహేశ్వరధూపములు వేయవలయు. చండభానుతిలకము బెట్టవలయు. ఇటులజేసిన మసూరికొజ్వరములు అంటకుండు.)

## క్రిమిరోగ లక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] జ్వరో వివర్ణతాశూలం హృద్రోగ స్సతతం
భ్రమః ! భ క్తద్వేషోతిశారశ్చసంవిద్యా త్క్రిమిలక్షణమ్ ॥

* ఇదే దాచినచెక్క † ఇది పిన్న రేగటిమాలగొండి.

దా. జ్వరము కలుగుట శరీరము వివర్ణమైయుండుట కడుపులో శూలించుట హృదయములో మండుట ఎల్లప్పుడు తబ్బిబ్బులాడుట అన్నద్వేషము అతిసారము ఈ లక్షణములుగలది క్రిమిరోగమన తెలియవలయు.

## క్రిమిరోగ చికిత్స

శ్లో॥ [మాధవనిదానే] ఆరనాళేనపాతవ్యః క్రిమిఘ్నః శత్రుహా।
ప్రాత స్తస్య సమోనాస్తి క్రిమిఘ్నో భువనత్రయే॥

తా. వాయువిడంగములను కలితోనూరి ప్రాతఃకాలమునందు సేవించిన క్రిమిరోగములు హరించు. క్రిముల నశింపజేయుటకు దీనికి సమానమైన యౌషధము ముల్లోకములయందు లేదు.

శ్లో॥ [గ్రంథాంతరే] ఖదిరఃకుటజః పిచుమందవచాత్రి కటుకత్రి ఫలం త్రివృతాచసమమ్ । పశుమూత్రయుతంపిబస ప్తదినం క్రిమికోటి శతాన్యపిహంత్యచిరాత్ ॥

తా. చంద్రచెక్క * కోలముక్కిచెక్క మంచివేపచెక్క వస శొంఠి పిప్పలి మిరియాలు కరక్కాయలు తానికాయలు ఉసిరికెపప్పు వీనిని సమభాగములుగా చూర్ణముచేసి దీనికి సమముగా శుద్ధిజేసిన తెల్లతెగడచూర్ణము కలిపి ప్రతిదినము 4 మాడలయెత్తు చూర్ణమును ఆవుపంచితముతో 7 దినములు సేవించిన సంఖ్యాతీత క్రిములుండినను శీఘ్రముగ నశించు.

శ్లో॥ [మాధవనిదానే] పాలాశబీజంసగుడం తిలజంతుఘ్నసంయుతమ్ । జలేన నారికేళస్య పిబేత్క్రిమి వినాశనమ్॥

తా. మోదుగవిత్తులు బెల్లము నువ్వులు వాయువిడంగములు వీనిని సమభాగములుగా గ్రహించి టెంకాయ నీళ్ళతోనూరి సేవించిన క్రిమిరోగములు నశించు.

శ్లో॥ [అన్యశాస్త్రే] విళంగనిర్గుండ్య భయాఖుకర్ణీ రసోనశోభాంజన చిత్రకాణామ్ । క్వాథానిపేవ్యః క్రిమిదుష్టలోగే యథామృతంస్వర్గిభిరాదరేణ॥

* కొడిశెచెక్క.

తా. వాయువిడంగములు వావిలి కరక్కాయలు ఎలుక చెవి విత్తులు వెల్లుల్లిపాయలు మునగవిత్తులు చిత్రమూలము వీనిని సమభాగములుగ దంచి కషాయముకాచి "స్వర్గవాసులగు దేవతలు అమృతమున ఆదరణతో సేవించిన మాట్కి" క్రిమిదుష్టరోగము గలవారు సేవించిన క్రిములు నశించుటయేగాక దివ్యశరీరముకూడా గలుగు.

శ్లో॥ [మాధవనిదానే] ముస్తాఖుకర్ణీసురదారుశిగ్రు వరాకషాయః క్రిమిజిత్కణాఢ్యః । జలేనవాహింగువిళంగబీజం ప్రపీతమాశు క్రిమిజిత్కణాఢ్యమ్॥

తా. తుంగముస్తెలు ఎలుక చెవివిత్తులు దేవదారు మునగ పిల్లిపీచర వాయువిడంగములు పిప్పళ్ళు వీనిని సమభాగములుగా దంచి కషాయముకాచి సేవించినను లేక ఇంగువ వాయువిడంగములు పిప్పళ్ళు వీనిని వుదకముతోనూరి సేవించినను క్రిమిరోగములు హరించు.

శ్లో॥ యఃపిబేచ్ఛ్రిద్ధయానామ్నా కీటమర్దనకంరసమ్ ।
త్రిమాసం క్రిమిరోగేషు దివ్యదేహీ భవేన్నరః॥

తా. క్రిమిరోగముగలవారు కీటమిర్దన రసమును 3 మాసములు సేవించిన దివ్యదేహముగలవారుగ నయ్యెదరు.

## క్రిమిరోగములయందు పథ్యము.

శ్లో॥ వటోలారిష్ట వేత్రాగ్ర వాస్తుకంమూలకానిచ ।
ఉపశ్రితోముద్గయూష్మా పురాణశ్శాలిషష్టికః ।
విళంగస్సర్వభోజ్యేషు క్రిమిరోగి ప్రయోజయేత్॥

తా. పొట్లకాయ వేము వెదురుగొమ్మ చక్రవర్తికూర ముల్లంగిగడ్డలు పెసగట్టు అరువది దినములకు పండినప్రాతవడ్లు వాయువిడంగములు వీనిని సర్వభోజ్యవస్తువులయందు క్రిమిరోగపీడితులు జేర్చుకొనవలయు.

## క్రిమిరోగములయందు అపథ్యము.

శ్లో॥ క్షీరాణిమ్మాంసాని గుడంఘృతాని దధీనిశాకానిచపర్ణవంతి ।
సమాసతోమ్లాన్మధురాన్రసాంశ్చ క్రిమీన్జిఘాంసుః పరివర్జయేతా॥

తా. పాలు మాంసము బెల్లము నెయ్యి పెరుగు ఆకుకూరలు మినుములు పులుసు తేనె మొదలగు మధుర ద్రవ్యములు వీనిని క్రిమిరోగులు వర్జింపవలయు.

జంతుజ్వర లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] అరుచిశ్శ్యామనేత్రత్వం పాండుత్వంఛర్దనం
భ్రమః । జ్వరాతిసారహృచ్ఛూలం క్రిమిణాథప్రజాయతే ॥

తా. అరుచి నేత్రములకు నలుపువర్ణము శరీరమునకుపాండురవర్ణము వాంతులు తబ్బిబ్బుమాటలు జ్వరము అతిసారము రొమ్మునొప్పి ఇవి గలిగిన జంతుజ్వరమని తెలియవలయు.

జంతుజ్వరములకు కీటమర్దనరసము.

శ్లో॥ [భేషజకల్పే] శుద్ధసూతంశుద్ధగంధ మజామోదంవిళంగకమ్
విషముష్టిర్బ్రిహ్మబీజం క్రమాదూర్ధ్వగుణంభవేత్ ।
చూర్ణయేన్మధునాలేహ్యం నిష్కైకంజంతుజద్భవేత్ ।
కీటమర్దరసోనామ ముస్తాతోయం పిబేదను ॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిజేసినగంధకము 2 భాగములుఓమము 3 భాగములు వాయువిడంగములు 4 భాగములు * పెనుముష్టిచెక్క 5 భాగములు మోదుగవిత్తులు 6 భాగములు ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి అందులో తేనెబోసి వండి మాడయెత్తుమాత్రలుజేసి యందొకదానిని తుంగముస్తెల కషాయములో సేవించిన జంతురోగము నశించు ఇది కీటమర్దన రసమనబడును.

జ్వరాతిసార లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] జ్వరసంతాపహృచ్ఛూల మరోచకవిరేచనమ్ । ఆమంతాశోణితంవాపి జ్వరాతీసారముచ్యతే ॥

తా. జ్వరము సంతాపము రొమ్మునొప్పి అరుచి విరేచనముల గలుగుట అమదనుగాని రక్తముగాని పడుట ఈలక్షణముగలది జ్వరాంతిసారమని తెలియవలయు. (ఈజ్వరాతి సారమునకు అతిసారప్రకరణములో నుదహరింపబడు కనకసుందరరసము నుపయోగింపవలయును.)

* ఇదే విషముష్టియనియు ముసిడియనియు జెప్పఁడు.

## జ్వరాతిసారచికిత్స.

[గ్రంథాంతరే] ధన్యానాగరముస్తాభి ర్బిల్వకై ఃక్వథితంజలమ్
జ్వరాతిసారంవిషమం మూర్ఛాంతృష్ణాంవమిర్జయేత్ ।

తా. కొతిమెర్లు శొంఠి తుంగముస్తెలుమారేడుపిందెలు. వీనిని సమభాగము గాదంచ్చి కషాయముకాచి సేవించిన విషమజ్వరాతిసారములు మూర్ఛ దప్పి వతులుహరించును.

## రక్తాతిసారజ్వర లక్షణము.

శ్లో॥ [పూజ్యపాదీయే] రక్తాతిసార స్త్వథవా ప్రవాహః పిపాసనంచైవ మహాజ్వరస్స్యాత్ । విలోమవాతస్సకలేనిరోధో జ్వరాతిసారస్యచలక్షణంస్యాత్ ॥

తా. రక్తవిరేచనంబులగుట లేక మలము పలుచనగ వెడలుట దప్పి ప్రబలరము విలోమలాతము శరీరమంతట నొప్పి ఈలక్షములుగలది రక్తాతిసారజ్వరవ తెలియవలయు (ఈరక్తాతిసారజ్వరమునకు అతిసారరోగ ప్రకరణమునం దుదహరిం బడు గ్రహణిగజకేసరి నేని కనక సుందరరసము నేని ప్రయోగించవలయు.)

## రక్తాతిసారజ్వర చికిత్స.

శ్లో॥ [మాధవానిదానే] శుంఠీసమంగాతివిషాచబిల్వ పాఠాకణావః క దీపనియాః । క్వాథోనిహన్యా దతిసారమాశు సామంసశూలం సకఫంసరక్తమ్॥

తా, శొంఠి ముణుగుదామర అతివస మారేడు * పాఠవేళ్లు పిప్పళ్లుకొడిపాల ఓమము వీనిని సమభాగములుగాదంచి కషాయముబెట్టి సేవించిన ఆమః శూల కఫము రక్తముఫీనితోగూడియుండు జ్వరాతిసారము హరించును.

## దోషాతిసార లక్షణము.

శ్లో॥ అంతర్దాహో బహిశ్శీతం కరపాదంచ శీతలమ్ ।
ప్రలాపశ్ఛర్ది హిక్కాచ కాసశ్వాస మరోచకమ్ ।

* ఇదే చిరుబొద్దియనియు విషబొద్దియనియు జెప్పబడు.

కంపోవిభ్రమహృల్లాసో బృంహణంజాగరోమదః ।
ఆమంసరక్తంహృచ్ఛూలం దోషాతీసారలక్షణమ్॥

తా. లోనవిదాహము వెలపట శీతలము కాళ్లుచేతులు చల్లగనుండుట కల్లలాడుట వాంతి ఎక్కిళ్ళు కాసశ్వాసలు అరుచి శరీరమువణకుట భ్రమ అలసట శరీర భారము నిదురరాకుండుట మదము ఆమము రక్తయుక్తమై వెడలుట బొమ్మ నొచ్చుట ఈలక్షణములుగలది దోషాతిసారమని తెలియవలయు, (ఇది యసాధ్యము.)

## జ్వరితునియొక్క నియమములు.

శ్లో॥ [చికిత్సాసార సిద్ధసంగ్రహే] గుర్వన్నంశీతలంవారి దివాస్వాపంక్లమంత్యజేత్ । జ్వరితో జ్వరముక్తశ్చ యత్నాదాబలలాభతః॥

తా. జ్వరితుడును జ్వరమువిముక్తుడును శరీరమునకు బలముకలుగువరకు బలకరయాహారసేవ శీతోదకపానము పగటినిద్ర శ్రమ వీనిని వర్జింపవలయు.

## పునరావృత్తి జ్వరకారణము.

శ్లో॥ అసక్తాహారచేష్టాభిః పునరావర్తతేజ్వరః ।
తత్రార్థంలంఘనంకార్యం శేషంపూర్వవదాచరేత్॥

తా. విరుద్ధాహారచేష్టలచే నివృత్తించిన జ్వరము తిరిగివచ్చును దానియందు పూర్వోక్త లంఘనములో సగము లంఘనము వేయించి పిదప పూర్వోక్త జ్వర చికిత్సలం జేయవలయు.

## జ్వరముక్త లక్షణము.

శ్లో॥ అన్నకాంక్షాశిరఃకండూః క్షవథుర్గాత్రలాఘవమ్ ।
ప్రస్వేదోముఖపాకశ్చ జ్వరముక్తస్యలక్షణమ్॥

తా. అన్నమునందిచ్ఛ తలదురద తుమ్ముటు శరీరమునకు చులకదనము చెమట ముఖపాకము ఈలక్షణములుకలవాడు జ్వరవిముక్తుడని తెలియవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] దేహోలఘు వ్యపగ్లమప క్లమమోహతాపాః పాకోముఖేకరణ సౌష్ఠవమవ్యథత్వమ్ । స్వేదఃక్షుతంప్రకృతి యోగమనోన్నలిప్సా కండూశ్చమూర్ధ్ని విగత జ్వరలక్షణాని॥

తా. శరీరలఘుత్వము కలిగియుండుట బడలిక అజ్ఞానము తాపము లేకుండుట ముఖపాకము ఇంద్రియములు తెలివిగనుండుట శరీరమున వేదనలేకుండుట చెమట తుమ్ములు మనస్సు తెలివిగనుండుట అన్నమునందిచ్ఛ తలదురద ఈలక్షణములు గల వాడు జ్వరవిముక్తుడని తెలియవలయు.

## జ్వర మంత్రము.

ఓం నమోభగవతే పరమార్థిని సర్వ జ్వర రక్షస్వాహా ।
హరిణా సారంగ సారంగస్వామిని ప్రసాదమ్॥

తా. ఈమంత్రముచే పదిమార్లు యభిమంత్రింపబడిన జలమును పానముజేసిన సర్వజ్వరములు హరించు.

## జ్వర సంప్రాప్తికారణము.

శ్లో॥ మిథ్యాహారవిహారాభ్యాం దోషాహ్య మాశయాశ్రయాః ।
బహిర్నిరస్యకోష్ఠాగ్నిం జ్వరదాస్స్యూరసానుగాః॥

తా. * మిథ్యాహార విహారములచే వాతపిత్తశ్లేష్మములు దుష్టంబులై ఆమాశయము నాశ్రయించి కోష్ఠాగ్నిని బైలుపరచి రసధాతువులోగలసి జ్వరమునుకలుగ జేయును ఇదియే శారీరజ్వరలక్షణము.

శ్లో॥ [బాహటే] తేమలాస్తత్ర దోషైశ్చ తైస్తైర్దుష్టాః ప్రసూషణైః । ఆమాశయం ప్రవిశ్యామ మనుగమ్య పిధాయచ । స్రోతాంసి సక్తిస్థానాచ్చ నీరస్య జ్వాలనంబహిః । సహతే వాభిసర్పంత స్తపంత స్సకలంవపుః । కుర్వంతోగాత్రమత్యు

---

* మిథ్యాహారమనగా ప్రకృత్యాదివిరుద్ధఆహారసేవలయుభుజించినయన్నము జీర్ణంబగుటకుముందుగా భుజించుటయు మిథ్యావిహారమనగా తనబలిమికి అతిక్రమించిన కార్యములు చేయంబూనుట.

ష్ణంజ్వరం నిర్వర్తయంతి తే । స్రోతోవిబంధాత్ప్రాయేణ తతః స్వేదోనజాయతే॥

తా. వాతాదిదోషములు తమతమ ప్రకోప కారణములచేత ప్రకోపించి ఆమాశయమును జెంది అజీర్ణముగ నుండు ఆహారరసములో చేరి రోమకూపము మొదలగు స్రోతోమార్గములనడ్డగించి పక్వాశయమునందుండి జాఠరాగ్ని బైలుపరచి దానితో కూడ శరీరమంతట వ్యాపించి అత్యుష్ణముగనుండు జ్వరమును కలుగజేయును. జ్వరమునందు రోమకూపాది స్రోతో మార్గములు అడ్డగింపబడి యుండుటవలన తరుచుగా చెమట కలుగదు.

## జ్వర లక్షణము.

శ్లో॥ స్వేదావరోధ స్సంతాప స్సర్వాంగ గ్రహణం తథా ।
యుగపద్య త్రయోగేచ సజ్వరో వ్యపదిశ్యతే॥

తా. చెమట బైలువెడలకుండుట దేహము ఇంద్రియములు మనస్సు వీనియందు సంతాపము సర్వాంగములయందు వేదన ఈ లక్షణములు ఏక కాలమునందు యేరోగములో కలుగునో యదియు జ్వరమనబడును.

## జ్వర పూర్వరూపము.

శ్లో॥ [గ్రంథాంతరే] శ్రమోరతిర్వివర్ణత్వం వైరస్యంనయనప్లవః । ఇచ్ఛాద్వేషౌముహుశ్చాపి శీతవాతాతపాదిషు । జృంభాంగమర్దోగురుతా రోమహర్షోరుచి స్తమః । అప్రహర్షశ్చ శీతంచ ఏతాన్యుత్పత్స్యతిజ్వరే । సామాన్యతోవిశేషస్తు జృంభోత్యర్థంసమీరణాత్ । పిత్తాన్నయనయోర్దాహః కఫాదన్నంనభినందనమ్॥

తా. బడలియుండుట దేనియందును యిష్టములేకుండుట శరీరము వివర్ణముగ నుండుట నోరు విరసముగనుండుట నేత్రములయందు నీరుపూరించియుండుట శీతము యెండ వాయువుశయనము వీనియందుపలుమారు యిచ్ఛ ద్వేషము ఆవులింతలు కలుగుట లేక శరీరమువిరుచుట శరీరమునొచ్చుట శరీరము బరువుగనుండుట గగుర్పొడుచుట అన్నమునందుయిష్టము లేకుండుట తమోగుణముకలుగుట సంతోషము లేకుండు

టచలిబెట్టుట ఈలక్షణములు జ్వరముజనించుటకు ముందుకలుగును ఇవి లాబాయ్యేడి వాతపిత్తశ్లేష్మజ్వరములకు సామాన్యలక్షణంబులు వాతజ్వరములో తలుచు గా వులింతలు పిత్తజ్వరములో నేత్రములయందుమంట శ్లేష్మజ్వరములో అన్నద్వేషము కలుగును ఇవిరాబాయ్యేడి జ్వరములకు విశేషలక్షణములు.

శ్లో॥ [మాధవనిదానే] తస్యప్రాగ్రూపమాలస్య మరతిర్గాత్రగౌర వమ్ । ఆస్యవైరస్యమరుచి ర్జృంభా సాస్రాకులాక్షితా । అంగమర్దోవిపాకోల్ప ప్రాణతా బహునిద్రతా । రోమహర్షో వినమనం పిండికోద్వేష్టనంక్లమః । హితోపదేశేష్వక్షాంతిః ప్రీతి రామ్లపటూషణే । ద్వేషోనిస్వాదు భక్ష్యేషు తథా బాలేషు తృట్భృశమ్ । శబ్దాగ్ని శీతవాతాంబు ఛాయోష్ణేష్వ నిమి త్తతః । ఇచ్ఛాద్వేషశ్చతదపి జ్వరస్యావ్యక్తతాం భవేత్ ॥

తా. ఆలస్యము వస్తువులయందు ప్రీతిలేకుండుట శరీరము బరువుగనుండుట నోటియందు విరసత్వము అరుచి ఆవులింత నేత్రములయందు నీరుకమ్ముట శరీరము నందుపోట్లు అజీర్ణము శరీరదౌర్బల్యము అధికనిద్ర గగుర్పాటు శరీరము విరుచుట పిక్కలయందునొప్పి బడలిక హితోపదేశములయం దసూయ పులుసు ఉప్పు కారము వీనియందుప్రీతి మధురపదార్థములయందును బాలురయందును ద్వేషము మిగులదప్పి శబ్ద ము అగ్ని శీతవాతము శీతోదకము నీడ ఎండ వీనియందు కారణములేక నే ఒకానొక పుడు యిచ్ఛ ఒకానొకపుడు ద్వేషము ఇవి జ్వరమునకు పూర్వరూపంబులు అనగా జ్వరముకలుగుటకు ముందు పైలక్షణములు కలుగును. పిదప జ్వరము ప్రకాశముగా కనుపించును.

## వాతజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] సర్వాంగదుఃఖంశిరశోతిఘూతో మంనిద్ర మతృష్ణ మితిప్రభావమ్ । కంపోవిబంధో మలమూత్రశుష్కం దంతోష్ఠభాగే త్వధికృష్ణవర్ణమ్ । విజృంభణాం శీతమనోచ శంస్యాద్విష్టంభనంబంధ రుజాచపార్శ్వే । రోమాంచకంపాం తిరుజావనాహం ప్రలాపనంమూర్ఛనకంపదాహః । అత్యంత శైత్యంహ్యతిమూత్రఘాతః పదాతిశూలంనఖశోషణంచ॥

తా. అవయవములందు పోట్లు అధికముగా తలనొచ్చుట శరీరము ఒకింత యుష్ణముగ నేని లేక కడునుష్ణముగ నేని ఉండుట శరీరము వణుకుట మలమూత్రములు వెడలకుండుట మలమూత్రములు శుష్కించి యొకింత వెడలుట దంతములు పెదవులు చర్మము నలుపుబారియుండుట ఆవులింతలు లేక ఒడలువిరుచుట చలిబెట్టుట అరుచి శరీరము బద్ధగించుట ఒకపార్శ్వము గట్టివేసినట్టుండుట గగుర్పొడుచుట వాంతి కడుపుబ్బుట ప్రలాపము మూర్ఛ విదాహము కడుశైత్యము అధికముగా * మూత్రాఘాతము పాదములు నఖములు వీనియందు పోట్లు శూల ఈలక్షణములు గలది వాతజ్వరమని తెలియవలయును.

శ్లో॥ [గ్రంథాంతరే] వేపథుర్విషమో వేగః కంఠోష్ఠముఖశోషణమ్
నిద్రనాశఃషవః స్తంభో గాత్రాణాం రౌక్ష్యమేవచ।
శిరోహృద్గాత్రరుగ్వక్త్ర వైరస్యంగాఢవిట్కతా ।
శూలాధ్మానేజృంభణంచ భవంత్యవిలజేజ్వరే॥

తా. శరీరకంపము అనియతకాలమున జ్వరాధిక్యము కలిగి అవయవములు ఒకింతసేపు ఉష్ణముగ శీతంబుగ నుండుట కంఠము పెదవులు ముఖము వీనియందు శోష నిద్రానాశము తుమ్ములు స్తబ్ధత్వము అవయవములయందు చురుకు శిరము హృదయము శరీరము వీనియందు వేదన నోరు వగరుగ నుండుట మలము పెంటికలుకట్టుట శూల కడుపుబ్బరము ఆవులింతలు ఈలక్షణములు గలది వాతజ్వరమని తెలియవలయును.

శ్లో॥ [బాహటే] ఆగమాపగమక్షోభ మృదుతా వేదనోష్మణా
మ్ । వైషమ్యంతత్రతత్రాంగే తాస్తాస్స్యుర్వేద నాశ్చలాః ।
పాదయోస్సుప్తతా స్తంభఃపిండికోద్వేష్టసంక్లమః । విశ్లేషయిన
సంధీనాంపాదఊర్వోః కటిగ్రహః పృష్ఠంక్షో భమివాప్నోతి
నిష్పీడ్యత ఇవోదరమ్ । బిద్యంతఇకచాస్థీని పార్శ్వాంగాని
విశేషతః । హృదయస్య గ్రహస్తోదో గ్రాజనేనైవ వక్షసః ।
స్కంధయోర్మదనంబాహ్వో ర్భేదఃపీడనమంసయోః । అశక్తి
ర్భక్షణేహన్వో ర్జృంభణంకర్ణయోస్స్వనః । నిస్తోదశ్శంఖ
యోర్మూర్ధ్ని వేదనావిరసాస్యతా । కషాయాస్యత్వమథవా

* మూత్రాఘాటమనగా మూత్రము మిగుల బద్ధగించి కడుస్వల్పముగా వెడలుట

మలానామప్రవర్తనమ్ । రూక్షారుణత్వగాస్యాక్షి నఖమూత్రపురీషతా । ప్రసేకారోచకాశ్రద్ధావిపాకస్వేదజాగరా । కంఠోష్ఠశోషస్తృట్ఛుష్కా ఛర్దికాసౌ విషాదితా । హర్షోరోమాంగ దంతేషు వేపథుక్షవథుగ్రహః । భ్రమప్రలాపోష్ణస్నేచ్ఛావినామశ్చానిలజ్వరే॥

తా. ఒకానొకపుడు జ్వరము కలుగుట మఱియొకపుడు లేకుండుటమఱియొకపుడు తీవ్రముగ నుండుట మృదువుగ నుండుట అధికతాపము మఱియొకపుడు చల్లగ నుండుట ఒకానొకపుడు హస్తపాదములు మిగుల వుష్ణముగను మఱియొకపుడుమిగుల శీతముగను నుండుట కాళ్ళుతిమురు పట్టినటులుండుట అవయవములయందు ఒకానొకపుడు అధికనొప్పి మఱియొకపుడు నొప్పి లేకుండుట పిక్కలయందు నొప్పి బడలిక సంధులు విరిగినటులుండుట తొడలయందు శక్తిలేకుండుట నడుమునందు పట్లు వీపు కడుపు వీనియందు నొప్పి అస్థులు ప్రక్కలు ఇవి భేదించినటులుండుట హృదయమునందు పట్లు పక్షస్థలమునందు నొప్పి భుజశిరములు మెడకొంకులకు పైభాగము భుజములు వీనియందు నొప్పి నములుటశక్తిలేకుండుట ఆవులింత చెవులయందు ధ్వని కణతల యందు పోట్లు శిరమునందునొప్పి నోరు విరసముగా లేక వగరుగా నుండుట మలమూత్రములు వెడలకుండుట ముఖము నఖములు నేత్రములు చర్మము మూత్రపురీషములు ఇవిరూక్షగా ఎఱుపువర్ణముగా నుండుట నోటియందు నీరుకారుట అరోచకము పదార్థములయం దిచ్ఛలేకుండుట భుజించిన యాహారము జీర్ణము కాకుండుట చెమట కలుగకుండుట నిదుర పట్టకుండుట కంఠము పెదవులు యెండుట దప్పి ద్రవరహితమైన ఓకర శుష్కకాసము దుఃఖము పండ్లు పులిసియుండుట వణుకు తుమ్ములు రాకుండుట భ్రమ కలవరించుట యెండ కాచుకొనుటయం దిచ్ఛ ఈలక్షణములు వాతజ్వరమునందు కలిగియుండును.

## పిత్తజ్వర లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] సర్వాంగదాహః కరపాదదాహస్తృష్ణాధికం విభ్రమణాంశిరోర్తిః । దాహోవిపాకో ముఖశోషణంచ మూర్ఛాగ్నిమాంద్యంహ్యరుచిర్కృశత్వమ్। జడంమనశ్చంచలతారతిశ్చ విశ్లేషితంస్యా ద్ఘనమర్మజాలమ్ । కండూతిదుస్స్వప్నవివాదితావా పిత్తాధికంయస్యమతానిచిహ్నమ్॥

తా. సర్వాంగములయందు మంట చేతులు కాళ్లు వీనియందు కడుమంట కడు దప్పి కలుగుట శరీరము తిరుగుట తలనొచ్చుట దాహముకలుగుట నోరు తియ్యగ నుండుట ముఖము శోషించుట మూర్ఛ అగ్నిమాంద్యము * అరుచికలుగుట శరీరము కృశించుట జడత్వము కలుగుట మనస్సు చలించుట దేనియందును యిచ్ఛలేకుండుట బలువుగనుండు మర్మజాలములు పీడినట్లుండుట నవదుస్స్వప్నములగుట విరుద్ధముగా వాదించుట ఈలక్షణములుగలది పిత్తజ్వరమని తెలియవలయు.

శ్లో॥ [మాధవనిదానే] వేగస్తీక్ష్ణోతిసారశ్చ నిద్రాల్పత్వంతథావమిః।
కంఠోష్ఠముఖనాసానాం పాకస్స్వేదశ్చజాయతే ।
ప్రలాపోవక్త్రకటుతా మూర్ఛాదాహోమదస్తృషా ।
పీతవిణ్మూత్రనేత్రత్వం పైత్తికేభ్రమఏవచ॥

తా. తీక్ష్ణమైన జ్వరవేగము అతిసారము అల్పనిద్రవాంతి కంఠము పెదవులు ముఖము నాసిక వీనియందుపాకము చెమట అసంబద్ధముగా మాటలాడుట నోరుచేదు మూర్ఛ దాహము † మదము దప్పి మలమూత్రములు నేత్రములు చర్మము ఇవి పసుపు బారియుండుట ‡ భ్రమ ఈలక్షణములుగలది పిత్తజ్వరమని తెలియవలయు.

శ్లో॥ [బాహటే] యుగపద్వ్యాప్తి రంగానాం ప్రలాపః కటు వక్త్రతా । నాసాస్యపాకోశీతేచ్ఛాభ్రమో మూర్ఛామదో రతిః । విట్స్రంసఃపిత్తవమనం రక్తష్ఠీవనమమ్లకః । రక్తకోఠో ద్గమః పీత హారితత్వంత్వగాదిషు । స్వేదోనిశ్వాసవైగంధ్య మతితృష్ణాచపిత్తజే॥

తా. జ్వరము ఏకకాలమునందు శరీరమంతయు వ్యాపించుట పలవరించుట నోటియందుకారము ముక్కు నోరు వీటియందు పాకము చల్లనివస్తువులయందిచ్ఛ శిరోభ్రమము మూర్ఛ మదము వస్తువులయందిచ్ఛలేకుండుట విశేషముగా మలము వెడలుట పిత్తము వమనంబగుట కారియుమియునపుడు రక్తముపడుట పులితేపులుసు రక్తకోఠము కలుగుట చర్మము నఖము ముఖము యీ మొదలగు వానియందు పసుపు

* అరుచిఅనగా అన్నమునందిచ్ఛ కలిగియుండినను భుజించుటకు శక్తిలేకుండుట.
† మదమనగా—మదించిన వానివలె నుండుట.
‡ భ్రమఅనగా—శరీరము చక్రాకారముగా దిరుగుట.

వర్ణము పచ్చవర్ణము చెమట శ్వాసము దుర్గంధముగా వెడలుట అధికదప్పి ఈలక్షణములు పిత్తజ్వరమునందు కలిగియుండును.

## శ్లేష్మజ్వర లక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] కాసశ్శ్వాసా పీనసః కంఠశోషా దాహశ్శో
భ్రాంతిశ్శ్వేత వర్ణబలాసమ్ । తంద్రాకారో గౌరవర్ణంచ
గాత్రవాజ్యాద్మధుర్యం వారిపూరంసలాలమ్ । చింతాభీతిర్వి
ద్ధితం మందవహ్ని తాపస్స్వేద శ్శోఫమూత్రం శిరోర్తిః ।
స్నిగ్ధంగాత్రం ఘుర్ఘురంసారణం స్యాద్ధేతుశ్శ్లేష్మన్యోతితోయం
జ్వరస్స్యాత్॥

తా. దగ్గు ఎగరోజు పీనస కంఠశోష దాహము భ్రమ కఫము తెల్లగనుండుట తంద్ర శరీరము పసుపువర్ణమైయుండుట నోరు తియ్యగనుండుట అధికముగా జొల్లు కారుట చింత భయము అగ్ని మాంద్యము తాపము చెమట శోభ అధికముగా మూత్రము వెడలుట శిరస్సు నొచ్చుట శరీరము నిగనిగలాడుచుండుట కంఠములో గుఱ్ఱుగుఱ్ఱుమను శబ్దము అతిసారము ఈలక్షణములుగలది శ్లేష్మజ్వరమని తెలియవలయు

శ్లో॥ [మతాంతరే] స్తైమిత్యం స్తిమితో వేగ ఆలస్యం మధురా
స్యతా । శుక్లమూత్రపురీషత్వక్ స్తంభ స్తృప్తి రథాపిచ ।
గౌరవం శీతముత్క్లేదో రోమహర్షోతినిద్రతా । ప్రతిశ్యాయో
రుచిః కాసః కఫజేఽక్ష్ణోశ్చ శుక్లతా॥

తా. శరీరము తడిగుడ్డచే గప్పబడినట్లుల నిశ్చలముగనుండుట జ్వరమునకు మందవేగము కార్యములయందాలస్యము [illegible] తియ్యగనుండుట మూత్రపురీషములు చర్మము తెల్లగనుండుట శరీరము స్తంభించుట తృప్తి కలిగినవానివలె అన్నమునందభిలాష లేకుండుట శరీరము బరువుగనుండుట శరీరము శీతలముగనుండుట ఓకర గగుర్పొడుచుట కడునిద్ర పీనస అరుచి కాస నేత్రములు తెలుపుబారియుండుట ఈ లక్షణములుగలది శ్లేష్మజ్వరమని తెలియవలయు.

శ్లో॥ [బాహటే] విశేషాదరుచిర్జాడ్యం స్రోతోరోధోల్పవేగతా ।
ప్రసేకో ముఖమాధుర్యం హృల్లేపశ్వాసపీనసః॥

హృల్లాసశ్ఛర్దనంకాస స్తంభ శ్వైత్యంత్వగాదిషు ।
అంగేషుశీతపిటికా । స్తంద్రో దరకఫోద్భవే॥

తా. మిగుల అరుచి జాడ్యము స్రోతః ప్రతిబంధముమలమూత్రాదులుకొంచెముగ వెడలుట నోటియందు నీరుకారుట కోరుతియ్యగనుండుట హృల్లేపము శ్వాసము పీనస హృల్లాసము వాంతి దగ్గు స్తబ్దత్వముచర్మము నఖము యీమొదలగువానియందు తెలుపువర్ణము అవయవములయందు శీతపిటికలు తంద్రఈలక్షణములు శ్లేష్మజ్వరమునందు కలిగియుండును.

## వాతపిత్తజ్వర లక్షణము.

శ్లో॥ (మాధవనిదానే) తృష్ణామూర్ఛాభ్రమోదాహ స్స్వప్ననాశ
శ్శిరోరుజా । కంఠాస్యశోషో వమథూ రోమహర్షో ఽ రుచి
స్తమః । పర్వభేదశ్చజృంభాచవాతపిత్తజ్వరాకృతిః॥

తా. దప్పిమూర్ఛభ్రమసర్వాంగ తాపము నిద్రానాశముతలనొప్పికంఠము ముఖము యెండియుండుట వాంతి గగుర్పొడుచుట అరుచి అకస్మాత్తుగా చీకట్లు క్రముకొనినట్లుండుట కీళ్లు నొచ్చుట ఆవలింతలు ఈలక్షణములు గలది వాతపిత్తజ్వర మని తెలియవలయును.

శ్లో॥ (బాహటే) శిరో ర్తిమూర్ఛా వమిదాహమోహాః కంఠాస్య
శోషా రతిపర్వభేదః । ఉన్నిద్రితాతృట్ భ్రమరోమహర్షా
జృంభాతివాక్త్వంచచలాత్సపిత్తాత్॥

తా. తలనొప్పి మూర్ఛ వాంతి సర్వాంగతాపము మోహము గొంతు నోరు యెండుట పదార్థములయం దిచ్ఛలేకుండుట కీళ్ళయందు నొప్పి మిక్కుటముగాదప్పి తాపము భ్రమము గగుర్పాటు ఆవులింత అధికముగా మాటలాడుట ఈ లక్షణములు వాత పిత్తజ్వరమునందు కలిగి యుండును.

## శ్లేష్మవాతజ్వర లక్షణము.

శ్లో॥ (మతాంతరే) స్తైమిత్యంపర్వణాంభేదో నిద్రాగౌరవమేవచ ।
శిరోగ్రహః ప్రతిశ్యాయః కాసస్స్వేదాప్రవర్తనమ్ ।
సంతాపోమధ్యవేగశ్చ వాతశ్లేష్మజ్వరాకృతిః॥

తా. శరీరము తడిగుడ్డచే గప్పబడినటుల నిశ్చలముగ నుండుట కీళ్లు నొచ్చుట నిద్ర అంగములు జడముగ నుండుట తలబరువుగనుండుట ,పీనసము కాసము స్వల్పముగా చెమటబట్టుట శరీరములో సంతాపము జ్వరమునకు మధ్యవేగము ఈలక్షణములు గలది వాతశ్లేష్మ జ్వరమని తెలియవలయును.

శ్లో॥ (బాహటే) తాపహాస్య రుచిపర్వ శిరోరుక్పీనస శ్వాసనకాస విబంధా । శీతజాడ్యతిమిరభ్రమతంద్రా శ్లేష్మవాతజనితజ్వర లింగమ్॥

తా. తాపము లేకుండుట అరుచి కీళ్ళయందు నొప్పి తలనొప్పి పీనసము శ్వాసము కాసము మలబంధము శైత్యము జాడ్యము తిమిరరోగము భ్రమ తంద్ర ఈ లక్షణములు శ్లేష్మవాత జ్వరమునందు కలిగియుండును.

## శ్లేష్మపిత్తజ్వర లక్షణము.

శ్లో॥ (మతాంతరే)లిప్తతిక్తాస్యతా తంద్రా మోహా కాసో రుచి స్తృషా । ముహుర్దాహో ముహుశ్శీతం శ్లేష్మ పిత్త జ్వరాకృతిః ॥

తా. నోరు అంటుకొని చేదుగనుండుట తంద్రమోహము కాసఅరుచి దప్పి ప్రతిక్షణమునందు దాహము ప్రతిక్షణమునందు శీతలము ఈలక్షణములుగలది శ్లేష్మపిత్తజ్వరమని తెలియవలయును.

## ద్వంద్వజ్వర లక్షణము.

శ్లో॥ (మాధవనిదానే) తృట్చ్ఛమోహాభ్రమదాహ పీడతా స్వప్న నిరతిర్వై శీర్ష వేదనా । రోమహర్షమరుచి ర్జ్వరం తథాశ్వాస కాస మితికధ్యతేబుధైః । స్వేదహాని భ్రమ కంపశోషణం ద్వంద్వజన్యమితికధ్యతేశ్రుణు.

తా. దప్పి మూర్ఛ భ్రమ దాహము నిదురరాకుండుట అధికము గాతలనొచ్చుట గగుర్పొడుచుట అరుచి కడుజ్వరము శ్వాసకాసలు చెమటబట్టకుండుట తబ్బిబ్బులాడుట వణకుట శోష ఈలక్షణములుగలది ద్వంద్వజ్వరమని విద్వాంసులచే జెప్పబడినది.

## సన్నిపాతజ్వర లక్షణము.

శ్లో॥ (మాధవనిదానే) రాత్రౌజాగరణందివాచకృశతామూర్ఛా తిదాహోమరు। చ్ఛీతంస్వేద ప్రలాపనం మదతృషాహాస్యంచ హృత్పీడనమ్ । కాసశ్వాస విదాహ శైత్యజ్వరితాతృష్ణా * శిరో రోదనమ్ । జిహ్వాదగ్ధకృశత్వ † మంగపులకంస్యా త్సన్నిపాతజ్వరే॥

తా. రాత్రి మేల్కొనియుండుట పగలు కృశించియుండుట మూర్ఛశరీరమునందు కడుదాహము వాతము ప్రకోపించియుండుట చలిబెట్టుట చెమటపట్టుట అసంగతముగ మాటలాడుట మదము పవ్వుట అొమ్మునొచ్చుట లేక అొమ్ముతో మండుట శ్వాసకాసలు విదాహించుట శరీరము చల్లనై యుండుట జ్వరము దప్పి తలనొచ్చుట నాలుక పిడకవలె యెండి కృశించియుండుట శరీరము గగుర్పొడుచుట ఈలక్షణములుగలది సన్నిపాతజ్వరమని తెలియువలయును.

శ్లో॥ (బాహటే) సర్వజోలక్షణైస్సర్వైః దాహోత్రచముహుర్ముహుః । తద్వచ్ఛీతంమహానిద్రా దివాజాగరణంనిశి । సదావానైవవానిద్రా ముహుస్స్వేదోతినైవవా । గీతనర్తనహాస్యాదివికృతేహాప్రవర్తనమ్ । సస్రుతేకలుషే రక్తేభుగ్నేలులితపక్ష్మణీ । అక్షిణీపిండికాపార్శ్వమూర్ధపర్వాస్థిరుక్ భ్రమః । స్వస్వనౌసదుజౌకర్ణౌ కంఠశ్శూకైరివావృతః । పరిదగ్ధఖరా జిహ్వా గురుస్రస్తాంగసంధితా । రక్తపిత్తకఫష్ఠీవో లోలనంశిరసోతిరుక్ । కోఠానాంశ్యావరక్తానాం మండలానాంచ దర్శనమ్ । హృద్వ్యథామలసంసర్గః ప్రవృత్తిర్వాల్పశోపివా । స్నిగ్ధాస్యతాబలభ్రంశః స్వరసాదః ప్రలాపితా । దోషపాకశ్చిరాత్తంద్రా సతతం కంఠకూజనమ్ । సన్నిపాతమభిన్యాసం తంబ్రూయాన్మూర్ఛహృతౌజసమ్॥

* శిరస్తోదనమ్. కాయపులకమ్.

తా. సన్నిపాతజ్వరమునందు వాతాది జ్వరమునకు చెప్పియుండు లక్షణము లన్నియు కలిగి యుండును దీనియందు పలుమారు ఉష్ణము పలుమారు శీతము పగటి యందు విశేషనిద్రరాత్రులయందు నిద్రలేకుండుట లేక యెల్లపుడు నిద్రించుట నిద్ర లేకపోవుట పలుమారు చెమటబట్టుట అధికముగా చెమట చెమటయే లేకుండుట సంగీతము వర్తనము హాస్యము మొదలగు వికారచేష్టలు చేయుట నేత్రములు కలకబారి నీళ్ళతోఁగూడి యెఱ్ఱగా నుండుట కంటిఱెప్పలు వంకరగాపోవుట పిక్కలు పార్శ్వములు శిరము కీళ్లు అస్థులుచీనియందు నొప్పి భ్రమము చెవులయందు ధ్వని శూల గొంతులో ముండ్లు గ్రుచ్చుకొనినటులుండుట నాలుక కాల్పవడినటుల రూక్షగ నుండుట శరిరసంధులు జారుట కారి యుమియునపుడుర క్తకఫములు వెడలుటశిరము నందు వణకు అధికనొప్పి నల్లగ యెఱ్ఱగ నుండుకోఠములు మండలములు కనుపించుట బొమ్మనొప్పి మలబంధము లేక కొంచె కొంచెముగా మలము వెడలుచుండుట ముఖము మిణమిణలాడుట బలహాని స్వరభంగమువదరుట బహుకాలముమీదదోషముజీర్ణంబగుట తంద్ర యెల్లపుడు కంఠమునందు గుర్గురు శబ్దము ఈలక్షణములు కలిగియుండును. తేజస్సును నశింపచేయునట్టి యీసన్నిపాతము అభిన్యాస మనబడును.

## దాహజ్వర లక్షణము.

శ్లో॥ (సిద్ధరసార్ణవే) దాహః పిపాసా ముఖశోషణంచ ప్రలాప
సంతాపమతీవదుఃఖమ్। మూర్ఛాపరిభ్రాంత్యుదరాగ్నిరోధ
ఏతానిదాహ జ్వరలక్షణాని॥

తా. సర్వాంగతాపముదప్పి నోరుయెండుట అసంగతముగా మాటలాడుట తాపము కడుదుఃఖము మూర్ఛ తబ్బిబ్బులాడుట అగ్నిమాంద్యము ఈలక్షణములుకలది దాహజ్వరమని తెలియవలయును.

## అజీర్ణజ్వర లక్షణము.

శ్లో॥ (చరకే) జ్వరజృంభణహిక్కాశ్చ మందాగ్నిర్జానునివ్యథా ।
ఆమ్లస్వభావ గంధశ్చ హ్యజీర్ణ జ్వరలక్షణమ్ ।

తా. జ్వరము ఆవలింతలు ఎక్కిళ్లు అగ్నిమాంద్యము మోకాల్లునొచ్చుట పులితేనుపులు ఈలక్షణములు గలది అజీర్ణజ్వరమని తెలియవలయును.

## భూతజ్వర లక్షణము.

శ్లో॥ (మాధవనిదానే) అపస్మారోవిరూపాక్షో జ్వరోత్యత ప్రలాపనమ్ । అతీవభోజనేవాంఛారోమహర్ష శ్చగాయితా । హాస్యంచ నర్తనంతంద్రా స్యాద్భూతజ్వలరక్షణమ్॥

తా. అపస్మారము వెఱ్ఱిచూపులుచూచుట జ్వరము మిక్కుటముగా వదరుట మిక్కుటముగా భుజించుటయందిచ్ఛగలుగుట శరీరము గగుర్పొడుచుట పాడుట నవ్వుట ఆడుట తంద్ర ఈలక్షణములుగలది భూతజ్వరమని తెలియవలయు.

## అభిఘాతజ్వర లక్షణము.

శ్లో॥ (మాధవనిదానే) దూరవ్యాయామతోతీవ జాయతేజ్వరముత్కటమ్ । దాహస్సర్వాంగవైకల్యం స్వేదస్తంద్రామతిభ్రమః। శీతంతృష్ణాతిమోహశ్చ ప్రలాపోహృదివేదనా । శ్రమస్సంధిరుజాకాస శ్చాభిఘాతజ్వరాకృతిః॥

తా. తనబలిమి నతిక్రమించి కడుదూరము నడుచుటచే నతిశయముగా జ్వరముజనించుట. ఇది అభిఘాతజ్వరడునబటను. దానియందు దాహము సర్వాంగముల యందు బలక్షయము చెడుట తంద్ర తబ్బిబ్బుమాటలు శరీరశైత్యము దప్పికడుమోహము ప్రలాపము హృదయమునందువేదన శ్రమ కీళ్ళందు నొప్పిదగ్గు ఇవి గలుగును.

శ్లో॥ తస్మిన్ జ్వరేతుపవనః ప్రాయోరక్తంప్రదూషయన్ ।
సవ్యథాశోషవైవర్ణ్యం సరుజంకురుతేజ్వరమ్॥

తా. అభిఘాతజ్వరమునందు వాతము తరుచుగా రక్తమునుచెరిచి నొప్పి శోష వివర్ణత్వము ఉపద్రవము వీనిని గలుగజేసి పిదప జ్వరమును కలుగజేయును.

## [illegible]జ్వర లక్షణము.

శ్లో॥ (బాహటే) క్షుధామహాదాహభ్రమాజ్వరశ్చ క్షణంక్షణం శీతరుజామలాది । ఊష్మాతి మూర్ఛావిషమప్రలాపశ్ఛర్దిశ్చ హృద్రుక్క్లమశూలమోహాః । క్వచిద్ధినేచ త్రిదినే చతుర్థే

విషోవిదాహోవివిధజ్వరంస్యాత్ । ఏతచ్చరూపంవిషమజ్వరా
ణాం క్వచిద్దినేద్విత్రిహిమంజ్వరశ్చ॥

తా. ఆకలి కడుదాహము భ్రమ ప్రతిక్షణమునందు జ్వరమువచ్చుట చలి బట్టుట మలమూత్రములు వెడలుట శరీరము ఉష్ణముగనుంట కడుమూర్ఛ తబ్బిబ్బు లాడుట వాంతి రొమ్మునొచ్చుట బడలిక శూల మోహము ఒకటవ దినమునగాని మూడవ దినమునగాని నాలుగవదినమునగాని విషమించి విదాహయుక్తమై పలువిధ ములుగ జ్వరమువచ్చుట 1 దినములో 2. లేక మూడుమార్లు చలిబట్టి జ్వరమువచ్చు ట ఈలక్షణములు గలది విషమజ్వరమని తెలియవలయు (మఱియుదీనియందు ఆసా ధ్యనాడులు కలిగియుండిన అసాధ్యంబనియుసాధ్యనాడులు కలిగియుండిన సాధ్యం బనియు తెలియవలయు.)

శ్లో॥ (నిత్యనాథీయే) క్షణేచోష్ణంక్షణేశీతం క్షణేజ్వరగతి స్తథా ।
క్వచిద్దోషగహిమంవాపి ద్వితీయంచతృతీయకమ్ । చలంచా
తుర్థికంవాపి విషమజ్వరలక్షణమ్॥

తా. క్షణములో ఊష్మముగలుగుట క్షణములో చలువపుట్టుట క్షణములో జ్వరమువచ్చుట 1 దినములో రెండుమార్లని మూడుమార్లని నాలుగుమార్లని విడిచి విడిచి చలివచ్చుట ఈలక్షణములుగలది విషమజ్వరమని తెలియవలయు.

## విషమజ్వరోత్పత్తి కారణము.

శ్లో॥ (మతాంతరే) దోషోల్పోహితసంభూతో జ్వరోత్సృష్టస్య
వాపునః । ధాతుమన్యతమంప్రాప్య కరోతివిషమజ్వరమ్॥

తా. జ్వరవిముక్తినికి ఆహితాహారాచారాద్యపథ్యసేవవలచేదోషముజనించు దోషము మరల కొంచెమువృద్ధిజెంది రసాదిసప్తధాతువులలో నేదైనా నొకదాని నాశ్రయించి ఉత్పత్తిలోనేతృతీయాది విషమజ్వరములను గలుగజేయు దోషము ఉత్పత్తికాలములో అల్పముగనుండి కాలవిశేషమువలన బలవత్తరమై జ్వరముగలు గజేయు బలవత్తమముగనుండిన నిత్యజ్వరమును గలుగజేయు.

శ్లో॥ (ఆయుర్వేదే) ధాతుస్థానగతైర్దోషైర్జాయంతేవిషమజ్వరాః॥

తా. దోషములు రసాదిసప్తధాతుగతంబులైన విషజ్వరములు జనించు,

## విషమజ్వర భేదము.

శ్లో॥ [ఆయుర్వేదే] సంతత స్సతతోన్యేద్యు స్తృతీయక చతుర్థకౌ॥

తా. సంతతము సతతము అన్యేద్యు (అనగా ద్వ్యాహికము) తృతీయకము (అనగా త్ర్యాహికము) చతుర్థకము (అనగా చాతుర్థికము) అని విషమజ్వరములు 5 విధంబులు (దోషము రసగతంబైన సంతతజ్వరమును గలుగజేయు రక్తగతంబైన సతతజ్వరమును గలుగజేయు. మాంసగతంబైన ద్వ్యాహికజ్వరమును గలుగజేయు. మేదోగతంబైన త్ర్యాహికజ్వరమును గలుగజేయు అస్థిమజ్జాగతంబైన అనేక రోగములతోగలసి మృత్యు తుల్యముగనుండు. చాతుర్థికజ్వరమును గలుగజేయు.)

శ్లో॥ [రసాశ్రిత స్సంతతకో దివారాత్రం సముంచతి।
అహోరాత్రే సతతకో ద్వౌకాలా వనువర్తతే।
అన్యేద్యుష్క స్త్వహోరాత్ర ఏకవారం ప్రవర్తతే।
తృతీయక స్తృతీయేహ్ని చతుర్థేహ్ని చతుర్థకః।
ముక్త్వాన్యేహ్ని చతుర్థోసౌ చాతుర్థిక విపర్యయః॥

తా. రసధాతువు నాశ్రయించి 7, 10 లేక 12 దినములవరకు రేయుంబగలు విడువకుండు జ్వరము సంతతమనబడును. అహోరాత్రమధ్యములో 2 మార్లు (అనగా పగలు 2 మారులుగాని రాత్రి 2 మార్లుగాని లేక పగలు ఒకమారుగాని రాత్రిఒక మారుగాని ఒకపూటలో 2 మార్లుగాని వచ్చుజ్వరము సతత మనబడు. అహోరాత్ర మధ్యములో ఒకమారువచ్చుజ్వరము అన్యేద్యుష్క మవబడు. 3 దినములకొకమారు వచ్చుజ్వరము తృతీయక మనబడు. 4 దినముల కొకమారు వచ్చుజ్వరము చాతుర్థిక మనబడు. ఈచాతుర్థికజ్వరము నాలుగవదినంబునవచ్చివిడిచి ఐదవదివసంబువచ్చిన చాతుర్థిక విపర్యయము (అనగా పంచాహికము) అనబడు. (ఈవిషమజ్వర సాధ్యాసాధ్యంబుల నెఱింగి చికిత్సింపవలయు. చికిత్సించునెడ స్వచ్ఛందభైరవమునొసంగవలయు.)

శ్లో॥ [బాహటే] జ్వరఃపంచ విధఃప్రోక్తః మలకాల బలాబలాత్॥
ప్రాయశ్చ సన్నిపాతేన భూయసా త్వపదిశ్యతే।
సంతత స్సతతోన్యేద్యుః తృతీయక చతుర్థకౌ॥

తా. వాతాదిదోషములు ఆదానవిసర్గరూపమైన కాలము వీని బలాబలముల వలన జనించు జ్వరము 5 విధములుగ నుండును, మఱియును సన్నిపాతముచే సంతత మనగ సతతము అన్యేద్యుః తృతీయకము చతుర్థకము అని జ్వరములు నానావిధములుగ నుండును.

## సంతతజ్వరోత్పత్తి క్రమము.

శ్లో॥ ధాతుమూత్రశకృద్వాహి స్రోతసా వ్యాపినో మలాః।
తాపయంత స్తమం సర్వాం తుల్యదూష్యాని వర్థితాః।
బలినో గురివ స్తబ్ధా విశేషేణ రసాశ్రితః।
సంతతం నిష్క్రితి ద్వంద్వం జ్వరం కుర్యా త్సుదుస్సహామ్॥

తా. తుల్యమగు దూష్యములు ప్రకోపకరవస్తువులు, వీనిచే వృద్ధిజెందిబలిష్ఠ ముగనుండు వాతాదిదోషములు రసాదిస ప్తధాతువులను మలమూత్రములను వహించు నట్టి స్రోతస్సులయందు వ్యాపించి సమ స్త శరీరమును తపింపజేసి పిదప అజీర్ణలసము నాశ్రయించి బలమును గురుత్వమును జెంది స్తబ్ధముగనై దుస్సహమైన సంతత జ్వర మును కలుగజేయును.

## సంతతజ్వర క్రమము

శ్లో॥ మలాః జ్వరోష్మ ధాతూన్వా సశీఘ్రం క్షపయే త్తతః।
సర్వాకారం రసాదీనాం శుద్ధ్యశుద్ధ్యాపివా క్రమాత్।
వాతపి త్తకఫైస్స ప్త దశద్వాదశ వాసరాః।
ప్రాయోనుయాతి మర్యాదాం మోక్షాయచవధాయచ॥

తా. సంతతజ్వరము సర్వాంగములయందు వ్యాపించి మలమును రసాది సప్త ధాతువులను శీఘ్రములోనిశ్శేషము గానశింపచేయును. మఱియు నిది రసాదులయొక్క జీర్ణాజీర్ణ భేదములవలనయథాక్రమముగా వాతపిత్తకఫదోషములచే 7,10,12 దినముల వరకు అనుసరింపుచుండి పిదప జ్వరనివ_ర్తినైనను లేకమరణమునైనను గలుగజేయును.

## సంతతజ్వరకాల ప్రమాణము.

శ్లో॥ ద్విగుణా స ప్తమీయాతు నవమ్యేకాదశీ తథా।
ఏషా త్రిదోష మర్యాదా మోక్షాయచ వధాయచ॥

తా. వాతపిత్త శ్లేష్మములచే జనించిన సంతతజ్వరములకు యథాక్రమముగా 7 14 22 28 దినములు కాలప్రమాణమనియు దానికి పిదప జ్వరనివర్తి గాని లేక మరణముగాని కలుగుననియు హారీతుని మతము.

## దోషక్షయ వృద్ధులచే విషమజ్వరోత్పత్తి కారణము.

శ్లో॥ కృశానాం వ్యాధిముక్తానాం మిథ్యాహారాది సేవినామ్॥
అల్పోపి దోషో దూష్యాదీన్ లబ్ధ్వాన్య తమతోపలమ్ ।
సవిపక్షో జ్వరంకుర్యా ద్విషమం క్షయ వృద్ధి భాక్ ॥

తా. జ్వరాదివ్యాధులు నివర్తించి కృశించియుండువారలకు మిథ్యాహారాది సేవనమువలన దోషము స్వల్పమైయుండినను దూష్యములను జెందివానినుండి విశేష బలమునుపొంది క్షయవృద్ధులను జెందుచు విషమజ్వరమునుగలుగజేయును. దీనియందు సన్నిపాతజ్వరములకు చెప్పియుండు గుర్గుణములు కలిగియుండును.

శ్లో॥ దోషఃప్రవర్తతే తేషాం స్వేకాలేజ్వరయన్ బలీ ।
నివర్తతే పున శ్చైషః ప్రత్యనీక బలాబలః ।
క్షీణేదోషే. జ్వరసూక్ష్మో రసాదిష్వ బలీయతే ।
లీనత్వా త్కార్శ్య వైవర్ణ్య జాడ్యాదీన్ విదధాతి సః ।

తా. పై చెప్పినవారికి దోషములు తమ తమ కాలములందు బలమును జెంది విశేషముగా జ్వరమును, గలుగజేయును మరల నాదోషము విరుద్ధమైన యాహారాదులచే దుర్బలమై నివర్తించును దోషము క్షయించుచుండగా జ్వరము సూక్ష్మరూపముగారసాదిధాతువులయందు లయమును జెందుచుండును. మఱియు నాజ్వరమురసశేషమునందు లయించియుండుటవలన శరీరకృశత్వము వైవర్ణ్యము జాడ్యము యీ మొదలగు వానిని కలుగజేయును.

## సంతతాదిజ్వర నిదానము.

శ్లో॥ ఆసన్న వివృతాస్యత్వా త్స్రోతసాం రసవాహినామ్ ।
ఆశు సర్వస్య వపుషో వ్యాప్తి ర్దోషేణ జాయతే ।
సంతత స్సంతత స్తేన విపరీతో విపర్యయాత్ ।
విషమో విషమారంభాః క్రియాః కాలోనుషంగవాన్ ।
దోషా రక్తాశ్రయః ప్రాయః కరోతి సతతజ్వరమ్॥

తా. అన్నరసాదులను వహించెడి స్రోతోద్వారములు తెరవబడియుండుట వలనయాయన్నరసాదులు సమస్తశరీరమునందు వ్యాపించిస్వల్పముగ క్షీణముగనుండు దోషము సంతతజ్వరమును గలుగజేయును ఇదియ సంతతజ్వరనిదానము. దీనియందు విరుద్ధాహారాదులవలన విషజ్వరము గలుగును. రక్తము నాశ్రయించియుండుదోషము తరుచుగా సతతజ్వరమును గలుగజేయును. ఇదియొకయహోరాత్రమువిడువకుండును. ఇదియ యేకాహికజ్వర మనబడును.

## ద్వ్యాహిక త్ర్యాహికజ్వర నిదానము.

శ్లో॥ అహోరాత్రస్య సద్విస్యా త్సకృదన్యేత్యు రాశ్రితః ।
తస్మిన్ మాంసవహానాడీమ్ దోషనాడీ తృతీయకే ।
గ్రాహిపిత్తా స్థలాన్మూర్ధా త్రికస్య కఫపిత్తతః ।
సపృష్ట స్యానిల కఫా త్సచై కాహాంతర స్మృతః॥

తా. జ్వరము మాంసవహనాడి నాశ్రయించియుండిన మరుదినము జ్వరము కలుగును ఇదియ ద్వ్యాహికజ్వర మనబడును. జ్వరములో నాడి నాశ్రయించియుండిన త్ర్యాహికజ్వరము కలుగును. దీనియందు పిత్తవాత సంసర్గమువలన తలనొప్పి కఫ పిత్తసంసర్గమువలన ముడ్డిపూసయందు పట్లు కఫవాతసంసర్గమువలనవీపునందు పట్లు ఇవి కలుగును, ఇది యొకదినము విడిచి మరుదినమునందు కలుగును. దీనిని త్ర్యాహిక జ్వర మనియెదరు.

## శుక్లగతజ్వర లక్షణము.

శ్లో॥ తిమిరకఠినవాక్యం స్వేదమూర్ఛా ప్రలాపమ్ ।
నయన జలదదృష్టి ర్వాంతి లాలాస్య దేశేః ।
వికృత విదహ దేహే నష్టకాంతిః ప్రకుర్యాత్ ।
వివిధ విషవికారాన్ శుక్లయుక్తం జ్వరంచ॥

తా. కండ్లు చీకట్లుకమ్ముట కఠినముగమాటలాడుట చెమట మూర్ఛ ప్రలాపించుట కండ్లయందు నీరుకారుట వాంతులగుట నోటియఁల్లుకారుట శరీరమువికృతమైయుండుట తాపయుక్తముగయుండుట కాంతిహీనముగనుండుటయిట్టివిషవికారములు శుక్లస్థానముయాలక్షణములుగలది శుక్లగతజ్వరమని తెలియవలయు. (దీనియందనికి దోషధాతువులు కలిగెడినో వాడు మృత్యువుపాలగును. అటుగాకధాతువు స్పష్టగతిగా నడుచుచుండిన సాధ్యమని యెఱింగి చికిత్సింపవలయు.

శ్లో॥ [మతాంతరే] మరణంప్రాప్నుయాత్తత్ర శుక్రస్థానగతేజ్వరే।
శేఫసః స్తబ్ధతామోక్షః శుక్రస్యచ విశేషతః।

తా. రసాదిసప్తధాతుగత జ్వరములలో శుక్రస్థానమునుజ్వరము నాశ్రయింపుచుండగా మరణము కలుగును. ఆజ్వరమధ్యములో మేఢ్రము స్తబ్ధత్వమును జెందుటయే గాక విశేషముగా శుక్రస్రావమును ఒకానొకపుడు కొంచెకొంచెముగా రక్తస్రావమును కలుగును.

## శుక్రగతజ్వర చికిత్స.

శ్లో॥ పునర్నవార్క మూలంచ బాలావార్తాకమూలకమ్ ।
పళుత్థమూలం బృహతీ బర్బరం గ్రంధి నాగరమ్ ।
కణచూర్ణ మిదంఖాదేచ్ఛుక్ల జ్వర నికృంతనమ్॥

తా. గలిజేరువేరు జిల్లెడివేరు నూనెముంతవేరులేక ముత్తవపులగపువేరువలగ వేరు ఉలవవేరు నేలములకవేరువాయింటవేళ్లు ఘోడి శొంఠి వీనినిసమభాగములుగా దంచి కషాయముకాచి పిప్పలిచూర్ణము కలిపి సేవించిన శుక్లగతజ్వరము హరించును.

## ఆమజ్వర లక్షణము.

శ్లో॥ [భేషజకల్పే] లాలాప్రసేకహృల్లాసహృదయాశుద్ధ్యశోచకా ।
‡ తంద్రాలస్య విపాకంచ గురుగాత్రాతి మూత్రకమ్॥
ఆమజ్వర సలింగస్యా న్నదద్యాత్తత్ర భేషజమ్॥

తా. జొల్లుకారుట ఓకరవచ్చునట్టుండుట రొమ్ము జడముగనుండుటఅరుచి తంద్ర ఆలస్యము అన్నము అరగకుండుట శరీరము బరువుగానుండుట అధికముగా మూత్రోత్సర్జనంబగుట ఈలక్షణములుగలది ఆమజ్వరమని (అనగా అపక్వజ్వరమని) తెలియవలయును. దీనియందు ఔషధము నివ్వంజనదు.

శ్లో॥ [బాహటే] జ్వరోపద్రవతీక్ష్ణత్వ మగ్లానిర్బహుమూత్రతా ।
సప్రవృత్తి ర్నవిడ్జీర్ణం నక్షుత్సామజ్వరాకృతిః॥

‡ తంద్రాలస్యవిపాకస్య వైరస్యంగురుగాత్రతా । క్షున్నాశోబహుమూత్రత్వం స్తబ్ధతాబలవాన్ జ్వరః।ఆమజ్వరఃస్యలింగాని నదద్యాత్తత్రభేషజమ్। భేషజంహ్యామదోషస్య భూయోజనయతి జ్వరం।శోధనం శమనీయంచ కరోతి విషమ జ్వరమ్.

తా. తంద్ర ఆలస్యము అన్నము అరగకుండుటనోరువిరసముగనుండుట అంగములు బరువుగనుండుట ఆకలిలేకుండుట పలుమారు మూత్రము వెడలుట అంగములు స్తంభించియుండుటఅధికజ్వరము ఈలక్షణములుగలది అపక్వజ్వరమని తెలియవలయును దీనియందు ఔషధము నివ్వంజనదు ఔషధమునిచ్చిన అధికముగాజ్వరముగలుగు మఱియు శోధనీయ ఔషధములనుగాని లేక శమనీయ ఔషధములనుగాని ప్రయోగించిన విషమజ్వరము కలుగునని పాఠాంతరముగలదు.

తా. జ్వరమునకు చెప్పియుండు శ్వాసకాస మొదలగు పది యువద్రవములు తీక్ష్ణముగానుండుట బడలిక లేకుండుట మూత్రము అధికముగా బైలువెడలుటప్రవృత్తి లేక పోవుట మలము జీర్ణము కాకుండుట అకలి లేకుండుట ఈలక్షణములు ఆమ జ్వరమునకు కలిగియుండును.

## పచ్యమానజ్వర లక్షణము.

శ్లో॥ [పూజ్యనాదీయే]జ్వరవేగోధికాత్తృష్ణాప్రలాపశ్శ్వాసనంభ్రమః।
* మలప్రవృత్తిరుత్క్లేశః పచ్యమానస్య లక్షణమ్॥

తా. జ్వరవేగము కడుదప్పి ప్రలాపము శ్వాస భ్రమ మలోత్సర్జనము ఓకరవచ్చునట్టుండుట ఈలక్షణముగలది పచ్యమానజ్వరమని (అనగా పాకోన్ముఖమైన జ్వరమని) తెలియవలయును.

## నిరామజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] క్షుత్క్షామతాలఘుత్వంచ గాత్రాణాం జ్వరమార్దవమ్। దోషప్రవృత్తి రుత్సాహో నిరామజ్వరలక్షణమ్॥

తా, ఆకలి శరీరముకృశించుట అంగములు లఘువుగనుండుట మందజ్వరము దాతము అధోముఖంబగుట మనస్సంతోషము ఈలక్షణములుగలది నిరామజ్వరమని (అనగా పక్వమైన జ్వరమని) తెలియవలయును.

## ఆమాదిజ్వరకాల ప్రమాణము.

శ్లో। ఆమజ్వర స్త్రిరాత్రం స్యాత్సప్తాహం పచ్యమానతా।
దోషహీనో దశాహోర్ధ్వం నిరామమితికథ్యతే॥

* మలప్రవృత్తేరుత్క్లేశః। మలము కడుకష్టముమీద వెడలుట.

తా. జ్వరమునకు 3 దినములు ఆమావస్థయనియు 4 వ దినము మొదలు 7 వ దినమువరకు పచ్యమానావస్థయనియు 7 వదినము మొదలు 10 దినములవరకు దోష నశ్యమానావస్థయనియు దానికి పిదప నిరామావస్థయనియు తెలియవలయును.

## త్వగ్గతాదిజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] త్వగంతర్గతరక్తాస్థి మాంసధాతుగతజ్వరమ్ ।
ప్రవక్ష్యేతన్నిదానం సువిజ్ఞేయమిదంబుధైః ।
కించిస్మాత్రం జ్వరోదాహో నాడీ మందగతి ర్భవేత్ ।
కించి చ్ఛిరోవ్యథా జ్ఞేయం త్వగ్గత జ్వరలక్షణమ్ ।

తా. చర్మగత అంతర్గతరక్తగత అస్థిగత మాంసధాతుగత జ్వరనిదానంబుల వచించెదను; స్వల్పముగా మాత్రము వేడులుట జ్వరము దాహము నాడిమందముగ నడుచుట ఒకింతతలనొచ్చుట ఈ లక్షణముగలది త్వగ్గతజ్వరమని తెలియవలయును.

## అంతర్గతజ్వర లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] అంతర్దాహో బహిశ్శీతం కౌటిల్యం సంతత
జ్వరమ్ । క్షయః పాండుశ్చ బధిర మంతర్గసర్య లక్షణమ్॥

తా. కడుపులో మండుట వెలపట శీతముగనుండుట కుటిలముగనుండుట ఎల్లప్పుడు జ్వరము శరీరముక్షయించి పాండురవర్ణముగనుండుట చెవుడు ఈలక్షణములుగలది అంతర్గతజ్వరమని తెలియవలయును.

## రక్తగతజ్వర లక్షణము,

శ్లో॥ [మాధవనిదానే] జ్వరోష్ణతా విదాహశ్చ మదాలస్య మతి
భ్రమాః। అంగవైకల్య మూర్ఛాచ జ్వరో రక్తగతః స్మృతః॥

తా. జ్వరోష్ణము విదాహము మదించినవానివలె నుండుట ఆలస్యము చిత్తభ్రమ అంగములునొచ్చుట మూర్ఛ ఈ లక్షణములుగలది రక్తగతజ్వరమని తెలియవలయును.

శ్లో॥ [మతాంతరే] రక్తనిష్ఠీవనందాహో మోహశ్ఛర్ధనవిభ్ర
మహా । ప్రలాపః పిటకా తృష్ణా రక్తప్రాప్తే జ్వరేనృణామ్॥

తా. ఉమియునపుడు రక్తముబడుట దాహము మోహము వమనము భ్రాంతి వదురుట పిటికలు దప్పి ఈ లక్షణములుగలది రక్తగతజ్వరమని తెలియవలయు.

మాంసగతజ్వర లక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః]అతితీవ్రజ్వరశ్శ్వాస స్స్వేద స్తృష్ణాంగక
వ్యథా। తంద్రా విదాహః పులక మూర్ఛా మాంసగత జ్వరే॥

తా. కడుతీవ్రజ్వరము శ్వాస చెమట దప్పి అంగములయందు నొప్పి తంద్ర విదాహము శరీరము పులకరించుట మూర్ఛ ఈలక్షణములుగలది మాంసగత జ్వరమని తెలియవలయును.

శ్లో॥ [మతాంతరే] పిండకోద్వేష్టనంతృష్ణాసృష్టమూత్రాపురీషతా ।
ఊష్మాంతర్దాహ విక్షేపౌ గ్లానిస్స్యా న్మాంసగే జ్వరే॥

తా. పిక్కలయందు దండముచే గొట్టబడినటుల వేదన దప్పి అధికముగా మూత్రపురీషములు వెడలుట వెలపటయూష్మము కడుపులోమంట హస్తపాదములు విదిలించుట గ్లాని ఈ లక్షణములుగలది మాంసగతజ్వరమని తెలియవలయును.

అస్థిగతజ్వర లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] పరిభ్రమ శ్శోక విదాహ పూర్వం క్రోధోద్భ
వో గాత్ర సకంపతృష్ణా।విషార్తి మజ్జారస రక్తమాంస జ్వరం
కృశార్తిశ్చ శిరోతిశోషా । రాత్రౌక్వచి త్స్వేద రుజాజ్వరం
స్యా దజీర్ణ మందోష్ణ పురీషబంధమ్ । బలక్షయో దోష
మహో గదశ్చ ప్రారబ్ధజం హ్యాసి గత జ్వరం స్యాత్ ॥

తా. శరీరము పరిభ్రమించుట దుఃఖము శరీరము విదాహించుట కోపము శరీరము వణుకుట దప్పి నోరుయెండుట మజ్జారస మాంసరక్తగత జ్వరములయందలి చేష్టలు శరీరము కృశించుట తలనొచ్చుట శరీరము శోషించుట 1 దినముకాత్రిచెమట జ్వరము అజీర్ణము సన్నపుజ్వరము మలము వెడలకుండుట బలము క్షయించుట

దోషజ్వరము ఈ లక్షణములు గలది అస్థిగతజ్వరమని తెలియవలయు. ఇది ప్రారబ్ధమువలన జనించును.

శ్లో॥ [మతాంతరే] భేదోస్థ్నాం కుంచనంశ్వాసోవిరేక శ్ఛర్ది రేవచ।
విక్షేపణం చ గాత్రాణా మేత దస్థిగతే జ్వరే॥

తా. ఎముకలు విరిగినటుల నొచ్చుట ఎముకలు సంకోచమును జెందుట శ్వాసము విరేచనము ఓకర అవయవములు వీడినట్టుండుట ఈ లక్షణములు గలది అస్థిగతజ్వరమని తెలియవలయు.

## కాలజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] దాహస్వేద హిమోద్భవం స్వరమితం హృచ్ఛూలమానాహకమ్ । మూర్ఛాశోషశిరో వ్యథాచ జఠరే హంత్యాశు కాలజ్వరః॥

తా. దాహము చెమట చలిబెట్టుట స్వరము హీనమగుట హృదయము శూలించుట కడుపుబ్బరము మూర్ఛ శోష తల కడుపు నొచ్చుట ఈ లక్షణముగలది కాలజ్వరమని తెలియవలయు ఇది మనుజుని కడుశీఘ్రముగా జంపును.

## చర్మగతజ్వర కాల ప్రమాణము.

శ్లో॥ [అశ్వినీనిఘంటౌ] జ్వరం చర్మగతం యస్యసర్వాంగం శీత మాశ్రయేత్ । దశరాత్రవినిర్ముక్తోనరో జీవేన్ననిశ్చితమ్॥

తా. చర్మగతజ్వరమునందు సర్వాంగములు శీతలముగానుండును అది 10 దినములలో నివర్తించినను నివర్తించును లేక చంపినను జంపును (10 దినములకు పిదప జీవించియుండిన చికిత్సజేయవలయును.)

## రక్తగతజ్వర కాల ప్రమాణము.

శ్లో॥ [బాహటే] దేహంపాండురవర్ణంచ రక్తశ్లేష్మవిజృంభణమ్ ।
నవజ్వరేచ సంతాపః కాలజ్ఞానేన భాషితమ్॥

తా. రక్తగత జ్వరమునందు శరీరమునకు పాండురవర్ణము రక్తయుక్త * శ్లేష్మస్రావము 9 దినములలో శరీరతాపము కలుగునని కాలజ్ఞానుడు వచించెను.

* శ్లేష్మ స్రావనమనగా తెమడ వెడలుట.

(ఈజ్వరరోగి 9 దినములకు వైవస్వతనిలయంబున కేగును; అటుగాక దైవికమువల
జీవించియుండిన చికిత్స జేయవలయు.)

## మాంసగతజ్వరకాల ప్రమాణము.

శ్లో॥ [మాధవనిదానే] జ్వరం మాంసగతం యస్య సర్వాంగే కృ
తాభవేత్ । ద్వాదశే జాయనే మృత్యుః కాలజ్ఞానేన భాషితమ్

తా. మాంసగతజ్వరమునందు సర్వాంగములు కృశించి దిగజారినట్టుండి
రోగి 19 దినములలో యమాలయంబున కేగునని కాలజ్ఞానుడు వచించెను; అట
గాకదైవికమువలన జీవించియుండిన చికిత్స జేయవలయును.

## రసగతజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] గురుతా హృదయోత్క్లేశ స్సదనం చర్ది
రోచకౌ । రసస్థేతుజ్వరేలింగందైన్యంచాస్యోపజాయతే॥

తా. శరీరము జడముగ నుండుట వాంతివచ్చునటు లుండుట గాని ఓక
అన్నద్వేషము మనోవ్యథ ఈలక్షణములుగలది రసగతజ్వరమని తెలియవలయును

## రసగతజ్వరకాల ప్రమాణము.

శ్లో॥ [చరకే] జ్వరంరసగతంయస్య సర్వాంగేజ్వరశైత్యతః ।
చతుర్థే జాయతే మృత్యు కాలజ్ఞానేన భాషితమ్॥

తా. రసగతజ్వరమునందు సర్వాంగములయందు జ్వరము చలుపబుట్టినయెడ
ల 4 దినములలో యమమందిరమున కేగునని కాలజ్ఞానుడు వచించెను (అటుగా
దైవికమువలన జీవించియుండిన చికిత్స జేయవలయును.)

## ఆగంతుకజ్వర నిదానము.

శ్లో॥ ఆగంతు రభిఘాతాభి షంగ శాపాభిచారతః ।
చతుర్ధాత్ర క్షత చ్ఛేద దాహాద్యై రభిఘాతజః॥

తా. అభిఘాతము తిరస్కారము శాపము అభిచారము వీనివలన 4 విధము
లగు ఆగంతుకజ్వరము జనించు అందభిఘాతజ్వరము గాయము నరకుదెబ్బదాహ
క్రియలు మొదలగు వానివలన జనించును.

## అభిన్యాసజ్వర లక్షణము.

శ్లో॥ ప్రహాసో నర్తనం గానం ఘుర్ఘజృంభాశిరోరుజాః ।
భైషజ్యే హ్యతివృద్ధిస్స్యాత్ రక్తాక్షం రోమహర్షణమ్ ।
ఏభిస్తు లక్షణైర్జ్ఞేయా హ్యభిన్యాసజ్వరాకృతిః ॥

తా. నవ్వుట ఆడుట పాడుట బొబ్బరించుట ఆవులించుట తలనొచ్చుట ఔషధసేవనచే జ్వరము హెచ్చుట కన్నులు యెఱ్ఱనై యుండుట గగుర్పొడుచుట ఈలక్షణములుగలది అభిన్యాసజ్వరమని తెలియవలయును.

## కామజ్వర లక్షణము.

శ్లో॥ అపస్తుకాలేపి విమూఢబుద్ధి స్తేజోవిహీనత్వ మనంగతాపః ।
నిరన్నకాంక్షాపి వివర్ణతా చ భవంతి కామజ్వరతాపి తస్య ॥

తా. స్త్రీపురుషుల కన్యోన్యవిరహామువలన మూఢబుద్ధి తేజోవిహీనము మన్మథతాపము అన్నమునం దిష్టములేకుండుట శరీరము వివర్ణముగనుండుట ఈలక్షణములుగలది కామజ్వరమని తెలియవలయును.

శ్లో॥ [మాధవనిదానే] కామజే చిత్తవిభ్రంశ స్తంద్రాలస్య మభోజనం । హృదయే వేదనాచాస్య గాత్రంచ పరిశుష్యతి ॥

తా. చిత్తభ్రమ తంద్ర ఆలస్యము అన్నమునందిచ్ఛలేకుండుట హృదయమున వేదన శరీము శుష్కించుట ఈలక్షణములుగలది కామజ్వరమని తెలియవలయును.

శ్లో॥ [బాహటే] కామాన్మోహారుచి ర్దాహో హ్రీంనిద్రాధీ ధృతిక్షయః॥

తా. కామజ్వరమునందు అరుచి మోహము సర్వాంగతాపము ఇవి కలుగుట లజ్జ నిద్ర బుద్ధి ధైర్యము ఇవి లేకుండుట ఈలక్షణములు కలుగును.

## అసాధ్యజ్వర లక్షణము.

శ్లో॥ జ్వరో నిహంతి రక్తాక్షం క్షీణాంగం హృది శూలినమ్ ।
సదాశ్వాసశ్చ స్వేదశ్చ శక్తిహీనం హతాననమ్ ॥

తా. నేత్రము లెఱ్ఱనైయుండుట ; శరీరము కృశించుట బొమ్మలలో శూల యెల్లపుడు శ్వాసము యెల్లపుడు, సత్వము అగ్నిదీపనము । లేకుండుట ఈలక్షణములుగల జ్వరరోగి యమాలయంబున కేగుసు.

శ్లో॥ [మతాంతరే] హేతుభిర్బహుభిర్జాతో బలహ్యద్బహులక్షణః।
జ్వరః ప్రాణాంతకృద్యశ్చ శీఘ్రమింద్రియనాశనః ॥

తా. అనేక కారణములతో జనించి బలక్షయమును గలుగజేసి స్వేదాద్యనేక దుర్లక్షణములతోగూడి శీఘ్రముగా ఇంద్రియశక్తిని నశింపజేయుచుండు. జ్వరము ప్రాణాంతకమగును.

శ్లో॥ [మాధవనిదానే] జ్వరక్షీణస్యశూనస్య గంభీరోదైర్ఘరాత్రికః।
అసాధ్యో బలవాన్ యశ్చ కేశసీమంతకృజ్జ్వరః ॥

తా. శరీరము కృశించిన వానికిగాని లేక శరీరము ఉబ్బియుండు వానికిగాని గలిగిన జ్వరము వాతాది నాడీగమనము నెఱుగుట శక్యముగ నేని అంతర్వేగము గలదిగ నేని॥నుండు జ్వరము దీర్ఘకాలమువరకు విడువక వేధించుచుండు జ్వరము బలవత్తరముగానుండు జ్వరము అకస్మాత్తుగా తలవెంట్రుకలను పాపటగా దీసికొను వానియొక్క జ్వరము ఇవి అసాధ్యంబులు.

శ్లో॥ [అన్యశాస్త్రే] ఆరంభాద్విషమోయస్యయస్యవాదైర్ఘరాత్రికః।
క్షీణస్యానిమిషాక్షస్య గంభీరో హంతి మానవమ్ ।
విసంజ్ఞస్తామ్యతే యస్తు శేతే నిపతితోపివా ।
శీతార్దితోంతరుష్ణశ్చ రేణచ మ్రియతేనరః ॥

తా. ఆరంభము మొదలు విషమముగా జనించిన జ్వరము అనేకదినములు విడువక వేధించుచుండు జ్వరము కృశించిన వానికి జనించిన జ్వరము నిక్కబొడిచికొనియుండు నేత్రములుగలవానికి అనువర్తించియుండు గంభీరజ్వరము ఇవిమను జునిజంపును, మతియు దిగ్భ్రమనొంది బడలియుండు జ్వరితుడు శయనించి మరల లేచుట కశక్తుడుగ నుండు జ్వరితుడు వెలుపట శీతబాధలోన జ్వరవేగముగల జ్వరితుడు వీరు మరణమును జెందెదరు.

శ్లో॥ [నిత్యనాథీయే] యో హృష్టరోమా రక్తాక్షో హృది సంఘాతశూలవాన్ । వక్త్రేణ చైవోచ్ఛ్వసితి తం జ్వరో హంతి

మానవమ్ । హిక్కా శ్వాసతృషాయుక్తం మూఢం విభ్రాంత లోచనమ్ । సంతతోచ్ఛ్వాసనం క్షీణం నరం క్షపయతి జ్వరః । హతప్రభేంద్రియం క్షామ మరోచకనిపీడితమ్ । గం భీరతీక్ష్ణ వేగార్తం జ్వరితం పరివర్జయేత్ ॥

తా. రోమాంచము యెఱ్ఱని నేత్రములు హృదయమునందు అష్ఠీలికాది వాత సమూహతుల్యమైన శూలగలవాడై ముఖమువలన శ్వాసము విడుచుచుండెడి జ్వర రోగి మరణము జెందును. ఎక్కిళ్లు శ్వాసము దప్పి మోహము వెఱ్ఱిచూపులు లేక నేత్రములు చక్రాకారములుగ దిరుగుట ఎల్ల పుడుముఖమువలన శ్వాసము వెడలుచుం డుట శరీరము క్షయించియుండుట ఈలక్షణములుగల జ్వరరోగి యమాలయమున కేగును. తేజోవిహీనత ఇంద్రియములకు శక్తిహీనత కృశత్వము అధికముగా అన్న ద్వేషము గంభీరజ్వరము లేక తీక్ష్ణమైన జ్వరపీడ ఇవిగల జ్వరరోగి మరణము జెందును.

శ్లో। [మతాంతరే] ప్రేతైస్సహాపిబేన్మద్యం స్వప్నేయఃకృష్యతే శునా। సఘోరంజ్వరమాసాద్య నజీవేన్నచముచ్యతే । జ్వరః పూర్వాహ్ణికోయస్య శుష్కకాసశ్చ దారుణః । బలమాంస విహీనశ్చ యథాప్రేతస్తథైవసః । జ్వరోయస్యాపరాహ్ణేతు శ్లేష్మాకాసకృదారుణః । బలమాంస విహీనశ్చ యథాప్రేత స్తథైవసః । సహసాజ్వరసంతాప స్తృష్ణామూర్ఛాబలక్షయః। విశ్లేషణంచసంధీనాం ముమూర్షోరుపజాయతే । గోసరేవదనా ద్యస్య స్వేదఃప్రచ్యవతేధ్రువమ్ । లేపజ్వరోపసృష్టస్య దుర్ల భం తస్యజీవితమ్॥ స్వేదోలలాటేహిమవాన్నరస్య శీతార్దిత స్యాతిసుపిచ్ఛిలస్య । కంఠస్థితోయస్యనయాతివక్షో నూనంయ మస్యైతిగృహంసమర్త్యః॥ యస్యస్వేదోతిబహుళఃపిచ్ఛిలో యాతిసర్వతః । రోగిణశ్శీతగాత్రస్య తదామరణమాదిశేత్ ॥

తా. జ్వరమధ్యమునందు ప్రేతలతోడ మద్యపానము చేసినటులేని కుక్క లచే నీడవబడినటులేని స్వప్నముగాంచెడివాడుభయంకరమైనజ్వరరోగముగలవాడై మరణము జెందును. పూర్వాహ్ణమునందు దారుణమైన జ్వరము కఫవిహీనమైన దగ్గు బలహాని మాంసక్షయముగలజ్వరితుడు యమాలయంబున కేగును. అపరాహ్ణమునందు

దారుణమైన జ్వరము శ్లేష్మముతోగూడిన దగ్గు బలహాని మాంసక్షయము ఇవిగల జ్వరితుడు యమునిగాంచును. అకస్మాత్తుగా జ్వరసంతాపము దప్పి మూర్ఛ బలక్షయము సంధి శైథిల్యముఇవిగల జ్వరితునికి మరణము ఆసన్నమైనదని తెలియవలయును- ఉదయకాలములో ముఖమునందు స్వేద స్రావము లేపజ్వరవ్యాప్తియివిగల జ్వరితుడు జీవించుట దుర్లభము నుదుట చల్లని చెమటబట్టుట అంగములు శీతలముగ శరీరము జిగటగ నుండుట నోటిలో నుంచుకొనిన కబళము బొమ్మలోనికి దిగకుండుట ఈలక్షణములుగల జ్వరితుడు యమాలయంబున కేగును. జిగటగనుండు చెమట అధికముగా జనించి శరీరమంతట వ్యాపించుట అంగములయందుచలువబట్టుట ఈలక్షణములుగల జ్వరితుడు కృతాంతునికడ కేగును.

## సంగమదోషజ్వర లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] సంగదోషస్యచిహ్నాని నేత్రరోగశ్శిరోవ్యథా।
ఊరుపీడోదరేదాహ స్సంధిబంధ స్త్వపాజ్వరః॥

తా. నేత్రము లెఱ్ఱనై నీరుగారుచుండుట తల తొడలు నొచ్చుట కడుపులో మండుట సంధులు బంధించినట్లుండుట దప్పి (ఆరాటము) జ్వరము ఈలక్షణములు గలది సంగమజ్వరమని తెలియవలయును. (దీనియందు శక్లగతజ్వరచికిత్స జేయవలయును.)

## విషూచిజ్వర లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] విషూచికాజ్వరేచ్ఛర్దిర్నాడీ మందగతిర్భవేత్
అంతర్దాహో బహిశ్శీత మతిసారో జ్వర స్తథా।
తృష్ణా ప్రలాపో భ్రాంతిశ్చ విజ్ఞేయా వైద్యపారగైః।
చతుర్థేజాయతే మృత్యుః కాలజ్ఞానేన భాషితమ్॥

తా. వమనంబగుట నాడులు మందగించుట లోపల విదాహము వెలపట శీతలము అతిసారము జ్వరము దప్పి వదురుట భ్రాంతి ఈలక్షణములు గలది విషూచిజ్వరమని ఆయుర్వేదవేత్తలు తెలిసికొనవలయును. యివి గలవాడు 4 దినములలో యమాలయంబున కేగునని కాలజ్ఞానుడు వచించెను.

## విషూచిజ్వర చికిత్స.

శ్లో॥ అరలుర్మథితనిసీతం చించాతరుమూల ఖాదిరరసంవా।
వినిహంత్యాశువిషూచిం సవిదాహం చూతవల్కలరసశ్చ॥

తా. పెద్దమ్రాను చెక్కరసము పెరుగు కాచు వీనినేని లేక చింతవేరు చెక్కరసము పెరుగు కాచు వీనినేని మామిడివేరు చెక్కరసము పెరుగు కాచు వీనినేని నేకముజేసి త్రాగిన విషూచిజ్వరములు హరించును.

శ్లో॥ [ఆయుర్వేదే] సహకైలోప్యతైలోవా చించాపత్రభవోరసః। మస్తకేనాభిదేశేచ తథాపాదద్వయేపిచ। లేపిత స్తత్క్షణాద్ధంతి సవిదాహాం విషూచికామ్॥

తా. చింతాకురసములో సూనెను కలిపిగాని కలపకగాని యారసమును శిరము అరికాళ్ళు నాభి వీనియందు లేపనము పానముజేయించిన విషూచిజ్వరములు తత్క్షణమున హరించును.

విషూచిజ్వరములకు అగ్నికుమారము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసేంద్రగంధం సహటంకణేన సమంవిషం యోజ్యమిదం త్రిభాగమ్। కపర్దిశంఖావపిచత్రిభాగా మరీచచూర్ణాష్టగుణాం విదద్యాత్। సుపక్వజంబీర రసేనఘృష్ట శుద్ధో భవేదగ్నికుమారఏషః। విషూచికారోచకసన్నిపాతే దేయం ద్విగుంజం యదివాప్యజీర్ణే। శ్రీపర్ణఖండేన యథాబలంచ శీతంజలంచాను పిబేత్పరంతు॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన వెలిగారము ఇవి సమభాగములు శుద్ధిజేసిన నాభి 3 భాగములు గవ్వలభస్మము శంఖభస్మము ఇవి 3 భాగములు మిరియములచూర్ణము 8 భాగములు; ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి నిమ్మపండ్ల రసముచే బాగుగా మర్దించి 2 గురిగింజలంతేసి మాత్రలుజేసి నీడవెండించి యందొకదానిని శరీరబలము నెఱిగి ప్రాతస్సాయంకాలములయందు తమలపాకు రసానుపానముతో సేవించి పిదప శీతోదకమును త్రాగిన విషూచిజ్వరము అరుచి సన్నిపాతము అజీర్ణము ఇవి నశించు.

కామిలాజ్వర లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] కృష్ణంపీతం శకృన్మూత్రం తంద్రామోహ శ్ఛర్దనమ్। దాహారుచి స్తథానాహో జ్వరస్యాఽ ద్రక్త

నేత్రతా । అసాధ్యస్స్వాసకాసాత్తు కామిలాజ్వరలక్షణమ్॥

తా, మలము నల్లగ మూత్రము పసుపువర్ణముగ వెడలుట తంద్ర మోహము వాంతి దాహము అరుచి కడుపుబ్బరము నేత్రము లెఱ్ఱనైయుండుట జ్వరము ఈ లక్షణములుగలది కామిలా జ్వరమని తెలియవలయును. దీనియందు శ్వాసకాసలు కలిగియుండిన యసాధ్యము.

## మేదోగతజ్వర లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] భృశంస్వేద స్తృషామూర్ఛా ప్రలాపశ్ఛ ర్ది రేవచ । దౌర్గంధ్యారోచకంగ్లాని ర్వేదనాచాసహిష్ణుతా॥

తా. కడుచెమట దప్పి మూర్ఛ ప్రలాపము వాంతి శరీరదౌర్గంధ్యము అన్నమునందరుచి గ్లాని వేదన సహింపకుండుట ఈలక్షణములుగలది మేదోగత జ్వరమని తెలియవలయును.

## మజ్జాగతజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] తమఃప్రవేశనంహిక్కా కాసఃశైత్యంవమి స్తథా । అంతర్దాహో మహాశ్వాసో మర్మభేదశ్చ మజ్జగే।

తా. చీకటి కమ్ముకొనినట్టుండుట ఎక్కిళ్ళు శరీరస కాశైత్యము ఓరక అంతర్దాహము మహాశ్వాసము హృదయము పగిలినట్టుండుట ఈలక్షణములుగలది మజ్జాగతజ్వరమని తెలియవలయును.

## జీర్ణజ్వర లక్షణము.

శ్లో॥ [మతాంతరే] త్రిసప్తాహేవ్యతీతేతు జ్వరోయస్తనుతాం గతః।ప్లీహాగ్నిసాదం కురుతే సజీర్ణః జ్వర ఉచ్యతే॥

తా. 21 దినము వరకుజ్వరము బలముగానుండి పిదప సూక్ష్మంబైప్లీహరోగమును అగ్నిమాంద్యమును కలుగజేయునది జీర్ణజ్వరమని తెలియవలయును.

## గంభీరజ్వర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] గంభీరస్తు జ్వరోజ్ఞేయో హ్యంతర్దాహే నతృష్ణయా।ఆనద్ధత్వేన దోషాణాం శ్వాసకాసోద్గమేనిచ॥

తా. అంతర్దాహము దప్పి కడుదోషవృద్ధి లేక మలబద్ధము శ్వాసము కాసము ఈ లక్షణములుగలది గంభీరజ్వరమని తెలియవలయును.

## తరుణాదిజ్వర ప్రమాణము.

శ్లో॥ [గ్రంథాంతరే] ఆసప్తరాత్రంతరుణంజ్వర మాహుశ్చికిత్సకాః।
మధ్యమం దశరాత్రంతు హ్యతఊర్ధ్వం పురాణకమ్

తా. జ్వరమునకు 7 దినములు తరుణవయస్సు 10 దినములు మధ్యమవయస్సు దానికిపైన వృద్ధాప్యము (అనగా పురాణము) అని తెలియవలయును.

శ్లో॥ [గ్రంథాంతరే] సప్తాహాదౌషధంకేచి దాహురన్యేదశాహతః।
ప్రాగర్పయతి సప్తాహో ద్విషవద్ధంతి మానవమ్ ॥

తా. జ్వరమున కౌషధము కొందరు 7 దినములకు పిదప మఱికొందరు 10 దినములకు పిదప నివ్వవలయునని వచించెదరు. 7 దినములలోపల జ్వరమున కౌషధం బిచ్చిన యది విషతుల్యంబై రోగినిజంపును.

## బాలురకు జనించు నీరుచవ్వాల లక్షణ చికిత్స.

వ॥ బాలురకు శరీరమువాచి చర్మముపొట్టువలె నూఁచుపులి నీరుగారుచురోమము లెట్టినై యుండిన నీరుచవ్వాలని తెలియవలయును. దీనికి చికిత్స; బాలురతల్లి పావుసేరు కరివేపచెక్క రసములో మిరియము చూర్ణమునూనె దీనినిగాని లేక నల్లవరిబియ్యపు వంటకములో నూనెనుగాని కలిపి పానముచేసి పిదప బాలురకు స్తన్యము నివ్వవలయును. స్తన్యము నిచ్చునపుడు బాలురకునుతాద్రాగిన యౌషధమును బోయవలయు నిటుల జేయుటయేగాక బాలురతల్లి చప్పిడి పథ్యమునాచరింపుచుండిన బాలురయొక్క నీరు చవ్వాలు వారించును.

## సూతికాజ్వర లక్షణము.

శ్లో॥ [మతాంతరే] అంగమర్దోజ్వరఃకంపో పిపాసాగురుగాత్రతా
శోక శ్శోషాతిశీతంచ సూతికాజ్వర లక్షణమ్ ॥

తా. శరీరమునందు నొప్పి జ్వరము కంపము దప్పి శరీరము బరువుగ నుండుట దుఃఖము శోథ అతిచలువ ఈ లక్షణములు గలది సూతికాజ్వరమని తెలియవలయును. దీనినే కొందరు సూతికావాతమని జెప్పెదరు. దీనికి వాతరోగప్రకరణము లో జెప్పియుండు వాతవిధ్వంసినీరసము నేని సంజీవనీరసము నేని బడబానలరసము నేని ప్రయోగించవలయును.

## స్వేద భేదములు.

శ్లో॥ జ్వరేముక్తే మలేముక్తే ప్రాణేముక్తే సమీరణే।
సన్నిపాతోద్భవశ్చైవ స్వేదోభవతి పంచమః॥

తా. జ్వరము విడుచు చెమట మలము విడుచు చెమట ప్రాణమువిడుచుచెమట వాతప్రకోపమువలని చెమట సన్నిపాతమువలని చెమట అనుస్వేదములు పంచవిధములు ఇక వాని లక్షణంబుల వచించెదను.

శ్లో॥ జ్వరముక్తేతు సర్వాంగే మలముక్తే లలాటకే।
ప్రాణముక్తేచ కంఠేచ సన్నిపాతే ముహుర్ముహుః।

తా. జ్వరము విడుచునపుడు సర్వాంగములయందు చెమట గలుగును. మలము విడుచునపుడు లలాటమునందు చెమటగలుగును. ప్రాణము విడుచునపుడు కంఠమునందు చెమట గలుగును. సన్నిపాతమునందు పలుమారు చెమట స్రవింపుచుండును.

## స్వేద చికిత్స.

శ్లో॥ స్వేదోద్గమే కుళుత్థానాం భ్రష్టానాం చూర్ణకం కథా।
భూనింబక్షారక స్తిక్తా వచాసార్ష పకంరిజః।
ఉద్ధూళనం త్రిదోషోత్థే స్వేదేభిష్యందజజ్వరే॥

తా. ఉలవలను వేయించి చూర్ణముచేసి అందు నేలవేము క్షారము కటుకరోహిణి వస ఆవాలు కలిపి శరీరమునకు లేపనముచేసిన త్రిదోషజనితస్వేదము అభిష్యందజ్వరజనిత స్వేదము హరించును.

శ్లో॥ హరీతకీంవాచణకం సంపిష్యోద్వర్తయేన్నరః।
పశ్చాదేవంప్రకుర్వంతి దేహస్వేదప్రశాంతయే॥

తా. కరక్కాయలచూర్ణము నేని లేక సెనగపప్పు చూర్ణము నేని శరీరమునకు లేపనము చేయించి పిదప పొడపత్రికషాయమును పానముచే యించిన స్వేదదోషము లు హరించును.

## జ్వరితుని మారకోపద్రవములు.

శ్లో॥ [నిత్యనాథీయే] రక్తపిత్తం తథాకాన హిక్కాహృచ్ఛూల శ్వాసకాః । మలరోధో౽తివిభ్రంశో జ్వరితానాముపద్రవాః।

తా. పై జెప్పిన సర్వజ్వరములలో దేనియందేనిరక్తముగ్రక్కుట దగ్గి ఉమ్మివేయునపుడు రక్తము వెంట తెమడ వెడలుట ఎక్కిళ్ళు రొమ్మునొప్పి శ్వాస మలమూత్రములు వెడలకుండుట అధికముగా భ్రమచే మాటలాడుట ఈ దుర్గుణములు గలిగి జ్వరము విడువక వేధింపుచుండిన మనుజుని జంపును.

శ్లో॥ శ్వాసమూర్ఛా రుచిశ్ఛర్ది తృష్ణాతిసార * విభ్రమాః । హిక్కాకాసోంగభేదశ్చ జ్వరేచోపద్రవాదశ॥

తా. పై జెప్పిన సర్వజ్వరములలో దేనియందేని శ్వాస మూర్ఛ అరుచి వాంతిదప్పి అతిసారము చిత్తభ్రమము ఎక్కిళ్ళు కాస ఒడలునొప్పి అను నీ పదియుపద్రవములు గలిగి జ్వరము విడువక వేధింపుచుండిన మనుజుని జంపును.

శ్లో॥ [ఆయుర్వేదే] కాసశ్శ్వాసశ్చ హిక్కాచ శిరోరోగ గళగ్రహా । ఛర్దిర్మూర్ఛాప్యతీసారో జ్వరితానా ముపద్రవాః॥

తా. పైచెప్పిన సర్వజ్వరములలో దేనియందేని కాస శ్వాసఎక్కిళ్ళు మహాశిరోరోగము నాలుకలోని కీడ్చుకొనుట వాంతులు మూర్ఛ అతిసారము అను నీ యుపద్రవములు గలిగి జ్వరము విడువక వేధింపుమండిన మనుజుని జంపును.

## జ్వరదశావస్థలు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] ప్రథమోహి హ్యపస్మారో ద్వితీయం ప్రేత భాషణమ్ । తృతీయ శ్చిత్తవిభ్రంశ శ్చతుర్థం శ్వాస మూర్ఛనమ్ । పంచమీచోర్ధ్వదృష్టిశ్చ ‡ షష్టిశ్చరతికామనా। సప్త

---

* విడ్గ్రహః. † షష్ఠంస్వరవిభేదనమ్. షష్ఠంత్వచలకాంగకమ్.

మ_స్త్వంగ దాహశ్చ వ_క్త్రిస్పర్శనమష్టమమ్ । నవమంస్విన్న
గాత్రత్వం దశమం మరణం భవేత్ ॥

తా. జ్వరమునకు పదియవస్థలు గలవు అందపస్మారము మొదటియవస్థ ప్రేత సంభాషణము రెండవయవస్థ చిత్తభ్రమ మూడవయవస్థ శ్వాసము మూర్ఛ నాలవ యవస్థ ఊర్ధ్వదృష్టి ఐదవయవస్థ రతికోరికె ఆరవయవస్థ శరీరములో విదాహము ఏడవయవస్థ నాలుకలోని కేగుట ఎనిమదవయవస్థ శరీరమునందు చెమట స్రవించుట తొమ్మిదవయవస్థ యటుల తొమ్మిదియవస్థలు గడచినపిదప పదియవది మరణావస్థ.

## జ్వరరోగ సాధ్యాసాధ్యో పద్రవములు.

శ్లో॥ [మాదవనిదానే] బలవాన్ స్వల్పదోషశ్చ జ్వరస్సాధ్యోనుప
ద్రవః । ఉపద్రవయుతోహంతి జ్వరోతీంద్రియనాశనః॥

తా. బలవంతుడుగా స్వల్పదోషయుక్తుడుగా శ్వాసాద్యుపద్రవరహితుడుగా నుండు జ్వరరోగి జీవించును. బలక్షయము నుపద్రవముల కభివృద్ధి యింద్రియనాశము యివి గల జ్వరరోగి మృతినొందును.

శ్లో॥ [రసరత్నాకరే] నిద్రాసౌఖ్యం భవేద్యస్య శరీరం సోద్య
మం భవేత్ । ఇంద్రియాణి ప్రసన్నాని బుద్ధిః ప్రకృతిమా
గతా । శరీరేయస్య నైర్మల్యం సరోగీనైవ నశ్యతి॥

తా. నిద్రాసౌఖ్యము శరీరోల్లాసము పంచేంద్రియములు తెలివిగ బుద్ధి నిర్వికారముగ శరీరము నిర్మలముగనుండుట యీ లక్షణములుగల జ్వరరోగి జీవించును.

## జ్వరదిన ప్రమాణము.

శ్లో॥ [నిత్యనాథీయే] వాతపిత్తకఫే స_ప్త దశ ద్వాదశవాసరాః ।
ప్రాయోనుయాంతి మర్యాద్యాం మోక్షాయచ వధాయచ।

తా. వాతజ్వరమునకు 7 దినములు పిత్తజ్వరమునకు 10 దినములు శ్లేష్మజ్వరమునకు 12 దినములు కాలప్రమాణము అట్లగుటచే యాజ్వరములువానివాని కాలక్రమముగా విడిచినను విడుచును. లేక చంపినను చంపును.

శ్లో॥ [అగ్నిమతే] ఇత్యగ్నివేశస్య మతం హారితస్యాపిచ స్మృతమ్ ।
ద్విగుణా స_ప్తమీయాతు నవమ్యేకాదశీ తథా॥

ఏషా త్రిదోషమర్యాదా మోక్షాయచ వధాయచ।
శుద్ధాశుద్ధజ్వరే కాలో దీర్ఘమప్యనువర్తతే॥

తా. వాతజ్వరమునకు 14 దినములు పిత్తజ్వరమునకు 18 దినములు శ్లేష్మజ్వరమునకు 22 దినములు కాలప్రమాణము అట్లగుటచే యా జ్వరములు వానివాని కాలక్రమముగా విడిచినను విడుచును. లేక జంపినను చంపును. శుద్ధాశుద్ధజ్వరములకు నిదియ కాలప్రమాణము. దీని నతిక్రమించి అనువర్తించియుండిన పురాణజ్వరమగును, యిట్టుల వేశుడు హారీతుడు వచించెను.

వచనము. వాతపిత్తశ్లేష్మజ్వరము లొకఝాములో వెలుపట వ్యాపించిన 7 లేక 9 దినములకు విడుచును. 2 వ ఝామున వెలపట వ్యాపించిన 11 లేక 13 దినములకు విడుచును. 3 వ ఝామునగాని 4 వ ఝామునగాని వెలపట వ్యాపించిన 15 లేక 21 వ దినమున విడుచును.

శ్లో॥ [చింతామణౌ]సప్తరాత్రంవాతికేస్యాత్షడ్రాత్రంచాపిపైత్తికే।
నవరాత్రం కఫేచైవ ద్వంద్వజే దశరాత్రకమ్।
జ్వరపాకో భవేదత్ర హ్యథయాప్య జ్వరంహరేత్ ॥

తా. వాతజ్వరము 7 దినములు పిత్తజ్వరము 6 దినములు శ్లేష్మజ్వరము 9 దినములు ద్వంద్వజ్వరము 10 దినములు వేధింపుచుండును. ఇవియు జ్వరదినప్రమాణములు. ఈదినప్రమాణములో జ్వరములు పాకము జెందిన హరించును. చెందకుండినయాప్యమగు (అనగా విడువక దీర్ఘకాలమువరకు అనువర్తించియుండును.

జ్వరపాక క్రమము.

శ్లో॥ లంఘనానంతరం జ్ఞాత్వా రోగముక్తం చికిత్సకః।
బహిరగ్ని ర్యథాపూర్వం గచ్ఛే త్కుర్యా త్తథా క్రియామ్।
ఔషధానాం ప్రభావంచ జ్ఞాత్వా దద్యా చికిత్సకః।
ధాతూత్పన్నాశ్చ యేదోషాన్యాశ్చోక్తాయయథాక్రమమ్।
అంతర్గతాశ్చ యేదోషా జ్వరరూపా బహిర్గతాః।

పునరామాశయగతా జ్వరకాకమవాప్యతే ।
తన్మధ్యేచాప్యపథ్యాని కురుతే జీర్ణముచ్యతే॥

తా. లంఘనానంతరము జ్వరవిమోచనము నెఱిగి యెవ్విధచికిత్సలచే బహిర్గతజ్వరము లోపల ప్రవేశించునో అవ్విధచికిత్సల వైద్యుడు జేయవలయును. అటుల చికిత్సించునెడ ఔషధముల ప్రభావము నెఱిగి ప్రయోగింపవలయును. ధాతుజనితదోషములను యితరదోషములను యథాక్రమంబుగా వచించినాడ. అంతర్గతదోషములు బహిర్గతంబులైనను జ్వరదూపంబు లగును. బహిర్గతదోషములు మరల ఆమాశయగతంబులైన జ్వరము పాకమును జెందును. జ్వరపాకమధ్యమున యపథ్యంబులు సేసిన అజీర్ణరోగము జనించును.

జ్వరితపథ్య లక్షణము.

శ్లో॥ [నిత్యనాధీయే] జ్వరితో జ్వరముక్తోవా సాయాహ్నే పథ్య మాచరేత్ । తత్తద్దోషక్షయంకుర్యా దాదౌ దోషప్రవర్ధనమ్ అన్నకాలేనభుంజానః క్షీయతేహస్యతేధవా॥

తా. జ్వరితుడేని లేక జ్వరవిముక్తుడేని సాయంకాలమునందు పథ్యము నాచరింపవలయును. వానిచే నాయాదోషములు క్షయించును. పూర్వాహ్ణమున పథ్యము నాచరించినను లేక గంజిత్రాగినను దోషములు వృద్ధిజెందును. పథ్యకాలమునందు పథ్యము సేయనివానికి శరీరకృశత్వం జేని గలుగును.

లంఘన క్రమము.

శ్లో॥ [చింతామణౌ] లంఘనంత్రివిధం ప్రోక్తం వాతపిత్తకఫేష్వధ। లంఘనంతూపవాసస్స్యా ల్లంఘనం భోజనం లఘు।
లంఘనం శుష్కపానీయం లంఘనం పరమౌషధమ్॥

తా. లంఘనము వాతపిత్తశ్లేష్మభేదంబులచే 3 విధంబులు. అందు వాతజ్వరపీడితుడు వుపవాసము సేయవలయును. పిత్తజ్వరపీడితుడు లఘువుగ భుజింపవలయును. శ్లేష్మజ్వరపీడితుడు పలచనిగంజిని త్రాగవలయును. ఇట్టి లంఘనమే పరమౌషధము.

పథ్య క్రమము.

శ్లో॥ [ ధాంతరే] ఔషధేన వినావ్యాధిఃపథ్యాభ్యాసేనజీర్యతే। నతుపథ్య విహీనస్య త్వౌషధానాం శతైరపి । పథ్యందేయం

యధాసాత్మ్య తస్మాత్పథ్యం సమాచరేత్ । నతుపథ్యవిహీనస్య భేషజానాం శతైరపి । శాకేషు తరుణం పథ్యం దధిపర్యుషితం హితమ్ । ధాన్యం వర్షాంతికం పథ్యం మాంసం సద్యోహితం నృణామ్ । అశీతేనాంభసాస్నానం పయఃపానం వయస్స్త్రియఃఏతద్ధి మానవం పథ్యంస్నిగ్ధముష్ణంచ భోజనమ్॥

తా. ఔషధసేవ చేయకుండినను పథ్యము నాచరింపుచుండిన కడుశీఘ్రముగా రోగము నివర్తించును. పథ్యమును వర్జించి 100 ఔషధంబుల సేవింపుచుండిన నురోగము శమింపదు. కాబట్టి పథ్యములలో ప్రకృత్యనుగుణమైన పథ్యముల నాచరింపవలయును. 100 ఔషధంబుల సేవించినను అవి పథ్యముతో సమానంబులుగావు. లేక కూరలు పులిసిన పెరుగు 1 సంవత్సరము నూగిన ధాన్యములు తత్కాలమున జంపిన జంతు మాంసము ఉష్ణోదకస్నానము క్షీరపానము వయస్స్త్రీసంభోగముసుకుమారమై యొకింత వేడిగనుండు యన్నముయివి మానవులకుపథ్యకరంబులు.

పథ్యోపయుక్త శాకనులు.

శ్లో॥ పటోలఫల వార్తాక కూశ్మాండం కారతల్లకమ్ ।
తండులీయక శాకంచ కాకమాచి జ్వరేహితమ్॥

తా. పొట్లకాయ లేక వంకాయ ముదురుగుమ్మడికాయ కాకరకాయ చిర్రికూర కొయ్యతోటకూర నల్లకాచికూర యివి జ్వరితులకు పథ్యకరంబులు.

శ్లో॥ [గ్రంథాంతరే] శాలయ షష్టికాశ్చైవ పటోలం జాంగలామిషమ్ । మత్స్యాక్షీ ముద్గయూషంచ తండులీయక వార్తకి। పక్వకూశ్మాండ కుటజ మపక్వం కదలీఫలమ్ । లఘు నవ్యంచ యద్ద్రవ్యం పురాణంచ హితం సదా॥

తా. 60 దినములకు ఫలించిన వడ్లు పొట్లకాయ *జాంగలమాంసము పొన్నగంటికూర పెసరకట్టు చిర్రికూర లేతవంకాయ ముదురుగుమ్మడికాయకొడిసెకాయ లేక అరటికాయ నవీనంబులై లఘువుగనుండు ద్రవ్యములు పురాణద్రవ్యములు యివి జ్వరితునికి యెల్లపుడు హితకరంబులు.

* మేకమాంసము.

## అపథ్యద్రవ్యాదులు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] షష్టికానిచ సర్వాణి శాకాని హారితానిచ ।
విదాహీ న్యుష్ణవీర్యాణి జ్వరితః పరివర్జయేత్ ।
దివాను ప్తంచ సతతం స్నానమభ్యంగ సంగమమ్ ।
వ్యాయామం రోషతాపంచ క్రోధంచాపి వివర్జయేత్॥

తా. 60 దినములలో ఫలించిన సర్వధాన్యములు పచ్చిఆకుకూరలువిదాహక రవస్తువులు వుష్ణవీర్యముగల వస్తువులు పగటినిద్ర స్నానము అభ్యంజనము స్త్రీసంభోగము సంచారము రోషము యెండ మొదలగువానియొక్క సేవ కోపము వీనిని జ్వరితుడు యెల్లపుడు వర్జింపవలయును.

## పురాణజ్వరములకు మాలిని వసంతరసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] రసకయుగళభాగం వేల్లజంచైకభాగమ్ద్వితయమపిచ ఖల్వేమర్ద యేచ్ఛ్లక్ష్ణకేన । భవతిజ్వరవిముక్తో నింబనీరేణతావత్ జ్వరహరమథకుర్యా న్మాలిని ప్రాగ్వసంతమ్।
జీర్ణజ్వరే ధాతుగతేతి సారే రక్తాన్వితేరక్త గవిట్స్వరూపే।
జ్వరేస్థిగేమాంసగతేపురాణే వల్లద్వయం దుగ్ధమతీవపథ్యమ్॥

తా. శుద్ధిజేసిన కఫరి 2 భాగములు మిరియాలు 1 భాగము యిటుల వీనిని ఖల్వములోవైచి వేపచెక్కరసముతో 3 దినములు బాగుగా మర్దించి 6 గురిగి జలయెత్తు మాత్రలుజేసి జీలకఱ్ఱ పిప్పళ్లు వీని అనుపానయుక్తముగా సేవించినజీర్ణజ్వరము ధాతుగతజ్వరము జ్వరాతిసారము రక్తయుక్తజ్వరాతిసారమురక్తయుక్తమలాతిసార జ్వరములు అస్థిగత మాంసగతజ్వరములు పురాణజ్వరములు హరించును. ఇది మాలినీ వసంతరస మనబడును.

## పురాణ జ్వరములకు రసకల్పము.

శ్లో॥ [గ్రంథాంతరే] కఫరీం మర్దయేత్క్షీరై శ్చతురశీతియామకమ్।
అనంతరం దివారాత్రం మర్దనేనామృతంభవేత్ ।
మాషమాత్రం సానుపానం జ్వరంహంతి దినార్ధతః॥

తా. శుద్ధిజేసిన కఫరిని ఖల్వములో నునిచి 48 ఝాములు ఆవుపాలితో చేయుంబగలు ఎడతెగకమర్దించిన అమృతతుల్యంబగును, పిదప దానిని 7 గురిగిం జలంతేసి మాత్రలుజేసి తేనె పిప్పలి వీని అనుపానయుక్తముగా సేవించిన పురాణ జ్వరములు అర్ధదినములో నశించును.

శ్లో॥ [మతాంతరే] కఫరీం శోధితాం కృత్వా మర్దయేచ్చ రసామృతైః । పంచాశదష్టౌ యామాన్వా ఏకమార్గంతు మర్దయేత్ । అమపానవిశేషేణ యామేన జ్వరనాశనమ్॥

తా. శుద్ధిచేసిన కఫరిని ఖల్వములోనునిచి ఆవునేతితో 58 జాములు ఎడతెగక మర్దించి 4 గురిగింజలంతేసిమాత్రలుచేసి పిప్పళ్లు లవంగములు వీని అనుపానములో సేవించిన పురాణజ్వరములు 1 ఝాములో హరించును.

శ్లో॥ [మతాంతరే] అర్కమూలరసేనైవ కఫరీం సమవేల్లజమ్।
మర్దయేద శీతియామం మాషమాత్రం వటీకృతమ్ ।
గోమూత్రేణ తథాదద్యా ద్యన్వరోగ ప్రశాంతయే॥

తా. శుద్ధిజేసిన కఫరి మిరియాలు వీనిని సమభాగములుగా ఖల్వములోనునిచి జిల్లేడు వేళ్ళరసము గోమూత్రము వీనిచే 80 ఝాములు బాగుగామర్దించి 7 గురిగింజలంతేసి మాత్రలుజేసి లవంగములు పిప్పళ్లు తేనె వీని అనుపానయుక్తముగా సేవించిన పురాణజ్వరములు హరించును.

శ్లో॥ కఫరీం శోధితాం కృత్వా సమగంధక మిశ్రితమ్ ।
అజాక్షీరేణ సంమర్ద్య హ్యష్టాశీతిక యామకమ్ ।
గవాంక్షీరేణదాతవ్యం జ్వరమాంద్యాది రోగకమ్ ।
శమయే ద్ఘటికానర్ధే దేవానాం మమృతం యథా॥

తా. శుద్ధిజేసిన కఫరిశుద్ధిజేసిన ఆమ్లసారగంధకము వీనిని సమభాగములుగా ఖల్వములోనునిచి 88 ఝాములు మేకపాలచేతను 88 ఝాములు ఆవు పాలచేతను బాగుగామర్దించిన దేవతల యమృతముతో తుల్యంబగును; పిదప దానిని 4 గురిగింజలయెత్తు మాత్రలుజేసి జీలకఱ్ఱ పిప్పళ్లు తేనె వీనియనుపానముతో సేవించిన పురాణజ్వరములు అగ్నిమాంద్యము మొదలగునవి అరఘడియలో హరించును.

శ్లో॥ కఫరీం ఘృతసంయుక్తాం నింబనీరేణ మర్దయేత్ ।
త్రింశత్త్రీణి దివాన్యస్య ప్రమాణ మమృతోపమమ్ ।
గుంజామాత్రం ప్రదాతవ్యం శతాయుర్వజ్ర దేహకృత్॥

తా. శుద్ధిజేసిన కఫరిని ఆవునేతిచేతను వేపచెక్క రసముచేతను ముప్పది మూడుదినములు బాగుగా మర్దించిన అమృత తుల్యంబగును। పిదప దానిని గురిగింజంతేసి మాత్రలుజేసి జీలకఱ్ఱ పిప్పల్లు పంచదార వీని। యనుపానయుక్తముగా సేవించినజ్వరము నివర్తించుటయేగాక 100 సంవత్సరంబులాయువు వజ్రదేహముగలవారై యుందురు.

శ్లో॥ కఫరీం మధుసంయుక్తాం గోక్షీరేణచ మర్దయేత్ ।
అహోరాత్రం మండలంతు దినమేకంతు శోషయేత్ ।
మాషయాత్రం సానుపానం సోమరోగం హరేజ్జ్వరమ్॥

తా. శుద్ధిజేసిన కఫరి తేనె ఆవుపాలు వీనిచే నలువదిదినములు రేలుంబగళ్లు ఎడతెగక మర్దించి 1 దినము యెండించి 7 గురిగింజలంతేసి మాత్రలుచేసి తేనె పిప్పలితో సేవించిన సోమరోగము జ్వరము ఇవి హరింపును.

శ్లో॥ కఫరీం శిఖితోయేన చతురశీతి యామకమ్ ।
అహోరాత్రంచ సంమర్ద్య భుంజీత మధుమిశ్రితమ్ ।
రోగావసాన కాలేతు మాషమాత్రం ప్రదాపయేత్ ।
యథోక్తం భోజనంకృత్వా దృఢకాయో భవిష్యతి॥

తా. శుద్ధిజేసిన కఫరిని ఖల్వములోనునిచి మయూరశిఖి కషాయముచే 84 ఝాములు రేలుంబగళ్లు ఎడతెగక మర్దించి 7 గురిగింజలంతేసి మాత్రలుజేసియుంచుకొని దానిని తేనెతో నాకంగి జ్వరము విడుచునపుడు యథోక్తముగా భుజింపజేసిన జ్వరములు హరించుటయేగాక శరీరదార్ఢ్యముకూడా గలుగును.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] శతవత్సర పర్యంతం వజ్రదేహో భవిష్యతి ।
రసంరక్తం త్వచంమాంసం మజ్జామస్థిగతం హరేత్॥

తా. పైజెప్పిన కఫరియోగములను సేవించిన పురాణజ్వరములు రసము రక్తము మాంసము చర్మము మజ్జ అస్థి వీని నాశ్రయించియుండు జ్వరములు హరించుటయేగాక 400 సంవత్సరములవరకు వజ్రతుల్య దేహముగలవారై జీవించెదరని

సిద్ధరసార్ణవమునందు శంకరుడు వచియించె; కావున పైజెప్పిన కఫరియోగములను 4 మాసములు సేవింపవలయును.

కఫరిశుద్ధి.

శ్లో॥ కఫరీ పలమాత్రంతు చూర్ణంకృత్వా విమర్దయేత్ ।
నరమూత్రే సప్తయామాన్ డోలాయంత్రే పచేత్తతః ।
గోమూత్రేణ ద్వియామంచ పాచయే చ్ఛుద్ధిమాప్నుయాత్ ।
అథవా ఘృతసంమిశ్రం పాచయే త్కపరీశుచిః॥

తా. పలప్రమాణము కఫరిని చూర్ణముజేసి ప్రాతబట్టన మూటగట్టి 7 ఝా ములు నరమూత్రముచేత 2 ఝాములు గోమూత్రముచేత డోలా యంత్రములో వం.డి నను లేక ఆవునేతిలోవైచి ఏడుపొంగులు వచ్చువరకు వండినను శుద్ధియగును. ఇటుల శుద్ధిచేయబడిన కఫరిని పైజెప్పినయోగములయందును సర్వౌషధములయందునుప యోగింపందగును.

జ్వర మురారి.

శ్లో॥ [ఆయుర్వేదే] త్రిసప్తజంబీరజ భావితఖర్పరస్య చూర్ణంవిమ ర్ద్యనవనీత సమానచూర్ణమ్ । వల్లద్వయం హారతి శర్కర యానుపానం సద్యోజ్వరం జ్వగమురారి సమాఖ్యమేతత్॥

తా. శుద్ధిజేసిన కఫరిని ఖల్వములోనునిచి 21 పర్యాయము నిమ్మపండ్లరసము చే భావనజేసి పిదప దానిని వెన్నలో సమానముగనూరి చూర్ణముజేసి యందు 6 గురి గింజల ప్రమాణము శక్కరానుపానముచేగాని తేనె పిప్పలి వీని యనుపానముచే గాని సేవించిన జ్వరములు హరించును. ఇది జ్వరమురారి యనబడును.

శ్లో॥ [బాహటే] హింగుళంచవిషంవ్యోషంటంకణం నాగరాభయా।
జయపాల సమాయుక్తం సద్యోజ్వర నివారణమ్॥

తా. శుద్ధిచేసిన ఇంగిలీకము శుద్ధిజేసిననాభి త్రికటుకమును వెలిగారము శొం ఠి కరక్కాయ వీనిని చూర్ణముచేసి దీనికి సమముగా శుద్ధిచేసిన నేపాళచూర్ణమును కలిపి నూరి కలాయప్రమాణము మాత్రలుచేసి అల్లపురసముతో నిప్పించిన తత్క్ష ణముననే జ్వరము నివర్తించును. (ఇది మఱియొక విషయమైన జ్వరమురారి.)

## సర్వజ్వరాది హరగుటికలు.

శ్లో॥ [నిత్యనాథీయే] జాతీఫలంత్రికటుకం త్రిఫలం త్రిజాతంఖర్జూరద్రాక్షాగరువాలుక చందనాని । తక్కోలధాన్య మధుజీరక మశ్వగంధా చూర్ణం సమంసమసితంగుళికాం ప్రకుర్యాత్ । భుక్తైః కరోతిసకల జ్వరపైత్యనాశం శ్వాసంక్షయం హరతి పాండుప్రమేహరోగాన్ । జీర్ణజ్వరంసతత సంతతకం ప్రణాశం రోగాన్నిహంతికథితం వరపూజ్యపాదైః॥

తా. జాజికాయ * త్రికటుకములు † త్రిఫలములు ‡ త్రిజాతము ఖర్జూరపుకాయ ద్రాక్ష అగరు కూతురుబుడమ చందనము తక్కోలములు దనియాలు అతిమధురము జీలకఱ్ఱ పెన్నేరుగడ్డ వీనిని సమభాగములుగా చూర్ణముజేసి దానిని సమముగా శర్కరను పోసుబట్టి యందామూర్ణమునుకలిపి ఘుటికలుజేసి యందొకదానిని భక్షించిన సర్వజ్వరములు పైత్యరోగములు శ్వాస క్షయము పాండువు ప్రమేహము జీర్ణజ్వరము సతతజ్వరము సంతతజ్వరము ఈరోగములు హరించునని శ్రేష్ఠుడగు పూజ్య పాదమహర్షి వచించెను.

## జ్వరవైరి వటుకములు.

శ్లో॥ [ఆయుర్వేదే] రసోగంధకనాభీచ బీజమున్మత్తసంభవమ్।
ద్వేద్వే పలానిచైతాని హ్యేకం శుంఠీచ పిప్పలీ ।
ఏతాని పంచమరిచం మర్దయే ద్గుడవారిణా ।
గుంజామాత్రం ప్రకుర్వీత గుడేనైవ ప్రయుజ్యతే ।
ఉష్ణోదకానుపానేవ భేషజం జ్ఞానపారగైః॥
జ్వరవైరీతి విఖ్యాతం సర్వజ్వర వినాశనమ్॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన వసనాభి శుద్ధిజేసిన ఉమ్మెత్తవిత్తులు ఇవి దినుసు యొకటింటికి రెండేసిపలములు శొంఠి పిప్పళ్లు ఇవి దినుసు యొకటింటికి ఒక్కొకపలము మిరియాలు ఐదు పలములు ఇటుల వీని నెల్ల

---

* త్రికటుకమనగా; శొంఠి పిప్పలి మిరియాలు.

† త్రిఫలములనగా: కరక్కాయ తానికాయ ఉసిరికెవరుగు.

‡ త్రిజాతములనగా; ఏలకులు ఆకుపత్రి లవంగపుచెక్క.

ఖల్వములోనునిచి బెల్లపురసముచే బాగుగామర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొక దానిని బెల్లముతో నొసంగి పిదప బుద్ధిమంతుడగు వైద్యుడు ఉష్ణోదకము ను పానముచేయించిన విడువక వేధింపుచుండు యెట్టిజ్వరములైనను నలువది దినము లలో హరించును. ఇవి జ్వరవైరి వటుకములనబడును. ఇవి సర్వజ్వరములను హరిం పచేయుటయందు కడు ప్రసిద్ధిజెందినవి.

## జ్వరగజ కేసరి.

శ్లో॥ [చరకే] జలదదరదయుక్తంశుద్ధసూతంసుగంధం ప్రహరమధు
సుపిష్టం వల్లయుగ్మంచదద్యాత్ । జ్వరగజహరిసంజ్ఞం శృంగి
బేరోదకేన ప్రథమజ్వరితదాహే క్షీరభక్తంచ భోజ్యమ్॥

తా. తుంగముస్తెలు శుద్ధిజేసిన ఇంగిలీకము శుద్ధిచేసినరసము శుద్ధిజేసిన గంధ కము వీటిని సమభాగములుగా ఖల్వములోనునిచి తేనెతో నొకఝాము బాగుగా మర్దించి 6 గురిగింజలంతేసి మాత్రలుచేసి యందొకదాని తొలుత జ్వరమువచ్చినపు డు అల్లపురసానుపానముతో సేవించి అన్నమును క్షీరమిశ్రమముగా భుజించిన సమ స్తజ్వరములు హరించును.

## జ్వరములకు పంచాననరసము.

శ్లో॥ [మాధవనిదానే] రసంగంధం వత్సనాభం టంకణంమాగధీ
సమమ్ । ధుత్తూరమూలజద్రావైర్మర్దితం యామయుగ్మకమ్ ।
గుంజాప్రమాణవటుకాన్యనుపానవిశేషతః । ఖాదేత్సర్వజ్వరం
హంతిసన్నిపాతాంస్త్రయోదశ । తత్క్షణేనవినశ్యంతి విషమం
దోషనాశనమ్ । పంచాననరసోనామ శంభునా పరికల్పితః॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిననాభి వెలిగారము పిప్పళ్లు వీనిని సమభాగములుగా గ్రహించి ఉమ్మెత్తవేళ్ళరసముచే 2 ఝాములు మర్దించి గుంజాప్రమాణము మాత్రలుచేసి అనుపానవిశేషములతో నిస్సించిన సర్వ జ్వరములు 13 సన్నిపాతములు [illegible] ణము నశించుటయేగాక విషమదోషములు కూ డా మానును. ఇది శివునిచే నిర్మించబడిన పంచాననరసము

## జ్వర గజాంకుశము.

శ్లో॥ [మాధవనిదానే] రసామ్లసారగంధంచనేపాళం బీజటంకణమ్।

ఖజ్జలీనాంచ సంమర్ద్య్యాం ముద్గమాత్ర ప్రమాణకమ్॥
చణమాత్రంచ వానితం నాగవల్లీ దళాన్వితమ్ ।
దేయం సర్వజ్వరంహంతి సంతతం తరుణజ్వరమ్॥
పథ్యంచైవ ప్రదాతవ్యం దధిక్షీరేణ శర్కరా ।
పూజ్యపాద మిదంప్రోక్తం సర్వజ్వర గజాంకుశమ్॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన ఆమ్లసారగంధకము శుద్ధిజేసిన నేపాళములు వెలిగారము వీనిని ఖల్వములోనునిచి కజ్జలివలెమర్దించి పెసరగింజలంత లేక సెనగగింజలంత మాత్రముజేసి తమలపాకులో నునిచి యిప్పించిన సర్వజ్వరములు సంతతజ్వరములు తరుణజ్వరములు యివి నశించును. పెరుగు పాలు శర్కర వీనిని పథ్యమునందుపయోగింపవలెను. ఇది పూజ్యపాదునిచే జెప్పబడిన సర్వజ్వరగజాంకుశము

## సర్వజ్వరములకు నారసింహ రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] నేపాళగంధామృత పారదానాం సచూర్ణకానాం సమభాగయుక్తమ్ । జ్వరాంతకశ్శర్కరయా సమేతః రసోనృసింహేత్యమృత ప్రసిద్ధః॥

తా. శుద్ధిచేసిన నేపాళములు శుద్ధిచేసినగంధకము శుద్ధనాభి శుద్ధిచేసిన పాదరసమువీనిని సమభాగములుగా చూర్ణముచేసి పంచదారతోడ నిప్పించిన సర్వజ్వరములు నశించును. ఇది నారసింహరసము అమృతమువలె ప్రసిద్ధమైనది.

## జ్వరములకు చండభాను రసము.

శ్లో॥ [నిత్యనాథీయే] సూతంత్రైగుణ్యాగంధం పరిమితమమృతం తీక్ష్ణకం భానునేత్రమ్ । హరితాళం తచ్చతుష్కం గగనమథ యుగం మారిచంసర్వతుల్యం । ఏతందద్యాన్నిహంతిజ్వరవన దహనస్తామసాహేఃఖగేంద్రః । కాసశ్వాసాపహంతాక్షయ తరుదహనః పాండురోగాపహంతా । వాతవ్యాధిభసింహో హ్యుదరజలనిధే శ్లేష్మకోబాడబాగ్నిః । నష్టాగ్నేర్దీపకస్స్యాజ్జఠర మలమహాక్లేశహృద్రోగహారీ । మూలవ్యాధ్యంధకార ప్రశమన తపనః కుష్ఠరోగాపహంతా । నామ్నాయం చండ భానుస్సకలగదహరో భాషితం పూజ్యపాదైః॥

**తా.** శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన వసనాభి లోహభస్మము తామ్రభస్మము ఇవి దినుసు యొకటింటికి 3 భాగములు శుద్ధిజేసినతాళకము 3 భాగములు అభ్రకభస్మము 2 భాగములు మిరియాలు 19 భాగములు షటుల వీనినెల్ల గ్రహించి చిత్రమూలరసముచే నొకదినము బాగుగామర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి నీడ నెండించవలయును. జ్వరమను వనమునకు కార్చిచ్చైసన్నిపాతములను సర్పములకు గరుత్మంతుడై కాసశ్వాసల బోకడుచునదియై క్షయమను వృక్షమునకు అగ్నియై పాండురోగముల జంపునదియై ।వాతవ్యాధులను ఏనుగులకు సింహంబై ఉదరరోగమను సముద్రమునుశోషింపజేసెడి బడబాగ్నియైనష్టమైనజాఠరాగ్నిని జ్వలింపజేయునదియై జఠరాశ్రిత మలమువలన జనించిన కడుక్లేశమును బొమ్మనొప్పిని అపహరించునదియై మూలవ్యాధియనునంధకారమును బోకడచుటయందు సూర్యునితో సమానంబై కుష్ఠురోగమును జంపునదియై చండభానువను పేరంబరగునీ రసము సకలరోగముల హరింపజేయునని పూజ్యపాదమహర్షి వచించెను. (దీనిని అల్లపురసముతో నొసంగిన జ్వరములు సన్నిపాతములు త్రికటుకములతో నొసంగిన కాసశ్వాసములు తేనె పిప్పలి వీనితో నొసంగిన క్షయరోగము జీలకఱ్ఱతో నొసంగిన పాండురోగములు వెల్లుల్లిరసముతో నొసంగిన వాతవ్యాధులు బెల్లము కరక్కాయ వీనితో నొసంగిన ఉదరరోగములు పిప్పళ్ళు ఉష్ణోదకము వీనితో నొసంగిన అగ్నిమాంద్యము నేలదంతిరసముతో నొసంగిన మలబద్ధకము తేనెతో నొసంగిన బొమ్మనొప్పి త్రిఫలకషాయముతో నొసంగిన మూలవ్యాధులు తేనె పంచదార వీనితో నొసంగిన కుష్ఠురోగములు వీనిని హరింపజేయును.

## జ్వరనాశన రసము.

శ్లో॥ [మాధవనిదానే] పారదంనిష్కమాత్రంస్యా ద్గంధకంచద్వినిష్కకమ్ । నిష్కంచటంకణక్షారం నిష్కం నైతాళకంతథా । ఏతేషాంసమభాగాని దంతి బీజానిమర్దయేత్ । నాగవల్లీదళైస్సైత ద్గుంజామాత్రం ప్రదాపయేత్ । పథ్యంక్షీరోదనందద్యాద్రసోయంజ్వరనాశనః॥

**తా.** శుద్ధిజేసిన పాదరసము † 1 నిష్కప్రమాణము శుద్ధిజేసిన గంధకము 2 నిష్కములు శుద్ధిజేసిన వెలిగారము 1 నిష్కప్రమాణము శుద్ధిజేసిన తాళకము

† నిష్కమనగా:—28 లేక 32, గురిగింజలయెత్తు.

నిష్క ప్రమాణము శుద్ధిజేసిన నేపాళచూర్ణము 5 నిష్కములప్రమాణము ఇటు వీనినెల్లఖల్వములోవైచి అల్లపురసముచే మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి య డొకదానిని తమలపాకులోనులిచి సేవించిన సర్వజ్వరములు హరించును. దీనియందు పాలతో అన్నము భుజించుట పథ్యము. ఇది జ్వరనాశన రసమనంబడును.

## తరుణజ్వరారి రసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] జైపాలగంధం విషపారదంతు తుల్యంకుమా
రీ స్వరసేనమర్ద్యమ్ । అస్యద్విగుంజా హి సితోదకేన ఖ్యా
తోరసోయంతరుణజ్వరారిః॥ దాతవ్యఏషోహాని పంచమేవా
షష్ఠేథవాసప్తమ ఏవవాపి । జాతేవిరేకే విగతజ్వరఃస్యా
త్పటోలముద్గాన్ననిషేవణేన॥

తా. శుద్ధిచేసిన నేపాళము శుద్ధిజేసిన గంధకము శుద్ధనాభి శుద్ధ పాదరసము వీనిని సమభాగములుగా గ్రహించి కలుబందరసముచే మర్దించి 2 గురిగింజల ప్రమాణమును శర్కరోదకముతో నిప్పించవలయును. ఇది తరుణజ్వరారి రసమనబడును. దీనిని జ్వరము కనుపించిన 5 లేక 6 లేక 7 యీదినములయందు నిప్పించవలయును. ఒకసారి విరేచనమైన పిదప పొట్లకాయ పెసరయన్నము వీనిని పథ్యమిప్పించిన జ్వరమునివర్తించును.

## నవజ్వరేభ సింహరసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం తథాగంధ లోహం తామ్రం
ససీసకమ్।మరీచంపిప్పలీ విశ్వం సమభాగాని కారయేత్ ।
అర్ధభాగంవిషం దత్వామర్దయేద్యాసరద్వయమ్ । శృంగిబే
రాంబు పానేన దద్యాద్గుంజాద్వయం భిషక్ । నవజ్వరే మ
హాఘోరేధాతుస్థే గ్రహణీగదే । నవజ్వరేభ సింహోయం
సర్వజ్వరకులాంతకృత్॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధగంధకము లోహభస్మము తామ్రభస్మము సీస భస్మము మిరియాలు పిప్పళ్ళు శొంఠి వీటిని సమభాగములుగా గ్రహించి వీనికి అర్ధ భాగము శుద్ధనాభినిచేర్చి 2 దినములు మర్దించి దారుణమైన నవజ్వరములు ధాతుగత

జ్వరము గ్రహణీరోగము వీనియందు 2 గురింగిజల ప్రమాణమును అల్లపురసానుపాన ముతో నిప్పించిన సమస్తజ్వరకులమును. నశింపజేయును. ఇది నవజ్వరేభసింహరసము

## నవజ్వరములకు త్రిపురభైరవరసము.

శ్లో॥ [ఆయుర్వేదే] విషటంకబలిమ్లేచ్ఛ దంతీబీజం క్రమాద్బహు।
దంత్యంబు మర్దితం యామం రసస్త్రిపురభైరవః । వల్లంవ్యో
షేణ చార్ద్రస్య రసేన సితయాథవా । దత్తోనవ జ్వరంహం
తి మాంద్యామానిలశోఫహా । హంతిశూలం సవిష్టంభ మ
ర్శాంసి క్రిమిజాన్ గదాన్ । పథ్యం తక్రేణ భోక్తవ్యం రసే
స్మిన్ రోగహారిణి॥

తా. శుద్ధిచేసిన నాభి వెలిగారము శుద్ధగంధకము తామ్రభస్మము నేపాళ ములు వీటిని క్రమముగా గ్రహించి దంతివేళ్లరసముతో 1 ఝాము మర్దించవలయును ఇది త్రిపురభైరవ రసమనబడును. దీనిని వల్లప్రమాణము త్రికటుకములతోగానిలేక అల్లపురసముతో గాని లేక పంచదారతో గాని నిప్పించిననవజ్వరములుఅగ్నిమాం ద్యము ఆమము వాతము శోఫశూల మలబంధము అర్శస్సుక్రిమిరోగముపీటిని హరింప జేయును. రోగహారమైన యీ రసమునం మజ్జిగయన్నమును భుజించవలయును.

## జ్వరములకు వైష్ణవీరసము.

శ్లో॥ [గ్రంథాంతరే] హింగుళం వత్సనాభంచ చక్రాంగీ కటుక
త్రయన్ । చిత్రమూలకషాయేణ సమభాగం విమర్దయేత్ ।
డోలాయంత్రే యామమాత్రం పచే న్నిష్పాదితోభవేత్ ।
ఆర్ద్రికస్యానుపానేన మాషమాత్రం జ్వరాపహః । ద్వంద్వ
జ్వరం సన్నిపాతం పురాణం విషమజ్వరమ్ । నాశయే దక్షి
లాన్ ఘోరా న్నామ్నాయం వైష్ణవీరసః॥

తా. శుద్ధిజేసిన ఇంగిలీకముశుద్ధిచేసినవసనాభి కటుకరోహిణి శొంఠి పిప్పళ్లు మిరియాలు వీనిని సమభాగములుగా గ్రహించి ఖల్వములోనునిచి చిత్రమూలకషాయ ముచే మర్దించి పిదప డోలాయంత్రమున నునిచి ఒక జాముఉండి 7 గురిగింజలంతే మాత్రలుజేసి యందొకదానిని అల్లపురసానుపానముతో సేవించిన జ్వరములుద్వంద

జ్వరములు సన్నిపాతములు పురాణజ్వరములు విషమజ్వరములు హరించుటయేగాక భయంకరములుగనుండు సమస్తరోగములుకూడా నివర్తించును. ఇదియే వైష్ణవీరసమనబడును.

## సర్వజ్వరములకు శీతభంజీరసము.

శ్లో॥ [సింధూరమణిదర్పణే] రసహింగుళగంధంచ నేపాళంమర్దితం త్రిభి। దంతీ క్వాథేన సంమర్ద్యరసోజ్వరహరఃపరః। ఆర్ద్రిక స్వరసేనాథ దాపయే ద్రక్తికాద్వయమ్। నవజ్వరం మహాఘోరంనాశయే ద్యామమాత్రతః। శీతతోయం పిబేచ్చాను ఇక్షుముద్గరసోహితః। శీతభంజీ రసోనామ్నా సర్వజ్వరకులాంతకృత్॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధలింగదకము గంధకము నేపాళములు వీటిని చంతివేళ్ళ కషాయముచే 3 దినములు మర్దించి అల్లపు స్వరసముతో 2 గురిగింజల ప్రమాణమును కలిపియిప్పించి శీతోదకము చెఱుకురసము పెసరకట్టు వీటిని వెంబడిగాపానముచేయించిన ఒక జాములోపల మిగుల దారుణమైన నవజ్వరములు నశించును. ఇది శీతభంజీరసమనబడును. సమస్తజ్వరకులమును నశింపజేయును.

## ముహూర్తములో జ్వరమును హరించెడి శీతభంజీరసము.

శ్లో॥ [రసరత్నాకరే] పారదంరసకంతాళంతుత్థంటంకణగంధకమ్। సర్వమేతత్సమం శుద్ధం కారవేల్ల్యా రసైర్దినమ్। మర్దయేత్తేనకల్కేనతామ్రపాత్రోదరంలిపేత్। అంగుళ్యార్ధ మానేన తంపచేత్సికతాహ్వయే। యంత్రేయావత్స్ఫుటంత్యేవ వ్రీహయస్తస్యపృష్ఠతః। తామ్రపాత్రంసముద్ధృత్యమార్జ యేన్మరిచైస్సమమ్। శీతభంజీరసోనామ ద్విగుంజం వాతికేజ్వరే। దాతవ్యంపర్ణఖండేన ముహూర్తాన్నాశయే జ్వరమ్॥

తా. శుద్ధిచేసినరసము రసకము తాళకము మైలుతుత్తము వెలిగారముగంధకము వీటిని సమభాగములుగా గ్రహించి కాకరరసముచే నొకదినము మర్దించి రాగిపాత్రలో అరయంగుళ ప్రమాణము దళముగాపూసి * సికతాయంత్రములోనునిచి యంత్రముయొక్క వెనుక ప్రక్కయందు వడ్లనువేశి దఫముగా ప్రేలునంతవరకు

* సికతాయంత్రమనగా; వాలుకాయంత్రము.

పాకముచేసి పిదప ఆతామ్రపాత్రనుతీసి మిరియాలను సమముగాచేర్చి చూర్ణముచేయవలయును ఇది శీతభంజీరసమనబడును. దీనిలో 2 గురిగింజలప్రమాణమును వాతజ్వరమునందు తమలపాకులో నిప్పించిన ఒకముహూర్తకాలములో జ్వరమునశించును. 6 తులముల ప్రమాణముగల శుద్ధ తామ్రముచేనొక తామ్రఖల్వమును చేయించిదానిలో రసాది ద్రవ్యకల్కమును ఒకతుల ప్రమాణము ప్రత్యేకముగా లేపనముచేసిమఱియొక తామ్రపాత్రచేమూసి ఇసుకబోసి పొయిమీదనునిచి అగ్నిజ్వలింపచేసి ఆ యిసుకలో వడ్లనువేసి ప్రేలువరకు పక్వముచేసిన ఆరసము సిద్ధమగును. పిదప దానిలో 6 తులములు మిరియములనుచేర్చి చూర్ణముచేసి 2 గురిగింజలయెత్తును తమలపాకులోనునిచి ఇప్పించవలయునని ఉపదేశము చేయబడినది.

## జ్వరమునకు స్వచ్ఛందభైరవము.

శ్లో॥ [భేషజకల్పే] సమభాగంచసంగ్రాహ్యం పారదామృతగంధకమ్ । జాతీఫలంచభాగార్ధందత్వా కుర్యాచ్చకజ్జలీమ్ । సర్వార్ధమాగధీ చూర్ణం కల్పయిత్వా నిధాపయేత్ । గుంజాద్వయంత్రయంవాపి నాగవల్లీరసేనచ । ఆర్ద్రికస్వరసేనాపిద్రోణపుష్పరసేనవా । శీతజ్వరే సన్నిపాతే విషూచ్యాం విషమజ్వరే।పీనసేచ ప్రతిశ్యాయే జ్వరే జీర్ణేతథైవచ । మందాగ్నావమనేచైవ శిరోరోగేచ దారుణే । ప్రయోజ్య భిషజా సమ్యగ్రసస్స్వచ్ఛందభైరవః । పథ్యం దధ్యోదనం దద్యా ద్వీక్ష్య దోషబలాబలమ్॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిననాభి శుద్ధిచేసినగంధకము ఇవి సమభాగములు జాజికాయ పాదరసమున కర్ధభాగము ఇటులవీనిని ఖల్వమున కజ్జలిగామర్దించి పిదప పైజెప్పిన ద్రవ్యములకన్నిటికి ½ భాగము పిప్పలి చూర్ణముకలిపి తమలపాకురసముచే బాగుగామర్దించి 2 లేక 3 గురిగింజలయెత్తు మాత్రలుచేసి యందొకదానిని తమలపాకుతోగాని అల్లపురసముతోగాని తుమ్మిపూలరసముతోగాని యొసంగినశీతజ్వరములు సన్నిపాతములు విషూచులు విషమజ్వరములు పీనసము పడిశము జీర్ణజ్వరం వమనము శిరోరోగము అగ్నిమాంద్యము దారుణరోగము హరించును. ఇదిస్వచ్ఛందభైరవమనబడును. దీనిని వైద్యుడుబాగుగా నెఱిగి ప్రయోగింపవలయును. దీనికిదుంను రోగబలాబలము నెఱింగి పెరుగన్నము నొసంగుట పథ్యము.

త్రిదోషజ్వరములకు జ్వరాంకుశము.

శ్లో॥ [మాధవనిదానే] రసస్య ద్విగుణం గంధం గంధతుల్యంతు టంకణమ్ । రసతుల్యం విషంయోజ్యం మరిచంపంచధావిషాత్ । కట్ఫలం దంతిబీజంచప్రత్యేకంమరిచోన్మితమ్ । జ్వరాంకుశో రసోహ్యేష చూర్ణయే దతిచిక్కణమ్ । మాషైకేన నిహంత్యాశు జ్వరం జీర్ణ త్రిదోషజమ్॥

తా. శుద్ధిచేసినరసము దీనికి రెండింతలు గంధకము దీనికి సమము వెలిగారము రసమునకుసమము నాభి రసమునకు 5 భాగములు మిరియాలు కాయఫలము. నేపాళములు ఇవి మిరియాలకు సమభాగము ఇటుల వీనినన్నిటినిచేర్చి చక్కగా చూర్ణము చేసిన నది జ్వరాంకుశరసమనబడును. దీనినొకమాషప్రమాణము నిచ్చిన జీర్ణ జ్వరము త్రిదోషజ్వరము నివర్తించును.

అష్టవిధజ్వరములకు జ్వరాంకుశము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] మరిచంటంకణంశంఖచూర్ణం పారదగంధకమ్।
శోధితం బ్రహ్మపుత్రంచ భాగమేకం వినిక్షిపేత్ ।
గుంజామాత్రం ప్రదాతవ్యం నాగవల్లీదళైస్సహ ।
జ్వరాంకుశో రసోహ్యేష జ్వరమష్టవిధం జయేత్ ॥

తా. మిరియాలు వెలిగారము శంఖచూర్ణము శుద్ధిచేసినరసము గంధకముశుద్ధిజేసిననాభి 1 భాగము వీనినన్నిటినిచేర్చి మర్దించి గురిగింజయెత్తు తమలపాకులో నిచ్చిన 8 విధములగు జ్వరములు నివర్తించును. ఇది జ్వరాంకుశమనబడును.

విషమజ్వరములకు జ్వరాంకుశము.

శ్లో॥ [రసరత్నాకరే] శుద్ధసూతం తథాగంధం కర్షమాణంనయే ద్బుధః।మహౌషధం టంకణంచ హరితాళం తథా విషమ్ । రసార్ధం మర్దయే త్ఖల్వే భృంగరాజరసేనతు। త్రిదినంభావనాం దత్వా చతుర్థేవటికాంతతః । కుర్యాచ్చణకమాత్రంచపిప్పలీ మధుసంయుతః । ఏషజ్వరాంకుశోనామవిషమజ్వరనాశనః॥

తా. శుద్ధిచేసినరసము గంధకము యివి కర్ష ప్రమాణము శొంఠి వెలిగారము శుద్ధహారిదళము శుద్ధనాభి యివి రసమునకు ½ భాగము యిటుల వీనినన్నిటిని చేర్చి ఖల్వములోవేసి మర్ధించి గుంటగలగరాకురసముతో 3 దినములు భావనచేసి నాలవ దినమునందు సెనగలంత మాత్రలుచేసి పిప్పలి తేనె వీని యనుపానముతో నిప్పించిన విషమజ్వరములు హరించును. ఇది జ్వరాంకుశ మనబడును.

## భేది జ్వరాంకుశము.

శ్లో॥ [గ్రంథాంతరే] పారదంవత్సనాభంచప్రత్యేకంనిష్కసమ్మితమ్। ద్వినిష్కంగంధకంచైవటంకణంచద్వినిష్కకమ్ । మరిచంపంచ నిష్కంస్యాత్షణ్ణిష్కందంతిబీజకమ్ । సింహీఫలరసైర్మర్ద్యం ద్వియామం శ్లక్ష్ణతాంనయేత్ । గుంజామాత్రం వటీంకృత్వా ఛాయాశుష్కంచకారయేత్ । ఆర్ద్రికద్రవసంయుక్తం జ్వరే జీర్ణేప్రయోజయేత్ । సర్వజ్వరహరం శీఘ్రం నామ్నా భేది జ్వరాంకుశమ్॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన వసనాభి యివి దినుసుయొకటింటికి నిష్క ప్రమాణము శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన వెలిగారము యివి దినుసుయొకటింటికి 2 నిష్కములు మిరియాలు 5 నిష్కములు శుద్ధిచేసిన నేపాళములు 6 నిష్కములు ఇటుల వీనిని ఖల్వములోనునిచి 2 జాములు ములకపండ్లరసముచే బాగుగా మర్ధించి గురిగింజలంతేసిమాత్రలుచేసి నీడనెండించియుందొకదానిని అల్లపురసానుపానముతో జ్వరపక్వకాలమునందొసంగిన సర్వజ్వరములు కడుశీఘ్రముగ నశించును. అది భేది జ్వరాంకుశ మనంబడును.

## జ్వరములకు రాజచండీశ్వరరసము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] రసంగంధం విషంశుల్బం వహ్నినీరేణమర్ద యేత్ । గుంజాపరిమాణకంచైవ దత్తంహంతిక్షణేజ్వరమ్ । తైలాభ్యంగంజల స్నానంతృష్ణార్తౌ తక్రసేవనమ్ । గాత్రేచం దనలేపంతు సుఖం తాంబూలచర్వణమ్ । ఇక్షుపానంచ పాశీ యం ద్వైహాని వివిధానిచ । రాజచండీశ్వరో నామ రసాన ముత్తమోత్తమః॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసినగంధకము శుద్ధిచేసినవసనాభితామ్రభస్మము వీనిని సమభాగములుగా గ్రహించి ఖల్వములోనునిచి చిత్రమూలరసముచేనొకదినము బాగుగా మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి అల్లపురసముతో నొసంగిన తత్క్షణమున జ్వరము హరించును. తేనె పిప్పళ్లతో నొసంగిన, పురాణజ్వరములు నిశ్చయముగ హరించును. మఱియు నీయౌషధ సేవన కాలంబున తైలాభ్యంజనము శీతోదకస్నానము దప్పిగలిగిన మజ్జిగను సేవించుట శ్రీగంధలేపనము తాంబూలసేవన చెఱుకురసమును పానము సేయుట శీతోదకపానము యితర దేహోపచారములు వీని నాచరింపవలయును. ఇది రాజచండీశ్వర రసమనబడును. సర్వరసంబులలో కడు శ్రేష్ఠంబు.

## జ్వరములకు సూతరాజీయము.

శ్లో॥ [రసరత్నాకరే] సూతంషోడశతత్సమోదినక రస్తస్యార్ధ భాగో బలిః । తద్వత్సింధుజనూత్నచూర్ణమృదితం * షడ్భాగకం టంకణమ్ । జంబీరస్వరసేనతద్దినక రేతః స్తం సుపక్వంభవేత్ । కాసశ్వాసగుల్మశూలముదరంపాండుజ్వరంనాశయేత్॥

తా. శుద్ధి చేసిన పాదరసము 16 భాగములు తామ్రభస్మము 16 భాగములు శుద్ధిచేసినగంధకము 8 భాగములు సైంధవలవణము 8 భాగములుశుద్ధిజేసినవెలిచారము 6 భాగములు ఇటుల వీనిలెల్ల గ్రహించి యేకముజేసి ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముచే 1 దినము బాగుగా మర్దించి యెండనెండించిన పక్వంబగును. పిదప దానిని అడ్డకయెత్తుమాత్రలుజేసి తేనె పిప్పళ్లు వీని యనుపానముతో సేవించిన. లేక అల్లపురసముతో సేవించినను కాసశ్వాసములు గుల్మము శూలలు వుదరరోగములు పాండువు పురాణజ్వరములు హరించును.

## జ్వరములకు కాలాగ్నిరుద్రరసము.

శ్లో॥ [పూజ్యపాదీయే] భస్మసూతస్య సంగ్రాహ్యంపలమేకంనియోజయేత్ । చతుష్పలం తామ్రభస్మ గంధకంచ చతుష్పలమ్। తాళకంపలమేకంతు పలమేకంతు టంకణమ్ । పలార్ధంవత్సనాభంతుజంభీ రామ్లేన పేషయేత్ । చిత్రమూలరసేనాపి మర్ద యిత్వాపృథక్పృథక్ । హంసపాదీరసేనాపి మర్దయే ద్యామ

* తస్యాంశకం టంకణం అనియు పాఠాంతరము గలదు.

మాత్రకమ్ । అయంకాలాగ్నిరుద్రస్స్యాత్ న్నామ్నారోగార్తి నాశనః। వ్రీహిమాత్ర ప్రయోగేణజ్వరాన్ ఘోరా న్నివర్త యేత్ । రసేంద్రో హంతిచ వ్యాధీన్ రస సర్వత్రపూజితః ॥

తా. రసభస్మము 1 పలము తామ్రభస్మము 1 పలము శుద్ధిచేసిన గంధకము 4 పలములు శుద్ధిచేసిన తాళకము 1 పలము శుద్ధిచేసిన వెలిగారము 1 పలము శుద్ధిచేసిన వసనాభి ½ పలము ఇటులవీని నెల్ల గ్రహించి ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసము చిత్ర మూల * రసము-హంసపాది యాకురసము వీనిలో ప్రతివానిచే నొక్కొక జాము బాగుగామర్దించి వరిగింజలంతేసి మాత్రలుజేసియందొకవానిని అల్లపురసముతోగాని లేకపిప్పళ్లుజీలకఱ్ఱవీనియనుపానముతో గాని సేవించిన ఘోరజ్వరములు హరించును. మఱియు నీరసము సర్వవ్యాధుల నశింపజేయుటచే సర్వత్రపూజితంబుగ మన్నయది.

## జ్వరములకు నవరత్నాగ్నికుమారసము.

శ్లో॥ [మాధవనిదానే] పారదంపంచ లవణంనవరత్నసమంసమమ్ । మర్దితంతరుణద్రావైః। ఖల్వమధ్యేదినద్వయమ్ కాచకుప్యాం తతో క్షిప్త్వా వాలుకాయంత్రకే పచేత్ । షడ్యామాంతే సముద్ధృత్య సూక్ష్మచూర్ణంతు కారయేత్॥ అనుపానవిశే షేణ సర్వరోగ హరంపరమ్ । గుంజామాత్రం ప్రదాతవ్య మిచ్ఛాపథ్యం ప్రదాపయేత్ । రసోహ్యగ్ని కుమారోయం రత్నాఖ్యేన భిషగ్వరైః॥

తా. శుద్ధిచేసినరసము పంచలవణములు నవరత్నభస్మములు వీనిని సమభాగ ములుగాగ్రహించి ఉలిమిడివేళ్ల రసముచే 2 దినములు మర్దించి గాజుకుప్పెలోనునిచి వాలుకాయంత్రమునందిడి 6 జాములువండి స్వాంగశీతలమునదీసి చూర్ణముచేసి గురి గింజ ప్రమాణమును అనుపానవిశేషములచే నిచ్చిన సర్వజ్వరములు హరించును. దీని యందు ఇచ్ఛాపథ్యం బిడవలయును. ఇది నవరత్నాగ్ని కుమార రసమనబడును.

## జ్వరములకు సిద్ధాగ్నికుమారము.

శ్లో॥ [ఆయుర్వేదే] సశుద్ధపారదంగంధం టంకణంవత్స నాభికమ్ అర్కపత్రరసైః స్సార్ధ్యం వజ్రమూషాంతరే క్షిపేత్ ।

* రసమనగా! కషాయము.

వాలుకాయంత్రచేపాచ్యం పుటమేకంతు భూధరే।
సాంగశీతల ముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్ ।
సిద్ధాఖ్యోయ మితి ఖ్యాతో రసో హ్యగ్నికుమారకః॥

తా. శుద్ధిచేసినరసము గంధకము వెలిగారము వసనాభి వీనిని జిల్లేడాకు రసముచే బాగుగా మర్దించి వజ్రమూషలోనునిచి చీలమన్నుయిచ్చి యామూషను వాలుకాయంత్రమునందునిచి భూధరపుటంబిడిసాంగ శీతలమునదీసి గుంజాప్రమాణమున అనుపాన విశేషములచేనిచ్చిన సర్వజ్వరములు హరించును. ఇది సిద్ధాగ్నికుమారరసమనబడును.

## జ్వరములకు లఘ్వగ్నికుమారము.

శ్లో॥ [రసరత్నాకరే] పారదం టంకణం గంధంతాళకంచమనశ్శిలా
సర్వం హంసపదిద్రావై ర్దినమేకంతు మర్దయేత్॥
కాచకుప్యాం నివేశ్యాథ వాలుకాయంత్రకే పచేత్।
షడ్యామాంతే సముద్ధృత్య దేయం గుంజానుపానతః।
విఖ్యాత మితి లఘ్వగ్ని కుమారోయం మహారసః॥

తా. శుద్ధిచేసినరసము వెలిగారము ఆమపానగంధకము తాళకము మణిశిల వీనిని సమభాగములుగాజేర్చి హంసపాదియాకురసముచే నొకదినము మర్దించి గాజుకుప్పెలోనునిచి దానిపై చీలమన్నుపూసి వాలుకాయంత్రములోనునిచి 6 జాములు వండి సాంగశీతలమునదీసి గురిగింజప్రమాణమును అనుపానవిశేషములచే నిచ్చినసర్వజ్వరములు హరించును. ఇది లఘ్వగ్నికుమార రసమనబడును.

## పురాణజ్వరములకు త్రిలోచనరసము.

శ్లో॥ [పూజ్యాపాదీయే] శుద్ధసూతంసమంగంధం సూతాంశంమృతమభ్రకమ్ । త్రిభిస్తుల్యైర్గవాం క్షీరైర్మర్దయే దాతపేఖరే।
నిర్గుండ్యాశ్చ ద్రవై ర్మర్ద్య దినైకం తచ్చగోళకమ్ । త్రియామంవాలుకాయంత్రేప్యథమూషాంగతంపచేత్ । ఆదాయచూర్ణయేత్ఖల్వే వ్యాప్తమాంశంవిషంక్షిపేత్ । త్రిలోచనరసోనామ్నా దేయంగుంజాద్వయంద్వయమ్ । పంచకోలంపిబేచ్చాను

పథ్యం ఛాగపయ స్తథా । సన్నిపాత్రం త్రిదోషోత్థం సాధ్యాసాధ్యం నసంశయః । పశుగంధా పూతికర్ణీ సింధువారక చిత్రకమ్ । మేషశృంగీ హ్యపామార్గో గ్రంథికం త్రూష్యణం వచా । క్వాథమష్టావ శేషంతు సన్నిపాతా న్నిహంతిచ । త్రయోదశ విధాంశ్చైవ పురాణజ్వరనాశనమ్ । మృత్యుంజయ కషాయేణ సారకాసౌ నిహంతిచ॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన గంధకము అభ్రకభస్మము వీనిని సమభాగములుగా గ్రహించి ఖల్వములోనునిచి వానికిసముగా ఆవు పాలుబోసి బాగుగా మర్దించి తీక్ష్ణమైనయెండ నెండించి పిదప వావిలాకురసముచే 1 దినము మర్దించి ముద్దజేసి మూసలోనునిచి వాలుకాయంత్రమునందిడి 3 జాములుఉండి స్వాంగశీతలము నదీసి ఖల్వములోనునిచి దానికి 8 వ భాగము శుద్ధిచేసిన నాభినికలిపి మర్దించిచూర్ణము చేసి రెండేసి గురిగింజలయెత్తును * పంచకోలకషాయాను పానముతో సేవించిన త్రిదోషమువలన జనించి సాధ్యాసాధ్యంబుగనుండు సన్నిపాతములు నిస్సంశయముగా హరించును ఇది త్రిలోచనరసమనబడును. మఱియు దీనిని నెమిలిచెక్క క్రొనుగు వావిలి త్రిమూలను † మొక్క ము ఉత్తరేణి మోడి త్రికటుకములు వస వీనినివేసి అష్టావశేషముగా కాచబడిన కషాయానుపానముతో సేవించిన బహుమూడు సన్నిపాతములు పురాణజ్వరములు అతిసారము కాసము ఇవి హరించును. ఇది మృత్యుంజయ కషాయమనబడును. ఈ యౌషధ సేవనకాలమునందు మేకపాలను పథ్యమునందు జేర్చుకొనవలయును.

## సర్వజ్వరములకు సింహప్రతీపాలనము.

శ్లో॥ [ఆయుర్వేదే] సూతం గంధకవత్సనాభగరళంచైకైకభాగాన్వితం । సర్వ మర్దితహంసపాదిస్వరసే గుంజేనమాత్రామితమ్ । తైలాభ్యంగ జలోపచారకథితం పథ్యంచ దధ్యోదనమ్ । సర్వంకాంతిమనేక దోషశమనం సింహప్రతీపాలనమ్

* పంచకోలమనగా—పిప్పళ్లు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి.

‡ మొక్కమనగా—ఇదేవద్దిచెక్క.

తా. శుద్ధిచేసినరసము గంధకము నాభిగరళము వీనిని సమభాగములుగా గ్రహించి పెద్దహంసాదియాకురసముచే మర్దించి గురిగింజలంతమాత్రలుచేసి అనుపానవిశేషములతో నిప్పించిన అనేకదోషములచే జనియించిన జ్వరములు శమించును. దీనియందు తైలాభ్యంగము శీతజలోపచారము పెరుగన్నభోజనము వీనిని చేయించవలయును. ఇది సింహప్రతీపాలన మనబడును.

## సర్వజ్వరములకు ఆనందభైరవము.

శ్లో॥ [నిత్యనాథీయే] సౌభాగ్య హింగుళకణం గరళంమరీచం సంమర్ద్యనింబక రసేన దినత్రయంచ । ఆనందభైరవపటీప్రతివరీమాణం నానానుపానసహితం సకలామయఘ్నమ్॥

తా. శుద్ధి జేసిన వెలిగారము శుద్ధిజేసిన ఇంగిలీకము పిప్పళ్లు శుద్ధిజేసినవసనాభి మిరియాలు వీనిని సమభాగములుగా ఖల్వములోనునిచి వేపచెక్కరసముచే 3 దినములు మర్దించి కందిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని అనుపానవిశేషములతో నొసంగిన సర్వజ్వరములు హరించును. ఇది ఆనందభైరవమనబడును. (దీనిని నేత్రముల కంజనముచేసిన సన్నిపాతములు హరించును.)

## ముహూర్తములో నవజ్వరములను హరించెడి రత్నగిరిరసము.

శ్లో॥ [నిత్యనాథీయే] శుద్ధసూతంసమంగంధంమృతతామ్రాభ్రహాటకమ్ । ప్రత్యేకంసూతతుల్యంస్యా త్సూతార్థంమృతతాహికమ్ । తాహార్ధంమృతవైక్రాంతంమర్దయేద్భృంగజ ద్రవైః । పర్పటీరసవత్పాచ్యం చూర్ణితంభావయేత్పృథక్ । శిగ్రువాసకనిర్గుండీ వచాగ్ని భృంగముండికైః । ద్రాక్షామృతాజయంతీభిర్మునిబ్రాహ్మీసుతిక్తకైః । కన్యాయాశ్చద్రవైర్భావ్యం ప్రతివారైస్త్రిధాత్రిధా । శుద్ధ్వాలఘుపుటే సాచ్యావాలుకాయంత్రమధ్యగా । యంత్రంనిరుధ్య యత్నేన సాంగశీతం సముద్ధరేత్ । చూర్ణంనవజ్వరే దేయం మాషమాత్రంరసస్యవై । కృష్ణాధాన్య సమాయుక్తం ముహూర్తాన్నాశయేజ్జ్వరమ్ । అయం రత్నగిరిర్నామ రసోయోగస్యవాహకః।

తా. శుద్ధిజేసినరసము గంధకము తామ్రభస్మము అభ్రకభస్మము స్వర్ణభస్మము యివి ప్రత్యేకము సమభాగములు లోహభస్మములో ½ భాగము వైక్రాంతభస్మము లోహభస్మము ½ భాగము ఇటుల గ్రహించి గుంటగలగరానురసముచే మర్దించి పర్పటీరసమునుచేర్చి పాకముచేసి పిదప దానిని చక్కగా చూర్ణముచేసి మునగ అడ్డరసము వావిలి వస చిత్రమూలము గుంటగలగర బోడతరము ద్రాక్ష తిప్పతీగె తక్కెడు మోదుగ బ్రాహ్మి చేనుపొట్ల కలబంద వీనిరసముచే ప్రత్యేకముగా నొక్కొక దినము 3 పర్యాయములు భావనచేసి మూకుళ్ళలోనునిచి చీలచేసి లఘుపుటంబిడిపిదప వాలుకాయంత్రమధ్యములో నునిచి పాకముచేసి సాంగశీతలమున దించుకొని చూర్ణముచేసి మాషప్రమాణమును పిప్పళ్లు ధనియాలు వీని యనుపానముతోడ నిప్పించిన ఒకముహూర్తములో నవజ్వరములు నివర్తించును. ఇది రత్నగిరి రసమనబడును. యోగవాహకమైనది.

## సర్వజ్వరములకు చండేశ్వరరసము.

శ్లో॥ [రసరత్నాకరే] రసంగంధంవిషంతామ్రం మర్దయేదేకయామకమ్ । ఆర్ధ్రికస్యరసేనైవ మర్దయేత్సప్తవారకమ్ । నిర్గుండ్యాస్వరసేపశ్చాన్మర్దయేత్సప్తవారకమ్ । గుంజైకార్ద్రరసేనైవా దత్వాహంతిజ్వరంక్షణాత్ । వాతంపిత్తజంశ్లేష్మ ద్వంద్వదోషజమపి క్షణాత్ । సుశీతలజలేస్నానం తృష్ణార్తేక్షీరభోజనమ్ । ఆమ్రంచపనసంచైవ చందనాగురులేపనమ్ । ఏతత్సమోరసో నాస్తినైద్యానాం హృదయంగమః । ఏషచండేశ్వరోనామ సర్వజ్వరకులాంతకృత్ ॥

తా. శుద్ధిజేసినరసము గంధకము నాభి తామ్రభస్మము వీటిని అల్లపురసముచే నొకజాము మర్దించవలయును ఇటుల యేడుపర్యాయములు మర్దించి పిదప వావిలియాకుస్వరసముచే నేడుపర్యాయములు మర్దించి గురిగింజప్రమాణమును అల్లపురసముతో నిప్పించిన వాతము పిత్తము శ్లేష్మము ద్వంద్వదోషము వీనివలన జనించిన జ్వరములు అతిశీఘ్రముగా నివర్తించును. మిగుల శీతలముగనుండి జలస్నానము దప్పిగలిగిన క్షీరపానము మామిడిపండ్లను పనసపండ్లను భుజించుట చందనము అగరు వీని లేపనము యీమొదలగువాటిని చేయించవలయును. దీనికి సమమైనరస

లేదు. ఇది వైద్యులమనస్సును మిగుల సంతోషపఱచును. దీనికి చండేశ్వరరసమని నామముగలదు. ఇది సమస్త జ్వరకులమును హరింపజేయును.

## సర్వజ్వరములకు శ్రీజయమంగళరసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] హింగూలసంభవంసూతం గంధకంటంకణం తథా । తామ్రవంగంమాక్షికంచ సైంధవంమరిచంతథా । సమంసర్వంసమాహృత్య ద్విగుణంస్వర్ణభస్మకమ్ । తదర్ధం కాంతలోహంచరూప్యభస్మాపితత్సమమ్ । విపతత్సర్వంచూర్ణ్యాథ భావయేత్కనకద్రవైః । శేఫాలీదళజైశ్చాపి దశమూలరసేనచ । కిరాత తిక్తకక్వాథై స్త్రివారం భావయేత్సుధీః। భావయిత్వాతతః కుర్యాద్గుంజాద్వయమితాంవటీమ్ । అనుపానం పయోక్తవ్యం జీరకం మధుసంయుతమ్ । జీర్ణజ్వరం మహాఘోరం చిరకాల సముద్భవమ్ । జ్వరమష్టవిధంహంతి సాధ్యాసాధ్య మథాపివా । పృథగ్దోషాంశ్చ వివిధాన్ సమస్తాన్ విషమజ్వరాన్ । మేదోగతంమాంసగత మస్థిమజ్జాగతంతథా। అంతర్గతం మహాఘోరం బహిఃస్థంచ విశేషతః । నానాదోషోద్భవంచైవ జ్వరంశుక్ర గతంతథా । నిఖిలం జ్వరనామానం హంతిశ్రీశివశాసనాత్ । జయమంగళనామాయం రసశ్శ్రీశివ నిర్మితః । బలపుష్టికరశ్చైవ సర్వరోగనిబర్హణః॥

తా. ఇంగిలీకములో నెత్తబడి శుద్ధిజేయబడినరసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసినవెలిగారము తామ్రభస్మము వంగభస్మము హేమమాక్షికభస్మము సైంధవలవణము మిరియాలు ఇవి దినుసుకొక్కొకభాగము సువర్ణభస్మము 2 భాగములు కాంతభస్మము లోహభస్మము ఇవి దినుసు కొక్కొకభాగము రజితభస్మము 2 భాగములు ఇటుల వీనినన్నిటిని ఖల్వములోనునిచి చూర్ణముజేసి వుమ్మెత్తరసము నల్లవావిలియాకురసము * దశమూలములరసము నేలవేముకషాయము వీనిచే ప్రత్యేకప్రత్యేకముగా

---

* దశమూలములన మారేడు తక్కలి గుందిలము గుమ్ముడు కలిగొటు కోలపొన్న నేలపొన్న చిన్నములక పెద్దములక పల్లేరు.

మూడేసిమారులు భావనజేసి పిదప 2 గురిగింజలంత సేసి మాత్రలుజేసి యందొకదానిని జీలకఱ్ఱ తేనె వీనియనుపానముతోడ సేవించిన కడుభయంకరమై దీర్ఘకాలముగా వేధింపుచుండు జీర్ణజ్వరము సాధ్యాసాధ్యములగనుండు 8 విధజ్వరములు వాతాదులచే ప్రత్యేకముగా జనించిన జ్వరములు ద్వంద్వజ్వరములు సన్నిపాతజ్వరములు విషమజ్వరములు మేదోగత మాంసగత అస్థిగత మజ్జాగతజ్వరములు కడుభయంకరమైన ఆంతర్గతజ్వరములు బహిర్గతజ్వరములు నానాదోషములచే జనించిన జ్వరములు శుక్రగతజ్వరము యీ మొదలగు సర్వజ్వరములను ఈశ్వరునియాజ్ఞచే హరింపజేయును. ఇది ఈశ్వరనిర్మితంబైన జయమంగళరసము. ఇది బలమును పుష్టిని గలుగజేయుటయేగాక సర్వరోగములను కూడా హరింపచేయును.

## సర్వజ్వరములకు మృత్యుంజయరసము.

శ్లో॥ [నిత్యనాథీయే] విషస్యైకంతథాభాగం మరిచంపిప్పలీకణా। గంధకస్యతథాభాగం భాగంస్యాట్టంకణస్యవై। సర్వత్రసమభాగంస్యాద్ద్విభాగం హింగుళంభవేత్। జంబీరస్యరసేనాత్రభావ్యంహింగుళశోధితమ్। రసశ్చేత్సమభాగంస్యాత్ హింగుళంనేష్యతేతథా। గోమూత్రశోధితంచాత్రవిషంసారవిశోధితమ్। చూర్ణయేత్ఖల్వమధ్యేతు ముద్గమాత్రాం వటీంచరేత్। మధునాలేహనంప్రోక్తం సర్వజ్వరనివృత్తయే। దధ్యూదకానుపానేసవాతజ్వరనిబర్హణః। ఆర్ద్రికస్వరసేపానందారుణేసాన్నిపాతికే।జంబీరరసయోగేన అజీర్ణజ్వరనాశనః। అజాజీగుడసంయుక్తో విషమజ్వరనాశనః। జీర్ణజ్వరేమహాఘోరే పురుషేయావనాన్వితే। పూర్ణమాత్రాప్రదాతవ్యా పూర్ణశ్రీచంవతుష్టయం। అతిక్షీణేతివృద్ధేచశిశౌచాల్పవయస్యపి। తూర్యమాత్రాప్రదాతవ్యా వ్యవస్థాసారనిశ్చితా। నవజ్వరేప్రదానేచయామైకా న్నాశయేజ్జ్వరమ్। అక్షీణేచకఫాభావే దాహేవావాతపైత్తికే। సితాతస్యాత్ప్రియత్నేన నారికేళాంబుఃర్భుతమ్। అయంమృత్యుంజయోనామ రసస్సర్వజ్వరాపహః। అనుపానప్రభేదేన నిహంతిసకలాన్గదాన్॥

తా. గోమూత్రములో శుద్ధి చేసిన నాభి 1 భాగము శొంఠియాలు పిప్పళ్ళు మోడి శుద్ధగంధకము ఇవి దినుసుకు 1 భాగము వెలిగారము 1 భాగము నిమ్మపండ్లరసముచే శుద్ధిజేయబడిన ఇంగిలీకము వానికన్నిటికి 2 భాగములు ఇట్టుల వీనినన్నిటిని ఖల్వమునందునిచి చక్కగా చూర్ణముచేసి పెసరగింజంత మాత్రలుచేయువలయు. దీనియందు నాభి మొదలైనవానికి సమభాగముగా రసమును చేర్చు పక్షములో ఇంగిలీకమును చేర్చంజనదు ఈమృత్యుంజయరసమును సమస్తజ్వరములయందు తేనెలోచాది నాకింపవలయును. వెఱుగు ఉదకము వీని యనుపానముతో నిప్పించిన వాతజ్వరము అల్లపురసముతో నిప్పించిన దారుణమైన సన్నిపాతజ్వరములు నిమ్మపండ్లరసముతోడ నిప్పించిన అజీర్ణజ్వరము జీలకఱ్ఱ బెల్లము వీనియనుపానముతోడ నిప్పించిన విషమజ్వరము ఇవి నివర్తించును దారుణమైన జీర్ణజ్వరమునందు యౌవన వయస్సుగల పురుషునికి సంపూర్ణమాత్రలో (అనగా పెసరగింజంత, పరిమాణముగల 4 మాత్రల నిప్పించవలయు. అతిక్షీణుడు వృద్ధుడు శిశువు స్వల్పవయస్సుగలవారు వీరికి తుల్యమాత్రగా (అనగా పూర్ణమాత్రలో నాలవభాగము) నిప్పించవలయును. నవజ్వరములయం దిప్పించిన 1 జాము లోపల జ్వరము నివర్తించును. వాతపిత్తము వలన జనించిన తాపమునందు పంచదారతోడ పైమాత్రనిప్పించి నారికేళోదకమును భయములేక ప్రయత్నముతో నిప్పించవలయును. ఇది మృత్యుంజయరసమనబడును సమస్తజ్వరములను పోగొట్టును. మఱియునిది అనుపానభేదముచే సమస్తరోగములను పోగొట్టును.

## తరుణాదిజ్వరములకు ప్రళయానలరుద్రరసము

శ్లో॥ [ఆయుర్వేదే] హింగుళోత్థరసంభాగం ద్వౌభాగానిచ గంధకమ్ । బాణభాగాభ్రగోదంతం కాలభాగం మనశ్శిలా । టంకణం నేత్రభాగంచ రసితంబుతుభాగికమ్ । ఏకభాగంచనేపాళంద్విభాగచ హాలాహలమ్ । దరదంచార్ధభాగంచ లోహంతామ్రంచభాగికమ్ । సర్వంఖల్వోదరే క్షేప్తవ్యం క్షీరేణార్కస్యమర్దయేత్ । సింధువారాగ్నిధుత్తూర జంబీరఃకారవల్లికా। గంధతాళవిషమ్లేచ్ఛ భాగాగ్రింనిక్షిపేమ్బుధః । దశమూలకషాయేణామర్దయేద్యామయుగ్మకమ్ । పంచకోలకషాయేణ మర్దయేద్యామమాత్రకమ్ । నిక్షిప్యతామ్రపాత్రేణద్వాయా

మహావాలుకాగ్నినా । సాంగశీతలముద్ధృత్య వల్లమాత్రకమేవచ । యోజయే త్తరుణేపేతే దోషవాతజ్వరేపిచ । పిత్తవాతగతేచైవ ప్రత్యహంతరుణేపివా । చాతుర్థిక త్రిరాత్రేచ అన్యత్ర వివిధజ్వరః । అమందాద్దీపసంజ్ఞేయో దాహస్వేదోల్బణం జయేత్ ॥ పయశ్శాల్యోదనంపథ్యందధితక్రసమన్వితమ్ । సితయామిశ్రతోయేన నారికేళాంబునాతథా । కదళీఫలపక్వాని పునస్సరేషునాళితః । తాంబూలచందనోన్మిశ్రం దేయోదద్యాద్భిషగ్వరైః । వాపీకూపతటాకానాం స్నానంకుర్యాద్యథేచ్ఛయా । ప్రళయానలరుద్రాఖ్యో రసఃకాలాగ్నిభైరవః ॥

తా. ఇంగిలీకములోనుండి తీయబడినరసము (అనగాబాలరసము) 1 భాగము గంధకము 2 భాగములు తాళకము అభ్రకము ఇవి 5 భాగములు మణిశిల 3 భాగములు వెలిగారము 2 భాగములు ఉల్లిపాషాణము 6 భాగములు నేపాళములు 1 భాగముహాలాహలమను విషము 2 భాగములు ఇంగిలీకము 4 భాగములు లోహమండూరము 1 భాగము తామ్రభస్మము 2 భాగములు వీనినన్నిటిని శుద్ధిచేసి ఖల్వమునందునిచి జిల్లేడుపాలతో మర్దించి పిదప వావిలాకు చిత్రమూలము ఉమ్మెత్తనిమ్మకాకర వీనిరసములతో మర్దించి అందులోగంధకము తాళకము నాభి ఇంగిలీకము వీటిని మునుపుచెప్పినభాగము చొప్పునచేర్చి దశమూలకషాయముచే 2 జాములుపఅచకోలకషాయముచే 1 జామునుర్దించి తామ్రపాత్రలోనునిచి 2 జాములు వాలుకాయంత్రముపాకముచేసి సాంగశీతలమునదీసివల్లప్రమాణము సేవించిన తరుణజ్వరములు దోషజ్వరములు వాతజ్వరములు పిత్తవాతజ్వరములు ప్రత్యహమునుండు తరుణజ్వరములు చాతుర్థికజ్వరములు త్ర్యాహికజ్వరములు పలువిధములైన ఇతరజ్వరములు ఇవి యన్నియు హరించును మఱియు అగ్నిమాంద్యము దాహము మిక్కుటముగా స్వేదము ఇవికూడా హరించు. శాల్యన్నమును పాలు పెరుగు మజ్జిగ వీనిసహితముగా భుజించవలయును. పంచదార పానకమునుగాని నారికేళోదకమునుగాని పానముచేయించవలయును. అరటిపండ్లు మొదలగు వానినికూడా భుజించవచ్చును తాంబూలభక్షణము చందనలేపనము వీనిని వైద్యుడు చేయించవలయును. కోనేరు నుయ్యి తటాకము వీనియందు యథేచ్ఛగా స్నానముచేయించవలయును. ఇది ప్రళయానల రుద్రరసమనియు కాలాగ్ని భైరవరసమనియు చెప్పబడును.

## సర్వజ్వరములకు తరుణార్క రసము

శ్లో॥ [ఆయుర్వేదే] గంధకంటంకణంచాభ్రం నాభిదుత్తూరబీజకః
కృష్ణసర్పస్యగరళం రక్తచందనవంగకమ్ ।
ఏతానిసమభాగానిసర్వత్రసమహింగుళమ్ ।
మాతులుంగరసైర్మర్ద్యం త్రిదినంచమహామృదు ।
వటికాసర్షమాత్రేణ హ్యనుపానవిశేషతః ।
తరుణార్కరసోఖ్యాత స్సర్వజ్వరనివారణః ॥

తా. శుద్ధిచేసినగంధకము వెలిగారము అభ్రకభస్మము శుద్ధిజేసిననాభి వెత్తవిత్తులు నల్లత్రాచువిషము రక్తచందనము వంగ భస్మము ఇవి సమభాగములు వీనిన్నిటికి సమము శుద్ధిచేసిన ఇంగిలీకము ఇటుల వీనినన్నిటిని జేర్చి మాదీఫలరసము 3 దినములు మృదువుగా మర్దించి ఆవగింజలతేసి మాత్రలుచేసి అనుపాన విశేషములచే నిచ్చిన సర్వజ్వరములు హరించును. ఇది తరుణార్కరసమనబడును.

## అసాధ్యజ్వరాదులయందు కల్పతరురసము

శ్లో॥ రసంగంధంవిషంతామ్రం సమభాగంప్రచూర్ణయేత్ । భావయేత్పంచభిఃపిత్తైః క్రమశఃపంచవాసరమ్ । నిర్గుండీస్వరసేనైవమర్దయేత్సప్తవాసరమ్ । ఆర్ద్రికస్యరసేనైవ భావయేచ్చత్రిధాపున । సర్షపాభా వటీకార్యా చ్ఛాయయాపరిశోషితా । తతస్సప్తవటీయోజ్యాయావన్నత్రిగుణాభవేత్ । వయోగ్నిదోషగంబుధ్వా ప్రయోజ్యాభిషజాంవరైః । అనుపానంచోష్ణజలం కజ్జలీపిప్పలీయుతమ్ । పానావశేషే ప్రస్వాప్యవస్త్రైరాచ్ఛాదయే న్నరమ్ । ఘర్మాభ్యా గమనం యావత్తతోరోగాత్ప్రముచ్యతే । రోగిణంస్వాపయిత్వాతు భోజయేత్ససితందధి । ఏషకల్పతరుర్నామ రసఃపరమదుర్లభః । అసాధ్యం చిరకాలోత్తజీర్ణంచవిషమజ్వరమ్ । హంతిజ్వరాతిసారాంచ గ్రహణీం పాండుకామలామ్ । నదేయశ్వాసకాసేచ శూలయుక్తే నరేతథా । గోపనీయః ప్రయత్నేన నదేయోయస్యకస్యచిత్ ॥

తా. శుద్ధిచేసినరసము గంధకము విషము తామ్రభస్మము వీటిని సమభాగము లుగా గ్రహించి చక్కగా చూర్ణము చేసి పంచపిత్తములచే (అనగా మత్స్యము ఎనుబోతు నెమలి అడవిపంది మేకపోతు వీనిపిత్తములచే) యథాక్రమముగా 5 దిన ములు భావనచేసి పిదపవావిలిస్వరసముచే 7 దినములు అల్లపుస్వరసముచే 3 దినములు భావనచేసి మర్దించి ఆవాలంత మాత్రలుచేసి నీడనెండించి దోషము వయస్సు జఠ రాగ్ని వీని బలము నెఱిగి సమర్థుడగు వైద్యుడు 7 మాత్రలనిప్పించి ఉష్ణోదకము పిప్పలి స్వరసము వీనిని అనుపానము చేయించి రోగిని పరుండబెట్టి చెమటకలుగు వరకు వస్త్రమునుకప్పి నిద్రించునటుల చేయవలయును. పిదప పంచదార పెరుగువీని తోడ పథ్యము నిప్పించవలయును. ఇది కల్పతరు రసమనబడును. మిగుల దుర్లభమై నది అసాధ్యజ్వరము చిరకాలజ్వరము జీర్ణజ్వరము విషజ్వరము జ్వరాతి సారము గ్రహణి పాండువు కామిల వీనిని హరింపజేయును. శ్వాస కాసములు శూల వీని తో గూడియుండు జ్వరమునందు దీని నిప్పించంజనదు. దీనిని యితరులకు యివ్వ కుండా మిగుల ప్రయత్నముతో రహస్యముగా కాపాడవలయును.

## జ్వరములకు అర్ధనారీశ్వరరసము.

శ్లో॥ [ఆయుర్వేదే] గారీశిలాహింగుళమభ్రకంచ తారంచతామ్రం చ బలించసూతమ్ । విషంచనేపాళమదోత్కటంచ వల్లీఫలం కర్పూరిమైలతుత్థమ్ । సర్వంచచూర్ణం శిఖిమత్స్యపిత్తే సంభా వయేత్వగ్నిభవేంద్రవారిణా । హాలాహలాదంతిచ మజ్జతో యైదినే నమర్ద్యంపరిభావశోషయేత్ । అజోత్తరస్తస్యపయో మిళిత్వా యామార్ధవామాన్యజ్వరంనిహన్యాత్ । అర్ధంశరీ రంవపుభవ్యమన్యే మహోద్భుతంవైద్యవివాదకాలే । తథా మజోదక్షిణదుగ్ధమిశ్రే ఉభేచపక్షాగతమేజ్వరంహరేత్ । కథితాహ్యజనాథేన రహస్యంచిత్రకారిణా । అర్ధనారీశ్వరో నామ రసస్స్వేవ్యోరసాయనః॥

తా. శుద్ధిచేసిన గారీపాషాణము ఇంగిలీకము అభ్రకభస్మము రజితభస్మ తామ్రభస్మము గంధకము రసము నాభి నేపాళము కస్తూరి మిరియాలు పాల త్తము మైలుతుత్తము వీనిని సమభాగములుగాగ్రహించి చూర్ణముచేసి నెమలిచే

చెపచేదున మర్దించి చిత్రమూలరసము నాభికషాయము పెద్దపాపరరసము దంతివేళ్ళరసము జాజికాయరసము వీనిచే నొక్కొకదినము మర్దించి భావనచేసి యెండించి వైద్యవివాదకాలమునందు మేక ఉత్తరపు చలుపాలతో నిప్పించిన 4 ఘడియలకు వామభాగమునందుండు జ్వరములుమానును. పిదప మేకయొక్క దక్షిణ వైపు చనుబాలలోకలిపి ఇప్పించిన 2 పార్శ్వములయందలి జ్వరముమానును. ఇది అజనాథునిచే జెప్పబడిన అర్ధనారీశ్వరరసము ఇది మిగుల శ్రేష్ఠమైనది. ఉత్తరస్తన్యమనగా ఎడమచన్ను దక్షిణస్తన్యమనగా కుడిచన్ను.

శ్లో॥ [మతాంతరే] రసగంధామృతంచైవసమంశుద్ధంచటంకణమ్ । మర్దయేత్ఖల్వమధ్యేతు యావత్స్యాత్కజ్జలప్రభమ్ । నకులారిముఖేక్షిప్త్వా మృదాసంవేషయేద్బహిః । స్థాపయేన్మృణ్మయేపాత్రే ఊర్ధ్వాధోలవణంక్షిపేత్ । భాండవక్త్రం నిరుధ్యాథ చతుర్యామందృఢాగ్నినా । స్వాంగశైత్యంసముద్ధృత్య ఖల్వేకృత్వాతుకజ్జలీమ్ । గుంజామాత్రంప్రదాతవ్యం నస్యంకర్ణేనియోజయేత్ । వామభాగేజ్వరంహంతి తత్క్షణాల్లోకకౌతుకమ్ ।కుర్యాద్దక్షిణభాగేన చారోగ్యంనిశ్చితంభవేత్ గోప్యాద్గోప్యతమంప్రోక్తం గోపనీయంప్రయత్నతః । అర్ధనారీశ్వరోనామ రసోయంకథితోభువి॥

తా. శుద్ధిచేసినరసము గంధకము నాభి శుద్ధిచేసిన వెలిగారము వీటిని సమభాగములుగా గ్రహించి ఖల్వములోవైచి యావత్తును కజ్జలివలెమర్దించి నకులారిముఖములోనునిచివెలపట చీలమన్ను చేసి మట్టికుండలో ఉప్పుబోసి అందులోనునిచిపైన ఉప్పుబోసి కుండనోరుమూసి 4 జాములు దృఢాగ్నిచే పక్వముచేసి స్వాంగశీతలమునదీసి ఖల్వములోనునిచి చక్కగానూరి గురిగింజలంతమాత్రలుచేసియెడమప్రక్కనొకమాత్రను నస్యముచేయించిన తత్క్షణమే యావామభాగమునందుండు జ్వరము నివర్తించును కుడిప్రక్క చేయించిన నిశ్చయముగా ఆరోగ్యముగలుగును. ఇదిమిగుల రహస్యమైనది దీనిని ప్రయత్నముచే రక్షించవలయును. ఇది అర్ధనారీశ్వరరసమనబడును.

## ఆమజ్వరాదులకు అగ్నికుమారరసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] మరిచోగ్రా కుష్ఠముస్తైః సర్వైరేవ సమం

విషమ్। పిష్ట్వాచార్ద్రకరసేనై వావటికారక్తికామితా। ఆమజ్వరే ప్రథమతః శుంఠ్యాచమధుపిష్టయా। ఆర్ద్రికస్వరసేనాపి నిర్గుండ్యాశ్చకఫజ్వరే। పీనసేచప్రతిశ్యాయే ఆర్ద్రికస్యచవారిణా। అగ్నిమాంద్యేలవంగేన శోఫేనదశమూలకః। గ్రహణ్యాం సహశుంఠ్యాచ దశమూలాతిసారకే। సామేచధాన్యశుంఠీభ్యాం పక్వేచ కుటజం మధు। సన్నిపాతజ్వరారంభే పిప్పల్యార్ద్రికవారిణా। కంటకార్యారసైః కాసే శ్వాసేతైలంగుడాన్వితమ్। పీత్వావటీద్వయంరోగీ స్వాస్థ్యంసముపగచ్ఛతి। సర్వేషామేవరోగాణా మామదోషప్రశాంతయే। అగ్నివృద్ధికరోనామ్నా ఖ్యాతోగ్నికుమారకః॥

తా. మిరియాలు వసచంగల్వకోష్ఠు తుంగముస్తెలు వీనికన్నిటికిసమము నాభి ఇటుల వీనిని గ్రహించి అల్ల పురసముచే మర్దించి గురిగింజ ప్రమాణము మాత్రలు చేయవలయును. దీనిని ఆమజ్వరమునందు తొలుత శొంఠి తేనె వీని యనుపానము తోడను పిదప అల్ల పురసముతోడను కఫజ్వరమునందు వావిలిరసముతోడను పీనసము ప్రతిశ్యాయము వీనియందు అల్ల పురసముతోడను అగ్నిమాంద్యమునందు లవంగముల తోడను శోఫరోగమునందు దశమూలములతోడను గ్రహణిరోగమునందు శొంఠితోడను అతిసారమునందు దశమూలతోడను అజీర్ణజ్వరమునందు ధనియాలు శొం: వీని యనుపానముతోడను పక్వజ్వరమునందు కొడిసెవిత్తులు తేనె వీని యనుపానము తోడను సన్నిపాత జ్వరారంభమునందు పిప్పళ్లు అల్ల పురసము వీనియనుపానముతో డను కాసమునందు వాకుడు రసముతోడను శ్వాసమునందు నూనె బెల్లము వీని యనుపానముతోడను 2 మాత్రల నిప్పించిన రోగికి సౌఖ్యము కలుగును. మఱియు సమస్త రోగములయందును ఆమదోషము నివర్తించుటకై వీని నిప్పించవలయును. ఇది అగ్నికుమార రసమనబడును. ఇది జాఠరాగ్నిని వృద్ధిజేయును.

## సర్వజ్వరాతిసారములకు మేఘనాదరసము.

శ్లో॥ తారంకాంస్యంమృతంతామ్రం త్రిభిస్తుల్యంచగంధకమ్। క్వాథేనమేఘనాదస్య పిష్ట్వారుధ్వాపుటేపచేత్। షడ్భిఃపుటైర్భవేత్సిద్ధో మేఘనాదోజ్వరాపహః। భక్షయేత్పర్ణఖండేన విషను

జ్వరనాశనః । అస్యమాత్రాద్విగుంజాస్యా త్పథ్యందుగ్ధౌదనం మతమ్ । నాగరాతివిషాముస్తాభూనింబామృతవత్సకైః । సర్వ జ్వరాతిసారఘ్నంక్వాథమస్యానుపాయయేత్ ॥

తా. రజతభస్మము కంచుభస్మము తామ్రభస్మము ఇవి సమభాగములు ఈ మూటికి సమము శుద్ధిజేసిన గంధకము వీనిని చిత్రమూలకషాయముచే బాగుగామర్దించి బిళ్ల జేసియెండనెండించి మూకుడులోనునిచి చీలమన్నుయిచ్చి పుటము వేయవలయును. ఇటులనే చిత్రమూలకషాయముచే మరల మర్దించి 5 పుటములు వేసిన శుద్ధంబగును పిదప వీనిని రెండుగురిగింజలయెత్తు తమలపాకులోనునిచి సేవించిన విషమజ్వరములు హరించును. వీనిని శొంఠి అతివస, తుంగముస్తెలు నేలవేము తిప్పతీగె కొడిసె వీని కషాయానుపానముతో సేవించిన సమస్తజ్వరాతిసారములు తరుణజ్వరము జీర్ణజ్వరము దప్పి దాహము ఇవి హరించును ఇదిమేఘనాద రసమనబడును. దీనియందు పాలతోగూడిన యన్నమును భుజించుట పథ్యము.

## చాతుర్థికజ్వరములు చాతురకారిరసము.

శ్లో॥ [గ్రంథాంతరే] హరితాళంశిలాతుత్థం శంఖచూర్ణంచగంధకమ్ । సమాంశంమర్దయేత్ఖల్వే కుమారీరససంయుతమ్ । సరావసంపుటేకృత్వా దత్వాగజపుటేపచేత్ । కుమారికారసైర్నైవవల్లమాత్రా వటీకృతా । దత్తాశీతజ్వరంహంతి చాతుర్థంతు విశేషతః । మరీచఘృతయోగేన తక్రంపీత్వాచరేద్వటీమ్ । ఏతయా వమనం భూత్వా జ్వరస్తస్మాద్వినశ్యతి॥

తా. శుద్ధిజేసిన హరిదళము శుద్ధిజేసిన మణిశిల శుద్ధిజేసిన పాలతుత్తము శంఖచూర్ణము శుద్ధిజేసిన గంధకము వీనిని సమభాగములుగా గ్రహించి ఖల్వములోనునిచి కలబందరసముచే మర్దించి యెండనెండించి మూకుళ్లలోనునిచి చీలమన్ను యిచ్చి గజపుటంబిడి స్వాంగశీతలమున గ్రహించి మరల కలబందరసముచే మర్దించి 3 గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని సేవించిన శీతజ్వరములు విశేషముగా చాతుర్థికజ్వరములు హరించును. మిరియములపొడి నెయ్యి మజ్జిగలో కలిపి పానముజేసి పిదప ఒక మాత్రను సేవించిన వమనంబై జ్వరము హరించును.

## సర్వజ్వరములకు చింతామణిరసము.

శ్లో॥ [గ్రంథాంతరే] రసంగంధంమృతంతామ్రం మృతమభ్రంఫల త్రికమ్ । త్ర్యూషణందంతిబీజంచ సమంఖల్వేవిమర్దయేత్ । ద్రోణపుష్పీరసైర్భావ్యం శుష్కంతదుపపాలితమ్ । చింతా మణిర సోహ్యేషత్వజీర్ణేశస్య తేసదా । జ్వరమష్టవిధంహంతి సర్వశూల నిషూదనమ్ । గుంజైకంవాద్విగుంజంవా దేయ మార్ద్రికవారిణా ॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన గంధకము తామ్రభస్మము కరకతాండ్రయు సిరికలు శొంఠి పిప్పలి మిరియాలు శుద్ధిజేసిన నేపాళములు వీనిని సమభాగములుగా ఖల్వములోనుంచి తుమ్మిపూలరసముచే మర్దించిదానిరసముచేత నే భావన జేసియెండిం చి రోగబలాబలము నెఱిగి ఒకటి లేక 2 గురిగింజల ప్రమాణమునుఅల్లపురసానుపాన ముతో సేవించిన అజీర్ణజ్వరమును అష్టవిధజ్వరములను సమస్తశూలలనుబోకడచును. ఇది చింతామణిరస మనబడును.

## సర్వజ్వరహర కషాయము.

శ్లో ॥ భార్గ్యబ్దపర్పాటక ధన్వయాసవిశ్వభూనింబ కుష్ఠకణాసింహ మృతవాసాకషాయః ॥ జీర్ణజ్వరం సతతసంతతకం నిహన్యా దన్యేద్యుకం సహతృతీయచతుర్థకంచ.

తా. గంటుభారంగి తుంగగడ్డలు పర్పాటకము * రేగటిదూల శొంఠి నేల వేము చెంగల్వకోష్టు పిప్పళ్లు నేలములక తిప్పతీగె అడ్డసరపు యీనెలు వీనిని సమ భాగములుగా దంచి కషాయము బెట్టి సేవించిన సర్వజ్వరములు హరించు.

## శీతజ్వరహర కషాయములు.

శ్లో ॥ [మాధవనిదానే] రామలక్ష్మణసీతాశ్చ రావణోనవిభీషణః। కుంభకర్ణసహాయుక్తం కషాయంసముపాచరేత్ । జానకీచూర్ణసంయుక్తం శీతజ్వరవినాశనమ్ ॥

* రేగటిదూల ఇదే సుగపగొండి.

తా. నేలవేము లక్ష్మణపంజి పర్పాటకము పెద్దమాను తానికాయ రక్కసి వీనిని కషాయముజెట్టి అందు పిప్పలిచూర్ణము కలిపి త్రాగిన శీతజ్వర హరించును.

శ్లో॥ మత్స్యకూర్మవరాహశ్చ నారసింహశ్చవామనః।
రామోరామశ్చరామశ్చ బుద్ధకఃకలిమేవచ ।
అవతారేణసంయుక్తం శీతజ్వరవినాశనమ్ ।

తా. కటుకరోహిణి నందివృక్షము పెన్నేరుగడ్డలు అడ్డసరముఊడుగు తెగరికె నేలవేము చిట్టాముదపువేళ్లు (కలుగ్రాను) తావిచిగుళ్లు చిత్రమూలమువీః కషాయముజెట్టిత్రాగిన శీతజ్వరము హరించును.

శీతజ్వరమునకు క్షుద్రాది కషాయము.

శ్లో॥ క్షుద్రాధాన్యకశుంఠిభిః గుడూచీముస్తపద్మకైః ।
రక్తచందపభూనింబ పటోలవృషపుష్కరైః ।
కటుకేంద్రయవారిష్ట భార్గీపర్పటకైస్సమైః ।
క్వాథంప్రతిని షే.వేత సద్యశ్శీతజ్వరచ్ఛిదమ్ ॥

తా. వాకుడు ధనియాలు శొంఠి తిప్పతీగె తుంగముస్తెలు పద్మకము రక్తచందనము నేలవేము చేతిపాట్ల అడ్డసరము పుష్కరమూలము కటుకరోహిణికొడిసె వేప గంటుబారంగి పర్పాటకము వీనిని సమ భాగములుగాచేర్చి కషాయముగాచియిప్పించిన శీతజ్వరము తత్క్షణమే నివర్తించును.

సర్వజ్వరములకు భూనింబాది కషాయము.

శ్లో॥ భూనింబదారుదశమూలమహౌషదాబ్ద తిక్తేంద్రబీజధనకేభ
కణాకషాయః । తంద్రాప్రలాపకసనారుచి దాహమోహ
శ్వాసాదియుక్తమఖిలంజ్వరమాశుహంతి ॥

తా. నేలవేము దేవదారు దశమూలములు శొంఠి తుంగముస్తెలు చేతిపాట్ల కొడిసెవిత్తులు ధనియాలు ఏనుగపిప్పళ్ళు వీని కషాయము తంద్ర పలవరింతకాసము

అరుచి సర్వాంగతాపము మోహము శ్వాసము యీ మొదలగువానితో గూడియుండు దారుణమయిన జ్వరములన్నిఁటిని అతిశీఘ్రముగా హరింపజేయును.

## విషమజ్వరములకు దార్వ్యాదికషాయము.

శ్లో॥ దార్వీదారుకళింగలోహితలతా శమ్యాకపాఠాసఠీ । శౌండీ
పీరి కిరాతకుంజర కణా త్రాయంతికాపద్మకైః। చక్రాధాన్యక
నాగరాక్షు సరళాశీఘ్రాంబుసింహీశివా । వ్యాఘ్రీపర్పటదర్భ
మూలకటుకానంతా మృతాపుష్కరైః । ధాతూత్థం విష
మంత్రిదోషజనితం ఏకాహికంద్వ్యాహికమ్ । శీతోహంతి
మహావ్యథంబహురుజం సద్యఃప్రలాపాన్వితమ్ ॥

తా. మానిపసపు దేవదారు కొడిసె రక్తచందనము కస్తురి రేల విషజొద్దిక చోరములు పిప్పళ్లు పిల్లి పీచర నేలవేము ఏనుగుపిప్పళ్ళు కలుత్రానుగు పద్మకముచక్రా ధనియాలు శొంఠి తానికాయ సరళదేవదారు శీఘ్రా జలము నేలములక కరక్కాయ వాకుడు పర్పాటకము దర్భవేళ్ళు కటుకరోహిణి సుగంధిపాల తిప్పతీగ పుష్కర మూలము వీనితో సిద్ధముజేయబడిన కషాయమునిప్పించిన ధాతుజనితము విషమము త్రిదోషజనితము ఏకాహికము ద్వ్యాహికము యీ మొదలగు జ్వరములు పలవరింత అధికశూల వీడ వీనితోగూడియుండు దారుణజ్వరములు ఇవి అతిశీఘ్రముగా హరించును.

## శ్లేష్మజ్వరాదులకు దశమూలకషాయము.

శ్లో॥ శాలిపర్ణీపృశ్నిపర్ణీ బృహతీద్వయగోక్షురైః । బిల్వాగ్ని
మంథశ్యోనాక కాశ్మరీపాటలాయుతైః । దశమూలమితి
ఖ్యాతం క్వథికంతజ్జలంపిబేత్ । పిప్పలీచూర్ణసంయుక్తం
వాతశ్లేష్మహరంపరమ్ । సన్నిపాతజ్వరంహంతి సూతికాదోష
నాశనమ్ । తద్కంఠగ్రహపార్శ్వార్తి తంద్రామస్తకశూల
హ్యాత్ ॥

తా. కోలపొన్న నేలపొన్న చిన్నములక పెద్దములక పల్లేరు మారేడుతక్కలి దుందిలము నేలగుమ్మడు కలిగొట్టు వీనివేళ్లు దశమూలములనబడును. వీనికషాయ

ముసు పిప్పలిచూర్ణసహితము గానిప్పించిన వాతశ్లేష్మజ్వరము సన్నిపాతజ్వరముసూతి దోషము మెడపట్లు పార్శ్వశూలతంద్రతలనొప్పి వీటిని శీఘ్రముగా హరింపజేయును.

## కఫరోగమునకు కట్ఫలాదికషాయము.

శ్లో॥ కట్ఫలాంబుదభార్గీభి ర్ధాన్యరోహిషపర్పటైః ।
వచాహరీతకీశృంగీ దేవదారు మహౌషధైః ।
క్వాథఃకాసజ్వరహంతి శ్వాసశ్లేష్మగళగ్రహాన్ ॥

తా. కాయఫలము తుంగముస్తెలు గంటుభారంగి ధనియాలు కామంచిగడ్డ పర్పాటకము వస కరక్కాయ కర్కాటకశృంగి దేవదారు శొంఠి వీనికషాయము కాసయుక్తజ్వరము శ్వాసము శ్లేష్మము మెడపట్లు వీటిని హరింపజేయును.

## కఫాదిజ్వరములకు శృంగ్యాదికషాయము.

శ్లో॥ శృంగీదారునిశాసురాహ్వామ భయా భార్గీ చవిశ్వౌషధమ్ ।
ముస్తాపర్పటకట్ఫలంచసవచా కుస్తుబరం కత్రృణం ।
క్వాథంక్షౌద్రయుతంపిబేచ్చకఫజే కాసేక్షయేపీనసే ।
శ్వాసేవాతయుతేజ్వరేచవమనే హిక్కాసుపిత్తామయే॥

తా. కర్కాటకశృంగిమ్రానిపసపు దేవదారుచెక్కకరక్కాయగంటుభారంగి శొంఠి తుంగముస్తెలు పర్పాటకము కాయఫలము వస ధనియాలు కామంచిగడ్డి వీని కషాయమును తేనె సహితముగా పానముచేయించిన కఫమువలన జనించిన కాసము క్షయము పీనసము శ్వాసము వాతజ్వరము వాంతి ఎక్కిళ్లు పిత్తరోగము వీటిని నశింపజేయును.

## త్రిదోషజ్వరమునకు క్షుద్రాదికషాయము.

శ్లో॥ క్షుద్రామృతానాగరపుష్కరాహ్వైః కృతః కషాయః కఫమారుతోత్తరే । సశ్వాసకాసారుచిపార్శ్వశూలే జ్వరేత్రిదోషప్రభవేప్రశస్యతే॥

తా. వ్రాయుడు తిప్పతీగ శొంఠి పుష్కరమూలము వీటికషాయము శ్లేష్మవాత ప్రకోపము శ్వాసకాసములు అరుచి పార్శ్వశూల వీనితో గూడియుండు త్రిదోష జనితజ్వరమును నివర్తింపజేయును.

## అష్టవిధజ్వరాదులకు వృద్ధక్షుద్రాది కషాయము.

శ్లో॥ క్షుద్రానింబపటోలచందనఘనైస్తిక్తామృతాపద్మకైః।
వాసావేసణశుంఠిపుష్కరజటా భూనింబభార్గ్యాసహా।
బీజంకుష్ఠధమాపకం కృమిరుజం కాసంవమింకామలం।
క్వాథంచాష్టవిధంజ్వరం కఫమరుత్పిత్తంసదాహంజయేత్॥

తా. వ్రాయుడు వేము పొట్ల చందనము తుంగముస్తెలు చేతిపొట్ల తిప్పతీగె పద్మకము అడ్డసరము వేసనము శొంఠి పుష్కరమూలము జటామాంసి నేలవేముగంటు భారంగి వేగిస చెంగల్వకోష్టు దురదగొండి వీనికషాయము కృమిరోగము కాసము వాంతి కామిల అష్టవిధజ్వరములు సర్వాంగతాపముతో గూడియుండు కఫవాత పిత్తము వీనిని నశింపజేయును.

## అజీర్ణాదిజ్వరములకు కిరమాలాపంచక కషాయము.

శ్లో॥ ఆరగ్వధగంధకతిక్తముస్తా హరీతకీభిః క్వథితంకషాయః।
సామేసశూలే కఫవాయుక్తే జ్వరేహితో దీపలపాచనశ్చ॥

తా. రేల మునగ నేలవేము తుంగముస్తెలు కరక్కాయ వీనితో సిద్ధముచేయ బడిన కషాయము అజీర్ణము శూల కఫవాతము వీనితోగూడియుండు జ్వరమును హరింపచేయుటయేగాక అగ్నిదీప్తిని ఆమపాకమును గలుగజేయును.

## వాతపిత్తజ్వరములకు పంచభద్రకషాయము.

శ్లో॥ పర్పటాబ్దామృతావిశ్వాకైరాతంసాధితంజలమ్।
పంచభద్రమిదంజ్ఞేయం వాతపిత్తజ్వరాపహమ్॥

తా, పర్పాటకము తుంగముస్తెలు తిప్పతీగ శొంఠి నేలవేము వీనితో సిద్ధము చేయబడిన కషాయము పంచభద్రమనబడును. ఇదివాతపిత్తజ్వరమును బోకడచును.

## వాతజ్వరమునకు శఠ్యాదికషాయము.

శ్లో॥ శఠీపుష్కరమూలంచ భార్గీశృంగీదురాలభా ।
గుడూచీనాగరాపాఠా కిరాతంకటురోహిణి ।
ఏషశఠ్యాదిజః క్వాథః సర్వవాతజ్వరాపహః ।
కాసాదిశోషయుక్తేషు దద్యాత్సోపద్రవేషుచ ॥

తా. కచోరములు పుష్కరమూలము గంటుభారంగి కర్కాటకశృంగిదురదగొండి తిప్పతీగె శొంఠి విషబొద్ది నేలవేము కటుకరోహిణి వీనితో సిద్ధముచేయబడిన కషాయము శఠ్యాదికషాయము మనబడును. ఇది సమస్తవాతజ్వరములను పోగొట్టును. కాసము శోష ఉపద్రవములు వీనితో గూడియుండు జ్వరమునందు హితకరము.

## శ్లేష్మజ్వరాదులకు బృహచ్ఛఠ్యాదికషాయము.

శ్లో॥ శఠీపటోలద్వినిశోగ్రగంధావాసాకిరాతం దశమూలధారా ।
సహాచరీభార్గి వరీసశృంగీరాస్నేంద్ర బీజంసురదారుశిగ్రుః ।
దురాలభ ధాన్యకశుంఠిపాఠాసురేంద్రకల్కం సహరీతకీభిః ।
త్రాయంతికైంద్రీ కటుకాగదంచ కషాయమేషాంవిహితస్సు వాయా శ్లేష్మజ్వరే కాసనశ్వాస శూలేవాతాధికేరోగిణిశీతకేచ । చిరజ్వరేమష్టమలగ్రహేపి నూనంహితోయం సతతం శఠ్యాదిః॥

తా, కచోరములు పొట్ల పసుపు మానిపసుపు వస అడ్డసరము నేలవేముదశమూలములు ధారా ములుగోరింట గంటుభారంగి పిల్లిపీచర కర్కాటక శృంగిసన్నరాస్నము కొడిసెవిత్తులు దేవదారు మునగ దురదగొండి ధనియాలు శొంఠి విషబొద్ది సరళదేవదారుచెక్క కరక్కాయ కలుక్కానుగ పెద్దసాపగ కటుకరోహిణి చంగల్వకోష్టు వీనితో సిద్ధముచేయబడినకషాయము శఠ్యాదికషాయమనబడును. ఇది శ్లేష్మజ్వరము శ్వాసకాసములు శూల వాతప్రకోపజ్వరము శీతజ్వరము పురాణజ్వరము దుష్టమలబంధము వీటిని హరింపజేయును.

## వాతజ్వరమునకు పటోలాదికషాయము.

శ్లో॥ పటోలీచగుడూచీచ ముస్తాచైవధమానకమ్ ।

నింబత్వక్పర్పటంతిక్తా భూనింబత్రిఫలావృషాః ।
పటోలాదిరయంక్వాథః వాతజ్వరహరస్మృతః ॥

తా. పొట్ల తిప్పతీగె తుంగముస్తెలు దురదగొండి వేపపట్ట పర్పాటకము చేదుపొట్ల నేలవేము త్రిఫలములు అడ్డరసము వీనితో సిద్ధముచేయబడిన కషాయము పటోలాదియనబడును. ఇది వాతజ్వరమును పోగొట్టును.

## వాతకఫజ్వరమునకు వృద్ధముస్తాదికషాయము.

శ్లో॥ ముస్తాగుడూచీసహనాగరేణ వాసాజలంపర్పటకంచపథ్యా ।
క్షుద్రాచదుస్స్పర్శయుతఃకషాయఃపీతోహితోవాతకఫజ్వరేచ

తా. తుంగముస్తెలు తిప్పతీగె శొంఠి అడ్డరసము వట్టివేరు పర్పాటకము కరక్కాయ దురదగొండి వాకుడు వీనితో సిద్ధము చేయబడిన కషాయము నిష్పించిన వాతకఫజ్వరము నివర్తించును.

## పిత్తజ్వరమునకు గుడూచ్యాది కషాయము.

శ్లో॥ గుడూచీనింబధాన్యాకం పద్మకంరక్తచందనమ్ ।
ఏషసర్వజ్వరంహంతిగుడూచ్యాదిస్తుదీపనః ॥

తా. తిప్పతీగె వేము ధనియాలు పద్మకము రక్తచందనము వీనిలో సిద్ధము చేయబడిన కషాయము గుడూచ్యాది యనబడును. ఇది సమస్తజ్వరములను హరింపజేయును. అగ్నిదీప్తిని కలుగజేయును.

## పిత్తజ్వరమునకు త్రాయమాణాదికషాయము

శ్లో॥ త్రాయంతీపర్పటోశీర తిక్తాభూనింబదుస్పర్శా ।
కషాయోమధుసంయుక్తః పిత్తజ్వరవినాశనః ॥

తా. కలుత్రాగుడు పర్పాటకము వట్టివేరు చేదుపొట్ల నేలవేము దురదగొం వీనితో సిద్ధముచేయబడిన కషాయము తేనె సహితముగా నిష్పించిన పిత్తజ్వరమ నివర్తించును.

## పిత్తశ్లేష్మజ్వరమునకు వృద్ధత్రాయమాణాదికషాయము.

శ్లో॥ త్రాయంతీంద్రయవావాసా ఛిన్నాతి క్తపటోలకైః ।

నింబదుస్పర్శభూనింబ సమ్యాకప్రద్మకపర్పటైః ।
అష్టావశేషితఃక్వాథ పిత్తశ్లేష్మజ్వరాపహః ॥

తా. కలుగ్రొనుగు కొడిసె అడ్డరసము తిప్పతీగ చేదుపొట్ల వేము దురద గొండి నేలవేము పద్మకము పర్పాటకము వీటినిజేర్చి అష్టావశేషముగా కాచబడిన కషాయము పిత్తశ్లేష్మజ్వరమును నివర్తిజేయును.

విషమజ్వరమునకు వాసాదికషాయము.

శ్లో॥ వాసాక్షుద్రామృతాముస్తా శుంఠీధాత్రీసమాక్షికః ।
పిప్పలీచూర్ణసంయుక్తో విషమజ్వరనాశనః ॥

తా. అడ్డరసము వ్రాకుడు తిప్పతీగ తుంగముస్తెలు శొంఠి ఉసిరికెవరుగు వీనికషాయమును తేనె పిప్పలి చూర్ణ సహితముగా నిప్పించిన విషము.జ్వరము నివర్తించును.

ఏకాహికజ్వరమునకు పటోలాదికషాయము.

శ్లో॥ పటోలంత్రిఫలానింబ ద్రాక్షాశమ్యాకవాసకైః ।
క్వాథంసితామధుయుతం పిబేదేకాహికజ్వరే॥

తా. పొట్ల త్రిఫలములు వేము ద్రాక్ష రేల అడ్డసరము వీనికషాయమును పంచదార తేనె రనిసహితముగా పానముచేసిన ఏకాహిక జ్వరము నివర్తించును.

త్ర్యాహికజ్వరమునకు గుడూచ్యాదికషాయము.

శ్లో॥ గుడూచీధాన్యముమస్తాభి శ్చందనోశీరనాగరైః ।
కృతంక్వాథంపిబేత్ క్షౌద్ర సితాయుక్తంజ్వరాతురః॥
తృతీయజ్వరనాశాయతృష్ణాదాహనివారణమ్ ।
పీతోమరీచచూర్ణేన తులసీపత్రగోరసః ।
ద్రోణపుష్పీరసోవాపి నిహంతివిషమజ్వరాన్ ॥

తా. తిప్పతీగ ధనియాలు తుంగముస్తెలు చందనము వట్టివేరు శొంఠివీనితో సిద్ధము చేయబడిన కషాయమును తేనె పంచదార వీని సహితముగా నిప్పించిన త్ర్యాహిక జ్వరము దప్పి సర్వాంగతాపము ఇవి నివర్తించును. మఱియు తులసి

స్వరసములో గాని లేక తుమ్మిపూలరసములో గాని మిరియాలచూర్ణమునుకలిపిపానము చేయించిన విషమజ్వరము హరించును.

## పురాణజ్వరములకు మహాలవంగాదిచూర్ణము.

శ్లో॥ [పూజ్యపాదీయే] భృంగంనాగాంగ కైలామరిచమగధజానాగరంవాజిగంధా । భృంగంస్యాదేకభాగం ద్వయహరికుసుమం ద్రావిళీవేదభాగా । మారీచంచాష్టభాగంతదపిమగధజాభాగ శ్షోడశోక్తాః । ద్వాత్రింశచ్ఛృంగిబేరంచతురధికయుతావాజిగంధాచషష్టిః । ఏతేషాంసూక్ష్మచూర్ణం సమసితసహితం సోష్ణధారంకఫఘ్నమ్ । పిత్తఘ్నంపాండుగుల్మజ్వరగురుగుద జారోచకాజీర్ణనాశమ్ । భృంగశ్వాసాది హిక్కాజ్వరజఠర మహాశ్వాసహృద్రోగనాశమ్ । భృంగాఖ్యంచైకబాహుంసకలగదహరంభాషితంపూజ్యపాదైః॥

తా. లవంగపుచెక్క 1 భాగము నాగకేసరములు 2 భాగములు ఏలకులు 4 భాగములుమిరియాలు 8 భాగములు పిప్పళ్లు 16 భాగములు శొంఠి 32 భాగములు * డొమ్మడోలుగడ్డ 64 భాగములు యిట్టుల వీనినిచూర్ణము జేసి దానికిసమము పంచదారగలిపి వుష్ణోదకముతో నేనివుష్ణధారలతో నేని సేవించినకఫముపిత్తము పాండువు గుల్మము పురాణజ్వరము మూలవ్యాధి అరుచి అజీర్ణము భృంగశ్వాసము యెక్కిళ్లు జ్వరము వుదరరోగము మహాశ్వాసము హృద్రోగము యేకబాహు జనితవాతరోగము యీ మొదలగు సర్వరోగములు హరించునని పూజ్యపాదమహర్షి వచించెను. ఇదిలవంగాది చూర్ణము.

## పురాణజ్వరక్షయాదులకు ఏలాదిచూర్ణము.

శ్లో॥ [పూజ్యపాదీయే] ఏలాత్వక్పత్రనాగామరిచ మగధజానాగరః కుందురుష్కమ్ । తక్కోలకోష్ఠజాతీ ఫలమమృతలతా సా॥ భూనింబవాసాః । ఉపష్టిత్రాతాలీకచోరం మలయజఖదిరంతీరి వారంప్రియంగుః । హ్రీబేరంధాన్యజాజీశతకుసుమవచాభార్గి

---

* ఇదే పెన్నేరుగడ్డయనియు జెప్పబడును.

ముస్తాశ్చతి క్తమ్ । సర్వాంసమ్యక్సుచూర్ణం సమసితసహితం శ్లేష్మపిత్తజ్వరఘ్నమ్ । పిత్తంవై పాండురోగాక్షయమదగుద జారోచకాగుల్మజీర్ణమ్ । హంతిశ్వాసాదిహిద్వాజ్వరజఠర మహాకాసహృద్రోగనాశనమ్ । ఏలాద్యంయోగరాజంసకల జనహితంభాషితంపూజ్యపాదైః॥

తా. ఏలకులు * దాచినిచెక్క ఆకుపత్రి నాగకేసరములుమిరియాలు పిప్పళ్లు కుందురుష్కము తక్కోలము చంగల్వకోష్టు జాజికాయ తిప్పసత్తు నేలవేము అడ్డసరపు యీనెలు యష్టిమధుకము దీపద్రాక్ష కచోరములు శ్రీగంథము చంద్రచెక్క మనుబాలవేళ్లు పేంకణము కురువేరు కొతిమెర్ల జాజిమొగ్గలు చామంతులు వసగంటు భారంగితుంగముస్తెలు కటుకరోహిణి వీనిని సమభాగములుగా గ్రహించి సూక్ష్మచూర్ణముచేసి దానికి సమము పంచదారగలిపి వుష్ణోదకములో సేవించిన శ్లేష్మపిత్త జ్వరములు పిత్తము పాండురోగము క్షయరోగము మదము మూలవ్యాధి అరుచి గుల్మము పురాణజ్వరములు శ్వాసకాసలుయెక్కిళ్లు అంతర్గతజ్వరము మహాశ్వాసము బొమ్మనొప్పి యివినశించును. ఇదియేలాదిచూర్ణమనబడును. ఈశ్రేష్ఠమైనయోగము సర్వజనులకు హితకరమని పూజ్యపాదమహర్షి వచించెను.

ఏకాహికాదిజ్వరములకు నింబాదిచూర్ణము.

శ్లో॥ నింబపత్రవరావ్యోష యవానీలవణత్రయమ్ । క్షారోదిగ్వహ్నిరామేషుత్రినేత్రక్రమశోంశకాః । సర్వమేకంకృతంచూర్ణంప్రత్యూషేభక్షయేన్నరః । యేకాహికంద్వ్యాహికంచ తద్వాత్రిదివసజ్వరమ్ ॥ చాతుర్థికంమహాఘోరం సతతంసంతతందివా । ధాతుస్థంచ త్రిదోషోత్థం జ్వరంహంతి నసంశయః॥

తా. వేపాకు 4 భాగములు త్రిఫలములు 3 భాగములు త్రికటుకములు 3 భాగములు ఓమము 5 భాగములు మూడువిధములయి నలవణములు 3 భాగములు క్షారము 3 భాగములు యిటులవీనినన్నిటిని నొకటిగాజేర్చి చక్కగా చూర్ణముచేసి ప్రాతఃకాలమునందు భక్షించిన యేకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికజ్వర

* ఇదే లవంగపుచెక్క.

ములు దారుణమైన సతత సంతతజ్వరములు దివాజ్వరము ధాతుగతజ్వరము త్రిదోష జ్వరము ఇవి యన్నియు నివర్తించును.

## జ్వరములకు సుదర్శనచూర్ణము.

శ్లో॥ కాలీయకంతురజనీ దేవదారువచాఘనమ్ । అభయాధన్వయా సాచశృంగీక్షుద్రామహౌషధమ్ ॥ త్రాయంతీ పర్పటంనింబం గ్రంధికంబాలకంశఠీ । పౌష్కరంమాగధీమూర్వా కుటజంమధుయష్టికా॥ శిగ్రూద్భవం సేంద్రయవం వరీదార్వీసుచందనమ్ । పద్మకం సరళోశీరత్వచంసౌరాష్ట్రికాస్థిరా ॥ యవాన్యతివిషా బిల్వంమరిచంగంధపత్రకమ్ । ధాత్రీగుడూచీ కటుకంసచిత్రక పటోలకమ్ ॥ కలశీచైవసర్వాణి సమభాగానికారయేత్ । సర్వద్రవ్యస్య చార్ధంతు కైరాతంసం ప్రకల్పయేత్ । ఏతత్సుదర్శనంనామ జ్వరాన్హంతి నసంశయః ॥ పృధగ్దోషాంశ్చ వివిధాన్ సమస్తాన్విషమజ్వరాన్ । ప్రాకృతంవైకృతంచాపి సౌమ్యంతీక్ష్ణమథాపివా ॥ అంతర్గతం బహిస్థంచ నిరామంసామ మేవచ। జ్వరమష్టవిధంహంతి సాధ్యాసాధ్యమథాపివా । నానా దోషోద్భవంచయివ వారికోషభవంతథా ॥ విరుద్ధభేషజభవం జ్వరమాశువ్యపోహతి । ప్లీహానంయకృతంగుల్మం హంత్యవశ్యంనసంశయః ॥ యథాసుదర్శనం చక్రందానవానాంనిషూదనమ్ । తథాజ్వరాణాంసర్వేషామిదమేవనిగద్యతే ॥

తా. మ్రానిపసుపు పసుపు దేవదారు వస తుంగముస్తెలు కరక్కాయదుసద గొండి కర్కాటకశృంగి వాకుడు శొంఠి కలుగొనుగు పర్పాటకము వేము గ్రంధి తగరము వట్టివేరు కచోరములు పుష్కరమూలలను పిప్పళ్లు చాగకొడిసె యష్టిమధుకము మునగవిత్తులు కొడిసెపాల చల్లపిల్లగడ్డలు మ్రాని పచందనము పద్మకము దేవదారు వట్టివేరు లవంగపట్ట కోరగాయి మయ్యాకుపొన్న సురాసోనిటీసుసు అతివస మారేడు మిరియాలు గంధపత్రి ఉసిరిక తిప్పతీగె కటుకరోహిణి చిత్రమూలము పొట్లనక్కతోక పొన్న వీనినన్నిటిని సమభాగములుగాచేర్చి దీనిలో సగము నేల వేమునుచేర్చి చూర్ణము చేయవలయును. ఇదిసుదర్శన చూర్ణమనబడును, ఇదిప్రత్యేక

## సర్వజ్వరములకు జ్వరభైరవచూర్ణము.

దోషములచే జనించిన జ్వరములు విషమజ్వరము ప్రాకృతజ్వరము నిరామజ్వరవ
సామజ్వరము సాధ్యజ్వరము అసాధ్యజ్వరము పలు దోషములచే జనించిన జ్వరవ
లు జలదోషమువలన జనించిన జ్వరము విరుద్ధౌషధము వలన జనించిన జ్వరము ప్లీ
హాము యకృత్తు గుల్మము యీమొదలగు రోగములను సుదర్శన చక్రము అసురులన
నశింపచేసి నటువలెనే నశింపజేయును.

శ్లో॥ నాగరంత్రాయమాణాచపిచుమందదురాలభా । పథాముస్తా
వచాదారువ్యాఘ్రీశ్శృంగీశతావరీ ॥ పర్పటం పిప్పలీమూలం
విశాలాపుష్కరంశటీ । మూర్వాకృష్ణాహరిద్రేద్వేలోధ్రచం
దనముత్పలమ్ । కుటజన్యవరంవల్కం యష్టీమధుకచిత్రకం ।
శోభాంజనం బలాచాతి విషాచకటురోహిణీ ॥ ముసలీ పద్మ
కాష్ఠంచయవానీశాలపర్ణికా । మరిచంచామృతా బిల్వంబా
లంపాకస్యపర్పటీ ॥ తేజపత్రం త్వచంధాత్రీపృశ్నిపర్ణీపటోల
కమ్ ।గంధకంపారదంలోహ మభ్రకంచమనశ్శిలా ॥ ఏతేషాం
సమభాగేనచూర్ణమేవం వినిర్దిశేత్ । తదర్థంప్రక్షిపేత్తత్ర
చూర్ణంభూనింబసంభవమ్ । మాత్రామస్యప్రయుంజీతదృష్ట్వా
దోషబలాబలమ్ । చూర్ణంభైరవసంజ్ఞంతు జ్వరాన్హంతినసం
శయః ॥ పృథగ్దోషాంశ్చవివిధాన్ సమస్తాన్ విషమజ్వరాన్ ।
ద్వంద్వజాన్ సన్నిపాతోత్థాన్ మానసానపినాశయేత్ ॥
ప్రాకృతంవైకృతంచైవ సౌమ్యంతీక్ష్ణమథాపివా । అంతర్గతంబ
హిఃస్థంచనిరామంసామమేవచ ॥ జ్వరమష్టవిధంహంతిసాధ్యా
సాధ్యంనసంశయః । నానాదోషోద్భవంచైవ వారిదోషభవం
తథా । విరుద్ధభేషజభవం జ్వరమాశువ్యపోహతి । అగ్ని
మాంద్యయకృత్ ప్లీహ పాండురోగమరోచకమ్ ॥ ఉదరా
ణ్యాంత్ర వృద్ధించరక్తపిత్తత్వగామయన్ । శ్వయథుంచశిర
శ్శూలం వాతామయరుజాంహరేత్ । జ్వరభైరవసంజ్ఞంతు
భైరవేణకృతంశుభమ్ ॥

తా. శొంఠి కలుగ్రాగానుగ వేము దుదరగొండి కరక్కాయ తుంగముస్తె లుపస దేవదారు వాకుడు కర్కాటకశృంగి పిల్లిపీచర పర్పాటకము మోడి పావర పుష్కర మూలము కచోరములు చాగపిప్పళ్లు పసుపు మ్రానిపసుపు లొద్దుగ చందనము నల్ల కలువ కొండిసెవిత్తులు లవంగపట్ట యష్టిమధుకము చిత్రమూలము మునగ ముత్తవపుల గము అతివస కటుకరోహిణి నేలతాటిగడ్డలు పద్మకాష్టము కురాసానిఓమము కోల పొన్న మిరియాలు తిప్పతీగె లేకమారేడు పద్మకము పర్పాటకము తేజపత్రము లవంగపుచెక్క ఉసిరికె నేలపొన్న పొట్ల శుద్ధిచేసినగంధకము రసము లోహభస్మము అభ్రకభస్మము మణిశిల వీనినన్నిటిని సమభాగములుగాచేర్చి చక్కగా చూర్ణము చేసి దీనికి ½ భాగము నేలవేము చూర్ణము కలిపి దోషబలానుసారముగా ప్రయోగించిన వాతపిత్తశ్లేష్మ దోషములు ద్వంద్వదోషము సన్నిపాతదోషము విషమజ్వరము ప్రాకృతము వైకృతము సౌమ్యము తీక్ష్ణము అంతర్గతము బాహ్యము నిరామము సామము సాధ్యాసాధ్యజ్వరములు నానాదోషములవలన జనించిన జ్వరములు జల దోషమువలన జనించినజ్వరము విరుద్ధాగధమువలనజనించిన రోగము అగ్నిమాంద్యము యకృత్తు ప్లీహము పాండువు అరోచకము ఉదరరోగము అంత్రవృద్ధి రక్తపిత్తము చర్మరోగము వాపు శిరశ్శూల వాతరోగము వీటినన్నిటినిహరింపజేయును ఇది భైరవ చూర్ణమనబడును. ఇది భైరవునిచే జెప్పబడినది

## సర్వజ్వరములకు ఆమలక్యాదిచూర్ణము.

శ్లో॥ ఆమలచిత్రకంపథ్యా పిప్పలీసైంధవంతథా।
చూర్ణతోయంకణోజ్ఞేయః సర్వజ్వరహరఃపరః।
భేదీరుచికర శ్లేష్మహంతాదీపనపాచనః॥

తా. ఉసిరికె చిత్రమూలము కరక్కాయ పిప్పళ్లు సైంధవలణము వీనినన్నిటి నొకటిగజేర్చి చేయబడిన చూర్ణము సర్వజ్వరములను పోగొట్టును. దోషములను భేదించును రుచినిపుట్టించును శ్లేష్మమును పోగొట్టును. అగ్నిదీపనము జీర్ణము వీటిని కలుగ జేయును.

## దుష్టజ్వరములకు హరీతక్యాదిచూర్ణము.

శ్లో॥ హరీతకీనింబపత్రం నాగరంసైంధవోనలః।
ఏషాంచూర్ణంసదాఖాదే ద్గర్జలజ్వరశాంతయే॥

తా. కరక్కాయ వేపాకు శొంఠి సైంధవలవణము చిత్రమూలము వీని చూర్ణమును సేవించిన జలదోషమువల్లన జనించిన దుష్టజ్వరములన్నియు శమించును.

## దుష్టజలజనితజ్వరమునకు కిరాతాదిచూర్ణము.

శ్లో॥ కిరాతతిక్తాత్రివృదంబుపిప్పలీ విడంగవిశ్వా కటురోహిణీరజః।
నిహంతిలీఢంమధునాతిసత్వరంసునుస్తరందుర్జలదోషజంజ్వరమ్

తా. నేలవేము తెగడ నీరుపిప్పళ్లు వాయువిడంగములు శొంఠి కటుకరోహిణి వీని చూర్ణమును తేనెతో నాకించిన దుష్టజలదోషముచే జనించిన జ్వరము అతిశీఘ్రముగా నివర్తించును.

## జ్వరములకు లాక్షాదితైలము.

శ్లో॥ లాక్షారససమంతైలం తైలాన్మస్తుచతుర్గుణమ్ । అశ్వగంధ నిశాదారు కాంతికుష్ఠాబ్దచందనమ్ । సమూర్వారోహిణీరాస్నాశతాహ్వామధుకైస్సమమ్ । సిద్ధంలాక్షాదికంనామ తైలమంగేనలేపితమ్ । సర్వజ్వరగ్రహోన్మాద మూర్ఛాపస్మారనాశనమ్ । యక్షరాక్షసభూతఘ్నంగర్భిణీనాంహితంవిదుః ॥

తా. లక్క వీసెడు తెచ్చి 4 వీసెల ఉదకముపోసి చాతుర్భాగావశేషముగా కషాయముకాచి వడియకట్టిఅకషాయమునకు సమమునూనె నాలుగింతలు ఆవు పెరుగు మీదినీళ్లునొకబానలోబోసి పెన్నేరుగడ్డ మానిపసుపు దేవదారుచెక్క రేణుకలు చెంగల్వకోష్టు తుంగముస్తెలు శ్రీగంధము చాగగడ్డలు కటుకరోహిణి దుంపరాష్ట్రిను సదాపాకు అతిమధురము ఇవి ప్రత్యేకము 1 తులప్రమాణము చూర్ణించివేసి తైలపక్వమున దించుకొనవలయును. ఇది లాక్షాదితైలమనబడును. అభ్యంజనాదులచే సమస్తజ్వరములు గ్రహపీడ ఉన్మాదయును మూర్ఛ అపస్మారము యక్షరాక్షసభూతాదిపీడ వీటిని హరింపజేయును. గర్భిణీస్త్రీలకు మిగుల హితకరమైనది.

## శీతజ్వరాదులకు హస్తికర్ణికతైలము.

శ్లో॥ హస్తికర్ణీబరాదుస్పృక్క్షీలీరాస్నాసురద్రుమైః । గాంధారీసహదేవీచతులసీసింధువారకః ॥పృథగ్దశఫలంక్షుణ్ణాం జలదోణే

విపాచయేత్ । చతుర్భాగావశేషేస్మిన్ తైలంప్రస్థద్వయం క్షిపేత్ ॥ గంధారిస్వరసంతైలం తుల్యంతక్రాఢకద్వయమ్ । లాక్షాయాస్స్వరసంచైవతైలంతుల్యం ప్రదాపయేత్ । వత్స కాతివిషాముస్తారాస్నా కాంతీపటోలికా । కుష్ఠకైదర్యకృమి జిత్స్వరాదార్వీకటుత్రయమ్ ॥ పిప్పలీమూల చవికా లశునం గృహధూమకమ్ । పృథకర్షవిచూర్ణ్యాథ శనైర్మృద్వగ్ని నాపచేత్ । యాతేనరక్షశ్రోతాయనవవస్త్రేణపేషయేత్ । తత్తైలంశ్రేష్ఠమభ్యంగపానేనవకర్మసు ॥ శీతజ్వరం నిహం త్యాశు పురాణజ్వరమేవచ । ఏకాహికం ద్వ్యాహికంచ త్ర్యాహికంచ చతుర్థకమ్ । విషమంచ త్రిదోషంచ హంతి సత్యం నసంశయః ॥

తా. బలురక్కసి 4 వీసెలు ముత్తవపులగము తీటకసింద నీలివేళ్లు దుంపరాష్ట్రము దేవదారు తక్కడ సహదేవి తులసి వావిలి వీటిని బ్రత్యేక ప్రత్యేకము 10 పలముల చొప్పున గ్రహించి తునకలుచేసి 4 పళ్లు నీళ్లుబోసి చతుర్భాగావశేషముగా కషాయముకాచి దానిలో 2 ప్రస్థములు నువ్వులనూనె తక్కడాకుస్వరసము 2 ప్రస్థములు త్రక్రము 2 ఆఢకములు లక్కస్వరసము 2 ప్రస్థములు వీటినిచేర్చి కాచవలయు కాగునపుడంసుకొడిసెపాలవిత్తులు అతిరస తుంగముస్తెలు దుంపరాష్ట్రము రేణుకలు వెట్టిపాట్ల చంగల్వకోష్టు కరివేపాకు వాయువిడంగములు అగరు కొంతి ప్రామానిపసపు త్రికటుకములు ఓమము చిత్రమూలము లవంగపుచెక్క కటుకరోహిణి కచోరములు అగరుచెక్క మంజిష్టి సదాప తక్కోలాలు గంటుభారంగి మోడి చవ్యము వెల్లుల్లి కరుధూపము వీటిని ప్రత్యేక ప్రత్యేకము కర్ష ప్రమాణముగ్రహించి చూర్ణముచేసివైచి మృద్వగ్నిచే మెల్లగపక్వముచేసి నూతనవస్త్రముచే వడియకట్టవలయును. ఈ తైలము అభ్యంగము పానముమొదలగు కర్మలయందు మిగుల శ్రేష్ఠమైనది. ఇది శీతజ్వరము పురాణజ్వరము ఏకాహికము త్ర్యాహికము ద్వ్యాహికవ చతుర్థకము విషమము సన్నిపాతకము వీటిని నిస్సంశయముగా హరింపజేయును.

## సర్వజ్వరములకు అంగారకతైలము.

శ్లో॥ మూర్వాలాక్షా హరిద్రేద్వే మంజిష్ఠా సేంద్రవారుణీ ।
బృహతీ సైంధవం కుష్ఠంరాస్నామాంసీ శతావరీ॥

ఆరనాళాఢకేనైవ తైలప్రస్థంవిపాచయేత్ ।
తైలమంగారకంనామ సర్వజ్వరవినాశనమ్ ॥

తా. చాగలక్క పసపు మ్రానిపసపు మంజిష్టి పెద్దపాపర నేలములక సైంధ వలవణము చంగల్వకోష్టు దుంపరాస్నము జటామాంసి పిల్లిపీచర వీటినిచేర్చి ఆఢక ప్రమాణము ఆరనాళముతోడ 1 ప్రస్థము నూనెబోసి పక్వము చేయవలయును. ఇది అంగారకతైలమనబడును. ఇది సమస్తజ్వరములను పోగొట్టును.

జ్వరములకు లాక్షాదితైలము.

శ్లో॥ లాక్షాహరిద్రామంజిష్ఠాకల్కై స్తైలంవిపాచయేత్ ।
షడ్గుణేనారనాళేన దాహశీతజ్వరాపహం ॥

తా. లక్క పసుపు మంజిష్టి వీటికల్కమునుచేర్చి 6 భాగములు ఆరనాళములో తైలమునుపోసి పక్వముచేయవలయును. ఇది తాపజ్వరము శీతజ్వరము వీనిని బోగొట్టును.

విషమజ్వరములకు మహాలాక్షాదితైలము.

శ్లో॥ లాక్షారసాఢకేప్రస్థం తైలస్యవిపచేద్భిషక్ । మస్త్వాఢకసమాయుక్తంపిష్ట్వాచాత్రసమారభేత్ ॥ శరపుష్పాం హరిద్రాంచ మూర్వాంకుష్ఠంహరేణుకమ్ । కటుకాంమధుకంరాస్నామశ్వగంధాంచదారుచ । ముస్తకంచందనంచైవ పృథగక్షసమానకైః ॥ ద్రవ్యైరేతైస్తుతచ్ఛిద్ధమభ్యంగాన్మారుతాపహమ్ । విషమాఖ్యాన్జ్వరాన్ సర్వాన్ ఆస్వేవప్రశమంనయేత్ । సంశ్వాసంతు ప్రతిశ్యాయం కండూదౌర్గంధ్య గౌరవమ్। త్రికపృష్ఠకటీశూలం గాత్రాణాంకుట్టణంతథా ॥ పాపాలక్ష్మీప్రశమనం సర్వగ్రహ నివారణమ్ । అశ్విభ్యాంనిర్మితంశ్రేష్ఠం తైలం లాక్షాదికంమహత్ । లాక్షామూఃషడ్గుణంతోయం దత్వా వింశతివారకమ్ । హరిద్రాన్యజలంగ్రాహ్యం కింవాక్వాథ్యం యథోదితమ్ ॥

తా. అధకప్రమాణము లక్కరసములో నువ్వులనూనె 1 ప్రస్థముపోసి పెరుగుమీదినీళ్లు అధ ప్రమాణముచేర్చి సదాప చాగ చంగల్వకోష్ఠురేణుకలు కటుకరోహిణి యష్టిమధుకము దుంపరాష్ట్రము పెన్నేరుగడ్డ దేవదారు తుంగముస్తెలుచందనము వీనిని ప్రత్యేకము అక్షప్రమాణముగ్రహించి కల్కముచేసి దానిలోచేర్చిపక్వము చేయవలయును. దీనిని అభ్యంగము చేసికొనిన వాతము సమస్త విషమజ్వరములు ఇవిశీఘ్రముగా శమించును. మఱియు కాసము శ్వాసము పీనసము దురద దుర్గంధము గురుత్వము ముడ్డిపూస వీపునడుము వీనియందలిశూల అవయవములయందు పోట్లు ఇవియన్నియు నివర్తించును. పాపము అలక్ష్మి సమస్తగ్రహపీడ ఇవియును శమించును. ఇదిమహా లాక్షాదితైలమనబడును. అశ్వినీదేవతలచే నిర్మించబడినది. మిగుల శ్రేష్ఠమైనది. లక్కను 6 భాగములధికముగనుండు ఉదకములోవైచి మర్దించి 21వ పర్యాయము వడియకట్టిగాని లేక లక్కను నలియగొట్టి ఎనిమిదింతల ఉదకములోవైచి పాదావశేషముగా కషాయముకాచిగాని యెత్తుకొనవలయును. ఇది లక్కరసమనబడును.

## శీతజ్వరమునకు కట్టరతైలము.

శ్లో॥ సువర్చికా నాగరకుష్టమూర్వా లాక్షా నిశాలోహిత యష్టికాభిః । తైలంజ్వరేషడ్గుణ తక్రసిద్ధ మభ్యంజనాచ్ఛీతవిదాహమత్స్యాత్ । దధ్నస్ససారకస్యాత్రతక్రంకట్టరమిష్యతే॥

తా. సువర్చికా శొంఠి చంగల్వకోష్టు చాగ లక్క పసుపు రక్తచందనము యష్టిమధుకము తైలము వీటిని 6 భాగములధికముగనుండు మజ్జిగలో పక్వముచేయవలయును. ఇది అభ్యంజనమువలన శీతజ్వరమును పోగొట్టును. మీగడతోగూడినపెరుగులోనుండి తీయబడిన మజ్జిగ కట్టరమనబడును.

## ఏకాహికాది విషమజ్వరములకు మహాకట్టరతైలము.

శ్లో॥ శుక్తారనాళైదధిమస్తుతక్రైః ఫలాంబుభాగేనసమంహి తైలమ్ । కృష్ణాదికల్కైర్మృదువహ్నిసిద్ధ మభ్యంజనంవాతకఫజ్వరాణామ్ । ఏకాహికద్విత్రిచతుర్థకానాం మాసార్ధమాసద్వయమాసికానాం । నివారణం తద్విషమజ్వరాణాంతైలంతు షట్కట్టరకం మహత్స్యాత్ ॥

తా. శుక్తము ఆరనాళము పెరుగుమీదిమీగడ మజ్జిగ త్రిఫలోదకము వీటికి సమముగా తైలము వీనినన్నిటిని చేర్చి దానిలో కృష్ణాదికల్కమును అనగా:—

"కృష్ణాచిత్రకషడ్గ్రంథావాసకంచవిషాఘనమ్ ।
గ్రంథికైలేచాతివిషా రేణుకంచకటుత్రయమ్ ॥
యవానిగోస్తనీవ్యాఘ్రీభూనింబం బిల్వచందనమ్ ।
భార్గీశ్యామాశివాధాత్రీ స్థిరామరాత్వాసజీరకా ॥
సర్షపం హింగుకటుకీం విడంగంచసమాంశకమ్ ।
ఏషకృష్ణాదికోనామ గణోజ్వరవినాశనః ॥"

అనెడివచనప్రకారము పిప్పళ్లు చిత్రమూలము వస అడ్డరసము మంజిష్ఠితుంగముస్తెలు గ్రంథితగరము ఏలకులు అతివస రేణుకలు త్రికటుకములు కురాసాని ఓమము ద్రాక్షవాకుడు నేలవేము మారేడు చందనము గంటుభారంగి కరక్కాయ ఉసిరికె ముయ్యాకుపొన్న చాగ జీలకఱ్ఱ ఆవాలు ఇంగువ కటుకరోహిణి వాయువిడంగములు వీటిని సమాంశములుగాచేర్చి నల్లసుగంధిపాలకల్కముపోసి మృద్వగ్నిచే సిద్ధము చేయవలయును. ఇది బృహత్కట్వరతైలమనంబడును. దీనినభ్యంజనము చేసికొనిన వాతకఫజ్వరములు ఏకాహిక ద్వ్యాహికము త్ర్యాహికము చాతుర్థికము మాసికము అర్ధమాసికము మాసద్వయము యీమొదలగు జ్వరములన్నియు నివర్తించును. విషమజ్వరములను పోగొట్టును.

## విషమజ్వరములకు బృహత్పిప్పల్యాదితైలము.

శ్లో॥ పిప్పలీముస్తకంధాన్యం సైంధవంత్రిఫలావచా । యవానీచాజమోదాచ చందనంపుష్కరాహ్వయమ్ । శటీద్రాక్షాగవాక్షీచశాలిపర్ణీత్రికంటకమ్ । భూనింబారిష్టపత్రాణి మహానింబనిదిగ్ధికా॥ గుడూచీపృశ్నిపర్ణీచబృహతీదంతిచిత్రకా । ధాత్రీవ హరిద్రావృక్షామ్లం పర్పటంగజపిప్పలీ । ఏతేషాంకార్షికైః కల్కైః సతైలప్రస్థవిపాచయేత్ । దధికాంజికతక్రైశ్చమాతులుంగరసైస్తథా ॥ స్నేహమాత్రాసమైరేభిశ్శనైర్మృద్వగ్నినాపచేత్ । సిద్ధమేతత్ప్రయోక్తవ్యం జీర్ణజ్వరమహోహరి ॥

ఏకజంద్వంద్వజంచైవ దోషత్రయసముద్భవమ్ । సంతతంస తతాన్యేద్యు స్తృతీయకచతుర్థకౌ । మాసజంపక్షజంచైవ చిరకాలానుబంధినమ్ । సర్వాంస్తాన్నాశయత్యాశు పిప్పల్యాద్యమిదంమహత్ ॥

తా. పిప్పళ్లు తుంగముస్తెలు ధనియాలు సైంధవలవణము త్రిఫలములు వస కురాసాని ఓమము అజామోదము చందనము పుష్కరమూలము కచోరములు ద్రాక్ష పాపర కోలపొన్న పల్లేరు నేలవేము వేపాకు పెనువేప వ్రాకుడు తిప్పతీగె నేలపొన్న నేలములక దంతి చిత్రమూలము మానిపసుపు వృక్షామ్లము పర్పాటకము ఏనుగుపిప్పళ్లు వీటిని ప్రత్యేకము కర్షప్రమాణముచొప్పున గ్రహించి కల్కముచేసి 1 ప్రస్థము తైలములోకలిపి పెరుగు కాంజికము మజ్జిగె మాతులుంగరసము వీటిని ప్రత్యేకము ఒక్కొక ప్రస్థముచొప్పునచేర్చి మెల్లగ మృద్వగ్నిచే పక్వము చేయవలయును. ఇది మహాత్పిప్పల్యాదితైలమనబడును. దీనిని ప్రయోగించిన జీర్ణజ్వరము ఏకజము ద్వంద్వజము త్రిదోషజము సంతతము అన్యేద్యుః తృతీయకము చతుర్థకము మాసజము పక్షజము చిరకాలానువర్తి మొదలగు జ్వరములన్నియు నివర్తించును

ఏకాహికాదిజ్వరములకు లాక్షాభూతాంకుశ తైలము.

శ్లో॥ భూతఘ్నీస్వరసంప్రస్థమజాక్షీరంచతత్సమమ్ । భృంగీనిర్గుండికాచైవ తక్కారీతులసీద్వయమ్ ॥ అశ్వగంధీకాకజంఘీ హస్తికర్ణీశతావరీ । లాక్షారసంప్రయోజ్యంతు బలాతైలాణకంతథా। ఏతేషాంస్వరసంగ్రాహ్యం ప్రస్థంప్రస్థం పృథక్పృథక్ । శనైర్మృద్వగ్నినాపక్త్వా కల్కద్రవ్యాణిదాపయేత్ । కటుకో శీరలశునం చందనం దేవదారుచ । క్రిమిఘ్నమరిచం ముస్తా పంచకోలం త్రిజాతకమ్ । ఏతాషాంకర్షమాత్రాణితైలయుక్తేనయోజయేత్ । ద్విదండాన్నవ్యవ । స్త్రేణ పిష్టస్యాద్బహుపీడయేత్ । పానలేపననస్యేన పురాణజ్వరనాశనమ్ । ఏకాహికంద్వ్యాహికంచత్ర్యాహికంచతుర్థకమ్ । పక్షాంత జ్వరమాసాంతం వర్షాంతేతిజ్వరంహరమ్ । సర్వాంతేవిషమం హంతి శిశూనాంపరమౌషధమ్ ॥

తా. మహాబీరాకు స్వరసము 1 ప్రస్థము మేకపాలు 1 ప్రస్థము గుంటగలగ రాకురసము 1 ప్రస్థము వావిలియాకురసము 1 ప్రస్థము తక్కెడాకురసము 1 ప్రస్థము భూతులసివేళ్ల కషాయము 1 ప్రస్థముగంధితులసివేళ్ల కషాయము 1 ప్రస్థము పెన్నేరు గడ్డలరసము 1 ప్రస్థము చీకిరెలగాకురసము 1 ప్రస్థము బలురక్కసిగడ్డరసము 1 ప్రస్థము పిల్లిగడ్డలరసము 1 ప్రస్థము చతుర్థావశేషముగా కాచి వడియబోసుకొనబడిన లక్కకషాయము 1 ప్రస్థము-చిట్టాముదము 4 ప్రస్థములు ఇటుల వీనినన్నిటిని 1 బానలో బోసి పక్వమగువరకు కాచి అందులో కటుకరోహిణి వట్టివేళ్లు తెల్లగడ్డలు శ్రీగంధము దేవదారుపట్ట వాయువిడంగములు మిరియాలు తుంగముస్తెలు పంచకోల్లములు త్రిజాతకములు ఇవి ప్రత్యేకము ఒక్కొకతులముచొప్పునకూర్చి తైలపాకముగావండినూతన వస్త్రముచే వడియగట్టుకొని పానము లేపనము నస్యము వీనియందుపయోగించిన పురాణజ్వరములు ఏకాహికము ద్వ్యాహికము త్ర్యాహికము చాతుర్థికము పక్షాంతము మాసాంతము వర్షాంతము విషమము యీమొదలగు జ్వరములన్నియునివర్తించును. ఇది శిశువులకు మిగుల హితకరమైనది.

## జ్వరములకు హస్తికర్ణితైలము.

శ్లో॥ హస్తికర్ణిసమూలేన క్షుణ్ణాద్రోణాంభసీపచేత్ । చతుర్భాగావశేషేస్మిన్ కల్క ద్రవ్యాణిదాపయేత్ ॥ భార్గీముస్తాపర్పటంచ ద్ధుసర్వావిశ్వభేషజమ్ । భూనింబకుష్ఠయష్ట్యాహ్వగుళూచీకంటకారికా । శతావరీహరిద్రాచ ప్రత్యేకంకర్షమాత్రకమ్ । తైలంప్రస్థంపయస్తుల్యం ఘటమధ్యేపనిక్షిపేత్ । ఖరపాకయుతంతైలం సర్వజ్వరహరంపరమ్ । పురాణజ్వరమత్యుగ్రంనూతికాజ్వరనాశనమ్ ॥

తా. బలురక్కసిగడ్డలు తెచ్చి తునక తునకలుగ తరిగి 1 ద్రోణప్రమాణము ఉదకముపోసి చతుర్థావశేషముగా కషాయముకాచి వడియబోసి 1 ప్రస్థమునూనె 1 ప్రస్థము ఆవుపాలుబోసి అందులో గంటుభారంగి తుంగముస్తెలు పర్పాటకము దురదగొండి శొంఠి నేలవేము కోష్టు అతిమధురము తిప్పతీగె ములక పిల్లిగడ్డలుపసుపు ఇవి ప్రత్యేకము 1 తులప్రమాణము చూర్ణించివేసి ఖరపాకముగా తైలము కాచి

సేవించిన సమస్తజ్వరములు దారుణమైన పురాణజ్వరములు కాలికాజ్వరములు ఇవి నివర్తించును.

## జ్వరాదులకు క్రముకాదిరసాయనము.

శ్లో॥ హేమాంభోధరచందనం త్రికటుకం జాతీప్రియాళుంకుహః । మజ్జాత్రీణిసుగంధిజీరకయుగం శృంగాటకంవంశజమ్ । జాతీకోశలవంగధాన్యకయుతం ప్రత్యేకకర్షద్వయమ్ । హవ్యాంగోకుడుపంసితార్ధతులయా ధాత్రీవరీయంజలిః । పూగస్యాష్టపలాన్యులూఖలవరే సంకుట్యమార్ణీకృతమ్ । క్షీరస్యాష్టకసంయుతం కృతమిదంమందాగ్నినాతత్పచేత్ । ఖాదేత్ప్రాతరిదంజ్వరామయహరందాహంచ పిత్తంజయేత్ । నాసాస్యాక్షిగుదప్రవాహరుధిరంయద్రోమకూపచ్యుతమ్ । యక్ష్మాక్షీణబలక్షతాగ్ని నిలయం ఛర్దిప్రమేహాశ్చసా । రేతోవృద్ధికరంరసాయనవరంగర్భప్రదం యోషితామ్ । మూత్రాఘాతవినాశనం బలకరంక్షీణాంగపుష్టిప్రదమ్ । పూగీపాకమిమం ప్రశస్తదివసే కుర్యాత్తథాభక్షయేత్ ॥

తా. నాగకేసరములు తుంగముస్తెలు శ్రీగంధము త్రికటుకములు జాజికాయలు సారపప్పు త్రిఫలములలోనిపప్పు లవంగపుచెక్క ఏలకులు ఆకుపత్రి జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ పరికెగడ్డలు వెదురుప్పు జాపత్రి లవంగాలు ధనియాలు ఇవిప్రత్యేకః 2 తులముల చొప్పునచేర్చి చేసినచూర్ణము 8 పలములు రోలులోవేసి చక్కగా చూర్ణించిన చిగినపువక్కలచూర్ణము ఈ 2 చూర్ణములకు 8 దింతలు ఆవుపాలు ఉసిరికె పండ్లరసము పిల్లిగెడ్డలరసము ఇవి ప్రత్యేకము అంజలిక ప్రమాణః ఆవునెయ్యి కుడుపము పంచదార 50 పలములు ఇటుల వీనినన్నిటిని చేర్చిమృద్వగ్ని రసాయనపాకము గావండి ప్రాతఃకాలమునందు సేవించినజ్వరము సర్వాంగతాపవ ముక్కు నోరు కండ్లు గుదము వీనియందు రక్తము స్రవించుటరోమకూపములోనుం రక్తము వెడలుట క్షయరోగము బలక్షయము మందాగ్ని ఛర్ది ప్రమేహము అర్శస్సు యీ మొదలగు రోగములను నివర్తింపజేయును. రేతస్సును వృద్ధిచేయును స్త్రీలకు

గర్భమును కలుగజేయును మూత్రాఘాతమును పోగొట్టును. బలము పుష్టివీటినికలుగ జేయును. ఈరసాయనమును శుభదినమునందుచేసి పుచ్చుకొనవలెను.

## జ్వరములకు యెఱ్ఱవాలుడు లేహ్యము.

శ్లో॥ రక్తవాతారిమూలత్వక్ సహస్రపలమానకమ్ ।
కుండలీదహనంవ్యోషా కరంజమరిమేదకమ్ ।
జట్వావృశ్చికణా మూలంశారుణం జలవృశ్చికమ్ ।
తాపనంధ్రువమూలంచద్రవ్యాణ్యేతానినిక్షిపేత్ ।
ద్రోణేచతుష్ట కేతోయేపాచయేద్గాఢవహ్నినా ।
తస్మిన్ మాఘగుడైః స్తుల్యైఃపచేత్సూక్ష్మాగ్నినాపునః।
కణామూలమజామోదం పిప్పలీచవ్యనాగరమ్ ।
దీప్య చిత్రకకుష్టంచనాగరం గజపిప్పలీ ।
వ్రణదామవిళంగాని చూర్ణమేషాసమాంశకమ్ ।
కీపాగ్నినాపచేత్తస్మిన్ క్షిప్తామధుసమన్వితమ్ ।
పూర్వవద్ధాన్యమధ్యేతుపుతం దద్యాథభక్షయేత్ ।
కర్షమాత్రప్రమాణేన-జ్వరంసర్వాణిదావాజిత్ ।
గార్గేయనిర్మితంవాలావటస్యాల్లేహ్యముత్తమమ్ ॥

తా. ఎఱ్ఱవాలుడుచెక్క 100 పలములు నల్లఉప్పి 1 వీసె చిత్రమూలము 1 వీసె త్రికటుకములు 3 వీసెలు కానుగచెక్క తుమ్మచెక్క ఖట్వమనుతీగమోడి మొగలింగచెక్క ఆగెదొండవేళ్లు ఇవి దినుసు కొకటింటికి 1 వీసె ఇటులయీదినుసులనన్నిటని బానలోవేసి యెనమంగుము ఉదకముపోసి గాఢాగ్నిచే అష్టాపశేషముగా కషాయముకాచి వడియబోసి అందు పాతబెల్లము 50 పలములుకలిపిసూక్ష్మాగ్నిచే పాకముగానిచ్చి మోడి ఓమము పిప్పళ్లు చెవ్యము శొంఠి ఖురాసాని ఓమము చిత్రమూలము కోష్టు శొంఠి గజపిప్పళ్ళు దేవదారుచెక్క వాయువిడంగములుఇవి దినుసు యొకటింటికి 2 ఫలములచొప్పున చూర్ణించిచేసి సూక్ష్మాగ్నిచే పక్వముచేసి పిదప 1 వీసె తేనెబోసి ధాన్యమధ్యమునందు పుటంబిడి కర్షప్రమాణము సేవించిన సమస్తజ్వరములు తాపము ఇవి నివర్తించును. ఇది గార్గేయునిచే చెప్పబడిన ఎఱ్ఱవాలుడు లేహ్యము.

## సహదేవి ఘృతము.

శ్లో॥ సహదేవిరసప్రస్థం ఘృతప్రస్థం నివేదితమ్ ।
రోహిణీచప్రకుంచంచ క్షీర ప్రస్థంవిపాచయేత్ ।
సేవితంవిషమంహూత్యం శీతజ్వరనివారణమ్ ।
సహదేవిఘృతంనామ శరీరబలవర్ధనమ్ ॥

తా. సహదేవియాకురసము 1 ప్రస్థము నెయ్యి 1 ప్రస్థము కటుకరోహిణి 1 కుంచము పాలు 1 ప్రస్థము యిటుల వీని నెల్ల కలిపి పాకము చేసి చిక్కనిపాకముగ వడియకట్టుకొని సేవించిన విషమజ్వరములు రోజు శీతజ్వరములు హరించును. ఇది సహదేవి ఘృతమనబడును శరీరమునకు బలమునిచ్చును.

## క్షీరషట్పల ఘృతము.

శ్లో॥ పంచకోలైస్ససింధూత్థైః పలికైః పయసాసమమ్ ।
సర్పిప్రస్థంశృతంప్లీహ విషమజ్వరగుల్మనుత్ ॥

తా. పంచకోలములు సైంధవలవణము మిరియాలు వీటికి సమముగా ఆవు పాలు 1 ప్రస్థము ఘృతము 1 ప్రస్థము వీటినన్నిటిని చేర్చి కాచి సిద్ధముచేయవలయును. ఇది ప్లీహము విషమజ్వరము గుల్మము వీటిని పోగొట్టును.

## దశమూలషట్పలక ఘృతము.

శ్లో॥ అత్రద్రవాంతరాసు క్తేః క్షీరమేవచతుర్గుణమ్ ।
ద్రవాంతరేణయోగేహి క్షీరంస్నేహసమంభవేత్ ।
దశమూలీరసేసర్పిః సక్షీరంపంచకోలకైః ।
సక్షారైర్హంతిత్సిద్ధం జ్వరకాసాగ్నిమాందతాః ।
వాతపిత్తకఫవ్యాధీన్ప్లీహానంచాపిపాండుతామ్ ॥

తా. దశమూలరసము ఘృతము క్షీరము పంచకోలములు క్షారము వీటిని చేర్చి సిద్ధముచేయవలయును. ఈఘృతము జ్వరము కాసము అగ్నిమాంద్యము వాతపిత్త రోగములు ప్లీహము పాండువు వీటిని పోగొట్టును. ఘృతపాకమునందు ద్రవరుదశమ్యుద్రవ

మును చేర్చునటుల చెప్పకుండినచో ఆవుపాలును 4 భాగములు చేర్చుకొనవలయును ద్రవద్రవ్యమును చెప్పియుండినచో పాలనుఘృతమునకుసమముగాజేర్చుకొనవలయు

ఇతి శ్రీనీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కౌరాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పాత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
అష్టాధాతు నిదాన నాడీపరీక్షాలక్షణ సర్వజ్వర
నిదాన తత్సాధ్యాసాధ్యలక్షణ లంఘన
క్రమ పథ్యాపథ్యత చికిత్సా
లక్షణయుక్తం ప్రథమ
ప్రకరణమ్.



శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

---

## ద్వి తీ య ప్ర క ర ణ ము.

శ్లో॥ కృత్తివాసంపురారాతి మంధకాసురభంజనమ్ ।
భర్గంశైలసుతాధీశం నీలకంఠమహంభజే ॥

అవతరణిక॥ ఇపుడు గ్రంథకర్త "మంగళాదిని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే" అను భగవన్మహాభాష్యకారవచన ప్రకారము గ్రంథమధ్యమునందు తన కిష్టదేవతయగు ఈశ్వర నమస్కారాత్మక మంగళమును "కృత్తివాసంపురారాతిం" అను శ్లోకముచే జేయుచున్నాను.

తా. గజచర్మాంబరధరుడు త్రిపురాంతకుడు అంధకాసురసంహారకుడు సర్వలోక పూజితుడు పార్వతీపతియగు నీలకంఠుని నేను భజించుచున్నాడను.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమాబసవాహ్వయః ।
వక్ష్యామివృషరాజీయ మహంవైద్యశిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు అని పేరొక్కబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథమునందు 2 వ ప్రకరణమును రచించుచున్నాడను.

### సన్నిపాతోత్పత్తి కారణము.

శ్లో॥ నిరూపణేనదోషస్య నిదానంకథ్యతేపురః । పిత్తంతుకటుకాపాద్యం మధురామ్లానమరుత్కఫౌ । సంకరాద్ద్వంద్వరూపంతు సర్వజంసన్నిపాతకమ్ । ఋతుదోషగ్రహావేశ విషదుర్గాసుకో

పతః । జన్మర్క్ష గ్రహపీడాభి రతిపాపానుషంగతః । గర్భస్రా
వాచ్చనారీణాం సన్నిపాతసముద్భవః॥

తా. తొలుత సన్నిపాతస్వరూపమును వానికారణమునువచించెద. మిక్కుటముగా కారమును సేవించుటవలన పిత్తమునుమధురమును సేవించుటవలనవాతమును పులుసును సేవించుటవలన శ్లేష్మమును ప్రకోపించును మఱియు దానిని సంకరముగా సేవించుటవలన ధాతువులను ద్వంద్వరూపముగలుగుసర్వరసములకు మిక్కుటముగా సేవించుటవలన సన్నిపాతములు జనించును. మఱియుఋతుదోషముగ్రహముసోకుట విషసంబంధము పాలదోషము జన్మనక్షత్రపీడ సూర్యాది గ్రహపీడ అతిపాపము గర్భస్రావము వీనివలనకూడా సన్నిపాతము జనించును.

## త్రయోదశసన్నిపాత సామాన్య నిదానము.

శ్లో॥ [మతాంతరే] ఆమ్లస్నిగ్ధోష్ణతీక్ష్ణైః కటుమధుర సురాతాప
సేవాకషాయైః । కామక్రోధాతిరూక్షైర్గురుతర పిశితాహార
సాహిత్యశీతైః । శోకవ్యాయామ చింతాగ్రహగణ వనితా
త్యంతసంగప్రసంగైః । ప్రాయఃకుప్యంతిపుంసా మధుసమయ
శరద్వర్షణేసన్నిపాతాః ॥

తా. పులుసు స్నిగ్ధోష్ణము అత్యుష్ణ కారముగల పదార్థసేవన మద్యము ఎండ ఒగరు వీనిసేవనవలనను కామక్రోధములవలనను అతిరూక్ష కడుజడత్వముగలపదార్థ సేవనవలనను ఆకంఠభోజనము మాంసభక్షము శీతపదార్థసేవన శోకము శ్రమ చింత పిశాచబాధ అత్యంత స్త్రీసంభోగము యీ మొదలగువానివలనను చైత్రము వైశాఖము ఆశ్వీజము కార్తికము శ్రావణము భాద్రపదము అను ఋతు దోషములవలనను మనుజులకు తఱుచుగా సన్నిపాతములు ప్రకోపించును.

శ్లో॥ [ఆయుర్వేదే] గ్రహౌషధ విషక్రోధచింతాభీతి స్తిరస్కృతిః ।
గ్రహోత్థస్సన్నిపాతస్స్యాద్భయతో మరుదాశ్రయః ॥

తా. పిశాచపీడ ఔషధము విషము కోపము చింతభీతి తిరస్కారము మొదలగు వానివలనను సూర్యాది గ్రహసంబంధమువలనను సన్నిపాతముజనించును భయపడుటవలన వాతజ్వరము జనించును.

శ్లో॥ కోపక్రోధేనపిత్తస్యాద్వ్యాతు శాపాభిచారజౌ।
సన్నిపాతజ్వరాఘోరౌ తావసాధ్యతమౌమతౌ ॥

తా. కోపక్రోధములవలన పైత్యము ప్రకోపించును. పాపముఅభిచారమువీని వలన భయంకరములై సన్నిపాతము జ్వరము జనించును. ఈరెండునుఅసాధ్యములు.

సన్నిపాత సామాన్యలక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] రాత్రౌజాగరణందివాచ కృశతామూర్ఛా తిదాహోమరుత్ । శీతం స్వేదప్రలాపనం మదతృషాహాస్యం చహృత్పీడనమ్ । కాసశ్వాసవిదాహశైత్య జ్వరితాతృష్ణాశిరో రోధనమ్ । జిహ్వాదగ్ధకృశత్వ మంగపులకం స్యాత్సన్నిపాత జ్వరే ॥

తా. రాత్రి మేల్కొనియుండుట పగలుకృశించియుండుట మూర్ఛ శరీరము నందు కడుదాహము వాతము ప్రకోపించియుండుట, చలిబెట్టుట చెమటపట్టుట అసంగతముగ మాటలాడుట మదము నగుట రొమ్మునొచ్చుట లేక రొమ్ములో మండుట శ్వాసకాసలు విదాహించుట శరీరము చల్లనైయుండుట జ్వరము దప్పి శిరస్సునొచ్చుట నాలుక పిడుకవలెయెండి కృశించియుండుట శరీరము గగుర్పొడుచుట ఈ లక్షణములుగలది సన్నిపాతజ్వరమని తెలియవలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] సంధ్యస్థిమూర్ధ్నిరుగ్దాహ శ్శీతతంద్రారుచి భ్రమాః । కంఠకూజనకర్ణార్తిర క్తదృగ్భగ్ననేత్రతా । రక్త నిష్ఠీవనంమూర్ఛా తృష్ణానిద్రాక్షయోనిని । జిహ్వాదగ్ధాఖర స్పర్శాశ్యామారక్తాంగరోధితా । విపాకే మూఢతాచేతిసన్ని పాతజ్వరాకృతిః ॥

తా. కీళ్ళు ఎముకలు తలనొచ్చుట దాహము శైత్యము తంద్రఅరుచి దబ్బర లాడుట హీనస్వరము చెవులుగడియలుపడుట కన్నులకొనలు యెఱ్ఱనై యుండుట నేత్రములు క్రుంగియుండుట నెత్తురు ఉమయుట మూర్ఛదప్పి రాత్రులయందునిదుర బట్టకుండుట నాలుక కాలినట్టుగ బిరుసుగ నల్లగ ఎఱ్ఱగనుండుట శరీరము బద్ధగించి యుండుట ఈలక్షణములుగలది సన్నిపాతజ్వరమని తెలియవలయును. మఱియు నీ సన్నిపాతజ్వరము ముదిరిన శరీరమునకు మరువుగలుగును.

శ్లో॥ [మాధవనిదానే] మిశ్రితేలక్షణేజాతేజ్వరస్యాస్య త్సన్నిపాతి కః । క్షణేదాహః క్షణేశీత మస్థిసంధిశిరోరుజా । సాస్రావేకలు షేరక్తేనిర్భుగ్నేచాపిలోచనే । సస్వనౌసరుజౌకర్ణౌకంఠశ్శూ కైరివావృతః । తంద్రామోహః ప్రలాపశ్చ శ్వాసఃకాసోరు చిర్భ్రమః । పరిదగ్ధాఖరస్పర్శాజిహ్వాస్రస్తాంగ తాపరమ్ । ష్ఠీవ నంరక్తపిత్తస్యకఫేనోన్మిశ్రితస్యచ । శిరసోలోడనంతృష్ణానిద్రా నాశోహృదివ్యథా । స్వేదమూత్రపురీషాణాం చిరాద్దర్శనమల్ప శః । కృశత్వంనాతిగాత్రాణాంప్రతతంకంఠకూజనమ్ । కోఠా నాంశ్యావరక్తానాం మండలానాంచదర్శనమ్ । మూకత్వం స్రోతసాంపాకో గురుత్వముదరస్యచ । చిరాత్పాకశ్చదోషా ణాంసన్నిపాతజ్వరాకృతిః ॥

తా. జ్వరములలో వాతపిత్తశ్లేష్మ సాంకర్యలక్షణములు గలిగియుండినసన్ని పాతజ్వరమని తెలియవలయును. వానిలక్షణంబు లెవ్వియనిన ప్రతిక్షణమునదాహము ప్రతిక్షణమున శీతలము ఎముకలు కీళ్ళు శిరస్సు వీనియందు శూల కండ్లయందు నీరు గారుట నేత్రములు కలకవారియుండుట నేత్రము లెఱ్ఱనై యుండుట నేత్రములు వ్రేంగియుండుట లేక నిక్కబొడిచికొనియుండుట చెవిలోశబ్దము పోట్లు కుతికెలో ముండ్లుబారినట్లుండుట తంద్ర మోహమువదురుటశ్వాసము కాసఅరుచిభ్రమ నాలుక కాలినబొగ్గువలె నల్లనై బిరుసై ముండ్లుబారియుండుట శరీరము మిక్కుటముగా వేలుట రక్తమిశ్రిత లేకపిత్తమిశ్రకఫలమును స్వల్పముగా ఉమియుట తలవిసురుట దప్పి నిదురబట్టకుండుట ఱొమ్ములోవేదన దీర్ఘకాలముమీద చెమట మూత్రము మలము కొంచెముగావెడలుట శరీరమధికముగా కృశింపకుండుట కడుహీనస్వరము మండలాకారంబై నలుపు ఎఱుపు వర్ణములుగల దద్దులు శరీరముననగుపడుట మంద ముగమాటలాడుట లేకమాటలాడకనేయుండుట చెవులువినరాకుండుట నేత్రముల కు దృష్టి లేకుండుట ఆకలిలేకుండుట వాతపిత్తశ్లేష్మములు దీర్ఘకాలముమీదపక్వం బులగుట ఈలక్షణములుగలది సన్నిపాతజ్వరమని తెలియవలయును.

శ్లో॥ [మతాంతరే] అంగవ్యథాశిరోరుక్స్యా ద్దాహస్సర్వాంగ నేత్రయోః । నేత్రేశోణితపీతాభే మూర్ఛాభ్రాంతి ప్రలాపకమ్ । హృచ్ఛూలం గుంభనంహిక్కా శ్వాసస్స్యాద్రోమహర్షణమ్ । సన్నిపాతజ్వరేఘోరే వైద్యోజానాతినిశ్చయాత్ ॥

తా. శరీరమునందు వేదన శిరమునందు పోట్లు సర్వాంగములు నేత్రములు మండుట నేత్రము లెఱ్ఱగ లేక పచ్చగ నుండుట మూర్ఛ భ్రాంతి వదురుట ఱొమ్ము నొచ్చుట * డగ్గుత్తికుండుట ఎక్కిళ్లు దగ్గు గగుర్పొడుచుట ఈలక్షణములు గలది భయంకరమైన సన్నిపాతజ్వరమని వైద్యుడు తెలిసికొనవలయును.

## అసాధ్యసన్నిపాత సామాన్య నాడీలక్షణము.

శ్లో॥ [చింతామణౌ] కాష్ఠభారస్యమధ్యేతు చంచూగమన వద్భవేత్ ॥ కుటిలంశిథిలంమందం సూక్ష్మంచ చపలంతథా । సన్నిపాతోద్భవానాడీ విజ్ఞేయాసా తథాబుధైః॥

తా. 13 డు సన్నిపాతములలోను సప్తవిధదోషములలోను నాడి కట్టెలమోపునడుమ చుంచు పాఱినటులను గుటిలముగను తెగినటుల ఖండఖండములుగను మందముగను సూక్ష్మముగను చపలముగను నడుచుచుండిన రోగి మృతిజెందునని తెలియవలయును.

## మృత్యుధాతు లక్షణము.

శ్లో॥ [మతాంతరే] నాడీడమరుకాకారా దినేమృత్యుర్దినత్రయే॥

తా. నడిమి వ్రేలికింద కడపటి వ్రేలికింద నాడి డమరుకమువలె నడుచుచుండిన రోగి 1 దినములో గాని 3 దినములలో గాని మృతిజెందును.

## సన్నిపాతజ్వర సామాన్య ప్రమాణము.

శ్లో॥ [నిత్యనాథీయే] దోషవిబద్ధేనష్టేగ్నౌ సర్వసంపూర్ణ లక్షణః । సన్నిపాతజ్వరోసాధ్యః కృచ్ఛ్రసాధ్యస్తతోన్యథా । సప్తమేదివసేప్రాప్తే దశమేద్వాదశేపివా ॥ పునర్ఘోరతరోభూత్వా

* డగ్గుత్తికె అనగా - గద్గద స్వరముతో మాటలాడుట.

శమనం యాతిహంతివా। ఏతైశ్చ ద్విగుణైర్వాపి మోక్షా యచ వధాయచ॥

తా. పిత్తాదిదోషములు మలాదిదోషములు బద్ధగించుట జాఠరాగ్ని నశించుట వాతాదులయొక్క సర్వదోషములు సంపూర్ణముగానుండుట ఈలక్షణములుగల సన్నిపాతజ్వరము అసాధ్యంబనియు దోషప్రవృత్తి ఒకింత అగ్నిదీపనము సర్వలక్షణములలో సన్నిలక్షణములు ఇవిమాత్రము గలిగియుండిన కష్టసాధ్యంబనియు తెలియవలయును. సన్నిపాతము 7 లేక 10 12 దినములకు కడు ఉగ్రంబై శాంతిజెందినను జెంగును. లేక జంపినను చంపును. అటు కాదేని, 14 20 21 దినములకు శాంతి జెందినను జెంగును. లేక జంపినను చంపును.

వాక్యము॥మాధవనిదానము ఆయుర్వేదము నిత్యనాధీయము వైద్యచింతామణి వీనియందలి త్రయోదశ సన్నిపాత నిదానంబులను వానిసాధ్యాసాధ్యంబులను కాలప్రమాణంబును ఉపద్రవములను చికిత్సను పానంబులను సంగ్రహించెద.

సన్నిపాతనామ తత్సాధ్యాసాధ్యములు.

శ్లో। [మాధవనిదానే] సంధిక స్తాంద్రిక శ్చైవ దుస్సాధ శ్చిత్త విభ్రమః। కష్టసాధ్యః కంఠకుబ్జః కర్ణికో జిహ్వక స్తథా। కష్టాత్కష్ట కరోజ్ఞేయో రుగ్దాహోహంతిమానవమ్। అంతకోభుగ్న నేత్రశ్చ రక్తష్ఠీవి ప్రలాపకః। శీతాంగశ్చాప్యభిన్యాస షట్సాధ్యా సప్తమారకాః॥

తా. సంధికము తాంద్రికము చిత్తవిభ్రమము కంఠకుబ్జము కర్ణికము జిహ్వకము రుగ్దాహము అంతకము భుగ్ననేత్రము రక్తష్ఠీవి ప్రలాపము శీతాంగము అభిన్యాసము అను నీ 13 ను సన్నిపాతనామంబులు అందు 6 సాధ్యంబులుతక్కినవి7 మారకంబులు అందు సంధికము తాంద్రికము చిత్తవిభ్రమము ఇవి కష్టసాధ్యంబులు కంఠకుబ్జము కర్ణకము జిహ్వకము ఇవి కడుకష్ట సాధ్యంబులురుగ్దాహముమారకంబు తక్కినవి 6 ను సాధ్యంబులు (ఇక వాని సాధ్యాసాధ్యంబుల నెఱుంగుటకు తగిన లక్షణంబుల వచించెదను.)

## సంధికసన్ని లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అంగశోఫో వాయుకఫౌ తంద్రాశూల ప్రజాగరాః।సంధికాఖ్యే సన్నిపాతే బలహానిశ్చజాయతే॥

తా. అంగములువాచుట వాతోపద్రవములు కలిగియుండుట కఫము బడుట తంద్ర శూల నిదురపట్టకుండుట సత్వము క్షయించుట ఈలక్షణములు గలిగి అంగములు శోభించియుండునది సంధిక సన్నియని తెలియవలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] పూర్వరూప కృతశూల సంభవం * శోఫ వాత బహువేద నాన్వితమ్। శ్లేష్మతాప బలహాని జాగరం సన్నిపాత మితి సంధికం వదేత్॥

తా. వాపు శరీరము వాతపూరితముగ నుండుట తలుచుక పొరలుట శ్లేష్మ ప్రకోప సంతాపము సత్వము క్షయించుట నిదురబట్టకుండుట ఈ లక్షణములు గలిగ పూర్వరూపజనిత శూలతోగూడి అంగములు శోభించియుండునది సంధిక సన్నియని తెలియవలయును.

శ్లో॥ [నిత్యనాధీయే] శరీరం పూర్వవచ్ఛూలం శోఫవాతంచ వేదనా। కఫస్తంద్రాను తాపంచ సంధికే సాన్నిపాతికే॥

తా. శరీరము పూర్వమువలెనే యుండుట శూల శోభ గలిగియుండుట శరీరమునందు వాతోపద్రవములు వేదన కఫము తంద్ర తాపము ఈలక్షణములు కలది సంధిక సన్నియని తెలియవలయును.

శ్లో॥ [చింతామణౌ] సదాస్యం శ్లేష్మణా పూర్ణం శూలం నాసాతివేదనా। శోకస్స్యాల్లక్షణంజ్ఞేయం సంధికే సాన్నిపాతి॥

తా. ఎల్లపుడు నోరుశ్లేష్మపూరితముగ నుండుట శూల నాసికములో కడు వేదన కన్నులయందు నీరుగారుట ఈ లక్షణముగలది సంధిక సన్నియని తెలియవలయును. (ఇందు శుభకర నాడులు కలిగియుండిన సాధ్యము అశుభకరనాడులు కలిగియుండిన అసాధ్యము అశుభాశుభనాడులను అష్టధాతువు నిదానమువలన తరుచుగా నెఱుంగవలయును.)

* శోపవాత.

## తాంద్రిక సన్నిలక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] తంద్రాశూల జ్వరశ్లేష్మ తృష్ణా ఛర్ది చ కంఠరుక్ ॥ ఉత్కణ్ఠాస్స్యాదనశనం తాంద్రికే శ్వాసకః కఫః ॥

తా. తంద్ర శూల జ్వరము శ్లేష్మము దప్పి వాంతులు మెడవాచి యుండుట బొంగబోయినటుల మాటలాడుట అన్నమునం దిచ్ఛలేకుండుట శ్వాశము తెమడ వెడలుట ఈ లక్షణములుగలిగి తంద్ర విడువకుండునది తాంద్రిక సన్నియని తెలియ వలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] ప్రభూతా తంద్రార్తి జ్వరకఫ పిపాకులతగో భవేచ్ఛ్యామా జిహ్వాప్పృథుల కఠినాకంటకవృతా । అతీసార శ్వాసః క్లమథ పరితాప శ్శ్రుతిరుజో భృశంకంఠే జాడ్యంశ యనమనిశం తాంద్రికగదే॥

తా. అధికముగా తంద్ర శూల జ్వరము తెమడవెడలుట దప్పివలనరోగి కడుపీడితుడుగ నుండుట నాలుక నల్లనైదళమై కఠినమై ముండు బారియుండుట అతిసారము శ్వాస బడలిక శరీరము మండుట చెవి వినరాకుండుట మిక్కుటముగా కంఠమునందు జడత్వము రేయుంబగులు పరుండియుండుట ఈ లక్షణములు గలిగి తంద్ర విడువకుండునది తాంద్రిక సన్నియని తెలియవలయును, ఇదియసాధ్యము.

శ్లో॥ [సిత్యనాధీయే] అతితంద్రా జ్వరశ్వాస శ్శ్రమస్తాపోతి సారతృట్ । స్థూలకణ్ఠ యుతిశ్యామా జిహ్వాకఠిన కంటకా। శ్రుతిస్స్వల్పా కఫశ్చేతి తాంద్రికే సాన్నిపాతికే॥

తా. విడువని తంద్ర జ్వరము శ్వాస శ్రమ చేతులు కాళ్లుమండుట అతిసారము దప్పి కుతికె బొంగుబోవుట నాలుక నలుపు వర్ణముగలదై కఠినమై ముండ్లు బారియుండుట చెవుడు పాడిదగ్గు ఈ లక్షణములు గలిగి తంద్ర విడువకుండునది తాంద్రిక సన్నియని తెలియవలయును.

శ్లో॥ [చింతామణౌ] బద్ధప్రలాప స్తంద్రాచజిహ్వా శ్యామాసకంటకా కఠినా నిర్ద్రివా శుష్కం సంతాపశ్చాతి సారకః ।

శ్వాసః కంఠమార్విపర్ణశ్చ తోయం స్రవతిలోచనే ।
జ్వరమత్యుత్కటంచైవ తాంద్రికే సాన్నిపాతికే ॥

తా. వదరుట తంద్ర నాలుక నల్లనైయుండుబారి కఠినమై ద్రవము లేకుండుట శరీరము శుష్కించుట తాపము అతిసారము శ్వాస శరీరమునందు దురద నేత్రములు విశాలమై పెద్దవిగనుండుట కన్నులయందు నీరుగారుట తీవ్రజ్వరము ఈలక్షణములు గలిగి తంద్ర విడువకుండునది తాంద్రిక సన్నియని తెలియవలయును.

## ప్రలాపసన్ని లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] ప్రలాపకంపరుక్ప్రజ్ఞానాశవైకల్యవిభ్రమాః।
ప్రలాపః ప్రాణహంతాచ విలాపోగ్రజ్వరాదిభి ॥

తా. ప్రలాపము కంపము వేదన మతిమరుపు శరీరము వికలమై యుండుట తబ్బిబ్బులాడుట ఏడ్చుట శరీరమునందు బాటిమెలు ఉగ్రజ్వరము ఈ లక్షణములు గలిగి ఏడ్చుచు వదురుచుండిన ప్రలాపసన్నియని తెలియవలయును. ఇది ప్రాణముల హరించును.

శ్లో॥ [ఆయుర్వేదే] కంపప్రలాప * పరితాపనకంఠపీడా † శోఫ ప్రతాపప్రతికః పవమానచింతా । ప్రజ్ఞాప్రణాశ వికలః ప్రచురప్రవాదః । క్షిప్రం ప్రయాతి పితృపాల పదంప్రలాపీ ॥

తా. శరీరము వణుకుట ప్రలాపించుట సంతాపము సుతిక మెచ్చుట శోఫశరీరమువాతపూరితముగ నుండుట గాలినికోరుట ప్రజ్ఞావిహీనతచే శరీరము గురుతెరుగకుండుట అధికముగవదురుట ఈలక్షణములుగలిగి ఏడ్చుచు వదురుచునుండిన ప్రలాప సన్నియని తెలియవలయును. ఇది గలవాడు కడుశీఘ్రముగా పితృలోకమునకేగును.

శ్లో॥ [నిత్యనాథీయే] ప్రలాపకంపౌ భ్రాంతిశ్చ ప్రజ్ఞానాశోతితాపవాన్ । పాదశోభాంగపీడాచ వికల । ప్రతివాదితా । జ్ఞేయం ప్రలాపకేచిహ్నం సన్నిపాతో నికృంతకః॥

* పరితాపనశీర్ష పీడా:—కపాలమునందు పీడ గలుగుట.

† ప్రౌఢ ప్రభావ పవమాన పరోన్యచింతా:-గంభీరముగా మాటలాడుట. తన సుఖమునుగోరి పరులదుఃఖమునకు వ్యసనపడుట.

తా. వదురుట శరీరము వణుకుట భ్రమ మాటలాడుట అజ్ఞానముఅతితాపము పాదములు శోభించుట శరీరము నొచ్చుట శరీరము గురుతెరుగకుండుట ప్రతివాదించుట ఈలక్షణములు గలది ప్రలాపసన్నియని తెలియవలయును. ఇదిరోగినిజంపును.

శ్లో॥ [చింతామణౌ] కంపప్రలాపసంతాపా వాతశ్లేష్మ ప్రజాయతే। హిక్కాతా పజ్వరశ్చైవ ప్రలాపేసాన్నిపాతికే॥

తా. శరీరము వణుకుట వదురుట సంతాపము శరీరమునొచ్చుట దగ్గువెక్కిళ్లు తాపజ్వరము ఈ లక్షణములు గలది ప్రలాప సన్నియని తెలియవలయును.

చిత్తవిభ్రమ సన్నిలక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] ప్రలాపోవర్తనంహాస్యం నాసాపీడా మదభ్రమాః। వైకల్యం కోపనంగానం దుస్సాధశ్చిత్తవిభ్రమః॥

తా. ప్రలాపించుట నృత్యము సలుపుట నగుట ముక్కు నలుచుకొనుట మదమెక్కియుండుట తబ్బిబ్బులాడుట శరీరముగురుతెరుగకుండుట కోపముపాడుట ఈ లక్షణములు గలిగి యెల్లపుడు చిత్తభ్రమ గలిగియుండునది చిత్తభ్రమ సన్నియని తెలియవలయును. ఇది అసాధ్యము.

శ్లో॥ [ఆయుర్వేదే] మనోమోహో భ్రమస్తాపో హాస్యగీతప్రలాపనమ్। నృత్యంవికలతాపీడా వికటాక్షోవిచక్షణః। లక్షణైస్సన్నిపాతోయం జ్ఞాతవ్యం శ్చిత్తవిభ్రమః॥

తా. శరీరము మదమెక్కుట మోహము భ్రమ తాపము నగుట పాడుట వదరుట ఆడుట శరీరము గురుతెరుగకుండుట శరీరపీడ వెఱ్ఱిచూపులు తెలివిగలవానివలెనుండుట ఈ లక్షణములు గలది చిత్తవిభ్రమ సన్నియని తెలియవలయును.

శ్లో॥ [నిత్యనాథీయే] యదికథమపిపుంసాంజాయతే కాయపీడా భ్రమమదపరితాపా మోహవైకల్యభావౌ। వికటనయనహాసో నృత్తగీత ప్రలాపా స్యభిదశతినసాధ్యాం కేహించిత్తభ్రమాఖ్యామ్॥

తా. ఉన్మత్తకాయ జనినవానివలె పిచ్చిమాటలాడుట భ్రమ శరీరము మద మెక్కుట సంతాపము మోహము శరీరము గురుతెరుగకుండుట ఊతిమి చూచుట నగుట ఆడుట పాడుట వదురుట ఈలక్షణములు గలది చిత్తవిభ్రమ సన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము.

శ్లో॥ [చింతామణౌ] సర్వావయవవైకల్యం వాతపిత్తప్రకోపనమ్ ।
భ్రమమోహౌ భ్రుకుటిలో గీతనృత్య ప్రలాపనమ్ ।
మహాఘోర సన్నిపాతో జ్ఞాతవ్య శ్చిత్త విభ్రమః ॥

తా. సర్వావయవములు వైకల్యమును జెందియుండుట వాతపిత్తములు ప్రకోపించుట భ్రమ మోహము కనుబొమలు ముడిబడుట పాడుట ఆడుట వదురుట ఈ లక్షణములు గలది కడు భయంకరమైన చిత్తవిభ్రమ సన్నియని తెలియవలయును.

జిహ్వక సన్నిలక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శ్వాసపరితాప విహ్వలో మీలితాక్షీచ కఫావృతం ముఖమ్ । నిశ్వాసక బధిరమూకలక్షణశ్చాంతే కృద్భవతియు స్సజిహ్వకః ॥

తా. శ్వాసకాసలు సంతాపము మతిచాంచల్యము నేత్రములు మూతలు బడుట నోట కఫము వెడలుట నిట్టూర్పు వాతము వెడలుట చెవుడు మూగతనము ఈ లక్షణములు గలిగి నాలుక కఠినమై ద్రవములేక ముండ్లు బారియుండునది జిహ్వక సన్నియని తెలియవలయును. ఇది రోగిని జంపును.

శ్లో॥ [ఆయుర్వేదే] శ్వసనకాస పరీతాపవిహ్వలః కఠినకంఠకవృతాచ జిహ్వికా । బధిరమూక బలహానిలక్షణో భవతికష్టతరసాధ్యజిహ్వకః ॥

తా. కాసశ్వాస సంతాపాదులచే మతిచాంచల్యము నాలుక కఠినమైముండ్లు బారియుండుట చెవుడు మూకత్వము సత్వము క్షయించుట ఈ లక్షణములు గలది జిహ్వక సన్నియని తెలియవలయును. ఇది కష్టసాధ్యము.

శ్లో॥ [నిత్యానాథీయే] కంటకాకఠినాజిహ్వా కాసశ్వాసాతి విహ్వలః ।
మూకో బధిరతా తాపో బలహాని ర్విలక్షణైః

జిహ్వక స్సన్నిపాతో౽యం కష్టసాధ్యం విదుర్బుధాః ॥

తా॥ నాలుక కఠినమై ముండ్లు బారియుండుట కాసశ్వాసలు ఘటిచాంచల్యము మూకత్వము చెవుడు తాపము సత్వక్షయము మరణచిహ్నములు ఈలక్షణముల గలిగి నాలుక కఠినమై ముండ్లుబారియుండునది జిహ్వకసన్నియని తెలియవలయును ఇది కష్టసాధ్యము.

శ్లో॥ [చింతామణౌ] నిశ్శ్వాసో వేగసంతాపౌ కాసఃకఠిన జిహ్వికా
కంటకా శ్యామవర్ణాచ మ్మూకత్వం బధిరో౽జడః ।
జిహ్వక స్సన్నిపాతో౽య మసాధ్యంచ వినిర్దిశేత్ ॥

తా. ఊర్ధ్వశ్వాసము తాపము దగ్గు నాలుక కఠినమై నల్లనై ముండ్లుబారియుండుట స్వల్పముగ మాటలాడుట లేక మాటలాడకనే యుండుట చెవుడు జడత్వము ఈలక్షణములుగలది జిహ్వక సన్నియని తెలియవలయును. ఇదియసాధ్యము

కర్ణిక సన్నిలక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] జ్వరో౽గ్రతాపకర్ణార్తిగ్రంధిః క్రోధఃప్రలాపనమ్ । శ్వాసకాసప్రసేకాస్స్యుః కర్ణికఃకృచ్ఛ్రసాధ్యకః ॥

తా. ఉగ్రజ్వరము తాపము చెవికొనలువాచుట గ్రంధులు పుట్టుట కోపము వదురుట శ్వాసకాసలు నోటిలో నీరుగారుట ఈ లక్షణములు గలిగి కర్ణమూలములయందు వాపుకలిగియుండునది కర్ణిక సన్నియని తెలియవలయును. ఇదికష్టసాధ్యము

శ్లో॥ [ఆయుర్వేదే] ప్రలాపశ్శ్రుతి హ్రాసకంఠ గ్రహా౽ంగవ్యథా
శ్వాసకాస ప్రసేక ప్రభావమ్ । జ్వరం తాప కర్ణాంతయో
ర్గల్ల పీడాబుధాః కర్ణికం కష్టసాధ్యం వదంతి ॥

తా. వదురుట చెవుడు కుతికబట్టికొనినట్టుండుట శరీరమునందు వ్యథ శ్వాస దగ్గు జొల్లుకారుట జ్వరము సంతాపము చెవి చెక్కిళ్లు వీని మూలములయందువాపు ఈలక్షణములు గలది కర్ణిక సన్నియని తెలియవలయును. దీనిని పండితులు కష్టసాధ్యమని వచించెదరు.

శ్లో॥ [నిత్యనాథీయే] జ్వరఃకర్ణాంత శోఫాచ శ్వాసకంపప్రలాపనమ్
స్వేదఃకంఠ గ్రహస్తాపో హృల్లాసో౽ంగ వ్యథాపిచ ।

కర్ణికే సన్నిపాతేచ లక్షణానిచ పండితైః ॥

తా. జ్వరము కర్ణమూలములయందు వాపు ఉబ్బసము శరీరకంపమువదురుట చెమట కంఠము పట్టికొనినట్టుండుట తాపము ఓకర వచ్చునట్టుండుటశరీరమునందు సూదులచే బొడుచునటుల వ్యథ ఈ లక్షణములుగలది కర్ణికసన్నియని పండితులు తెలిసికొనవలయును.

శ్లో॥ [చింతామణౌ] ప్రలాపజిహ్వాస్ఫుటన హిక్కా శ్వాసాంగకంపనమ్ । కర్ణాంతశోఫస్తాపశ్చకర్ణికేసాన్నిపాతికే ॥

తా. వదురుట నాలుక పగిలియుండుట ఎక్కిళ్ళు దగ్గు శరీరకంపము చెవి కొనలువాచుట తాపము పలుమారు లేచుట ఈ లక్షణములుగలది కర్ణిక సన్నియని తెలియవలయును.

## పూర్వోక్తసన్నిపాత సాధనాడీ లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] సువ్యక్తతానిర్మలత్వం స్వస్థానస్థితిరేవచ । అచంచలమమందత్వం సర్వంసల్లక్షణంశుభమ్ ॥

తా. పైజెప్పబడిన 6 సన్నిపాతములలో నాడిస్వస్థానము విడనాడకను నిర్మలముగను కౌటిల్య రహితంబుగ సూక్ష్మతా విహీనంబుగనుండిన యాసన్ని పాతములు సాధ్యములని తెలియవలయును.

## సాధ్యసన్నిపాత వివరణము.

శ్లో॥ [గ్రంథాంతరే] సంధికస్తాంద్రికశ్చైవప్రలాపశ్చిత్తవిభ్రమః । జిహ్వకఃకర్ణికశ్చైవ షట్సాధ్యాశ్చప్రకీర్తితాః ॥

తా. సంధికము తాంద్రికము ప్రలాపము చిత్తవిభ్రమము జిహ్వకము కర్ణికము అను నీ 6 సన్నిపాతములు సాధ్యంబులు (అట్లగుటచే వానికి చికిత్సచేయ వలయును.

## అసాధ్యసన్నిపాత వివరణము.

శ్లో॥ [గ్రంథాంతరే] రుగ్దాహమంతకోభుగ్న నేత్రంస్యాత్కంఠకుబ్జకః । రక్తష్ఠీవీశీతగాత్ర మభిన్యాసశ్చదారుణాః । సన్నిపాతా ఇమేసప్తాప్యసాధ్యాఃపరికీర్తితాః ॥

తా. రుద్గ్రాహము అంతకము భుగ్న నేత్రము కంఠకుబ్జము రక్తష్ఠీవి శీతాంగ ము అభిన్యాసము అను నీ 7 సన్నిపాతములు అసాధ్యంబులు)అట్లగుటచేవానికితలు చుగా చికిత్స జేయంజనదు.

## రుద్గ్రాహసన్ని లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శోథప్రలాపమోహాఽగ్నిమాంద్యం శ్రాంతి
స్తృషాభ్రమః । రుద్గ్రాహే శ్వాసశూలౌచ కంఠమన్యారు
జాతథా ॥

తా. శరీరమువాచుట ప్రలాపము మోహము అగ్నిమాంద్యము బడలిక దప్పి తబ్బిబ్బులాడుట ఉబ్బసము శూల మెడపెడతలనరము వీనియందు వేదన ఈలక్ష ములుగలిగి కుతిక పగిలినొచ్చునది రుద్గ్రాహసన్నియని తెలియవలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] మోహస్తాపః ప్రలాపశ్చ వ్యథా కంఠేభ్రమః
క్లమః । వేదనాతి తృషాజాడ్యం శ్వాశ స్త్వేతైశ్చలక్షణైః ।
కష్టాత్కష్టతరంజ్ఞేయం రుద్గ్రాహస్సాన్నిపాతికః ॥

తా. మోహము తాపము వదురుట కుతిక పగిలినొచ్చుట శరీరము చక్రా కారముగ దిరుగుట బడలిక పొరలుట కడుదప్పి శరీరజాడ్యము శ్వాసము ఈ లక్షణ ములు గలిగి కుతికపగిలి నొచ్చునది రుద్గ్రాహసన్నియని తెలియవలయును. ఇది కడు అసాధ్యము

శ్లో॥ [నిత్యనాథీయే] ప్రలాప పరితాపన ప్రబలమోహమాంద్య
శ్రమాః । పరిభ్రమణ వేదనా వ్యథిత కంఠమన్యాహనుః ।
నిరంతరతృషా కరశ్వసనశూలహిక్కాకులః । సకష్టతర
సాధనోభవతిహంతిరుద్గ్రాహకః ॥

తా. వదురుట సంతాపము కడుమోహము అగ్ని మాంద్యము లేక కడుపులో మంట శ్రమ శరీరము దిరుగుట పొరలుట కంఠము పెడతలనరము ఎక్కిళ్లు వీని యందు వేదన ఎల్లపుడు దప్పి నిట్టూర్పులు శూల ఎక్కిళ్లు ఈ లక్షణములుగలిగి కుతికపగిలియుండునదిరుద్గ్రాహసన్నియని తెలియవలయును. ఇది యసాధ్యంబగు టచే రోగినిజంపును.

శ్లో॥ [చింతామణౌ] ప్రలాపతాపౌ మోహశ్చ కంఠేనై వేదనా భ్రమః । వేదనాతితృషా కాసో జాడ్యకంపప్రలాపనమ్ । స్వేదోలలాటకంఠేచ రుగ్దాహేసాన్నిపాతికే ॥

తా. వదురుట తాపము మోహము కుతికపగిలినొచ్చుట శరీరము దిరుగుట పొరలుట కడుదప్పి కాసము సరీరజాడ్యము శరీరకంపము మొరబెట్టుట లలాటము కుతిక వీనియందు చెమట ఈ లక్షణములుగలిగి కుతిక పగిలినొచ్చునది రుగ్దాహసన్నియని తెలియవలయును.

## అంతకసన్ని లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అంతర్దాహ శిరఃకంప హిక్కారోదన విభ్రమాః । తమంతకంవిజానీయాదసాధ్యశ్చాప్రతిక్రియః ॥

తా. కడుపులోదాహము శిరఃకంపము ఎక్కిళ్ళు ఏడ్చుట తబ్బిబ్బులాడుట ఈలక్షణములుగలిగి కడుపులో కడుమంటలు గలిగియుండునది అంతక సన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము అట్లగుటచే దానికి చికిత్సయేలేదు.

శ్లో॥ [ఆయుర్వేదే] దాహమోహ శిరః కంప హిక్కా కాసాంగ కంపనమ్ । సంతాపశ్చాత్మనోజ్ఞేయశ్చాంతకే సన్నిపాతకే ॥

తా. దాహము మోహము శిరఃకంపము ఎక్కిళ్ళు దగ్గు శరీరము వణకుట ఆత్మకు సంతాపము ఈ లక్షణములుగలిగి కడుపులో కడుతాపము గలిగియుండునది అంతక సన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము.

శ్లో॥ [నిత్యనాథీయే] దాహం కరోతి పరితాపనమాతనోతి మోహం దదాతి విదధాతి శిరఃప్రకంపమ్ । హిక్కాకరోతికసనంచసమాతనోతి జానీహితం విబుధ వర్జిత మంతకాఖ్యమ్ ॥

తా. దాహము సంతాపము మోహము తలవణుకుట ఎక్కిళ్ళు వాంతి ఈ లక్షణములుగలది అంతకసన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము.

శ్లో॥ [చింతామణౌ] సదాహమోహస్తాపశ్చ శిరః కంపఃప్రలాపనమ్ । వాంతిర్హిక్కాజ్వరశ్చైవహ్యంతకేసన్నిపాతకే ॥

తా. దాహము మోహము సంతాపము దలవణుకుట వదురుట వాంతిఎక్కిళ్ళు జ్వరము ఈ లక్షణములుగలది అంతకసన్నియని తెలియవలయును. ఇదియసాధ్యము.

## భుగ్న నేత్రసన్ని లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అక్షిభంగశ్శ్రుతేర్భంగః ప్రలాపశ్వాసవిభ్రమాః। భుగ్నదృష్టింవిజానీయా దసాధ్యాఽకంఠశోషవత్ ॥

తా. నేత్రములయందు మిటిమిటిచూపు చెవులు వినరాకుండుట ప్రలాపము శ్వాసము తబ్బిబ్బులాడుట కంఠశోష ఈలక్షణములుగలిగి నేత్రములుత్రుంగియుండు నదిభుగ్న నేత్రసన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము.

శ్లో॥ [ఆయుర్వేదే] జ్వరబలాపచయ శ్శ్రుతి శూన్యతా శ్వసన భుగ్నవిలోచనమోహితాః । ప్రలపనభ్రమకంపనశోకవాఞ్ త్యజతిజీవితమాశుసభుగ్నదృక్ ॥

తా. జ్వరమువలన బలక్షయము చెవులు వినరాకుండుట నిట్టూర్పు వాతము విడుచుట నేత్రములు త్రుంగియుండుట మోహమువదురుట శరీరము తిరుగుట శరీర కంపము దుఃఖించుట ఈలక్షణములుగలది భుగ్న నేత్ర సన్నియని తెలియవలయును. ఇది యసాధ్యంబగుటచే రోగి కడు శీఘ్రముగా ప్రాణంబులవిడుచును.

శ్లో॥ [నిత్యనాధీయే] శ్వసనం లోచనే భుగ్నే శ్రుతిశూన్యం జ్వరాధికమ్ । మోహప్రలాపనం కంపో భ్రమో నిద్రాపిలక్షణైః।జ్ఞాతవ్యోభుగ్ననేత్రోఽయం సన్నిపాతస్సుదారుణః ॥

తా. శ్వాస నేత్రములు త్రుంగియుండుట చెవులు వినరాకుండుట జ్వరాధిక్యము మోహము ప్రలాపము శరీరకంపము భ్రమ మైకము ఈ లక్షణములుగలది భుగ్న నేత్రసన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము.

శ్లో॥ [చింతామణౌ] భుగ్నం విలోచన ద్వంద్వం బాష్పంస్రవతి సంతతమ్ ॥ ।నిరీక్షణేనరహితం ప్రలాపభ్రమకంపనమ్ । జ్ఞాతవ్యోభుగ్ననేత్రోఽయం సన్నిపాతస్సుదారుణః ॥

తా. నేత్రములు త్రుంగియుండుట నేత్రములయందు యెల్లపుడు నీరుగారుట

నేత్రములకు చూపులేకుండుట వదురుట భ్రమయుట వణకుట ఈలక్షణములుగలది భగ్న నేత్ర సన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము.

## కంఠకుబ్జసన్ని లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] హనుఃకంఠశిరశ్శూలో మోహకంపజ్వరానిలా। మూర్ఛాదాహ ప్రలాపాస్స్యు రిత్యాద్యాః కణ్ఠకుబ్జకే॥

తా. చెక్కిళ్ళు మెడశిరము శూలించుట మోహము వణకుటజ్వరము ఊర్ధ్వ శ్వాసము మూర్ఛ దాహము ప్రలాపము ఈ లక్షణములుగలిగి మెడ కుదియబడి యుండునది కంఠకుబ్జ సన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము.

శ్లో॥ [ఆయుర్వేదే] శిరో_్త్తికంఠగ్రహదాహమోహ కంపజ్వరా ర_్తసమీరణా_్తిః। హనుగ్రహస్తాపవిలాపమూర్ఛా స్స్యాత్కంఠకుబ్జ। ఖలుకష్టసాధ్యః॥

తా. తలనొచ్చుట మెడకుదియబడుట దాహము మోహము వణకు జ్వరము ర_్తవాతసంబంధపీడ చెక్కిళ్ళు గిట్టుకొనుట సంతాపమువదురుట మూర్ఛ ఈలక్షణములుగలది కంఠకుబ్జసన్నియని తెలియవలయును. ఇది కష్టసాధ్యము.

శ్లో॥ [నిత్యనాథీయే] కంఠగ్రహోజ్వరోమూర్ఛా దాహః కంపో విలాపనమ్। మోహస్తాపశ్శిరో_్తిశ్చ వాతా_్తః ప్రలపశ్శ్వసః॥

తా. కంఠము కుదియబడుట జ్వరము మూర్ఛ దాహము వణకు ఏడ్చు మోహము తాపము శిరోవేదన వాతప్రకోపము వదురుట నిట్టూర్పులు విడుచు ఈలక్షణములుగలది కంఠకుబ్జ సన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము.

శ్లో॥ [చింతామణౌ] మోహదాహౌశిరః కంపః [illegible]ట్టిశ్చమూకతా॥ విలాపస్తాపనం మూర్ఛా త్వంగశైథిల్యకంకషః। ఛర్ది హిక్కాగుంభనంచ హృ్యుత్తమాంగవ్యధాతతః। సః సన్నిపాతోయం జ్ఞాతవ్యః కణ్ఠకుబ్జకః॥

తా. మోహము దాహము తలవణకుట మెడ కుదించినట్లుండుట మూకత్వము విలపించుట తాపము మూర్ఛ శరీరము శైథిల్యమును జెందుట దగ్గు పొట్ట ఎక్కిళ్ళు డగ్గుత్తికబడుట తలనొచ్చుట ఈ లక్షణములుగలది కంఠకుబ్జ సన్నియని తెలియ వలయును.

## రక్తష్ఠీవి సన్ని లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] రక్తఛర్ది భ్రమశ్వాసా అజ్ఞానాధ్మానహిక్కికా। ఆరక్తమండలం శ్యామం రక్తష్ఠీవీయలమాయమ్॥

తా. నెత్తురు గక్కుట తబ్బిబ్బులాడుట ఉచ్ఛ్వాసము అజ్ఞానము కడుపుబ్బరము ఎక్కిళ్ళు శరీరమునల్లనై రక్తమండలములు గలిగియుండుట ఈ లక్షణములు గలిగి రక్తము గక్కుచుండిన రక్తష్ఠీవిసన్నియని తెలియవలయును. ఇది గలవాడు యమాలయంబున కేగును.

శ్లో॥ [అయుర్వేదే] రక్తష్ఠీవిజ్వరవమితృషామోహశూలాతిసారా హిక్కాధ్మానభ్రమణదవథు శ్వాససంజ్ఞాప్రణాశాః । శ్యామారక్తాధికతరరసనా మండలోత్థానరూపా రక్తష్ఠీవీనిగదిత ఇహప్రాణహంతా ప్రసిద్ధః॥

తా. రక్తము గక్కుట జ్వరము వాంతి దప్పి మూర్ఛ శూల అతిసారము ఎక్కిళ్ళు కడుపుబ్బరము శరీర చక్రాకారముగ దిరుగుట సంతాపము శ్వాస తెలివి లేకుండుట నాలుక నల్లగగాని ఎఱ్ఱగగాని లేక మండలములు గలదిగగాని నుండుట ఈలక్షణములుగలది రక్తష్ఠీవిసన్నియని తెలియవలయును. ఇది ప్రాణహానిని చేయుట యందు ప్రసిద్ధిజెందినది.

శ్లో॥ [నిత్యనాధీయే] రక్తష్ఠీవన సంమూర్ఛా జ్వరమోహతృషా భ్రమాః । వాంతిర్హిక్కాతిసారశ్చ సంజ్ఞానాశోవ్యధాశ్వసః। మండలాశ్యామరక్తాశ్చ దాహస్స్యాల్లక్షణానివై । జ్ఞాతవ్య సన్నిపాతోయం రక్తష్ఠీవీతిఘాతుకః ॥

తా. రక్తము గక్కుట మూర్ఛ జ్వరము మోహము దప్పి శరీరము దిరుగుట వాంతి ఎక్కిళ్ళు అతిసారము తెలివిలేకుండుట * వ్యథ శ్వాస శరీరమునందు నల్లగ

---

* వ్యథ అనగా-సూదులచే బొడుచునటుల శరీరమునందు వేదన.

గాని ఎఱ్ఱగానినుండు మండలములు జనించుట దాహము ఈ లక్షణములుగలది రక్తష్ఠీవి సన్నియని తెలియవలయును. ఇది రోగిని జంపును.

శ్లో॥ [చింతామణౌ] జిహ్వోష్ఠస్ఫోటనాచ్చైవ రక్తం స్రవతి వేగతః। జ్వరతృష్ణామోహమూర్ఛా హిక్కాతీసారవిభ్రమాః। కాసశ్శిరోభ్రమః కంపో జిహ్వాశ్యామాసకంటకా ॥ రక్తష్ఠీవీ సన్నిపాతోజ్ఞాయశ్చాతివిభీషణః॥

తా. నాలుక పెదవులుపగిలి తీవ్రముగా రక్తముగారుట జ్వరము దప్పిమోహము మూర్ఛ ఎక్కిళ్లు అతిసారము దగ్గు తబ్బిబ్బులాడుట తలదిరుగుట వణకుట నాలుక నల్లనై ముండ్లుబారియుండుట ఈలక్షణములుగలది రక్తష్ఠీవి సన్నియని తెలియవలయును. ఇది కష్టభయంకరమైనది.

## శీతాంగసన్ని లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] ఉగ్రతాపక్లమశ్శైత్యం ఛర్ద్యతీసారవేగవాన్। శోకకంపభ్రమశ్వాస శీతగాత్రాద్యుపద్రవాః॥

తా. లోన ఉగ్రమైనతాపము లేక కడుశైత్యము బడలిక వాంతిఅధికముగా విరేచనములగుట శోకము వణుకు భ్రమ ఎగపూసిరి యీ మొదలగు లక్షణములు కలిగి శరీరమంతయు చల్లగనుండునది శీతాంగసన్నియని తెలియవలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] హిమసదృశశరీరో వేపథుశ్వాసహిక్కా శ్శిథిలసకలాంగః ఖిన్ననాదః ప్రలాపః। క్లమథదవథుకాసచ్ఛర్ద్యతీసారశోకా స్త్వరితమరణహేతు శ్శీతగాత్రప్రభావాత్

తా. శరీరము మంచువలె చల్లగనుండుట శరీరము వణకుట శ్వాస ఎక్కిళ్ళు సర్వాంగములు శిథిలములై యుండుట స్వరభంగము ప్రలాపము అనాయాసముగా శ్రమలోన ఉగ్రసంతాపము దగ్గు వాంతి అతిసారము దుఃఖము ఈలక్షణములుగలది శీతాంగ సన్నియని తెలియవలయును. దీనియందు శరీరము శీతలముగా నుండుట త్వరిత మరణమునకు హేతుకరమగును.

శ్లో॥ [నిత్యనాథీయే] శరీరంహిమశీతంచ ఛర్ద్యతీసారకంపనమ్ క్షీణనాడ్యంగ తాపశ్చ హిక్కాశ్వాసక్లమశ్రమాః।

సర్వాంగశిథిలోహంతి శీతాంగస్సన్నిపాతకః ॥

తా. శరీరము మంచువలె చల్లగనుండుట వాంతి అతిసారము వణుకు నాడి క్షీణించియుండుట శరీరమున తాపము ఎక్కిళ్ళు శ్వాస బడలిక శ్రమసర్వాంగములు శిథిలము జెందుట ఈ లక్షణములుగలది శీతాంగసన్నియని తెలియవలయును. ఇది రోగిని జంపును.

శ్లో॥ [చింతామణౌ] సర్వాంగం చంద్రవచ్ఛీతం కాసశ్వాసశ్చ జాయతే । హిక్కాసర్వాంగశైథిల్యాం వాంతిసంతాపమూర్ఛనమ్ । అతిసారోంగకంపశ్చ శీతాంగేసన్నిపాతకే॥

తా. సర్వాంగములు చంద్రునివలె చల్లగనుండుట కాసశ్వాసలు ఎక్కిళ్ళు సర్వాంగములయందు శైథిల్యము వాంతి సంతాపము మూర్ఛ అతిసారము శరీర కంపము ఈ లక్షణములుగలది శీతాంగసన్నియని తెలియవలయును.

## అభిన్యాస సన్ని లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] కరపాదతలేదాహః ప్రజ్ఞాహానిశ్చ జాయతే॥ జానీయాత్తమభిన్యాస మాయుర్వేదవిశారదః ॥

తా. అరకాళ్ళు అఱచేతులుమంట తెలివిలేకుండుట ఈ లక్షణములుగలది అబిన్యాస సన్నియని ఆయుర్వేద వేత్తలగు వారెఱుంగవలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] దోషత్రయస్నిగ్ధ ముఖత్వనిద్రా వైకల్యనిశ్చేష్టనకష్టవాచః । బలప్రణాశశ్శ్వసనాదివిగ్రహో భిన్యాస ఉక్తోనను మృత్యుకల్పః॥

తా. వాతపిత్తశ్లేష్మనాదులుప్రకోపించి పలుమారేగిరెగిరినడుచుట ముఖము నిగనిగలాడుట నిదుర బట్టకుండుట చేష్టలుడిగియుండుట కడుకష్టమువిూద మాట లాడుట బలిమికోరవడుట శ్వాసాదులు వెడలక బిగబట్టుట ఈ లక్షణములుగలది అభిన్యాససన్నియని తెలియవలయును. ఇది మృత్యుతుల్యముగ నుండును.

శ్లో॥ [నిత్యనాథీయే] త్రిదోషంచముఖంస్నిగ్ధం నిద్రావైకల్యంకం పనే।నిశ్చేష్టనమతిశ్వాస మందాగ్నిబలహానయః । మృత్యుతుల్యం హ్యభిన్యాసం సన్నిపాతం సులక్షయేత్ ॥

తా. వాతపిత్తశ్లేష్మనాడులు సంకరముగ నడచుట ముఖము మెఱయుట నిదుర బట్టకుండుట వణుకుట చేష్టలుడిగియుండుట అతిశ్వాస అగ్నిమాంద్యము బలముతక్కించుట యీ లక్షణములుగలది అభిన్యాససన్నియని తెలియవలయును. ఇది మృత్యుతుల్యమని యూహింపవలయును.

శ్లో॥ [చింతామణౌ] దోషత్రయం జ్వరశ్శ్వాసస్య స్నిగ్ధా మతి నిద్రతా । అంగవైకల్య తాపశ్చ బలహాని స్తృషాజటః ।
అత్యుత్కట స్సన్నిపాతో హ్యభిన్యాస స్సుదారుణః ॥

తా. వాతపిత్తశ్లేష్మనాడులు గలసి ప్రకోపించుట జ్వరము శ్వాస ముఖము మెఱయుట అధికనిద్ర అంగములయందునొప్పి తాపము బలముతక్కించుట దప్పి జాడ్యము యీ లక్షణములుగలిగి భయంకరముగనుండునది అభిన్యాససన్నియని తెలియవలయును. ఇది యసాధ్యము.

## సన్నిపాత భేదములు.

శ్లో॥ [శారీరే] తద్ద్విధా దాహశీతాది దాహాద్యాష్షట్తథాపరే ।
అభిన్యాశోభవేదేక సన్నిపాతాస్త్రయోదశ ॥

తా. సన్నిపాతములు దాహాది శీతాదిభేదములచే ద్వివిధంబు అందు దాహాది లక్షణములతోగూడిన సన్నిపాతములు 6 శీతాదిలక్షణములతోగూడినసన్నిపాతములు 6 అభిన్యాసం బొకటి సన్నిపాతములు పదమూడు.

## శీతాదిసన్నిపాత వివరణము.

శ్లో॥ సంధికస్తాంద్రికోజిహ్వ కర్ణికశ్చప్రలాపకః ।
చిత్తవిభ్రమకశ్శీతాః కఫవాతోత్తరాః స్మృతాః ॥

తా. సంధికము తాంద్రికము జిహ్వకము కర్ణికము ప్రలాపము చిత్తవిభ్రమము అను 6 సన్నిపాతములు శీతాదిలక్షణయుక్తంబులై శ్లేష్మవాతప్రకోపములు గలవిగ నుండును. అట్లగుటచే యవి సాధ్యంబులు.

## దాహాద్యుగ్రసన్నిపాత వివరణము.

శ్లో॥ భుగ్నాక్షోరక్తష్ఠీవీ శీతాంగోంతకఏవచ ।
కణ్ఠకుబ్జశ్చరుద్దాహో దాహాద్యాభూతపిత్తకాః ॥

తా. భుగ్ననేత్రము రక్తష్ఠీవి శీతాంగము అంతకము కంఠకుబ్జము రుగ్దాహము అను 6 సన్నిపాతములు దాహాదిలక్షణములతోఁగూడి కేవలపిత్తాధిక్యముగలవై యుండును. ఈ 6 ను సాధ్యములు

శ్లో॥ అంతర్దాహోబహిశ్శీతో నిహంత్యేష త్రయోదశః ॥

తా. అంతర్దాహ బహిశ్శీతంబులుఁగలది అభిన్యాససన్నిపాతము. ఇది 13 వ సంఖ్యగలదిగ నుండును. ఇది మనుజుని జంపును.

శ్లో॥ త్రయోపోషాన్సమాక్షిప్య చేష్టాభగ్నేనచేతసా ।
అభిన్యస్యేత్ప్రకుర్వంతి తేనజంతుర్మృతోపమః ॥

తా. వాతపిత్తశ్లేష్మములు 3 ను ప్రకోపించిసమానంబులైనచేష్టావిహీనంబులై మనస్సుతోఁగలసి క్రమమును దప్పియుండునది అభిన్యాససన్నియని తెలియవలయును. ఇది నిశ్చయముగా మనుజుని జంపును.

సన్నిపాత దినప్రమాణము.

శ్లో॥ [గ్రంథాంతరే] సంధికస్సప్తదివస మంతకోవాసరాందశ । రుగ్దాహోవింశతింవారా న్విభ్రమస్త్వేకవింశతిమ్ । పక్షమేకం శీతగాత్ర స్తాంద్రికః పంచవింశతిమ్ । అథవా వాసరాన్సప్త కంఠకుబ్జస్త్రయోదశ ! త్రిమాసం కర్ణికశ్చైవ భుగ్ననేత్రో దినాకష్టకమ్ । రక్తష్ఠీవీ దశదినం ప్రలాపస్స్యాచ్చతుర్దశ । జిహ్వక షోడశదినమభిన్యాసోర్ధమాసకమ్ । ఇత్థంహి సన్నిపాతానాం ప్రమాణం పరికీర్తితమ్ ॥

తా. సంధికసన్నికి 7 దినములు అంతకసన్నికి 10 దినములు రుగ్దాహసన్నికి 20 దినములు చిత్తభ్రమసన్నికి 21 దినములు శీతాంగసన్నికి 15 దినములు యాంద్రికసన్నికి 25 దినములు లేక 7 దినములు కంఠకుబ్జసన్నికి 13 దినములు కర్ణికసన్నికి 3 మాసములు భుగ్ననేత్రసన్నికి 8 దినములు రక్తష్ఠీవిసన్నికి 10 దినములు ప్రలాపసన్ని 14 దినములు జిహ్వకసన్నికి 16 దినములు అభిన్యాససన్నికి 16 దినములు కాలప్రమాణంబు. (అట్లగుటచే సంధికము తాంద్రికము ప్రలాపము చిత్తవిభ్రమము జిహ్వకము కర్ణికము అను 6 సాధ్యసన్నిపాతములు పైజెప్పబడిన కాలక్రమముగానివర్తించినను నివర్తించును లేక చంపినను చంపును; అంతకము రుగ్దాహము శీతాంగము

కంఠకుబ్జము అభిన్యాసము రక్తష్ఠీవి భుగ్ననేత్రము అను 7 అసాధ్యసన్నిపాతములు నానివాని కాలక్రమముగా తెలుచుగ చంపును.)

## త్రయోదశసన్నిపాత విశేషములు.

శ్లో॥ ఏకోల్బణాస్త్రయస్తేషు ద్వ్యుల్బణాశ్చతథేతిషట్ । త్ర్యుల్బణశ్చభవేదేకో విజ్ఞేయఃసకుసప్తమః । ప్రవృద్ధమధ్యహీనైస్తు వాతపిత్తకఫైశ్చషట్ । సన్నిపాతజ్వరస్యైవం స్యుర్విశేషాస్త్రయోదశ । విస్ఫారకశ్చాశుకారీ కంపనోబభ్రుసంజ్ఞకః । శీఘ్రకారీ తథాభల్లః సప్తమః పుటపాలకః । సమ్మోహకః పాలకశ్చ యామ్యః క్రకచఇత్యపి । తతఃకర్కటః ప్రోక్తస్తతోవైదారికాభిధః ॥

వాతాధిక్యముగల సన్నిపాతము పిత్తాధిక్యముగల సన్నిపాతము శ్లేష్మాధిక్యముగల సన్నిపాతము వాతపిత్తాధిక్యముగల సన్నిపాతము వాతపిత్త శ్లేష్మాధిక్యముగల సన్నిపాతము పిత్తశ్లేష్మాధిక్యముగల సన్నిపాతము వాతపిత్తశ్లేష్మాధిక్యముగల సన్నిపాతము వాతము వృద్ధిజెంది పిత్తము సమముగ కఫముక్షీణముగనుండు సన్నిపాతము వాతము సమముగ పిత్తమువృద్ధిజెంది కఫముక్షయించియుండుసన్నిపాతము వాతము క్షయించి పిత్తము వృద్ధంబై కఫము సమముగానుండుసన్నిపాతము వాతమువృద్ధిజెంది పిత్తముక్షయించి కఫముసమముగానుండు సన్నిపాతమువాత సమముగను పిత్తముక్షయించి కఫము వృద్ధిజెందియుండు సన్నిపాతముయిటుల సన్నిపాతము 13 విధంబులుగనుండును. వీనికి యథాక్రమముగా విస్ఫారకము ఆశుకారికంపనవ బభ్రు శీఘ్రకారి భల్లము పుటపాలకము సమ్మోహకము పాలకము యామ్యము క్రకచము కర్కటము వైదారికము అని నామంబులుగలవు.

## విస్ఫారకసన్నిపాత లక్షణము.

శ్లో॥ శ్వాసఃకాసో భ్రమోమూర్ఛా ప్రలాపో మోహవేపథూ ।
పార్శ్వస్యవేదనాజృంభా కషాయత్వం ముఖస్యచ ॥
వాతోల్బణస్యలింగాని సన్నిపాతస్యలక్షయేత్ ।
ఏషవిస్ఫారకోనామ్నా సన్నిపాతసుదారుణః ॥

తా. శ్వాసము కాసము భ్రమము మూర్ఛ పలవరింత మోహము వణుకు ప్రక్కశూల ఆవులింత నోరువగరుగనుండుట ఈలక్షణములువాతాధిక్యముగలసన్ని

పాతమునందు కలిగియుండును. ఇది నిస్ఫారకసన్నిపాతమనబడును. మిగుల దారుణ మయినది.

### ఆశుకారిసన్నిపాత లక్షణము.

శ్లో॥ అతిసారో భ్రమో మూర్ఛా ముఖపాక స్తథైవచ ।
గాత్రేచ బిందవో రక్తా దాహోతీవ ప్రజాయతే ॥
పిత్తోల్బణస్య లింగాని సన్నిపాతస్య లక్షయేత్ ।
భిషగ్భి సన్నిపాతోయ మాశుకారీ ప్రకీర్తితః ॥

తా. అతిసారము భ్రమ మూర్ఛ ముఖపాకము శరీరమునందు రక్తబిందువులు సర్వాంగములయందు అధికతాపము ఇవి పిత్తాధిక్యముగల సన్నిపాతమునందు కలిగియుండును. ఇది ఆశుకారి సన్నిపాతమని వైద్యులచే జెప్పబడును.

### కంపనసన్నిపాత లక్షణము.

శ్లో॥ జడతా గద్గదా వాణీరాత్రౌ నిద్రాభవత్యపి ।
ప్రస్తబ్ధే నయనేచైవ ముఖమాధుర్యమేవచ ।
కఫోల్బణస్య లింగాని సన్నిపాతస్య లక్షయేత్ ।
మునిభి స్సన్నిపాతోయ ముక్తః కంపనసంజ్ఞకః ॥

తా. జాడ్యము గద్గదభాషణము రాత్రులయందు నిద్రించునపుడు నేత్రములు స్తబ్ధములుగనుండుట నోరుతియ్యగనుండుట ఈలక్షణములు కఫాధిక్యముగలసన్నిపాతమునందు కలిగియుండును. ఇది కంపన సన్నిపాతమని ఋషులచే జెప్పబడును.

### బభ్రుసన్నిపాత లక్షణము.

శ్లో॥ వాతపిత్తాధికోయ స్తు సన్నిపాతః ప్రకుప్యతి
తస్యజ్వరో మద స్తృష్ణా ముఖశోషః ప్రమీలకః ।
అధ్మానా రుచి తంద్రాశ్చ కాసశ్వాసభ్రమశ్రమాః ।
మునిభి ర్బభ్రునామాయం సన్నిపాత ఉదాహృతః ॥

తా. వాతపిత్తాధిక్యముగల సన్నిపాతమునందు జ్వరము మదము దప్పినోరు యెండుట తంద్ర కడుపుబ్బరము అరుచి కాసశ్వాసములు భ్రమ శ్రమము ఇవి కలుగును. ఇది బభ్రుసన్నిపాతమని ఋషులచే జెప్పబడును.

## శీఘ్రకారి సన్నిపాతలక్షణము.

శ్లో॥ వాతశ్లేష్మాధికోయస్య సన్నిపాతఃప్రకుప్యతి।
తస్యశీతజ్వరోమూర్ఛా క్షుత్తృష్ణాపార్శ్వనిగ్రహః॥
శూలమస్విద్యమానస్య తంద్రాశ్వాసశ్చజాయతే।
అసాధ్యస్సన్నిపాతోయం శీఘ్రకారీతికథ్యతే।
నహిజీవత్యహోరాత్రావేతేనావిష్టవిగ్రహః॥

తా. శీతజ్వరము మూర్ఛ ఆకలి దప్పి పార్శ్వములయందుపట్లు శూల చెమట లేకుండుట తంద్ర శ్వాసము ఇవి వాతశ్లేష్మాధిక్యముగల సన్నిపాతమునందు కలిగి యుండును. ఇది శీఘ్రకారి సన్నిపాతమనబడును. చికిత్సకుందసాధ్యము. ఒక అహోరాత్రములోపల మనుజుని జంపును.

## భల్లసన్నిపాత లక్షణము.

శ్లో॥ పిత్తశ్లేష్మాధికో యస్యసన్నిపాతః ప్రకుప్యతి।అంతర్దాహో
బహిశ్శీతంతస్యతృష్ణాప్రవర్ధతే । తుద్యతేదక్షిణేపార్శ్వే ఉరః
శ్శీర్షగళగ్రహః। ష్ఠీవతిశ్లేష్మపిత్తంచ కృఛ్ఛాత్కోఠశ్చజాయ
తే। విడ్భేదశ్వాసహిక్కాశ్చ వర్ధంతేనప్రమీలకాః। ఋషి
భిర్భల్లనామాయం సన్నిపాత ఉదాహృతః॥

తా. శరీరముయొక్క లోభాగమునందు విశేషతాపము పైభాగమునందు శీతము విశేషదప్పి కుడిపార్శ్వమునందుపోట్లు రొమ్ము శిరము కంఠము వీనియందు పట్లు శ్లేష్మపిత్తము కారియుమియుట కంఠమునందునొప్పి మలబంధము శ్వాసము ఎక్కిళ్లు తంద్ర ఇవి పిత్తశ్లేష్మాధిక్యముగల సన్నిపాతమునందు కలిగియుండును. ఇది భల్ల సన్నిపాతమని ఋషులచే చెప్పబడును.

## కూటపాలక సన్నిపాతలక్షణము.

శ్లో॥ సర్వదోషోల్బణోయస్య సన్నిపాతఃప్రకుప్యతి । త్రయాణామ
పిదోషాణాం తస్యరూపాణిలక్షయేత్ ॥ వ్యాధిభ్యోదారుణ

శ్చైవ వ్రజకస్త్వాగ్నిసన్నిభః ॥ కేవలోచ్ఛ్వాసపరమ స్సబ్ధాంగ స్తబ్ధలోచనః ॥ త్రిరాత్రాత్పరమే తస్యాజంతోర్హ్వ రతిజీవితమ్॥ తదవస్థంతు తంద్రృష్ట్వా మూఢోవ్యాహారతేజనః । ధర్షితో రాక్షసై ర్భ్వానమ వేలాయాంచరంతియే । అంబయాబ్రువతే కేచిత్ యక్షిణ్యా బ్రహ్మరాక్షసైః । పిశాచైర్గుహ్యకైశ్చైవ తథాన్యైర్మ స్తకేహతమ్ । కులజైవార్చనాహీనం ధర్షితంకుల దైవతైః । నక్షత్రపీడా మపరేగరక ర్మేతిచాపరే । సన్నిపాత మిమం ప్రాహు ర్భిషజః కూటపాలకమ్॥

తా. వాతాదిత్రిదోషప్రకోపాధిక్యముగల సన్నిపాతమునందు ప్రకోపించి యుండు వాతాది త్రిదోషముల లక్షణములన్నియు కలిగియుండును ఇది అన్నివ్యాధులకంటె మిగుల దారుణమయినది దీనియందు పెద్దయూపిరి విశేషదప్పి అవయవములు నేత్రములు ఇవి స్తబ్ధములుగనుండుట ఈ లక్షణములు కలిగియుండును. ఇది 3 దినములలోపల రోగియొక్క ప్రాణమును హరింపజేయును. ఈసన్నిపాతము కలిగియుండువానినిచూచి కొందరు మూఢులు అకాలములో సంచరించునట్టి రాక్షస గ్రహములు సోకినవియు కొందరు చాముండాదిగ్రహములు సోకినవియు కొందరు బ్రహ్మరాక్షసగ్రహములుసోకినవియు కొందరు పిశాచగ్రహములుసోకినవనియు కొందరు యక్షగ్రహము సోకినదనియు కొందరు కులదేవతలను పూజింపకుండుటవలన జనించిన చేష్టయనియు కొందరు నక్షత్రపీడయనియు కొందరు విషప్రయోగమువలన జనించినదనియు మఱికొందరు మారణాది ప్రయోగమువలన జనించినదనియు వచించెదరు. ఇది కూటపాలకమను సన్నిపాతమని వైద్యశాస్త్రవేత్తలు వచించెదరు.

## సమ్మోహసన్నిపాత లక్షణము.

శ్లో॥ ప్రవృద్ధమధ్యహీనైస్తు వాతపిత్తకఫైశ్చయః ।
తేనరోగా స్తవహోక్తా యథాదోషబలాశ్రయాః ॥
ప్రలాపాయాససంమోహ కంపమూర్ఛారతిభ్రమాః ।
ఏకరూపాభిఘాతశ్చ తత్రాప్యేతేవి శేషతః ।
ఏషసంమోహకోనామ్నా సన్నిపాత స్సుదారుణః॥

తా. వాతము ప్రవృద్ధమై పిత్తము సమముగా కఫము క్షయించినదిగానుండు సన్నిపాతమునందు పలవరింత ఆయాసము మోహము వణుకు మూర్ఛ అరతి భ్రమము 1 పార్శ్వమునందుశూల ఇవి జనించియుండును. ఇది సమ్మోహన సన్నిపాత మన బడును మిగుల దారుణమయినది.

పాలకసన్నిపాత లక్షణము.

శ్లో॥ మధ్యప్రవృద్ధహీనైస్తు వాతపిత్తకఫైశ్చయః । తేనరోగాస్త ఏవోక్తా యథాదోషబలాశ్రయాః । మోహప్రలాపమూర్ఛా స్స్యుః ర్మన్యాస్తంభః శిరోగ్రహః । కాసశ్వాసోభ్రమస్తంద్రా సంజ్ఞానాశోహృదివ్యథా । ఖేభ్యోరక్తంవిసరతి సంరక్తస్తబ్ధనే త్రతా । తత్రాప్యేతేవి శేషాస్స్యు ర్మృత్యురరాక్ త్రివాస రాత్ । భిషగ్భిస్సన్నిపాతోయం కథితఃపాలకాభిధః ॥

తా. వాతము సమముగానుండి పిత్తము వృద్ధిజెంది కఫము క్షయించియుండు సన్నిపాతమునందు మూర్ఛ పలవరింత మోహము మన్యాస్తంభము తలనొప్పి కాసము శ్వాసము భ్రమము తంద్రా ప్రజ్ఞాహాని ఱొమ్మునొప్పి నేత్రాదీంద్రియ ద్వారము నుండి రక్తము వెడలుట నేత్రములు యెఱ్ఱగ స్తబ్ధముగనుండుట ఈ లక్షణములుగల గును. ఇదిపాలకసన్నిపాతమని వైద్యులచే చెప్పబడును ఇది 3 దినములలోపలమ ణమును కలుగజేయును.

యామ్యసన్నిపాత లక్షణము.

శ్లో॥ హీనప్రవృద్ధమధ్యైస్తు వాతపిత్తకఫైశ్చయః । తేనరోగాస్త ఏవోక్తాయథాదోషబలాశ్రయాః । హృదయం దహ్యతేచా స్యయకృత్ప్లీహం త్రపుప్ఫుసాః । పచంత్యత్యర్థమూర్ధ్వాధః పూయశోణితనిర్గమః । శీర్ణాదంతాశ్చమృత్యుశ్చ తత్రాప్యే తద్విశేషతః । భిషగ్భిస్సన్నిపాతోయం యామ్యోనామ్నా ప్రకీర్తితః ॥

తా. వాతము హీనమై పిత్తము ప్రవృద్ధమై కఫము సమముగనుండు సన్ని పాతమునందు హృదయమునందుమంట యకృత్తు ప్లీహము అంత్రము పుప్ఫుసము ఇవి

పాకమును జెందుట ఊర్ధ్వాధోమార్గముగా చీము రక్తము వెడలుట దంతములు రాలి పడుట శీఘ్రముగా మరణము కలుగుట ఈలక్షణములు కలిగియుండును, ఇదియామ్య సన్నిపాతమని వైద్యులచే చెప్పబడినది.

## క్రకచసన్నిపాత లక్షణము.

శ్లో॥ ప్రవృద్ధహీనమధ్యైస్తువాతపిత్తకఫైశ్చయః। తేనరోగాస్తఏవోక్తాయథాదోషబలాశ్రయాః ॥ ప్రలాపాయాససంమోహాకంప మూర్ఛారతిభ్రమాః । మన్యాస్తంభేనమృత్యుస్స్యాత్తత్రాప్యేతద్విశేషతః ॥ భిషగ్భిస్సన్నిపాతోయం క్రకచఃసంప్రకీర్తితః ॥

తా. వాతము ప్రవృద్ధమై పిత్తముతక్కువయై కఫము సమముగానుండు సన్నిపాతమునందు పలవరింత ఆయాసము మోహము వణుకు మూర్ఛ అరతి భ్రమముఇవి కలుగుటయేగాక మన్యాస్తంభముచే మరణముసంభవించును. ఈసన్నిపాతముక్రకచ మను పేర బరగునని వైద్యశాస్త్రవేత్తలు వచింపుచున్నారు.

## కర్కటసన్నిపాత లక్షణము.

శ్లో॥ మధ్యహీనప్రవృద్ధైస్తు వాతపిత్తకఫైశ్చయః। తేనరోగాస్త ఏవోక్తా యథాదోషబలాశ్రయాః ॥ అంతర్దాహో విశేషోత్ర నచవక్తుంనశక్యతే । రక్తమాలక్తకేనేవ లక్ష్యతేముఖమండలమ్ । ఇత్యేనాగర్హితః శ్లేష్మాహృదయాన్నప్రపిద్యతే ॥ ఇషుణేవాహతంపార్శ్వంతుద్యతేఖన్యతేహృది । ప్రమీలకశ్వాసహిక్కావర్ధంతేతుదినేదినే ॥ జిహ్వాదగ్ధాఖరస్పర్శాగళఃశూకైరివావృతః । విసర్గం నాభిజానాతకూజేచ్చాపికపోతవత్ । అతీవశ్లేష్మణాపూర్ణం శుష్కరక్తోష్ఠతాలుకః । తంద్రానిద్రాతియోగార్తోహతనాజ్ఞహతద్యుతిః । నరతింలభతేనిత్యంవిపరీతానిచేచ్ఛతి । ఆయమ్యతేచబహుశోరక్తం ష్ఠీవతిచాల్పశః । ఏషకర్కటకోనామ్నా సన్నిపాతస్సుదారుణః॥

తా. వాతము సమముగా పిత్తము క్షయించినదిగా కఫము వృద్ధి కొందినదిగా నుండు సన్నిపాతమునందు మిగుల దారుణమై అంతస్తాపము ముఖము విశేషముగా నెఱ్ఱగనుండుట యెంతకారియుమిసినను కఫము వెడలకుండుట హృదయము బాణముచే కొట్టబడినట్లు విశేష నొప్పితో గూడియుండుట కండ్లు చెక్కుకొని పోవుట ఎక్కిళ్లు అడుగడుక్కు వృద్ధి జెందుచుండుట నాలుకనిప్పతో కాల్చబడినట్లుసుకఠిన స్పర్శముగలదిగనుండుట కంఠము ముండ్లచే కప్పబడినటులుండుట శ్వాసము వెడలునపుడు పావురపిట్టశబ్దమువలె కంఠమునందుధ్వనిగలుగుట నోరుకఫము చేపూరింపబడిలోదాడ పెదవి యివియెండిరక్తవర్ణముగనుండుట తంద్రఅధికనిద్ర మాటలుబయటికి రాకుండుట శరీరమునందు కాంతి తగ్గియుండుట ఎల్లపుడు ఉత్సాహము లేకుండుట అపథ్యవస్తువులయందు విశేషముగా యిచ్ఛగలుగుట కారియుమియునపుడు రక్తము స్వల్పస్వల్పముగ పడుట యిట్టి లక్షణములుగలిగియుండును. ఇది కర్కటమనబడును. మిగుల దారుణమైనది.

## వైదారికసన్నిపాత లక్షణము.

శ్లో॥ హీనమధ్యప్రవృద్ధైస్తు వాతపిత్తకఫైశ్చయః। తేనరోగా స్త
ఏవోక్తా యథాకోపభలాశ్రయాః॥ అల్పశూలం కటీతోదో
మధ్యేదాహోరుజాభ్రమః। భృశంక్లమఃశిరోవస్తి మన్యా
హృదయవాగ్రుజః॥ ప్రమీలకశ్వాసకాస హిక్కాజాడ్యవి
సంజ్ఞతాః। ప్రథమోత్పన్నమేనంతుసాధయంతికదాచన। ఏత
స్మిన్సన్నివృత్తేతుకర్ణమూలేసుదారుణః। విడకోజాయతేజం
తోర్యథాకృచ్ఛ్రేణజీవతి। సవైదారికసంజ్ఞోయం సన్నిపాతి
స్సుదారుణః। త్రిరాత్రాత్పరమేతస్యవ్యర్థమాధకల్పనమ్॥

తా. వాతము క్షయించి పిత్తము సమమై కఫము వృద్ధిజెందియుండు సన్నిపాతమునందు స్వల్పశూల నడుమునొప్పి బొమ్మనందు శూల భ్రమ విశేషముగాబలిక శిరము వస్తిపెడతల పెద్దనరము హృదయమునోరు వీనియందుశూల తంద్రశ్వా కాసములు ఎక్కిళ్ళు జడత్వము ప్రజ్ఞలేకుండుట ఈ లక్షణములు కలిగియుండును ఇవి జనించినతోడనే చికిత్సించిన ఒకానొకపుడుశమించును. శమించినతోడనేకర్ణ

మూలమునందు దారుణమయిన పిటికజనించును దీనిచేత ప్రాణాంత్య మయిన కష్టము కలుగును, ఇదివై దారిక సన్నిపాతమనబడును. దీనియందు 3 దినములకుపైన చికిత్స చేయుట నిష్ఫలము,

## సన్నిపాత సప్తవిధదోష మారకోపద్రవములు.

శ్లో॥ [సిద్ధవిద్యాభూ] జ్వర స్తీక్ష్ణోథ వాశీతమథం ల్పజ్వరోపివా । నేత్రాంతౌ రక్తరహితౌ పాణిపాదనఖా స్తథా । నేత్రేకాంతి విహీనేచ నశ్రుతౌ సాగరధ్వనిః । స్వేదహీనః జ్వరశ్చైవ హ్యథవా స్వేదఉత్కటః । ముఖేకాంతి స్తతో క్షీణా నేత్రే బుగ్నేథవాకృశే । నాభిహృన్నాసికాపాద హీం కస్సర్వాంగ కంపనమ్ । శిరఃకంపో హ్యపస్మారః కఫఃకంఠం సమాగతః । గంధస్వాదుం సజానాతి మలంకపిలవర్ణకమ్ । శిథిలాచపలా చైవ నాడీకుటిలసూత్రకా । ఆదాపిత్త గతిర్నాడీ తతోవాత గతిర్భవేత్ । తతశ్లేష్మ గతిర్నాడీ చక్రవద్భ్రమతేముహుః । మందనాడీ భవేద్యస్య హ్యసాధ్యం భవతిధ్రువమ్ । సరోగీ నిధనంయాతి విజ్ఞేయం వైద్యపారగైః । సాధ్యాసాధ్య విధిం జ్ఞాత్వా కిత్సే త్పండితస్స్వయమ్ ॥

తా. అతితీవ్రజ్వరము లేక శరీరమునకు శీతలము లేక స్వల్పజ్వరము నేత్రాంతములురెప్పలు పాదములు హస్తములు నఖములు వీనియందు రక్తము లేకుండుట నేత్రములు కాంతిహీనములై యుండుట చెవులలో సముద్రపుధ్వని వినరాకుండుట చెమటలేని జ్వరము లేక ఆరనిచెమట ముఖమున కాంతిలేకుండుట నేత్రములు క్రుంగియుండుట నేత్రములు కృశించి సూక్ష్మంబులై యుండుట బొడ్డుహృదయము నాసికకాళ్ళు చేతులు కడుచల్లనైయుండుట కడుతీవ్రమైన శిరోరోగము ఎగవూపిరి ధనుర్వాతము ఎక్కుళ్ళు శరీరమంతటవణుకుటతలవణుకుట అపస్మారముగుతికలో శ్లేష్మము అడ్డపడుట పరిమళద్రవ్యములవాసన నాసికకు తెలియకుండుట మలము కపిలవర్ణముగ వెడలుట నాడి 3 వ్రేళ్లక్రింద ఖండఖండములుగ నేని లేక చపలముగ (మెఱుపువలె) నేనిలేక కుటిలమై వేగముగ నేని నడుచుట వాతపిత్తశ్లేష్మనాడులు 3 ను కలిసి తంతివలె నేక ముగనడుచుటనాడిముందుగా పిత్తగతి వెనుకవాతగతి దానికి వెనుక శ్లేష్మగతిగలదై

నడుచుట పలుమారు చక్రమువలె తిరుగుట మందగతిగానడచుట ఈగుర్గుణములలో 1 2 3, సర్వసన్ని పాతములలోను సప్తవిధదోషములలోను జనించిన వానితోడపై జెప్పిన వికారములును గూడియుండిన అసాధ్యంబగుటచే ఆరోగి మరణము జెందును. అట్లగుటంజేసి సన్నిపాత సప్తవిదోష సాధ్యాసాధ్యముల నెఱిగి వేత్తయగు పండితుడు చికిత్స జేయవలయును.

శ్లో॥ [అశ్వినీకల్పే] జ్వరోనిహంతిరక్తాక్షమక్షామంహృదిశూలినమ్
సదాశ్వసంత స్విద్యంతం శక్తిహీనం హతానలమ్ ॥

తా. నేత్రములు రక్తోద్రిక్తములై యుండుట శరీరముకృశింపకుండుటఱొమ్ము నొచ్చుట యెల్లపుడుశ్వాసము వెడలుట అరనిబంక చెమట సత్వములేకుండుట అగ్నిమాంద్యము ఈలక్షణములు 13 ను సన్నిపాతజ్వరములలోను సప్తవిధదోషములలోను గలిగియుండిన ఆరోగి మరణము జెందునని యెఱిగి చికిత్స జేయంజనదు.

శ్లో॥ [ఆయుర్వేదే] జిహ్వాశ్యామా ముఖంపూతి క్షుతమక్షిసిమజ్జతి
ఖగాశ్చమూర్ధ్నిరిష్యంతి యస్యరోగాంశ్చ వర్జయేత్ ॥

తా. నాలుక నల్లగనుండుటనోరు కంపువేయుట నేత్రములుపగిలిక్రుంగియుండుట తలమీద పక్షిదన్నుట ఈ లక్షణములు 13 ను సన్నిపాతములలోను సప్తవిధదోషములలోను గలిగిన ఆరోగి బ్రతుకడని యెఱిగి చికిత్సజేయంజనదు.

శ్లో॥ [నిత్యనాధీయే] సుశీతాహారితా యస్యరోమకూపాశ్చ సం
వృతాః । ఆమ్లాభిలాషస్సతతం మృత్యుమాప్నోతితత్వతః ॥

తా. శీతల ద్రవ్యాహారములనుగోరుట రోమకూపములు మూసికొనుటపులుసు మీద నభిలాషగలుగుట ఈ లక్షణములు యేరోగియందుగలిగినను ఆరోగిబ్రతుకడని తెలియవలయును.

రోగారిష్ట తిధివార నక్షత్రములు.

శ్లో॥ [జ్యోతిషగ్రంథే] ఉరగశతభిషార్ద్రా స్వాతిమూలాత్రిపూర్వా భరణి పిత్రువిశాఖా భానుభౌమార్కజానామ్ । ప్రతిపనవచతుర్థీద్వాదశీ చాపిషష్ఠీ హరిహరవిధిరేకో రోగిణాం కాలమృత్యుః ॥

తా. ఆశ్రేష శతభిష ఆర్ద్రస్వాతి మూల పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్ర భరణి మఖ విశాఖ ఆనక్షత్రవారములుంగ శివారము శనివారము పాడ్యమి నవమి చవితి

ద్వాదశి షష్ఠి ఈతిథి వారనక్షత్రములు 3 ను కూడినదినము నందెవనికి జ్వరమువచ్చెనో వానికి కాలమృత్యువు ఆ సన్నమైనదని తెలియవలయును.

## రోగోత్పత్తి శుభాశుభ నక్షత్రములు.

శ్లో॥ [గ్రంథాంతరే] కృత్తికాసుయదాకశ్చిజ్జ్వరాదిప్రతిపద్యతే ।
నవరాత్రంతదాపీడాత్రిరాత్రంరోహిణీషుచ । మృగశీర్షే పంచ
రాత్రమార్ద్రాప్రాణభయంతథా । పునర్వసూచపుష్యశ్చసప్త
రాత్రంవిధీయతే । నవరాత్రంతథాశ్లేషాఃశ్మశానాంతంమఘా
సుచ । ద్వామాసౌఫల్గునీచైవ ఫల్యుత్తరాసుత్రిపంచకమ్ ।
హస్తేవజాయతేపక్షం చిత్రాచైవార్ధమాసకమ్ । మాసద్వ
యంతథాస్వాతీవిశాఖేపంచవింశతిః । అనూరాధా దశప్రోక్తా
జ్యేష్ఠాచైవార్ధమాసకమ్ । మూలేచజాయతేమోక్షఃపూర్వా
షాఢాత్రిపంచకమ్ । ఉత్తరేదినవింశత్యా ద్వామాసౌశ్రవ
ణేతథా । దనిష్ఠాయామర్ధమాసో వారుణేచదశాహకమ్ ।
పూర్వాభాద్రపదేమోక్ష ఉత్తరాసుత్రిపంచకమ్ । రేవతీసప్త
రాత్రంచ హ్యహోరాత్ర తథాశ్వినీ । భరణీ తత్క్షణేనైవ
మరణంతు నసంశయః ॥

తా. కృత్తికా నక్షత్రమునగలిగిన జ్వరాదులు 9 రాత్రులును రోహిణియందు 8 రాత్రులును మృగశీర్షయందు 5 రాత్రులును పీడించును. ఆర్ద్రయందు ప్రాణభయమునుగలుగజేయును. పునర్వసు పుష్యమీనక్షత్రముల జనించినజ్వరాదులు 7 రాత్రులును ఆశ్లేషానక్షత్రమున 9 రాత్రులును పీడించును. మఖానక్షత్రమున జనించినజ్వరాదులుమరణమును గలుగజేయును. పుబ్బానక్షత్రమున జనించిన జ్వరాదులు 2 మాసములును ఉత్తరానక్షత్రమున 15 దినములు హస్తానక్షత్రమున 1 పక్షమును చిత్తానక్షత్రమున ½ మాసమును స్వాతీనక్షత్రమున 2 మాసములును విశాఖా నక్షత్రమున 25 దినములును అనూరాధా నక్షత్రమున 10 దినములును జ్యేష్ఠా నక్షత్రమున 15 దినములును పీడించును. మూలానక్షత్రమున జనించినరోగము 15 దినములలోనుపూర్వాషాఢా నక్షత్రమున 15 దినములలోను ఉత్తరాషాఢా నక్షత్రమున 20 దినములలోను శ్రవణనక్షత్రమున 2 మాసములలోను ధనిష్ఠానక్షత్రమున 15 దినములలోను శతభిషా

నక్షత్రమున 10 దినములలోనునివర్తించును పూర్వాభాద్రఉత్తరాభాద్రనక్షత్రముల యందు జనించిన రోగము 14 దినములును రేవతీ నక్షత్రమున 8 దినములును అశ్వినీ నక్షత్రమున 1 యహోరాత్రమును పీడించి పిదప నివర్తించును. భరణి నక్షత్రమున నిస్సంశయముగా తత్క్షణమున మరణమును గలుగజేయును.

## దూతలక్షణ రోదసాధ్యాసాధ్యములు.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] పూర్వత్రపశ్చనైరృత్యా ముత్తరస్యాం
తథాదిశి । భాషతేదూతకోయత్ర శుభంభవతినిశ్చయమ్॥

తా. రోగివద్దనుండి వచ్చినదూత వైద్యునికి తూర్పు భాగమునందేని పశ్చిమ భాగమునందేని నిర్ఋతిభాగమునందేని ఉత్తరభాగమునందేని నిలువబడి వైద్యుని బిలిచిన అరోగిజీవించునని తెలియవలయును.

శ్లో॥ యామ్యేచాగ్నేయవ్యాయవ్యే ఈశాన్యేయదిసంస్థితః ।
దూతోపిభాషతేజ్ఞేయ మశుభం నిశ్చితంతథా ॥

తా. మఱియు రోగివద్దనుండి వచ్చినదూత వైద్యునిక దక్షిణ భాగమునందేని ఆగ్నేయ భాగమునందేని వాయువ్య భాగమునందేని ఈశాన్య భాగమునందేనినిలువ బడివైద్యునితో సంభాషించిన రోగిమరణము జెందునని వైద్యు డెరుగవలయును

## సన్నిపాతసప్తవిధదోష సాధ్యలక్షణములు.

శ్లో॥ [సిద్ధవిద్యాభూ] అథసాధ్యగుణాన్వక్ష్యేశ్రోతవ్యం భిషజో
త్తమః । ఇందీవరసమంనేత్రం ముఖంతామరసన్నిభమ్ । సమ
ధాతుగతిర్నాతీ స్వరఃకోకిలసన్నిభః । క్షుతంక్షుధామూర్ధ్ని
కండూ రన్నవాంఛాతనుర్లఘుః । దంతాఃకుందనిభాభాసాజి
హ్వాసద్రవమార్దవా । యవాగూప్రాశనేస్వేదఃకర్ణయోశ్ర
వణంసమమ్ । ఘ్రాణేగంధసమజ్ఞానే పాణిపాదతలోష్ణతా ।
నఖపఙ్క్త్యక్షిరేఖాసు రక్త సంపూర్ణతాయథా । జ్ఞాత్వా
చైనంసుఖంసాధ్యం చికిత్సేత్పండితోభిషక్ ॥

తా. ఇకత్రయోదశ సన్నిపాత సప్తవిధదోష సాధ్యగుణంబుల వచించెదను. ఓవైద్యోత్తముడా! వినుము!– నేత్రములయందునల్లకలువరేకులవంటికాంతిముఖము

చంద్రునితో సమానముగనుండుట నాడికి సమగమనము స్వరము కోకిలస్వరముతో సమానముగ నుండుట తుమ్ములుఅన్నమునందిచ్ఛశరీరముచులకనగనుండుటదంతముల యందు మొల్లలవంటికాంతి నాలుక ద్రవయుక్తమై మృదువుగనుండుటగంజిత్రాగు నపుడు చెమట కర్ణములయందు ఘోషము సమముగావినిపించుట యిరునాసికలయం దు పరిమళద్రవ్యముల వాసన సమముగానెఱుంగవచ్చుటకాళ్ళుచేతులుఉష్ణముగనుం డుట నేత్రములు రెప్పలు గోళ్ళు హస్తకరేఖలు యివి రక్తపూరితముగనుండుట ఈ లక్షణములు 13 ను సన్నిపాతములలోను సప్తవిధదోషములలోను జనించి నాడి స్వస్థగతిగా నడుచుచుండిన సాధ్యమని యెఱిగి పండితుడు చికిత్సజేయవల యును.

## అపథ్యజనిత సప్తవిధదోషలక్షణము.

శ్లో॥ [మాధవకల్పే] తంద్రామూర్ఛాభ్రమోమోహః ప్రలాపో హృదివేపనమ్ । అపథ్య దోషావిజ్ఞేయా వైద్యవిద్యా విశా రదైః॥

తా. తంద్ర మూర్ఛ భ్రమ మోహము ప్రలాపము రొమ్ము అదురుట ఈలక్షణ ములుగలిగిన అపథ్యదోషమని వైద్యశాస్త్రవేత్తలు తెలిసికొనవలయును.

## స్త్రీసంగమదోష లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] తరుణజ్వరమధ్యేతు యువతీసంగ మేతథా ।
జాయతేవారుణోదోషో హ్యంగవైకల్యకంపనమ్ ।
వక్షోంతరేచ సంతాపః ప్రలాపస్తాపవిభ్రమా ।
పాణిపాదతలేశీతం దోషః స్త్రీసంగమేస్మృతః ॥

తా. తరుణజ్వర మధ్యములో స్త్రీసంభోగము సేయుటచే దారుణమైనదోష ముజనించును. దానియందు అంగవైకల్యము వణుకు రొమ్ములో మంటప్రలాపము తాపముతబ్బిబ్బుమాటలు హస్తపాదములయందు శైత్యముగలుగుట ఈ లక్షణములు గలది స్త్రీ సంగమదోషమని తెలియవలయును.

## విషమదోష లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] జ్వరసంతాపవేగశ్చ నాడీకుటిలవేగతా
అంతర్దాహోమనోమూర్ఛా విషమే దోషఆగతే ॥

తా. జ్వరము కడుసంతాపము అంతర్దాహము మదనుమూర్ఛగలిగి నాడికుటిలమై వేగముగనడుచుచుండిన విషమదోషమని తెలియవలయును.

## విషమశీతదోష లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] దినేద్విత్రిచతుర్వారం ముహుశ్శీతం ముహుర్జ్వరః । దాహోమోహా శిరోరుక్చ జిహ్వా కఠినకంటకాః ।
దోషం విషమశీతంవై జానీయాద్వైద్యపారగః॥

తా. 1 దినములో 2 3 4. పర్యాయములు చలి జ్వరము వచ్చుట దాహము మోహము తలనొప్పి గతుంగుట నాలుక కఠినమై ముండ్లుబారియుండుట ఈ లక్షణములుగలది విషమ శీతదోషమని వైద్యవేత్తలగు వారెఱుంగవలయును.

## పీతజిహ్వాకదోష లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] జిహ్వాపీతాస్ఫోటకుష్కా-గ్రంధికాజ్వరవిభ్రమాః । * మూర్ఛామూకత్వగుంభంచపీతజిహ్వాకలక్షణమ్॥

తా. నాలుక పచ్చగనుండుట నాలుకముండ్లుబారియుండుట చెవుల సందులలో గడ్డలుకట్టుట జ్వరము తబ్బిబ్బులాడుట మూర్ఛ మూగతనము డగ్గుత్తికబడుట ఈ లక్షణములుగలది పీతజిహ్వాకదోషమని తెలియవలయును.

## రక్తజిహ్వాకదోష లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] జిహ్వాచ రక్తవర్ణాస్యాత్కంట కద్రవ
సంయుతా । జ్వరతృష్ణావిదాహంచ రక్తజిహ్వాకలక్షణమ్॥

తా. నాలుక ఎఱ్ఱగనుండుట నాలుక ముండ్లుబారి ద్రవయుక్తముగ నుండుట జ్వరము దప్పి శరీరతాపము ఈ లక్షణములుగలది రక్త జిహ్వాకదోషమని తెలియవలయును.

* మూర్ఛ గుంభసహిక్కాశ్చ పీతజిహ్వాకలక్షణమ్;
మూర్ఛ డగ్గుత్తిక ఎక్కిళ్ళుగలుగుట.

## కృష్ణజిహ్వాకదోష లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] కృష్ణాజిహ్వాచకఠినాకంటకా ఘామవిభ్రమాః । శ్వాస కంఠూర్మద స్తృష్ణాస్యాద్దోషః కృష్ణజిహ్వకః॥

తా. నాలుక నల్లనై కఠినమై ముండ్లుబారియుండుట తాపముతబ్బిబ్బులాడుట శ్వాసము శరీరమున దురద శరీరము గురు తెరుగకుండుట దప్పి ఈ లక్షణములు గలది కృష్ణ జిహ్వాకదోషమని తెలియవలయును.

## శ్వేతజిహ్వాకదోష లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] జిహ్వ శ్వేతాస్ఫోట గళాశ్శాంగవైకల్యకంపితా ॥ భ్రమస్వేదాతి సారాశ్చహిక్కోద్గారశ్చిత్తవిభ్రమః। క్షణేక్షణేమతిర్మూర్ఛా శ్వేతజిహ్వకలక్షణమ్॥

తా. నాలుక తెల్లగనుండుట గొంతులో ఉడికి పగిలినట్టుండుట శరీరమునొచ్చుట వణుకుట భ్రమ చెమట అతిసారము ఎక్కిళ్ల చిత్తభ్రమ ప్రతిక్షణమునందుమరపు మూర్ఛ ఈ లక్షణములుగలది శ్వేతజిహ్వకదోషమని తెలియవలయును.

## సప్తవిధదోష దినప్రమాణము.

శ్లో॥ [మాధవనిదానే] ఇతిసప్తవిధాదోషాః ప్రమాణంచార్ధమాసకమ్ । అథవాసప్తదివసం విజానీయా ద్భిషగ్వరః ॥

తా. పైజెప్పిన సప్తవిధదోషములకు 15దినములుగాని 7 దినములుగానికాల ప్రమాణమని వైద్యుడు తెలిసికొనవలయును. (ఆకాలముగడచిన పిదప రోగిజీవించియుండిన చికిత్సచేయవలయును. ఆసప్తవిధదోషములు తరుణమునందు జనించిన 7 దినములకు జంపును. తరుణముగతించిన పిదప జనించిన 15 దినములకుజంపును. అట్లగుటంజేసి 7 దినములు గాని 15 దినములుగాని గతించిన దైవబలముగలవారు జీవించినను జీవించెదరు).

## ఔషధ ప్రయోగకాలము.

శ్లో॥ క్షణద్దోషా ద్యవస్థాయాం కుర్యాద్భేషజ యోగకృత్ ॥
తా, దోషించినపుడే యౌషధం బివ్వవలయును,

## సప్తవిధదోష నూరకోపద్రవములు.

శ్లో॥ [గ్రంథాంతరే] హీనస్వరో గుదభ్రంశః కాసశ్వాస సమాకులః । హృదిశోభోభవేత్తస్య కుక్షిశూలోనజీవతి ॥

తా. హీనస్వరము † గుదభ్రంశము కుతికలో శ్లేష్మముఅడ్డపడుట శ్వాసశరీగము గురుతెరుగకుండుట బొమ్మువాచుట కడుపులో ప్రబలమైనశూల ఈ లక్షణములు సప్తవిధదోషములోను సన్నిపాతములలోను కలిగియుండిన అట్టిరోగియమాలయమున కేగునని యెఱింగి చికిత్సజేయంజనదు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] యోహృష్ట రోమారక్తాక్షస్స హిక్కాశ్వాస శూలవాన్ । విభ్రాంతలోచనంమూఢం జ్వరితంపరివర్జయేత్ ॥

తా. రోమములు గగుర్పొడుచుట నేత్రములు రక్తోద్రిక్తములుగ నుండుట ఎక్కిళ్ళు ఎగవూపిరికడుపులోప్రబలమైనశూల నేత్రములు చక్రాకారముగదిరుగుట శరీరము గురుతెరుగకుండుట ఈలక్షణములు 13 సన్నిపాతములలోను సప్తవిధదోషములలోను కలిగియుండిన రోగి యమమందిరమున కేగునని తెలియవలయును.

శ్లో॥ [పూజ్యపాదీయే] రాత్రౌ తాపోదివాశీతం వాతార్తిర్హ్యల్ప జల్పకః । కృష్ణాజిహ్వాతిరక్తావా శిరస్తోదోనశస్యతే ॥

తా. శరీరము రాత్రులయందు తాపయుక్తముగనుండుట పగటియందుచల్లగనుండుట ధనుర్వాతము స్వల్పగా మాటలాడుట నాలుకనల్లగగాని కడుఎఱ్ఱగగాని యుండుటయేగాక ముండ్లుబారి పిడకవలెనుండుట శిరమునిలువకుండుట ఈలక్షణములలో 1 టి గాని కొన్ని గానిసప్తవిధదోషములలోను 13 సన్నిపాతములలోనుకలిగియుండిన రోగిజీవించుట దుర్లభమని యెఱింగి చికిత్సజేయంజనదు.

శ్లో॥ [మాధవకల్పే] భగ్నగ్రీవా తథాస్ఫోటో మూర్ఛావాతః । క్షణేక్షణే । ఊర్ధ్వశ్వాసోభవేద్యస్య కఫఃకణ్ఠేనజీవతి ॥

తా. మెడనిలువకుండుట కుతికలోపగిలియుండుట ప్రతిక్షణమునందుమూర్ఛ ధనుర్వాతము ఎగవూపిరి కుతికలోశ్లేష్మము అడ్డపడుట ఈ లక్షణములు సప్తవిధ

† గుదభ్రంశమనగా:—ఆసనము బైటికివెడలుట

దోషములలోను 13 సన్నిపాతములలోను గలిగియుండిన రోగిబ్రతుకడని తెలియ వలయును.

శ్లో॥ అంగుళీనాంనఖానాంచ దంతానాంపక్ష్మణాంతథా ।
నాస్తికేద్రక్తవర్ణత్వం తస్యమృత్యుర్నసంశయః ॥

తా. ఏరోగమునందు వ్రేళ్ల తుదగోళ్లుపండ్ల చిగుళ్లు రెప్పలువీనియందురక్తము లేకుండునో అట్టిరోగి నిశ్చయముగా మృతిజెందునని తెలియవలయును.

శ్లో॥ అంగకంపోగతేర్భంగో ముఖంకుంకుమసన్నిభమ్ ।
ముఖేవారిచనశ్వాస స్సచయాతియమాలయమ్ ।
చిరాత్ప్రవృద్ధరోగస్తు భోజనేప్యసమర్థకః ।
భగ్నగాత్రోభవేద్యస్తు సద్యస్త్యాజ్యోభిషగ్వరైః ।
ఇత్యేవంలక్షణంజ్ఞాత్వా చికిత్సాంకారయేద్బుధః ॥

తా. శరీరము వణుకుట నడచుటకు శక్తి లేకుండుట ముఖము ఎఱ్ఱగనుండుట నోటనీరుగారుటశ్వాసఈలక్షణములుగలరోగియమాలయంబునకేగును. మఱియురోగికి రోగములు క్రమముగా వృద్ధిజెందుచుండుట అన్నము దిగకుండుటశరీరము శిథిలము జెందుట ఈలక్షణములుగల రోగినివైద్యుడు వర్జింపవలయును. ఇటులరోగసాధ్యా సాధ్యంబు నెఱిగి బుద్ధిమంతుడగువాడు చికిత్సజేయవలయును.

శ్లో॥ [నిత్యనాథీయే] అనిలోయాతిపిత్తేచ పిత్తంయాతికఫాలయే ।
కఫశ్చకంఠమాయాతిదుర్లభంతస్యజీవితమ్ ॥

తా. నాభికి క్రిందభాగముననుండు వాతము ప్రకోపించి నాభికిపైభాగమున నుండు పిత్తస్థానమునుజెందును. అందువలన పిత్తము ఉద్రిక్తమై ఱొమ్మునందుండు శ్లేష్మస్థానమును జెందును. అందువలనశ్లేష్మము ప్రకోపించికుతికనడ్డగించును. దాని వలనరోగి మరణముజెందును.

శ్లో॥ [భైరవకల్పే] క్షీణేంద్రియస్య చాసత్వే కాసశ్వాసోద్గమ స్యచ । జ్వరాదావిషమోయస్య యస్యదీర్ఘాశ్చరాత్రయః ।
తీక్ష్ణవేగార్తియుక్తస్య తంఘ్నంతి జ్వరితంధ్రువమ్ ॥

తా. సప్తవిధ దోషములలోను సన్నిపాతములలోను చక్షురాదిపంచేంద్రియ విషయము బలహాని ఎగవూపిరి కుతికలో శ్లేష్మప్రతిబంధము తో లుత విషమజ్వరము తీవ్రవేగము రూక్షకలిగి దీర్ఘకాలమువరకను వర్తించియుండిన రోగిమరణముకెందునని తెలియవలయును.

## సన్నిపాతసప్తవిధదోషమృత్యునాడీ లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] చాంచల్యందోషదుష్టత్వం కాఠిన్యమతిమంద
తా । వక్రత్వమనిసూక్ష్మత్వంస్వస్థానత్యాగఏవచ। యస్యైవ
తానిచదృశ్యంతేసయాతియమమందిరమ్॥

తా. 13 సన్నిపాతములలోను సప్తవిధదోషములలోను నాడి చంచలముగ త్రిదోషసంకరముగ కఠినముగ అతిమందముగ వక్రముగ లేక అతిసూక్ష్మముగనడుచుచు స్వస్థానమును విడనాడియుండిన రోగియమాలయమునకేగునని తెలియవలయు.

శ్లో॥ [నిత్యనాథీయే] యావత్కంఠగతాః ప్రాణాః యావన్నశ్యతి
చేంద్రియమ్ । తావచ్చికిత్సాకర్తవ్యాకాలస్యకుటిలాగతిః।

తా. ఈశ్వరేచ్ఛా కర్మగతుల నెఱుగుట కెవ్వారికి నశక్యముగానుండుటచే ప్రాణములు కంఠగతంబగువరకు ఇంద్రియములు నశించువరకునుఅసాధ్యరోగముల యందుకూడా చికిత్సచేయవలయుము.

## సద్వైద్య లక్షణము.

శ్లో॥ వ్యాధేస్తత్వపరిజ్ఞానం వేదనాయాశ్చనిగ్రహః ।
ఏతద్వైద్యస్యవైద్యత్వనవైద్యః ప్రభురాయుషః॥

తా. వైద్యుడు రోగతత్వము నెఱిగిరోగమువలన జనించినవేదనలను పోకడచుటయందు సమర్థుడగు నేకాని ఆయువు నొసంగుటకు సమర్థుడుకా నేరడు.

## సప్తవిధదోష సన్నిపాత సాధ్యలక్షణములు.

శ్లో॥ [ఆయుర్వేదే] భిషగ్భేషజయోస్సమ్యగ్విశ్వాసస్త్వంగకే
శుచిః । నిద్రాసౌఖ్యం ప్రీతిహార్ధాశరీరంసోద్యమంభవేత్ ।
ఇంద్రియాణిప్రసన్నానిసరోగీనైవనశ్యతి । సౌమ్యదృష్టిర్భవే
ద్యస్యశ్రోత్రేవక్త్రేచస్వచ్ఛతా । పాణిపాదంభవేదుష్ణం

జిహ్వాయస్యచకోమలా । స్వేదహీనోజ్వరోయస్య * కాస శ్వాసోనవర్తతే । కంఠోపికఫహీనస్తు సరోగీనైవనశ్యతి । చైతన్యంసకలంయస్య గంధస్వాదస్స్ఫుటంభవేత్ । స్వర పూరితకంఠస్తు సజీవతినసంశయః । ఏతానివిపరీతానియస్య స్యుర్నసజీవతి॥

తా. వైద్యునియందు ఔషధమునందు శ్రద్ధ శరీరశుచిసుఖముగానిద్రపట్టుట వస్తువులయందాసక్తి సంతోషము కార్యములయందు ప్రవృత్తి పంచేంద్రియములకు పటుత్వము ఈలక్షణములుగల రోగి జీవించునని తెలియవలయును. మఱియు సౌమ్య దృష్టి చెవులు బాగుగావినిపించుట నోరు దోషరహితమై నిర్మలముగనుండుట కాళ్ళు చేతుల ఉష్ణముగనుండుట నాలుక మృదువై ద్రవయుక్తముగనుండుట బంక చెమట లేకుండెడి జ్వరము కాసశ్వాసలులేకుండుట కుతికలో తెమడలేకుండుట సర్వాంగ ములయందు ఎఱుక గలిగియుండుట ముక్కున పరిమళ ద్రవ్యములువాసన తెలియ వచ్చుట కంఠస్వరము చెడక బాగుగా నుండుట ఈ లక్షణములుగలిగి నాడి స్వస్థ గతిగానడుచుచుండిన ఆరోగినిశ్చయముగా జీవించునని యెఱింగిచికిత్స జేయవలయు. మఱియు పైజెప్పినలక్షణములకు విపరీతలక్షణంబులు కలిగియుండినఆరోగివై వస్వ తనిలయంబున కేగునని యెఱింగి చికిత్స జేయంజనదు.

సన్నిపాతసప్తవిధదోషములకు కాలకూటరసము.

శ్లో॥ [నిత్యనాథీయే] రుద్రసంఖ్యామృతంచైవత్రిభాగం స్యాతమే వచ । గంధకంపంచభాగంచ శిలాయాఋతుభాగమ్ । తామ్రభస్మచతుర్భాగం ఋషిభాగంచటంకణమ్ । తాళకంనవ భాగంచవహ్నిమూలంతథైవచ । త్రిఫలాచ త్రికటుకం దశ ద్వాదశకంతథా । హింగుభాగైకసంఖ్యాన ముగ్రగంధాతథై వచ। ఏవంఖల్వేచసంస్థాప్యహ్యార్ద్రికవహ్నిమూలకమ్। జంబీ రలశునంచైవ శార్ఙ్గశిగ్ర్వర్కమూలకమ్।లాంగలీహంసపాదే న సింధుర్నాగదళేనచ।అంకోలశిగ్రుమూలానిప్రత్యేకంయామ మమాత్రకమ్ । పంచకోల కషాయేణ పంచమూలేనమర్ద యేత్ । గుంజామాత్రంవటీంకృత్వా శృంగిబేరంపిబేదను ।

* నాసాశ్వాసః ప్రవర్తతే.

అసాధ్యంసన్నిపాతంచ సర్వజ్వరహరంపరమ్ । సప్తదోష వినాశశ్చ సన్నిపాతకులంహరేత్ । స్నానంకుర్యాత్ప్రియ త్నేన శ్రీగంధంలేపమాచరేత్ । పథ్యందధ్యోదనంచైవ ఖర్జూరాది ఫలైరపి । తాంబూలచర్వణం కుర్యాత్క్రమే ణైవంసమాచరేత్ । కాలకూటరసోనామ్నా త్వీశ్వరేణైవ భాషితమ్ । భిషగ్వరాశ్చకుర్వీరన్ రోగాణాంకులనాశకృత్ ॥

తా. శుద్ధిజేసిన నాభి 11 భాగములు శుద్ధిజేసిన పాదరసము 3 భాగములు శుద్ధి జేసిన గంధకము 5 భాగములు శుద్ధిచేసిన మణిశిల 6 భాగము తామ్రభస్మము 4 భాగములు శుద్ధిచేసిన వెలిగారము 6 భాగములు శుద్ధిజేసినతాళకము 9 భాగములు చిత్రమూలము 9 భాగములు, త్రిఫలములు 10 భాగములు త్రికటుకములు 12 భాగ ములు ఇంగువ 1 భాగము వస 1 భాగము ఇటుల వీనిని ఖల్వములోనునిచి అల్లము చిత్రమూలము నిమ్మపండ్లు వెల్లుల్లి బండిగురువింద చెక్క కొండముసగ జిల్లేడు వేళ్లు చన్నచర్లగడ్డ హంసపాదియాకు వావిలాకు తమలపాకు ఊడుగ వేళ్లచెక్క మును వేళ్లచెక్క వీనిరసములచే ప్రత్యేక ప్రత్యేకముగానొక్కొకరుఝాము బాగుగమర్దించి పిదప పంచకోలకషాయముతో 1 దినముపంచమూలకషాయముతో 1 దినముమర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొక దానిని అల్లపురసాను పానముతో సేవించిన అసాధ్య సన్నిపాతములు సప్తవిధదోషములు సర్వజ్వరములు సన్నిపాతసమూహము నశించును. మఱియు దీనియందు శీతోదకస్నానము శ్రీగంధలేపనము పెరుగన్నమును భుజించుట ఖర్జూరాది ఫలభక్షణ తాంబూలచర్వణము వీనిని క్రమముగానాచరింప వలయును. ఇది ఈశ్వరునిచే వచింపబడిన కాలకూటరసము. దీని క్రమము నెఱిగి వైద్యోత్తములు ప్రయోగించిన సన్నిపాతాదిరోగ సమూహమును నశింపజేయును.

## సన్నిపాత భైరవము.

శ్లో॥ తాళకంగంధకంసూతంవత్సనాభంత్రిభిస్సమమ్ । శిరోచటం కణంచైవ సర్వత్రసమహింగుళమ్॥ మర్దితం చిత్రజంబీరే ణార్ద్రకేనదినత్రయమ్ । అనుపానవిశేషేణ సన్నిపాతకభైర వమ్॥ । త్రిదోషంచాతిసారంచ కఫపాండుమగోచకమ్ । కుక్షి శూలముదావర్తసన్నిపాత నికృంతనమ్॥

తా. శుద్ధిజేసిన తాళకము గంధకము రసము ఇవిసమభాగములువీనికిసమము నాభి మణిశిల వెలిగారము ఇవి తాళకముతో సమము వీనికన్నిటికి సమము ఇంగిలికము వీటిని చిత్రమూలరసముతో 1 దినము నిమ్మ పండ్లరసముతో 1 దినము అల్లము రసముతో 1 దినము మర్దించి మిరపగింజలంతమాత్రలుచేసిఅనుపానవిశేషములతో నిప్పించిన త్రిదోషాతి సారములు కఫపాండువు అరోచకముకుక్షిశూలఉదావర్తము సన్నిపాతములు ఇవిహరించును. ఇదియు సన్నిపాత భైరవము.

## సన్నిపాతాములకు అపుటాగ్నికుమారము.

శ్లో॥ రసస్యభాగాశ్చత్వారో వంగంచాష్టప్రకల్పయేత్।
చత్వారోమరిచంగంధం విషకంచత్రిభాగకమ్ ।
ద్వాదశస్ఫటికంగాహ్యం సర్వంచూర్ణప్రకల్పయేత్ ।
అపుటాగ్నికుమారోయం దీయతేగుంజమాత్రకమ్।
ఆర్ద్రకస్వరసస్యాద్యం సన్నిపాత జ్వరాపహమ్॥

తా. శుద్ధిజేసిన పాదరసము 4 భాగములు వంగభస్మము 6 భాగములు మిరియాలు 4 భాగములు శుద్ధిజేసిన గంధకము 4 భాగములు శుద్ధిజేసిన వసనాభి 3 భాగములు పటిక 13 భాగములు ఇటుల వీనిని ఖల్వములోనునిచి అల్లపురసముతో మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి ,అల్లపురసానుపానముతో సేవించిన 18 సన్నిపాతములు సప్తవిధదోషములు నశించును. ఇది అపుటాగ్ని కుమారమన బడును.

## సన్నిపాతములకు రాజాగ్నికుమారము.

శ్లో॥ రసంగంధామృతంతుల్యం త్రిఫౌరాదుంబరస్నమా । హంస
పాదిద్రవేఖల్వే మర్దితం దివసత్రయమ్॥ కాచకుప్యాంనివే
శ్యాథ విలేప్యవస్త్రమృత్తికామ్ । వాలుకాయంత్రకే పా
చ్యారసైర్మృద్వగ్నినాతతః । ద్విపడ్యామం సముద్ధృత్య
చూర్ణయేన్మాషమాత్రకమ్ । ఆర్ద్రకస్యానుపానేన సర్వరో
గాన్నిహంతిచ॥ రసోహ్యగ్నికుమారాఖ్యో యోగోయంరస
భూపతిః॥

తా. శుద్ధిచేసినరసము గంధకము వసనాభి ఇవి సమభాగములు త్రికారములు మేడి వీనిని పైజెప్పిన వస్తువులను సమముగా గ్రహించి ఖల్వములోనునిచి వాలుకా యంత్రమున మృద్వగ్నిచే 12 ఝాములువండి సాంగశీతలమునదీసినూరిమార్ణము చేసి మూషప్రమాణముఅల్లపురసముతోనిచ్చినసన్నిపాతజ్వరములుసమస్తరోగములుహరిం చును. ఇదియు రాజాగ్ని కుమార మనబడును.

## సన్నిపాతములకు నవలోహాగ్నికుమారము

శ్లో॥ సంశుద్ధ పారదంతుల్యం భస్మలోహాష్టకం సమమ్ । అర్క మూలకషాయేణ మర్ద్దితందినపంచకమ్ । కూపికాయాంనివే శ్యాథ విలేప్యవస్త్రమృత్తికామ్ । మృద్వగ్నినా వాలుకాభి ర్ద్వాదశ ప్రహరంపచేత్ ॥ సాంగశీతల ముద్ధృత్య మర్దితం చూర్ణయేత్తతః । గుంజామాత్రం ప్రదాతవ్యం సర్వరోగో వినశ్యతి । సన్నిపాతోతి శీఘ్రేణ సర్వజ్వర హరంపరమ్ ॥ ప్రఖ్యాతం నవలోహాఖ్యం రసోహ్యగ్ని కుమారకః ॥

తా. శుద్ధిచేసిన రసముసువర్ణభస్మముగజితభస్మముచవంగభస్మములోహభస్మము నాగభస్మము తామ్రభస్మము కంచుభస్మము ఇత్తడి భస్మమువీనిని సమభాగములుగా ఖల్వములోవేసి జిల్లేడువేళ్ళకషాయముచే 5 దినములుమర్దించిగాజుకుప్పెలోబెట్టిచీల మన్నుచేసి వాలుకాయంత్రమునందునిచి మృద్వగ్నిచే 12 ఝాములువండిసాంగశీతల మునదీసి చూర్ణముచేసి గురుగింజయెత్తును అనుపాన విశేషములచేనిచ్చి నసమస్తరోగ ములు హరించును, సన్నిపాతములు సర్వజ్వరములు ఇవి అతిశీఘ్రముగా నివర్తించు ను. ఇది నవలోహాగ్ని కుమార రసమనబడును.

## సన్నిపాతమునకు ప్రతాపాగ్నికుమారము.

శ్లో॥ పారదంశుల్బభస్మంచ విషంమరీచనాగరమ్ । త్రికారంపంచ లవణాన్యేభి ర్మర్ద్యార్ద్రకద్రవైః । కాచికుప్యాంతరేక్షిప్త్వా మృదాచాలేపయేద్బహిః । ఏవమ్మృద్వగ్నినాపాచ్యః వాలుకా యంత్రకేదినే । సాంగశీతల ముద్ధృత్య దశమాంశం విషం

క్షిపేత్ । సూక్ష్మచూర్ణీకృతంఖల్వే గుంజామాత్రం ప్రదాపయేత్ । సన్నిపాతంనిహంత్యాశు ఆర్ద్రికద్రవసంయుతమ్ । ప్రతాపాగ్నికుమారోయం సర్వరోగహరంపరమ్ ॥

తా. శుద్ధిచేసినరసము తామ్రభస్మము నాభిమిరియాలు శొంఠి త్రిక్షారములు పంచలవణములు వీనిని సమభాగములుగా గ్రహించి అల్లపురసముచే మర్దించి గాజుకుప్పెలోబెట్టి చీలమన్ను పూసి వాలుకాయంత్రము నందిడి 1 దినము మెల్లనిపంటను వండి సాంగశీతలమునదీసి దీనికి 10 వపాలు నాభిచేర్చి మెత్తగానూరిగురిగింజప్రమాణమును అల్లపురసముతోనిచ్చిన సన్నిపాతములు శీఘ్రములోనశించును ఇది సర్వరోగములను హరింపజేసెడి ప్రతాపాగ్నికుమారము.

## దివ్యాగ్నికుమారము.

శ్లో॥ హారవీర్యంవిషంతుల్యాం మర్ద్యంవహ్నికషాయకే ।
మూషాయాంభూధరేపాచ్యం వాలుకాయంత్ర కేదినమ్ ।
సాంగశీతలముద్ధృత్య కటుతైలేనభావయేత్ ।
పాదాంశ మమృతంక్షిప్త్వా మర్దితంనీలికాద్రవై ।
గుంజాద్వయం ప్రదాతవ్యం సర్వేషాం సన్నిపాతనుత్
సుదివ్యాగ్నికుమారోయం ప్రాణినాంప్రాణదాయకః ॥

తా. శుద్ధిచేసి పాదరసమువసనాభివీనిని సమభాగములుగా గ్రహించి చిత్రమూలవేళ్ళకషాయముచేనూరి గుటికలు మూసలోబోసి వాలుకా యంత్రమునందిడి 1 దినము భూధరపుటము వేసి సాంగశీతలమునదీసి శొంఠిపిప్పలి మిరియాలు వీనిలో తైలముతీసి దానిచేమర్దించి ఔషధమునకు 4 వ పాలు నాభిచేర్చి నీలియాకు రసము చేమర్దించి 2 గురిగింజలప్రమాణమునిచ్చినసమస్త సన్నిపాతములుహరించును. ఇది దివ్యాగ్నికుమారము ఇదిప్రాణులకు ప్రాణమునిచ్చును.

## సన్నిపాతములకు మహాతరుణార్కము.

శ్లో॥ అభ్రకంగంధకంతామ్రం టంకణంనాగవంగకమ్ । మాక్షీకంలోహభస్మంచ మౌక్తికంచఫణిర్విషమ్ ॥ జాంబూనదోన్మత్తబీజం ప్రవాళంరక్తచందనమ్ । తవక్షీరీచకస్తూరీ సగోహిర

ఏతత్సర్వంసమాంశాని సర్వతుల్యం తునాభకమ్ । సర్వేత దర్ధమర్ధంస్యాత్తత్స్వరూపస్య హింగుళమ్ ॥ సర్వంఖల్వేవిని క్షిప్య మాతులుం గరసేనచ । మర్దయేత్త్రి దినంఖల్వేనవనీత సమంమృదు ॥ మూలకస్యచబీజాని మాత్రాద్వంద్వంప్రయో జయేత్ । ఉద్ధతానపినిహంత్యాశుసన్నిపాతాన్త్రయోదశ పుంసాతుజనితాన్ దోషాన్ స్త్రీణాందోషంచనాశయేత్ సర్వారోగావినశ్యంతి హ్యనుపానవిశేషతః ॥ మహాతరుణార్క నామాయంబాలదోషప్రశాంతికృత్ ॥

తా. అభ్రకభస్మము శుద్ధిచేసిన గంధకము తామ్రభస్మము శుద్ధిచేసిన వెలిగారము నాగభస్మము వంగభస్మము హేమమాక్షికములోహభస్మము ముత్తెపుభస్మము త్రాచ్చూ[illegible]షము సువర్ణభస్మము శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు పగడ భస్మము రక్తచందనము తవక్షీరి కస్తూరి శుద్ధిచేసిన రక్తమనోశిల ఇవి సమభాగములు వీనికిసమము శుద్ధిచేసిన నాభి నాభికిసమము శుద్ధిచేసిన ఇంగిలీకము ఇటుల వీనినన్నిటిని ఖల్వమునందునించి మాదీఫలరసముచే 3 దినములు వెన్నవలె మృదువుగామర్దించి ముల్లంగిగింజలంత మాత్రలుచేసి 2 మాత్రలను అనుపానవిశేషములతో నిచ్చిన ప్రకోపించియుండు 13 సన్నిపాతములు మానును, మఱియు పురుషులకు జనించియుండు దోషము స్త్రీలకు జనించియుండు దోషములు హరించును, ఇది మహాతరుణార్క మనబడును. ఇది బాలరోగములనుకూడా శమింపజేయును.

## సన్నిపాతములకు సమగరళతరుణార్కము.

శ్లో॥ గోదంతం హింగుళంతుల్యం ద్వయోస్తుల్యంహాలాహలమ్ । త్రయాణాంగరళంతుల్యం గరళంకృష్ణసర్పజమ్ ॥ మాతులుం గరసైర్మర్ద్యందిననేకంతుకజ్జలీ । ముద్గప్రమాణవటికాన్నారి కేళోదకేనచ ॥ దాతవ్యం సన్నిపాతార్తే తత్సైత్యముపాచ రేత్ । తరుణార్కరసోనామమృత్యుంజయతినిశ్చయః । మృత్యువక్త్రగతంవాపిరోగిణంజీవయేద్ధ్రువమ్ ॥

తా. తాళకము శుద్ధిచేసిన ఇంగిలీకము ఇవిసమభాగములు యీరెంటికిసమము హాలాహలమనువిషము ఇది దొరకనియెడల నాభి యీమూటికి సమము గరళము నల్ల

త్రాచువిషము వీనిని మాదీఫలరసముచే నొకదినము మర్దించి కజ్జలిచేసి పెసరగింజ లంత మాత్రలుచేసి కొబ్బెరకాయనీరుతో నొసంగి శైత్యోపచారముచేయుచుండిన సకలమయిన సన్నిపాతములు హరించును. ఇది తరుణార్కరసమనబడును. ఇది మృత్యువును నిశ్చయముగా హరింపచేయును. మరణము జెందిన వానినికూడా శీఘ్రముగా జీవింపజేయును.

## సన్నిపాతాదులకు అమృతసంజీవనీరసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం విషంగంధం హింగుళంకటు
రోహిణీ । భృంగరాజస్యనీరేణ మర్దయేద్దివస త్రయమ్ ।
మాషమాత్రాంవటీంకుర్యాదార్ద్రికస్యానుపానతః । దేయం
హ్యమృతసంజీవిరసోయంసన్నిపాతనుత్ ॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన వసనాభి శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన ఇంగిలీకము కటుకరోహిణి వీనిని సమములుగా ఖల్వములోనునిచి గుంటగలిజేరాకు రసముచే 3 దినములు బాగుగామర్దించి * మాషప్రమాణము మాత్రలుజేసి యలదొకదానిని అల్లపురసముతో సేవించిన 13 సన్నిపాతములుసప్తవిధదోషములునశించును.

## సన్నిపాతాదులకు ఆనందభైరవము.

శ్లో॥ [మాధవకల్పే] హింగుళంచవిషంవ్యోషం మరిచంటంకణం
కణాః । మాతులుంగరసైర్మర్ద్యం రసమానంద భైరవమ్ ।
కాసశ్వాసక్షయే గుల్మేప్రమేహే విషమజ్వరే । తృష్ణాయాం
గ్రహణీ రోగేష్వజీర్ణేసన్నిపాతకే । గుంజైకంతుప్రదాతవ్యం
రసమానందభైరవమ్ ॥

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము శుద్ధిజేసినవాభి † త్రికటుకములు మిరియాలు శుద్ధిజేసిన వెలిగారము పిప్పళ్లు వీనివి సమభాగములుగా ఖల్వములోనునిచి మాదీఫలరసము 4 ఝాములు బాగుగామర్దించి గురిగింజలంతేసి మాత్రలుచేసి యందొకదానిని

* మాషమనగా:—7 లేక 8 గురిగింజలయెత్తు.

† త్రికటుకములనగా:—శొంఠి పిప్పలి మిరియాలు.

అల్లపురసముతో సేవించిన కాసశ్వాసములు క్షయములు గుల్మములు ప్రమేహములు విషమజ్వరములు డప్పి గ్రహణీరోగము అజీర్ణములు 13 సన్నిహితములు సప్తవిధ దోషములు నశించును.

శ్లో॥ [నిత్యనాథీయే] హింగుళంచచతుర్భాగం టంకణంవసుసమ్మితమ్ । కణాచవత్సనాభంచ ప్రత్యేకమినసంఖ్యయా ॥ ఆర్ద్రకస్వరసేనైవ దినానిత్రీణి మర్దయేత్ । ఆర్ద్రకస్వరసేనైవ గుంజామాత్రం ప్రదాపయేత్ ॥ సర్వేషు సన్నిపాతేషు రసమానందభైరవమ్ ॥

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము 4 భాగములు వెలిగారము 8 భాగములు పిప్పళ్లు 12 భాగములు నాభి 11 భాగములు ఇటుల వీనిని ఖల్వములోనునిచి అల్లపురసముచే 3 దినములు మర్దించి గురిగింజలంత మాత్రలుచేసి అల్లపురసముచే నిచ్చిన సమస్త సన్నిపాతములు హరించును. ఇది ఆనందభైరవ రసమనబడును.

## సన్నిపాతములకు బ్రహ్మాస్త్రరసము.

శ్లో॥ ద్వితుత్థంచత్రిపాషాణం గంధకంచశిలావిషమ్ । నేపాళందరదంచాభ్రం సైంధవం మరిచంబిడమ్ ॥ త్రిక్షారం టంకణం హింగుసర్వతుల్యంతుపారదమ్ । జ్యోతిష్మతీస్తు తైలేనమిర్దయేద్దినపంచకమ్ ॥ డోలాయంత్రేదినే పాచ్యానీత్వాఖల్వేవిమర్దయేత్ । మయూరమహిషీమత్స్యవారాహచ్ఛాగపన్నగాః । శశకాజంబుకాశ్వాసపభిఃపిత్తైస్తుభావయేత్ ॥ గుంజామాత్రం క్షురేభిత్వా బ్రహ్మద్వారేవినిక్షిపేత్ ॥ సత్యంతిత్త్వజ్ఞేనైవ సన్నిపాతంసుదారుణమ్ । మూకాపస్మారబధిరాహిక్కాశ్వాసవినాశనమ్ । బ్రహ్మాస్త్రోయం మయాఖ్యాతసన్నిపాతకులాంతకః॥

తా. శుద్ధిజేసిన మైలుతుత్తము పాలతుత్తము ఉల్లిపాషాణము గౌరీపాషాణము దొడ్డిపాషాణము గంధకము మణిశిల నాభి నేపాళము ఇంగిలీకము అభ్రకభస్మము సైంధలవణము మిరియాలు బిడాలవణము సరజక్షారము యవక్షారము సజ్జికారము వెలి

గారము ఇంగువ వీనికి సమము శుద్ధిచేసిన పాదరసమువీనినన్నిటిని ఖల్వములోనునిచి వెఖ్ఖుడువిత్తులు తైలముతో 5 దినములు మర్దించి డోలాయంత్రమున వండి మరల ఖల్వములోనునిచి నెమలి ఎనుబోతు రోహితమను మత్స్యము పంది మేక పాలు చెవులపిల్లి నక్క శునకము వీని చేములచే వెవ్వేరుగ మర్దించి కత్తితో బ్రహ్మరంధ్రమును గీరి పైరసమును గుంజామాత్రమునునిచిన తక్షణముననే దారుణమైన సన్నిపాతములు మానును. మఱియు మూగతనము అపస్మారము చెవుడు ఎక్కిళ్ళు శ్వాసము వీనిని కూడా హరింపజేయును. ఇది బ్రహ్మాస్త్రరసమనబడును. సన్నిపాతసులమును నశింప జేయును.

## సన్నిపాతాది సర్వరోగములకు శీతాంశురసము.

శ్లో॥ [రేవణసిద్ధభాష్యే] కునటీశుద్ధతాళంచత ద్వ్యగ్రంవ్యోమకం భవేత్ । మర్దయేన్నింబనీరేణ గుంజాయుగ్మంతుసేవయేత్ । అనుపానం మధుపథ్యాప్యుష్ణవారితథార్ద్రకమ్ । శీతజ్వరం సన్నిపాతం కామిలాంపంచగుల్మకే । సర్వంశ్వాసంచకాసంచ హృద్యదరేపూర్వరోగజిత్ । సన్నిపాతం తథాచర్దిమశీతివాతపైత్తకే । శూలంశూకాజీర్ణశూలంనాభౌకుక్షౌచవిద్రధిమ్ । ఆధ్మానానాహవిష్టంభం తాపంసర్వాంగనాహకమ్ । జంగమస్థావరపంహిక్కాందీప్తైశ్చ కారణమ్ । శోథంచ భ్రమమూర్ఛాంచ తిమిరంచానువిధ్యతి । మర్దితం నింబతోయేన లేపితంగజచర్మకమ్ । విసర్పిమణ్డలేచైవతుపాచర్మవ్యపోహతి సేవితంలేపితంకుర్యాద్వ్యాధితంగ్రంధిమర్బుదమ్ । లేపితందంతరోగాంశ్చజిహ్వానేత్రరుజస్తథా । అర్కపత్రరసైఃకర్ణేకర్ణరోగస్యనాశనమ్ । నిర్గుండిమిశ్రితంనస్యమపస్మారంశిరోరుజామ్ । అంజనంసర్షమాత్రంచనేత్రరోగవినాశనమ్ । మాషంచ సన్నిపాతానాం కామిలాజ్వరశీతకే । ధనుర్వాతంతథా భూతం శేషరోగేచకాకథా । భాషితంరేవణేనైవ రసంశీతాంశునామకమ్॥

తా. శుద్ధిజేసిన నేపాళమణిశిల శుద్ధిజేసిన తాళకము యివిదినుసు కొక్కొక భాగము త్రికటుకములు 2 భాగములు యిట్టులవీనినిఖల్వములోనునిచి వేపచెక్కరసముతో బాగుగామర్దించి 2 గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని తేనెకరక్కాయచూర్ణము పుష్టోదకము అల్లపురసము వీనిని యనుపానముతోడ సేవించినశీతజ్వరములు సన్నిపాతపాండువు కామిల 5 గుల్మములు సమస్తకాసశ్వాసలువుదరరోగ పూర్వరూపములు సన్నిపాతములు వాంతి80 వాతములు 40పిత్తరోగములుశూల శూకరోగము పరిణామశూల నాభిపక్షులయందు జనించెడి బల్లలు కడుపుబ్బరము ఆనాహవాతము నిష్టంభము తాపము సర్వాంగములదాహము * స్థావర † జంగమ విషములు యెక్కిళ్లు అగ్నిమాంద్యములోభ్రమమూర్ఛతిమిరరోగములుహరించును మఱియు దీనినే వేపాకురసముతో చాది లేపనముచేసిన గజచర్మము విసర్పి మండలకుష్టము శరీరమునపొట్టువలె చర్మమునూడెడి రోగముహరించునుమఱియుగ్రంధులు అర్బుదము వీనియందు కత్తితాట్లువేసి వేపరసముతో నూరి లేపనము జేయుటయేగాక దానిసేవనముకూడా జేయుచుండిన గ్రంధులు అర్బుదము హరించును. మఱియు వేపరసముతో నూరి దంతరోగములయందు లేపనముచేసిన దంతరోగములు జిహ్వారోగములు నేత్రరోగములు హరించును. జిల్లేడాకురసముతో నూరిచెవిలోబోసినకర్ణరోగములు వావిలాకురసముతో నూరినస్యముచేసిన అపస్మారము(కాకిసోమాలు)శిరోరోగములు నిమ్మపండ్లరసముతో నూరి ఆవగింజంత కన్నులయందు కలికము వేసిన నేత్రరోగములు మాషప్రమాణము అల్లపురసముతో నొసంగిన 13సన్నిపాతములుసప్తవిధదోషములు కామలలు శీతజ్వరములు ధనుర్వాతము భూతచేష్టలుహరించును. ఇట్టి ప్రబలరోగములనే హరింపజేయుచుండగా తక్కినరోగములను గురించివచింప నేల. ఇది రేవణసిద్ధునిచే జెప్పబడిన శీతాంశురసము.

## సన్నిపాతములకు మృతోత్థాపన రసము

శ్లో॥ [గ్రంథాంతరే] శుద్ధసూతంద్విధాగంధం శిలాచవిషహింగుళమ్ । మృతకాంతాభ్ర తామ్రాయః తాళకం మాక్షికం సమమ్ । అమ్లవేతస జంబీర చాంగేరీణాంరసేనచ । నిర్గుండీ

* స్థావరవిషమనగా--- ...భి మొదలగువాని విషము.

† జంగమవిషమనగా—పాము తేళ్లు యెలుకలు సాలెపురుగులు మొదలగువాని కాటుచే జనించు విషము.

హ స్తిశుండ్యోశ్చ ద్రవైర్మర్ద్యం దినత్రయమ్ । రుద్ధ్వా
భూధరేపాచ్యోదినాం తేతంసముద్ధరేత్ । చిత్రకన్యకషాయే
మర్దయే త్ప్రహరద్వయమ్ । మాషమాత్రం ప్రదాతః
హింగువ్యోషార్ద్రకద్రవైః । సకర్పూరానుపానంస్యాన్మ
ర్త్యోత్థాపనేరసే । పీడితం సన్నిపాతేన గతంవాపి యమ
యమ్ । తత్క్షణాజ్జీవయత్యేష పద్యంక్షీరై ప్రయోజయేత్

తా. శుద్ధిచేసిన పాదరసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము 2 భాగమ
శుద్దిచేసిన మణిశిల శుద్ధిచేసిన వసనాభి శుద్ధిజేసిన యింగిలీకము కాంతభస్మము అ
భస్మము తామ్రభస్మము శుద్ధిజేసిన తాళకము * హేమామాక్షికభస్మము యివి దిః
కొకొక్క భాగము యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి వుల్లప్రబ్బలినిమ్మపండ్లు
చింతాకు వావిలి హస్తిశుండి వీని రసములచే 3 దినములు మర్దించిబిళ్లచేసియొండి
మూకుళ్లలో నునిచి చీలమన్ను లేపనముజేసి భూధరయంత్రమున 1దినముపాకము
దినాంతమున సాగశీతలమున దీసి చిత్రమూలకషాయముచే 2 ఝాములు మర్ది
మానుషప్రమాణము మాత్రలుచేసి యంపొకదాని సేవింపవలయును. సేవించు
హింగుపత్రి త్రికటుకములు అల్లము వీనికల్కములో పచ్చకర్పూరముగలిపి సేవి
వలయును. ఇది మృతోత్థాపనరస మనబడును. ఇది సన్నిపాతముచే పీడింపః
చుండు రోగిని లేక మృత్యువైన రోగిని క్షణమాత్రములో సజీవునిగజేయును.
యందు పాలను పథ్యముగా గ్రహించవలయును.

సన్నిపాతములకు మృతసంజీవినీరసము.

శ్లో॥ [అన్యశాస్త్రే]శుద్ధసూతంద్విధాగంధంఖల్వేతత్కజ్జలీకృతమ్
అభ్రలోహక యోర్భస్మతామ్రభస్మ సమంసమమ్ । విష
తాళవరాటీచశిలాహింగులచిత్రకమ్ । హస్తిశుండీచాతివిః
త్ర్యూషణం హేమమాక్షికమ్ । చూర్ణం విమర్దయేద్ద్రా
రార్ద్రకస్య దినత్రయమ్ । నిర్గుండీ విజయాద్రావై స్త్రీదిః
మర్దయేత్పునః । కాచకుప్యాంనివేశ్యాథ వాలుకాయంత్ర

* హేమమాక్షిక మనగా — వెండినిమ్మా.

పచేత్ । ద్వియామాంతే సముద్ధృత్య మర్దయేదార్ద్రకద్ర వైః । మృతసంజీవనీనామ రసోయం శంకరోదితః।మృతోపి సన్నిపాతార్తోజీవత్యేవనసంశయః । నాతఃపరతరంకించిత్సన్నిపాతహరోరస॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము 2 భాగములుఇటుల వీనిని ఖల్వములోనునిచి కజ్జలివలె మర్దించి అభ్రకభస్మము లోహభస్మము తామ్రభస్మము శుద్ధిజేసిన వసనాభి శుద్ధిజేసిన తాళకము గవ్వల భస్మము శుద్ధిజేసిన మణిశిల శుద్ధిజేసిన హేమమాక్షికభస్మము వీనిని దినుసుయొకటింటికొక్కొక్కభాగముచొప్పున చూర్ణముజేసి కలిపి అల్లపురసముచే 3 దినములు వావిలియాకు రసముచే 3 దినములు తక్కుడరసముచే 3 దినములు మర్దించి కొచకుప్పెలోనునిచి వాలుకాయంత్రమున 2 ఝాములు వండి స్వాంగశీతలమునదీసి మరల అల్లపురసముచే మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని అల్లపురసముతో సేవించిన సన్నిపాతముచే పీడితుడుగ నుండువాడును మృతిజెందినవాడును నిస్సంశయముగా జీవించును. ఇది శివునిచే వచింపబడిన మృతసంజీవినీ రసము సన్నిపాతములను హరింపజేయుటయందు దీనికంటె శ్రేష్ఠంబైన యౌషధం బెద్దియులేదు.

సన్నిపాతాదులకు మృతసంజీవినిరసము.

శ్లో॥ హింగూలభాగాశ్చత్వారో ద్వై పాలస్యత్రయోమతాః । ద్వౌభాగౌ టంకణస్యాపి భాగైక మమృతస్యచ । తత్సర్వం మర్దయేచ్ఛ్లక్ష్ణం శుష్కంయామంభిషగ్వరః । శృంగిబేరాంబునామర్ద్యంవ్యోషచిత్రకసైంధవైః । యామద్వయ మితస్తాపంహరత్యేవసంశయః। ఘనసారరసారేణచందనేనవిలేపనమ్॥ విదధ్యాత్కాంస్యపాత్రేణ విజయేద్రోగిణంభిషక్ । శాల్యన్నం తక్రసహితం భోజయేదింధుసంయుతమ్॥ సన్నిపాతేమహాఘోరే త్రిదోషే విషమజ్వరే । ఆమవాతేవాతగుల్మేశూలేప్లీహ్నిజలోదరే॥ శీతపూర్వేదాహపూర్వేవిషమే సంతతజ్వరే।అగ్నిమాంద్యేచవాతేచ ప్రయోజ్యోయంరసోత్తమః॥మృతసంజీవనోనామవిఖ్యాతోరససాగరే॥

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము 4 భాగములు నేపాళములు 3 భాగములు వెలిగారము 2 భాగములు వసనాభి 1 భాగము వీని నన్నిటని సన్నగనూరి యొండించి అల్లపురసముచే 1 ఝామము మర్ధించి త్రికటుకములు చిత్రమూలము సైంధవలవణము వీనిచే 2 ఝాములు మర్ధించి యిప్పించిన తాపము నివర్తించును.పచ్చకర్పూరసహితముగా చందనలేపనము కంచు విసనకఱ్ఱతో విసురుటకు మజ్జిగ సైంధవలవణము వీనితోడ శాల్యన్నభోజనము యీ మొదలగువానిని చేయించవలయును. వీనినిదారుణమైన సన్నిపాతము త్రిదోషజ్వరము విషమజ్వరము ఆమవాతము వాతగుల్మము శూలప్లీహము జలోదరము శీతపూర్వజ్వరము దాహపూర్వజ్వరము విషమసంతతజ్వరము అగ్నిమాంద్యము వాతము వీనియందు ప్రయోగింపవలయును. ఇది మృతసంజీవనమని రససాగరమునందు చెప్పబడినది.

### సన్నిపాతములకు మహాగంధసూర్యరసము.

శ్లో॥ గంధేశౌలశునాంభోభిః మర్దయేద్యామమాత్రకమ్ ।
తస్యోదకేనసంయుక్తం నస్యంతత్ప్రతిబోధయేత్ ।
మరిచేనసమాయుక్తం హంతితంద్రాప్రలాపకమ్॥

తా. శుద్ధిచేసిన గంధకము పాదరసము వీటిని వెల్లుల్లిరసముచే నొకఝాము మర్ధించి వెల్లుల్లిరసములోకలిపి నస్యముచేయించినమూర్ఛనివర్తించును.మిరియాలతో నొసంగిన తంద్ర పలవరింత ఇవి నివర్తించును.

### సన్నిపాతములకు సూచికాముఖరసము.

శ్లో॥ రుచకంచాభ్ర గంధంచ నేపాళంచ మనశ్శిలా । కర్పూరీమైల తుత్థంచ తాళకం టంకణంతథా॥ దరదంసైంధవంచైవ సర్వతుల్యంతు పారదమ్ । మధుబీజస్య తైలేన మర్దితం దివసత్రయమ్॥ డోలాయంత్రేపచేద్యామంతన్నీత్వాఖల్వమధ్యకే కృష్ణసర్పస్యపిత్తేన భావితందివసద్వయమ్॥ బ్రహ్మద్రావేకు రేణైవ కుతంగుంజా విమర్దితమ్। జంబీరసీరేయుంజీతసన్నిపాతాన్నిహంతిచ॥ హిక్కాంమూర్ఛాంచకంపంచ మూకత్వం బధిరస్యచ । కాసార్తి స్తథోర్ధ్వశ్వాసంచమధువాతంనికృంతనమ్॥ సూచికాముఖనామాయంరసఃప్రాణప్రదాయకః॥

తా. సౌవర్చలవణము అభ్రకభస్మము శుద్ధిచేసిన గంధకము నేపాళములు మణిశిల కర్పరి మైలుతుత్తము పాలుతుత్తము తాళకము వెలిగారము ఇంగిలీకము సైంధవలవణము ఇవి సమాంశములు వీనికి సమము పాదరసము ఇటుల వీని నన్నిటిని చేర్చి ఇప్పవిత్తులతైలముచే 3 దినములు మర్దించి డోలాయంత్రమున ఒకఝాము వండి ఖల్వములోనునిచి నల్లతాచు పిత్తాన రెండుదినములు భావనచేసి బ్రహ్మరంధ్రమునుగీరి గురిగింజయెత్తును నిమ్మపండ్లరసములో కలిపి ఆగాయమునందు రాయుచుండిన సన్నిపాతములు హరించును. మఱియు ఎక్కిళ్ళు మూర్ఛ వణుకు మూగతనము చెవుడు కాసము ఊర్ధ్వశ్వాసము మదువాతము వీనినికూడా హరింపజేయును. ఇది సూచికాముఖ రసమనబడును. ఇది ప్రాణులకు ప్రాణమునిచ్చును.

## సన్నిపాతములకు భేతాళరసము.

శ్లో॥ రసగంధంవిషంచైవమరిచంచసమాంశకమ్ । మర్దయేచ్ఛిల
యాతావ ద్యావజ్జాయేతకజ్జలమ్ ॥ గుంజాద్వయ ప్రమాణేన
హరేద్వాదశసంజ్ఞకమ్ । సాధ్యాసాధ్యం నిహంత్యాశు సన్ని
పాతంసుదారుణమ్॥ గ్లానేషులిప్తదేహేషు మోహగ్రస్తేషు
దేహిషు । దాతవ్యస్త్వతిభేతాళో యమదూతనివారకః॥

తా. శుద్ధిచేసినరసము గంధకము నాభి మిరియాలు వీటిని సమాంశములుగా గ్రహించి కాటుకవలె నగువరకు చక్కగా రాతిచే మర్దించి 2 గురిగింజలప్రమాణము నిప్పించిన సాధ్యాసాధ్యముగమిగుల దారుణముగనుండు 12 విధములైనసన్నిపాతములు నివర్తించును. బడలిక శరీరము జారిపోవుట మోహము కప్పికొనుట యీలక్షణములు కలిగియుండునపుడు దీనిని రోగికి యిప్పించవలయును. ఇదిభేతాళరసమనబడును. ఇది యమదూతల నడ్డగించును.

## సన్నిపాతములయందు సూచికాభరణరసము.

శ్లో॥ విషంపలమితంసూతఃశాణకశ్చూర్ణయేద్ద్వయమ్ । తచ్చూర్ణం
సంపుటేకృత్వా కాచలిప్తశరావయోః ॥ ముద్రాంకృత్వాథ
సంశోష్య తతశ్చుల్ల్యాం నివేశయేత్ । వహ్నింశనైశ్శనైః
కుర్యాత్ప్రహర ద్వయసంఖ్యయా ॥ తతఉద్ఘాట్య తన్ముద్రా
ముపరిస్థశరావకాత్ । సంలగ్నోయోథవేద్ధూమ తంగృహ్ణీ

యాచ్ఛనైశ్శనైః ॥ వాయుస్పర్శోయథానస్యాత్తతః కూప్యాం నివేశయేత్ । యావత్కూప్యామఖేలగ్నం కూప్యానిర్యాతి భేషజమ్ ॥ తావన్మాత్రోరసోదేయోమూర్ఛితే సన్నిపాతిని । క్షురేణప్రచ్ఛితేమూర్ధ్ని తత్రాంగుళ్యాచఘర్షయేత్ । రక్త భేషజ సంపర్కాన్మూర్ఛితోపిహిం జీవతి । తథైవ సర్పదష్టోపి మృతావస్థోపిజీవతి ॥ యదాతాపో భవేత్తస్య మధురం తత్రదీయతే॥

తా. శుద్ధిచేసిన విషము 1 పలము రసము 1 శాణము ఇట్లు వీనిని చక్కగా చూర్ణముచేసి ప్రమిదెపైన ప్రమిదనూసి వానిపై కాచమృత్తికను పూపి యెండించి పొయిమీదనునిచి 2 ఝాములవరకు మెల్లమెల్లగా నిప్పునుజ్వలింపజేసి పిదపదానిని గ్రహించిపైనపూసియుండుమట్టిని తీసివేసి పైప్రమిదెలో నంటియుండుపాగను గాలి సంబంధములేకుండా మెల్లగాయెత్తివుంచుకొని సూదికొనచేనెత్తిన యెంతవచ్చునో అంతప్రమాణముగల ఔషధమును మూర్ఛతోగూడియుండు సన్నిపాతరోగియొక్క శిరమునందు కత్తితోగీరి ఔషధమునునిచి వ్రేళ్ళచేరాచవలయును. ఔషధమురక్తముతో సంబంధించినతోడనే దారుణమయినమూర్ఛను గలుగజేసియుండు సన్నిపాత రోగము తత్క్షణమే నివర్తించును. పాముకాటుచే మరణావస్థ జెందియుండువానికి ఔషధమును పూర్వోక్తప్రకారము ప్రయోగించిన వాడు తత్క్షణమే జీవించును. శిరమునందు మంటగలిగినతోడనే మధురౌషధమును ప్రయోగించవలయును.

## సన్నిపాతములకు రసరాజేంద్రరసము.

శ్లో॥ సూతస్య శుద్ధస్యపలం పలం తామ్రమయోరజః । అభ్రం నాగం పలంవంగం పలం గంధకతాళకమ్ ॥ పలంశుద్ధ విషం చూర్ణంసర్వమేకత్రకారయేత్ । మర్దయేత్కాకమాచ్యాశ్చ పత్రసారరసేనచ ॥ మత్స్యవారాహమాయూరఛాగమాహిషపిత్తకైః । మర్దయేచ్ఛిన్నభిన్నంచ త్రికటోరంబుభిస్తథా॥ ఆర్ద్రకే సర్వసైఃపశ్చాత్ శతవారాన్ముహుర్ముహుః । సిద్ధోయంరసరాజేంద్రో ధన్వంతరిప్రకాశితః ॥ గుంజామాత్రంరసం

దద్యాత్సురసారససంయుతమ్ । మేఘధారాప్రవాహేనధారితం వారిమస్తకే ॥ అనివార్యోయదాదాహిస్తదా దేయాచ శర్కరా । భోజనందధిసంయుక్తం వారమేకంతుదాపయేత్ ॥ ఈశ్వరేణ హతఃకామః కేశవేనచదానవః । పావకేనహతం శీతం సన్నిపాతరసస్తథా॥

తా. శుద్ధిజేసిన రసము తామ్రభస్మము లోహభస్మము అభ్రకభస్మము నాగభస్మము వంగభస్మము శుద్ధిచేసిన గంధకము తాళకముశుద్ధిచేసినవాభి ఇవి దినుసుకొక్కొకపలము ఇటుల వీనినన్నిటిని చూర్ణముచేసి కాకమాచిరసము మత్స్యము లంపంది నెమిలి మేక బర్రె వీని పిత్తములచే ప్రత్యేక ప్రత్యేకముగానూరి పిదప త్రికటుకకాయముచేతను అల్లపుస్వరసముచేతను పలుమారు భావనచేయవలయును. ఇది ధన్వంతరిచే జెప్పబడిన రసరాజేంద్ర మనబడును. దీనిని గురిగింజప్రమాణము తులసిరస సహితముగా నిప్పించవలయును వానిని వర్షధారలయందునిలిపియు తాపము శమించకుండిన శర్కరను యిప్పించవలయు. ఒకపూట పెరుగన్నమును భుజింపజేయవలయును. ఈశ్వరుడు మన్మథుని విష్ణువు అసురులను, అగ్నిశీతమును నాశము జేసినటుల యీరసము సన్నిపాతములను నాశముచేయును.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
త్రయోదశ సన్నిపాత సప్తవిధదోష సాధ్యా
సాధ్య దినప్రమాణ నాడీనిర్ణయ
చికిత్సా లక్షణయుక్తం
ద్వితీయ ప్రకరణమ్.

శ్రీ ర స్తు.

# బసవరాజీయము.

## ఆంధ్ర తాత్పర్యము.

## — తృతీయ ప్రకరణము. —

శ్లో॥ దక్షయజ్ఞాపహారంచ సర్వదేవమదాపహమ్ ।
వీరచూడామణింవీరం వీరభద్రమహంభజే ॥

అవతరణిక. ఇపుడు గ్రంథకర్త గ్రంథమధ్యమమునందు తనకిష్టదేవుడగు వీరభద్రునకు నమస్కారాత్మక మంగళమును "దక్షయజ్ఞాపహారంచ" అనుశ్లోకముచే జేయుచున్నాడు.

తాత్పర్యము. దక్షయజ్ఞ సంహారకుడు ఇంద్రాది సర్వదేవతలమదమునుబోకరచినవాడు శూరాగ్రగణ్యుడు ప్రభాకలితుడు నగు వీరభద్రుని నేను భజింపుచున్నాడను.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః।
వక్ష్యామివృషరాజీయ మహంవైద్యశిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు అనిపేర్కొనబడిన నేనువైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథమునందు మూడవప్రకరణమును వచింపుచున్నాడను.

### మనఃకాయదోష లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] కాయస్యదోషా వాతాద్యా మనసస్తు రజస్తమః । దోషా ఏపహిసర్వేషాం రోగాణా మేపకారణమ్ ।
* రాగాదయోమనోరోగాః కాయరోగాజ్వరాదయః ॥

* రాహోదయో.

తా. వాతపిత్తశ్లేష్మదోషములు దేహజనితంబులు రాజసతామసములు మనో జనితంబులు దేహజనిత వాతపిత్తశ్లేష్మములు మనోజనిత రజస్తమోగుణములు ఇవి సర్వప్రాణులకు ద్వివిధరోగములకు కారణభూతంబులు రాగాదులన మనోరోగంబులు జ్వరాదులన దేహజరోగంబులు.

### వాతస్థానములు.

శ్లో॥ పక్వాశయః కటిస్సక్థి శ్రోత్రాస్థి స్పర్శనేంద్రియమ్ ।
స్థానంవాతస్యతత్రాపి పక్వాధానంవిశేషతః ॥

తా. పక్వాశయము పిఱుఁదు తొడలు చెవులు అస్థులు త్వగింద్రియము ఇవి వాతమునకు స్థానంబులు అయినను వాతంబధికముగా పక్వాశయముననే నెలకొని యుండుటంజేసి పక్వాశయమే వాతమునకు ముఖ్యస్థానంబు.

### పిత్తస్థానములు.

శ్లో॥ నాభిరామాశయస్స్వేదో లసికారుధిరంరసః ।
దృక్స్పర్శనంచ పిత్తస్య నాభిరత్రవిశేషతః ॥

తా. బొడ్డు ఆమాశయము చెమట చొంగ రక్తము రసధాతువు శీతోష్ణజ్ఞాన సహితనేత్రములు ఇవి పిత్తమునకు స్థానంబులు అయినను పిత్తంబధికముగా నాభియందే నెలకొనియుండుటంజేసి నాభియే పిత్తమునకు ముఖ్యస్థానంబు.

### శ్లేష్మస్థానములు.

శ్లో॥ ఉరఃకంఠశ్శిరఃక్లోమాపర్వాణ్యామాశ యాద్రసః ।
మేదోఘ్రాణంచజిహ్వాచకఫస్యసుతరాముర ః ॥

తా. హృదయము కంఠము శిరము మెదడు కీళ్ళు బొడ్డుకుపైనుండు రసము క్రొవ్వు నాసికము నాలుక ఇవిశ్లేష్మమునకుస్థానంబులుఅయినను శ్లేష్మంబధికముగా హృదయముననే నెలకొనియుండుటంజేసి హృదయమేశ్లేష్మమునకు ముఖ్యస్థానంబు.

### వాతాదిధాతువుల అవస్థావిశేషము.

శ్లో॥ చయోవృద్ధిస్స్వధామ్న్యేవ కోపస్తూన్మార్గగామితా ।
శమస్స్వస్థానసమతా తత్త్రైవాపచయఃక్షయః ॥

తా. వాతపిత్తశ్లేష్మములు తమతమస్థానములయందు వృద్ధిజెందుట చయావస్థయనియు వృద్ధిజెందినస్థానమువిడవాడి నాడులయందు ఊర్ధ్వముగానడుచుచుండిన ప్రకోపావస్థయనియు తమతమస్థానములయందు సమముగనుండిన సమావస్థయనియు తమతమ స్థానములయందు హీనదశను జెందిన క్షయావస్థయనియు జెప్పంబడును.

## వాతాదిదోషాద్యవస్థా లక్షణము.

శ్లో॥ స్రోతోరోధో బలభ్రంశో గౌరవానిలమూఢతే ।
ఆలస్యాపక్తినిష్ఠీవ మలసంగారుచిక్లమాః ।
లింగంమలానాంసామానాం నిరామాణాంవిపర్యయః ॥

తా. నాడీద్వారములు బంధించుట బలముక్షయించుట శరీరముబరువుగనుండుటవాతముబాగుగా స్ఫురింపకుండుట ఆలస్యము అజీర్ణము కారియుమియుట మలబద్ధకము అరుచి బడలిక ఇవిదుష్టమైనవాతాదులకు సామాన్యలక్షణములని తెలియవలయును. వాతాదులు నిర్దుష్టంబులుగనుండిన పైలక్షణములు లేకయుండును.

## వాతవికారములు.

శ్లో॥ స్రంసతాపవ్యథాస్వాపా స్సాదరుక్తోదభేదనమ్ ।
సంగేచభంగస్సంకోచో వర్త్మాంతస్రావదర్శనమ్ ।
పారుష్యకంపౌవాతస్య శోభస్పందనవేష్టనమ్ ।
స్తంభఃకషాయరసతా వర్ణశ్శ్యామోరుణోపివా॥

తా. శరీరము సోలుట మండుట సూదులచే బొడిచినటులుండుట నిదురశరీరకృశత్వము శోషాదిరోగములు వేదన శరీరమునలియగొట్టినటులనొచ్చుట సంభోగమున భంగపడుట శరీరము సంకోచమునుజెందుట కనురెప్పకొనలు విచ్చివియై నీళ్ళుగ్రమ్ముట శరీరమునందువణుకు పరుసదనము శరీరముయెండుట శరీరముకదలుట శరీరము చుట్టికొనుట శరీరము స్తంభించుట నోరు ఒగరుగనుండుట శరీరమునలుపువర్ణముగనేని ఎఱ్ఱగనేనినుండుట ఈలక్షణములుగలిగిన వాతవికారములని తెలియవలయును.

## పిత్తవికారములు.

శ్లో॥ పిత్తస్యదాహరోగాష్మా భుక్తాశనవిపాకతా ।
స్వేదఃఖేదఃస్మృతిఃక్రోధ శ్శమునఃమూర్ఛనంమదః ।

కటుకామరసోపక్తే పాండుర స్త్వచివర్ణతః ॥

తా. దాహము ఉష్ణాధిక్యరోగము భుజించిన యన్నముపక్వము గాకుండుట చెమట శరీరమునందు బడలిక స్మృతి కడుకోపము శరీరశైత్యము మూర్ఛ మదము నోరుకారముగగాని పుల్లగగానియుండుట శరీరము* పాండువర్ణముగనుండుట ఈలక్షణములుగలిగిన పిత్తవికారములని తెలియవలయును.

## శ్లేష్మవికారములు.

శ్లో॥ శ్లేష్మణస్స్నేహకాఠిన్య కండూ శీతత్వగౌరవమ్ ।
బంధోపలేపస్త్మైమిత్య శోఫాపర్వ్యాణినిద్రితమ్ ।
వర్ణశ్శ్వేతోరసస్స్వాదుర్లవణంచిరకారితా ।

తా. శరీరము మెఱయుట కఠినమైయుండుట గురదగొనుట శరీరముచల్లగబరువుగానుండుట శరీరము ధాతుసంధులు దృఢమైగట్టిగనుండుట శరీరము జిగటగ నిశ్చలముగనుండుట శరీరము వాచుటనిదుర శరీరము తెల్లనైయుండుట నోరుతీపిగ నేని ఉప్పగనేని యుండుట మందముగ బనిసేయుట ఈలక్షణములు గలిగిన శ్లేష్మవికారములని తెలియవలయును.

## దోషలక్షణముల నెఱుంగునుపాయము.

శ్లో॥ ఇత్యశేషామయవ్యాపి యదుక్తందోషలక్షణమ్ ।
దర్శనస్పర్శనప్రశ్నై స్తత్సమ్యగుపలక్షయేత్ ॥

తా. పైజెప్పబడిన క్రమప్రకారము సకలరోగవ్యాపక దోషలక్షణములను దర్శన స్పర్శన ప్రశ్నలచే నెఱుంగందగును.

## ఋతుభేదమువలన వాతాదులకు అవస్థావిశేషము.

శ్లో॥ చయప్రకోపప్రశమావాయోర్గ్రీష్మాదిషుత్రిషు ।
వర్షాదిషుచపిత్తస్యశ్లేష్మణశ్శిశిరాదిషు ॥

తా. గ్రీష్మము మొదలు మూడుఋతువులయందు వాతమునకుక్రమముగాచయ ప్రకోప శమనావస్థలుగలుగును. వర్షఋతువు మొదలుమూడుఋతువులయందుపిత్త

* తెలుపు పచ్చనగల రంగు.

మునకు క్రమముగా చయ ప్రకోప శమనావస్థలుగలుగును. శిశిరఋతువు మొదలు మూడుఋతువులయందు శ్లేష్మమునకు క్రమముగా చయ ప్రకోప శమనావస్థలు గలుగును.

## శరీరరోగముల కౌషధ భేదవివరణము

శ్లో॥ శోధనం శమనంచేతి సమాసాదౌషధంద్విధా ।
శరీరజానాం రోగాణాం క్రమేణపరమౌషధమ్ ॥

తా. సర్వరోగములకు ఔషధము శోధనము శమనముఅనిద్వివిధంబు అందు శరీరజనితరోగములకు యీరెండును క్రమముగా పరమౌషధంబులు.

శ్లో॥ వస్తిర్విరేకోవమనం తథాతైలంఘృతంమధు ॥

తా. *వస్తి †విరేచనము ‡ వమనోపయుక్తఔషధములుశోధనౌషధంబులు నూనె నెయ్యితేనె ఇవి శమనౌషధంములుబులు ఈరెంటినిశరీరజనితరోగములయందుఉపయోగింపవలయును. మనోజనితరోగములయందు బుద్ధిమంతుడగువైద్యుడు ధైర్యమునవలంబించి రోగియొక్క యభిప్రాయము నెఱిగి తదను గుణముగాచికిత్స జేయవలయును.

## వాతాదిదోష చికిత్సాభేద వివరణము.

శ్లో॥ ద్విధాచోపక్రమస్తేషాం తర్పణంచాప తర్పణమ్ ।
బృహణంలంఘనంచేతి తత్పర్యాయ ముదాహృతిమ్ ॥

* వస్తియనగా—చిమ్మనగొట్టములో తైలాదిరూపయౌషధముల నాకర్షించుటకై దానిమధ్యభాగమున బంధింపబడి అధోభాగమునందు కర్ణికాకారముగా అందాకర్షింపబడిన తైలాదుల వెలిపరచుటకై అగ్రభాగమునందుగుంద్రముగ నిర్మింపబడి చిమ్మనగ్రోవిలో బంధిపపబడియుండు దండమే వస్తియనబడును. అవస్తికర్మ అనువాసనము నిరూహముఅనిద్వివిధంబుఅందుఘృతతైలాది స్నేహములను చిమ్మనగ్రోవితో గొట్టుట అనువాసన వస్తికర్మమనియు కషాయము పాలు తైలము వీనిని చిమ్మనగ్రోవితో కొట్టుట నిరూహవస్తియనియు జెప్పబడును.

† పక్వాపక్వంబులుగలుండు యన్నాదుల పచనముజేసి వెలిపరచెడి తెల్లతెగడ మొదలగునవి విరేచనౌషధమనబడును.

‡ అపక్వరూపముగనుంటు పిత్తశ్లేష్మముల హృదయమున నడ్డగించి వానియందలి దోషసంబంధమైన జలాదుల ఊర్ధ్వముఖముగా వెలిపరచెడి మ్రంగకాయ మొదలగునవి వమనౌషధమనబడును.

తా. వాతపిత్త శ్లేష్మరోగములయందు ద్వివిధచికిత్సల జేయవలయును. ఎట్లన్న తర్పణము అపతర్పణము అను రెండు క్రియలను † బృంహణము లంఘనము అను నీరెండు క్రియలను క్రమముగా జేయవలయును.

శ్లో॥ బృంహణంయద్బృహత్వాయ వాయోఃపిత్తకఫస్యచ ।
బృంహణంలంఘనంచైవ వాయోఃపిత్తకఫస్యచ ॥

తా. పుష్టికొరకు బృంహణక్రియను లఘువుకొరకు లంఘనక్రియను జేయించవలయును. మఱియు వాతపిత్తశ్లేష్మములయందు బృంహణలంఘనముల జేయించవలయును.

లంఘన భేదము.

శ్లో॥ శోధనంశమనంచేతి లంఘనంద్వివిధంభవేత్ ।
ఔదరంయద్బహిర్దోష శ్శోధనంతచ్చపంచధా ॥

తా. లంఘనము, శోధనము శమనము అని ద్వివిధంబు, అందు అంతర్గత బాహ్యాగతదోషములకు శోధనము ఐదువిధంబులు:

దోషభేదముచే రోగభేదములు.

శ్లో॥ ఏకేనైవచదోషేణ త్రయోద్వాభ్యామపిత్రయః ।
త్రిదోషైరపిచైకస్స్యాదేవంసప్తవిధోగదః ॥

తా. సర్వరోగములు ఏకదోషజనితము ద్విదోషజనితము త్రిదోషజనితము అని ఏడువిధంబులు, అందు వాతము పిత్తము శ్లేష్మము వీనివలన ప్రత్యేకముగా జనించినవి ఏకదోషజనితంబులు వాతశ్లేష్మము వాతపైత్యము పిత్తశ్లేష్మము వీనివలన జనించినవి ద్వంద్వదోష జనితంబులు వాతపిత్త శ్లేష్మములవలన జనించినవి త్రిదోషజనితంబులు,

సర్వరోగ సాధ్యాసాధ్య వివరణము.

శ్లో॥ [నిత్యనాధయే] ప్రయోగ క్షమయేద్వ్యాధి మన్యామయ
ముదీరయేత్ । నాసావ శుద్ధశ్శుద్ధస్తు సమయేన్నసమీర
యేత్ ॥

తా. ఔషధప్రయోగముచేశుద్ధరోగములు (అనగాఏకదోషజనితరోగములు) హరించు మఱియును. అశుద్ధరోగములయందు(అనగా ద్వంద్వరోగములయందు త్రిదో

† బృంహణమన—శరీరమునకు ఔషధాదులచే పుష్టిని గలుగజేయుట,

వ జనితరోగములయందు) ఔషధము ప్రయోగించిన యితరరోగములు జనించ అట్లగుటంజేసి శుద్ధరోగములకే చికిత్సజేయవలయును. అశుద్ధరోగములు కుదుర దుర్లభంబగుటచే చికిత్సచేయం జనదు.

## మూత్రపరీక్షాక్రమ తత్సాధ్య లక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] గృహీత్వా రోగిణోమూత్రం సూర్యా
తాపే నిధాపయేత్ । తస్యమధ్యే క్షిపేత్తైలం తస్మూత్రంచ
పరీక్షయేత్ । యదావికాస మాప్నోతి తదాసాధ్యం భవి
ష్యతి । బిందురూపేణమధ్యస్థ మసాధ్యంతైలమాదిశేత్ ॥

తా. రోగియొక్క మూత్రమును కంచుపెంకులోబట్టి ఎండలోనునిచి రా మధ్యమున నూనెబొట్టు వైచి బరీక్షించిన వికసించెనేని రోగము సాధ్యమనియువి సించక బింకురూపముగనుండిన రోగం బసాధ్యంబనియు తెలియవలయును.

శ్లో॥ తైలబిందు ర్యదామూత్రే వికాసం కురుతేస్వయమ్ ।
స్వరూపంతస్యవక్ష్యామి శుభాశుభ వినిర్ణయం ।
తైలబిందు ర్యదామూత్రే మత్స్యాకారం భవేద్ధ్రువమ్ ।
నిర్దోషంచ తదాసూనం మోక్షణంచైవకారయేత్ ॥

తా. పైజెప్పబడిన క్రమప్రకారము మూత్రమునందువైచిన తైలబిందువు విక సించుటచే జెం నట్టిభేదముల దానిశుభాశుభముల వ . చెద ఆతైలబిందువుమత్స్యా కారమునుజెందిన రోగము నిశ్చయముగ సాధ్యమనియెఱింగి చికిత్సింపవలయును.

శ్లో॥ [మాధవనిదానే] సర్పదాసక లేమూత్రే ప్రాసాదంగజచామరమ్।
ఛత్రంచతోరణాకార తైలబిందు శుభప్రదమ్ ॥

తా. పైప్రకారము రోగి మూత్రములో వేయబడిన తైలబిందువు మూత్రమం తట వికసించినను లేక మేడ ఏనుగు వింజామరము గొడుగు తోరణము దేనియొక్క రూపము నేని జెందినను రోగము నిశ్చయముగా సాధ్యమని తెలియవలయును.

శ్లో॥ [మాధవకల్పే] ప్రాతరుత్థాయ మతిమాన్ మూత్రంపశ్యే
న్నిరంతరమ్। మృణ్మయేతైలజేస్వచ్ఛే పాత్రేదృష్ట్వా శుభా
శుభమ్।తన్మధ్యేనిక్షిపేత్తైలం యథాసాధ్యం విచారయేత్॥

తా. బుద్ధిమంతుడగు వైద్యుడు రోగిమూత్రమును పరీక్షించవలయునని నిశ్చయించునపుడెల్లవానిని ప్రాతఃకాలమున మేలుకొలిపి స్వచ్ఛమై తైలసంబంధములేకుండెడి మట్టిపాత్రయందు మూత్రమును విసర్జించునటులజేసి దానిమధ్యమున నొక తైలబిందువువైచి రోగ సాధ్యాసాధ్యంబుల బరీక్షింపవలయును. ఎట్లన్న:—

శ్లో॥ [గ్రంథాంతరే] బిందురూపేణ మధ్యస్థం తైలంచేత్కృచ్ఛ్రసాధ్యతామ్ । వికాసతే యదాతైలం సుఖసాధ్యం సమాదిశేత్ ॥

తా. పైక్రన్నప్రకారము మూత్రమునందు వేయబడినతైలము బిందురూపముగనుండిన రోగము కష్టసాధ్యమనియు వికసించిన సుఖసాధ్యమనియు తెలియవలయును

శ్లో॥ [గ్రంథాంతరే] ఛత్రపర్వతవృక్షాణాం ప్రాసాదోష్ట్రగజస్యచ । రూపైస్సమానిసాధ్యం స్యాత్తైలబిందుః ప్రకాశతే ॥

తా. మూత్రమునందు వేయబడినతైలము గొడుగు పర్వతము వృక్షము మేడలొటిపిట్ట ఏనుగ వీనిలో దేనియొక్క రూపము నేని జెందిన రోగము సాధ్యమని తెలియవలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] వల్లీమృదంగ మనుజభాండచక్రమృగాదిభిః । సమోవికాసతేబిందుః కృచ్ఛ్రసాధ్యం సమాదిశేత్ ॥

తా. మూత్రస్థతైలబిందువు తీగె మద్దెల నరాకారముభాండాకారముచక్రాకారము సింహము మొదలగువానిలో దేనియాకారముగలదిగ నేనివికసించినరోగము కష్టసాధ్యమని తెలియవలయును.

శ్లో॥ [శారీరే] ప్రాతరగ్రభవాంధారాంత్యక్త్వామూత్రస్యరోగిణః । తత్రతైలలవంక్షిప్త్వా సాధ్యాసాధ్యం విచారయేత్ ॥

తా. ప్రాతఃకాలమునందు రోగియొక్క మూత్రప్రథమధారను వర్జించిమధ్యధారను గ్రహించి యెండలో నునిచి తైలబిందువునువైచిరోగసాధ్యాసాధ్యములబరీక్షించవలయును.

శ్లో॥ భద్రపీఠ పృథుదర్పణఛత్రం పద్మశంఖ సహచామరవీణాః । కుండలాకృతిభవేద్యతితైలంయస్య మూత్రపతితంసతుసాధ్యః ॥

తా. మూత్రమునందు వేసిన తైలబిందువు భద్రపీఠము అటుకులు అద్దము గొడుగు పద్మము శంఖము చామరము వీణ కుండలము వీనిలో దేనియొక్క రూపముగలదిగనేని గన్పట్టిన రోగము సాధ్యమని తెలియవలయును.

## అసాధ్య మూత్రపరీక్ష.

శ్లో॥ [నిత్యనాథీయే] చతుష్పాదం త్రిపాదంచ ద్విపదంచైవ దృశ్యతే । ఏకపాదం యదాబిందు ర్మృత్యుదః కథితో బుధైః । నరశ్శిరోవిహీనస్తు గాత్రం స్తంభ సమాకృతిః । ఏతద్రూప విభేదాచ్చ ధ్రువంమృత్యుః ప్రజాయతే ॥

తా. మూత్రమునందు వేసిన తైలబిందువు నాలుగుఖండములుగ నేని మూడుఖండములుగ నేని రెండుఖండములుగ నేని ఒకఖండముగ నేని గనుపించినరోగి మృతిజెందును బుధులు వచించెదరు. మఱియు నాతైలబిందువుశిరోవిహీననరాకారముగ నేని శరీరాకారముగ నేని స్తంభాకారముగ నేని గన్పించిన రోగి మృతిజెందునని తెలియవలయును.

శ్లో॥ [మాధవనిదానే] శస్త్రఖడ్గ ధనుశ్చైవ త్రిశూలం ముసలాయుధమ్ । లగుడాకృతికం తైలం తత్క్షణంవాగతాయుషమ్ ॥

తా. మూత్రస్థతైలబిందువు శస్త్రము ఖడ్గము విల్లు త్రిశూలమురోకలి* భిండివాలము వీనిలో దేనియొక్క రూపముగలదిగనేని గన్పట్టిన రోగి తత్క్షణమున మృతిజెందునని తెలియవలయును.

శ్లో॥ [మాధవకల్పే] సృగాలసర్పమార్జాల ఖడ్గబాణలులాయవత్ । వ్యాఘ్రమర్కట సింహానాం సాదృశ్యా న్మృత్యుమాప్నుయాత్ ॥

తా. మూత్రస్థతైలబిందువు నక్క పాము పిల్లి ఖడ్గము బాణము ఎనుబోతు పులి సింహము వానరము వీనిలో దేనియొక్క రూపముగలదిగనేని గన్పట్టిన రోగి కాలాంతకుని కడకేగునని తెలియవలయును.

శ్లో॥ [మతాంతరే] సర్పవానరబిడాలమూషికా సూకరాకృతిర్వేద్యదిచిహ్నమ్ । వృశ్చికాకృతి భవేదథస్తదా యస్యమూత్ర ప్రతితంసగతాయుః ॥

---

* భిండిలవాము — ఇనుప అలుగు కట్టుసాగు.

తా. మూత్రస్థతైలబిందువు సర్పము వానరము పిల్లి ఎలుక పంది తేలువీనిలో దేనియొక్క రూపము గలదిగ నేని గన్పట్టినను లేక లోనమునిగినను రోగియొక్క ఆయువు క్షయించినదని తెలియవలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] పక్షీకూర్మోవృషసింహా స్సూకరస్సర్పవానరౌ ।
బిడాలోవృశ్చికశ్చైవ ఛిద్రత్వేపితథైవచ ।
నిమజ్జనాత్తైలబిందో స్తదామృత్యుర్ధ్రువంభవేత్ ॥

తా. మూత్రస్థతైలబిందువు పక్షి తాబేలు ఆబోతు సింహము పందిసర్పము వానరము మార్జాలము తేలు వీనిలో దేనియొక్క రూపముగలదిగనేనిఛిద్రరూపములుగలదిగనేని గన్పట్టినను లేక లోనమునిగినను రోగి నిశ్చయముగా మరణము జెందునని తెలియవలయును.

శ్లో॥ [మాధవనిదానే] నాగవల్లీదళకకుంభసన్నిభంహాస్తివాలకైః ।
వృషవానరమండూకం మూత్రంపశ్యేన్నజీవతి ॥

తా. మూత్రస్థతైలబిందువు తమలపాకుకుండ ఏనుగు తోకఆబోతువానరము కప్ప వీనిలో దేనియొక్క రూపముగలదిగనేని గన్పట్టినరోగిబ్రతుకడని తెలియవలయును.

శ్లో॥ [గ్రంథాంతరే] తైలబిందుర్యదామూత్రే చాలనీ వేంద్రగోపకమ్ । ప్రేతలోకస్యగమనం ధ్రువంజ్ఞేయంచికిత్సకైః ॥

తా. మూత్రస్థతైలబిందువుజల్లెడవలెఇంద్రగోపపురుగులవలెనుండినరోగిప్రేతలోకమున కేగునని వైద్యుడెరుంగవలయును.

దీర్ఘరోగియొక్క మూత్రాపరీక్షాక్రమము.

శ్లో॥ ప్రవృద్ధరోగిణాంవయిద్యో మూత్రోత్సర్గంతుకారయేత్ ।
భాస్కరోదయవేళాయాం ప్రకాశేస్థాపయేద్ధ్రువమ్ ।
లోడయిత్వాచతత్సమ్యక్తతోమూత్రంపరీక్షయేత్ ।
శ్వేతకాచమయేపాత్రేధృత్వామూత్రంపరీక్షయేత్ ॥
తృణేనతిలతైలస్యబిందుమూత్రంక్షిపేత్తదా ।
వాతేనమండలంయాతిపిత్తతోబుద్బుదాయతే ।
కఫేవబిందుమాయాతి త్రిదోషేతునిమజ్జతి ॥

తా. నిర్మలమై తెల్లగనుండు గాజుపాత్రయందు దీర్ఘరోగముల వానిని వైద్యుడు మూత్రోత్సర్జనము జేయించి ఆమూత్రమును సూర్యోదయమునయెండయందు నిచి బాగుగా కలియబెట్టి అందొకతృణముచేనూనెబిందువును వేసిరోగమునుపరీక్షించ వలయును పరీక్షించునపుడు మూత్రస్థబిందువు మండలాకారమును జెందిన వాతరోగ మనియు బుద్బుదాకారమును జెందిన పిత్తరోగమనియు చిన్న చిన్న బిందువులయొక్క యాకారమును జెందినకఫరోగమనియులోనమునిగినత్రిదోషమనియు తెలియవలయును

రోగవిశేషముల మూత్రలక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] అధోబహుళమారక్తం మూత్రమాలోక్య తేయదా । వదంతితదతీసార లింగంవైలింగవేదినః । జలో దర సముద్భూతం మూత్రం ఘృతకణోపమమ్ । ఆమవాతే వసాతుల్యం తత్రతుల్యంతు జాయతే । వాతజ్వర సము ద్భూతం మూత్రం కుంకుమపింజరమ్ । మలేన పీతవర్ణంచ బహుళంచ ప్రజాయతే ॥

తా. పాత్రయందలి మూత్రము ఆభాగమునందు మిగుల రక్తవర్ణముగలదిగ నుండిన అతిసారరోగమనియు నేతికణములవలెనుండినజలోదరమనియువసతోసదూ నంబుగ నేని మజ్జిగతో సమానంబుగ నేని నుండిన ఆమవాతరోగమనియుకుంకుమవలె నెఱ్ఱగ నేని యెఱుపథికముగాగల పచ్చరంగుగలదిగ నేని మలయుక్తమై పీతవర్ణము గలదిగ నేని నుండి అధికముగా వెడలుచుండిన వాతజ్వరమనియు తెలియవలయును.

శ్లో॥ [గ్రంథాంతరే] పీతస్వచ్ఛంచజాయేత మూత్రంపిత్తోదయే సతి । సమథాతౌపునఃకూప జలతుల్యం ప్రజాయతే । మూ త్రంచ కృష్ణతాంయాతి క్షయరోగా కులస్యచ । క్షయరోగో భవేద్యస్యత మసాధ్యం వినిర్దిశేత్ ఊర్ధ్వంపీతమధోరక్తం మూత్రంవైద్యవరస్తదా । పిత్తప్రకృతిసంభూత సన్నిపాతస్య లక్షయేత్ । యస్యేక్షురససంకాశం మూత్రం నేత్రేచ పింజరే । రసాధిక్యం విజానీయా న్నిర్దిశేత్తస్యలంఘనమ్ । పీతంచబహుళంచయువ హ్యామావాతా త్ప్రజాయతే । రక్తం స్వచ్ఛంచ యన్మూత్రం తజ్జ్వరాధిక్య లక్షణమ్ । ధూమ్ర

వర్ణం యదామూత్రం జ్వరాధిక్యం వదే త్తథా।కృష్ణమచ్ఛం
చ జానీయాత్సన్నిపాతజ్వరోద్భవమ్॥

తా. మూత్రము పసుపువర్ణముగలదిగ స్వచ్ఛముగనుండిన పిత్తజ్వరమనియు కూపజలతుల్యముగనుండిన సమధాతువనియు కృష్ణవర్ణంబుగనుండిన క్షయరోగమని యు తెలియవలయును. అట్టి క్షయరోగము అసాధ్యము మఱియు నామూత్రలోని మూత్రము పైభాగమునందు పీతవర్ణముగలదిగ అధోభాగమునందు రక్తవర్ణముగల దిగ నుండిన పిత్తప్రకృతి సంభూతసన్నిపాత రోగమనియు తెలియవలయును. మ ఱియు మూత్రము చెఱుకు రసతుల్యంబుగ నేత్రములు ఎఱుపధికముగాగల పచ్చ రంగుగలదిగ నుండిన రసాధిక్యరోగమని యెఱింగి లంకణము వేయవలయును. మఱి యు మూత్రముపచ్చవర్ణముగలదై అధికముగా వెడలుచుండినఆమయతరోగమనియు గలతేటదై రక్తవర్ణముగ నేని ధూమ్రవర్ణముగ నేని నుండిన జ్వరాధిక్యమనియు నిర్మ లమై కృష్ణవర్ణముగనుండిన సన్నిపాతజ్వరమనియు తెలియవలయును.

## వాతాదిరోగమూత్ర లక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] కఫేస్వచ్ఛతరంశీతం ఫేనబుద్బుదసంయుతం।
ఘృతోదకసమంవాతే మిశ్రైర్మిశ్రగుణంభవేత్॥

తా. శ్లేష్మరోగియొక్క మూత్రము నిర్మలముగ శీతలముగ పిత్తరోగియొక్క మూత్రము నురుగు బుగ్గలు వీనితోగూడినదిగ వాతరోగియొక్క మూత్రము ఘృతము ఉదకము వీనితో తుల్యముగ ద్వంద్వరోగియొక్క మూత్రము మిశ్రమలక్షణములు గలదిగ నుండును.

శ్లో॥ వాయోశ్చపాండురంమూత్రం రక్తవర్ణం చపైత్తకే।
అథవాపీతవర్ణంచ కామిలాయాంతథైవచ।
శ్వేతవర్ణంకఫానాంచ మిశ్రితంద్వంద్వజంభవేత్॥

తా. వాతరోగియొక్కమూత్రము పాండువర్ణముగ పిత్తరోగియొక్కమూత్ర మురక్తవర్ణముగ లేక పీతవర్ణముగ కామిలారోగియొక్క మూత్రము పచ్చగ శ్లేష్మరో యొక్క మూత్రము తెల్లగ ద్వంద్వరోగియొక్క మూత్రము మిశ్రవర్ణముగనుండును

## దీర్ఘరోగిమూత్ర లక్షణము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] రక్తధారా దీర్ఘరోగే కృష్ణాతు మరణాంతికే
సౌవీరస్యసమంమూత్రం మాతులుంగసమప్రభమ్ ।
తైలతుల్యంభవేన్మూత్రం నిత్యంసహజపిత్తజమ్ ॥

తా. మూత్రము రక్తవర్ణముగనుండిన దీర్ఘరోగమనియు నలుపువర్ణముగ నుండిన మరణము జెందుననియు సౌవీరతుల్యముగ నేని మాతులుంగ రసతుల్యముగ నేని తైలతుల్యముగ నేని యుండిన పైత్యరోగమనియు తెలియవలయును.

## ప్రకారాంతర అసాధ్యమూత్ర లక్షణము

శ్లో॥ [నిత్యనాధీయే] అతిరక్తంమేహరోగే జ్వరేహారిద్రవర్ణకమ్ ।
జ్వరేవామేహరోగేవా హ్యసాధ్యంబహుమూత్రకమ్ ॥

తా. మూత్రము కడురక్తవర్ణముగ వెడలిన మేహరోగంబనియు పచ్చగ వెడలిన జ్వరరోగంబనియు జ్వరమునందేని మేహరోగమునందేని బహు మూత్రముగలిగిన రోగి మృతిజెందుననియు తెలియవలయును.

శ్లో॥ యస్యమూత్రంస్రవేత్తైలం మధుమద్యంస్రవేత్తదా ।
యమేన క్రియతేశీఘ్రం పాలితః పశుపాలకః ॥

తా. ఏరోగియొక్క మూత్రము తైలము చేనెకల్లువలె వెడలెడివో అట్టిరోగి కడుశీఘ్రముగా మరణము జెందును.

ఇది శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచా తురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
కాయదోష మనోదోష నిదాన మూత్రపరీక్షా
క్రమ తత్సాధ్యాసాధ్య
లక్షణయుక్తం తృతీయ
ప్రకరణమ్.

శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

---

## — చ తు ర్థ ప్ర క ర ణ ము. —

శ్లో॥ బ్రహ్మవిష్ణు సురాధీశ సేవ్యపాద సరోరుహమ్ ।
పరాత్పర తరం దేవం నీలకంఠ మహంభజే ॥

అవతరణిక. ఇపుడు గ్రంథకర్త విఘ్న బాహుళ్యశంకగలవాడైతనచే జేయంబడు నీగ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తి జెందునిమిత్తము గ్రంథమధ్యమున తన కిష్టదేవతయగు పరమేశ్వరనమస్కారాత్మక మంగళమును "బ్రహ్మవిష్ణుసురాధీశ" అనుశ్లోకముచే జేయుచున్నాడు.

తాత్పర్యము. చతుర్ముఖుడు విష్ణువు దేవేంద్రుడు అనువారలచే సేవింపబడు నట్టి పాదపద్మముగలవాడును హిరణ్యగర్భునకంటె పరుడును స్వయంప్రకాశస్వరూపుడునగు పరమేశ్వరుని నేను భజింపుచున్నాడను.

శ్లో॥ శ్రీ నీలకంఠవంశాబ్ధి చంద్రమాఃబసవాహ్వయః ।
వక్ష్యామివృషరాజీయ మహంవైద్యశిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడైబసవరాజు అని చెప్పఁబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠం బైన బసవరాజీయమను నీగ్రంథమునందు నాలుగవప్రకరణమును వచింపుచున్నాడను.

### క్షయరోగోత్పత్తి కారణము.

శ్లో॥ ఆయుర్వేశే] రసరక్తగతంమాంస మజ్జాగోస్థిగతోజ్వరః ।
ఏతన్మధ్యేత్వపథ్యాని ధాతుగస్తుతదోచ్యతే ।
ధాతుగశ్చేత్వపథ్యాని కురుతేతత్క్ష యోభవేత్ ॥

తా. రసగత రక్తగత మాంసగత మజ్జాగత అస్థిగతజ్వరములు జనించు తరి యపథ్యంబులు సేసిన యవి ధాతుగతంబులగును. ధాతుగతంబున యపథ్యంబ సేసిన క్షయరోగము జనించును. (ఆ క్షయరోగము రసగత రక్తగత మాంస మజ్జాగత అస్థిగతములన నైదువిధంబులు. అందుశరీరాశ్రితరసము క్షయింపుచుం రసగతక్షయమనియు రక్తముక్షయింపుచుండిన రక్తగతక్షయమనియు మాంస క్షయింపుచుండిన మాంసగతక్షయమనియు మజ్జ క్షయింపుచుండిన మజ్జాగత క్ష మనియు అస్థులు క్షయింపుచుండిన అస్థిగతక్షయమనియు తెలియవలయును.)

## క్షయరోగకారణీభూత పాపములు,

శ్లో॥ (కర్మవిపాకే) స్త్రీహత్యా గురుహత్యా భ్రాంతద్వైవ బ్రహ్మ
హత్యయా । సజ్జనానాంవిరోధేవ రాజయక్ష్మా ప్రజాయతే ॥

తా. స్త్రీహత్య గురుహత్య బ్రహ్మహత్య సజ్జనవిరోధము అనువానివ పడకొండు క్షయరోగములు జనించునని కర్మవిపాకమను గ్రంథమున జెప్పం యున్నయది.

## క్షయరోగ స్వరూపము.

శ్లో॥ అనేకరోగానుగతో బహురోగపురోగమః ।
రాజయక్ష్మాక్షయశ్శోషోరోగ రాజఇతిస్మృతః ॥

తా. అనేకరోగంబులతోగూడి తనకు ముందనేకరోగంబులుగలదై సక రోగంబులకు ప్రభువై యుండునదియె* రాజయక్ష్మయని † యక్షమని ‡ శోషయ జెప్పంబడును.

## క్షయరోగ పరివారము.

శ్లో॥ (ఆయుర్వేదే) క్షయరోగేజ్వరోరాజా తస్యపత్నీతుకామిలా
చమూపతిఃపాండురోగోరక్తపిత్తంతుపుత్రకః । సఖ్యాశోఫా

* సర్వరోగములకు రాజుగ నుండుటవలన రాజయక్ష్మ యనంబడు.

† శరీరమునందలి జాఠరాగ్నియొక్క సర్వక్రియల క్షయింపంజేయుటవల క్షయమనంబడు

‡ రసము రక్తము మాంసము మేదస్సు మజ్జ అస్థి శుక్రము అన సప్తధా వుల శోషింపంజేయుటవలన శోష యనంబడును.

సారౌచమంత్రిణౌ శ్వాసకాసకౌ । గూఢచారౌ వాతపిత్తే వాజి
నౌవాంతికారుచి । గ్రహణ్యర్శోగుల్మశూలాగాయకాస్తూర్య
వాదకాః । అనేకరోగానుగతో బహురోగపురస్సరః । ఏవంవిధ
ప్రకారేణ క్షయో భవతి రోగరాట్ । అసాధ్యోయంమహారో
గో సహస్రదివసావధిః ॥

తా. జ్వరము రాజుగ ఆరాజుకు కామిలారోగము భార్యగ పాండురోగము సేనాధిపతిగ రక్తపిత్తము పుత్రుడుగ శోపాతిసారములు స్నేహితులుగ శ్వాసకాసలు మంత్రులుగ వాతపిత్తములు గూఢచారులుగ వాంత్యరుచులు అశ్వములుగ గ్రహణ్యర్శస్సులు గుల్మశూలలు గాయకులుగ వాద్యముల వాయించువారు గలదై అనేక రోగములతో గూడి తనకు ముందనేకరోగంబులుగలదై రోగాధిపతియై యుండునదియే క్షయరోగమని తెలియవలయును. ఇది అసాధ్యము అట్లగుటంజేసి వీనికి వెయ్యిదినములు ప్రమాణము.

## ప్రకారాంతరక్షయ రోగోత్పత్తికారణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] వేగరోధాత్క్షయాచ్చైవసాహసాద్విషమాశ
నాత్ । త్రిదోషోజాయతేయక్ష్మాగదో హేతుచతుష్టయాత్ ॥

తా. వాతమూత్రపురీషాది వేగము నడ్డగించుట అతిమైధునము ఉపవాసము అసూయ దుఃఖము ఈ మొదలగువానివలన ధాతువులు క్షయించుట బలిష్ఠమై యుద్ధాదులచే క్షోభగలుగుట నానావిధాన్నపానముల విషముగభుజించుట, ఈనాలుగు కారణములవలన త్రిదోషములు ప్రకోపించి ఒక్క యక్ష్మరోగమును జనింపజేయును. (పైజెప్పిన వేగరోధాది నాలుగుకారణములవలన వాతము ప్రకోపించును. దానివలన అగ్నిదుష్టంబై పిత్తశ్లేష్మముల ప్రకోపింపంజేయును. మఱియు. పై జెప్పబడిన వేగరోధాది నాలుగు హేతువులమధ్యములో అసంఖ్యాతీతమైన హేతువులు అంతర్భావమును జెందియుండును.

శ్లో॥ కఫప్రధానైర్దోషైస్తు రుద్ధేషురసవర్త్మసు ।
అతివ్యవాయినోవాపి క్షీణే రేతస్యనంతరాః ।
క్షీయంతేధాతవస్సర్వే తతశ్శుష్యతిమానవః ॥

తా. కఫమే ముఖ్యముగగల వాతాదిదోషములు రసవాహినులగుధమనులనడ్డగించుటవలన రసము హృదయమును జెంది నచ్చటనే దుష్టంబైనోటిమార్గముగ బైలు వెడలు అందుచే రసధాతువు రసధాతువువలన రక్తమురక్తధాతువువలన మాంసము మాంసధాతువువలన మేదస్సు మేదోధాతువువలన మజ్జ మజ్జాధాతువలన అస్థులు అస్థులవలన శుక్రము క్రమముగ క్షయించి అను లోమక్షయమును గలుగంజేయును. మఱియు అతిమైథునమువలన పురుషునికి శుక్రము శుక్రమువలన అస్థులుఅస్థులువలన మజ్జమజ్జవలన మేదస్సు మేదస్సువలన మాంసము.మాంసమువలన రక్తము రక్తమువలన రసముక్షయించి ప్రతీరోమక్షయమును గలుగంజేయును. పిదప నరుడు శుష్కించును కార్యభూతమయిన శుక్రము క్షయించుటవలన కారణభూతములైన మజ్జాదిదాతువులును క్షయించు, ఎట్లనగా,—కాలిన ఇనుపగుండును తడిభూమియందునుటజే దానికి చుట్టునుండుతడిని యది శోషింపంజేయుచందంబునశుక్రముక్షయించుటవలన వాతము ప్రకోపించి సమీపముననుండు మజ్జాదిధాతువుల శోషింపంజేయును.

[illegible]రోగ రూపములు.

శ్లో॥ భక్తద్వేషోజ్వరశ్శ్వాసః కాసశ్శోణితదర్శనమ్ ।
స్వరభేదశ్చజాయేత షడ్రూపంరాజయక్ష్మణి ॥

తా. అన్నద్వేషము జ్వరము దగ్గు ఊబ్బసము నెత్తురుగ్రక్కుట స్వరభేదము అను నీయాఱును రాజయక్ష్మరూపంబులు.

రాజయక్ష్మ లక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] అంసపార్శ్వాభితాపశ్చ సంతాపఃకరపాదయోః । * సత్యహానిశ్చ దౌర్బల్యంరాజయక్ష్మణిలక్షణమ్ ॥

తా. భుజశిరఃపార్శ్వముల సంతాపముగలుగుట చేతులు కాళ్లు మండుట సత్వము క్షయించుట దౌర్బల్యముగలుగుట ఈలక్షణముగలది రాజయక్ష్మయని తెలియవలయును.

శ్లో॥ [మాధవనిదానే] అగ్నిమాంద్య బలహీనతా జ్వరాశ్శ్వాస కాసకృశదేహితాశ్వసః । పాకహానిగురువాంతి రేచనంరోగ రాజపరిపాకలక్షమ్ ॥

---

* జ్వరస్సర్వాంగగశ్చైవ లక్షణం రాజయక్ష్మణః——సర్వాంగముల జ్వరముగలది రాజయక్ష్మయని తెలియవలయును.

తా. అగ్నిమాంద్యము బలహాని జ్వరము శ్వాసకాసలు శరీరకృశత్వము గుట నిట్టూర్పు వాతము వెడలుట భుజించియన్నము జీర్ణము గాకుండుట శరీ బరువుగనుండుట వమన విరేచనంబులగుట. ఈలక్షణములచే క్షయరోగము రినదని తెలియవలయు.

## వాతక్షయ లక్షణము.

శ్లో॥ [చరకే] సంకోచస్స్కంధపార్శ్వానాం స్వరభేదజ్వరా భ్ర
మాః॥ వాతజేయక్ష్మణిజ్ఞేయం లక్షణంచాతిశీతతా ॥

తా. భుజపార్శ్వములు నొచ్చుట స్వరముహీనమగుట జ్వరము భ్రమగలు శరీరము కడుచల్లగనుండుట. ఈలక్షణములుగలది వాతక్షయమని తెలియ ను.

## పిత్తక్షయ లక్షణము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] జ్వరదాహాతిసారాశ్చ రక్తవాంతిశ్చ్రియో
మహాః । వీర్యస్తంభోరతిఃక్షీణాలక్షణంపిత్తజేక్షయే ॥

తా. జ్వరము దాహము అతిసారము గలుగుట నెత్తురుగ్రక్కుట మిక్కుట అలసట గలుగుట వీర్యము స్తంభించుట రతిక్రియలు క్షయించుట ఈ లక్షణ గలది పైత్యక్షయమని తెలియవలయు.

## శ్లేష్మక్షయ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] గురుత్వంశిరసశ్ఛర్ది కాసఃకంఠేతథారుచిః ।
ఊర్ధ్వశ్వాసశ్చవిజ్ఞేయం లక్షణంకఫజేక్షయే ॥

తా. తలనొచ్చుట వమనంబగుట కుతిక లోశ్లేష్మము అడ్డపడుట అరుచి ఊపిరిగలుగుట ఈలక్షణములుగలదిశ్లేష్మక్షయమని తెలియవలయు.

## సన్నిపాత క్షయలక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] వాతపిత్తకఫైర్యస్యలక్షణైస్సంయుతో యదా
సన్నిపాతాన్వితోజ్ఞేయః కష్టసాధ్యః క్షయస్తథా ॥

తా. వాతపిత్తశ్లేష్మ క్షయలక్షణంబులుగలది సన్నిపాతక్షయమని తెలియ ను. ఇది కష్టసాధ్యము.

### వాతశ్లేష్మక్షయ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] స్వరభేదఃకఫఃకంఠేశూలంశ్వాసశ్చఛర్దనమ్ । వాతశ్లేష్మభవోయక్ష్మాజాత్వైవంతుచికిత్సయేత్ ॥

తా. సర్వభేదముగలుగుట కంఠములో శ్లేష్మము కట్టుట కడుపులో శూలగలుగుట రొమ్మగవూపిరిగలుగుట వమనంబగుట ఈలక్షణములుగలది వాతశ్లేష్మక్షయమని తెలియవలయు.

### వాతపిత్తక్షయలక్షణము.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] స్వరభేదోజ్వరోదాహోశూలంఛర్దిస్త్వరోచకమ్ । వాతపిత్తాత్మకోయక్ష్మా రాజరోగోమహాబల ॥

తా. స్వరభేదము జ్వరము దాహము కడుపులోశూల వమనము అరోచకవకలుగుట ఈలక్షణములుగలది వాతపిత్తక్షయమనియు కడుబలిష్ఠమైన రాజయక్ష్మయనియు తెలియవలయు.

### పిత్తశ్లేష్మక్షయ లక్షణము.

శ్లో॥ [భేషజకల్పే] ఆలస్యంబహునిద్రాచ స్వల్పదాహోభ్రమోజ్వరః । వాంతిశోణితపూరశ్చపిత్తశ్లేష్మద్భవేక్షయే ॥

తా. ఆలస్యము కడునిద్ర యొకింతదాహము భ్రమ జ్వరముగలుగుట నెత్తురుగక్కుట ఈలక్షణములుగలది పిత్తశ్లేష్మక్షయమని తెలియవలయు.

### రక్తపిత్తక్షయ లక్షణము.

శ్లో॥ స్వరభేదోనిలశ్శూలం సంకోచశ్చోరుపార్శ్వయోః ।
జ్వరదాహాతిసారాశ్చరక్తపిత్తస్యయక్ష్మణః॥

తా. కంఠస్వరముచెడుట శరీరము వాతపూరితముగ నుండుట కడుపులో శూలగలుగుట లోతొడలు పార్శ్వములునొచ్చుట జ్వరము దాహము అతిసారముగలుగుట నెత్తురుగక్కుట ఈలక్షణములుగలది రక్తపిత్తక్షయమని తెలియవలయు. (ఇది అసాధ్యము.)

## క్షతక్షయ లక్షణము.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] వక్త్రేవిభంగస్స్వరభంగయోగ స్స్వల్ప జ్వరః పాణిపదేషుదాహః । రక్తాన్వితచ్ఛర్ద్యతిసారయుక్తః ప్రోక్తశ్చ యత్నాత్క్షతలక్షణశ్చ ॥

తా. నోరుపొక్కియురిడుట లేక మాటలాడుటకు శక్తిలేకుండుట కంఠ స్వరముచెడుట స్వల్పజ్వరముగలుగుట చేతులుకాళ్లుమండుట రక్తయుక్తముగ గ్రక్కుట పారుట ఈలక్షణములుగలది క్షతక్షయమని తెలియవలయును. (ఇది అసాధ్యము.)

## రోగరాజక్షయ లక్షణము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] అగ్నిమాంద్యం జ్వరం శైత్యం ఛర్దిశ్శోణిత పూయయోః । సత్వహానిశ్చదౌర్బల్యంరోగరాజస్యలక్షణం ॥

తా. అగ్నిమాంద్యము జ్వరము శైత్యము గలుగుట రక్తము నేని చీము నేని గ్రక్కుట సత్వము క్షయించుట దౌర్బల్యము గలుగుట ఈలక్షణములుగలది రోగ రాజక్షయమని తెలియవలయును. (ఇది అసాధ్యము.)

## రక్తక్షయ లక్షణము.

శ్లో॥ మందాగ్నిశ్ఛర్దనంమోహోరక్తత్వఙ్మూత్రనేత్రకః ।
మాంసగ్రంథ్యర్బుద గ్రంతిముఖదౌర్గంధ్యమేవచ ।
కంఠశ్శుష్యతిమాంసంచరక్తక్షయీయమాలయమ్ ॥

తా. మందాగ్నిగలుగుట వమనంబగుట మోహముగలుగుట మూత్రమురక్త వర్ణముగనుండుట నేత్రములనెత్తురు ఉట్టిబడుట మాంసగ్రంథులు జనించుట నోరు దుర్గంధముగనుండుట కంఠముశోషించుట శరీరమాంసము కృశించుట ఈ లక్షణ ములుగలది రక్తక్షయమని తెలియవలయును. ఇదిగలరోగి యమాయలంబునకేగు

## చతుర్విధక్షయ లక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] త్రివిధస్యాత్క్షయోవాతపైత్తశ్లైష్మైతుచతు ష్టయాత్ । ధాతుక్షయాద్వేగరోధా త్సాహసాద్విషమాశ

నాత్ । ఆగంతుకక్షయోజ్ఞేయ శ్చతుర్థో వైద్యపారగైః । తస్యరూపాణివై స్వర్యంకాస శ్వాసోరుచిర్జ్వరః । బలమాంస క్షయఃపార్శ్వ శిరోరుగ్రేచసంవమిః । కంఠపార్శ్వ రుజానాహ రక్తశ్చ ఛర్ది పీనసః । నిహంతి పూయనిష్ఠీవో హ్యతిసారో హతస్వరః ॥

తా. విరుద్ధాహారవిహారములవలన వాతపైత్యశ్లేష్మములు ప్రకోపించి వాతక్షయము పిత్తక్షయము శ్లేష్మక్షయము అనిమూఁడువిధములైన క్షయరోగములుగలుగంజేయు ధాతుక్షయము మలమూత్రప్రతిబంధము సాహసము * విషమాశనము అను నాలుగుకారణములవలన ఆగంతుకక్షయముజనించు. ఈ ఆగంతుకముతోడ క్షయరోగములు నాలుగువిధంబులని సిద్ధవిద్యాభ్యుయనెడు గ్రంథమున జెప్పంబడియున్నయది, వానియందు స్వర్హీనము కాసశ్వాసములు అరుచి జ్వరము బలక్షయము మాంసక్షయము పార్శ్వములయందునొప్పి మిక్కుటముగ శిరమునందునొప్పి వమనము కుతికయొక్క పార్శ్వములయందునొప్పి కడుపుబ్బరమురక్తమునుగ్రక్కుట పీనసము దగ్గునప్పుడు చీముబడుట అతిసారము హీనస్వరము గలుగుట, ఈలక్షణములతో గూడియుండెడి నాలుగు విధములైన క్షయరోగములు రోగినిజంపు.

ఏకాదశక్షయ లక్షణము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] సాహసో వేగసంరోధశ్శుక్రాభిస్నేహనంక్షయః । అన్నాహారవిధేస్త్యాగశ్చ త్యారోరాజయక్ష్మణః । రూపంభవిష్యత స్తత్రప్రతిశ్యాయ స్తుసంక్షయః । ప్రసావేముఖమాధుర్యంతపనంవహ్నినాశనమ్ । సాల్యరోగ స్తథానాహశోభావప్యశుభేక్షణమ్ । మక్షికామత్స్యణకేశాది ప్రాణనాయు స్స్వపానగః । హ్యల్లాసశ్ఛర్దిరరుచీ రసతోపిబలక్షయః । పాదశ్చశోషః పదయో శ్శోషశ్చక్షీణశుక్లతా । బాహ్యప్రమానభిజ్ఞానం కాయేఃభీభత్సదర్సనమ్ । పీనస శ్వాసకాసాది మూర్ధస్వర రుజారతిః । ఊర్ధ్వ విస్రంసనంశోఫో రక్తఛర్దిస్తు కోష్ఠగః

* విషమాశనమన:—నానావిదాన్నపానసాల విషముముగ సేవించును,

యోనిపార్శ్వగుదేశూలం సంధిశోథ భవతిజ్వరః । ఏకాదశసు
రూపాణి జాయంతే రాజయక్ష్మసు॥

తా. సాహసము చేయంబూనుట కార్యములయందు కడువేగము గలుగుట శుక్లముక్షయించుట లేక చమురువలెగారుట అన్నమునందిచ్ఛలేకుండుట ఈ 4 గును ముందుగలుగబోయెడి పదకొండువిధములై నరాజయక్ష్మలకు పూర్వరూపంబులుఅవి జనించినపిదప పడిసెము మూత్రకృచ్ఛ్రముగలుగుట నోరుతీపిగనుండుట శరీరమువిదాహించుట అగ్నినశించుట స్థూలరోగము కడుపుబ్బరము గలుగుట ముఖమువాచుట వికారముగజూచుట వెంట్రుకలు మఱికొత్తృణవర్ణసమానంబులుగనుండుట ప్రాణవాయువు అపానవాతముతోగలియుట ఓకర లేకఎక్కిళ్ళువాంతి అరుచి గలుగుట రసధాతుక్షయమువలన సత్వముక్షయించుట కాళ్ళుచేతులువాయుట శరీరముశోషించుట శరీరమున స్పర్శజ్ఞానములేకుండుట శరీరము ఘోరముగ గనుపించుట పీనసము శ్వాసకాసాదులు గలుగుట శరీరమువాచుట నెత్తురుగ్రక్కుట కోష్ఠవాతముగలుగుట యోనిపార్శ్వములు గుదస్థలముశూలించుట సంధివాతము జ్వరముగలుగుట ఈలక్షణంబులన్నియు ఏకాదశక్షయములని తెలియవలయును.

## క్షయరోగ లక్షణము.

శ్లో॥ [చరకే] మందాగ్నిశ్చబలహీనతాకృతనుశ్వాసశ్చకాసభ్రమా॥
హృచ్ఛూలంవమనంప్రవాహస్వరరుక్కంపస్త్వజీర్ణంతృషా ।
దాహోవిస్తృతహస్తి మూత్రగళరుక్ఛీతం శిరోర్తిర్జ్వరం ।
మూర్ఛార్తిస్త్వథపీనసండగతిర్శ్వైత్యతత్క్షయే లక్షణమ్ ॥

తా. మందాగ్నిగలుగుట సత్వములేకుండుట శరీరముకృశించుట కాసశ్వాసములు భ్రమ ఱొమ్మునొప్పి వాంతులు అతిసారము స్వరభేదము వణుకు అజీర్ణము దప్పి దాహముగలుగుట ఏనుగుమూత్రమువలెనే మూత్రంబధికముగ వెడలుట కుతికలోనొచ్చుట చలువగలుగుట తలనొచ్చుట జ్వరము మూర్ఛ పీనసము జడత్వముగలుగుట ఇవియన్నియు క్షయరోగలక్షణంబులని తెలియవలయును.

## క్షయోపద్రవములు.

సీ॥ క్షయకుపద్రవమతిసారంబు గృశమైవ దేహంబు గన్నులుదెల్ల నగుట । కడుపెండివెన్నునం గలయుట మోహంబు నష్టేంద్రియంబువ్రణాలుగలుగు । దగ్గునుశూలయూర్ధ్వశ్వాసస్వరహీనమై కాళ్ళువాచుట మఱియుదాన । సంగమెల్లనుశుష్కమగుటముక్కున నెత్తురొలుకుట ధాతుక్షయోర్మి యగుట॥

గీ॥ క్షయలకెల్లనునీరోగజాలమున్న । నదిప్రయాసంబుధన్వంత్రికైనఁగాని । మాన్పరాదని చెప్పెఁ బల్మాఱునీల । కంఠకోట్టూరువైద్యసంఘంబెఱుంగ॥

శ్లో॥ [నిత్యనాథీయే] అనేకోపద్రవయుతం పాదయోః ప్రసృతం నరమ్ । నారీంశోప ముఖేంహంతి కుక్షిగుహ్యే వ్రభావపి॥

తా. ఏపురుషునికి క్షయరోగముతోడ అనేకోపద్రవములుగూడి కాళ్ళయందువాపు స్త్రీకి ముఖమునందువాపు స్త్రీపురుషులకుకడుపు మర్మస్థలము అను వానియందు వాపుగలిగియుండెడినో అట్టివారు మరణము జెందుదురని తెలియవలయును.

శ్లో॥ [నిత్యనాథీయే] జ్వరాతిసారశోఫానాంశ్వ యథాచతథాక్షయే । ఆననంహస్తపాదంచ విశేషాద్యస్యశుష్యతి । స్వయోనావపిచేహేచ సామాన్యాద్యాతిపంచతామ్ ॥

తా. క్షయరోగములలో జ్వరాతిసారంజేని శోఫమేని ముదిరినను లేక ముఖము కాళ్ళు చేతులు శుష్కించి యోనిశరీరము వాచియుండినను అట్టి క్షయరోగి మరణముజెందునని తెలియవలయును.

శ్లో॥ [మతాంతరే] నాసికాచ్యుతరక్తశ్చ మేహ పాండ్వామయీ క్షయీ । సహోప్యపిముంచతిప్రాణాన్ సద్యనేవనసంశయః॥

తా. మేహ పాండు క్షయరోగముగలవారికి ముక్కుబెదరి రక్తముగారుచుండిన వారునిస్సంశయముగ తత్క్షణంబునప్రాణంబుల విడిచెదరు.

శ్లో॥ శోషోదలాక్షో గ్రహణీ జ్వరగుల్మాహ్యుపద్రవాః॥

తా. క్షయరోగంబులలో శోష ఉదరము మూలవ్యాధి గ్రహణి జ్వరము గుల్మము అను నుపద్రవములు గలిగినరోగి మృతి జెందునని తెలియవలయును.

శ్లో॥ [మాధవనిదానే] విషూచీశ్లేష్మహీనాంగ మతిసార ప్రపీడితమ్।
శూలశుష్కోదరంచైవ యక్ష్మాణంపరివర్జయేత్ ।
ఊర్ధ్వశ్వాసాతిశుక్లాక్షి భిన్నకాంస్యహతస్వరః ।
అతిమేహః కృశోమందో హీనబుద్ధిబలేంద్రియః ।
వ్రణాంగశోషంహిక్కావాన్ క్షయీయాతియమాలయమ్ ।
తథాస్యాపిప్రకర్తవ్యా చికిత్సాజీవితావధి ॥

తా. విషూచి కఫము అంగహీనము అతిసారము శూల శుష్కోదరము ఎగ వూపిరి నేత్రములు తెల్లనైరక్తవిహీనములుగనుండుట సర్వముపగిలినకంచుపాత్రధ్వనితోతుల్యముగనుండుట కడుమేహము శరీరకృశత్వముశరీరమాంద్యముబుద్ధిమాంద్యము బలక్షయము ఇంద్రియక్షయము వ్రణములు శరీరముయెండుట ఎక్కిళ్లుఅను నుపద్రవములలో దేనితోనైన లేక అనేకరోగంబులతో నైనగూడి యుండెడిక్షయరోగి యమాలయంబునకేగును. ఐననుక్షయరోగి జీవించియుండువరకు చికిత్సచేయవలయును.

క్షయేకాదశరూప షడ్రూప త్రిదోషశోషవివరణము.

శ్లో॥ [ఆయుర్వేదే] స్వరభేదోనిలాచ్ఛూలం సంకోచశ్చాంసపా
ర్శ్వయోః । జ్వరోదాహోతిసారశ్చ పిత్తాద్రక్తస్యచాగ
మః । శిరసోప్యతిధారశ్చ హ్యభక్తచ్ఛందఏవచ । కాసఃకంఠ
స్యశోధ్వంసో విజ్ఞేయః కఫకోపతః । ఏకాదశభిరేతైర్వా
షడ్భిర్వాపిసమన్వితమ్ । కాసాతిసారపార్శ్వార్తి సర్వభేదా
రుచిజ్వరైః త్రిభిర్వాపీడితంలింగ ఋర్జ్వర కాసాసృగామయైః ।
జహ్యాచ్ఛోషార్దితం జంతుమిచ్ఛంసు విపులంయశః ॥

తా. వాతపిత్త శ్లేష్మసంకరమువలన జనించు సన్నిపాతము సర్వలక్షణసంపూర్ణముగనుండుచందంబున సన్నిపాతము వలన జనించు క్షయరోగము సర్వలక్షణసంపూర్ణముగనుండును. అందువాతప్రకోపమువలనసర్వభేదముశూలభుజపార్శ్వములు

యీడ్చికొనుట పిత్తప్రకోపమువలన జ్వరము దాహము అతిసారము రక్తముగ్రక్కుట శ్లేష్మప్రకోపమువలన శిరోభారము అన్నద్వేషము దగ్గు కంఠమునొప్పి అను నీపదునొకండులక్షణములు గలిగి మాంసక్షయముతో క్షయరోగిని లేక కాసము అతిసారము పార్శ్వములు యీడ్చికొనుట స్వరభేదము అరుచి జ్వరము అను నీ 9 లక్షణములుగలిగి మాంసక్షయముతో గూడియుండు క్షయరోగిని లేక జ్వరము దగ్గు రక్తము గ్రక్కుట అను నీ 3 లక్షణములుగలిగి మాంసక్షయముతో గూడియుండు క్షయరోగిని మిక్కుటముగ యశమునుగోరెడి వైద్యుడు వర్జింప వలయును.

## సర్వరోగభేద వివరణము.

శ్లో॥ ఏకనయివచదోషేణ తయోర్ద్వాభ్యామపిత్రయః ।
త్రిదోషయిరపిచైకస్యా ద్వైతైస్సప్తవిధోగదః॥

తా. సర్వరోగములు ఏకదోష ద్విదోష త్రిదోషజనితమువలన 7 విధంబులు అందు వాతపిత్తశ్లేష్మమువలన ప్రత్యేక ప్రత్యేకముగ జనించునవి ఏకదోషజనితంబులు వాతశ్లేష్మ వాతపైత్య పిత్తశ్లేష్మమువలన జనించిన ద్వంద్వదోషజనితంబులు. వాతపిత్తశ్లేష్మములవలన జనించునవి త్రిదోషజనితంబులు.

## రోగసాధ్యాసాధ్యములు.

శ్లో॥ [నిత్యనాథీయే] ప్రయోగశ్శమయేద్వ్యాధిమన్యామయము దీరయేత్ । నాసావశుద్ధశ్శుద్ధస్తు శమయేన్నసమీరయేత్ ॥

తా. ఔషధప్రయోగము శుద్ధరోగము (అనగా ఏకదోషజనితరోగము) లను హరింపజేయునేగాని యితరరోగములగలుగజేయకుండును. మఱియు అశుద్ధరోగముల (అనగా ద్వంద్వరోగముల త్రిదోషజనితరోగముల) ఔషధముప్రయోగించినఇతర రోగములుజనించును అట్లగుటంజేసి శుద్ధరోగములకే చికిత్సంజేయవలయును అశుద్ధరోగములు కుదురుట దుర్లభంబగుటచే వానికి చికిత్స జేయంజనదు.

## క్షయరోగములకు తాళకసిందూరము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధతాళస్యభాగంచసుధాచూర్ణంసమాంశకమ్ । రక్తాకార్పాసనారేణ మర్దయిత్వాదినత్రయమ్ ।
మూషాయాన్నిక్షిపేత్సర్వం సప్తవారంపుటంభవేత్ ।
సింధూరంహరితాళస్యచేంద్రగోపప్రభంభవేత్ । ఏతత్సర్వం

సమాలోడ్య నానారోగేషు యోజయేత్ । పత్రవల్లీ రసై ర్యుక్తం శ్లేష్మక్షయవినాశనమ్ । గోక్షుస్వరసై ర్యుక్తం రక్తక్షయవినాశనమ్ । నారికేళర సై ర్యుక్తంవాతశ్లేష్మవినాశనమ్ । హరీతకిచూర్ణయుక్తం శ్వాసక్షయవినాశనమ్ । పిప్పలీచూర్ణ యోగేన కాసక్షయవినాశనమ్ । సితయామధునాయుక్తం పిత్తక్షయవినాశనమ్ ॥ నిర్గుండీచూర్ణసంయుక్తం కఫజ్వరవినాశనమ్ । నవనీతేనసంయుక్తం హిక్కాఛర్ది నివారణమ్ । మంజరీసారసంయుక్తం చాతుర్థికవినాశనమ్ । అర్జునత్వక్చూర్ణయుక్తం శుక్లమేహవినాశనమ్ । కార్పాసబీజచూర్ణేన బహుమూత్రప్రణశ్యతి । శంఖచూర్ణేన సంయుక్తం గ్రహణీసారనాశనమ్ । ఉన్మత్తసారసంయుక్తం క్రిమికుష్ఠంవినశ్యతి । అపామార్గస్యసారేణ గుదరోగోవినశ్యతి । వృశ్చికాళీరసై ర్యుక్తం మేహంకృఛ్రంవినశ్యతి । ధూపచూర్ణేన సంయుక్తం గ్రహణీదోషనాశనమ్ । శుక్లకందేనసంయుక్తం గ్రహణీశూలనాశనమ్ । దాడిమీకుసుమసారేణ హిక్కాగ్రహణీనాశనమ్ । ఏతత్సూంశకంచూర్ణ మయోక్తంభాషితంతథా । తాళసింధూర యోగేన నానారోగంహరంపరమ్॥

తా. శుద్ధిచేసిన తాళకము సున్నము వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునవునిచి పైడిప్రత్తిపువ్వులరసాన మూడుదినములు మర్దించి వజ్రమూషలోనునిచి 7 లఘుపుటములువేసిన తాళకము అరుద్రపురుగులవలె నెఱ్ఱగసిందూరించును. పిదప నావజ్రమూషములోని సిందూరమును గీచి యెత్తుకొని సర్వరోగములయందుపయోగింపవలయును. మఱియు నాసింధూరములో రెండు * చిన్నములయెత్తును రుద్రజడాకురసముతో నొసంగిన శ్లేష్మక్షయమును ఏనుగుపల్లేరు రసముతో నొసంగిన రక్తక్షయమును టెంకాయ నీళ్లతో నొసంగిన వాతశ్లేష్మక్షయమును కరక్కాయను చీనాపంచదారతో నేని తేనెతోనేని నొసంగిన పైత్యక్షయమును నల్లవావిలియాకు చూర్ణముతో నొసంగిన శ్లేష్మజ్వరమును వెన్నతో నొసంగిన ఎక్కిళ్లు వాంతులును తొలసియాకురసముతో నొసంగిన, చాతుర్థికజ్వరమును మద్దిచెక్కచూర్ణముతో

* చిన్నమన:--- నాలుగు గురివెందగింజలయెత్తు.

నొసంగిన శుక్ల మేహములు ప్రత్తిగింజలచూర్ణముతో నొసంగిన బహు మూత్రమును శంఖచూర్ణముతో నొసంగిన గ్రహణి అతిసారములును ఉమ్మెత్తరసముతో నొసంగిన క్రిమి కుష్ఠరోగములను ఉత్తరేణిరసముతో నొసంగిన గుదరోగమును తేలుమణి యాకు రసముతో నొసంగిన మేహరోగమును మూత్ర కృచ్ఛ్రమును అగరుగంధపు చెక్క చూర్ణముతో నొసంగిన గ్రహణీ దోషమును అతివస చూర్ణముతో నొసంగిన గ్రహణీశూలలును దానిమ్మ పువ్వుల రసముతో నొసంగిన ఎక్కిళ్ళతోగూడియుండు గ్రహణీరోగమును నశించును పైయనుపానములు సింధూరమునకు సమముగ నుంచు కొనవలయును. మఱియు నీతాళక సింధూరము నానారోగముల హరింపజేయుట యందు కడుశ్రేష్టంబైనదిగ నున్నది.

## క్షయపాండుకామిలలకు శ్రీమదగ్నికుమారము.

శ్లో॥ చింతామణౌ తుల్యాగంధక పారదావమృతకం శుల్బంచ
తుల్యాంశకమ్ ఖల్వేహంసపదీరసేదినయుగం సమర్ద్యాయ
త్నాత్తతః । కృత్వాకాచమయేఘటేచ వటికాస్సాతప్య
సూర్యాంశుభిః । తద్రుద్ధ్వాదనమంగుళీ పరిమితం చేలంమృ
దావేష్టయేత్ । భాండేవాలుకయాత్రిభాగభరితే క్షిప్త్వా
క్షిపేద్వాలుకామ్ । భాండాస్యంతునిరుధ్య వాసరయుగం
గాఢాగ్నిముద్దీపయేత్ । ఉత్తార్యస్వశరీరశీతలమతోవేదాం
శతుల్యామృతమ్ । తుల్యాంశైశ్చమరీచ చూర్ణనికరైస్సం
యోజ్య గుంజామతమ్ । దేయంనాగలతాదళేన సహితం
చూర్ణంతథాఖాదయేత్ । శ్రీమానగ్నికుమారకోరసవరో
నిశ్శేషరోగాసహః । శ్వాసకాసక్షయ పాండుకామిలా శూ
లవాతవమిరోగభూపతిః । సన్నిపాతమతి దారుణజ్వరాన్
హంతిహంతరసభూపతిః క్షణాత్ ॥

తా. శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన వసనాభి తామ్రభస్మము వీనినిసమభాగ ములుగ ఖల్వమునయునిచి రెండుదినములు హంసపాదియాకురసముచే బాగుగామర్దించి మాత్రలుజేసి ఎండనెండించి గాజుబుడ్డిలోబోసి దానిమూతిని బలపపుబిరడచేసి శీలమన్నులిచ్చి యెండించి కుండను 3 భాగములయిసుకబోసి అంతా గాజుబుడ్డి

నునిచి దానిపైమరల నిసుకబోసి వాలుకాయంత్రమున 2 దినములువండిసాంగశీతల
మునదీసి దానికి 4 వ పాలుశుద్ధిజేసినవసనాభివసనాభికి సమము మిరియపుచూర్ణము
కలిపియుండొక గురిగింజప్రమాణమును తమలపాకులోనునిచి సేవించిన శ్వాసకాసలు
క్షయరోగములు పాండువులు కామిల శూల వాతములు వాంతులు సన్నిపాతములు
పురాణజ్వరములు (అమ్లపైత్యములు శోఫలు) మొదలగు సర్వరోగముల తత్క్షణమున
నిశ్శేషముగబోకడచు. ఇది శ్రీమదగ్నికుమారమనియు రసభూపతియనియు జెప్పంబడు.

## క్షయాదిసర్వరోగములకు పూర్ణచంద్రోదయము.

శ్లో॥ [గ్రంథాంతరే] పలంమృదు స్వర్ణదళం రసేంద్రపలాష్టకం
షోడశగంధకస్య । శోణైస్తు కార్పాసభవైః ప్రసూనైస్స
ర్వంవిమర్ద్యాథకుమారికాద్భిః । తత్కాచకుంభే నిహితంప్ర
గాఢే * మృత్కర్పటీభిర్ద్వి వసత్రయంచ । పచేత్క్రమాగ్నౌ
సికతాఖ్యయంత్రే తతోరజః పల్లవరాగరమ్యమ్ ॥ నిగృ
హ్యచైతచ్ఛుపలం పలంచ చత్వారి కర్పూరరజస్తథైవ ।
జాతీఫలంశోషణ మింద్రపుష్పం కస్తూరికాయా ఇహ శాణ
మేకమ్ । చంద్రోదయోయంకథితోస్య మాషో భుక్తోహి
వల్లీదళమధ్యవర్తీ । మదోత్కటానాంప్రమదాశతానంగర్వా
ధికత్వంశ్లథ యత్యకాండే । ఘృతంఘుభూతమతీవముద్ధం ।
* మృదూని మాంసానిస మండకాని । మాషాన్నపిష్టానిభ
వంతిపథ్యా న్యానందదాయీన్యపరాణిచాత్ర । వలీపలిత
నాశనస్తను భృతాంవయస్తంభ నస్సమస్తగద ఖండనః
ప్రచురరోగపంచాననః । గృహేపిగృహ భూపతిర్భవతి య
స్యచంద్రోదయస్సపంచశరదర్పితోమృగదృశాంభవేద్వల్ల
భః । రతికాలేరతాంతే వాసేవితవ్యోరసోత్తమః । మాస
హానింకరోత్యేష ప్రమదానారసు నిశ్చితమ్ । కృత్రిమంస్థా
వరంచైవ జంగమంచాపి యద్విషమ్ । నశ్యత్యాశు యథాభ
సాధకేంద్రస్య వత్సరాత్ । యథామృత్యుం జయాభ్యా
సాన్మృత్యుంజయతి దేహినామ్ । తథాయంసాధకేంద్ర

* మత్కర్పటైస్తద్ద్వివసత్రయంచ. * గురూణిమాంసాలిసమస్తకాని.

స్యజరామరణనాశినః । ఇంద్రపుష్పంలవం గంస్యాత్కార్పాస కుసుమద్రవమ్ । తంత్రాంతరేప్రసిద్ధో యంమకరధ్వజనామత

తా. శుద్ధిజేయబడి సూక్ష్మముగ కత్తిరించబడిన కుందనపురేకులు 1 పలః శుద్ధిజేసినపాదరసమ 8 పలములు శుద్ధిజేసిన అమ్లసార శిలగంధకము 16 పలములు ఇటుల వీనినెల్లఖల్వమునను నిచి ఎఱ్ఱప్రత్తిపువ్వుల రసమునఒకదినముబాగుగామర్దిం పిదప మఱియొకదినము కలబంధమురసముచే మర్దించి సెనగగింజలంతేసిమాత్రలుజే ఎండించి గాజుకుప్పెలోబోసి చీలమన్ను లేపనము జేసి వాలుకాయంత్రము నునిచి మృదు తీక్ష్ణ గాఢాగ్నులచే మూడుదినములువండి సాంగశీతలమున దింపి యందలి యౌషధమునుదీసిజూచిన యదిచిగురుటాకు వర్ణతుల్యముగనుండవలయును. అటులుండిన పక్వంబైనదని యెఱింగి యందు దినుసుకొక్కొక పలముచొప్పున పచ్చకర్పూరమును జాజికాయలనుపిప్పళ్ళునులవంగములను* శాణప్రమాణముకస్తూ రినిగలిపి మర్దించవలయును.ఇదియ పూర్ణచంద్రోదయమనంబడును.దీనినిమాషప్రమా ణముతమలపాకులోనునిచిసేవించిన మదించిన నూరుగురు స్త్రీలగర్వము నణచుటయం దు శక్తిగలవాడుగనగును. మఱియు ౨దిముదిమినిసమస్తరోగములను బోకడచివయస్తం భనమును గలుగంజేయుటయేగాక బలిష్ఠమైన క్షయాదిరోగముల నేఏనుగులకుసింహ ముగనుండును. ఈపూర్ణచంద్రోదయము గృహపతి గృహమును రక్షింపుచుండు చం దంబున శరీరమునురక్షింపుచుండును. మఱియు దీనిని సేవించువాడు కామముచేగర్వి తుడై స్త్రీలకు మిగులసంతోషమునుగలుగంజేయుచుండును. మఱియు దీనినిసురత కాలంబునగాని సురతాంతమునగాని సేవించెడువాడు మదించిన స్త్రీలయొక్కగర్వ మును నిశ్చయముగబోకడచును. మఱియుదీనినొకసంవత్సరమువరకు సేవించెడివానికి కృత్రిమస్థావరజంగమ విషములవలన యెవ్విధవికారంబును గలుగకుండు మృత్యుం జయరససేవనవలన మృత్యువు గలుగకుండు చందంబున దీనిసేవనవలన జరామరణ ములుగలుగకుండును. దీనియందు పేరిననెయ్యి అధికముగపాలు మృదుకరమాంస ములుమీగడ మాషాన్నము పిండివంటలు మొదలగు తన కిష్టపదార్థముల సేవించుట పథ్యకరము.

క్షయాదులకు మహదగ్నికుమారము.

శ్లో॥ [దేవీశాస్త్రే] గంధకేనద్వికర్షేణ శుద్ధసూతేనతావతా । విధా యకజ్జలీంశ్లక్ష్ణామేకవాసరమర్దనాత్ । కర్షమాత్రంవిషందత్వా

* శాణమున 4 మాషములయెత్తు.

మర్దయిత్వా దృఢంతథా । హంసపాదిరసందత్వాస్తోకంస్తోకం ముహుర్ముహుః । కుడవార్ధమిదం పశ్చాద్గోళీకృత్యవిచక్షణః॥ కాచకుప్యాం వినిక్షిప్య శుల్బంచాస్మిన్ ప్రదాపయేత్ । దేవీశాస్త్రేపునఃప్రోక్తం చూర్ణితం కాంచనవిషమ్ । ఊర్ధ్వాధోగోళకానాహిం కాచకుప్యాం వినిక్షిపేత్ । నిక్షిపేత్కుజ్జలీమధ్యేయథా శ్వాసోనజాయతే । తతశ్చద్వ్యంగుళేనైవ మృదాకుప్యం విలిప్యచ । విశోష్యవాలుకా యంత్రే సూత్రస్థానప్రకాశితే । అధోముఖం ఘటీంక్షిప్త్వా క్షిపేదుపరి వాలుకామ్ । నిరుధ్యభాండ వక్త్రంచ చుల్ల్యామారోప్య యత్నతః । వహ్నింప్రజ్వాలయేత్స్వార్ధ దినంక్రమ వివర్ధితమ్ । సాంగశీతంసమాకృష్య సహతామ్రేణ మర్దయేత్ । పలార్ధం మారిచంసూక్ష్మం కర్షార్ధంవత్స నాభకమ్ । వినిక్షిప్యవిమర్ద్యాథ క్షిపేద్ద్రవ్యంకరండకే । నందినాథసమాదిష్టం రసతుల్యం మరీచకమ్ । తత్సనాభంచ కర్షార్ధంమిశ్రయేత్పతిచూర్ణితమ్ । నిర్దిష్టోగ్నికుమారకో రసవరో దేయస్తథా నందినా । సర్వోవైద్యయశః ప్రభూతఫలదః స్సర్వామయధ్వంసకః । నిత్యంపాచనదీపనో రుచికరశ్లేష్మఘ్నం గుణోత్కర్షకృత్ । శాలీభోజన తోయభక్షసుఖదశ్శ్లేష్మరసానాంప్రభుః మహదగ్నిం కఫవాతజక్షయగదం నిశ్శేష శూలామయమ్। శ్వాసంకాసగదం తథా కఫమరుజ్జ్వరంచ పాండుంతథా । శోషంవాతగదా న్మహాకఫరుజః కంఠామయం సర్వశః। సామాంచగ్రహణీం హరేత్సలు రతిం కుర్యాచ్చ పర్ణాన్వితః * కణయాసిత యాజ్యేనదాతవ్యోయం మహారసః । వాయుముఖ్యేషు రోగేషు వాయు సంసర్గకేష్వపి । నందినాథేపునఃప్రోక్తస్తత్రరోగ హరఃపరః । నిహంతిసకలాన్ రోగానసుపానవిశే

* మధునా.

షత్ః । రసజనితవిదాహే శీతతో యాభిషేకో మలయజఘుః
సార్ద్రైః శ్లేపనం మందవాతః। తరుణ రధిచయుక్తం నారికేళస్యక్షీ
రమ్ । మధురశిశిర వాత శ్శీతమన్యచ్చశస్తమ్॥

తా. శుద్ధిచేసినగంధకము 2 కర్షములు శుద్ధిజేసినరసము 2 కర్షములు ఇటుల వీనిని గ్రహించి ఖల్వములో నునిచి ఒకదినముకజ్జలిగమర్దించి అందు కర్ష ప్రమాణము శుద్ధిజేసిన వసనాభిని కలిపి మరల దృఢముగ మర్దించి హంసపాదియాకు రసమునుకొద్ది వార్ధ పరిమితముగజేకొని కొంచెకొంచెముగ వేయుచు పలుమారుమర్దించి మాత్రలు జేసి యెండించి పిదపగాజుకుప్పెలోపలదేవకాంచనపు చూర్ణమునుశుద్ధిజేసినవసనాభి చూర్ణమునువైచిదానిపై యామాత్రలనునిచి ఆమాత్రలకు నడుమ తామ్రభస్మమును మరల దానిపై దేవకాంచనపు చూర్ణమును శుద్ధిచేసినవసనాభిచూర్ణమునువైచిసందు లేకుండునటుల దానిమూతిని బలపపురాతిచే మూసి రెండంగుళములు దళప్రమాణము చీలమన్ను లేపనముజేసియెండించి దేవీశాస్త్రముయొక్క సూత్రస్థానమునజెప్పంబడిన వాలుకాయంత్రములో నునిచి దానిపై నిసుకబోసి ఒకకుండను దానిపైబోర్లించి ఆ రెండుకుండల మూతుల బంధించి చీలమన్ను లేపనముజేసి యెండించి కడుజాగరూకతతో పొయిమీద నునిచి మృదుతీక్ష్ణ గాఢాగ్నులచే క్రమముగ 12 ఝాములుపాకముజేసి చల్లారినపిదప యందలి గాజుకుప్పెను దీసికొని తామ్రభస్మముతోడఖల్వమున మర్దించి అందుమిరియములచూర్ణము $\frac{1}{2}$ పలము శుద్ధిజేసిన వసనాభిచూర్ణముఅర్ధకర్ష ప్రమాణము కలిపి ఒకభరణియందునిచికొనవలయును. ఇటులరసమునకు సమముగ మిరియముల చూర్ణము $\frac{1}{2}$ కర్షము శుద్ధిజేసిన వసనాభిని కలుపుటచే నిర్దుష్టంబై శ్రేష్ఠంబుగనుండు మహాదగ్నికుమారమును నీరసము తమలపాకుతోడ సేవింపబడిన పాచనము అగ్నిదీపనము రుచి గుణాదిక్యము అనువానిని గలుగంజేయునని అగ్నిమాంద్యము కఫవాతజనితక్షయరోగములు శూల శ్వాసము కాసము కఫము వాతరోగములు పాండువు శోష ఎనుబదివాతములు శ్లేష్మరోగములు కంఠరోగము ఆమయుక్త గ్రహణి మొదలగు సర్వరోగముల హరింపజేయుటవలన తత్కాలమునందేవైద్యులకు యశస్సును గలుగంజేయుననియు పిప్పలచూర్ణము పంచదార నెయ్యి అనువానితో సేవింపబడుటవలన వాతమేముఖ్యముగగలరోగముల వాతసంబంధమువలన జనించిన రోగముల హరింపజేయుననియు మఱియు అనుపానవిశేషమువలన సకలరోగముల హరింపంజేయుననియు నందినాధీయమను గ్రంథమునజెప్పంబడియున్నయది. ఈరససేవనకాలముల సంతాపముజనించిన శీతోదకస్నానము పచ్చకర్పూరముతోగూడి

శీతకరముగ నుండు చందనలేపము యొకింత వాతసేవన నూతనమైన పెలుగు లేం కాయనీరె మధురద్రవ్యములు శీతకరద్రవ్యములు ఇతర శీతలద్రవ్యము|అనువానిని సేవించుట హితకరంబు ఇవియు మహదగ్నికుమార మనంబడును. ఇది సకలరసముల లో కడుశ్రేష్టంబు దీనియందు మంచి శాల్యన్నమును మంచి ఉదకమును మంచి భక్ష్యములను పథ్యముగ గ్రహింపవలయును.

## మండూర గుణము.

శ్లో॥ [మాధవనిదానే] మండూరకఫవాతఘ్నం శోపపాండుక్షయా పహమ్॥

తా. మండూరమును తేనె పిప్పలితో సేవించిన శ్లేష్మము వాతము శోఫ పాండువు క్షయరోగము హరించును.

## క్షయాదులకు జీర్ణమండూరచూర్ణము.

శ్లో॥ [అశ్వినీకల్పే] జీర్ణమండూరచూర్ణం పశుసలిలపరీభ్రంగరా
జస్వవాసా । మత్స్యాక్షీమేఘ నాథేక్షురకులిశలతా బ్రహ్మ
మూర్వామృతానామ్ । వర్షాభూశిగ్రునీలీహపుషబహుళదళా
శేఫకన్యార్ద్రకానామ్ । భృష్టంశ్రేష్ఠంరసేనత్రికటువరనిశాదా
రుదార్వగ్నివేల్లైః । ఏభిస్తుల్యంసమాంశం దదిమధుపయసా
కోష్ణతోమార్ద్రసీరైః । ప్రాతఃత్రీత్యాని హన్యాత్క్షయకసన
శుభశ్వాస పాండ్వగ్నిమాంద్యాక్॥

తా. పాతచిట్టెము నెట్టగ కాల్చి గోమూత్రములో యేడుమారులు చల్లార్చిన నది శుద్ధియగును. పిదప దానిని దంపు చూర్ణముజేసిగుంటగలగర జిల్లేడాకులు అడ్డసర పాకు పొన్నగంటియాకు చిట్టియాకు నీరుగొలిమడి నల్లేరు మండూక బ్రహ్మీనాగమ ట్టలు తిప్పతీగె గలిజేరు మునగచెక్క నీలియాకు బోడతరము సంబరేణు వావిలి కల బంద అల్లము దుష్టుపాకు పసుపు అను వానిరసములతో ప్రతిదానిచే ప్రత్యేక ప్రత్యే కముగ రుబ్బి ప్రతిదానిచేనై దేసిపుటంబుల చొప్పున నూరుపుటంబులిడవలయును. ఇటుల నూఱుపుటంబు లిడిన యది శుద్ధంబగును. పిదప శొంఠి పిప్పలిమిరియాలుకరక తాండ్ర ఉసిరికలు పసపు మ్రానిపసపు దేవదారు చిత్రమూలమువాయువిడంగములు అనువానిని సమభాగములుగ చూర్ణముజేసి దాని సమముగ పైమండూరముగలిపిప్రతి

దినము పదిచిన్నములయెత్తును పెఱుగు పాలు కోష్టుకల్కముఅల్ల పురసము అనువాని లో దేనితోనేని ప్రాతఃకాలమున సేవింపుచుండిన క్షయరోగములు కాసము, శోఫ శ్వాసలు పాండువు అగ్ని మాంద్యము హరించును. (ఈ మండూరముక్షయపాండు శోఫల హరింపంజేయుటయందు కడుప్రసిద్ధి జెందినది.)

## సర్వక్షయములకు కాంతవల్లభరసము.

శ్లో॥ [నిత్యనాథీయే] కాంతంషోడశభాగంచ సతుర్దశమయోరజః। కిట్టంద్వాదశంచైవ దశభాగంతు టంకణమ్ । మనశ్శిలాష్ట భాగంచ షడ్భాగంచశిలాజతు । సర్వేణచసమంసూతంగంధ కంచాపితత్సమమ్ । అర్ద్రిమూషోదరేన్యస్యవాలుకాయంత్ర కేక్షిపేత్ । పాచయేత్సప్తరాత్రంతు సంగ్రాహ్యంసూక్ష్మ చూర్ణితమ్ । సేవితంమధునాయుక్తంనిష్కార్ధేనసమన్వితమ్। పాండురోగక్షయంగుల్మ గ్రహణీరోగనాశనమ్ । కాసంశ్వా సంజ్వరంఛర్దిప్లీహోదరమరోచకమ్ । మందాగ్నికుష్ఠరోగం చ మూలరోగం భగందరమ్ । వాతశూలహరంవృష్యమత్యం త మతిదీపనమ్ । తుష్టిపుష్టికరం కాంతివర్ధనం బలవర్ధనమ్ । కాంతవల్లభనామ్నాయం విష్ణునానిర్మితంపురా । సర్వపాండు క్షయంచైవలోకస్యారోగ్యకారకమ్॥

తా. కాంతభస్మము 15 భాగములు ఉక్కురాపొడి 14 భాగములు * మండూరము 12 భాగములు శుద్ధిజేసిన వెలిగారము 10 భాగములు శుద్ధిజేసిన మణిశిల8 భాగములు శుద్ధిజేసిన కర్పూరశిలాజిత్తు6భాగములు శుద్ధిజేసిన పాదరసము 66 భాగములు శుద్ధిజేసిన గంధకము 66 భాగములు ఇటుల వీనినెల్ల ఖల్వమునయునిచి నిమ్మపండ్లరసములో బాగుగ మర్దించి † అర్ద్రిమూషలోగాని గాజుకుప్పెలోగానియుని చి వాలుకాయంత్రమున యేడుదినములువండి స్వాంగశీతలమున ఖల్వమున నునిచి మర్దించి చూర్ణముజేసి యందర్ధనిష్కప్రమాణమునుప్రత్యహము ప్రాతస్సాయంకాసముల తేనెలోసేవించుచుండిన పాండువు క్షయరోగము గుల్మముగ్రహణిరోగముకాస శ్వాసలు జ్వరము వాంతులు ప్లీహోదరముఅరుచిఅగ్నిమాంద్యము కుష్ఠువుమూలవ్యాధిభగందరము వాత శూలహరించుటయేగాక కడువీర్యవృద్ధిఅగ్నిదీపనమునస్సంతో

---

* మండూర మన—ప్రాతచిట్టెము.

† అర్ద్రిమూష యన— ఆవము (నూళి)లో నుంచని మూస.

షము శరీరపుష్టి కాంతి బలము గలుగును. ఇది విష్ణుదేవుచే నిర్మింపబడిన కాంతవల్లభరస మనబడును. మఱియునది సర్వపాండువుల క్షయముల హరింపజేసి లోకమున కారోగ్యము గలుగంజేయుచుండును.

## క్షయరోగములకు లోకనాథరసము.

శ్లో॥ [పూజ్యపాదీయే] వరాటతుల్యమండూరంతదర్ధంతీక్ష్ణలోహకమ్ । తత్పాదాంశం మృతంసూతం సూతద్విగుణగంధకమ్ । ఖల్వోదరేవినిక్షిప్యమర్దయేద్దివసత్రయమ్ । వర్షాభూమూలసారేణ వజ్రవల్లీరసేనచ । వాసాసాతలగేనాపిచిత్రమూలేన మర్దయేత్ । గోళకం చాతపే శోష్యందినాంతంతువినిక్షిపేత్ । శరావేణచమృద్వగ్నౌకుక్కుటీపుటవద్భవేత్ । సూక్ష్మచూర్ణంతతఃకృత్వాతత్సమంమారిచం రజ । భావనానంతరంద్రవ్యంనాగవల్లీరసార్ద్రకమ్।భృంగరాజంచనిర్గుండీముండీశిగ్రురసస్తథా । త్రిఫలారసభావేనఛాయాశుష్కంతుకారయేత్ । నిష్కార్ధంమధునాలేహ్యంయామేయామేచ భక్షయేత్ । క్షయంక్షయకృశంవ్యాధీన్ వాతపిత్తకఫోద్భవాన్ । కాసశ్వాస ప్రతిశ్యాయ శోభపాండు గదాదికాన్ । హాలీమకం చాస్థిగతం వినిహంతిచసత్వరమ్। దీపనం వీర్యవృద్ధిం చకారయేన్నాత్రసంశయః । లోకనాథరసోనామ శంభునాపరికీర్తితః ॥

తా. గవ్వలభస్మము 1 భాగము మండూరము 1 భాగము లోహభస్మము ½ భాగమురసభస్మములేక శుద్ధిజేసినరసము 2 భాగములు శుద్ధిజేసినగంధకము 1 భాగము ఇటుల వీనినెల్ల ఖల్వమునను౦చి గలిజేరువేళ్లు నల్లేరు అడ్డసరము సంబరేణు చిత్రమూలము అనువానిరసములచే 3 దినములు బాగుగమర్దించి పెనగగింజలంతేసి మాత్రలు జేసిఒకదినము ఎండించి మూకుడులోనునిచి దానిపైనొకమూకుడుమూసి బాగుగాచీలమన్ను లేపనముజేసి కుక్కుట పుటంబిడవలయును. లేక ఒకఝామువరకుపొయిమీద నైనా వండవలయును. పిదప నామాత్రల సాంగశీతలమునదీసి చూర్ణముజేసి దానికి సమముగ మిరియములచూర్ణముగలిపి తమలపాకు అల్లము గుంటగలగరాకు వావిలి బోడతరము మునగచెక్క కరక తాండ్ర ఉసిరికెలు అనువానిరసములతో ప్రత్యేక ప్రత్యేకముగ భావనజేసి అర్ధనిష్కప్రమాణము మాత్రలుజేసి నీడనెండించి తేనెతో ప్రతిఝామున సేవింపుచుండినక్షయరోగము క్షయమువలన జనించినశరీరకృశత్వము

వాతపిత్త శ్లేష్మమువలన జనించిన కాసశ్వాసలు పీనసము శోఫపాండువు మొదలగు రోగముల హలీమక అస్థిగతజ్వర అగ్నిమాంద్యరోగముల నిస్సంశయముగ హరింపం జేసి వీర్యవృద్ధిని గలుగంజేయును. ఇది శివునిచే జెప్పంబడిన లోకనాథరస మనం బడును) (పైజెప్పిన యౌషధముల నన్నింటిని సర్వక్షయరోగములం దుపయోగింప వలయును. తాళకసిందూరము నొసంగునెడ వానియనుపానముల నెఱింగి ప్రయోగింపవలయును.)

## క్షయరోగములయందు పథ్యము.

శ్లో॥ పురాణశాల్యోదన సముద్గ యూషాఘృతాన్యజాతేవాస్తుకమేషు
నాజా । కుశ్మాండ శిగ్రూ లఘురుచ్యభోజ్య క్షయేషు
పథ్యం సముదాహరంతి॥

తా. ప్రాతరాజనపు బియ్యపువంటకము పెసరకట్టు మేకనెయ్యి మేకపాలు చక్రవర్తకపుకూర చిర్రికూర ముదురుగుమ్మిడికాయ మునగకూరలఘువైరుచికరముగ నుండు ద్రవ్యములు క్షయరోగులకు పథ్యకరంబులు.

శ్లో॥ [గ్రంథాంతరే] కుళుత్థయూషోనిలహాశర్కరాశ్మరిభేదనః ।
తూనిప్రతూనినిరసోగుల్మ మేహక్షయాపహః ॥

తా. ఉలవకట్టు వాతరోగము శర్కరాశ్మరి తూని ప్రతూని గుల్మరోగము మేహరోగము క్షయరోగము గలవారలకు పథ్యకరంబు.

## క్షయరోగములయం దపథ్యములు

శ్లో॥ వర్జయేల్లవణం హింగు గవాంతక్రంసదాపయేత్ । క్షీర
మాజ్య దధిక్వాథ పథ్యవర్గః క్షయేహితః ॥

**తా. లవణము** ఇంగువ ఆవుచల్ల (ఆవుమజ్జిగ) పాలు నెయ్యి పెరుగు వగ రుగల **ద్రవ్యములు** క్షయరోగుల కపథ్యంబులు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
క్షయదోషనిదాన తత్సాధ్యాసాధ్య చికిత్సాను
పాన పథ్యాపథ్య లక్షణయుక్తం
చతుర్థ ప్రకరణమ్.

శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

## — పం చ మ ప్ర క ర ణ ము. —

శ్లో॥ నందీశశేషశీతాంశు సింహకర్పూరసారసైః ।
చందనేన చతుల్యాంగం నీలకంఠమహంభజే ॥

అవతరణిక. ఇపుడు గ్రంధకర్త విఘ్నబాహుళ్యశంకగలవాడైతనచేజేయం బడు నీగ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తి జెందుటకై తనకిష్టదేవతయగు ఈశ్వర నమస్కారాత్మక మంగళమును " నందీ శేషశీతాంశు " అనుశ్లోకముచే జేయు చున్నాడు.

తాత్పర్యము. నందీశ్వరుడు ఆదిశేషుడు చంద్రుడు సింహము కర్పూరము సారసపక్షి చందనము అనువానితో తుల్యశరీరముగల నీలకంఠుని నేనుభజించెదను.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమాబసవాహ్వయః ।
వక్ష్యామివృష రాజీయ మహంవైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు అని పేర్కొనబడిన నేనువైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథమున నైదవప్రకరణమును వచింపుచున్నాడను.

### పాండురోగ నిదానాదులు.

శ్లో॥ [ఆయుర్వేదే] పాండురోగాఃస్మృతాఃపంచవాతపిత్తకఫైస్త్రయః । చతుర్థస్సన్నిపాతేనపంచమోభక్షణాన్మృదః । వ్యాయామామ్లలవణంచామ్లమతితీక్ష్ణంచమృత్సురా । సేవనాచ్చదివాస్వాపాజ్జాయతేపాండురస్త్వచి । అపక్వంయకృత్రవిట్ప్రీతం

మృత్తికాభక్షణాధికమ్ । నిష్ఠీవనం త్వచిస్ఫోట విజ్ఞేయం పూర్వలక్షణమ్ ॥

తా. పాండురోగములు వాతపిత్త శ్లేష్మ సన్నిపాతమ్ము త్పాండువులనఐదు విధంబులు మిక్కుటముగ సంచారాదులు సేయుటవలన ఉప్పు పులుసుకడుతీక్ష్ణద్రవ్యములు మృత్తిక కల్లు అనువానిని మిక్కుటముగ సేవించుటవలన పగటినిద్రవల రక్తము దుష్టంబై చర్మము పాండురవర్ణమగును. అందు భుజించిన యన్నముజీర్ణమ గాక విరేచనంబగుట మలమూత్రములు పచ్చగవెడలుట అధికముగ మన్నుదినుట యందిచ్ఛగలుగుట కొరి ఉమియుట శరీరముయెండి చర్మముపూడుట లేక శరీరమ గాదరైయుండుట ఈలక్షణములు ముందుగలుగ బొయ్యేడి పాండురోగమునకు పూర్వరూపంబులు.

వాతపాండురోగ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] త్వఙ్మూత్రనయనాదీనాం రౌక్ష్యంకృష్ణారుణాభతా । వాతపాండ్వామయేకంపతోదానాహభ్రమాదయః

తా. చర్మము మూత్రము నేత్రమును మొదలగునవిరూక్షముగ నేని నల్లగ నేని ఎఱ్ఱగ నేని నుండుట వణుకు సూదులచే బొడుచునటుల వేదన కడుపుబ్బరము భ్రమ మొదలగునవి గలుగుట ఈలక్షణములుగలది వాతపాండువని తెలియవలయును.

పిత్తపాండురోగ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] పీతమూత్రశకృన్నేత్రో దాహతృష్ణాజ్వరాన్వితః । భిన్నవిట్కోఽతిపీతాభః పిత్తపాండ్వామయీనరః ।

తా. మూత్రము మలము నేత్రములు పచ్చగనుండుట దాహము దప్పి జ్వరముగలుగుట అధికముగ మలమువెడలుట శరీరము కడుపచ్చగనుండుట ఈలక్షణములు గలది పిత్తపాండువని తెలియవలయును.

శ్లేష్మపాండురోగ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] కఫప్రసేకశ్వయథు తంద్రాలస్యాతి గౌరవైః । పాండురోగీకఫాచ్ఛుక్లై స్త్వఙ్మూత్రనయనాననైః ॥

తా. తెమడ వెడలుట వాపు తంద్ర ఆలస్యముగలుగుట శరీరము కడుబలువుగ నుండుట చర్మము మూత్రము నేత్రములు తెల్లగనుండుట ఈలక్షణములుగలది శ్లేష్మ పాండువని తెలియవలయును.

## సన్నిపాత పాండురోగ లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] జ్వరారోచకహృల్లాసతృష్ణాఛర్దిక్లమాన్వితః ।
పాండురోగీ త్రిభిర్దోషైః త్యాజ్యః క్షీణో హతేంద్రియః॥

తా. జ్వరము అరుచి ఓకర దప్పి వాంతి బడలికగలుగుట పైజెప్పబడినవాత పిత్తశ్లేష్మ పాండురోగ లక్షణంబులన్నియును గలిగియుండుట శరీరము క్షయించుట ఇంద్రియములు స్వల్పవిషయగ్రాహకశక్తివిహీనంబులుగనుండుట ఈలక్షణములుగలది సన్నిపాతపాండువని తెలియవలయును. ఇదిగల రోగికి చికిత్సంజేయంజనదు. ఐనను చక్షురాదింద్రియములకు స్వల్పవిషయగ్రాహశక్తి గలిగియుండిన చికిత్సంజేయ వలయు.

## మృత్పాండురోగ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] మృత్తికాదనశీలస్య పాండురోగస్సుదు
స్సహః । జాయతే క్రిమికుష్ఠంచ హ్యతిసారస్సకృత్కఫః ।
శూనాక్షీ కూటగండ భ్రూశ్శూనహస్తాది మేహనః । అతి
శ్వేతోతిదగ్ధాంగశ్ఛర్దిమూర్ఛాతృషాన్వితః॥

తా. మిక్కుటముగ మన్నుభుజించుటవలన పాండురోగముజనించును. అందు పురుగులు కుష్ఠువు అతిసారముగలుగుట ఒకానొకపుడు తెమడవెడలుట కనురెప్పలు చెక్కిళ్ళు కనుబొమలు హస్తములు తొడలు పాదములు నాభి మేహనము ఉబ్బియుండుట శరీరము తెలుపుబారియుండుట శరీరము మండుట వాంతులు మూర్ఛ దప్పిగలుగుట ఈలక్షణములుగలది మృత్పాండువని తెలియవలయును. ఇది అసాధ్యము

## ప్రకారాంతర పాండురోగ లక్షణము

శ్లో॥ [నిత్యనాథీయే] నయనధవళకాంతిస్స్వేదనం జాడ్యరూపం
శ్వయథువమనమాంద్యంచాంగశోషాతిసారమ్ ।
అరుచిజఘనజాడ్యంశ్లేష్మనిద్రాతిపిత్తమ్ ।
శ్రమభ్రమణవిదాహంపీడశైత్యానిపాండౌ॥

తా. నేత్రములు తెల్లగనుండుట చెమట శరీరజాడ్యము వాపుగలుగుటవమన మగుట శరీరమువాతపూరితముగనుండుట శరీరముశోషించుట అతిసారము అరుచి గలుగుట పిలుదులయందుజాడ్యముగలుగుట దగ్గు నిదుర కడుశైత్యము ఆలసటగలుగుట శరీరముదిరుగుట కడుదాహముగలుగుట ఈ 16 లక్షణములుగలది పాండురోగమ తెలియవలయును.

శ్లో॥ [సిద్ధరసార్ణవే]నయనధవళకాంతిస్స్వేదనంజాడ్యరూపమ్ ।
పవనపదకరాగ్నిత్వంగశోఫస్తథైవ ।
అరుచిరనలమాంద్యం శ్లేష్మనిద్రాపయుక్తిః ।
భ్రమణమతివిదాహోద్వాదశై తానిపాండౌ ॥

తా నేత్రములుతెల్లగనుండుట చెమట శరీరజాడ్యముగలుగుట శరీరమువా పూరితముగనుండుట కాళ్ళుచేతులుమండుట శరీరమువాచుటఅరుచి అగ్నిమాంద్యమ దగ్గు నిద్ర భ్రమగలుగుట శరీరమధికముగనుండుట ఈ 12 లక్షణములు గలదిపాండ రోగమని తెలియవలయును.

శ్లో॥ [గ్రంథాంతరే] వివర్ణతా శరీరస్య శ్వయథుః కార్శ్య మేవ చ । సత్వహాని స్తథాలస్యం పాండురోగస్యలక్షణమ్ ॥

తా. శరీరము వివర్ణముగనుండుట శరీరమువాచుట శరీరముకృశించుటసత్వము లేకుండుటఆలస్యముగలుగుట ఈలక్షణములుగలదిపాండురోగమని తెలియవలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] నిస్సారశ్శిథిలేంద్రియోల్పవచనం శూనాక్షికూట స్తథా । శ్వాసఃకర్ణరవోగ్నిసాదనయుతోహ్యక్ష్యోస్రపమేదస్రవః । కాసోదృష్టివిహీనతానిశితనోకార్శ్యంచనిష్ఠీవనమ్ । ధాతూనాం శిథిలత్వ మంగగురుతా పీడాన్వితః పాండురః ॥

తా. శరీరము నిస్సత్తువగనుండుట ఇంద్రియములు క్షయించుట మాటలాడుటకు శక్తిలేకుండుట కనురెప్పలు ఉబ్బుట శ్వాసముగలుగుట చెవిలో గింగురింగుమనుట అగ్నిమాంద్యముగలుగుట నేత్రములనీరు పుసిగారుట దగ్గుగలుగుటరాత్రులయందు నేత్రములకు దృష్టిలేకుండుట శరీరము కృశించుట తెలుచుగఉమియుటస్తథా

తువులు శిథిలంబులగుట శరీరము వాచుట శరీరముపసపుబారియుండుట ఈ లక్షణములుగలది పాండురోగమని తెలియవలయును.

## పూర్వోక్త పంచపాండురోగ మారకోపద్రవములు.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః]తంద్రాదాహారుచిఃఛర్ది మూర్ఛాధ్మానాతిసారవాన్ । పాండుదంతే క్షణనఖః పాండుసంఘాతదర్శనః
ఏభిశ్చలక్షణైర్యుక్తం వర్జయేత్పాండురోగిణమ్ ॥

తా. తంద్ర దాహము అరుచి వాంతులు మూర్ఛ కడుపుబ్బరముఅతిసారము గలుగుట దంతములచిగుళ్లు నేత్రములు గోళ్ళు పాండురవర్ణముగనుండుట సర్వవస్తువులు పాండురవర్ణముగ నగుపడును ఈ లక్షణములు పైజెప్పిన పంచవిధ పాండురోగములలో దేనియందు గలిగియుండినను అపాండురోగినివర్జింపవలయును.

శ్లో॥ [చింతామణౌ]పాండుదంతనఖోయస్తు పాండునేత్రశ్చయో భవేత్ । పాండుసంఘాతదర్శీచ పాండురోగీవినశ్యతి ॥

తా. దంతముల చిగుళ్ళు గోళ్ళు నేత్రములు అనునవి రక్తహీనంబులై పాండురవర్ణముగనుండినను లేక సర్వవస్తువులు పాండువర్ణముగ గనుపించినను ఆపాండురోగి వైవస్వతనిలయంబున కేగునని తెలియవలయును.

శ్లో॥ [పూజ్యపాదీయే] పాండురోగేశ్వ యథుమాన్ పీతాక్షీనఖవాంస్తథా । తంద్రాదాహారుచిశ్ఛర్దిః పాండురోగీవినశ్యతి॥

తా. శరీరమువాచియుండుట నేత్రములు గోళ్ళు పసపుబారియుండుటతంద్రకలుగుచుగదాహము అరుచిగలుగుట వమనంబగుట ఈలక్షణములుగల పాండురోగి నమధర్మరాజును గాంచునని తెలియవలయును.

శ్లో॥ నాసికాస్రుతరక్తశ్చ మేహపాండ్వామయీక్షయీ ।
సద్యోవిముంచతిప్రాణాన్ సత్యమేవనసంశయః॥

తా. మేహ పాండు క్షయరోగములయందు ముక్కుబెదరి రక్తముగారుచుండిన రోగి నిస్సంశయముగ తత్క్షణమున ప్రాణంబుల విడుచును.

శ్లో॥ [రసరత్నాకరే] నిస్సారతాతినిష్ఠీవశ్రమశోషానాక్షీకూటతాః ।
ధాతూనాంశిథిలత్వంస్యాదసాధ్యంపాండులక్షణమ్॥

దుర్గంధం మదనంపిత్తం చతుర్వింశతి పైత్తకమ్ ।
పూర్వాచార్యై రిదంప్రోక్తంశాస్త్ర సూర్గ విచారణాత్ ॥

తా. ఆవర్ణపైత్యము వివర్ణపైత్యముసూర్యవర్ణపైత్యము కామిలాపైత్యముఆమ్ల పైత్యము రక్తపైత్యము స్వేదపైత్యము ఉన్మాదపైత్యము పాండ్రకపైత్యమువిసర్పిపైత్యము కరపాదపైత్యము శీతపైత్యము మూర్ఛాపైత్యము మధురపైత్యముకుసుమపైత్యము క్రోధపైత్యము భ్రంశపైత్యము శిరఃపైత్యము క్షుధాపైత్యము తృషాపైత్యము దుర్భావపైత్యము చర్మపైత్యము దురంధపైత్యము మదనపైత్యము అన పైత్యరోగములు 24 విధంబులని వైద్యశాస్త్రానుసారముగ పూర్వాచార్యులు వచించిరి,

## ఆవర్ణపైత్య లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] స్వేదఃకాంతి హరంతృష్ణా వ్యతి రుర్గంధ
దేహతా । దేహస్తుపీతస్సర్వాంగ మావర్ణంపైత్తమాదిశేత్ ॥

తా. చెమట దప్పిగలుగుట శరీరము కంపువేసుట శరీరము పచ్చగనుండుట సర్వాంగముల కంతులుగట్టుట ఈలక్షణములు గలిగి శరీరముకాంతి విహీనముగనుండుటయే ఆవర్ణపైత్యమని తెలియవలయు.

శ్లో॥ [చరకే] అంగదాహ శిరోదాహః పాదదాహశ్శిరోభ్రమః ।
మూర్ఛాభ్రమో మనస్తాపో హృదిఃక్లేశో ముహుర్భయమ్ ।
కంఠస్వేదశ్చ పాండుత్వం శోషఃక్లేశో ముహుర్భయమ్ ॥
సర్వేంద్రియేషు దౌర్బల్య మావర్ణపైత్యలక్షణమ్ ॥

తా. శరీరము శిరము పాదములుమండుట తలతిరుగుట మూర్ఛ భ్రమ మనస్తాపముగలుగుట ఱొమ్ములోమండుట కడుపునొప్పుట కుతికెక్రింద చెమటబట్టుట శరీరము పాండువర్ణముగనుండుట శోష క్లేశముగలుగుట పలుమారు భయపడుట శ్రోత్రత్వక్నేత్రజిహ్వాఘ్రాణేంద్రియ వాక్పాదపాణిపాయు గుహ్యేంద్రియములన దశేంద్రియములు దౌర్బల్యమునుజెందుట. (అనగా శ్రోత్రేంద్రియదౌర్బల్యమున చెవులలో ధ్వనులుగలుగుట చెవులుగడియలుపడుట చెవుడుగలుగుటత్వగింద్రియదౌర్బల్యమున చర్మముమండుట శరీరము అదురుట శరీరము ఉబ్బుట శరీరమున పొట్టువలేరాలుట శరీరము పగులుట శరీరమున దురదగలుగుట నేత్రేంద్రియదౌర్బల్యమున నేత్రములుమండుట నిదురబట్టకుండుట దృష్టిమధ్యమమగుట జిహ్వేంద్రియదౌర్బల్య

## వాతపాండువునకు రససిందూర భూషణము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతంస సిందూరంపలైకైకం వినుర్దయేత్। వాసారసేనయామైకం తలేకుర్యాచ్చచక్రికామ్। అపక్వాంకార యేన్మూషా ముష్ణతాం ద్వాదశాంగుళామ్। తన్మధ్యేగంధకంశుద్ధంతుః పేత్పలచతుష్టయమ్। పూర్వోక్తాం చక్రికాంవక్త్రేదత్వారుద్ధాపుటేలఘు। జీర్ణేగంధేసముద్ధృత్య చక్రికాంతాంవిచూర్ణయేత్ । చూర్ణాద్దశ గుణంయోజ్యం మృతలోహంచమర్దయేత్। లశునస్యదశాం శేనచణమాత్రా వటీకృతా । వాతపాండుహరస్సిద్ధోరసస్సిందూరభూషణః॥

తా. శుద్ధిచేసిన పాదరసము సిందూర వీటిని దినుసు కొక్కొకపలముచొప్పున ఖల్వమునునిచి అడ్డసరపురసముచే నొకఝామమర్దించి అఱచేతిలో బిళ్ళజేసి పన్నెండంగుళములపొడవుగల * ఆపక్వమూషను గ్రహించి దానిలోపల నాలుగుపలములు శుద్ధిజేసినగంధకము వైచి దానిపై యీబిళ్ళనునిచి మూషయొక్క మూతిని బలపపుబిళ్ళతోమూసి చీలమన్ను లేపనముజేసి మూసయందలిగంధకముజీర్ణంబగు వరకు లఘుపుటంబిడి యీబిళ్ళనుదీసి ఖల్వమునునిచి చూర్ణముజేసి దానికి పదింతలు లోహభస్మముగలిపి ఈ యౌషధమునకు 10. వ భాగము వెల్లుల్లిపాయల గలిపి మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుచేసి అనుపానవిశేషములతో సేవించిన వాతపాండువుహరించును. ఇది రససిందూరభూషణమనంబడును.

శ్లో॥ [అన్యశాస్త్రే] మండూరంచూర్ణితం శ్లక్ష్ణంగోమూత్రేష్టగుణే పచేత్ । త్ర్యూషణం త్రిఫలాముస్తంవిళంగంచవ్యచిత్రకమ్। దార్వీగ్రంధీర్దేవదారు తుల్యంసర్వంవి చూర్ణయేత్ ।చూర్ణం మండూరతుల్యంచ పాకకాలేవిమిశ్రయేత్ । భక్షయేత్కర్ష మాత్రంచ జీర్ణాంతే తక్రభోజనమ్ । పాండుశోఫహలీమంచ హృద్యరుస్తంభంచ కామిలామ్ । అర్శాంసి హంతిశీఘ్రంచ హంసమండూర కాహ్వయమ్।

---

* అపక్వమూషయన:—ఆర్ద్రమూష.

తా. † మండూరము దంచి మృదువుగ చూర్ణముజేసి దాని కెనిమిదింతలుగో మూత్రముబోసి పాకముజేయవలయును, పాకకాలంబున త్రికటుకములు త్రిఫలములు తుంగముస్తెలు వాయువిడంగములు చెవ్యము చిత్రమూలము మ్రానిపసపు దేవదారు అను వానిని సమభాగములుగదంచి చూర్ణముచేసి పైమండూరమునకు సమముగ వైచి బాగుగకలియబెట్టి పాకముజేసికర్ష ప్రమాణము మాత్రలుజేసి సేవింపవలయును. సేవించినయౌషధము జీర్ణంబైన పిదప మజ్జిగ అన్నమును భుజింపవలయునుఇటుల జేసిన పిత్తపాండుశోఫలు హలీమకము ఊరుస్తంభవాతము కామిలరోగముమూల వ్యాధి శీఘ్రముగ నశించును. ఇదియ హంసమండూరమనబడును.

## శ్లేష్మపాండువుకు మండూరవటకములు.

శ్లో॥ [మతాంతరే] నిశాదార్వీత్వచంచవ్యం గ్రంథికందేవదారుచ। వ్యోషంచనవకంచైత చ్చూర్ణ యేద్ద్విగుణాంతతః । మండూరం చాంజననిభం సర్వతోష్ట గుణేక్షిపేత్ । పృథగగ్నిపచ్య గోమూత్రేవటకీకరణక్షమే । ప్రక్షిప్యవటికాఃకుర్యాత్తాంఖాదేత్తక్రభోజనమ్ । ఏతామండూర వటికా అగదాః పాండు రోగినామ్। కుష్ఠాసృగ్రజకం శోఫామూరుస్తంభ మరోచకమ్ అర్శాంసికామిలాంమేహంప్లీహానంశమయంతిచ॥

తా. మండూరమును కాటుకవలె చూర్ణముజేసి యామండూరమునకు ఈ క్రిందజెప్పంబడు ద్రవ్యముల చూర్ణమునకును ఎనిమిదింతలు గోమూత్రము బోసిమాత్రలు చేయుటకు పక్వంబగువరకు పాకము జేసి అందు పసపు మ్రాని పసపు లవంగ చెక్క చెవ్యము కొసుగచెక్క దేవదారుచెక్క త్రికటుకములు అనువానినిసమ భాగములుగదంచి చూర్ణముచేసి పైమండూరమునకు ½ భాగము కలిపి రేగుబంటంత మాత్రలుచేసి సేవింపుచుండిన పాండువులు కుష్ఠువులు శోఫలు రజస్వాలలు ఊరుస్తంభవాతము అరుచి మూలరోగము కామిల మేహము ప్లీహారోగము హరించును. ఇవియ మండూరవటుకములనంబడును. సేవించిన యౌషధము జీర్ణంబైన పిదప మజ్జిగ యన్నమును భుజింపవలయును.

‡ మండూరమన—ప్రాత ఇనుపచిట్టెము.

## మృత్పాండువునకు స్వాయమగ్ని ముఖమండూరము.

శ్లో॥ [గ్రంథాంతరే] మండూరంద్వాదశపలం గోమూత్రేష్టగుణే పచేత్ । పంచకోలం దేవదారు ముస్తంవ్యోషంఫలత్రయమ్। విడంగంపలమాత్రంతు పాకాంతేచూర్ణితం క్షిపేత్ । పాయయేదక్షమాత్రంతు తక్రేణ సహబుద్ధిమాన్. । పాండుమందాగ్నిగ్రహణీ శోఫార్శాంసి హలీమకమ్ । ఊరుస్తంభంక్రిమిప్లీహాగళరోగంచ నాశయేత్ । అసాధ్యం శ్వయధుంహంతి పాండురోగం చిరోద్భవమ్ । స్వయమగ్ని ముఖంనామ మృత్పాండౌచ ప్రశస్తకమ్॥

తా. 96 పలముల గోమూత్రములో సూక్ష్మముగ చూర్ణముచేయబడిన 11 పలముల మండూరమునువైచి పాకముజేసి అందు * పంచకోలములు దేవదారు తుంగముస్తెలు త్రికటుకములు త్రిఫలములు వాయువిడంగములు అనువానియొక్క చూర్ణమును దినుసుకొక్కొక్క ఫలముచొప్పున పాకాంతమునవైచికలియబెట్టిగచ్చకాయలంతేసి మాత్రలుజేసి యంబొకదానిని మజ్జిగలో సేవింపుచుండిన మృత్పాండువు అగ్నిమాంద్యము గ్రహణీగోగము వాపు మూలవ్యాధి హలీమకము ఉరుస్తంభవాతము క్రిమిరోగమునశించును. ఇదియు స్వయమగ్నిముఖమండూరమనంబడును. ఇది మృత్పాండువులకు కడుప్రశస్తము.

## సన్నిపాత పాండువునకు సిద్ధమండూరము.

శ్లో॥ [సూత్రస్థానే] మండూరస్య పలాన్యష్టౌ గోమూత్రేష్ట గుణే పచేత్ । పునర్నవాత్రివృద్వ్యోషం విడంగందేవదారుకమ్। ద్వీనిశే పుష్కరంచహ్వా దంతీచవ్యం ఫలత్రికమ్ । కుటజస్య ఫలంతిక్తా పిప్పలీ మూలముస్తకమ్ । విషంచ ప్రతికర్షంతు చూర్ణ యిత్వావిమిశ్రయేత్ । మండూరస్యచపాకాంతేహ్య

---

* పంచకోలమన—పిపళ్ళు మోడి చెవ్యము చిత్రమూలము శొంఠి.

క్షమాత్రా వటీకృతా । పాండు * శోఫోదరానాహ శూలార్శః క్రిమిగుల్మనుత్ । ఇత్యేవం సిద్ధమండూర † సర్వపాండువినాశకృత్ ॥

తా. 64 పలముల గోమూత్రములో సూక్ష్మముగ చూర్ణముచేయబడిన 8 పలముల మండూరమును వైచి పాకము జేసి అంగుగతిజేరు శుద్ధిచేసిన తెగడ త్రికటుకములు వాయువిడంగములు దేవదారు పసపు మ్రానిపసపు పుష్కరమూలము చిత్రమూలము నేలదంతి చెవ్యములు త్రిఫలము కొడిసెవిత్తులు వేపుబీరవిత్తులు మోడి తుంగముస్తెలు అతివస అనువానియొక్క చూర్ణమును దినుసుకు కర్షప్రమాణము చొప్పున మండూర పాకకాలమునకలిపి గచ్చకాయలంతేసి మాత్రలుజేసియుందొక దానిని సేవించిన పాండువువాపులు ఉదరరోగములు కడుపుబ్బరము శూలలు మూలవ్యాధి క్రిమిరోగము గుల్మములుహరించును. ఇదియ సిద్ధమండూరమనంబడును. ఇది సర్వపాండువుల హరింపంజేయును. [పైజెప్పిన 5 విధపాండురోగభేదముల శాస్త్రోక్తముగనెఱింగి తగినయౌషధంబుల సేవించిన సర్వపాండువులు హరించును.]

## సర్వపాండ్వాదులకు చించాది కషాయము.

శ్లో॥ [అశ్వినీకల్పే] కాలలోహశకలేన వాథవాతన్మలేనసహ తింత్రిణీదళైః । క్వాథితాంబుసకలావినాశయే ద్వృద్ధపాండుగదశోఫకామిలాః॥

తా. చింతాకునుడంచి అందు ఇనుపతునుకలుగాని లేక చిట్టెచూర్ణముగాని వైచి కషాయముకాచి వడియగట్టి దానిలో పిప్పలిచూర్ణముకలిపి సేవించిన ముదిరిన పాండువులు వాపులు కామిలలు మొదలగునవి హరించును.

## సర్వపాండువులకు లఘుచించాది లేహ్యము.

శ్లో॥ [అశ్వినీకల్పే] చించాపత్రతులామర్థతులాం కృష్ణలోహశకలానామ్ । ద్విద్రోణేంబునివిపచేద్వసు భాగశ్రితేచగుడపలాన్యత్ర । ప్రక్షిప్యవం చవింశతిసూర్ధ్రకతకలానిషోడశపలానీ । వృశ్చికవరదకరసంప్రస్థంవిపచ్యసాంద్రతరంతత్ర । త్రికటుకజీ

* శోఫజ్వరానాహ, † సర్వరోగి

రకచూర్ణం చతుష్పలం తత్సమంచ మండూరమ్ । దత్వావ తార్యధాన్యేవిధాయ పక్షంయథానలం లీఢమ్ । వినిహంతి పాండు శోఫగ్రహణీ మేహప్లీహానాహాన్ । అయమశ్విభ్యాం దిష్టో హ్రస్వశ్చించాదిలేహ్యక స్సమ్యక్॥

తా. చింతాకు 100 పలములు ఇనుపతునకలు 50 పలములు ఇట్టుల వీనిని నొక భాండమునవైచి అందుఎనమండుము ఉదకముబోసి ఒకతూ-ను శేషించునటుల చిక్కగ కషాయముగాచి వడియగట్టి అందు బెల్లము 25 పలములు పైబొబ్బరతీసిన అల్లపుతునకలు 16 పలములు తెలుమణియాకురసము 1 కుంచెడు త్రిఫలకషాయము 1 కుంచెడువైచి లేహపక్వముగ కాచి యందు శొంఠి పిప్పలి మిరియాలు జీలకఱ్ఱ అను వానిని దినుసుకొక్కొకపలముచొప్పున చూర్ణముజేసివైచి అందు 4 పలములు సూక్ష్మముగ చూర్ణముచేయబడిన మండూరమునుకలిపి పాయిమీదనుండిదించిచల్లార్చి 15 దినములు ధాన్యరాశియందునిచి యందుండి దీసి అగ్నిబలానుగుణ్యముగ సేవింపుచుండిన ముదిరిన పాండువులు వాపులు గ్రహణీరోగములు ప్లీహరోగము కడుపుబ్బరము హరించును. ఇదియు అశ్వినీదేవతలచే జెప్పంబడిన లఘుచించాదిలేహ్యము. (ఇది పాండు శోఫల హరింపంజేయుటయందు కడుప్రసిద్ధి జెందినది.)

## పాండువులకు ప్రకారాంతర లఘుచించాదిలేహ్యము.

శ్లో॥ [అశ్వి కల్పే] పాదాంశై ర్లోహశకలై శ్చించాపత్రతులాం సహ। పచేజ్జలేష్టగుణితే తస్మిన్ పాదావశేషితే । పక్వేగుడ తులాం సమ్యక్ పార్ద (ప్రస్థార్ధ) కాన్వితమ్ । ఆతపే జీరకం వ్యోషం ప్రత్యేకం పలపంచకమ్ । తత్సమంచాపి మండూరం క్షౌద్రం ప్రస్థంచనిక్షిపేత్ । లఘుచింతాదిలేహోయంసర్వ పాండునిబర్హణః । ఆనాహమరుచిం శోఫకాసశ్వాసమహోదరమ్ । హలీమకంకామిలాంచ సర్వాంచైవ వ్యపోహతి॥

తా. చింతాకు 100 పలములు ఇనుపతునకలు 25 పలములు ఇటుల వీనిని నొకభాండములోవైచి యందెనిమిదింతలు ఉదకముబోసిచతుర్థాంశముగ కషాయము గాచి వడియకట్టి అందు 100 పలములు బెల్లము పైపొట్టుతీసిన అల్లపుతునకలు 24 పలములువైచి లేహ్యపక్వముగాకాచి అందుజీలకఱ్ఱ శొంఠి పిప్పలి మిరియాలు అను

వానిని దినుసుకొక్కటికి 5 పలములచొప్పున చూర్ణముజేసివైచి కలియబెట్టి అందు 20 పలములు శుద్ధమండూరమును కలిపి చల్లార్చి పిదప యందు కుంచెడు తేనెబోసి బాగుగ కలియబెట్టి 15 దినములు ధాన్యరాశియందునిచి ప్రతిదినము నాలుగుమాడల యెత్తు లేహ్యమును సేవింపుచుండిన సమస్త పాండువులు కడుపుబ్బరము అరుచి శోఫ కాసశ్వాసములు మహోదరము హాలీమకము కామిలలు హరించును. ఇదియలఘుచించాదిలేహ్యమనంబడును ఋషీయి విధి పాండువు వాపు కామిల హాలీమకము అను నీరోగముల బోకడచును.

## సర్వపాండువులకు మహాచింతాదిలేహ్యము.

శ్లో॥ [గ్రంథాంతరే] చింతాపత్ర తులార్ధమాయసరజో వహ్నిస్తథై వార్ద్రికమ్। తస్యార్ధం పృథగే తదర్ధముదితం దేవంచ పౌనర్నవమ్ । పాఠానాయక పుంఖధాన్యకుటజ ద్రాక్షాః పృథక్ ప్రస్థకాః । చవ్యగ్రంథి దశాంఘ్రియశ్చకుడపః క్వాథేతురాస్మిన్ గుడమ్॥ చాఙ్గేరీదళ మాతులుంగ రసయోః ప్రస్థం తథాపాచయేత్ । వేల్ల త్ర్యూషణ జీరకం త్రుటిశటీ త్వక్పత్రకం పాలికమ్ । మండూర ద్విపలాయస త్రిపలికే క్షౌద్రేణ యోజ్యంతథా । సేవ్యోయం చిరపాండు శోఫ శమన శ్చింతాది లేహోమహాన్॥

తా. చింతాకు 100 పలములు ఇనుపరాపొడి చిత్రమూలము ఇవిదినుసుకు 50 పలములు అల్లము దేవదారు గలిజేరు వేళ్లు చిరుబొద్ది వేళ్ళు ఇవిదినుసుకు 25 పలములు వెంపలి వేళ్ళు కొత్తిమెర్లు కొడిసెచెక్క ద్రాక్షపండు ఇవి దినుసుకు 16 పలములు చెవ్యము పిప్పలిమూలము ఇవి దినుసుకు 4 పలములు దశమూలములు దినుసు యొకటింటికి 4 పలములు ఇటుల వీనిని గ్రహించి వీనికన్నిటికి నాలుగింతలు (అనగా వైద్యసంప్రదాయ ప్రకారము ముప్పంటము) నీళ్ళుబోసి చతుర్థాంశముగ చిక్కగ కషాయముకాచి వడియగట్టి అందు 100 పలములు బెల్లము కలిపి వడబోసి అందు పులిచింతాకురసము కుంచెడుమాదీఫలరసము కుంచెడుబోసి బాగుగకలిపి లేహ్యపాకముగ వండి అందువాయువిడంగములు త్రికటుకములు జీలకఱ్ఱ ఏలకులు కచోరములు దాల్చినిచెక్క తాళిసెపత్రి అనువానియొక్క చూర్ణము దినుసుకొక్కొక పలముమండూరము 2 పలములు లోహభస్మము 3 పలములు లేహ్యపాకమునవైచి సాంగ శీతలమున

తేనెకలిపి సేవించిన ముదిరిన పాండువు శోఫలు హరించును ఇదియ మహాచించాది లేహ్యమనబడును.

పాండువులకు రక్షాకర్మాదులు.

శ్లో॥ [గ్రంథాంతరే] ద్వ్యంగులేధః కూర్పరతోదహేత్తామ్ర శలాకయా । చించాది లేహ్యాద్వితయం ప్రయోజ్యం పాండురోగిణాం॥

తా. పాండురోగముల మోచెయ్యికి రెండంగుళములకు దిగువ తామ్రశలాకతో రక్షలువేయుటయేగాక లోనికిచించాదిలేహ్యము నేనిమహాచించాదిలేహ్యము నేని నొసంగవలయును.

హలీమక వివరము

శ్లో॥ వాతపిత్తసముద్భూతః పాండురోగో హలీమకమ్ ॥

తా. వాతపిత్తములచే జనించిన పాండువు హలీమకమని జెప్పంబడును.

హలీమక లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] యదాతుపాండో ర్వర్ణ స్స్యాద్ధరిత శ్శ్యావ పీతకః । బలోత్సాహ క్షయ స్తంద్రా మందాగ్నిత్వం మృదు ర్జ్వరః । స్త్రీష్వహర్షోంగమర్దశ్చదాహతృష్ణారుచిర్భ్రమాః హలీమకంతదాతస్యవిద్యాదనిలపిత్తతః ॥

తా. పాండురోగ మధ్యమున శరీరము అనుపసపువర్ణము కపిలవర్ణము లేక పసపుపర్ణముగలదై బలము ఉత్సాహము అనునవినశించి తంద్ర అగ్నిమాంద్యము స్వల్పజ్వరము స్త్రీసంభోగమునం దిచ్ఛలేకుండుట ఒడలునొప్పి దాహము దప్పిఅన్న ద్వేషము భ్రమ అనునవి గలిగియుండిన వాతపిత్తములచే జనించిన హలీమకమని తెలియవలయును.

పాండువులకు త్రిఫలాయసచూర్ణము.

శ్లో॥ [లోహతంత్రే] త్రిఫలాద్వికరంజాగ్ని కుండలీ మార్కసంయుతమ్ । పాండురోగీపిబేల్లోహరజస్తక్రేణ మండలమ్ ॥

తా. కరక తాండ్ర ఉసిరికెలు క్రానుగచెక్క నేమలిచెక్క చిత్రమూలము నల్లవుప్పిచెక్క వీనిని సమభాగములుగ చూర్ణముచేసి యందు తగుమాత్రము లోహ భస్మముకలిపి మజ్జిగతో 1 మండలము సేవించిన పాండువు సోఫలు హరించును.

పాండువులకు సహాయసచూర్ణము.

శ్లో॥ [చింతామణౌ] వ్యోషాగ్నివేల్ల త్రిఫలాతుల్యాంభసితమాయసమ్ । సహాయ సమిదంచూర్ణం ప్రశస్తం పాండుశోభినామ్

తా. త్రికటుకములు చిత్రమూలము వాయువిడంగములు త్రిఫలములు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దానికి సమముగ లోహభస్మముకలిపి యందొక తులమును ప్రతిదినము మజ్జిగతో సేవింపుచుండిన పాండువు శోఫలు హరించును. (క్షయరోగప్రకరణమున జెప్పబడిన కొంతవల్లభరసము నేని లోకనాథరసము నేని సర్వపాండువులయందు బ్రయోగింపందగును.)

సర్వపాండువులకు పూర్ణచంద్రరసము.

శ్లో॥ [గ్రంథాంతరే]ద్వికర్షం శుద్ధసూతంచగంధకంచద్వికర్షకమ్। లోహభస్మ పలంచాభ్రం జారితంచ పలాశకమ్ । ద్వితోలం రజతంచైవ వంగభస్మ ద్వికర్షకమ్ ॥ సువర్ణం తోలకంచైవ తామ్రంకాంస్యంచతత్సమమ్ । జాతీపలంచేంద్రపుష్ప మేలాం భృంగంచజీరకమ్। కర్పూరంవనితాము స్తంకర్షంకర్షం పృథక్పృథక్ । సర్వంఖల్వతలేక్షిప్త్వాకన్యారసవిమర్దితమ్ । భావయిత్వావరీతోయై రుబుకానాం రసైస్తథా ఏరండపత్రైస్సంవేష్ట్య ధాన్యేరాత్రిం దివోషితమ్ । ఉద్ధృత్య మర్దయిత్వాతువటికాంవల్లసమ్మితామ్ । ఖాదేచ్ఛవటికామేకాం పర్ణఖండేనసంయుతామ్ । సర్వవ్యాధివినాశాయకాశీనాథేన నిర్మితః। పూర్ణచంద్రరసోనామ్నాసర్వరోగేషుయోజయేత్। బలోస రసాయనోవృష్యో వాజీకరణ ఉత్తమః । ఆయమష్ఠీలికాంహంతికాసశ్వాసమరోచకమ్ । ఆమశూలంకటీశూలం హృచ్ఛూలం పంక్తిశూలకమ్ । అగ్నిమాంద్యమజీర్ణంచ

గ్రహణీం చిరజాంపరామ్ । ఆమ్ల వాతం చామ్లపిత్తంభగం
ధర మపిద్రుతమ్ । కామిలాం పాండురోగంచ ప్రమేహం
వాతశోణితమ్। వాతః పరతరం శ్రేష్ఠో పద్య తేవాజికర్మణి ।
రసస్యాస్య ప్రసాదేన నరోభవతినిర్గదః । మేధాంచ లభతే
వాగ్మి తుష్టిపుష్టి సమన్వితః । మదనస్య సమాకాంతి ర్మద
నస్య సమంబలమ్ ॥ గీయతే మదనేనైవ మదనస్య సమం
వపుః । ప్రియాంచైవ రతిప్రాయాం పశ్యేచ్చ మదనాకుల
మ్ । స్త్రీణామపత్యానాందుర్బలానాంచ దేహినామ్ ।
క్షీణానా మల్పశుక్రాణాం వృద్ధానాం వాతరేతసామ్। ఓజ
స్తేజ స్కరశ్చాయంస్త్రీషుకామవివర్ధనః। అభ్యాసేననిహం
తి మృత్యుపలితం సర్వామయ ధ్వంసవః । వర్ధానాం మద
నోదయో దయకరః ప్రౌఢాగంనాసంగమే । నిత్యానంద
కరస్తథాతిసుఖదో భూపైస్సదాసేవ్యతే । దృష్టస్సిద్ధ ఫలో
రసాయన పరః శ్రీపూర్ణ చంద్రోరసః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము యివి దినుసుకు రెండుకర్షములు లోహభస్మము జారణము జేయబడిన అభ్రకభస్మము యిది దినుసుకొక్కొక పలము రజతభస్మము 2 తులములు వంగభస్మము 2 కర్షములు సువర్ణభస్మము తామ్రభస్మము కంచుభస్మముయివి దినుసుకొక్కొకతులము జాజికాయ లవంగములుయేలకులులవం గపుచెక్క జీలకఱ్ఱ పచ్చకర్పూరము వనితా తుంగముస్తెలు యివి దినుసు కొక్కొ కపలము యిటుల వేనినెల్ల ఖల్వమున నునిచి కలబందరసముతో మర్దించి పిదపపిల్లి పీచరము ఆముదపువేళ్ళు అనువానిరసములతో ప్రత్యేకప్రత్యేకముగ భావనజేసి ముద్దజేసి ఆముదపాకులతోచుట్టి ధాన్యరాశియందొక రేయుంబగలునిచిపిదపదానిని యందుండితీసి మరల మర్దించి వల్లప్రమాణము మాత్రలుజేసి యందొకదానిని తమల పాకులోనునిచి సేవించిన సర్వరోగములు హరించును. ఇదియదివోదాసునిచే నిర్మింప బడిన పూర్ణచంద్రరస మనంబడును. దీనిని సర్వరోగముల ప్రయోగింపందగును ఈ రసాయనము బలమును వీర్యవృద్ధిని మైధునశక్తిని గలుగంజేయుటయేగాక అర్ది లికావాతము కాసశ్వాసలు అరుచి ఆమశూల కటిశూల భ్రూమ్మనొప్పి పంక్తిశూ అగ్నిమాంద్యము అజీర్ణము చిరకాలముగనుండు గ్రహణీరోగము ఆమవాతము అమ్ల

పిత్తము భగందరము కామిల పాండువు ప్రమేహము వాతరక్తము అనువానిని కడు శీఘ్రముగ పోకడచును. * వాజీకరణమునకు దీనికన్న శ్రేష్ఠంబైన యౌషధం బెద్దియులేదు ఈరససేవనవల్ల నరుడు సర్వరోగ విముక్తుం డగుటయేగాక మేధవాక్పటుత్వము సంతోషము శరీరపుష్టి మన్మథునితో సమానమైన శరీరకాంతి బలముగలవాడుగా నగును. మఱియు వానికి స్త్రీలయం దత్యాసక్తియు వానియందు స్త్రీలకు కడు ఆసక్తియుగలుగును. దీనిని గొడ్రాలుగనుండు స్త్రీ సేవించిన సంతానంబును దుర్బలులుగనుండువారు సేవించిన బలంబును శరీరకృశత్వముఅల్పశుక్రవృద్ధాప్యము వాతదుష్టశుక్రము గలవారు సేవించిన ఓజస్సు తేజస్సును గలుగును. దీనిని స్త్రీలు సేవించిన వారికి కామోద్రేకము గలుగును మఱియు దీని సేవనవలన మరణము మినహా సర్వరోగములు హరించి వృద్ధులు కామోద్రేకముగలవారై మదించిన స్త్రీలను రతమున తృప్తిపరచెదరు. మఱియు నీరసమును రాజులుప్రత్యహము సేవింపుచుండిన వారికి కడుసౌఖ్యము వాటిల్లును. ఈరసము నిశ్చయముగ ఫలమును గలుగంజేయును.

## పాండుశోఫలకు శోఫాంకుశ రసము

శ్లో॥ [జాతుకర్ణనిఘంటు] తామ్రపత్రం త్రిభాగేన రసగంధేనలేపయేత్ । నింబద్రవేణ సంయోజ్య సూర్యతాపేవినిక్షిపేత్ । ఊర్ధ్వాధోగంధకందత్వాపాచ యేదతియత్నతః । మత్వా స్రక్షీ మర్దితంకృత్వా మృద్భాండే వాలుకేక్షిపేత్ । యామమాత్రంచ వహ్నిర్వం సాంగశీతలముద్ధరేత్ । గుంజామాత్రాంవటీంకృత్వా పృథయా గుడునంయుతామ్ । అర్ధ్రకస్వరసేనాపిశోఫపాండు విభేదనమ్ । శోఫాంకుశ రసో నామ్నాలోకానాం హితకారకః॥

తా. శుద్ధిజేసిన రాగిరేకులు3భాగములు శుద్ధిచేసినరసమును 3 భాగములుశుద్ధిజేసిన గంధకమునుగ్రహించి వేపాకురసములో బాగుగ మర్దించి లేపనముజేసి ఎండ

---

* వాజః శుక్రం తదస్యాస్తీతివాజీ అవాజీవాజీ క్రియతేపురుషోనేనేతివాజీకరణమ్॥ శ్లో॥ యేవనారీషు సామర్థ్యంవాజి వల్లభతేనరః । యేనవాప్యధికంవీర్య వాజీకరణమేవతత్॥

కొండించి మూకుటిలోనునిచి వానికి ఊర్ధ్వాధోభాగముల గంధకము నునిచి చీలమన్నుబూసి పాకముజేసి మరల పొన్నగంటియాకురసముతో మర్దించి మాత్రలుజేసి యందొక దానిని కరక్కాయచూర్ణము బెల్లము అనువానితోగాని అల్లపురసముతోగాని సేవించిన శోఫ పాండువులు హరించును. ఇదియ శోఫాంకుశరస మనంబడును.

## శోఫముద్గర రసము.

శ్లో॥ [గ్రంథాంతరే] రసగంధం మృతంతామ్ర పథ్యా వాలుక గుగ్గులు। సమమాజ్యేన సంయుక్త గుళికాః కారయేత్తతః। ఏకైకాం సేవయేద్వైద్య శ్శోఫపాండ్వప నుత్తయే। శీతలంచ జలందేయం తక్రంచామ్లం వివర్జయేత్। శోఫముద్గర నామ్నాయం పూజ్యపాదేన నిర్మితః॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధచేసిన గంధకము తామ్రభస్మము కరక్కాయలు కూతురుబుడమ శుద్ధిజేసినగుగ్గిలము వీనిని సమభాగములుగ గ్రహించి నేతితో బాగుగమర్దించి పదుచిన్నములయెత్తు మాత్రలుజేసి యందొకదానిని సేవించి పిదప శీతోదకమును పానముజేసిన శోఫ పాండువులు హరించును. ఇదియ పూజ్యపాదునిచే నిర్మింపబడిన శోఫ ముద్గరరస మనంబడును. దీనియందు మజ్జిగను పులుసును వర్జింపవలయును.

## శుష్కపాండు లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] పాండురోగే భవేత్కార్శ్యం శుష్కపాండుం వినిర్దిశేత్॥

తా. పాండురోగములలో శరీరము యెండియుండిన శుష్కపాండువని తెలియవలయును.

## శుష్కపాండువులకు కాలవిధ్వంసన రసము.

శ్లో॥ పారదం త్రిఫలందత్వా గంధకే త్రిపలాత్మకే। పచేద్యామంచచుల్ల్యాంతు చూర్ణయిత్వాతతఃపునః। గుడూచీ సారమాథాయ శుష్కంసప్త పలాత్మకమ్। మర్దయిత్వా తతస్సర్వం మధునా గుళికాకృతం వాసాపత్రై స్సమాబధ్య

మధుభాండే వినిక్షిపేత్ । ఏకైకాం భక్షయే న్నిత్యం శుష్క పాండు వినాశనః । కాలవిధ్వంసనోనామ హ్యసాధ్యం శ్వాయధుం జయేత్॥

తా. శుద్ధిజేసినరసము 3 భాగములు శుద్ధిజేసిన గంధకము 3 భాగములు యిటుల వీని నేకముజేసి మర్దించి మూకుల్లోనునిచి బాగుగ చీలమన్ను లేపనము జేసి 1 ఝాముపండి సాంగశీతలమున చూర్ణముచేసి యందు తిప్పసత్తు 7 భాగములు కలిపి తేనెతో మర్దించి మాత్రలుజేసి అడ్డసరపాకులోనునిచి బంధించి తేనెకుండయందునిచి యందొక్కొకమాత్రచొప్పున ప్రత్యహము ప్రాతస్సాయంకాలముల సేవింపుచుండిన శుష్కపాండువు అసాధ్యశోఫలు హరించును. ఇదియ కాలవిధ్వంసనరసమనంబడును.

## శుష్కపాండు క్షయలకు త్రైలోక్యసుందరరసము.

శ్లో॥ [ఆయుర్వేదే] భాగారసస్య చత్వారో గంధకస్యచ పంచ చ । ముసలీ త్రిఫలాచైవ త్రికటుర్మోచసంజ్ఞకః । గుళూచీ సత్వకంచైవ పంచపంచ పృథక్పృథక్ । అభ్రకస్య షడష్టౌచ లోహస్య పరికీర్తితాః । చూర్ణయిత్వాద తత్సర్వం భావయే రతియత్నతః । చతుష్షష్టికవారంచ త్రిఫలాక్వాథ తస్తథా । తదర్థం భృంగరాజస్యం తదర్థం శిగ్రుమూలతః। ద్రవేణ చిత్రమూలస్య తదర్థం గృహకన్యయా । ఆర్ద్రికస్య ద్రవేణాపి భావనా పరికీర్తితా । త్రైలోక్య సుందరో నామ్నా శుష్కపాండు క్షయాపహః। అష్టవల్లం ప్రదద్యాశ్చ దశద్వాదశరాభిషక్ ।మధునాసితయావాపి ఘృతేనకణయా పివా।ఏవంచించా సమాయుక్తం శోఫపాండు వినాశనమ్ । పథ్యంమృగాంక వద్దద్యా ద్భక్ష్యంసర్వం వివర్జయేత్॥

తా. శుద్ధిచేసిన పాదరసము 4 భాగములు శుద్ధిచేసిన గంధకము 5 భాగములు నేలతాటిగడ్డలు కరక తాండ్ర యుసిరికెలు శుంఠి పిప్పలి మిరియాలు బూరుగ తిప్పసత్తు అనువానిచూర్ణము దినుసు యొకటింటికి 5 భాగములు అభ్రకసిందూరము 6 భాగములు లోహభస్మము 8 భాగములు యిటులవీనినెల్ల ఖల్వమునవైచి చూర్ణముజేసి త్రిఫలకషాయముచే 64 భావనలు గుంటగలగ రాకుకషాయముచే 32 భావనలు మునగవేళ్ళరసముచే 16 భావనలు చిత్రమూలము కలబంద అల్లము అనువాని రసములచే

ప్రత్యేక ప్రత్యేకముగ ఎనిమిదేసి భావనలుజేసి పిదప 8 లేక 10 లేక 12 వల్లముల ప్రమాణము మాత్రలుజేసి యందొకదానిని తేనె పంచదార ఘృతము అనువానితో నేని చింతాకురసము పిప్పలితో నేని సేవింపుచుండిన శుష్క-పాండువు క్షయములు వాపులు హరించును. ఇదియ త్రైలోక్యసుందర రసమనంబడును దీనియందు సర్వ భక్ష్యముల వర్జించి మృగాంకరసములో జెప్పంబడిన పథ్యము నాచరింపవలయును.

శ్లో॥ [అన్యశాస్త్రే] గంధకంటంకణంసూతం త్రికటుత్రిఫలారస మమ్ । నవద్రవ్యాణిచైతాని లోహకిట్టంసమాంశకమ్। గో మూత్రేద్విగుణేపక్త్వా తత్సమంమిశ్రితంగుడమ్ । భక్షయే త్కోలమాత్రంతుశాల్యన్నంతక్రభోజనమ్। అనంతగుణమం డూరం క్షయపాండువినాశనమ్॥

తా. 9 భాగముల చిట్టెపుచూర్ణములో 36 భాగములు గోమూత్రము బోసి కాచి అందు శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన వెలిగారము త్రికటుక ములు త్రిఫలములు అనువాని చూర్ణము దినుసుకొక్కొకభాగముచొప్పున 9 భాగ ములు ప్రాతబెల్లము 18 భాగములు వైచి పాకముజేసి రేగుబండంత మాత్రలుజేసి సేవింపుచుండిన క్షయము పాండువు హరించును. ఇదియ అనంతగుణమండూరము. పథ్యముం దీనియందు మజ్జిగయన్నమును భుజింపవలయును.

## పాండురోగములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిధానే] భోజనంసాత్మ్యకంశాలియవగోధూమముా ద్గకమ్। జాంగలానిచమాంసానిగోపయోమాహింషంఘృతమ్। వృష్టాపటోలంవేత్రంచ పర్పటంశాకద్రాక్షకమ్ । దాడిమం చాపిఖర్జూరం ఫలాన్యామలకానిచ । పంచమూలంసింధు వారి పిబేద్వాతాదికేతథా। సర్వేషాంపాండురోగాణాం మా హిషంతు ఘృతంహితమ్॥

తా. శరీరప్రకృతి కనుగుణ్యముగనుండు భోజనము ప్రాతవడ్లు యవలు గోధు మలు పెసలు జాంగలమాంసము ఆవుపాలు బర్రె నెయ్యి అడ్డసరము పొట్లకాయ పెదురుగొమ్ము పర్పాటకము తోటకూర ద్రాక్షపండు దానిమ్మపండు ఖర్జూరపండు ఉసిరికపండు మారేడు నెల్లికూర గుమ్ముడుబద్ద దుందిలము కలిగొట్టు నదీజలము ఇవి వాతాదిసర్వపాండురోగములయందు పథ్యకరంబు.

## పాండురోగముల పథ్యాపథ్యములు.

శ్లో॥ గురుద్రవ్యవిదాహానితిలంముద్గాన్నమేవచ॥ గ్రామ్యాముపో తకించాపి మాంసానిపరివర్జయేత్ । సర్వేషాంపాండురోగాణాం మాహిషంతుఘృతంహితమ్॥ ఇతిసామాన్యతః ప్రోక్తం పాండురోగేచికిత్సకైః॥

తా. గురుద్రవ్యములు విదాహకరవస్తువులు నువ్వులు పులగము ఊరబచ్చకూర మాంసములు ఇవి పాండురోగములయందు అపథ్యకరంబులు. సర్వపాండురోగములబర్రెనెయ్యి హితకరము, ఇటుల పాండురోగముల చికిత్సకులచే పథ్యాపథ్యంబులు సామాన్యంబుగ జెప్పంబడియె.

## పాండురోగచికిత్సా విధానము.

శ్లో॥ పాండురోగేషుకుశల శ్శోఫోక్తంచక్రియాక్రమత్॥

తా. బుద్ధిమంతుడగు వైద్యుడు పాండురోగములయందు సదా శోఫచికిత్సనే చేయవలయును.

## శోఫనిదానము.

శ్లో॥ [అశ్వినీకల్పే] సితాన్యానిలోరుధిరపిత్తకఫాః ప్రదుష్టోబాహ్యాస్సిరాః ప్రకుపితాః సచతైర్నిరుద్ధః । త్వఙ్మాంససంశ్రయము లంవిత నోతిశోఫంసోత్సేధ సంహతమధోకిలశోఫమాహుః । కర్మవ్యాధికృశత్వతీక్ష్ణలవణక్షారోష్ణ శీతాశనాత్ శోకస్వప్న సురాతిమాసం రతితస్సంక్షోభణాద్వాహనాత్ । ఊర్ధ్వాధశ్చసిరాసు రోధకుపితఃస్థితాన్యానిలో మధ్యగః । సోత్సేధంపరిసర్పిణం వితనుతేశోఫంచసర్వాంగగమ్ । శ్వయథుర్యస్య పాదస్థో ఘనఃపాదానిపీడయేత్ । శోఫస్స్నిగ్ధని వైషమ్యం తంభిషక్పరివర్జయేత్॥

తా. సర్వకారణముచే దుష్టమైన వాతము రక్తపిత్తకఫములదోషయుక్తబులంగజేసి బైటసిరల జెందునటులంజేయును. పిదప వాతము పూర్వోక్తరక్తపిత్తకఫములచే నడ్డగింపబడినదై త్వఙ్మాంసములయందున్నతముగ కఠినముగనుండు వాపును గలుగంజేయును. అదియె శోఫరోగమనంబడును. మఱియు ప్రారబ్ధకర్మముచే

న వ్యాధిచేజనించెడి కృశత్వమువలన అత్యుష్ణములవణము క్షారముఉష్ణముశీతలము గల పదార్థసేవనవలన శోకము నిద్రి. కడుమద్యపానము కడుమాంసభక్షణము అను వానిసేవనవలన క్షోరికలవలన శరీరశ్రమమువలన అధికముగ భారమునుమోయుటవలనవాతము సిరలయొక్క ఊర్ధ్వాధఃప్రదేశములయందు పూర్వోక్తరక్తపిత్తకఫము చేనడ్డగింపబడుటంజేసి ప్రకోపించినవై శరీరమంతట వ్యాపించి ఉన్నతమైన శోఫను గలుగంజేయును. మఱియు ఎవనికి పాదములయందు వాపుదిగి గట్టియై వేదనను గలుగంజేయుచు మరల తొడలయందు వ్యాపించుచునుండెడినో అట్టివానిని వైద్యుడు వర్జింపవలయును.

శ్లో॥ [గ్రంథాంతరే] రక్తపిత్తకఫాన్వాయుర్దుష్టో దుష్టాన్ బహిస్సిరాః। నీత్వారుద్ధగతిస్తైర్హి కుర్యాత్ త్వఙ్మాంససంశ్రయమ్ । సోత్సేధంసంహతంశోఫం తమాహుర్నిచయాదతః ॥

తా. వాతము దుష్టంబై స్వకారణముచే దుష్టంబులైన రక్తపిత్తకఫములబాహ్యసిరల కెందునటులంజేసి వానిచే నడ్డగింపబడిన గతిగలదై తజ్మాంసాశ్రితముగనుండువాపును గలుగంజేయును. ఆవాపు పొడపుగ కఠినముగనుండును. మఱియు నిదిరక్తయుక్త త్రిదోషసంబంధముగలదిగ నుండుటంజేసి సన్నిపాతాత్మకమని జెప్పంబడును.

## శోఫవిభాగము.

శ్లో॥ సర్వంహేతువిశేషైస్తు రూపభేదాన్నవాత్మకత్ ।
దోషైఃపృథగ్ద్వయైస్సర్వైరభిఘాతాద్విషాదపి ॥

తా. ఆవాపు కారణభేదజనిత కార్యభేదములవలన వాతపిత్తశ్లేష్మవాతపిత్తశ్లేష్మ శ్లేష్మవాత సన్నిపాత అభిఘాతవిషసంబంధమువలన తొమ్మిదివిధంబులుగ నగును.

## శోఫ పూర్వరూపము.

శ్లో॥ తత్పూర్వరూపందవథుస్సిరాయామోంగగౌరవత్ ॥

తా. సంతాపముగలుగుట సిరలు యీడ్చినటుల నొప్పుట శరీరజడత్వము గలుగుట ఈలక్షణములవలన వాపుజనించునని తెలియవలయును.

## శోఫ కారణము.

శ్లో॥ శుద్ధ్యామయాభక్తకృశాబలానాంక్షారామ్ల తీక్ష్ణోష్ణగురూపసేవా । దధ్యామమృచ్ఛాకవిరోధి దుష్ట గరోపసృష్టాన్నని

షేవనంచ । అర్శ్యాంస్యచేష్టానచదేహశుద్ధిర్మర్మోక్త ఘాతో విషమాప్రసూతిః । మిథ్యోపచారః ప్రతికర్మణాంచ నిజస్య హేతుశ్శ్వయథోః ప్రదిష్టః ॥

తా. వమనవిరేచకాది శోధనము జ్వరాదిరోగములు విరుద్ధభోజనము ఉపవాసము ఈ మొదలగువానివలన క్షీణించినవారలు మఱియు సత్వక్షయముగలవారలు ఉప్పు పులుసు కారము ఉష్ణము జడముగల పదార్థముల సేవించుటవలనను పెఱుగు అపక్వద్రవ్యములు మృత్తిక ఆకుకూరలు క్షీరమత్స్యాది విరుద్ధపదార్థములు దుష్టాన్నము విషసంబంధముగల అన్నము ఈ మొదలగువానిని సేవించుటవలనను మూలవ్యాధి సంచారాదులు సేయకుండుట వమనవిరేచనములచే శోధనార్హంబగు దోషములు శోధింపకుండుట హృదయాది మర్మస్థలముల దోషములు కుపితంబగుటచే ఉపఘాతముగలుగుట ఆమగర్భప్రసవము విరుద్ధప్రసవము వమనాదికర్మలయందు విరుద్ధోపచారంబులు సేయుట ఈ మొదలగువానివలనను వాపు జనించును.

## శోఫసామాన్య లక్షణము.

శ్లో॥ సగౌరవంస్యా దనవస్థితత్వం సోత్సేధమూష్మాథ సిరాతనుత్వాత్ । నలోమహర్ష శ్చవివర్ణతా చ శామాన్యలింగంశ్వయథోః ప్రదిష్టత్ ॥

తా. శరీరజడత్వము చంచలచిత్తము శరీరమున ఉబ్బు దాహముగలుగుటనరములు ఉబ్బుట గగుర్పొడుచుటశరీరము వివర్ణముగనుండుట ఈలక్షణములు శోఫంయందు సామాన్యముగ గలిగియుండునని తెలియవలయును.

## వాతజశోఫ లక్షణము.

శ్లో॥ చలస్తను త్వక్పరుషోరుణోసిత స్సుప్తిహర్షార్తియుతో నిమిత్తతః । శామ్యత్యతిప్రహోన్నమతిప్రపీడితో దివాబలీస్యా చ్ఛ్వయథుస్సమీరణాత్ ॥

తా. వాపు చంచలముగ చర్మము పలచగ కఠినముగ ఎఱ్ఱగ లేక నల్లగనుంటుట స్పర్శజ్ఞానములేకుండుట జిలజిలయను వేదనగాని గగుర్పాటుగానిగలిగి కారణము లేకనే శమించుట అణచిన తత్క్షణమున పైకిలేచుట పగటియందు వాపుప్రాబల్యముగ నుండుట ఈలక్షణములుగలది వాతజశోఫ యని తెలియవలయును.

## పిత్తజశోఫ లక్షణము.

శ్లో॥ మృధుస్సగంధోసితపీతరాగవాౝ భ్రమజ్వరస్వేదతృషామదాన్వితః । యఉష్యతే స్పర్శరుగక్షిరాగకృత్సపిత్తశోఫోభృశదాహపాకవాౝ॥

తా. మృదువుగ యొకింత గంధయుక్తముగ నల్లగ పసపుగా ఎఱ్ఱగనుండుట భ్రమ జ్వరము చెమట దప్పి ఉన్మాదము తాపముగలుగుట తాకిన నొచ్చుట నేత్రము లెఱ్ఱగనుండుట కడమంటలు పాకముగలుగుట ఈలక్షణములుగలది పిత్తజశోఫయని తెలియవలయును.

## శ్లేష్మజశోఫ లక్షణము.

శ్లో॥ గురుఃస్థిరః పాండురరోచకాన్వితః ప్రసేకనిద్రావమివహ్నిమాంద్యకృత్ । సకృచ్ఛ్రజన్మప్రశమోనిపీడితోనచోన్నమేద్రాత్రిబలీకఫాత్మకః॥

తా. జడముగ స్థిరముగ పాండురవర్ణముగ నుండుట అన్నద్వేషముగలుగుట జొల్లుకారుట నిద్ర ఓకర అగ్నిమాంద్యము గలుగుట చిరకాలముమీదట ఉత్పట నాశనములజెందుట అణచిన పైకి లేవకుండుట రాత్రులయందు వృద్ధిలజెంది నాడులనడ్డగించి రోగికి దేహక్లేశమును చేష్టావిహీనతను గలుగంజేయుటవలన వాపుబలవత్తరముగనుండుట పగటియందు కఫమునకు బలములేకుండుటంజేసి స్రోతస్సులకు ప్రతిబంధము చేష్టావిహీనతలేకుండుట ఈలక్షణములు గలది శ్లేష్మజశోఫయని తెలియవలయును.

## ద్వంద్వజ సన్నిపాతజ శోఫలక్షణము.

శ్లో॥ నిధానాకృతిసంసర్గాచ్ఛ్వయథుస్స్యాద్ద్విదోషజః ।
సర్వాకృతి స్సనిపాతాచ్ఛోఫోవ్యామిశ్రలక్షణః ॥

తా. రెండురెండు దోషవికారములు లక్షణములు గలిగియుండిన ద్వంద్వశోఫమనియు వాతాదిసర్వదోషలక్షణములు గలిగియుండిన సన్నిపాత శోఫయనియు తెలియవలయును.

## అభిఘాతజశోఫ లక్షణము.

శ్లో॥ అభిఘాతేనశస్త్రాదిఛేదచ్ఛేదక్షతాదిభిః । హిమానిలోదధ్యనిలైర్భల్లాతకపికచ్ఛుజైః । రసైశ్శూకైశ్చసంస్పర్శాచ్ఛ్వయ

ఘన్వాఽర్థ్యోసర్పవాక్ ॥ భృశోష్మ్యాలోహితాభాసః ప్రాయ
శః పిత్తలక్షణః॥

తా. కాష్ఠాదులచే ప్రహరించుట శస్త్రాదులచే నరుగుట బ్రద్దలుసేయుటలేక గాయపరచుట చలిగాలి సముద్రపుగాలి జీడిగింజరసము దురదగొండిరసము మల్లు అనువానిసంబంధమువలన శరీరమున వాపు జనించి కడుదాహము యెఱుపువర్ణము తరుచుగ పిత్తశోథలక్షణములు కలిగియుండుట, ఈలక్షణములుగలది అభిఘాతశోఫ యని తెలియవలయును.

విషజశోఫ లక్షణము.

శ్లో॥ విషజస్సవిషప్రాణిపరిసర్పణమూత్రనాత్ । దంష్ట్రాదంతనఖాఘాతాదవిషప్రాణినామపి । విణ్మూత్రశుక్రోపహత మలవద్వస్త్రసంకరాత్ । విషవృక్షానిలస్పర్శాద్గరయోగావ చూర్ణనాన్ । మృదుశ్చలోవలంబీచ శీఘ్రోదాహరుజాకరః॥

తా. విషజంతువులు శరీరముపై బరుగిడుటచేనేని లేక వానిమూత్రము శరీరముపైబడుటచేనేని లేక విషవిహీనజంతువులయొక్క కోరలు లేక దంతములు నఖములు అనువాని అభిఘాతముచేనేని లేక విషప్రాణులయొక్క మలమూత్ర శుక్లముల చే తడిసినవస్త్రమును ధరించుటచేనేని లేక విషవృక్ష విషవాత స్పర్శచేనేని లేక విషసంబంధముగల వస్తువును శరీరముపై పూయుటచేనేని విషశోఫజనించును. ఆశోఫ మృదువుగ చంచలముగ వ్రేలునదిగ శీఘ్రోత్పత్తి దాహము పీడ గలదిగ నుండును.

వాతాదిస్థానవిశేషమువలన శోఫోత్పత్తిక్రమము.

శ్లో॥ శోషాశ్చామాశయస్థా మూర్ధ్వహికుర్వంత్యామా శయస్థితాః । పక్వాశయస్థా మధ్యేతువర్చస్స్థానగతా స్త్వధం । కృత్స్న దేహమనుప్రాప్తాః కుర్యుస్సర్వ సరంతథా ॥

తా. వాతపిత్తశ్లేష్మములు ఆమాశయగతంబులై బొమ్మకు పైభాగమున పక్వాశయగతంబులైన బొమ్మ పక్వాశయము అనువానికి మధ్యభాగమున వాపును గలుగంజేయును. మఱియు మలాశయగతంబైన పక్వాశయము మొదలు పాదప

ర్యంతము వాపును గలుగంజేయును. మఱియుశరీరమంతట వ్యాపించినసర్వాంగము లవాపును గలుగంజేయును.

## అసాధ్యశోఫ లక్షణము.

శ్లో॥ శ్వాసఃపిపాసాఛర్దిశ్చ దౌర్బల్యంజ్వర యేవచ ।
యస్యచాన్నేరుచిర్నాస్తిశోఫినంపరివర్జయేత్ ॥

తా. శ్వాసము దప్పి ఒకర దౌర్బల్యము జ్వరము అన్నద్వేషముగలశోఫరోగి నివర్జింపవలయును.

శ్లో॥ [నిత్యనాథీయే] ఆననంహస్తపాదంచ పుంసిశోఫఃప్రవర్తతే ।
పునఃపునఃప్రకారేణాప్యసాధ్యఃపరికీర్తితః

తా. ఏపురుషునికి ముఖము కాళ్ళు చేతులు అను వానియందు వాపుజనించి నివృత్తింపుచు మరల వాచుచునుండెడినో అట్టిరోగియొక్క శోఫ యసాధ్యంబని తెలియవలయును.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] ఆననంహస్తపాదంచ కుక్షిగుహ్యోపభావపి ।
స్త్రీణాంశోఫఃప్రవర్తేత హ్యసాధ్యః పరికీర్తితః ।

తా. స్త్రీకి ముఖము చేతులు కాళ్ళు కడుపు మర్మస్థలము అను వానియందు వాపుజనించినను లేక నివృత్తించి మరల వాచినను ఆస్త్రీయొక్క శోఫయసాధ్యం బని తెలియవలయును.

శ్లో॥ [అశ్వినీకల్పే] గౌరవంచజ్వరంతృష్ణామదస్వేదోగ్నిమందతా ।
మూత్రకృచ్ఛ్రాతిసారంచఛర్దిశ్చశ్వయథౌభవేత్ ॥

తా. శరీరము బరువుగనుండుట జ్వరము దప్పిగలుగుట శరీరము గురుతెరుగకుండుట చెమటబట్టుట అగ్నిమాంద్యము మూత్రకృచ్ఛ్రము అతిసారము వాంతిగలుగుట ఈలక్షణములుగల వాపులు అసాధ్యమని తెలియవలయును.

## శోఫమారకోప ద్రవములు.

శ్లో॥ [మతాంతరే] అనేకోపద్రవయుతం పాదయోః ప్రసృతంన
రమ్ । నారీంశోఫముఖింహంతికుక్షిగుహ్యోపభావపి ॥

తా. ఏపురుషునికి శోఫరోగముతోడ అనేకోపద్రవంబులుగూడి కాళ్ళయందు వాపుస్త్రీకి ముఖమునందు వాపు స్త్రీపురుషులకు కడుపు మర్మస్థలము అను వానియందువాపుగలిగియుండెడినో అట్టివారుమరణము జెందుదురని తెలియవలయును.

శ్లో॥ [నిత్యనాధియే] జ్వరాతిసారశోఫానాం శ్వాయధాచతథాక్షయే। ఆననంహస్తపాదంచ విశేషాద్యస్యశుష్యతిః। స్వాయోనావపిదేహేచ సామాన్యాద్యాతిపంచతామ్॥

తా. పాండు క్షయరోగములలో జ్వరాతిసారంజేని శోఫయేని ముదిరినను లేక ముఖము కాళ్ళు చేతులుశుష్కించి యోని శరీరమువాచియుండినను ఆపాండు క్షయరోగులు మరణముజెందుదురని తెలియవలయును. (మఱియు అనేకోపద్రవములతో గూడియుండు శోఫలు అసాధ్యంబులనియు తక్కినవి సాధ్యంబులనియు తెలియవలయును.

క॥ చిరుచెమట దప్పి మూత్రము। నరికట్టుటపచ్చనగుట యతిసారంబుగ। జ్వరమును వాంతియు గలయా గురుశోఫలు మానవనుచుఁ గొట్టురుచెప్పెన్॥

శోఫారిరసము.

శ్లో॥ [భైరవకల్పే] స్వచ్ఛసూతేన గంధేనకృతా కజ్జలికాశుభా। తతశ్శుల్బంసకాంతంచ రాజవర్తశ్చ కాప్యకమ్। * అభ్రకంచశిలాతాళం విషంవ్యోషసరాజితాః। విషతిందుకబీజాగ్ని ప్రత్యేకం రససమ్మితమ్। సర్వమేకత్ర సంయోజ్య చూర్ణయిత్వాతతఃపరమ్। భృంగరాజ రసందత్వా మర్దయే ద్దివసద్వయమ్। శోషణం కారయే త్తేన దాతవ్యాచణ కోపమా। రసశ్శోఫారి నామాయం ప్రోక్తమందారభైరవే॥ స్థౌల్యాం రోగమరోచతాగ్నిసదనంశోఫంచపాండ్వామయమ్। ప్లీహంచ గ్రహణీంచమూలకరుజాం వాతంతథానాహకమ్। హిక్కాశ్వాస కఫానిలంక్రిమి యక్ష్మచ్ఛూలంచ జీర్ణజ్వరమ్। సర్వాన్వాతకఫామయాంశ్చహరతిక్షి(పంతి)దోషామయాన్॥

---

* కాచజంచ — గాజువ్వు.

తా॥ శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము వీనిని సమముగ ఖల్వమువనుంచి కజ్జలిగ మర్దించి యందు తామ్రభస్మము కాంతభస్మము * రాజావర్తపుటాయిభస్మ మురజితభస్మము అభ్రకభస్మము శుద్ధిజేసిన మణిశిల శుద్ధిజేసిన తాళకము శుద్ధిజేసిన వసనాభి త్రికటుకములు గంటెన శుద్ధిజేసిన ముష్టిగింజలు చిత్రమూలము అనువాని లో ప్రతిదానిచూర్ణమును పాదరసమునకు సమముగవైచి గుంటగలగరాకురసముతో 2 దినములు మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుజేసి యెండించి తేనెలో సేవించిన స్థూలరోగము అరుచి అగ్నిమాంద్యము శోఫ పాండువులు ప్లీహరోగము గ్రహణీరోగము మూలరోగము కడుపుబ్బరము ఎక్కిళ్ళు శ్వాస కఫరోగము వాతరోగముక్రిమిరోగము యకృద్రోగము శూల జీర్ణజ్వరము సమస్తవాతకఫములచే జనించిన రోగములు త్రిదోషజనిత రోగములు కడుశీఘ్రముగ హరించును. ఇదియు మందారశ్రీవరగ్రంథమున జెప్పంబడిన శోఫారిరస మనంబడును.

## శోపలకు వజ్రమండూరము.

శ్లో॥ [మాధవనిదానే] సూక్ష్మచూర్ణంతు మండూరం గోమూత్రేపాచయేద్దినమ్ । వజ్రవల్లీం సమాంశంచ చించాత్వక్క్షారసంయుతామ్ । భక్షితంచాక్షమాత్రంతు హ్యసాధ్యశ్వయథుంజయేత్ ॥

తా. మండూరమును సూక్ష్మముగ చూర్ణముజేసి గోమూత్రములోవైచి 1 దినమువండి పిదప యామండూరమును గ్రహించి దానికి సమముగ నల్లేరుబూడిదెను చింతచెక్కలబూడిదెను కలిపి గచ్చకాయలంతేసి మాత్రలుజేసి సేవింపుచుండిన అసాధ్యశోఫ హరించును. (మఱియు పాండురోగమున జెప్పంబడినచించాదికషాయమునుసగా శోఫరోగములో సేవింపందగును.)

## శోఫలకు కిట్టాదికషాయము

శ్లో॥ [ఆయుర్వేదే] కిట్టామల కషాయేణ పాండుం శోఫంచ కామిలాత్ । చించాకిట్టకషాయేణ శోఫపాండుగదంహరేత్ ॥

తా. ప్రాతచిట్టెమును ఉసిరికెపప్పును కషాయముగాచి అందు సిందూరము కలిపి సేవించిన పాండు శోఫ కామిల హరించును. మఱియు చింతాకును ప్రాత

* రాజావర్తమన—కలుపుటాయి.

చిట్టెమునకు కషాయముగాచి యందు సింధూరముగలిపి సేవించిన పాండువు శోఫహ రించును. (మఱియు పాండురోగములయందు జెప్పంబడిన కాంతవల్లభరసము లోక నాథరసము మండూరకల్పములు లోహభస్మము చించాదిలేహ్యము అనుపానిలో దేని నేని సేవించిన శోఫలు హరించును.)

శోఫలకు తింత్రిణీమండూరము.

శ్లో॥ [బాహటే] తింత్రిణీ కణసంయుక్తం మండూరం యోజయే త్తతః । పీత్వాచ హరతేశీఘ్రం శోఫపాండు క్షయాదికమ్ ॥

తా. చింతాకురసము పావుసేరు పిప్పళ్ళు 1 వరహాయెత్తు మండూరము 1 వరహాయెత్తు ఇటుల వానినెల్ల నేకముజేసి నలువదిదినములు సేవింపుచుండిన శోఫ పాండువు క్షయములు పురాణజ్వరములు హరించును. పథ్యము—వాయింటికూరను శాల్యన్నమును భుజింపవలయును.

శోఫలకు రసభూపతి.

శ్లో॥ [చింతామణౌ] రసగంధా మృతంతుల్యం తీక్ష్ణమాదుంబరం సమత్ । హంసపాది ద్రవైఃఖల్వే మర్దితం దివసత్రయమ్ ।
కాచకుప్యాం నివేశ్యాథ లేపయే ద్వస్త్రమృత్తికామ్ । వాలు కాయంత్రకేక్షిప్త్వాశనైర్మృద్వగ్ని నాపచేత్ । ద్విషడ్యా మంపశుద్ధృత్య చూర్ణయే న్మాషమాత్రకం । ఆర్ద్రికస్యా నుపానేన సర్వశోఫం నిహంతిచ । రసోహ్యగ్ని కుమారా ఖ్యోయోగోయం రసభూపతిః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన వసనాభి ఉక్కుభస్మ ము తామ్రభస్మము వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునవైచి హంసపాది యాకురసముతో మూడుదినములు మర్దించి గాజుబుడ్డిలో నునిచి చీలమన్ను లేప నముజేసి వాలుకాయంత్రమున పండ్రెండుఝాములు మాఱ్మాగ్ని చేవండి స్వాంగశీతల మున దీసి చూర్ణముచేసి యందు మాషప్రమాణమును అల్లపురసానుపానముతో నొ సంగిన సర్వశోఫలు హరించును. (ఇదియు అగ్నికుమారమని రసభూపతియని జెప్పం బడును.)

### శోభలయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] పురాణ శాలిగోధూమ పటోలం తండులీయకమ్। ధాత్రీ పృధ్వీకరఘురసి ద్రాక్షా దాడిమచందనమ్ ।
తక్రంమధు మధూకేచ శోభానాం హితమావిదుః॥

తా. ప్రాతవడ్లు గోధుమలు పొట్లకాయ చిర్రికూర ఉసిరికె గలిజేరుకూరచేత ఘాసికూర ద్రాక్షపండ్లు దానిమ్మపండ్లు శ్రీగంధము అవుచల్ల ఇప్పపువ్వు తేనె ఇవి శోఫరోగులకు పథ్యకరంబులు.

### శోఫలక్షుం దపథ్యము.

శ్లో॥ దధినిష్పాన కట్వామ్ల మత్స్యమద్య విదాహినః ।
తిలాస్సూపశ్చ మాషశ్చ శోఫానా మహితంవిధుః ॥

తా. పెఱుగు చిక్కుడుకాయ అనపకాయ కారము పులుసు మత్స్యములు కల్లు విదాహకరద్రవ్యములు నువ్వులు పప్పు మినుములుఇవి శోఫరోగుల కపథ్యంబు.

### కామిలా నిధానము

శ్లో॥ [మాధవనిదానే] పాండురోగేషు యేవాత పిత్తకాసా స్తతో భవేత్ । హరిద్రయా సమంచక్షు ర్ముఖమూత్రమలంతథా । దాహోవిపాకోదౌర్బల్య మరుచిశ్చప్రజాయతే । కామిలాసాతికాలేస జాయతే కుంభకామిలా॥

తా. పాండురోగ వాతపిత్తశ్లేష్మ లక్షణములన్నియును గలిగియుండుట ముఖము నేత్రములు మూత్రము మలము పసపుబారియుండుట దాహముగలుగుట అన్నము జీర్ణము గాకుండుట దౌర్బల్యము అరుచిగలుగుట ఈలక్షణముగలదికామిలయనితెలియవలయును. ఇది దీర్ఘకాలంబుండుటచే * కుంభకామిల పరిణమిల్లును.

### కుంభకామిలా లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] కృష్ణపీత సకృన్మూత్ర తంద్రా మోహా

* కుంభకామిలయన కోష్ఠము నాశ్రయించియుండు కామిల.

శ్చఛర్దనమ్ । దాహోరుచి స్తథా నాహాజ్వరో వైశర క్తనేత్ర తా । అసాధ్యా శ్వాసకాసశ్చ విజ్ఞేయా కుంభకామిలా॥

తా. మలమునల్లగ మూత్రము పచ్చగ వెడలుట తంద్ర మోహము వాంతి దాహము అరుచి కడుపుబ్బరము జ్వరముగలుగుట నేత్రము లెఱ్ఱగనుండుట శ్వాసకాసలుగలుగుట ఈలక్షణములు గలది కుంభకామిలయని తెలియవలయును. అది అసాధ్యము.

## కామిలా సాధ్యాసాధ్యోపద్రవములు.

శ్లో॥ [అశ్వినీకల్పే] దగ్ధమాంస రుధిరాతిపిత్తతః కామిలాభ్రమ తృషావిదాహినీ । పీతనేత్ర బలవత్యుపేక్షయా శోభవత్యపిత కుంభకామిలా । కామిలా హంతిరక్తాక్షం రక్తమూత్రం హతానలమ్॥

తా. పిత్తోద్రేకమువలన రక్తమాంసములు వుడికి శరీరము దిరుగుచు దప్పితాపముగలిగిన కామిలారోగమని తెలియావలయును. అదిఉపేక్షవలనప్రబలమై నేత్రముల పసపు వర్ణమును శరీరమును శోఫను గలుగంజేసి కుంభకామిలయని జెప్పంబడును. అందు నేత్రములు మూత్రము ఎఱ్ఱనై అగ్నిదీపనము లేకుండిన రోగి జీవింపడని యెఱింగి చికిత్సజేయంజనదు. మఱియు పైదుర్గుణంబులు లేకుండిన రోగము సాధ్యమనియెఱింగి చికిత్సంజేయవలయును.

## కామిలకు పంచాస్యరసము.

శ్లో॥ [చికిత్సాసారసంగ్రహే] రసభస్మాభ్రకాంతార్క తీక్ష్ణతాళకమాక్షికమ్ । దేవదారుద్రవైః పిష్ట్వాదినైకంతత్సమంసమమ్ । పాచయేద్వాలు కాయంత్రే త్రిదినాంతేసముద్ధరేత్ । * అమృతోత్పలకల్హారకందేనక్షీరసంయుతమ్ । పిష్టంయష్ట్యంభసాయామం మాషంక్షౌద్ర సితాయుతమ్ । రసః పంచాస్యనామ్నాయం సేవయే త్కుంభకామలీ ॥

తా. రసభస్మము అభ్రకభస్మము కాంతభస్మము తామ్రభస్మము లోహ

* అమృతోత్పల కందాతి బలాక్షేత్ర పలంయుతమ్.

భస్మము శుద్ధిజేసినతాళకము*హేమమాక్షికభస్మము వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునసునిచి 1 దినము దేవదారు చెక్కరసముతో మర్దించి కుప్పెలోనునిచి వాలుకాయంత్రమందు 8 దినములు దీప్తాగ్ని చేవండి సాంగశీతలమునదీసి ఖల్వములో నునిచి అందు తిప్పతీగె కలువగడ్డలు తామరగడ్డలు అనువాని చూర్ణమును కలిపి పాలు అతిమధురకషాయము వీనితో 1 ఝాము మర్దించి మాషప్రమాణమంతేసి మాత్రలు జేసి తేనె పంచదారతోగాని (నల్లగంటెన విత్తుల చూర్ణములోగానికలిజేరు వేళ్ళరసము పిరికములు పంచదార అనువానితోగాని తెల్లగంటెనరసము సాలు అను వానితోగాని కుప్పింటాకురసము పెఱుగు అనువానితోగాని) సేవించిన కుంభకామిలహరించును. ఇదియు పంచాస్యరసమనంబడును.

## శిలాజత్వాది వటికములు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] శిలాజతుశ్చగోమూత్రం మండూరంచాథ
మాక్షికమ్ । లోహభస్మచనిష్కంవా సేవయేత్కుంభకామలీ॥

తా॥ శుద్ధిజేసినశిలాజిత్తు మండూరము హేమమాక్షికభస్మము లోహభస్మము వీనిని సమభాగములుగ గోమూత్రముతో మర్దించి నిష్కప్రమాణము మాత్రలు జేసి సేవించిన కుంభకామిల హరించును.

## కామిలకు మంత్రము.

శ్లో॥ అగ్రతోనారసింహశ్చపృష్ఠతోవాయునందనః ।
ఉభయోర్బాహుధన్వంత్రౌసహితౌ రామలక్ష్మణౌ॥

తా. ఈ మంత్రముచే కామిలారోగిని మంత్రించుచు క్రొత్త కంచుగిన్నెలో పుడిసెడు నీళ్ళుబోసి దానియందు ఛాయను జూచునటులంజేసి ఆట్టితరి రెండుపూదుల దెచ్చి వానికొసలబట్టికొని పైకంచుగిన్నెలోముంచుచు నీమంత్రమును ముమ్మారు జెప్పుచు వానిముఖము మొదలుకొని పాదములపర్యంతము దిగదుడిచి యందలినీరును వదిలము సేయవలయును. మఱియు కామిలారోగము హరించువరకు దినప్రొద్దున మంత్రింపుచుండవలయును. ఆగిన్నెలోనీరు విరుగకుండిన కామిలమానుననియు విరిగినమానదనియు తెలియవలయును.

---

* హేమమాక్షికమన వెండిమ్లాని.

## కామిలకు రక్షకర్మ.

శ్లో॥ [అగ్నిమతే] ఘుటికామణి బంధేచ దహేత్స్వాక్షశలాకయా। వలయంచ సువర్ణస్య తామ్రస్య రజతస్యవా॥

తా. ఇరుమణికట్లు తిరుగు వారలయందు 2 చీలమండల యొక్క కీళ్ళయందు బంగారుశలాకుతో నేని రాగిశలాకుతో నేని వెండిశలాకుతో నేని వలయాకారం బుగ రక్షలువేసిన కామిలమానును. మఱియు దీనియందు పాండురోగమున జెప్పంబడిన పథ్యములనే యాచరింపవలయును.

## హలీమక కులాంతకరసము.

శ్లో॥ [గ్రంథాంతరే] శుద్ధసూతామృతంగంధం హరితాళం మనశ్శిలా। ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్। వాసాఖదిరదుత్తూర రసేనపరిభావయేత్। ప్రత్యేకంచదినంమామంవాలుకా యంత్రకేపచేత్। సాంగశీతలముద్ధృత్య పంచపిత్తేనభావయేత్। గుంజామాత్రంప్రదాతవ్య మనుపానంపిబేదను। త్రికటుత్రిఫలాచైవ లజ్జాలుగిరికర్ణికా।అపామార్గశ్చ సురసా నిర్గుండీ కర్ష మాత్రతః। క్వాథమష్టావశేషంతు పీయమానంహలీమకమ్। నాశయేత్సర్వరోగాంశ్చ కామిలాపాండుశోఫజిత్॥

తా. శుద్ధిజేసిన పాదరసము శుద్ధిజేసిన వసనాభి శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసినహరిదళము శుద్ధిజేసినమణిశిల వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునందునిచి అడ్డసరము చండ్ర ఉమ్మెత్త అనువానిరసములచే ప్రత్యేకప్రత్యేకముగ ఒక్కొక దినము మర్దించి భావనచేసి కుప్పెలోనునిచి 1 ఝామువాలుకాయంత్రమునవండిసాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి చేప కాఱుబఱె నెమలి అడవిపంది మేక అనువాని పిత్తములచే భావనజేసి గురిగింజలంతేసి మాత్రలు జేసి శొంఠి పిప్పలి మిరియాలు కరకతాండ్ర ఉసిరికెలు అంతరదామర తెల్లగంటెన ఉత్తరేణి మంచితులసి వావిలిఅనువానిని దినుసుయొకటింటికి కర్షప్రమాణము చొప్పున గ్రహించు ఉదకముబోసి అష్టావశేషముగ కషాయము కాచి దీనిచే యౌషధమును సేవించిన హలీమకము కామిల పాండువులు శోఫ మొదలగు సర్వరోగములు హరించును.

శ్లో॥ [గ్రంథాంతరే] హాలీమకే పాండురోగ చికిత్సాం కారయే ద్భిషక్।

తా. హాలీమకమునకు పాండురోగ చికిత్సనే జేయవలయును.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడీ భగిపత్సంప్రదాయ కౌరాధ్య రామదేశిక శిష్యోత్తమ
సమశ్శివాయసత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
కామిలానిదాన తత్సాధ్యాసాధ్య చికిత్సాను
పాన పథ్యాపథ్య లక్షణయుక్తం.
పంచమ ప్రకరణమ్.



శ్రీ ర స్తు.

# బసవరాజీయము.

## ఆంధ్ర తాత్పర్యము.

## —— షష్ఠమ ప్రకరణము. ——

శ్లో॥ వృషేంద్ర గామినంశంభుం సర్వేశం భక్తవత్సలమ్ ।
భూతేశం లోకకర్తారం నీలకంఠ మహంభజే ॥

అవతరణిక. ఇపుడు గ్రంథకర్త తనచే జేయంబడు నీగ్రంథమునందు షష్ఠప్రకరణమును వచింపంబూని యది నిర్విఘ్నముగ పరిసమాప్తి చెందుటకై తనకిష్టదేవతయగు ఈశ్వరనమస్కారాత్మక మంగళమును "వృషేంద్ర గామినం శంభుం" అను శ్లోకముచే జేయుచున్నాడు.

తాత్పర్యము. శ్రేష్ఠమైన వృషభము నెక్కి సంచారము సేయువాడు సుఖకరుడు జగదీశ్వరుడు భక్తులయందు వాత్సల్యముగలవాడు భూతములకు ప్రభువు జగత్సృష్టిస్థితిసంహారకుడు నగు నీలకంఠుని నేను భజించెదను.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహంవైద్య శిఖామణిమ్॥

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు అని పేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథముయొక్క యైదవప్రకరణమును వచింపుచున్నాడను.

### అశీతివాత వివరణము.

శ్లో॥ ఊర్ధ్వవాతంశిరోవాతంపక్షఘాతంచపార్శ్వకమ్ । అర్ధాంగ
కంపవాతంచ హన్వ్యారుస్తంభం తథైవచ। కిక్కసంశోణితం
వాతం హృచ్ఛూలంచ కఫవాతకమ్ । సాధ్యవాతం ధనుర్వాతం
తిమిరం కంఠవాతకమ్ । కాకవాతం శీతవాతం నయనోదర

వాతకమ్ ॥ నాసావాతం ముఖావాతం వాతంచావయవాం గకమ్ । జిహ్వాంగం నరవాతంచ కర్ణవాతంని రుధ్యచ । ఆమ వాతంచ త్వగ్వాత మణువాతం తథైవచ । అంగభ్రమణాకం చైవ మలబద్ధంచ గుల్మకమ్ । మూత్రబద్ధం బాహుకంపం స్కంధవాతంతథైవచ । ఆఢ్యవాతం విధూమవాతం విధూమం భోగవాతకమ్ । కటివాతంతు తద్వచ్చ శుక్లవాతంచ పాంశు కమ్ । సంధివాతంస్కంధ్రవాతం గుల్మవాతంతథైవచ । మంద వాతంజానువాతంజంఘావాతంచపాదకమ్ । కంధరంచాంగుళీ వాతమనులోమంవిలోమకమ్ । సుప్తవాతంకోష్టవాతం వస్తి వాతంచ శుష్కకమ్ । స్థానవాతం కుక్షివాత మస్థివాతంచ మజ్జకమ్ । ఏకాంగకంక్షీణవాతవసావాతకసంజ్ఞకమ్ । మధు వాతంక్షుదావాతంశ్శృంఖలంస్ఫోటవాతకమ్ । స్నాయుప్రసూతి వాతంచ హృజ్జీర్ణాతపవ్వాతకమ్ । అగ్నివాతం తథానామ్నా సర్వహీనంచఖంజకమ్ । కళావాతందండవాతం క్షుతవాతంచ పంగుకమ్ । దధివాతం తథోన్మాద మశీతి ర్వాతసంజ్ఞికా ॥

తా. ఊర్ధ్వవాతము శిరోవాతము వక్షఘాతవాతము పార్శ్వవాతము అర్ధాంగవాతము కంపవాతము ఊరుస్తంభవాతము కిక్కిసవాతము రక్తవాతము ఆమ్లవాతము కఫవాతము సాధ్యవాతము ధనుర్వాతము తిమిరవాతము కంఠవాతము కాకవాతము శీతవాతము నయనవాతము ఉదరవాతము నానావాతము ముఖవాతము అవయవాంగవాతము జిహ్వాంగవాతము నరవాతము కర్ణవాతము ఆమవాతము త్వగ్వాతము అణువాతము అంగభ్రమణవాతము మలబద్ధవాతము గుల్మవాతము మూత్రబద్ధవాతము బాహుకంపవాతము స్కంధవాతము ఆఢ్యవాతము ధూమవాతము వినూవాతము భోగవాతము కటివాతము శుక్లవాతము పాంశువాతము సంధివాతము గృధ్రవాతము గుల్మవాతము మందవాతము జానువాతము జంఘావాతము పాదవాతము అంగుళీవాతము అనులోమవాతము విలోమవాతము సుప్తవాతము కోష్ఠవాతము వస్తివాతము శుష్కవాతము స్థానవాతము కుక్షివాతము అస్థివాతము మజ్జావాతము ఏకాంగవాతము క్షీణవాతము వసావాతము మనూవాతము క్షుతవాతము శృంఖల

వాతము విస్ఫోటవాతము స్నాయుకవాతము ప్రసూతివాతము అజీర్ణవాతము ఆతప వాతము అగ్నివాతము స్వరహీనవాతము ఖంజావాతము కళావాతము దండవాతము క్షతవాతము పంగువాతము దదివాతము ఉన్మాదవాతము అనవాతరోగములు రెండు బదివిధంబులు.

## వాతాదిప్రకోప జనితరోగ భేదములు.

శ్లో॥ నవాతేన వినాశూలం నకండూః శ్లేష్మణావినా ।
సపిత్తేన వినాఛర్దిః నాజీర్ణేన వినాజ్వరః ॥

తా. వాతముప్రకోపించక నే శూలయు శ్లేష్మముప్రకోపించక నే దురదయు పైత్యముప్రకోపించక నే వాంతియు అజీర్ణము లేక నే జ్వరమును గలుగదని తెలియ వలయు.

## వాతరోగ నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] రూక్షశీతాల్పలఘ్వన్న వ్యవాయాతిప్రజా గరైః । విషమా దుపచా రాచ్చ దోషా సృక్స్రావణాదపి । లంఘన * ప్లవనాత్యధ్వవ్యాయామాతివిచేష్టనైః । ధాతూ నాంసంక్షయాచ్చింతాశోకరోగాతికర్శనాత్ । వేగసంధార ణాదామా దభిఘాతాదభోజనాత్ । మర్మబాధాద్గజోష్ట్రాశ్వ శీఘ్రయానాది సేవనాత్ । దేహే స్రోతాంసిరిక్తాని పూర యిత్వానిలోబలీ । కరోతివివిధాన్ వ్యాధీన్ సర్వాంగైకాంగ సంశ్రయాన్ । సంకోచఃపర్వణాం స్తంభోభంగోస్థ్నాంపర్వ ణామపి । రోమహర్షఃప్రలాపశ్చపాణిపృష్ఠశిరోగ్రహః । ఖాంజ్య పాంగుల్యకుబ్జత్వం శోషోంగా నామనిద్రతా । గర్భశుక్లరజో నాశ, స్స్పందనం గాత్రసుప్తతా । శిరోనా సాక్షిజత్రూణాం గ్రీవాయాశ్చాపి హుండనమ్ । భేదస్తో దార్తిచాక్షేపో † మోహశ్చాయాసఏవచ। మోటనంచయువగ్రివాయాశ్వాస

* ప్లవనా త్యధ్వాయా పాదతి విచేష్టనైః.
† ముహుశ్చాయాస ఏవచ.

సర్వాంగతోదనమ్ । ‡ ఏవంవిధానిరూపాణి కరోతికుపితోఽనిలః । తత్రతత్రోక్తస్థానాశ్రితేదుష్టే నిగ్రహో మాత్రవర్జ్యసః । హేతుస్థానవిశేషాచ్ఛభవేద్రోగవిశేషకృత్ । సుస్నిగ్ధైస్సుఖయేద్దేహం సోష్ణస్నేహంచ పాయయేత్ । యూషైస్సైలైర్ఘృతైస్సాన్లైః పయోభిస్స్వరసైరసైః । భోజయేద్రేచయేత్స్విద్యేన్మృదుస్నేహోక్త భేషజైః । క్షీరైర్వాతారితైలంవా పిబేచ్ఛుద్ధికరంభవేత్ ॥

తా. రూక్ష శీతలము అల్పప్రమాణము లఘుత్వముగల యన్నమును భుజించుట కడుమైథున జాగరణ విషమోపచారములసేయుట దోషము అనగా కఫ పిత్త మలమూత్రాదులను రక్తమును స్రవింపంజేయుట దాటుట నదులయందీదుట మిక్కుటముగ మార్గమునడుచుట (కడు ఆయాసముజెందుట) దుముకుట మొదలగు కడు విరుద్ధచేష్టలసేయుట రసరక్తాదిధాతువులు క్షయించుట చింత దుఃఖము రోగము అనువానిని జెందుట మిక్కుటముగ కృశించుట మలమూత్రముల బంధించుట ఆమ మన—రసధాతువు దుష్టంబై వాతమార్గము నడ్డగించుట కాష్ఠాద్యభిఘాతము జెందుట ఉపవాసముసేయుట హృదయాదిమర్మములయందభిఘాతము గలుగుట ఏనుగ, ఒంటె గుఱ్ఱము మొదలగువానిపైనుండి భూమిపైబడుట ఈ మొదలగు కారణముల వలన వాతముప్రకోపించి బలిష్ఠమై శరీరమునందలి రిక్తములైన నాడులపూరింపంజేసి సర్వాంగము నేని లేని ఏకాంగము నేని నాశ్రయించి నానావిధ వాతరోగముల జనింపంజేయు. మఱియు సంధులయందు సంకోచము స్తంభనము అస్థిసంధులయందు భిన్నంబగునటుల పీడ గగుర్పాటు తబ్బిబ్బుమాటలు చేతులు వీపు శిరము అనువానియందు పట్లు కుంటితనము పిచ్చుకుంటితనము కుబ్జత్వము అంగములయందువాపు నిద్రాభంగము గర్భముధరించకుండుట శుక్ర రజోరక్తములునశించుట శరీరమువణుకుట శరీరము మొద్దుబారియుండుట కేశప్రదేశము కణత లలాటము అనువానియందు పగులుట ఘ్రాణేంద్రియమునశించుట నేత్రముల దృష్టిలేకుండుట ఆవులించుచుకొనుట మెడ స్తంభించుట పెదవులు దంతములు కంఠము మొదలగు వానియందుపగులుట సూదులచేబొడుచునటుల పీడ ఆక్షేపవాతము మోహము ఆయాసము గలుగుట మెడయాడ్చికొనుట శ్వాసము సర్వాంగము వేదన (పార్శ్వములయందు శూల

‡ పార్శ్వశూలం భ్రమోమోహః కరోతి కుపితోఽనిలః.

మోహము) గలుగుట ఈ లక్షణములు వాతప్రకోపమువలన గలుగు కోష్ఠాశ్రితవాతము దుష్టంబైన మలమూత్రములు చెడ్డగించు. మఱియు ప్రకోపించినవాతము కారణస్థానభేదములవలన నానావిధ వాతరోగముల గలుగంజేయు వాతరోగికి కోమలములగు ద్రవ్యములచే శరీరసౌఖ్యమును గలుగంజేయుటయేగాక ఉష్ణములగు స్నేహద్రవ్యములపానమును * యూషమును తైలము ఘృతము పుల్లనిద్రవ్యములు పాలు స్వరసములు రసవిశేషద్రవ్యములు. అనువానిభోజనమును స్వేదనక్రియను మృదుకర ద్రవ్యములు స్నేహముఅనువాని లేపనమును రేచనమును క్షీరము వాతాయరితైలము అనువానిసేవనను జేయింపవలయు. ఈఉపచారములచే వాతరోగము శమించు. ఇవి యవాతరోగమునకు సామాన్యోపచారంబులు.

శ్లో॥ [ఆయుర్వేదే] పార్శ్వస్థానవిశేషాచ్చ భవేద్రోగ విశేష
కృత్ । ధనురాదిరసాధ్యస్తు ద్వంద్వలక్షణ స్తథా ।
స్థాననామానురూపేణ లింగభేదాద్వినిర్దిశేత్ ।
శుద్ధవాతహతంపక్షం కృచ్ఛ్రసాధ్యతమంవిదః ।
హను స్తంభార్ది తాక్షేప పక్షఘాతాతతానకాః ।
కాలేనమహతా సాధ్యా హ్యసాధ్యాశ్చచిరంగతాః ॥

తా. ఒకపార్శ్వము నాశ్రయించియుండు వాతము ధనురాదివాతములు ద్వంద్వవాతము స్థాననామానుగుణమువలన లక్షణములవలన అసాధ్యములనియు శుద్ధవాతము (అనగా ఏకదోషజనిత వాతరోగము) వలన జనించిన పక్షవాతము కష్టసాధ్యమనియు హనుస్తంభము అర్దితము ఆక్షేపకము పక్షఘాతము ఆపతానకము అనువాతరోగములు కాలక్రమము మీదట సాధ్యంబులనియు కడుదీర్ఘ కాలముండిన అసాధ్యములనియు తెలియవలయును. జ్వరముతోగూడిన ఏకాదశ వాత లక్షణముల వచించెద.)

## ధూమవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] విషూచికా వాంతి విదాహకార్శ్యజ్వరో
తితృష్ణా హ్యతీసారకశ్చ । పిత్తంచమూర్ఛా భ్రమణంవికా
రో ధూమంచవాతంతు వదంతితద్జ్ఞాః॥

* మూషమున పెసలు ఉలవల మొదలగువానికట్టు.

తా. విషూచి వాంతులు శరీరమునవిదాహము కడుదప్పి అతిసారముగలుగుట పిత్తము ప్రకోపించుట మూర్ఛ భ్రమగలుగుట ఈలక్షణములతోడ జ్వరమును గూడి శరీరము తెలుపుబారియుండిన ధూమవాతమని ఆయుర్వేదవేత్తలు వచించెదరు (దీనియందు పంచవక్త్రరసమును సేవింపవలయును.)

## ధూమవాతమునకు త్రిఫలాదిచూర్ణము.

శ్లో॥ ఏరండతైలంత్రిఫలా గోమూత్రంచిత్రకంవిషమ్ ।
ఏకమాసంఘృతైఃపానం ధూమవాతంవినాశయేత్ ॥

తా. కరక్కాయ తానికాయ ఉసిరికెపప్పు చిత్రమూలము అతివస వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఆముదము గోమూత్రము నేయ్యి అనుపానిలోగలిపి ఒకమాసము సేవించిన ధూమవాతము హరించు.

## విధూమవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శరీరేతువిదాహశ్చ జ్వరస్యోత్కటసంభవః।
శిరశ్శూలంరక్తనేత్రం విధూమంవాతకంవిదుః ॥

తా. శరీరమువిదాహించుట శిరమునొచ్చుట నేత్రము లెఱ్ఱగనుండుట ఈలక్షణములతోడ ఉత్కృష్టమైన జ్వరముగలిగి శరీరమున తెల్లని పొట్టురాలుటయే విధూమవాతమని తెలియవలయు.

## విధూమవాతమునకు వాతారిరసము.

శ్లో॥ అష్టౌభాగారసస్యాపివిషంతిన్దోస్తథైవచ । గంధకస్యతథైవాష్టౌకటుత్రయఫలత్రయమ్ । వహ్నిపత్రకముస్తానాంవచాశ్వగంధయోరపి । రేణుకావిషకుష్ఠానాంపిప్పలీమూలకస్యచ ఏకైకంతుభవేద్భాగమింద్రదారోస్తథైవచ । చతుర్వింశద్గుణాత్రవటకాచణకాకృతిః । వాతారిరసనామాయంవిధూమవాతనాశకమ్॥

తా. శుద్ధిచేసినపాదరసము 8 భాగములు కలిలోమూడుదినములు నాననెండించిన విషముష్టిగింజలు 8 భాగములు శుద్ధిజేసిన గంధకము 8 భాగములు శొంఠిపిప్పలి మిరియాలు కరక్కాయలబెరడు తానికాయలబెరడు ఉసిరికెపప్పు చి

మూలము అకుపత్రికె తుంగముస్తెలు వస ‡ డొమ్మడోలుగడ్డ రేణుకలు శుద్ధిజేసిన వసనాభి చెంగల్వకోష్ఠు పిప్పలీమూలము పాపటవేరుఅలువాని చూర్ణముదినుసుయొక టింటికి ఒక్కొకభాగము ఇటుల వానినెల్ల గ్రహించి యందు బెల్లము 24 భాగ ములువైచి బాగుగమర్ధించి శనగగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని ఆవు నెయ్యి మిరియములచూర్ణము అనువాని యనుపానముతో సేవించిన విషూమవాతము హరించు. ఇదియ నాతారిరసమనబడు. మఱియు నీరసమే యెనుబదివాతముల హరింపంజేయునని (గ్రంథములయందు జెప్పంబడియున్నది.)

## ఏకాంగవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] వాతాధికం జ్వరవిదాహ వికారకం దేహా
తిమఃఖగతిపీడితవాంతిదోషం । శుష్కాంగకంచశిరసోభ్రమ
ణంక్షుతంచ నిష్ఠీవనంమలనిరోధనకుక్షిదాహమ్ ॥

తా. వాతము ప్రకోపించుట శరీరముమండుట శరీరమున వికారముగలుగుట శరీరమువణుకుట నొచ్చుట నడుచుటకుశక్తిలేకుండుట వాంతిగలుగుట అవయవ ములు ఎండుట తలదిరుగుట తుమ్ములుగలుగుట కారియుమివేయుట మలమువెడల కుండుట కడుపులోమండుట ఈలక్షణములతోడ జ్వరమునుగలిగి శరీరములోసగము వాతపూరితముగ నుండునదియే ఏకాంగవాతమని తెలియవలయు (ఇదిఅసాధ్యము.)

## ఏకాంగవాతమునకు స్వర్ణారిరసము.

శ్లో॥ రసభాగోభవేదేకోగంధకో ద్విగుణోమతః । ద్వాదశబ్రహ్మ
బీజానాంనిపతింద్రో స్తథైవచ । త్రిదినం కాంజికేక్షిప్త్వాధశో
యేద్విపతింమకాణ । ఏకీకృత్యాత శ్చూర్ణం మధునాలోడ
యేత్తతః । స్నిగ్ధభాండేనిధాయాథధాన్యరాశౌవినిక్షిపేత్ ।
యాసాదూర్ధ్వంతత స్తస్యాఖాదయేద్గుళికాద్వయమ్ ।· ఏకాం
గవాతమత్యర్థంఖంజకం చవివర్జయేత్ । పణ్మాసేనతుసేవేత
రసంస్వర్ణారికాహ్వయమ్ ॥

తా. శుద్ధిచేసినరసము 1 భాగము శుద్ధిజేసినగంధకము2భాగములు మోదుగ గింజలు 12 భాగములు కలిలో మూడుదినములు నానబెట్టబడిన ముష్టిగింజలు 12

‡ డొమ్మడోలుగడ్డయున పెన్నేరుగడ్డ.

భాగములు ఇటుల వీనినెల్ల ఖల్వమునను నిచి చూర్ణముజేసి తేనెలో కలిపి నున్నని క్రొత్తకుండలో నునిచి ధాన్యరాశిలో నొకమాసంబిడి పిదప యందు రెండుగురి కెలచొప్పున 6 మాసములు సేవించిన ఏకాంగవాతము ఖంజక వాతము హరించు ఇదియ స్వర్ణారి రసమనంబడును. (మఱియు దీనియందు వాతాదిరసము నేని రస కర్పూరము నేని సేవింపందగు.)

## కఫవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] దేహశోషోజ్వరః కార్శ్యంకాసశ్చహ్యల్ప భాషితా । దేహస్థూలంచవహతికఫవాతస్యలక్షణమ్ ॥

తా. శరీరము వాచుట శరీరము కృశించుట హీనస్వరము గలుగుట శరీరము స్థూలించుట ఈలక్షణములతోడ జ్వరము దగ్గుగలుగుటయే కఫవాతమని తెలియ వలయు.

## కఫవాతారి రసము.

శ్లో॥ మృతసూతంతీక్ష్ణకాంతంతాళంమాక్షికగంధకమ్ । తుల్యాం శంమర్దయేత్ఖల్వేవాతారేరార్ద్రకోద్భవైః । భృంగజైఃకాక మాచ్యుత్థైఃగిరికర్ణ్యాద్రవైర్దినమ్ । మర్దితంభాండగంరుధ్వా పచేన్మందాగ్నినాదినమ్ । వ్యోషాగ్నిగంధకవిషం నారణా భయటంకణమ్ ।. సమాంశం చూర్ణితంమిశ్రం తుల్యాంశం పూర్వపాచితమ్ । త్రిదినం మర్ధయేద్ద్రావైః ర్ముండీ నిర్గుండి భృంగజైః । అష్టగుంజామితంఖాదేత్కఫవాతనికృంతనమ్ ॥

తా. రసభస్మము లోహభస్మము కాంతభస్మముశుద్ధిజేసిన తాళకము హేమ మాక్షికభస్మము శుద్ధిజేసినగంధకము వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునను నిచి ఆముదపుచెట్లు అల్లము గుంటగలగర కాచాకు తెల్లగంటెన అనువానిరసము లతో ఒకొక్కదినము ప్రత్యేకప్రత్యేకముగమర్దించి ముద్దజేసి కుప్పెలోనునిచి చీల మన్ను లేపనముజేసి క్రమప్రకారము మందాగ్నిలో ఒకదినమువండి స్వాంగశీతలమున దీని ఖల్వములోవైచి చూర్ణముజేసి దానికి సమముగ శొంఠి పిప్పలిమిరియాలు చిత్ర మూలము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిననాభి కందగడ్డ కరక్కాయ శుద్ధిజేసిన వెలి గారముఅనువాని చూర్ణమునుకలిపి బోడతరము వావిలి గుంటగలగర అనువాని రస

ములతో 3 దినములు మర్దించి 8 గురిగింజలంతేసి మాత్రలుజేసి యుంచొక దానిని అనుపాన విశేషములతో సేవించిన కఫవాతము హరించు.

## జిహ్వాంగవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] జిహ్వాంగబంధనం దోషోజ్వరతృష్ణాపరిభ్రమమ్ । మూకబాధిర్యతాపంచ జిహ్వాంగవాతలక్షణమ్ ॥

తా. దప్పిగలుగుట తబ్బిబ్బులాడుట మూగతనముగలుగుట చెవు వినరాకుండుట తాపము గలుగుట ఈలక్షణములతోడ జ్వరముగలిగి నాలుక లోనికీడ్చికొనుటయే జిహ్వాంగవాతమని తెలియవలయు.

## జిహ్వాంగవాతాంకుశ రసము.

శ్లో॥ సూతంపంచపలంప్రోక్తంపలంస్యాత్తామ్రభస్మకమ్ । జంబీరాణాంద్రవైపిష్టంసూతతుల్యంచగంధకమ్ । నాగవల్లీరసైపిష్టం కాచేపిష్టం ప్రకల్పయేత్ । రుద్ధ్వాలఘుపుటేపాచ్యంత్ర్యూషణేవసుమిశ్రితమ్॥జిహ్వాంగకంపవాతార్తోభక్షయేత్ద్విగుంజకం॥

తా. శుద్ధిజేసినరసము 5 పలములు తామ్రభస్మము 1 పలము శుద్ధిచేసినగంధకము 5 పలములు ఇటుల వీనిని గ్రహించి నిమ్మపండ్ల రసముతోను తమలపాకుల రసముతోను మర్దించి గాజుకుప్పెలోనునిచి చీలమన్ను లేపనముజేసి లఘుపుటం బిడి సాంగశీతలమునదీసి ఖల్వమునసునిచి మరల మర్దించి దానికిసమముగశొంటి పిప్పలి మిరియాలు అనువానిచూర్ణమును కలిపి యందు రెండు గురిగింజలయెత్తును సేవించిన జిహ్వాంగవాతము కంపవాతము నశించు.

## స్కంధవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] సంతాపందృష్టిహీనాంగంశిరోభ్రమణకంపనమ్ । సజ్వరంశూలికంఠశ్చస్కంధవాతస్యలక్షణమ్ ॥

తా. శరీరము వెచ్చగనుండుట నేత్రములు కనుపడకుండుట అంగములు గానములైయుండుట తలదిరుగుట శరీరమువణుకుట ఈలక్షణంబులతోడ జ్వరముగలిగి కంఠమునుశూలించుట స్కంధవాతమని తెలియవలయు.

## కంధరవాత లక్షణము

శ్లో॥ [మాధవనిధానే] దాహశ్శుష్కాంగశోషంచతంద్రానిద్రామతిభ్రమః। జ్వరతృష్ణా వికారోయం వాతకంధరలక్షణమ్ ॥

తా. తాపము గలుగుట శరీరముకృశించుట అవయవములువాచుట తంద్ర నిదుర గలుగుట తబ్బిబ్బులాడుట దప్పిగలుగుట ఈ లక్షణములతోడ జ్వరముగలిగి మెడకొంకులు నొచ్చుటయే కంధరవాతమని తెలియవలయును.

## స్కంధవాతమునకు వాతముద్గర రసము.

శ్లో॥ శుద్ధశూతం విషంగంధంటంకణంచమనశ్శిలా । ధూర్తబీజం సమంఖల్వే హంసపాదిరసేనచ । మర్దితంకజ్జలీంకృత్వా శరావే సంపుటేపచేత్ । స్నుహీక్షీరేణసంమర్ద్య మత్స్యపిత్తేసభావయేత్ । గుంజామాత్ర ప్రదాతవ్యం స్కంధవాతవినశ్యతి॥

తా. పాదరసము వసనాభి గంధకము వెలిగారము మణిశిల ఉమ్మెత్తవిత్తులు వీనినెల్లశుద్ధిజేసి సమభాగములుగ ఖల్వమునసునిచి హంసపాది యాకురసముతో మర్దించి ముద్దచేసి మూకుళ్ళలో నునిచి చీలమన్ను లేపనముజేసి వాలుకాయంత్రమున నాలుగు ఝాములువండి సాంగశీతలమునదీసి మరల ఖల్వమునవైచి జెముడుపాలతో మర్దించి పిదప చేపచేదుతో భావనజేసి గురిగింజలంతేసి మాత్రలుజేసి అనుపానవిశేషములతో సేవింపుచుండిన స్కంధవాతము (కంధరవాతము హరించును.)

## స్కంధవాతమునకు ఇంద్రవారుణికాది ఘుటికలు.

శ్లో॥ ఇంద్రవారుణికామూలం మాగధీగుడసంయుతమ్ ।
భక్షయే త్కర్షమాత్రంతు స్కంధవాత హరంభవేత్ ॥

తా. పాపరవేరు పిప్పళ్ళు అనువానిచూర్ణములో బెల్లము కలిపి బాగుగ మర్దించి కర్షప్రమాణము సేవించిన స్కంధవాతము (కంధరవాతము) హరించును.

## పాతవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] మోహనం ఘాతతంద్రంచ జ్వరశ్శూలంచ కంపనమ్ । అక్షిశ్శూలం కర్ణశూలంశిరశ్శూలంచగుహ్యకమ్ । కటిశూలం పాదశూలం పాదవాతస్యలక్షణమ్॥

తా. మోహము శరీరము బోట్లు తంద్ర కడుపులో శూల వణుకుగలుగుట నేత్రములు చెవులు శిరము మర్మస్థలము మొల అనువానియందు శూలగలుగుట ఈ లక్షణములతోడ జ్వరముగలిగి పాదములుశూలించుటయే పాదవాతమని తెలియ వలయును.

## పాతవాతమునకు స్వచ్ఛందనాయ రసము.

శ్లో॥ మృతసూతం మృతంలోహం గంధకం తాళమాక్షికమ్ ।
పథ్యాశ్శృంగీ విషంత్ర్యూష మగ్నిమదంచ టంకణమ్ ।
తుల్యం ఖల్వే దినంమర్ద్యం ముండీ నిర్గుండిజద్రవైః ।
ద్విగుంజ వటికాంకాథే త్పాదవాతం వినశ్యతి ॥

తా. రసభస్మము లోహభస్మము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన తాళకము హేమమాక్షికభస్మము కరక్కాయలు కర్కాటకశృంగి శుద్ధిచేసిన వసనాభి శొంఠి పిప్పలి మిరియాలు చెల్లి శుద్ధిజేసిన వెలిగారము వీనిని సమభాగములుగ ఖల్వమున నునిచి బోడతము వావిలి అనువానిరసములతో 1 దినము బాగుగ మర్దించి 2 గురిగింజలంతేసి మాత్రలుజేసి అనుపానవిశేషముతో సేవించుచుండిన పాదవాతము హరించు. (మఱియు నీవాతమున రసకర్పూరము ఉప్పి పరంగిచెక్క అనువాని యోగమును కూడా సేవింపందగును.)

## మధువాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] జ్వరః పాండుశ్ఛహిక్కాచ నాసికాకుసుమంతథా । దేహక్లండూశ్చిరః కండూఃకఫస్యాన్మధువాతకే॥

తా. శరీరము పాండువర్ణముగ నుండుట యెక్కిళ్ళుగలుగుట ముక్కున నెత్తురుగారుట శరీరము శిరమున దురదగలుగుట దగ్గుగలుగుట ఈ లక్షణములతోడ జ్వరముగలిగి నోరు తీపిగనుండుటయే మధువాతమని తెలయవలయును.

## మధువాతహర ఘుటికలు.

శ్లో॥ పిప్పలీ పిప్పలీమూలం హింగులంచ శిలాజతు
గుగ్గులుం వర్ధమానంవా మాక్షికేన గుడేనవా ।
పథ్యాశుత్యం మృతాక్వాథ పిప్పలీ చూర్ణమిశ్రితమ్ ।
భక్షయే న్నిష్కమాత్రంతు మధువాథం వినాశయేత్ ।

తా. పిప్పలి పొడి శుద్ధిజేసిన యింగిలీకము కర్పూరశిలాజిత్తు శుద్ధిచేసిన గుగ్గిలము ఆముదము వీనిని సమభాగములుగ ఖల్వమునవైచి అందు తేనెగాని బెల్లముకలిపి మర్దించి నిమ్మ ప్రమాణమంతేసి మాత్రలుజేసి యందొకదానిని కరక్కాయ కొంత తిప్పతీగె అనువాని కషాయానుపానములో పిప్పలిచూర్ణము కలిపి సేవించిన మనువాతము హరించును.

## వస్తివాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] సజ్వారంచాగ్ని మాంద్యంచనిద్రాభంగవిదాహకృత్ । మహావరోధనం దుఃఖం శిరోభంగః పరిభ్రమః । అతిమూర్ఛాతి శీతంచ వస్తివాతస్య లక్షణమ్॥

తా. అగ్నిమాంద్యము గలుగుట లేక కడుపులో మండుట నిదుర రాకుండుట విదాహముగలుగుట శరీరము మిక్కుటముగ బద్ధగించుట కడుపునొప్పులు తలనొప్పి గలుగుట తలదిరుగుట కడుమూర్ఛగలుగుట శరీరము కడుచల్లగనుండుట ఈ లక్షణములతోడ తీవ్రజ్వరముగలిగి పొత్తికడుపు నొచ్చుటయే వస్తివాతమని తెలియవలయును.

## వస్తివాతమునకు సచ్ఛందభైరవ రసము.

శ్లో॥ శుద్ధసూతం విషంచాభ్రం హింగుళం బలితాళకమ్ ।
తుల్యంతుల్యం ఖల్వమధ్యే క్షిపేన్మర్ద్య దినత్రయమ్ ।
చూర్ణకృత్వా తతోదేయం మత్స్యసూర్ణ వరాహకే ।
పిత్తేదిన త్రయంభావ్యం మాషమార్ద్రానుపానతః ।
వస్తివాతం నిహంత్యాశు చాత్యుగ్రం నాశయే ధ్రువమ్ ॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన వసనాభి అభ్రకభస్మము శుద్ధిచేసిన ఇంగిలీకము శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన తాళకము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకు కషాయముతో మూడుదినములు బాగుగమర్దించి కుక్కుటపుటంబిడి సాంగశీతలమున దీసి ఖల్వమునవైచి చూర్ణముజేసి చేప తాబేలు అడవిపంది అనువానిచేదులలో ప్రతిదానిచే ఒక్కొకదినముచొప్పున మూడుదినములు భావనచేసి మాషప్రమాణమంతేసి మాత్రలుజేసి అల్లపురసానుపానములో సేవింపుచుండిన అత్యుగ్రమైన వస్తివాతము హరించును.

శ్లో॥ క్షుతఘాతశ్చ దౌర్బల్య మన్న ద్వేషో వికారితా।
అగ్నిమాంద్యం జ్వరంతృష్ణా క్షుతవాతస్య లక్షణమ్॥

తా. స్వతము క్షయించుట అన్నద్వేషము శరీరమున వికారములు మాంద్యము లేక కడుపులోమంట దప్పిగలుగుట ఈలక్షణములతోడ జ్వరము తరుచుగ తుమ్ములుగలుగుటయే క్షుతవాతమని తెలియవలయు. (ఇది హరిం రసకర్పూరము నేని వాతారిరసము నేని సేవింపవలయు. పైజెప్పబడిన పదకొ జ్వరవాతములు వానిలో శుభకరనాదులు గలిగియుండిన సాధ్యమని నెఱిం త్రింపవలయును.

## శృంఖలవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిధానే] దేహంచపాండుశుష్కంచ నిద్రానా రోవ్యథా । వాంతిర్హిక్కా చవిశ్లేషటశ్శృంఖలవాతలక్ష

తా. శరీరము పాండురవర్ణముగ నుండుట శరీరముకృశించుట నిదుర డుట, తలనొచ్చుట వాంతులు ఎక్కిళ్ళుగలుగుట ఈ లక్షణములతోడ శరీర కంతులుకట్టుటయే శృంఖలవాతమని తెలియవలయును.

## శృంఖలవాతమునకు త్రిగుణాఖ్యరసము.

శ్లో॥ శుద్ధ సూతం విషంగంధం చాభ్రకం చామ్లవేతసం । ద్వి భావయేత్ఖల్వే హంసపాదిరసైస్తథా । కాచకుప్యాన్ని వే తకుక్కుటీ పుటపాచితమ్ । భావితం మత్స్యపిత్తేన ద్విగు భక్షయేత్సదా । అనుపాన విశేషేణ శృంఖలవాతనాశనం పథ్యంక్షీరోదనం దేయంనారికేళ జలవృతమ్॥

తా. మద్దిజేసిన రసము శుద్ధిజేసిన వసనాభి శుద్ధిజేసిన గంధకము అ భస్మము అమ్లవేతసము వీనినెల్ల సమభాగములుగ ఖల్వములో నునిచి హంస యాకురసమున రెండుదినములు మర్దించి గాజుకుప్పెలో నునిచి కుక్కుటపుటం సాంగశీతలమునదీసి మరల ఖల్వములో నునిచి జేపచేదున భావనచేసి రెండుగురి లంతేసి మాత్రలుజేసి యందొక దానిని వసకషాయముతో నేని ఒరగొమ్మ చె

రసము మిరియాలు అనుపానితో నేని సేవించిన శృంఖలవాతము హరించును. దీని యందు పాలఅన్నమును బెంకాయరసముతో తడబడిన యన్నమును భుజించుట పథ్యకరంబు. మఱియు నిశ్శృంఖలవాతమున రసకర్పూరమును అనుపానముగ గ్రహింపవలయును.

## విస్ఫోటవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] దేహస్య భ్రమణంచైవ హిక్కాతీవ శిరో భ్రమః । నేత్రశూలంమహారోగో విస్ఫోటవాతలక్షణమ్ ॥

తా. శరీరము తిరుగుట ఎక్కిళ్ళుగలుగుట మిక్కుటముగ తలతిరుగుట నేత్రములు శూలించుట కడుపీడగలుగుట ఈలక్షణములతోడ; శరీరమున మంటలు చెమటకాయగలుగుటయే విస్ఫోటవాతమని తెలియవలయును. ఈ వాతము హరించుటకై శృంఖలవాతచికిత్స నే జేయవలయును. మఱియు రసఉబ్బ వేయవలయును.

## స్నాయకవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] దేహస్యస్ఫుటితంపుంసాంహ్యంగవై । కల్య పీడనమ్ । దేహశోషో నేత్రశూలంస్నాయువాతస్యలక్షణమ్ ॥

తా. అంగములు నొచ్చుట శరీరమున పీడగలుగుట శరీరము వాచుట నేత్రములు నొచ్చుట, ఈ లక్షణములతోడ శరీరము పగులుటయే స్నాయుకవాతమని తెలియవలయును.

## స్నాయుకవాతమునకు పంచాననకల్పము.

శ్లో॥ మృతసూతం తథాగంధం కాంతం చాభ్రకమేవచ । తామ్ర భస్మమృతం సమ్యక్ నిష్కార్థం శిఖితుత్థకమ్ । సింధువారస్య భృంగస్య పత్రచూర్ణం పలత్రయమ్ । ఖాదిరం ద్విపలంచైః సర్వంసంచూర్ణ్యనిక్షిపేత్ । స్నిగ్ధభాండేవినిక్షిప్య ద్వికాలం భక్షయేత్సుధీః । నిష్కార్థమాత్రం సేవేత పథ్యం తక్రౌదనం హితమ్ । లవణ క్షౌరకామ్లాని వర్జయిత్వాని షేవయేత్ । చిరకాలసముద్భూతం వాతంస్నాయుక సంజ్ఞితమ్ । నాశయే న్మాత్రనం దేహో ముక్తకం చూరగా ఇవ ॥

తా. రసభస్మము శుద్ధిజేసిన గంధకము కాంతభస్మము అభ్రకభస్మము శుద్ధ తామ్రభస్మము ఇవి దినుసుయొకటింటికి నాలుగేసితులము శుద్ధిజేసిన మైలుతుత్తము అర్ధనిష్క ప్రమాణము వావిలియాకుచూర్ణము గుంటగలగరాకుచూర్ణము చంద్ర చెక్క చూర్ణము ఇవి దినుసుయొకటింటికి 2 పలములు ఇలుల వానినెల్ల నేకముజేసి మర్దించి నున్నని క్రొత్తకుండలో నునిచి సాయంప్రాతఃకాలముల అర్ధనిష్క ప్రమాణము చొప్పున ఉష్ణోదకముతో సేవింపుచుండిన చిరకాలముగ బాధింపుచుండువాత కంతులుహరించి శరీరము కూసమువిడచిన పామువలె నగుదీనియందు ఉప్పు కారము పులుసు మైధునము మొదలగువానిని వర్జించి మజ్జిగయన్నమును భుజించుట పథ్యకరము.

## స్నాయుకవాతమునకు భుజగరాజచూర్ణము.

శ్లో॥ తాపసద్రుమమూలస్య త్వక్చూర్ణి తాపునః । క్రమాత్తదర్థం మరిచం తదర్థంచ లవంగకమ్ ॥ సర్వం సమాంశకం చూర్ణం శర్కరాసహితంభజేత్ । ఉష్ణోదకేనసంమిశ్రమథవా ఘృతసంయుతమ్ । నవాతపిటకాన్ హంతివివిధాన్ వాతసంభవాన్ । నాశయేస్నాత్రసందేహోముక్తకం చూరగా ఇవ ॥

తా. గారవేళ్ళచూర్ణము 1 శేరు మిరియపుచూర్ణము ½ శేరు లవంగపు చూర్ణము 1 శేరు ఇటుల వీనినెల్ల నేకముజేసి దానికి సమముగ పంచదారగలిపిసాయం ప్రాతఃకాలముల బూట 1 ½ తులము చొప్పున ఉష్ణోదకముతో నేని లేకఆవునేతితోనేని సేవింపుచుండిన వాతమువలన బుట్టిన నానావిధవాతపిటికలు హరించి శరీరము కూపమువిడిచిన పామువలె నగును. (మఱియు నీచూర్ణసేవన కాలమున పూటకు రెండు వీసములయెత్తు పచ్చకర్పూరమును గలిపి సేవింపవలయును.)

## గృధ్రవాత లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] స్ఖలనం వాతశోఫాచ కరపాద విదాహకృత్ । స్వేదోమూర్ఛాభ్రమస్తృష్ణా గృధ్రివాతస్య లక్షణమ్ ॥

తా. శరీరము వాతపూరితముగ నుండుట శరీరమువాచుట చేతులు కాళ్ళు మండుట చెమట మూర్ఛ తబ్బిబ్బుమాటలు దప్పిగలుగుట ఈలక్షణములతోడ ఇంద్రి

యము స్ఖలనంబగుటయే గృధ్రవాతమని తెలియవలయును. దీనియందు పూర్ణచం ద్రోదయము నేని చింతామణిరసము నేని సేవింపవలయును.)

## గృధ్రివాతమునకు ద్రాక్షాది ఘుటికలు.

శ్లో॥ [సిందూరమణిదర్పణే] ద్రాక్షా యష్టీకర్జూర మేలాత్వక్ప త్రకేసరమ్ । మధుకులీచందనంచ ముసలీకందమేవచ । ప్రియాళుమజ్జాసంతుల్యాం సర్వాంశం జాతికాఫలమ్ । సింధూరమష్టభాగంచ నవనీతేన మిశ్రితమ్ । మహావీర్యకరోవృద్ధిం వనితా శతసంగమమ్ ॥

తా. ద్రాక్షపండ్లు అతిమధురము ఖర్జూరపండ్లు ఏలకులు లవంగపుచెక్క ఆకుపత్రికె నాగకేసరములు తేనె తంగేడువిత్తులు శ్రీగంధము నేలతాటిగడ్డలు మొరలిబంక వీనిని సమభాగములుగా గ్రహించి వానికి సమముగ జాజికాయలు పైవానికన్నిటికి కెనిమిదవభాగము సిందూరముగలిపి ఖల్వమున మర్దించి ఆసిందూరములో ప్రాతఃకాలమున చిన్నప్రమాణము సాయంకాలమున చిన్నప్రమాణం బుండునటుల మాత్రలుజేసి వానిని అవువెన్నతో 1 సంవత్సరము సేవింపుచుండిన నష్టవీర్యదోషము హరించు వీర్యవృద్ధిని దండవృద్ధిని నూఱుగురు స్త్రీలతో రమించు శక్తిని గలుగంజేయును. మఱియు దీనిని సేవించునపుడుఆవునూనె పులుసు స్త్రీ సంగమము ఈ మొదలగు వానిని వర్జించి మధురాహారముల సేవింపవలయును.)

## పాంశువాత లక్షణము.

శ్లో॥ స్ఖలనం పాయుమేఢ్రేచ కరపాద నిదాహకృత్ ।
స్వేదోమూర్ఛా భ్రమస్తృష్ణా పాంశువాతస్య లక్షణమ్ ॥

తా. చేతులు కాళ్ళు మండుట చెమట మూర్ఛగలుగుట తబ్బిబ్బులాడుట దప్పిగలుగుట ఈ లక్షణములతోడ ఆపనమేఢ్రముల వీర్యము స్రవించుటయే పాంశువాతమని తెలియవలయు. (ఈవాతమనందు వాతగజాంకుశరసము నేని వాతారిరసము నేని సింధూరమును జబిలికెవేళ్లరసముతో నేని సేవించిన యది హరించునని నిత్యనాధీయమున జెప్పంబడియున్న యది స్త్రీసంగమమున వీర్యము స్ఖలితమై శరీరము చలువగొనుట చెమట మూర్ఛ భ్రమలుగలుగుట శరీరము వణకుట కాళ్ళుతీసుట

ఈ లక్షణములు గలది స్ఖలనవాతమని తెలియవలయును. దీనియందు వాతగజాంకుశరసముగాని వాతారిరసముగాని ప్రయోగించవలయును.

## శుక్లవాత లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] ఇంద్రియంపుంస్త్వవర్జ్యంచ విదాహంచ
కారితామ్। అంతర్వాయుః ప్రకుర్వీత శుక్లవాతస్యలక్షణమ్

తా. శరీరము మండుట శరీరమున వికారము గలుగుట అంతర్వాతము ప్రకోపించుట ఈలక్షణములతోడ శుక్రములోన యినికిపోవుటయే శుక్లవాతమని తెలియవలయును.

## శుక్లవాతమునకు ఫణిపతిరసము.

శ్లో॥ శుద్ధసూతం సమంగంధం చాభ్రకం లోహభస్మకమ్ ।
తామ్రభస్మ సమంమర్ద్యం జంబని రేణసంయుతమ్ ।
ద్విదినం గుళికాకార్య కాచకుప్యాం వినిక్షిపేత్ ।
విలేప్య మృత్తికావస్త్రం వాలుకాయంత్ర కేపచేత్ ।
షడ్యామం తేసముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్
అనుపాన విశేషేణ శుక్లవాతం నిహంతిచ ॥

తా. శుద్ధిచేసిన పాదరసము శుద్ధిజేసిన గంధకము అభ్రకభస్మము లోహభస్మము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వమునవుంచి నిమ్మపండ్లరసములో 2 దినములు మర్దించి ముద్దజేసి గాజుకుప్పెలో నుంచి చీలమన్ను లేపనముజేసి ఎండించి వాలుకాయంత్రమున నుంచి 6 ఝాములు వండి స్వాంగశీతలమున దీసి 1 గురిగింజయెత్తు ఔషధమును తీటకోవిలవేళ్ళ చూర్ణముతోగాని లేక నెయ్యి మిరియపు చూర్ణముతోగాని సేవించిన శుక్లవాతము హరించును.

## నష్టేంద్రియ నిదానము.

శ్లో॥ ఉష్ణద్రవ్యాణిపథ్యాని హ్యుష్ణవీర్యంచ జాయతే ।
వీర్యేణ తేనమేహశ్చ మేహరోగస్స ఉచ్యతే ।
మేహేపి వీర్యనాశశ్చ చికిత్సాంకురుతేభిషక్ ।
పూర్ణచంద్రోదయంపేయం క్షీణరేతోహరం పరమ్ ॥

తా. ఉష్ణద్రవ్యములు శరీరమున కఫధ్యకరంబులు వానివలన ఉష్ణవీర్యమును ఉష్ణవీర్యమువలన మేహరోగంబును మేహరోగమువలన వీర్యనష్టమును గలుగు ఈవీర్య నష్టమునకు పూర్ణచంద్రోదయమును 1 సంవత్సరము సేవించిన యదిహరించు. (మఱియు ఇంద్రియస్ఖలనముగలిగెడి సర్వవాతములయందును పూర్ణచంద్రోదయమును సేవింపవలయును.)

నష్టేంద్రియమునకు వాతాంతకరసము.

శ్లో॥ [ఆయుర్వేదే] హేమార్క కాంతలోహాభ్రం సూతభస్మంచ గంధకమ్ । వైక్రాంతం విద్రుమజ్చైవ తారంతాళ సమన్వితమ్ । సుముహూర్తే ఖల్వమధ్యే చిత్రమూలస్య చద్రవైః । చతుర్యామంచ సంమర్ద్యం ఛాయాశుష్కంచ కారయేత్ । కుక్కుటీ పుటపాకేన సాంగశీతలముద్ధరేత్ । ఇదంచచూర్ణితం శ్లక్ష్ణం తదర్ధం సూతభస్మకమ్ । మూతతుల్యం మృతంతాళం సర్వంఖల్వే విమర్దయేత్ । చిత్రకార్ద్రకనీరేణ నిర్గుండీవారుణీద్రవైః । వాసాజంబక నీరేణ సప్తభావ్యం పృథక్పృథక్ । గుంజామాత్ర ప్రయోగేణకణామధ్వాజ్య సంయుతమ్ । సుప్తవాతం వాతశూలం వేదనా వాతమేవచ । స్నాయుకంపంగాత్రభంగం పక్షఘాతం హనుగ్రహమ్ । వాయోరూర్ధ్వార్ధ్వంచ తిమిరంవాతా శీతంచ నాశయేత్ । నంధ్యాచలభతే గర్భం నష్టంవీర్యం ప్రశస్యతే । వాతాంతం రసోనామ్నా సర్వరోగ నివారకః ॥ లోకోపకరణార్థాయహ్యశ్వినీ దేవనిర్మితః

తా. సువర్ణభస్మము తామ్రభస్మము కాంతభస్మము లోహభస్మము అభ్రంభస్మము రసభస్మము శుద్ధిచేసినగంధకము వైక్రాంతభస్మము పగడభస్మము రజితభస్మము తాళకభస్మము వీనిని సమభాగములుగ మంచిముహూర్తమున ఖల్వమునునించి నాలుగుఝాములు చిత్రమూలరసముతో మర్ధించి బిళ్ళచేసి నీడనెండించి కుక్కుటపుటంబిడి సాంగశీతలమునదీసి సూక్ష్మముగ చూర్ణముచేసి దానికి అర్ధభాగము రసభస్మము తాళకభస్మము కలిపి చిత్రమూలము అల్లము వావిలి చాగ అడ్డసరము నిమ్మకాయ అనువాని రసములలో ప్రతిదానిచే ఏడేసిమార్లు మర్ధించి ఏడేసి

నూర్లు భావనజేసి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని పిప్పలి చూర్ణము తో నేని తేనెతో నేని యొసంగిన సుప్తవాతము వాతశూలము వేదనావాతము స్నాయుకవాతము కంపవాతము గాత్రభంగవాతము పక్షఘాతవాతము హనుగ్రహవాతము మూర్ఛావాతము తిమిరవాతము ఈమొదలగు ఎనుబదివాతములు నశించుటయే గాక గొడ్రాలుగనుండు స్త్రీ గర్భమును ధరించు. మఱియునష్టవీర్యముసగా శాంతి జెందు. ఇదిలోకోపకారమునకై అశ్వినీదేవతలచే సర్వరోగనివారణార్థంబై నిర్మింపబడిన వాతాంతకరసము.

## సూతికవాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] అంగమర్దోజ్వరః కంపో పిపాసాగురు గాత్ర
తా । శోకశ్శోఫోతి శీతంచసూతికావాత లక్షణమ్ ॥

తా. శరీరమంతయునొచ్చుట శరీరముగురొప్పొడుచుట దప్పిగలుగుట శరీరము బరువై యుండుట కండ్లనీరుగారుట శరీరమున శోఫగలుగుట శరీరము కడుచల్లగనుండుట ఈలక్షణములుగలిగి జ్వరమును కంపమును గలిగియుండుటయే సూతికావాతమని తెలియవలయు.

## సూతికావాతమునకు బడబానలరసము.

శ్లో॥ శుద్ధసూతం చైకభాగం తామ్రభస్మ చతత్సమమ్ ।
ద్విభాగం గంధకంచైవ త్రిభాగంచ కటుత్రయమ్ ।
వహ్నినామాచైకభాగం కోష్ఠభాగంచ తత్సమమ్ ।
జ్వాలాముఖీ రసైర్మర్ద్యం బదరాస్థి ప్రమాణకమ్ ।
బడబానల నామాయం సూతికావాత నాశనః ॥

తా. శుద్ధిజేసినరసము 1 భాగము తామ్రభస్మము 1 భాగము శుద్ధిజేసినగంధకము 2 భాగములు త్రికటుకములు 3 భాగములు చిత్రమూలము 1 భాగము చంగల్వకోష్టు 1 భాగము ఇటులవీనినెల్ల ఖల్వమునవునిచి నములిచెక్కరసమున 1 దినము మర్దించి రేగుగింజలంతేసి మాత్రలుజేసి యందొకదానిని మినుపకట్టు వెల్లుల్లిరసము అనువాని యనుపానముతో నేని లేక తీటకశింవవేళ్ళరసానుపానముతో నేని లేక ముల్లు వెలగచెక్కరసము మిరియపుచూర్ణముతో నేని సేవించిన ప్రసూతివాతము హరించు. మఱియు (ప్రాణేశ్వర రసమునుగాని లేకసంజీవినీరసమునుగాని సేవించిన సూతివాతము హరించు.)

## సూతికావాతమునకు వాతవిధ్వంసకరసము.

శ్లో॥ [మాధవనిదానే] రసం గంధకం నాగవంగంచలోహంతథా తామ్రమజంవ్యోమ నిశ్చంద్రకంచ । కణాటంకణం చోషణం నాగరంవై పృథగ్భాగమేకం క్షిపేత్ఖల్వమధ్యే । తతోవత్స నాభంచ తుష్యార్ధభాగం దృఢం మర్దయే ద్వ్యోషజైశ్చ త్రివారమ్। వరాచిత్రకైర్భార్కకుష్ఠేస్త్రి వారంపృథగ్భావ యే * త్సింధు వారార్ద్రవాసైః। తథామోహినీ జంబనీరైః పృథగ్వై మహాన్ వాతవిధ్వంస కోయంరసశ్చ । సమీరేచ శూలేతథా శ్లేష్మరోగో గ్రహణ్యాంతథా సన్నిపాతేచమూకే । అపస్మారమాంద్యేచ శీతే చపిత్తేస ప్లీహోదరే కుష్ఠ రోగేచదద్యాత్ । స్త్రీయసూతికావాద రోగేతథైవ ద్వి గుంజః ప్రదద్యాదిమం సూతరాజమ్॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిజేసినగంధకము సీసభస్మము తగరభస్మము లోహ భస్మము తామ్రభస్మము తళుకులులేని అభ్రకభస్మము పిప్పళ్ళు శుద్ధిజేసిన వెలి రము మిరియాలు శొంఠి ఇవిదినుసుకొక్కొక భాగము శుద్ధిచేసినవసనాభి 4½ గము ఇటుల వీనిని ఖల్వమునఁనునిచి శొంఠి పిప్పళ్ళు మిరియాలు అమవాని కషా ములతో మూడుపర్యాయములు నేలతాటిగడ్డలరసము చిత్రమూలరసము గుంటగ రాకురసము చంగల్వకోష్టుకషాయము అనువానితో మూడుమార్లును వావిలియా అల్లము అడ్డసరము గంజాయాకు నిమ్మపండ్లు అనువానిరసములతో ప్రత్యేకప్రత్యే ముగను మర్ధించి భావనజేసి గురిగింజలంతేసిమాత్రలుజేసి యందు 2 గురిగింజలం త్తును అనుపానవిశేషములతో సేవింపుచుండిన వాతరోగము శూల శ్లేష్మరోగను గ్రహణి సన్నిపాతము మూకవాతము అపస్మారము అగ్నిమాంద్యము శీతపిత్తము ప్లీహోదరము కుష్టువు హరించు (లేక నక్కపేటాసరసముతో పిప్పళ్ళుకలిపి సేవింపు మండిన ప్రసూతివాతము హరించు) ఇదియు రసములలో శ్రేష్ఠమయిన వాతవిధ్వం సక రసము.

---

* సింధువారార్కవాసైః.

## త్వగ్వాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] దేహస్ఫోటన సర్వాంగపాదమూల విదారణమ్ । కరపాద విదాహశ్చ త్వగ్వాతస్యచ లక్షణమ్॥

తా. సర్వాంగములు కాళ్ళుపగులుట చేతులు కాళ్ళుమండుట ఈలక్షణముల తోడ శరీరము పగులుటయే త్వగ్వాతమని తెలియవలయు (దీనియందు రసకర్పూరము నేని బోడతరపాకరసముతో వాతారిరసము నేని 40 దినములు సేవింపవలయు.)

## భోగవాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] విధూమంచ విదాహశ్చ హ్యోమ్లకంపశ్చ దేహినామ్ । విస్పష్టం వాయుకోపశ్చ హ్యంగవైకల్య కారితాః।
నేత్రశూలం శిరశ్శూలం భోగవాతస్య లక్షణమ్॥

తా. పులితేనుపులువచ్చుట శరీరము విదాహించుట శరీరము పులుసుకంపు వేసుట శరీరము వణుకుట వాయువుప్రకోపించుట అంగములునొచ్చుట నేత్రములు శిరముశూలించుట ఈ లక్షణములుగలిగి శరీరము సర్పమువలె ముడుచుకొనుటయే భోగవాతమని తెలియవలయు.

## భోగవాతమునకు ఏరండమూలచూర్ణము.

శ్లో॥ స్థూలైరండకమూలస్య కర్షంఘృష్ట్వా జలైః పిబేత్ ।
భోగవాతవికారంచ సర్వవాతంచ నాశయేత్ ॥

తా. పెద్దాముదపు వేళ్ళనుదంచి చూర్ణముజేసి కర్షప్రమాణము ప్రాచినీళ్ళలోకలిపి 40 దినములు సేవించిన భోగవాతము సర్వవాతములు హరించు (దీనియందు కాలాగ్ని రుద్రరసమునుసగా సేవింపదగు.)

## భోగవాతమునకు రసకర్పూరము.

శ్లో॥ రసకర్పూర మమృతం వాతాశీతి వినాశనమ్॥

తా. రసకర్పూరము అమృతతుల్యంబగుటచే 80 వాతముల హరింపంజేయు సర్వశాస్త్రములు జెప్పుటంజేసి భోగవాతమున సేవింపవలయు.

## కిక్కిసవాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] కటిప్రదేశశూలంచ మహాశూలా వరోధనమ్
పాదేపీడా శిరోఘ్రాణే కిక్కిసవాత లక్షణమ్ ॥

తా. శరీరమంతట శూలించుట లేక శరీరమంతట పట్టుకొనుట పాదములు నొచ్చుట తలశూలించుటముక్కునొచ్చుట ఈలక్షణములుగలిగి మొలచుట్టు శూలించుటయే కిక్కిసవాతమని తెలియవలయు.

## కిక్కిసవాతమునకు మహాకర్పూరము.

శ్లో॥ రసకర్పూర మమృతం వాతాశీతి వినాశనమ్ ।
మహాకర్పూర సేవేయం కిక్కిస వాతనాశనీ ॥

తా. రసకర్పూరము అమృతసమానంబగుటచే 80 వాతములహరింపంజేయు. అట్లగుటంజేసి కిక్కిసవాతము హరించుటకై రసకర్పూరమును సేవింపవలయు. మఱియు రసఊబ్బను వేయవలయు.

## కటివాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] కటిభంగోవికారశ్చ మహాశూలంచ క్రోధ
కృత్ । అపస్మారీచ దుర్భాషీ కటివాతస్య లక్షణమ్ ॥

తా. మొలచుట్టు పగలగొట్టునటుల నొచ్చుట శరీరవికారము కడుకోపము అపస్మారముగలుగుట దుర్భాషలాడుట ఈలక్షణముగలిగి మిక్కుటముగ నడుము శూలించుటయే కటివాతమని తెలియవలయు.

## కటివాతమునకు వాత కేసరీరసము.

శ్లో॥ హింగుళం వత్సనాభంచచక్రాంగీ త్రికటుంవచామ్ ।
చిత్రమూలకషాయేణ సమభాగం విమర్దయేత్ ।
డోలాయంత్రేష చేదామ్యం కటివాతం నిహంతిచ ॥

తా. శుద్ధిజేసిన ఇంగిలీకము శుద్ధిజేసిన వసనాభి కటుకరోహిణి త్రికటుకములు రస వీనిని సమభాగములుగ ఖల్వమునమునిచి చిత్రమూల కషాయముతో మర్దించి ముద్దజేసి డోలాయంత్రమున ] ఝాముఉండి సేవనలేపనముల సేయుచుం

డిన కటివాతము హరించు. [ఈ కటివాతము హరించుటకై కిక్కిసవాత చికిత్సలను సగాచేయవలయు.]

### మలబద్ధవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] పక్షస్యారా పగ్నితాపో మూత్రబంధ ॥ తిస్మృతిః । ఆనాహశ్చశిరఃకంపో మలబద్ధస్య లక్షణమ్ ॥

తా. బొమ్మ తొడలు మండుట మూత్రము వెడలకుండుట కడుపుబ్బుట తలవణుకుట ఈలక్షణములు గలిగి మలము బంధించుటయే మలబద్ధవాతమని తెలియవలయు [ఇది * యాప్యము.]

### మలబద్ధవాతమునకు వాకుచ్యాదిచూర్ణము.

శ్లో॥ శతశోభావితం మూత్రంభావయేత్తేన వాకుచీమ్ ।
పలద్వయం శారిబాచ తథా కృష్ణ తిలాన్వితమ్ ।
కైడర్యం శంఖపుష్పీచ సమభాగం విచూర్ణయేత్ ।
ఉష్ణోదకే పిబేచూర్ణం మలబద్ధం వినాశయేత్ ॥

తా. భావంచివిత్తులు 2 పలములు గూడపాల నల్లనువ్వులు † పెద్దమ్రాను చెక్క కట్లచెక్క వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి అనేకమార్లు వడియకట్టబడిన మేకమూత్రముతో భావవజేసి ఉష్ణోదకముతో ప్రాతఃకాలమున సేవించిన మలబద్ధ వాతము హరించు.

### మూత్రబద్ధవాత లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] అసీహతామూత్ర విదాహికాచ కంఠావరోధో గుదకేంకంచ । ఆధ్మానముక్తం హృదయూచరోధో మూత్రంవిబద్ధం త్వితీవాతవిద్భిః ॥

తా. శరీరము వెలవెలబారుట మూత్రద్వారము మంకుట మెడపట్టుకొనుట మూలవ్యాధిగలుగుట బొమ్మపట్టుకొనుట ఈలక్షణములతోడ కడుపుబ్బి మూత్రము వెడలకుండుటయే మూత్రబద్ధవాతమని తెలియవలయు. [ఇది యాప్యము.]

* యాప్యమన—శరీరముండువరకు మానకుండురోగములు

† ఇదే గుమ్ముడుతేకు అనియు జెప్పంబడు.

## మూత్రబద్ధవాతమునకు వాతవిద్రావణరసము.

శ్లో॥ సూతాభ్రతామ్రతీక్ష్ణం మృతంతాళకగంధకమ్ ।
భార్గీశుంఠీ వచాధాన్యా కట్ఫలంచా భయావిషమ్ ।
మర్ద్యం పర్పట కద్రావై ర్దిన్మైకం పక్షయేద్వటీమ్ ।
మూత్రబద్ధ వినాశాయ సర్వవాత ప్రశాంతయే॥

తా. రసభస్మము అభ్రకభస్మము తామ్రభస్మము లోహభస్మము తాళక భస్మము శుద్ధిచేసినగంధకము గంటుభారంగి శొంఠి వస కొతిమిర్లు * పెద్దనుమ్ముడు కరక్కాయలు అతివస వీనిని సమభాగములుగ ఖల్వమునవుంచి పర్పాటకరసముతో 1 దినము మర్దించి నిమ్మ ప్రమాణమంత మాత్రలుజేసి సేవించిన మూత్రబద్ధ వాతము సర్వవాతములు హరించు.

## ఊరు స్తంభవాత లక్షణము.

శ్లో॥ ఊరు స్తంభశ్చ మేఢ్రేచ గుదేపాదేచ శూలకమ్ ।
రక్తవాంతి ర్నఖేశూల మూరువాతస్య లక్షణమ్ ।

తా. మేఢ్రము గుదముపాదములు శూలించుట నెత్తురుగ్రక్కుట గోళ్ళు నొచ్చుట ఈలక్షణములతోడ తొడలు స్తంభమువలె కదలక శూలించుటయే ఊరు స్తంభవాతమని తెలియవలయు. [ఇది అసాధ్యము.]

శ్లో॥ [గ్రంథాంతరే] దేహంచ పాండురంమూత్రం దేహనేత్రేచ కంపనమ్ । శరీరేచ వికారోస్తు మూరువాతః ప్రకీర్త్యతే॥

తా. శరీరము పాండువర్ణముగ నుండుట మూత్రము పాండువర్ణముగ వెడలుట శరీరమువణకుట నేత్రములు తిరుగుట శరీరము వికారముగనుండుట ఈలక్షణములు గలిగి తొడలు కదలక శూలించుటయే ఊరువాతమని తెలియవలయు. [ఇది అసాధ్యము ఈ వాతమునకు హరించుటకై రసకర్పూరమును సేవింపవలయు.]

## ఊరు స్తంభవాతమునకు వాతగజాంకుశరసము.

శ్లో॥ అష్టభాగా రసస్యాపి విషతిందో స్తథైవచ ।
గంధకస్య త్రిభాగంచ కటుత్రయ పలత్రయమ్।

† ఇదే గుమ్ముడు తేకు అనియు జెప్పంబడు.

గుంజామాత్రం వటీంఖాదే దశీతి వాతనాశనమ్ ।
వాతగజాం కుశోనామ్నా హ్యూరు స్తంభం నిహంతిచ॥

తా. శుద్ధిజేసిన పాదరసము 8 భాగములు 3 దినములు కలిలోనాన బెట్టివిష ముష్టిగింజలు 8 భాగములు శుద్ధిచేసిన గంధకము 8 భాగములు త్రికటుకములు 3 భాగములు త్రిఫలములు 3 భాగములు ఇటుల వీనిని ఖల్వమునను నిచి నిమ్మపండ్లు రసముతో బాగుగ మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందు 3 మాత్రలను నెయ్యి మిరియపు చూర్ణానుపానముతో నొసంగిన ఊరు స్తంభ వాతము మొదలగు 80 వాతములు హరించు.

## తిమిరవాత లక్షణము.

శ్లో॥ [మాధవకల్పే] దేహంతిమిరయుక్తంచ జగదేహోప సం
భవేత్ । దేహతాపశ్చాంగశోషో తిమిర వాతస్య లక్షణమ్॥

తా. శరీరము ఏపుగ చర్మముపలెనుండుట శరీరముమండుట అంగములు శోషించుట ఈలక్షణములుగలిగి శరీరమున చీమలుప్రాకినటుల తిమిరిగలుగుటయె తిమిర వాతమని తెలియవలయు.) ఇది యాప్యము మఱియు పంగువాతప్రకరణమున జెప్పంబడిన బ్రహ్మావళివటికముల నల్లకాచాపురసముతో నేని లేక ఉన్మాదప్రకణ మున చెప్పంబడు గంధకపిష్టము నేని 6 నెలలు సేవించిన తిమిరవాతముహరించు.)

## కంపవాత లక్షణము.

శ్లో॥ కరపాదతలే కంపో దేహ భ్రమణ దుఃఖితే ।
నిద్రాభంగో మతిఃక్షీణా కంపవాతస్య లక్షణమ్॥

తా. చేతులు కాళ్ళువణుకుట శరీరము తిరుగుట కడుదుఃఖము గలుగుట నిదురబట్టకుండుట జ్ఞానములేకుండుట ఈలక్షణములుగలిగి శరీరము వణుకుటయే కంపవాతమని తెలియవలయు (ఇదియాప్యము.)

## కంపవాతమునకు విజయభైరవరసము.

శ్లో॥ మృతసూతం మృతంతామ్రం మర్ద్యం గోకంటకద్రవైః । ఏక
వింశతివారంచ శోష్యం పేష్యంపునఃపునః । చణమాత్రవటీం
కుర్యాత్కంపవాతం వినాశయేత్॥

తా. రసభస్మము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి పల్లేరు వేళ్ళరసములో మర్థించి యెండింపవలయును. ఇటుల 21 దినము మర్థించి యెండించి శనగగింజలంతేసి మాత్రలుజేసి దుంపరాష్ట్నముతోగాని సెయ్యమిరియపుచూర్ణముతోగాని 6. నెలలు సేవించిన కంపవాతము హరించును.) (దీనియందు చప్పిడిపథ్యము నాచరించవలయును.)

## బాహుకంపవాత లక్షణము.

శ్లో॥ ఏకబాహు ప్రకంపశ్చ వికారశ్చాపి దేహినామ్ ।
మహాదుఃఖం దివారాత్రౌ బాహుకంపస్య లక్షణమ్ ॥

తా. శరీరవికారముకలుగుట రేయింబగలు కడుదుఃఖములుగలుగుట యీ లక్షణములు గలిగి ఒక చేయ్యి వణుకుటచే బాహుకంపవాతమని తెలియవలయు. (ఇది యాప్యము.)

## భాహుకంపవాతమునకు మాషతైలము.

శ్లో॥ మాషప్రస్థేహ్యాపామష్టౌ పాకేస్మిఁ పాదశేషితే । జీవనీయ
మిసీవ్యోషరాస్నా యష్ట్యాహ్వసైంధవైః ॥ ఆత్మగుప్తాయుతం
తైలం ప్రస్థంక్షీరం చతుర్గుణమ్ । వస్తికం చాపబాహుంచ
బాహుకంపం వినాశయేత్ ॥

తా. 4 శేర్లు మినుములనొకభాండములోవైచి దాని కెనిమిదింతలు నీళ్ళు బోసి చతుర్థాంశముగ కాచి అందు పాలకూర పిన్నసదాప త్రికటుకములు దుంపరాష్నము యష్టిమధుకము సైంధవలవణము దూలగొండివిత్తులు అనువానిచూర్ణము దినుసుకు పావుశేరు నూనె 4 శేర్లు పాలు 16 శేర్లు కలిపి చిక్కగాకాచి శరీరమునకు మర్దనచేయుచుండిన వస్తివాతము అపబాహువాతము బాహు కంపవాతము హరించు.

## బాహుకంపవాతమునకు కార్పాసతైలము.

శ్లో॥ [గ్రంథాంతరే] కార్పాసాసికకుత్థానాం క్వాథం తైలం ప
యోన్వితమ్ । సైంధవంచిత్రకాభ్యాంచస్నిగ్ధంతదపబాహుం

తా. ప్రత్తివిత్తులు 4 శేర్లు వులవలు 4 శేర్లు వీనిలో 32 శేర్లు వుదక బోసి 8 శేర్లు మిగులునటుల కషాయముకాచి అందు నూనె 4 శేర్లు పాలు 16 శే

కలిపి చిక్కగవండి దించునప్పుడు సైంధవలవణము చిత్రమూలము అనువానిచూర్ణము దినుసుకు పావు శేరువంతున కలిగి శరీరమునకు లేపనము సేయుచుండినను (లేక యీతాకును మేకపాలులోవై చికాచి ఒకసంవత్సరమువరకు సేవింపుచుండినను) అపబాహుకవాతము హరించు.

## శీతవాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] దేహేతి శీతలంమూర్ఛ నేత్రభ్రమణమేవచ।
కంఠశూలం శిరశ్శూలం శీతవాతస్య లక్షణమ్॥

తా. మూర్ఛ గలుగుట నేత్రములు శరీరము తిరుగుట మెడ శిరముశూలించుట యీలక్షణములు గలిగి శరీరము కడుశీతలముగ నుండుటయే శీతవాతమని తెలియవలయు. ఇది యాప్యము.

## శీతవాతమునకు అగ్నికుమారరసము.

శ్లో॥ సూతభస్మయికభాగంచశుల్బ భస్మతథైవచ। విషంచతత్సమంగ్రాహ్యంగంధకం ద్విగుణీకృతమ్। త్రికటుత్రిఫలాచైవ సర్వమేకత్ర మర్దయేత్। నిర్గుండీభావనీహ్ని వ్యాఘ్రీపాతాళకంతథా। కర్కోటీ కాకమాచీచ ఇంద్రంవారునికాతథా। ఏతేషాం సర్వసంగ్రాహ్యంభావయే శేకవింశతి। రసోహ్యగ్ని కుమారాఖ్యః ప్రత్యక్షం పరమేశ్వరి। సన్నిపాతేత్రిదోషేచ శీతాంగే వాతబంధనే। యమూలయన్యక ర్తవ్యం సూచికాగ్ర ప్రమాణకమ్। సన్నిపాతహరంచయివ శీతజ్వరనివ ర్తకమ్॥

తా. రసభస్మము తామ్రభస్మము శుద్ధిజేసిన వసనాభి యివి దినుసుకొకొక్క భాగము శుద్ధిజేసినగంధకము 2 భాగములు త్రికటుకములు 1 వ భాగము త్రిఫలములు 1 భాగము యిటుల వీనిని ఖల్వమున నునిచి వావిలాకు నేలములక వేళ్లు చిత్రమూలము యెఱ్ఱఆముదపువేళ్ళు దూసరితీగె గొడ్డుకాకర నల్లకాచాకు పాపటవేళ్ళు అనువాని రసములతో యిరువై యొక్కమార్లు మర్దించి భావనజేసిమిను పగింజలంత మాత్రలుజేసి అల్లపురసముతో నొసంగిన సన్నిపాతము త్రిదోషము శీతాంగవాతము వాతపట్లు హరించు. మఱియు సన్నిపాతజ్వరములవలన యమూలయమున కేగుటకు వున్ముఖుండుగ నుండు వానియొక్క నడినెత్తియందు వెంట్రుకలుతీసి యీయగ్నికుమారమును సూచ్యగ్రప్రమాణం బునిచి నెత్తురుతో గలియు

వరకు ప్రతిలో బాగుగరుద్దిన వాడు జీవించు. ఈ అగ్నికుమార రసము పరమే శ్వరునిచే పార్వతికి జెప్పంబడియె. (మఱియు దీనిని నెయ్యి మిరియపు చూర్ణాను పానము చేని లేక శొంఠి గుడానుపానముతో చేని లేక కొరుకునగ నడ్డ రసానుపాన ముతో చేని లేక శొంఠి వెల్లుల్లిరసానుపానముతో చేని సేవించిన లేక పైత్యప్రకర ణమున జెప్పంబడు బడబాగ్నిరసమును సేవించినను శీతవాతము హరించు.)

## సిరావాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] సార్వాంగంచసిరాదుఃఖం శరీరంచ చరాచ
రమ్। దేహః పాండుశ్చపీతశ్చ సిరావాతస్య లక్షణమ్ ॥

తా. అవయవములునొచ్చుట శరీరము దౌర్బల్యముగనుండుట శరీరము పాం డురవర్ణముగగాని పచ్చగగాని నుండుట యీ లక్షణములు గలిగి నరములు నొచ్చు టయే సిరావాతమని తెలియవలయు. (దీనియందు వాతగజాంకుశరసము చేని రస కర్పూరము చేని సేవింపవలయు.)

## సిరావాతమునకు ఏరండాదికషాయము.

శ్లో॥ ఏరండమూలం లశునం శుంఠీదార్వీపునర్నవా ।
సపిప్పలీ కృతక్వాథం సిరావాత హరంపరమ్ ॥

తా. ఆముదపువేళ్ళు వెల్లుల్లిపాయలు శొంఠి మ్రానిపసపు గలిజేరువేళ్ళు పిప్పళ్ళు వీనిని సమభాగములుగ దంచి కషాయముకాచి సేవించిన సిరావాతము హరించు.

## సిరావాతమునకు దేవాదార్వాదికషాయము.

శ్లో॥ దేహదారు బలావిశ్వ స్సై రే ర్యై స్సాధితంజలమ్ ।
పాయయేత్తైలమిశ్రంతు సిరావాత వికారహృత్ ॥

తా. దేవదారు ముత్తవపులగము శొంఠి ములుగోరింటవీనిని సమభాగములు కషాయము కాచి వడియకట్టి అందు 4 బిందువులు ఆముదముకలిపి త్రాగిన సి వాతము హరించును.

## నయనవాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] నయనేకంపరోగశ్చశిరోభ్రమణమూరుణిచ ।
ఉష్ణాంశ్రు సహితంనేత్రం నయనే వాతలక్షణమ్ ॥

తా. నేత్రములు అదురుచు తలతిరుగుట శరీరము వాతపూరితముగ నుండుట నేత్రములు మండుట నేత్రముల నీరుగారుట యీ లక్షణములు గలిగి నేత్రములు నొచ్చుటయే నయనవాతమని తెలియవలయును (మఱియు పరంగిచెక్కను సాయం ప్రాతఃకాలముల సేవింపుచు తియ్యనికూరలు అన్నము కందిపప్పు వీనిని భక్షింపు చుండినను లేక రసకర్పూరమును సేవింపుచుండినను నయనవాతము హరించు.)

## నాసావాత లక్షణము.

శ్లో॥ పూరితం కుసుమంఘ్రాణే నిర్వేదన మహాభయమ్ ।
శిరోభ్రమణపిత్తంచ నాసావాయా ప్రకీర్తితమ్ ॥

తా. శరీరము దుర్బలముగనుండుట కడుభయముగలుగుట తలవణుకుట శరీరము పిత్తాధికంముగ నుండుట యీ లక్షణములు గలిగి నాశికముపూరించి నెత్తురు గారుటయే నాసావాతమని తెలియవలయు. (ఇది హరించుటకై మఱ్ఱిపూడలచూర్ణమును నస్యము సేయవలయు.)

## నాసావాతమునకు నస్యము.

శ్లో॥ శర్కరాతిల కల్కాభ్యాం నానాఘ్రాణం ప్రయోజయేత్ ।
గశూచ్యాః పుటపాకంతు నిష్పీడ్యానేన నావయేత్ ।
నాసాయాంచ శిరోహృద్యం నాసావాయుర్వినశ్యతి॥

తా. పంచదార నువ్వులు వీనిని కల్కముగ వండి దానిని బట్టలోనునిచి నస్యము చేసినను లేక తిప్పతీగెను కుమ్ములోపక్కి యందు రసముతీసి ముక్కులో పిండినను నాసావాతము శిరోవేదన హరించు.

## నాసారక్తమునకు నస్యము.

శ్లో॥ గుడనాగరయోఃకల్క కోష్ణతోయేన నావనమ్ ।
సర్వసై ర్భృంగరాజస్య తూ్రిపణేనచ నావనమ్ ।
నాసావాతే శిరోమధ్యే లేప్యంరక్తం వినశ్యతి ॥

తా. నాసావాతము బెల్లము శొంఠి వీనిని వుష్ణోదకముతోనూరి కల్కము చేసి నస్యముచేసినను లేక శొంఠి పిప్పలి మిరియాలు వీనిని గుంటగలగరాకురసతో నూరి నస్యముచేసినను లేక శిరోమధ్యమున లేపనముచేసినను నాసారక్తము హరించు.

## ముఖవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిధానే] నిష్ఠీవనం కృశత్వంచ ముఖనాసాత్కఫస్యచ । దేహం కదూశ్చ శ్వాసశ్చ ముఖంవాత ప్రకీర్తితః ॥

తా. శరీరము కృశించుట శరీరమున దురద ఉబ్బసము గలుగుట ఈ లక్షణను గలిగి ముక్కున నోట తెమడగారుటయే ముఖవాతమని తెలియవలయు.

## ముఖవాతమునకు చతుర్ముఖరసము.

శ్లో॥ మృతసూతాభ్రకం తుత్థం వరాజార్తం శిలాజతు ।
గుగ్గులుశ్చ శిలాచైవం సమాంశం మధుమిశ్రితమ్ ।
భక్షయే న్మాషమేకంతు ముఖవాత ప్రశాంతయే ॥

తా. రసభస్మము అభ్రకభస్మము శుద్ధిజేసిన మైలుతుత్తము కలుపురాయి శుద్ధిజేసిన శిలాజిత్తు శుద్ధిజేసిన గుగ్గిలము శుద్ధిజేసిన మణిశిల వీనిని సమభాగములుగ తేనెలో మర్దించి మాషప్రమాణముంతేసి మాత్రలుజేసి భక్షించిన ముఖవాతము శమించు.

## ముఖవాతమునకు విళంగాది చూర్ణము.

శ్లో॥ విళంగ హింగ్వపామార్గ బీజనక్తాహ్వ సర్షపైః ।
అగ్నిం పురస్తాన్నిక్షిప్య ముఖవాతేచ ధూపయేత్ ॥

తా. వాయువిడంగములు ఇంగవ ఉత్తరేణివిత్తులు ఆవాలు వీనిని చూర్ణము జేసి అగ్నిలోవేసి పొగబట్టిన ముఖవాతము హరించు.

## ఉదరవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] ఉదరం శూలబద్ధంచ బాహుకంప శ్శిరో । వ్యధా । నిద్రానాశోతిపీడాచ వుదరవాతస్యలక్షణమ్ ॥

తా. చేతులు వణుకుట తలనొచ్చుట నిదురబట్టకుండుట శరీరమున పీడగలుగుట ఈ లక్షణములు గలిగి కడుపుశూలించి బంధించుటయే ఉదరవాతమని తెలియవలయు.

## కుక్షివాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] కుక్షిశూలం శోఫపాండు శిరోభ్రమణ కంతథా। నేత్రభ్రమో నాభిశూలః కుక్షివాతస్య లక్షణమ్ ॥

శరీరము వాచుట శరీరము పాండువర్ణముగ నుండుట తల నేత్రములు తిరుగుట బొడ్డుక్రింద శూలించుట ఈ లక్షణములు గలిగి కడుపుశూలించుటయే కుక్షివాతమని తెలియవలయు. [ఉదర కుక్షివాతములను ఏక చికిత్సంజేయువలయు.]

## అశీతివాతములకు కాలాగ్నిరుద్రరసము.

శ్లో॥ శుద్ధసూతం విషంగంధ మజామోదం ఫలత్రయమ్ । సర్జక్షారం యవక్షారం వహ్నిసైంధవ జీరకమ్ । సౌవర్చలం విడంగాని టంకణంచ కటుత్రయమ్ । విషముష్టి స్సర్వసమాజం బీరైమర్దయే ద్దినమ్ । మరీచమాత్ర వటికా హ్యగ్నిమాంద్యం ప్రణాశయేత్ । అశీతివాతజాన్ రోగాన్ గుల్మంచ గ్రహణీగదాన్ । రసఃకాలాగ్ని రుద్రోయం పూజ్యపాదేన నిర్మితః ॥

తా. శుద్ధిచేసిన పాదరసము శుద్ధిచేసిన వసనాభి శుద్ధిచేసిన గంధకము అజామోదము త్రిఫలములు సర్జక్షారము యవక్షారము చిత్రమూలము సైంధవ లవణము జీలకఱ్ఱ సౌవర్చలవణము వాయువిడంగములు శుద్ధిచేసిన వెలిగారము త్రికటుకములు వీనినెల్ల సమభాగములుగ దంచి చూర్ణముజేసి దీనికి సమముగ మూడుదినములు కలిలో నానబెట్టబడిన విషముష్టివిత్తుల చూర్ణమును కలిపి ఖల్వమున నిమ్మపండ్లరసముతో ఒకదినము మర్దించి మిరియపుగింజలంతేసి మాత్రలుజేసి నెయ్యి మిరియపు చూర్ణము అనువాని యనుపానముతో నొసంగిన అగ్నిమాంద్యము కుక్షివాతము మొదలగు ఎనుబదివాతములు గుల్మను గ్రహిణి హరించు. ఇదియ పూజ్యపాదునిచే వచింపబడిన కాలాగ్ని రుద్రరసము.

## అజీర్ణవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] మలస్య బంధోవయ వేచనదుఃఖ జంఘాది పాదేశిరశూలశోషణమ్।మందాగ్ని యోగోహ్యరు చిక్లమంచ హ్యజీర్తివాతఃప్రవరంతితజ్ఞాః ॥

తా. మలము బద్ధగించుట అవయవములు నొచ్చుట పిక్కలు మొదలు పాదములవరకు శూలించుట తలనొచ్చుట శరీరము ఎండుట అగ్నిమాంద్యము అరుచి బడలిక గలుగుట ఈ లక్షణములు గలిగి భుజించిన యన్నము అరిగి అరగకుండుటయే అజీర్ణవాతమని తెలియవలయు. [ఇది హరించుటకై వాతకజాంకుశరసము లేనిలేక రసభస్మము నేని సేవింపవలయు.]

## ఆమ్లవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అరుచి శ్చామ్లవాతశ్చ మందాగ్ని ర్నాభి
శూలనమ్ । గురూకరత్యపీడాచ హామ్లవాతస్య లక్షణమ్ ।

తా. అరుచిగలుగుట అన్నము అరగకుండుట బొడ్డులో శూలించుట శరీర
ము బరువుగనుండుట శరీరము నొచ్చుట ఈలక్షణములు గలిగి పులితేనుపులు వచ్చు
టయే ఆమ్లవాతమని తెలియవలయు. (ఇదిహరించుటకై క్షయప్రకరణమున జెప్పం
బడిన శ్రీమదగ్ని కుమారమును సేవింపవలయు.)

## ఆమ్లవాతమునకు విషతిందుకతైలము.

శ్లో॥ విషతిందుకవృక్షస్య పరసారస్యప్రస్థకమ్ ॥ ద్వాడకేనారనా
ళేన సంమిశ్ర్యాలోడ్యయత్నతః । జంబీరనీరంద్విప్రస్థంప్రస్థం
తద్బీజచూర్ణకమ్ । ప్రస్థమేరండతైలంచద్విప్రస్థంతిలతైలకమ్।
యవత్కషాయంతత్తైలం నవవస్త్రేనడోలితమ్ । సర్వాంగ
సంధ్యస్థిగతామ్లవాయు కఫామయేచానిలఘోరశూలే । విలో
మవాయావనులోమవాయూ స్తం భేధనుర్వాతఇతిప్రశస్తమ్ ॥

తా. నాలుగుశేర్ల విషముష్టివిత్తులలో ముప్పదిరెండు శేర్లుజొన్నల కలిపోసి
12 శేర్ల కషాయముకాచి క్రొత్తవస్త్రమున వడియగట్టి అందు నిమ్మపండ్లరసము8
శేర్లు విషముష్టివిత్తుల చూర్ణము 4 శేర్లుఆముదము 4 శేర్లు నువ్వులనూనె 8 శేర్లు
కలిపి తైల పక్వముగ కాచి శరీరమున లేపనముచేయుచుండిన సర్వాంగవాతము
సంధివాతము అస్థివాతము ఆమ్లవాతము కఫవాతము ఘోరమైనవాతనొప్పులు విలో
మవాతము అను లోమవాతము ఊరుస్తంభవాతము ధనుర్వాతము మొదలగునవి
హరించు.

## అనులోమవాత లక్షణము.

శ్లో॥ శిరంకదూశ్చ దేహశ్చ పాండుర శ్ఛర్దనంభ్రమః ।
స్వేదమూర్ఛా భయంచయివ ధాతుశోషో వికారకృత్ ।
హాస్యం నిద్రాతిశ్వాశస్చ హ్యనులోమస్య లక్షణమ్

తా. శిరమున దురదగలుగుట శరీరము * పాండువర్ణముగ నుండుటవాంతి
భ్రమ చెమట మూర్ఛ భయము గలుగుట ధాతువులు శోషించుట శరీరవికారము

* పాండురవర్ణమన— తెలుపువన్నెలేక తెలుపు పచ్చనగలరంగు.

నగవు కడునిద్ర కడుశ్వాసము గలుగుట ఈలక్షణములతోడ వెనకకు వంగదీసుటయే అను లోమవాతమని తెలియవలయు. [దీనియందు తీవ్రమైన తపులుగలిగిన రోగిమృతిని జెందుననియు మెల్లని తీపులుగలిగిన రోగి జీవించుననియు తెలియవలయు.]

## అనులోమవాతమునకు వాతసమ్మోహనరసము.

శ్లో॥ శుద్ధసూతం విషం చాభ్రంవ్యోషం గంధకటంకణమ్ । సైంధవం ధూర్తబీజంచతుల్యంతుల్యంవిచూర్ణయేత్ । త్రిదినం మర్దయేత్ఖల్వే కారవల్లీరసేనచ । వజ్రమూషాంతరేక్షిప్త్వా కాచకుప్యామథాపివా । వాలుకాయంత్రకేపక్త్వా ద్వియామాం తేసముద్ధరేత్ । ఏతత్సర్వంసమాదాయమత్స్యపిత్తేన భావయేత్ । మాషమాత్ర నిషేవేత హ్యనులోమం నిహంతిచ ॥

తా. శుద్ధిచేసిన పాదరసము శుద్ధిచేసిన వసనాభి అభ్రకభస్మము త్రికటుకములు శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన వెలిగారము సైంధలవణము శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఖల్వములోనునిచి కాకరాకురసములో మూడుదినములు మర్దించి వజ్రమూషలోగాని కుప్పెలోగానినునిచి వాలుకాయంత్రమున రెండుఝాములువండి సాంగశీతలమువదీసి ఖల్వములోనునిచి చేపచేదుతో భావనజేసి మాషప్రమాణముంతేసి మాత్రలుచేసి యందొకదానిని తాటకసిండవేళ్ళ రసముతోనేని వావిలాకురసముతోనేని సేవించిన అనులోమవాతము హరించు.

## విలోమవాత లక్షణము.

శ్లో॥ అతితంద్రాప్యతిశ్వాసః పాండుతానేత్ర శూలకృత్ ।
స్వేదోహిక్కాంతి వాంతిశ్చ విలోమవాతక్షణమ్ ॥

తా. కడుతంద్ర కడుశ్వాసము గలుగుట శరీరము పాండువర్ణముగ నుండుట నేత్రములు శూలించుట చెమట ఎక్కిళ్ళు వాంతిగలుగుట ఈలక్షణములుగలిగిముందరికి వంగదీసుటయే విలోమవాతమని తెలియవలయు. (మరియు దీనియందు తీపులు తీవ్రముగనుండిన రోగి మృతిజెందుననియు, మెల్లగనుండిన జీవించుననియు తెలియవలయు.)

## విలోమవాతమునకు సింహనాదరసము.

శ్లో॥ శుద్ధసూతం విషంగంధం సమం మణిశిలారసమ్ ।
దంతిబీజం సమంఖల్వే మర్దయే ద్దివసద్వయమ్ ।
కారవల్లీ రసైస్సమ్య క్పుటపాకేచ యోజయేత్ ।
ఉద్ధృత్య చూర్ణ యేత్ఖల్వే ద్వికూమంచాను పానతః ।
గుంజామాత్రం ప్రదాతవ్యం విలోమ వాతనాశనమ్ ।

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన వసనాభి శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన మణిశిల శుద్ధిచేసిన కఫరి యివి సమభాగములు వీనికి సమముగ నేలదంతివిత్తుల చూర్ణము కలిపి ఖల్వమున నునిచి కాకరాకురసముతో 2 దినములు మర్దించి 2 ఝాములు వాలుకాయంత్రమున పాకముచేసి సాంగశీతలమున దీసి ఖల్వములో చూర్ణముచేసి గురిగింజ ప్రమాణమును వావిలాకురసముతో నేని తీటకసింకరసముతో నేని సేవింపుచుండిన విలోమవాతము హరించు.

## ధనుర్వాత లక్షణము.

శ్లో॥ [న్మూధవనిదానె] ధనుశ్చకంపనమూర్ఛా హ్యగ్నిమాంద్యం ప్రలాపకమ్ । మృత్యుతుల్యాని చిహ్నా నిధనుర్వాతస్యలక్షణం ॥

తా. వణుకుట మూర్ఛ అగ్నిమాంద్యము లేక కడుపులోమంట ప్రలాపము గలుగుట మృతిజెందునటుల కన్పించుట యీ లక్షణములు గలిగి శరీరము విల్లువలె వంగియుండుటయే ధనుర్వాతమని తెలియవలయు. (ఇది అసాధ్యము.)

## ధనుర్వాతమునకు అగ్నికర్మాదిచికిత్స

శ్లో॥ శరీరం జాయతేఘోర మగ్నివైద్యంచ కారయేత్ ।
పాదాది కంఠపర్యంతంసంధి దేశే శలాకయా ।
ఏరండ తైలత్రిఫలా గోమూత్రం చిత్రకంవిషమ్ ।
మాషకస్య ఘృతైఃపానం ధనుర్వాతం వినాశయేత్ ॥

తా. పైజెప్పబడిన ధనుర్వాతమున శరీరము మహాఘోరముగ నుండును కావున పాదము మొదలు కంఠమువరకు సంధిప్రదేశముల శలాకలతో అగ్నివైద్య

మును నేయుటయేగాక త్రిఫలములు చిత్రమూలము అతివస అనువానిని సమభాగ ములుగ చూర్ణముచేసి అంను ఆముదము గోమూత్రముకలిపి సేవించినను లేక మినప కట్టులో నెయ్యికలిపి సేవించినను ధనుర్వాతము హరించు.

## కంఠవాత లక్షణము.

శ్లో॥ నద్యోమృత్యుః కంఠవాత శిరోభంగః ప్రలాపనమ్ ।
వాంతీ ర క్తస్యకంపశ్చ కంఠవాతస్య లక్షణమ్ ॥

తా. ప్రలాపించుట నెత్తురుగ్రక్కుట శరీరము వణకుట యీ లక్షణములు గలిగి కంఠము తల బ్రద్దలుచేసినటుల నొచ్చుటయే కంఠవాతమని తెలియవలయు. ఇది జనించునపుడే రోగిని చంపు. (దీనియందు వాతగజాంకుశరసమును సేవింపదగు.)

## పక్షఘాతవాత లక్షణము.

శ్లో॥ శిరసః పాదపర్యంత మర్ధాంగే పార్శ్వశూలకృత్ ।
మహాశూలం దివారాత్రౌ పక్షఘాతస్య లక్షణమ్ ॥

తా. శిరము మొదలు పాదపర్యంతమును 1 పార్శ్వమున శూలించుట రేయుం బగలు శరీరము మిక్కుటముగ నొచ్చుట యీ లక్షణములు గలిగి శరీరముయొక్క ½ పార్శ్వము పగలగొట్టునటుల నొచ్చుటయే పక్షఘాతవాత మని తెలియవలయు. ఇది యాప్యము.

శ్లో॥ [ఆయుర్వేదే] పార్శ్వమర్ధంశరీరస్యకంపస్స్యాత్కుక్షిశూ ।
లనమ్ । నేత్రామయ విరోధశ్చ భంగస్స్యా త్పక్షఘాతకః ॥

తా. శరీరార్ధపార్శ్వమువణకుట కడుపులోశూలించుట నేత్రరోగము గలుగుట యీ లక్షణములు గలిగి శరీరముయొక్క ½ పార్శ్వము పగలగొట్టునటుల నొచ్చుటయే పక్షఘాతవాతమని తెలియవలయు. (ఇది యాప్యము మఱియు వీని కోడ జ్వరమును సంబంధించియుండిన రోగి మృతిజెందు. జ్వరము సంబంధించ ండిన చికిత్సం జేయవలయు. చికిత్సించునెడ రసకర్పూరమును సేవింపజేయ లయు రసపుబ్బను సేయ వలయు.)

## పక్షఘాతవాతమునకు కాలకంటకరసము.

శ్లో॥ శుద్ధసూతంవిషంగంధంమరీచటంకణంకణా । ధూర్తబీజంచ త్రిఫలాసమభాగంచఖల్వకే । తిందుకోబృహతీఫల్గుసోమవల్లీ కపిత్థకః । ఆర్ద్రికభృంగరాజంచ ద్రవైర్భావ్యందినత్రయమ్। కాచకుప్యాంవిలేప్యాథవాలుకాయంత్రకేపచేత్ । యామద్వ యంచ మందాగ్నౌసాంగశీతల ముద్ధరేత్ । వారాహచాగ పిత్తేచ భావయేచ్చ దినద్వయమ్ । గుంజామాత్రం ప్రధా తవ్యం పక్షఘాతం వినాశయేత్ । త్రికటు త్రిఫలాక్వాథ మనుపానం పిబేత్సదా ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిచేసిన వసనాభి శుద్ధిజేసిన గంధకము మిరియాలు శుద్ధిచేసిన వెలిగారము పిప్పళ్ళు ఉమ్మెత్తవిత్తులు త్రిఫలములువీనినిసమభాగములుగ చూర్ణముచేసి ఖల్వములోనునిచి నల్లతుమికి పెద్దములక బ్రహ్మమేడి భావంచివిత్తులు వెలగఅల్లము గుంటగలగర అనువాని రసములతో 3 దినములు మర్దించి భావనచేసి ముద్దచేసి గాజుకుప్పెలోనునిచి చీలమన్ను లేపనముజేసి ఎండించి వాలుకాయంత్ర మున 2 ఝాములు మందాగ్నితోవండి సాంగశీతలమున దీసి ఖల్వముననునిచి అడవి పంది మేక అనువాని చేదులతో 2 దినములు భావనచేసి గురిగింజలంతేసి మాత్రలు జేసి యందొక దానిని త్రికటుకములు త్రిఫలములు అనువాని కషాయానుపాన ముతో సేవించిన పక్షఘాతవాతము హరించు. మఱియు ఔషధమును 1 వత్సరం బేని ఆరుమాసములేని సేవింపక వాతరోగములు హరింపవని శాస్త్రములయందు చెప్పఁబడియున్నయది.

## అర్ధాంగవాత లక్షణము.

శ్లో॥ అర్ధాంగం బాహుకంపశ్చ నిద్రానాశన మేవచ
హృదయాగ్నిస్థలంబద్ధ మర్ధాంగం వాతలక్షణమ్ ॥

తా. బాహువులువణుకుట నిదురబట్టకుండుట కడుపులోమండుట మలము బాధించుట ఈలక్షణములుగలిగి శరీరములో అర్ధభాగము ఈడ్చికొనియుండుటయే అర్ధాంగవాతమని తెలియవలయును. ఇదియసాధ్యము. దీనియందు పక్షఘాతవాత చికిత్సం జేయవలయును.

పార్శ్వవాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] దేహస్యశీతలంపార్శ్వే ఫ్యున్మాదశ్చ శిరో భ్రమః । కర్ణనేత్రేచ విస్ఫోటః పార్శ్వవాతస్య లక్షణమ్ ॥

తా. ఉన్మాదము గలుగుట తలతిరుగుట చెవులు నేత్రములు నొచ్చుట ఈ లక్షణములు గలిగి శరీరములో 1 పార్శ్వము చల్లగ నుండుటయే పార్శ్వవాతమని తెలియవలయు. ఇది యాప్యము దీనియందు వాతగజాంకుశరసమును సేవింపవలయు.

శ్లో॥ శిరః పార్శ్వేచ శూలంచ నేత్రేకర్ణేతు మందతా ।
కర్ణాంతరే మహాశూలం పార్శ్వశూలాది దోషకృత్ ॥

తా. శిరముయొక్క 1 పార్శ్వము శూలించుట నేత్రములకు చూపులేకుం డుట చెవులు వినరాకుండుట చెవిలో మిక్కుటముగ పోట్లుపొడుచుట ఈలక్షణ ములు గలిగి శరీరముయొక్క 1 పార్శ్వమున శూలాదిదోషములు కలుగుటయే పా ర్శ్వవాతమని తెలియవలయు. ఇది హరించుటకై వాతగజాంకుశరసమును సేవింప వలయు.

ఆతపవాత లక్షణము.

శ్లో॥ [మాధవకల్పే] పాండుశ్చదృష్టి ర్భ్రమణంవికారః ప్రాణస్య హాని ర్భయతాపసంభవః । దుఃఖాతిపీడా కుటిలంవ్యధాచ శరీర ఇత్యా తపవాతలక్షణమ్ ॥

తా. నేత్రములు పాండువర్ణముగ నుంపుట శరీరముతిరుగుట శరీరమువికా రముగనుండుట ప్రాణహాని దుఃఖము మహాసంకటము గలుగుట పలువిధములైన యుపద్రవములు గలుగుట ఈ లక్షణములతోడ సహించుట కశక్యమైనతాపముగలు గుటయే ఆతపవాతమని తెలియవలయు. ఇది యాప్యము.

ఆతపవాతమునకు వాతశార్దూలరసము.

శ్లో॥ విషం సూతాభ్రకంగంధ వచాహింగుళ సైంధవమ్ ।
లవంగం పిప్పలీమూలం తుల్యంతుల్యాం విమర్దయేత్ ।
దినంహంస పదీద్రావై కుక్కుటీపుటపాచితమ్ ।
చూర్ణీకృతం తతోదేయ మనుపాన విశేషతః ।
ఆతపవాతనిర్ముక్తి స్తమస్సూర్యోదయే యథా ॥

తా. శుద్ధిచేసిన వసనాభి శుద్ధిచేసిన రసము అభ్రకభస్మము శుద్ధిచేసిన గంధకము అతివస శుద్ధిచేసిన ఇంగిలీకము సైంధవలవణము లవంగములు మోడి వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదియాకురసముతో 1 దినము మర్దించి కుప్పెలో నునిచి 3 ఝాములు కుక్కుటపుటంబిడి సాంగశీతలమునదీసి చూర్ణము జేసి గురిగింజలంత యెత్తును నెయ్యి మిరియపు చూర్ణముతో నొసంగిన "సూర్యుడు దయించుటచే నంధకారము నశించుభంగి" ఆతపవాతము నశించు.

## అగ్నివాత లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] అగ్నౌ దేహవికార యంతిమనుజా మూర్ఛా
విదాహ శ్శిరో భంగస్స్యాచ్చ తథాశరీర మలినా శుష్కాం
గతాః కోపితా । ఆయుర్వృద్ధిన దోబలక్షయకరః కాంతింవినా
మానుషా హ్యగ్నింవాత మిమంవంద తిమునయో ధాత్రీచరం
మారుతమ్ ॥

తా. శరీరవికారము మూర్ఛ విదాహము తలనొప్పి శరీరమాలిన్యము శరీర కృశత్వము కోపము * ఆయుర్వృద్ధి దౌర్బల్యముగలుగుట శరీరము కాంతిహీనముగనుండుట ఈ లక్షణములు గలిగి శరీరముఅగ్నివలెమండుచుమనుజులపీడింపుచుండునది అగ్నివాతమని మునీశ్వరులచే జెప్పంబడియె. [ఇది యాప్యము.]

## అగ్నివాతమునకు వీరభద్రరసము.

శ్లో॥ మృతింసూతం మృంతతామ్రం మర్దయే త్కంటకీద్రవైః ।
ఏకవింశతివారం నై శోష్యం పేష్యం పునఃపునః ।
చణమాత్రాం వటీంఖాదే త్సర్వాంగే చాగ్నివాతకే ।
స్వర్ణక్షీరీ విషానహ్నీ వారిణా పేషయే త్సమమ్ ।
ఈషన్మాత్ర ఘృతేపాచ్యం లేపాద్వాతో వినశ్యతి ॥

తా. రసభస్మము తామ్రభస్మము వీనిని ఖల్వములోనునిచి పల్లేరువేళ్లరసములో మర్దించి ఎండింపవలయు. ఇటుల 21 మార్లు మర్దించి ఎండించి శనగగింజలంతేసి మాత్రలుజేసి సేవించుటయేగాక రెడ్డినానబ్రాలు అతివస చిత్రమూలము

* ఆయుర్వృద్ధి యన—చంపకబాధించుట.

అనువాని సమభాగములుగ ఖల్వములోనునిచి ఉదకములోనూరి అందు యొకింత ఘృతముకలిపి పాకముచేసి శరీరమునకు లేపనము జేసిన అగ్ని వాతము నశించు.

## ఆఢ్యవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] వర్ణ్యాణి జఠ రేదాహశ్శిరో నేత్రేభ్రమస్త థా। పాదశూలం కర్ణశూలం మాఢ్యవాతస్య లక్షణమ్ ॥

తా. కడుపులో మండుట తలవణుకుట కన్నులుతిరుగుట కాళ్ళయందు శూల చెవిలో పోట్లుగలుగుట ఈ లక్షణములు గలిగి శరిరమున గాదెలు కట్టుటయే ఆఢ్యవాతమని తెలియవలయు.

## ఆఢ్యవాతమునకు ప్రభావతీ వటికములు.

శ్లో॥ భాగమేకంతు కర్పూరం తదర్థం శుద్ధగంధకమ్ ।
తత్సమాని విడంగాని జాతీపత్ర లవంగకమ్ ।
జాజీఫలం తథాచైలా వోష్యంచాపి సమంసమమ్ ।
శ్లక్ష్ణచూర్ణ మిదంసర్వం మర్దయే ద్యామమాత్రకమ్ ।
గుడేన మాషమాత్రంతు వటికాం కారయేద్బుధః ।
ఇయం ప్రభావతీనామ్నా హాఢ్యవాత వినాశకృత్ ॥

తా. రసకర్పూరము 1 భాగము శుద్ధిచేసిన గంధకము ½ భాగము వాయు విడంగములు ½ భాగము లవంగము జావత్రిజాజికాయ ఏలకులు ఇవి దినుసు నొకటింటికి నొక్కొక భాగము త్రికటుకములు 1 భాగము ఇటుల వానినెల్ల గ్రహించి చూర్ణముచేసి అందు బెల్లముకలిపి 1 ఝాము మర్దించి మాషప్రమాణముం చేసి మాత్రలుజేసి సాయం ప్రాతఃకాలములయం దొక్కొక మాత్రచొప్పున 4 మాసములు నేతితో సేవింపుచుండిన ఆఢ్యవాతముహరించు.

## శుష్కవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] దేహశ్చ పాండుశ్శ్రమ మారుతౌచ మూర్ఛాతికంప భ్రమతాపయుక్తః । స్వేదశ్చతృష్ణాబధిర త్వయోగ శ్శుష్కంచవాతం ప్రవదంతితజ్జ్ఞాః ॥

తా. శరీరము పాండువర్ణముగ నుండుట బడలిక శరీరమున వాతోపద్రవ ములు మూర్ఛ వణుకు భ్రమ తాపము చెమట దప్పిగలుగుట చెవులు వినరాకుండుట ఈ లక్షణములు గలిగి శరీరము ఎండిపుండుటయే శుష్కవాతమని తెలియవలయు ఇది హరించుటకై ఆఢ్యవాతచికిత్సనైన వాతగజాంకుశరసనేవనైన చేయవలయు.

## సుప్తవాత లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] భయంభీతత్సతారౌద్రం శోషః కర్ణాంతరు గ్భవేత్। మూర్ఛాకంపభ్రమస్వేదాస్సుప్తవాతంవినిర్దిశేత్॥

తా. భయపడుట చిత్తవికారము కోపముగలుగుట శరీరముయెండుట చెవి కొనలయందు పీడ మూర్ఛ వణుకు భ్రమ చెమటగలుగుట యీ లక్షణములు గలిగి స్పర్శజ్ఞానము లేకుండుటయే సుప్తవాతమని తెలియవలయు.

## సుప్తవాతమునకు కనకసుందరరసము.

శ్లో॥ శుద్ధంచ పారదంశుల్బం గంధకం టంకణంకణా ।
కాకజంఘా కషాయేన దినమేకంతు మర్దయేత్ ।
డోలాయంత్రేప చేద్యామం సమ్యక్తీవ్రాగ్నినాతతః ।
ఆర్ద్రికస్యానుపానేన మాషమాత్రం పిబేదను ।
సుప్తవాతం నిహంత్యాశు సర్వవాత నికృంతనః ॥

తా. శుద్ధిచేసిన రసము తామ్రభస్మము శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన వెలిగారము పిప్పళ్లుపీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి వెలుమసంధివేళ్ళ కషాయములో 1 దినము మర్దించి ముద్దచేసి డోలాయంత్రమున 1 ఝాము ఘాడాగ్ని తోవండి మాషప్రమాణమును అల్లపురసముతో సేవించిన సుప్తవాతము హరించు. మఱియు దీనినే శుష్కవాతమనందురు. 80 వాతములయందును సేవింపవలయు.

## సంధివాత లక్షణము.

శ్లో॥ శరీరం గంధలిప్తంచ శూలంవాయుప్రకోపతః ।
దేహేచ వికృతిశ్చైవ రోమహర్షో విలాపనమ్ ।
అంగసందిషుపీడాచ సంధివాతస్య లక్షణమ్ ॥

తా. శరీరము గంధముచే బోయబడినటు లుండుట వాతప్రకోపమువలన శూలగలుగుట శరీరమున గాడెలుకట్టుట గగుర్పొడుచుట ప్రలాపించుట యీలక్షణములు గలిగి అవయవసంధులు నొచ్చుటయే సంధివాతమని తెలియవలయు.

## సంధివాతమునకు రత్నగర్భపోటలీరసము.

శ్లో॥ శుద్ధసూతం విషంగంధం హింగుళం కటురోహిణీ ।
లోహతామ్ర మయోభస్మ తాళకంచ మనశ్శిలా ।
అర్కమూల కషాయేణ మర్దితంవటకీకృతమ్ ।
కాచకుప్యాం నివేవ్యాథ లేపయే ద్వస్త్రమృత్తికామ్ ।
త్రియామం వాలుకాయంత్రే పచేన్మృదగ్నినా తతః ।
గుంజామాత్రం ప్రయుంజీత సంధివాతం నిహంత్యలమ్ ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిచేసిన వసనాభి శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన యింగిలీకము కటుకరోహిణి లోహభస్మము తామ్రభస్మము మండూరము శుద్ధిచేసిన తాళకము శుద్ధిచేసిన మణిశిల వీనిని సమభాగముయిగ ఖల్వములోనునిచిజిల్లేడువేళ్ళ కషాయములో 1 దినము మర్దించి గాజుబుడ్డిలో నునిచి చీలమన్ను లేపనముజేసి యెండించి వాలుకాయంత్రమున 3 ఝాములు మృద్వగ్నితోవండి యందొక గురి గింజప్రమాణమును నెయ్యి మిరియపుచూర్ణముతోనైని లేక ఓమము వస అనువాని కషాయములోనైని సేవించిన సంధివాతము హరించు.

## సాధ్యవాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] రోమహర్షణ కంప్రైవ శిరోభ్రమణ శూలకమ్ । కర్ణబాధిర్య మజ్ఞానం సాధ్యవాతం వినిర్దిశేత్ ॥

తా. గగుర్పొడుచుట తలతిరుగుట శరీరము శూలించుట చెవులు వినరాకుండుట అజ్ఞానము గలుగుట యీలక్షణములు గలది సాధ్యవాత మని తెలియవలయు ఇది యాప్యము. దీనియందు పూర్వోక్తసంధివాతచికిత్సనే చేయవలయు.

## శిరోవాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] శిరోవాతేచ హృచ్ఛూలం రోమహర్షో నిశోషణమ్। దాహస్సర్వాంగ నేత్రేచ శిరోవాతస్య లక్షణమ్ ॥

తా. బొమ్మనొచ్చుట రోమములు గగుర్పొడుచుట శరీరము ఎండుట సర్వాంగములు నేత్రములు మండుట ఈ లక్షణములుగలిగి తలనొచ్చుటయే శిరోవాతమని తెలియవలయు. (ఇది హరించుటకై రసగర్భారసము నేని కాలాగ్నిరుద్రరసము నేని సేవింపవలయును.)

## సర్వహీనవాత లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] ఆతపో దేహ శుష్కత్వంసర్వహానిశ్చకంప
నమ్ । పరిభ్రమః కర్ణశూలం స్వరహీన నిరీక్షయేత్ ॥

తా. శరీరము ఉడుకుట శరీరము శుష్కించుట శరీరము వణుకుట తబ్బిబ్బులాడుట చెవిలోశూలగలుగుట ఈ లక్షణములుగలిగి స్వరహీనమై పలుకుటయే స్వరహీనవాతమని తెలియవలయు.

## స్వరహీనవాతమునకు వాతకులాంతకతైలము.

శ్లో॥ రసంగంధ శిలాతాళ చూర్ణం మర్ద్యంచ కాంజికై
లిప్త్వావస్త్రే కృతాంవర్తిం తైలాక్తాం జ్వాలయేన్ముఖాత్ !
స్రావయే ద్గ్రాహయేత్తైల మథః పాత్రేషుతై స్సహ
తత్తైలం లేపయేత్పత్రే నాగవల్ల్యాస్తు భక్షయేత్ ।
స్వరహీన వికారఘ్నం సర్వవ్రణ హరంపరమ్ ॥

తా. రసము గంధకము శిలాజిత్తు తాళకము వీనినిశుద్ధిజేసినసమభాగములుగ చూర్ణముజేసి ఖల్వములోనునిచి కలితో మర్దించి వస్త్రమునకు లేపనముజేసి ఎండించివత్తిగజుట్టి నూనెలోతడిపి దీపము ముట్టించి దానిక్రింద నొకపాత్రము నునిచిన యందు నూనెపడుసును పిదప దానిలో ఆవునెయ్యికలిపి తమలపాకుకు లేపనముజేసి భక్షించిన స్వరహీనవాతమును లేపనముజేసి సర్వవ్రణములు హరించు.

## రక్తవాత లక్షణము.

శ్లో॥ రక్తవాంతిశ్చ హింక్కాచ మూర్ఛాదాహశ్చ కంపనమ్ ।
దేహకాంతి హరస్స్వేదోరక్తవాతస్య లక్షణమ్॥

తా. నెత్తురు గ్రక్కుట ఎక్కిళ్లు మూర్ఛ దాహముగలుగుట శరీరము వణుకుట శరీరకాంతి నశించుట చెమట గలుగుట ఈలక్షణములుగలిగి నెత్తురుగ్రక్కుటయే రక్తవాతమని తెలియవలయు.

## రక్తవాతమునకు వాతాంతకరసము.

శ్లో॥ శుద్ధసూతం విషంచాభ్రం విషం త్రికటుకం సమమ్ ॥
చిత్రమూల కషాయేణ దినంమర్ద్యంచ వాసయో ।
అర్కమూల కషాయేణ దినంజంబీర నీరకైః ।
డోలాయంత్రే యామమాత్రం మాషమాత్రంచ భక్షయేత్ ।
క్షీణవాతం నిహంత్యాశు రక్తవాతం వినాశయేత్ ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన వసనాభి అభ్రకభస్మము అతివస త్రికటుకములు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి చిత్రమూలకషాయము అడ్డసరపాకురసము జిల్లేడువేళ్ళకషాయము అనువానిలో ప్రతిదానిచే ఒక్కొకదినంబును నిమ్మపండ్ల రసముతో 1 దినంబును మర్దించి ముద్దచేసి డోలాయంత్రములో 1 ఝాము పాపకముజేసి మాషప్రమాణమంతేసి మాత్రలుజేసి యందొక దానిని నీరుగొలిమిడి కషాయానుపానముతో నొసంగిన రక్తవాతమును నెయ్యి మిరియపుచూర్ణానుపానముతో నొసంగిన క్షీణవాతమును హరించు.

## క్షీణవాత లక్షణము.

శ్లో॥ క్షీణేచవాతే శిరసోవ్యథాచ నాసానఖేదుఃఖిత మంగశూలమ్ ।
దివాచరాత్రౌచ వినష్టనిద్రః కపాలనేత్రేచ వివృద్ధశూలమ్ ॥

తా. తలనొచ్చుట నాసికము గోళ్ళుశూలించుట అంగములునొచ్చుట రేయింబగలు నిదురబట్టకుండుట కపాలము నేత్రములు మిక్కుటముగనొచ్చుట ఈలక్షణములుగలిగి శరీరము కృశించుటయే క్షీణవాతమని తెలియవలయును. (క్షీణశిరోవాతములు హరించుటకై రక్తవాతచికిత్సనేని లేక రసకర్పూర సేవన నేని చేయవలయు.)

## ఖంజావాత లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] జాగరశ్చ దివానిద్రా హ్యజీర్తి శ్చాగ్నిమాంద్యకమ్ । అంగనైకల్య నిశ్చేష్టం ఖంజావాతస్య లక్షణమ్ ॥

తా. రాత్రుల నిదురబట్టకుండుట పగలునిద్రించుట అన్నము జీర్ణముగాకుండుట అగ్నిమాంద్యము లేక కడుపులో మంటగలుగుట అంగములు నొచ్చుట శరీరము గురుతెరుగకుండుట ఈ లక్షణములుగలిగి కుంటితనము గలుగుటయే ఖంజావాతమని తెలియవలయు.

## ఖంజావాతమునకు వాతవజ్రరసము.

శ్లో॥ అభ్రికం గంధకంసూతం విషవ్యోషక సయింధవమ్ ।
హింగుళంచ విళంగంచ పిప్పలీమూల చిత్రకమ్ ।
దినంహంస పదీద్రావైః కుక్కుటీ పుటపాచితమ్ ।
చూర్ణంకృత్వాతతో దేయంహ్యనుపానవిశేషతః ।
మాషమాత్రంచ సేవేత ఖంజావాతం వినాశయేత్ ॥

తా. అభ్రకభస్మము శుద్ధిచేసినగంధకము శుద్ధిచేసినరసము శుద్ధిచేసినవసనాభిత్రికటుకములు సైంధవలవణము శుద్ధిచేసిన ఇంగిలీకము వాయువిడంగములు మోడి చిత్రమూలము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదియాకురసముతో 1 దినము మర్దించి కుక్కుటపుటంబిడి సాంగశీతలమునదీసి చూర్ణముచేసి యందొక మాష ప్రమాణమును సెయ్యితోనేని మిరియపుచూర్ణముతో నేనిదుంపరాష్ట్రపుచూర్ణముతో నేని సేవించిన ఖంజావాతము హరించు. (మఱియు దీనినే కళావాతము నందును సేవింపందగు.)

## కళావాత లక్షణము.

శ్లో॥ శరీరం పాండురంచాస్యేవై వర్ణ్యం రక్తనేత్రతా ।
కృష్ణజిహ్వాచ శూలంచ కళావాతస్య లక్షణమ్ ॥

తా. శరీరము పాండువర్ణముగ నుండుట ముఖము వివర్ణమైయుండుట నేత్రము లెఱ్ఱగ నాలుక నల్లగనుండుట శరీరము శూలించుట ఈ లక్షణములుగలిగి స్త్రీరజస్సును శుక్రమును జెరుపునదియే కళావాతమని తెలియవలయు.

## కళావాతమునకు వాసాదితైలము.

శ్లో॥ వాసాగళూచీచతురంగుళానామేరండతైలేనపిబేత్క షాయమ్।
క్రమేణసర్వాంగవిమర్దనంచ కళాఖ్యవాతస్యవినాశకంస్యాత్ ॥

తా. అడ్డసరముతిప్పతీగె గేల దీనిని కషాయముకాచి యందాముదము కలి పిసేవించుటయే గాక శరీరమునకు లేపనము సగాజేసినకళా వాతము హరించు. (మఱి యు దీనియందు ఖంజావాత చికిత్సనుకూడా జేయందగు.)

## అవయవాంగవాత లక్షణము

శ్లో॥ అవయవాంగే వాతశూలం దేహేచాగ్ని విదాహకమ్ ।
మలమూత్ర వినాశశ్చ నిద్రానాశ శ్శిరోవ్యథా ॥

తా. శరీరమంతటనొచ్చుట శరీరమంతయునుండుట మలమూత్రములు వెడల కుండుట నిదురబట్టకుండుట తలనొచ్చుట ఈలక్షణములుగలిగిసర్వాంగములునొచ్చు టయే అవయవాంగవాతమని తెలియవలయు.

## అవయవాంగవాతమునకు వైరేచనకల్పము

శ్లో॥ పయస్సైరండజంతైలం పిబేద్దోషఃహారంపరమ్ ।
హరితక్యాస్త్రయోభాగ భాగస్సైంధవ కృష్ణయోః ।
ఏతదుష్ణాంబు నాపీతం చూర్ణమాశు విరేచయేత్ ।
అవయవాంగం సన్నిపాతం వాతశూలహరం పరమ్॥

దా. ఆవుపాలు ఆముదము వీని సేకముజేసి త్రాగినను లేక కరక్కాయలు 4 భాగములు సైంధవలవణము పిప్పళ్ళు ఇవిదినుసుకు ఒక్కొక్కభాగము ఇటుల వానిసేకముజేసి ఉష్ణోదకముతోనూరి త్రాగినను శీఘ్రముగ విరేచనంబులై, అవయ వాంగవాతము సన్నిపాతము వాతశూల హరించు. (మఱియు ఈఅనుపానములతో ఆమవాతమున జెప్పంబడిన పంచవక్త్రరసమును సేవించిన అవయవాంగవాతము హరించు.)

## స్త్యానవాత లక్షణము.

శ్లో॥ మహావాతం భవేద్దేహే దివారాత్రౌచ శూలనమ్।
సదానిరశనంస్వేధ స్త్యానవాతస్య లక్షణమ్॥

తా. వాతము అధికముగ ప్రకోపించుట రేయుంబగలు మిక్కుటముగ అం గములు శూలించుట ఎల్లపుడు ఆకలిలేకుండుట చెమటగలుగుట ఈ లక్షణములు గలిగి శరీరసంధులు శూలించి ఆలస్యమును గలుగంజేయునదియే స్త్యానవాతమని తెలియవలయు.

## స్త్యానవాతమునకు వాతోన్మూలనరసము.

శ్లో॥ శుద్ధసూతం విషంగంధం ధూర్తబీజం త్రిభిస్సమమ్।
పంచకోల కషాయేణ మర్దయే ద్దివసద్వయమ్।
మూషయో ర్ధ్యాధ రేపాచ్యం సాంగశీతం విచూర్ణయేత్ ।
మత్స్యపిత్తే భావయేచ్చ మర్దనే ద్దివసద్వయమ్।
పంచకోల కషాయేణ గుంజామాత్రం ప్రదాపయేత్ ।
స్త్యానవాతం హరేచ్ఛీఘ్రం సర్వవాత వికారనుత్ ॥

తా. రసము వనసాభి గంధకము|వీనిని శుద్ధిచేసిన వానికి సమముగ శుద్ధిజేసిన ఉమ్మెత్తవిత్తుచూర్ణమునుకలిపి ఖల్వములోనునిచి పంచకోలకషాయముతో 2 దినములు మర్దించి మూసములోనునిచి దానిపై మరియొకమూసనుమూసి చీలమన్ను లేపనము జేసి యెండించి భూధరయంత్రములో పుటంబిడి సాంగశీతలమునదీసి ఖల్వములోను నిచి చూర్ణముచేసి చేపచేదుతో 2 దినములు భావనజేసి మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి పంచకోలకషాయానుపానముతో సేవింపుచుండిన స్త్యానవాతముసర్వ వాతములు కడుశీఘ్రముగ హరించు.

## గుల్ఫవాత లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] శరీరంపాండువర్ణంచ కటిదేశేచ తాపనమ్ ।
శిరశ్శూలం నేత్రశూల గుల్ఫశూలం విదాహికా ।
తన్నిద్రాం నాశయేద్రాత్రౌ గుల్ఫవాతస్య లక్షణమ్ ॥

తా. శరీరము పాండువర్ణముగనుండుట మొలచుట్టుమండుట శిరము నేత్రములు శూలించుట శరిరము విదాహించుట రాత్రులయందు నిదురబట్టకుండుట ఈలక్షణములుగలిగి చీలమండలువాచి కడుశూల గలుగుటయే గుల్ఫవాతమని తెలియవలయు. (ఇది హరించుటకై రసపుబ్బ వేయవలయు. మఱియు రసకర్పూరమును సేవింపవలయు.)

## గుల్ఫవాతమునకు ప్రాణవల్లభరసము.

శ్లో॥ సంరవిషంచ ంభస్మం గంధకంచ మనశ్శిలా ।
మర్దితం పర్పటద్రావై ర్వజ్రమూషాంతరే క్షిపేత్ ।

భూధరే పుటపాకంచ సాంగశీతల ముద్ధరేత్ ।
ఖల్వామధ్యే వినిక్షిప్య మత్స్యాజ శిఖిపిత్తకైః ।
భావితం యామమాత్రంతు గుంజామాత్రంతు ప్రదాపయేత్ ।
గుల్ఫవాతం నిహంత్యాశు సర్వవాత వికారనుత్ ॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన వసనాభి అతివస ! అభ్రకభస్మము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన మణిశిల వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచిపర్పాటకరసముతో 2 దినములు మర్దించి వజ్రమూషలోనునిచి భూధరపుటంబిడి సాంగశీతల మునదీసి ఖల్వములోనునిచి చేప మేక నెమలి అనువాని చేసులతో 1 ఝామువావన జేసి గురిగింజలంతేసి మాత్రలుజేసి అల్లపురసానుపానముతో సేవించిన గుల్ఫవాతము సర్వవాతములు కడుశీఘ్రముగ హరించు.

అంగులీవాత లక్షణము.

శ్లో॥ దేహేతాప శ్చాంగులీనాం దాహశ్చ కరపాదయోః ।
అంగుళ్యః కుబ్జరూపేణ హ్యాంగులీ వాతలక్షణమ్ ॥

తా. శరీరముమండుట చేతులవ్రేళ్ళయందు కాళ్ళవ్రేళ్ళయందు మంటలు పోట్లుంగలుగుట ఈలక్షణములుగలిగి వ్రేళ్ళుకుబ్జత్వమును జెందుటయే అంగుళీవాతమని తెలియవలయు. [ఇది హరించుటకై వాతగజాంకుశరసమును పిప్పళ్ళు మోడి అను వాని సేవింపవలయు. మఱియు రసకర్పూరమునుగాని లేక మేహవ్రణప్రకరణమున జెప్పంబడు పరంగిచెక్కయోగములో శుద్ధిజేసిన ఇంగిలీకమునుకలిపిగాని సేవింపవలయు. ఆ పరంగిచెక్క యోగమును సేవించునపుడందు జెప్పంబడినపథ్యముల నాచరింపవలయు.]

జానువాత లక్షణము.

శ్లో॥ జానుసమ్యక్త్వ కంపోచ వాంతిర్మూర్ఛా పరిభ్రమః ।
తృష్ణాదాహో జనుశూలంచ జానువాతం వినిర్దిశేత్ ॥

తా. మోకాళ్ళుమండుట శరీరము వణకుట వాంతులు మూర్ఛ గలుగుట తల్లడిల్లాడుట ఱొమ్ములోనుండుట ఈలక్షణములు గలిగి మోకాళ్ళు నొచ్చుటయే

జానువాతమని తెలియవలయు. (ఇది నివర్తించుటకై వాతగజాంకుశరసము నేని రస కర్పూరము నేని సేవింపవలయు.

## జంఘవాత లక్షణము.

శ్లో॥ భీతభీతం చాతిశూలం రోమహర్షో నిరీక్షణమ్ ।
భ్రూమధ్యే శూలనం మూర్ఛా జంఘావాతస్య లక్షణమ్ ॥

తా. కడుభీతిగలుగుట శరీరమున పోట్లుబొడుచుట శరీరము గగుర్పొడుచుట రెప్పపాటు వేయక చూచుట కనుబొమలనడుమ శూలించుట మూర్ఛిల్లుట యీలక్షణములు గలిగి పిక్కలు శూలించుటయే జంఘావాతమని తెలియవలయు.

## జంఘావాతమునకు లక్ష్మీవిలాసరసము.

శ్లో॥ శుద్ధసూతం విషంగంధం నేపాళం దరదంసమమ్ ।
చిత్రమూలకషాయేణ డోలాయంత్రే దినంపచేత్ ।
మత్స్యపిత్తేన సంశోధ్య ద్వియామంచ విమర్దయేత్ ।
సుహ్నిక్షీరే దినంమర్ద్యం ద్విగుంజం భక్షయేత్సదా ।
జంఘావాతం నిహంత్యాశు హ్యనుపాన విశేషతః ॥

తా. రసము వసనాభి గంధకము నేపాళము యింగిలీకము వీనిని సమభాగములుగ శుద్ధిజేసి ఖల్వములోనునిచి 1 దినము చిత్రమూలకషాయములో మర్దించి డోలాయంత్రమున 1 దినమువండి సాంగశీతమున తీసి మరలఖల్వములో నునిచిచేపచేదులో 2 ఝాములును బ్రహ్మజెముడుపాలతో 1 దినమును మర్దించి 2 గురిగింజలంతేసి మాత్రలుజేసి 6 మాసములు బోడతరపానరసములో మిరియపుచూర్ణమును గలిపి సేవింపుచుండిన జంఘావాతము హరించు.

## అస్థివాత లక్షణము.

శ్లో॥ [గ్రంథాంతరే] దేహస్య కంపనంమూర్ఛా స్వేదదాహోగ్ని మాంద్యకమ్ । శ్రోత్రేతిబధిరత్వంచ హ్యస్థివాతస్య లక్షణమ్॥

తా. శరీరమువణుకుట మూర్ఛిల్లుట చెమట తాపము అగ్నిమాంద్యము చెవుడు గలుగుట యీలక్షణములు గలది అస్థులు మిక్కుటముగనొచ్చుటయే అస్థివాతమని

తెలియవలయు. (ఇది హరించుటకై 1 వత్సరమువరకు పైజెప్పంబడు గంధకకల్పము నేని వాతగజాంకుశరసము నేని సేవింపవలయు.)

## కాకవాత లక్షణము.

శ్లో॥ [పారిజాతే] హస్తేపాదేచ కంపస్స్యా శిరోభ్రమణకం తథా।
నేత్రభ్రమణకం చయివ కాకవాతస్య లక్షణమ్ ॥

తా. చేతులు కాళ్ళువణకుట తల నేత్రములుదిరుగుట యీలక్షణములుగలిగి తలదిరిగి భూమిపైబడుటయే కాకవాతమని (కాకిసోమాలని) తెలియవలయు. (ఇది హరించుటకై పైజెప్పంబడు గంధకకల్పము నేని టెంకాయనీరులోసిందూరముకలిపి యేని సిందూరము కానుగవిత్తులు పిప్పలి అనువానిచూర్ణము నేని 6 మాసములుసేవింపవలయు.

## భ్రమణవాత లక్షణము.

శ్లో॥ [కౌముద్యామ్] భ్రమణే మారుతేశ్రేష్ఠం మూర్ఛాత్రృష్ణా వికారకృత్ । అంగశోషోదరంగుల్మం దేహశోషస్చలక్షణమ్ ।

తా. దప్పిగలుగుట శరీరము వికారముగనుండుట అంగములువాచుట ఉదరగుల్మరోగములుగలుగుట దేహముశుష్కించుట ఈలక్షణములుగలిగి శరీరముతిరిగి మూర్ఛిల్లబడుటయేభ్రమణవాతమని తెలియవలయు. (ఇదిహరించుటకై 1 వత్సరము వరకు గంధకకల్పమును సేవింపవలయును.

## భ్రమణవాతమునకు విష్ణుపరాక్రమరసము.

శ్లో॥ శుద్ధపారదగంధంచ టంకణంచ విషంసమమ్ । త్రిక్షారంసైంధవంతుల్యం సర్వంధూత్తూరజైర్ద్రవైః । మర్దితం గోళకీకృత్య కుక్కుటీ పుటపాచితమ్ । ఖల్వమధ్యే వినిక్షిప్య మత్స్యవారాహపిత్తకే । భావితంమాషమాత్రంచ దేయం శీతోదకంత్వను । సన్నిపాతేజ్వరేశ్వాసేదోషేవిషమశీతకే । అపస్మారే ధనుర్వాతే కంపవాతేచమూర్ఛకే । తత్క్షణేన నిహంత్యాశు ఇచ్ఛాపథ్యంప్రదాపయేత్ । మనుష్యాణాం హితార్థాయసర్వరోగభయాపహః । విష్ణునాకథితః పూర్వంరసోవిష్ణుపరాక్రమః॥

తా॥ శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన వెలిగారము శుద్ధిచేసిన వసనాభి* త్రిక్షారములు సైంధవలవణము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ఉమ్మెత్తాకురసముతో మర్దించి ఘుటికలుచేసి కుక్కుటపుటంబిడి స్వాంగశీతలమునదీసి మరల ఖల్వములోనునిచి చేప అడవిపంది ధనువానిచేములతో భావనచేసి మాష ప్రమాణమంతేసి మాత్రలుజేసి యందొకదానిని శీతోదకము లేక రేలవేరుగంధము శ్రీగంధము అనువాని యనుపానములలో దేనితోనైన సేవింపుచుండిన సన్నిపాతము జ్వరము శ్వాసము విషము శీతదోషము అపస్మారము అనుర్వాతము కంపవాతము భ్రమణ వాతము మొదలగునవి తత్క్షణమున హరించు. దీనియందిచ్ఛాపథ్యము నాచ రింపవలయు. సర్వరోగములు హరించి మనుజులకు హితముకలుగుటకై విష్ణుపరాక్ర మమనురసమును పూర్వకాలమున విష్ణువు వచించె. ఈభ్రమణవాతము హరించుటకై వాతగజాంకుశ రసముసుకూడా సేవింపందగు.

## భ్రమణాదివాతములకు గంధకకల్పము.

శ్లో॥ షట్పలంగంధచూర్ణంచ త్రిఫలాచిత్రతెండులాః । శుంఠీమరీచ వైదేహీ షణ్ణిష్కంచ పృథక్పృథక్ । చిత్రకంచ పలైకంతు చూర్ణితం వస్త్రగాలితమ్ । ఏకనిష్కంద్వినిష్కంవా పయసా జ్యసితైఃపిబేత్ । సర్వరోగవినిర్ముక్తో మృగరాజపరాక్రమః । దీర్ఘాయుఃకుంజరబలో దివాపశ్యతి తారకాః । దివ్యదేహో బలీభూత్వా ఖేచరత్వం ప్రపద్యతే । తస్యమూత్రపురీషాణి శుల్బం భవతికాంచనమ్ । హంత్యష్టాదశకుష్ఠాని గ్రహణీశ్చ చతుర్విధాః । మందాగ్నిమతిసారంచ గుల్మమష్టవిధంతథా । అశీతిం వాతరోగాంశ్చ హ్యర్శాంస్యష్ట విధానిచ । మను ష్యాణాం హితార్థాయ పూజ్యపాదేన నిర్మితః ॥

తా. శుద్ధిజేసిన ఆమ్లసారశిలగంధకము 6 పలములు త్రిఫలములు వాయువిడం గములు శొంఠి మిరియములు పిప్పళ్ళు అనువానిచూర్ణము దినుసు ఒకటింటికి 6 నిష్క ములు చిత్రమూలపుచూర్ణము 1 పలము ఇటుల వీనినెల్ల వస్త్రగాలితంబొనర్చియేకము చేసి యందొక నిష్కప్రమాణంబు నైన 2 నిష్కముల ప్రమాణంబు నైనిఆవుపాలు

* త్రిక్షారములన —సర్జక్షారము యవక్షారము టంకణక్షారము,

ఆవునెయ్యి శర్కర అనుపానిలో దేనితోనేని 6 మాసములవరకు, సాయంప్రాతః కాలముల సేవింపుచుండిన సర్వరోగవిముక్తుండై సింహముతో సమానమైన పరాక్రమము దీర్ఘాయువు ఏనుగుతో సమానమైన బలము పగటియందు నక్షత్రముల గాంచగలిగినదృష్టి సుందరమైన దేహము శరీరదార్ఢ్యముగలవాడై ఆకసమున సంచరించు వాడుగ రాగిని బంగారును ఉత్పత్తిజేయగలిగిన మూత్రపురీషముల విసర్జించువాడుగను మఱియు నీగంధక కల్పసేవనవలన 18 కుష్ఠువులు 4 విధగ్రహణులుఅగ్నిమాంద్యము అతిసారము 8 విధగుల్మరోగములు 80 వాతరోగములు 8 విధ మూలరోగములు హరించు, దీనిని మనుష్యులహితార్థంబై పూజ్యపాదుడు వచించె. (దీనియందు చప్పిడియన్నము ఆవుపాలు ఆవుచల్ల అనుపానిని సేవించుట పథ్యకరము.)

## పంగువాత లక్షణము.

శ్లో॥ [సింహారమణిదర్పణే] గృహీతో రుద్వాయుఃపంగా గతిభంగశ్చవాతకే ॥

తా. 2 తొడలు బంధింపబడి నడుచుటకు శక్తిలేకుండుటచే పంగువాతమని తెలియవలయు. దీనినేకొందరు చచ్చువాతమనియు వచించెదరు, (ఇది నివర్తించుటకై గంధక కల్పమును 6 నెలలు సేవింపవలయు.)

## పంగు వాతమునకు ప్రభావతీ వటికలు.

శ్లో॥ హరిద్రా నింబపత్రాణి పిప్పలీ మరిచానిచ । విడంగం భద్రముస్తాచ జీరకంవిశ్వభేషజమ్ । చిత్రకం సైంధవంకుష్ఠం విషం పాఠాహరీతకీ । ఏతాని సమభాగాని హ్యజామూత్రేణ పేషయేత్ । చణప్రమాణవటికాశ్ఛాయాశుష్కాశ్చకారయేత్ । ఏకా హ్యుష్ణోదకైఃపీతా శ్వాసంచ వ్యపోహతి । లూతవిస్ఫోట భేదేచ గోమూత్రేణ విలేపయేత్ । ఉష్ణాంబునాలేసపీతాచే త్సర్పదష్ట విషంహరేత్ । మేహేరక్త ప్రవాహేచ శ్రీగంధేనసమంపిబేత్ । అర్కక్షీరేణసంలిప్తావృశ్చికస్యవిషం హరేత్ । హంతిపుష్పంచ పటలం * రంభాకందర సాన్వితా । కాకమాచీరసైంపీతాతిమిరాణివినాశయేత్ । నీలికాయారసై

* అజాక్షీరేణసంయుతా.

రక్తా రక్తాక్షిత్వం వినాశయేత్ । గుడేన భక్షితాచైవ వాతరోగంవినాశయేత్ । భృంగరాజరసైః పీతాశిరోదాహంహరేద్భ్రుశమ్ । తండులోదక సంయుక్తా కాసంకృచ్ఛ్రాం వినాశయేత్ । గోమూత్రేణయుతాపితా ప్లీహరోగం వినాశయేత్ । ఛాగక్షీర సమాయుక్తా వటికా సాశ్వగంధికా । పీతా మండల పర్యంతం రాజయక్ష్మ వినాశిని॥

తా. పసవు మంచివేపాకు పిప్పళ్ళు మిరియాలు వాయువిడంగములు తుంపముస్తెలు జీలకఱ్ఱ శొంఠి చిత్రమూలము సైంధలవణము చంగల్వకోష్ఠు అతివస శిరుబొద్ది కరక్కాయలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఖల్వములోనునిచి మేకమూత్రముతో 4 ఝాములు మర్దించి శనగగింజలంతేసి మాత్రలుజేసి నీడనెండించి యందొక దానిని ఉష్ణోదకముతో సేవించిన విషూచియుగోమూత్రముతో నూరి లేపనముచేసిన లూత విస్ఫోటకవ్రణములును నాగురువేరుగంధముతో సేవించిన సర్పవిషములను శ్రీగంధముతో సేవించిన ప్రమేహములును కుసుమరోగములును జిల్లేడుపాలతోనూరి లేపనముజేసిన తేలుకరచిన విషంబును అరటిగడ్డరసముతోనూరి నేత్రముల కంజనము వేసిన కంటిపువ్వులును పటలములును నల్లకాచాకురసముతో సేవించిన నేత్రములయందు జనించు తిమిరరోగంబును నీలిచాకురసముతో నూరి నేత్రములకంజనము వేసిన రక్తోద్రేకమును గలుగంజేయు నేత్రదోషంబును బెల్లముయొక్క అనుపానముతో సేవించిన వాతరోగములును గుంటగలగరాకురసముతో సేవించిన శిరోవాతము శిరోజనిత తాపమును పశికడుగుతో సేవించినకాసమునుమూత్రకృచ్ఛ్రములును గోమూత్రముతో సేవించినప్లీహరోగంబును మేకపాలు * ఊమ్మడోలుగడ్డచూర్ణము అనువానితో 40 దినములు సేవించిన క్షయరోగంబును హరించు. (మఱియు దీనినే శిరుబొద్దివేళ్ళకషాయముతో సేవించినజ్వరములును ప్రసూతిరోగములును బెల్లముతో 6 మాసములు సేవించిన పంగువాతములు భ్రమణవాతమును తిమిరవాతమును హరించు.)

## పక్ష అర్ధితవాతములకు భృంగాదినస్యము.

శ్లో। భృంగైరండక నిర్గుండ్యో మత్స్యాక్షీచార్క పత్రకమ్ ।
సతైల మరిచంనస్యం పక్షఘాతార్దితేషుచ॥

---

* ఇదే పెన్నేరుగడ్డయనియు జెప్పంబడు.

తా. గుంటగలగర ఆముదపుకొనలు వావిలికొనలు పొన్నగంటియాకు జిల్లేడు కొనలు వీనిని సమభాగములుగనూరి కల్కముచేసి అందు మిరియపుచూర్ణము నూనె కలిపి నస్యముజేసిన పక్షఘాతవాతము అర్దితవాతము హరించు.

మూర్ఛావాతమునకు మధూకాది నస్యములు.

శ్లో॥ మధూకపిష్టం సితయాచ యుక్తం స్తన్యేననస్యం వినిహంతి మూర్ఛామ్ । స్తన్యేనపిత్తు స్వరసేననస్యం సుచందనం చైవ నిహంతిమూర్ఛామ్॥

తా. ఇప్పపిండి పంచదార అనువానిని చనుబాలతోనూరి నస్యముచేసినను లేక చనుబాలు చెరుకురసము శ్రీగంధము అనువాని నేకముజేసి నస్యముజేసినను మూర్ఛావాతము హరించు (మఱియు జిల్లేడుకొనల నస్యముచేసిన కూతవేసి భూమి పైబడే మూర్ఛారోగములు హరించు.

అర్దితాదివాతములకు కాశ్మర్యాదినస్యము॥

శ్లో॥ కాశ్మరీచవ్యకుష్ఠంచ లవంగందారు సైంధవమ్ ।
పిప్పలీ నస్యకంహంతి హ్యర్దితంచ హనుగ్రహమ్ ॥

తా కవ్వపుగుమ్ముడు కొనలు . చెవ్యము చంగల్వకోష్టు లంగములు దేవదారు సైంధవలవణము పిప్పలి వీనినిసమభాగములుగనూరి నస్యముచేసిన అర్దితవాతము హనుగ్రహవాతము హరించును.

మూర్ఛాదులకు కుంకుమాదినస్యము.

శ్లో॥ కుంకుమం ఘృతసంయుక్తం మూర్ఛాపిత్త వికారనుత్ ।
శిరోభ్రమ హరంశ్రేష్ఠం నస్యంవై నాత్రసంశయ ॥

తా. కుంకుమపువ్వును తేనెలోకలిపి నస్యముచేసి మూర్ఛ పైత్యవికారము తలదిరుగుట నిస్సంశయముగ హరించు.

వాతాదిరోగములకు త్రికటుకాది నస్యము.

శ్లో॥ [పూజ్యపాదీయే] త్ర్యూషణం చిత్రకంచైవ లాంగలీచేంద్ర వారుణీ । వచామధుకబీజాని తత్రపాఠా నదీఫలమ్ । తాళకం

వత్సనాభంచ టంకోల క్షారయుగ్మకమ్ । ఏవంపంచ దశైతాని సమభాగాని కారయేత్ । సూక్ష్మచూర్ణీ కృతంచైవ నిర్గుండీ తింత్రిణీరసైః ఆర్ద్రిక స్వరసై ర్మర్ద్యం త్రివిధైశ్చ విచక్షణః । ఏవంనస్యం ప్రదాతవ్య మర్కమూల రసేనచ । అపస్మారంచ హృద్రోగం వాతసంకులమేవచ । ధనుర్వాతం భ్రమింహంతి హ్యున్మాదం సన్నిపాతకమ్ । పూజ్యపాదకృతోయోగో నరాణాం హితకామ్యయా॥

తా. త్రికటుకములు చిత్రమూలము చెన్నంగెర్ల గడ్డ పాపరవేళ్ళు వస ఇప్పగిం... శిరుబొద్ది వేళ్ళు సముద్రపాలవిత్తులు శుద్ధిచేసిన తాళకము శుద్ధిచేసిన వసనాభి ...డుగకొనలు ...ము యవక్షారము ఈపదిహేను దినుసులను సమభాగములుగ కొనిసూక్ష్మముగ చూర్ణముచేసి వావిలి చింతాకు అల్లము అనువానిరసములతో 1 ...ము మర్దించి ...గింజలం తేసి మాత్రలుచేసి ఎండ నెండించి యందొకదానిని జిల్లేడు వేళ్ళరసముతోనూరి నస్యముచేసిన అపస్మారము హృద్రోగము వాతరోగముచేత ...రము ...తెరుగక పడేరోగములు ధనుర్వాతము భ్రమణవాతము ఉన్మాదము సన్నిపాతము నశించు. ఇది లోకహితార్థమై పూజ్యపాదునిచే నిర్మింపబడియె.

## దండవాత లక్షణము.

శ్లో॥ దండవత్ స్తంభతే యస్మిన్ మందాగ్ని శ్చాతిశీతతా ।
అపస్మారశ్చ తంద్రాచకఫః పాండుశ్చస్వాపితా ।
ఉదరంగంధలేపేన శూలంవాయుశ్చ దండకః ॥

తా. అగ్నిమాంద్యము కడుశైత్యము అపస్మారము తంద్ర దగ్గుగలుగుట శరీర ... పాండురవర్ణముగనుండుట నిదురగలుగుట ఉదరమున శ్రీగంధము పూసికొనినటు ...నే వాసనవచ్చుట శూలగలుగుట ఈ లక్షణములుగలిగి శరీరము దండమువలె స్తం ...ంచియుండుటయే దండవాతమని తెలియవలయు.

## దండవాతము... విజయభైరవరసము

శ్లో॥ శుద్ధసూతం విషంగంధం మరీచం నాగరంసమమ్।
త్రిక్షారంపంచలవణంపేషయే దార్ధ్రికద్రవైః ।

కాచకుప్యంతరే క్షిప్త్వా శనైర్మృద్వగ్నినాపచేత్ ।
స్వాంగశీతంసముద్ధృత్య దశమాంశం విషంక్షిపేత్ ।
సూక్ష్మచూర్ణంకృతంఖల్వే గుంజామాత్రం ప్రదాపయేత్ ।
ఆర్ద్రికద్రవసంయుక్తం దండవాతం వినాశయేత్॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిననాభి శుద్ధిచేసినగంధకము మిరియాలు శొంఠి సర్జక్షారము యవక్షారము టంకణక్షారము * పంచలవణములు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి ఖల్వములోనునిచి అల్లపురసముతో 1 దినముమర్దించి గాజుకుప్పెలోనునిచి చీలమన్ను లేపనముజేసి ఎండించి 3 ఘామములు మృద్వగ్నిలోవండి స్వాంగశీతలమున దీసి మరల ఖల్వములోనునిచి దానికి పదియవభాగము శుద్ధిజేసిననాభికలిపి బాగుగమర్దించి గురిగింజలంత అల్లపురసానుపానముతో సేవించినదండవాతము (ఆమవాతము అజీర్ణవాతము) హరించు.

## మందవాత లక్షణము.

శ్లో॥ పాండుపుశ్చభ్రమోమూర్ఛా స్వేదఃకంశేపరిభ్రమః ।
వాంతిదోషోవికారశ్చ మందవాతస్య లక్షణమ్ ॥

తా. శరీరము పాండురవర్ణముగనుండుట తబ్బిబ్బులాడుట మూర్ఛకులికేయంగ చెమటగలుగుట శరీరముతిరుగుట వాంతి ఓకరగలుగుట ఈ లక్షణములు గలది మందవాతమని తెలియవలయు.

## మందవాతమునకు కాలకంటకరసము.

శ్లో॥ శుద్ధసూతం మృతంగంధం చాభ్రకంతీక్ష్ణ తామ్రకమ్
హంసపాదిరసైర్మర్ద్యంకాచకుప్యాంనివేశయేత్ ।
వాలుకాయంత్రకే పాచ్యంమద్యామాంతే సముద్ధరేత్ ।
మాషమాత్ర ప్రయోగేణమందవాతో వినశ్యతి॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసినగంధకము అభ్రకభస్మము లోహభస్మము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదియాకు రసముతో

* పంచలవణములనః—సైంధవలవణము సౌవర్చలవణము బిడాలవణము కాచలవణము సముద్రలవణము అనునవి.

1 దినము మర్దించి గాజు కెప్పెలోనునిచి చీలమన్ను లేపనముజేసి ఎండించి వాలుకా యంత్రమున 6 ఝామములువండి స్వాంగశీతలమునదీసి మాష ప్రమాణమును మినుపకట్టు వెల్లుల్లిరసము అనువాని అనుపానముతో సేవించిన మందవాతము హరించు.

## కోష్ఠవాత లక్షణము.

శ్లో॥ దేహకార్శ్యో హరి ద్రాచ స్వేదోహీనమల స్తథా ।
అగ్నిమాంద్యం వికారశ్చ కోష్టవాతస్యలక్షణమ్ ॥

తా. శరీరము కృశించుట శరీరము పసుపు వర్ణముగనుండుట చెమట అగ్ని మాంద్యము కడుపులో వికారముగలుగుట ఈ లక్షణములుగలిగి అల్పముగ మలము వెడలుటయే కోష్ఠవాతమని తెలియవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] సతతం చాగ్నిమాంద్యంచశోభాతీ సారసం భవః । దేహంచపాండురంమూత్రం కోష్ఠవాతస్యలక్షణం ॥

తా. ఎల్లపుడు అగ్నిమాంద్యముగలుగుట శరీరమువాచుట అతిసారము గలుగుట శరీరము పాండురవర్ణముగనుండుట మూత్రము పాండురవర్ణముగ వెడలుట ఈల క్షణములుగలది కోష్ఠవాతమని తెలియవలయు.

## కోష్టవాతమునకు స్వచ్ఛందభయిరవరసము.

శ్లో॥ శుద్ధసూతం విషంగంధం నేపాళంవిషచిత్రకమ్ ।
అర్కమూలకషాయేణ మర్దయే ద్యామ మాత్రకమ్ ।
డోలాయంత్రేపవేద్యామంగుంజామాత్రం ప్రదాపయేత్ ।
కోష్ఠవాతవినాశస్స్యాత్సర్వవాతవి కారనుత్ ॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిచేసిననాభి శుద్ధిజేసినగంధకము శుద్ధిజేసిన నేపాళ ములు అతివస చిత్రమూలము వీనినీ సమభాగములుగఖల్వములోనునిచి జిల్లేడువేళ్ళ కషాయముతో 1 ఝాముమర్దించి డోలాయంత్రములో 1 ఝాముపండి గురిగింజ ప్రమాణమును సేవించిన కోష్ఠవాతము సర్వవాతములు నశించు.

## గుల్మవాత లక్షణము.

శ్లో॥ అజీర్తిరోర్ఛజనేభంగో కుక్షిశూలంశిరోవ్యథా ।
ధాతుశోషోవికారశ్చ గుల్మవాతస్య లక్షణమ్ ॥

తా. అన్నము అరగకుండుట భోజనమునం దిచ్చలేకుండుట తలనొచ్చుట ధాతువులు శోషించుట శరీరము వికారమును జెందుట ఈలక్షణములుగలిగి కడుపులో శూలించుటయే గుల్మవాతమని తెలియవలయు.

## గుల్మవాతమునకు త్రివిక్రమరసము.

శ్లో॥ శుద్ధసూతామృతంతామ్రం శిలాతాళంచగంధకమ్ ।
కుష్ఠంమహా బలాపథ్యా శిఖికంఠంవిదారికా ।
ఏరండతైలసంయోజ్యదిన మేకంతు మర్దయేత్ ।
పునర్నవాద్రవేణఖువ హ్యనుపానేననైతథా ।
గుంజామాత్రాం వటీంఖాదేద్గుల్మవాతం నిబర్హణమ్ ॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిజేసిన వసనాభి తామ్రభస్మము శుద్ధిజేసిన మణిశిల శుద్ధిజేసిన తాళకము శుద్ధిజేసిన గంధకము చంగల్వకోష్టు ముత్తవపులగ పువేళ్ళకరక్కాయలు శుద్ధిచేసిన మయిలుతుత్తము నేలగుమ్ముడుగడ్డ వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ఆముదముతో 1 దినము మర్దించి గురిగింజంత మాత్రలుజేసి యందొక దానిని గలిజేరురసానుపానముతో సేవించిన గుల్మవాతము హరించు.

## మజ్జావాత లక్షణము.

శ్లో॥ సర్వాంగశోథః కంపశ్చహిక్కావై ఛర్ది సంతథా ।
తీవ్రభ్రమణ శూలంచమజ్జా వాతస్యలక్షణమ్ ॥

తా. సర్వాంగములు వాచుట శరీరము వణుకుట ఎక్కిళ్ళు వాంతిగలుగుట శరీరము తిరుగుట శూలగలుగుట ఈ లక్షణములుగలిగి ఎముకలలోని క్రొవ్వుశోషించుటయే మజ్జావాతమని తెలియవలయు. (ఇది హరించుటకై వాతారిరసము నేనివాతగజాంకుశరసము నేని సేవింపవలయు.)

## క్షతవాత లక్షణము.

శ్లో॥ ఆనాహోమూత్రకృచ్ఛ్రంచ హ్యంగదాహశ్చ కంపనమ్ ।
నాభిశూలంకుక్షిశూలం క్షతవాతస్యలక్షణమ్ ॥

తా. కడుపుఉబ్బుట మూత్రము ఒక్కొకబొట్టుగ వెడలుట అవయవములు మండుట శరీరము వణుకుట ఈలక్షణములుగలిగి బొడ్డు కడుపు శూలించుటయే క్షతవాతమని తెలియవలయు.

## వసావాత లక్షణము.

శ్లో॥ గాత్రేశోపశ్చనేత్రేచ నిద్రాభంగ శ్శిరోవ్యథా ।
నాసాశూలం శిరశ్శూలం వసావాతస్య లక్షణమ్॥

తా. శరీరము వాచుట నేత్రములు ఉబ్బుట నిదురరాకుండుట తలనొచ్చుట ముక్కు తలశూలించుట ఈ లక్షణములు గలిగి మాంసములోని క్రొవ్వుశోషించుట నేవసావాతమని తెలియవలయు. (ఇది హరించుటకై వాతారిరసము నేని వాతగజాంకుశరసము నేని సేవింపవలయు.)

## అణువాత లక్షణము.

శ్లో॥ అణువాతే కుబ్జరూప మంగేషు పరిపీడనమ్ ।
గాత్రభేదోగ తేర్భంగో హ్యాణు వాతస్యలక్షణమ్॥

తా. శరీరము స్వల్పమగుట కురచతనము గలుగుట అవయవములు నొచ్చుట శరీరము విరిచికొనుట నడుచుటకు శక్తిలేకుండుట ఈలక్షణములు గలిగి నడుమును లోపలికి వంగదీయుటయే అణువాతమని తెలియవలయు. (ఇది యాప్యముఇదిహరించుటకై వాతగజాంకుశరస సేవననువిషతిందుకతైలలేపనమును సేయుచుండవలయు.)

## దధివాత లక్షణము.

శ్లో॥ అక్షిశూలం కర్ణశూలం నాసాశూలం శిరోభ్రమః ।
హిక్కాతి సారకంచైవ దధివాతస్య లక్షణమ్॥

తా. నేత్రములు కర్ణములు ముక్కుశూలించుట తలతిరుగుట ఎక్కిళ్ళు అతిసారము గలుగుట ఈలక్షణములు గలది దధివాతమని తెలియవలయు.

## తద్ధివాతారి రసము.

శ్లో॥ రసగంధక నేపాళం సమంఖల్వే విమర్దయేత్ ।
చిత్రమూల కషాయేణ డోలాయంత్రేణ పాచయేత్ ।
గుంజామాత్రం పాయయేత్తు దధివాతం వినశ్యతి॥

తా. రసము గంధకము నేపాళములు వీనిని శుద్ధిచేసి సమభాగములుగ ఖల్వములో నునిచి చిత్రమూలకషాయముతో 1 దినముమర్దించి డోలాయంత్రమున వ ఒకగురిగింజమోత్తును సేవించిన దధివాతము హరించు.

## కర్ణవాత లక్షణము.

శ్లో॥ కర్ణవాతేచ బాధిర్యం మహాశూలేన పీడనమ్ ।
అహోరాత్రం చదుంఖంస్యాద్దేహశోషః ప్రకీర్తితః

. తా. చెవులు నొచ్చుట రేయుంబగలు దుఃఖించుట శరీరము కృశించుట ఈ లక్షణములుగలిగి చెవులు వినరాకుండుటయే కర్ణవాతమని తెలియవలయు.

## కర్ణవాతహర తైలము.

శ్లో॥ శేఫాల్మతిల కైరండ కుమారీకులమిశ్రితైః ।
తతోనిరూహోవాతఘ్నః కల్కస్నెహైర్నిరూహయేత్ ।
కర్ణవాతం నిహంత్యాశు బాధిర్యంచ వినాశయేత్ ।

తా. నల్లవావిలి అమ్లవేతసము నువ్వులనూనె ఆముదము కలబందగుజ్జు వ్రాకుడు వీనిని కల్కముగవండి చెవిలో * నిరూహవస్తి సంస్కారము చేసినకర్ణవాతము చెవుడు కడుశీఘ్రముగ హరించు.

## బధిరవాత లక్షణము.

శ్లో॥ వాతేసబధిరోజాః తథాశ్రోత్రధ్వనిర్భవేత్ ।
కర్ణవాత హరంతైలం ప్రయోక్తవ్యం ప్రలాయతే ॥

తా. వాతమువలన చెవుడు చెవులయందు ధ్వనిగలిగిన బధిరవాతమని తెలియవలయు. ఇదిహరించుటకై పైజెప్పబడిన కర్ణవాతహర తైలమునుప్రయోగింపవలయు.

## కర్ణవాతమునకు దశమూల తైలము.

శ్లో॥ క్వాథశ్చ దశమూలానాం భాగక్షీరంచ తత్సమమ్ ।
తిలతైలం ద్వయోస్తుల్యం పాచ్యం తైలావశేషితమ్ ।
తత్తైలంనిక్షి పేత్కర్ణే బాధిర్యంనాశయేద్ధ్రువమ్ ॥

తా. దశమూలములన (మారేడు గుమ్మడు తక్కిలి కలిగొట్టు దుందిలముకొన్న నేలపొన్న నేలములక పెద్దములకపల్లేరు) అనువాని వేళ్ళనుదంచికషాయము

---

* నిరూహమన—కషాయము పాలు తైలము అనువానిని చిమ్మనగొట్టముతో చిమ్ముట.

కొంచి వడియకట్టి దానికిసమముగ మేకపాలుగలిపి ఈ రెంటికిసమముగ నువ్వులనూనె కలిపి తైలముపాకముగ (అనగా తైలము శేషించువరకు) వండి దానిని చెవిలోబోసిన చెవుడు ధ్వని కడు శీఘ్రముగ హరించు.)

## కర్ణశూలవాతలక్షణము తచ్చికిత్స.

శ్లో॥ కర్ణశూలంపవనజం క్షిపేచ్ఛ్రోత్రేరసాశనమ్ ।
వాతఘ్నసాధితంసర్పిః కోష్ణంకర్ణంచ పూరయేత్ ।
మహతఃపంచమూలస్య కాష్ఠాత్క్షౌమేన వేష్టితాత్ ।
తైలసిక్తాత్ప్రదీప్తాగ్నే స్నేహస్స్రోత్ర్యోరుజాపహః ॥

తా. వాతమువలన చెవులయందుశూలగలుగు దానియందు అన్నరసమును ఆవునెయ్యిని విడిచి చెవిలోబోసినను లేక వాతహరద్రవ్యయుక్తముగ కాచబడిన ఘృతమును చెవిలోబోసినను లేక మారేడు చిత్రమూలము పెద్దమాను గుమ్మడుకలిగొట్టు అను మహాపంచమూలముల యొక్క కొష్ఠములకు పట్టువస్త్రముచుట్టినూనెలో తడిపి జ్వాలగ దీపముముట్టించి యందు స్రవించెడి తైలమును చెవిలోబోసినను చెవినొప్పితత్క్షణమునహరించు.

## ఉన్మాదవాత లక్షణము.

శ్లో॥ ప్రలాపకృత్తథాకోపీ భూతావేశ వికారకృత్ ।
దిగంబరస్స్మృతిభ్రంశ ఉన్మాదస్స్యాచ్చమారుతః ॥

తా. వదురుట కోపగించుకొనుట దయ్యముపట్టినట్టుగ దిగంబరుడుగ నుండుట స్మృతిలేకుండుట ఈలక్షణములును ఉన్మాదమును గలిగియుండుటయే ఉన్మాదవాతమని తెలియవలయు (ఇదిహరించుటకై ఉన్మాద ప్రకరణమున జెప్పబడు విజయాగుళికలనేని పర్పటీరసము నేని సేవింపవలయు.)

## ఊర్ధ్వవాత లక్షణము.

శ్లో॥ ఉపరోధో మలంబద్ధ ముచ్ఛ్వాసశ్వాసకాసకౌ।
అన్నంతీక్ష్ణంచ మందాగ్నిరూర్ధ్వవాతస్యలక్షణమ్ ॥

తా. శరీరముబద్ధగించుట మలముబంధించుట అన్నమునందిచ్ఛలేకుండుట అగ్నిమాంద్యములుగలుగుట ఈ లక్షణములతోడ ఉచ్ఛ్వాసములేక శ్వాసకాసలుకలుగుటయే ఊర్ధ్వవాతమని తెలియవలయు. [ఇది అసాధ్యము.]

## ఊర్ధ్వవాతమునకు వాతారిరసము.

శ్లో॥ క్రమోత్తరగుణంశుద్ధం రసంగంధంఫలత్రయమ్ । చిత్రకంగుగ్గులు-మర్ద్యం పంచైరండకతైలకైః । పున్నాగంబృహతీయుగ్మం దేవదారుసుచూర్ణకమ్ । ఏతత్సార్వౌషధసమంమర్ద యేద్యామమాత్రకమ్ । కర్షంఖాదేత్పిబేత్క్వాథం నాగరైరండమూలజమ్ । అభ్యంగైరండతైలేన పృష్ఠే స్వేదంచకారయేత్ । విరేచనంభవే తేన స్నిగ్ధముష్ణంచభోజయేత్ । రసో వాతారినామాయ మూర్ధ్వవాతంచ నాశత్ ॥

తా. శుద్ధిజేసినరసము 1 మాడయెత్తు శుద్ధిచేసిన గంధకము 2 మాడల ఎత్తు కరక్కాయలు 3 మాడల ఎత్తు తానికాయలు 4 మాడల ఎత్తు ఉసిరికెపప్పు 5 మాడల ఎత్తు చిత్రమూలము 6 మాడల ఎత్తు శుద్ధిచేసిన గుగ్గిలము 7 మాడల ఎత్తు ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి 5 మాడల ఎత్తు ఆముదముబోసి మర్దించి పిదప దానికి సమముగ సురపొన్న నేలములక వాకుడు దేవదారు అనువాని చూర్ణమును కలిపి మరల ఒకఝామువరకు మర్దించి కర్షప్రమాణమంతేసి మాత్రలుజేసి యందొక వానిని శొంఠి ఆముదపువేళ్ళు అనువాని కషాయానుపానముతో సేవనను ఆముదముతో అభ్యంజనమును స్వేదస్రావముగలుగునటుల వీపుయందు మర్దనను చేయించిన ఊర్ధ్వవాతము హరించు మఱియు నీయౌషధసేవనవలన ఒకమారు విరేచనంబగు పిదప స్నిగ్ధమై ఒకింత ఉష్ణముగనుండు భోజనమును భుజింపంజేయవలయు.

## ఆమవాత లక్షణము

శ్లో॥ దేహంచపాండురంమూత్రం తృష్ణాఛర్దిశ్చనేత్రకమ్ ।
పీతవర్ణంభవేదుష్ణ మామవాతస్య లక్షణమ్ ॥

తా. శరీరము మూత్రము పాండురవర్ణముగ నుండుట దప్పి వాంతిగలుగుట నేత్రములుపచ్చగ శరీరము ఉష్ణముగనుండుట ఈలక్షణములుగలది ఆమవాతమని తెలియవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] జంఘోరు త్రికసంధీనాం వ్యథా హృన్నాభి పాదకే । తృష్ణాశోషోవిషూచిశ్చా ప్యామవాతస్య లక్షణమ్ ॥

తా॥ పిక్కలు తొడలు మడ్డిపూస సంధులు హృదయము నాభి పాదములు మొదలగువానియందు వేదనగలుగుట దప్పిగలుగుట శరీరము యెండుట విషూచిగలుగుట ఈ లక్షణములుగలది ఆమవాతమని తెలియవలయు.

## ఆమవాతనివర్తకోపాయము.

శ్లో॥ పంచవక్త్రరసో దేయో ద్విగుంజంతత్ప్రశాంతయే।
దద్యాదేరండతైలేన రసంవాతారిమేవచ॥

తా. పైజెప్పబడు పంచవక్త్రరసములో 2 గురిగింజల ప్రమాణమును సేవించినను లేక ఆముదముతో వాతారిరసమునుగలిపి సేవించినను ఆమవాతమునారించు.

## ఆమవాతమునకు పంచవక్త్రరసము.

శ్లో॥ శుద్ధసూతం సమంగంధం మరీచం టంకణంకణా।
మర్దయేద్ధూర్తజద్రావై ర్దినమేకం విశోషయేత్।
పంచవక్త్రరసోనామా ద్విగుంజం సన్నిపాతజిత్।
అర్కమూల కషాయంచ సవ్యోషమనుపానయేత్॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసినగంధకము మిరియాలు శుద్ధిచేసిన వెలిగారము పిప్పళ్ళు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ఉమ్మెత్తరసముతో 1 దినము మర్దించి ఎండించి రెండుగురిగింజల ప్రమాణము జిల్లేడు వేళ్ళకషాయము త్రికటుకచూర్ణము అనువానియనుపానముతోడ [illegible]ంచిన ఆమవాతము సన్నిపాతము హరించు.

## ఆమవాతమునకు ఏరండతైలము.

శ్లో॥ ఆమవాత గజేంద్రస్య శరీరవన చారిణః।
ఏకఏవాగ్రణీర్హంతా ఏరండస్నేహ కేసరీ॥

తా. శరీరమనువనమున సంచరించునట్టి ఆమవాతమను నేనుగును ఆముదమను సింహము నశింపజేయుచున్నయది.

## ఒరుగువాతమునకు చికిత్స.

సీ॥ పెసువజ్రనీలియుబీరయుగురిజాకురసము మిర్యమునూనెరవిది
నమునానొక్కటిరేగొట్టి చెక్కమిర్యము ద్రాగితెరలగావిడెము

సంధిల్లనొక్కటి। తగుగువ్వగుత్తాకు ద్రవమును మిరియంబుగో ఘృతంబున సేవఁగూడనొకటి । మేదినినీలాకు మేకపాలును గాచి చెస్నుమిూఱఁగఁ సేవఁజేయనొకటి । నెమిలి చెక్కయు పిప్పలి నమరఁద్రాగి । యొరుగుదిక్కున గంధంబు నొరయ నొకటి । రమణతో బుడ్డ కాచాకురసము నెయ్యి । మిరియ ములమూను చుండుఁదానొరుగువాయ్వు॥

వాతప్రకోప లక్షణము.

శ్లో॥ పార్శ్వసంకోచశూలార్తి స్సంధిభంగోతిశీతతా ।
అంగశోషః ఖరశ్చాపో వాతాత్స్ర్యాజ్జాయతే ॥

తా. శరీరపార్శ్వము సంకోచమును జెందుట శూలగలుగుట కీళ్ళునొచ్చుట శరీరము చల్లగనుండుట అంగములువాచుట అంగములు బిరుసై నల్లగనుండుట నిదుర గలుగుట ఈ లక్షణములవలన వాతము ప్రకోపించినదని తెలియవలయు.

వాతశమనోపచారములు.

శ్లో॥ స్వేదాభ్యంగైః కటుక్షారైః స్నేహైరాన్నభోజనైర్ఘృతైః ।
తైలైరసౌషధైర్దివ్యైర్మారుతంనాశయేద్భిషక్ ॥

తా. మఱియు వాతప్రకోపమును స్వేదస్రావము అభ్యంజనము కారము క్షారము స్నేహము ఉష్ణాన్నభోజనము వాతోపయుక్తఘృతములు తైలములురసౌషధములు ఈమొదలగువానివలన వైద్యుడు పోకడచవలయు.

సర్వవాతములకు స్వచ్ఛందభైరవము.

శ్లో॥ శుద్ధసూతం మృతంలోహం తాప్యంగంధకతాళకమ్ । పథ్యాం గ్నిమంధనిర్గుండీ త్ర్యూషణం టంకణంవిషమ్ । తుల్యాంశం మర్దయేత్ఖల్వే దినంనిర్గుండికాద్రవైః । ముండీద్రావైః రేకదినం ద్విగుంజం వటకీకృతమ్ । భక్షయేత్సర్వ వాతార్తోనామ్నా స్వచ్ఛంద భైరవః ॥ రాస్నామృతా దేవదారు శుంఠీవాతారి తుల్యకమ్ । గుగ్గులుం సర్వతుల్యాంశంకుట్టయేద్ఘృత పాచితమ్ । కర్షంచభక్షయేచ్చాను సర్వవాత హరంపరమ్॥

తా. శుద్ధిచేసినరసము లోహభస్మము స్వర్ణమాక్షికభస్మము శుద్ధిచేసినగంధకము శుద్ధిచేసినతాళకము కరక్కాయ నెల్లివాపిలి త్రికటుకములు శుద్ధిచేసినశాలిగారము శుద్ధిచేసిన వసనాభి వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వావిలాకురసముతో 1 దినము బోడతరపాకురసముతో 1 దినము మర్దించి 2 గురిగింజలంతేసి మాత్రలుజేయవలయు. ఇదియ స్వచ్ఛందభైరవ మనంబడు దుంపరాష్ట్ర చూర్ణము తిప్పతీగె చూర్ణము దేవదారు చూర్ణము శొంఠిచూర్ణము ఆముదము అనువాని సమభాగములుగ గ్రహించి దానికి సమముగ శుద్ధిజేసిన గుగ్గిలచూర్ణమునువైచి అందు నెయ్యిగలిపి వండి కర్ష ప్రమాణమును జేకొని వానిలో పైస్వచ్ఛంద భైరవమును గలిపి 2 మండలములు సేవింపుచుండినను లేక (రసఉబ్బవేసినను) సర్వవాతములుహరించు.

## అశీతివాత సామాన్యలక్షణము.

శ్లో॥ [శారీరనిఘంటౌ] అశీతిర్వాతరోగాశ్చ జాయంతే వాతకోపతః । రుక్తోదభేద సంకోచ శోష వేష్టనలక్షణాః ॥

తా. విరుద్ధాహార చేష్టలవలన వాతముప్రకోపించి † ఎనుబదివాతముల గలగంజేయు అందు పీడ పోట్లుబ్రద్దలు సేయునటుల వేదన శరీర సంకోచము శరీరకార్శ్యము శరీరము మెలిబడుట ఈ లక్షణములుగలుగు.

## మతాంతరస్థాశీతివాతములలో బలవత్తరములగున వాతములు.

శ్లో॥ ఆయామద్వయదండకార్దితహనుస్రంస వ్రణాయామరుజ్జిహ్వాస్తంభకళాయఖంజవికృతిస్సాగృధ్రసీవిశ్వాచిః । ఖల్లీస్యాదపతంత్రతానకగదాపంగుశ్చఖంజః క్రమాత్ । దూర స్తంభ శిరోగ్రహావపితథాక్షేపాంఘ్రిబాహామయాః । వాతకంటకగదోప బాహుకంక్రోష్టుశీర్ష మథపాదహర్షరుక్ । పక్షఘాతమఖిలాంగ వాతరుజ్మారు శేషుబలవత్తరాఇమే ॥

---

† ఈ వాతప్రకరణమునం దశీతివాతనామ లక్షణంబులు జెప్పంబడియె నైననువానికిమతాంతరమువలన నామ లక్షణభేదములు గలిగియున్నయవి వానిలో ఇందు జెప్పంబడిన 55 వాతలక్షణంబుల నిచట నుపహరించిన గ్రంథవిస్తరంబగునను భీతిచే జెప్పంబడవయ్యె కావున వాని నామ లక్షణముల శారీరనిఘంటు మొదలగుగ్రంథములవలన తెలిసికొనవలయు.

తా. అంతరాయామము బహిరాయామము దండకము అర్దితము హనుస్రంసము ప్రణాయామము జిహ్వాస్తంభము కళాయఖంజము గృధ్రసి విశ్వాచి ఖల్లీ అపతంత్రకము అపతానకము పంగువు ఖంజము ఊరుస్తంభము శిరోగ్రహము ఆక్షేపకము పాదదాహము వాతకంటకము అపబాహుకము క్రోష్టుశీర్షము పాదహర్షకము పక్షఘాతము సర్వాంగవాతము అను నిరువదియైదును అశీతి వాతములలో బలవత్తరములని తెలియవలయు.

## బలవత్తరవాత లక్షణములు.

సూత్రమ్ ॥ [శారీరసూత్రస్థానే] వేగైరంతరానమితాంగోంతరాయామః । వేగైర్బహిరానమితాంగో బహిరాయామః। తేనదశరాత్రంనజీవతి । మందవేగేనతుజీవేత్ ॥దండవత్ స్తబ్ధసర్వాంగోదండకః । తంభిషగ్వర్జయేత్ । వక్రితవక్త్రోర్ధ్వార్దితః ॥ స్రస్తహనుర్హనుస్రంసః॥ప్రణాప్రకో పాదాంతర్బహిచ్చవేగైరానమితాంగోప్రణాయామః । తంభిషక్పరివర్జయేత్ ॥ దండవత్ స్తబ్ధజిహ్వోజిహ్వాస్తంభః ॥ ముక్తసంధిప్రబంధనః కళాయఖంజః । గృహీతైకచరణోగృధ్రసీ ॥ సాబాహౌచేద్విశ్వాచిః । పాదేబాహౌచఖల్లీ ॥ అంతర్బహిశ్చవేగైర్నమితాంగోపతంత్రః । తేనదశరాత్రంనజీవతి । మందవేగేనతుజీవేత్ । అపతంత్రకవదపతానకః । తత్రాయంవిశేషః । హృదయ్యనిలేవిముక్తేసుఖీభవేత్ । సతుసాధ్యః ॥ గృహీతసక్థిద్వయః పంగుః ॥ గృహీతైకసక్థిఃఖంజః ॥ దండవత్ స్తబ్ధోరుఃఊరుస్తంభః । గృహీతగ్రీవాశిరశ్శిరోగ్రహః ॥ అనుక్రమంవేగైః పతితస్సమాక్షిప్తాంగఆక్షేపకః॥ పాదదాహకత్వాదనిఘ్రిదాహః । సకంటకగమనోవాతకంటకః ॥ అధోముఖబాహురపబాహుకః ॥ జానుమధ్యాదికరుజాశోఫఃక్రోష్టుశీర్షకః ॥ సుప్త్యాహృష్టపాదఃపాదహర్షః ॥ హతైకపక్షః పక్షఘాతః ॥ భగ్నసర్వాంగసర్వాంగవాతః ॥

తా. వాతము ఱొమ్మునాశ్రయించి శరీరమును విల్లువలెవంగతీయునదిఅంతరాయామ వాతమనియు వీపునాశ్రయించి శరీరమును విల్లువలె వంగదీయునది

బహిరాయామవాతమనియు జెప్పంబడు. ఇవి జనించిన 10 దినములకు రోగిమృతిజెందు అయినను వానియందు తీపులు మందముగనుండిన రోగిజీవించు—శరీరమును కఱ్ఱవలె స్తంభింపంజేయునది దండకవాతమనంబడు. ఇది అసాధ్యమగుటంజేసి దానియందు వైద్యుడు చికిత్సజేయంజనదు.—వాతము ముఖము నాశ్రయించి సగము నోరును వంకరగజేయునది అర్దితవాతమనియు దవడల నాశ్రయించి వానిని జారునటులంజేయునది హనుస్రంసవాతమనియు జెప్పంబడు. వ్రణప్రకోపమువలన శరీరమును లోనికిగాని వెలపలికిగాని వంగతీయునది వ్రణాయామవాతమనంబడు. ఇది అసాధ్యమగుటంజేసి వైద్యుడు వర్జింపవలయు.—వాతము వాగ్వాహినీ సిరలయందు ప్రవేశించి నాలుకను దండమువలె స్తంభింపంజేయునది జిహ్వాస్తంభవాతమనియు శరీరసంధులవదలించి శరీరమును కాళ్ళను వణికింపుచు ఖంజరీపిట్టవలె వంకరగ నడుచునటులంజేయునది కళాయ ఖంజవాతమనియు 1 పాదముయొక్క సిరలనాశ్రయించి కదలకబంధింపంజేయునది గృధ్రసీవాతమనియు 1 హస్తముయొక్క స్థూలసిరలయందు ప్రవేశించి అందుండి భుజములయందు వ్యాపించి హస్తమునుకదలక బంధింపంజేయునది విశ్వాచివాతమనియు కాళ్ళచేతులయందు వ్యాపించి శూలనుగలుగంజేయునది ఖల్లీ వాతమనియు జెప్పంబడు.—వాతము ఊర్ధ్వముఖంబై లోపలవెలుపల వేదనను తాపమును గలుగంజేయుచు శరీరమును వంగతీయునది అపతంత్రక వాతమనంబడు ఇదిగలవాడు 10 దినములకు మృతిజెందు. అయినను దానియందు మెల్లని తీపులు గలిగియుండిన వాడుజీవించు.—అపతంత్రక వాతలక్షణములుగలదేఅపతానకవాతమనంబడు. అయినను దానియంధు బొమ్మునొప్పి లేకుండిన రోగిజీవించు. ఇది అసాధ్యము.—వాతము రెండురొండ్ల ప్రవేశించి తొడలయందలి స్థూలనరంబులకేగి తొడలబంధింప జేయునది పంగువాతమనియు ఒకరొండియందు ప్రవేశించి 1 తొడయందు వ్యాపించి కుంటితనము గలుగంజేయునది ఖండవాతమనియు తొడలయందు ప్రవేశించి గుదియవలె స్తంభింపజేయునది ఊరుస్తంభవాతమనియు మెడ తల వీనిని కదలక బంధింపజేయునది సిరోగ్రహవాతమనియు సిరలజొచ్చి ఏగుగమీద కూర్చుండువాని శరీరము కదలుభంగి శరీరమును పలుమారు కదలునటులంజేయునది ఆక్షేపకవాతమనియు నడిచిన అరికాళ్ళు మండునటులంజేయునది పాదదాహవాతమనియు నడచిన ముండ్లునాటునటుల నొచ్చునటులంజేయునది కంటకవాతమనియు చెయ్యిని తలక్రిందుగజేయునది అపబాహుకవాతమనియు రక్తాశ్రితమైమెకాలినడుము కడునొప్పిని వాపునుగలుగంజేయునది క్రోష్టుశీర్ష వాత మనియు కఫాశ్రితమై కాళ్ళయందు గిలిగింతలవలె తిమురును గలుగంజేయునది పాదహర్ష వాతము

నియు అర్ధాంగమున బ్రవేశించి సంధిబంధములవదలించి శరీరముయొక్క 1 పార్శ్వమును చేతనారహితముగ జేయునది పక్షఘాతవాతమనియు విరగగొట్టబడినటుల సర్వాంగములయందు నొప్పి గలుగంజేయునది సర్వాంగవాతమనియు జెప్పంబడు.

## బలవత్తర వాతోపచారము,

శ్లో॥ ఏతేదాహ క్రియాసాధ్యా అగ్నివైద్య మతఃపరమ్॥

తా. పైజెప్పబడిన వాతములు అగ్నికర్మవలన సాధ్యంబులు అట్లగుటంజేసి అగ్నికర్మలవచించెద,

## వాతములకు రక్షాదికర్మలు.

సూత్రమ్॥ అయామద్వయాప తంత్రాకాపతానకా క్షేపకేషు శిరోలలాటకర్ణమూల గ్రీవాగ్రపృష్ఠమధ్య త్రికవక్షోజంఘా ప్రదేశేషుసందహేత్ ॥ అర్దితేగ్రీ వాగ్రఏవ ॥ హను సంసేహనుమూలయోరేవ॥ జిహ్వాస్తంభేకర్ణ మూలయోరేవ ॥ కళాయఖంజేసంధిబంధనేషు ॥ గృధ్రిస్యాంజానో రూర్ధ్వ వాచతురంగుళే ॥ విశ్వాచ్యాంహస్తే తద్వత్ ॥ ఖల్యాంతద్వత్పాదహస్తయోః ॥ సక్తి మధ్యేవంగా ॥ తద్వత్తంజే ॥ వాతకంటకే గుల్ఫాద ధోర్ధ్వ ద్వ్యంగుళే ॥ అపబాహుకే భుజశిర సోర్ధ్వద్వ్యంగుళే ॥ భుజానుక పాలస్యపరితఃక్రోష్టుశీర్షకే ॥ ఊరుస్తంభే తన్మధ్యఏవ । పాదదాహేంనదాహః ॥ శిరోగ్రహే గ్రీవాగ్రఏవ ॥ పాదహర్షే నదాహః । పక్షఘాతేషు పక్షయోరేవ । సర్వాంగవాతేనదాహః ॥

తా. అంతరాయామము బహిరాయామము అపతంత్రకము అపతానకము ఆక్షేపకము అను నీ 5 వాతములయందు శిరము లలాటము కర్ణమూలము మెడ నడివీపు ముడ్డిపూస రొమ్ము పిక్కలు అనువానియందును అర్దితవాతమున మెడను పైభాగమునందును రక్షవేయవలయు. హనుస్రంసవాతమునందు చెక్కిళ్ళమోలముల యందుగాని లేక పెద్దచెవిగూబ మొదటిగుంటలోగాని లేక క్రిందిపెదవిగుంటలోగాని రక్షవేయవలయు. జిహ్వాస్తంభవాతమునందు చెవికొలుకులయందును కళాయఖంజ

వాతమున కీళ్ళయందును రక్షలు వేయవలయు. గృధ్రసీవాతమున మోకాలియొక్క 4 అంగుళములపైనగాని లేక వెనుకగాని రక్ష వేయవలయు. విశ్వాచీవాతమున చెయ్యినడిమికీలుకు ముందరగాని లేక వెనుకగాని రక్షలు వేయవలయు. ఖల్లీవాతము నందు మోకాళ్ళు మోచేతులు అనువాని ముందర వెనుక రక్షలు వేయవలయు. పంగువాతము ఖంజవాతము అనువానియందు తొడల మధ్యమునందును వాతకంట వాతమున చీలమండలకు 2 వేళ్ళక్రిందనుఅవ బాహుకవాతమునభుజశిరస్సులకు 2 వేళ్ళ క్రిందను క్రోష్టుశీర్ష వాతమున మోకాలిచిప్ప తిరుగువారయందును ఊరుస్తంభవాతమున తొడలనడుమను రక్షలు వేయవలయు. పాదదాహవాతమున రక్షలు వేయంజనదు.—శిరోగ్రహవాతమున మెడతుదన రక్షలు వేయవలయు.—పాదహర్ష వాతమున రక్షలు వేయంజనదు.—పక్షఘాతవాతమున ఇరుప్రక్కల రక్షలు వేయవలయు—సర్వాంగవాతమున రక్షలు వేయంజనదు.

సూత్రమ్ ॥ ఆయామయోస్సిరావేధమ్ । వమనంచకుర్యాత్ ॥

తా. అంతరాయామి బహిరాయామవాతములయందు సిరావేధనను వమనమును జేయించవలయు.

సూత్రమ్ ॥ త్వఙ్మాంసశోణితగతేష్వనిలేషుశృంగై ర్రసంవిస్రావయ్యేత్ ॥

తా. త్వగ్గత మాంసగత రక్తగతవాతములయందు బొమ్మున శృంగములతో రక్తమును స్రవింపంజేయవలయు. (కంటియొక్క వల్లగ్రుడ్డు మీదికెగతీయుచుకంటికిముందర అదురుచుండువాతమున కంటియొక్కక్రింది యెముకమీద కదురుతో నడ్డముగ రక్ష వేయవలయు. కాళ్ళయందీడ్చుగలిగిన చీలమండయొక్క కీలువెను చంద్రాకారముగ రక్ష వేయవలయు. మోకాలు మోచెయ్యి ముంజెయ్యి అనువానిలో దేనియందేని వాపు గలిగియుండినను నెపట్టించి 7 తడిబట్టలుచుట్టదానిపైఅగ్నికర్మ చేయబడువాడు సహించునటుల 10 దివసములు సాయంప్రాతఃకాలముల అగ్నికర్మ చేయవలయు. నొప్పిగల కంటియొక్క కనుబొమ్మమీదరెండువేళ్ళకు పొడపున కదురుతో అడ్డముగ రక్ష వేసిన నేత్రము లెఱ్ఱనై పోట్లుపొడుచుచు నీరుకారుచుండు నేత్రవాతము హరించు కుడికన్ను తెల్లగ అవినై నీళ్ళుగారుచునొప్పితోగూడితెల్లగ కప్పుకొనుచు వచ్చుచుండిన ఎడమకాలియొక్క ఐదువ్రేళ్ళగాశ్రయించియుండు కీళ్ళయందును ఎడమకన్ను అయినయెడల కుడికాలియొక్క ఐదువ్రేళ్ళయందుండు కీళ్ళయందును అడ్డముగ రక్ష వేయవలయు, గుఱ్ఱపుమోర్లకుజిట్టుడునొలి చికడుపుతో

అడ్డముగ రక్షవేయవలయు. డబురుకవాతమున వెణుతురునారతో త్రాడుచేసిదానిని కౌగినమూనెలోముంచి మోకాలికి రెండంగుళముల ప్రదేశమున రక్షవేయవలయు. మఱియు డబురుకమైన మోకాలియొక్క వెలుపటి కంటికి ఐదంగుళములకు దిగువ రక్షవేయవలయు. మఱియు డబురుకమైన కాలియొక్క చీలమండసంధిలో అడ్డముగ కదురుతో చంద్రాకారముగ రక్షవేయవలయు.)

[శుద్ధిచేసిననాభి మేకవెంట్రుకలబూడిద మిరియాలు వీనిని దినుసుకొకటింటికి 1 తులముచొప్పున ఖల్వములోనునిచికరివేపాకురసముతో మర్దించి గురిగింజంతేసి మాత్రలుజేసి యందొకదానిని ఐదుచిన్నముల కరివేపాకురసముతో సేవించిన ఒరుగువాతము సర్వవాతములు మూర్ఛ హరించు.]

ఉ॥ మేలు చికిత్సఁగోరి విను మేదిని బ్రహ్మజెముండుఁ బాలునుం ।
నాలుగు సేరులాముదము నాలుగు సేరులుఁగూర్చి యందులో ।
నేలపు దంగెడాకుపూడి నీరులిగడ్డల నర్ధ సేరునుం ।
గ్రాలఁగఁదైలపాకముగఁ గాచియుఁ వాతశరీరినొప్పిపై ।
దాలిమిఁబూసికాచినను దక్షణమాత్రన మానునిమ్ముగన్ ॥

సర్వవాతములకు అర్కాదితైలము.

శ్లో॥ అర్కక్షీరమజాక్షీరం నిర్గుండీతింత్రిణీరసః ।
తిలతైలసమాయుక్తం వాతాశీతివినాశనమ్ ॥

తా. జిల్లేడుపాలు మేకపాలు వావిలాకురసము చింతాకురసము నూనె వీనిని సమభాగములుగ కలిపి 1 కుండలోబోసి తైలపక్వముగ కాచి శరీరమునకులేపనము చేసి మర్దింపుచుండిన 80 వాతములు హరించు.

తైలపాక లక్షణము.

శ్లో॥ నాంగుళీగ్రాహితా కల్కే సస్నేహి గ్నౌచశబ్దితా ।
వర్ణాదికంపంచయథాతథయుతచ్ఛ్రీఘ్రమాహరేత్ ॥

తా. కల్కము వ్రేళ్ళకు అంటుకొనకుండుట అగ్నియందువైచిన చటచట శబ్దములేకుండుట విజాతీయశ స్పర్శవర్ణ సగంధములుగలుగుట ఈలక్షణములవలన తైలము పక్వమైనదని తెలిసి దానిని శీఘ్రముగ దించవలయు.

శ్లో॥ పాకస్తు త్రివిధోమందః చిక్కణఃఖరచిక్కణః।
మందః కల్కసమేకిట్టే చిక్కణోమదనోపమే।
కించిత్సీదతికృష్ణేచ వర్తమానేతుపశ్చిమః॥

తా. తైలపాకము మందము చిక్కణము ఖరచిక్కణము అన 3 విధంబులు అందు స్నేహకిట్టము కల్కముతో సమముగ నుండిన మందపాకమనియు మైనముతో సమముగనుండిన చిక్కణపాకమనియు ఒకింత చెడినను లేక నలుపువర్ణమును జెందినను ఖరచిక్కణ పాకమనియు తెలియవలయు.

శ్లో॥ [మతాంతరే] ఖరోమణిరవఃకాంస్యే మృదుః పిచునివర్తికా।
చిక్కణస్స్పర్శమాత్రేణ నిమ్నభావం ప్రపద్యతే।
మృదుర్నస్యే ఖరోభ్యంగేపానేవస్తౌచచిక్కణః॥

తా. మఱియు స్నేహకిట్టమును ఉంటగ చేసి కంచుపాత్రలో వైచిన మణివలె నేధ్వనిగలిగిన ఖరపాకమనియు వ్రేళ్ళతో నలిపిన వర్తియొక్క ఆకారమును జెందిన మృదుపాకమనియు, ఉంటచేసి వ్రేళ్ళతో నదిమిన పల్లముబడిన చిక్కణపాకమని యు తెలియవలయు. తైలము నస్యమునకు మృదువుగను అభ్యంజనమునకు ఖరముగను పానవస్తి కర్మలకు చిక్కణముగను పాకము సేయవలయు.

## వాతరోగములయందు పథ్యము.

శ్లో॥ కూష్మాండమాష వార్తాకబృహతీ కారవేల్లకమ్।
వాస్తుకంకాసమర్దంచ పృశ్నికాళిపునర్నవమ్।
కృష్ణాఃకుళుత్థాగోధూమా స్తైలంతి క్తపటోలకమ్।
మూలకంవత్సకంచైవ ఢుండుకంకతకంతథా।
తక్కారీసూరణీముండీ మిసీజీరకరామఠమ్।
పురాణధాన్యమభ్యంగం మిత్రవర్గో నిలామయే॥

తా. బూడిదగుమ్మడుకాయ మినుములు వంకాయ మునగకాయ కాకరయు చక్రవర్తికూర కసివెందకూర తూటికూర గలిజేరుకూర నల్లఉలవలు గోధుమ నూనె చేదుపొట్ల ముల్లంగి కొడిసెకాయ దుందిలపుకాయ మొక్కపుకాయ తక్కంపబోడితరము పెద్దసదాప జీలకఱ్ఱ ఇంగువ ప్రాతబియ్యము అభ్యంజనస్నానః ఇవివాతరోగములయందు పథ్యకరంబులు.

## వాతరోగములయందపథ్యములు.

శ్లో॥ శీతాంబుశాకలఃకంద త్రపుసాలాబు ముద్గకమ్ ।
గురుణీచాభిష్యందీని నిష్పావోద్దాల సర్షపమ్ ।
కరీరాణీతథానింబో నవధాన్యంచలంఘనమ్ ।
మృణాలీ ఝురసీనింబ తిక్త శింబంహిమాలయః ।
కోశాతకీద్వయంచైవ పవనాశీతిశత్రవః॥

తా శీతోదకము మూడాకులగడ్డ దోసకాయ అనపకాయ (అనగా సొర కాయ) పెసలుగురుకరద్రవ్యములు కఫకరపదార్థములు అనుములు నక్కదోసకాయ ఆవాలు వెదురుమొలకలు వేపపండ్లు క్రొత్తధాన్యము ఉపవాసము తామరతూండ్లు చాతలాసికూర కరివేము చేదుదొండకాయ శీతలప్రదేశము బీరకాయ నేతిబీరకాయ ఇవి 80 వాతరోగములయందపథ్యంబులు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
అశీతివాతరోగనిదాన తత్సాధ్యాసాధ్య చికి
త్సానుపాన నస్యాగ్ని కర్మతైలపాకప
థ్యాపథ్య లక్షణయుక్తం షష్ఠి
ప్రకరణమ్.



శ్రీ ర స్తు.

# బసవరాజీయము.

## ఆంధ్రతాత్పర్యము.

### — సప్తమ ప్రకరణము. —

శ్లో॥ శూలినం మేరుకోదండం షద్మలోచన సాయకమ్ ।
త్రిపురాసుర సంహారం నీలకంఠ మహంభజే ॥

అవతరణిక॥ గ్రంథకర్త తనచేజేయంబడు నీగ్రంథమునందు సప్తమప్రకరణమును వచింపఁబూని నిర్విఘ్నముగ పరిసమాప్తిఁజెందుటకై తనకిష్టదేవతయగు ఈశ్వరనమస్కారాత్మకమంగళమును "శూలినం మేరుకోదండం" అనుశ్లోకముచే జేయుచున్నాడు.

తాత్పర్యము॥ శూలహస్తుడై మేరుపర్వతమే ధనస్సుగగలవాడై శ్రీమహావిష్ణువేబాణముగ గలవాడై త్రిపురముజయించిన నీలకంఠుని నేనుభజించెద.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహంవైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజుఅనిపేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమును నీగ్రంథమునందు సప్తమ ప్రకరణమును వచింపుచున్నాడను.

### చతుర్వింశతి పైత్యవివరణము

శ్లో॥ [మాధవనిదానే] ఆవర్ణంచ వివర్ణంచ సూర్యవర్ణంచ కామిలా । ఆమ్లంరక్తంచ స్వేదశ్చ హ్యున్మత్తం పౌండ్రసర్పికమ్ ।
కరపాదంచ శీతంచ మూర్ఛా మధురకుసుమకమ్ ।
క్రోధభ్రాంశ శ్శిరఃశూల్చ తృష్ణా రుర్ఛావచర్మణీ ।

దుర్గంధం మదనంపి త్తం చతుర్వింశతి పైత్తకమ్ ।
పూర్వాచార్యై రిదంప్రోక్తం శాస్త్ర నూర్గ విచారణాత్ ॥

తా. ఆవర్ణపైత్యము వివర్ణపైత్యముసూర్యవర్ణపైత్యము కామిలాపైత్యముఆమ్ల పైత్యము రక్తపైత్యము స్వేదపైత్యము ఉన్మాదపైత్యము పాండ్రకపైత్యమువిసర్పిపైత్యము కరపాదపైత్యము శీతపైత్యము మూర్ఛపైత్యము మధురపైత్యముకుసుమపైత్యము క్రోధపైత్యము భ్రంశపైత్యము శిరఃపైత్యము క్షుధాపైత్యము తృషాపైత్యము దుర్భావపైత్యము చర్మపైత్యము దురంధపైత్యము మదనపైత్యము అన పైత్యరోగము లు 24 విధంబులని వైద్యశాస్త్రానుసారముగ పూర్వాచార్యులు వచించిరి,

ఆవర్ణపైత్య లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] స్వేదఃకాంతి పరంతృష్ణా ప్యతి రుర్గంధ
దేహతా । దేహస్తుపీతస్సర్వాంగ మావర్ణంపైత్తమాదిశేత్ ॥

తా. చెమట దప్పిగలుగుట శరీరము కంపువేసుట శరీరము పచ్చగనుండుట సర్వాంగముల కంతులుగట్టుట ఈలక్షణములు గలిగి శరీరముకాంతి విహీనముగ మండుటయే ఆవర్ణపైత్యమని తెలియవలయు.

శ్లో॥ [చరకే] అంగదాహ శిరోదాహః పాదదాహశ్శిరోభ్రమః ।
మూర్ఛాభ్రమో మనస్తాపో హృదిః క్లేశో ముహుర్భయమ్ ।
కంఠస్వేదశ్చ పాండుత్వం శోషః క్లేశో ముహుర్భయమ్ ।
సర్వేంద్రియేషు దార్బల్య మావర్ణపైత్యలక్షణమ్ ॥

తా. శరీరము శిరము పాదములుమండుట తలతిరుగుట మూర్ఛ భ్రమ మనస్తాపముగలుగుట ఱొమ్ములోమండుట కడుపునొప్పుట కుతికెక్రింద చెమటబట్టుట శరీరము పాండువర్ణముగనుండుట శోష క్లేశముగలుగుట పలుమారు భయపడుట శ్రోత్రత్వక్నేత్రజిహ్వాఘ్రాణేంద్రియ వాక్పాదపాణిపాయు గుహ్యేంద్రియములన దసేంద్రియములు దౌర్బల్యమునుజెందుట. (అనగా శ్రోత్రేంద్రియదౌర్బల్యమున చెవులలో ధ్వనులుగలుగుట చెవులుగడియలుపడుట చెవుడుగలుగుటత్వగింద్రియదౌర్బల్యమున చర్మముమండుట శరీరము అదురుట శరీరము ఉబ్బుట శరీరమున పొట్టువలేరాలుట శరీరము పగులుట శరీరమున దురదగలుగుట నేత్రేంద్రియదౌర్బల్యమున నేత్రములుమండుట నిసురబట్టకుండుట దృష్టిమధ్యమమగుట జిహ్వేంద్రియదౌర్బల్య

మున నాలుకపదునులేక బిరుసై యుండుట వాంతి అరుచి ఊములుగలుగుట (ఘ్రాణేంద్రియదౌర్బల్యమున ముక్కునసీరుగారుట తుమ్ములుగలుగుటస్వరము బంధించుట దురదగలిగి కణతలు నొచ్చుట వాగింద్రియదౌర్బల్యమున వాక్కునకు జడత్వము ఆవలింతలుగలుగుట తేనుపులువచ్చుట పాదేంద్రియదౌర్బల్యమున కాళ్ళయందు సత్వములేకుండుట కాళ్ళుతీసుట కాళ్ళుకృశించుట పాణీంద్రియదౌర్బల్యమున చేతులుమండుట తరతరలాడుట పాయింద్రియదౌర్బల్యమున బొడ్డు గుండె వీనిమధ్యమున గుబులు జనించి కడుపు కుతికె వీనియందు మెదలుట ఉబ్బసమువలన కుతికెపట్టుకొనుట కడుపు ఉబ్బుట మలముబంధించుట మూత్రంబద్ధకముగ వెడలుట గుహ్యేంద్రియదౌర్బల్యమున వీర్యము స్ఖలనంబగుట.) ఈలక్షణములు గలది అవర్ణపైత్యమని తెలియవలయు. ఇది ఊర్ధ్వగతమైన రెండువత్సరంబులేని లేక మూడువత్సరంబులేని శరీరమున నెలకొనిబాధింపుచుండు.

## ఆవర్ణాదిపైత్యములకు పైత్యాంతకరసము.

శ్లో॥ మృతసూతాభ్రముండార్కతీక్ష్ణంమాక్షికతాళకమ్ । గంధకం
మర్దయేత్తుల్యంయష్టిద్రాక్షామృతాద్రవయి । జలమఁటబకః
పాఠాద్రవై క్షీరవిదారికా । మర్దయేచ్చదినంఖల్వేసితాక్షౌ
ద్రయుతావటీ । నిష్కమాత్రీ నిహంత్యాశు పిత్తం పిత్తజ్వ
రం క్షయమ్ । దాహతృష్ణాశమశ్శోషం హంతిపిత్తాంతకోర
సః । సితాక్షీరం పిబేచ్చాను యష్టిక్వాథం సితాన్వితమ్ ।
పిబేద్వా పిత్తశాంత్యర్థం శీతతోయేన వాలుకమ్ ॥

తా. రసభస్మము అభ్రకభస్మము ఇనుపభస్మము తామ్రభస్మము లోహభస్మము శుద్ధిచేసిన మాక్షికము శుద్ధిచేసిన తాళకము శుద్ధిచేసిన గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి యష్టిమధుకము ద్రాక్షపండు తిప్పతీగె * నీరుతూటు విషబొద్ది పాలుగల నేలగుమ్మడిగడ్డ అనువాని రసములతో 1 దినము మర్దించి నిష్కప్రమాణమంత వటికములుచేసి యందొకదానిని పంచదారతోగాని లేక పంచదార పాలు అను వానితోగాని లేక పంచదారతో గూడియుండుయష్టిమధుక కషాయముతో గాని లేక కూతురుబుడమ చూర్ణములో శీతోదకమును కలిపి గాని

* ఇదే నీళ్ళమీద బలిసిన పాకెడుకూరయనియు జెప్పంబడు.

సేవించిన అవర్ణపైత్యము మొదలగు ఇరువదినాలుగు పైత్యములు పిత్తజ్వరము క్షయరోగము దాహము దప్పి శోష హరించు. (మరియు అవర్ణపైత్యము ఊర్ధ్వగతంబైన దాని నివారణార్థంబై ఈపైత్యాంతకరసమున 1 సంవత్సరంజేని లేక 8 మాసములేని సేవింపవలయు.)

## అవర్ణాది పైత్యోపచారము.

శ్లో॥ తస్మిందూరం వినిక్షిప్య గుంజామాత్రప్రమాణకమ్ ।
వాలుకంశీతతోయేన హ్యాశు వర్ణాదిపైత్యజిత్ ॥

తా. కూతురుబుడమను శీతోదకములో నూరి పావుసేరురసమును పిడిచికొని అందు గురిగింజంత సిందూరముకలిపి 4 మాసములు సేవించిన అవర్ణాదిపైత్యములు శీఘ్రముగ హరించు.

## వివర్ణపైత్య లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] రోమనాశ శ్శిరఃకంప స్సర్వాంగం స్ఫుటితం భవేత్ ॥ రోమహర్షణకం శూలం వివర్ణంపైత్యమాదిశేత్ ॥

తా. రోమములు నశించుట తలవణుకుట శరీరమంతటపగలుట గగుర్పొడుచుట కడుపులో శూలించుట ఈలక్షణములుగలిగి శరీరము వివర్ణమైయుండుటయే వివర్ణపైత్యమని తెలియవలయు.

## వివర్ణపయిత్యమునకు బడబాగ్నిరసము.

శ్లో॥ పారదంగంధకంచైవ భస్మలోహాష్టకంసమమ్ ।
కుమారీస్వరసేనైవ మర్దితంయామ మాత్రకమ్ ।
గుంజామాత్రం ప్రదాతవ్యం వివర్ణం పిత్తనాశనమ్ ।
నిహన్యాత్సర్వపిత్తార్తిం యోగోయంబడబాగ్నికః ॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన గంధకము ఉక్కుభస్మము ఇనుపభస్మము తగరభస్మము నాగభస్మము రజితభస్మము సువర్ణభస్మము తామ్రభస్మము కాంతభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి కలబంధరసములో 1 ఝాము మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి యందొక దానిని పిప్పలితో సేవించిన సర్వపైత్యములు వివర్ణపైత్యము హరించు; ఇదియ బడబాగ్నిరస మనంబడు.

## ఊర్ధ్వగత పిత్తలక్షణము.

శ్లో॥ నాభికాసా శయస్వేదః పైత్యమూర్ధ్వ గతంస్మృతమ్ ।

తా. బొడ్డు గుండె వీనిమధ్యమున చెమటగలిగిన పిత్తము ఊర్ధ్వగతమైనదని తెలియవలయు. ఇది హరించుటకై బడబాగ్నిరసము నేని పైత్యాంతకరసము నేని పాణిబద్ధరసము నేని 4 మాసములు సేవింపవలయు.)

## సూర్యవర్ణ పైత్యలక్షణము.

శ్లో॥ [చరకే] సూర్యోదయేచ దృష్టీనాం భ్రమణం చైవమూర్ఛ
నమ్ । అతితీవ్రగతిర్దాహ స్సూర్యవర్ణేచ పైత్యకే ॥

తా. మూర్ఛ పలుమారు దాహముగలుగుట ఈలక్షణములుకలిగి సూర్యోదయమును చూచినతోడనే నేత్రములుతిరుగుటయే సూర్యవర్ణపైత్యమని తెలియవలయు.

## సూర్యవర్ణపైత్యమునకు మృగజరసము.

శ్లో॥ శుద్ధసూతం సమంగంధం టంకణంచ మనశ్శిలా ।
ఏలాతక్కోలజాజీచ సమభాగంచ ఖల్వకే ।
శతావరీకషాయేణ దివసంమర్దయే దృఢమ్ ।
శర్కరామధు సంయుక్తం సూర్యవర్ణం నిహంతిచ ॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసినగంధకము శుద్ధిచేసిన వెలిగారము శుద్ధిచేసిన మణిశిల ఏలకులు తక్కోలపుట్లు జాజికాయ వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి పిల్లిపీచరవేళ్ళకషాయముతో 1 దినము మర్దించి గురిగింజలంతేసి మాత్రలు జేసి యందొకదానిని జీలకఱ్ఱ పంచదార అనుపానితో నేని లేక తేనె చక్కెరతో నేని సేవించిన సూర్యవర్ణపైత్యము హరించు.

## కామిలాపైత్య లక్షణము.

శ్లో॥ ముఖేహరిద్రావర్ణశ్చ చక్షుషోరతి పాండుతా ।
మలంనిరశనంతృష్ణా కామిలా పైత్యలక్షణమ్ ॥

తా. ముఖము పచ్చగనుండుట మలము వెడలకుండుట ఆకలిలేకుండుట దప్పిగలుగుట ఈలక్షణములుగలిగి నేత్రములు పాండురవర్ణముగనుండుటయే కామిలాపైత్యమని తెలియవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] యచ్ఛంఖంయేనదృష్టంస్యాత్తచ్ఛంఖంపీత
మాప్నుయాత్ । తదేవ కామిలాత్వంచ ఏవముక్తంపురా
తనైః ॥

తా. శంఖమును పచ్చగ గాంచెడువాడు కామిలారోగియని పూర్వులు వచించిరి.

కామిలాపైత్యమునకు కపర్దకరసము.

శ్లో॥ రసభస్మసమంగంధం మేలావాలుకటంకణమ్ ।
అమృతాశీరకుష్ఠాబ్ధా సమభాగం విచూర్ణయేత్ ।
ఆర్ద్రికస్యరసైః ఖల్వేద్వియామాంతం విమర్దయేత్ ।
శీరకస్యకషాయేణ ద్విగుంజం భక్షయేత్సదా ।
కామిలాపిత్తనాశాయ దాహశాంతి హరః పరః ॥

తా. రసభస్మము శుద్ధిచేసినగంధకము ఏలకులు కూతురుబుడమ శుద్ధిచేసిన వెలిగారము తిప్పసత్తు వట్టివేళ్ళు చంగల్వకోష్టు తుంగగడ్డలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఖల్వములోనునిచి అల్లపురసముతో 2 ఝాములు మర్దించి 2 గురిగింజలంత మాత్రలుచేసి యందొకదానిని జీలకఱ్ఱకషాయముతో సేవించిన కామిలాపైత్యము దాహము హరించు.

ఆమ్లపైత్య లక్షణము.

శ్లో॥ ఆమ్లోద్గార స్తథాతృష్ణా హ్యరుచిస్స్వరహీనతా ।
జిహ్వావా త్వరిదోషశ్చహ్యామ్ల పైత్యస్యలక్షణమ్ ॥

తా. దప్పి అరుచిహీనస్వరముగలుగుట నాలుక నోరు కంపువేయుట ఈలక్షణములుగలిగి పులితేనుపులు వచ్చుటయే ఆమ్లపైత్యమని తెలియవలయు.

ఆమ్లపైత్యమునకు సుధానిధిరసము.

శ్లో॥ గంధకంపారదంచాభ్రం మేలా గ్రంథికేసరమ్ ।
సమభాగయుతం ఖల్వేజీరకేణచ మర్దితమ్ ।
కాచకుప్యాంనివేశ్యాథద్వియామంతుతు సాగ్నినా ।

సాంగశీతలముద్ధృత్య ద్విగుంజం భక్షయేత్సదా ।
శర్కరామధుసంయుక్తం నామ్లపైత్త్యవికారనుత్ ।

తా. శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన రసము అభ్రకభస్మము ఏలకులు గ్రంధి తగరము నాగ సరములు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి జీలకఱ్ఱరసములో 1 దినము మర్దించి గాజుకుప్పెలోనునిచి ఉమకమంటలో 2 ఝామములువండిసాంగ శీతలమునదీసి 2 గురిగింజలయెత్తును తేనెతోగాని లేక పంచదారతోగాని సేవించిన అమ్లపైత్యము హరించు.

## స్వేదపైత్య లక్షణము.

శ్లో॥ అతిస్వేదంచ దౌర్బల్యం దేహేంగం జలపూరితమ్ ।
అగ్నిమాంద్యం దృఢాపీడా స్వేదపైత్యం వినిర్దిశేత్ ॥

తా. శరీరము దుర్బలముగనుండుట అంగముల నీరుపూరించియుండుట అగ్ని మాంద్యము శరీరమున మిక్కుటముగ పీడగలుగుట ఈలక్షణములుగలిగి శరీర మంతట మిక్కుటముగ చెమట ప్రవించుటయే స్వేదశైత్యమని తెలియవలయు.

## స్వేదపయిత్యమునకు అమృతేశ్వరరసము.

శ్లో॥ రసంగంధం వత్సనాభం వాసాత్రికటుకంవచా ।
జీరకంచిత్రకంశుంఠీ త్రిఫలాచ సమంసమమ్ ।
తతస్తత్ఖల్వ మధ్యస్థం త్రియామం మర్దయేద్భిషక్ ।
కాచకుప్యాం నివేశ్యాధత్రిదినం మందవహ్నినా ।
సాంగశీతలముద్ధృత్య ద్విగుజం భక్షయేత్సదా ।
శర్కరామధుసంయుక్తం స్వేదపయిత్యవికారనుత్ ॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన నాభి అడ్డసరవ త్రికటుకములు వస జీలకఱ్ఱ చిత్రమూలము శొంఠి త్రిఫలములు వీనిని సమభాగవ లుగ ఖల్వములోనునిచి 3 ఝాములు నిమ్మపండ్లరసముతో మర్దించి గాజుకుప్పెలో నునిచి మందాగ్నిలో 3 దినములు పాకముజేసి సాంగశీతలమునదీసి 2 గురిగింజలయెత్తు నుపంచదారతోగాని లేక తేనెతోగాని సేవించిన స్వేదపైత్యము హరించు.

## స్వేదపైత్యమునకు మృతసంజీవనీరసము

శ్లో॥ [చరకే] మారిచంటంకణం సూతం మాక్షికం కాంతలోహ
కమ్ । అభ్రకంచసమాంశాని వహ్నిక్వాథేన మర్దయేత్ ।
కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయంత్రపాచితమ్ ।
మరీచార్ద్రక సంయుక్తం ద్విగుంజం భక్షయేత్సదా ।
పథ్యంక్షీరోదనం చయివ తాపేదత్వాత్స శర్కరమ్ ।
ప్రాతఃకాలేతుసేవేత సద్యస్స్వేదో విముంచతి ।

తా. మిరియాలు శుద్ధిచేసిన వెలిగారము రసభస్మము శుద్ధిచేసిన హేమమాక్షికము కాంతభస్మము లోహభస్మము అభ్రకభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి చిత్రమూలకషాయముతో మర్దించి గాజుబుడ్డిలోనునిచి వాలుకాయంత్రమున 1 ఝామువండిఅందు 2 గురిగింజలయెత్తును మిరియపుచూర్ణము అల్లపురసము అనువాని యనుపానముతో ప్రాతఃకాలమున సేవింపుచుండిన స్వేదపైత్యము తత్క్షణమున హరించు. దీనియందు పాలఅన్నమును భుజించుట పథ్యకరము తాపము జనించిన పైపథ్యములో పంచదారనుకూడా కలిపి భక్షించవలయు.

## ఉన్మాదపైత్య లక్షణము

శ్లో॥ విదాహచ్చ వికారశ్చ వాంతిర్మూర్ఛా పరిభ్రమః ।
మలమూత్రం త్యజేచ్ఛీఘ్ర ముస్మత్తస్యచ దోషకృత్ ॥

తా. శరీరము విదాహించుట వికారము వాంతి మూర్ఛగలుగుట శరీరము తిరుగుట మలమూత్రములు శీఘ్రముగ వెడలుట ఈలక్షణములుగలిగి ఉన్మాదపు మాటలాడుటయే ఉన్మాదపైత్యమని తెలియవలయు.

## ఉన్మాదపైత్యమునకు చండభైరవరసము.

శ్లో॥ రసభస్మత్రయోభాగా హేమభస్మైకభాగకమ్ ।
టంకణం రవిదుగ్ధేన సర్వం తుల్యంచ ఖల్వకే ।
ద్వియామం మర్దయేత్సమ్య గుద్ధృత్య గోళకంతథా ।
కాచకుప్యాం నివేశ్యాథ సప్తవస్త్రం మృదాలిపేత్ ।
వాలుకా యంత్రమధ్యస్థం ద్వియామం మందవహ్నినా ।

సాంగశీతలముద్ధృత్య ద్విగుంజం వటకీకృతమ్ ॥
శర్కరామధుసంయుక్త మున్మత్తపైత్యనాశకృత్ ॥

తా. రవిభస్మము 3 భాగములు సువర్ణభస్మము 1 భాగము శుద్ధిచేసిన వెలిగారము 4 భాగములు ఇటుల వీనిని ఖల్వములోనునిచి జిల్లేడుపాలతో 2 ఝాములు మర్దించి ఉంటజేసి గాజుకుప్పెలోనునిచి 7 శీలమన్నులిచ్చివాలుకాయంత్రమున మందాగ్నితో 2 ఝాములువండి సాంగశీతలమున దీసి 2 గురిగింజలయెత్తును పంచదారతో గాని లేక తేనెతోగాని సేవించిన ఉన్మాదపైత్యము హరించు.

## ఉన్మాదపైత్యమునకు పిప్పలీఘృతము.

శ్లో॥ పిప్పలీ ద్విగుణంసర్పి స్సర్పిషో ద్విగుణంసితా ।
సితాయా ద్విగుణంక్షౌద్రం క్షౌద్రస్యాష్టగుణంపయః ।
ఏతద్ధిపాచితంచైవ ప్రాతరుత్థాయ భక్షయేత్ ।
ఉన్మాదంచ విదాహంచ సర్వపైత్య వికారనుత్ ॥

తా. నెయ్యి 2 భాగములు తేనె 8 భాగములు పాలు 64 భాగములు ఇటుల వాని నేకముజేసి శూక్ష్మాగ్నితోవండి ఘృతము తేనె పక్వమునప్పుడందు పిప్పలి చూర్ణము 1 భాగము పంచదార 4 భాగములు కలిపి దించుకొని ప్రాతఃకాలమున 1½ తులము చొప్పున సేవింపుచుండిన ఉన్మాదపైత్యము విదాహము సర్వపైత్యములు హరించు.

## పుండరీక పైత్యలక్షణము.

శ్లో॥ దేహమూంతం పుండరీకం రోమహర్షణ కండుతా ।
ఉష్ణాతి శయనంతృష్ణా పుండరీకేచ పైత్యకీ ॥

తా. గగుర్పొడుచుట శరీరమున దురదగలుగుట శరీరము కడువుష్ణముగనుండుట దప్పిగలుగుట ఈలక్షణములుగలిగి శరీరమున తెల్లదామరపువ్వువంటి దద్దులు గలుగుటయే పుండరీక పైత్యమని తెలియవలయు.

## పుండరీక పైత్యమునకు విశ్వమూర్తి రసము.

శ్లో॥ శుద్ధసూతం సమంగంధం తామ్రభస్మ మనశ్శిలా । చందనం
త్రిఫలావాసా కుష్ఠజీరకదీప్యకమ్ । ఏతానిసమభాగాని హంస

ఖాదిరసేనచ। తతస్సర్వంఖల్వమధ్యే త్రిదినం మర్దయేద్భిషక్ ।
తతస్సుగోళ కంకృత్వా వజ్రమూషాంతరే క్షిపేత్ । భూధరే
యంత్రే తేకేపాచ్యం సాంగశీతలముద్ధరేత్ । ద్విగుంజాంభక్షయే
న్నిత్యం పుండరీ పైత్యనాశనమ్ ॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసినగంధకము తామ్రభస్మము శుద్ధిచేసిన మణిశిల శ్రీగంధము త్రిఫలములు అడ్డసరము చంగల్వకోష్టు జీలకఱ్ఱ ఓమము వీనిని సమభాగములుగ ఖల్వముతో నునిచి హంసపాదియాసరసములో 3 దినములు మర్దించి ఉంటచేసి వజ్రమూసలోనునిచి భూధరయంత్రమున పుటంబిడి సాంగశీతలమునదీసి 2 గురిగింజల యెత్తున ప్రతిదినము సేవింపుచుండిన పుండరీకపైత్యము హరించు.

## కరపాద పిత్తలక్షణము.

శ్లో॥ కరపాద విదాహశ్చా వయవానాంచ శోషకృత్ ।
మధ్యేపిత్తస్య తృష్ణాచ కరపాదేచ పైత్యకే ॥

తా. అవయవములు ఎండుట దప్పిగలుగుట ఈలక్షణములుగలిగి అరికాళ్ళు అరిచేతులు మండుటయే కరపాదపైత్యమని తెలియవలయు.

## సర్వపైత్యములకు పాణిబద్ధరసము.

శ్లో॥ గంధకం పారదంచైవ భస్మలోహాష్టకం సమమ్ ।
జీరకస్య కషాయేణ మర్దితం యామమాత్రకమ్ ।
కుప్పికాయాం వినిక్షిప్య వాలుకాగ్ని ప్రయోజితమ్ ।
గాఢాగ్నౌ త్రిదినంచైవ సాంగశీతల ముద్ధరేత్ ।
గుంజామాత్రం ప్రదాతవ్యం పైత్యేపాదకరే స్మృతమ్ ।
నిహన్యాత్సర్వపిత్తార్తిం యోగోయం పాణిబద్ధకః॥

తా. శుద్ధిచేసిన గంధకము శుద్ధిజేసిన రసము ఉక్కుభస్మము తగరభస్మము రజితభస్మము స్వర్ణభస్మము ఇనుపభస్మము నాగభస్మము తామ్రభస్మము కాంతభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి జీలకఱ్ఱకషాయములో 1 ఝామము మర్దించి గాజుకుప్పెలో నునిచి వాలుకాయంత్రమున 3 దినములుగాఢాగ్నిలోవండి సాంగశీతలమునదీసి గురిగింజంతయెత్తును తేనె పిప్పలిచూర్ణముతో నేని లేక ఉసిరిక

రసము పంచదార వీనితో నేని సేవించిన కరపాదపైత్యము మొదలగు సర్వరోగ్యము లు హరించు.

## శీతపైత్య లక్షణము.

శ్లో॥ [చరకే] అరుచిశ్శీతమంగేషు మందాగ్నిర్భ్రమకోషితా ।
మహాపిత్తంచమూర్ఛాచ శీతపిత్త వినిర్దిశేత్ ॥

తా. అరుచి అగ్నిమాంద్యముగలుగుట తప్పిల్బులాడుట కోపము కడుపయి త్యము మూర్ఛగలుగుట యీలక్షణములుగలిగి శరీరము కడుశీతలముగ నుండుటయే శీతపయిత్యమని తెలియవలయు.

## శీతపైత్యములకు పూర్ణాభ్రరసము.

శ్లో॥ శుద్ధసూతంసమంగంధ మభ్రకంచ మనశ్శిలా ।
మర్దితంవరుణార్ద్రావైర్మర్దయేద్దివసద్వయమ్ ।
కాచకుప్యాం నివేశ్యాథ వాలుకాయంత్రకేపచేత్ ॥
షడ్యామాంతే సముద్ధృత్యసూక్ష్మ చూర్ణంతు కారయేత్ ।
ద్విగుంజంభక్షయేన్నిత్యం శీతపైత్యనివారణమ్ ॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసినగంధకము అభ్రకభస్మము శుద్ధిచేసిన మణిశిల వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి చూర్ణముచేసి ఉలిమిడిచెక్కరసముతో 2 దినములు మర్దించి గాజుకుప్పెలోనునిచి వాలుకాయంత్రమున 6 ఝాములు వండి స్వాంగశీతలమునదీసి మర్దించి సూక్ష్మచూర్ణముచేసి 2 గురిగింజలయెత్తును తేనె పిప్పలితో నేని లేక నెయ్యి మిరియపు చూర్ణముతో నేని ప్రతిదినము సేవింపుచుండిన శీతపయిత్యము హరించు. (మఱియు నీశీతపయిత్యము హరించుటకై బడబాగ్ని రసము నేని లేక పాణిబద్ధరసము నేని స్వయమగ్నిరసము నేని సేవింపవలయు.

## మూర్ఛాపైత్య లక్షణము.

శ్లో॥ [చరకే] అతిమూర్ఛాతి శీతంచ మూర్ఛంనచ ప్రతీక్షణమ్
అతితృష్ణాంగ శోషశ్చ మూర్ఛాపిత్తేచ విభ్రమః ॥

తా. కడుమూర్ఛగలుగుట శరీరము కడుచల్లగనుండుట కడుదప్పిగలుగుట అంగములుశోషించుట భ్రమగలుగుట యీలక్షణములుగలిగి ప్రతిక్షణమును మూర్ఛ గలుగుటయే మూర్ఛాపయిత్యమని తెలియవలయు.

## మూర్ఛాపైత్యాంకుశ రసము.

శ్లో॥ శుద్ధపారదగంధంచ టంకణం చాభ్రభస్మకమ్ ।
ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్ ।
భద్రముస్తకషాయేణ మర్దయే త్త్రిదినంతథా ।
కాచకుప్యాం వినిక్షిప్య పుటమేకంతు భూధరమ్ ।
సాంగశీతలముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్ ।
మూర్ఛాపిత్తవినాశాయ సర్వపైత్యనివారణమ్ ॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిజేసినగంధకము శుద్ధిజేసిన వెలిగారము అభ్రక భస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి తుంగముస్తెల కషాయములో 3 దినములు మర్దించి గాజుపెప్పెలోనునిచి భూధరయంత్రమున పుటంబిడి సాంగ శీతలమున దీసి మరల ఖల్వములోనునిచి తుంగముస్తెల కషాయములో మర్దించి గురి గింజంతమాత్రలు జేసి యందొకదానిని నారికేడపుకాయ నీరుతో సేవించిన మూర్ఛా పయిత్యము సర్వపయిత్యములు హరించు. (సిందూరమును నారికేడపుకాయ నీరు తో సేవించిన మూర్ఛాపయిత్యము హరించు.)

## మధురపైత్య లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అరుచిర్మధురోద్రేక ఉషఃకాలేచకోపితా ।
శిరోభ్రమణమాధుర్యం ఛర్దిరోమాంచ హర్షనమ్ ॥

తా. నోరు రుచిలేకుండుట ఉషఃకాలమున కోపముగలుగుట తలతిరుగుట వాంతిగలుగుట రోమములు గగుర్పొడుచుట ఈలక్షణములుగలిగి నోరు తీపుగనుం డుటయే మధురపయిత్యమని తెలియవలయు. ఇది హరించుటకై బడబాగ్నిరసము నైన పాణిబద్ధరసమునైన సేవింపవలయు

## మధురపిత్తమునకు పైత్యగజాంకుశరసము.

శ్లో॥ శుద్ధగంధక టంకంచ తాళకంచ మనశ్శిలా ।
సర్వాంశాంసపదీద్రావైర్దినమేకం విమర్దయేత్ ।
వాలుకాయంత్రకే పాచ్యంపద్యామాంతం నిరుధ్యచ ।
దేయాంగుంజాను పానేన మధుపిత్తం వినాశయేత్ ॥

తా. గంధకము వెలిగారము తాళకము మణిశిల వీనిని శుద్ధిచేసి సమభాగము లుగ ఖల్వములోనునిచి * హంసపాదియాకురసముతో 1 దినము మర్దించి గాజు కుప్పెలోనునిచి కొలుగాయంత్రమున 6 ఝాములువండి గురిగింజయెత్తును అనుపాన విశేషములతో సేవించిన మధురపి_త్తము హరించు.

## కుసుమపైత్య లక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] ఆతాపోనాసికార_క్త మతితృష్ణా ప్రపీడనమ్ ।
క్వచిచ్ఛోణీత వాహశ్చకుసుమం శీర్ష సంభవమ్ ।

తా. శరీరముమండుట కడుదప్పిగలుగుట ఒకానొకపుడు నోటనుండి నెత్తురు పడలుట ఈలక్షణములు గలిగి ముక్కున నెత్తురుగారుటయే కుసుమపయిత్యమని తెలియవలయు. ఇది శిరమునజనించు.

## నాసికా కుసుమపైత్య వివరణము.

శ్లో॥ [అశ్వినీకల్పే] శిరశ్శూలేతు సంజాతే వాతాద్ఘ్రాణాద స్స్రవేత్ । దాడిమీ పుష్పమూలాశ్చ రసకర్పూర మాక్షికమ్ । సమందుగ్ధం శిరోభ్యంగే నస్యేపానే సితామధు । దాపయేత్పి_త్తరోగాచ్చ శిరశ్శూలేతుదారుణే ॥

తా. తలనొప్పి ముక్కులనెత్తురుగారుటయే వాతకుసుమ పయిత్యమనియు శిరమున మంటగలిగి శిరముశూలించి ముక్కున నెత్తురుగారుటయేపయిత్యకుసుమమని యు తెలియవలయు. వానియందు దానిమ్మపువ్వులను గరికవేళ్ళను పాలతోనూరి రసముపిడిచికొని అందు రసకర్పూరము శుద్ధిజేసిన హేమమాక్షికము అనువానిని సమముగ కలిపి అభ్యంజనము నస్యము సేయుటయేగాక పంచదారను తేనెను కలిపి సేవించిన 2 విధములైన కుసుమపయిత్యములు హరించు.

## నాసికాకుసుమములకు ఉదుంబరాదికల్పము.

శ్లో॥ [చరకే] ఉదుంబర ఫలంపక్వం ఘృతపక్వం సితాయుతమ్
ఏలామరీచసిందూరై ర్భు_క్తంస్యాద్ర_క్తశాంతయే ।

* హంసపాదయాకు—అనగా చేప్పతట్టాకు.

తా. మేడిపండ్లు పంచదార, ఏలకులు మిరియాలు అనువానచూర్ణములో ఆవు నెయ్యికలిపి వండి అందు సింహారమునునిచి సేవించిన నాసికాకుసుమములు హరించు.

## నాసికాకుసుమములకు గజకేసరీరసము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] శుద్ధసూతం విషంచాభ్రిం గంధకం హింగు తాళకమ్ । ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్ । మర్దయేద్భృంగనీరేణ కాచకుప్యాంత రేక్షిపేత్ । వాలుకాయంత్రకే పాచ్యం దినైకం మందవహ్నినా । సాంగశీతల మృద్ధృత్య చణమాత్రంచభక్షయేత్ । సుమపిత్తవినాశాయ సర్వపిత్తవినాశకః ॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన వసనాభి అభ్రకభస్మము శుద్ధిజేసినగంధకము శుద్ధిజేసిన యింగిలీకము శుద్ధిజేసినతాళకము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గుంటగలగరాకురసముతో 1 దినము మర్దించి గాజుకుప్పెలోనునిచి 1 దినము మందాగ్నిలో వాలుకాయంత్రమునవండి సాంగశీతలమునదీసి శనగగింజ ప్రమాణమును తేనెతో గాని లేక నేతితోగాని సేవించిన కుసుమపయిత్యములు సర్వపయిత్యములు హరించు.

## నాసికాకుసుమములకు నస్యము.

శ్లో॥ [బాహటే] నస్యందాడిమపుష్పోత్థో రసోదూర్వాభవోథవా । ఆమ్రాస్థితః పలాండోర్వా నాసికాచ్యుతరక్తజిత్ ॥

తా. దానిమ్మపువ్వు గరిగవేళ్ళు అనువానినిగాని లేక గరికవేళ్ళు మామిడిపప్పు అనువానినిగాని (లేక ఇప్పపువ్వు తెల్లనీరుల్లిగడ్డ అనువానినిగాని) చనుబాలతో నూరినస్యము చేసినను లేక తెల్లనీరుల్లిగడ్డను కుమ్ములోకుక్కి ఉడికించిరసము తీసి నస్యముచేసినను నాసికాకుసుమములు హరించు. (లేక జమ్మికొనలను 3 మిరియపు గింజలను! ఉదకముతో నూరి నస్యముచేసినను లేక పట్టుబట్టకాల్చిన మసిని గవ్వలభస్మమును పయిడి ప్రత్తిపువ్వులరసముతో నూరి నస్యముచేసినను లేక నాసిగావాళ చికిత్సలంజేసినను నాసికాకుసుమములు హరించు.)

## క్రోధపైత్య లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] సదాచ తామసాచారో దుర్భాషా వరితా గుణాః । శిరోభ్రమణ దోషశ్చ క్రోధపిత్తం వినిర్దిశేత్ ॥

తా. దుర్భాషలాడుట సర్వపనులయందు తీవ్రముగనడుచుట తలతిరుగుట ఈలక్షణములుగలిగి ఎల్లప్రడు తామసక్రియల సేయుచుండుటయే క్రోధపయిత్యమని తెలియవలయు.

## క్రోధపైత్యమునకు నారాచరసము.

శ్లో॥ రసభస్మసమంగంధం విషంమరిచనాగరమ్ ।
త్రిక్షారంపంచలవణం సమభాగంచఖల్వకే,
జీరకస్యకషాయేణ ద్వియామాంతంవిమర్దయేత్ ।
కాచకుప్యాంతరేక్షిప్త్వా వాలుకాయంత్రకేపచేత్ ।
శనైర్మృద్వగ్నినా పాచ్యాం సాంగశీతల ముద్ధరేత్
గుంజామాత్రాంప్రదాతవ్యం క్రోధపిత్తంవినశ్యతి ॥

తా. రసభస్మము శుద్ధిచేసినగంధకము శుద్ధిజేసిననాభి మిరియాలు శొంఠి త్రిక్షారములు పంచలవణములు వీనినిసమభాగములుగ ఖల్వములోనునిచి జీలకఱ్ఱ కషాయముతో 2 ఝాములు మర్దించి గాజుకుప్పెలోనునిచి చీలమన్ను లేపనముచేసి వాలుకా యంత్రమున మృద్వగ్నిలో 4 ఝాములు మెల్లగవండి సాంగశీతలమున తీసి గురిగింజప్రమాణమును తేనెతోగాని లేక జీలకఱ్ఱ పంచదార అనుపాని యనుపానముతోగాని సేవించిన క్రోధపయిత్యము హరించు. (మఱియు దీనినే ఆమ్లపయిత్యమునందును సేవింపదగు.)

## భ్రంశపైత్య లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అపభ్రంశోమతి స్తంభ స్ఫుదాంచితానిరీక్షణమ్ । సంభాషణమతిక్రోధాద్భ్రంశపిత్తలక్షణమ్ ।

తా. ఎరుగనటులుండుట సదాచింతించుట రెప్పపాటువేయక చూచుట కడు కోపముగ మాటలాడుట ఈలక్షణములుగలిగి తబ్బిబ్బులాడుటయే భ్రంశపిత్తమని తెలియవలయు.

## భ్రంశపైత్యమునకు భృంగరాజచూర్ణము.

శ్లో॥ భేకరాజరసేప్రస్థే సాధితంమరిచాంజలిమ్ ।
అభయాపిప్పలీచార్ఙ్గి సైంధవంపుష్కరాహ్వయమ్ ।

అక్షప్రమాణకంచూర్ణం మిశ్రయిత్వామధుప్లుతమ్ ।
భక్షయేత్ప్రాతరుత్థాయ భ్రంశపిత్తంనియచ్ఛతి ॥

తా. అంజలిప్రమాణముగల మిరియాలు 1 ప్రస్థము గుంటగలగరాకు రసము తోభావనజేసి ఎండించి చూర్ణముచేసి అందు కరక్కాయలు పిప్పళ్ళుగంటుభారంగి సైంధవలవణము పుష్కరమూలము అనుదానిలో ప్రతివానిచూర్ణమును అక్షప్రమాణమును గలిపి గచ్చకాయంతచూర్ణమును ప్రాతఃకాలమున తేనెతో సేవించిన భ్రంశ పిత్తముహరించు.

## శిరఃపిత్త లక్షణము.

శ్లో॥ శిరోభ్రమణసంతాప మరుచ్యాప్యతిపీడనమ్ ।
ఆమ్లోద్గారశ్చహృద్రోగ శ్శిరఃపిత్తస్యలక్షణమ్ ।

తా. శరీరతాపము కడుఅరుచిగలుగుట పులితేనుపులువచ్చుట ఱొమ్మునొచ్చుట యీలక్షణములుగలిగి తలతిరుగుటయే శిరఃపయిత్యమని తెలియవలయు.

## శిరఃపిత్తమునకు పైత్యకాలాంతక రసము.

శ్లో॥ శుద్ధసూతంసమంగంధం నేపాళందరదం విషమ్ ।
ఖల్వమధ్యేవినిక్షిప్య వహ్నిమూలకషాయకే ।
మర్దితంతద్ద్వియామంచ డోలాయంత్రేదినంపచేత్ ।
స్నుహిక్షీరేవిమర్ద్యాథ ద్వియామంఖల్వమధ్యకే ।
గుంజామాత్రంప్రదాతవ్యం శిరఃపిత్తంనియచ్ఛతి ॥

తా. రసము గంధకము నేపాళములు ఇంగిలీకము నాభి వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములోనునిచి చిత్రమూల కషాయముతో 2 ఝాములు మర్దించి చిత్ర మూలకషాయముతో నే 1 దినము డోలాయంత్రమునవండి బొంతజెముడుపాలతో 2 జాములుమర్దించి గురిగింజంతమాత్రలుజేసియుందొకదానిని ఆవునెయ్యి సున్నపుతేట నీరు అనుపానితోగాని లేక బొల్లబూసురకషాయము పిప్పలి అనుపానితోగానిలేక జీలకఱ్ఱ పంచదార అనుపానితోగాని సేవింపుచుండిన శిరఃపయిత్యము హరించు.

## క్షుధాపైత్య లక్షణము.

శ్లో॥ [మాధవకల్పే] క్షుధాశీఘ్రాత్ భుంజీత దేహమాంతం విదాహికా । నేత్రశూలంత థాహిక్కా క్షుధాపిత్తస్యలక్షణమ్ ॥

కడుశీఘ్రముగ మిక్కుటముగ భుజించుట శరీరమంతట విదాహించుట నేత్రములు శూలించుట ఎక్కిళ్ళుగలుగుట ఈలక్షణములుగలిగి మిక్కుటముగ ఆకలిగలుగును క్షుధాపయిత్యమని తెలియవలయు.

## క్షుధాపైత్యమునకు పిత్తభంజనరసము.

శ్లో॥ రసగంధాభ్రకంతుల్యాం దినమేకంవిమర్దయేత్ ।
భృంగరాజరసేఖల్వే వజ్రమూషాంతరేక్షిపేత్ ।
కుక్కుటీపుటసాకేచ స్వాంగశీతలముద్ధరేత్ ।
ఆర్ద్రికస్యానుపానేన గుంజామాత్రంపిబేత్తథా ।
క్షుధాపిత్తవినాశస్స్యా త్సర్వపిత్తవినాశకః॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిచేసిన గంధకము అభ్రకభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గుంటగలగరాకురసముతో 1 దినము మర్దించి వజ్రమూషలోగాని గాజుకుప్పెలోగాని యునిచి కుక్కుటపుటంబిడి స్వాంగశీతలమున దీని గురిగింజప్రమాణమును అల్లపురసముతో సేవించిన క్షుధాపయిత్యముసర్వపయిత్యము లుహరించు.

## తృష్ణాపైత్య లక్షణము.

శ్లో॥ [చరకే] ఉషఃకాలేచాతితృష్ణా శీతలస్యసముద్భవః ।
కుక్షౌకంఠేవిదాహశ్చ తృష్ణాపైత్యస్యలక్షణమ్॥

తా. చలువపుట్టుట కడుపు కంఠము వీనియందు విదాహించుట ఈలక్షణములు గలిగి ప్రాతఃకాలమున కడుదప్పిగలుగుటయే తృష్ణాపయిత్యమని తెలియవలయు.

## తృష్ణాపైత్యమునకు పైత్యసింహకరసము.

శ్లో॥ విషంమణిశిలాసూతం గంధకంటంకణంకణాః
ధూర్తబీజం సమంఖల్వే దినంహంసపదీరసే ।
మర్దితంకజ్జలీంకృత్వా శరావసంపుటేపచేత్ ।
స్నుహీక్షీరేణసంమర్ద్యం గుంజామాత్రంపిబేదను ।
సర్వపైత్యవినాశస్స్యా త్తృష్ణాపిత్తంచనశ్యతి॥

తా. శుద్ధిజేసిననాభి శుద్ధిచేసినమణిశిల శుద్ధిచేసినరసము శుద్ధిచేసినగంధకము శుద్ధిచేసిన వెలిగారము పిప్పళ్ళు శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదిగూకురసముతో 1 దినము కజ్జలికమర్దించి మూకుళ్ళ లోనునిచి చీలమన్ను లేపనముజేసి పాకముజేసి సాంగశీతలమునదీసి మరల ఖల్వము లోనునిచి బొంతజెముడుపాలతో మర్దించి గురిగింజంతమాత్రలుజేసి యందొక దానిని కురువేరు కషాయానుపానముతోగాని లేక ఉసిరికెరసముతోగాని సేవించిన తృష్ణాపయిత్యము సర్వపయిత్యములు హరించు.

## తృష్ణాపైత్యమునకు నారికేళయోగము.

శ్లో॥ నారికేళస్యతోయేన సంమిశ్రంకదలీఫలమ్ ।
భ్రమతృష్ణాజ్వరహరం వృష్యంచక్షుష్యముత్తమమ్ ।

తా. నారికేళపు నీరులో అంటిపండును కలిపి సేవించిన భ్రమ తృష్ణాపయిత్యము జ్వరము హరించుటయేగాక వీర్యవృద్ధి నేత్రములకు హితము సగా గలుగు.

## తృష్ణాపైత్యమునకు ధాన్యకాదియోగము.

శ్లో॥ ధాన్యకంకుష్ఠసిష్ఠంచ నారికేళజలంసితా ।
పీతంపైత్యవికారేతు తృష్ణాపైత్యవినాశనమ్ ।
ధారోష్ణంశర్కరాయుక్తం పిబేత్ప్రాతర్నరోయది ।
కామిలాదాహశమనం రూక్షాత్తృష్ణాహరంతథా॥

తా. కొతిమెర్లు చంగల్వకోష్టు వీనికి చూర్ణముజేసి నారికేళపుకాయ నీరు లోకలిపి అంమ శర్కరవైచి పానముచేసిన తృష్ణాపయిత్యము హరించులేక ధారోష్ణ ములో శర్కరకలిపి ప్రాతః కాలమున సేవించిన కామిల దాహము రూక్ష తృష్ణా పయిత్యము హరించు.

## దుర్భావపైత్య లక్షణము.

శ్లో॥ శరీరకార్శ్యయుక్తశ్చ సర్వసంగవివర్జితః॥
స్వప్నేభ్రంశోవపుశ్శీర్ణ దుర్భావంపైత్తకంవిదుః॥

తా. శరీరము కృశించుట ఏవస్తువయందు నాసక్తిలేకుండుట, దుస్స్వప్నముల గాంచుట శరీరము శైథిల్యమునుజెందుట ఈలక్షణములుగలిగి దుర్భావ లాడుటయే దుర్భావపయిత్యమని తెలియవలయు. ఇదిహరించుటకై ఆవర్ణాదిపయిత్యచికిత్సలం జేయవలయు.

## చర్మపైత్య లక్షణము.

శ్లో॥ జిహ్వాంగే చర్మశీర్ణత్వం కరపాదోష్ఠకాదికే ।
శీఘ్రకండ్వ బలంహిక్కా చర్మపిత్తస్య దోషజాః ।

తా. నాలుక శరీరము చేతులు కాళ్ళు పెదవులు మొదలగువానియందు చర్మము ఊడుట శరీరమున కడుదురదికలుగుట సత్వము లేకుండుట ఎక్కిళ్ళు గలుగుట ఈలక్షణములుగలిగి చర్మము పూడుటయే చర్మపైత్యమని తెలియవలయును. ఇది హరించుటకై రసకర్పూరమును సేవింపవలయు. మఱియు రసఉబ్బను వేయవలయు.

## చర్మపైత్యమునకు పిత్తవిధ్వంసనరసము.

శ్లో॥ శుద్ధసూత విషం చాభ్రం త్ర్యూషణం గంధటంకణమ్।
ధూర్తబీజం సైంధవంచ తుల్యంతుల్యం విచూర్ణితమ్ ।
ఖల్వమధ్యే వినిక్షిప్య కటిల్ల ద్రవమర్దితమ్ ।
వజ్రమూషా గతంకృత్వా వాలుకా యంత్రకేపచేత్ ।
ద్వియామాంతే సముద్ధృత్య మాషమేవానుపానతః ।
భక్షయే చ్చర్మపైత్యేతు సర్వపైత్య నివారణమ్ ॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిచేసిననాభి అభ్రకభస్మము త్రికటుకములు శుద్ధిచేసిన గంధకము శుద్ధిజేసిన వెలిగారము శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు సైంధవలవణము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి కాకరాకురసములో మర్దించి కుప్పెలోబెట్టి వాలుకాయంత్రమున 2 జాములువండి సాంగశీతలమునదీసి మాషప్రమాణమును హంసపాదియాకురసము పావుసేరు నౌటాకు తులము మేకనెయ్యిమిరియపుచూర్ణము అనువానితోగాని లేక బోడతరపాకురసముతోగాని లేక తేనె పంచదారతోగాని సేవించిన చర్మపైత్యము సర్వపైత్యములు హరించు.

## దుర్గంధపైత్య లక్షణము.

శ్లో॥ దేహం దుర్గంధమలినం తథాస్వేదశ్చ పాండురమ్ ।
కుక్షావుష్ణం బహిశ్శీతం దుర్గంధే పిత్తకేవిదుః ॥

తా. శరీరము కడుమలినముగనుండుట చెమటగలుగుట శరీరము పాండురవర్ణముగనుండుట కడుపులోమండుట వెలుపట శీతలముగనుండుట ఈలక్షణములుగలిగి

శరీర దుర్గంధముగనుండుటయే దుర్గంధపైత్యమని తెలియవలయు. ఇది హరించుటకై పైత్యాంతకరసము గాని లేక బడబాగ్నిరసమును గాని సేవింపవలయు.

### మదనపైత్య లక్షణము.

శ్లో॥ దేహస్య మదనంమూర్ఛా స్వేదస్స్యాచ్చర్మపీడితమ్ ॥
శిరోనేత్ర భ్రమశ్చైవ మదనాపిత్త లక్షణమ్ ॥

తా. మూర్ఛ చెమటగలుగుట చర్మమువూడుట తల నేత్రములు తిరుగుట ఈలక్షణములు గలిగి శరీరము మదమెక్కినట్లుండుటయే మదన పైత్యమని తెలియవలయు.

### మదనపైత్యమునకు శ్రీరామబాణరసము.

శ్లో॥ శుద్ధసూతం విషం కాభ్రం దినంఖల్వే విమర్దయేత్ ।
కాకజంఘా కషాయేణ డోలాయంత్రే ద్వియామకమ్ ।
ఆర్ద్రకస్యాను పానేన మదనాపైత్య నాశనమ్ ॥

తా. శుద్ధిచేసిన రసకర్పూరము శుద్ధిచేసిన వసనాభి అభ్రకభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి 1 దినము వెలుమసంధికషాయములో మర్దించి డోలాయంత్రములో 2 జాములు వెలువసంధి కషాయములతోడ నేవండి గురిగింజ ప్రమాణమును అల్లపురసానుపానములో సేవించిన మదన పైత్యము హరించు.

### విస్ఫరి పైత్యలక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] సిధ్మంచ సర్వాంగ గమభ్రివర్ణః క్రోధోతి కండూరరు చిర్మహీయసీ । చిరప్రవృత్తిర్బలహీన తాచ వి సర్పిపిత్తం తదసాధ్యకంవిదుః ॥

తా. శరీరము మెరయుట కోపము శరీరమున కడుదురద కడుఅరుచి పనులయం దాలస్యముగలుగుట సత్వములేకుండుట ఈలక్షణములుగలిగి శరీరమంతట తోలుశిబ్బెమువలె రాలుటయే విసర్పిపైత్యమని తెలియవలయు. ఇది అసాధ్యము.

శ్లో॥ [నిత్యనాథీయే] విస్తీర్ణమండలైస్స్యాంద్రైః ఖండూభిశ్శోణిత ప్రభైః । శిలపిత్తం విజానీయాత్తచ్చికిత్సత ముచ్యతే ॥

తా. శరీరమున వెడలుపాటి మండలములుగలిగి దళమైదురదతోగూడి ఎఱ్ఱనై యుండుటయే శీతపిత్తవిసర్పియని తెలియవలయు. (ఇదియాప్యము) ఇక దానికి చికిత్సను వచించెద.

## విసర్పిపైత్త్యమునకు పిత్తకులాంతకరసము.

శ్లో॥ రసగంధాం మృతంతీక్ష్ణం తుల్యమాదంబరం సమమ్।
హంసపాది రసైః ఖల్వే మర్దితందివసత్రయమ్।
కాచకుప్యాం నివేశ్యాథ విలేప్య వస్త్రమృత్తికామ్ ।
వాలుకా యంత్రకేపాచ్యం శనైర్మృద్వగ్నినాతథా ।
త్ర్యామాంచ సముద్ధృత్య చూర్ణయే న్మాషమాత్రకమ్ ।
జీరకస్యాను పానేన విసర్పి పైత్త్యనాశనమ్॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసినగంధకము శుద్ధిచేసిననాభి ఉక్కుభస్మము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదియాకురసముతో 3 దినములు మర్దించి గాజుకుప్పెలోనునిచి చీలమన్ను లేపనముచేసి ఎండించి వాలుకాయంత్రమున2జాములు మృద్వగ్నిలోవండి సాంగశీతలమునదీసి ఖల్వములోనునిచి మోదుగచెక్కరసముతో మర్దించి మాషప్రమాణమంతమాత్రలుజేసి యందొకదానిని జీలకఱ్ఱకషాయానుపానముతోగాని లేక చంద్రచెక్కరసముతోగాని లేక చంద్రచెక్క తగరంచివిత్తులు అనువాని కషాయముతోగాని 4 మాసములు సేవింపుచుండిన శీతపైత్త్య విసర్పిహరించు (మఱియు దీనిని తేనె పిప్పలితో సేవించిన గుబులుగలపైత్త్యములు హరించు.)

## శీతపైత్త్యవిసర్పికి లేపనములు.

శ్లో॥ క్షారసింధూత్థతైలేనగాత్రాభ్యంగం ప్రయోజయేత్ ।
శీతపైత్త్య వినాశాయా యోగోయం కథితోబుధైః॥

తా. యవక్షారము సర్జక్షారము సైంధవలవణము నూనె కలిపి శరీరమునకు లేపనము సేయుచుండిన శీతపైత్త్యవిసర్పి హరించు.

శ్లో॥ అభ్యంగం తిక్తతైలేన శీతస్యోష్ణాంబు భిర్స్నిశిః॥

తా. చేదుబీరవిత్తులతైలముతీసి శరీరమునకు లేపనముజేసికొని రాత్రులయందుష్ణోదకముతో స్నానముచేసిన శీతపైత్త్యవిసర్పి హరించు.

శ్లో॥ సిద్ధార్థ రజనికల్కం ప్రపున్నాల తిలైస్సహ ।
తిక్తతైలేన సంమిశ్రం పిత్తోద్వర్తనకే హితమ్ ॥

తా. ఆవాలు పసపు తగరంచివిత్తులు నువ్వులనూనె వీనిని సమముగ కల్క ముచేసి అందు చేతిబీరవిత్తుల తైలమునుకలిపి 3 నెలలు లేపనము సేయుచుండిన శీతపిత్త విసర్పి హరించు.

శ్లో॥ కపిత్థ శిగ్రుపత్రంవా నవనీతం సమంయుతమ్ ।
ముహురుద్వర్తితంచైవ శీతపిత్త హరంపరమ్ ।

తా. వెలగాకురసము మునగాకురసము వెన్న వీనినేకముజేసి శరీరమునందు పలుమారులేపనముసేయుచుండిన శీతపిత్తవిసర్పిహరించు. (ఇదిహరించుటకై గంధక కల్పమును సగాసేవింపందగు.)

## రక్తపైత్య లక్షణము.

శ్లో॥ అథాన్యత్సం ప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్తముత్తమమ్
ఆయుర్వేదోప దేశేస్మిఙ రక్తపిత్తం నిగద్యతే ॥

తా. ఇక ఆయుర్వేదమున జెప్పంబడిన ప్రకారము రక్తపిత్తలక్షణమును సంక్షిప్తముగ వచించెద.

శ్లో॥ [ఆయుర్వేదే] ఉష్ణామ్ల లవణక్షార కటుభిః పిత్తదూషణైః ।
యకృత్ప్లీహాశ్రితంరక్త మూర్ధ్వంచాధః ప్రవర్తతే ॥

తా. ఉష్ణద్రవ్యములు పులుసు ఉప్పు యవక్షారము సర్జక్షారము కారము పిత్తవికారద్రవ్యములు ఈ మొదలగువాని సేవనవలన * యకృత్తు ‡ ప్లీహములయందు రక్తము ప్రవేశించి ఊర్ధ్వాధోముఖములుగ వెడలుటయే రక్తపైత్యమని తెలియవలయు.

## రక్తపైత్యవర్ణ వివరణము.

శ్లో॥ వాతేశ్యా మారుణంరూక్షే శోణితం తనుఫేనిలమ్ ।
కఫజ స్నిగ్ధమాంపాండు పిచ్ఛిలం బహులం తథా ॥

* యకృత్తన—కడుపులోని క్లోమము క్రిందనుండెడి నల్లనిమాంసదళము.
‡ ప్లీహమన—హృదయమునకు వామభాగమునందుండెడి పచ్చనిమాంసము.

తా. వాతజనితర_క్తము నలుపుగ ఎఱ్ఱగను పి_త్తజనితర_క్తము సూక్ష్మమైనను రుసుగలదిగ స్నిగ్ధముగను శ్లేష్మజనితర_క్తము చిక్కగ ఒకింత తెలుపుగ బంకగ అధికముగ నుండు.

## ర_క్తపి_త్త సాధ్యాసాధములు.

శ్లో॥ అధోగమానిలంయాప్య మసాధ్యం శ్లేష్మమూర్ధ్వగమ్ ।
కఫానిలసముద్భూతం దుశ్చికిత్స్యం ద్విమార్గగమ్ ॥

తా. వాతజనితర_క్తము గుదద్వారమువలనవెడలును ఇదియాప్యము శ్లేష్మజనిత ర_క్తము నోటివలనవెడలుట ఇది అసాధ్యము ఏకకాలంబున వాతశ్లేష్మములు ప్రకోపించి గుదము నోరు అనువానిమూలముగ వెడలును ఇది అసాధ్యము.

## ర_క్తపి_త్త నివ_ర్తకోపాయములు.

శ్లో॥ విధేయం ర_క్తపి_త్తేచ యథాశ_క్తి విలంఘనమ్ ।
అధోగే వమనంశ_స్త మూర్ధ్వగేతు విరేచనమ్ ॥

తా. ర_క్తపైత్యము నివ_ర్తించుటకై శ_క్త్యనుగుణ్యముగ లంఘనము ర_క్తము అధోముఖముగ బ్రవ_ర్తించిన వమనమును ఊర్ధ్వముగ బ్రవ_ర్తించిన విరేచనమునుజేయించవలయు.

## జ్వరాదులయందు చికిత్సానిషేధకాలము.

శ్లో॥ [చరకే] జ్వరేతథాతిసారేచ ర_క్తపై_త్యే హృగామయే ।
ఆదాన ప్రతిక_ర్తవ్యం వ్యాధివేగశ్చ దుర్జయః ॥

తా. జ్వరము అతిసారము ర_క్తపి_త్తము నేత్రరోగము ఇవి జనించునపుడు వాని యందు వేగంబధికముగ నుండుటవలన తొలుత నే చికిత్స జేయంజనదు.

## ప్రకారాంతర ర_క్తపైత్య లక్షణము.

శ్లో॥ [నిత్యనాథీయే] ఘర్మవ్యాయామ శోకాధ్య వ్యవాయైరతి
సేవితైః । తీక్ష్ణోష్ణ క్షారలవణై రమ్లైః కటుభిరేవచ ।
పి_త్తం విదగ్ధంస్వగుణై ర్విదహత్యాశు శోణితమ్ ।
తతః ప్రవ_ర్తతే ర_క్త మూర్ధ్వవాధోద్విధాపివా ॥

తా. మిక్కుటముగ ఎండలో సంచరించుట ఆయాసము పొందుట మిక్కిలి ంచు ట మార్గము నడుచుట మైథునము సేయుట విరపకాయలు పొందలగు తీక్ష్ణపదార్థము లను అగ్నితాపమును యవక్షారము ఉప్పు పులుసు కారముగల ద్రవ్యములను మిక్కు టముగ సేవించుట వీనివలన పిత్తము ప్రకోపించి తీవ్రముగ ద్రవించి దుర్గంధయు క్తమై తీవ్రముగ రక్తమును తపింపంజేసి ఊర్ధ్వమార్గముల వలనగాని లేక అధో మార్గముల వలనగాని లేక ఇరుమార్గములవలనగాని స్రవింపంజేయు.

## ఊర్ధ్వాధోగత రక్తపిత్త లక్షణము.

శ్లో॥ ఊర్ధ్వ నాసాక్షికర్ణాస్యై ర్మేఢ్రయోనిగుదై రధః ।
కుపితం రోమకూపైశ్చ సమస్తై స్తత్ప్రవర్తతే ॥

తా. మఱియు రక్తపిత్తము ఊర్ధ్వగతంబైన ముక్కు నేత్రములు చెవులు నోరు అనువానివలనను అధోగతంబైన మేఢ్రము యోని గుదము అనువానివలననును మిక్కుటముగ కుపితంబైన సర్వరోమకూపములవలనను రక్తము స్రవించు.

## వాతాది రక్తపిత్త లక్షణము.

శ్లో॥ [చరకే]సాంద్ర సంపాండుసస్నేహంపిచ్ఛిలంచకఫాన్వితమ్ ।
శ్యావారుణంసఫేనంచ తనురూక్షంచ వాతికమ్ । రక్తపిత్తం
కషాయాభం కృష్ణగోమూత్రసన్నిభమ్ । మేచకా గారధూ
మాభ మంజనాభంజ పైత్తికమ్ । సంసృష్టలింగం సంసర్గా
త్త్రిలింగంసాన్నిపాతికమ్ । ఊర్ధ్వగం కఫసంసృష్ట మధోగం
మారుతానుగమ్ । ఊర్ధ్వం సాధ్య మధోయాప్య మసాధ్యం
యుగపద్గతమ్ । యేనచోప హతోరక్తంరక్తపిత్తేనమానవః ।
వ్యసేద్వాశ్యం వియచ్చాసి తచ్చాసాధ్య మసంశయమ్ ॥

తా. రక్తపిత్తమున రక్తముదట్టముగ ఒకింతపాండురవర్ణముగ దమురుతో తు ల్యముగ బంకగ నుండునది శ్లేష్మయుక్తరక్తపిత్తమనియు నలుపుగ ఎఱ్ఱగ ఒకింతనురుగు తో గూడినదిగ తేటగ రూక్షముగ నుండిన వాతరక్తపిత్తమనియు మఱ్ఱిపాచరి అను వాని కషాయవర్ణముగ నల్లగ గోమూత్రముతో తుల్యముగ నెమలియీకె లేక కరు దూపము లేక కాటుక అనువానితో తుల్యముగనుండిన పైత్యకరక్తపిత్తమనియు 2 వర్ణములు గలదిగనుండిన ద్వంద్వజనిత రక్తపిత్తమనియు 3 వర్ణములుగలదిగనుండిన

త్రిదోషజనితరక్తపిత్తమనియు తెలియవలయు మఱియు ఊర్ధ్వముగ రక్తము వెడలిన శ్లేష్మగుణమనియు యధోముఖముగ వెడలిన వాతగుణమనియు తెలియవలయు మఱియు రక్తము ఊర్ధ్వముగ వెడలిన సాధ్యము. అధోముఖముగ వెడలిన * యాప్యము. ఊర్ధ్వాధోముఖములుగ వెడలిన అసాధ్యము. మఱియు రక్తపిత్తమువలన పీడితుడుగ నుండునూనపుడు ఘటపటాది వస్తువులను ఆకాశమును ఎఱ్ఱగ గాంచిన వానియొక్క రక్తపిత్తము నిస్సంశయముగ అసాధ్యమని తెలియవలయు.

## ప్రకారాంతరం. రక్తపిత్తలక్షణమ్

శ్లో॥ [అశ్వినీకల్పే] వాంతీకరస్య హిక్కాచ తాంబూలస్యచ వర్జనం। దృఢాస్యా ద్దేహపీడాచ రక్తపైత్త్య నికారకే ॥

తా. నెత్తురుగ్రక్కుట ఎక్కిళ్ళుగలుగుట తాంబూలమునం దిచ్ఛలేకుండుట శరీరమున దృఢమైనపీడగలుగుట ఈలక్షణములుగలది రక్తపైత్యమని తెలియవలయు

## మేఢ్రమున స్రవింపుచుండు రక్తపిత్తమునకు ఉపచారము.

శ్లో॥ రక్తాతిసారకర్మాణి ప్రయోజ్యాని భిషగ్వరైః। ॥
రక్తప్రవాహికేకృత్స్నం మేఢ్రగే సన్నియోజయేత్ ॥

తా. మేఢ్రమున రక్తము స్రవించుచుండిన రక్తాతిసారచికిత్సల చేయవలయు.

## అస్సృగ్ధరరోగ వివరణములు.

శ్లో॥ [మతాంతరే] అపత్యమార్గగం స్త్రీణాం రక్తపిత్తమ స్సృగ్ధరమ్। తదేవ ప్రదరప్రోక్తం క్రియాకార్యాస్రపైత్త్యకే ॥

తా. స్త్రీలకు రక్తపైత్యము యోనిమార్గముగ వెడలుచుండిన అస్సృగ్ధరమనియు ప్రదరమనియు జెప్పంబడు, ఇది హరించుటకై రక్తపైత్యరోగ చికిత్సఁ జేయవలయు.

## సర్వరక్తపైత్యములకు రక్తమారేశ్వరరసము.

శ్లో॥ [చరకే] సూతంగంధంమృతంస్వర్ణంరససిందూరకాంతకమ్ అభ్రకం సర్వద్విగుణం తామ్రభస్మ ద్విభాగకమ్। వంగం నాగంతథారౌప్యం ప్రత్యేకంసూతసామ్యకమ్। లోహభస్మ

* యాప్యమన—సాధ్యాసాధ్యము.

త్రిభాగంచ ముండ సిందూరకంతథా । సర్వాంశతుల్యో ప్రసూతః
మర్దయే దతియత్నతః । ఖర్జూరయష్టి కాద్రాక్షా మధుపుష్ప
శతావరీ । లోధ్రకాశ్మర్య హ్రీబేర పద్మకేసర పద్మకమ్
మృణాలచందనోశీర నీలోత్పలఘనంసమమ్ । శ్రీగంధంవా
కంకుష్ఠం బలాశాల్మలిమూలకమ్ । రంభాకందం గోక్షురక
మాధవీసహదేవికా । పరూషణకషాయేణ భావయేచ్ఛతశ
రకమ్ । వల్లప్రమాణకంచైవ శర్కరా మృతశర్కరైః ।
భక్షయేద్ఘృతమిశ్రంతు రక్తపిత్త హరంపరమ్ సర్వపైత
హరోన్యాణాం రక్తమారేశ్వరోరసః ॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసినగంధకము సువర్ణ భస్మము రససిందూరమ కాంతభస్మము ఇవి దినుసుకొక్కొకభాగము అభ్రకసిందూరము 10 భాగము తామ్రభస్మము 2 భాగములు వంగభస్మము నాగభస్మము రజితభస్మము ఇవి దినుసుకొక్కొకభాగము లోహభస్మము ఇనుపభస్మము ఇవి దినుసు ఒకటింటికి 3 భాగములు ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి ఖర్జూరపండు యిష్టి మధుకము దీపద్రాక్ష ఇప్పపువ్వు పిల్లిపీచరవేళ్ళు లొద్దుగచెక్క కవ్వపుగుమ్ముడుచెక్క కురువేరు తామ అగరులు పద్మకాష్ఠము తామరతూండ్లు రక్తచందనము వట్టివేళ్ళు నల్లకలువగడ్డ తుంగముస్తెలు శ్రీగంధము కూతురుబుడమ చంగల్వకోష్టు ముత్తవపులగపువేళ్ళ బూరుగవేళ్ళు అరటిగడ్డ పల్లేరువేళ్ళు పువ్వులగురివెంద సహదేవి పేరీత అనువాని సమభాగములుగ దంచి కషాయముకాచి దీనిచే నూరుమార్లు భావనచేసి 2 పల్లవలంతేసి మాత్రలుజేసి యందొకదానిని పంచదార తిప్పసత్తు ఆవునెయ్యి అనువాయనుపానములోడ సేవించిన రక్తపైత్యము సర్వపైత్యములు హరించు, మఱియు నిది అవర్ణపైత్యమునకు ప్రసిద్ధమగుటంజేసి దానియందు సగా ప్రయోగింపవగు.)

## రక్తపిత్తమునకు సిందూరకల్పము.

శ్లో॥ [సిందూరమణిదర్పణే] తత్సిందూరంవినిక్షిప్యగుంజామాత్ర
ప్రమాణకమ్। మృద్వీకేనసితాయుక్తరక్తపిత్తహరంపరమ్॥

తా. సిందూరము దీపద్రాక్షపండు పంచదార అనువానిని నేకముజేసి మర్దిం చి సేవించినను (లేక ఈ యనుపానముతోడనే పూర్ణచంద్రోదయమును సేవించిన ను) రక్తపైత్య హారించు.

## రక్తపిత్తమునకు రసభస్మకల్పము.

శ్లో॥ రసభస్మక నిష్కంచ షడ్భాగం మృద్వీకాసితా।
క్షయకాస తృషాఛర్ది రక్తపిత్త వికారజిత్॥

తా. రసభస్మము నిష్కప్రమాణము దీపద్రాక్ష పంచదార ఇవి 6 నిష్కములు. ఇటుల వీనినిమర్దించి 30 మాత్రలుచేసి యందొకదానిని అడ్డసరపాకురసము తేనె అనువానితో సేవించిన క్షయకాస దప్పి వాంతి రక్తపైత్యము హారించు.

## రక్తపిత్తమునకు పైత్యముద్గరరసము.

శ్లో॥ [చరకే] పారదం హింగుళీతంచ హ్యార్ధ్వయంత్రేచ మేళ
యేత్ । కుక్కుటాండ రసోభాగో టంకణ క్షారమేవచ।
గంధకస్య తథాభాగో మృతేన పరిమర్దయేత్।
సిద్ధంరసంసమాధాయ జీరతో యేనదాపయేత్।
మాషత్రయం ప్రతిదినం గ్రహణీ రక్తదోషనుత్।
జ్వరదాహ వినాశశ్చ రక్తపిత్త నిబర్హణః॥

తా. రసము ఇంగిలీకము వీనిని సమభాగములుగ శుద్ధిజేసి మర్దించి ఊ యంత్రములోనునిచి 2 ఝాములు పాకముజేసిన రసము పైకుండయందు వ్యాపిం ఇట్టి సంస్కారముచే శుద్ధమైన పాదరసమును సాంగశీతలమున గ్రహింపవలెను అట్టి పాదరసము కోడిగుడ్లరసము టంకణక్షారము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజే వసనాభి వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి బాగుగమర్దించి 3 మాష లంతేసిమాత్రలుజేసి యందొకదానిని జీలకఱ్ఱ కషాయముతో గాని లేక దీపద్ర తేనె పంచదార అనువానితోగాని లేక ఖర్జూరపండు తేనె అనువానితోగాని వించిన గ్రహణిరక్త దోషము జ్వరము దాహము రక్తపైత్యము హారించు.

## రక్తపిత్తములకు మహాచంద్రకళారసము.

శ్లో॥ [ఆయుర్వేదే] ప్రత్యేకంతోలమానేన * సూతకాంతాభ్ర భస్మకమ్ । సమంసమంగంధకంచ కృత్వాకజ్జలికాంతథా । ముస్తామాలతిదూర్వాభిః కేతకీస్తనవారిణా । సహాదేవ్యాః కుమార్యాశ్చపర్పటస్యచవారిణా । మృణాళస్య శతాహ్వయాశ్చతావర్యాశ్చరసేనచ । భావయిత్వాప్రయత్నేన దివసేదివసేపృథక్ । తిక్తాపర్పటకాగ్నిపిప్పల్యౌ శ్రీగంధంశారిబైతేషాం సమాంశంసూక్ష్మచూర్ణితమ్ । ద్రాక్షాదికకషాయేణ సప్తధాపరిభావయేత్ । ఛాయాయాం పరిశోష్యాథ వట్యఃకార్యాశ్చణోపమాః । అయంచంద్రకళానామరసేంద్రఃపరికీర్తితః । సర్వపైత్యగదధ్వంసీ వాతపైత్యగదాపహః । అంతర్బాహ్యమహాదాహ విధ్వంసోయం మహారసః । గ్రీష్మకాలేశరత్కాలే విశేషేణప్రశస్యతే । కురుతేనాగ్నిమాంద్యంచ మహాతాపజ్వరంహరేత్ । శోషం మూర్ఛాంహరత్యాశు స్త్రీణాంరక్తంమహాస్రవమ్ । ఊర్ధ్వాధోరక్తపిత్తంచరక్తవాంతిం విశేషతః । మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి నాశయేన్నాత్రసంశయః॥

తా. శుద్ధిజేసిన రసము కాంతభస్మము అభ్రకభస్మము శుద్ధిజేసిన గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి కాటుకతో సమానముగ మర్దించి పిదప భద్రముస్తెలు విరజాజిపువ్వులు గరికెవేళ్లు మొగలిచన్ను సహదేవి కలబందపర్పాటకము తామరతూండ్లు అడవిసదాప పిల్లిపీచరవేళ్లు అనువానిని శీతోదకములో ప్రత్యేక ప్రత్యేకములుగదంచి రసముతీసి ప్రతిదానితో ఒక్కొకదినము మర్దించి అందు పసత్తు పర్పాటకము వట్టివేళ్లు పిప్పళ్లు శ్రీగంధము గూడపాల అనువానిని సమ భాగములుగ చూర్ణముజేసి కలిపి దీనిని ద్రాక్షపండు ఖర్జూరపండు పంచదార ఇప్ప

* సూతకం తామ్రభస్మకమ్॥ రసము - తామ్రభస్మము.

పువ్వు తేనెతవక్షీరి యష్టిమధుకము అనువానికషాయముతో 7 దినములు భావనజేసి నీడ నెండించి శనగగింజలంతేసి మాత్రలు జేసి యందొకదానిని **దీపద్రాక్షపండు** తేనె అనువాని యనుపానముతోడ 6 మాసములు సేవించిన **సర్వపైత్యములు** వాత పిత్తజనితరో**గములు కడుపు**లోమంట వెలపట తాపము కడుదాహము అగ్నిమాంద్య ము కడు**తాపజ్వరము శోష** మూర్ఛ అనురోగములను జాజికాయలచూర్ణయుక్తము గపాకముచేయబడిన గోఘృతాను పానముతోడగాని లేక మామిడిచెక్కరసములో సున్నపునీరు 3 నూనెబొట్లు కలిపిగాని సేవించిన కుసుమరోగములును ఖర్జూరపండు తేనె లేకగుమ్ముడుపండు తేనె అనువానిలో దేనితోగాని సేవించిన ఊర్ధ్వగత అధోగతరక్తపైత్యములును రక్తవాంతులును మూర్ఛయు సర్వమూత్రకృచ్ఛ్రములును గుబులుగల పైత్యములును అస్థిస్రావరోగములును హరించు. ఈచంద్రకళారసము రక్తపిత్తముల బోకడుచుటయందు కడుప్రసిద్ధిజెందియున్నది. మఱియు నీరసము గ్రీష్మశరత్కాలములయందు విశేషము ప్రశస్తంబు (మఱియు దీనిని లవంగపు చూర్ణయుక్తముగ జేయబడిన చిన్నంగిసమూలము ఇంగువ కరక్కాయ అనువాని కషాయముతోడగాని లేక శేలగంధము పేల్చినఇంగువ సైంధవలవణము మిరియాలు శొంఠి అనువానిచూర్ణముతోడగాని లేక జీడిగింజలచూర్ణముతోడగాని 6 నెలలు భక్షించిన గుబులుగల పైత్యములు హరించు.)

## రక్తపిత్తమునకు వేణుపత్రాదికషాయము.

శ్లో॥ వేణుపత్రో శీరముస్తాః కేశీదాడిమ వాలుకేః।
క్వాథో నాగరమిశ్రస్తు రక్తపిత్తనిబర్హణః॥

తా. వెదురాకు వట్టివేళ్ళు తుంగగడ్డలు కురువేరు దానిమ్మకాయ కూతురుబుడమ వీనిని సమభాగములుగదంచి కషాయముకాచి అందు శొంఠిచూర్ణము గలిపి పానముచేసిన రక్తపైత్యము హరించు.

## రక్తపిత్తమునకు అలక్తకల్పము.

శ్లో॥ అలక్తకలశంక్షౌద్రం రక్తవాంతి హారంభవేత్॥

తా. లక్క తేనె కలిపి సేవించిన రక్తపైత్యము హరించు.

## రక్తపిత్తమునకు కాకతుండ్యాదిచూర్ణము.

శ్లో॥ పుష్యార్కే కాకతుండ్యాస్తు మూలంగోక్షీరభావితమ్।

రక్తవాంతి హరంపేయం ప్రత్యహం నిష్కనిష్కకమ్॥

తా. పుష్యమీనక్షత్రము ఆదివారముకూడిన దినమునందు బండిగురిజవేరు చెక్కనుదెచ్చి చూర్ణముచేసి ఆవుపాలతో 7 మారులు భావనచేసి ప్రతిదినము నిష్కప్రమాణము సేవింపుచుండిన రక్తపిత్తము హరించు.

రక్తపిత్తమునకు చందనాదిఘృతము.

శ్లో॥ చందనసారకషాయ విపక్వం శారిభయామధు కీన సుసర్పిః।
శర్కరయా-మధుకేనచమిశ్రం శోణితపిత్తముపోహతిసద్యః॥

తా. రక్తచందన కషాయములో సుగంధిపాల ఇప్పపువ్వులు నెయ్యి కలిపి ఘృతపక్వముగాకాచి అందు శర్కర తేనెకలిపి సేవించిన తత్క్షణము రక్తపిత్తము హరించు.

రక్తపిత్తమునకు ఉశీరకాదిచూర్ణము.

శ్లో॥ ఉశీరం తగరంశుంఠి కంకోలం చందనద్వయమ్।
లవంగం పిప్పలీమూలం త్రుటిైలా నాగకేసరమ్।
ముస్తామలక కర్పూరం తవక్షీరీచ పత్రకమ్।
కృష్ణాగరుసమంచూర్ణం సితాస్యా దష్టమాంశకమ్।
రక్తవాంతింహృదస్తాపం నాశయే న్నాత్రసంశయః॥

తా. వట్టివేళ్లు గ్రంథితగరము శొంఠి కంకోలములు శ్రీగంధము రక్తచందనము లవంగములు మోడి పిప్పళ్ళు ఏలకులు నాగకేసరములు తుంగముస్తెలు ఉసిరికెపప్పు కర్పూరము తవక్షీరి ఆకుపత్రి కృష్ణాగరు దీనిని సమభాగములుగదంచి చూర్ణముచేసిదానికి 8 వ భాగము పంచదార గలిపి పిల్లి అడుగంత భక్షించిన రక్తవాంతి ఱొమ్ములోమంట నిస్సంశయముగ హరించు.

రక్తపిత్తమునందు పథ్యములు.

శ్లో॥ ముద్గగోధూమమష్టికా శాలీజాంగల జామిషమ్।
పక్వకూశ్మాండపత్తూర పటోలం తండులీయకమ్।

ద్రాక్షా దాడిమ ఖర్జూరం ధాత్రీఫల ఘృతంమధు।
ప్రదరేర క్తపి త్తేచ పథ్యవర్గ ఉదాహృతః॥

తా. పెసరకట్టు గోధుమలు 60 దినములకు ఫలించిన వడ్లు జాంగలమాంసము ముదురు గుమ్మడుకాయ పొన్నగంటికూర పొట్లకాయ చిత్తికూర ద్రాక్షపండు దానిమ్మపండు ఖర్జూరపండు ఉసిరికెపప్పు ఆవునెయ్యి తేనె ఇవి రక్తపైత్యరోగులకు కుసుమ రోగులకు పథ్యకరంబులు.

## రక్తపిత్తమునందు పథ్యములు.

శ్లో॥ కట్వమ్ల లవణక్షారం మత్స్యమద్య విదాహినః।
మాషాన్నిష్పావతిలజ కుళుత్థ లశునందధి।
ప్రదరే రక్తపి త్తేచ హ్యాపథ్య మితికథ్యతే॥

తా. కారము పులుసు ఉప్పు క్షారము మత్స్యములు మద్యము విదాహకరద్రవ్యములు మినుములు అనుములు ఆవాలు నూనె ఉలవలు వెల్లుల్లి పెరుగు ఇవి రక్తపైత్యరోగులకు కుసుమరోగులకు అపథ్యకరంబులు.

## ఆమ్లపైత్య లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] అథాన్యత్సం ప్రవక్ష్యామిసంక్షిప్తం సూక్తము త్తమమ్। ఆయుర్వేదోదితే శాస్త్రే న్నామ్లపి త్తంనిగద్యతే। విరుద్ధదుష్టామ్ల విదాహిపి త్త ప్రకోపిపానాన్న భుజోవిదగ్ధం। పి త్తంస్వహేతూపచితంపురాయ తదమ్లపి త్తం ప్రవదంతి సంతతః॥

తా. ఇక ఆయుర్వేదమునకు జెప్పంబడిన ప్రకారము ఆమ్లపిత్తోత్పత్తిని సంక్షిప్తముగ వచించెద. విరుద్ధక్షీరమత్స్యాద్యాహారములు పులుసు విదాహకరద్రవ్యములు అనువాని సేవనవలన వర్షాది ఋతువులవలన పి త్తము ప్రకోపించి భుజించిన యన్నాదులు జీర్ణము గాక పులితేనుపులు వచ్చుటయే ఆమ్లపైత్యమని తెలియవలయు.

శ్లో॥ ఆమ్లాల్పిత్తా చ్ఛిరో ర్తి జ్వరిత తనువపుః కోష్ఠ హృత్కంఠ దాహాస్స్వేదో మూర్ఛా పిపాసాకఫ సహితవమిశ్చామ్ల శేషోరసస్య। వాంఛాఘ్రాణేసతస్మిం జఠరముపగతే చామ్ల శేషస్య

వాంతి స్తిక్తా మ్లోద్గార కండూ బహువిధపిట కామండలా స్యామ్లపిత్తే॥

తా. తలనొచ్చుట జ్వరముగలుగుట శరీరము కృశించుట లోకడుపు హృదయము మెడ అనువానియందు తాపముగలుగుట చెమట మూర్ఛ దప్పిగలుగుట శ్లేష్మమును పులుసును గ్రక్కుట కడుపులో వ్యాపించిన ఆమ్లపిత్తమువలన నోరు ముక్కు అనువానియందు పులుసు వెడలుట చేదుగ పుల్లగ తేనుపులువచ్చుట దురద పలువిధపిటికలు మండలములుగలుగుట ఈలక్షణములుగలది ఆమ్లపైత్యమని తెలియవలయు.

శ్లో॥ [మాధవనిదానే] అవిపాకక్లమోత్క్లేశ తిక్తామ్లోద్గారగౌరవైః । అరుచిఃకంఠతృడ్దాహ మోహమూర్ఛాః క్వచిద్భ్రమః ।
తిక్తామ్లకటుకోద్గార శ్వాసహృల్లాసతాపతృట్ । ప్రలాపఃకుక్షిరోగశ్చ హ్యామ్లపిత్తస్య లక్షణమ్॥

తా. అన్నము జీర్ణముగాకుండుట ఆయాసముగలుగుట శరీరము పగులుట చేదుగ పుల్లగ తేనుపులువచ్చుట శరీరము బరువుగనుండుట అరుచిగలుగుట కంఠము ఎండుట తాపము మోహము మూర్ఛ ఒకానొకపుడు భ్రమగలుగుట చేదుగ పుల్లగ వగరుగ వమనముసేయుట శ్వాస ఓకరగలుగుట ప్రలాపించుట కడుపులో శూలించుట ఈలక్షణముగలది ఆమ్లపైత్యమని తెలియవలయు.

శ్లో॥ [చికిత్సాసారసిద్ధసంగ్రహే] అమ్లోద్గారామ్లవమనంశిరోర్తిర్జ్వరితంవపుః । ఆమ్లపిత్తస్యలింగాని స్వేదతృష్ణావిమూర్ఛనమ్ ।
తత్కృచ్ఛ్రసాధ్యంప్రత్యగ్రం దుశ్చికిత్సం పురాతనమ్॥

తా. పులితేనుపులు గలిగి పులుసును గ్రక్కుట తలనొచ్చుట జ్వరము చెమటదప్పి మూర్ఛ గలుగుట ఈ లక్షణములుగలది ఆమ్లపైత్యమని తెలియవలయు. ఇది లేతగనుండిన కష్టసాధ్యము ముదిరి వాత పిత్త శ్లేష్మయుక్తంబై జ్వరయుక్తంబైయుండిన అసాధ్యము.

### ఊర్ధ్వాధోముఖామ్ల పిత్తమునకు ఉపచారము.

శ్లో॥ ఊర్ధ్వామ్లపిత్తేవమనం విరేచనమధోగతే।

సర్వత్రాసిశనంశ స్తం నిరూహాంచ ప్రశస్యతే।
కఫపిత్తప్రశమనం యచ్చపానాన్న భేషజమ్॥

తా. ఆమ్లపిత్తము ఊర్ధ్వముఖంబైన వమనమును అధోముఖంబైన విరేచనమును ఊర్ధ్వాధోముఖంబైన లంఘనమును నిరూహవస్తికర్మమును మఱియు శ్లేష్మపిత్తరక్త శమనోపయుక్త పానాన్నసేవనను చేయించి దానిని బోకడవలయు.

ఆమ్లపిత్తమునకు సంజీవరసము.

శ్లో॥ [సిందూరమణిదర్పణే] రసగంధక తామ్రంచ కాంతభస్మ సమాంశకమ్ । ముసలీరససంమర్ద్యం కాచకుప్యాంవినిక్షిపేత్ । పాచయేద్వాలుకాయంత్రే ద్వియామాంతేసముద్ధరేత్ । సిందూరంత్రిఫలావ్యోమ్యం క్షారంలవణపంచకమ్ । హింగుగుగ్గులువహ్నీచ కుబేరాక్షశ్చటంకణమ్ । దీప్యత్రయంచజాతిశ్చ సూరణంవిశ్వవత్సకమ్ । శిగ్రుద్వయంతథా పుంఖీ వ్యాఘ్రీత్రయపటోలకమ్ । రాక్షశీవజ్రవల్లీచ కటభి క్షురపీలుకమ్ । సమభాగానిసంచూర్ణ్య ఖల్వమద్యేవినిక్షిపేత్ । గృంజనశృంగబేరస్య జంబీరరసభావనా నిష్కార్ధంమధునాలేహ్యం యామేయామేచభక్షితమ్ । ఆమ్లపిత్తం నిహంత్యాశుసర్వవ్యాధిహరఃపరః । కుర్యాత్ప్రాణపరిత్రాణం సంజీవరసఉత్తమః॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము తామ్రభస్మము కాంతభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నేలతాటిగడ్డ రసముతో మర్దించి సూత్రలుచేసి ఎండించి గాజుకుప్పెలోబోసి వాలుకాయంత్రమున 2 ఝాములువండి స్వాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి చూర్ణముచేసి అందు సిందూరము త్రిఫలము త్రికటుకములు త్రిక్షారములు పంచలవణములు ఇంగువ శుద్ధిచేసిన మహిసాక్షీ గుగ్గిలము చిత్రమూలము గచ్చపలుకులు శుద్ధిచేసిన వెలిగారము ఖురాసాని ఓమము మంచిఓమము అజామోదము జాజికాయలు అడవికంద అడవి అల్లము కొడిసెపాల మునగ గడ్డ కారుమునగగడ్డములు వెంపలివేళ్లు నేలములకవేళ్లు పెద్దములకవేళ్లు రామములక

వేళ్లు చేతిపాట్లు బలురక్కసిగడ్డ నల్లేరు ఒరగొమ్ము నేలగొలిమిడి గాడిదెగడపరవే ళ్లు అనువాని చూర్ణమును ప్రత్యేకప్రత్యేకముగ రసప్రమాణముకలిపి మర్దించి వెల్లుల్లిపాయలరసము అల్లము నిమ్మపండ్లు అనువాని రసములలో ప్రతిదానితో 3 మార్లు భావనజేసి ప్రతిఝామునందు అర్ధనిష్కప్రమాణము తేనెతో నేనిలేక తమల పాకుతో నేని భక్షించి ఉష్ణోదకమును పానముచేసిన ఆమ్లపైత్యము గ్రహణి అజీర్ణము గుల్మశూలమొదలగు సర్వరోగములు శీఘ్రముగ హరించు. ఇది ప్రాణముల రక్షించుటచే సంజీవరస మనంబడు. (దీని సేవనవలన నీరువెడలకుండిన దొండాకురసమును పానము సేయవలయు.)

## ఆమ్లపిత్తమునకు పిత్తభంజనరసము.

శ్లో॥ [చరకే] పారదంగంధకంతామ్రం ముసలీరసమర్దితమ్ । కాచ కుప్యాంవినిక్షిప్య వాలుకాయంత్రకేతథా । పచేద్విపక్వసం చూర్ణ్యం ఖల్వమధ్యే వినిక్షిపేత్ । త్రిక్షారంపంచలవణం హింగుగుగ్గులు కుష్ఠకమ్ । కటుత్రయంచత్రిఫలా గంధారీ జాతికద్వయమ్ । దీప్యత్రయంత్రిఫేనంచ ముస్తాంబ్రంవిమవ త్సకమ్ । ఏలాద్వయంచ సౌభాగ్యం కుబేరావహ్నిమూలకమ్ । తింత్రిణీఫలగ్రంధీచ చూతెందాడిమఖంఫలమ్ । సమ భాగాని సంచూర్ణ్యం ఖల్వమధ్యేవినిక్షిపేత్ । భావయేత్స ప్తవారంచ శృంగబేరరసేనచ । నిమ్బార్ధంమధునాలేహ్యం యామేయామేచ భక్షయేత్ । ఆమ్లపిత్తం నిహంత్యాశు గ్రహణీచ వినశ్యతి॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిజేసిన గంధకము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నేలతాటిగడ్డల రసముతో మర్దించి మాత్రలుజేసి ఎండించి గాజుకుప్పెలోబోసి వాలుకాయంత్రమున 2 ఝాములు వండి స్వాంగశీతలమున దీసి అందు త్రిక్షారములు పంచలవణములు నేతితోపొంగించిన ఇంగువ శుద్ధిజేసిన మహిసాక్షిగుగ్గిలముచంగల్వకోష్టులుత్రికటుకములు త్రిఫలములు గంజాయివిత్తులు జాజికాయలు జాపత్రి ఓమము ఖురాసాని ఓమము అజామోదము పోస్తుకాయగసగసాలు నల్లమందు ముస్తాంబ్రము అతివసకొడిసెపాల ఏలకులు బొంతఏలకులు శుద్ధిచేసిన

వెలిగారము గచ్చపలుకులు చిత్రమూలము చింతతేయాకులు మయూరసలములు కొమ మోడి మామిడిపప్పు దానిమ్మకాయ అనువానిని సమభాగములుగ చూర్ణముచేసి కలిపి 7 మార్లు అల్లపురసముతో భావనజేసి ½ నిమ్మ ప్రమాణమును ప్రతిఝామున తేనెలో సేవింపుచుండిన ఆమ్లపిత్తము గ్రహణి (ఛర్ది అజీర్ణము) హరించు.

## ఆమ్లపిత్తమునకు లీలావిలాసరసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూత తథాగంధం మృతతామ్రాభ్రరుచ్యకమ్ । తుల్యాంశం మర్దయేద్యామం రుధ్వా పాచ్యం లఘూపుటే । అక్షంధాత్రీంచపథ్యాంచ క్రమవృద్ధ్యా విపాచయేత్ । జలేనాష్టగుణేనైవా గ్రాహ్యమష్టావశేషితమ్ । అనేనభావయేత్పూర్వం పక్వసూతంపునఃపునః । పంచవింశతివారంచ తావతాభృంగజైర్ద్రవైః । సంశోష్య భక్షయేద్రావైః పంచగుంజంమధుపుతమ్ । రసోలీలా విలాసోయ మామ్లపిత్తంనియచ్ఛతి ॥

తా: శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము తామ్రభస్మము అభ్రకభస్మము సౌవర్చలవణము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో 1 ఝాము మర్దించి గాజుకుప్పెలోనునిచి లఘువుటంబిడి పిదప 1 భాగము గచ్చపలుకులును 2 భాగములు ఉసిరికెపప్పును 3 భాగములు కరక్కాయలను దంచి వాని కెనిమిదింతలు నీళ్ళుబోసి అష్టావశేషముగ కషాయముకాచి యీ కషాయముతో 25 మార్లును గుంటగలగరాకు రసముతో 25 మార్లును పైయౌషధమును ఖల్వములో మర్దించి ఎండించి చూర్ణముజేసి అందు 5 గురిగింజలయెత్తులో గురిగింజ యెత్తు సిందూరము తేనె కలిసి సేవించిన కడుకుర్షుటమైన ఆమ్లపైత్యములు హరించు.

## ఆమ్లపైత్యమునకు ప్రాణేశ్వరరసము.

శ్లో॥ [రసరత్నాకరే] గంధకాభ్రంస మంసూతం వారాహీరసమర్దితమ్ । కంచుకప్యాం వినిక్షిప్య ముఖంఖండే సరోధయేత్ । పాచితంవాలుకాయంత్రే ద్వియామాంతే సముద్ధరేత్ । సిందూరంవత్సనాభంచ త్రిఫలావ్యోషచిత్రకమ్ । త్రిక్షారం పంచలవణం హింగు గుగ్గులుదీప్యకమ్ । అజామోదం చేంద్ర

యువం పృథగ్రససమైర్యుతమ్ । ఆర్ద్రకస్య ద్రవేణైవ భావయే త్సప్తవారకమ్ । ద్విమాషమనుపానేన ద్విపలేనోష్ణవారిణా । అనుపానవి శేషణ స్వరోగాన్ వినాశయేత్ । అభిన్యాసం చామ్లపిత్తం గ్రహణీపాండు గుల్మజిత్ । కాసశ్వాసంచప్లీహం చ జ్వరాతీసారమేవచ । వాతశూలంచ మందాగ్నిం సర్వజ్వర వినాశకః। కుర్యాత్ప్రాణపరిత్రాణ మయం ప్రాణేశ్వరో రసః ॥

తా. శుద్ధిజేసిన గంధకము అభ్రకభస్మము శుద్ధిజేసిన రసము వీనిని సమభాగ ములుగ ఖల్వములోనునిచి నేలతాటిగడ్డల రసముతో మర్దించి మాత్రలుచేసి గాజు కుప్పెలోబోసి బలపపుబిల్లచే దాని మూతిని మూసి వాలుకాయంత్రమున 2 ఝా ములు వండి సాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి అందు సిందూరము శుద్ధిచేసిన వాభి త్రిఫలములు త్రికటుకములు చిత్రమూలము త్రిక్షారములు పంచలవణములు ఇంగువ శుద్ధిచేసిన మహిసాక్షి గుగ్గిలము ఓమము ఖురాసాని ఓమము కొడిసెపాల అనువానిలో ప్రతిదాని చూర్ణమును రసమెత్తును కలిపి అల్లపురసముతో 7 మార్లు భావనచేసి 2 మాషములయెత్తు తేనెతో సేవించినను లేక తమలపాకులోనునిచి భ క్షించి చేరెడు ఉష్ణోదకమును త్రాగినను అభిన్యాసము అమ్లపైత్యము గ్రహిణి పాండువు గుల్మము కాసశ్వాసలు ప్లీహరోగము జ్వరాతిసారము వాతశూలలు అగ్ని మాంద్యము సర్వజ్వరములుహరించు ఇది ప్రాణముల రక్షించుటచే ప్రాణేశ్వర రస మని జెప్పంబడు.

## అమ్లపైత్యమునకు మహాప్రాణేశ్వరరసము.

శ్లో॥ [శారీరే] గంధకాభ్రసమంసూతం వారాహీరస మర్దితమ్ । హంసపాదిరసేనాపి మర్దయేత్త్రిదినంమ్మదు । కాచకుప్యాం తరేక్షిప్త్వా తన్ముఖంచ నిరుధ్య చ । పాచయేద్వాలు కాయం త్రేతథాయామ చతుష్టయమ్ । సాంగశీతల మాదాయ మర్ద యేదేభిరౌషధైః । పంచకోలంచ త్రిక్షారం జీరకద్వయ దీప్య కమ్ । మరీచాన్ పంచలవణం గుగ్గులుంచ విషద్వయమ్ । త్రిజాతకంలవంగంచ వరారాస్నా శ్వగంధికా । జంబీరార్ద్రక భృంగాణాం రసైస్సంమర్దయేత్పృథక్ । సప్తధా త్రంతతో గుంజాప్రమాణం వటకీకృతమ్ । తత్త్రద్రోగేను పానేనసేవయే

త్సర్వరోగజిత్ । సన్నిపాత మభిన్యాసం ధనుర్వాతంచ
తాంద్రికమ్ ॥ కాసశ్వాసాగ్ని మాంద్యంచ పాండు కామలి
పీనసాన్ । శోఫంగుల్మ తథార్శాంసి క్షయంచ గ్రహిణీ
గదాన్। జ్వరకుష్ఠ ప్రమేహంచనాశయే న్నాత్రసంశయః ।
సర్వేషాం పిత్తరోగాణాం మహా ప్రాణేశ్వరోరసః॥

తా. శుద్ధిజేసిన గంధకము అభ్రకభస్మము శుద్ధిజేసిన రసము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నేలతాటిగడ్డల రసము హంసపాదియాకు రసము వీనితో 3 దినములు సన్నగమర్దించి గాజుకుప్పెలోనునిచి దాని మూతిని మూసి వాలుకా యంత్రమున 4 ఝాములు వండి సాంగశీతలమున దీసి అందు పిప్పళ్ళ మోడి చెవ్యము చిత్రమూలము శొంఠి సర్జక్షారము యవక్షారము టంకణక్షారము జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ ఓమము మిరియాలు పంచలవణములు శుద్ధిజేసిన మహిసాక్షి గుగ్గిలము శుద్ధిజేసిన నాభి అతివస లవంగపుచెక్క ఏలకులు లవంగపత్రి లవంగములు త్రిఫలములు దుంపరాష్ట్రము డొమ్ముడోలుగడ్డ అనువానిలో ప్రతిదానిచూర్ణమును రసమునకు సమముగ కలిపి నిమ్మపండ్లు అల్లము గుంటగలగర అనువాని రసములలో ప్రతిదానితో 7 దినములు మర్దించి గురిగింజంతేసి మాత్రలుజేసి అనుపాన విశేషములతో సేవించిన సన్నిపాతము అభిన్యాసము ధనుర్వాతము తాంద్రికసన్ని కాసశ్వాసలు అగ్నిమాంద్యము పాండువు కామిల పీనసము శోభ గుల్మము మూలవ్యాధి క్షయరోగము గ్రహణిజ్వరము కుష్ఠువు ప్రమేహము ఆమ్లపైత్యము మొదలగు సర్వపైత్యరోగములు హరించు.

## ఆమ్లపైత్యమునకు రసభస్మాదికల్పము.

శ్లో॥ మృతసూతార్కలోహానాం తుల్యంపథ్యాంవిచూర్ణయేత్ ।
మాషత్రయంలిహేత్క్షౌద్రేణామ్లపిత్తప్రశాంతయే॥

తా. రసభస్మము తామ్రభస్మము లోహభస్మము ఇః దినుసు కొక్కక తులము కరక్కాయలు 3 తులములు ఇటుల నేకముజేసి తేనెలోకలిపి 3 మాషముల యెత్తును సేవించిన ఆమ్లపైత్యము హరించు.

## ఆమ్లపైత్యమునకు అభ్రకాదికల్పము.

శ్లో॥ మృతాభ్రకంమృతంలోహంక్షౌద్రేర్లిహ్యాద్ద్విగుంజకమ్ ।

ఫలత్రయంపటోలంచతిక్తా క్వాథంసితాయుతమ్ ।
అమ్లపిత్తహరంచాశుపిబేచ్ఛర్దింజ్వరంజయేత్ ॥

తా. అభ్రకభస్మము లోహభస్మము వీనిని తేనెతో సేవించినను లేక త్రిఫలములు చేదుపొట్ల కటుకరోహిణి వీనిని కషాయముకాచి పంచదారకలిపి త్రాగినను ఆమ్లపయిత్యము ఛర్ది జ్వరము శీఘ్రముగ హరించు.

## ఆమ్లపైత్యమునకు తామ్రాదికల్పము.

శ్లో॥ మృతతామ్రంచైకగుంజం మధునాసహభక్షయేత్ ।
ద్రాక్షాంపథ్యాంసమంఖాదే న్మధునాచామ్లపిత్తజిత్ ॥

తా. గురిగింజంత తామ్రభస్మముగాని లేక ద్రాక్షపండు కరక్కాయ అనువానిని సమముగ చూర్ణము చేసిగాని తేనెతో సేవించిన ఆమ్లపయిత్యము హరించు.

## * ఛర్ది నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] దుష్టైర్దోషైః పృథక్సర్వైర్బీభత్సాలోకనాదిభిః । ఛర్దయఃపంచవిజ్ఞేయా స్తాసాంలక్షణముచ్యతే । అతిద్రవైరతిస్నిగ్ధై రహృద్యైర్లవణైరపి । అకాలేచాతిమాత్రైశ్చ తథాసాత్మ్యైశ్చభోజనైః । శ్రమాద్భయా దథోద్వేగా దజీర్ణాత్క్రిమిదోషతః । నార్యాశ్చాపన్న సత్వాయా స్తథాతి ద్రుతమశ్నతః ॥

తా. కడుద్రవము స్నిగ్ధముగల పదార్థములు మనస్సుకు ఇంపుగాని పదార్థముల లవణపదార్థములు అనువాని సేవనవలన అకాలభోజనములేక అధికభోజనములేక శరీరప్రకృతి కనుగుణ్యముగాని భోజనము అనువానివలన శ్రమ భయము దుఃఖము అజీర్ణము క్రిమిదోషము గర్భిణీస్త్రీలకుగలుగు గర్భపీడ అతితీవ్రభోజనము అనువానివలన వాత పిత్త శ్లేష్మములు ప్రకోపించి వాతఛర్ది పిత్తఛర్ది అరోచకఛర్ది అగంతుకఛర్ది అను 5 విధ చర్దుల గలుగంజేయు.

---

* అన్నపానాదులయందు ద్వేషముకలిగి వమనంబగుటయే ఛర్దిరోగమనంబడు.

## ఛర్దిపూర్వ రూపము

శ్లో॥ హృల్లాసోద్గార సంరోధౌ ప్రసేకో లవణ స్తనుః ।
ద్వేషోన్నపానేచ భృశంవమీనాం పూర్వలక్షణమ్ ॥

తా. ఓకరగలుగుట తేనుపులువచ్చుట మలమూత్రము వెడలకుండుట నోట నీరుగారుట నీరు కొంచము ఉప్పగనుండుట అన్నపానములయందు మిక్కుటముగ ద్వేషముగలుగుట ఈలక్షణములవలన ఛర్దిరోగము జనించునని తెలియవలయు.

## ఛర్దులయందు సామాన్యోపచారము.

శ్లో॥ అస్వాంచలం ఘయేత్పూర్వం ముహుః కార్యా విరేచనమ్ ॥

తా. పైజెప్పబడిన 5 విధ ఛర్దులయందు తఱుచుగ లంఘమును విరేచనమును చేయించవలయు.

## వాతఛర్ది లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] ఛర్దిర్భవేత్కృష్ణ కషాయఫేనై ర్ముహుర్ముహుశ్శూలక కుక్షిదాహా । వాతోద్భవాంఛర్దిమిమాంబ్రువంతి వక్త్రే చశోషోశ్వినిముఖ్యవైద్యాః

తా. నల్లగ వగరుగ నురుగుగ గ్రక్కుట పలుమారుశూల కడుపులో మంట గలుగుట నోరుయెండుట ఈ లక్షణములుగలది వాతఛర్దియని అశ్వినీదేవతలు వచించెదరు.

## పైత్యఛర్ది లక్షణము.

శ్లో॥ మూర్ఛాపిపాసా ముఖశోషశీర్ష తాల్వక్షిసంతాప భయోభిమార్తః । పీతంభృశోష్ణం హరితంసతిక్తం ధూమ్రంచ పిత్తవమేత్సదాహమ్ ॥

తా. మూర్ఛ దప్పిగలుగుట ముఖమువాడియుండుట తల దవడలు నేత్రములు మండుట అజ్ఞానము భ్రమగలుగుట పచ్చగ కడువుష్ణముగ ఆకుపసరువర్ణము, వగరుగ ఊదావర్ణముగ దాహయుక్తముగ గ్రక్కుట ఈ లక్షణములు గలది పైత్యఛర్దియని తెలియవలయు.

## శ్లేష్మఛర్ది లక్షణము.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] వాంతోరుణోయత్రవర్ణః పిచ్ఛిలః పూతిసీత
లః । శ్లేష్మఛర్ది వికారోయంమునిభిః పరికీర్తితః ॥

తా. ఎఱ్ఱగ బంకగ దుర్గంధముగ చల్లగ వమనంబగుట ఈ లక్షణములు గలది శ్లేష్మఛర్దియని తెలియవలయు.

## ఛర్ధిరుచి లక్షణము.

శ్లో॥ హృచ్ఛూల పీడనయుతం వమనేన పిత్తాత్తృడ్దాహశోషబహు
శం సతతం ప్రలాపః శ్లేష్మాధికం హ్యరుచికరం పమిగోగకే
తువైవర్ణ్యమోహజడతా గురుకంపనంచ ॥

తా. పిత్తప్రకోపమువలన వమనంబై రొమ్మునొచ్చుట దప్పిగలుగుట ఎల్లప్పుడు శరీరముమండుట శోష కడుప్రలాపము శ్లేష్మాధిక్యము అరుచిగలుగుట ముఖము వెల్లబోవుట మోహము జడత్వము మిక్కుటముగ వణుకుగలుగుట ఈలక్షణములు గలది ఛర్ది అరోచకమని తెలియవలయు. (ఛర్ది రోగము త్రిదోషలక్షణయుక్తంబుగనుండిన అసాధ్యము. ద్వంద్వలక్షణయుక్తంబుగనుండిన యాప్యము. ఏకదోషలక్షణయుక్తంబుగ నుండిన సాధ్యము.)

## ఆగంతుకఛర్ది లక్షణము.

శ్లో॥ బీభత్సజాదౌహృదజాఽమజాచ యాఽసాత్మ్యజావా క్రి
మిజాచయాహి । సాపంచ మీతాంచ విభావయేత్తు దోషో
చ్ఛ్రియేణైవ యథోక్తమాదౌ ॥

తా. రోతపదార్థదర్శనము వేవిళ్ళు అజీర్ణము శరీరమున కనుగుణ్యముగాని భోజనము గర్భస్థక్రిములు అను నీ 5 కారణములవలన వాతాదిదోషములు ప్రకోపించి 5 ది యగు ఆగంతుకఛర్దిని గలుగంజేయు. మఱియు దీనియందు వాతాది ఛర్దిలక్షణములే గలిగియుండు.

## అసాధ్యఛర్ది లక్షణము.

శ్లో॥ విచ్ఛేదమాత్రాంబు సహానివాయుః స్రోతాంసిసంరుధ్యయ
దోర్ధ్వమేతి । ఉత్పన్నదోషస్య సమాచితంతం దోసము

ద్భవనరస్యకోష్ఠాత్ । వినా త్రయో స్తత్సమగంధ వర్ణం తృట్ శ్వాసకాసా ర్తి యుతం ప్రసక్తమ్ । ప్రచ్ఛర్దయే దుష్ట మిహాతివేకా త్తయార్దితశ్చాశు వినాశమేతి॥

తా. వాయువు పురీషము స్వేదము మూత్రము ఉదకము అనువాని వహింపుచుండు స్రోతస్సులనడ్డగించి ఊర్ధ్వముఖంబై మలమూత్ర అమానగంధ వర్ణములు గలదై దప్పిని శ్వాసమును దగ్గును గలుగం జేయునదియై నరునియొక్క కోష్ఠము లోనుండి లేచి కఫమునుగాని లేక పిత్తమునుగాని పలుమారు కడువేగముగ వమనం బగునటుల జేయుచున్నయది. ఇట్టి వమనముచే పీడితుడుగ నుండువాడు కడుశీఘ్రముగ నశించు.

## వాతఛర్దియందు ఉపచారము.

శ్లో॥ క్షీరోదకసమాపీతా ఛర్ది ర్వాతేనసంభవా ।
ససైంధవంపిబేత్సర్పి ర్వాత ఛర్దినివారణమ్॥

తా. పాలునీళ్ళు పసుపువర్ణము వీనివలె వమనంబైన వాతఛర్దియని తెలియవలయు. ఇది నివృత్తించుటకై నెయ్యిలో సైంధవలవణమును కలిపి సేవింపవలయు.

## వాతఛర్దికి విళంగాదిచూర్ణము.

శ్లో॥ విళంగంసైంధవోపేతం సౌవర్చలకటుత్రయమ్ ।
భక్ష యేన్మధునాచైవ వాతఛర్దిఛిదంజనః॥

తా. వాయువిడంగములు సైంధవలవణము సౌర్చలవణము త్రికటుకములు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి తేనెతో సేవించిన వాతఛర్ది హరించు.

## పిత్తఛర్దియందు ఉపచారములు.

శ్లో॥ [ఆయుర్వేదే] చందనంచాక్షమాత్రంచ నియోజ్యామలకే
రసే । పిబేన్మాక్షికసంయుక్తం పిత్తఛర్దివినాశనమ్॥

తా. అక్షప్రమాణము శ్రీగంధములో ఉసిరికెరసము తేనె కలిపి సేవించిన పైత్యఛర్ది హరించు.

శ్లో॥ హరీతకీనాంచూర్ణంతు లిహేన్మాక్షికసంయుతమ్ ।
అథోర్ధ్వ్వచక్ర తేదోషే ఛర్దిస్తేచవినశ్యతి॥

తా॥ కరక్కాలపొడిని తేనెతో భక్షించిన ఊర్ధ్వాధోగత దోషములు పైత్యఛర్ది హరించు.

కఫఛర్దికి పిప్పల్యాదియోగము.

శ్లో॥ కఫాన్వితాయాంపవనోత్థితాయాం సపిప్పలిసర్షప నింబతోయమ్। పిబేత్తథాసైంధవసంయుక్తం ఛర్ద్యాంకఫామాశయశోధనంతత్॥

తా. పిప్పళ్ళు ఆవాలు సైంధవలవణము వీనిని సమభాగములుగ జూర్ణము చేసి మంచి వేపచెక్క రసముతో సేవించిన శ్లేష్మవాతఛర్ది హరించు. మఱియునిది కఫమును ఆమాశయమును శోధించు.

కఫఛర్దియందు కపిత్థాదికల్పము.

శ్లో. [ఆయుర్వేదే] కపిత్థంమాలతీపత్ర పిప్పలీమరిచాన్వితమ్ ।
శర్కరామధు సంయుక్తం శ్లేష్మఛర్దియుతోజనః॥

తా. వెలగాకురసములో జాజిపువ్వు పిప్పలి మిరియాలు అనువానిచూర్ణము ను పంచదారను తేనెను కలిపి సేవించిన కఫఛర్ది హరించు.

శ్లో॥ [శారీరే] మధునామాతులుంగంచ లాజపిప్పలికాన్వితమ్।
కపిత్థంరజనచూర్ణం కఫఛర్ది వినాశనమ్॥

తా. ఫుల్లమాదీ ఫలపు పండ్లరసము పేలపుసత్తు పిప్పళ్ళు వీనినితేనెతోగాని లేక వెలగపండ్లగుజ్జులో పసపు చూర్ణమును కలిపిగా సేవించిన కఫచర్ది హరించు.

పంచఛర్దులకు పూర్ణచంద్రోదయ సింధూరము.

శ్లో॥ [సింధూరమణిదర్పణే] తుల్యంతుల్యంరసంగంధంఖల్వామధ్యే వినిక్షిపేత్ । కపిత్థమూలసారేణ మర్దితంచదినత్రయమ్ ; వటికాంఛాయయాశుష్కాంభాండమధ్యేవినిక్షిపేత్ । కాచకుప్యాంవినిక్షిప్య వాలుకాభిః ప్రపూరయేత్ । దీపాగ్నాచ స్వాపద్యాపం సాంగశీతంసముద్ధరేత్॥ కపిత్థమూలసారేణ త్రిదినం మర్దయేత్క్రమాత్ । బిల్వమూల కషాయేణ

మర్దయేత్త్రిదినంపునః । చాతుర్జాతకకర్పూర లవంగకుసుమా న్వితం।సర్వంరససమంచైవ మేళయిత్వాథ చూర్ణకమ్ ।। లాజ చూర్ణసితామిశ్రం మధునాసహసేవయేత్ । వల్లద్వయమి దంసూత వమన స్తంభనం తథా । కాసాదిపంచ ఛర్దీనాం హ్యరుచేర్నాశక స్తథా । హృద్రోగంసర్వభంగంచ మందా గ్నించ నివారయేత్ । పూర్ణచంద్రో దయోన్నామ నిర్మిత శ్శూలపాణినా॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసినగంధకము వీనిని సమభాగములుగ ఖల్వము నునిచి వెలగవేళ్ళరసముతో 3 దినములు మర్దించి వటికములుచేసి నీడనెండించి జుకుప్పెలోనునిచి కుండలో నిసుకబోసి దానిపైకుప్పెనునిచి 12 ఝాములు గాగ్నితోవండి సాంగశీతలమున దీసి చూచిన యది సిందూరించు. పిదప దానిని ్వములోనునిచి వెలగవేళ్లరసముతో 3 దినములు మారేడువేళ్ల కషాయముతో 3 ములు మరల మర్దించి అందు సిందూరమునకు సమముగ ఏలకులు * లవంగపు క్క † ఆకుపత్రి నాగకేసరములు పచ్చకర్పూరము లవంగములు అనువానిచూర్ణ ను కలిపి 2 వల్లముల ప్రమాణమును పేలపుసత్తు పంచదార తేనెవీనితో సేవించిన మనము కాసశ్వాసములు పంచఛర్దులు అరుచిహృద్రోగము స్వరభంగము మందాగ్ని ంచు ఇదియ శూలపాణిచే నిర్మింపబడిన పూర్ణచంద్రోదయ సిందూరము.

## ఛర్దులకు ఊషణాదిచూర్ణము.

శ్లో॥ ఊషణాచకపిత్థాబ్ద త్వగేలాపత్రకంసమమ్
సక్షౌద్రంచ రసోరాగ స్సప్తై తేఛర్దినాశకాః ॥

తా. పిప్పళ్ళు వెలగపండ్లగజ్జు తుంగముస్తెలు దాచనచెక్క వెలకులు ఆకు ్రతి సిందూరము అను నీ 7 ద్రవ్యముల జూర్ణముచేసి తేనెలో సేవించిన వాంతి ారించు.

## ఛర్దులకు లాజాదికల్పము.

శ్లో॥ లాజచూర్ణంసితాయుక్తం సిందూరంమధునాసహః ।
లిహ్యాత్సకలరోగేషు చర్దిస్తేనవిశశ్యతి ॥

* ఇదే దాచినచెక్కయనియు జెప్పంబడు.
† ఇదే లవంగపత్రియనియు జెప్పంబడు.

తా. పేలపుసత్తు పంచదార సింధూరము వీనిని తేనెతో సేవించిన సర్వపైత్య వికారములు వాంతి హరించు.

## సర్వఛర్దులకు బిల్వాది లేహ్యము.

శ్లో॥ త్రింశత్పలం బిల్వమూల మర్ద్ధ కుంభాంభ సాపచేత్ । అష్ట భాగావ శేషేస్మిన్ కషాయమవ తారయేత్ । త్రిశత్పలంగు డందత్వా కించిత్పక్వంచ కారయేత్ । త్రిఫలాంశ్శృంగి బేరస్య మరీచస్య చతుష్పలమ్ । పిప్పల్యాః కుడవార్ద్ధంచ చవినాయాః ప్రకుంచకమ్ । ముష్టింతాళిసపత్రస్య ముష్ట్యర్ధంకే సరస్యచ । ద్విపలంపిప్పలీమూలం చిత్రకస్యపలం తథా । పృథక్త్రి జాత కంచైవ కర్షంజీర పలద్వయమ్ । చూర్ణంతస్మిన్ వినిక్షిప్య యుక్త్వాపుష్పరసంక్షి పేత్ ఏతద్బిల్వాదికం లేహ్యం సర్వఛర్ది నివారణమ్ । హృద్రోగ కామిలాగుల్మ గ్రహణ్యారుచిపీనసమ్ । హిక్కాకాస క్రిమిశ్వాస ప్లీ హానాహగరామయాన్ । అర్శాంసి పాండురోగంచ హన్యాత్కాలేనిషేవితః ॥

తా. 30 పలములు మారేడువేళ్ళను చిదియగొట్టి 1 భాండములోవైచితూమెడునీళ్ళుబోసి 8 వభాగముగ కషాయముకాచి అందుబెల్లము 30 పలములుకలిపిచిక్కగకాచి పిదప యందు శొంఠిచూర్ణ 3 పలములుమిరియాలచూర్ణము 4 పలములుపిప్పలిచూర్ణము 2 పలములు చెవ్వపుచూర్ణము 1 పలము తాళిసపత్రిచూర్ణము 1 పలము నాగకేసరములచూర్ణ ½ పలము మోడిచూర్ణము 2 పలములు చిత్రమూల చూర్ణము 1 పలము ఏలకులచూర్ణము 1 పలము లవంగపుచెక్కచూర్ణము 1 పలము ఆకుపత్రిక చూర్ణము 1 పలము జీలకఱ్ఱచూర్ణము 2 పలములవైచి బాగుగ కలియబెట్టి కించిదుష్ణముగనుండు నపుడందు తేనెబోసి బాగుగకలిపి యథోక్తకాలమున సేవింపుచుండిన సర్వఛర్దులుహృద్రోగము కామిలగుల్మము గ్రహణిఅరుచి పీనసము ఎక్కిళ్లుకాసము క్రిమిరోగము శ్వాసము ప్లీహారోగము కడుపుబ్బరము విషదోషము మూల రోగము పాండువు హరించు.

## సర్వఛర్దులకు లఘుబిల్వాదిలేహ్యము.

శ్లో॥ బిల్వార్ధాఢకమంభసోర్ధకల శేషక్వా చతుర్థాంశకమ్ ।

తస్మిన్ జీర్ణగుడంచషోడశపలం మిశ్రీకృతంచూర్ణితమ్ ।
కర్షాంశంఘనధాన్యజీరకత్రుటి త్వక్కేసరత్ర్యూషణమ్।
లీఢంచర్ద్యరుచిప్రసేకశమనం శ్వాసాగ్ని మాంద్యంజయేత్ ॥

తా. 32 పలములు మారేడువేళ్ళనుదంచితూమెడునీళ్ళుబోసి 5 వభాగముగ కషాయము కాచి అందు ప్రాతబెల్లము 16 పలములుకలిపిలేహ్యపక్వముగకాచిఅందు తుంగముస్తెలు కొత్తిమిర్లు జీలకఱ్ఱ ఏలకులు దాచినచెక్క నాగకేసరము త్రికటుకములు అనువాని చూర్ణమును దినుసుకు 1 పలము చొప్పున వైచి బాగుగకలియబెట్టి సేవించిన సర్వవాంతులు అరుచి ఎల్లప్పుడు నోట నీరుగారుట శ్వాసము అగ్నిమాంద్యము హరించు.

## ఛర్దులకు కృష్ణాదికల్పము.

శ్లో॥ కృష్ణాలాజకపిత్థామ్ల కోలమజ్జాత్రిజాతకైః ।
వాసాపుష్పోద్భవంవారి గుడూచికాండజంజలమ్।
సక్షౌద్రస్సాధితోయోగ స్సర్వచ్ఛర్ది నిబర్హణః॥

తా. అడ్డసరపువ్వుల రసములోగాని లేక తిప్పతీగె రసములోగాని పిప్పళ్ళు పేలపుసత్తు వెలగగుజ్జు రేగుపప్పు ఏలకులు లవంగపుచెక్క ఆకుపత్రి అనువాని చూర్ణమును తేనెను కలిపి సేవించిన సర్వఛర్దులు హరించు.

## ఛర్దులకు కార్పాసాస్థికల్పము.

శ్లో॥ కార్పాసాస్థిత్రుటీకృష్ణా రాజచూర్ణేనశర్కరామ్ ।
లిహ్యాచ్ఛర్దివినాశాయ రహస్యమిదముత్తమ్॥

తా. ప్రత్తిగింజలపలుకులు ఏలకులు పిప్పళ్ళు పేలపుపిండి వీనిచూర్ణమును సమభాగములుగ కలిపి సేవించిన ఛర్ది హరించు. ఇది రహస్యమైన క్రియ. (తెల్లని జున్నువలె వమనంబగుచుండిన శుద్ధిచేసిన హరిదళమును ఆవువెన్నతోనూరి వస్త్రమునకు పట్టించి వర్తిజేసి దీపము ముట్టించిన యందు తైలము స్రవించు. దాని తమలపాకుయందు లేపనముచేసి భక్షించిన తెల్లనిజున్నువలె వమనంబగుట హరించును.)

## ఛర్దులయందు లేపనము.

తే-గీ॥ నెమలియీకమసియును విమలముగను

వసుధజెంగల్వ క్రోష్టువు మసియుఁగూర్చి।
గవ్వబూడిదె దేనెయుఁ గలిపికంఠ।
మందుఁబూసినవాంతులు మానునపుడు।

ఛర్ద్యయం దనుపానములు.

శ్లో॥ [నిత్యనాథీయే] జాతీవలవంగకంలాజమధు శర్కరామధు ।
పథ్యాగుళూచికాసత్వ మేలావైకాంజికంతథా ।
మాతులుంగం కపిత్థంచ బిల్వమూలంకరంజకమ్ ।
ఏతానివాంతినాశాయ రసరాగానుపానతః॥

తా. జాజికాయలు లవంగములు పేలాలు యష్టిమధుకము పంచదార తేనె కరక్కాయలు తిప్పసత్తు ఏలకులు కలి మాదీఫలరసము వెలగపండు మారేడువేరు కానుగచెక్క వీనిని సిందూరసేనన కాలంబున ఛర్ది రోగములయందును పానములుగ నునిచికొనవలయు.

ఛర్దులకు ఏలాదిచూర్ణము.

శ్లో॥ ఏలాలవంగ గజకేసరకోల మజ్జాలాజప్రియంగు ఘనచందన * పిప్పలీనామ్ । చూర్ణంతథాచమధునా సహసేవ్య మాన ఛర్దింనిహంతి కఫమారుత పిత్తజాతామ్॥

తా. ఏలకులు లవంగపత్రి నాగకేసరములు రేగుపలుకులు పేలపుసత్తు ప్రేంకణము తుంగముస్తెలు చందనము పిప్పళ్ళు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి తేనెతో సేవించిన శ్లేష్మవాత పిత్తములవలన జనించిన ఛర్ది హరించు.

ఛర్ద్యరోచకమునకు కుస్తుంబరీలేహ్యము.

శ్లో॥ ఘృతేకుస్తుంబరీచూర్ణం పాచయేచ్ఛర్కరాయుతమ్ ।
ఏలామరిచసంయుక్తం ఖాదేదరుచివాంతయే॥

తా. కొత్తిమెర్లు ఏలకులు మిరియాలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి పంచదార నెయ్యిగలిపి లేహ్యపక్వముగవండి సేవించిన అరోచకఛర్ది హరించు.

* చంద్రహాసమ్ ॥ చూర్ణేకృతం - పచ్చకర్పూరము.

## ఛర్ద్యరోచక హర యోగములు,

శ్లో॥ [మాధవనిదానే] భ్రిష్ట కుస్తుంబరీకంచ నిస్తుషం శర్కరా
యుతం। ఖాదేదరుచి శాంత్యర్థ మార్ద్రికంవాసమాక్షికమ్ ॥

తా. పొట్టు తీసివేయించిన కొతిమెర్ల చూర్ణములో పంచదారగలిపి సేవించి
నను లేక అల్లపుముక్కలు తేనెలో నానబెట్టి భక్షించినను అరుచి ఛర్ది హరించు.

## ఛర్ద్యరోచకమునకు ధాన్యక లేహ్యము.

శ్లో॥ ధాన్యకంజీరకసితా ఘృతమగ్నివి పాచితమ్ ।
అరుచేర్దోషశమనం వాంతిపి_త్తవినాశనమ్ ॥

తా. కొతిమెర్లు జీలకఱ్ఱ వీనిని సమభాగములుగ చూర్ణముచేసి పంచదార
ఆవునెయ్యి కలిపి లేహ్యపక్వముగ వండి సేవించిన ఛర్ది వాంతి పి_త్తము హరించు.

## * ఛర్ద్యరోచకమునకు ఖండార్ద్రిక లేహ్యము

శ్లో॥ విత్వగార్ద్రిక ఖండాంశ్చ సూక్ష్మాన్ పశ్చాచ్చ కారయేత్ ।
పలషోడశకంయావ ద్గవ్యసర్పిషిభర్జయేత్ । పలద్వాదశకే
యావ ద్గౌరవర్ణం భవే_త్తతః । చూర్ణమావాప్య మారీచం
నిష్కద్వాదశ మానతః । కృష్ణాష్టనిష్కం తస్మాలం చతు
ర్నిష్కద్వాదశమావపేత్ । వంశాఖ్య జాతిఫలయో_స్త్రుటి
శుంఠ్యోః పృథక్పృథక్ । చిత్రకం దశనిష్కంహ్యా త్పశ్చా
త్ఖండస్యషోడశ । పలాని సమ్యగాలోఢ్య చుల్ల్యా ఉద్ధృత్య
తత్పునః । ప్రాతఃకాలేచైకకర్షం హన్యాచ్ఛర్ది మరోచకమ్।
దీపనస్యక్షయంహన్యా త్పాచనంపుష్టి వర్ధనమ్ । రాజ్ఞాంచ
సుకుమారాణాం ప్రశ_స్తం చానుపపి_త్తకే ॥

తా. 16 పలములు పొట్టునొలిచిన సూక్ష్మపు అల్లపుతునకలను 12 పలము
యావునేతితో నెఱ్ఱగవేయించి అందు మిరియముల చూర్ణము 12 నిష్కములు పిప

* ఈ లేహ్యపాక కాలంబున తొలుత పంచదారను పాకపట్టి పిదప
చిన అల్లపుతునకలను తక్కిన వానిచూర్ణములువైచి వండి పొయిమీదనుం
నెయ్యిబోసి బాగుగ కలయబెట్టవలయు.

చూర్ణము 8 నిష్కములు శొంఠిచూర్ణము 4 నిష్కములు వెదురుబియ్యములు లేక వెదురుప్పు జాజికాయ ఏలకులు శొంఠి అనువానిచూర్ణము దినుసుకు 4 నిష్కములు చిత్రమూలముచూర్ణము 10 నిష్కములు పంచదార 16 పలములు కలిపి లేహ్యపక్వముగ వండి బాగుగ కలియబెట్టి ప్రాతఃకాలమున కర్షప్రమాణమును సేవింపుచుండిన ఛర్ద్యరోచకము అగ్నిమాంద్యము వాంతి అమ్లపిత్తము హరించుటయే గాక పాచనము బలమును గా గలుగు. ఇది రాజులకును కుమారులకు ప్రశస్తము.

## మూర్ఛానిదానము.

శ్లో॥ క్షీణస్యబహుదోషస్య విరుద్ధాహారసేవినః । వేగాఘాతాద భీఘాతా ద్దీనసత్వస్యవాపునః । కరణాయతనేషూ గ్రాబాహ్యే ష్వాభ్యంతరేషుచ । నివిశంతేయదా దోషాత థామూర్ఛంతి మానవాః । సంజ్ఞావహాసు నాడీషు పిహితాస్వ నిలాదిభిః । తమోఽభ్యుపైతిసహసా సుఖదుఃఖవ్యపోహకృత్ ॥ సుఖదుఃఖవ్యపోహాశ్చ నరఃపతతి కాష్ఠవత్ మోహోమూర్ఛేతితాంమాహు షడ్విధానాప్రకీర్తితా । వాతాదిభి శ్శోణితేన మద్యేనచ విషేణచ ॥ షట్స్వప్యేతాసు పిత్తంతు ప్రభుత్వేనావతిష్ఠతే ॥

తా. క్షీణుడై పలుదోషములతో గూడియుండు నరుడు విరుద్ధాహారములసేవించుటవలన మలమూత్రముల బంధించుటవలన కాష్ఠాదులచే నభిఘాతము జెందుటవలన లేక సత్వగుణక్షయముగల నరునియొక్క శ్రోత్రాది బాహ్యేంద్రియములయందు అభ్యంతర మనోవహ నాడీలయందు లేకకర్మేంద్రియ జ్ఞానేంద్రియ ములయందు వాతాది దోషములు ప్రవేశించుటవలన మనుజుడు మూర్ఛంజెంద సుఖదుఃఖ జ్ఞానరహితుండై భూమిపై కాష్ఠమువలె ద్రెళ్లు. (మూర్ఛయనగా సంజ్ఞావహ నాడులయందు వాతాదిదోషము లాచరించుటవలన సుఖదుఃఖ జ్ఞానమును నష్టపరచెడి అజ్ఞానం బకస్మాత్తుగ ప్రాప్తంబగుటయు. ఇది వాతజమూర్ఛ పిత్తజమూర్ఛ శ్లేష్మజమూర్ఛ రక్తమూర్ఛ విషజమూర్ఛ మద్యజమూర్ఛ అన 6 విధంబులు. ఈ 6 మూర్ఛలయందును పిత్తము రాజుగనుండు.

## పూర్వరూపము

శ్లో॥ హృత్పీడాజృంభణంగ్లాని స్సంజ్ఞాదౌర్బల్యమేవచ ।
సర్వాసాంపూర్వరూపాణి యథాస్వంచవిభావయేత్॥

తా. హృదయమున పీడ ఆవలింతలు వమనము బడలిక భ్రాంతి -అనునవిసర్వమూర్ఛలకు పూర్వరూపములు. ఈమూర్ఛలక్షణములు వాతాది భేదములవలన తెలియవలయు,

## వాతజమూర్ఛా లక్షణము.

శ్లో॥ నీలంవాయదినాకృష్ణమాకాశమథవారుణమ్ ।
పశ్యం_స్తమః ప్రవిశతి శీఘ్రంచ ప్రతిబుధ్యతే ।
వేపథుశ్చాంగమర్దశ్చ ప్రపీడాహృదయస్యచ ।
కార్శ్యంశ్యావారుణాఛాయా మూర్ఛాయేవాతసంభవే॥

తా. ఆకాశమును నీలవర్ణముగ నల్లగలేక ఎఱ్ఱగగాంచుట మూర్ఛిల్లుట కడు శీఘ్రముగ తెలియవచ్చుట శరీరము వణుకుట ఒడలు విరుచుట మిక్కుటముగ ఱొమ్ము నొచ్చుట శరీరము కృశించుట శరీరవర్ణము నల్లగగాని లేక నీలముగగాని వుండుట ఈలక్షణములు గలది వాతజమూర్ఛయని తెలియవలయు.

## పి_త్తజమూర్ఛా లక్షణము.

శ్లో॥ ర_క్తహారిత వర్ణంవా వియత్పీత మథాపివా ।
పశ్యం_స్తమః ప్రవిశతి సస్వేదశ్చ ప్రబుధ్యతే॥
సపిపాసస్స సంతాపోర_క్తపీతా కులేక్షణః ।
సంభిన్నవర్చాః పీతాభో మూర్ఛాయే పి_త్తసంభవే॥

తా. ఆకాశమును యెఱ్ఱగ లేక ఆకుపసపువర్ణముగ లేక పసపువర్ణముగగాంచి తక్షణమున మూర్ఛిల్లుట తెలివి గలుగునపుడు చెమట దప్పి సంతాపము గలుగుట నేత్రములు యెఱ్ఱగ లేక పసుపువర్ణముగనుండుట మలము పచ్చగ వెడలుట శరీర కాంతి పసపువర్ణముగ నుండుట ఈ లక్షణముగలది పి_త్తజమూర్ఛయని తెలియవలయు.

## కఫజమూర్ఛా లక్షణము.

శ్లో॥ మేఘసంకాశ మాకాశ మావృతంవాతమోఘనైః ।

పశ్యాం స్తమః ప్రవిశతి చిరాచ్చ ప్రతిబుధ్యతే ।
గురుభిః ప్రావృతైరంగై ర్యద్వైవా ర్ద్రేణచర్మణా॥
సప్రసేకస్స హృల్లాసో మూర్ఛాయే కఫసంభవే ।

తా. మేఘములచే లేక చీకటిచేగాని గప్పంబడినటుల ఆకాశమును గాంచి తత్క్షణమున మూర్ఛిల్లి దీర్ఘకాలము విూద తెలివినిజెందుట శరీరముపై దట్టమైనవస్త్రగాని వేక పచ్చిచర్మముగాని కప్పంబడినటులుండుట ముఖమువలన చొంగకారుట వాంతివచ్చునటులుండుట ఈలక్షణముగలది కఫజమూర్ఛయని తెలియవలయు.

## సన్నిపాతజమూర్ఛా లక్షణము.

శ్లో॥ సర్వాకృతి స్సన్నిపాతా దపస్మార ఇవాగత ।
సజంతుం పాతయత్యాశు వినాబీభత్సచేష్టితైః॥

తా. వాతపిత్తశ్లేష్మలక్షణయుక్తంబై నోట నురుగుకారుట వండ్లుకొరుకుట నేత్రములు త్రిప్పుట ఈమొదలగు అపస్మారలక్షణ విహీనంబై 2 వ అపస్మారము వలె నుండునది సన్నిపాతజమూర్ఛ యనంబడు. (ఇది వాతాది మూర్ఛలలో అంతర్భావము జెందియుండుటవలన ఆరుగ గణనము చేయబడియె.)

## రక్తజమూర్ఛా సంప్రాప్తి.

శ్లో॥ పృథివ్యాప స్తమోరూపం రక్తగంధ స్తదన్వయః।
తస్మాద్రక్తస్య గంధేన మూర్ఛంతి భువిమానవాః ।
ద్రవ్యస్వభావ ఇత్యేకే దృష్ట్వాయ దభిముహ్యతి॥

తా. పృథ్వీ ఉదకములు తమోగుణ విశిష్టములు మఱియు రక్తముయొక్క గంధమును పృథ్వీ ఉదకసంబంధముగలదిగ నుండుటంజేసి తమోగుణ విశిష్టంబు దానంజేసి తామస ప్రాధాన్యముగలవారలు రక్తగంధమువలన మూర్ఛం జెందెదరు. రక్తగంధము రాక రక్తమును చూచిన మాత్రముననే మూర్ఛిల్లుట ద్రవ్య స్వభావ గుణమని కొందరు వచించెదరు.

## విషమద్యజనిత మూర్ఛావివరణము.

శ్లో॥ గుణాస్త్రీప్రతరత్వేన స్థితాస్తువిషమద్యయోః ।
తఏద తస్మాదాభ్యాంతు మోహాస్యాతాం యథేరితౌ॥

తా. తైలాగులయరదు (శ్లో॥ లఘుగాత్యమాశువిశదం వ్యవాయి తీక్ష్ణంవికాసి సూక్ష్మంచ। ఉష్ణమనిర్దేశ్యరసం దశగుణయుక్తం వినంతతేక్షే॥ అనగా లఘు రూక్షాశువిదశ వ్యవాయి తీక్ష్ణ వికాసి సూక్ష్మ ఉష్ణ అనిర్దిశ్యరసమువలన నీ 10 గుణంబులలో కొన్ని తీవ్రముగనుండుటవలన మూర్ఛ గలుగకుండు. మఱియు పై జెప్పబడిన 10 గుణంబులు విషమద్యములయందు కడుతీవ్రతరములుగ నుండుటవలనపై జెప్పబడిన ప్రకారము మోహముగలుగు. విషమద్యములలో విషము జీర్ణము జెందకుండు. దానంజేసి విషసంబంధమువలన జనించిన మోహము స్వయముగ వదలక బాధింపుచుండు. మద్యము జీర్ణముజెందు దానంజేసి మద్యమువలన జనించిన మోహము స్వాభావికముగ శాంతము జెందు.

## రక్తజాది మూర్ఛాలక్షణము.

శ్లో॥ స్తబ్ధాంగదృష్టిస్త్వసృజా గూఢోచ్ఛ్వాసశ్చమూర్ఛితః।
మద్యేనవిలపఞ్శేతే నష్టవిభ్రాంతమానసః।
గాత్రాణివిక్షిపఞ్భూమౌ జరాంయావన్నయాతితత్।
వేపథుస్స్వప్న తష్ణాస్స్యుస్తమశ్చవిషమూర్ఛితే।
వేదితవ్యంతీవ్రతరం యథాస్వంవిషలక్షణైః॥

తా. శరీరము నేత్రములు స్తంభించుట శ్వాసము అస్పష్టముగ వెడలుటమద్యపానమువలన తెలుచుగ మాటలాడుట నిద్రించుట స్మృతిలేకుండుట భ్రమించుట మద్యముజీర్ణముకాకుండు వరకు భూమిపైబడి కాళ్ళనుచేతులును గొట్టుట ఈలక్షణములుగలది రక్తజమూర్ఛయని తెలియవలయు. కంపము నిద్రదప్పి అజ్ఞానము అనువానితోగూడినదై సుశ్రుతకల్పస్థానమున జెప్పంబడిన మూల పత్ర క్షీరాదిసేవన వలన జనించెడి విషలక్షణయుక్తంబై యుండునది విషజమూర్ఛ యనంబడు.

## మూర్ఛా భ్రమ తంద్ర నిద్ర అనువానిభేదములు.

శ్లో॥ మూర్ఛాపిత్త తమఃప్రాయా రజఃపిత్తా నిలాద్భ్రమః।
తమోవాత కఫాతంద్రా నిద్రాశ్లేష్మ తమోభవా॥

తా. మూర్ఛారోగమున పిత్తతమోగుణములు ప్రబలముగనుండు. రజోగుణ పిత్తవాతముల వలన భ్రమగలుగుతమోగుణ వాతకఫమువలన తంద్రగలుగు. కఫము తమోగుణము అనువానివలన నిదురగలుగు.

## తంద్రాలక్షణము.

శ్లో॥ ఇంద్రియార్థేష్వసం ప్రాప్తి ర్గౌరవంజృంభణంక్లమః ।
నిద్రార్తస్యేవయస్యైతే తస్యతంద్రాంవినిర్దిశేత్॥

తా. ఇంద్రియములకు స్వస్వవిషయ గ్రాహికశక్తి విహీనత శరీరగౌరవము ఆవులింతలు బడలిక అనునవి నిద్రార్త పురుషునికి గలుగునటుల జాగ్రదవస్థయందుండువానికి గలిగిన తంద్రయని జెప్పంబడు. (చరకే॥ శ్లో॥ యదాతు మనసిక్లాంతే కర్మాత్మానః క్లమాన్వితాః।విశయేభ్యో నివర్తంతే తదా స్వపితిమానవః ॥ అనగా నెపుడు మనస్సు ఇంద్రియములు బడలి విషయగ్రాహకశక్తి విహీనంబులుగ నుండెడినో అపుడు నిద్రగలిగినదని తెలియవలయు.) (భ్రమయొక్క లక్షణము ప్రసిద్ధంబగుటయే ననట జెప్పంబడదయ్యె.)

శ్లో॥ దోషేషుమదమూర్ఛాద్యా గతవేగేషు దేహినామ్ ।
స్వయమేవోపశామ్యంతి సన్యాసోనౌషధైర్వినా॥

తా. దోషములయొక్క వేగము శమించిన మదమూర్ఛాదులు తమంతటతామే శమించు. మూర్ఛాది వ్యతిరిక్త సన్యాసమునందైతేనో దోషములయొక్క వేగము ఔషధములేకనే శమించనేరదు.

## సన్యాసలక్షణము.

శ్లో॥ వాగ్దేహమనసాంచేష్టా ఆక్షిప్యాతిబలామలాః ।
సన్యస్యంత్యబలంజంతుం ప్రాణాయతనమాశ్రితాః ।
సనాసన్నంనాసన్యస్తః కాష్ఠీభూతోమృతోపమః ।
ప్రాణైర్విముచ్యతేశీఘ్రం ముక్త్వాసద్యఃఫలాంక్రియామ్।

తా. కడుబలిష్ఠమైన దోషము వాగ్దేహ మనోవ్యాపారములకు ప్రతిబంధమును గలుగంజేసి హృదయమున నెలకొని దుర్బలులైనవారిని మోహింపంజేయునదిసన్యాసమనంబడు. దీనివలన పీడితుడుగనుండువాడు భూమిపై కొయ్యవలెద్రెల్లు. దీనియందుమూలతో పొడుచుట యంత్రములలో త్రిప్పుట దీపపువత్తిని ముట్టించి దానిపొగనునాసికాద్వారములయం దునుచుట యీమొదలగు చికిత్సలను చేయవలయు. అట్లు చేయని యెడల శీఘ్రముగా మృతిజెందు.

## సర్వమూర్ఛలకు శిరీషబీజాద్యంజనము.

శ్లో॥ శిరీషబీజం సింధూత్థం వచామారీచ నూగాధి ।
మనశ్శిలాం సమంచైవ బస్తమూత్రేణ పేషయేత్ ।
తత్కల్కేనాంజయేన్మూర్ఛాం సన్నిపాతోద్భవాంజయేత్ ॥

తా. దిరిసెనవిత్తులు సైంధవలవణము వస మిరియాలు పిప్పళ్ళు రక్తమణిశిల వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గొర్రెమూత్రముతో మర్దించి కల్కము చేసి కన్నుల బెట్టి సన్నిపాతమూర్ఛహరించు.

## వాతాదిస్వస్థా స్వస్థతాలక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] దోషాయుక్తశ్చ సుఖకృ ద్ధోషోయుక్తో సుఖాపహః । హృదయే నాభిమధ్యేచ జాయతే పిత్తకోపతా ॥

తా. వాతపిత్తశ్లేష్మములు తమతమ స్థానములయందుండి శరీరము సుఖకరముగనుండు. లేక ఒకటితోనొకటి గలసియుండిన అనేకరోగముల గలుగంజేయు రొమ్ము బొడ్డుగ వీని నడుమ గుబులు జనించినపిత్తము ఊర్ధ్వగతమైనదని తెలియవలయు. ఇదికష్టసాధ్యము. (ఇది నివర్తించుటకై బడబాగ్నిరసము గానిలేక ప్రాణబద్ధరసమునుగాని లేక పైత్యాంతకరసమును గాని లేక ఆముదము తిప్పసత్తు మిరియమును గానిలేక గచ్చపలుకులను గాని లేక చిన్నంగిరసములో నెయ్యిమిరియపుచూర్ణము చింతపులుసు అనువానిని కలిపిగాని సేవింపవలయు మఱియుదీనియందుపిత్తాంతకరసముమహాద్రాక్షాదిచూర్ణము ప్రసిద్ధము గాన సేవింపవలయు.)

## పిత్తప్రకోప కారణము.

శ్లో॥ అతికట్వామ్ల తీక్ష్ణోష్ణ శుష్కశాకా త్పురాన్నత । విషమశన క్రోధాగ్ని ధూమఘర్మాధ్వ సేవనాత్ । శరద్గ్రీష్మౌగమేపిత్తప్రకోపో జాయతేనృణామ్ । వాంతిభ్రాంతి క్లమామూర్ఛా ప్రలాపోతి శిరోరుజా । దాహోరుచి స్తృషా దోషాః పిత్తాత్స్యు రతిదారుణాః । శీతలై ర్మధురాహారై స్స్నానపానై రుపాచరేత్ ॥

తా. కడుచేదు పులుసు తీక్ష్ణపదార్థములు ఉష్ణపదార్థములు ఎండిన కూరలు దుష్టాన్నము అనువాని సేవనవలన విషమాశనము కడుకోపము అగ్నితాపము పొగ ఎండ మార్గమునడుచుట అనువానివలన శరద్గ్రీష్మకాలములవలన పైత్యము ప్రకోపించి వాంతి భ్రాంతులు బహలిక మూర్ఛ ప్రలాపము తలనొప్పి తాతము అరుచి దప్పిఅను లక్షణములతో గూడినవై దారుణములగు 24 పైత్యరోగముల జనింపంజేయు. వానియందు శీతలద్రవ్య సేవన మధురద్రవ్యములయొక్క సేవన స్నానపాన ములు హితకరంబు.

శ్లో॥ [మతాంతరే] శిరోర్తిమూర్ఛావమిదాహ
మోహాః కంపోతి శోషారుచిపర్వభేదాః ।
ఉన్నిద్రతాతృడ్భ్రమరోమహర్ష జృంభాతివాక్చాపిమదశ్చపిత్తే॥

తా. తలనొచ్చుట మూర్ఛవాంతి మోహము కంపము కడుశోష అరుచిగలుగుట వ్రేళ్లగణుపులు నొచ్చుటనిదురబట్టకుండుట(మిక్కుటముగ ఆకలిగలుగుట)దప్పి భ్రమగలుగుట శరీరము గగుర్పొడుచుట ఆవలింతలు గలుగుట త్వరపడి మాటలాడుట ఈలక్షణములుగలది పైత్యరోగమని తెలియవలయు. (పైజెప్పబడిన పిత్తరోగ నిదానాదుల బాగుగ సెఱింగి చికిత్సింపవలయు.)

వాతపైత్యగుణులుగల రోగములకు త్రివిక్రమరసము.

శ్లో॥ [సిద్ధసార్ణవే] సూతంగంధం మృతంతామ్రం శిలాతాంచ ।
శోధితమ్ । కృష్ణానాగ బలాపథ్యా శ్రీఖండంచ విదారికా ।
ఏరండం మర్దయేతుల్యాం ద్రవైశాగ్ని పునర్నవైః ।
నిష్కప్రియాంత్రాం వటీంఖాదే ద్వాతపిత్త హరంభవేత్ ॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన గంధకము తామ్రభస్మము శుద్ధిచేసిన శిలాజిత్తు శుద్ధిచేసిన తాళకము పిప్పళ్లు చిబిలిక వేళ్లు కరక్కాయలు శ్రీగంధము నేలగుమ్మడు గడ్డ ఆముదపువేరు వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి చిత్రమూలగసముతోను గలిజేరువేళ్లరసముతోను మర్దించి నిష్కప్రమాణము మాత్రలుజేసి తేనెతోను సేవించిన వాతపిత్త సంకలిత రోగములు గుణులుగలరోగము హరించు. (లేక యిదినివర్తించుటకై పైత్యాంతకరసమునుగాని లేక ద్రాక్షాదిచూర్ణమునుగాని సేవింపందగు.)

## వాతపైత్యమూర్ఛలకు ప్రచండభైరవరసము.

శ్లో॥ ॥ [సిద్ధరసార్ణవే] పలానిపంచ్యసూతస్యపలం వై తామ్రచూర్ణ
కమ్ । జంబీరాణాంద్రవై పిష్టం సూతతుల్యంచ గంధకమ్ ।
నాగవల్లీద్రవై పిష్టంతామ్రపాత్రే ప్రదాపయేత్ ।
రుద్ధ్వాలఘువుటేపాచ్యంత్ర్యూషణైస్సమమిశ్రితమ్
అర్ధాంగకంపకాతార్తో భక్షయేత్తుద్విగుంజతమ్ ।
దాహసంతాపమూర్ఛాను వాయుపిత్తసమన్వితే॥

తా. శుద్ధిచేసిన రసము 5 భాగములు తామ్రభస్మము 1 భాగము శుద్ధిచేసిన గంధకము 5 భాగములు ఇటుల వీనిని ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసము తమలపాకురసము వీనితోమర్దించి తామ్రపాత్రలోగాని (లేకకుప్పెలోగాని) యునిచి దానిమూతిని మూసి లఘువుటంబిడి చూర్ణముజేసి దానికి సమముగ త్రికటుకచూర్ణమును గలిపి 2 గురిగింజల యెత్తును సేవించిన అర్ధాంగవాతము కంపవాతము దాహముశరీరతాపము మూర్ఛ వాత పైత్య సంకలిత రోగములు (గుబులుగల రోగములు) హరించు.

## వాతశ్లేష్మసంకలితమునకు గగనగర్భికారసము.

శ్లో॥ సూతాభ్రతీక్ష్ణతామ్రంచ మృతతాళక గంధకమ్ ।
భార్గీశుంఠీవచాధాన్యా కట్ఫలంచవిషాభయమ్ ।
మర్ద్యంపర్పటికాద్రావై ర్నిష్కం వై భక్షయేద్వటీమ్ ।
వాతశ్లేష్మరహాత్యాశు వటిగగనగర్భికా॥

తా. రసభస్మము అభ్రకభస్మము ఉక్కుభస్మము తామ్రభస్మము శుద్ధిచేసిన తాళకము శుద్ధిచేసిన గంధకము గంటుభారంగి శొంఠి వస కొత్తిమెర్లు గుమ్ముడుతేకు శుద్ధిచేసిన నాభి కరక్కాయలు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి పర్పాటక రసముతో మర్దించి నిష్కప్రమాణము మాత్రలుచేసి తేనెతో సేవించిన వాతశ్లేష్మ సంకలిత రోగములు హరించు.

## వాతపైత్య మూర్ఛాహార కల్పములు.

క॥ కానుగవిత్తులుపిప్పలి । వేనీళ్ళను నూరిద్రాగ వేగమెపుటిడా ।
మేనసువంటివమూర్ఛల । నానాఁటనుసంహరించునయగుణశీలా॥

తే-గీ॥ బొడ్డుకాకరగడ్డను బొడియుఁ జేసి ।
గలిపినీటనుద్రావంగఁ గడిదియైన ।
మూర్ఛగణముల నిర్మూలముగహరించు ।
నగ్గిమీఁదతలుపడిద్రుగ్గి నట్లు వేగ॥

క॥ శ్రీగంధరేలగంధము । బాగుగమఱి చారెడేసి భక్షణసేయన్ ।
నాగాభరణునికృపచే। వేగంబునమానుమూర్ఛ వితతులుధాత్రిన్॥

(మణుగు నెమలివేళ్ళచెక్క మణుగు వావిలివేళ్ళు ఆయాకు అడ్డెడు తెల్లపులవలు ఇవి కూడా కుండను బెట్టి నలుతూముల నీళ్ళుబోసి అష్టావశేషము గాక షాయము గాచి అది వడియబోసి అందు 2 సేర్లు నూనెబోసి అదిలేహము గాను వండి ఘృమొత్తు మాడయెత్తు వెల్లుల్లిపాయలముద్ద కలిపి 6 నెలలు సేవించేది. మూర్ఛకుండేటి లెవులు తీపుగల వాతములు మానును. ఆకు దీసిన ఉలవపప్పు మునుగకూర కందిపప్పు సేవించేది. ఈ యోగము మాకు లభించిన గ్రంథములయందు సంస్కృత శ్లోక విహీనంబై ఔషధ సిద్ధిగ ననుగుణ్యంబై గన్పట్టుచుండినను గ్రంథస్థంబగు దాని వదల నేరక యిందు ముద్రించినారము.

శ్లో॥ ముండీపంచాంగచూర్ణంవా పిత్తరోగం వినాశమేత్ ।
తచ్చూర్ణంక్షీరమధునా సర్వమూర్ఛాహరంపిబేత్ ॥

తా. కర్షప్రమాణ బోడతర సమూల చూర్ణము ఆవుపాలతోగాని లేక తేనెతోగాని ప్రత్యహము సేవింపుచుండిన సర్వమూర్ఛలు ఆయారోగములు హరించు.

## మూర్ఛలకు నస్యము.

శ్లో॥ [నిత్యనాథీయే] మధూకపిప్ప సితయాచయుక్తం స్తన్యేన
నస్యం వినిహంతిమూర్ఛామ్॥
స్తన్యేనమిఠుస్వరసేననస్యంసచందనంచైవ నిహంతిమూర్ఛామ్॥

తా. ఇప్పపిండి పంచదార వీనిని చనుబాలతోనూరి నస్యముజేసినను లేక చను బాలు చెఱుకు రసము శ్రీగంధము వీనిని నస్యముజేసినను మూర్ఛహరించు.

శ్లో॥ [ఆయుర్వేదే] కుంకుమంశర్కరాయుక్తం ఘృతేన పయసాత
ధా । మూర్ఛావికారదోషఘ్నం వాయుజోన్మాదపిత్తజిత్ ॥

తా. కుంకుమపువ్వు పంచదార ఆవునెయ్యి ఆవుపాలు వీనిని నస్యముగాని లే క సేవనగాని జేసిన మూర్ఛ వాతోన్మాదము పిత్తము హరించు.

శ్లో॥ నారీపయస్సమమధుం శర్కరాయూతీకంఘృతమ్ ॥
మూర్ఛామదవికారఘ్నం వాయుజోన్మారపిత్తజిత్ ॥

తా. చనుబాలు యష్టిమధుకము పంచదార తేనె నెయ్యి నస్యముజేసినమూ ర్ఛమదము వాతోన్మాదము పిత్తము హరించు.

శ్లో॥ కుంకుమంఘృత సంయుక్తం మూర్ఛా పిత్తవి కారనుత్ ।
శిరోభ్రమహరం శ్రేష్టం నస్యంవై నాత్రసంశయ ॥

తా. కుంకుమపువ్వును అవునేతితోనూరి నస్యముజేసిన మూర్ఛ పిత్తము తల తిరుగుట నిస్సంశయముగ హరించు.

క॥ జిల్లేడు కొనలరసమును ।
సల్లలితముముక్కుదొండ్ల సరగునఁబోయన్ ।
వెల్లియగుమూర్ఛరోగము ।
తెల్లనుదామూనుసుమ్మి యిలలోవెలయన్ ॥

పైత్యరోగములయందు పథ్యము.

శ్లో॥ పురాణశాలిగోధూమ పటోలంతండు లీయకమ్ ।
ధాత్రీవయస్థార్ఘురసీ ద్రాక్షాదాడిమచందనమ్ ।
చతుర్వింశతిపైత్యేతు సేవితంచ హితంసదా ॥

తా. ప్రాతవడ్లు గోధుమలు పొట్లకాయి చిత్తికూర ఉసిరికపప్పుపొన్నగంటి కూరచాతలాసికూర ద్రాక్షపండు దానిమ్మపండు శ్రీగంధము ఇవి24 పైత్యరోగముల యందు పథ్యకరంబులు.

## పైత్యరోగములయం దపథ్యము.

శ్లో॥ దధిక్షీరగుడంసర్పి ర్మాషనిష్పా వసర్షపం ।
విదాహీకరుద్రవ్యాని వ్యాయామః క్రోధఆతపః ।
చతుర్వింశైపైత్యేచహ్యపథ్యం సముదాహృతమ్॥

తా. పెరుగు పాలు బెల్లము నెయ్యి మినుములు ఆవాలు విదాహ కరద్రవ్యములు గురుకరద్రవ్యములు సంచారము కోపము ఉష్ణము ఎండసేవ ఇవి 24 పైత్యరోగములయందున పథ్యకరంబులు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కొరాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
చతుర్వింశతి పైత్యరోగ ఛర్దిమూ
ర్ఛారోగ నిదాన తత్సాధ్యా సాధ్య
చికిత్సానుపానపథ్యాపథ్య
లక్షణ యుక్తం
సప్తమ ప్రకరణమ్.



శ్రీ ర స్తు

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

## — అ ష్ట మ ప్ర క ర ణ ము. —

శ్లో॥ ఖట్వాంగధారిణంరుద్రం చంద్రసూర్యాగ్నిలోచనమ్ ।
విష్ణువల్లభమీశానం దేవ దేవమహంభజే॥

అవతరణిక. ఇపుడు గ్రంథకర్త విఘ్నబాహుళ్య శంకగలవాడై తనచే జేయంబడు నీ గ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తిజెందుటకై గ్రంథమధ్యమునతన కిష్టదేవతయగు ఈశ్వరునియొక్క నమస్కారాత్మక మంగళమును "ఖట్వాంగ ధారిణంరుద్రం" అను శ్లోకముచే జేయుచున్నాడు.

తా. ఖట్వాంగమే యాయుధముగ గలవాడును చంద్ర సూర్యాగ్నులే నేత్రములుగ గలవాడును విష్ణువునకు ప్రియకరుడును సకలైశ్వర్య సంపన్నుడును సర్వ దేవతలకు ప్రభువునగు ఈశ్వరుని నేను భజించెద.

శ్లో. శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహంవైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని పేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో కడు శ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథముయొక్క అష్టమ ప్రకరణమును వచింపుచున్నాడను.

### కాసరోగ నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] ధూమోపఘాత ద్రజసస్తథైవ వ్యాయామ రూక్షాన్ననిషేవణాచ్చ । విమార్గగత్వాదపిభోజనస్య వేగా వరోధాత్క్షవథోస్తథైవ। ప్రాణోహ్యుదానానుగతః ప్రదుష్ట

స్సంభిన్న కాంస్యస్వనతుల్యఘోషః । నిరేతివక్త్రాత్సహసా సదోషోమనీషిభిః కాసఇతి ప్రదిష్టః ॥

తా. ముఖ నాసికాద్వారముల పొగ దుమ్ము ప్రవేశించి శ్వాసము నడ్డగించుట మిక్కుటముగ సంచారము మొదలగు వానిని సేయుట రూక్షాన్నముల ప్రతిదినము సేవించుట కడుతీవ్రముగ భుజించుటవలన అన్నము విరుద్ధ మార్గమును జెందుట (అనగా కొరబోవుట) మలమూత్రముల తుమ్ముల నడ్డగించుట ఈ కారణముల వలన ప్రాణవాయువు మిక్కుటముగ దుష్టంబై ఉదానవాతమును దోషయుక్తముగ జేసి దానితోడంగలసి కఫపిత్తయుక్తంబై పగిలిన కంచుపాత్రతో తుల్యమైనశబ్ధముగలదై వాగ్ద్వారంబున నుండి యకస్మాత్తుగ బైలువెడలు. దీనినే విద్వజ్జనులు * కాసమని వచించెదరు.

కాసరోగ భేదవివరము.

శ్లో॥ [మాధవనిదానే] పంచకాసః స్మృత-వాత పిత్తశ్లేష్మక్షత క్షయైః । క్షయాయోపేక్షితాస్సర్వే బలినశ్చోత్తరోత్తరమ్॥

తా. కాసరోగము వాత పిత్తశ్లేష్మ క్షత క్షయములన 5 విధంబులు. వానియందౌషధోపచారము సేయబడకుండుటచే సర్వధాతువులుక్షయించి ఒకదానికన్న నొకటి బలవత్తరముగ నగు. (అనగా వాతకాసాపేక్షయా పిత్తకాసము పిత్తకాసాపేక్షయా శ్లేష్మకాసము శ్లేష్మకాసాపేక్షయా క్షతకాసము క్షతకాసాపేక్షయా క్షయకాసము జనించు ననుట.

కాసరోగ పూర్వరూపములు.

శ్లో॥ [నిత్యనాథీయే] పూర్వరూపంభవేత్తేషాం శూకపూర్ణగళాస్యతా । † కంఠేకండూశ్చభోజ్యానా మవరోధశ్చజాయతే॥

తా. కంఠము నోరు వీనియందు ముండ్లుబారుట కంఠములో దురదగలుగుట కంఠములో అన్నము దిగకుండుట ఈ లక్షణముల వలన కాసము జనించునని తెలియవలయు.

వాతకాస లక్షణము.

శ్లో॥ వాతకాసేకంఠశూలం మూర్ధ్నిపార్శ్వోదరేపిచ ।

* కాసమన—దగ్గు. † కంఠే కండూర్భవేచ్చైవ భుక్తా రోధశ్చజాయతే.

తృూహీనానంబలక్షీణాం భిన్న కాంస్యస్వరి_స్తథా॥

తా. కంఠము శిరము పార్శ్వములు కడుపు శూలించుట ముఖముకృశించుట సత్వము క్షయించుట సర్వము పగిలిన కంచుపాత్రతో తుల్యముగ నుండుమ ఈలక్షణములు గలది వాతకాసమని తెలియవలయు.

## పైత్యకాస లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] ఉరోదాహో * రక్తశోష_స్తిక్తాస్యత్వాం
జ్వర_స్తృషా । కటుతి_క్తంపమిశ్లోష్మం పీతంచసి_త్తకాసకే॥

తా. ఱొమ్ములోమండుట నోరెండుట నోరుచేదువేసుట జ్వరము దప్పిగలుగుట కారముగ వగరుగ ఉష్ణముగ పచ్చగ వాంతియగుట చకారమువలన శరీరము పాండువర్ణముగనుండుట ఈ లక్షణములుగలది పిత్తకాసమని తెలియవలయు.

## శ్లేష్మకాస లక్షణము.

శ్లో॥ శిరో_ర్తికఫపూర్ణాస్యం హృద్దాహోగురుతారుచిః ।
దానేసాంద్రకఫఃకండూ శ్లేష్మకాసస్య లక్షణమ్ ॥

తా. తలనొచ్చుట ముఖము కఫముచే పూయంబడినటులుండుట ఱొమ్ములో మండుట శరీరము బరువుగనుండుట అరుచిగలుగుట దగ్గిన దట్టముగ కఫము వెడలుట శరీరమున దురదగలుగుట ఈ లక్షణములుగలది శ్లేష్మకాసమని తెలియవలయు.

## క్షతకాస లక్షణము.

శ్లో॥ (ఆయుర్వేదే] సర్వభేదజ్వరశ్వాసతృష్ణావైస్వర్యపీడితః ।
నపూర్వంకాస తేశుష్కం తతఃష్ఠీవతిశోణితమ్ ।
పారావతఇవాకూజక్ కాసవేగాత్ క్షతోద్భవే ॥

తా. వేళ్ళగణుపులు నొచ్చుట జ్వరము ఉబ్బసము దప్పిగలుగుట బొంగు బోయినటుల మాటలాడుట తొలుత పొడిదగ్గు గలిగి పిదప రక్తమునుమియుట క్షతజకాసవేగము వలన పావురపిట్టవలె ఘుర్ఘురుశబ్దమునుజేసుట ఈ లక్షణములు గలది క్షతకాసమని తెలియవలయు.

* రక్తశోష—రక్తము శోషించుట.

### క్షయకాస లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే]. గాత్రశూలం జ్వరోదాహో మోహః ప్రాణక్షయశ్చ వర్తతే। శుష్కంనిష్ఠీవ యేత్కృచ్ఛ్రాత్స పూయంశోణితంచయః। ఇత్యేషక్షయజఃకాస స్సాధ్యో బలవతాం క్వచిత్।క్షీణానాం దేహనాశాయ సఏవాసాధ్య తాంవ్రజేత్॥

తా. శరీరము నొచ్చుట జ్వరము తాపము మోహముగలుగుట ప్రాణవాతము క్షయించుట వాతప్రకోపమువలన మిక్కుటముగ నిట్టూర్పు వాయువు వెడలుట పొడి దగ్గుగలుగుట కష్టముమీద చీము నెత్తురుతో గూడియుండు కఫమును ఉమియుట ఈ లక్షణములు గలది క్షయకాసమని తెలియవలయు, (ఇది సత్వముగల) వారిలో ఒకానొకనికి సాధ్యంబగు. సత్వము లేకుండు వానికి అసాధ్యంబగు.

### కాసరోగ సాధ్యాసాధ్యములు.

శ్లో॥ కాసఃపంచవిధ స్తత్ర శుష్కో వాతాత్కఫోమతః।
పైత్యకేదాహసంయుక్త శ్లేష్మి కేపీనసాన్వితః।
క్షతేభిఘాతాదురసి క్షయజస్తు క్షయాకృతిః।
యాప్యఃక్షతసముద్భూతః క్షయకాసోనసిధ్యతిః।

తా. పై జెప్పబడిన ప్రకారము కాసరోగము 5 విధంబులు అందు వాతకాసమున పొడిదగ్గుగాని లేకశరీర కృశత్వముగాని గలిగియుండు. (ఇదిసాధ్యము.) పిత్తకాసమున సర్వాంగములయందు తాపముగలుగు. (ఇది సాధ్యము. శ్లేష్మకాసమున పీనసగలుగు (ఇది సాధ్యము.) క్షతకాసమున అభిఘాతమువలన అరొమ్మునందలి రక్తముచెడి దగ్గుగలుగు. (ఇది యాప్యము.) క్షయకాసమున క్షయరోగ లక్షణములు గలుగు (ఇది అసాధ్యము.)

### పంచకాసాదులకు అమృతాంకరసయు.

శ్లో॥ [మాధవనిదానే] రసగంధత్రికటుకం గ్రంథికంచవ్య చిత్రకమ్। అమృతం లవణంతుల్యం భృంగస్వరస మర్దితమ్। గుంజామాత్రాశ్చవటికాః పంచకాసాన్వినాశయేత్॥

అమృతాంకరసోనామ్నా వింశతిశ్లేష్మరోగజిత్ ।
అశీతివాతరోగాంశ్చ నాశయేన్నాత్రసంశయః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసినగంధకము త్రికటుకములు మోడి చెవ్యము చిత్రమూలము శుద్ధిచేసిన నాభిసైంధవలవణము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గుంటగలగరాకు రసముతో బాగుగనుర్దించి గురిగింజంత మాత్రలుజేసి యందొక దానిని తేనెపిప్పలితో సేవించిన 5 కాసములు 20 శ్లేష్మరోగములు 80 వాతరోగములు చకారమువలన గళరోగము తాలురోగము శిరోరోగము కర్ణమునాసారోగము నిస్సంశయముగ హరించు.

## తిలాది లేహ్యము,

శ్లో॥ [నిత్యనాథీయే] తిలాభల్లాతకంపథ్యాగుడంచేతిసమాంశకమ్ ।
దుర్నామశ్వాసకాసఘ్నంప్లీహపాండురుజాపహమ్ ॥

తా. ఎఱ్ఱనువ్వులు శుద్ధిజేసిన జీడిగింజలు కరక్కాయలు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి వానికి సమముగ బెల్లమును గ్రహించి పాకుబట్టి యందాచూర్ణమును గలిపి లేహ్యపక్వముగవండి ప్రత్యహము 4 మాడల యెత్తునుగాని లేకధరణమెత్తునుగాని తేనెతో సేవింపుచుండిన మూలరోగముశ్వాసకాసలు ప్లీహరోగము పాండువు హరించు. లేక ఈ గ్రంథములో జ్వరప్రకరణమునందు జెప్పబడిన చండభానురసమునుగాని లేక సూతరాజీయమను రసమునుగాని సేవించిన కాసశ్వాసములు హరించు.

## చిత్రకాది లేహ్యము.

శ్లో॥ [ఆయుర్వేదే]చిత్రకంపిప్పలీమూలంవ్యోషంముస్తాదురాలభా ।
శఠీపుష్కరమూలాంచ శ్రేయసీసురనావచా
భార్గీఛిన్నరుహారాస్నా కర్కటాఖ్యాచకర్షికా ।
కల్కాగ్నిదగ్ధద్విత్రుసంకషాయే పలవింశతిః ।
మత్స్యండికాయా దశవాసర్పిషః కుడవంపచేత్ ।
సిద్ధేశీతేపృథక్క్షౌద్ర పిప్పలీకుడవాన్వితమ్ ।
చతుఃపలంతుగాక్షీర్యా శ్చూర్ణంతత్ర ప్రదాపయేత్ ।
లేహయేత్కాసహృద్రోగ శ్వాసగుల్మ నివారణమ్

తా. చిత్రమూలము మోడి త్రికటుకములు తుంగముస్తెలు* దురదగొండివేరు కచోరములు పుష్కరమూలము కరక్కాయలు తులసి వస గంటుభారంగి తిప్పతీగె సన్నరాష్ట్రము కర్కాటకశృంగి వీనిలో ప్రతిదానిని కర్షప్రమాణము గ్రహించి కల్కముజేసి అందు 200 పలములయెత్తు నీళ్ళుబోసి 20 పలములు శేషించునటుల కషాయముకాచి వడియగట్టి యందు 10 పలములయెత్తు ఖండశర్కర కుడవప్రమాణము నెయ్యికలిపి లేహ్యపక్వముగవండి చల్లారిన పిదప తేనె 1 కుడవయు పిప్పలి చూర్ణము 1 కుడవము వెదురుప్పు 4 పలములువైచి కలియబెట్టి సేవించిన కాసము బొమ్మనొప్పి శ్వాసము గుల్మము హరించు.

## అగస్త్య హరీతక్యవ లేహ్యము.

శ్లో॥ దశమూలీ స్వయంగుప్తా శంఖపుష్పీశ్వశఠీబలా । హస్తిపిప్పల్య పామార్గ పిప్పలీ మూల చిత్రకమ్ । భార్గీ పుష్కరమూలంచ ద్విపలాంశం యవాఢకేమ్ । హరీతకీ శతంచైవజలే పంచాఢకేపచేత్ ॥ యవేస్విన్నేకషాయేచ పూతేతచ్ఛాభయాశతమ్॥ పచేద్గుడతులాందత్వా కుడపంచ పృథగ్ఘృతమ్। తైలంపిప్పలిచూర్ణంచ సిద్ధేశీతేచమాక్షికమ్ । లిహ్యాద్వే చాభయేనిత్యమతః ఖాదే ద్రసాయనమ్ । వలించపలితం హన్యాద్వర్ణాయుర్బలవర్ధనమ్ । పంచకాసాన్ క్షయాన్ శ్వాసాన్ హిక్కాంచ విషమజ్వరాన్ । హన్యాత్తథాగ్రహణ్యర్శోహృద్రోగారుచి పీనసాన్ । అగస్త్యవిహితంధన్యమిదంశ్రేష్ఠం రసాయనమ్।

తా. దశమూలములు దురదగొండి విత్తులు శంఖపుష్పి కచ్చూరములు ముత్తవపులగపువేళ్ళు ఏనుగపిప్పళ్లు ఉత్తరేణి మోడి చిత్రమూలము గంటుభారంగి పుష్కరమూలము అవి దినుసుయొకటింటికి 2 పలములు యవధాన్యము ఆఢకప్రమాణము కరక్కాయలు 100 పలములు ఇటుల వీనినెల్ల నొకభాండములోవైచి అందైదు ఆఢకముల ప్రమాణము నుదకముబోసి కషాయము కాచవలయు. ఆ భాండమందలి యవలు పక్వమైనతోడనే కషాయమును వడియగట్టి యందుకరక్కాయలు

* ఇదే తీటకసింద: మఱియు ఇదే దూలంగొండియనియు జెప్పంబడు.

100 పలములు బెల్లము 100 పలములు నెయ్యి 4 పలములు నూనె 4 పలములుపిప్పలిచూర్ణము 4 పలములు కలిపి లేహ్యపక్వముగవండి దించుకొని చల్లార్చి పిదప 4 పలములు తేనెబోసి బాగుగ కలియబెట్టి నేతితో మాగిన కుండయందునిచి ప్రత్యహము 2 కరక్కాయల సేవింపుచుండిన మదిమి పంచకాసములు క్షయరోగము శ్వాసము ఎక్కిళ్ళు విషమజ్వరము గ్రహణి మూలరోగము ఱొమ్మునొప్పి అరుచి పీనసము ఇవివశించుటయే గాక శరీరకాంతి ఆయుర్వృద్ధి బలము సగా గలుగు. ఈహారీతకీలేహ రసాయనము అగస్త్యులచే జెప్పంబడియె.

## ఇంద్రవారుణికాది చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] ఇంద్రవారుణికాసూతందేవదారుకటుత్రయం।
శర్కరాసహితంఖాదే చ్ఛ్వాసకాసహరంపరమ్॥

తా. పాపరవేరు దేవదారు త్రికటుకములు పంచదార వీని చూర్ణమును దినుసుకొకటింటికి $1\frac{1}{4}$ తులము చొప్పున గ్రహించి అందు రసభస్మము 10 చిన్నములయెత్తుకలిపి 20 దినములు తేనె పిప్పలి వీని యనుపానముతో సేవింపుచుండిన శ్వాసలు కాసలున్హరించు.

## స్వయమగ్ని రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం ద్విధాగంధం కుర్యాత్ఖల్వేచ కజ్జలీమ్ । తయోస్సమంతీక్ష్ణ చూర్ణం * మర్దయేత్కన్యకాద్రవైః॥ ద్వియామాంతే కృతంగోళం తామ్రపాత్రే వినిక్షిపేత్ । ఆచ్ఛాద్యైరండపత్రేణ ‡ యామాంత్యేవుష్ణతాంవ్రజేత్ ॥ ధాన్యరాశౌన్యసేత్పశ్చా † ద్వియామాంతేసముద్ధరేత్ । సంపేష్యగాలయేద్వస్త్రే సద్యోవారితరంభవేత్ । త్రికటుత్రిఫలాచైలా జాతీఫల లవంగకమ్ । ♦ ఏతేషాంనవభాగానాం సమంపూర్వోదితంభవేత్ । సంచూర్ణ్యలోడయేత్తుద్రైర్భక్ష్యం నిష్కద్వయంతథా । స్వయమగ్నిరసోనామ క్షయకాసనికృంతకః । ఇంద్రవారుణికామూలం భృంగీకృష్ణాత్రిలైస్సహ।భక్షయేత్క్షయకాసార్తోనిష్కమాత్రప్రశాంత్తయే

* మర్దయేత్కతక్రద్రవైః. ‡ యామార్థేవుష్ణతాభవేత్ † ద్విదినాంతే.
♦ ఏషాంచపరభాగానాంసమంపూర్వరసోభవేత్॥ఇటులను పాఠాంతరములుగలవు.

తా. శుద్ధిచేసిన రసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము 2 భాగములు ఈ రెంటిని ఖల్వములోనునిచి కాటుకవలె మర్దించి దానికి సమముగ ఉక్కుభస్మము కలిపి కలబందరసముతో గాని లేక ఇందుపుకాయ రసముతో గాని 2 ఝాములు మర్దించిముద్దజేసి రాగిసంపుటములోనునిచి దానిపై ఆముదపాకులుజుట్టి 1 ఝాము వరకు నునిచిన ఉష్ణంబగు. పిదపదానిని ధాన్యరాశియందు 2 ఝాములు గాని (లేక 2 దినములుగాని) వునిచి యందుండి తీసి ఖల్వములో మెత్తగనూరి వస్త్రగాళితము జేసి నీళ్ళపైవైచిన నది తేలును. పిదప ఈ లోహచూర్ణమునకు సమముగ త్రికటుకములు త్రిఫలములు ఏలకులు జాజికాయ లవంగములు అను నీ 9 వస్తువులయొక్క చూర్ణమును గలిపి తేనెలోవైచి కలియబెట్టి 2 నిష్కముల యెత్తును సేవింపుచుండినను లేక నిష్క ప్రమాణమును వెట్టిపుచ్చవేరు గుంటగలగర పిప్పళ్ళు నువ్వులు అనువాని అనుపానముతోడ సేవింపుచుండిన క్షయకాసము హరించు.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధసూతస్య భాగైకం ద్విభాగం శుద్ధగంధకమ్। భాగత్రయం మృతంతామ్రం మరీచందశభాగకమ్। మృతాభ్రస్య చతుర్భాగం భాగమేకంవిషం క్షిపేత్। ధూర్తాంకుశస్య భాగైకం సర్వమామ్లేన * మర్దయేత్। ♦ యామం ధూర్తాంకుశో నామ మాషేకం వాతకాసజిత్। అనుపానం లిహేత్క్షౌద్రే విభీతక ఫలత్వచః। వ్యోషహా త్ర్యామలకీ భార్ఙ్గి వ్యాఘ్రీభిః క్వథితంజలమ్। కాసాన శేషాంశ్చిరా త్సీత మాశు వ్యపోహతి మాషైకంచ లిహేత్క్షౌద్రై రక్తకాసం నియచ్ఛతి॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిచేసిన గంధకము 2 భాగములు తామ్రభస్మము 3 భాగములు మిరియాలు 10 భాగములు అభ్రకభస్మము 4 భాగములు శుద్ధిచేసిన నాభి 1 భాగము ధూర్తాంకుశము 1 భాగము ఇటుల వీనినెల్ల ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో నొకఝాము మర్దించిమాషయెత్తు మాత్రలుజేసియుంచొక దానిని తేనెతో సేవించివెంబడిగ తానికాయలబెరడు త్రికటుకములు ఉసిరికెవరుగు

* భావయేత్ ♦ రసోధూర్తాంకుశ నామ.

గంటుభారంగి నేలములక వేళ్లు ఆసవాని కషాయమును దాగినదీర్ఘకాలముగ బాధింపుచుండు వాతకాసము మొదలగు సర్వకాసములు శీఘ్రముగ హరించు. మఱియు నీ భూతాంకుశరసములో మాషప్రమాణమును తేనె (పిప్పలి) తోడ సేవించినరక్త కాసము హరించు.

వింశతీ శ్లేష్మరోగ వివరణము,

శ్లో॥ [మాధవనిదానే] పూర్వాకాసః క్షయః కాసో రక్తకాసశ్చ చిప్పికా । వాతకాసః పైత్యకాసఃక్షతకాసశ్చశుక్తికా । ఆమ కాసః పాండుకాసః కృష్ణకాస స్తథైవచ । శ్లేష్మకాసో దధి కాసః కాసశ్చశ్లేష్మ జిహ్వకః । కంఠజిహ్వోప జిహ్వాచ హంతి జిహ్వకకాసకః । ఊర్ధ్వకాస శ్లేష్మభంగ శ్లేష్మ కుష్ఠశ్చసంజ్ఞితః । ఇత్యేతేవింశతిఃకాసాః వక్ష్యామివిధివ త్క్రమాత్ ॥

తా. పూర్వకాసము క్షయకాసము రక్తకాసము చిప్పికాకాసము వాతకాసము పైత్యకాసము క్షతకాసము శుక్తికాకాసము ఆమకాసము పాండుకాసము కృష్ణకాసము శ్లేష్మకాసము దధికాసము శ్లేష్మజిహ్వకకాసము కంఠజిహ్వకకాసము ఉపజిహ్వకకాసము జిహ్వకకాసము (ఇదిజంపుడు) ఊర్ధ్వకాసము శ్లేష్మభంగాళికాసము శ్లేష్మకుష్ఠకాసము అనునీనిరువదియు శ్లేష్మరోగములని తెలియవలయు.

పూర్వకాస లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] జన్మప్రభృత్యవీర్యంచసతతంకాసపీడనమ్ ।
అనారోగ్యం ప్రభాతేచ పూర్వకాసస్య లక్షణమ్॥

తా. కాసముజనించినది మొదలు ఇంద్రియములకు సత్వములేకుండుట ఎల్లపుడు దగ్గుగలిగియుండుట లేక మూల్గుచుండుట ప్రాతఃకాలమున మిక్కుటముగ దగ్గుగలుగుట ఈ లక్షణములు గలది పూర్వకాసమని తెలియవలయు.

పూర్వకాసమునకు కాసకర్తరీ రసము,

శ్లో॥ అమృతంపారదంగంధం నేపాళంచసమాంశకమ్ ।
అర్కమూలకషాయేణ మర్దయేద్యామమాత్రకమ్ ।

డోలాయంత్రే ద్వియామాంతం పానితంచ సముద్ధరేత్ ।
గుంజామాత్రం ప్రదాతవ్యం పూర్వకాసం నియచ్ఛతి ॥

తా. నాభీ రసము గంధకము నేపాళములు వీనినెల్ల శుద్ధిజేసిన సమభాగములుగ ఖల్వములో నునిచి జిల్లేడు వేళ్ళకషాయముతో 1 ఝామము మర్దించి జిల్లేడువేళ్ళకషాయముతోడనే 2 ఝాములు డోలాయంత్రమున వండి గురిగింజలంత సేసి మాత్రలుజేసి యుంచొక దానిని తేనె పిప్పలితో సేవింపుచుండిన పూర్వకాసము హరించు.

## క్షయకాస లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] దేహం శుష్కంచాంగకుష్ఠమన్నం క్షీణంచ
పాండుతా। శిరోభ్రమశ్చహిక్కాచ క్షయకాసస్యలక్షణమ్॥

తా. శరీరము శుష్కించుట శరీరము కుష్ఠురోగముపట్టి నటులుండుట అన్నమునందిచ్ఛలేకుండుట శరీరము పాండురవర్ణముగనుండుట తలదిరుగుట ఎక్కిళ్ళుగలుగుట ఈలక్షణములతోడ దగ్గునుగలిగియుండిన క్షయకాసనుని తెలియవలయు, (ఇది అసాధ్యము.)

శ్లో॥ [ఆయుర్వేదే] దేహంశుష్యతి శూలరోగసహితం కుక్షివ్యథారోచకమ్ । హిక్కాశుక్ల వినాశగద్గదగళం కంపోగ్నిమాంద్యం
జ్వరః। శ్లేష్మాగ్రంధినిభశ్చదుఃఖ విపులం మాంసస్యనిష్ఠీవనమ్ ।
శ్వాసశ్చక్షయకాస లక్షణమిదం వైవర్ణ్య తృష్ణాన్వితమ్॥

తా. శరీరము కృశించుట శూలగలుగుట కడుపునొచ్చుట అరుచిగనుండుట ఎక్కిళ్ళుగలుగుట శుక్లము నశించుట డగ్గుత్తికెబడుట శరీరము వణుకుట అగ్నిమాంద్యము జ్వరముగలుగుట కఫము ఉండలుగట్టి వెడలుట చకారమువలన కఫము కంపు వేయుట కడుపీడగలుగుట ఉమిసిననెత్తురుగడ్డలుగట్టి వెడలుట శ్వాసముగలుగుట శరీరమున కాంతిలేకుండుట దప్పిగలుగుట ఈ లక్షణములుగలది క్షయకాసమని తెలియవలయు. ఇది అసాధ్యము. (ఐనను దీనియందు స్వయమగ్నిరసమును బ్రయోగింపవలెను.)

## రక్తకాస లక్షణము.

శ్లో॥ [చరకే] శోణితశ్లేష్మయుక్తాస్రావః హృద్దాహః కాంతిహీ
నతా। ఉష్ణాతిశయరూక్షేచ రక్తకాసేబలక్షయః॥

తా. దగ్గిన కఫమువెంట నెత్తురుబడుట ముక్కున నెత్తురుగారుట ఱొమ్ము లోనుండుట శరీరమున కాంతిలేకుండుట శరీరమున కడు ఉష్ణముగనుండుట ఈలక్షణములుగలది రక్తకాసమని తెలియవలయు. [దీనియందు జ్వరము బలక్షయముగలిగి యుండిన అసాధ్యము. లేకుండిన సాధ్యము. ఈరక్తకాసముహరించుటకై పైజెప్ప బడిన ఘూతాంకుశరసముతో మాషప్రమాణమును తేనె పిప్పలితో సేవింపవలయు.]

## వృష్ణాది కషాయము.

శ్లో॥ వృషామధాభ్యాం వృషపిప్పలీభ్యాం వృషోషణాభ్యాంచ
కృతాన్ కషాయాన్ । క్రమేణవాతాది సముద్భవేషురక్తేచ
కాసేసముదాహరంతి ॥

తా. అడ్డరసము శొంఠి అనుపాని కషాయము వాతరక్తకాసములను అడ్డసరము పిప్పళ్ళు అనుపానికషాయము పిత్తరక్తకాసములను అడ్డసరము మిరియాలు అనుపాని కషాయము శ్లేష్మరక్తకాసములను హరింపంజేయు (మేక అవు అనుపాని పంచితములను 2 అడ్డలు ప్రమాణమునుగ్రహించిఅందు శేలచెక్క 10 పలములుచం ద్రవేరుచక్క 10 పలములువైచి చాతుర్భాగముగ కషాయముగాచి వడియగట్టిఅం దుత్రికటుకములు చెవ్యము గంటుభారంగి అక్కలకఱ్ఱ దుంపరాష్నము లవంగములు త్రిఫలములు కలబందనుంపలు అభ్రకభస్మముఅనుపానిచూర్ణమును దనుసుకు సన్నా ని (డబ్బుల) యెత్తుగలిపి లేహ్యపక్వముగవండి సాంగశీతలమున తగుమాత్రము తేనెబోసి బాగుగ కలియబెట్టి సాయంప్రాతఃకాలముల ఉసిరికకాయంత సేవింపు చుండిన రక్తకాసము హరించు.

## చిప్పికాకాస లక్షణము.

శ్లో॥ [చరకే] వక్త్రేదుర్గంధతా కాంతి రరుచిర్గురుగాత్రతా ।
దేహకాంతిహరఃకుష్ఠో మందాగ్నిశ్చిప్పికాసకే ॥

తా. నోరుకంపు వేసుట శరీరము మెఱయుట అరుచిగలుగుట శరీరముబలువు గనుండుట శరీరకాంతిజెడుట శరీరము కుష్ఠురోగము పట్టినటులుండుటఅగ్నిమాంద్య ముగలుగుట ఈ లక్షణములతోడ దగ్గును గలిగియుండిన చిప్పికాకాసమని తెలియ వలయు. (దీనియందు ధాతుక్షయము ప్రధానముగనుండిన అసాధ్యము. లేకుండిన సాధ్యము.

## చిప్పికాకాసమునకు సర్వాంగసుందర రసము.

శ్లో॥ శుద్ధసూతం విషంగంధ శుద్ధతాళకమాక్షికమ్ । ఏతాని సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్ । హంసపాది రసేనైవ ద్వియామం మర్దయేద్దృఢమ్ । కాచకుప్యాం నివేశ్యాథ వాలుకాభిః ప్రపూరయేత్ । స్వాంగశీతల ముద్ధృత్య ద్విగుంజంభక్షయేత్సదా । చిప్పికాసం నిహంత్యాశుసర్వకాసం నియచ్ఛతి । సర్వాంగ సుందరో హ్యేష రోగరాజ నికృంతనః । దశభిర్మరి చైర్యుక్తాంపథ్యాంపిష్ట్వాథ సాతథా । నాభి జానాతికాసంచ నిద్రాసుఖకరంపరమ్॥

తా. రసము నాభి గంధకము తాళకము * హేమమాక్షికము వీనినెల్ల శుద్ధి చేసి సమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదియాకురసముతో 2 జాములు బాగుగ మర్దించి గాజుకుప్పెలోనునిచి వాలుకా యంత్రమున 2 జాములు మృద్వగ్నితో వండి స్వాంగశీతలమున దీసి యందు 2 గురిగింజలయెత్తును పదిమిరియాలు 1 కరక్కాయ అను వానిని ఉదకములో నూరి దానియనుపానముతోడ సేవించిన చిప్పికాకాసము సర్వకాసములు క్షయరోగము హరించు మఱియు నీయౌషధసేవన వలన కాసోపద్రవరహితుండై సుఖముగ నిద్రించు. (కరక్కాయచూర్ణము $\frac{1}{2}$ సేరు ఉప్పు $\frac{1}{2}$ సేరు అక్కలకఱ్ఱ దుంపరాష్ట్రము పంచకోలములు అనువాని చూర్ణము దినుసుకు 1$\frac{1}{2}$ తులము ఇటులవానినెల్ల నేకముజేసి గుంటగలగరాకురసముతో మర్దించి † భావనజేసి ప్రతిదినము ఉసిరికకాయంత చూర్ణమును తేనెతో సేవింపుచుండిన చిప్పికాకాసము హరించు.)

శ్లో॥ మండూరం కఫవాతఘ్నం దీపనస్యవివర్ధనమ్॥

తా. మండూరమును గంజితోడ త్రాగిన వాతకాసము హరించుటయేగాక అగ్ని దీపనము సగాగలుగు.

## వాతకాస లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] హృచ్ఛంఖమూర్ధోదరపార్శ్వశూలీ క్షామాననఃక్షీణ బలస్వరౌజాః । ప్రసక్తవేగస్తుసమీరణేన భిన్నస్వరః కాసతిశుష్కమేవ॥

* హేమమాక్షికమన — బంగారుస్సు. †. భావనయన ఊరగ బెట్టుట.

తా. హృదయము కణత శిరము ఉదరము పార్శ్వములు వీనియందు శూల గలుగుట నోరెండుట బలము స్వరము ధాతువులు వీనియొక్క తేజస్సు క్షయించుట పలుమారుదగ్గుట స్వరభేదము పొడిదగ్గు గలుగుట ఈలక్షణములుగలది వాతకాస మని తెలియవలయు.

## రుద్రపర్పటీ రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతంద్విధాగంధం సంమర్ద్యాంలో
ధ్రిజద్రవైః। వాతారిరార్ద్రికంభృంగీకాకమాచీద్వికర్ణికా।
దినైకంమర్దయేత్ఖల్వే పాచయేత్పర్పటీంతథా। ద్వయోఃపా
దంమృతంతామ్రం క్షిప్త్వామృద్వగ్నినాపచేత్ ।రక్తవర్ణం
భవేద్యావత్తావద్దర్వ్యా ప్రచాలయేత్ । ప్రక్షిపేత్కదళీ
పత్రేస్థాప్యస్నిగ్ధపుటేపునః । ఆచ్ఛాద్యతేనయోగేనహ్యాధ
శ్చోర్ధ్వంచగోమయమ్ । దగ్ధంవిమర్ద్య యేత్పశ్చాచ్చూర్ణ
పాదం విషంక్షిపేత్ । రుద్రపర్పటికాహ్యేషాచేయాగుంజా
ద్వయంద్వయమ్ । చూర్ణితంకటునిర్గుండ్యా మూలంనిష్క
ద్వయంపిబేత్ । భృంగరాజరసేనైవలిహేద్వామధునాసహా ।
వాతకాసంనిహంత్యాశు సర్వథైవనశంశయః॥

తా. శుద్ధిచేసినరసము 1 భాగము శుద్ధిచేసినగంధకము 2 భాగములు ఈరెంటిని కొటుకవలెనూరి లొద్దుగ చెక్కరసము ఆముదపువేళ్ళు అల్లము గుంటగలగర కాచియాకు తెల్లగంటెన నల్లగంటెన అనువాని రసములతో 1 దినము ఖల్వములో మర్దించి సన్నగ బిళ్ళజేసి అగ్నిపైనునిచి అప్పడమువలె కాల్చి దానికి4 వ భాగము తామ్రభస్మము గలిపి మర్దించి చూర్ణముజేసి మూకుడులోనునిచి మందాగ్నిని ఎఱ్ఱనగువరకు గరిటెతో వేయించి లేత అరటియాకులో నునిచి పొట్లముగట్టి గోమయములో పొదిగి లఘుపుటంబిడి స్వాంగశీతలమునదీసి చూర్ణముచేసి దానికి 4 వభాగము శుద్ధిజేసిన నాభిగలిపి మర్దించి 2 గురిగింజల యెత్తును 2 నిష్కముల యెత్తు చేతిపొట్ల వావిలివేరు అనువాని చూర్ణానుపానముతోడగాని లేక గుంటగలగరాకు రసానుపానముతోడగాని లేక తేనెయనుపానముతోడగాని సేవించిన వాతకాసము నిస్సంశయముగ హరించు.

## పైత్యకాస లక్షణము.

శ్లో॥ [చరకో] ఉరోవిదాహజ్వరవక్త్రశోషై రభ్యర్దితస్తిక్తముఖస్తృషార్తః। పిత్తే వపీతానివమేత్కటూని కాసేవపాండుఃపరిదహ్యమానః॥

తా. రొమ్ములోమండుట జ్వరముగలుగుట నోరెండుట నోరుచేదుగనుండుట కడుదప్పిగలుగుట పచ్చగ కారముగా వమనంబగుట దగ్గుగలుగుటశరీరము పాండురవర్ణముగనుండుట శరీరమున తాపముగలుగుట ఈ లక్షణములుంగలది పైత్యకాసమని తెలియవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] శిరఃకంపోభ్రమస్స్వేదశ్ఛర్ది దోషశ్చక్షీణతా। తృష్ణాచశ్లేష్మశమనం మూర్ఛావై పైత్యకాసకే॥

తా. తలకణుకుట తబ్బిబ్బులాడుట చెమట వాంతిగలుగుట సత్వము లేకుండుట దప్పిగలుగుట ఒకింతదగ్గు మూర్ఛగలుగుట ఈలక్షణములుగలది పైత్యకాసమని తెలియవలయు.

## విజయభైరవ రసము.

శ్లో॥ [రసరత్నాకరే] రసభాగోభవేదేకో గంధకోద్విగుణోమతః। త్రిభాగాపిప్పలీగ్రాహ్యాచతుర్భాగాహరీతకీ । విభీతఃపంచభాగస్తువాసాషడ్గుణికామతా । భార్గీసప్తగుణాగ్రాహ్యాత్వేతచ్చూర్ణంప్రకల్పయేత్ । బర్బరక్వాథమాదాయభావయేదేకవింశతి । విభీతకీప్రమాణేనమధునాగుళికాక్రియా । ఏకైకాం భక్షయేత్ప్రాతః కాసశ్వాసవినాశనీ । బ్రహ్మణా నిర్మితోహ్యేష రసోవిజయభైరవః॥

తా. శుద్ధిచేసినరసము 1 భాగము శుద్ధిచేసినగంధకము 2 భాగములు సిప్పళ్ళు 3 భాగములు కరక్కాయలు 4 భాగములు తానికాయలబెరడు 5 భాగములు అడ్డసరపు యాకులు 6 భాగములు గంటుభారంగి 7 భాగములు ఇటులవీనినెల్ల గ్రహించి చూర్ణముజేసి వాయింటాకు కషాయముతో 21 మార్లు భావనజేసి తాని కాయ గింజలంత మాత్రలుజేసి యెండించి యందొక దానిని ప్రాతఃకాలమున తేనెతో సేవించిన సర్వకాసశ్వాసములు హరించు. ఇది బ్రహ్మచే నిర్మింపబడినది.

## త్రినేత్రక రసము

శ్లో॥ [పూజ్యపాదీయే] భస్మతామ్రాభ్రతీక్ష్ణానాం కాసమర్దవరీ
రసైః । మునిజైః శ్వేతసామేన దినమర్ద్యంసుపిండితమ్॥
* నిష్కార్ధంపి త్తకాసార్తో సర్వకాసంనియచ్ఛతి॥

తా. తామ్రభస్మము అభ్రకభస్మము ఇనుపభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి కసివెంద పిల్లిపీచరవేళ్ళు అవిశాకు పుల్లప్రబ్బలి అనువాని రసముతో ప్రత్యేక ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దించి 2 గురిగింజలంతగాని లేక అర్ధనిష్క ప్రమాణముగాని మాత్రలుజేసి ఎండించి యందొకదానిని సేవించిన పైత్యకాసము సర్వకాసములు హరించు.

## క్షతకాస లక్షణము.

శ్లో [సిద్ధరసార్ణవే] అతివ్యవాయభారాధ్వయుద్ధాశ్వగజనిగ్ర
హైః ।రూక్షస్యోరఃక్షతంవాయు ర్గృహీత్వా కాసమావ
హేత్ । సపూర్వంకాస తేశుష్కంతతఃష్ఠీ వేత్స శోణితమ్ ।
కంఠేనరుజతాత్యర్థంవిభిన్నేనై వచోరసా । సూచీభిరివతీక్ష్ణా
భిస్తుద్యమానేనశూలినా । దుఃఖస్పర్శేనశూలేనభేదపీడాభి
తాపినా। సర్వభేదజ్వరశ్వాసతృష్ణానైస్వర్యపీడితః । పారా
వతఇవాకూజ న్కాసవేగాత్క్ష తోద్భవాత్ ॥

తా. అతిమైథునముజేసుట కడుభారమునుమోయుటమిక్కుటముగమార్గము నడుచుట మల్లయుద్ధముచేయుట గుఱ్ఱము ఏనుగు మొదలగునవి పరుగులడునపుడువాని నడ్డగించి పట్టుట ఈ కారణముల వలన రూక్షగలపురుషునియొక్క రొమ్ముపగిలి దానియందు వాతముప్రకోపించి దగ్గునుగలుగంజేయు. ఈ కాసరోగము జనించుట కుముందు పొడిదగ్గుగలిగి పిదప రక్తయుక్తముగ కఫముబడుట కంఠము మిక్కుటముగ నొచ్చుట రొమ్ము పగిలినట్టుండుట రొమ్ములో సూదులచే బొడుచునటుల శూలగలుగుట శూలవలన రొమ్ములోస్పర్శసహనము లేకుండుట పార్శ్వములయందు గొడ్డలితో గొట్టినటుల తాపయుక్తమైన శూలగలుగుట సంధులుపగిలినటులుండుట

* ద్విగుంజంపిత్తకాసార్తోభక్షయేచ్ఛత్రినేత్రికమ్॥ ఇటులను పాఠాంతరముగలదు.

జ్వరము శ్వాసము దప్పి స్వరభేదము గలుగుట క్షతజన్యకాస వేగమువలన పావుర పిట్టవలె గుర్గురుశబ్దమును జేయుట ఈ లక్షణములు క్షతకాసమునగలుగు.

## క్షతకాసమునకు తాళేశ్వర రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసపాదంమృతంతారం శిలాతాప్యం చతు
ర్గుణమ్ । ఇక్షువాసారసాభ్యాంచ మర్దయే త్ప్రహరద్వ
యమ్ । ద్వియామం వాలుకాయంత్రే స్వేద్యమాదాయ
చూర్ణయేత్ । గుంజాద్వయం నిహంత్యాశు కాసం * శ్వా
సంక్షతోద్భవమ్ । రసస్తాళేశ్వరోనామ్నా హ్యనుపానంచ
కథ్యతే । వచాకుష్ఠహరిద్రాభి స్సైంధవం టంకణంవిషమ్ ।
పాఠాచలాంగలీవ్యోషంచాక్షుం ప్రత్యేకభాగకమ్ । భావి
తంభృంగసారేణ దినైకంతంచభక్షయేత్ । మాషంతాళేశ్వ
రోనామ్నా హిక్కానై స్స్వర్యకాసజిత్ । దాడిమంత్రిఫలా
వ్యోషంప్రమాణాంచ సమంగుడమ్ । చూర్ణితంభక్షయేత్క
ర్షం క్షతకాసపనుత్తయే॥

తా॥ రసభస్మము 1 భాగము రజితభస్మము ¼ భాగము శుద్ధిజేసిన మణిశిల 2 భాగములు శుద్ధిజేసిన హేమమాక్షికము 2 భాగములు ఇటుల వీనిని ఖల్వములో నునిచి చెఱుకు అడ్డసరము అనువాని రసములతో 2 జాములు మర్దించి కుప్పెలో నునిచి వాలుకాయంత్రమున 2 జాములు వండి స్వాంగశీతలమున దీసి చూర్ణముజేసి 2 గురిగింజలయెత్తును వస చంగల్వకోష్ఠు పసపు సైంధవలవణము వెలిగారము అతివస చిరుబొద్ది చెన్నచెర్లగడ్డ త్రికటుకములు అనువానిని అక్షప్రమాణము ప్రత్యేక ప్రత్యేకముగ చూర్ణముజేసి గుంటగలగరాకు రసముతో 1 దినము భావన జేసి ఈ చూర్ణానుపానముతోడ సేవించిన క్షతమువలని జనించిన కాసశ్వాసములు హరించు. మఱియు దీనిని మాషప్రమాణము పైయనుపానముతోడ సేవించినను యెక్కిళ్ళు స్వరభంగము కాసము హరించు. మఱియు దాడిమబెరడు త్రిఫలములు త్రికటుకములు అనువానిని చూర్ణముజేసి దీనికి సమముగ బెల్లముగలిపి కర్షప్రమాణానుపానముతోడ పైతాళేశ్వరరసమును సేవించిన క్షతకాసము హరించు.

* క్షతభవం ధ్రువమ్.

## శుక్తికాస లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శుక్తికాసేచ మందాగ్నిః కంఠేచ శ్లేష్మ
సంస్థితిః। అంగానాంచైవవైకల్యాంశుక్తికాసంవిదుర్బుధాః॥

తా. అగ్నిమాంద్యము గలుగుట కుతికలో తెమడనిలుచుట అవయవములు శిథిలంబులగుట ఈలక్షణములుగలది శుక్తికాసమని తెలియవలయు.

## సూర్య రసము.

శ్లో॥ [నిత్యనాథీయే] రసమేకం ద్విధాగంధం త్రితాప్యం పంచ
తాళకమ్ । సర్వశుద్ధం చూర్ణ్యాథ చతుర్భాగం మృతా
భ్రకమ్ । వచాకుష్ఠహరిద్రాగ్నిటంకణం సైంధవంవిషమ్ ।
పాఠాచలాంగలివ్యోషం సర్వంప్రత్యేకకర్షకమ్ । భావితం
భృంగసారేణదినైకంతంచ భక్షయేత్ । మాషంసూర్యరసో
నామ * శుక్తికాసంజయేత్తతః । పిప్పల్యాసహ నిర్గుండ్యాః
క్వాథం చానుప్రపాయయేత్ । అష్టగుంజామితాభక్ష్యా వి
ఖ్యాతారసపర్పటీ । త్రికంటమూల శుంఠీచ హజాక్షీ రస
మోదకమ్ । క్షీరావశిష్టంతంక్వాథం సకణంపాయయేన్నిశి॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము 2 భాగములు శుద్ధిచేసిన స్వర్ణమాక్షికము 3 భాగములు అభ్రకభస్మము 4 భాగములు శుద్ధిజేసిన తాళకము 5 భాగములు ఇటుల వీనినెల్ల నేకముజేసి యందు వస చంగల్వకోష్టు పసపు చిత్రమూలము టంకణక్షారము సైంధవలవణము శుద్ధిజేసిన వసనాభి శిరుబొద్ది చన్నచల్లగడ్డ త్రికటుకములు అనువాని చూర్ణమును దినుసుకు కర్షప్రమాణము చొప్పున గలిపి గుంటగలగరాకురసముతో 1 దినము భావనజేసి మాషప్రమాణమును 12 పిప్పళ్లు వావిలియాకు అనువాని కషాయములోడ సేవించినను లేక 8 గురిగింజల యెత్తు రసపర్పటిని సేవించి పల్లేరువేళ్ళు శొంఠి అనువానిని దంచి యందు మేక పాలు మేకపాలకు సమముగ నుదకముబోసి పాలు శేషించువరకు కషాయముకాచి యందు పిప్పలిచూర్ణమును గలిపి రాత్రులయందు త్రాగినను శుక్తికాకాసము హరించు.

* హిక్కావైస్వర్యకాసజిత్। ఎక్కిళ్లు స్వరభంగము శుక్తికాకాసము హరించు.

### ఆమకాస లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] అతిశీతంచకాసశ్చ దధ్యాహార వివర్జితః।
శిరోర్తిఃక్షీణతాతృష్ణా హ్యామకాసస్య లక్షణమ్॥

తా. కడుశీతలము దగ్గుగలుగుట పెరుగన్నమునం దిచ్ఛలేకుండుట తలనొచ్చుట శరీరము కృశించుట దప్పిగలుగుట ఈలక్షణములు గలది ఆమకాసమని తెలియవలయు. (ఇది కష్టసాధ్యము.)

### ఆమకాసమునకు చంద్రామృతరసము.

శ్లో॥ శుద్ధసూతామృతంగంధం నేపాళంచ సమాంశకమ్।
అర్కమూలకషాయేణ మర్దితంచ త్రియామకమ్।
డోలాయంత్రే యామమాత్రం పాచితంచ సముద్ధరేత్।
గుంజామాత్రం ప్రదాతవ్య మామకాసం నియచ్ఛతి।
అయంచంద్రా మృతోనామ చంద్రనాథేన నిర్మితః॥

తా. రసము నాభి గంధకము నేపాళములు వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములో నునిచి జిల్లేడువేళ్ళకషాయముతో 3 జాములు మర్దించి ముద్దజేసిజిల్లేడు వేళ్లకషాయముచే డోలాయంత్రమున 1 జాము వండి గురిగింజంతమాత్రలుజేసిఎండించి యందొకదానిని సేవించిన ఆమకాసము హరించు ఇది చంద్రనాథునిచే నిర్మింపబడియె.

### పాండుకాస లక్షణము.

శ్లో॥ [మతాంతరే] దేహేచ పాండురచ్ఛాయా రాత్రౌశ్లేష్మ సముద్భవః। దివాశ్లేష్మవినాశశ్చ పాండుకాసస్యలక్షణమ్॥

తా. శరీరము పాండురవర్ణముగనుండుట రాత్రులయందు మిక్కుటముగదగ్గు గలుగుట పగటియందు దగ్గులేకుండుట ఈలక్షణములు గలది పాండుకాసమని తెలియవలయు.

### పాండుకాసమునకు కాససంహార భైరవము.

శ్లో॥ [మాధవనిదానే] మృతసూతం సమంచాభ్రం హింగుళం విషతాళకమ్। తుల్యాంతుల్యం ఖల్వమధ్యే క్షిపేన్మర్ద్యం దినద్వయమ్। హంసపాది కషాయేణకుక్కుటీ పుటపాచితమ్।

చూర్ణీకృతంచ తత్సమ్యగ్ జ్మాషమాత్రం ప్రదాపయేత్ ।
పాండుకాస వినాశస్స్యాత్సర్వకాస క్షయోభవేత్ । శ్రీను
ద్గహసనాథేన కాససంహార భైరవః । రసోయం నిర్మితో
యత్నా ల్లోకరక్షణహేతవే ॥

తా. రసభస్మము అభ్రకభస్మము శుద్ధిచేసిన ఇంగిలీకము శుద్ధిజేసిన నాభి శుద్ధిచేసిన తాళకము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదియాకు కషాయముతో 2 దినములు మర్దించి కుక్కుటపుటంబిడి సాంగశీతలమున దీసిచూర్ణ ముజేసి మాషప్రమాణమును తేనె పిప్పలితో సేవించిన పాండుకాసము సర్వకాస ములు హరించు. ఇది గహననాథునిచే లోకహితార్థమై నిర్మింపంబడియె.

## కృష్ణకాస లక్షణము.

శ్లో॥ [పూజ్యపాదీయే] రాత్రౌ శ్లేష్మ ప్రకోపశ్చ నిద్రాభోగవివ
ర్జితః । రాత్రౌ దుఃఖంచకృష్ణత్వం కృష్ణకాసస్య లక్షణమ్ ॥

తా. రాత్రులయందు మిక్కుటముగ దగ్గుగలుగుట నిదురబట్టకుండుట రాత్రులయందు దుఃఖముగలుగుట శరీరము నలుపుబారియుండుట ఈ లక్షణములు గలది కృష్ణకాసమని తెలియవలయు.

## కృష్ణకాసమునకు రసేంద్రఘుటిక.

శ్లో॥ విషసూతాభ్రకంగంధం వ్యోషంహింగుళసైంధవమ్ ।
లవంగంపిప్పలీమూలం తుల్యం తుల్యం విమర్దయేత్ ।
దినంహంసపదీద్రావైః కుక్కుటీపుటపాచితమ్ ।
చూర్ణీకృతంతతో దేయం మాషమాత్రం భిషగ్వరైః ।
కృష్ణకాసంనిహంత్యాశు సర్వకాసం నియచ్ఛతి॥

తా. శుద్ధిజేసిన నాభి శుద్ధిజేసిన రసము అభ్రకభస్మము శుద్ధిజేసిన గంధకము త్రికటుకములు శుద్ధిజేసిన ఇంగిలీకము సైంధవలవణము లవంగములు మోడి వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో నొకదినము మర్దించి కుక్కుటపుటంబిడి సాంగశీతలమున దీసి చూర్ణముజేసి మాషప్రమాణమును తేనె పిప్పలితో సేవించిన కృష్ణకాసము సర్వకాసములు శీఘ్రముగ హరించు.

## శ్లేష్మకాస లక్షణము.

శ్లో॥ [బాహటే] శ్లేష్మప్రకోపితః కంఠ స్సతతంరోగ విగ్రహః ।
దివారాత్ర ప్రకోపశ్చ శ్లేష్మకాసం వినిర్దిశేత్ ॥

తా. కుత్తికలో తెమడకట్టుట యెల్లపుడుశరీరమున శ్లేష్మము వ్యాపించియుండుట చేయుంబగలు దగ్గు గలుగుట ఈ లక్షణములు గలది శ్లేష్మవాతమని దెలియవలయు.

## శ్లేష్మకాసమునకు బోళబద్ధ రసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] రసభస్మ విషంతుల్యాం బోళాద్యాం ద్విగుణం మతమ్ । బోళ తాళక పాఠాగ్ని కర్కోటీ మాతృకం నిశా । కంటకారీ యవక్షారం లాంగలీ జీర సైంధవమ్ । మధూకసారంసంచూర్ణ్యం సప్తాహం చార్ద్రకద్రవైః । ఛాయాయాంపాచయేత్పశ్చా త్సప్తాహం చిత్రకద్రవైః । గుటికా బదరాకారా శ్లేష్మకాసాప సుత్తయే । భక్షయే ద్బోల బద్ధోయం రసస్స్యాచ్ఛ్వాస పాండుజిత్ । కటుత్రయం పావక దేవదారు రాస్నా విడంగ త్రిఫలామృతానామ్ । చూర్ణం సమాంశం సితయాసమేతం కాసం జయేద్విష్ణుగదేవదైత్యాన్॥

తా. రసభస్మము శుద్ధిజేసిన నాభి ఇవి సమభాగములు బోళము శుద్ధిజేసిన † హరిదళము శిరుబొద్ది చిత్రమూలము చేరిబీరవిత్తులు శుద్ధిజేసిన హేమమాక్షికము పసపు వాకుడు యవక్షారము చన్నచర్లగడ్డ జీలకఱ్ఱ సైంధవలవణము యష్టిమధుకము అనువాని చూర్ణము దినుసుకు 2 భాగములు ఇటుల వీనిని ఖల్వములో నునిచి అల్లపు రసములో 7 దినములు మర్దించి నీడనెండించి పిదప 7 దినములు చిత్రమూల రసములో భావనజేసి రేగుగింజలంత మాత్రలుజేసి యందొకదానిని త్రికటుకములు చిత్రమూలము దేవదారు దుంపరాస్నము వాయువిడంగములు త్రిఫలములు తిప్ప

† హరిదళమన — తాళకము.

తీ॥ అనువానిని సమభాగములుగ చూర్ణముజేసి దానికి సమముగ పంచదారగలిపి ఈయనుపానముతోడ సేవించిన "విష్ణుమూర్తియొక్క గదాయుధము దైత్యుల నిర్మూలముజేయు భంగి" శ్లేష్మకాసముశ్వాసము పాండువువీనిని నిర్మూలముజేయు.

## దధికాస లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శ్లేష్మోద్రేకశ్చ రోగేచ దధిభుక్తి వివర్జితః।
రాత్రౌ శ్లేష్మాదివానిద్రా దధికాసస్యలక్షణమ్॥

తా. దగ్గుగలుగుట పెలుగునం దిచ్ఛలేకుండుట రాత్రులయం దధికముగ దగ్గు పగటియందు నిద్రగలుగుట ఈలక్షణములుగలది దధికాసమని దెలియవలయు.

## దధికాసమునకు కాసవిధూననరసము.

శ్లో॥ రసగంధక పిప్పల్యో హరీతక్యక్ష వాసకమ్ ।
యష్ట్యుత్తరం సమంచూర్ణం బర్బరక్వాథ భావితమ్ ।
ఏవంవింశతివారేణ భావయిత్వా విచూర్ణయేత్ ।
భక్షయేన్మధునాచైవ దధికాసం వినాశయేత్ ।
విధూననరసోహ్యేష మహాదేవేన భాషితః॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిజేసిన గంధకము పిప్పళ్లు కరక్కాయలు గచ్చ పలుకులు ఆడ్డసరము యష్టిమధుకము వీనిని సమభాగములుగ చూర్ణముజేసి వాయింటాకు కషాయముతో 21 మార్లు భావనజేసి యెండించి చూర్ణముజేసి మాడయెత్తు ను లేనెతో సేవించిన దధికాసము హరించు.

## శ్లేష్మజిహ్వకకాస లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] జిహ్వాచాపి సమండలాసపిటకా దేహేచ కండూర్భవేత్ । తిక్తశ్లేష్మవివర్ణశీర్ణతనుతా పీడాహ్యసంభాషితా॥ నిర్నిద్రత్వముహర్నిశంచ దలతాకర్లేచ బాధిర్యకమ్।
ఏవశ్లేష్మకజిహ్వ కస్తుగదిత శ్చైవహ్యసాధ్యో భవేత్॥

తా. నాలుకయందు మండలములు పొక్కులుగలుగుట శరీరమున దురదగలుగుట కఫము వగరుగ వెడలుట శరీరము విశీర్ణముగ శిథిలముగనుండుటమాటలాడుటకు

తా. వ్రణము శారీర ఆగంతుక భేదములవలన 2 విధంబులు. అందు మొదటిదియగు శారీరమను వ్రణము వాతాదిదోషములవలన జనించు. 2 వది యగు ఆగంతుకవ్రణము శస్త్రాదుల గాయములవలన గలుగు.

వాతికవ్రణ లక్షణము.

శ్లో॥ స్తబ్ధః కఠినసంస్పర్శో మందస్రావో మహారుజః ।
తుద్యతేస్ఫురతిశ్యావో వ్రణోమారుతసంభవః ॥

తా. జడముగనుండుట తాకిన కఠినముగనుండుట కొంచెముగ స్రావము మిక్కుటముగ పోట్లుగలుగుట పొడిచినట్టుల వేదనతో గూడియుండుట స్ఫురించుట నల్లగనుండుట యీ లక్షణములుగలది వాతవ్రణమని తెలియవలయు.

పైత్తికవ్రణ లక్షణము.

శ్లో॥ తృష్ణామోహజ్వరక్లేద దాహదుష్టావదారణైః ।
వ్రణంపిత్తకృతంవిద్యా ద్గంధైస్రావైశ్చ పూతికైః ॥

తా. దప్పి మోహము జ్వరము చెమ్మ తాపముగలుగుట చీల్చబడినట్టుల వేదన గలుగుట కంపువేయుట దుర్గంధముగ స్రావముగలుగుట యీ లక్షణములుగలది పిత్తవ్రణమని తెలియవలయు.

కఫజవ్రణ లక్షణము.

శ్లో॥ బహుపిచ్ఛోగురుస్స్నిగ్ధ స్తిమితోమందవేదనః ।
పాండువర్ణోల్ప సంక్లేదీ చిరపాకీకఫోద్భవః ॥

తా. కడుజిగటగ జడము బట్టముగ నిశ్చలముగ మందవేదన గలదిగ తెల్లని వర్ణము గలదిగనుండుట కొంచెముగ స్రావముగలుగుట దీర్ఘకాలము మీద పండుట యీలక్షణములు గలది శ్లేష్మజవ్రణమని తెలియవలయు.

రక్తజ ద్వంద్వజవ్రణ లక్షణము.

శ్లో॥ రక్తోరక్తస్రుతీరక్తాద్ద్విత్రిజస్స్యాత్తదన్వయైః ॥

తా. రక్తవర్ణముగలదై రక్తమును స్రవింపం జేయుచుండు వ్రణము రక్తజ వ్రణమనంబడు. ఏకదోష రక్తసంబంధములవలన జనించినది ద్వంద్వజవ్రణమనియు ద్విదోష రక్తసంబంధమువలన జనించునది సన్నిపాతజ వ్రణమనియు జెప్పంబడు.

గోళకంధారి యేద్వ క్త్రే కంఠజిహ్వాం వినాశయేత్॥

తా. గుంటగలగరాకు చూర్ణములో తేనెగలపి ముద్దజేసి దానిని నోటిలో నిచికొని రసము మ్రింగుచుండిన కంఠజిహ్వాక కాసము హరించు.

దంతిధూమ పానము.

శ్లో॥ దంతిమూలస్య ధూమంవా నిర్గుండీచాపి యోజయేత్ ।
కంఠజిహ్వాం నిహంత్యేవ ధూమపానేన తత్క్షణాత్॥

తా. నేలగంతివేళ్ళను గాని వావిలియాకును గాని యెండించి చూర్ణము జేసి అగ్నిలోవైచి పొగను పానముజేసిన తక్షణమున కంఠజిహ్వాకకాసము హరించు.

ఉపజిహ్వాకకాస లక్షణము.

శ్లో॥ [అన్యచ్ఛేదే] జిహ్వోపరితథా జిహ్వాప్యన్న క్షీణస్తథైవచ।
గాత్రే శ్లేష్మప్రకోపశ్చా ప్యుపజిహ్వాక లక్షణమ్॥

తా. నాలుకపై నాలుక మొలిచినట్లుండుట అన్నమును భుజించుటకు శక్తి లేకుండుట గాత్రులయందు మిక్కుటముగ దగ్గగలుగుట ఈ లక్షణములుగలది ఉప జిహ్వాక కాసమని తెలియవలయు (ఇది హరించుటకై కృష్ణకాసమునకు జెప్పబడిన రసేంద్రగుటికలు 6 నెలలు సేవింపవలయు. మఱియు ఉపజిహ్వాకకాసము పురుషునికి జనించినయెడల కుడిచన్ను మొనకు 3 వ్రేళ్లక్రింద చంకలోరక్షవేయవలయు స్త్రీకైన యెడల ఎడమచన్ను మొనకు 3 వ్రేళ్లక్రింద చంకలో రక్షవేయవలయు. లేక చిత్రమూలపువేళ్ళచిప్పనుదెచ్చి గట్టిగగట్టిదానిపై కొజ్జల పిండినిమెత్తి దానిపై రావియాకుల విస్తరిని పొదగి దానిపై పుట్టమన్ను మెత్తి యెండించి పుట్ట మన్ను ఇటికె యగువరకు పుటంబిడి దీని యందలి పిండిని ప్రతిదినము సేవింపుచుండిన 4 మాసములలో ఉపజిహ్వాక కాసము హరించు.

జిహ్వాకకాస లక్షణము.

శ్లో॥ [చరకే] శ్లేష్మోపలిప్త జిహ్వాయాః క్షీణవాక్యకృశతాతథా।
నిద్రాహానిర్నిశి శ్లేష్మా జిహ్వాకాసస్య లక్షణము॥

తా. నాలుక కఫముచే పూయంబడినటులుండుట మాటలాడుటకుశక్తిలేకుండుట శరీరము కృశించుట నిదురబట్టకుండుట గాత్రులయందు దగ్గుగలుగుట ఈ లక్షణములు గలది జిహ్వాకకాసమని తెలియవలయు.

### జిహ్వాక కాసమునకు నీలకంఠ రసము.

శ్లో॥ సూతకం గంధకంలోహం విషంచిత్రకపత్రకమ్ । వరాంగం రేణుకాముస్తాగ్రంథికం నాగకేసరమ్ । ఫలత్రికం త్రికటుకం శుల్బం తుల్యం తద్ద్వైవచ । ఏతాని సమభాగాని గుడోద్విగుణముచ్యతే । సంమర్ద్యగుటికాంకృత్వా భక్షయేచ్చణమాత్రకమ్। జిహ్వాకాసేతథాగుల్మే ప్రమేహే విషమజ్వరే । మూత్రకృచ్ఛ్రేమూఢగర్భే వాతరోగేచదారుణే । నీలకంఠ రసోనామ శంభునిర్మిత స్స్వయమ్॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము లోహభస్మము శుద్ధిజేసిన నాభి చిత్రమూలము ఆనపత్రిక లవంగములు రేణుకలు తుంగముస్తెలు మోడి దాగకేసరములు త్రిఫలములు త్రికటుకములు తామ్రభస్మము ఇవి సమభాగములు వీనికన్నిటికి రెండింతలు బెల్లము ఇటుల నేకముజేసి బాగుగమర్దించి సెనగలంతమాత్రలుజేసి సేవించిన జిహ్వాక కాసము గుల్మము ప్రమేహము విషమజ్వరము మూత్రకృచ్ఛ్రము మూఢగర్భము దారుణమైన వాతరోగము వీనినపహరింపంజేయు ఈ నీలకంఠరసమును శంభుడు స్వయముగ గల్పించె.

### ఊర్ధ్వకాస లక్షణము.

శ్లో॥ [చరకే] ఆకర్షణంచతీవ్రేణ వాయునాశ్లేష్మణస్తథా ।
మహామేఘా శ్చిత్రవస్స్యూర్ధ్వశ్లేష్మ ప్రపీడితః॥

తా. తీవ్రమైన వాతము శ్లేష్మము నాకర్షించుట [అనగా పుబ్బసము గలుగుట] మేఘము రావరించియుండునపుడు మిక్కుటముగ పుబ్బసముగలుగుట ఈలక్షణములుగలది ఊర్ధ్వకాసమని దెలియవలయు. [దీనినే కొందరు మేఘరంజియనియు వచించెదరు,]

### ఊర్ధ్వకాసమునకు కాసకేసరి వటికములు.

శ్లో॥ గంధంత్రికటుకంచాభ్రం రోహిణీతాళకంసమమ్।
పంచకోలకషాయేణ మర్దయేద్దివసత్రయమ్ ।

మూషయేద్భూధరేశాచ్యం సాంగశీతం సముద్ధరేత్ ।
మధునాచానుపానేవ హ్యూర్ధ్వశ్వాసం వినశ్యతి॥

తా. శుద్ధిచేసిన గంధకము త్రికటుకములు అభ్రకభస్మము కటుకరోహిణి శుద్ధిజేసిన తాళకము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి పంచకోలకషాయములో 3 దినములు మర్దించి మూసలో నునిచి చీలమన్ను లేపనముచేసి భూధరయంత్రమున పుటంబిడి సాంగశీతలమునదీసి గురిగింజంతయెత్తును తేనెతో ఒక సంవత్సరము సేవింపుచుండిన ఊర్ధ్వశ్వాసము (అనగా ఉబ్బసము) హరించు.

ఊర్ధ్వశ్వాసమునకు అంకోలాది చూర్ణము.

శ్లో॥ అంకోలస్యపలాన్యష్టౌ త్రిగుణైర్మరిచైస్సహ ।
తథాలిహ్యేచ్ఛృతచూర్ణం మధునాచోర్ధ్వకాసకే॥

తా. ఊడుగచెక్క 8 పలములు మిరియాలు 24 పలములు వీనిని దంచి చూర్ణముజేసి తేనెతో సేవించిన ఉబ్బసము హరించు.

ఆ–గీ॥ [బాహటము] ఉసిరికాయపప్పు నొప్పగునల్లేరు ।
సిందురంబుఁగూర్చి చెలువుమీఱ ।
దానినొక్కయేఁడు ప్రాణిసేవించిన ।
సకలరోగసమితి సమసిపోవు॥

క॥ బలురక్కసినల్లేరును । జెలువుగమరియుప్పుఁగూర్చి సేవించినచో ।
సెలపాఱుమేఘరంజిని । కులమెల్లను వేగనడఁచు గోపతిగమనా॥

గీ॥ సాంటిపంచదార సున్నపు రాళ్ళలో ।
బట్టముల్లె గట్టిపెట్టినీరు ।
వోసివండిదించి ప్రాణిసిందూరంబు ।
సేవఁజేయమాను శీఘ్రముగను॥

శ్లేష్మభంగాళీ లక్షణము.

శ్లో॥ [అన్యశాస్త్రే] ఆవికశ్లేష్మలఃకంఠా దంగేపీతంచనేత్రయోః।
బాధిర్యంశ్లేష్మణాప్రోక్తం భ్రమమూర్ఛాశ్రమక్లమాః।
స్యాద్రూపంశ్లేష్మణాజిహ్వా భంగాళీశ్లేష్మకేతథా॥

తా. నోట మేక తెమడవలె వెళ్ళుట శరీరము నేత్రములు పచ్చగనుండుట శ్లేష్మప్రకోపమువలన చెవుడుగలుగుట తబ్బిబ్బులాడుట మూర్ఛ శ్రమ ఆయాసము గలుగుట నాలుక శ్లేష్మముతో పూయంబడినటులుండుట ఈలక్షణములుగలది శ్లేష్మ భంగాళియని తెలియవలయు.

## సర్వకాసములకు స్వర్ణభూపతి.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం సమంగంధం మృతిశుల్బం తయోస్సమమ్ । అభ్రలోహాక యోర్భస్మకాంతభస్మ సువర్ణజమ్ । రాజతంచవిషంసామ్యా క్పృథక్స్యాత్సమంభవేత్ । హంసపాదీరసైర్మర్ద్యందినమేకం వటీకృతమ్ । కాచకుప్యాం వినిక్షిప్యమృదాసం లేపయేద్బహిః । శుష్కాసావాలుకా యంత్రేశనైర్మృద్వగ్నినాపచేత్ । చతుర్గుంజామితం దేయం పిప్పల్యార్ద్రకవేణతు । క్షయంత్రిదోషజం హంతిసన్నిపాతాం స్త్రయోదశ । ఆమవాతం ధనుర్వాతం శృంఖలావాతమేవచ । ఆఢ్యవాతంపంగువాతం కఫవాతాగ్నిమాంద్యనుత్ । కటీవాతంసర్వశూలం నాశయేన్నాత్రసంశయః । గుల్మసూలముదావర్తం గ్రహణీమతిదుస్తరామ్ । ప్రమేహముదరం సర్వామశ్మరీం మూత్రవిడ్గ్రహమ్ । భగందరం సర్వకుష్ఠం విద్రధింమహతీంతథా । శ్వాసంకాసమజీర్ణంచ జ్వరమష్టవిధంతథా । కామలాంపాండురోగంచ శిరోరోగంచ నాశయేత్ । అనుపానవిశేషేణ సర్వరోగాన్వినాశయేత్ । యథాసూర్యోదయేన శ్యేత్తమస్సర్వగతంతథా । సర్వరోగవినాశాయసర్వేషాంస్వర్ణభూపతిః॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము 1 భాగము తామ్రభస్మము 2 భాగములు అభ్రకభస్మము లోహభస్మము కాంతభస్మము స్వర్ణభస్మము రజితభస్మము శుద్ధిచేసిన వసనాభి ఇవి దినుసుయొకటింటి కొక్కొకభాగము ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి హంసపాదియాకురసముతో 1 దినము మర్దించి ముద్దజేసి యెండించి గాజుకుప్పెలోనునిచి దానిపైచీలమన్ను లేపనముజేసి యెండించివాలుకా

యంత్రములో నునిచి మందాగ్నితో మెల్లగవండి స్వాంగశీతలమున దీసి 4 గురిగింజల యెత్తును పిప్పళ్ళు అల్లపురసము అనువాని యనుపానముతోడ సేవించిన సన్నిపాత క్షయము 13 సన్నిపాతములు అనువాతము ధనుర్వాతము శృంఖలావాతము అర్ధవాతము పంగువాతము కఫవాతము అగ్నిమాంద్యము కటివాతము సర్వశూలలుగుల్మ శూల ఉదావర్తము కడుబలిష్ఠమైన గ్రహణీరోగము ప్రమేహము సర్వఉదరరోగములు అశ్మరీరోగము మూత్రకృచ్ఛ్రము మలబద్ధము భగందరము సర్వకుష్ఠములు బలిష్ఠమైన విద్రధులు శ్వాసము కాసము అజీర్ణము 8 విధములైన జ్వరములుకామిల పాండురోగము శిరోరోగము "సూర్యుడుదయించుటవలన అంధకారము నశించుభంగి" నిస్సంశయముగ నశించుటయేగాక అనుపానవిశేషములవలన సర్వరోగములు నశింపంజేయును.

## శ్లేష్మభంగాళీకాసమునకు నిదిగ్ధికాది చూర్ణము.

శ్లో॥ నిదిగ్ధికామామలకాస్థికంచ హింగూషణాభ్యాం మధునాచ
యుక్తామ్ । లిహ్యాన్నరశ్వాసనపీడితశ్చ శ్లేష్మాళిభంగంవిని
హంతిశీఘ్రమ్॥

తా. రామములకపండు ఉసిరికపప్పు.ఇంగువ పిప్పళ్ళు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి తేనెతో సేవించిన మూలరోగము శ్లేష్మభంగాళికాసము శీఘ్రముగ హరించు.

## కుష్టకాస లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అత్యుద్ధృతోప్యనాకారో వ్యంగసైకల్య
దుఃఖితా । కండూశ్చదేహపాండుశ్చ శ్లేష్మకుష్ఠస్యలక్షణమ్॥

తా. ఉలికిపడుట ఆకారముచెడుట అంగములు నొచ్చుట శరీరమున దురద గలుగుట శరీరము పాండురవర్ణముగ నుండుట ఈ లక్షణములు గలది కుష్ఠకాసమని తెలియవలయును.

## కుష్ఠకాసమునకు అగ్నిరసము.

శ్లో॥ [రసరత్నాకరే] శుద్ధసూతంవిషంగంధంశిఖితుత్థంచటంకణమ్।
దరదంతాళకంచైవ సమభాగానికారయేత్ ।
పునర్నవామూలరసైర్మర్దితం హరత్రయమ్ ।
పాచయేద్యామమాత్రంతుడోలాయంత్రేచబుద్ధిమాన్ ।

గుంజాద్వయంతథానిత్యం శ్లేష్మకుష్ఠవినాశనః ।
భక్షయేన్మధునాహంతి కాసమగ్నిరసోహ్యయమ్॥

తా. రసము గంధకము మైలుతుత్తము వెలిగారము ఇంగిలీకము తాళకము వీనిని శుద్ధిచేసిన సమభాగములుగ ఖల్వములో నునిచి గలిజేరువేళ్ల రసముతో 3 దినములు మర్దించి గలిజేరువేళ్ల రసముతో డోలాయంత్రమున నొక దినామువండి 2 గురిగింజల యెత్తును తేనెతో ప్రతిదినము సేవింపుచుండిన కుష్ఠకాసము హరించు.

## సర్వకాసములకు క్షుద్రాది లేహ్యము.

శ్లో॥ [మాధవనిదానే] వ్యాఘ్రీశతంస్యాదభయాశతంచ ద్రోణే జలస్యప్రపచేత్కషాయమ్ । తులాప్రమాణేనగుడేనయుక్తః పక్వాభయాభిస్సహతాభిరత్ర । శీతేక్షిపేత్క్షౌద్రమ్ఘునః పలాని పలానిచత్రీణికటుత్రయస్య । త్వక్పత్రకైలాగరుకేసరాణాం చూర్ణాత్పలంచేతివిదేహదృష్టః । క్షుద్రావలేహః కఫజాన్వికారాన్ సశ్వాస శోషానపిపంచకాసాన్ । హిక్కాముర్శోరోగమపస్మృతించ హత్వావివృద్ధింకురుతేనలస్య॥

తా. నేలములకవేళ్ళు 100 పలములు కరక్కాయలు 100 పలములు ఈరెంటిని చిదియగొట్టి ద్రోణప్రమాణము నీళ్ళుబోసి చతుర్థాంశముగ కషాయముగాచి వడియగట్టి అందు ప్రాతబెల్లము 100 పలములు గలిపిపైకషాయములోని కరక్కాయల నిందువైచి పక్వముజేసి చల్లారిన పిమ్మట యందు తేనె 6 పలములు త్రికటుక చూర్ణము 3 పలములు లవంగపట్ట ఆకుపత్రిక ఏలకులు అగరు నాగకేసరలు అను యీని చూర్ణము దినుసుకొక్కొక పలముచొప్పున గలిపి లేహ్యపక్వముగా వండి సేవింపుచుండిన శ్లేష్మరోగములు 5 శ్వాసములు శోష 5 కాసములు యెక్కిళ్ళు రొమ్మునొప్పి అపస్మారము వీనిని నశింపజేసి అగ్నిదీపమును గలుగంజేయు.

## సర్వకాసములకు మహాక్షుద్రాది లేహ్యము.

శ్లో॥ [మతాంతరే] వ్యాఘ్రీమూలంతులాచైవ పంచకోలంతదర్థకమ్ । తదర్థంగ్రంథికంచైవ భార్గీరాస్నా పృథక్పలమ్ । హరీతక్యాశ్శతంచైవద్విఖుంభంజలమేవచ । వాసాభృంగచ

నిర్గుండీ కురంటశ్చతుర్ద్రవమేవచ । స్వరసం ప్రస్థమేకైకంద్రవస్థం గోఛాగమూత్రయోః। పురాణగుడమాదాయ తులామేకాం నిధాపయేత్ । త్రికటుత్రిఫలాగ్రంథిచాతుర్జాతకసైంధవమ్। ద్విక్షారంపంచలవణాం టంకణంరామఠంపృథక్ । పలంపలం వినిక్షేవ్యం కాసానాంవింశతింజయేత్ । మహాక్షుద్రాదికో నామ లేహ్యరాజోనసంశయః॥

తా. నేలములకవేళ్ళు 100 పలములు*పంచకోలములు 50 పలములు మోడి 25 పలములు గంటుభారంగి దుంపరాష్ట్రము ఇవి దినుసుకొక్కొక్కపలము కరక్కాయలబెరడు 100 పలములు ఇట్టుల వీని నెల్ల నేకముజేసి2 సంభములనీళ్లుబోసి చతుర్థాంశముగ కషాయముగాచి అందు అడ్డసరపాకు గుంటగలగరాకు వావిలియాకులు గోరంటాకు నేలములకవేళ్ళు అనువాని రసముల దినుసుమొకటింటి కొక్కొక్క ప్రస్థము ఆవుపంచితము మేకపంచితము దినుసుకొక్కొక్క ప్రస్థము ప్రాతబెల్లము 100 పలములుగలిపి పక్వంబగు నప్పుడందు త్రికటుకములు త్రిఫలములు మోడి † చాతుర్జాతకములు సైంధవలవణము యవక్షారము సర్జక్షారము ‡ పంచలవణములు పేల్చిన వెలిగారము పేల్చిన యింగువ అనువానిని దినుసుకొక్కొక్క పలము చొప్పున గలిపి లేహ్యపక్వముగ వండి దించుకొని సేవించిన 20 కాసములు హరించు. ఇది సర్వలేహ్యములలో శ్రేష్ఠంబైనది.

## మేఘరంజిదగ్గుకు చికిత్స.

క॥ చేదయిన బీరవిత్తుల ।
మోదంబున వేడినీళ్ళ ముద్దుగనూరన్ ।
వేదననొందక త్రాగిన ।
భేదించును మేఘరంజి పీనసమానున్॥

* పంచకోలములన–పిప్పలి మోడి చెవ్యము చిత్రమూలము శొంఠి.

† చాతుర్జాతకములన–ఏలకులు లవంగపుచెక్క ఆకుపత్రిక నాగకేసరములు.

‡ పంచలవణములన–సైంధవలవణము కాచలవణము సముద్రలవణము సౌవర్చలవణము బిడాలవణము.

తా. శరీరదార్ఢ్యముగలవారు 20 చేదుబీరవిత్తులగాని లేక 16 చేదుబీరవిత్తుల గాని ఉష్ణోదకముతో నూరి ఉబ్బసము గలిగినప్పుడు త్రాగిన వమనంబులై తిత్తులుపడును పిదప శాంతి యుక్తముగ మజ్జిగయన్నమును భక్షించిన వాంతులు నిలుచును

## అసాధ్య శ్లేష్మ రోగోపద్రవములు.

శ్లో॥ [ఆయుర్వేదే] కపాల జిహ్వాకాశూలం జ్వరః పాండుశ్చనే
త్రయోః । రోమహర్ష ప్రతిశ్వాసోప్యసాధ్యోనాస్తిభేషజమ్॥

తా. కపాలము నాలుక శూలించుట జ్వరముగలుగుట నేత్రములు పాండుర వర్ణముగ నుండుట రోమములు గగుర్పొడుచుట మిక్కుటముగ శ్వాసముగలుగుట ఈలక్షణములుగల కాసరోగి జీవించుట దుర్లభమని తెలియవలయు.

## కాసములకు కదళీఫల యోగము.

శ్లో॥ వికారే శ్లేష్మణాజాతే భక్షయేత్కదళీఫలమ్।
మర్దితైర్మరిచైస్సార్ధం హంతిశ్లేష్మచిరంతనమ్॥

తా. అరటిపండులో మిరియపుచూర్ణము గలిపి సేవించిన దీర్ఘకాలముగనుండు కాసరోగములు హరించు.

## కాసరోగములయందు పథ్యము.

శ్లో॥ [ఆయుర్వేదే] శాలిషష్టికగోధూమామాషముద్గకులుత్థకాః।
ఛాగ్యాఃపయోఃఘృతంబింబీవార్తాకం బాలమూలకమ్।
కాసమర్దకజీవంతి వాస్తుకంబీజపూరకమ్।
గోస్తనిలశునంలాజా వ్యోషముష్ణోదకంమధు।
పథ్యమేతద్యథాదోష ముక్తం కాసగదాతురే॥

తా. 60 దినములకు ఫలించిన ధాన్యము గోధుమలు మినుములు పెసలపప్పు వులవలు మేకపాలు మేకనెయ్యి దొండకాయ లేతవంకాయ లేతముల్లంగి కసివెంద పాలకూర చక్రవర్తపుకూర మాదీఫలము ద్రాక్షపండు వెల్లుల్లి పేలాలు త్రికటుకములు ఉష్ణోదకము తేనె ఇవి కాసరోగములయందు పథ్యకరంబులు.

శ్లో॥ [మాధవనిదానే] పటోలమిసిరిఝిల్లీ కవాస్తుకంబాలమూలకమ్।
ఝురసీతిక్తకంచైవ బాలంచకదళీఫలమ్।

కుటజంపక్వకూశ్మాండం కషాయకటుతిక్తకమ్।
మధూకంతండులీయంచ పయోవింశతికాసినామ్॥

తా. పొట్లకాయ పిన్నసదాప కొయ్యతోటకూర చక్రవర్తికూర లేతముల్లంగి చాతలాసికూర చేదబీర లేతఅరటికాయ దాడిసకాయ ముదురుగుమ్మడుకాయ ఒగరు కారము చేదుగలపదార్థములు ఇప్పపువ్వు చిర్రికూర పాలు ఇవి 20 కాసములయందు పథ్యకరంబులు.

కాసరోగములయం దపథ్యము.

శ్లో॥ [ఆయుర్వేదే] మైథునంస్నిగ్ధమధురం దివాస్వాపఃపయోదధి।
పిష్టాన్నంపాయసాదీని కాసీఘామంచవర్జయేత్॥

తా. స్త్రీసంగమము జిగటగల పదార్థములు మధురపదార్థములు పగటియందు నిద్రించుట పాలు పెరుగు పిండివంటకములు పాయసము మొదలగునవియు పొగయందుండుట ఇవి కాసరోగములయం దపథ్యకరంబులు అట్లగుటంజేసి వీని నివర్తింపవలయు.

శ్లో॥ [మాధవనిదానే] మత్స్యాలాబుచ వార్తాకంకంద్లాన్లంతిల తైలకమ్ । ఉపోతకీదధిక్షీరంచూహీమం శుష్కరూక్షకమ్ ।
తథావింశతికాసేష్వత్యజేద్ధ్రివ్యాణిబుద్ధిమాన్॥

తా. మత్స్యములు * అనుపకాయ వంకాయ కందగడ్డ పులుసు నూనెబచ్చలికూర బర్రెపెరుగు బర్రెపాలు యెండిన ద్రవ్యములు రూక్షపదార్థములు ఇవి 20 కాసములయం దపథ్యకరంబులు కావున వీనిని వర్జింపవలయు.

‡ శ్వాస నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] మహోర్ధ్వచ్ఛిన్నతమక క్షుద్ర బేధైస్తు పంచధా । భిద్యతేసమహావ్యాధి శ్వాసయేకోపిశేషితః॥

తా. ] శ్వాసరోగమే మహత్తు ఊర్ధ్వము ఛిన్నముతమకముక్షుద్రముఅన 5 విధంబులుగ నగు.

శ్వాసరోగ పూర్వరూపములు.

శ్లో॥ ప్రాగ్రూపంతస్యహృత్పీడా శూలమాధ్మానమేవచ ।

* అనుపకాయ అనగా-సొరకాయ, ‡ శ్వాసమన-ఎగయూపిరి.

ఆనాహోప క్త్రివైరస్యం శంఖనిస్తోదఏవచ॥

తా. హృదయమున కీడ శూలగలుగుట కడుపుబ్బుట కడుపీడ్చుట నోరుచే దుగనుండుట కణతయందు బొడుచునటుల పీడగలుగుట ఇవి శ్వాసరోగమునకు పూర్వరూపంబులు.

## మహాశ్వాస లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] ఉద్ధూయమానవాతోయశ్శబ్దవద్దుఃఖితోనరః। ఉచ్చైశ్శ్వసతిసంరుద్ధోమత్తర్షభ ఇవానిశమ్ । ప్రణష్టజ్ఞానవిజ్ఞాన స్తథా విభ్రాంతలోచనః । వి స్తృతాక్ష్యాననోబద్ధమూత్రవర్చావిశీర్ణవాక్ । దీనఃప్రశ్వసితంచాస్యదూరాద్విజ్ఞాయతేభృశమ్ । మహాశ్వాసోప సృష్టస్తుక్షిప్రమేవవిపద్యతే॥

తా. వాతము పైకి ఈడువబడుటవలన మనుజుడు కడుదుఃఖితుడై "మదించిన వృషభమును బంధించుటవలన గొప్పశబ్దమును చేయుమాడ్కి" శ్వాసమునువిడుచుచు ఎల్లయుంబగలు శ్వాసమువలన పీడితుడుగనుండుట శాస్త్రము శాస్త్రార్థనిశ్చయము నశించుట ఒకానొకపుడు నేత్రములు తిరుగుట నేత్రములు నోరు తెరచికొని జడముగ నుండుట జలమలాదులు వెడలకుండుటయు మాట్లాడుటకు శక్తిలేకుండుట మాట్లాడినను హీనస్వరముగ మాటలాడుట మనస్సు ఖిన్నంబగుట దూరముగ నుండునపుడే శ్వాసవేగము తెలియవచ్చుట ఈ లక్షణములుగలది మహాశ్వాసమని తెలియవలయు. ఇది గలవాడు నశించు.

## ఊర్ధ్వశ్వాస లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] ఊర్ధ్వశ్వస్య సితియోదీర్ఘం నచప్రత్యాహారత్యధః । శ్లేష్మావృతముఖస్రోతాః క్రుద్ధగంధవహార్దితః।ఊర్ధ్వదృష్టిర్విపశ్యంశ్చవిభ్రాంతాక్ష ఇత స్తతః । ప్రముహ్యన్వేదనార్తశ్చ శుష్కాస్యోఽరతిపీడితః॥

తా. దీర్ఘకాలమువరకును ఊర్ధ్వశ్వాసము వెడలుచుండుట ఊర్ధ్వశ్వాసమును దించుటకు శక్తిలేకుండుట నోరు నేత్రములు నాసికారంధ్రములు కర్ణరంధ్రములు కఫముచేనడ్డగింపంబడుట వాత ప్రకోపమువలన పీడితుడై పాడవుగ జూచుచు

చంచలమైన దృష్టితో ఇటు అటు చూచుట మూర్ఛ వేదన అనువానివలన కడుపీడి తుడుగనుండుట నోరెండుట యెల్లప్పుడు దేనియందాసక్తిలేకుండుట ఈ లక్షణము లు గలది ఊర్ధ్వశ్వాసమని తెలియవలయు.

శ్వాసాధోముఖ నిషేధకారణము.

శ్లో॥ ఊర్ధ్వశ్వాసే ప్రకుపితే హ్యధశ్శ్వాసో నిరుధ్యతే।
ముహ్యతస్తామ్యతశ్చోర్ధ్వం శ్వాసస్తసైవ హంత్యసూన్ ॥

తా. ఊర్ధ్వశ్వాసము ప్రకోపించుటవలన అధశ్శ్వాసము అడ్డగింపంబడు (అనగా హృదయమునందేయడ్డగింపంబడుననుట) లేక శ్వాసమునగాయధోముఖమును జెందకుండు. దానివలన రోగి మోహములు బడలికను జెందు. ఈ యూర్ధ్వశ్వాసము ప్రాణముల హరింపజేయు.

ఛిన్నశ్వాస లక్షణము.

శ్లో॥ యస్తుశ్వసితి విచ్ఛిన్నం సర్వప్రాణేన పీడితః। నవాశ్వసితి దుఃఖార్తో మర్మచ్ఛేదరుగర్దితః। ఆనాహస్వేదమూర్ఛార్తో దహ్యమానేనవస్తినా। విప్లుతాక్షః పరిక్షీణ శ్వసన్ రక్తైక లోచనః। విచేతాః పరిశుష్కాస్యో వివర్ణః ప్రలపన్నరః। ఛిన్నశ్వాసేనవిచ్ఛిన్న స్సశీఘ్రం విజహాత్యసూన్॥

తా. నిలిపినిలిపి శ్వాసములువిడుచుట శక్తికొలది శ్వాసమును విడువయత్నించినను సాధ్యపడకుండుట లేక క్లేశమును జెంది శ్వాసమును విడుచుట తొమ్మలో గొడ్డలితో ఛేధించునటుల పీడగలుగుట కడుపుబ్బరము చెమట మూర్ఛఅనువానితో పీడింపబడుట పొత్తికడుపునందు మండుట నేత్రములను గిరగిరత్రిప్పుట లేక సత్వహీనుడై నేత్రములుచలింపక నిద్రబొడిచికొనుట శ్వాసమును పలుమారువిడుచుటవలన క్షయించుట ఒక నేత్రము యెఱ్ఱగ నుండుట మనస్సుఖిన్నమగుట నోరెండుట కాంతిజెడుట వదరుట సంధిబంధములు శిథిలంబులగుట ఈ లక్షణములుగలది ఛిన్నశ్వాసమని తెలియవలయు. ఇదిగలవాడు కడు శీఘ్రముగా ప్రాణములవిడుచు.

తమకశ్వాస లక్షణము.

శ్లో॥ [చరకే] ప్రతిలోమంయదావాయుస్స్రోతాంసిప్రతిపద్యతే।
గ్రీవాంశిరశ్చ సంగృహ్య శ్లేష్మాణం సముదీర్యచ। కరోతి

పీనసంతేన రుద్ధోఽతిఘుర్ఘురంతథా । అతీవతీవ్రవేగంచ శ్వాస
ప్రాణప్రపీడకమ్ । ప్రతామ్యతిసవేగేనత్రస్యతేసన్నిరుధ్యతే ।
ప్రమోహంకాసమానశ్చ సగచ్ఛతిముహుర్ముహుః । శ్లేష్మ
ణ్యముచ్యమానేతు భృశంభవతిదుఃఖితః । తస్యైవచవిమో
క్షాంతే ముహూర్తంలభతేసుఖమ్ । తథాస్యోద్ధ్వంసతే
కంఠః కృచ్ఛ్రాచ్ఛక్నోతిభాషితమ్ । నచాపి నిద్రాంలభతే
శయాన శ్వాసపీడితః । పార్శ్వేతస్యావగృహ్ణాతిశయానస్య
సమీరణః । ఆసీనో లభతేసౌఖ్య ముష్ణంచైవాభి నందతి ।
ఉచ్ఛ్రితాక్షోలలాటేన స్విద్యతాభృశమార్తిమాన్ । విశు
ష్కాస్యో ముహుశ్శ్వాసో ముహుశ్చైవా వధమ్యతే ।
మేఘాంబుశీతప్రాగ్వాతై శ్లేష్మలైశ్చవివర్ధతే । సయాప్యస్త
మకశ్వాస స్సాధ్యోవాస్యా న్నవోద్ధితః॥

తా. వాతము మెడ శిరము అనువాని నాశ్రయించి యధోముఖముగ స్రోతో
మార్గములం జెంది కఫమును ప్రకోపింపం జేసి కఫమువలన నడ్డగింపబడినదై పడిసె
మును గొంతులో గురగురశబ్దమును గలుగం జేయుచు కడుతీవ్రవేగయుక్తమైనహృద
యప్రపీడకమైన శ్వాసమును గలుగంజేయుట దానివేగమువలన మోహమును జెంది
మిక్కుటముగ దుఃఖించుట నిశ్చేష్టితుండగుట పలుమారు దగ్గుటవలన మోహమును
జెందుట కఫము వెడలకుండునప్పుడు కడుపీడం జెందుట కఫము వెడలిన పిదప కొంత
కాలము సుఖముగనుండుట మరల కంఠములో కఫము చేరుటవలన దురదగలుగుట
కడుకష్టముచే మాటలాడుట శ్వాసపీడవలన పరుండినను నిదురరాకుండుట పరుం
డియుండినను వాతము యిరుపార్శ్వములనీడ్చుట కూర్చుండియుండిన సుఖముగనుం
డుట ఉష్ణపదార్థసేవనవలన సంతోషమును జెందుట కండ్లుబ్బుట నుదుట చెమట
పట్టుటవలన కడుపీడం జెందినటులతోచుట నోరెండుట పలుమారు శ్వాసము వెడ
లుట ఏనుగపై గూర్చుండి యుండువాని శరీరము కదలునటుల పలుమారుకదలుట
మేఘములు వర్షము చలి తూర్పుగాలి కఫకరపదార్థసేవన అనువానివలన శ్వాసము
వృద్ధింజెందుట ఈ లక్షణములుగలది తమకశ్వాసమని తెలియవలయు. (ఇదియాప్య
ము.) నూతనముగ జనించిన సాధ్యము.

## క్షుద్రశ్వాస లక్షణము.

శ్లో॥ రూక్షాయాసోద్భవఃకోష్ఠేక్షుద్రోవాతముదీరయేత్ ।
క్షుద్రశ్వాసోనసోత్యర్థం దుఃఖేనాంగప్రబాధకః ।
హీనస్తేనసగాత్రాణి నచదుఃఖోయథేతరే।
నచభోజనపానానాం నిరుణద్ధ్యుచితాంగతిమ్ ।
నేంద్రియాణాంవ్యథాంచాపి కాంచిదాపాదయేద్రుజమ్॥

తా. రూక్షపదార్థసేవన ఆయాసము వీనివలన నొకింతశ్వాసము జనించి కోష్ఠగతవాతము నూర్ధ్వముగజేసి కడుదుఃఖమును శరీరమున కెవ్విధమైన బాధను ప్రాణవియోగమును ఊర్ధ్వశ్వాసాదులయందుగల దుఃఖములను గలుగంజేయక నపానాదికముల గతిని నిరోధింపక భోజనపానాదికముల గతినినిరోధింపక ఇంద్రియముల కెవ్విధమైన వ్యథయును గలుగంజేయకనుండునది క్షుద్రశ్వాసమనంబడు.

## శ్వాససాధ్యాసాధ్య విచారము.

శ్లో॥ [ఆయుర్వేదే] ససాధ్యఉక్తోబలిన స్సర్వేచావ్యక్తలక్షణాః ।
క్షుద్రస్సాధ్యతమ స్తేషాం తమకఃకృచ్ఛ్రఉచ్యతే ।
త్రయశ్శ్వాసానసిధ్యంతి తమకోదుర్బలస్యచ॥

తా. క్షుద్రశ్వాసము సాధ్యము. మఱియు సత్వముగల వానియొక్క మహాశ్వాసాదులు అల్పలక్షణయుక్తంబులుగ నుండిన సాధ్యంబు. అందు క్షుద్రశ్వాసము కడుసాధ్యంబు. మఱియు తమకశ్వాసము కష్టసాధ్యంబు. మహత్తు ఊర్ధ్వము ఛిన్నము అన నీ 3 శ్వాసములు సంపూర్ణలక్షణయుక్తంబులై నుండిన అసాధ్యంబులు. మఱియు దుర్బలునికి జనించిన తమకశ్వాసము సగా అసాధ్యంబు,

## రోగసంప్రాప్తిలక్షణములు.

శ్లో॥ [మాధవనిదానే] యదాస్రోతాంసిసంరుద్ధ్య మారుతఃకఫపూర్వకః । విష్వగ్వ్రజతిసంరుద్ధ స్తదాశ్వాసంకరోతిసః। ప్రణష్ట జ్ఞానవిజ్ఞాన స్తథావిభ్రాంతలోచనః । ఊర్ధ్వంశ్వసితిమోదీర్ఘం నచప్రత్యాహారత్యధః । శ్లేష్మావృత ముఖ

స్రోతా హ్యూర్ధ్వదృష్ట్యాచ పశ్యతి । ఆనాహ స్వేదమూ ర్చార్తో భృశం భవతిదుఃఖతః॥

తా. వాతము కఫయుక్తమై ప్రాణాన్నోదకములవహించు స్రోతోమార్గము లనడ్డగించి విరుద్ధమార్గముగలదై సర్వశరీరమునవ్యాపించి శ్వాసరోగమును గలుగం జేయు. అందు శాస్త్రజ్ఞానము శాస్త్రార్థజ్ఞానము నశించుట నేత్రములుదిరుగుట దీర్ఘకాలమువరకు యెగయూపిరివిడుచుటయెగయూపిరిని డించుటకు శక్తిలేకుండుట నోరు కర్ణనాసి కారంధ్రములు నేత్రములు వీనియందు శ్లేష్మమువ్యాపించియుండుట పొడవుగజూచుట కడుపుబ్బుట చెమట మూర్ఛ కడుదుఃఖముగలుగుట అన నీ లక్షణములు గలుగు.

## శ్వాససామాన్య లక్షణములు.

శ్లో॥ [ఆయుర్వేదే] శ్వాసః పంచవిధస్తత్ర మహాశ్వాసో మహాస్వనః। ఊర్ధ్వశ్వాస శ్చోర్ధ్వదృష్టి శ్ఛిన్నోఽచ్ఛిన్న సంజ్ఞకః। తమోభ్రమ ఘనశ్చైవ క్షుద్రాఖ్యో మందవేదనః। క్షుద్ర స్సాధ్య స్తమోయాప్య శ్శేషాః ప్రాణహరాస్త్రయః॥

తా. పూర్వోక్త పంచవిధ శ్వాసములలో మిక్కుటముగ శబ్దముగలది మహాశ్వాసమనియు ఊర్ధ్వదృష్టిగలది ఊర్ధ్వశ్వాసమనియు నిలిచినిలిచి శ్వాసమువచ్చునది ఛిన్నశ్వాసమనియు నేత్రములు గనుపడక భ్రమసినట్లుండునది తమకశ్వాసమనియు స్వల్పముగ నొప్పిగలది క్షుద్రశ్వాసమనియు తెలియవలయు. అందు క్షుద్రశ్వాసము సాధ్యము. తమకశ్వాసము యాప్యము. మహాశ్వాసము ఊర్ధ్వశ్వాసము ఛిన్నశ్వాసము అను నీ 3 ను మృత్యుప్రదంబులు.

## శ్వాసోపద్రవములు.

శ్లో॥ కాసవృద్ధ్యా భవేచ్ఛ్వాసః పూర్వైర్వా దోషకోపనైః। ఆమాతిసారవమధు తృష్ణాపాండుజ్వరైరపి । ఉరస్తకుదునే శ్వాసోహ్యామాశయసముద్భవః । ప్రాగ్రూపంచభవేత్తేషాం పార్శ్వశూలమరోచకమ్ ! ఆనాహశ్శంఖభేదశ్చతత్రాయా సశ్చషోజనే । ప్రేరితః పేరయేత్క్షుద్రం స్వాయం నశమయే న్మనుత్ ।అతీవతీవ్రవేగచ్ఛశ్వాసః ప్రాణప్రపీడనః । ప్రశామ్య

తిన వేగశ్చతహ్యంత ర్వేగనిపీడితం। పూర్వ యేపీభ వేచ్ఛ్వాస స్సవృద్ధః కృశ దేహింతా । త్రయశ్శ్వాసానసిధ్యంతి హైతత ఏవహ్యుపద్రవాః॥

తా. కాసము వృద్ధి జెందుటవలన గాని లేక వాత పిత్త శ్లేష్మములు ప్రకోపించుటవలనగాని శ్వాసము జనించి ఆహారిసారము వోకర దప్పి పాండుపు జ్వరము అను వానితోఁగూడి రొమ్ము నాశ్రయించి ఆమాశయములోనుండి శ్వాసమును గలుగంజేయు. పూర్వరూపంబు లెవ్వియనిన—ప్రక్కశూల అరోచకము కడుపుబ్బరము గలుగుట కుతికలో శ్లేష్మముగట్టి పగిలినటుల నొచ్చుట శ్వాసమువలన అన్నమును కుడువలేకయుండుట వాతము దుష్టంబై తొలుత క్షుద్రశ్వాసమునుగలుగంజేసి తాను శమింపకుండుట అనునవియ—ఈ పూర్వరూపములతోడ శ్వాసము వృద్ధిం జెంది శరీరము కృశించియుండినను లేక కడుతీవ్రవేగముగల శ్వాసము జనించు ప్రాణములపీడింపుచుండినను లేక శ్వాసవేగము శమింపక అంతర్వేగముగల శ్వాసముగలిగియుండినను ఈ లక్షణములుగల 3 శ్వాసరోగములు అసాధ్యములని తెలియవలయు (ఈలక్షణములులేకుండెడి శ్వాసరోగములే సాధ్యములనియెఱింగిచికిత్సింపవలయు.)

శ్లో॥ [మాధవనిదానే] అతిసంచితదోషస్య భక్తచ్ఛేదకృశస్యచ ।
వ్యాధిభిః క్షీణ దేహస్య వృద్ధస్యాతి వ్యవాయినః ।
ఆసాంయాసా సముత్పన్నా హిక్కాహంత్యాశు జీవితమ్ ।
సర్వేషురోగినాశాయ హిక్కేయం శీఘ్రకారిణీ ।
హిక్కాశ్వాసాయదాతౌద్వౌ మృత్యుకాలే కృతాలయా॥

తా. కడుసంచిత దోషముగలవానికి అన్న ద్వేషమువలన కృశించిన వానికి పలువిధరోగములవలన శరీరక్షయముగలవానికి వృద్ధునికి మిక్కుటముగ మైథునము సేయువానికి సాధ్యహిక్కలలో నేది జనించినను అది వానిని శీఘ్రముగ జంపు. మఱియు సర్వరోగములయం దెక్కిళ్ళు జనించిన రోగి శీఘ్రముగ మృతిజెందు. మఱియుఎక్కిళ్ళు శ్వాసము అన నీ 2 ను మృత్యుకాలమునందే జనించు.

## ఊర్ధ్వశ్వాసమునకు సూర్యావర్త రసము.

శ్లో॥ [మాధవనిదానే] సూతార్ధంగంధకం మర్ధ్యంయామైకంకన్యకాద్రవైః । ద్వయోస్తుల్యంతామ్రపత్రం పూర్వకల్కేనలేప

యేత్ । దినైకంహండికాయంత్రె పక్వమాదాయ చూర్ణ
యేత్ । సూర్యావర్తోరసోనామ ద్విగుంజంశ్వాసజిద్భవేత్ ।
ఇంద్రవారుణికామూలం దేవదారుకటు * త్రయమ్ । శర్క-
రాసహితంఖాదే దూర్ధ్వశ్వాసప్రశాంతయే । నిష్కైకాం
లేహయేద్వాపిక్షౌద్రేణకటురోహిణీమ్ । శ్వాసంచారోచకం
హంతీమరిచందాడిమంగుడమ్॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము ½ భాగము ఈ 2 ను ఖల్వములోనునిచి కలుబందరసముతో 1 ఝామము మర్దించి 1½ భాగము శుద్ధిచేసిన తామ్రపురేకులకు లేపనము జేసియెండించి హండికాయంత్రమున 1 దినము వండిసాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి చూర్ణముచేసి 2 గురిగింజలయెత్తును సేవించిన శ్వాసమును పాపరవేరు దేవదారు త్రికటుకములు పంచదార అనువాని చూర్ణానుపానముతోడ సేవించిన ఊర్ధ్వశ్వాసమును నిష్క ప్రమాణము కటుకరోహిణిచూర్ణము తేనె అనువాని యనుపానముతోడగాని లేక నిష్కప్రమాణము మిరియాలు దాడిమవిత్తులు బెల్లము అనువానిని నూరి దాని యనుపానము తోడగాని సేవించిన శ్వాసమును అరోచకమును హరించు.

## సర్వశ్వాసములకు ఉదయభాస్కర రసము.

శ్లో॥ ధాన్యాభ్రం సూతకంగంధం శ్వేతాపామార్గజద్రవైః ।
తుల్యాంశంమర్దయేచ్ఛాయః పాత్రేపాతనకేపచేత్ ।
ఊర్ధ్వలగ్నంతతోగ్రాహ్యం రసోహ్యుదయభాస్కరః ।
శ్వాసంపంచవిధంహంతి † గుంజామాత్రంపిబేదను॥

తా. ధాన్యాభ్రకము రసము గంధకము వీనిని శుద్ధిజేసిన సమభాగములుగ ఖల్వములోనునిచి తెల్లయుత్తరేణురసముతో 1 దినము మర్దించియినుపపాత్రలోనునిచి పాతనాయంత్రమున పాకముచేసిన యడియూర్ధ్వయంత్రమున కెగయును. దానిని దీసికొని యందొకగురిగింజయెత్తును నిష్కప్రమాణము కటుకరోహిణి తేనెఅనువాని యనుపానముతోడగాని నిష్కప్రమాణము మిరియాలు దాడిమవిత్తులు బెల్లము అనువానిని నూరిసుద్దచేసి దానితోడగాని సేవించిన 5 శ్వాసములుఅరోచకముహరించు.

* త్రికమ్. † గుంజాద్వయానుపానతః.

## శ్వాసములకు గంధక యోగము.

శ్లో॥ గంధకంమరిచంసాజ్యం పిబే*చ్ఛ్వాసకఫాపహమ్ ।
గంధకంఘృతపానేన శ్వాసక్షతక్షయాపహమ్॥

తా. శుద్ధిచేసిన గంధకము మిరియాలు వీనిని నేతితో నూరి సేవించిన శ్వాస కాసలు హరించు. శుద్ధిచేసిన గంధకమును నేతితోడ సేవించిన శ్వాసము క్షత క్షయము హరించు.

## శ్వాసములకు భార్గ్యాది కషాయము.

శ్లో॥ భార్గీవచాభానుశివాహరిద్రా వాసామృతా నాగరధాన్యకానామ్ క్వాథోజయేచ్ఛ్వాసమిమంప్రసిద్ధంతథాచనిద్రాసుఖమాప్నుయాశ్చ।

తా. గంటుభారంగి వస జిల్లేడువేరు కరక్కాయలు పసపు అడ్డసరపుయీనలు తిప్పతీగె శొంఠి కొతిమెర్లు వీనిని సమభాగములుగ దంచి కషాయముకాచి సేవించిన శ్వాసములు హరించుటయేగాక నిద్రసుఖమును గలుగు.

## శ్వాసములకు విభీతకాది కషాయము.

శ్లో॥ విభీతభాన్వగ్నిచ విశ్వభార్గ్యా కణాభయా ముస్తకృతః కషాయః । వమింహరేచ్ఛ్వాసమిమంపిబేచ్చ ప్రవృద్ధకాసం ప్రబలాంచహిక్కామ్॥

తా. తానికాయలు జిల్లేడువేరుపట్ట చిత్రమూలము శొంఠి గంటుభారంగి పిప్పళ్ళు కరక్కాయలు తుంగముస్తెలు వీనిని సమభాగములుగ దంచి కషాయము కాచి సేవించిన వాంతి శ్వాసము ప్రబలమైన కాసము ప్రబలమైన యెక్కిళ్లు హరించు.

## శ్వాసాదులకు కంటకార్యావలేహము.

శ్లో॥ [ఆయుర్వేదే] కంటకారీతులాం ద్రోణంరేపక్త్వా కషాయకమ్ । పాదశేషంగృహీత్వాచ తస్మించూర్ణానిదాపయేత్ । పృథక్పలాని చైతానిగుడూచీచవ్యచిత్రకాః । ముస్తకర్క

---

* ద్వాత.

శృంగిచత్రుట్యాషణాందద్యాన్మూసనః । భార్గీదాన్యా సకీచైవ శర్కరాపలవింశతిః । ప్రత్యేకంచపల్యానష్టౌ ప్రదద్యాద్ఘృతతైలయోః । పక్వాలేహత్వమానీయశీతేమధుపలాష్టకమ్ । చతుః పలంతుగాక్షీర్యాః పిప్పలీనాంచతుః పలమ్ । క్షిప్త్వా నిదధ్యాత్సుదృఢేమృణ్మయేభాజనేశుభే । లేహోయం హంతి హిక్కార్తి శ్వాసకాసాన శేషత,॥

తా. 100 పలములు వ్రాసదువేళ్ళనుదంచి ద్రోణప్రమాణముగలయుదకమునందువైచి 4 వ భాగము మిగులునటుల కషాయముకాచి వడియగట్టిఅందుతిప్పతీగ చెవ్యము చిత్రమూలము తుంగముస్తెలు కర్కాటకశృంగి త్రికటుకములు దురదగొండి గంటుభారంగి * సన్నరాస్నము కచ్చూరములు అనువాని చూర్ణము దినుసుయొకటింటికొక్కొకపలము పంచదార 20 పలములు నెయ్యి 8 పలములు తెల్లఆవనూనె 8 పలములు గలిపి లేహ్యపక్వముగవండి చల్లారినపిదప తేనె 8 పలములు వెదురుప్పు ❖పలములు పిప్పలిచూర్ణము 4 పలములు గలిపి మంచిమట్టిపాత్రలోనునిచి సేవింపుచుండిన యెక్కిళ్లుశ్వాసకాసములు నిశ్శేషముగ హరించు.

## సర్వశ్వాసములకు భార్గీగుడము.

శ్లో॥ [నిత్యనాధీయే] శతంసంగృహ్య భార్గ్యాస్తు దశమూల్యాస్తథాశతమ్।శతంహరీతకీనాం చపచేత్తోయేచతుర్గుణే । పాదావశేషేతస్మింస్తురసేవస్త్రనిష్పీడితే । ఆలోఢ్యచతులాంపూతాం గుడస్యాప్యభయాంతతః । పునః పచేత్తుమృద్వగ్నౌ యావల్లేహత్వమేతితత్ । శీతేచమధువస్త్రత్రమష్టౌలానివినిక్షిపేత్ । త్రికటుత్రిసుగంధంచపల మాత్రంపృథక్పృథక్ । యవక్షారంకిషట్ యుగ్మంసంచూర్ణ్యప్రక్షిపేత్తతః । భక్షయేద భయామేకాంలేహస్యార్ధ పలంతథా । శ్వాసంసుదారుణాం హంతి కాసంపంచవిదంతథా । అర్శాంసరోచకంగుల్మం శకృద్భేదం

* ఇదేదుంపరాస్నము.

క్షయంతథా । స్వర్ణవర్ణప్రదోహ్యేష జఠరాగ్నేఃప్రదీపనః। నామ్నా భార్ఙీగుడఃఖ్యాతోభిషజ్ఞస్సకలైర్మత-॥

తా. గంటుభారంగి దశమూలములు కరక్కాయలు వీనిని దినుసుకు 100 * పలములచొప్పున నొకభాండములోవైచి 1200 పలములు నీళ్ళుబోసి 4 వ భాగము మిగులునటుల కషాయముకాచివడియగట్టియందు బెల్లము 50 పలములుకరక్కాయలు 50 పలములు వైచి మరలమందాగ్నితో చిక్కగనగువరకు పాకముజేసిచల్లారిన పిదప తేనె 6 పలములు త్రికటుకములు దాలచినిచెక్క ఆకుపత్రిక యేలకులు అనువాని చూర్ణము దినుసు కొక్కొకపలము యవక్షారచూర్ణము 2 కర్షములుకలిపి లేహ్యమును సిద్ధపరచి యందర్ధపలమును 1 కరక్కాయను ప్రతిదినము। ప్రాతఃకాలమున సేవించిన భయంకరమైన శ్వాసము 5 విధకాసములు మూలవ్యాధి అరోచకము గుల్మము అతిసారము క్షయము వీనిని నశింపజేయుటయే గాక స్వరము వర్ణము అగ్నిదీపనము అనువానిని సగాగలుగంచేయు. ఈభార్ఙ్యాదిగుడము సకలవైద్య సమ్మతము.

## శ్వాసములకు వాసాద్యవ లేహ్యము.

శ్లో॥ [ఆయుర్వేదే] వాసాతులామష్టగుణేచనీరే విపాచ్యతాంపాద జలేనపాకమ్ । క్షుణ్ణాఢకంత ద్విపచేచ్ఛ్వానాంఖండాః ప్రయోజ్యాస్సకలస్యతుల్యాః । తతస్సముత్తార్య పలానిచాష్టౌ క్షౌద్రస్యచద్వేకిలవంశజాయాః । తీ.పే.త్తథామాగధికా పలార్ధం పలంచతుర్జాతభవంప్రయోజ్యమ్ । యోజ్యంపలార్ధం శ్వాసనేచకాసేక్షయేసపిత్తేకఫపీనసేచ । హృద్రోగ కార్శ్యే కిలవిద్రధౌచహన్త్యురఃక్షతేశోణితవాంతికోపే॥

తా. 100 పలముల అడ్డసరములో 800 పలములు నీళ్ళుబోసిచతురాంశముగ కషాయముగాచి అందు కరకచూర్ణము ఆఢకప్రమాణముగలిపి గట్టియగువరకు మరల పాకముజేసి దానిని దించి చల్లారిన పిదప తేనె 8 పలములు వెదురుప్పుచూర్ణము 2 పలములు పిప్పలిచూర్ణము ½ పలము చాతుర్జాతక చూర్ణము 1 పలముకలిపి ½ పలమును సేవింపుచుండిన శ్వాస కాసములు క్షయము రక్తపిత్తము కఫము పీనసము హృద్రోగము కృశత్వము విద్రధి ఉరః క్షతము రక్తవాంతి వీనిని హరింపంజేయు.

---

* పలమన 3 తులములు.

## సర్వశ్వాసములకు శ్వాసకాళేశ్వర రసము.

శ్లో॥ మృతంవంగం మృతంలోహం మృతార్కం మృత మభ్రకమ్।
శుద్ధసూతం తథాగంధం మాక్షికం హింగుళంవిషమ్ । జాతీ
ఫలం లవంగంచ త్వగేలానాగ కేసరమ్ । ఉన్మత్తకస్యబీజాని
జైపాలంరాత్రిదుర్లభమ్ । ఏతాని సమభాగానిమరీచం హర
నేత్రకమ్ । సర్వంతద్వ్యాక్షిపేత్ఖల్వేలోహదండేనమర్దయేత్
తావచ్చూర్ణీకృతంఫేనూక యావత్సూతం నదృశ్యతే ।
శక్రాసనస్యస్వరసేర్భావనా చైకవింశతిః । ద్విగుంజాప్యుత్త
మామాత్రాహ్యార్ద్రకస్వరసైర్యుతా । తదర్ధంబాలవృద్ధేషు
పథ్యందేయంతథోచ్యతే । పంచశ్వాసాన్ క్షయంకాసంరాజ
యక్ష్మనివారణమ్ । శ్వాసకాళేశ్వరో నామ దేవానామపి
దుర్లభః॥

తా. వంగభస్మము లోహభస్మము తామ్రభస్మము అభ్రకభస్మము శుద్ధిచేసి నరసము శుద్ధిజేసినగంధకము శుద్ధిజేసిన సువర్ణమాక్షికము శుద్ధిజేసిన ఇంగిలీకమును శుద్ధిజేసినవసనాభి జాజికాయ లవంగములు దాచినిచెక్క యేలకులు నాగకేసరములు శుద్ధిజేసిన వుమ్మెత్తవిత్తులు శుద్ధిచేసిన నేపాళములు పసపు కచోరములు ఇవి సమభాగములుగ మిరియాలు 3 భాగము వీనినెల్ల ఖల్వములో నునిచి రసము దెలియకుండువరకు లోహదండముతో మర్దించి కొండిసెరసముతో 21 మార్లు భావనజేసి వయోవంతులు 2 గురిగింజలయెత్తును బాలవృద్ధులు 1 గురిగింజయెత్తును అల్లపుస్వరసముతో సేవించి పథ్యముగనుండిన 5 విధ శ్వాసములు శరీరక్షయము కాసము రాజయక్ష్మ వీనిని నశింపజేయు. ఈశ్వాసకాళేశ్వర రసము లభించుట దేవతలకు సగా దుర్లభంబు.

## హిక్కా నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] విదాహిగురువిష్టంభి రూక్షాభిష్యంది భో
జనైః । శీతపానాశనస్నానైర్హిక్కాభవతిధావనాత్॥

తా. దాహజనకద్రవ్యములు జడకరద్రవ్యములు మలబద్ధకర రూక్షకరద్రవ్యములు జిగటగలపదార్థములు వీనిని భుజించుటవలన సీతాన్నపానముల సేవించుటవలన శీతోదకములో స్నానము జేయుటవలన పరుగులిడుటవలన యెక్కిళ్ళు జనించు.

## హిక్కాభేద తత్సంప్రాప్తి॥

శ్లో॥ అన్నజాయమలాంక్షుద్రాం గంభీరాంమహతీంతథా ।
వాయుఃకఫేనానుగతం పంచహిక్కాఃకరోతిహి॥

తా. వాతము కఫముతోగలసి అన్నజహిక్కా యమళహిక్కా క్షుద్రహిక్కా గంభీరహిక్కా మహాహిక్కా అన 5 విధములైన హిక్కాలు గలుగంజేయు.

## హిక్కా పూర్వ రూపము.

శ్లో॥ [ఆయుర్వేదే] కంఠోరసోర్గురుత్వంచ వదనస్యకషాయతా।
హిక్కానాంపూర్వరూపాణి కుక్షేరాటోపఏవచ,

తా. కంఠము ఱొమ్ము అనువానియందు జడత్వముగలుగుట నోరువగరుగ నుండుట కడుపులో ఆరాటముగలుగుట ఇది హిక్కకు పూర్వరూపంబులు.

## అన్నజహిక్కా లక్షణము.

శ్లో॥ పానాన్నైరతిసంభుక్తైస్సహసాపీడితోనిలః
హిక్కాయత్యూర్ధ్వగోభూత్వాతాం విద్యాదన్నజాంభిషక్॥

తా. అన్నపానాదుల మిక్కుటముగ సేవించుటవలనవాతంబకస్మాత్తుగ పీడింపబడినదై ఊర్ధ్వగతంబై యెక్కిళ్ళను గలుగంజేసిన అన్నజ హిక్కయని తెలియవలయు.

## యమళహిక్కా లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] చిరేణయమళైర్వేగైర్యా హిక్కాసం ప్రవర్తతే । కంపయంతీశిరో గ్రీవాంయమలాంతాంవినిర్దిశేత్॥

తా. చిరకాలముమీద యెక్కిళ్ళు 2 గ గలిసి కడుతీక్రముగ వచ్చుట శిరము కంఠము వణుకుట ఈలక్షణములుగలది యమళహిక్కయని తెలియవలయు.

## క్షుద్రహిక్కా లక్షణము.

శ్లో॥ [నిత్యనాథీయే] ప్రకృష్టకాలైర్యా వేగైర్మందైః సమభి వర్తతే । క్షుద్రికానామసాహిక్కా జత్రుమూలాత్ప్రధావతిః

తా. చిరకాలముమీద యెక్కిళ్ళు మందవేగముగవచ్చుట * జత్రుమూలములలోనుండి జనించుట ఈ లక్షణములుగలది క్షుద్రహిక్కయని తెలియవలయు.

### గంభీరహిక్కా లక్షణము.

శ్లో॥ నాభిప్రవృత్తాయాహిక్కా ఘోరాగంభీరనాదిని ।
అనేకోపద్రవవతీగంభీరానామసాస్మృతా॥

తా. ఎక్కిళ్ళు బొడ్డువద్దనుండిలేచి గంభీరశబ్దమును గలుగంజేయుట దప్పి జ్వరము మొదలగు పలు నుపద్రవములతోగూడి భయంకరముగనుండుట ఈ లక్షణములుగలది గంభీరహిక్కయని తెలియవలయు.

### మహాహిక్కా లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] మర్మాణ్యుత్పీడయంతీవసతతంయాప్రవర్తతే ।
మహాహిక్కేతిసాజ్ఞేయాసర్వగాత్రప్రకంపినీ॥

తా. బొమ్మ నాభి పొత్తికడుపు మొదలగు మర్మస్థలములయందుపిడగలుగుట యెల్లప్పుడు యెక్కిళ్ళు వచ్చుట సర్వాంగములు వణుకుట ఈ లక్షణములుగలదిమహాహిక్కయని తెలియవలయు.

### హిక్కాస్వరూప తత్సాధ్యాసాధ్యములు.

శ్లో॥ [ఆయుర్వేదే] యమళాయుగళైర్వేగైర్మహతీమహతీధ్వనిః।
గంభీరానాభిసంభూతా క్షుద్రఖ్యామందవేగినీ ।
అన్నజాపితథైవస్యాత్పూర్వాస్త్రిస్రోవివర్జయేత్॥

తా. ఎక్కిళ్ళు వేగముతోగూడి జంటగవెడలిన యమళహిక్కయనియు మహాధ్వనితోగూడి వెడలిన మహాహిక్కయనియు నాభినుండివెడలిన గంభీరహిక్కయనియు మందవేగముతోగూడి పలుమారు వెడలుచుండిన్ని క్షుద్రహిక్కయనియు అన్నపానాదులవలన యెక్కిళ్ళుజనించిన అన్నజహిక్కనియు తెలియవలయు, అందుయమళహిక్క మహాహిక్క గంభీరహిక్క అన నీ 3 వసాధ్యంబులు. క్షుద్రహిక్క అన్నజహిక్క అన నీ 2 ను సాధ్యంబులు.

* జత్రుమూలములన— మెటకోంకులు.

## అసాధ్యహిక్కా లక్షణము.

శ్లో॥ ఆయమ్యతే హిక్కతోయస్య దేహో దృష్టిశ్చోర్ధ్వంతా మ్యతేయస్యనిత్యమ్ । క్షీణోన్నద్విట్ క్షౌతియశ్చాతి మాత్రం థాద్వాచాంత్యేవర్జ్య యేద్ధిక్కమానా ॥

తా. క్షుద్రజ అన్నజములను సాధ్యహిక్కలలో సగా యెక్కిళ్ళ వేగమువలన నేత్రములు విస్తరించి ఊర్ధ్వదృష్టిగలిగి యెల్లప్పుడు మోహమును జెందుచుండు హిక్కారోగిని శరీరక్షయము అన్నద్వేషము పలుమారు యెక్కిళ్ళుగల హిక్కారోగిని వైద్యుడు వర్జించవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] అతిసంచితదోషస్య భక్తచ్ఛేదకృశస్యచ ।
వ్యాధిభిఃక్షీణ దేహస్య వృద్ధస్యాతి వ్యవాయినః ।
ఆసాంయాసాసముత్పన్నా హిక్కాహంత్యాశు జీవితమ్ ॥

తా. కడుసంచిత దోషముగలవానికి అన్నద్వేషమువలన కృశించినరోగికి పలువిధములైన రోగములవలన శరీరకృశత్వముగలవానికి వృద్ధునికి అతిమైథునము సేయువానికి సాధ్యహిక్కలలో నేదిజనించినను యదివానిని శీఘ్రముగజంపు.

## హిక్కలకు మేఘడంబర రసము.

శ్లో॥ [మాధవనిదానే] తండులీయద్రవైఃపిష్టం సూతతుల్యంచ గంధకమ్।* వజ్రమూషాగతం పాచ్యంభూధరేంత్రం సముద్ధరేత్ । దశమూలకషాయేణ భావయేత్త్రిహరద్వయమ్। గుంజాద్వయం హరత్యేషహిక్కాం శ్వాసంజ్వరంకిల। అనుపానేనదాతవ్యో రసోయం మేఘడంబరః । నాగరంపిప్పలీ భార్జీపుష్కరంకర్కటశృంగీ । శర్కరాష్టగుణం చూర్ణంమను పానంప్రకల్పయేత్

తా. రసము గంధకము వీనిని శుద్ధిజేసిన సమభాగములుగ ఖల్వములోనునిచి చిర్రివేళ్ళరసముతో మర్దించి వజ్రమూషలోనునిచి భూధరయంత్రమున పుటంబిడిన యదిభస్మంబగు పిదప దానిని స్వాంగశీతలమునదీసి మరల ఖల్వములో నునిచి దశ

* వజ్రమూషాగతంచైవ భూధరేభస్మతాంవ్రజేత్॥

మూల కషాయముతో 2 ఝాములు భావనజేసి 2 గురిగింజలయెత్తును శొంఠిపిప్పళ్ళు, గంటుభారంగి పుష్కరమూలము (దీనియభావంబున నేలములకవేళ్ళు) కచ్చూరము లు వీనిని దినుసుకు కర్ష ప్రమాణము చొప్పున చూర్ణముజేసి దీనికి 8 వ పాలు సం ధార గలిపి యీయనుపానముతోడ సేవించిన యెక్కిళ్ళు శ్వాసము జ్వరము హరిం చు. (మఱియు నీరసమును చిర్రివేళ్ళరసముతో సేవించినయమళహిక్క హరించు.)

## హిక్కలకు యోగవాహక రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసస్యతుల్యభాగేన తామ్రభస్మప్రకల్పయేత్
జంబీరోత్థద్రవైర్మర్ద్యం దినాంతే తత్సముద్ధరేత్ ।
బధ్వావస్త్రోటికాయంత్రే తుల్యం గంధేవసాచయేత్ ।
ఏవంతుషడ్గుణం కార్యంతతః పిష్టం సముద్ధరేత్ ।
పాషాణభేదిమత్స్యాక్షీ ద్రవైః పిష్టంతుమర్దయేత్ ।
తద్గోళంలేపయేచ్ఛోష్యం కల్కేపాషాణభేదినః ।
మత్స్యాక్ష్యాశ్చ ఘనంలేప్యం దత్వాపాతనయంత్రకే ।
స్వేదయేద్యామ మాత్రంతురసోమం యోగవాహకః ।
గుంజాద్వయం ప్రదాతవ్యం హిధ్మాసై స్సర్వశ్వాసజిత్ ।
దశమూలంపిబేచ్చాను కుళుత్థంచకషాయకమ్॥

తా. రసభస్మము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో 1 దినము మర్దించి బట్టనమూటకట్టి వేష్టికాయంత్రములోనుని చి 6 తల గంధకము జీర్ణంబగువరకు పుటంబిడి ఖల్వములోనునిచి ‡ కొండపిండివే ళ్ళపాన్నగంటివేళ్ళు వీనిరసములతో ప్రత్యేకముగమర్దించియుద్ధజేసి దానిపైకొండ పిండాకునునూరి లేపనముజేసి యెండనెండించి పాతనాయంత్రమున నొకఝాము పుటంబిడి స్వాంగశీతలమునదీసి 2 గురిగింజలయెత్తును దశమూలకషాయముతో గాని ఉలవకషాయముతోగాని సేవించిన యమళహిక్క మొదలగుసర్వహిక్కలు సర్వ భంగము శ్వాసము హరించు.

## హిక్కలకు గంధామృత రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసంగంధకతైలేన మర్దయేత్పాదటంకణమ్॥

---

‡ ఇదే పిండిబంవయనియు జెప్పంబడు.

తత్పిండం బంధయేద్వ స్త్రేగంధకార్యంచ పూర్వవత్ ।
చూర్ణంవై వేష్టికాయంత్రే యావజ్జీర్యతి షడ్గుణమ్ ।
అయంగంధామృతోనామ్నా రసోహిక్కా వినాశకః ।
గుంజాంమాత్రయం లిహేత్క్షౌద్రైః కషాయంచపిబేదను ।
అమృతాగ్నికుళుత్థానాం పాయయేత్క్వథితైర్జలైః॥

తా. శుద్ధిచేసిన రసము గంధకతైలముతో మర్దించిపిదప రసమునకు 4 వభాగము శుద్ధిజేసిన వెలిగారముగలిపి మరల మర్దించి బట్టలోనునిచి మూటగట్టి దీనిని శుద్ధిచేసిన గంధకములోబెట్టి వేష్టికాయంత్రమున 6 తల గంధకము జీర్ణంబగువరకు పుటంబిడి 3 గురిగింజలయెత్తును తేనెతో సేవించిశొంఠనే తిప్పతీగె చిత్రమూలము ఫులవలు అనువానికషాయమును త్రాగిన యెక్కిళ్ళుహరించు.

హిక్కలకు నిదిగ్ధికాది యోగము.

శ్లో॥ నిదిగ్ధికాంచామలక ప్రమాణాంహింగూ కణాభ్యాం మధునాచయుక్తామ్ । హ్యన్నరశ్వాసన పీడితశ్చహిక్కాంజయత్యేష బలాత్క్షణేన ॥

తా. ఉసిరికాయంత వాకుడువేళ్ల ముద్దలో పేల్చిన యింగువ పిప్పళ్ళుఅనువాని చూర్ణమును తేనెను గలిపి సేవించిన శ్వాసము యెక్కిళ్ళు తక్షణమున హరించు.

హిక్కలకు కుళీరాది కషాయము.

శ్లో॥ కుళీరమధుకంధాన్య మేలాచో శీరకోలకమ్ ।
వరాబిల్వాయుతం క్వాథం హిక్కాఛర్ది నివారణమ్॥

తా. కర్కాటకశృంగి యష్టిమధుకము కొతిమెర్లు ఏలకులు వట్టివేరుతక్కోలపుట్లు త్రిఫలములు మారేడువేరు వీనిని సమభాగములుగ దంచి కషాయముకాచి సేవించిన యెక్కిళ్ళు వాంతి హరించు.

హిక్కలకు విభీతకాది కషాయము.

శ్లో॥ విభీతకాద్ధ్రామల విశ్వభార్ఙ్గీకణాభయాసాధితమంబుపీతమ్ ।
సమీరణశ్వాస వమింహరేచ్చ ప్రబద్ధకాసం ప్రబలాంచ హిక్కాం॥

తా. తానికాయలు తుంగముస్తెలు ఉసిరికెపప్పు శొంఠి గంటుభారంగి పిప్పళ్ళు కరక్కాయలు వీనిని సమభాగములుగదంచి కషాయముకాచి సేవించినవాతగు శ్వాసము వాంతి ప్రబలమైన కాసములు ఎక్కిళ్ళు హరించు.

హిక్కలకు వ్యాఘ్ర్యాదికషాయము.

శ్లో॥ వ్యాఘ్రీమురాలభాభార్గీబిల్వ మజ్జాత్రికంటకైః ।
కషాయశ్చానుపానంచ క్షౌద్రం హిక్కాతిశ్వాసజిత్ ॥

తా. ములకవేళ్ళు రేగటిదూలవేళ్ళు గంటుభారంగిమారేడుగుజ్జుపల్లేరువీనిని సమభాగములుగ దంచి కషాయముకాచి యందొకింత తేనెవైచిసేవించిన ఎక్కిళ్ళు ప్రబలమైన శ్వాసము హరించు.

హిక్కలకు మయూరపింఛ యోగము.

శ్లో॥ [మాధవనిదానే] మయూరంపింఛభస్మాపి మధుకంచ కణాయుతమ్ । కుళీరరక్తేసంమర్ద్య మధునా వాసితోయుతమ్ ।
గండూషంకురుతేక్షిప్రం హిక్కామాశు వినాశయేత్ ॥

తా. నెమలి యీకలభస్మము యష్టిమధుకము పిప్పళ్ళు వీనినిసమభాగములుగ ఖల్వములోనునిచి యెండ్రకాయ రక్తముతో మర్దించి తేనెగాని లేక పంచదారగానికలిపి గండూషముజేసిన యెక్కిళ్ళు శీఘ్రముగ హరించు.

హిక్కాహర యోగములు.

శ్లో॥ కర్కటీసలిలంయష్టి మయూరస్యచపింఛజమ్ ।
భస్మభ్రమరగేహంచ హ్యపామార్గస్యబీజకమ్ ।
మధునాయోజితందేయం హిక్కామాశు వినాశయేత్ ॥

తా. ఎండ్రకాయ బొక్కలలోని యుదకము యష్టిమధుకము నెమలియీకల భస్మము తుమ్మెదలగూడు ఉత్తరేణి విత్తులు అనుపానిలో దేనినేని తేనెతోగూర్చి సేవించిన యెక్కిళ్ళు శీఘ్రముగ హరించు.

క॥ వెలిగారమాకుపత్రిక । నిలదాచిని చెక్కకోష్టు సేలకిచూర్ణం।
బులుచేసి తేనెతోడను। నెలమినిసేవింపహిక్కలెల్లనుమానున్ ॥

## హిక్కలకు మధూచ్ఛిష్ట ధూమపానము.

శ్లో॥ [మాధవనిదానే] మధూచ్ఛిష్టంసర్జరసం ఘృతంమనశ్శిలా
సమమ్ । ధూమపానేహ రేద్ధిక్కాంధూమైర్వాశిఖిపక్షజైః॥

తా. మైనము గుగ్గిలము మణిశిల వీనిని సమభాగములుగాని లేక నెమలియీ కలగాని ఆవునేతిలోదడిపి నిప్పులోవైచి దానిపొగనుద్రాగిన యెక్కిళ్ళుహరించు.

క॥ గోశృంగంబును భుజగపు ।
కూసంబును నెమలిరెక్క గుగ్గిలమును మే ।
ల్వాసి పసపగరుగంధము ।
గోసర్పులధూమ్రమసేవ గూలునుహిక్కల్ ॥

తా. ఆవుకొమ్ము పాముకూసము నెమలియీకలు గుగ్గిలము పసపు శ్రీగంధము కృష్ణాగరు వీనిని ఆవునేతిలోదడిపి అగ్నిలోవైచి దాని పొగను ద్రాగినప్రబల మైనయెక్కిళ్ళు హరించు.

## హిక్కలయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] కచోరం పుష్కరంయోషం మాతులుం
గామ్లవేతసమ్। శాలిషష్టిక గోధూమ యవముద్గకులుత్థకమ్।
నిద్రాసిద్ధ్యా శ్వాసకాస పిపాసాశ్చవినాశయేత్ ॥

తా. కచోరములు పుష్కరమూలము త్రికటుకములు మాదీఫలము పుల్లప్రబ్బలి 60 దినములకు ఫలించెడి వడ్లు గోధుమలు యవలు పెసలు ఉలవలు నిద్ర ఇవి గాక్కా శ్వాస కాస తృష్ణా రోగములయందు పథ్యకరంబులు.

## హిక్కయందపథ్యము.

శ్లో॥ విష్టంభీనివిదాహీని రూక్షాణికఫదానిచ ।
నిష్పావమాష పిణ్యాక వారిజా నూపమాంమిషమ్ ।
అవిదగ్ధందంతకాష్ఠం వస్తిమత్స్యాంశ్చ సర్ష పాణ ।
ఆమ్లతుంబీఫలంకందం తైలభృష్టముపోతకీమ్ ।
గురుశీతంచాన్నపానం హిక్కారోగీ వివర్జయేత్ ॥

తా. మలబద్ధకర ద్రవ్యములు వెదురుమొలక మద్యము మరీచము మొదలగు విదాహకరద్రవ్యములు రూక్షకరద్రవ్యములు కఫకరద్రవ్యములు మినుములు అనుములు తెలికపిండి నీటిలో జనించిన ద్రవ్యములు ఊటభూమిలో జనించిన జంతుమాంసము పక్వముజేయబడని ద్రవ్యములు దంతకాష్ఠము * వస్తికర్మ మత్స్యములు ఆవాలు పులుసు అనుగవుకాయ గడ్డలు నూనెతో వేయించబడిన ముట్టబచ్చలికూర జడముగ శీతకరముగనుండు అన్నపానములు వీనిని యెక్కిళ్ళుగలవారు వర్జింపవలయు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
కాస శ్వాస హిక్కా- నిదాన తత్సాధ్యా
సాధ్య చికిత్సానుపాన పథ్యాపథ్య
లక్షణ యుక్తం అష్టమ
ప్రకరణమ్.



* చిమ్మనగొట్టములో తైలాదుల నాకర్షించుటకై దాని మధ్యభాగమున బంధింపంబడి యధోభాగంబున కర్ణికలనలెను అందాకర్షింపబడిన తైలాదుల బైలుపరుచుటకైన నగ్రభాగంబున గుండ్రముగను నిర్మింపంబడిన చిమ్మన గ్రోవిలో బంధింపబడియుండు దండమేవస్తియనంబడు. కావున దానిలో రోగోపయుక్త తైలాదుల నాకర్షించుకొని గుదమేఢ్రముల ప్రయోగించుటయు వస్తికర్మ యనంబడు.

శ్రీ ర స్తు.

# బసవరాజీయము.

## ఆంధ్ర తాత్పర్యము.

### — నవమ ప్రకరణము. —

శ్లో॥ సర్వజ్ఞం సచ్చిదానందం లోకనాథం జగద్గురుమ్ ।
వ్యోమకేశం భవానీశం రాజభూషమహం భజే ॥

తా. సర్వజ్ఞుడు సచ్చిదానంద స్వరూపుడు లోకేశుడు జగద్గురువు ఆకసమే కేసములుగాగలవాడు పార్వతికి ప్రభువు శిరమున చంద్రుడే భూషణముగాగలవాడునగు నీలకంఠుని నేను భజించెదను.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని పేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో కడు శ్రేష్ఠంబైన బసవరాజీయమను గ్రంథముయొక్క అష్టమ ప్రకరణము వచింపుచున్నాడను.

### మేహరోగ నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] నవాన్నదధిమద్యాంబుగుడధూమనిషేవణాత్ ।
దూషయంతీపలం మేధ శ్శుక్లం మజ్జాం రసం రజః ।
జాయంతే వింశతిర్మేహా దశసాధ్యాః కఫోత్థితాః ।
పిత్తోత్థితాశ్చ షడ్యాప్యాశ్చతుర్గోమారుతాత్త్యజేత్ ।
సాధ్యాన్ యాప్యానసాధ్యాంశ్చ క్రమేణేత్థం వినిర్దిశేత్ ॥

తా. క్రొత్తయన్నము పెరుగు మద్యము ఉదకము బెల్లముతో జేయబడినద్రవ్యములు పొగ అనువానిని మిక్కుటముగ సేవించుటవలనమాంసము మేదస్సు శుక్లము మజ్జ రసము రక్తము దుష్టంబులై 20 మేహముల జనింపజేయును. అందు 10 మేహ

ములు శ్లేష్మజనితంబులు 6 పైత్యజనితంబులు 2 వాతజనితంబులు అట్లగుటంజేసి శ్లేష్మమువలన జనించిన 10 మేహములు సాధ్యంబులు. పైత్యమువలన జనించిన 6 మేహములు కష్టసాధ్యంబులు. వాతమువలన జనించిన 4 మేహములు అసాధ్యం బులు. ఈ క్రమానుగుణ్యముగ మేహసాధ్య కష్టసాధ్య అసాధ్యత్వముల నెఱుంగందగు.

శ్లో॥ [మతాంతరే] ఆస్యాసుఖంస్వప్నసుఖంధీని గ్రామ్యోదకా
నూపరసాః పయాంసి । నవాన్నపానంగుడవైకృతంచ ప్రమే
హహేతుః కఫకృచ్చసర్వమ్ ॥

తా. సుఖముగ గూర్చుండుట నిద్రాసుఖమును జెందుట పెఱుగును ద్రాగుట ఊరు ఉదకము అనువానియందలి ప్రాణులయొక్క మాంసరసమును పాలను క్రొత్త యన్నమును క్రొత్తయుదకమును బెల్లముతో జేయబడిన భక్ష్యములను లేక బెల్లము యొక్క వికారముగల పదార్థములను కఫకర సర్వపదార్థములను మిక్కుటముగ సేవించుట ఈ కారణమువలన ప్రమేహముజనించు.

కఫాదిమేహ సంప్రాప్తి.

శ్లో॥ [నిత్యనాథీయే] మేదశ్చమాంసంచ శరీరజంచక్లేదంకఫోవస్తి
గతఃప్రదూష్య । కరోతిమేహాన్సముదీర్ణముష్ణైస్తానేవపిత్తం
పరిదూష్యచాపి। క్షీణేషుదోషేష్వవకృష్యధాతూన్సందూ
ష్యమేహాన్కురుతేనిలశ్చ । సాధ్యాః కఫోత్థాదశపిత్తజాష్షడ్యా
ప్యానసాధ్యంపవనాచ్చతుష్కమ్ । సమక్రియత్వా ద్విషమ
క్రియత్వాన్మహాత్యయత్వాచ్చ యథాక్రమంతే ॥

తా. వస్తిగతకఫము మేదస్సును మాంసమును శరీరమునందలిక్లేదమును జెర చి శ్లేష్మమేహమును గలుగంజేయు. ఇవ్విధంబున నే ఉష్ణపదార్థసేవనవలన పిత్తము ప్రకోపించి పైజెప్పబడిన మేదాదులంజెరచి పిత్తమేహమును గలుగంజేయు. పిత్త శ్లేష్మములు క్షయింపుచుండ వాతము వసామజ్జాదిధాతువుల నాకర్షించికొని వానిం జెరచి వస్తియొక్క ముఖమునందుజేర్చి వాతజమేహమును గలుగంజేయు. అందు10 మేహములు కఫజనితంబులు. అవి సమక్రియ (అనగా కఫముయొక్క కటుతిక్తాది క్రియలు మేదస్సు మొదలగు వానియొక్క కటుతిక్తాది క్రియలు వ్యాధిబలము సమానంబులుగ నుండుటచే సమక్రియత్వము) గలవి యగుటంజేసిసాధ్యంబులు. 8 మేహ

ములు పిత్తజనితంబులు. అవి విషమచికిత్సలవలన (అనగా పిత్తమును హరింపజేసెడి శీతమధురాది ద్రవ్యములవలన మేదస్సును మేదోవృద్ధిని హరింపంజేసెడి ఉష్ణకటుకాది ద్రవ్యములవలన పిత్తమును) వృద్ధిలజెందుటచే క్రియావైషమ్యముగలవియగుటంజేసి యాప్యంబులు 4 మేహములు వాతజనితంబులు అవి గంభీరములై వమజ్జాది ధాతువుల నాకర్షించి కడుపీడను గలుగంజేసుటవలన విషయక్రియగలవియగుటవలన అసాధ్యంబులు.

## మేహరోగ భేదములు.

శ్లో॥ [అయః ర్వేదే] ఉదకేక్షుసాంద్రసురాసికతాశుక్లశీతళమ్ ।
పిష్టలాలాతిమూత్రంచ క్షారహారిద్రరక్తకమ్ ।
మంజిష్ఠానీలకాలాశ్చ వసామజ్జామధూత్థితమ్ ।
హస్తిమేహోవింశతిస్స్యుర్జ్ఞాత్వాఃవర్ణేనలక్షయేత్ ॥

తా. ఉదకమేహము ఇక్షుమేహము సాంద్రమేహము సురామేహము సికతామేహము శుక్లమేహము శీతమేహము పిష్టమేహము లాలామేహము బహుమూత్రమేహము క్షారమేహము హారిద్రామేహము రక్తమేహము మంజిష్ఠామేహము నీలమేహము కాలమేహము వసామేహము మజ్జామేహము మధుమేహము హస్తిమేహముఅన మేహములు 20 విధంబులు. వాని లక్షణములు వర్ణమువలన దెలియవలయు.

---

## కఫజనితదశమేహములు.

### ఉదకమేహ లక్షణము,

శ్లో॥ స్వచ్ఛంబహుసితంశీతం నిర్గంధముదకోపమమ్ ।
* జ్ఞేయశ్చోదక మేహోయం కించిదావిలపిచ్ఛిలమ్॥

తా. మూత్రము నిర్మలముగ అధికముగ తెల్లగ చల్లగ గంధవిహీనముగఉదకతుల్యముగ నొకింత గలిగినట్లుగ జిగటగ వెడలిన ఉదకమేహమని తెలియవలయు.

### ఇక్షుమేహ లక్షణము.

శ్లో॥ ఇక్షోరసమివాత్యర్థం మధురంచేక్షుమేహత ॥

---

* మేహాత్యుదక మేహోస కించిదావిల పిచ్ఛిలమ్॥

తా. మూత్రము చెఱుకురసతుల్యంబై కడుమధురముగ వెడలిన ఇక్షుమేహ మని తెలియవలయు.

సాంద్రమేహ లక్షణము.

శ్లో॥ సాంద్రీభవేత్పర్యుషితం † సాంద్రమేహంతదుచ్యతే ॥

తా. మూత్రమువిడిచిన 1 ఝామునకు పేరిన సాంద్రమేహమని తెలియ వలయు.

సురామేహ లక్షణము.

శ్లో॥ సురామేహీసురాతుల్య ముపర్యచ్ఛమథోఘనమ్ ॥

తా. మూత్రము కల్లువలెవెడలుట మూత్రముపైన నిర్మలముగ అడుగునగట్టిగ నుండుట ఈ లక్షణములుగలది సురామేహమని తెలియవలయు.

సికతామేహ లక్షణము.

శ్లో॥ మూత్రాణూన్సికతామేహీ సికతారూపిణోమలాన్ ॥

తా. మూత్రకణములు ఇసుకవలె వెడలిన సికతామేహమని తెలియవలయు.

శుక్లమేహ లక్షణము.

శ్లో॥ శుక్లాభంశుక్లమిశ్రంవా శుక్ల మేహీప్రమేహతి ॥

తా. మూత్రము శుక్లమువలెగాని లేక శుక్లయుక్తముగగాని వెడలిన శుక్ల మేహమని తెలియవలయు.

శీతమేహ లక్షణము.

శ్లో॥ శీతమేహీసుబహుశోమధురం * చాతిశీతలమ్ ॥

తా. మూత్రము మాధుర్యము కడుశీతలముగలదై పలుమారు వెడలినశీతమే హమని తెలియవలయు.

పిష్టమేహ లక్షణము.

శ్లో॥ సంహృష్టరోమాపిష్టేన పిష్టవద్బహుళంసితమ్ ॥

† సాంద్రమేహేన మేహతి

* భృతశీతలమ్

తా. మూత్రము కలిపిన పిండివలె దట్టమై తెల్లగ వెడలుట మూత్రోత్సర్జన కాలంబున రోమములు నిక్కపొడిచి కొనుట ఈ లక్షణముగలది † పిష్ట మేహమని తెలియవలయు.

శనైర్మేహ లక్షణము.

శ్లో॥ శనైశ్శనైశనైర్మేహీ మందంమందం ప్రమేహతి ॥

తా. మూత్రము మెల్ల మెల్లగ మందమందముగ వెడలిన శనైర్మేహమని తెలియవలయు,

లాలామేహ లక్షణము.

శ్లో॥ లాలాతంతుయుతంమూత్రం లాలామేహేనపిచ్ఛిలమ్ ॥

తా. మూత్రము చొంగవలె తంతియుక్తముగ జిగటగ వెడలిన లాలామేహమని తెలియవలయు.

బహుమూత్ర లక్షణము.

శ్లో॥ శోషస్తాపోంగకార్శ్యంచ బహుమూత్రఃతృషాభ్రమః ।
అస్వాస్థ్యసర్వగాత్రేషు మేహోయంబహుమూత్రకః॥

తా. శోష తాపముగలుగుట మూత్రము అధికముగ వెడలుట దప్పి భ్రమ గలుగుట సర్వావయవముల [స్వత్వము లేకయుండుట ఈ లక్షణములుగలది బహుమూత్ర మేహమని (గ్రంథాంతరేణ శనైఃమేహమని) తెలియవలయు.

పిత్తజనిత షణ్మేహములు.

క్షార మేహ లక్షణము.

శ్లో॥ గంధవర్ణరసస్పర్శైః క్షారేణక్షారతోయవత్ ॥

తా. మూత్రము క్షారోదకమువలె గంధ వర్ణరుచి స్పర్శలను గలదిగ వెడలిన క్షారమేహమని తెలియవలయు.

† పిష్ట మేహమన—పిచ్ఛిల మేహము.

హారిద్రమేహ లక్షణము.

శ్లో॥ హారిద్రమేహీకటుకం హరిద్రాసన్నిభందహేత్ ॥

తా. మూత్రము కారముగ పసుపువర్ణముగ తాపయుక్తముగ వెడలినహారిద్రా మేహమని తెలియవలయు.

రక్తమేహ లక్షణము.

శ్లో॥ విస్రముష్ణంసలవణం రక్తాభంరక్తమేహతః ॥

తా. మూత్రము దుర్గంధముగ ఉష్ణముగ ఉప్పగ రక్తమువలె నెఱ్ఱగ వెడలిన రక్తమేహమని తెలియవలయు.

మంజిష్ఠామేహ లక్షణము.

శ్లో॥ విస్రంమంజిష్ఠమేహేన మంజిష్ఠాసలిలోపమమ్ ॥

తా. మూత్రము దుర్గంధముగ మంజిష్ఠాకషాయము వంటి ఛాయగలదిగ వెడలిన మంజిష్ఠామేహమని తెలియవలయు.

నీల కాలమేహ లక్షణము.

శ్లో॥ నీలమేహేననీలాభం కాలమేహీమషీనిభమ్ ॥

తా. మూత్రము నీలవర్ణముగ వెడలిన నీల మేహమనియు బొగ్గువలె నల్లగ వెడలిన కాలమేహమనియు తెలియవలయు.

వాతజనితచతుర్మేహములు.

మజ్జామేహ లక్షణము.

శ్లో॥ మజ్జామేహమహుర్మ్మహుః ॥
వసామేహచికిత్సాయాం తాంచికిత్సాంచకారయేత్ ॥

తా. మూత్రము మజ్జతో సమానవర్ణముగగాని లేక మజ్జాయుక్తముగగాని పలుమారు వెడలిన మజ్జామేహమని తెలియవలయు. దీనియందు వసామేహ చికిత్సంజేయవలయు.

## మేహరోగనిదాన లక్షణ చికిత్సాదయః

### వసామేహ లక్షణము.

శ్లో॥ వసామేహీవసామిశ్రం వసాభం మూత్రయేన్ముహుః॥

తా. మూత్రము క్రొవ్వుతో గలసిగాని క్రొవ్వుతో సమానముగగాని పలుమారు వెడలిన వసామేహమని తెలియవలయు.

### హస్తిమేహ లక్షణము.

శ్లో॥ హస్తీమత్త ఇవాజస్రం మూత్రంవేగ వివర్జితమ్ ।
సలసీకంవిబద్ధంచ హస్తిమేహీప్రమేహతి॥

తా మూత్రము మదించిన యేనుగు మదముతో సమానంబై యెల్లపుడువేగ రహితముగ త్వఙ్మాంస మధ్యగత రసయుక్తముగ నిలచి నిలచి వెడలిన హస్తిమేహమని తెలియవలయు.

### మధుమేహ లక్షణము,

శ్లో॥ మధుమే హేమధుసమం మధునాతస్యలక్షణమ్॥

తా మూత్రము తేనెవలె వెడలుట చీమలు యీగలు ఆవరించుట ఈలక్షణములు గలది మధుమేహమని తెలియవలయు.

శ్లో॥ [మంతాంతరే]కషాయమధురంరూక్షంక్షౌద్రమేహంవదేద్బుధః॥

తా మూత్రము వొగరుగ మధురముగ బంకగ వెడలిన క్షౌద్రమేహమని తెలియవలయు.

### వింశతిమేహ పూర్వ రూపములు,

శ్లో॥ [సిద్ధరసార్ణవే] శీతప్రసక్తంగళ తాలుశోషో మాధుర్యమాస్యేకరపాదదాహః । భవిష్యతో మేహగుణస్వరూపం మూత్రేభిధావంతిపిపీలికాశ్చ । అనిష్టా హారచేష్టాభ్యాం స్యాన్మేహామయవింశతి ॥

తా. శీతలపదార్థములయం దిచ్ఛగలుగుట కంఠము దవడలుయెండుట నోరుతీపుగనుండుట చేతులు కాళ్లు మండుట మూత్రము విడచిన స్థలమునందు గండచీమలుప్రాకుట యివి గలుగబోయ్యేడి మేహరోగమునకు లక్షణంబులు పైజెప్పబడి 20 మేహములు విరుద్ధాహార చేష్టలవలన జనించు.

## వాతాదిమేహ విభాగము.

శ్లో॥ చత్వారో వాతజామజ్జా వసాక్షౌద్రేభ సంజ్ఞికాః ।
క్షారహారిద్ర మంజిష్ఠా నీల కాలాశ్చ రక్తజమ్ ।
తోయేక్షుసికతాపిష్ట శుక్ల సాంద్రసురాశనైః ।
శీతలంబహుమూత్రత్వం దశమేహాః కఫోద్భవాః ॥

తా. మజ్జామేహము వసామేహము మధుమేహము హస్తిమేహము అన4 మేహములు వాతజనితంబులు. క్షారమేహము హారిద్రమేహము మంజిష్ఠామేహము నీలమేహము కాలమేహము రక్తమేహము అన 6 మేహములు పిత్తజనితంబులు ఉదకమేహము ఇక్షుమేహము సికతామేహము పిష్టమేహము శుక్లమేహము సాంద్రమేహము సురామేహము శనైర్మేహము శీతమేహము బహుమూత్ర (లాలా) మేహము అన 10 మేహములు శ్లేష్మజనితంబులు.

## శ్లేష్మమేహోపద్రవములు.

శ్లో॥ అవిపాకోరుచిచ్ఛర్ది ర్జ్వరః కాసస్సపీనసః ।
ఉపద్రవాః ప్రజాయంతే మేహానాంకఫజన్మనామ్ ॥

తా. భుజించిన యన్నము జీర్ణముగాకుండుట అరుచి వాంతి జ్వరములుకఫముతోగూడిన దగ్గు పడిసెముగలుగుట ఈ యుపద్రవములు కఫ జనిత మేహముల యందు గలుగు.

## పైత్య మేహోపద్రవములు.

శ్లో॥ వస్తి * మేహనయోస్తోదో ముష్కావదరణంజ్వరః ।
దాహ స్తృష్ణామేహమూర్ఛా విడ్భేదఃపిత్తజన్మనామ్ ॥

తా. పొత్తికడుపు మేఢ్రము అనువాని యందు సూదులచే బొడుచునటుల పీడగలుగుట వృషణములయందలి చర్మముపండి పగులుట జ్వరము తాపము దప్పిగలుగుట పిల్లనితేనుపులు వచ్చుట మూర్ఛగలుగుట మలము ద్రవముగ వెడలుట ఈ యుపద్రవములు పిత్తమేహములయందు గలుగు.

---

* మేహనయోశ్శూలమ్.

## వాతమేహోపద్రవములు.

శ్లో॥ వాతజానాముదావర్త కంఠహృద్గ్రహలోలతాః ।
శూలమున్నిద్రతాశోషః కాసశ్వాసశ్చజాయతే ॥

తా. ఉదావర్త రోగము గలుగుట కంఠము రొమ్ము బంధింపంబడినటు లుండుట సర్వరసభక్షణమునం దిచ్ఛ శూల నిద్రాభంగము శోష పొడిదగ్గు శ్వాసము గలుగుట ఈ యుపద్రవములు వాతజమేహములయందు గలుగు.

## అసాధ్యమేహ లక్షణము.

శ్లో॥ యథోక్తోపద్రవావిష్టో హ్యతిప్రస్రుత * వేదనా ।
పిటికాపీడితం ‡ ఘోరం ప్రమేహోహంతిమానవమ్॥

తా. పైజెప్పబడిన అవిసాకొద్యుపద్రవయుక్తుడై మూత్రమును మిక్కుటముగ వేదనాయుక్తముగ విసర్జించునాడై ఉత్తరోత్తర జెప్పంబడు శరావికాది పిటికాయుక్తుడైయుండు మేహరోగి మృతిజెందునని తెలియవలయు.

## మేహరోగములయందు మూత్రపరీక్ష.

శ్లో॥ [నిత్యనాధీయే] వాతపిత్తకఫమేహసముత్థం మూత్రమగ్నిక్వథితంపరిపాకాత్ । పంచసప్తనవభాగతః ద్రిమాత్కల్కముద్భవతిచేత్తదసాధ్యమ్॥

తా. వాతమేహ రోగియొక్క మూత్రమును వెడల్పుమూతిగల పెంకులోబట్టి సన్నపుసెగను మాడకుండ కల్కమువలె గాచిన చిక్కనై 5 వ భాగము శేషించి కరగువలెనుండిన అసాధ్యంబనియు పిత్తమేహ రోగియొక్క మూత్రము 7 వభాగము శేషించి బెల్లము కరగువలె నుండిన అసాధ్యంబనియు శ్లేష్మమేహ రోగియొక్క మూత్రము 9 వ భాగము శేషించిన అసాధ్యంబనియు తెలియవలయు.

## మూత్ర పరీక్ష.

శ్లో॥ [నిత్యనాధీయే] అతిరక్తమేహరోగే జ్వరేహరిద్రవర్ణకమ్ ।
జ్వరేవామేహరోచేవా హ్యసాధ్యం బహుమూత్రకమ్॥

* మేవచ. ‡ గాఢం.

తా. మూత్రము కడురక్తవర్ణముగ వెడలిన మేహరోగంబనియు పచ్చగ వెడలిన జ్వరరోగంబనియు జ్వరమునందేని మేహరోగమునందేని బహుమూత్రము గలిగిన అసాధ్యంబనియు తెలియవలయు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే]యస్యమూత్రం స్రవేత్తైలంమధుమద్యంస్రవేత్తథా । యమేనే నీయతేశీఘ్రం కారితః పశువాతకః॥

తా. ఏ రోగియొక్క మూత్రము తైలము తేనె కల్లువలె వెడలెడినో అట్టిరోగికడు శీఘ్రముగ మృతిజెందునని తెలియవలయు.

అసాధ్య మేహోపద్రవములు.

శ్లో॥ [చికిత్సాసార సిద్ధసంగ్రహే] అరుచిశ్చాంగమర్దశ్చ తృష్ణా కాన భ్రమా స్తథా । శూలేన పిటికాకండూః ప్రమేహాణా ముపద్రవాః ॥

తా. అరుచిగలుగుట శరీరమునొచ్చును దప్పి దగ్గుగలుగుట భ్రమమాటలాడుట పొక్కులు జనించి శూల దురదగలుగుట యివి అసాధ్యమేహోపద్రవములని తెలియవలయు.

మేహరోగ పూర్వ రూపములు.

శ్లో॥ [మాధవనిదానే]స్వేదోంగ గంధశ్శిథిలత్వ గంగేశయ్యాసన స్వప్న సుఖాభిలాషః । హృన్నేత్రజిహ్వా శ్రవణోపదాహో ఘనాంగతా కేశనఖాతివృద్ధిః । శీతప్రియత్వంగళతాలుశోషో మాధుర్యమాస్యేకరపాదదాహః భవిష్యతో మేహగుణస్య లింగం మూత్రేభిధావంశ పిపీలికాశ్చ । తృష్ణాప్రమేహో మధురస్సపిచ్ఛో మధూపమస్స్యాద్ద్వివిధోకారః॥

తా. శరీరమున చెమటబట్టుట వాసననేసుట చర్మంబూడుట పడక ఆసనము నిద్ర అనువానియం దిచ్ఛగలుగుట హృదయము నేత్రములు జిహ్వ చెవులు అనువానియందు తాపము శరీరమున వొకింత జడత్వము గలుగుట వెంట్రుకలు గోళ్ళువృద్ధిం జెందుట శీతపదార్థములయం దిచ్ఛ గొంతు లోనోడ అనువానియందు శోషగలుగుట నోరు తీపుగనుండుట చేతులు కాళ్ళు మండుట మూత్రమున చీమలు గాని రేక యీగలు గాని వ్యాపించుట దప్పిగలుగుట మూత్రము తీపుగ జిగటగనుండినదై తేనెతో

తుల్యంబైన పలువిధ వికారములతో గూడియుండుట ఇవి గలుగబోయ్యెడి మేహమునకు పూర్వరూపములు.

శ్లో॥ [అశ్వినీ] ఆస్యేస్వాదుస్తృషాదాహో దంతేషుమలసంచయః।
దేహేచిక్కణతావాపి విదాహః పాణిపాదయోః।
ప్రభూతినీలమూత్రత్వం మేహలక్షణమగ్రజమ్॥

తా. నోరు తీపుగనుండుట దప్పిగలుగుట శరీరముమండుట దంతములు కడు పాచిగలుగుట శరీరము మినమినలాడుట కాళ్ళు చేతులు మండుట మూత్రము నీలవర్ణముగలదై మిక్కుటముగ వెడలుట ఈ లక్షణములు గలుగ బోయ్యెడి మేహమునకు పూర్వరూపంబులు.

మేహపిటకోపద్రవములు.

శ్లో॥ [పూజ్యపాదీయే] ముఖేపాయౌచమేఢ్రేచ హస్తేపాదేతథైవచ। హృన్మస్తకేపృష్ఠదేశే పిటికామరణాంతికమ్॥

తా. ముఖము గుదము మేఢ్రము హస్తము పాదము రొమ్ము మస్తకము వీపు అనువానియందు మేహపిటికలు జనించి ఆయా మేహోపద్రవములతో గూడి వేధింపుచుండిన అట్టి మేహరోగి మృతిజెందునని తెలియవలయు.

ప్రమేహపిటికా భేదము.

శ్లో॥ [పూజ్యపాదీయే] శరావికాకచ్ఛపికా జాలినీవినతాలజీ।
మసూరికాసర్షపికా పుత్రిణీసవిదారికా।
విద్రధిశ్చేతిపిటికాః ప్రమేహోపేక్షయాదశ।
సంధిమర్మసుజాయంతే మాంసలేషుచధామసు॥

తా. మేహరోగము నుపేక్షించుటవలన శరావిక కచ్ఛపిక జాలినీ వినతఅలజిమసూరికా సర్షపిక పుత్రిణి విదారిక విద్రధి అన దశవిధ మేహ * పిటికలు సంధులు మర్మస్థలము మాంసస్థానము అనువానియందు జనించు.

సర్వపిటికా లక్షణములు.

శ్లో॥ అంతోన్నతాచతద్రూపా నిమ్నమధ్యాశరావికా। సదాహా కూర్మసంస్థానాజ్ఞేత యాకచ్ఛపికాబుధైః। జాలిని తీవ్రదాహాతు

* పిటకయన—పొక్కులు,

మాంసజాల సమావృతా । అవగాఢరుజోత్క్లేదాపృష్ఠేవా
ప్యుదరేపివా । మహతీపిటికానీలా సాబుద్ధైర్వినతాస్మృతా।
రక్తాసితాస్ఫోటవతీదారుణాత్వలజీభవేత్ । మసూరదళసంస్థా
నావిజ్ఞేయాతుమసూరికా । గౌరసర్షపసంస్థానా తత్ప్రమా
ణాచసర్షపీ । మహత్యల్పచితాజ్ఞేయా పిటికాచాపిపుత్రిణీ ।
విదారకందవద్వృత్తా కఠినాచవిదారికా । విద్రధేర్లక్షణై
ర్యుక్తా జ్ఞేయావిద్రధికాతుసా॥

తా. చుట్టూమూపదువలె సుబ్బుగ మధ్యమున గుండ్రముగనుండుపిటికశరా విగయనియు తాబేటి వీపువలె నుండినదై మంటలతో గూడియుండునది కచ్ఛపిక యనియు తీవ్రమైన మంటలతో గూడి మాంసజాలములతో వ్యాప్తమైయుండునది జాలినియనియు వీపుపైనగాని లేక కడుపుపైనగాని లోతుగ పిటకలు జనించిన పీడ తోగూడినదై గొప్పదియైన నీలవర్ణముగలదై యుండునది వినతయనియు యెఱ్ఱనై లేక తెల్లనై సన్నని పిటికలతో వ్యాప్తమై భయంకరముగ నుండునది అలజియనియు చిఱుసెనగపప్పుతో సమానముగ నుండునది మసూరికయనియు తెల్ల ఆవాలయొక్క సమూహమువలె జనించి తత్ప్రమాణ తుల్యంబుగనుండునది సర్షసికయనియు 1 టి పెద్దకురుపై దానిచుట్టు సన్నని కురుపులుగలది పుత్రికయనియు నేలగుమ్మడు గడ్డ వలె గుండ్రముగ కఠినముగనుండునది. విదారికయనియు విధ్రదలక్షణంబులు గలది విద్రధికయనియు జెప్పంబడు.

## అసాధ్యపిటికా లక్షణము.

శ్లో॥ పిటికామర్మహృత్పృష్ఠ స్థానాంసగుదమూర్ధ్నివా ।
పర్వపాద కరస్థాశ్చఘ్నంతి తీవ్రంప్రమేహినమ్॥

తా. బొమ్మ మొదలగు మర్మస్థానములు వీపు భుజశిరస్సులు గుదము శిరము వ్రేళ్ళు పాదములు ముంజెయ్యి చకారమువలన చండ్లు ముఖము అనుదానియందు మేహపిటికలు జనించిన రోగి శీఘ్రముగ మృతిజెందునని తెలియవలయు.

## మేహపిటికా చికిత్స.

శ్లో॥ అన్యస్థానోత్థితాంచైవ జలూకాభిర్హరేదసృక్ ।
పక్వానిపాట్య మతిమాన్వ్రణ వత్సముపాచరేత్ ॥

తా. పైజెప్పబడిన స్థానములయందుగాక ఇతర స్థలముల మేహపిటికలు జనించిన జలగలచే రక్తమును స్రవింపంజేసి * పంచపల్లవములనూరిదానిపై గట్టుగట్టవలయు. మఱియు నావహ పిటికలు పక్వంబులైనవానిని భేదించి వ్రణమువలెనే చికిత్సం జేయవలయు.

చ॥ శిరమునఁజండ్లపీఁపునను జేతులఁగాళ్ళనుగీళ్ళయందున ।
న్నురముననంసయుగ్మముననొయ్యనమోమునమేఢ్రమందునం।
జిఱుచిఱుపొక్కులుచ్చినను జెన్నుగమేహముమానదంచు సు ।
స్థిరముగనీలకంఠకులశేఖరుకొట్టురుచెప్పెలెస్సగన్ ॥

## అసాధ్యమేహ లక్షణములు.

శ్లో॥ [ఆయుర్వేదే] జాతఃప్రమేహీ మధుమేహినాయో నసాధ్య
స్సోగస్సహి బీజదోషాత్ । ఏచాపికేచిత్కులజావికారాభ
వంతితాంతశ్చ ప్రవదంత్యసాధ్యాన్ ॥

తా. మధుమేహివలన జనించిన పురుషునికి మేహరోగము గలిగిన యది బీజదోషమువలన అసాధ్యంబగు. (ఇచట మధుమేహమను శబ్దము సామాన్య మేహపర్యాయంబని తెలియవలయు. మఱియు వంశపరంపరచే జనించు. కుష్టాదిరోగములు సగా అసాధ్యంబులు.

## మర్మస్థాన వివరణము.

శ్లో॥ భ్రూమధ్యే మూర్ధ్నిమధ్యేచ కంఠేచశిరసస్తథా ।
హృదయేనాభిమధ్యేచా ప్యక్ష్ణోర్వృషణయోరపి ।
గుల్ఫయోర్జంఘయోకట్యాం పాదాంగుష్ఠేష్వవస్థితమ్ ।
తర్జన్యాంబాహుమూలేచ మర్మస్థానంచతుర్దశ ॥

తా. కనుబొమలమధ్య ప్రదేశము శిరోమధ్యప్రదేశము కంఠము శిరము హృదయము నాభి మధ్యప్రదేశము నేత్రములు వృషణములు చీలమండ పిక్కలు నడుము కాలిబొట్టనవ్రేలు జుట్టనవ్రేలు చంక అను నీ 14 నుమర్మస్థానంబులు. అట్లగుటంజేసి వానియందు మోహపిటికలు జనించిన అసాధ్యము.

* పంచపల్లవములన—మామిడి— రావి—మఱ్ఱి— —బ్రహ్మమేడి— జువ్వి— అనువాని-చిగుళ్లు.

## మేహకులాంతక రసము.

శ్లో॥ [మాధవనిధానే] సూతంవంగంమృతాతుల్య మృతాభ్రం సూతికాత్రిధా। లశునంసర్వతుల్యంస్యా న్నిస్వగేకత్రమర్దయేత్ । బదరాభాంవటీంకుర్యాన్నామ్నా మేహకులాంతకః । లశునంహ్యాజమూత్రంచ తద్వయంహ్యనుదాపయేత్ ॥

తా. రసభస్మము 1 భాగము వంగభస్మము 1 భాగముఅభ్రకభస్మము 3 భాగములు వెల్లుల్లిపాయలు 5 భాగములు ఇట్టుల వీని నేకముజేసి మర్దించి రేగుగింజలంత మాత్రలు జేసి యందొక దానిని వెల్లుల్లిపాయలరసము మేకమూత్రము అనుపానియనుపానముతోడ సేవించిన సర్వమేహములు హరించు.

## మధుమేహమునకు లోధ్రాది కషాయము,

శ్లో॥ లోధ్రముస్తాభయంతుల్యాం కట్ఫలంచజలైస్సహ । క్వాథయిత్వాపిబేచ్చాను మధునామధుమేహజిత్ ॥

తా. లొద్దుగచెక్క తుంగముస్తెలు కరక్కాయలు గుమ్మడి తేను వీనిని సమభాగములుగ దంచి కషాయముగాచి యందొకింత తేనెగలిపి సేవించిన మధుమేహముశమించు.

## సర్వమేహములకు హరగౌరీసృష్టి రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధసూతం చతుర్భాగం సూతార్ధం * మృతమభ్రకమ్ । గంధకంచద్వయో స్తుల్యం మస్తునామర్ధయేత్ద్దినమ్ । గోళకంబధయేద్వస్త్రే † వాలుకాయంత్రగంపచేత్ । మందాగ్నినాపచేత్తావ ద్యావత్తప్తాశ్చవాలుకాః । స్విన్నం నశక్తాస్తప్తాస్తద్దుద్ధృత్య విచూర్ణయేత్ । ధాత్రీఫలరసేభావ్యం సప్తధాగోక్షురస్యచ । ‡ శ్లక్ష్ణచూర్ణం తతఃకృత్వా వింశద్భాగాన్ప్రకల్పయేత్ । భాగైకంపూర్వజంచూర్ణం సర్వాంశేన గోళయేత్ । నిష్కద్వయవటీంకుర్యా

* మృతతామ్రకమ్ † సిరతా ‡ సూక్ష్మ.

ఘృతమధ్యేవిపాచయేత్ । సాంగశీతాంతధాఖాదే త్ప్రిత్య
హాంపాచితాంఘృతైః । మహిషీక్షీ రకశైక మనుపానంచ
సర్వదా । హరగౌరీ సృష్టిరస స్సర్వమేహ కులాంతకః ।
దుగ్ధోదనం ఘృతం పథ్యం శాకం బింబ ఫలంభవేత్ ॥

తా. శుద్ధిజేసినరసము 4 భాగములుఅభ్రకభస్మము(లేకతామ్రభస్మము) 2 భాగములు శుద్ధిజేసిన గంధకము 6 భాగములు యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి పెఱుగుమీది మీగడతో 1 దినము మర్దించి ముద్దజేసి బట్టలో మూటగట్టి వాలుకాయంత్రమునందిడి ఇసుకనుతాకిన దానియుష్ణముచేతికి సహింపకుండువరకు నుందాగ్నిచే వండి సాంగశీతలమున దీసి ఖల్వమునందిడి చూర్ణముజేసి ఉసిరికెపండ్లరసముతో 7 దినములు పల్లేరురసముతో 7 దినములు భావనజేసి సూక్ష్మ చూర్ణముగావించి దానిని 20 భాగములుగవిభజించి యందు ప్రతిభాగమును పాలలోగలిపి యుంటలుజేసి ఘృతములోవండి సాంగశీతలమున 2 నిష్కములంత మాత్రలుజేసి యందొకదానిని కర్షప్రమాణము బర్రెపాల యనుపానముతోడ ప్రతిపూటసేవించిన సర్వమేహములు హరించు. దీనియందు పాలయన్నము నెయ్యి దొండకాయకూర వీనిని భుజించుట పథ్యకరము.

మేహములకు చంద్రప్రభావ వటికములు.

శ్లో॥ [మాధవనిదానే] మృతసూతంచకాసీసయేలాజాతీఫలంజటా।
మధుకంమధుయష్టీచధాత్రీదాడిమశర్కరా । కర్పూరంఖాది
రంసారం శతాహ్వా కంటకారికా । ఆమ్లవేతస తుల్యాంశం
దినైకంలాంగలీద్రవైః భావయేన్మేషదుగ్ధైశ్చ నాగవల్ల్యా
దినందినమ్ । వటికాబదరాకారా నామ్నాచంద్రప్రభావటీ ।
భక్షయేత్తీవ్ర * మేహార్త స్సర్వమేహకులాంతకః । ధాత్రీ
పటోల † నింబానాం కషాయంవాఘృతాన్వితమ్ । సక్షౌద్రం
పాయయేచ్చాను సర్వమేహపనుత్తయే ॥

తా. రసభస్మము శుద్ధిచేసిన అన్నభేది యేలకులు జాజికాయ జటామాంసి ఇప్పపువ్వు యష్టిమధుకము వుసిరికెపప్పు దాడింబయిలుపు పంచదార కర్పూరము చంద్రబంక సదాప వ్రాకుడు పుల్లప్రబ్బలి వీనిని సమభాగములుగ ఖల్వములోనుని

* మేహార్తః మోహార్త-హంతిసుదుస్తరాన్. † పత్రాణాం,

చి చెన్నచెర్లగడ్డ రసములో 1 దినము ఫేకపాలతో 1 దినము తనులపాకురసముతో 1 దినము భావనజేసి శేసుగింజంత మాత్రలుజేసి యందొకదానిని వుసిరికెపప్పు పొట్ల వేము అనువాని కషాయములో నొకింత నెయ్యిగాని లేక తేనెగాని కలిపి సేవించిన సర్వ మేహములు హరించును.

హరిద్రమేహమునకు మేహహార రసము.

శ్లో॥ మృతసూతంమృతంతామ్రం తారభస్మచహాటకమ్। హంసపాదిరసేనైవ సమభాగంచఖల్వకే । దినైకంమర్దయేద్గోళం కాచకుప్యాంనివేశయేత్ । వాలుకాయంత్రకేచైవ ద్వియామంచవిపాచయేత్ । సాంగశీతలముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్ । పంచాంగ నింబతుల్యానాం కషాయమనుపాయయేత్ । హరిద్రమేహంసంహంతిసర్వమేహకులాంతకః॥

తా. రసభస్మము తామ్రభస్మము వెండిభస్మము స్వర్ణభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదియాకు రసముతో 1 దినము మర్దించి ముద్ద చేసి యెండించి గాజుకుప్పెలోనునిచి వాలుకాయంత్రమున 2 ఝాములు వండి సాంగశీతలమునదీసి గురిగింజయెత్తును వేపాకు వేపపువ్వు వేపకాయలు వేపచెక్క వేపవేరు అనువానిని కషాయానుపానముతోడ సేవించిన హరిద్రామేహము సర్వమేహములు హరించు.

మంజిష్ఠామేహమునకు విద్యావాగీశ్వర రసము.

శ్లో॥ [రసరత్నాకరే] శుద్ధసూతంవిషంచాభ్రం విషటంకణగంధకమ్। మృతలోహాష్టకంచైవ కర్ష మాత్రంచఖల్వకే। జంబీరోన్మత్తవాసాభి స్త్రీకటు త్రిఫలేనచ । యామమాత్రంతు ప్రత్యేకం మర్దయిత్వాతుగోళకమ్ । కాచకుప్యాంనివేశ్యాథ సప్తవస్త్రంమృదాబహిః । లవణపూరిత యంత్రేచ త్రిదినం మందవహ్నినా । సాంగశీతల ముద్ధృత్య గుంజామాత్రం ప్రదాపయేత్ । ఆర్ద్రకస్యా నుపానేన మంజిష్ఠాయాః నికృంతనమ్ । విద్యావాగీశ్వరోనామ్నా రసేంద్రః పరికీర్తితః ॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిజేసిన వసనాభి అభ్రకభస్మము అతివిస పేల్చిన వెలిగారము శుద్ధిజేసిన గంధకము స్వర్ణభస్మము వెండిభస్మము తామ్రభస్మము

* వంగభస్మము సీసభస్మము కాంతభస్మము పుష్యభస్మము ఇనుపభస్మమువీనినిదిను సు యొకటింటికి కర్షప్రమాణము చొప్పున ఖల్వములోనునిచి నిమ్మపండ్లు ఉమ్మెత్త అడ్డరసము త్రికటుకములు త్రిఫలములు అనువాని రసములతో ప్రత్యేకప్రత్యేకముగ నొక్కొక ఝాము మర్దించి ముద్దజేసి యెండించి గాజుకుప్పెలోనునిచి 7 చీలమన్నులిచ్చి లవణ పూరితయంత్రమున 3 దినములు మందాగ్నితో వండి సాంగశీతలమున దీసి గురిగింజ యెత్తును అల్లపు రసానుపానముతో సేవించిన మంజిష్ఠామేహము హరించు. ఇది సర్వ రసములలో కడు శ్రేష్ఠంబైనది.

## నీలమేహమునకు హరిశంకర రసము.

శ్లో॥ మృత † తామ్రాభ్రకం శుల్యం ధాత్రీఫల నిజైర్ద్రవైః । సప్తాహం భావయేత్ఖల్వే యోగోయం హరిశంకరః । మాష మేకం వటీంఖాదే న్నీలకాల ప్రశాంతయే । మహానింబస్య బీజాని ‡ మర్దయే త్తండులోదకైః । సఘృతం పాయయే చ్చాను హ్యసాధ్యం సాధ్యయేత్క్షణాత్ । అనే నైవానుపానేన ♦ పంచవక్త్ర రసోహితః ॥

తా, తామ్రభస్మము (లేక రసభస్మము) అభ్రకభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి పుసిరికపండ్లరసముతో 7 దినములు భావనజేసి మాషప్రమాణమంత మాత్రలుజేసి యందొక దానిని సాయంప్రాతఃకాలముల పెద్దవేపవిత్తుల బియ్యపు కడుగులోనూరి నేతిలోగలిపి యీయనుపానముతోడ సేవించిన అసాధ్యమైన నీలమేహముకాలమేహము తక్షణమున హరించు. ఈ మేహములయందీ యనుపానము తోడనే పంచవక్త్రరసమునుకూడ సేవింపదగు.

* లవంగమన—తగరము. † సూతాభ్రకం ‡ పూర్వవ.

♦ పంచవక్త్రరసము—"శ్లో॥ శుద్ధసూతంసమంగంధంమరీచంటంకణంకణాః మర్దయేద్ధూర్తజద్రావైర్దినమేకంచశోషయేత్ । పంచవక్త్రరసోనామద్విగుంజం సర్వ మెహజిత్॥" తా, శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన గంధకము మిరియాలు పేల్చిన వెలిగారము పిప్పళ్ళు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ఉమ్మెత్తాకురసముతో 1 దినము మర్దించి 2 గురిగింజలంత మాత్రలుజేసి నీడ నెండించి యందొకదానిని సేవించిన సర్వమేహములు హరించు.

## రక్తమేహమునకు వేదవిద్యా రసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] రసభస్మత్రిభాగంచ భాగైకంతారభస్మక మృతమభ్రించ లోహంచ కాసీసంతు మనశ్శిలామ్ । ఏ సమభాగాని ఖల్వమధ్యే వినిక్షిపేత్ । నిర్గుండీముసలీవ జయార్ద్రై రగ్నిమంథజైః । అభయార్ద్రకజై ర్మర్ద్యం ః హంచ పృథక్పృథక్ । తద్గోళం కూపికాయంత్రే ప మంతు తుషాగ్నినా । ద్విగుంజంభక్షయేన్నిత్యం రక్తవే ప్రశాంతయే । నింబబీజకషాయంచ బోళయుక్తంపి బేదః వేదవిద్యా రసోనామ్నా రక్తమేహ కులాంతకః॥

తా. రసభస్మము 3 భాగములు రజతభస్మము అభ్రకము లోహము ‡ కాసీసము శుద్ధిజేసినమణిశిల యివిదినుసు కొక్కొక భాగముయిటులవీని ఖల్వములోనునిచి వావిలి నేలతాటిగడ్డలు అడ్డసరము తక్కలి నెల్లికరక్కాయ అల్లము అనువాని రసములతో ప్రత్యేక ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దించి ముద్దజేసి కూపికాయంత్రములో నునిచి వుముకమంటను 6 ఝాములువండిసాం లమున దీసి 2 గురిగింజలయెత్తును వేపవిత్తులు బోళము అనువానికషాయమువాం తోడ ప్రతిదినము సేవింపుచుండిన రక్తమేహము హరించు.

## మేహబద్ధ రసము.

శ్లో॥ భస్మసూతం మృతంకాంతం ♦ తీక్ష్ణభస్మ శిలాజతు । తు తాప్యం శిలావ్యోషం త్రిఫలాం కోలబీజకమ్ । కపిత్థం ర చూర్ణం † భృంగరాజేన భావయేత్ । వింశద్వారం ః ష్యాథ మధుయుక్తం లిహేస్సదా । నిష్కమాత్రం మ న్మేహా న్మేహబద్ధరసోమహాన్ । మహానింబస్యబీజాని * పిష్ట్వా షట్సమ్మితానిచ । పలతండుల తోయేన ఘృతనిష్కద్వ నచ । ఏకీకృత్య పిబేచ్చాను హంతిమేహం చిరంతనమ్॥

‡ కాసీసమున---అన్న భేది.

‡ ముండ † తుల్యంభావ్యంతుఃభృంగిణా । * షణ్నిష్కం పేషితాని

తా. రసభస్మము కాంతభస్మము ఉక్కుభస్మము (లేక ఇనుపభస్మము) శుద్ధిచేసినకర్పూరశిలాజిత్తు శుద్ధిచేసిన కర్పరీతుత్థము † స్వర్ణమాక్షికభస్మము శుద్ధిచేసిన మణిశిల త్రికటుకములు త్రిఫలములు ఊడుగవిత్తులు వెలగపంటి బేసము పసపుచూర్ణము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గుంటగలగరాకురసముతో 20 మార్లు భావనజేసి యెండించి తేనెతో నిష్కప్రమాణమును సేవించి వెంబడిగ 6 నిష్కములయెత్తు పెద్దవేపవిత్తులను పలిమెడుబియ్యపు కడుగుతోనూరి యందు 2 నిష్కములయెత్తు నెయ్యిగలిపి సేవించిన చిరకాలముగనుండు మేహము హరించు.

## సర్వమేహములకు వేదవిద్యావటికములు.

శ్లో॥ పారదాభ్రక కాంతానాం నాగభస్మ సమంసమమ్। దినం
బ్రహ్మీ రసైర్మర్ద్యం స్వేద్యంతస్య కషాయకైః। దినైకం
వాలుకాయంత్రే వస్త్రేబద్ధ్వా విపాచయేత్। ఉద్ధృత్య
చూర్ణయేత్ శ్లక్ష్ణం * రాజావర్తం శిలాజతు। తాప్యం
మండూర వైక్రాంతం కాసీసంతుల్యమేవచ। ‡ సమంపూర్వ
రసంకృత్వా సర్వంచూర్ణం ప్రకల్పయేత్। ముస్తాచందన
పున్నాగ నారికేళస్యమూలకమ్। కపిత్థరజవిదార్యోచూర్ణమా
సర్వంసమంభవేత్। జంబీరాణాంద్రవైర్మర్ద్యం ద్వియామం
వటకీకృతమ్। వేదవిద్యావటీనామ్నా † భక్షణాత్సర్వమేహ
జిత్। మధుధాత్రీరసంచాను క్షౌద్రైః క్వాథోగుడూచికా।
అంకోలస్యతుబీజానాం రాత్రౌదాహాహరంపిబేత్॥

తా. రసభస్మము అభ్రకభస్మము కాంతభస్మము నాగభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మోదుగ నెక్కరసముతో 1 దినము మర్దించి ముద్దజేసి బట్టలోగట్టి మోదుగకషాయముతోడనే డోలాయంత్రమున 1 దినమువండి యెండించి గాజుపప్పెలోనునిచి వాలుకాయంత్రమున మరల 1 దినమువండి సాంగశీతలమున దీసి మరలఖల్వములోనునిచి సూక్ష్మముగ చూర్ణముగావించి యందురాజావర్తము శుద్ధిచేసిన శిలాజిత్తుభస్మము స్వర్ణమాక్షికభస్మము మండూరము వైక్రాంత

† స్వర్ణమాక్షికమన—బంగారువిమ్మ. * జారితామ్రం.

‡ సర్వంసర్వసమంచూర్ణంకల్పయేచ్ఛతతఃపునః। † భక్షణాదిక్షుమేహజిత్ ।

ము కాసీసము అనువానిలో ప్రతిదానిని పైరసభస్మమునకు సమముగ కలిపి చూర్ణ ముజేసి దీనిలో తుంగముస్తెలు శ్రీగంధము సురపొన్న నారికేళపువేళ్ళు వెలగపస పు మ్రానిపసపు అను వాని చూర్ణమును సమభాగములుగ కలిపి నిమ్మపండ్లరసము తో 2 ఝాములు మర్దించి మాత్రలుజేసి యందొక దానిని తేనె వుసిరికపండ్లరసము అనువాని యనుపానముతోడ గాని లేకతిప్పతీగె కషాయములో తేనెగలిపి యీయ నుపానముతోడగాని సేవించిన సర్వమేహములు హరించు. రాత్రులయందు శరీర మున తాపముగలిగిన యది హరించుటకై ఊడుగవిత్తుల కషాయముగాచి పానము సేయవలయు.

## శీతమేహమునకు నాగేంద్రఘుటికలు.

శ్లో॥ [పూజ్యపాదీయే] మృతనాగస్యభాగైకం భాగైకేన వృషా
భయా । * దార్వ్యంకోల ఫలంధాత్రీ హ్యక్షబీజం పలం
పలమ్ । కనకస్య ఫలద్రావైః పిష్ట్వా తన్మళికాకృతా ।
నాగేంద్ర ఘుటికాఖ్యాతా తక్రైః పీతాచమేహజిత్ ।నిశా
మృతాద్వినిష్కంచ మధునాలేహయేదను । వేదవిద్యా వటీ
వాత్ర హ్యనుపానంచయోజయేత్ ॥

తా. సీసభస్మము అడ్డసరము కరక్కాయలు మ్రానిపసపుఊడుగవిత్తులువుసి రికెపప్పు గచ్చపలుకులు వీనిని దినుసుకొక్కొక పలముచొప్పున ఖల్వములోనునిచి మోదుగుకాయలరసముతో మర్దించి మాత్రలుజేసి యందొకదానిని మజ్జిగతో గాని లేక 2 నిష్కములప్రమాణము పసపు తిప్పతీగె అనువాని చూర్ణమును తేనెతోగలి పి యీ యనుపానముతోగాని సేవించిన శీతమేహము హరించు. లేక పైజెప్పబడిన వేదవిద్యా వటికములను యీ యనుపానముతోనే సేవించిన శీతమేహముహరించు.

## పిష్టమేహమునకు మేహారి రసము.

శ్లో॥ వంగభస్మ మృతంసూతం తుల్యంక్షౌద్రైర్విమర్దయేత్ ।
ద్విగుంజం లేహయేన్నిత్యం హంతిమేహం చిరంతనమ్ ।
గుంజామూలం పిబేచ్చాను క్షీరైరేవ ప్రశామ్యతి ॥

తా. వంగభస్మము రసభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి తే నెతో మర్దించి 2 గురిగింజలంత మాత్రలుజేసి యందొకదానిని సేవించి వెంబడిగ గురిజవేరుచెక్కనుపాలతోనూరిత్రాగిన దీర్ఘకాలముగనుండు పిష్టిమేహముశమించు.

* దార్వీకోలఫలం—రేగుపండు.

## శుక్ల మేహమునకు మేహద్విరదసింహ రసము.

శ్లో॥ [మాధవకల్పే] పారదాభ్రకయోర్భస్మ మృతలోహాష్టకం సమమ్। టంకణంచైవమధ్వాజ్యం ప్రత్యేకంసూతతుల్యకమ్ । చండాలీ రాక్షసీపుష్పై ర్ది నంమర్ద్యం నిరుధ్యచ। మూషాయాం * భూధరేపక్వం దినైకంతంచచూర్ణయేత్ । మేహద్విరద సింహోయం రసఃక్షౌద్రై ర్ద్విమాషకమ్ । లిహేచ్చాను పిబేత్తక్రై ర్నిష్కైకం టంకణంసదా। పంచవక్త్రరసోప్యత్ర దేయశ్శుక్రప్రమేహజిత్ ॥

తా. రసభస్మము అభ్రకభస్మము స్వర్ణభస్మము రజతభస్మము తామ్రభస్మము నాగభస్మము వంగభస్మము కాంతభస్మము వుక్కుభస్మము లోహభస్మము పేల్చిన వెలిగారము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి తేనె నెయ్యి నీలి బలురక్కసి పువ్వులు అనువానిరసములతో 1 దినము మర్దించి ముద్దజేసి యెండించి మూసలోబెట్టి 1 దినము భూధర పుటంబిడి సాంగశీతలమున దీసి చూర్ణము చేసి యందు 2 మాషములయెత్తును ప్రతిదినము తేనెతో సేవించినతోడనే నిష్కుమెతు వెలిగారమును మజ్జిగతో నూరి త్రాగిన శుక్ల మేహము హరించు. ఈ శుక్ల మేహము హరించుటకై పంచవక్త్రరసమునైనను సేవింపందగు.

## సాంద్రమేహ చికిత్స.

శ్లో॥ ధాత్రీఫలం చంవాథ హరిద్రామాక్షి కాన్వితమ్ ।
దార్వీముస్తా దేవదారు త్రిఫలా క్వాథి తేజలే ।
యోజయేద నుపానేన మేహబద్ధ రసోపివా ।
దేయశ్చ సాంద్రమేహంతు నాశయే న్నాత్రసంశయః ॥

తా. పైజెప్పబడిన మేహబద్ధరసమును వుసిరికెపండ్లరసము పచ్చిపసవు తేనె అనువాని యనుపానములోడగాని లేక మ్రానిపసపు తుంగముస్తెలు దేవదారు త్రిఫలములు అను కషాయానుపానములోడగాని సేవించిన సాంద్రమేహము నిస్సంశయముగ హరించు.

* అంతరేపక్వం.

సురామేహమునకు మృగమాల రసము.

శ్లో॥ మారితంత్రపుసంసీసం * దగ్ధం హరిణశృంగకమ్ ।
కార్పాసబీజమజ్జాచ తుల్యమంకోలబీజకమ్ ।
పేషయేన్మహిషీతక్రై ర్ద్వికంవటకీకృతమ్ ।
మాషద్వయంసదాఖాదే న్మృగమాలాప్రమేహజిత్ ।
అక్షిపాఠాభయాదార్వీ కషాయమనుపానయేత్ ॥

తా. వంగభస్మము సీసభస్మము యిఱ్ఱికొమ్ముభస్మము ప్రత్తిపలుకులు ఊడుగపలుకులు వీనినిసమభాగములుగ ఖల్వములోనునిచి బఱ్ఱెమజ్జిగతో 1 దినముమర్దించి 2 మాషములంత మాత్రలుజేసి యందొకదానినిగచ్చపలుకులు శిరుబొద్ది కరక్కాయలు ప్రానిపసపు అనువాని కషాయానుపానముతోడ సేవించిన సురామేహము హరించు.

లాలామేహమునకు నిత్యారోగ్యేశ్వర రసము.

శ్లో॥ [సిందూరమణిదర్పణే] సూతంమృతాభ్రవంగాభ్యాం తుల్యభాగంప్రకల్పయేత్ । మహానింభోత్థపంచానాం చూర్ణంమోజ్యంత్రిభిస్సమమ్ । మధునాలేహయేన్మాషం లాలామేహస్యశాంతయే । సక్షౌద్రరజనీంవాత్రిలిహ్యాన్నిష్కత్రయంసదా ।
అసాధ్యం నాశయేన్మేహం నిత్యారోగ్యేశ్వరోరసః ॥

తా. రసభస్మము అభ్రకభస్మము వంగభస్మము యివి సమభాగములుగ ఈ మూడింటికిసమము పెద్దవేపచెక్క దానివిత్తులు దానిపువ్వులు దానియాకులు దానివేరు వీనినెల్ల చూర్ణముజేసి మాషప్రమాణమును దేనెతో సేవించిన శీతమేహముహరించు. మఱియు 3 నిష్కములయెత్తును 1 రూపాయయెత్తు పసపుచూర్ణము తేనె అనువాని యనుపానముతోడ సేవించిన అసాధ్య మేహములు హరించు.

లాలామేహ చికిత్స.

శ్లో॥ శీతమేహస్తుబహుశోమధురశ్చాతిశీతలః । ద్విగుంజందాపయేదత్రరసమానందభైరవమ్ । పాఠార్జునవిడంగానాంకషాయం మధుసంయుతం। అనుపానంప్రయుంజీతశీతమేహస్యశాంతయే ॥

* సుదగ్ధంమృగశృంగకమ్.

తా. శీతమేహము బహుళముగ మధురముగ కడుశీతలముగ స్రవించు. ఇది హరించుటకై 2 గురిగింజలయెత్తు * ఆనందభైరవరసమును శిరుబొద్ది యేటిమద్దియు విడంగములు అనువాని కషాయములో నొకింత తేనెగలిపి సేవింపవలయు.

## బహుమూత్రమునకు తాళకేశ్వర రసము.

శ్లో॥ మృతసూతంమృతంవంగం మృతంలోహాభ్రకంసమమ్ ।
మర్దయేన్మధునాచాహ్ని రసోయంతాళకేశ్వరః ।
† మాషమేకంలిహేత్ప్రాతర్బహుమూత్రాపనుత్తయే ।
ఉదుంబరఫలంపక్వం చూర్ణితంకర్షమాత్రకమ్ ।
సంలిహేన్మధునాసార్థ మనుపానంసుఖావహమ్ ।
ముద్గామలకయూషేణ పథ్యం దేయంసతక్రకమ్॥

తా. రసభస్మము వంగభస్మము లోహభస్మము అభ్రకభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి తేనెతో 1 దినము మర్దించి మాషమెత్తు మాత్రలు చేయందొకదానిని-కర్ష ప్రమాణము మేడిపండ్లచూర్ణము తేనె అనువాని యనుపానముతోడ సేవించిన బహుమూత్రము హరించు మఱియు పెసలుపుసిరికెపప్పు అనువాని ‡ యూషమును తక్రయుక్తముగజేసి సేవించుట పథ్యకరము.

## బహుమూత్రమునకు ఆకుల్యాది పుటపాకము.

శ్లో॥ [నిత్యనాథీయే] ఆకుల్యాయాః ప్రవాళాశ్చ ముకుళాస్సమ
భాగికాః।రంభాకేసరసంయుక్తాస్సంవేష్ట్యకదలీదళైః।కృష్ణ
మృత్తికయాలిప్య పుటపాకేవిపాచితమ్ । కదుష్ణకల్కంసం
మర్ద్య తైలమధ్యేవినిక్షిపేత్ । కుక్కుటాండప్రమాణంతు

* ఆనందభైరవము —"శ్లో॥ హింగుళంచవిషంవ్యోషంగంధకంటంకణంసమ జంబీరఫలజద్రావైర్మర్ద్యం యామ చతుష్టయమ్ । గుంజైకంచ ప్రదాతవ్యం హ్యానందభైరవః" తా. శుద్ధిచేసిన ఇంగిలీకము శుద్ధిచేసిన నాభి త్రికటుకములు శుద్ధిజేసిన గంధకము వెలిగారము వీనినిసమ భాగములుగ ఖల్వములో నిచి నిమ్మపండ్లరసముతో 4 ఝాములు మర్దించి గురిగింజం మాత్రలుజేసి సేవింపవలయు.

† మాషైకంభక్షయేత్ప్రాతః. ‡ యూషమనగా

భక్షయేన్మధునాసహ । మాసమాత్రప్రయోగేణ బహుమూత్ర
రోగంనివారింతిచ ॥

తా. నేలతంగేడు చిగుళ్ళు నేలతంగేడు మొగ్గలు అరటికేసరములు వీనినిసమ భాగములుగనూరి ముద్దజేసి అరటియాకులోనునిచి దానిపై రేగటిమన్ను మెత్తి మాడ కుండా పుటంబిడి వొకింత యుష్ణముగనుండునపు డంగుండితీసి మర్దించి ముద్దజేసి తెల్లయావనూనెలోనువిచ్చి కోడిగుడ్డంత ప్రమాణమును తేనెయనుపానముతోడ 1 మాసమువరకు ప్రత్యహము సేవింపుచుండిన బహుమూత్రము హరించు.

బహుమూత్ర చికిత్సలు.

సీ॥ తనరారు నవభాగమును మాషపిష్టంబు నష్టావట్ఛాగంబు
పూర్వగుడము। క్రముకంబులక్కలకట్టియు రెండేసి భాగము
ల్గూర్చియింపారగున్న చింతగింజలపొట్టు చెన్నొందనొక్కొక్క
భాగంబుమఱియుఁబర్పాటకంబు । సురలవంగంబులుసొంపుగ
నభయంబు నొక్కొక భాగంబు నునిచికల్వ॥ మందుభల్లాతకీ
బీజమమరఁగూర్చి । తొక్కియుంటలుచేసియుఁ దులము
నఱయ్ము । ననుభవముచల్లయన్నంబునారగింప । మహిని
బహుమూత్రవ్యాధులు మానుచుండు॥

సీ॥ ప్రాచీనిరుమశుభస్మంబులమెత్తు దగమూఁడుదినములు
ద్రాగవలయు। మఱియుఁ జింతలపచ్చిబెఱడు గంధమునావు
పాలతోమున్నాళ్ళుగ్రోలవలయు । పెనుజీడిగింజలబెల్లము
మూ, డేసి సేరులుగూరిచి చెన్నుమీఱఁ । గను రసకర్పూర
మును నేడుచిన్నాలనఱకొక్క నేయియు నాముదంబు॥
తైలమును సేరుబావులు దేనెగూర్చి । క్రమముదప్పక లేహ్య
పాకముగవండి । తులముభక్షింప బహుమూత్రములు దొ
లంగు । భుజగరిపుఁజూచివిషములుపోవునట్లు॥

మ॥ మొదలనొక్కనుముజీడిగింజలుభయమ్ము రెండుభాగమ్ములుం।
బదిభాగంబులునింబపక్వవితతుల్యాత్రంబునన్వండియుం । పొద

వం జూర్ణముచేసి సూషధము సంభోగింపఁబథ్యంబుచే । విది
తంబై బహుమూత్రజాలగదములిఁక్షయాతిగా మానదే ॥

సీ॥ భాండంబులో నావుపాలు వోసియు బాతవస్త్రంబుగట్టి
తద్వస్త్రమందుఁ దిలపిష్టచూర్ణంబు దీరుగా జెన్నంగి యాకు
ముద్దను వేడ్క నమరగాను । నుంచిపాకముచేసి యొనర యా
రసముతోఁ బంచదారయు వంగభస్మమునను । జేర్చి సేవిం
చియుఁ జెన్నొందఁ బథ్యంబు వాపిష్టమును నన్నమనుభవింప ॥
వాసికెక్కిన బహుమూత్ర వర్గములును । దేహతాపంబుచే
గల్గుదాహములును । శాంతిఁబొందుననత్యంతసమ్మదంబు ।
నై సుఖంబుననుండుదురనుదినంబు ॥

క॥ మరినాగరంబు సేరం ।
తరదామరపాకుచూర్ణతతియుఁదులంబుల్ ।
వరగోక్షీరంబులతోఁ ।
పరిపాకతఁ గ్రోలబోవుబహుమూత్రంబుల్ ।

క॥ చెలువారవంగభస్మము ।
వెలిగారము దేనెతోడ నెలయఁగఁగ్రోలన్ ।
నలకందికట్టుచేలో ।
బలికింగానమానిపోవు బహుమూత్రంబుల్ ॥

సీ॥ పరగనిష్మక్రాంత పసిగడ్డతోసూరి జీలకఱ్ఱయుశీతవారిసేవ
మదనబుడుతలంబు మఱిగడుగునసూరిజీలకఱ్ఱయుశీతవారిసేవ
వరసురాకారంబు ధరనింబఫలసారమునఁ ద్రాగమానును
మూత్రకృచ్ఛ్రి । లరయకవ్వపుగుమ్ము డాకుపిసికిననీళ్ళు
పంచదారయుబెట్టి పానమొకటి ॥ యమరజిన్నంగిమాకు
శీతాంబుచింత । శొరడుగంధంబు నచ్చంపుబత్తినెయ్య । యను
భవించినరక్తమేహములుదొలఁగుఁ । బథ్యములు చేయవల
యునుభవ్యముగను ॥

### బహుమూత్రమునకు జాత్యాది వటుకములు.

శ్లో॥ [నందినాథీయే] జాతీఫలైక భాగంతుజాతీపత్రం తథా। మహాత్ । అఫేనమేకభాగంతు ద్విభాగందీప్యకంతథా । గాంధారీచచతుర్భాగంఖల్వామధ్యే వినిక్షిపేత్ । నారికేళోదకే నాథమర్దయేత్త్రిదినంద్ృఢమ్ । చణకస్యప్రమాణంతు మండలం భక్షితంయది । మధురాహారభోజీతు బహుమూత్ర పరిశాంతయే॥

తా. జాజికాయ జాపత్రి పెద్దములక నల్లమందు యివి దినుసుకొక్కొకభాగము ఖురాసానివోమము 3 భాగములు గంజాయియాకు 2 భాగములు యిట్లుల వీనిని సెల్ల ఖల్వములోనునిచి కొబ్బరికాయనీరుతో 3 దినములు దృఢముగ మర్దించిసెనగగింజ లంతేసిమాత్రలుజేసి 1 మండలమువరకు సాయంప్రాతఃకాలముల సేవింపుచుండిన బహుమూత్రము హరించు. పథ్యము మధురాహారముల భుజింపవలయు.(½ సేరు వుత్తరేణి యాకురసములో ½ తులము మిరియపుచూర్ణము గలిపి త్రాగినరక్తమేహము హరించు. మఱియు రక్తమేహమునందు చంద్రకళారసమునుకూడ సేవింపందగు.)

### వంగావలేహ యోగము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] మారితంత్రపు సంసీసంహారిణశ్శృంగమాకులమ్ । కర్పాసనాకులీతక్రం మహిషంచపరిమేహజిత్॥

తా. వంగభస్మము సీసభస్మము యిఱ్ఱికొమ్ము గంధముప్రత్తిపలుకులుతంగేడువిత్తులు వీనిని సమభాగములుగనూరి బఱ్ఱెమజ్జిగలో గలిపి త్రాగిన మేహరోగములు హరించు.

శ్లో॥ పిచుమందస్యనిర్యాసం ధాత్రీక్వాథేన పేషితమ్ ।
శిలాధాతుసమాయుక్తం శుక్లమేహవినాశనమ్।

తా. మంచివేపబంకను వుసిరికెపప్పు కషాయముతో నూరి 10 చిన్నములయెత్తు కర్పూరశిలాజిత్తు భస్మము గలిపి 40 దినములు సేవించిన శుక్లమేహము హరించు.

### మేహములకు వసంతకుసుమాకరము.

శ్లో॥ [ఆయుర్వేదే] ప్రవాళ్ళహాటకంచంద్రం త్రిమోవంగాహి కాంతజమ్ । చతుర్భాగసూతం భ్రింప ప్రవాళంమాక్తికం

తథా । భావనాగవ్యదుగ్ధేక్షు వాసాశ్రీద్విజలైర్నృణా। మోచకందరసైస్సప్తక్రమాద్భావ్యం పృథక్పృథక్ । శతపత్రిరసేనైవ మాలత్యాః కుసుమైస్తథా । పశ్చాన్మృగమదైర్భావ్యసుసిద్ధో రసరాట్భవేత్ । కుసుమాకర విఖ్యాతో వసంతపదపూర్వకః । వల్లద్వయమితస్సేవ్య స్సితాజ్యమధుసంయుతః। వలీపలిత హృన్మేధ్యః కామదస్సుఖదస్సదా । మేహఘ్నఃపుష్టి వశ్యేష్టః పరంవృష్యోరసాయనః । ఆయుర్వృద్ధికరఃపుంసాంప్రజా జననముత్తమమ్ । క్షయకాసతృషోన్మాదశ్వాసరక్తవిషార్తిజిత్। సితాచందనసంయుక్తమామ్లపిత్తాదిరోగజిత్ । హంతిపాండ్వామయాన్ శూలాన్ మూత్రఘాతాశ్మరీంహరేత్ । యోగవాహిత్వదం సేవ్యంకాంతి శ్రీర్బలవర్ధనమ్ । సుసాత్మ్య మిష్టభోజీన రమయేత్ప్రమదాశతమ్ । మదనం మదయన్స్మరముజ్జ్వలయన్ ప్రమదా నివహాన్సతివిహ్వలయన్ । సురతైస్సుఖదైర్గతివిహ్వచనైర్భవసారజుషామయమేవసుహృత్ ॥

తా. సువర్ణభస్మము 2 భాగములు రజతభస్మము 2 భాగములు వంగభస్మము 3 భాగములు సీసభస్మము 3 భాగములు లోహకాంతభస్మము 3 భాగములు రసభస్మము 4 భాగములు అభ్రకభస్మము 4 భాగములు పగడభస్మము 4 భాగములు ముత్తియపుభస్మము 4 భాగములు యిటుల వానినెల్ల ఖల్వములోనునిచి ఆవుపాలు చెఱకు అడ్డసరము అనువానిని కషాయములతోను చందనము వట్టివేరు కురువేరుపసవు అనువాని కషాయములతోను అరటిగడ్డ దామెర జాజిమొగ్గలు అనువానిరసములతోను వేర్వేరుగ యేడేసిమార్లు భావనజేసి పిదప కస్తూరితో భావనజేసిన వసంతకుసుమాకరము పోరంబబుగు నీయౌషధము శ్రేష్ఠంబైనదిగ నగుచున్నయది. పిదప అందు 2 వల్లములయెత్తును శర్కర నెయ్యి తేనె అనువాని యనుపానముతోడ సేవించిన యెడల మేహము క్షయము కాసము దప్పి ఉన్మాదము శ్వాసము రక్తవిషదోషములు పాండువులు శూలలు మూత్రాఘాతము అశ్మరి అనురోగముల హరింపంజేయుట యేగాక కామసుఖము పుష్టి వీర్యవృద్ధి ఆయుర్వృద్ధి ప్రజోత్పత్తి కాంతి బలము అనువానిని సగాగలుగంజేయు. మఱియు నీరసాయనమును పంచదార చందనము అనువాని యనుపానముతోడ సేవించిన ఆమ్ల పిత్తాదిరోగములు హరించు. పథ్యము

లేక యథేష్టముగ భుజించుచు నీయౌషధమును సేవించుచుండిన 100 గురు స్త్రీలతో రమించుటకు దగిన శక్తిగలవాడై కఱుకామాతురుడై కడుసుఖకరసురతముల వలన మదోన్మత్తుడై స్త్రీలమదము నణంచువాడైయుండు కావున సంసారసుఖము నెఱింగి నవాని కీయౌషధము స్నేహితునివలె హితమును సేయుచుండు.

## సర్వమేహములకు మహావంగేశ్వర రసము.

శ్లో॥ వంగం కాంతం చ గగనం హేమపుష్పం సమం సమమ్ ।
కుమారీరసతో భావ్యం సప్తవారం భిషగ్వరైః ।
ఏష వంగేశ్వరో నామ ప్రమేహాన్ వింశతిం జయేత్ ।
మూత్రకృచ్ఛ్రం సోమరోగం పాండురోగం మహాశ్మరీమ్।
రసాయనవరశ్రేష్ఠో నాగార్జునవినిర్మితః ॥

తా. వంగభస్మము లోహకాంతభస్మము అభ్రకభస్మము నేలతంగేడువిత్తులు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి కలబందరసముతో 7 మార్లు భావనజేసి రోగబలానుగుణ్యముగ సేవించిన 20 మేహములు మూత్రకృచ్ఛ్రము సోమరోగము పాండురోగము అశ్మరి అనువానిని హరింపజేయుటయం దీరసాయన శ్రేష్ఠంబై వదని నాగార్జునుడు వచించె.

## మేహకుంజర కేసరీ రసము.

శ్లో॥ [అన్యశాస్త్రే] రసగంధాయసాభ్రాణి నాగం వంగం సువర
కమ్ । వజ్రకం మౌక్తికం సర్వమేకీకృత్య విచూర్ణయేత్ శతా
వరీరసేనైవ గోళకం శుష్కమాతపే। తథా శుష్కం సముద్ధృత్య
శరావే సుదృఢే క్షిపేత్ । సంధిలేపం మృదా కుర్యాద్గర్తాయాం
గోమయాగ్నినా । పుటేద్యావచ్చతుర్యామం సముద్ధృత్య స్వాంగ
శీతలమ్॥ శ్లక్ష్ణం ఖల్వే వినిక్షిప్య గోళం తం మర్దయేద్దృఢమ్ । దేవ
బ్రాహ్మణపూజాం చ కృత్వా ధృత్వా చ కుప్యకే। ఖాదేద్వల్ల
ద్వయం ప్రాతశ్శీతం చానుపిబేజ్జలమ్ । తథా సర్వప్రమేహాంశ్చ
జయేన్నానాప్రయోగతః। తుష్టిం తేజో బలం వర్ణం శుక్ర వృద్ధించ

నారుణమ్। అగ్నేర్బలంవితనుతే మోహమేకుంజరకేసరీ। దివ్యం
రసాయనం శ్రేష్ఠం నాత్రకార్యావిచారణా॥

తా॥ శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము లోహభస్మము అభ్రకభస్మము సీసభస్మము వంగభస్మము సువర్ణభస్మము వజ్రభస్మము ముత్తియపుభస్మము వీనినెల్ల సమభాగములుగ ఖల్వములోనునిచి పిల్లిపీచరవేళ్ళరసముతో మర్దించి బిళ్ళజేసి యెండనెండించి దృఢమైన శరావముల యందునిచి దానిచుట్టూచీలమన్ను లేపనము జేసి గంటత్రవ్వి దానిలోనునిచి 4 ఝాములు ఆవుపిడకలతో పుటంబిడి స్వాంగశీతలమునదీసి దేవగురు బ్రాహ్మణ అతిథుల పూజించి ఖల్వములోనునిచి బాగుగమర్దించి చూర్ణముజేసి కుప్పెలోనునిచికొని యందు 2 వల్లములయెత్తును ప్రాతఃకాలమున సేవించి కొంచెము శీతోదకమును వెంబడిగ త్రాగవలయును. ఇట్టుల 1 మాసమువరకు సేవింపుచుండిన సర్వమేహముల హరింపంజేసి సంతోషము తేజస్సు బలము వర్ణము స్మృతివృద్ధి అగ్నిదీపము అను వానిని నిస్సంశయముగ గలుగంజేయును. ఇది శ్రేష్ఠంబైన రసాయనంబుగానున్నయది.

## పంచలోహ రసాయనము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే]మృతాభ్రం కాంతలోహంచ నాగవంగౌవిశో
ధితౌ। యథోత్తరంభాగవృద్ధ్యాఖల్వమధ్యేవినిక్షిపేత్। తల
పోటేన వారాహ్యాశతావర్యా హిమాంబునా। భావనాత్రి
ప్రకర్తవ్యా యామంయామం పృథక్పృథక్। చణమాత్రాం
వటీంకృత్వాఽనవనీతేనసేవయేత్। ప్రాతరుత్థాయవిధినా సర్వ
మేహకులాంతకః। శాల్యన్నంనవటోలంచతండులీయకవాస్తు
కమ్। మత్స్యాక్షీముద్గయూషం చాప్యపక్వంకదళీఫలమ్।
అర్శాంసిగ్రహణీదోషమూత్రకృచ్ఛ్రాశ్మరీపరిణుత్। కామి
లాంపాండుశోథంచాప్యపస్మారం క్షతక్షయాన్। రక్తకాసం
నిహంత్యాశు పంచలోహరసాయనమ్॥

తా॥ అభ్రకభస్మము 1 భాగము లోహకాంతభస్మము 2 భాగములు సీసభస్మము 3 భాగములు వంగభస్మము 4 భాగములు యిట్టుల వానినిఖల్వములోనునిచి ంగేడు నేలతాటిగడ్డలు పిల్లిపీచరవేళ్ళు రక్తచందనము అనువాని కషాయములలో

ప్రతిదానిచే నొక్కొక జాము మర్దించి పెనగగింజలంత మాత్రలుజేసి యందొకదా నిని ప్రాతఃకాలమున వెన్నతో సేవించిన సర్వమేహములు హరించు. మఱియు దీని యందు వరివంటకము పొట్లకాయ చిట్టికూర చక్రవర్తికూర పొన్నగంటికూర పెస రకట్టు అరటికాయ అనువానిని భుజించుట పథ్యకరము. మఱియు నీయౌషధసేవ నవలన మూలరోగము సంగ్రహణి మూత్రకృచ్ఛ్రము అశ్మరి కామిల పాండువు వాపు అపస్మార క్షతక్షయము రక్తకాసము హరించు.

## సర్వమేహములకు చంద్రోదయ రసము.

శ్లో॥ అభ్రికంగంధకంసూతం వంగభస్మసమాంశకమ్ ।
ఏలశిలాజతుంచైవ రంభాసారేణమర్దయేత్ ।
ప్రమేహాన్వింశతింహన్యా త్కామిలాపిత్తనాశనః ॥

తా. అభ్రకభస్మము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన రసము వంగభస్మము యేలకులు శుద్ధిజేసిన కర్పూరశిలాజిత్తు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి అరటి గడ్డరసముతో మర్దించి మాత్రలుజేసి యందొకదానిని సేవించిన 27 ప్రమే హములు కామిల పిత్తరోగము హరించు.

## మేహ శూలలకు.

క॥ తాళకమువంగభస్మము। క్రిలగదంగేడుపంచకంబుసుధరణిక్।
గ్రోలంగశుద్ధకట్టులు। శూలారినమేహశూలకులముదొలంగుక్॥

పంచపాది చంపకమాలిక॥ ఉలిమెండువేళ్లుపల్లెనుకొప్పుగు కొమ్మునం
బెండివేరునుక్ ॥ వెలసిన భూమిధాత్రిముల వేరుల నాము
లు దోస విత్తులుక్। పలుపసిగడ్డుతోమరియుబాగుగమర్దన
చేసిశీఘ్రముక్ । బలుమఱుమేహరోగములుపాయునిజంబు
ధారుణీస్థలిక్॥

## అసాధ్యమేహ పిటికా లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] గుదేహృదిశిరస్యంసే పృష్ఠే మర్మకు చో
త్థితాః । సోపద్రవామర్బలాగ్నిః పిటికా పరివర్జయేత్॥

తా. గుదము హృదయము శిరము భుజశిరస్సులు వీపు మర్మస్థలము అనువాని పైమేహపిటికలుజనించి॥ శ్లో॥ తృట్కాసమాంససంకోచా మేహహిక్కామదజ్వరాః

విసర్పమర్మసంరోధాః పిటికానాముపద్రవాః॥" అనగా దప్పి పొడిదగ్గు మాంస సంకోచము మోహము యెక్కిళ్ళు మదజ్వరము విసర్పి మర్మస్థలములయందుపట్లు అనునుపద్రవములు గలవాడై అగ్నిదీపనములేనండెడి పిటికారోగిని వైద్యుడు వర్జింపవలయును మఱియుతంత్రాంతరసములయందు "శ్లో॥రజఃప్రసేకాన్నారీణాంమాసి మాసి విశుద్ధ్యతి । కృత్స్నం శరీరం దోషాంశ్చ నప్రమేహంత్యతస్త్రియః॥" అనగా స్త్రీలు ప్రతిమాసమునందు ఋతువగుటవలన సర్వశరీర దోషములు శుద్ధంబులగు చానంజేసి స్త్రీలకు ప్రమేహము జనించుటలేదనియు జనించియుండుట నిదివరకెవ్వరికి ననుభవసిద్ధంబుగ లేదనియు తదితరరోగములు జనించుట అసంభవములనియు జెప్పంబడియున్నయది. ఐనను నీవిషయము వాదాస్పదముగ నున్నయది. దీనినెవ్వరు విశదముగ నిర్ణయము జేయలేరు.

శ్లో॥ మర్మణ్యాం సే గుదే పాణ్యో స్తనే సంధిషు పాదయోః ।
పిటికా యదిజాయంతే ప్రమేహీ నచజీవతి ॥

తా. మర్మస్థలములు భుజశిరస్సులు గుదము చేతులు స్తనములు కీళ్ళు పాదములు అనువానియందు మేహపిటికలుజనించిన ఆమేహరోగి జీవింపడని తెలియవలయు.

## మేహపిటికా చికిత్సాక్రమము.

శ్లో॥ [ఆయుర్వేదే] శరావికాదిపిటికా శ్శోఫవత్సముపాచరేత్ ।
అపక్వవ్రణవత్సర్వాం సాత్వాత్పూర్వరూపమేవచ ।
పిటికాస్సంధిజాతాశ్చ త్వరయారక్తముద్ధరేత్ ।
జలూకాలాబుశృంగైర్వా పచనైర్వాచికిత్సకైః ॥

తా. శరావికాది మేహపిటికల శోఫవలెనేచికిత్సింపవలయు.పిటికలయందపక్వవ్రణపూర్వరూపములే గలిగియుండు. సంధిజనిత పిటికలయందు జలగలు సొరకాయబుఱ్ఱలు కొమ్ములు అనువానిచే శీఘ్రముగ రక్తమునైన స్రవింపజేయవలయు లేక వానిని పడునటులంజేసియైన చికిత్సింపవలయు.

## మేహవ్రణ చికిత్స.

శ్లో॥ అరుష్కరాఖ్యబీజాని చాతుర్జాతంసమంతథా । రసభస్మతద ర్ధంచ గంధకంక్షౌద్రమర్దితమ్ । ఖాద్యంఘృతేన నిష్కార్ధం మేహవ్రణప్రశాంతయే॥

తా. జీడిపలుకులు ఏలకులు దాచినిచెక్క ఆకుపత్రిక నాగకేసరములు ఇవి దినుసుకు సమభాగములు వీనికి ½ భాగాను శుద్ధిచేసిన రసభస్మము శుద్ధిజేసిన గంధకము ఇటులవీని నెల్ల ఖల్వములోనునిచి లేనెతో మర్దించి ½ నిష్క ప్రమాణము మాత్రలుజేసి యందొకదానిని సాయంప్రాతఃకాలముల నొక మాసమువరకు సేవింపుచుండిన మేహపిటికలు హరించు. పథ్యము చప్పిడియన్నము ఆవుపాలు ఆవుమజ్జిగ వీనిని సేవింపవలయు.

మ॥ పొసఁగన్ మ్లేచ్ఛమునావువెన్నయును దాంబూలీసహోదేవియు ।
నొప్పసగన్ బంగరుప్రత్తియాకురసము న్నింపార మర్దించియున్ ।
వసుధన్మేలుఫిరంగిచెక్కతునుకల్వస్వంబుగాఁబోకఁలున్ ।
విసగా రేడును రెండుసేర్లువిడియా భాగాలుమిశ్రించి సం ।
తస మొందన్ విడియంబుసేయఁజనుగాత న్మేహగ్రంథ్యాదులున్॥

క॥ వెలుమసంధ్యాకురసమును । దిలసారము రెండుఁగూర్చి తెలివిగఁద్రాగన్ । నెలకొన్న మేహవ్రణములు । దొలఁగును రవిగన్నఁదమము దొలఁగినరీతిన్ ॥

మేహములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] పురాణశాలిగోధూమ షష్టీజాంగలజామిషం । పిణ్యాకంతిలజంతక్రం నవనీతముపోదకీ । తండులీయకధత్తూరం జీవంతీశిగ్రుపల్లవమ్। ముద్గమూషా మ్రతాధాత్రీ పటోలం వత్సకంమధు । ఔదుంబరఫలంబాల పక్వంచదళీఫలమ్ । రంభాప్రసూనం గాంగేరీ ఝురసీ డుండుకంతథా । కపిత్థంమేషశృంగీచ ముష్కకంకతకంతథాః కారవల్యాఖాకర్ణీచ తిక్తవర్గానియానిచ । వ్యాయామ స్నానమభ్యంగం ప్రమేహేషు హితంసదా ॥

తా. ప్రాతబియ్యము గోధుమలు 60 దినములకుఫలించెడువడ్లు జాంగలమాంసము తెలికపిండి మజ్జిగ వెన్న బచ్చలికూర చిత్రికూర పొన్నగంటికూర మునుబాల కూర లేతమునగకూర పెసరకట్టు తిప్పతీగె ఉసిరికకాయ పొట్లకాయ కొడిసె

కాయ తేనె మేడికాయ లేత అరటికాయ అరటిపువ్వు పులిచింత చేతరాశికూర మందిలపుకాయ వెలగపండు వద్దికూర మొక్కపుకాయ ఇండుపుకాయ కాకరకాయ రొలుక చెవికూర చేసుగల పదార్థములు సంచారము అభ్యంజనస్నానము వీనిని సేవించుట మేహరోగములయందు పథ్యకరంబులు.

## మేహములయంద పథ్యము.

శ్లో॥ దధిమధుగుడసర్పిః క్షీరమామ్లంచ హింగు । లవణలశునని(ద్రా సంగమంమత్స్యమాంసమ్ । తిలసర్ష పశుంఠీచ నారికేళాంబు పిష్టం । బృహతి పనసకందం మేహినాం శత్రువర్గః ॥

తా. పెరుగు కల్లు బెల్లము నెయ్యి పాలు పులుసు యింగువ పుప్పు వెల్లుల్లి పగటినిద్ర స్త్రీసంగమము మత్స్యమాంసము నువ్వులు ఆవాలు శొంఠి టెంకాయనీరు పిండివంటకములు ములకకాయలు పనసపండు కందగడ్డ ఇవి మేహరోగములయందపథ్యకరంబులు.

## మూత్రకృచ్ఛ్ర నిదానము.

శ్లో॥ [చరకే] వ్యాయామతీక్ష్ణరూక్షౌచ్చ మద్యమత్స్యాతి సేవనాత్ । అజీర్ణాదతివేగాచ్చమూత్రకృచ్ఛ్రాష్టకంభవేత్ ॥

తా. మిక్కుటముగ సంసారముసేయుట తీక్ష్ణ రూపముగల పదార్థములు కల్లుమత్స్యములు వీనిని మిక్కుటముగ సేవించుట అన్నము జీర్ణముగాకుండుట గుఱ్ఱము మొదలగువానినెక్కి కడువేగముగ సంచరించుట ఈ కారణములవలన 8 విధములైన మూత్రకృచ్ఛ్రములు జనించు.

## వాతమూత్రకృచ్ఛ్ర లక్షణము.

శ్లో॥ మూత్రాష్ఠీలాద్భవేత్పీడాకష్టాన్మూత్రాయతేముహుః । మేఢ్రవంక్షే వేదనాచ కృచ్ఛ్రోవాతాధికోభవేత్ ॥

తా. కడువేదనాయుక్తమై కడుకష్టముమీదపలుమారు కొంచెకొంచెముగా మూత్రము వెడలుట మేఢ్రము అండసంధులు చకారమువలన పొత్తికడుపు మూత్రాశయము అనువానియందు తీవ్రమైన వేదన గలుగుట ఈ లక్షణములుగలదివాతమూత్ర కృచ్ఛ్రమని దెలియవలయు.

## పైత్యమూత్రకృచ్ఛ్రలక్షణము.

శ్లో॥ పీతంర క్తంసలుగ్దాహం మూత్రకృచ్ఛ్రించ పిత్తళమ్ ।
శీతలేచావగాహాశ్చపి త్తేయోజ్యంసు శీతళమ్ ॥

తా. పొట్లతోగూడి పచ్చనివర్ణముగాని లేక యెఱ్ఱనివర్ణముగాని గలదైని ప్పువలె మండుచు కొంచెకొంచెముగ మూత్రము వెడలిన పిత్తజమూత్ర కృచ్ఛ్రమని తెలియవలయు దీనియందు శీతోదకములో గ్రుంకుట శీతలపదార్థముల సేవించుట హితకరము

## శ్లేష్మమూత్ర కృచ్ఛ్ర లక్షణము.

శ్లో॥ [రసరత్నాకరే] వస్తౌలింగే గురుత్వంచ మూత్రేచ్ఛిలతా ।
కఫాత్ ; శ్వయథుశ్చభ వేత్కృచ్ఛ్రంవమనస్వేదనంజయేత్ ॥

తా. పొత్తికడుపు మేఢ్రము వాచి జడనుగనుండుట మూత్రముజిగటగపడుట ఈ లక్షణములుగలది శ్లేష్మజ మూత్రకృచ్ఛ్రమని తెలియవలయు. దీనిని వమనస్వేదన క్రియలచే శమింపంజేయవలయు.

## శుక్లమూత్రకృచ్ఛ్రలక్షణము.

శ్లో॥ ఆధ్మానవాతంశూలంచ మూత్రసంగం కరోతిచ ।
అశ్మరీహేతుకం పూర్వం మూత్రాఘాతో హ్యయంభవేత్ ।
సశుక్లంమూత్రయేత్కృచ్ఛ్రాదిదంచాశ్మరి లక్షణమ్ ॥

తా. వెన్నును గుదియదీసుట లేక కడుపుబ్బుట మేఢ్రములో శూలగలుగుట మూత్రోత్సర్జనముగాకుండుట ఈ మూత్రాఘాతము అశ్మరీరోగోత్పత్తికి కారణంబు గనగుట మూత్రముతోడ శుక్రధాతువు కొంచకొంచముగ స్రవించుట ఈ లక్షణములుగలది శుక్రమూత్ర కృచ్ఛ్రమని తెలియవలయు మఱియు నీ లక్షణములే అశ్మరీ కృచ్ఛ్రమునందు సగా గలిగియుండు.

## వాతకుండలి మూత్రకృచ్ఛ్ర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] మూత్రమల్పంచ రంధ్రార్తి రాధ్మానం గురుకండుతా । సరుంజమూత్రరోధశ్చ కృచ్ఛ్రోయం వాతకుండలీ ॥

తా. మూత్రద్వారమున మూత్రము వెడలునప్పుడు చురుచురుగలిగి యొక్కొక్కట్టుగ స్రవించుట వెన్నును గుగియదీసుట జడత్వము దురదగలుగుట పొత్తికడుపునందు వాతవేదన మూత్రప్రతిబంధముగలుగుట ఈ లక్షణములుగలది వాతకుండలి మూత్రకృచ్ఛ్రమని తెలియవలయు.

## శల్యజమూత్రకృచ్ఛ్ర లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] మూత్రవాహిషుశల్యేన క్షతేష్వభిహతేషుచ ।
మూత్రకృచ్ఛ్రం తదాఘాతా జ్జాయతే భృశదారుణమ్ ।
వాతకృచ్ఛ్రేణ తుల్యాని తస్యలింగాని లక్షయేత్ ॥

తా. మూత్రమును వహించు స్రోతస్సులయందు శల్యము ప్రవేశించుటవలన గాయముగాని లేక దెబ్బగాని గలుగుటచే కడుదారుణమైన మూత్రకృచ్ఛ్రము జనించు ఇదియె శల్యమూత్రకృచ్ఛ్రమనంబడును. దీనియందు వాతమూత్రకృచ్ఛ్రలక్షణంబులే గలిగియుండు.

## పురీషజ మూత్రకృచ్ఛ్ర లక్షణము.

శ్లో॥ శకృతస్తు ప్రతీఘాతా ద్వాయు ర్విగుణతాంగతః ।
ఆధ్మానం వాతసంగంచ మూత్రసంగం కరోతిచ ॥

తా. మలము బంధించుటవలన వాతము వికారగుణమునుజెంది ఆధ్మానము వాతశూల మూత్రప్రతిబంధము అనువానిని గలుగంజేసిన పురీషజన్యమూత్రకృచ్ఛ్రమని తెలియవలయు.

## సన్నిపాత మూత్రకృచ్ఛ్ర లక్షణము.

శ్లో॥ [నిత్యనాథీయే] వాతపిత్త కఫేభిస్త్రిం వామస్తుంచ పృథక్పృథక్ । తత్సమస్తం భవేద్యత్ర సకృచ్ఛ్రస్సాన్నిపాతికః॥

తా. వాతపిత్తశ్లేష్మమూత్రకృచ్ఛ్రములకు ప్రత్యేక ప్రత్యేకంబుగ జెప్పంబడిన లక్షణంబులన్నియుంగలిగిన సన్నిపాతమూత్రకృచ్ఛ్రమనంబడు [కడువేగము గలదై మూత్రం బొక్కొక్కబొట్టుగ వెడలుట మూత్రము వెడలునప్పుడు మేఢ్రమునులో నొచ్చుట పొత్తికడుపులో గడ్డలుకట్టి మెదలుట బచ్చగగాని ఎఱ్ఱగగాని మూత్రము వెడలుట మేఢ్రములో పోట్లుబొడుచుట దప్పిగలుగుట తఱచుగ మూత్రము కొంచ

కొంచముగ వెడలుట మేఢ్రము వాచుట అన్నము జీర్ణము గాకుండుట శరీరము వాచు టవమనంబులగు ఈ లక్షణంబులుగల మూత్రకృచ్ఛ్రరోగి యమాలయంబున కేగు నని తెలియవలయును.

శ్లో॥ [ఆయుర్వేదే] అష్టస్యుర్మూత్రకృచ్ఛ్రాణి రూక్షతీక్ష్ణోష్ణ ఖాదనాత్ । వాతాత్సశూలం స్రవలి మూత్రంపిత్తేన దాహ కృత్ కఫేన శీతలం సాంద్రం మశ్చికిత్స్యం త్రిదోషజమ్ । రక్తజం రక్తసంస్రావి శుక్లసంస్రావి శుక్లజమ్। అశ్మాశ్మరీ వస్తిగతా భిన్నా సా శర్కరాశ్మరీ ॥

తా. తీక్ష్ణద్రవ్యములు రూక్షద్రవ్యములు ఉష్ణకరభోజనము వీనిని సేవించుట వలన 8 విధముల మూత్రకృచ్ఛ్రములు జనించు అందు మేఢ్రమున శూలగలిగి మూత్రం బొక్కొకబొట్టుగ వెడలిన వాతమూత్రకృచ్ఛ్రమనియు మూత్రము వెడలునపుడు మేఢ్రమున నగ్నివలెమండుచుండిన పైత్యమూత్రకృచ్ఛ్రమనియు మూత్రము చల్లగ దట్టముగ వెడలిన శ్లేష్మమూత్ర కృచ్ఛ్రమనియు తెలియవలయు. త్రిదోషమూత్రకృచ్ఛ్రంబసాధ్యంబు. రక్తజమూత్రకృచ్ఛ్రమున రక్తము స్రవించు. శుక్లజమూత్రకృచ్ఛ్రమున శుక్లముగాని లేక మూత్రము శుక్లవర్ణముగాని స్రవించు. పొత్తికడుపునందు రాళ్ళుజనించి మూత్రద్వారము నడ్డగించిన మూత్రకృచ్ఛ్రాశ్మరియనియు యిసుకవలె మూత్రము వెడలిన శర్కరాశ్మరి మూత్రకృచ్ఛ్రంబనియు దెలియవలయు. కావున ఈ 8 విధములైన మూత్రభేదముల వలన తల్లక్షణములవలన వాని సాధ్యాసాధ్యంబుల నెఱింగి చికిత్సం జేయవలయు.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] ప్రయోగ శ్శమయేద్వ్యాధి మన్యామయ మదీరయేత్ । నాశావశుద్ధ స్తుతయా శయమేన్న సమీరయేత్॥

తా. ఔషధప్రయోగమువలన ఏకదోష జనితరోగములు హరించు. మఱియు ద్వంద్వ త్రిదోష జనితరోగములయం దౌషధమును బ్రయోగించిన తదితర రోగములు జనించు అట్లగుటంజేసి ఏకదోష జనితంబులగు వాతపిత్తశ్లేష్మ మూత్రకృచ్ఛ్రములకే చికిత్సంజేయవలయు. ద్వంద్వ త్రిదోషజనిత మూత్రకృచ్ఛ్రములు కుదురుటదుర్లభంబగుటచే వానియందు చికిత్స చేయుంజనదు.

## వాత మూత్రకృచ్ఛ్రమునకు మూత్రకృచ్ఛ్రాంతక రసము.

శ్లో॥ [మాధవనిదానే] * మృతంసూతం తామ్రభస్మ శిఖితుత్థం చటంకణమ్। శతావరీరసైనైవదినైకంమర్దయేద్దృఢమ్। తద్గోళంసార్ష పైతైలే పాచ్యం యామంచ చూర్ణయేత్। మూత్రకృచ్ఛ్రాంతకః క్షౌద్రైర్దేయం గుంజా చతుష్టయమ్। భక్షణాన్మాత్రసందేహో మూత్రకృచ్ఛ్రం నిహంత్యలమ్। తులసీతిలపిణ్యాకం బిల్వం మూలం తుషాంబునా। కర్షైకమనుపానేన † వాతకృచ్ఛ్రాంతకోభవేత్ ॥

తా. రసభస్మము తామ్రభస్మము శుద్ధిజేసిన మైలుతుత్తము పేల్చినవెలిగారము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి పిల్లిపీచరవేళ్ళ రసముతో 1 దినము బాగుగ మర్దించి ముద్దజేసి ఆవనూనెతో 1 ఝాము వరకు వండి చూర్ణముజేసి 2 గురిగింజలయెత్తును తేనెతో సేవించిన మూత్రకృచ్ఛ్రములుహరించు. లేక ఈమూత్రకృచ్ఛ్రాంతరసమును తులసియాకు గానుగపిండి మారేడువేరుపట్ట అనుదానిని కర్ష ప్రమాణము గ్రహించి వుముక నీటితో గ్రొక్కి ‡ నౌటాకు ప్రమాణము రసముదీసి ఈ యనుపానముతోడ 4 మాసములు సేవింపుచుండినమూత్రకృచ్ఛ్రము హరించు.

## పైత్యమూత్రకృచ్ఛ్రమునకు లఘులోకేశ్వర రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసభస్మచభాగైకంచతుష్కంశుద్ధగంధకమ్। పిష్ట్వావరాటికాః పూర్వారసపాదంచటంకణమ్। క్షీరేణపిష్ట్వా రుద్ధ్వాస్యం భాండేరుద్ధ్వాపుటేపచేత్। స్వాంగశీతం విచూర్ణ్యాథలఘులోకేశ్వరేరసః। చతుర్గుంజోఘృతైర్దేయోమరీచైకోనవింశతిః। ధాత్రీమూలం వల్లైకంతుహ్యజా క్షీరేణ పాచయేత్। శర్కరాభావితంచానుపీతంకృచ్ఛ్రహరంపరమ్॥

---

* శతావరీరసైఃపిష్ట్వా మృతసూతంచ తామ్రకమ్।
శిఖితుత్థంచ తుల్యాంశం దినైకంమర్దయేద్దృఢమ్॥

† సురయావాసువర్చలైః:

‡ నౌటాకుయన — సేరున కెనిమిదవ భాగము,

తా. రసభస్మము 1 భాగము శుద్ధిజేసిన గంధకము 4 భాగములు ఇటుల వీని నిఖల్వములోనునిచి మర్దించి గవ్వలలోనునిచి పాదరసమునకు 4 భాగము వెలిగారము మేకపాలతోనూరి గవ్వమూతులపై మెత్తి గట్టిమండలోనునిచి దానిమూతి మూకుడుచేమూసి చీలమన్ను లేపనముజేసి మాడకుండా లఘుపుటంబిడి స్వాంగశీతలమున దించి యందలి గవ్వలదీసిమర్దించి చూర్ణముజేసి 4 గురిగింజలయెత్తును నెయ్యి 19 మిరియములు అనువాని యనుపానముతో గానిలేక 1 పలము వుసిరికవేళ్ళనూరి పావుసేరు మేకపాలలోగలిపి కాచిగాని లేక శర్కరతో భావనజేసిగాని సేవించిన పిత్తమూత్రకృచ్ఛ్రము హరించు.

పిత్తమూత్రకృచ్ఛ్రమునకు యష్ట్యాదికషాయము.

శ్లో॥ యష్టిగోక్షురకంపథ్యావిదారీచకశేరుకమ్ । కషాయంససితాక్షౌద్రం రసభస్మయుతం పిబేత్ । మూత్రకృచ్ఛ్రం హరత్యాశు సప్తాహాత్పిత్తసంభవమ్॥

తా. అతిమధురము పల్లేరు కరక్కాయలు నేలగుమ్మడు నెమ్మటములుఅనువాని కషాయములో శర్కర తేనె రసభస్మముగలిపి 7 దినములు త్రాగిన పిత్తజమూత్రకృచ్ఛ్రము శీఘ్రము హరించు (నీరుకట్టు వ్యాధియందు 4 గురిగింజలయెత్తు లఘులోకేశ్వరరసమును కడికెడు అంబుగాకు పాలెడు వుసిరికెపప్పు నేటూరు ప్రమాణము జీలకఱ్ఱ అనువాని కషాయానుపానముతోడ సేవించిననీరుకట్టువ్యాధి హరించు.)

శ్లేష్మమూత్రకృచ్ఛ్రమునకు చక్రధర రసము.

శ్లో॥ [మాధవనిధానే] సూతం స్వర్ణంచ వైక్రాంతం మృతం తుల్యం విమర్దయేత్ । చాండాలీ రాక్షసీద్రావైర్ద్వియామాంతంచగోళకమ్ । శుష్కంబధ్వాపుటేచ్ఛాహః కరీభాగ్నామహాపుటే । మాషమాత్రం లిహేత్క్షౌద్రైర్మూత్రకృచ్ఛ్రంప్రశాంతయే। జయంతీం వాజయాంశ్లేష్మ కృచ్ఛ్రమత్తండులోదకైః ॥

తా. రసభస్మము స్వర్ణభస్మము వైక్రాంతభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వీని బలురక్కసిగడ్డ అనువానిరసములతో 2 జాములు మర్దించి ముంటజేసి నీడనెండించి దానిని మూలలోనునిచి చీలమన్ను లేపనముజేసి యేలు

పిడకలతో ] దినము పెద్దపుటంబిడి మాషప్రమాణమును తేనెతో సేవించిన మూత్ర కృచ్ఛ్రము లేక తక్కలివేరునుగాని కరక్కాయనుగాని బియ్యపుకడుగుతో నూరి ఈ యనుపానముతోడ సేవించిన శ్లేష్మమూత్రకృచ్ఛ్రము హరించు.

## శుక్లమూత్రకృచ్ఛ్రమునకు చికిత్స.

శ్లో॥ రసః పాషాణభేదీచరజనీ గుడకాంజికైః ।
అన్నైర్వానువానేన మూత్రఘాతాశ్మరీ ప్రణుత్ ॥

తా. ఉత్తరోత్తర జెప్ప బడు పాషాణభేదియను రసమును పసపుచూర్ణము బెల్లము కలి అనువాని యనుపానముతోడసేవించిన మూత్రాఘాతము శుక్లాశ్మరి హరించు.

## మూత్రకృచ్ఛ్రమునకు తిలాదిక్షారము.

శ్లో॥ [ఆయుర్వేదే] తిలాపామార్గ దళీ పాలాశయవసంభవః ।
దగ్ధ్వా తద్భస్మచాదాయ వస్త్రఘూత జలైఃకురు ।
జలేన శుష్కేనిక్షారం ద్వితప్కం మూత్రకృచ్ఛ్రనుత్ ॥

తా. నువ్వులదంటు వుత్తరేణు అరటి మోదుగ యవలదంటువీనిని సమభాగ ములుగ కాల్చి బూడిదజేసి నీళ్లలోగలిపి వస్త్రగాలితముచేసి నీరిగురువరకెండించి యందు 2 నిష్కములయెత్తును పాచినీళ్లతో సేవించిన వాతకుండలి మూత్రకృచ్ఛ్ర ము హరించు.

## సన్నిపాత మూత్రకృచ్ఛ్రమునకు ద్రాక్షాది కషాయము.

శ్లో॥ ద్రాక్షాశటీ బలాయష్టీ క్వాథం చందనసంయుతమ్ ।
వైక్రాంత భస్మనంపీత్వా కృచ్ఛ్రహంతి త్రిదోషజమ్ ॥

తా. ద్రాక్షపండు నల్లయలివస ముత్తవపులగము యష్టిమధుకము శ్రీగంధము వీనిని సమభాగములుగ కషాయముకాచి యందు వైక్రాంతభస్మముగలిపి సేవించిన సన్నిపాత మూత్రకృచ్ఛ్రము హరించు. (మూత్రకృచ్ఛ్రమును హరించుటకై పైజె ప్పబడిన చంద్రకళారసమును సగా సేవింపందగు.)

## మూత్రకృచ్ఛ్రములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] పటోలం మత్స్యాక్షీ దధిమధురం బింబీ
ఫలగుడమ్ । కుమారీ కూశ్మాండః త్రపుస మథవోర్వారుక

ఫలమ్ । సితారంభాపుష్పంఘృత పనసధాత్రీద్రుమఫలమ్ ।
సముద్గాజీవంతీహిమమఖిల కృచ్ఛ్రేషువిహితమ్ ॥

తా. పొట్లకాయ పొన్నగంటికూర ఆవుపెరుగు మధురపదార్థములు దొండకాయ బెల్లము కలుబంద ముదురగుమ్మడుకాయ ముళ్లుదోస నక్కదోసకాయ పంచదార అరటిపువ్వు నెయ్యి పనసపండు ఉసిరికకాయ పెసలు పాలకూర శీతోదకము ఇవి సర్వమూత్రకృచ్ఛ్రములయందు పథ్యకరంబు.

మూత్రకృచ్ఛ్రములయం దపథ్యము.

శ్లో॥ తిలసర్షప పిణ్యాకం సతైలం బృహతీద్వయం ।
అత్యుష్ణం హింగులవణ మాతపం మత్స్యసూరణమ్ ।
ఆమ్లం మద్యవిదాహ్యన్నం కరీరం మిసిమాషకమ్ ।
పునర్నవం సతాంబూలం కృచ్ఛ్రేవింశతి శత్రవః ॥

తా. నువ్వులు ఆవాలు తెలికపిండి నూనె చిన్నములక పెద్దములక అత్యుష్ణకరపదార్థములు యింగువ వుప్పు యెండు మత్స్యములు కందగడ్డ పులుసు! మద్యము విదాహకరమైన యన్నము వెదురుమొలక సదాప వుద్దులు గలిజేరు తాంబూలము అననవి 20 మూత్రగృచ్ఛ్రములయం దపథ్యకరంబులు.

మూత్రాఘాత నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] జాయంతే కుపితైర్దోషై ర్మూత్రాఘాతాస్త్రయోదశ । ప్రాయోమూత్ర విఘాతాద్యై ర్వాతకుండలికాదయః ॥

తా. మూత్ర పురీష శుక్రాదివేగముల నడ్డగించుట రూక్షాన్నాదులభుజించుట వీనివలన వాతాది దోషములు ప్రకోపించి వాతకుండలికాది 13 విధములైన మూత్రాఘాతముల గలుగంజేయు.

వాతకుండలికా లక్షణము.

శ్లో॥ రౌక్ష్యాద్వేగ విఘాతాద్వాపా యుర్వస్తౌస వేదనః ।
మూత్రమా విశ్యచరతి విగుణః కుండలీకృతః ।

మూత్రమల్పాల్పమథవా సరుజం సంప్రవర్తతే ।
వాతకుండలికాంతాంతు వ్యాధిం విద్యాత్సుదారుణమ్।

తా. రూక్షకరపదార్థముల సేవించుటవలనగాని లేక మలమూత్ర శుక్ర వేగములనడ్డగించుటవలనగాని వాతము ప్రకోపించి వస్తిగతంబై వేదనను గలుగంజేయుచు మూత్రమును ప్రతిబంధించి వ్యక్త్యస్తముగలదై కుండలాకారముగ దిరుగుచు మూత్రము కొంచకొంచముగ చురుకుయుక్తముగ వెడలింపం జేయునది వాతకుండలీ మూత్రాఘాతమని తెలియవలయు. ఇది భయంకరమైనది.

## అష్ఠీలా లక్షణము.

శ్లో॥ ఆధ్మాపయన్ వస్తిగుదం రుద్ధ్వాయుశ్చలోన్నతామ్ ।
కుర్యాత్తీవ్రార్తి మష్ఠీలాం మూత్రమార్గావరోధినిమ్ ॥

తా. వాతము పొత్తికడుపు నుబ్బింపంజేసి గుదమునడ్డగించి చంచలముగవున్నతముగనుండు. అష్ఠీలమును గలుగంజేసి మూత్రమార్గము నడ్డగించినవాతాష్ఠీలయని తెలియవలయు.

## వాతవస్తి లక్షణము.

శ్లో॥ [నిత్యనాధీయే] వేగం విదారయేద్యస్తు మూత్రస్యా కులో నరః । నిరుణద్ధి ముఖంతస్య వస్తేర్వస్తిగతోనిలః। మూత్ర సంగో భవేత్తేన వస్తికుక్షి నిపీడితః। వాతవస్తి స్సవిజ్ఞేయో వ్యాధిఃకృచ్ఛ్రప్రసాధనః ॥

తా. మూర్ఖుడైన మనుజుడు మూత్రమును బంధించుటవలన పొత్తికడుపునందలివాతము వస్తిముఖమునడ్డగించి మూత్రమును ప్రతిబంధించి వస్తి కుక్షి అనువానియందుపీడనుగలుగంజేయుచుండినవాతవస్తియని తెలియవలయు. ఇదికష్టసాధ్యము.

## మూత్రాతీత లక్షణము.

శ్లో॥ చిరంధార యతోమూత్రం త్వరయానప్రవర్తతే ।
మేహమానస్య మందంవా మూత్రాతీతస్స ఉచ్యతే ॥

తా. దీర్ఘకాలమువరకు మూత్రమును బంధించి యుండుటవలన శీఘ్రముగ వెడలక మెల్ల మెల్లగ వెడలిన మూత్రాతీతమని తెలియవలయు.

## మూత్రజఠర లక్షణము.

శ్లో॥ మూత్రస్య వేగే భిహతే తదుదావర్తహేతుకః ।
అపానః కుపితో వాయు రుదరం పూరయేద్భృశమ్ ।
నాభేరధస్తా దాధ్మానం జనయే త్తీవ్రవేదనమ్ ।
తన్మూత్ర జఠరంవిద్యా దధోవస్తి నిరోధజమ్॥

తా. మూత్రవేగము నడ్డగించుటవలనవుదావర్తరోగమునకు కారణభూతమైన యనుపానవాతము ప్రకోపించు మిక్కుటముగ కడుపుబ్బరమును బొడ్డుక్రింద ఆధ్మానమును గలుగంజేయుట మిక్కుటముగ వేదనను గలుగంజేయుటఅధోవస్తివేగము నడ్డగించుట ఈ లక్షణములుగలది మూత్రజఠరమని తెలియవలయు.

## మూత్రోత్సంగ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] వసౌ వాప్యథవానాళే మణౌ వాయస్య దేహినః । మూత్రంప్రవృత్తం సజ్జేత సరక్తంవా ప్రవాహతః॥ స్రవేచ్ఛనై శల్పమల్పం సరుజం వాధనిరుజమ్ । విగుణానిలజో వ్యాధి స్సమూత్రో త్సంగసంజ్ఞితః॥

తా. దుష్టమైనవాతము వెడలిన మూత్రమును వస్తిమధ్యమునందు గానిలేక మేఢ్రమునందు గాని లేక మేఢ్రముయొక్క యగ్రభాగమునందుగాని జేర్చుటచే ముక్కిముక్కి బలాత్కారము మీద మూత్రమును వెడలింపంజేయుటవలన వాతమువస్తి జనించి మెల్లమెల్లగ కొంచెకొంచెముగ * దాహయుక్తముగ లేక దాహవిహీనముగ రక్తమును స్రవింపంజేసిన మూత్రోత్సంగమని తెలియవలయు.

## మూత్రక్షయ లక్షణము.

శ్లో॥ రూక్షస్య క్లాంతదేహస్య వస్తిస్థౌ పిత్తమారుతౌ ।
మూత్రక్షయం సరుగ్దాహం జనయే తాంతదాహ్వయమ్॥

తా. రూక్షమలినదేహముగల పురుషునియొక్క వస్తియందుండు వాత పిత్తము వలన మూత్రము క్షయించి చురుకు మంటల గలుగంజేయుచుండి మూత్రక్షయమని తెలియవలయు.

* దాహమన — చురుకు

## మూత్రగ్రంథి లక్షణము.

శ్లో॥ అంతర్వస్తిముఖేవృత్తః స్థిరోల్పస్సహసాభవేత్ ।
అశ్మరీ తుల్యరుగ్గ్రంథి ర్మూత్రగ్రంధి స్సఉచ్యతే ॥

తా. వస్తియొక్క ముఖమునందు గుండ్రముగ స్థిరముగ చిన్నదిగనుండుగ్రంధ్యకస్మాతుగ జనించి అశ్మరితో తుల్యమైన పీడను గలుగంజేయుచుండినమూత్రగంధియని తెలియవలయు.

## మూత్రశుక్ర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] మూత్రతస్య స్త్రియంయాతో వాయునా శుక్రముద్ధతమ్ । స్థానాచ్యుతం మూత్రయతః ప్రాకపశ్చాద్వా ప్రవర్తతే । భస్మోదక ప్రతీకాశం మూత్రశుక్రం తదుచ్యతే ॥

తా. మూత్రము వచ్చినపుడు దానిని విసర్జింపక స్త్రీసంగమము సేయుటవలనవాతము శుక్రము నెగరగొట్టి స్థానభ్రష్టముజేసి మూత్రము వెడలునపుడు తొలుతగాని లేక కడపటగాని నీళ్ళలో భస్మము గలపబడిన చందంబున వెడలింపంజేసి మూత్రశుక్రమని తెలియవలయు.

## ఉష్ణవాత లక్షణము.

శ్లో॥ వ్యాయామాధ్వాతపైః పిత్తం వస్తిం ప్రాప్యానిలాయుతమ్ ।
వస్తింమేఢ్రంగుదంచైవ ప్రదహేత్స్రావయేదధః ।
మూత్రంహారిద్రమథ వాసరక్తం రక్తమేవవా ।
కృచ్ఛ్రాత్పునః పునర్జంతో రుష్ణవాతం వదంతితం ॥

తా. మిక్కుటముగ వ్యాయామముసేయుట మార్గమునడుచుట యెండలో సంచరించుట ఈ కారణములవలన పిత్తము ప్రకోపించి వస్తిగతంబై వాతముతోఁ గలసి వస్తి మేఢ్ర గుదములయందు మంటను గలుగంజేయుచు కష్టంబు మీద మూత్రమును పలుమారు పచ్చగ లేక రక్తయుక్తముగ లేకయెఱ్ఱగ వెడలింపంజేసినవుష్ణవాతమని తెలియవలయు.

## మూత్రస్రావ లక్షణము

శ్లో॥ పిత్తం కఫో వాద్వావాపి సంహన్యే తేనిలేనచేత్
కృచ్ఛ్రాన్మూత్రం తదాపీతం రక్తం శ్వేతం ఘనంసృజేత్ ।
సదాహం రోచనాశంఖ చూర్ణవర్ణం భవేత్తుతమ్ ।
శుష్కం సమస్తవర్ణం వా మూత్రసాదం వదంతితమ్ ॥

తా. వాతము పిత్తమునుగాని లేక కఫమునుగాని లేక పిత్తకఫముల 2 నిగాని గట్టిగ జేయుటవలన మూత్రము శుష్కించి స్వల్పమై పసుపుగ లేక యెఱ్ఱగ లేక తెలుపుగ కష్టముమీద వెడలుట మూత్రమును విడుచునపుడు మండుట మూత్రము భూమిపైబడి యెండిన గోరోచనము శంఖచూర్ణము అనువాని వర్ణముతో సమానములుగాని లేక సర్వవర్ణములు గలిదిగాని యుండుట ఈలక్షణములుగలది మూత్రస్రావమని తెలియవలయు.

## విడ్విఘాత లక్షణము.

శ్లో॥ రూక్షదుర్బలయోర్వాతే నోదావర్తం సకృద్యథా ।
మూత్రస్రోతో నుపద్యేత విడ్విసృష్టం తథానరః ।
విడ్గంధం మూత్రయేత్కృచ్ఛ్రాద్విడ్విఘాతం వినిర్దిశేత్ ॥

తా రూక్ష దౌర్బల్యముగల పురుషునియొక్క వాతమలముల నూర్ధ్వముఖంబుగ జేసి మూత్రవాహినులగు నాడులం జెందించి మూత్రమార్గమువలన మలముయొక్క వాసనగల మూత్రమును కడుకష్టముమీద వెడలింపంజేసిన విడ్విఘాతమని తెలియవలయు.

## వస్తికుండల లక్షణము.

శ్లో। [ఆయుర్వేదే] ద్రుతాధ్వలంఘనాయాసై రభిఘాతాత్ప్రపీడనాత్ । స్వస్థానాద్వస్తిరుద్వృత్తః స్థూలస్తిష్ఠతి గర్భవత్ । శూలస్పందనదాహార్తో బిందుంబిందుం స్రవత్యపి । పీడితస్తుసృజేద్ధారాం సంరంభోద్వేష్టనార్తిమాన్ । వస్తికుండలమాహుస్తం ఘోరం శస్త్రవిషోపమమ్ । పవనః ప్రబలం ప్రాయో దుర్నివార మబుద్ధిభిః । తస్మిన్ పిత్తాన్వితేదాహ శూలం

మూత్రవివర్ణతా శ్లేష్మణాగౌరవంశోఫ స్నిగ్ధంమూత్రం ఘనంసితమ్ । శ్లేష్మయుద్ధబిశోవస్తిః పిత్తోదీర్ణేనసిధ్యతి । అవిశాంతబిలస్సాధ్యో నచయః కుండలీకృతః । స్యాద్వస్తౌ కుండలీభూతే తృణ్మోహః శ్వాసఏవచ ॥

తా. శీఘ్రముగ మార్గమున నడుచుట దుముకుట ఆయాసము-జెందుట తా యిక ట్టై అనువానివలన ఘాతముజెందుట విసుగుట ఈ కారణములవలన వస్తిస్వ స్థానమునువిడనాడి పొరలియుబ్బి గర్భమువలె కఠినమైనశూల కంపమున తాపము అనువానితోడంగూడి యొక్కొక్కచోట్టుగ మూత్రము వెడలుట వస్తిని బలాత్కార ముగ పిసుకుటవలన మూత్రధార పెద్దదిగ వెడలుట వస్తియందు తొందరగలుగుట పొర్లాడుట పీడగలుగుట ఈ లక్షణములుగలది వస్తికుండల మూత్రాఘాతమని తెలి యవలయు. ఇది శస్త్రవిషతుల్యంబై భయంకరముగనుండు. ఇందు వాతము తలు చుగ ప్రబలంబైయుండుదానంజేసి మందబుద్ధిగల వైద్యుడు దీని వారింపంజేయు టకసమర్థుండుగనుండు మఱియు దీనియం దన్యదోషసంబంధమువలనగలుగు లక్ష ణంబు లెవ్వియనిన పిత్తయుక్తంబున దాహము శూల మూత్రవివర్ణతగలుగు. కఫ యుక్తంబున జడత్వము వాపుగలిగి మూత్రము దట్టముగ గట్టిగ తెల్లగ వెడలువస్తి ముఖమును కఫము నడ్డగించి పిత్తోద్రేకముగనుండిన అసాధ్యంబనియు వస్తిముఖము నడ్డగింపబడక కుండలీకృతము గాకనుండిన సాధ్యంబనియు వస్తికుండలీ ఘాతమై దప్పి మోహము శ్వాసము అనువానితో గూడియుండిన అసాధ్యంబనియు తెలియ వలయు.

మూత్రాఘాతమునకు ముస్తాది చూర్ణము.

శ్లో॥ [చికిత్సాసారసంగ్రహే] సదాభద్రాశ్మభిన్మాలం శతావ ర్యాశ్చ చిత్రకమ్ । రోహిణీకోకిలాక్షౌచ ఔంచస్థూలత్రికం టకమ్ । శ్లక్ష్ణపిష్ట్వాసురాపీతం మూత్రాఘాంతనిషూదనమ్ ॥

తా. తుంగగడ్డలు కొండపిండివేళ్లు చల్లపిల్లిగడ్డలు చిత్రమూలము కటుకరో హిణి నీరుగొబ్బివిత్తులు తామరవిత్తులు సన్నపల్లేరుకాయలు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి యందు 1 తులమును మద్యములోగలిపి సేవించిన మూత్రాఘాతము నశించు.

మూత్రాఘాతమునకు క్షీరయోగము.

శ్లో॥ శృతశీతం పయోమాంసీ చందనంతండులాంబునా ।
పిబేత్సశర్కరం శ్రేష్ఠ ముష్ణవాతేన శోణితే ॥

తా. ఆవుపాలను జక్కగ కాచి చల్లార్చి యందు జటామాంసి చూర్ణము శ్రీగంధపుచూర్ణము బియ్యపుకడుగు పంచదార వీనిని తగుమాత్రముగ గలిపి పుచ్చుకొనిన నుష్ణవాతముచే జనించిన రక్తయుక్త మూత్రాఘాతము హరించు.

శ్లో॥ త్రికంటకైరండశతావరీభిస్సిద్ధ పయోవాతమయే సశూలే ।
గుడప్రగాఢం సఘృతం పయోహా రోగేషు కృచ్ఛ్రాదిషు
శస్త్రమేతత్ ॥

తా. సన్నపల్లేరుకాయలు ఆముదపువేళ్ళు చల్లపిల్లిగడ్డలు వీనిని సమభాగములుగ దంచి కషాయముకాచి త్రాగిన వాతముచే జనించి పోట్లతోగూడియుండెడి మూత్రాఘాతము నశించు. మఱియు పాలలో బెల్లము నెయ్యికలిపి త్రాగిన మూత్రకృచ్ఛ్రము లన్నియు నశించు.

* అశ్మరీరోగ భేదములు.

శ్లో॥ [మాధవనిదానే] వాతపిత్తకఫైస్తిస్రశ్చతుర్థీ శుక్రజామతాః।
ప్రాయశ్శ్లేష్మాశ్రయాస్సర్వా హ్యశ్మర్యస్సర్వ మోపమాః ॥

తా. వాతాశ్మరి పిత్తాశ్మరి శ్లేష్మాశ్మరి శుక్రాశ్మం అనఅశ్మరీరోగములు 4 విధములు. ఈ 4 నుతఱుచుగ శ్లేష్మాశ్రితంబులై మృత్యుతుల్యబులుగ నుండు.

అశ్మరీసామాన్య లక్షణము,

శ్లో॥ సామాన్యలింగం రుజ్నాభి సేవనీవస్తిమూర్ధను ।
విశీర్ణధారం మూత్రం స్యాత్తయా మార్గనిరోధనే ।

* అశ్మరియన-మూత్ర శుక్రములు ఘనీభవించి రాయివలె నగుటయు. ఏరోగమునం దిట్టిరాయి మూత్రద్వారము నిరోధించి కడుకష్టము మీద మూత్రమును వెడలింపం చేసెడినో యది యశ్మరీరోగ మనంబడు.

తద్వ్యపాయాత్సుఖంమేహే దచ్ఛంగోమేధకోపమమ్ ।
తత్సంక్షోభాత్క్షతేసాస్రమాయాసాచ్చాతి రుగ్భవేత్ ॥

తా. నాభి అస్థిసంధులు వస్తియొక్క అగ్రము అనువానియందు శూలగలుగుట అశ్మరీ సంబంధమువలన మూత్రద్వారము నిరోధింపబడి ఛిన్నాభిన్నములుగ మూత్రము వెడలుట అశ్మరివెడలిన పిదప మూత్రము కష్టములేక స్వచ్ఛముగ గోమేధికమణి వర్ణతుల్యముగ వెడలుట అశ్మరీ సంబంధమువలన వస్తియందు గాయముగలిగిన మూత్రము రక్తమిశ్రితముగ వెడలుటబలాత్కారముగ మూత్రమును విడుచుటవలన క్లేశము పీడగలుగుట ఇవియ అశ్మరీ రోగములయందు సామాన్యలక్షణంబులు.

## వాతాశ్మరీ లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] తత్రవాతాద్భృశార్త్యార్తో దంతాన్ ఖాదతి వేపతే । మృద్నాతిమేహనంనాభిం పీడయత్యనిశంక్వణన్ । సానిలంముంచతి శకృ న్ముహుర్మేహతిబిందుశః । శ్యావా రూక్షాశ్మరీచాస్య స్యాచ్చితాకంటకైరివ॥

తా. కడుపీడగలుగుట దంతముల కటకటకొరుకుట వణుకుట మేఢ్రమును బిసకకొనుట బొడ్డును గోకుట దుఃఖమువలన ఏడ్పుగలుగుట బొబ్బలిడుట మూత్రమును విడుచుట నపుడు వాతముతోడ మలోత్సర్జనము జేసుటబొట్లుబొట్లుగ మూత్రమును విడుచుట అశ్మరి నీలవర్ణముగ రూక్షముగ ముండ్లుగలదిగ నుండుట ఈలక్షణములు గలది వాతాశ్మరియని తెలియవలయు.

## పిత్తాశ్మరీ లక్షణము.

శ్లో॥ పిత్తేనదహ్యతేవస్తిః పచ్యమానయివోష్మవాన్ ।
భల్లాతకాస్థిసంస్థానా రక్తాపీతాసితాశ్మరీ॥

తా. పొత్తికడుపులో మండుట క్షారమువలన గాల్చబడినటుల తాపమువేదనగలుగుట పొత్తికడుపుపై హస్తమునుంచిన వేడిగనుండుట అశ్మరి జీడిగింజలోని పప్పువలె నుండినదై యెఱ్ఱగాని లేక పసపువర్ణముగాని నల్లగానియుండుట ఈలక్షణములు గలది పైత్త్యాశ్మరియని తెలియవలయు.

## శ్లేష్మాశ్మరీ లక్షణము.

శ్లో॥ వస్తిర్నిస్తుద్యత ఇవ శ్లేష్మణా శీతలాగురుః ।
అశ్మరీమహతీశ్లక్ష్ణా మధువర్ణాథవాసితా॥

తా. పొత్తికడుపు పొడవంబడినటులనుండుట శీతలముగ జడముగ నుండుట అశ్మరీ పెద్దదిగ నునుపుగలదిగ తేనె వర్ణముగలదిగ లేక తెల్లగనుండుట ఈ లక్షణములు గలది శ్లేష్మాశ్మరియని తెలియవలయు.

శ్లో॥ ఏతాభవంతిబాలానాం తేషామపిచభూయసా ।
ఆశ్రయోపచయాల్పత్వా ద్గ్రహణా హరణేసుఖాః॥

తా. బాలురు గురుత్వము మధురము శీతలము స్నిగ్ధముగల యాహారముల భుజించుటవలన వాత పిత్త శ్లేష్మాద్యశ్మరులు తఱుచుగ బాలురకును జనించుటగలదు. ఐనను వారలయొక్క వస్తి చిన్నదిగ వృద్ధిజెందనిదిగ నుండుటవలన దానిని బట్టికొని యీడ్చివేసుటకు సులభ సాధ్యంబుగనుండు.

## శుక్రాశ్మరీ లక్షణము.

శ్లో॥ శుక్లాశ్మరీతుమహతాం జాయతే శుక్రధారణాత్ । స్థానా
చ్చ్యుతమముక్తంహి ముష్కయోరంతరేనిలః । శోషయ
త్యుపసంహృత్య శుక్రంత చ్ఛుష్కమశ్మరీ। వస్తిరుక్కృచ్ఛ్ర
మూత్రత్వముష్కశ్వ యథుకారిణీ। తస్యాముత్పన్నమాత్రా
యాంశుక్రమేతి విలీయతే । పీడితే త్వవకాశేస్మిన్న శ్మర్యే
వచశర్కరా॥

తా. యౌవనానంతరము శుక్రధారణమువలన శుక్రము ఘనీభవించి మైథున కాలమునందు స్వస్థానమునుండి వెడలిపూర్తిగ మైథునము సేయంబడకుండుటచేవిస ర్జనముగాక శిశ్నవృషణములయందు వాతముచే జేర్చంబడి శోషింపంజేసి శుక్రాశ్మరిగనై దాని సంబంధమువలన వస్తియందుశూల మూత్రకృచ్ఛ్రము వృషణములయందువాపుగలిగిన ఆ వాపు గలిగిన తత్క్షణముననే శుక్రము వెడలుటమేఢ్రవృషణమధ్యములయం దదిమిన పలచనగుట ఈ లక్షణములు గలదిశుక్రాశ్మరియని తెలియవలయు ఇదియే సికతాశ్మరిగ శర్కరాశ్మరిగ నగుచున్నదని నిశ్చయింప వలసియున్నది అని

యీ రెండశ్మరులయందు భేదంబుగలదు. ఎట్లనిన—శర్కరాశ్మరి లావుగనుండు,సికతాశ్మరి సన్నగనుండు.

## అశ్మరీమారకోపద్రవములు.

శ్లో॥ * మూత్రరోధస్తృషాఛర్ది పాండుర్వ్యాప్తిపీడ తాక్లమః ।
అశ్మరీమారయత్యాశు సికతాశర్కరాన్వితా ॥

తా. మూత్రము వెడలకుండుట దప్పి వాంతి గలుగుట శరీరము పాండురవర్ణముగనుండుట బొమ్మలోమండుట బడలికగలుగుట ఈ లక్షణములతోగూడియుండు శర్కరాశ్మరి సికతాశ్మరి రోగిని శీఘ్రముగ మృత్యువుపాలు గావించు.

శ్లో॥ మిశ్రేణవాతపిత్తస్య గంధకృచ్ఛ్రజ్వరారుచి॥

తా. వాతపిత్తపిత్తశ్లేష్మ శ్లేష్మవాత అశ్మరీరోగములలో మూత్రముదుర్గంధముగ వెడలుట మేహోపద్రవములు జ్వరము అరుచి గలిగియుండుట ఈ లక్షణములుగల అశ్మరీరోగములు అసాధ్యంబులని తెలియవలయు.

శ్లో॥ [మాధవన్నిదానే] అశ్మర్యామతిరోధాయాం దారావస్త్యాదికేషుచ । అమయేషుయథాదోష మిమూమేవోపచారయేత్ ॥

తా. వాతాద్యశ్మరులయందు మూత్రధార వస్తి మొదలగునవి అడ్డగింపబడకుండినను లేక వాతాది దోషములు దుష్టంబులుగాకుండినను సాధ్యమనియెంచి చికిత్సింపవలయు దారుణముగనుండు అశ్మరీరోగములు దినేదినే వృద్ధిం జెందుచుండు అశ్మరీరోగములు అసాధ్యంబులు.

## అశ్మరికి పాషాణభేద రసము.

శ్లో॥ మాధవనిదానే శుద్ధసూతం ద్విధాగంధం శిఖితుత్థంరసోపమమ్ । శ్వేతాపునర్నవావాసాగిరికర్ణీరసోద్భవైః । ప్రతిద్రావైస్త్రిధాసంమర్ద్యం శుష్కంతచ్చాంధసంపుటే । శ్వేద

---

* ప్రశూనవాభి వృషణంబద్ధమూత్ర రుజాన్వితమ్ । అశ్మరీ క్షపయిత్యాశు శర్కరా సికతాన్వితా॥ అనియు పాఠాంతరము కలదు. వృషణములు వాచుట మూత్రము వెడలకుండుటచే వేదనగలుగుట.

యే ద్వాలుకాయంత్రే దినైకంతం విచూర్ణయేత్ । రసః పాషాణభిన్నామద్వి గుంజో హ్యశ్మరీహరః । గోపాలకర్కటీ దుగ్ధం భూధాత్రీఫలపేషితమ్ । కుళుత్థక్వాథసంపీత మనుపా నంప్రశస్యతే సఘృతైర్గోక్షుర క్వాథంరాత్రౌ తైలేనలేహయేత్ ॥

తా॥ శుద్ధిజేసిన రసము 1 భాగముశుద్ధిజేసిన ఆమ్లశిలగంధకము 2 భాగములు శుద్ధిజేసిన మైలతుత్తము 1 భాగము ఇటుల వీనిని ఖల్వములోనునిచి తెల్లగలిజేరువేళ్ళు అడ్డసరపాకు గంటెన అనువాని రసములలో ప్రతిదానిచే మూడేసి దినములు మర్దించి నీడనెండించి గాజుకుప్పెలోనునిచి వాలుకాయంత్రమున 1 దినము మందాగ్నితోవండి సాంగశీతలమున దీసి చూర్ణముజేసి 2 గురిగింజల యెత్తును బుడమవేరు నేలయుసిరికెవేరు అనువానిని పాలలోనూరి యీ యనుపానముతోడగాని లేక వులవకషాయయూను పానముతోడగాని లేక పల్లేరు కషాయములో నేయింగలిపిగాని సేవించిన అశ్మరీరోగములు హరించు. రాత్రియందైనయెడల పల్లేరు కషాయములో తెల్ల ఆవనూనె ఔషధముగలిపి సేవింపవలయు.

అశ్మరీరోగమునకు శిలాది చూర్ణము.

శ్లో॥ శిలాజతుతథాద్రాక్షా దంతి పాషాణభేదకమ్ ।
నిశావహ్న్యభయంతుల్యాం మాషైకంచాశ్మరీహరమ్ ।
బాలానామర్ధమాషంచ హ్యనుపాన బుధంభవేత్ ।
తిలకాండస్య వై భస్మక్షేపే నిష్క ద్వయంపిబేత్ ॥

తా. శుద్ధిజేసిన కర్పూరశిలాజిత్తు ద్రాక్షపండు నేలదంతివిత్తులు కొండపిండివేరు పచ్చిపసపు చిత్రమూలము కరక్కాయ వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి యౌవనముగలవారు మాషమెత్తును బాలురర్ధమాషమెత్తును 2 నిష్కలములయెత్తునువ్వులక్షారానుపానముతోగాని(లేక లేమిడిచెక్కరసము వారగొమ్మిచెక్కరసము పిప్పల మోడిఅనువాని యనుపానముతోడగాని) సేవించిన అశ్మరి హరించు.

సీ॥ వెన్నయునులుదోసవిత్తులువంగ భస్మముఁ గూర్చి సేవింప
మానొకటి । పంచదారయుహంస పాదియాకును జీలకఱ్ఱ
త్రపుభస్మంబు జుఱ్ఱనొకటి । రాయిపురీశర్కరయును గుండు

త్తరేణుసువంగభస్మము నూరియొకటి ఖండిశర్కర నారు
దొండయు నల జీలకఱ్ఱ వంగంబుతోఁ గలయనొకటి। వెల
యుశీతాంబుచిఱుబొద్ది వేళ్ళరసము । వంగభస్మంబు సేవింప
వరుసనొకటి । రూఢికెక్కిన యశ్మరీరోగతతులు। పథ్యము
గనున్న మానునుతథ్యముగను ॥

## పాషాణ వజ్రరసము.

శ్లో॥ [నిత్యనాథీయే] శుద్ధసూతంద్విధాగంధం ద్రవై శ్శ్వేతపున
ర్నవైః । మర్దయిత్వాదినంఖల్వే రుధ్వాతం భూదరేపచేత్।
దినాంతే తత్సముద్ధృత్యచూర్ణయేదతిచిక్కణమ్ । పాషాణ
భేదసంయుక్తం చూర్ణతుల్యం ద్విమాషకమ్ । భక్షయేద
శ్మరీంహంతి రసః పాషాణవజ్రకః । గోపాల కర్కటీమూల
క్వాథంమధుయుతంపిబేత్ । గోకంటకశుభాభద్రా మూల
క్వాథం పిబేన్నిశి ॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము 2 భాగములు ఈ 2 నిఖల్వములోనునిచి తెల్లగలిజేరువేరు రసముతో 1 దినము మర్దించి కుప్పెలోనునిచి భూధరయంత్రమునందిడి దానిమూతిని మూసి 1 దినము పుటంబిడి స్వాంగశీతలమున దీసి సూక్ష్మముగ చూర్ణముజేసి దానికి సమముగ కొండపిండివేళ్ళ చూర్ణము గలిపి 2 మాషములయెత్తును పగటియందు బుడమవేరు కషాయములో తేనెగలిపియాయను పానముతోడను రాత్రులయందు పల్లేరు వెమురుప్ప భద్రముస్తెలు అనువాని కషాయానుపానముతోడను 4 మాసములు సేవించిన 4 విధములైన అశ్మరీరోగములు హరించు.

## శుక్లాశ్మరీ చికిత్స,

శ్లో॥ [మతాంతరే] యేలాహింగు యుతంక్షీరం సర్పిర్మిశ్రం పిబే
న్నరః । మూత్రదోష విశుద్ధ్యర్థంశుక్లాశ్మరహరం పరమ్॥

తా. ఆవుపాలలో ఏలకులు యింగువ నెయ్యిగలిపి ద్రాగిన మూత్రదోషము శుక్రాశ్మరి హరించు.

### శుక్లాశ్మరికి శ్వదంష్ట్రాదియోగము.

శ్లో॥ శ్వదంష్ట్రామాతులుంగాగ్ని శోభాంజనకరంజకమ్ ।
శుక్లాశ్మరీ హరం శ్రేష్ఠం మూత్ర కృచ్ఛ్రహరంపరమ్ ।

తా. ఏనుగపల్లేరు మాదీఫలము చిత్రమూలము కొరుమునగ కానుగ వీనిని సమభాగములుగ నుదకముతోనూరి సేవించిన శుకాశ్మరి మూత్రకృచ్ఛ్రము హరించు.

### శర్కరాశ్మరీ చికిత్స.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] సింధువారనిశాదార్వీదారయేన్మేఘశర్కరాః । నారికేళాంబునాపీతః తయోః కల్కంచతద్గుణమ్
క్వాథోవరుణమూలస్య తత్కల్కేనచ సంయుతః ।
పీతోనివారయేత్సద్య శ్శర్కరాశ్మరికామపి ॥

తా. వావిలి పసపు మ్రానిపసపు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి సేవించినను లేక ఆ చూర్ణమును టెంకాయ నీళ్ళతోనూరి కల్కముజేసి త్రాగినను లేక పైచూర్ణమును కల్కముజేసి వులిమిడివేళ్ళ కషాయముతోజేర్చి త్రాగినను శర్కరాశ్మరిమూత్రకృచ్ఛ్రము తక్షణమున హరించు.

శ్లో॥ రసోమృగాక్షీపత్రోత్థో నిశాతీక్ష్ణ రజోన్వితః ।
ప్రతీతః ప్రాతయత్యాశు దుస్తరాం శర్కరాశ్మరీమ్ ॥

తా. పాపరాపు రసములో పసపు మండూరము గలిపి త్రాగిన ప్రబలమైన శర్కరాశ్మరి శీఘ్రముగ హరించు.

### శర్కరాశ్మరికి తిలాది క్షారము.

శ్లో॥ తిలాపామార్గకదళీ పాలాశయవ సంభవః ।
క్షారః పేయో విమూత్రేణ శర్కరాస్వశ్మరీషుచ ॥

తా. నువ్వులదంటు ఉత్తరేణి అరటి మోదుగుయవలదంటు వీనిని సమభాగములుగ కాల్చి క్షారముజేసి గొఱ్ఱెమూత్రముతో సేవించిన శర్కరాశ్మరి హరించు.

### అశ్మరికి విషాది పటుకములు.

శ్లో॥ విషంపాషాణ భేదశ్చ క్షారస్సింధూత్థగోజలమ్ ।

వటీఃకృత్వాశ్మరీంహంతి సప్తరాత్రంపిబేదను ।
జయంత్యావా జయాయావా తండులోదకపానతః ।
అశ్మరీంహంతినోచిత్రం మూత్రకృచ్ఛ్రమహోద్భుతమ్॥

తా. అతివస కొమ్మనపిండివేళ్ళు యవక్షారము సైంధవలవణము వీనిని సమభాగములుగ గోమూత్రముతోనూరి మాత్రలుజేసి తక్కలివేరునుగాని లేక కరక్కాయనుగాని బియ్యపుకడుగుతోనూరి యీ యనుపానముతోడ 7 దినములు సేవించిన అశ్మరీ మూత్రకృచ్ఛ్రము హరించు.

## అశ్మరికి త్రివిక్రమ రసము.

శ్లో॥ [నిత్యనాథీయే] తామ్రభస్మత్వజాక్షీరే పాచ్యంతుల్యే ఘృతేపచేత్ । తత్తామ్రంశుద్ధసూతంచగంధకంచసమంసమమ్। నిర్గుండుంత్థద్రవై ర్మర్ద్యం దినంతద్గోళముద్ధరేత్ । * దినైకం వాలుకాయంత్రేపాచ్యంయోజ్యం ద్విగుంజకమ్ । బీజపూరస్యమూలంతు సజలంచానుపాయయేత్ । రసస్త్రివిక్రమో నామ్నా † మాసైకంచాశ్మరీప్రణుత్ ॥

తా. తామ్రభస్మమును మేకపాలలోవైచి కాచి దానికి సమముగ నెయ్యిబోసిపాకముజేసి పిదప తామ్రభస్మమునకు సమముగ శుద్ధిజేసిన రసము శుద్ధిజేసినగంధకముగలిపి వావిలియాకు రసముతో 7 దినము మర్దించి యుంటచేసి వాలుకాయంత్రమునందునిచి 1 దినము పాకముజేసి 2 గురిగింజలయెత్తును 1 మాసము వరకుమాదీఫలపువేరు కషాయానుపానముతోడ సేవింపుచుండిన అశ్మరి హరించు.

## అశ్మరీ రోగములయందు పథ్యము.

శ్లో॥ [యోగధవనిదానే] కుళుత్థముద్గ గోధూమాజీర్ణశాలీయవాహితాః। ధన్వామిషం తండులీయం జీర్ణంకూశ్మాండ కంఫలమ్ । ఆర్ద్రికంయవశూకశ్చ పథ్యమశ్మరి రోగినామ్॥

తా. ఉలవకట్టు పెసరకట్టు గోధుమలు ప్రాతబియ్యము యవలు నిర్జలదేశమున జనించు జంతుమాంసము చిర్రికూర ముదురుగుమ్మడుకాయ అల్లము యవక్షారము ఇవి అశ్మరీరోగములయందు పథ్యకరంబులు.

* యామైకం. † సికతా చాశ్మరీ ప్రణుత్.

శ్లో॥ [మతాంతరే] వస్తిర్విరేకో వమనంచ లంఘనం స్వేదోవగాహోపిచ వారిసేచనమ్ । యవాకులుత్థాశ్చపురాణశాల్యో మద్యానిధన్వాండజసంభవోరసః । పురాణకూశ్మాండఫలం చఢూలోగోకంటకో వారుణశాకమార్ద్రికమ్ । పాషాణభేదోయవశూకవైణవాః భిత్వాసమూకర్షణ మశ్మనామపి । ఏతానిసర్వాణిభవంతి సర్వదాహితు దేశ్మరీరోగనిపీడితాత్మనామ్॥

తా. వస్తికర్మ విరేచనము వమనము లంఘనము చెమటతీయుట స్నానము శరీరముపై నీళ్ళు చిలకరించుట యవలుఉలవలు ప్రాతబియ్యము మద్యము నిర్జలదేశమున జనించు జంతుమాంసరసము ప్రాతగుమ్మడుకాయ చిల్లిశాకము పలేరువులిమిడికూర అల్లము కొండపిండివేరు యవక్షారము వెదురుమొలక భేదించి మూత్రస్థానమునందుండు రాయిని వెలిపరచుట యివి యెల్లప్పుడు అశ్మరీరోగములయందు హితకరములని పథ్యవర్గములో జెప్పంబడియున్నయది.

## అశ్మరీరోగములయం దపథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] మూత్రశుక్రస్యమలస్యరోధం విష్టంభిరూక్షం గురుచాన్నపానమ్। విరుద్ధపానాశనమశ్మరీ వాన్విర్జయేత్సతతంచాప్రమత్తః॥

తా. మూత్ర శుక్ర మలవేగముల నడ్డగించుట మలబద్ధకరాన్నమును రూక్షగల యన్నమును జడత్వముగలయన్నమును సేవించుట విరుద్ధపానాన్నములను సేవించుట యివి అశ్మరీరోగములయం దపథ్యకరంబులగుటచే వానిని ముఖ్యముగ వర్జింపవలయు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగ విహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కౌరాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
మేహమూత్రకృచ్ఛ్రమూత్రాఘాతఅశ్మరీరోగ
నిదానతత్సాధ్యాసాధ్య చికిత్సానుపానపథ్యా
పథ్య లక్షణ యుక్తం నవమ
ప్రకరణమ్.

శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

### — ద శ మ ప్ర క ర ణ ము. —

మహాదేవం విరూపాక్షం శంకరం పరమేశ్వరమ్ ।
దేవేశం కరుణాపాంగం జగదీశం మహం భజే॥

తా. మహాదేవుడు విరూపాక్షుండు శంకరుడు కరుణారసయుక్తమైన కల్గ మూపుగలవాడు జగదీశ్వరుడు నగు పరమేశ్వరుని నేను భజియించెద.

శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామివృషరాజీయ మహం వైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని -నబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ కుయొక్క దశమ ప్రకరణము వచింపుచున్నాడను.

గ్రహణీరోగ నిదానాదులు.

[మాధవనిదానే] అత్యాశనాదజీర్ణాచ్చ వేగరోధాతిమైథు నాత్ । అతిసారేనివృత్తేపి హ్యహితాహారసేవనాత్ । అగ్ని మాంద్యంభవే త్తేన గ్రహణీసంభవోనృణామ్ । సామపక్వంస రక్తంవాముహుర్బద్ధంముహుర్ద్రవమ్ । సగంధంస్రవతేమిశ్ర మాలస్యంతృడ్బలక్షయః । చిరాద్భుక్తస్యపాకశ్చ గ్రహణీ పూర్వలక్షణమ్॥

తా. మిక్కుటముగ భుజించుట అన్నము జీర్ణముగాకుండుట మూత్రమును నుటమిక్కుటముగ స్త్రీసంభోగము సేయుటఅతిసారము నివృత్తించినతోడనే కరభోజనముల సేవించుట ఈ కారణమువలన అగ్నిమాంద్యముజనించి గ్రహణీ

రోగము గలుగంజేయు అన్నము కొంతపక్వంబై కొంతపక్వముగాక మలములోగ లసిగాని మలరక్తములో గలసిగాని పలుమారు బద్ధకముగ గాని ద్రవముగగాని దుర్గంధముగగాని మిశ్రమముగగాని వెడలుట. ఆలస్యముదప్పి బలక్షయము భుజించిన యన్నము దీర్ఘ కాలముపిూద పాకముజెందుట అను నీలక్షణంబులు గలిగిన గ్రహణీ రోగము జనించునని తెలియవలయు.

## వాతగ్రహణి లక్షణము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] కంఠశోషశ్చహృత్పీడా తృష్ణాకాసవిషూచికే। అన్నేజీర్ణేసదాధ్యానం భుక్తేరుగ్వాంక్షణేభవేత్। చిరాద్దుఖంద్రవంశుష్కంతన్వామంశబ్దఫేనవత్। పునఃపునస్సృజేద్వర్చః కాసశ్వాసమజీర్ణతా। గ్రహణీ వాతజాజ్ఞేయా దీపనైస్తాముపాచరేత్ ॥

తా. కంఠము శోషించుట హృదయపీడ దప్పి దగ్గు విషూచిగలుగుట అన్నము జీర్ణముగాకుండునపుడు భుజించుటయం దిచ్ఛగలుగుట గజ్జలలో వేదనగలుగుట మలము ద్రవముగ శుష్కముగ అల్పముగ ఆమయుక్తముగ శబ్దము నురుగు అనువానియుక్తముగ సావకాశముమీద పీడతోగూడి పలుమారువెడలుట కాసము శ్వాసము అజీర్ణముగలుగుట ఈ లక్షణములుగలది వాతగ్రహణియని తెలియవలయు. దీనియం దగ్నిదీపనమును గలుగంజేసెడి చికిత్సలం జేయవలయు.

## పైత్యగ్రహణి లక్షణము.

శ్లో॥ పూత్యామ్లోద్గారహృత్కంఠ దాహాస్తృట్ఛ్వాసరుక్క్లమాః॥
అజీర్ణంపీతనీలాభంపిత్తాద్వై * స్రవతిద్రవమ్ ।
నమయేద్దేచయేత్క్వాథైః పిత్తోత్థాంచ ప్రవాహికామ్ ॥
మధురైశ్శీతలైర్ద్రవ్యై ర్నాతిరూక్షైరుపాచరేత్॥

తా. దుర్గంధముగ పులితేనుపులు వచ్చుట రొమ్ముకుతికె అనువానియం దుండుట దప్పి శ్వాసము శ్రమ అజీర్ణముగలుగుట మలము పచ్చగ నల్లగ ద్రవము వెడలుట ఈ లక్షణములుగలది పైత్యగ్రహణియని తెలియవలయు. దీనియందువమ

* సార్యతేద్రవమ్.

రేచనకర కషాయముల నివ్వందగు. మఱియు మధురము శీతలముగల ద్రవ్యములు కటురూక్షవిహీనద్రవ్యములు అనుపానిచే నుపచరింపవలయు.

## శ్లేష్మగ్రహణి లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] కాసనిష్ఠీవనంఛర్దిః మధురాస్యమరోచకమ్ ।
భిన్నామ * శ్లేష్మమిశ్రంచ సార్యతేచ ద్రవంజడం । దుష్టో
మధురఉద్గారః ‡ పీనసశ్చకఫాదికే । అకృశస్యాపి దౌర్బల్య
మాలస్యంచ కఫాత్మకే । శ్లేష్మకేపంచ కర్మాణికర్తవ్యాణి
బలాధికే । బలహీనేనకర్తవ్యం దీపనైః పాచనైర్హితమ్ ।
ఏతానివైద్యనాథేన రోగిక్లేశ ప్రశాంతయే॥

తా. దగ్గి యుమియుట వమనంబగుట నోరు తీపిగనుండుట అరుచిగలుగుట మలముభిన్నంబై ఆమశ్లేష్మ యుక్తంబై యుదకమువలె ద్రవముగ జడముగ వెడలుట వికారముగ మధురముగ వోకరింతలుకలుగుట పీనసగలుగుట శరీరము కృశింపకయే దౌర్బల్యము ఆలస్యము గలుగుట ఈలక్షణములుగలది శ్లేష్మగ్రహణియని తెలియవలయు. దీనియందు రోగికి బలముగలిగియుండిన పంచకర్మలను బలములేకుండిన దీపనపాచనకర కర్మలను సేయుట హితకరంబు. అట్లగుటంజేసి వైద్యశ్రేష్ఠులగువారు రోగశమనార్థంబై పైజెప్పబడిన చికిత్సలం జేయవలయు.

## ద్వంద్వ త్రిదోష గ్రహణీ లక్షణములు.

శ్లో॥ మిశ్రితేద్వంద్వజాజ్ఞేయా త్రిదోషేసర్వరూపిణీ ॥

తా. వాతపిత్తాది ద్వంద్వలక్షణములంగలది ద్వంద్వగ్రహణియనియు వాతపిత్తశ్లేష్మలక్షణములంగలది త్రిదోష గ్రహణియనియు తెలియవలయు (యివి యసాధ్యములు.)

## ఆమవాతగ్రహణి లక్షణము.

శ్లో॥ [చరకే] సుప్తిఃపార్శ్వార్తితాయస్య గళజ్జలఘటధ్వనిః ।
ప్రవర్తతేఘటీయంత్రాత్స్వశబ్దం మందవేదనమ్ ।

---

* శ్లేష్మసంసృష్టగురువర్చః ప్రవర్తనమ్ ।

‡ సదం స్త్రీష్వహర్షణమ్—అనగా శరీరము శిథిలంబగుట ; స్త్రీలయం దిచ్ఛలేకుండుట.

ద్వాత్రింశద్దినాద్వాపి పక్షాన్మాసాచ్చ వాసరాత్ ।
ఆమస్రావస్సఫేనశ్చ స్నిగ్ధంశుద్ధంఘనం స్రవేత్ ।
దివాకోపోనిశాశాంతి శ్చ్యుష్కకంపాంగ కృచ్ఛవేత్ ।
గ్రహణీహ్యామవాతేన దుశ్చికిత్సాభిషగ్వరైః ।

తా. నేత్రములు మసకగ నుండుట 1 పార్శ్వమున శరీరము గదలకయుండుట మలము వెడలుటకుముందు కడుపులో గడబిడయను శబ్దముగలిగి కుండతో గుమ్మరించునటుల శబ్దముగలదై కొంచెముగ వేదనగలదై అధికముగ వెడలుట 32 దినములకుగాని అపిశబ్దమువలన 10 దినములకుగాని లేక 15 దినములకుగాని లేక 1 మాసమునకుగాని చకారమువలన ప్రతిదినముగాని లేక 8 దినములకొకమారుగాని ఆమము నురుగుతోగూడి దట్టముగ నిర్మలముగ బిరుసుగ వెడలుట పగటియందు ప్రకోపించి రాత్రులయందు శాంతిజెందుట ఈలక్షణములతో శరీర మెండిపణుకుచుండిన ఆమవాతగ్రహణియని తెలియవలయు యిది అసాధ్యము (యిది వాతగ్రహణిలో నంతర్భావమును జెందియుండు)

## గ్రహణీ భేదములు.

శ్లో॥ నష్టాగ్నిర్దూషితైర్దోషైః పృథక్సర్వైశ్చతుర్విధా ।
గ్రహణ్యాలక్షణంతాసాం చికిత్సాచాతిసారవత్ ॥

తా. వాత పిత్తశ్లేష్మములు ప్రత్యేకములుగ దుష్టంబులైగాని లేక త్రిదోషములు దుష్టంబులైగాని జాఠరాగ్నిని జెరచి 4 విధ గ్రహణులగలుగంజేయు. వీనిలక్షణములను పై జెప్పంబడిన ప్రకారము తెలియవలయు. మఱియు దీనియం దతిసార చికిత్సలనే జేయవలయు.

## గ్రహణీరోగోపచార క్రమము.

శ్లో॥ [బాహటే] గ్రహణ్యామబలోగ్నిర్హి సతస్యగ్రహణీబలమ్ ।
తస్మాదతిప్రయత్నేన వహ్నిమేవ ప్రదీపయేత్ ॥

తా. అగ్నిదౌర్బల్యమువలన గ్రహణి జనించు. గ్రహణి యగ్నికి బలకరము కానేరదు. (అనగా గ్రహణివలన మిక్కుటముగ యగ్నిమాంద్యము గలుగుట) కావున గ్రహణిరోగమున సర్వప్రయత్నములచే యగ్నిదీపనమును గలుగంజేయవలయు. (ద్వంద్వదోషములవలన జనించిన గ్రహణులు కష్టసాధ్యంబులు. త్రిదోషగ్రహణులు అసాధ్యంబులు.)

## అతిసార నిదానము.

శ్లో॥ [చికిత్సాసారసిద్ధసంగ్రహే] విరుద్ధాతిగురుస్నిగ్ధ రూక్షోష్ణా
ద్యశనాదిభిః। అగ్నింహత్వాతథాథోషై రతిసారః ప్రవర్త్యతే॥

తా. విరుద్ధపదార్థములు కడుజడకరపదార్థములు జిగటగలపదార్థములు రూ
గల పదార్థములు వుష్ణకరపదార్థములు మొదలగువానిని సేవించుటవలన వాతపై
శ్లేష్మములు ప్రకోపించి జఠరాగ్నిం జెరచి అతిసారమును గలుగంజేయు.

## అతిసార భేదములు.

శ్లో॥ ఏకైకేన సమస్తైస్తు దోషైశ్శోకా ద్భయాదపి।
షడ్విధశ్చైవ బోద్ధవ్య స్తస్యలక్షణముచ్యతే॥

తా. వాతాతిసారము పిత్తాతిసారము శ్లేష్మాతిసారము సన్నిపాతాతిసారము
శోకాతిసారము భయాతిసార అన అతిసారములు 6 విధంబులు. వాని లక్షణం
లెవ్వియనిన——

## వాతాతిసార లక్షణము.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] * అరుణంఫే నిలంరూక్ష మల్పమల్పం ము
హుర్ముహుః। సామంసశూలశబ్దశ్చ సారోవాతాత్ప్రవర్తతే॥

తా. మలము యెఱ్ఱనై నుఱుగుతోగూడియుష్ణముగ బంక శూల శబ్దముఅను
ని యుక్తముగ పలుమారు కొంచ కొంచముగ వెడలిన వాతాతి సారమని తెలి
వలయును.

## పైత్త్యాతిసార లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అరుణం హారితంపీతంనీలమర్గంధసంయుతమ్।
శూలసంతాప పాకాశ్చ తాపశ్చ కరపాదయోః।
మూర్ఛాస్వేద పిపాసాశ్చ పిత్తాతీ సారలక్షణమ్॥

తా. మలము దుర్గంధమైయెఱ్ఱగగాని లేక ఆకుపసరు వర్ణముగగాని లేకపస
వర్ణముగగాని లేకనీలవర్ణముగ గాని వెడలుట శూలశరీరతాపము అసనమునపాకము

* శ్లో॥ అరుణంఫేనిలం రూక్షం మల్పమల్పంముహుర్ముహుః। సకృదామంసరుజ
బ్ద మారుతే హ్యతిసార్యతే। యిట్లను పాఠాంతరము గలదు.

గలుగుట చేతులు కాళ్ళుమంటుట మూర్ఛ చెమట దప్పి గలుగుట ఈ లక్షణములు గలది పిత్తాతిసారమని తెలియవలయు.

### శ్లేష్మాతిసార లక్షణము.

శ్లో॥ శుక్లంసాంద్రంసత్ కఫంశ్లేష్మణాతు విస్రంశీతం హృష్టరోమామనుష్యః ॥

తా. మలము తెల్లగ గట్టిగ కఫమిశ్రితముగ ఆమగంధయుక్తముగ చల్లగవెడలుట రోమములు గగుర్పొడుచుట ఈ లక్షణములుగలది కఫాతిసారమని తెలియవలయును.

### సన్నిపాతాతిసార లక్షణము.

శ్లో॥ వారాహా స్నేహమాంసాంబు సదృశం సర్వరూపిణమ్ ।
కృచ్ఛ్రసాధ్యమతీసారం విద్యాద్దోషత్రయోద్భవమ్ ॥

తా. మలము పందిక్రొవ్వుతో తుల్యముగగాని లేక మాంసముగడిగిన నీళ్ళవలెగాని వెడలుటయేగాక పైజెప్పబడిన వాతాది దోష లక్షణయుక్తంబై యుండిన సన్నిపాతాతి సారమని తెలియవలయు, (ఇదికష్టసాధ్యము.)

### శోకాతిసార లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] తైస్తైర్భావై శ్శోచతోల్పాశనస్యబాష్పోష్మావైవహ్నిమా విశ్యజంతోః । కోష్ఠంగత్వాక్షో భయేత్తస్యరక్తం తచ్చాధస్తాత్కాకణంతీవ్రకారమ్ । నిర్గచ్ఛేద్వై విడ్విమిశ్రంహ్య విడ్వా నిర్గంధంవా గంధవద్వాతిసారః ॥

తా. ధన బంధు నాశనాదికములచే దుఃఖించుటవలన అన్నముహీనమైదాని వలన ధాతుక్షయముగలవానియొక్క శరీరమునందలి యూష్మము నేత్రసాపాంగళాదులయందు వ్యాపించియుండు జలముతోడంగలసి కోష్ఠగతంబై జాఠరాగ్నికి మాంద్యమును గలుగంజేసి రక్తమును క్షోభపరచి (క్షోభయనగా రక్తమునందు వుష్ణద్రవత్వములగలుగంజేసి) గురిగింజవలె నెఱ్ఱగనుండు రక్తమును మలమిశ్రితముగగాని స్రవింపజేసిన శోకాతిసార మని తెలియవలయు. ఇది వాతపిత్తములవలన జనించునని ఆయుర్వేద వేత్తలను వారంపరు వచించెదరు.

## శోకాతిసార కృచ్ఛ్రసాధ్యత్వము.

శ్లో॥ శోకోత్పన్నోదుశ్చికిత్స్యోతి మాత్రంరోగోవైద్యైః కష్ట ఏవప్రదిష్టః॥

తా. శోకాతి సారమున శోకము శాంతిజెందుటకుముందు ఔషధమువలన శాంతిగలుగ నేరదు. అట్లగుటంజేసి దీనిని కష్టసాధ్యమని వైద్యులు వచించెదరు.

## రక్తాతిసార లక్షణము.

శ్లో॥ పిత్తకృంతి యదాత్యర్థం ద్రవ్యాణ్యశ్నాతిపైత్యకే ।
తదోపజాయతే భీక్ష్ణం రక్తాతీ సారఉల్బణః॥

తా. పిత్తాతిసారముగలిగి యుండునపుడుగాని లేక పిత్తాతిసార పూర్వలక్షణంబులు గలిగియుండునపుడుగాని ద్రవ్య పిత్తతేనువులు మిక్కుటముగగాని లేక యెల్లపుడుగాని సేవించుటవలన బలిష్ఠమైనరక్తాతిసారము జనించి పలుమారు వెడలుట మఱియునది వాతాదిదోషములవలన యెఱుపు నలుపు మొదలగు వర్ణములుగ వెడలునని కొందరు వచించెదరు (ఈరక్తా సారము నేడవదిగ వచించిన వట్త్వ సంఖ్యకు బాధకమునలుగు దానంజేసి దీనిని పిత్తముయొక్క అవస్థాభేదమని జెప్పందగియున్నది.)

## ఆమతి సార లక్షణము.

శ్లో॥ అన్నాజీర్ణాత్ప్రద్రుతాః క్షోభయంతః కోష్ఠందోషాధాతు
సంఘూన్మలాంశ్చ। నానావర్ణైః కశస్సారయంతి శూలో
పేతం షష్ఠమేవం వదంతి॥

తా. అన్నము జీర్ణముగాకుండుటవలన త్రిదోషములు స్వమార్గమును విడనాడికోష్ఠగతంబులై క్షోభనుగలుగంజేసి రక్తాతిధాతువులను పురీషాదులను పలుమారు గుదద్వారమువలన ననేకవర్ణములుగ స్రవింపం జేయుచు గడుపును విశేషముగ నులియపెట్టుచునుండునది ఆమాతిసారమనంబడు యిది 6 వ సంఖ్య గలదిగనుండు.

శ్లో॥ [మాధవనిదానే] అతిసారేజ్వరేచైవ రక్తపిత్తేస్రగామయే ।
ఆదానప్రతికుర్వీత వ్యాధివేగోహిదుస్తరః ॥

తా అతిసారము జ్వరము రక్తపిత్తము నేత్రరోగము యివి జనించునపుడే చికిత్సజేయంజనదు అట్లు జేసిన నవిప్రబలంబులై చికిత్సకనర్హంబులగు.

## అసాధ్యాతిసార లక్షణములు.

శ్లో॥ జ్వరాతి సారశ్శోఫాంతే శ్వయథౌచ తథాక్షయే । దుర్బ లస్యవిశేషేణ కాయేసంతాప పీడనమ్ । హస్తపాదాంగుళీ సంధిప్రవృద్ధిర్మూత్రనిగ్రహః । అధ్మానంచతృషా ఛర్దిఃపు రీషస్యాతి చోష్ణతా । విశేషేణ నరంవృద్ధ ముష్ణాతీసారి ణంత్యజేత్ ॥

తా. జ్వరము శోఫ వాపు క్షయము అనువాని యంతమున గ్రహణ్యతి సారములు జనించినను లేక దుర్బలునికి గ్రహణ్యాతిసారములు జనించినను లేక గ్రహణ్యతి సారములు గలిగి యుండినపుడు శరీర తాపము చేతులు కాళ్ళు వ్రేళ్ళు సంధులు అనువానియందు వాపు మూత్రప్రతిబంధము కడుపుబ్బరము దప్పి వాంతి మలము వెడలునపుడు కడుమంట గలిగియుండినను లేక వృద్ధునికి గ్రహణ్యాతి సారములు జనించినను లేక గ్రహణ్యాతి సారములు వుష్ణముగ వెడలుచుండినను అసాధ్యంబు. అట్లు గుటచే వానిని వర్జింపవలయును.

శ్లో॥ [సిద్ధసారసంగ్రహే] క్షౌద్రస్నేహమపిక్షీర తోయపూయేవ మాంసకృత్ । నానావర్ణోత్కటంపూతిసకృన్నాశ్యేనసిధ్యతి॥

తా. తేనె స్నేహము పుప్పు నీరు చీము మాంసము అనువానితో తుల్యముగ గాని నానావర్ణ యుక్తంబై దుర్గంధముగ గాని మలము వెడలెడి గ్రహణ్యాతిశారములు అసాధ్యంబులు.

శ్లో॥ మిశ్రంచ కృష్ణవర్ణంచ బహువర్ణంతు రక్తకమ్ ।
దుర్గంధం జ్వరయుక్తంచాప్య సాధ్యమతిసారకమ్॥

తా. మలము మిశ్రవర్ణముగ గాని లేక నల్లగ గాని లేక నానావిధవర్ణములుగ గాని లేకరక్తవర్ణముగగాని వెడలుట దుర్గంధము వేసుట ఈ లక్షణములుగల అతీసారముతోడ జ్వరమునుగలిగియుండిన అసాధ్యంబు.

శ్లో॥ [చింతామణౌ] ఏరండతైల వర్ణంచ మాంసమాక్షికయో స్తథా । స్వనపారంచదుర్గంధ మసాధ్యమతిసారకమ్ ॥

తా. మలము ఆముదము మాంసముగడిగిననీళ్ళు తేనె అనువాని వర్ణములతో సమానమై శబ్దయుక్తమై వెడలుట మలము కడుదుర్గంధము వేసుట ఈ లక్షణములు గల యతిసారము అసాధ్యంబు.

శ్లో॥ [ఆయుర్వేదే] పక్వజాంబవసంకాశంయకృత్పిండనిభంతను ।
ఘృతతైలవసామజ్జావేసవారపయోదధి । మాంసధావసతో
యాభంకృష్ణం నిలారుణప్రభమ్ । మేచకం కర్బురం స్నిగ్ధం
చంద్రకోపగతంఘనమ్ । కుణపంమస్తులుంగాభం దుర్గంధం
కుథితంబహు। తృష్ణాదాహారుచిశ్వాసహిక్కా పార్శ్వాస్థిశూ
లినమ్ । సంమూర్ఛారతి సంమోహాయుక్తంపక్వ వలీగుదమ్
ప్రలాపయుక్తంచభిషగ్వర్జయే దతిసారిణమ్ ॥

తా. పండిన నేరేడు పండువర్ణముగ యకృత్పిండముతో సమానముగ (అన గానల్లగ యెఱ్ఱగ) నెయ్యి నూనె క్రొవ్వు మజ్జ* వేసవారము పాలు పెఱుగు మాంసముగడిగిననీరు అనువాని వర్ణములుగలదిగ పిత్తాతిసారమునందు దప్ప తక్కినయతిసారములలో కాటుకవలె నల్లగ నీలవర్ణముగ యెఱ్ఱగ మృదంగమునకు పూసెడి కాటుకవలె నలుపుశాయివర్ణముగ మెఱయుచు పలువిధవర్ణములు గలదిగ ధాతువులయొక్కచమురు స్రవించుటవలన నెమలిఱెక్కలతో సమానమైన చాయగలదిగ గట్టిగ శవమువలె దుర్గంధముగ మస్తకమునందుండు చమురుతో తుల్యముగ కుళ్ళిపోయినటుల దుర్గంధముగలదిగనుండినదై విశేషముగ మలమువెడలుట దప్పి తాపము అన్నద్వేషము పుబ్బసము యెక్కిళ్ళు ప్రక్కటెముకలయందు పోట్లు మనోమోహముగ్రస్తులగుట దేనియం దిచ్ఛలేకుండుట యింద్రియములకు మోహముగలుగుట గుదము తెరచికొనియుండుట వదురుట ఈలక్షణములుగల యతిసారరోగిని వైద్యుడు వర్జింపవలయు.

శ్లో॥ [మాధవనిదానే] అసంవృత గుదంక్షీణం దురాధ్మాన ముపద్రుతమ్ । గుదేపక్వేగతోష్మాణ మతిసారిణ ముత్సృజేత్ ॥

తా. ఆసనము తెరచికొనియుండుట బలము శరీరవృద్ధిలేకుండుట మిక్కుటముగ కడుపుబ్బరము శోషాద్యుపద్రవములుగలుగుట గుదపాకారంభకపిత్తము గలిగియుండునపుడు సగా శరీరము చల్లగనుండుట లేక అగ్ని నష్టమైయుండుట ఈలక్షణములుగల యతిసారరోగిని వైద్యుడు వర్జింపవలయు.

శ్లో॥ శోపంశూలం జ్వరంతృష్ణా శ్వాసకాస మరోచకమ్ ।

---

* వేసవారమన మాంసమునందుండు నెముకలదీసి దంచి పెఱుగు పాలు మిరియాలు యేలకులువేసి జేసెడి పదార్థము.

ఛర్దిమూర్ఛాంచ హిక్కాంచ దృష్ట్వాతీసారిణంత్యజేత్ ॥

తా. వాపు శూల జ్వరము దప్పి శ్వాసము దగ్గు అన్న ద్వేషము వాంతిమూర్ఛ యెక్కిళ్ళుగల యతిసారరోగిని వర్జింపవలయును.

శ్లో॥ శ్వాసశూల పిపాసార్తం క్షీణంజ్వరని పీడితమ్ ।
విశేషేణనరంవృద్ధ మతిసారో వినాశయేత్ ॥

తా. శ్వాసము శూల దప్పి గలవానికి సత్వక్షయము గలవానికి జ్వరమువలన కడుపీడితుడుగనుండువానికి వృద్ధునికి అతిసారము జనించినవారలు మృతిజెందెదరు.

శ్లో॥ [సిద్ధసారసంగ్రహే] ద్వివిధాసర్వాతి సారశ్చస్యాదామః పక్వ ఇత్యపి । మజ్జతేచసకృత్తోయే పక్వంతత్ప్లవతేంభసి ॥

తా. ఆమ పక్వాతిసారమువలన అతిసారము 2 విధంబులు, ఆమాతి సారమున మలమును నీళ్లలో వేసిన మునుంగు, ఇది అసాధ్యము, పక్వాతిసారమున మలమును వుదకములో వేసిన తేలును, ఇది సాధ్యము.

## అతిసార సామాన్యోపచారము.

శ్లోః తత్రాదావమనంకార్యం లంఘనంచయథాబలమ్ ।
లంఘితాయహితంపేయం తక్రంనై విశ్వసాధితమ్ ॥

తా. అతిసారమునందు తొలుత వమనమునుసత్వానుగుణ్యముగ లంఘనమును జేయించి పిదప శొంఠియుక్తముగ గాచబడిన చల్లనుపానము జేయించవలయు.

## గ్రహణ్యాతి సారోపచారవిధి.

శ్లో॥ గ్రహణ్యామతీసారేచాప్య ఫేనంమాత్రవత్పిబేత్ ॥

తా. గ్రహణ్యాతిసారరోగులను నల్లమందు తల్లివలె బోషింపుచుండు గావున నల్లమందుగలసిన యౌషధమువలననే గ్రహణ్యాతిసారముల హరింపంజేయవలయు.

## వాతగ్రహణికి బడబాముఖ రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధసూతం సమంగంధం మృతతామ్రాభ్రటంకణమ్ । సాముద్రంచయవక్షారంసర్జ్జాసైంధవనాగరమ్ ।
అపామార్గవ్యచక్షారం పాలాశంవరుణద్వయమ్ । ప్రత్యేకం

సూతతుల్యాంశంచుక్లి కామ్లేన మర్దయేత్ । హస్తిశుండ్యా ద్రవై శ్చాపిస్నానుర్దయిత్వాపచేల్లఘు । మాషైకం భక్షయే న్నిత్యంరసోయంబడబాముఖః । పాఠాత్రికటుపథ్యాగ్ని శారి శాబృహతీద్వయమ్ । త్రిక్షారేంద్రయవాజాజీతుల్యం లవణ పంచకమ్ । ఆరనాళైః పిబేచ్చాను వాతోత్థాం గ్రహణీం జయేత్ ॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన గంధకము తామ్రభస్మము అభ్రికభస్మము ంకణక్షారము సముద్రవలణము యావక్షారము సర్జక్షారము సైంధవలవణము శొంఠి త్తరేణుక్షారము మోదుగక్షారము వులిమిడి పొంగర వీనిని సమభాగములుగ ఖల్వము 'నునివి వులిచింతరసముతో 1 దినము హస్తిశుండిరసముతో 1 దినము మర్దించి ల పుటంబిడి మాష మెత్తును శిరుబొద్ది త్రికటుకములు కరక్కాయ చిత్రమూలము ాడ పాల పిన్నములక పెద్దములక సర్జక్షారము యవక్షారము టంకణక్షారము కొడి సాలజాడికాయ పంచలవణములు అనువానిని సమభాగములుగ కలిసోనూరి ఈ నుపానముతోడ సేవించిన వాత గ్రహణి హరించు.

## వాతగ్రహణికి వజ్రకవాట రసము.

శ్లో॥ [మాధవనిదానే] మృతసూతాభ్రకం గంధం యవక్షారంస టంకణమ్ । అగ్నిమంథంపచాంకుర్యా త్సూతతుల్యానిమా న్సుధీః తతోజయంతిజంబీర భృంగద్రావైర్ద్వి మర్దయేత్ । త్రివాసరంతతోగోళం కృత్వాసంశోష్యధారయేత్ । లోహ పాత్రేశరావంచ దత్వోపరి విముద్రయేత్ । అధోవహ్నిం శనైః కుర్యా ద్యామార్థంతతఉద్ధరేత్ । రసతుల్యా మతివి షాం దద్యాన్మోదరసంతథా । కపిత్థవిజయాద్రావై ర్భావయే త్సప్తధాపృథక్ । ధాతకీంద్ర యవాముస్తా లోధ్రప్రతివిషా మృతాః । ఏతద్ద్రవై ర్భావయిత్వాదినైకంచవిశోషయేత్ । రసోవజ్ర కవాటాఖ్యోమాషైకం మధునాలిహేత్ । వహ్నిం

శుంఠీ విడంబిల్వాం లవణంచూర్ణ యేత్సమమ్ । పిబేదుష్ణాం బునాచాను * వాతజాం గ్రహణీంజయేత్ ॥

తా. రసభస్మము అభ్రకభస్మము శుద్ధి జేసిన గంధకము యవక్షారము టంకణ క్షారము కూరనెల్లి వస వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి తక్కడ నిమ్మపండు గుంటగలగరాకు అనువాని రసములతో 3 దినములు మర్దించి ముద్దజేసి యెండించియినుపగిన్నెలోనునిచి దానిపై మూకుడుమూసి చీలమన్ను లేపనముజేసి మందాగ్నితో ½ ఝాముపరకు మెల్లగవండి సాంగశీతలమునదిసి మరల ఖల్వములోనునిచి రసభస్మప్రమాణము ఆతివసను బూరుగబంకను గలిపి వెలగ గంజాయియాకు అనువానిరసములతో 7 మార్లు ప్రత్యేక ప్రత్యేకములుగా భావనలుజేసి పిపప ఆరెపువ్వు కొడిసెపాల తుంగముస్తెలు నొద్దుగ అతివస తివ్వతీగె అనువాని రసములతో ప్రత్యేక ప్రత్యేకముగ నొక్కొకదినము భావనజేసి యెండించి మాషప్రమాణమును తేనెతో సేవించి వెంబడిగ చిత్రమూలము శొంఠి వాయువిడంగములు మారేడు బెరడు సైంధవలవణము అనువానిని సమభాగములుగ గ్రహించి వుష్ణోదకముతో నూరి త్రాగిన వాతగ్రహణి నశించు.

## పైత్యగ్రహణికి చిత్రాంబర రసము.

శ్లో॥ [రసరత్నాకరే] శుద్ధసూతం మృతంచాభ్రం గంధకం మర్ద యేత్సమమ్ ।లోహపాత్రే ఘృతాభ్యక్తే క్షణం మృద్వగ్నినాపచేత్ । చాలయేల్లోహ దండేన త్వవతార్య విభావ యేత్ । త్రిదినంజీరక క్వాథై ర్నామైకంభయేత్సదా । గ్రహణీశాంతిమాయాతి సర్వోపద్రవసంయుతా । రసఃచిత్రాంబరోనామ గ్రహణీగ్రహ హృన్మతః । శమయేదనుపానేనా ప్యామశూలం ప్రవాహికామ్॥

తా. శుద్ధిజేసినరసము అభ్రికభస్మము శుద్ధిజేసిన గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి మర్దించి నెయ్యిబూసిన యినుపగిన్నెలో నునిచి మృద్వగ్నిని 1 క్షణమువండి యినుపకాడతో బాగుగ గలియబెట్టి దించిజీలకఱ్ఱకషాయముతో 2 దినములు భావనజేసి మాషప్రమాణమును యెల్లపుడుసేవింపుచుండిన సర్వోపద్రవ

* సర్వజాం.

తోగూడియుండు పిత్తగ్రహణి హరించు. మఱియు నీరసము అనుపాన విశేష
బన ఆమశూల ప్రవాహిక అనువానిని సగా హరింపంజేయు.

## శ్లేష్మగ్రహణికి అర్కలోకేశ్వర రసము.

శ్లో॥ శుద్ధసూతం పలంమర్ద్య మర్కక్షీరైర్దినావధి । ద్విపలంగం
ధకంచాథ మహాశంఖం పలాష్టకమ్ । ద్వయంవహ్నే రసై
ర్భావ్యం శోష్యంపేష్యం దినత్రయమ్ । మేళయేత్పూర్వ
సూతేన సర్వార్థం టంకణంక్షిపేత్ । అర్కక్షీరైః పునస్స
ర్వం యామైకం మర్దయేద్దృఢమ్। తచ్ఛుష్కంచ నివేశ్యాథ
భాండేరుద్ధ్వా పుటేపచేత్ । చతుర్గుంజామితంఖాదే న్మరీ
చాజ్యేన సంయుతమ్ । అర్కలోకేశ్వరోనామ గ్రహణీరో
గనాశకః । దేయం దివోదనంపథ్యం విజయాసగుడంనిశి ॥

తా. పలప్రమాణము శుద్ధిజేసిన రసమును ఖల్వములోనునిచి జిల్లేడుపాలతో
నము మర్దించిపిదప 2 పలములు శుద్ధిజేసినగంధకమును 8 పలములు పెద్దశంఖము
చూర్ణముజేసి చిత్రమూల రసముతో 3 దినములు భావనజేసి యెండించి 3 దిన
మర్దించి మర్దించియునిచిన పైరసముతోడం గలిపి అన్నిటికి సగం వెలిగార
జేర్చి జిల్లేడుపాలతో 1 ఝాము బాగుగ మర్దించి యెండనెండించికుండలలో
ం దానిపై చీలమన్ను లేపనముజేసి లఘుపుటంబిడి 4 గురిగింజల యెత్తును ప్రా
ంలమున మిరియపుచూర్ణము నెయ్యి అనువాని యనుపానముతోడను రాత్రుల
ను గంజావియాకు బెల్లము అనువాని యనుపానముతోడను సేవించిన శ్లేష్మగ్ర
హరించు. దీనియందు పగటియందుమాత్ర మన్నముకు భుజింపవలయు.

## త్రిదోషగ్రహణికి కుటజాద్యవలేహ్యము.

శ్లో॥ [చికిత్సాసార సిద్ధసంగ్రహే] కుటజత్వక్పలశతం జలేద్రోణే
విపాచయేత్ । అష్టభాగావశేషంతు కషాయమవతారయే
త్ । వస్త్రపూతంపునః క్వాథం పచేల్లేహత్వమాగతమ్। భ

భల్లాతకవిడంగాని త్రికటు * త్రిఫలాంతథా । రసాంజనంచిత్రకంచ కుటజస్య ఫలానిచ । వచామతివిషాంబిల్వం ప్రత్యేకంచ పలంపలమ్। త్రింశత్పలంగుడంచైవ చూర్ణీకృత్య నిధాపయేత్ । మధునఃకుడవందద్యాద్ఘృతస్యకుడవంతథా । లేహోయం శమయత్యర్శో యస్యరక్త సముద్భవమ్ । వాతికం పైత్తికంచైవ శ్లైష్మికంసాన్నిపాతికమ్। యేచదుర్నామ జారోగాస్తాన్ సర్వాన్నాశయత్యపి। ఆమ్లపిత్తమతీసారం పాండురోగ మరోచకమ్ । గ్రహణీమార్దవంకార్శ్యం శ్వయథుం కామిలామపి। అనుపానం ఘృతందద్యాన్మధుతక్రంజలంపయః । అనేకరోగ నాశాయ కౌటజోలేహ ఉచ్యతే।

తా. 100 పలముల కొడిసెచెక్కదంచి యందు ద్రోణప్రమాణము నీళ్ళుబోసి యష్టావశేషముగ కషాయముకాచి వడియగట్టి మరల దానిని చిక్కగ కాచి అందు శుద్ధిచేసిన జీడిగింజలు వాయువిడంగములు త్రికటుకములు త్రిఫలములు రసాంజనము చిత్రమూలము కొడిసె పండ్లు వస అతివస. మారేడు బెరడు అనువాని చూర్ణము దినుసు ౧కి ఒక్కొకపలము బెల్లము 30 పలములు తేనెకుడుబము నెయ్యికుడుబము కలిపి లేహ్యపక్వముగా వండి 4 మాడలయెత్తును సేవింపుచుండిన రక్తార్శస్సు వాత పిత్తశ్లేష్మ సన్నిపాతములవలన జనించిన మూలరోగములు మూలరోగమువలన జనించిన కదిశరోగములు ఆమ్లపిత్తము అతిసారము పాండువు అరుచి గ్రహణి రజస్సంబంధములవలన జనించినరోగములు కృశత్వము వాపు కామిల హరించు. మఱియు దీనిని నెయ్యి తేనె మజ్జిగ ప్రసకేము పాలు అనువాని యనుపానములతోడ సేవించిన తదితర సర్వరోగములు హరించు.

ఆమవాతగ్రహణికి గ్రహణ్యాంకుశ రసము.

శ్లో॥ [మతాంతరే] శుద్ధసూతంసమంగంధం సూతార్ధం మృతమ
భ్రకమ్। మర్దయేన్మాతులుంగాద్భిః పేష్యంశోష్యంచసప్తధా।

* హరీతక్యాస్త్రయోభాగా శివాద్వాదశ భాగికా। షడ్భాగాస్సు ర్విభీతస్య త్రిఫలేయం ప్రకీర్తితా॥ అనగా కరక్కాయలు 3 భాగములు ఉసిరికపప్పు 22 భాగములు తానికాయ 6 భాగములుచేరిన త్రిఫలము లనంబడునుట.

త్ర్యూషణంనీలికామూలం దుత్తూరస్యచబీజకమ్ । ప్రత్యేకం సూతతుల్యాంస్యా త్సర్వాంత ద్విజయాద్రవైః । శ్వేతాపరాజి తాకన్యామత్స్యాక్షీ కాకమాచికా । ఆర్ద్రికంపర్పటీవహ్ని ర్ముసలీచరుదంతికా । ద్రవైర్దినత్రయంభావ్యంమాషమాత్రం చభక్షయేత్ । గ్రహణ్యాంకుశకోనామ్నా హ్యసాధ్యం చాపి సాధయేత్ । ద్విపలంజీరకక్వాథ హ్యనుపానంచ పాయయేత్॥

తా, శుద్ధిజేసిన రసము శుద్ధిచేసిన గంధకము యివి దినుసు కొక్కొకభాగము అభ్రకభస్మము ½ భాగము యిటుల వానినెల్ల ఖల్వములో నునిచి మాదీఫలరసముతో 7 మార్లు మర్దించి 7 మార్లెండించి అందు త్రికటుకములు నీలివేళ్ళు వుమ్మెత్తవిత్తులు అనువాని చూర్ణములను దినుసు కొక్కొకభాగముచొప్పున గలిపి గంజాయియాకు తెల్లగంటెన కలుబంద పొన్నగంటి కాచియాకు అల్లము పర్పాటకము చిత్రమూలము, నేల తాటిగడ్డలు రుదంతి అనువాని రసములతో 3 దినములు భావనజేసి మాష ప్రమాణమును 2 పలములజీలకఱ్ఱ కషాయానుపానముతోడ సేవించిన అసాధ్యగ్రహణి హరించు.

## ఆమకుఠార రసము.

శ్లో॥ [సింధూరమణిదర్పణే] జాజీఫలంత్రికటుకం టంకణం రస గంధకమ్ । నిర్యాసంవత్సనాభంచ ముస్తాకుటజ చిత్రకమ్। వరాచాతి విషారోచ నిర్యాస క్షారరామఠమ్ । సర్వంసం మర్ద్యవిజయాస్వరసేనదిన త్రయమ్ । వల్లప్రమాణ వటికాం శుంఠీద్రావానుపానతః । ఆమశూలమతీసారం గ్రహణీంచ చిరంతనామ్। ఏష ఆమకుఠారాఖ్యోరసస్త్రైలోక్యపూజితః॥

తా. జాజికాయ త్రికటుకములు పేల్చినవెలిగారము శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన నల్లమందు శుద్ధిజేసిన వననాభి తుంగముస్తెలు కొడిసెపాల చిత్రమూలము త్రిఫలములు అతివస బూరుగబంక యవక్షారము నేతిలో పొంగించిన యింగువ వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి గంజాయియాకురసముతో 3 దినములు మర్దించి వల్లప్రమాణము మాత్రలుచేసి శొంఠి కషాయానుపానముతో సేవించిన ఆమశూల అతిసారము చిరకాలముగనుండు గ్రహణి హరించు. ఈఆమకుఠార రసము త్రిలోకములయందు శ్రేష్ఠంబైనదిగ నున్నయది.

### గ్రహణులకు ఆనంద రసము.

శ్లో॥ [చరకే] జాతీఫలంహింగుళ సైంధవంచ వరాటశుంఠీ విష హేమబీజం । సపిప్పలీకంవటికాం ప్రకుర్యాద్ధుత్తూరమూలస్య రసేనమర్ద్యమ్ । గుంజాప్రమాణంజఠరామయఘ్నం నిహంతి వాతంక ఫశూలకంచ। ఆమాతిసారం గ్రహణీవికారంనిహంతి శుష్కంసితయాసమేతమ్ । రసోయమానంద ఇతిప్రదిష్ట గ్రహణీగదానాం యమపాణిదండః ॥

తా. జాజికాయ శుద్ధిజేసినయింగిలీకము సైంధవలవణము గవ్వలభస్మము శొంఠి శుద్ధిజేసిన వసనాభి వుమ్మెత్తవిత్తులు పిప్పళ్ళు వీనిని సమభాగములుగ ఖల్వములోనుని చివుమ్మెత్తవేళ్ళరసముతో మర్దించి. గురిగింజంత మాత్రలుజేసి నీడనెండించి సేవించిన జఠరరోగము వాంతి కఫ శూలలు హరించును. మఱియు దీనిని పంచదార యనుపానముతోడ సేవించిన ఆమాతిసారము గ్రహణీ వికారము శరీరకార్శ్యము హరించు. మఱియునిది గ్రహణులకు యమునిదండమువలనే భయంకరమై యుండు.

శ్లో॥ పిత్తాధిక గ్రహణ్యాంతు కపిత్థాష్టకమిష్యతే।
కఫవాతోత్తరాయాంతు పాఠాతక్రం హరీతకీ॥

తా. పైత్యోద్రేక గ్రహణుల హరింపంజేయుటయందు కపిత్థాష్టకంబును శ్లేష్మవాతోద్రేక గ్రహణులయందు పాఠాతక్రహరీతకియును శ్రేష్ఠంబులు.

### పిత్తాధిక గ్రహణికి కపిత్థాష్టకము.

శ్లో॥ యవానీపిప్పలీమూల చాతుర్జాతక నాగరమ్ । మరిచాగ్ని జలంజాజి ధాన్యసౌవర్చలంసమమ్। ద్విగుణంజలకాంబష్ఠా సమంగావరకాత్వచమ్ । వృక్షామ్లదాతకీకృష్ణా బిల్వదాడిమ దీప్యకమ్। త్రిగుణం షడ్గుణసితం కపిత్థాష్ట గుణీకృతమ్। చూర్ణాతి సారగ్రహణీ క్షయగుల్మ గళామయాన్ । * కాసశ్వాసాగ్ని మాంద్యార్శః పీనసారోచకంజయేత్॥

* కాసశ్వాసా రుచీహిక్కాః కపిత్థాష్ట మిదం జయేత్॥

తా. ఓమము వోడి యేలకులు ఆకుపత్రిక దాచినిచెక్క నాగ కరములు శొంఠి మిరియాలు చిత్రమూలము కురువేరు జీలకఱ్ఱకొతిమెర్లు సౌవర్చలవణముయివి దినుసు కొక్కొక భాగము తుంగముస్తెలు శిరుబొద్ది మంజిష్టి లవంగపుచెక్క యివి దినుసుకు 2 భాగములు పులిచింత ఆరెపువ్వు పిప్పళ్లు మారేడు దానిమ్మకాయఖురాసానివోమము యివి దినుసు యొకటింటికి 3 భాగములు పంచదార 6 భాగములు వెలగపండ్లుగుజ్జు 3 భాగములు ఇటుల వీనినెల్లదంచి చూర్ణముజేసి సేవించినఅతిసారము గ్రహణిక్షయము గుల్మము కంఠరోగము కాసశ్వాసములు అగ్నిమాంద్యముమూలవ్యాధి పీనస అరుచి హరించు.

## గ్రహణులకు తక్రాభయము.

శ్లో॥ [మాధవనిదానే] పాఠాకరంజయుగ్మాగ్ని శరపుంఖాపునర్నవా। కృష్ణనింబ మహానింబ లశునం బర్బురంపచేత్ । పృథగ్దశపలంద్రోణే జలేపాదావశేషితమ్ । కాంసపాత్రం దధిపటు ప్రస్థంద్విప్రస్థ కాంజికమ్ । క్షిప్త్వాతన్మధ్యఖండాని పథ్యాత్వక్పశతద్వయమ్ । తద్వచ్ఛనాగరంతైలం ఘృతంచ కుడవద్వయమ్। సుసిద్ధేలేహ్యతాంయాతే యవానీజీరకద్వయమ్ । హింగువ్యోషయవక్షారం ద్విపలంచవిచూర్ణితమ్ । సమవాప్యతతః ఖాదేత్తక్రేణాలోడ్యవాపిబేత్ । ఇయంతక్రాభయాహంతి సకలాన్ గ్రహణీగదాన్ । షడ్విధానప్యతీసారానజీర్ణాన్ వివిధానపి । అగ్నిమాంద్యంచ గుల్మంచ శీఘ్రుంహన్యాన్నసంశయ ॥

తా. శిరుబొద్దివేరు క్రానుగచెక్క నెమలిచెక్క చిత్రమూలముములువెంపలివేరు గలిజేరువేరు కరివేపాకు పెద్దమానుచెక్క వెల్లుల్లిపాయింట వీనిని దినుసుయొకటింటికి 10 పలముల చొప్పున గ్రహించి దంచి ద్రోణప్రమాణము నీళ్ళుబోసి 4 ళ భాగము శేషించునటుల కషాయముకాచి వడియగట్టి అందు పెరుగు 1 ఆఢకముసైంధవలవణము 1 ప్రస్థము బియ్యపుకడుగు 2 ప్రస్థములు 200 కరక్కాయల బెరడ చూర్ణము కరక్కాయలకు సమముగ శొంఠి చూర్ణముగలిపి తెల్ల ఆవనూనె నెయి 2 కుడవములువైచి మృద్వగ్నితో లేహ్యపక్వముగకాచి అందు వోమము జీలకఱ్ఱ

నల్లజీలకఱ్ఱ నేతితో పొంగించిన యింగువ త్రికటుకములు యవక్షారము అనువాని చూర్ణమును దినుసుకు 2 పలముల చొప్పున గలిపి 1 పాత్రలోనునిచి ప్రతిదినము కర్ష మెత్తును అనుపానరహితముగాగాని లేక చల్ల యొక్క యనుపానముతోడగాని సేవించిన సర్వగ్రహణులు 6 విధములైన అతిసారములు సర్వాజీర్ణములు అగ్నిమాంద్యము గుల్మము శీఘ్రముగ హరించు.

## గ్రహణీ రోగోపచార విశేషము.

శ్లో॥ దీపనీయానిసర్వాణి చూర్ణారిష్టఘృతానిచ ।
ప్రవిభజ్యయథావస్థం యోజయేద్గ్రహణీగదే॥

తా. దీపనకర సర్వచూర్ణములు అరిష్టములు ఘృతములువీనిని గ్రహణీరోగములయం దవస్థాంతర భేదములనెంచి ప్రయోగింపవలయు.

## సర్వాతిసారములకు పథ్యాది పటుకములు.

శ్లో॥ [ఆయుర్వేదే] పథ్యావిశ్వపునర్నవా గులికణాపూతీకయుగ్మంఝషా । వారాపాటలికా కలాయకదళంపుంఖీ జలప్రస్థకే । క్వాథేహింగుక దీప్యకంత్వతివిషావ్యోషం పలార్ధం పృథక్ । క్షిప్త్వాచూతశీకపాద మూథకయుగం తక్రంచ యోజ్యాంతతః॥ తద్వద్యోజ్య పలాష్టకంచకుటజం షష్టింశిపేచ్ఛాభయాః । చూర్ణీకృత్యఘృతంసుయోజ్య కుడవం తద్వచ్చతైలంక్షిపేత్ । తద్వద్వ్యాగర చూర్ణకేన సహితం వాలంచ జాతీఫలం । మారీచంచకులంపలం సువిపచేత్పాగ్ ప్రమాణావటీః । లిహ్యాన్నిత్యమిమాం వటీంతుమధునా సర్వాతిసారాంజయేత్ ॥

తా. కరక్కాయ శొంఠి గలిజేరు తంగేడు పిప్పళ్ళు నెమలి చెక్క క్రొమగుజిలిక వేళ్లు నేలతాటిగడ్డలు కలిగొట్టు సెనగాకు ములువెంపలివేళ్ళు వీనిని సమభాగములుగదంచి ప్రస్థప్రమాణ ముదకముబోసిచిక్కగ కషాయముకాచివడియగట్టి అందు యింగవ వోమము అతివస త్రికటుకములు అనువాని చూర్ణము దినుసుకు ½ పలము తేనె కషాయమునకు 4 వ భాగము మజ్జిగ 2 అఢకములు కొడిసెచూర్ణము 8 పలములు 60 కరక్కాయలచూర్ణము నెయ్యి 1 కుడవము ఆవనూనె 1 కుడవము

శొంఠిచూర్ణము 1 కుడవము వట్టివేరు జాజికాయ మిరియాలు అనువాని చూర్ణమును దినుసు కొక్కొక్కపలము చొప్పున గలిపి పాకముజేసి పోకలంత మాత్రలుజేసి యం దొక దానిని తేనెతో సేవించిన సర్వాతిసారములు (గ్రహణులు) హరించు.

## గ్రహణులకు పూతీకాది యోగము.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] పూతీకశరపుం ఖాగ్నిశుంఠీచవ్యపునర్నవైః। బిల్వాముస్తాలుక కణామూల పాఠారసోనకైః । నక్తమాల కళాశ్లేష్మ వాకైదర్వ్య క్షుద్రకంటకైః । క్వాథ మష్టాంశశే షంతు లవణంమథితంతథా । ధాన్యామ్ల మాఢకంపథ్యా శతంసింధుపలాష్టకమ్ । పునారసాంతంవిపచే ద్వాదశాహం విచక్షణః। సుచూర్ణితైః ప్రతీవాత్య ప్రత్యేకం కర్షసమ్మితం। త్వక్పత్రవహ్నివ్యోషాబ్ద పాఠాదీప్య కధాన్యకైః । కర్కోటు హింగుళం చైలానిశాద్విక్షార జీరకైః । మోచాహ్వాబర్బరీ దంతివచాతిందుక సైంధవైః। భక్షయే త్ప్రాతరుత్థాయ భుక్తాంతేచ మితాశనః । సర్వశూల గ్రహణ్యర్శో వహ్ని మాంద్యమ రోచకమ్ । జఠరంక్రిమిజాలంచ పాండురోగం కఫాత్మకమ్ । ఆనాహ శూలప్లీహంచ హంతీ చక్రమివా సురాణ్॥

తా. * నెమలిచెక్కములు వెంపలివేళ్ళు చిత్రమూలము శొంఠి చెవ్యము గలిజేరువేరుమారేడు తుంగముస్తెలు తంగేడు అగరులు మోడి శిరుబొద్ది వెల్లుల్లిపాయలు గానుగచెక్క పెద్దగురిజవేరు పెద్దమ్రానుచెక్క నేలములక వీనిని సమభాగములుగ దంచి 1 మణుగు నీరుబోసి 8 వ భాగముగ కషాయముకాచి వడియగట్టిఅందు వుప్పు మజ్జిగ పులికడుగు అనువానిని దినుసు యొకటింటికి అఢక ప్రమాణము 100 కరక్కా యలబెరడు 8 పలములు సైంధవలవణము గలిపి 12 దినములు చిక్కగవండి దించికొ నియందు ఆకుపత్రిక చిత్రమూలము త్రికటుకములు తుంగముస్తెలు శిరుబొద్ది వోము ము కొతిమెర్లు ఆకొకర యింగువ యేలకులు పసపు సర్జక్షారము యవక్షారము జీల కఱ్ఱబూరుగబంక వాయింట నేలదంచి వసముచ్చతుమికి సైంధవలవణము అనువాని చూర్ణమును దినుసుకు కర్షప్రమాణముచొప్పునగలిపి 4 మాడలయెత్తుప్రాతఃకా

* ఇదే నెమలడుగుచెక్క.

మున సేవించి పిదప మితముగ యన్నమును భుజించిన సర్వశూలలు గ్రహణులు మూలవ్యాధులు అగ్నిమాంద్యము అరోచకము వుదరమునందలి క్రిములు పాండువులు కఫరోగము అనగా దగ్గు ఆనాహము పార్శ్వశూల ప్లీహరోగము వీనిని "విష్ణుచక్రము అరుల నాశనముజేయు భంగి" నాశనము జేయు.

## గ్రహణ్యతిసారములకు అగ్నికర్మవిధి.

శ్లో॥ [శారీరే] శృణుదేవి ప్రవక్ష్యామి దేవత్వం కథయస్వమే ।
అగ్నివైద్యమతః కార్యం శృణుష్వాయతలోచనే ।
ఇత్యాదేశేనమతిమాన్ దహేల్లోహశలాకయా ।
పీణాస్థిమూలేశక్రాభంనాభేచ్ఛద్వ్యంగుళాదధః॥

తా. పైయౌషధముల సేవనవలన గ్రహణ్యతిసారములు నివర్తింపకుండినఅగ్నికర్మను జేయవలయునని ఈశ్వరుడు పార్వతి కుపదేశించినందున యినుప శలాకును గాల్చి ముడ్డిపూసయొముక కిరుగువారల చక్రాకారముగను బొడ్డుకు 2 వ్రేళ్ళక్రింద నడ్డముగను రక్షవేయవలయు. (శూలబుట్టి గ్రహణ్యతిసారములు నివర్తింపకుండిన బొడ్డుదిరుగువార రష వేయువలయు. ఈ గ్రహణ్యతిసార సాధ్యాసాధ్యముల నెఱింగి అందసాధ్యములగు వానిని వర్జించి సాధ్యంబులగు వానికే చికిత్సం జేయవలయు.)

## వాతాతిసారమునకు కనకసుందర రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం సమంగంథం మరీచం టంకణంకణా।స్వర్ణబీజం సమంమర్ద్యం భృంగిద్రావైర్దినార్ధకమ్।
సూతతుల్యం విషంయోజ్యం రసఃకనకసుందరః ।
దేయుంగుంజాద్వయంహంతి వాతాతీసారముద్ధృతమ్ ।
దధ్యన్నపదాళియేత్పథ్య మాజుసాధగవాందధి ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము మిరియాలు వెలిగారము పిప్పళ్ళుశుద్ధిజేసిన పుమ్మెత్తవిత్తులు శుద్ధిజేసిన నాభి యివిని సమభాగములుగ ఖల్వములోను నిచి గుంటగలగరాకు రసముతో 2 ఝాములు మర్దించి 2 గురిగింజలంతేసి మాత్రలు జేసి యందొకదానిని తేనె పిప్పలితో సేవించిన వాతాతిసారము హరించు పథ్యము మేక పెరుగన్నమును గాని లేక ఆవు పెరుగన్నమును గాని భుజింపవలయు.

## వాతాతిసార హితకర ద్రవ్యములు.

శ్లో॥ భంజీశాల్మలిరక్తాక్షీ కపిత్థందాడిమా న్యథ ।
శ్లేష్మాటోబరీవాథ క్షీరిణీవాకుచిశివా।
తర్కారీవాబలీచైషాం బాలపత్రాణివాపునః ॥
పక్వానివ్యంజనార్థాయ యోజయేదతిసారిణామ్॥

తా. భారంకెగి బూరుగ గన్నేరు వెలగ దాడింబ విరిగి తేగపాల చెట్టు భావంచి కరక తక్కడ వీని లేతయాకులనుగాని లేక ముదిరిన యాకులనుగాని య థారోగ్యముగ కూరగవండి భుజించుట వాతాతిసారమునందు హితకరంబు.

## సర్వగ్రహణ్యతి సారములకు మృతసంజీవని రసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] కర్పూరం రసగంధకంచ దరదం తీక్ష్ణోద్భవం భస్మకమ్ । కాలేయేంద్రయవాజ మోదహుత భుక్చించాస్థి కంథాతకీ । ఏలామాంసి లవంగశాల్మలి మలం జాజీ ఫలం టంకణమ్ । సీతాసింధుభవం విషంసమమిదం ప్రత్యేకనిష్కాన్వితమ్ । సర్వేషాం సదృశంచ బిల్వఫలకమ్ కాంతాభ్ర సిందూరకమ్ । సిందూరించసఫేన కంచతులితం దుత్తూర బీజంక్షిపేత్ । భంగాపత్రకకోకిలాక్ష సహితం సర్వంచ చూర్ణీకృతమ్ । దుత్తూరస్వరసేన సంతతమిదం సంమర్దయే ద్యామకమ్ । జంబీరస్వరసేన మర్దిత మిదంగుంజా ప్రమాణావటీ । సేవ్యాచేన్మధురాజయేద్భ్రశమిమం రక్తాతిసారం పరమ్ । సర్వంచగ్రహణీగదేషు సహజేష్వామాతిసారేషుచ । తద్వచ్ఛూలయుతాంశ్చ దుస్తరతరాన్ నానాతిసారా జయేత్ ॥

తా. కర్పూరము శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన యింగిలీకము ఇనుపభస్మము కస్తూరిపసపు కొడిసెపాల అజామోదము చిత్రమూలము చింత గింజలు ఆరెపువ్వు యేలకులు జటామాంసి లవంగములు బూరుగబంక జాజికాయ వెలిగారము సముద్రఫలపువిత్తులు సైంధవలవణము శుద్ధిచేసిన నాభి ఇవి దినుసు యొ

కటింటికి నిష్క-ప్రమాణము వీనికన్నిటికి సమము మారేడుచేసను కొంతభస్మముఅ భ్రకసింధూరము రససింధూరము శుద్ధిచేసిన నల్లమందు శుద్ధిచేసినవుమ్మెత్తవిత్తులుశుద్ధి చేసిన గంజాయియాకు నీరుగొలిమిడివిత్తులు అన్నింటి చూర్ణము ఇటుల వీనినెల్లఖల్వములో నుంచి ఉమ్మెత్తవేళ్ళరసముతో 1 ఝాము నిమ్మపండ్లరసముతో 1 ఝాము మర్దించి గురిగింజంత మాత్రలుచేసి యందొకదానిని తేనెతో సేవించిన రక్తాతిసారము సర్వగ్రహణులుసహజాతిసారము ఆమాతిసారసముశూలలతోగూడి అసాధ్యములుగనుండు రక్తాద్ధాతిసారములు హరించు.

గ్రహణులకు మరీచ వటుకము.

శ్లో॥ దుత్తూరమూలజంకల్కం మరీచ్యాచసమన్వితమ్ ।
ఇమాంగుంజ ద్వయాంమాత్రాం తైలయుక్తేన యోన్నరః ।
మలవేగం రుణద్ధ్యేత త్సేతు బంధయివోదధిమ్॥

తా. ఉమ్మెత్తవేళ్ల కల్కమునకు సమముగ మిరియపుచూర్ణముగలిపి మర్దించి 2 గురిగింజలయెత్తు మాత్రలుజేసి తెల్లఆవనూనెతో సేవించిన "సముద్రమునుశ్రీరాములు వారధికట్టిన భంగి" గ్రహణ్యతిసారములు బంధించును.

గ్రహణ్యతిసారాములకు మదవారణ సింహరసము.

శ్లో॥ [ఆయుర్వేదే] సురభిపారద హింగుళచిత్రకాః గగనభస్మ
సుటంకణజాతికాః । కనకబీజమథోతివిషా కటుత్రయహరీతకీభస్మసుదీప్యకాః । గరళబిల్వక పిత్థకళింగకాః నలదమోచకదాడిమధాతకీ । జలదశాల్మలి పిప్పయుతాః సమాః కనకసామ్యమ ఫేనమిదంధృశమ్ । కనకపత్రరసైః పరిమర్ద యేన్మరిచమాన వటీమధుసంయుతా । వినిహరేద్గ్రహణీగద ముత్కటం జ్వరయుతామ సతీంచవిషూచికామ్ । అగ్నిమాంద్య మథశూలవిబంధకం గుల్మశూలమథ పాండుమమందకమ్ । సరుధీరామమతీవసముత్కటం గ్రహణికామదవారణసింహకః॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన యింగిలీకము చిత్రమూలము అభ్రకభస్మము పేల్చిన వెలిగారము జాజికాయలు శుద్ధిచేసిన వుమ్మెత్తవిత్తులు అతివస త్రికటుక

ములు కరక్కాయమసి సోమము శుద్ధి జేసిన నాభిమారేడుగుజ్జు వెలగబేసము కొడిసెకా యవత్తి వేరు అరటిదుంప దాడింబకాయ ఆరెపువ్వు తుంగముస్తెలు బూరుగబంక శు ద్ధి చేసిన నల్లమందు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వుమ్మెత్తాసరసముతో మర్దించి మిరియపుగింజలంత మాత్రలు చేసి తేనెతో సేవించిన ప్రబలమైన గ్రహణు లు జ్వరముతో గూడి దుష్టముగనుండు విషూచి అగ్నిమాంద్యము శూల మలబద్ధము సర్వగుల్మశూలలు తీవ్రమైన పాండురోగములు దారుణమైన రక్తస్రావముతో గూ డియుండు ఆమము వీనిని హరింపంజేయు.

## సర్వగ్రహణ్యతిసారములకు లోకనాథరసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] శుద్ధసూతంవిషంగంధంటంకణంలోహభస్మ కమ్ । జాతీఫలంధాతకీచ వరాంగంచిత్రమూలకమ్ । జీరకం నాగరంసింధు మాతబీజంసపిప్పలి। మోచాపిచ్ఛంబిల్వ మజ్జా ముస్తాచాతివిషాపృథక్ । సప్తభాగమఫేనంచ సర్వతుల్యం మృతాభ్రకమ్ । దుత్తూరత్వక్కషాయేణ మర్దితంయా మమాత్రకమ్ । బదరాస్థిసమంఖాదే ద్వహ్నిదీప్తికరంపరం । అనుపానవిశేషేణగ్రహణీంచచిరంతనామ్ । సర్వాజీర్ణ ప్రశ మన మనుపానంచ మాక్షికమ్॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన వసనాభి శుద్ధిజేసిన గంధకము వెలిగారము లోహభస్మముజాజికాయ ఆరెపువ్వు లవంగపుచెక్క చిత్రమూలము జీలకర్ర శొం ఠి సైంధవలవణము మామిడిపప్పు పిప్పళ్ళు బూరుగబంక మారేడుబేసము తుంగము స్తెలు అతివస యివి దినుసు కొక్కొకభాగము శుద్ధిజేసిన నల్లమందు 7 భాగములు వీనికన్నిటికి సమము అభ్రకభస్మము యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి నల్ల ఉమ్మె త్తవేర్లపట్ట కషాయముతో 1 జాము మర్దించి రేగుపండంత మాత్రలుజేసి అనుపా నవిశేషములతో సేవించిన అగ్నిమాంద్యము చిరకాలముగనుండు సర్వగ్రహణులు అ తిసారములు) హరించు మఱియు దీనిని తేనెతో సేవించిన సర్వాజీర్ణములుహరించు.)

## కనకసుందర రసము.

శ్లో॥ హింగుళంమరిచంగంధంపిప్పలీకంటణంవిషమ్ । కనకస్యచబీజాని సమాంశం విజయాద్రవైః। మర్దయే ద్యామమాత్రంతు చణ

మాత్రావటీకృతా। భక్షణీద్గ్రహణీంహంతిరస కనకసుందరం॥ అగ్నిమాంద్యంజ్వరంతీవ్రమతిసారంచనాశయేత్ । దధ్యన్నం దాపయేత్పథ్యంతథా తక్రోదనంచరేత్ ॥

తా. శుద్ధిజేసిన యింగిలీకము మిరియాలు శుద్ధిచేసిన గంధకము పిప్పళ్ళు వెలిగారము శుద్ధిజేసిన నాభి శుద్ధిచేసిన ఫుమ్మెత్తవిత్తులు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గంజాయియాకు రసముతో 1 జాము మర్దించి సెనగగింజలంత మాత్రలుజేసి సేవించిన అగ్నిమాంద్యము తీవ్రజ్వరము సర్వాతి సారములు గ్రహణులు హరించు. దీనియందు పెరుగు లేక మజ్జిగయన్నమును భుజించుట పథ్యకరము

## గ్రహణీగజకేసరీ రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] పారదంవ్యోమగరళం హింగుళంసురభిర్బలిః॥ ఆయసం టంకణంచైవ ధూర్తబీజం సవత్సకమ్ । వ్యోషా చిత్రకజాజీచవయస్థాదగ్ధభస్మచ ॥ అజామోదా ప్రతివిషా కుబేరాక్షితథైవచ । కపిత్థబిల్వాపైశాచమే తేచసమభాగినః । ఏతత్సమ మఫేనంచ దుత్తూర రసమర్దితం । వాసరంమర్ద్దిరం కల్కమరీచస్యప్రమానితః । మాంక్షికేణలి హేద్దేవంశుంఠీరస సమన్వితమ్ । జ్వరాతిసారగ్రహణి గుల్మశూలమజీర్ణకం । రక్తాతిసారప్రదరం విషూచీపాండురోగనుత్ । దీపనంకురుతే తీవ్ర గ్రహణీగజకేసరీ॥

తా. శుద్ధిజేసిన రసము అభ్రకభస్మము శుద్ధిజేసిన నాభి శుద్ధిజేసిన యింగిలీకము శుద్ధిజేసిన గంధకము ఉక్కుభస్మము వెలిగారము శుద్ధిజేసిన ఫుమ్మెత్తవిత్తులుకొడిసెపాల త్రికటుకములుచిత్రమూలము జాజికాయ కరక్కాయలమసి అజామోదము అతివస గచ్చకాయలు వెలగపండు బేసము మారేడు బేసము లేక మారేడుపిందెలు బూరుగబంక వీనిని సమభాగములుగ చూర్ణముజేసి ఖల్వములోనునిచి దానికి సమముగ శుద్ధిజేసిన నల్లమందు గలిపి ఫుమ్మెత్తవేళ్ళరసముతో 1 దినము మర్దించి మిరియపుగింజలంత మాత్రలుజేసి యందొకదానిని తేనెతోగాని లేక శొంఠి సముతోగాని సేవించినజ్వరము అతి సారము గ్రహణులు గుల్మము శూల అజీర్ణము రక్తాతిసారము ప్రదరము విషూచిపాండువు వీనిని హరింపంజేసి మిక్కుటముగ అగ్నిదీపనమును గలుగంజేయు.

## అతిసారాదులయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] పటోలకుటజాజాజీ చుక్రికాకదలీఫలమ్ ।
బిల్వందధిచఛాగాద్యాశ్చ తైలకై డర్యవాసుకమ్ ।
నిద్రాకారంచశాకంచ కపిత్థంతు వరీసమ్ ।
అతిసారేగ్రహణ్యాంవా రంభా పుష్పంహితంవిదు ॥

తా. పొట్లకాయ కొడిసెకాయ జాజికాయ పులిచింత అరటివండు మారేడు కాయ మేకపెరుగు తెల్లఆవనూనె పెద్దమ్రానుచెక్క చక్రవర్తికూర నిద్రగ్రొనుగ చిగుళ్ళు వెలగపండు కందికట్టు అరటిపువ్వు యివి గ్రహణ్యతిసారములయందు హిత కరంబు.

## అతిసారాదులయం దపథ్యము.

శ్లో॥ తిలనిష్పావకూశ్మాండ కర్కోటకముపోదకీ ।
అలాబుకందపూపంచ మాంసంమద్యం గుడంహిమమ్ ।
ఆమ్లాంబుపానతాంబూలం స్నానంజాగరసంగమమ్ ।
గ్రహణీష్వతిరేషు త్యాజ్యంమానం గురూణిచ॥

తా. నువ్వులు అనుములు గుమ్మడుకాయ కాకరకాయ బచ్చలికూర ఆనుగపుకాయ కందగడ్డపిండివంటకములు మాంసము కల్లు బెల్లము శీతకరవస్తువులు పులుసు మిక్కుటముగ నీరుద్రాగుట తాంబూలముస్నానము జాగరణము స్త్రీసంగమము కోపము జడకరపదార్థములు వీనిని గ్రహణ్యతిసారములయందు వర్జింపవలయును.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
గ్రహణ్యతి సారరోగనిదాన తత్సాధ్యాసాధ్య
చికిత్సానుపాన పథ్యాపథ్య లక్షణయుక్తం
దశమ ప్రకరణమ్.

❖

శ్రీరస్తు.

# బసవరాజీయము.

## ఆంధ్ర తాత్పర్యము.

### — ఏకాదశ ప్రకరణము. —

శ్లో॥ శంకరం నిర్మలాకారం బాలచంద్ర కళాధరమ్ ।
స్థాణుంచోమాపతిం శర్వం భజేహం మల్లికార్జునమ్॥

తా. సుఖకరుడు నిర్మలస్వరూపుడు బాలచంద్రకళాధరుడు అచంచలుడు పార్వతీవల్లభుడు శర్వుడు నగు మల్లికార్జునుని నేను భజించెదను.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి నృపరాజీయః మహాన్వైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని పేరొందబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథముయొక్క ఏకాదశ ప్రకరణము వచింపుచున్నాడను.

## ఉదర నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] రోగాస్సర్వేపిమందేగ్నౌ సుతరాముదరాణిచ ।
అజీర్ణాన్మలినై శ్చాన్నైర్జాయంతే మలసంచయాత్ ॥

తా. అగ్నిమాంద్యము త్రిదోషజనితంబగుటచే సర్వరోగములు జనించుటకు కారణంబుగనుండును. అందు ఉదరరోగము ముఖ్యముగ జనించును. మఱియు అజీర్ణము మలినాన్నము అనగా విరుద్ధాన్నశనాదికములు మలసంచయము (అనగా దోష పురీషముల సంచయము) అనువానివలనకూడా ఉదరరోగము జనించును.

## ఉదర సంప్రాప్తి.

శ్లో॥ రుద్ధ్వాస్వేదాంబువాహీని దోషాస్స్రోతాంసిసంచితాః ।
ప్రాణాగ్న్యపానా స్సందూష్య జనయం త్యుదరంనృణామ్ ॥

తా. వాతాదిదోషములు స్వేదము వుదకము అనువానిని వహింపుచుండు స్రోతస్సులయందు సంచితంబులై వృద్ధింజెంది ప్రాణావాయువు అగ్ని అపానవాయువుఅనువానిని కడుదుష్టయుక్తంబుగ జేసి మనుజులకువుదరరోగమును గలుగంజేయును

## ఉదరరోగ సామాన్య రూపము

శ్లో॥ [మాధవనిదానే] ఆధ్మానంగమనేశక్తిర్దౌర్బల్యాదుర్బలాగ్ని
తా । శోథస్సదవమంగానాం సంగోవాతపురీషయోః ।
దాహ స్తంద్రాచసర్వేషు జఠరేషుభవంతిహి॥

తా. కడుపుబ్బుట నడుచుటకు శక్తిలేకుండుట దౌర్బల్యము అగ్నిమాంద్యమువాపు అంగములయందు గ్లానిగలుగుట వాతము మలము బద్ధగించుట తాపముతంద్రగలుగుట ఈ లక్షణములు సర్వోదరములయందు గలుగును.

## ఉదరసామాన్య లక్షణము.

శ్లో॥ [శారీరే] యేనశుష్యతిసర్వాంగం జఠరంవర్ధతేభృశమ్ ।
ఉదరంతంవిజానీయా త్తదష్టవిధముచ్యతే ॥

తా. సర్వాంగములు కృశించిమిక్కుటముగ కడుపుబ్బినవుదరరోగమని తెలియవలయును. ఆ యుదరరోగములు 8 విధంబులు.

## ఉదరరోగ విశేష లక్షణములు.

శ్లో॥ [ఆయుర్వేదే] పృథగ్దోషైస్సమస్తైశ్చప్లీహాబద్ధక్షతోదకైః ।
సంభవంత్యుదరాణ్యష్టౌ తేషాంలింగంపృథక్ఛృణు ।
క్షతమూర్ధ్వమధోబద్ధ ముదకంతుసమంతతః ।
నాభేఃప్లీ హావామపార్శ్వే దోషజందోషలక్షణమ్ ।
సాధ్యంప్లీహంచైకదోషం శేషంత్యాజ్యం చతుష్టయమ్ ।

తా. వాతోదరము పిత్తోదరము శ్లేష్మోదరము త్రిదోషోదరము ప్లీహోదరము బద్ధోదరముక్షతోదరము జలోదరమువలన వుదరరోగములు 8 విధంబులు వానిలక్షణముల ప్రత్యేకముగ వచించెద వినుము. బొడ్డుకు పైభాగమున జనించునది క్షతోదరమనియు బొడ్డుకు క్రిందిభాగమున జనించునది బద్ధోదరమనియు బొడ్డుకు చుట్టూ జనించునది జలోదరమనియు బొడ్డుకెడమ పార్శ్వమువ జనించునది ప్లీహోదర

మనియు వాతపిత్త శ్లేష్మములవలన జనించునవి ద్వంద్వజోదరములనియు వాతపిత్తశ్లేష్మలక్షణ యుక్తంబై జనించునది త్రిదోషోదరమనియు తెలియవలయు. అందు ప్లీహోదరము వాతపిత్తశ్లేష్మోదరములు నీ నాలుగును సాధ్యంబులు తక్కినవి నాలుగును అసాధ్యంబులు.

## ఉదరరోగ సామాన్యచికిత్స.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] ఉదరాణిమలంధ్వాత్వా బహుశోరేచసంహితమ్ । లశునాదికమేరండ తైలంతత్రప్రశస్యతే॥

తా. పైజెప్పబడిన 8 యుదరములు మలాధిక్యమువలన జనించు అట్లగుటం జేసి వానియందు తఱుచుగ లశునాద్యేరండ తైలమువలన విరేచనము జేయించుట. ప్రశస్తంబు.

## వాతోదర లక్షణము.

శ్లో॥ [మతాంతరే] తత్రవాతోదరేశోఫః పాణిపన్నాభికుక్షిషు ।
కుక్షీపార్శ్వోదర * కటిసవ్యథంచకృశాంగతా ।
ముహుర్మహుశ్చసంతాపో శుష్కకాసేనలక్షయేత్ ॥

తా. మీ జేతులు మీ గాళ్ళు నాభికుక్షి అనువానియందు శోఫగలుగుటకుక్షీ పార్శ్వములు కడుపు కటిప్రదేశము అనువానియందు సూదులతో బొడుచునటుల వేదనగలుగుట శరీరము కృశించుట పలుమారు సంతాపము పొడిదగ్గు గలుగుట ఈ లక్షణములుగలది వాతోదరమని తెలియవలయు.

## పైత్త్యోదర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] జ్వరోమూర్ఛాచతృడ్దాహా కటుకాస్యంచ జృంభణమ్। భ్రమోతిసారస్వేదశ్చ పిత్తజోదరలక్షణమ్॥

తా. జ్వరము మూర్ఛ దప్పి తాపము గలుగుట నోరు చేదుగనుండుట ఆవులింతలు గలుగుట తబ్బిబ్బులాడుట అతిసారము చెమటగలుగుట ఈలక్షణములు గలది పిత్తోదరమని తెలియవలయు.

## శ్లేష్మోదర లక్షణము.

శ్లో॥ శ్వయథుర్గౌరవంనిద్రాకాసనిద్రాశ్చపాండుకృత్ ।

---

* కటీపృష్ఠరుక్పార్శ్వభేదనమ్.

ఉదరం స్తిమితంస్నిగ్ధం శీతస్పర్శః కఫోదరే॥

తా. వాపుగలుగుట శరీరము జడగము నుండుట యెల్లపుడు నిదురగలుగుట దగ్గు వుబ్బసము గలుగుట చర్మాగులు తెల్లగనుండుట కడుపు కదలక మెఱయుచుండుట కడుపు దాకిన చల్లగనుండుట ఈ లక్షణములుగలది శ్లేష్మోదరమని తెలియవలయు

## సన్నిపాతోదర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] త్రిదోష లక్షణైర్యుక్తం సన్నిపాతోదరం భవేత్ । దేహంచ పాండురంమాత్ర మగ్నిరక్షణముత్తమమ్॥

తా. వాత పిత్త శ్లేష్మ లక్షణంబులన్నియుంగలది సన్నిపాతోదరనుని తెలియవలయు. దానియందు శరీరము మాత్రము పాండువర్ణముగనుండు మఱియు "రోగాస్సర్వేపిమందేగ్నౌ సుతరాముదరాణిచ" అను వచన ప్రకారము వుదరమునకు మందాగ్నియే ప్రధానంబు. అట్లగుటంజేసి దీనియందు ముఖ్యముగ యగ్ని దీప్తి కరములగు నౌషధముల నొసంగవలయు.

## జలోదర లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] ఉదరంసజలంయస్య వర్ధతేశ్వయథుస్తథా ; హస్తపాదేకృశత్వంచ స్యాజ్జలోదర లక్షణమ్॥

తా. ఉదరంబతయు జలయుక్తమై మిక్కుటముగ పెరుగుట బొడ్డువాచుటచేతులు కాళ్ళు కృశించుట ఈ లక్షణములుగలది జలోదరమని తెలియవలయు.

## ప్లీహోదర లక్షణము.

శ్లో॥ ప్లీహోదరం కీర్తయతోనిబోధ విదాహ్యభిష్యందిరతస్యజంతోః । ప్రదుష్టమత్యర్థమసృక్కఫశ్చ ప్లీహాభివృద్ధింకురుతః ప్రవృద్ధౌ । ప్లీహోత్థమేతజ్జఠరంవదంతి తద్వామపార్శ్వే పరివృద్ధిమేతి । విశేషతస్సీదతిచాతురోత్ర మందజ్వరాగ్నిః కఫపిత్తలింగైః। ఉపద్రుతః క్షీణబలోతిపాండుః ప్లీహోదరంసాధ్య మితిబ్రువంతి॥

తా. ప్లీహోదరలక్షణమును వచించెద వినుము- * విదాహకర పదార్థము౦ † అభిష్యందిపదార్థముల యెల్లప్పుడు సేవించుటవలన రక్తకఫములు మిక్కుటముగ దుష్టంబులై వృద్ధింజెంది యెడమపార్శ్వమున ప్లీహాభివృద్ధిని గలుగంజేయు. దీనినే ప్లీహోదరమని వచించెదరు. మిక్కుటముగ శరీరశైథిల్యము స్వల్పజ్వరము అగ్నిమాంద్యము కఫపిత్తోదరలక్షణములు బలక్షయము శరీరమున తెలుపువర్ణము గలుగుట. । ఈ ప్లీహోదరము సాధ్యము.

శ్లో॥ [రసరత్నాకరే] ప్లీహోనాంపృష్ఠదేశేచ రక్తస్రావంచ కారయేత్ ॥

తా. ప్లీహోదరమున వీపుయందు రక్తస్రావము జేయించవలయు.

బద్ధగుదోదర లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] యస్యాంత్రమన్నైరుపలేపిభిర్వా బాలాశ్మభిర్వాపిహితంయథావత్ । సంచీయతేతస్యమలస్సదోషః శ్శనైశ్శనైస్సంకరవచ్చనాడ్యామ్ । నిరుధ్యతేతస్యగుదేపురీషం నిరేతికృచ్ఛ్రాదతిచాల్పమల్పమ్ । హృన్నాభిమధ్యే పరివృద్ధిమేతి తస్యోదరం బద్ధగుదంవదంతి॥

తా. జిగటగనుండు అన్నశాకశాలూకాది పదార్థసేవనవలన సూక్ష్మమైనటాళ్ళు వుదరమున బ్రవేశించుటవలన మలవాహినులగు ప్రేగులడ్డగింపబడి దానివలన వాతపిత్తశ్లేష్మములు దుష్టంబులై వానితోడ మలముగలసి గుదస్థానమునందుండుబోలు నరములయందూడ్చబడిన కుప్పవలె క్రమముగ సంచితంబై కడుకష్టముమీదకొంచెకొంచెముగ బైలువెడలు. వానివలన నుదరము హృదయము నాభి అనువాని మధ్యమున (అనగా అన్నపాకస్థానమున) వృద్ధిజెందు. దానినే బద్ధగుదోదరమని వచించెదరు.

క్షతోదర లక్షణము.

శ్లో॥ శల్యం తథాన్నోపహితంయదంత్రం భుక్తం భినత్త్యాగతమవ్యథావా । తస్మాత్స్రుతోంత్రాత్సలిలప్రకాశస్స్రావస్స్రవేద్వైగుడతస్తుభూయః । నాభేరధశ్చోదరమేతివృద్ధింని

విదాహియన - వంశకరీరాదులు † అభిష్యందియన - దధ్యాదిజిగటపదార్థము.

స్తుద్యతే దాల్యతిమాత్రిమాత్రమ్ । ఏతత్పరిస్రావ్యుదరం ప్రదిష్టం ఛిద్రోదకోదరం కీర్తయతోనిబోధ॥

తా. శల్యములన కంటక శర్కరాదు లన్నముతోడగలసిపక్వాశయగతంబై యందుండి బయలువెడలునపుడు నాడులయందడ్డముగ ప్రవేశించుటవలనగాని లేక అవులింతచేగాని మిక్కుటముగ భుజించుటవలనగాని ప్రేగులు భిన్నంబులై వాని ఛిద్రములవలన పలుమారు స్రవించెడు నీరు గుదము ప్రేగులు అనువానియందు పూరితంబై బొడ్డుక్రింద వుదరమును గలుగంజేయు యిదే క్షతోదరమనియు పరిస్రావ్యుదరమనియు గ్రంథాంతరేణ ఛిద్రోదరమనియు జెప్పంబడు. దానియందు సూదులతో బొడుచునటుల బ్రద్దలుసేయునటుల మిక్కుటముగ వేదనగలుగు నివి నుపేక్షించుటవలన నిది శీఘ్రముగ జలోదరంబగు.

## జలకూర్మోదర లక్షణము.

శ్లో॥ [మతాంతరే] జలకూర్మంతుతంవిద్యాచ్ఛ్లేష్మవాయు సముద్భవః । సచకృచ్ఛ్రప్రయత్నేన ప్లీహోదరగుణాన్వితః॥

తా. శ్లేష్మవాతమువలన జనించి ప్లీహోదరలక్షణయుక్తంబై కూర్మాకారమైన నుదరము గలదియే జలకూర్మోదరమనంబడు. (ఇది కష్టసాధ్యము. ఇది జలోదరము నందంతర్భావమును జెందియుండు.

## అష్టోదర సాధ్యాసాధ్యములు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] జన్మనైవోదరంసర్వం ప్రాయఃకృచ్ఛ్రతమనువిదుః । బలిన స్తదతాతాంబు యత్నసాధ్యం నవోత్థితమ్॥

తా. ఉదరరోగంబులన్నియు నుత్పత్తిమొదలుకొని తలుచుగ కష్టసాధ్యంబులు. ఐనను సత్వముగలవానికి నవీనముగ జనించిన అజాతోదకోదరము కడుప్రయత్నమువలన సాధ్యంబగు. అజాతోదరలక్షణం బెద్దియనిన (చరక॥శ్లో॥ "అశోథమరుణాభాసంసశబ్దంనాతిభారికమ్। సదాగుడాయంతంసిరాజాలగవాక్షితమ్। నాభింవిష్టభ్యపాయాతు వేగంకృత్వాప్రణశ్యతి। హృద్వంక్షణకటీనాభిగుదంప్రత్యేకశూలినః కర్కశంసృజలోపానంనాతిమందేచపావకే ।లోలస్యవిరసేచాస్యేమూత్రేల్పేసంహతే విశ । అజాతోదకమిత్యేతైర్యుక్తంవిజ్ఞాయలక్షణేరితి" అనగావాపు లేక యెఱుపై శబ్దముతోగూడి బలువు లేకయెల్లపుడు గుడుగుడు శబ్దముతోగూడి గవాక్షీరూప

మగు సిరలతో వ్యాప్తంబైయుండు అపానవాతము నాభితోనుండిలేచి గుదస్థానము వరకు వ్యాపించియుండు వేగముతోగూడినదై ఆంత్రములు గజ్జలు కటిప్రదేశము బొడ్డు గుదము అనువానియందు శూలనుకలుగంజేయుచు గుదస్థానమును కఠినముగజేయుచు కుక్షి మిక్కుటముగ వృద్ధిం బొంది నీటిచే పూరింపంబడిన తోలుతిత్తినిదాకినసెట్టిస్వ ర్యత్నోభగల్గునో అట్టివానితో తుల్యంబై యగ్నిమాంద్యము అరుచి అల్పమాత్రము మలబద్ధము అనువానితో గూడియుండునది అజాతోదకోదమని తెలియవలయు ననుట.)

శ్లో॥ [ఆయుర్వేదే] పశ్చాద్బద్ధగుదంతూర్ధ్వం సర్వంజాతోదకం
తథా । ప్రాయోభవ త్యభావాయ చిద్రాంత్రంచోదరం
నృణామ్॥

తా. బద్ధగుదోదరము 15 దినములకుపిదప నసాధ్యంబగు. ఇత్తైలంగుననే స ర్వోదరములు నీరైన యెడల మృత్యుప్రదంబులగు మఱియు ఛిద్రాంత్రోదరముతఱు చుగ మృత్యుప్రదంబు ఐనను ఒకానొకపుడు*శల్యచికిత్సవలనగాని లేక శస్త్ర చి కిత్సవలనగాని పునకపూరితంబగు ఛిద్రాంత్రము బద్ధగుదము సాధ్యంబులగు.

ఉదరాసాధ్య లక్షణము.

శ్లో॥ శూనాక్షం కుటిలోపస్థ ముపక్లిన్న తనుత్వచమ్।
బలశోణితమాంసాగ్ని పరిక్షీణంచవర్జయేత్ ॥

తా. నేత్రములుబ్బుట శిశ్నము వంకరగనగుట చర్మము క్లేదయుక్తమైపల్చ గనుండుట సత్వము రక్తము మాంసము జాఠరాగ్ని క్షయించుట ఈలక్షణములుగల యుదరరోగిని వర్జింపవలయు.

శ్లో॥ [మతాంతరే] పార్శ్వభంగాన్నవిద్వేష శోథాతీసారపీడితమ్।
* బలశోణితమాంసాగ్ని క్షీణంచోదరిణంత్యజేత్ ॥

తా. పార్శ్వములు పగలినటులుండుట అన్నద్వేషము వాపు అతిసారము గలుగుట సత్వము రక్తమాంసములు క్షయించుట అగ్నిమాంద్యము గలుగుట ఈ లక్షణములుగల యుదరరోగిని వైద్యుడు వర్జింపవలయు.

* బహువిధములగు తృణములు కొష్ఠములు పాషాణములు లోహములుమంటి గడ్డలు మొదలగునవి శరీరమునుండి వెడలకుండిన వానిని యంత్ర శస్త్ర క్షారాగ్నుల వలన వెలికిందీయు నుపాయంబును వ్రణనిశ్చయమును బోధించునది శల్యమనంబడు ఈశల్యచికిత్స సుశ్రుతమున జెప్పంబడియున్నయది చూడుడు.

## వాతోదరమునకు అగ్నికుమార రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం సమంగంధం శుద్ధతాళం మనశ్శిలా । తుత్థ్యాంశంచిత్రమూలంచ * యామం దుత్తూరజైర్ద్రవైః । జంబీరైశ్చతథామర్ద్యం తద్గోళం శ్రావసంపుటే । రుద్ధ్వాబహిర్మాషపిష్టైస్తయోర్లేప్యంచసంపుటమ్ । గోధూమపిష్టికావాథవిలేప్యావస్త్రమృత్తికా । విశోష్యపాచయేద్యం త్రేద్విషడ్యామంసువాలుకే । క్రమవృద్ధ్యాగ్నినా పాచ్యం సాంగశీతంసముద్ధరేత్ । దశమాంశంవిషందత్వా విషాంశం మృతతామ్రకమ్ । జ్వాలాముఖీద్రవైస్సర్వంభావయిత్వాత్రిసప్తధా । త్ర్యూషణంచ సహైవార్ద్రద్రవైర్భావ్యం త్రిసప్తధా । రసోహ్యగ్నికుమారోయంసేవ్యం గుంజాద్వయంసదా । తాంబూలపత్రసంయుక్త ముదరం వాతగుల్మజిత్ । శాకజం ఘూకషాయంచ హ్యనుపానం సదాపిబేత్॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన తాళకము శుద్ధిజేసిన మణిశిల చిత్రమూలము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వుమ్మెత్తాను నిమ్మపండు అనువానిరసములలో ప్రతిదానిచే నొక్కొకఝాముమదించి ముద్దజేపి మూకుళ్ళలోనునిచి వానిచుట్టూ మినుపపిండినిగానిలేక గోధుమపిండినిగాని మెత్తి పిదప వానిచుట్టు చీలమన్ను లేపనముజేసి యెండించి వాలుకాయంత్రమునందునిచి మృదు మధ్య గాఢాగ్నులతో క్రమముగ 12 జాములువండి సాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి దానికి 10 వభాగము శుద్ధిజేసిన నాభికిసమముగ తామ్రభస్మముగలిపి జ్వాలాముఖిరసముతో 21 మార్లుభావనజేసి అందుత్రికటుకచూర్ణముగలిపి అల్లపురసముతో 21 మార్లు మరల భావనజేసి యందు 2 గురిగింజలయెత్తును తమలపాకులోనునిచి సేవించినతోడనే వెలుమసంధివేరు కషాయమును ద్రాగినవాతోదరము గుల్మము హరించు.

---

* యవమానూరజైర్ద్రవైః।

## వాతోదరమునకు వ్యోషాదిగణ చూర్ణము.

శ్లో॥ కటుత్రయంవచాహింగు యవక్షారంవిషద్వయమ్ । చవ్యతి క్తవిడంగాని గజకృష్ణాలవణానిచ । గ్రంథిబిల్వా జమోదంచ గణోవ్యోషాదిక స్తథా । ఏతానిసమభాగాని సూక్ష్మచూర్ణా నికారయేత్ । లేహ్యమేరండతైలేన తచ్చూర్ణం బుద్ధిమా న్నరః । బిడాలపతకంచైవ పిబేద్వాకోష్ణవారిణా। వాతోదర వినాశాయ సర్వోదరవినాశకృత్॥

తా. త్రికటుకములు వస యింగువ యవక్షారము అతివస శుద్ధిజేసిన నాభిచెక్క చేలిపాట్ల వాయువిడంగములు యేనుగపిప్పలి పంచలవణములు గ్రంథీ తగరము మారేడు వోమము వీనిని సమభాగములుగ చూర్ణముజేసి బిడాలపతకప్రమాణము ఆముదముతో గాని లేక యొకింత వుష్ణోదకముతో గాని సేవించిన వాతోదరము సర్వోదరములు హరించు.

## పైత్యోదరమునకు త్రైలోక్యసుందర రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం ద్విధాగంధం మృతాభ్రం సైంధవంవిషమ్। కృష్ణజీరంవిడంగంచ గుడూచీసత్వమేవచ। * వాసాచైవయవక్షారంప్రత్యేకంస్యాద్రసార్ధకమ్। నిర్గుండికా ద్రవైశ్చాపి బీజపూర రసైర్దినమ్। మర్దయేచ్ఛోషయేత్సో యం రసత్రైలోక్యసుందరః । గుంజాద్వయంఘృతైర్లేహ్యం పైత్యోదరకులాంతకమ్। పలైకంచిత్రకంశ్లక్ష్ణంద్విగోమూత్ర శకృజ్జలైః । పాచ్యం పాదావశేషంచ ఘృతప్రస్థం విపాచ యేత్ । పలైకంచయవక్షారం క్షిప్త్వాపక్త్వావతారయేత్ । తత్కార్షికం పిబేచ్చాను స్నిగ్ధముష్ణంచ భోజయేత్॥

తా. శుద్ధిచేసిన రసము 1 భాగము శుద్ధిచేసిన గంధకము 2 భాగములు అభ్రభస్మము శుద్ధిజేసిన సైంధవలవణము శుద్ధిచేసిననాభి నల్లజీలకఱ్ఱ వాయువిడంగము తిప్పసత్తు అడ్డసరము లేక వస యవక్షారము యివిదినుసుకు ½ భాగము యిటుల

* వచా.

నెల్ల ఖల్వములోనునిచి వావిలియాకు రసముతో 1 దినము మాదీఫలరసముతో 1 దినము మర్దించి యెండించి 2 గురిగింజలయెత్తును నేతితో సేవించిన తోడనే 1 పలము చిత్రమూలమును సూక్ష్మముగ చూర్ణముచేసి 2 పలములు గోమూత్రము 2 పలములు గోమయరసముగలిపి 4 వ భాగముగ గాచి అందు ప్రస్థప్రమాణమును ఘృతము 1 పలము యవక్షారము గలిపి పాకముచేసి దించుకొని కర్ష ప్రమాణమును పానముచేసిన పైత్త్యోదరము హరించు. మఱియు స్నిగ్ధమై యుష్ణముగనుండు యన్నమును భుజింపవలయు.

## శ్లేష్మోదరమునకు వైశ్వానరీ వటుకములు.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధసూతం సమంగంధం మృతార్కాయశ్శిలాజతు। రసాయనం ప్రకర్తవ్యం రసస్యద్విగుణం విషమ్। త్రికటుశ్చిత్రకంకుష్ఠం నిర్గుండీముస లీరజ। అజమోదాం విషాంశేన ప్రత్యేకంచ ప్రకల్పయేత్। పంచాంగనింబక్వాథేన భావనాచైకవింశతిః। భృంగరాజరసైస్సప్త దత్వాక్షౌద్రేణాలోడయేత్। భక్షయేద్బదరీమాత్రాం వటికాంతాందివానిశి। శ్లేష్మోదరంనిహంత్యాశు నామ్నావైశ్వానరీవటీ। దేవదార్వగ్ని మూలస్య కల్కంక్షీరేణ పాయయేత్। భోజనం వ్యోషదుగ్ధేన కుళుత్థస్యరసేనవా॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన గంధకము తామ్రభస్మము లోహభస్మము శుద్ధిజేసిన శిలాజిత్తు యివి దినుసు కొక్కొక భాగము శుద్ధిచేసిననాభి త్రికటుకములు చిత్రమూలము చంగల్వకోష్టు వావిలి నేలతాటిగడ్డలు పసపు వోమము యివి దినుసు కొకటింటికి 2 భాగములు ఇటుల వీనినెల్ల ఖల్వములోనునిచి వేపచెక్క దానిపువ్వులు కాయలు ఆకులు వేళ్ళు అనువాని కషాయముతో 21 మార్లును గుంటగలగరాకు రసముతో 7 మార్లును భావనచెసి తేనెగలిపి కలియబెట్టి రేగుపండంతమాత్రలుచేసి యందొకదానిని దేవదారు చిత్రమూలము అనువానిలో పాలుబోసి కల్కముగ కాచి యీయనుపానముతోడ సాయం ప్రాతఃకాలములందు సేవింపుచుండిన శ్లేష్మోదరము హరించు. భోజనమునందు త్రికటుకయుక్తముగ కాచబడిన పాలను గాని వులవకట్టును గాని చేస్కొనవలయు.

## సన్నిపాతోదరమునకు బృహదగ్నిముఖచూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] సర్జక్షారం యవక్షారం భల్లాతం గజపిప్పలీమ్ । అజమోదావచాముస్తా దేవదారు విడంగకమ్। పాఠా దారునిశాహింగుధాత్రీ దాడిమపుష్కరమ్। వృద్ధదారు త్రివృచ్చించాయవాని జీరకద్వయమ్ । కర్పూరంనాగరంభార్గీ మరిచంచామ్లవేతసమ్ । మండూరమభయాశుంఠీ చాతుర్జాత కరంజకమ్ । ఆరగ్వధంతథా పంచలవణాని విచూర్ణయేత్ ।। శిగ్రుబ్రహ్మత్వచాక్షారం వారుణీపత్రచించికామ్। తిలకాండం కోకిలాక్షంక్షారం చైవాపామార్గజమ్ । తుల్యాంశం మాతులుంగామ్లైః ర్భావనాత్రయ భావితమ్ । ముస్తాక్వాథై స్త్రీధా భావ్యమార్ద్రకోత్థద్రవైస్త్రిధా । బృహదగ్నిముఖోనామ్నా కర్షైక ముదరాపహమ్ । గోమూత్రైర్వాసురాభిర్వా హ్యారనాళైరథాపివా । సన్నిపాతోదరంచైవ గుల్మంహంతి త్రిదోషజమ్ ॥

తా. సర్జక్షారము యవక్షారము శుద్ధిచేసిన జీడివిత్తులు యేనుగపిప్పళ్ళు అజామోదము వస తుంగముస్తెలు దేవదారు వాయువిడంగములు శిరుబొద్ది (మానిపసపు పసపు యింగువ వుసిరికవరుగు దాడిమబెరడు పుష్కరమూలము వృద్ధదారు (బొద్ధియాకు) తెగడ చింతచెక్కలక్షారము వోమము జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ కర్పూరము శొంతి గంటుభారంగి మిరియాలు పుల్లప్రబ్బలి చిట్టెపుపొడి కరక్కాయ శొంతిచాతుర్జాతకములు క్రానుగచెక్క రేలచెక్క పంచలవణములు కారుమునగక్షారము మోదుగచెక్కక్షారము అడవికలిగొట్టాకు క్షారము చించాక్షారము సువ్వులక్షారము గొలిమిడిక్షారము ఉత్తరేణుక్షారము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి మాదీఫలరసము తుంగముస్తెల కషాయము అల్లపురసము అనువానిలో ప్రతిదానిచే మూడేసి మార్లు భావనచేసి కర్షప్రమాణమును గోమూత్రముతో గాని సురతో గాని సేవించిన సన్నిపాతోదరము త్రిదోషజనితగుల్మము హరించు.

శ్లో॥ స్నుహీక్షీరేణ సంభిన్నం పిప్పలీచూర్ణ భక్షణమ్ ।
సప్తాహేశమనంయాతి చిరజాతం జలోదరమ్ ॥

తా. పిప్పలిచూర్ణమును బొంతజెముడుపాలతో దడిపి యెండించి 5 చిన్నములయెత్తును బియ్యపుకడుగుతో 7 దినములు సేవించిన చిరకాలముగనుండు జలోదరము హరించు.

## జలోదరమునకు వహ్నివీర్య రసము.

శ్లో॥ [నిత్యనాథీయే] చతుస్సూతంచ గంధోష్టౌ రజనీ త్రిఫలాశిలా ॥ ప్రత్యేకంచ ద్విభాగంస్యాత్తి వృన్నేపాలచిత్రకమ్ । ప్రత్యేకంచ త్రిభాగంస్యా త్త్ర్యూషణం జీరదంతికా । ప్రత్యేకమష్టభాగంస్యా దేకీ కృత్యా విచూర్ణయేత్ । జయంతీస్నుక్పయోభృంగీ వహ్ని వాతారితైలకైః । ఏకైకేన క్రమాద్భావ్యం సప్తవారంపృథక్పృథక్ । వహ్నివీర్య రసోనామ నిష్కముష్ణ జలైః పిబేత్ । విరేచనం భవేత్తేనతక్రభుక్తంససైంధవమ్ । దినాంతే దాపయేత్పథ్యం వర్జయే చ్ఛీతలం జలమ్ । సర్వోదరహరః ప్రోక్తోమూఢ వాతహరః పరః॥

తా. శుద్ధిజేసినరసము 4 భాగములు శుద్ధిచేసిన గంధకము 8 భాగములు పసపుత్రిఫలములు శుద్ధిచేసిన మణిశిల యివి దినుసుకు 2 భాగములు శుద్ధిచేసిన తెగడశుద్ధిచేసిన నేపాళములు చిత్రమూలము యివి దినుసుకు 3 భాగములు శొంఠి పిప్పలిమిరియాలు జీలకఱ్ఱ నేలదంతిచెక్క యివి దినుసుకు 8 భాగములు వీనినెల్ల దంచిచూర్ణముచేసి తక్కలి బొంతజెముడుపాలు గుంటగలగర చిత్రమూలము ఆముదము అనువానిరసములలో ప్రతిదానిచే నేడేసిమార్లుక్రమముగ భావనచేసి నిష్కప్రమాణమును వుష్ణోదకముతో సేవించిన విరేచనమై జలోదరముసర్వోదరములు మూఢవాతము హరించుపథ్యము 3 వఝామున మజ్జిగలో సైంధవలవణమును, గలిపి దీనితోడ యన్నమునుభుజింపవలయు. మఱియు నీ యౌషధసేవనకాలమున శీతోదకమును వర్జింపవలయు.

## ప్లీహోదరమునకు వంగేశ్వర రసము.

శ్లో॥ సూతభస్మంవంగభస్మం పలైకైకంప్రకల్పయేత్ । మృతంతామ్రం గంధకంచ ప్రత్యేకంచ పలంపలమ్ । అర్కక్షీరైర్దినం మర్ద్యం సర్వం తద్గోళకీకృతమ్ । రుద్ధ్వాథ భూధరేపాచ్యం

పుష్పైకేనసముద్ధరేత్ । ఏషవంగేశ్వరోనామప్లీహగుల్మోదర రంజయేత్ । ఘృతైర్గుంజా ద్వయంలేహ్యం నిష్కంశ్వేత పునర్నవామ్ । గవాంమూత్రైః పిబేచ్చాను రజనీంవా గవాంజలైః । పంచాంగందేవదారోస్తు చూర్ణంకర్షంశివాంబునా । మాషమాత్రం పిబేద్యస్తు ప్లీహస్తస్యకరోతికిమ్।

తా. రసభస్మము వంగభస్మము తామ్రభస్మము శుద్ధిజేసిన గంధకము వీనిని దినుసు కొక్కొక్కపలముచొప్పున ఖల్వములోనునిచి జిల్లేడుపాలలో 1 దినము మర్దించిముద్దచేసి మూకుళ్ళలోనునిచి క్రింద పైన చీలమన్ను లేపనముచేసి భూధరపుటం బిడి సాంగశీతలమునదీసి 2 గురిగింజలయెత్తు నేతితో సేవించిన తోడనే నిష్కప్రమాణము తెల్లగలిజేరువేరు చూర్ణమునుగాని లేక పసపుచూర్ణమునుగాని గోమూత్రములో గలిపి సేవించిన ప్లీహోదరము గుల్మము హరించు. లేక కర్ష ప్రమాణ దేవదారు * పంచాంగముల చూర్ణమును వుసిరికపండ్ల రసముతో గలిపి మాషప్రమాణముపై యౌషధమునుగలిపి సేవించిన ప్లీహోదరము హరించు.

## సర్వోదరములకు బ్రహ్మ వటుకములు.

శ్లో॥ [ఆయుర్వేదే] విడంగం దాడిమంకుష్ఠం † నింబత్వగ్దహనం వచా । త్ర్యూషంపాఠా దేవదారు నిశావ్యాఘ్రనఖాభయా। రేణుకం రోహిణీచైలా త్రివృత్పృత్యేకకార్షికమ్। నేపాళబీజ చూర్ణంచ దంతిమూలాపలంపలమ్ । బ్రహ్మదండీ రసప్రస్థం ప్రస్థమాజ్యం పురాతనమ్ । పూర్వకల్కయుతం పాచ్యం మృద్వగ్నౌచనుపాచితమ్ । భక్షయేద్బదరాకారాం నిత్యం బ్రహ్మవటీంశుభామ్ । చతుష్షష్ట్యుదరవ్యాధీ సాధ్యాసాధ్యాన్నిహంత్యలమ్॥

తా. వాయువిడంగములు దాడిమవరుగుచంగల్వకోష్ఠు వేపపట్ట చిత్రమూలము లేక శ్రీగంధము వస త్రికటుకములు శిరుబొద్ది దేవదారు పసపు ‡ వ్యాఘ్రనఖము

* పంచాంగములనగా—ఆకు వేరు విత్తులు పువ్వులు పట్ట అనునవియు.

† నింబత్వక్చందనంవచా.

‡ పులిగోరుగు.

కరక్కాయలు రేణుకలు కటుకరోహిణి యేలకులు తెగడవేరిని దినుసుకుకర్ష ప్రమాణముచొప్పున ఖల్వములోవునిచి చూర్ణముచేసి 1 పలముశుద్ధిజేసిన నేపాళచూర్ణము 1 పలము నేలదంతివేళ్ళచూర్ణమును 1 ప్రస్థము బ్రహ్మదండివేళ్లరసముతో నూరికల్కముచేసి పైచూర్ణముతోగలిపి 1 ప్రస్థము ప్రాతనెయ్యినిచేర్చి మృదవగ్నితో పక్వముగ వండి రేగుపండంత ప్రతిదినము సేవింపుచుండిన సాధ్యాసాధ్యోదరములు గుల్మము శూల విద్రధి మొదలగు 64 వుదరరోగములు హరించు.

## ఉదరములకు కదళీయోగము.

శ్లో॥ [మాధవనిదానే] గోదుగ్ధేకదళీపత్రం పిష్టమంతఃపుటంపచేత్ ।
తద్భస్మోదకపానేన సర్వోదరనాశనమ్॥

తా. అరటివరుగును ఆవుపాలతో తడిపి ముద్దగనూరి పుటంబిడిన భస్మంబగు ఆభస్మము నుదకములోగలిపి త్రాగిన సర్వోదరములు హరించు.

## ఆనాహరోగ నిదానము,

శ్లో॥ [ఆయుర్వేదే] ఆమంశకృద్వా నిచితంక్రమేణ భూయోవిబద్ధంవిగుణానిలేన । ప్రవర్తమానం నయథాస్వమేనం వికారమానాహముదాహరంతి । తస్మిన్భవంత్యామ సముద్భవేతు తృష్ణాప్రతిశ్యాయశిరోవిదాహః । ఆమాశయేశూలమథో గురుత్వం హృత్స్తంభ ఉద్గార విఘాతనంచ । స్తంభఃకటీపృష్ఠ పురీషమూత్రే శూలంచమూర్ఛా శకృతశ్చఛర్దిః । శ్వాసశ్చపక్వాశయ జేభవంతి తథాలసోక్తా నిచలక్షణాని॥

తా. దుష్టవాతమువలన ఆమముగాని లేక పురీషముగాని క్రమముగసంచితంబై పలుమారు బద్ధగింపబడినదై స్వమార్గమునందు బాగుగాబ్రవర్తింపకవికారమును గలుగంజేయుచుండునది ఆనాహమనంబడు. ఆమమువలన జనించిన ఆ యనాహామునందు దప్పి పడిశెము తలయందు తాపము ఆమాశయమునశూల జడత్వము బొమ్మడచుట తేనుపులువెడలకుండుట నడుము వీపు మలము మూత్రము స్తంభించుట శూల మూర్ఛగలుగుట మలమునుగక్కుట శ్వాసము యీ లక్షణంబులు గలుగు పక్వాశయమున జనించిన ఆనాహమునందు అలసరోగోక్త లక్షణంబులు గలుగు. అలసరోగలక్షణంబు లెవ్వియనిన—శ్లో॥ కుక్షిరా నహ్యతేత్యర్థం ప్రతామ్ త్పరికూజతి ।

నిరుద్ధో మారుతశ్చైవంకుక్షావుపరిధావతి। వాతవర్చోవినిరోధశ్చ యస్యాత్యర్థం భవేదపి । తస్యాలసకమాచష్టేతృష్ణోద్గారౌతుయస్యచ। అనగా మిక్కుటముగ ప్రకృలుస్తంభించుట ప్రజ్ఞావిహీనుడై భూమిపైబడి గొప్పధ్వనితో బొబ్బలిడుటవాతమునకధోముఖ వ్యాప్తిలేక నడ్డగింపబడుటవలన కుక్షిపైభాగము హృదయము కంఠము మొదలగు వానియందు వాతము సంచరించుట వాతము మలము బంధింపబడుట మిక్కుటముగ దప్పి తేనుపులుగలుగుట ఈ లక్షణములుగలది అలసక మనంబడునుట.

శ్లో॥ [చరకే] ఆనాహమత్యుగ్ర రుజంసశబ్దం కృత్వానిలోంత్రే ద్వయమార్గరోధాత్ । అపూపయుక్తో జఠరోయతీస్యా దానాహమూద్యాః పరిచక్షతేచ॥

తా. విరుద్ధములగు నన్నపానాది సేవనలవలన వాతము ప్రకోపించి ఊర్ధ్వాధోమార్గ ప్రతిబంధముగలదై ప్రేగులయందు శబ్దమును కడుభయంకరమైన నొప్పిగలుగంజేయుచు అపూపాకారముగ గడుపును నుబ్బునటులంజేయునదిఅనాహరోగమని పెద్దలు నచించెదరు.

ఉదావర్త నిదానము

శ్లో॥ [చికిత్సాసారసిద్ధసంగ్రహే] రూక్షైః కోద్రవముద్గ చూర్ణచణకైః క్రుద్ధోనిలోధస్సిరాః । రుధ్వావర్త్యమలంచ శోష్యకురుతే విణ్మూత్రసంగంతతః । గచ్ఛన్నూర్ధ్వముసౌ హిశూనమరుచిః కంటూహ్యుదావర్తకృత్ ॥

తా. రూక్షకరద్రవ్యములు కొఱ్ఱలు పెసలు జొన్నలు సెనగలుఅను వానిని మిక్కుటముగ భుజించుటవలన వాతము ప్రకోపించి అధోగతసిరలబంధించి మలమునూర్ధ్వముగజేసి యెండించి మలమూత్రములనడ్డగించి ఱొమ్ము వీపు కణతలు కొత్తికడుపు తల అనువానియందు నొప్పిని శ్వాసము తాపము జ్వరము శోఫ అరుచి కంఠములో నవ అనగా వోకరింతలు. (అనువాని గలుగంజేసి యూర్ధ్వముఖంబైవుదావర్తరోగమును గలుగంజేయు.) వుదావర్తమన—(మలమునోటినుండివెడలుట.)

శ్లో॥ [మతాంతరే] వాయుః కోష్ఠానుగోరూక్ష కషాయః కటుతిక్తకైః । భోజనైః కుపితస్సద్య ఉదావర్తంకరోతిచ । వాత

మూత్రపురీషాశ్రుకఫమేదోవహాని వై ః। స్రోతాంస్యుదావర్తయతీపురీషం చాతివర్తయేత్ । తతోహృద్వస్తి శూలార్తో హృల్లాసారతిపీడితః । వాతమూత్రపురీషాణికృచ్ఛ్రేణలభతే నరః । శ్వాసకాసప్రతిశ్యాయ దాహమోహతృషాజ్వరాన్। వమిహిక్కా శిరోరోగ మనశ్శ్రవణ విభ్రమాన్ । బహూనన్యాంశ్చలభతే వికారాన్వాతకోపజాన్॥

తా. రూక్ష వగరు కారము చేదుగలపదార్థముల భుజించుటవలన కోష్ఠగత వాతము ప్రకోపించి తత్క్షణమున వుదావర్తరోగమునుగలుగంజేయు, మఱియు వాతము మూత్రమల అశ్రు కఫ మేదస్సుల వహింపుచుండు స్రోతోమార్గములయందువ్యాపించి మలమును శోషింపంజేసి పూర్ధ్వముగ వెడలింపంజేయు దానివలన హృదయము పొత్తికడుపు అనువానియందు మిక్కుటముగ శూల వోకర అస్వాస్థ్యముగలిగి మలమూత్రవాతములు కడుకష్టముమీద వెడలుటయేగాక శ్వాసము దగ్గు పడిసెము తాపము మోహము దప్పి జ్వరము వాంతి యెక్కిళ్ళు శిరోరోగము మనస్సునకు భ్రాంతి మందముగ వినుట ఈమొదలగు పలువిధ వికారములు వాతప్రకోపమువలన గలుగు.

## ఉదావర్తా సాధ్య లక్షణము.

శ్లో॥ తృష్ణార్దితంపరిక్లిష్టం క్షీణంశూలైరుపద్రుతమ్ ।
శకృద్వమంతం మతిమానుదావర్తినముత్సృజేత్ ॥

తా. దప్పి క్లేశము క్షయము శూల అనువానివలన పీడితుడై మలమునువమనము సేయునట్టి వుదావర్తరోగిణి బుద్ధిమంతుడగు వైద్యుడు వర్జింపవలయు.

శ్లో॥ ఆనాహవదుదావర్త విధినాసముపాచరేత్ ।
ద్వయేహితంవిశేషేణ చూర్ణమగ్నిముఖంసదా॥

తా. ఆనాహచికిత్సలనే వుదావర్తమునందు సగాజేయందగుమఱియుఅనాహోదావర్తములయందు అగ్నిముఖచూర్ణము విశేషముగ హితకరంబు.

## అగ్నిముఖ చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] చిత్రకాతివిషాకుష్ఠ హింగుసౌవర్చలం వ

వా। మాగధీపౌష్కరంభార్గీయవానీవిశ్వభేషజమ్ । యవక్షా
ంవిడంగానిమరిచంగంధిశౌండికమ్ । ఏతానిసమభాగానిసర్వ
సల్యాహరీతకీ । ఏతదగ్నిముఖంనామ చూర్ణమాశు సుఖా
హమ్ । శుంఠ్యంబునాకోష్ణజలైః ప్రాతస్సేవ్యంఘృతేనవా।
నాన్యాదజీర్ణమానాహం జ్వరోచా వర్తకుండలీ । అర్శాంసి
గహణీగోపంప్లీహోధ్మానంచదారుణమ్ । హిక్కాంశ్వాసం
యేత్కాసందీపయేచ్చహుతాశనమ్ । వస్తిహృన్నాభికోష్ఠ
ంమహాంతందోషసంచయమ్ । నిర్హరేద్వివిధంచాన్నంభస్మీ
వతితత్క్షణాత్॥

చిత్రమూలము **అతివస** చంగల్వకోష్టు యింగువ సౌవర్చలవణము వస
ష్కరమూలము (**దీని** యభావంబున నేలములక వేళ్ళు) గంటుభారంగి
ంఠి యవక్షారము **వాయు**విడంగములు మిరియాలు మోడి గజపిప్పళ్లు వీనిని
లుగదంచి చూర్ణముజేసి దానికిసమముగ కరక్కాయల చూర్ణముగలిపి
హడలయెత్తును శొంఠి రసముతోగాని లేక వుష్ణోదకముతో గాని లేక ఆ
గాని ప్రాతఃకాలమున సేవించిన అజీర్ణము ఆనాహము పురాణజ్వరములు
ు వాతకుండలి అర్చస్సు గ్రహణి భయంకరమైన ప్లీహోదరము కడుపు
క్కిళ్ళు శ్వాసకాసములు పొత్తికడుపు ఱొమ్ము నాభి కోష్ఠము అనువా
ాత పిత్తశ్లేష్మ సంకలితములవలన జనించు రోగములు అగ్నిమాంద్యము
ంజేసి పలువిధాన్నముల భక్షించినను తత్క్షణమున భస్మం బగునటులంజే
అగ్ని ముఖచూర్ణమనంబడు దీని సేవనవలన కడుసుఖము గలుగు.

మూత్రపురీషాశ్రుకఫమేదోవహానివై ః । స్రోతాంస్యుదావర్త
యతీపురీషం చాతివర్తయేత్ । తతోహృద్వస్తి శూలార్తో
హృల్లాసారతిపీడితః । వాతమూత్రపురీషాణికృచ్ఛ్రేణలభతే
నరః । శ్వాసకాసప్రతిశ్యాయ దాహమోహతృషాజ్వరాన్।
వమిహిక్కా- శిరోరోగ మనశ్శ్రవణ విభ్రమాన్ । బహూ
నన్యాంశ్చలభతే వికారాన్వాతకోపజాన్॥

తా. రూక్ష వగరు కారము చేదుగలపదార్థముల భుజించుటవలన కోష్ఠగత వాతము ప్రకోపించి తత్క్షణమున వుదావర్తరోగమునుగలుగంజేయు, మఱియు వాత మమూత్రమల అశ్రు కఫ మేదస్సుల వహింపుచుండు స్రోతోమార్గములయందువ్యాపించి మలమును శోషింపంజేసి పూర్ధ్వముగ వెడలింపంజేయు దానివలన హృదయముహా త్తికడుపు అనువానియందు మిక్కుటముగ శూల వోకర అస్వాస్థ్యముగలిగి మలమూత్రవాతములు కడుకష్టముమీద వెడలుటయేగాక శ్వాసము దగ్గు పడిసెము తాపము మోహము దప్పి జ్వరము వాంతి యెక్కిళ్ళు శిరోరోగము మనస్సునకు భ్రాంతి మందముగ వినుట ఈమొదలగు పలువిధ వికారములు వాతప్రకోపమువలన గలుగు.

ఉదావర్తా సాధ్య లక్షణము.

శ్లో॥ తృష్ణార్దితంపరిక్లిష్టం క్షీణంశూలైరుపద్రుతమ్ ।
శకృద్వమంతం మతిమానుదావర్తినముత్సృజేత్॥

తా. దప్పి క్లేశము క్షయము శూల అనువానివలన పీడితుడై మలమునువమనము సేయునట్టి వుదావర్తరోగిణి బుద్ధిమంతుడగు వైద్యుడు వర్జింపవలయు.

శ్లో॥ ఆనాహావదురావర్త విధినాసముపాచరేత్ ।
ద్వయేహితంవిశేషేణ చూర్ణమగ్నిముఖంసదా॥

తా. ఆనాహచికిత్సలనే వుదావర్తమునందు సగాజేయందగుమఱియుఅనాహోదావర్తములయందు అగ్నిముఖచూర్ణము విశేషముగ హితకరంబు.

అగ్నిముఖ చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] చిత్రకాతివిషాకుష్ఠ హింగుసౌవర్చలం వ

చా। మాగధీపౌష్కరంభార్గీ యవానీవిశ్వభేషజమ్ । యవక్షారంవిడంగానిమరిచంగంధిశౌండికమ్ । ఏతానిసమభాగానిసర్వతుల్యాహరీతకీ । ఏతదగ్నిముఖంనామ చూర్ణమాశు సుఖావహమ్ । శుంఠ్యంబునాకోష్ణజలైః ప్రాతస్సేవ్యంఘృతేనవా। హన్యాదజీర్ణమానాహం జ్వరోదావర్తకుండలీ । అర్శాంసి గ్రహణీదోషంప్లీహోథ్మానంచదారుణమ్ । హిక్కాంశ్వాసం జయేత్కాసందీపయేచ్చహుతాశనమ్ । వస్తిహృన్నాభికోష్ఠ స్థంమహాంతందోషసంచయమ్ । నిర్హరేద్వివిధంచాన్నంభస్మీభవతితత్క్షణాత్॥

తా. చిత్రమూలము **అతివస** చంగల్వకోష్టు యింగువ సౌవర్చలవణము వస **పిప్పళ్ళు** పుష్కరమూలము (**దీని యభావంబున** నేలములక వేళ్ళు) గంటుభారంగి **ఆమము**-శొంఠి యవక్షారము **వాయు**విడంగములు మిరియాలు మోడి గజపిప్పళ్లు వీనిని సమభాగములుగదంచి చూర్ణముజేసి దానికిసమముగ కరక్కాయల చూర్ణముగలిపి 1 లేక 2 మాడలయెత్తును శొంఠి రసముతోగాని లేక వుష్ణోదకముతో గాని లేక ఆ **వు**నేతితోగాని ప్రాతఃకాలమున సేవించిన అజీర్ణము ఆనాహము పురాణజ్వరములు పుదావర్తము వాతకుండలి అర్శస్సు గ్రహణి భయంకరమైన ప్లీహోదరము కడుపుబ్బరముయెక్కిళ్ళు శ్వాసకాసములు పొత్తికడుపు ఱొమ్ము నాభి కోష్ఠము అనువానియందు వాత పిత్తశ్లేష్మ సంకలితములవలన జనించు రోగములు అగ్నిమాంద్యము వీనినిహరింపంజేసి పలువిధాన్నముల భక్షించినను తత్క్షణమున భస్మం బగునటులంజే**యు**. ఇది అగ్ని ముఖచూర్ణమనంబడు దీనిసేవనవలన కడుసుఖము గలుగు.

ఆనాహోదావర్తములకు యోగసార రసము.

శ్లో॥ [జాతుకర్ణే] సూతంగంధంవిషతామ్రంభస్మనేపాళతాళకమ్॥ క్షారత్రయంపటోలంచపంచకోలంసరామఠమ్ । శంఖచూర్ణం సమూలోద్యజంబీరామ్లేనమర్దయేత్ । లశునస్యకషాయేణాప్యథ జేనరసేనచ । తాంబూలవల్లీనిర్గుండీ మాతులుంగార్ద్రకద్రవైః । తతశ్చవటికామాష మాత్రాంకృత్వా ప్రయోజయేత్ ।సర్వగుల్మేషుశూలేషుశ్వాసకాసోదరేషుచ । ఆనాహే

చాన్యుదావర్తే సన్నిపాతేచదారుణే। యోగసార రసోహ్య
పజాతుకర్ణేన నిర్మితః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన నాభి తామ్రభస్మము శుద్ధిజేసిన నేపాళములు రేకులుగవొలిచి శుద్ధిజేసిన తాళకము యవక్షారము సర్జక్షారము టంకణక్షారము చేతిపొట్లపంచకోలములు యింగువ శంఖభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచినిమ్మపండ్లరసము వెల్లులిపాయల కషాయము గచ్చవిత్తులరసము తమలపాకురసమువావిలాకురసము మాదీఫలరసము అల్లపురసము అనువానితో బాగుగ మర్దించి మాషప్రమాణము మాత్రలుజేసి అనుపానవిశేషములతో సేవించిన సర్వగుల్మములు శూలలు శ్వాస కాసములు వుదరములు ఆనాహము వుదావర్తము దారుణమైన సన్నిపాతము నశించు. ప్రత్యేకము ఉడుకలిలో 3 బొట్లు వుమ్మెత్తాకురసము గలిపి త్రాగిన యిరువాయి కట్టకమూత్రము వెడలుటయేగాక రక్తమూత్రము సగా హరించు. ఈతవేళ్ళకషాయము గిద్దెడు కొమ్మన పిండివేళ్ళరసము తవ్వెడు ములుదోసవిత్తులుసోలెడు వీనినెల్ల నేకముజేసి సోలెడురసములో సస్యాని యెత్తుపంచదార 1 తులముజీలకఱ్ఱ 1 తులము యేలకులు మాడయెత్తు శుద్ధిచేసిన నేపాళవు గింజలు గ్రహించి యుద్రకముతోనూరి కలిపి సేరు రసమును త్రాగిన బంధింపబడిన మలమూత్రములు వెడలు.

శ్లో॥ ఉపదావర్తే సమభ్యజ్య స్విన్నగాత్ర ముపాచరేత్ ।
ఆనాహేచతథా కార్యం వస్త్యావర్తేశ్చకర్మణా ।

తా. ఉదావర్తము అనాహము అనువానియందు శరీరమునకు చమురుబట్టించి కాచి చెమటను స్రవింపచేయుటయేకాక వస్తికర్మంచేసి పిదపఆసనములో ఫేనవర్తినునిచి మలమును వెడలింప చేయవలయు.

శ్లో॥ [మతాంతరే] ఉద్గారస్యావరోధేతు స్నైహికం ధూమమాచరేత్ । ఛర్దినిగ్రహసం జాతే వమనం లంఘసంహితమ్। విరేచనంచాత్రమతం తైలేనాభ్యంజసంహితమ్ । వస్తిశుద్ధికరైస్స్నిగ్ధం చతుర్గుణ జలంపయః॥

తా. తేనుపుల నడ్డగించుటవలన జనించిన వుదావర్తమున స్నిగ్ధపదార్థము నగ్నియందువైచి దానిధూపమును పానము సేయవలయు. వాంతిని నడ్డగించుటచె జనించిన వుదావర్తమున వమనము లంఘనము విరేచనము తైలాభ్యంజనము అనువానిని నుపయోగించు

వతు స్థిద్ధి కరౌషధయుక్తముగ గాచబడిన కషాయములో 4 భాగములు పాలుగలిపి దానిసేవనను చేయించవలయు.

ఉదావర్తమునకు నారాచ చూర్ణము.

శ్లో॥ [చరకే] ఖండంపలం త్రివృత్తాక్షః కృష్ణాకర్ష ద్వయంచూర్ణ
మ్। ప్రాగ్భోజనస్యమధునా బిడాలపతకం నరోలిహ్యాత్ ।
ఏతద్గాఢపురీషేజ్ఞేయం విజ్ఞే రుదావర్తే।
మధురంనరపతి యోగ్యం చూర్ణం నారాచకంనామ ॥

తా. ఖండశర్కర 1 పలము శుద్ధిచేసిన తెగడ చూర్ణము అక్షుప్రమాణము పిప్పలిచూర్ణము 2 కర్షములు యిటుల వానినెల్ల నేకముచేసి భోజనాత్పూర్వము బిడాలపతకమును (అనగా 1 రూపాయయెత్తును) తేనెలో భక్షించిన మలబద్ధమును వుదావర్తమును హరించు, ఇవి మధురముగ నుండుటచే భూపతులకు యోగ్యంబు.

ఫల చూర్ణము.

శ్లో॥ ఫలంచ మూలంచ విరేచనోక్తం హింక్వర్కమూలం దశ
మూలమగ్ర్యమ్ । స్నుక్చిత్రకశ్చేతి పునర్నవాచ తుల్యాని
సర్వైర్లవణానిపంచ । స్నేహైస్సముద్రైస్సహజర్జరాణిసశం
ఖసంధౌ విపచేత్సులిప్తే। పక్వంసుపిష్టం లవనంతదన్నైః పా
నైస్తథానాహ రుజామయఘ్నమ్॥

తా. విరేచనకరములైన ఫలములు లేక వేళ్ళు యింగువ జిల్లేడువేరు దశమూలములు త్రిఫలములు జెముడు చిత్రమూలము గలిజేరుయివి సమభాగములు వీనికి సమము పంచలవణములు యిటుల వీనినెల్ల చూర్ణముచేసి శంఖమునందునించి దానిసందులకు వుప్పుపేలాలును నేతితోనూరి పూసి పుటంబిడి సాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి అన్నముతోడగాని లేక యుదకముతోగాని సేవించిన ఆనాహము హరించు.

తుంబురు చూర్ణము.

శ్లో॥ తుంబురుశ్చాభయాహింగు పౌష్కరం లవణత్రయమ్ ।
యువానీచయవక్షారం విడంగేనసమానిచ ।

త్రివృ(త్త్రి)గుణితంచూర్ణం పిబేదుష్ణేణవారిణా ।
ఆనాహముదరాణ్యష్టౌ నిష్బంథంచాపినాశయేత్ ॥

తా. ధనియాలు కరక్కాయ యింగువ పుష్కరమూలము సైంధవలవణము బిడాలవణము కాచలవణము వోమము యవక్షారము వాయువిడంగములు అనువానిని సమభాగములుగ చూర్ణముచేసి దానికి 3 భాగములు శుద్ధిచేసిన తెగడచూర్ణము గలిపి వుష్ణోదకములో సేవించిన ఆనాహము సర్వోదరములు మలబద్ధము నశించు.

భేదన వర్తి.

శ్లో॥ [అస్యశాస్త్రే] గోమూత్ర ఛర్ది ఫలరామరదంతికైశ్చ కంకుష్ఠసైంధవభిడైశ్చ గుడప్రగాఢైః । ఆగారధూప సహితైరితి వస్త్రలేపా ద్వర్తీ రుదే గ్రథిత విడ్వటికామయఘ్నః ॥

తా. మ్రంగపండు యింగువ నేలదంతిచెక్క కుంకుడుసండ్లు సైంధవలవణము బిడాలవణము బెల్లము కరుఘూపము వీనిని సమభాగములుగ గోమూత్రముతోనూరి కోకబట్టకుబట్టించి వర్తిచేసి ఆసనమునందునిచిన వుంటగట్టి వెడలకుండెడి మలము సుగా వెడలు.

శ్లో॥ త్రివృత్కృ(కృ)ష్ణా హరీతక్య స్త్రిచతుః పంచభాగతః ।
గుళికాగుదతుల్యాస్యా ద్విడ్బంధన గదాపహా॥

తా. తెగడ 3 భాగములు పిప్పళ్ళు 4 భాగములు కరక్కాయలు 5 భాగములు యిటుల వానినికలితోనూరి గుదద్వారమునకు దగినటులయుండుటచేసి ఆసనములో నునిచిన బంధింపబడియుండుమలము వెడలు.

విద్రధి నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] త్వగ్రక్తమాంస మేదాంసి ప్రతోష్యాస్థిసమాశ్రితాః । దోషాసోధంశవై ఘోరం జనయంత్యు(చ్ఛ్రి)తా భృశమ్। మహాశూలం రుజాపంతం వృత్తంవా ప్యథవాయతమ్। సవిద్రధిరితిఖ్యాతో విజ్ఞేయః షడ్విధశ్చసః। పృథగ్దోషైస్సమస్తైశ్చక్షతేనాప్య సృజాతథా । షణ్ణామపిహి తేషాంతు లక్షణం సంనిగద్యతే॥

తా. వాతాదిదోషములు కడుదుష్టంబులై అస్థుల నాశ్రయించి త్వక్ రక్త మాంస మేదస్సుల జెరచి వుత్పత్తియగునపుడే కడుశూల పీడతోగూడి అస్థిపర్యంతము వ్యాపించియుండు మూలముగలదై గుండ్రముగగాని లేక నిడుపుగగానుండు భయంకరమైన వాపును మెల్లమెల్లగ గలుగంజేయు నిదియ విద్రధి యనంబడు యిది వాత పిత్త శ్లేష్మ సన్నిపాత క్షత రక్తములన 6 విధంబులు యికవానిలక్షణంబుల వచించెద.

## వాతవిద్రధి లక్షణము.

శ్లో॥ కృష్ణోరుణోవా విషమో భృశమత్యర్థవేదనః ।
చిత్రోత్థాన ప్రపాకశ్చ విద్రధి ర్వాతసంభవః ॥

తా. నల్లగగాని యెఱ్ఱగగాని విషమమైన వొకానొకపుడు సన్నగ వొకానొకపుడు లావుగ నుండినదై కడువేదనాయుక్తమై జనించిన పలువిధములైన వుత్పత్తిపాకములతో గూడియుండునది వాతవిద్రధియని తెలియవలయు.

## పిత్తవిద్రధి లక్షణము.

శ్లో॥ [చరకే] పక్వోదుంబరసంకాశ శ్శ్యామోతిజ్వరదాహవాన్ ।
క్షిప్రోత్థానప్రపాకశ్చ విద్రధిః పిత్తసంభవః ॥

తా. పండిన అత్తిపండువలెగాని లేక నలుపువర్ణముగగాని నుండినదై జ్వరదాహములతోడంగూడి తీవ్రమైన వుత్పత్తిపాకములంగలది పిత్తవిద్రధీయని తెలియవలయు.

## శ్లేష్మవిద్రధి లక్షణము.

శ్లో॥ శరావసదృశః పాండు శ్శీతస్స్నిగ్ధోల్ప వేదనః ।
చిరోత్థానప్రపాకశ్చ విద్రధిః కఫసంభవః॥

తా. మూకుడుతో సమానమైన యాకారము పాండురవర్ణము శీతలము స్నిగ్ధత్వము అల్పవేదనగలదై సాపకాశముమీద వుత్పత్తి పాకములంజెందునది కఫవిద్రధియని తెలియవలయు.

## పండిన విద్రధియొక్క స్రావము.

శ్లో॥ తనుపీతసితాశ్చైషా మాస్రానాః క్రమశః స్మృతాః ॥

తా. పైజెప్పబడిన వాత పిత్తశ్లేష్మ విద్రధులు పండినయెడల వానియందు వాతాదిక్రమముగ సన్నగ పసపువర్ణముగ తెల్లగ స్రావము గల్గు.

## సన్నిపాతవిద్రధి లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] నానావర్ణరుజాస్రావో ఘంటాలో విషమో మహాన్ । విషమంపచ్యతేచాపి విద్రధిస్సాన్నిపాతికః॥

తా. పలువిధములైనపీడ స్రావముగలుగుట గంటవలె నుండుట చిన్నదిగ గాని విషమముగ (అనగా అసాధ్యముగ నుండుట) పెద్దదిగనుండుట విషమపాకమన (కొంతభాగము చిరకాలమునకు మఱికొంతభాగము తీవ్రముగ గంభీరముగ వుత్తానముగ పొడవుగ క్రిందుగ పండుట) ఈ లక్షణములుగలది సన్నిపాత విద్రధియని తెలియవలయు.

## అభిఘాతజవిద్రధి లక్షణము.

శ్లో॥ తైస్తైర్భావైరభిహతే క్షతేవాపథ్యకారిణః ।
క్షతోష్మావాయువిసృత స్సరక్తంపిత్తమీరయేత్ ।
జ్వర స్తృష్ణాచదాహశ్చ జాయంతే తస్యదేహినః ।
ఆగంతువిద్రధిర్జ్ఞేయః పిత్తవిద్రధిలక్షణః ॥

తా. కాష్ఠలోష్ట పాషాణాదికములవలన అభిఘాతము గాని లేక గాయము గాని గలిగియుండునపుడు అపథ్యము సేయుటవలన వాతము ప్రకోపించి తస్మూలంబునవృద్ధింజెందిన క్షతోష్మ రక్త సహితంబై పిత్తమును ప్రకోపింపంజేసి జ్వరము దప్పి తాపము అనువానిని గలుగంజేయును పిత్తవిద్రధి లక్షణయుక్తంబైయుండిన అభిఘాతజవిద్రధియని దెలియవలయు.

## రక్తవిద్రధి లక్షణము.

శ్లో॥ కృష్ణాస్ఫోటావృతశ్శ్యావ స్తీవ్ర దాహ రుజాకరః ।
పిత్తవిద్రధిలింగస్తు రక్తవిద్రధి రుచ్యతే॥

తా. నల్లనిస్ఫోటకములతో వ్యాప్తంబై శ్యామలవర్ణము తీవ్రమైన తాపము పోట్లు జ్వరముగలదై పిత్తవిద్రధి లక్షణయుక్తంబై యుండునదిరక్తవిద్రధి యనంబడు.

శ్లో॥ [ఆయుర్వేదే] పవనేన స్తనసిరా స్సంవృతాః ప్రాప్యయోషి

తామ్ । సూతానాంగర్భిణీనాంతుసంభవేచ్ఛ్వయథుర్ఘనః।
స్తనేస్త్రీయస్సదుగ్ధేవా బాహ్యావిద్రధిలక్షణః । నాడీనాం
సూక్ష్మవక్త్రిన్వాత్కన్యానాంనసజాయతే॥

తా. ప్రసవించిన స్త్రీలయొక్కగాని లేక గర్భిణీస్త్రీయొక్కగాని పాలతో గూడియుండు స్తనములయందు వాతము ప్రకోపించి సిరలంజెంది వానిముఖముల సంకుచితంబులుగ చేసి బాహ్యావిద్రధి లక్షణంబుగల కఠినమైనవాపును గలుగంజేయు. యిదియ స్తనవిద్రధి యనంబడు కన్యకలయొక్క స్తననాడీముఖములు సూక్ష్మంబులుగ నుండుట వలన వారలకీ స్తనవిద్రధిజనింపకుండు (యిది వాతాది విద్రధులయందే అంతర్భావమును జెందియుండు)

## అంతర్విద్రధి లక్షణము.

శ్లో॥ పృథక్సంభూయవాదోషాః కుపితాగుల్మరూపిణమ్ ।
వల్మీకవత్సమున్నద్ధ మంతః కుర్వంతివిద్రధిమ్॥

తా. శరీరమధ్యమున వాతాదిదోషములు ప్రత్యేకములుగగాని లేక వొకటిగ జేరిగాని ప్రకోపించి గుల్మరూపంబై పుట్టవలె పెరిగి విద్రధినిగలుగంజేయు. ఇదియు అంతర్విద్రధి యనబడు.

## విద్రధి స్థానములు.

శ్లో॥ [మాధవనిదానే] గుదేవస్తిముఖేనాభ్యాంకుక్షౌవంక్షణయోస్తథా। వృక్కయోఃప్లీహ్ని యకృతిహృదయేక్లోమ్నిచాప్యథ । ఏషాముక్తానిలింగాని బాహ్యవిద్రధిలక్షణైః । గుదేవాతనిరోధస్తువస్తౌకృచ్ఛ్రాల్పమూత్రతా । నాభ్యాంహిక్కాతథాటోపఃకుక్షౌమారుతకోపనమ్। కటీపృష్ఠగ్రహస్తీవ్రోవంక్షణోత్థేచ విద్రధౌ । వృక్కయోః పార్శ్వసంకోచ।ప్లీహ్న్యుచ్ఛ్వాసావరోధనమ్ । సర్వాంగప్రగ్రహస్తీవ్రోహృదికంపశ్చజాయతే । శ్వాసోయకృతిహిక్కాచ క్లోమ్ని పేపీయతేపయః ॥

తా. గుదము మూత్రద్వారము బొడ్డుకుక్షి అండసంధులు కుక్షిపిండము ప్లీహము యకృత్తు హృదయము క్లోమము (పిపాసాస్థానము) అనునీస్థలములయందు విద్రధి

జనించి బాహ్యవిద్రధి లక్షణ యుక్తంబైయుండు విద్రధి గుదమధ్యమున జనించిన వాతమునకు ప్రతిబంధముగలుగు పొత్తికడుపు మధ్యమున జనించిన కష్టము మీద కొంచకొంచముగ మూత్రము వెడలును నాభి మధ్యమున జనించిన యెక్కిళ్ళురజా పూర్వకమైన క్షోభగలుగుట ప్రక్కలయందు జనించిన వాతము ప్రకోపించుగజ్జలమ ధ్యమున జనించిన నడుము వీపు యివి బలముగనీడ్చును కుక్షిపిండ మధ్యమున జనిం చిన పార్శ్వములయందీడుపుగలుగు ప్లీహస్థానమున జనించిన యెగయూపిరి నడ్డ గింపంబడుహృదయమునజనించిన సర్వాంగముల నీడుపు కంపనము గలుగు యకృత్తు మధ్యమున జనించిన శ్వాసము యెక్కిళ్ళుగలుగు క్లోమస్థానమునందు జనించిన పలు మారు వుదకపానమునందిచ్ఛగలుగు.

## విద్రధిస్రావ నిర్గమనము.

శ్లో॥ నాభేరుపరిజాఃపక్వాయాం తూర్ధ్వమిత రేత్వధః ।
అధస్స్రుతేషుజీవేత్తు స్రుతేషూర్ధ్వం నజీవతి॥

తా. నాభికిపైనజనించిన విద్రధి పండినయెడల ముఖమువలన నాస్రావము గలుగు (నాభికిక్రిందుగ జనించిన విద్రధియందు గుదద్వారమువలన స్రావముగలుగు నాభియందు జనించిన విద్రధియం దిరుమార్గములుగ స్రావముగలుగు) విద్రధియంద ధోభాగమువలన స్రావముంగలరోగి జీవించుననియు పూర్ధ్వభాగమువలన స్రావము గలరోగి మృతిజెందునని తెలియవలయు.

## విద్రధిసాధ్యా. సాధ్యములు.

శ్లో॥ హృన్నాభివస్తివర్జ్యంయే తేషు భిన్నేషుబాహ్యతః। జీవేత్క దాచిత్పురుషో నేత రేషుకథంచన । సాధ్యావిద్రధయఃపంచ వివర్జ్యస్సాన్నిపాతికః । ఆమపక్వవిదగ్ధత్వాం తేషాంశోథవదా గిశేత్ ॥

తా. ట్రొమ్ము నాభి పొత్తికడుపు అనునీస్థానములయందు గాకతక్కినస్థాన ముల (అనగా ప్లీహము క్లోమము మొదలగుస్థానముల) విద్రధిజనించి వెలుపలపగిలి నయెడల ఒకానొకపుడు రోగిజీవించు. హృన్నాభివస్తువులయందైనయెడల రోగి మృతిజెందు మఱియు పైజెప్పబడిన 5 విద్రధులు సాధ్యంబులు సన్నిపాతవిద్రధి అ సాధ్యంబు. వానిలో ఆమ పక్వ విదగ్ధావస్థలు 3 ను వాపువంటివని దెలియవలయు.

### అసాధ్యవిద్రధి లక్షణము.

శ్లో॥ ఆధ్మాతంబద్ధనిష్యందం ఛర్దిహిక్కాతృషాన్వితమ్ । రుజాశ్వాసనసమాయుక్తం విద్రధిర్నాశయేన్నరమ్॥

తా. విద్రధియందు కడుపుబ్బరము మూత్రప్రతిబంధము వాంతి ఎక్కిళ్లు దప్పిపోట్లు శ్వాసము అనునవి గలిగిన రోగి మృతిజెందునని తెలియవలయు.

శ్లో॥ [చికిత్సాసార సిద్ధసంగ్రహే]కోష్ఠేబహిర్వాపిహిత రుక్శోఫోవిద్రధిరుచ్యతే।విద్రధిర్హంతిహిధ్మావాన్ శ్వాసవాన్నాభి దేశతః॥

తా. కోష్ఠమునకు లోనగాని లేక వెలుపలగాని కడుపునొప్పి వాపుగలిగిన విద్రధియనబడు. దీనియందు ఎక్కిళ్లు శ్వాసము నాభిలోనుండి జనించిన రోగి మృతిజెందు.

### విద్రధిసామాన్య చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] గుదేవాత నిరోధంతు వస్త్యాకృచ్ఛ్రాల్ప మూత్రతామ్ । కురుతే విద్రధిఃపుంసాం తస్యాదౌ రక్తమోక్షణమ్॥

తా. మదము వస్తి అనుస్థలముల పురుషునికి జనించిన విద్రధియందు వాతప్రతిబంధము అల్పమూత్రత్వము క్రమముగ గలుగుదానియందు తొలుత రక్తస్రావమును జేయింపవలయు.

### వాతవిద్రధి చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] క్వాథేవరుణవల్కస్య పిబేద్వా సైంధవం తథా । శిలాజతుసమంహింగు మసాధ్యం విద్రధింజయేత్॥

తా. సైంధవలవణము శిలాజిత్తుభస్మము ఇంగువ వీనిని సమభాగములుగను చికొని ఉలిమిడివేళ్ళ కషాయముతో సేవించిన అసాధ్యవిద్రధులు హరించు.

శ్లో॥ క్వాథంశిగ్రో ర్వచాయాశ్చ హింగుసైంధవచూర్ణకైః। సంయుక్తంపాయయేచ్చాంత్యైఃవిద్రధిరోగపీడితమ్॥

తా. ఇంగువ సైంధవలవణము వీనిని సమభాగములుగ చూర్ణముజేసిమునగచెక్కవస అనువాని కషాయములోగలిపి సేవించిన విద్రధిహరించు.

## చిత్రకాది లేహ్యము.

శ్లో॥ [ఆయుర్వేదే] చిత్రమూలస్యద్వక్పంచాష్టక ధస్వయాసవా
పాఠాచ। ఉగ్రాపునర్నవాద్వయ శిగ్రుత్వగ్బలా భూపీలు
నిర్గుండ్య। చవ్యారూషేంద్ర యవఖదిరసారకింశుకత్రిఫలా।
ద్వీకరంజం త్రివృద్దంతిపుష్కరకణామూఃసహచరై రండాః।
పృథక్పలాన్యేషాం స ప్తదశమూలకస్య పృథగ్ద్విపలంచ। ప
ర్వమిదం ద్వాదశద్రోణేజలేచ పాచయేద్విధినా। అష్టాంశేవ
శేషి తైతస్మిన్నవ వస్త్రపరిస్రుతం భవతి। క్వాథేతథావైర్వి
శత పలంగుడంచ నిక్షిపేత్సమ్యక్। క్షౌద్రామృతాకుమారీతప
స్వినీ మధుహుతభుక్పథ్యాచ। ఆర్ద్రికరజనీ పునర్నవాగో
మయరసంచ మిశ్రయేత్తత్ర। గవాంమూత్రంసర్పిస్తైలంచ
పృథక్పృథక్ప్రస్థంచాదాయ। అభయానాంచసహస్రం గో
మూత్రస్విన్నం జర్ఝరితంలోడ్యశనైర్భ్యాయః। ఏతద్దార్వ్యాస
లోడ్యవిపచేదవతార్యహింగుశుంఠి మరీచకణానామ్। పృథ
క్త్రిఫలానాంచూర్ణ మయోరజసష్టట్పలానితత్రావపేత్।
శీతేతతోమధునఃప్రస్థచతుష్కంతథాన్యేనిధాపయేత్పటుమ్।
ఏతత్ప్రాంకాయనేనకథితోయంశబలగ్రంహంశేహయోత్రాప్తితః।
ఏతద్గుల్మోదరంచనిహన్యాద్ద్వివిధానిదారుణాని। శూలా
న్యష్ఠీలానాహ క్షయవిషమజ్వర తృడ్విద్రధీంశ్చాపి॥

తా. చిత్రమూలపుపట్ట 5 అఘకషులు శేగటిదూల అడ్డసరము శిరుబొద్ది వెల్లుల్లి తెల్లగలిజేరు ఎఱ్ఱగలిజేరు మునగపట్ట ముత్తవపులగము ముచ్చతుమికి వావిలిచవ్యను నల్లజీడి కొడిసెపాల కొచుములుమోదుగ త్రిఫలములు కానుగచెక్క నెలులిచెక్క తెగడ నేలదంతి పుష్కరమూలము (దీనియభావంబున ఆముదపువేళ్లు) మోడి గోరింట ఆముదపువేళ్లు ఇది దినుసుకు 7 పలములు దశమూలములు (అనగామారేడు గుమ్ముడు తక్కలి కలిగొట్టు కోలపొన్న నేలములక నక్కపొన్న పెద్దములక పల్లేగు)ఇవి దినుసుకు 2 పలములు యిటులవానినెల్లదంచి 12 [illegible] కముబోసి 8

వ భాగముగ కషాయముకాచి క్రొత్తవస్త్రములో వడియగట్టి అందు 200 పలముల బెల్లము నేతిబీర తిప్పతీగె కలుబంద తపసివేరు యిప్పపువ్వు చిత్రమూలము కరక్కాయలు అల్లము పసపు గలిజేరు అనువానిచూర్ణము గోమయరసము గోమూత్రము నెయ్యి తెల్లఆవనూనె యివి దినుసుకు 4 సేరులు గలిపి పిచప 1000 కరక్కాయలను విత్తులను దీసి గోమూత్రములో నానబెట్టి యెండించి పైదానిలో బాగుగగలిపి గరిటెకాడతో గలియబెట్టుచు పాకముజేసి దించునపుడు యింగువ శొంఠి మిరియాలు పిప్పళ్ళు అనువాని చూర్ణమును దినుసుకు 3 పలములు పుక్కపొడి 6 పలములుగలిపి సాంగశీతలమున 4 ప్రస్థములు తేనెబోసి ధాన్యరాశియందు దొక పక్షంబునిచి ప్రాతఃకాలమున 1 రూపాయి యెత్తును సేవించిన గుల్మము దారుణమైన పలువిధశూలలు అష్ఠీలము క్షయము విషముజ్వరమునప్పి విద్రధి హరించు. ఇది కాంకాయనునివలన జెప్పంబడియె.

శ్లో॥ విద్రధౌ వ్రణవత్సర్వం కర్మకుర్యాద్భిషగ్వరః॥

తా. విద్రధిరోగమును వ్రణమువలెనే చికిత్సంపవలయు.

రక్తవిద్రధియందుపచారము.

శ్లో॥ [మాధవనిదానే] రక్తాధికస్థితౌవస్థాంప్యంపి త్తవిద్రధిపత్క్రియా ।
న్యగ్రోధస్యత్వచశ్చైవ మంజిష్ఠాయాః కషాయకమ్ ।
ఆరగ్వధకషాయేణ నిశావహ్నీ నికుంభకమ్ ।
పిష్ట్వాఖాదేజ్జయేత్తేన విద్రధించరజోధికమ్॥

తా. పాత్తికదుపునందు జనించు రక్తవిద్రధియందు పిత్తవిద్రధి చికిత్సంజేయవలయు. మఱ్ఱిపట్ట మంజిష్ఠి అననీ 2 ను సమభాగములుగ దంచి కషాయముకాచి త్రాగినను లేక పసపు చిత్రమూలము పెద్దనూనుచెక్క అనువానిని రేలచెక్క కషాయములోనూరి త్రాగినను రక్తవిద్రధి హరించు.

పిత్తవిద్రధియందుపచారములు.

శ్లో॥ కటుకంవత్సకోశీర భూనింబాతివిషాకణా ।
ముస్తాచందన దార్వ్యశ్చ భూనింబోశీరవత్సకమ్।
పద్మాకురాలభాశుంఠీ వత్సకత్వగ్నిపాచితమ్ ।
రక్తపిత్తాతిసారఘ్నం పిత్తవిద్రధినాశనమ్ ॥

తా. కటుకరోహిణి కొడిసెపాల వట్టివేరు అతివస నేలవేము పిప్పళ్ళు వీనిని సమభాగములుగ దంచి కషాయము కాచి త్రాగినను లేక తుంగముస్తెలు శ్రీగంధము మాని పసపు నేలవేము వట్టివేరు కొడిసెపాల పద్మకాష్ఠము సురదంగొండి శొంఠి కొడిసెచెక్క వీనిని సమభాగములుగా దంచి కషాయము కాచి త్రాగినను రక్తపిత్తాతిసారములు పిత్తవిద్రధి హరించు.

## శ్లేష్మవిద్రధికి త్రివృతాది తైలము.

శ్లో॥ [మాధవనిదానే] త్రివృతాప్యగ్ని సిందూరందంతి బిల్వాకుళుత్థకమ్ ॥ కర్షాంశంప్రస్థగోమూత్రే తిలతైలచతుష్పలమ్। పాచ్యాంతైలావశేషంతుకఫజే లేపనంహితమ్ ॥

తా. శుద్ధిజేసిన తెల్లతెగడ చిత్రమూలము వావిలి నేలదంతి మారేడు వులవలు యివి దినుసుకొక్కకకర్షము గోమూత్రము 1 ప్రస్థము నువ్వులనూనె 4 పలములు యిటుల వీనినెల్ల నేకముజేసి తైలము శేషించువరకు కాచి విద్రధులయందు లేపనముజేసిన శ్లేష్మవిద్రధి హరించు.

## ఇరిమేదాది ఘృతము.

శ్లో॥ అంజలిశ్చారిమేదత్వ క్సాధ్యాన్యష్టగుణేంభసి । కుడవంతత్రవైధాత్రీస్వరసఃక్షీరకంఘృతమ్ । కర్షాంశంకల్కంతంతిక్తాత్రాయంతీధన్వయాసకః । ముస్తాచామలకీచైవ జీవంతీచందనోత్పలమ్ । పచేదేకత్రసంయోజ్య ఘృతంపాయయేద్యజ్ఞయేత్ । విద్రధించగుల్మంచ దాహమోహజ్వరంతథా । తృష్ణామూర్ఛాఛర్దిహృద్రోగాన్ పిత్తరక్తంససకామలమ్ ॥

తా. అంజలిప్రమాణము నల్లతుమ్మచెక్కను దంచి 8 అంజలిప్రమాణము నీళ్ళలోవైచి కషాయముగాచి అందు వుసిరికెపండ్లరసము ఆవుపాలు ఆవునెయ్యి అనువానిని దినుసుకొక్కక కుడవమును చేదుబీర కలుకొని నువేరు నేలవేము తుంగముస్తెలు పుసిరికెపప్పు మనుబాల శ్రీగంధము కలువగడ్డలు అనువాని కల్కమును దినుసుకొక్కక కర్షప్రమాణమును గలిపి చిక్కగ (అనగా ఘృతపక్వముగ) వండి సేవించిన శ్లేష్మవిద్రధి గుల్మము చకారమువలన విసర్పి తాపము మోహము జ్వరము దప్పి మూర్ఛ వాంతి హృద్రోగము పిత్తరక్తము కామిల హరించు.

## ఉదరరోగములయందు పథ్యము.

శ్లో॥ [మాధవదానినే] కులుత్థావాస్తు బృహతీ ద్వీపటోలం పునర్నవా । పక్వకూష్మాండకతక మిశిహింగుజీరకమ్ । గవ్యం తక్రంపృశ్నికాళీ ముండీనారంగబిల్వకమ్ । ప్లీహాష్ఠీలోదరానాహగుల్మ విద్రధిమిత్రకమ్॥

తా. వులవకట్టు తోటకూర లేక చక్రవరికూర ములకకాయపొట్లకాయచేదుపొట్ల గలిజేరుకూర ముదిరిన గుమ్మడుకాయ ఉండుపుకాయ సదాప యింగువ జీలకఱ్ఱ ఆవుచల్ల కోలపొన్న బోడతరము నారంజిపండు మారేడుపండు యివి ప్లీహము అష్ఠీలము వుదరము ఆనాహము గుల్మము విద్రధి అనువానియందు పథ్యకరంబులు.

## ఉదరరోగములయం దపథ్యము.

శ్లో॥ నింబధాన్యానినిష్పావశాలూరంపిష్టవైకృతమ్ ।
తథాపిణ్యాలపిణ్యాకమాంసం మధురసంభవమ్ ।
అలాబూదధిచామ్లానికలుషాణిగురూణిచ ॥
ప్లీహాష్ఠీలోదరానాహగుల్మవిద్రధిశత్రవః ॥

తా. వేపపండు కొత్తిమెర్లు అనుములు కలువగడ్డలు పిండివంటకము * చారకండ తెలకపిండి మాంసము మధురజనిత మద్యవిశేషములు అనుగపుకాయ పెరుగు పులుసు కల్మషద్రవ్యములు గురుకర ద్రవ్యములు యివి ప్లీహము అష్ఠీలము వుదరము ఆనాహము గుల్మము విద్రధి అనువానియం దపథ్యకరంబులు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కౌరాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరో భూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
ఉదర ఆనాహ ఉదావర్త విద్రధిరోగ నిదాన
తత్సాధ్యాసాధ్య చికిత్సానుపాన పథ్యాపథ్య
లక్షణయుక్తం ఏకాదశ ప్రకరణమ్.

---

* యిదే పెండలమను చెప్పంబడు.

# శ్రీరస్తు.

# బసవరాజీయము.

## ఆంధ్రతాత్పర్యము.

## — ద్వాదశప్రకరణము. —

శ్లో॥ నీలకంఠంమహాదేవం తారకంకరుణార్ణవమ్ ।
దేవేశంభక్తమందార మష్టమూర్తిమహంభజే ॥

తా. మహాదేవుడు సంసారతారకుడు కరుణారసపరిపూర్ణుడు సర్వదేవతలకు ప్రభువు భక్తులకోర్కెనీడేర్చువాడు అష్టమూర్తి స్వరూపుడునగు నీలకంఠుని నేను భజింపుచున్నాడను.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహంవైద్య శిఖామణిమ్॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని పేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథముయొక్క ద్వాదశ ప్రకరణమును వచింపుచున్నాడను.

### తృష్ణా నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] భయశ్రమాభ్యాం బలసంక్షయాద్వాప్యూ
ర్ధ్వంచితం పిత్తవివర్ధనైశ్చ। పిత్తంసవాతం కుపితంనరాణాం
తాలుప్రపన్నంజనయేత్పిపాసా[illegible]॥

తా. భయము శ్రమ గాలి[illegible]ము పిత్తమును ప్రకోపింపజేసెడి [illegible]షము వుపవాసము మొదలగువానివలన స్వస్థానమున జేరియుండు పిత్తవాతములు ప్రకోపించి పూర్ధ్వగతంబులై లోదౌడను (అనగా పిపాసస్థానమును) జెంది దప్పిని గలుగంజేయు.

తృష్ణాసామాన్య లక్షణము.

శ్లో॥ జిహ్వాబహిర్గమనకర్కశకంఠజిహ్వా కాంతి ప్రలాప ముఖశోషజలాభిలాషా । ద్వేష్యాశనేంద్రియ మనస్స్వరహానితంద్రా సామాన్య లక్షణమిదంకథితంతృషోన్యాః॥

తా. నాలుక బైలువెడలుట కంఠము నాలుక బిరుసుగనుండుట కాంతిచెడుట ప్రలాపించుట నోరెండుట పీరుద్రాగుటయం దిచ్ఛగలుగుట అన్నద్వేషము గలుగుట పంచేంద్రియములు సత్వహీనంబులుగ నుండుట మనస్సు కంఠస్వరము చెడుట తంద్రగలుగుట యివియ తృష్ణారోగ సామాన్య లక్షణంబులు.

వాతజతృష్ణా లక్షణము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] క్షామాస్యతామారుత సంభవాయాంతోదస్తథా శంఖశిరస్సుచాపి । స్రోతోనిరోధో విరసంచవక్త్రం శీతాభిరద్భిశ్చ వివృద్ధిమేతి॥

తా. ముఖమెండిడీనుడగుట కణత మస్తకము అనువానియందు సూదులతో బొడుచునటుల పీడగలుగుట రసవాహినీనాడులు ఫురక వాహినీనాడులు అడ్డగింపంబడుట ముఖము విరసంబగుట శీతోదకమునుద్రాగిన దప్పి వృద్ధిం జెందుట చకారమువలన నిగురబట్టకుండుట ఈ లక్షణములుగలది వాతజతృష్ణయని తెలియవలయు.

పిత్తజతృష్ణా లక్షణము.

శ్లో॥ మూర్ఛాన్నవిద్వేషవిలాపదాహార క్తేక్షణత్వంప్రపతశ్చశోషః । శీతాభిలాషోముఖతిక్తతాచపిత్తాత్మికాయాంపరిదూయనంచ ॥

కఫజతృష్ణా లక్షణము.

తా. మూర్ఛ అన్నద్వేషము తలుచుమాటలు తాపము నేత్రములయందెరుపు వర్ణము కడుశోష శీతపదార్థములయం దిచ్ఛగలుగుట ముఖముచేదువేసుటసంతాపము గలుగుట యీ లక్షణములుగలది పిత్తజతృష్ణయని తెలియవలయు.

శ్లో॥ [మాధవనిదానే] బాష్పావరోధాత్కఫసం వృతేగ్నౌ తృష్ణాబలాసేన భవేత్తథాతు । నిద్రాగురుత్వం మధురాస్యతాచ తృష్ణార్థితశ్శుష్యతి చాతిమాత్రమ్॥

తా. స్వకారణమువలన బ్రకోపించిన కఫము జాఠరాగ్ని నాచ్ఛాదించుటచే దాని వేడిమి నడ్డగింపబడినదై అథోముఖంబై వుదకమును వహింపుచుండు స్రోతస్సుల శోషింపంజేసి కఫజ తృష్ణను గలుగంజేయు. దానియందు నిద్ర జడత్వముగలిగి నోరు తీపుగనుండుట. ఈ తృష్ణవలన పీడింపంబడినవాడు కడుశోషంబొందు.

## క్షతజతృష్ణా లక్షణము.

శ్లో॥ క్షతస్యరుక్శోణిత నిర్గమాభ్యాంతృష్ణాచతుర్థీక్షతజామతాతు।

తా. శస్త్రాదికములవలన క్షతముగలవానికి పీడ రక్తస్రావము గలుగు. వానివలన క్షతజ తృష్ణ జనించు. ఇది 4 ర నుండు. (క్షతమన... గాయము.)

## క్షయజతృష్ణా లక్షణము.

శ్లో॥ రసక్షయా ద్యాక్షయసంభవాసా తయాభిభూతస్తు నిపాది శేషు। పేపీయతేం భస్సుఖం నయాతి తాంసన్ని పాతాదితి కేచిదాహుః । తసక్షయోక్తానిచ లక్షణాని తస్యామ శేషేణ భిషగ్వ్య వస్యేత్ ॥

తా. రసక్షయమువలన జనించునది క్షయజ తృష్ణయనంబడు. దానివలన పీడితుడుగ నుండువాడు రేయుంబగలు పలుమారు నీరు ద్రాగినను తృప్తిబొందకుండు. ఇది సన్నిపాత జనితంబని-కొందరు వచించెదరు. దీనియందు రసక్షయమున జెప్పంబడియుండు లక్షణంబులన్నియు గలుగునని వైద్యుడు దెలిసికొనందగు. (రసక్షయమున హృదయమునందు పీడ మబ్బు శోష చెవుడు చీములు శరీరముపై బారునటులుండుటదప్పి అను నుపద్రవంబులు గలుగునని సుశ్రుతమునందు జెప్పంబడియున్నది.)

## ఆమజతృష్ణా లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] త్రిదోషలింగామ సముద్భవాతు హృచ్ఛూలనిష్ఠీవన సాదకర్త్రీ॥

తా. త్రిదోషలక్షణంబులు హృదయమున శూలగలుగుట జొల్లుగారుట బడలికగనుండుట ఈ లక్షణముగలది ఆమజ (అనగా అజీర్ణ) తృష్ణయని దెలియవలయు.

## అన్నజతృష్ణా లక్షణము

శ్లో॥ స్నిగ్ధంతథామ్లంలవణంతుభుక్తంగుర్వన్నమేవాశుతృషంకరోతి।

తా. స్నిగ్ధము పులుసు వుప్పు జడము లేక మూత్రాధికముగల యన్నమును భుజించుటవలన శీఘ్రముగ జనించునది అన్నజ తృష్ణయనంబడు.

ఉపసర్గజతృష్ణా లక్షణము.

శ్లో॥ [మాధవీయే] దినస్వరః ప్రతాంయందీనాననశుష్కహృదయగళతాలుః। భవతిఖలుసోప సర్గాత్తృష్ణా సాశోషిణీకష్టా। జ్వరమోహ క్షయ కాసశ్వాసాద్యు పసృష్ట దేహానామ్ ॥

తా. తృష్ణయొక్క యుపద్రవమువలన హీనస్వరము మోహము మనఃక్లాంతముగలుగుట ముఖమువాడుట హృదయము గొంతు దవడలు యెండుట ఈ లక్షణములుగలది వుపసర్గజ తృష్ణయని దెలియవలయు మఱియు శరీరము కృశించి జ్వరము మోహము క్షయము దగ్గు శ్వాసము ఆదిశబ్దమువలన అతిసారము మొదలగు నుపద్రవములతో గూడియుండు తృష్ణారోగము కష్టసాధ్యంబు.

అసాధ్యతృష్ణా లక్షణము.

శ్లో॥ సర్వాస్త్వతి ప్రసక్తారోగ కృశానాంవమి. ప్రసక్తానామ్ । ఘోరోపద్రవయుక్తా స్తృష్ణా మరణాయవిజ్ఞేయా ॥

తా. వాతజాది సర్వతృష్ణారోగములు మిక్కుటముగ వృద్ధిం జెందినను లేక తృష్ణారోగమువలన శరీరము కృశించినను లేక వాంతివలన దప్పిగలిగినను యిట్టి భయంకరమైన యుపద్రవములతో గూడియుండు తృష్ణారోగి మృతి జెందునని దెలియవలయు.

దా హ ని దా న ము.

మద్యజన్య దాహ లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] త్వచంప్రాప్తస్సపానోష్మా పిత్తరక్తాభిమూర్ఛితః। దాహంప్రకురుతే ఘోరంపిత్తవత్తత్రభేషజమ్॥

తా. మద్యపానమువలన పిత్తము ప్రకోపించి దానియొక్క యూష్మము పిత్తరక్తమువలన వృద్ధిజెంది చర్మగతంబై భయంకరమైన దాహమును గలుగంజేయు. దానియందు పిత్తశమన కరౌషధముల సేవింపందగు.

## రక్తజ పిత్తజదాహ లక్షణములు.

శ్లో॥ కృత్స్నదేహానుగం రక్త ముద్రిక్తం దహతి ధ్రువమ్ ।
సముష్యతే తృష్యతే చ తామ్రాభ స్తామ్రలోచనః ।
లోహగంధాంగ వదనో వహ్ని నేవావకీర్యతే ।
పిత్తజ్వరసమః పిత్తాత్సచాప్యస్యవిధిః స్మృతః ॥

తా. సర్వదేహమునందుండు రక్తము ప్రకోపించి కడుదాహమును గలుగం జేసిన రక్తజదాహ మనంబడు. దానియందు రోగికి అగ్నివద్ద కూర్చుండియుండు నట్టుల తాపము దప్పి శరీర నేత్రములయందు దెలుపువర్ణము శరీరము నోరు అమవాసియం దినుముతో తుల్యమైన వాసన శరీరముపై నిప్పును జల్లినట్టుల వేదనగలుగు. మఱియు పిత్తాధిక్యమువలన దాహము జనించు దానియందు పిత్తజ్వర చికిత్సం జేయవలయు.

## తృష్ణానిరోధజ దాహ లక్షణము.

శ్లో॥ [సిందూర మణిదదర్పణే] తృష్ణానిరోధాదబ్ధాతౌ క్షీణే తేజస్స ముద్ధతమ్ సదాహ్యోభ్యంతరం దేహం ప్రదహేన్మందచేతసః ।
సంశుష్క గళతాల్వోష్ఠో జిహ్వాంనిష్కృష్య వేపతే ॥

తా. దప్పి నడ్డగించుటవలన వుదకరూపమైన ధాతువు క్షయించి దానివలన పిత్తోష్ణము వృద్ధిజెంది శరీరమునకు లోపల వెలపల దాహమును గలుగంజేయు. దానంజేసి రోగి జ్ఞాన శూన్యుండగుటయేగాక గొంతులో దౌడ పెదవి అనువాని యందు శోషగలవాడై నాలుకను బైటికిదీసి కదలింపుచుండు.

## శస్త్రఘాతజ దాహ లక్షణము.

శ్లో॥ అసృజాపూర్ణకోష్ఠస్య దాహోన్యస్స్యాత్ తుదున్సహః ॥

తా. శస్త్రప్రహారమువలన రక్తము కోష్ఠమున (అనగా హృదయాదులయందు) నిండి దాహమును గలుగంజేయు. ఇదియు శస్త్రజన్యదాహమనంబడు. ఇది కడు అసాధ్యము.

## ధాతుక్షయ జన్యదాహ లక్షణము.

శ్లో॥ ధాతుక్షయోత్థో యోదాహస్తేన మూర్ఛాతృషాన్వితః ।
క్షామస్వరః క్రియాహీనస్స సీదేద్భృశనిపీడితః ॥

తా. రసాది ధాతువులు క్షయించుటవలన దాహము జనించు. దానియందు మూర్ఛ దప్పి స్వరభంగము నిశ్చేష్టత కడుపీడగలవాడై మృతిజెందు.

క్షతజదాహ లక్షణము.

శ్లో॥ క్షతజోఽన్నశ్నతశ్చాన్య శ్శోచతోవాప్యనేకధా ॥
తేనాంతర్దహ్యతేత్యర్థం తృష్ణామూర్ఛా ప్రలాపవాన్ ॥

తా. క్షతమువలన జనించిన దాహములో అన్నద్వేషము గలుగు. లేక పలు విధములుగ దుఃఖించుటవలన వెలపట మిక్కుటముగ దాహము జనించు. దానియందు దప్పి మూర్ఛ తలుచుమాటలు గలుగు.

మర్మాభిఘాతజ దాహ లక్షణము.

శ్లో॥ మర్మాభిఘాతజోప్యస్తి సోఽసాధ్యస్సప్త మోమతః ।
సర్వఏపచ వర్జ్యాస్స్యు శ్శీతగాత్రస్య దేహినః ॥

తా. మర్మముపై దెబ్బదగులుటవలన దాహము జనించు ఇది అసాధ్యము ఈ దాహము 7 వ సంఖ్యగలదిగ నుండు. సర్వదాహములయం దెవని శరీరము వెలపట చల్లగనుండెడినో అట్టివానియొక్క సర్వదాహముల వర్జింపవలయును.

తృష్ణకు పునర్నవాది కల్పము.

శ్లో॥ [చికిత్సాసారసిద్ధ సంగ్రహే] పునర్నహ్యపామార్గమూల
కంజీరకద్వయమ్ । తక్రపిష్టంపిబేచ్చాపిముఖశోష ప్రశాం
తయే ॥

తా. గలిజేరువేరు వుత్తరేణివేరు జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ వీనిని సమభాగములుగ మజ్జిగలోనూరి త్రాగిన దప్పి హరించు.

తృష్ణకు పర్పటీ వటుకములు.

శ్లో॥ [మాధవనిదానే] పర్పటీమాగధీ మూలం పిచుమందార్ద్రిక
ద్రవైః । మర్దయిత్వావటీకార్యాముఖశోష ప్రశాంతయే ॥

తా. పర్పాటకము మోడి వీనినింసమభాగములుగ గ్రహించి వేపచెక్క అల్లము అనువాని రసములతోనూరి మాత్రలుజేసి సేవించిన దప్పిహరించు.

## తృష్ణకు ఖర్జూరాది కషాయము.

శ్లో॥ [ఆయుర్వేదే] * ఖర్జూరయష్టి కాశ్మీరమృద్వీకాపద్మకేసరమ్
ధాత్రీపరూషంవ్యాఘ్రీ†బలా ద్వయంచసుచందనమ్ ।
మధూకపుష్పకాశ్మర్యంతోయైశ్చైవచతుర్గుణైః ।
పక్వంపర్యుషితంరాత్రౌస్థితాభాండేనవేద్యధే ।
లాజామూర్ణ ప్రతీవాపం శర్కరామధుసంయుతమ్ ।
తృష్ణాదాహహరంపానేజాతీపుష్పాధివాసితమ్ ।
మూర్ఛాదాహ భ్రమంహంతి దీప్తంగృహమివాంబునా॥

తా. ఖర్జూరపండు యష్టిమధుకము కుంకుమపువ్వు ద్రాక్షపండు తామరయి గురులు పుసిరికెపప్పు పెద్దయీత పెద్దములక చిన్నములక ముత్తవపులగము పెద్దముత్తవపులగము శ్రీగంధము యిప్ప పువ్వు గుమ్ముడు వీనిని సమభాగములుగ నంచి 4 గింతలు నీళ్ళుబోసి 4 వ భాగముగ కషాయముకాచి వడియగట్టి కొత్తకుండలోనునిచి అందుపేలపుసత్తు పంచదార తేనెగలిపి జాజిపూవులువైచి 1 రాత్రియునిచి సేవించిన'' అగ్నిచే దహింపంబడుచుండు గృహ ముదకమువలన శాంతిజెందు చందంబున ''దప్పి తాపము మూర్ఛ భ్రమ అనునవి శాంతిజెందు.

## తృష్ణకు వాలుకాది లేహ్యము.

శ్లో॥ ద్వాత్రింశత్తాపలైస్తోయైః పలైకంవాలు కంపచేత్ ।
పాదశేషంవస్త్రపూతం లాజాసక్తుసితామధు ।
యుక్తంలేహ్యం నిహంత్యాశు దాహతృష్ణామదాత్యయాన్ ।

తా. 32 పలముల యుదకములో 1 పలము కూతురుబుడమనువైచి 6 వభాగముగ కషాయముగాచి వడియగట్టి అందుపేలపుసత్తు పంచదార తేనెగలిపి లేహ్యపక్వముగ వండి సేవించిన తాపము దప్పి మదాత్యయరోగము శీఘ్రముగ హరించు.

## దాహమునకు సైంధవకల్పము

శ్లో॥ నిష్కైకంసైంధవం చూర్ణం సురాపల చతుష్టయమ్ ।
పిబేత్సద్య శ్శమంయాతి మద్యపానోత్థదాహకమ్॥

---

* ఖర్జూరీశరమృద్వీజం పద్మకం పద్మ సరమ్ † యష్టిక.

తా. నిష్క ప్రమాణము సైంధవలవణము 4 పలముల కల్లులోగలపి సేవించి నమద్యపానమువలన జనించిన తాపము తత్క్షణమున హరించు.

తృష్ణకు దధిమస్తు కల్పము

శ్లో॥ దధిమస్తుగుడంక్షౌద్రం మద్యంచైనామ్లకాంజికైః ।
నష్ఫ్రుత్రైత్లి క్షుభి స్తృష్ణాం ప్రాతఃపానాత్త్ర్యహాజ్జయేత్ ।

తా. పెరుగుమీది మీగడ బెల్లము తేనె మద్యము పులిసినకలి నెయ్యి పేలపు సత్తు వీనిని ప్రాతఃకాలమున సేవించిన 3 దినములలో దప్పి హరించు.

యవసక్తు కల్పము.

శ్లో॥ యవబీజోత్థసక్తూనాం సస్సైంధవసువర్చలమ్ ।
సజీరకంజలంపీతం పానాత్యయ హరంపరమ్॥

తా. యవల పేలపుసత్తు సైంధవలవణము సౌవర్చలవణము జీలకఱ్ఱ వీనిని సమ భాగములుగ నుదకముతో నూరి ద్రాగిన మద్యపానమువలన జనించిన దాహము హరించు.

వాతతృష్ణకు బదర్యాది కల్పము.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] కోలదాడిమవృక్షామ్ల మాతులుంగ ద్రవం పృథక్ । పక్త్వైకంహాపుష్పాశుంఠీ యవానీజీరకస్సనుమ్।
స్తోకంక్షిప్త్వాపిబేచ్ఛామ్లే వాతతృష్ణాత్యయంహరేత్ ॥

తా. రేగుపండు దాడిమపండు చింత మాదీఫలము అనువానియొక్క రసము ను దినుసుకొక్కొక పలముచొప్పున గ్రహించి అందు బోడతరము శొంఠి వోమము జీలకఱ్ఱ అనువానిచూర్ణమును దినుసుకు ½ పలముచొప్పునగలిపి సేవించిన వాతతృష్ణ హరించు.

పైత్యతృష్ణకు సితాది కల్పము.

శ్లో॥ సితాదాడిమఖర్జూర ద్రాక్షాచవ్యపరూషకమ్ ।
ప్రతిచూర్ణంతుకర్షైకం పలమాత్రంతు సక్తుకమ్ ।
ఉదకంమదిరాన్వైన ప్రతియోజ్యం పలత్రయమ్।
పిత్తతృష్ణాత్యయంచాశు పిబేచ్ఛాంతి మవాప్నుయాత్ ॥

తా. పంచదార దాడిమపండు ఖర్జూరపండు ద్రాక్షపండు చెవ్యము చిట్టింతపడు అనువానిని దినుసుకు కర్ష ప్రమాణముచొప్పున దంచి చూర్ణముజేసి 1 గలము పేలవుసత్తుగలిపి అందు నీళ్ళుకల్లు మూడుమూడు పలములుగలిపి సేవించిన పిత్తజతృష్ణశీఘ్రముగ హరించు.

## శ్లేష్మజతృష్ణకు శారిబాది కషాయము.

శ్లో॥ శారిబాధాన్యకంద్రాక్షా వాలుకం చందనంసమమ్ ।
సర్వతుల్యంథ వేల్లాజా స్సర్వాంతతోయైశ్చతర్గుణైః ।
పాదశేషంపచేత్పీతం ససితంశ్లేష్మ జాంజయేత్ ॥

తా. మనుబాల కొత్తిమెర్లు ద్రాక్షపండు కూతురుబుడము శ్రీగంథము వీనిని సమభాగములుగదంచిచూర్ణముజేసి దీనికి సమముగ పేలవుసత్తుగలిపి యీయన్ని ద్రవ్యములకు 4 యింతతులు నీళ్ళుబోసి చతుర్థాంశముగ కషాయముకాచి పంచదారగలిపి ద్రాగినశ్లేష్మజతృష్ణ హరించు.

## తృష్ణకు చందనాది కల్పము.

శ్లో॥ [ఆయుర్వేదే] చందనంశారిబాద్రాక్షా ముస్తాబదరకంసమమ్ ।
సర్వతుల్యాస్తథాలాజా ద్విరష్టగుణితైర్జలైః ।
అష్టావశేషకంపాచ్యం సితాక్షౌద్రయుతంపిబేత్ ।
ఛర్దింతృష్ణాం నిహంత్యాశు క్షౌద్రైర్వామక్షీకామలమ్ ।
అత్యంతమద్యపానేన తంహరేద్దాహమేవహి ।
తృష్ణాభ్రాంతింక్లమంశోషం తథాపానాత్యయంహరేత్ ॥

తా. శ్రీగంథము గూడపాల ద్రాక్షపండు తుంగముస్తెలు రేగుపండు యివి దినుసుకొక్కొక్కభాగము పేలాలు 5 భాగములు ఉదకము 160 భాగములు. యిటుల వాని నెల్ల నేకముజేసి 8 వ భాగముగ కషాయముకాచి వడియగట్టి పంచదారగాని లేక తేనెగాని గలిపి ద్రాగిన వాంతి దప్పి హరించు మైనము తేనె గలిపి ద్రాగిన కడుమధ్యపానమువలన జనించినతాపము దప్పి భ్రాంతి శ్రమ శోష పానాత్యయ రోగము హరించు.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] ధాన్యకంజీరకంకేశీహ్యుశీరంచందనంఘనమ్ ।
శీతకర్పూరకంకుష్ఠం మధుకంచ మృణాలకమ్ ।

పంచత్వక్పల్లవాః పంచధాత్రీ ఫలవటాదికమ్ ।
ఇదంస్యాదనుపానేన దాహశాంతికరంపరమ్ ॥

తా. కొత్తిమెర్లు జీలకర్ర వరువేరు శ్రీగంధము వట్టివేరు తుంగముస్తెలు పచ్చ కర్పూరము చంగల్వకోష్ఠు అతిమధురము తామరతూండ్లు * పంచత్వక్కులు ‡ పంచపల్లవములు వుసిరికెపండు వటాదులు అనువానియొక్క యీయనుపానమువలన దాహముశమించి.

తామ్రాదిక రసము.

శ్లో॥ తామ్రం చాశికయా బద్ధ సూతంతాళం సతుత్థకమ్ ।
వటాంకురరసైర్మర్ద్యం తృష్ణాద్వల్లమాత్రతః ॥

తా. తామ్రభస్మము శుద్ధిచేసిన రసము శుద్ధిజేసిన తాళకము శుద్ధిజేసిన మైలుతుత్థము వీనిని మఱ్ఱిచిగుళ్ళరసముతో మర్దించి బిళ్ళచేసి యెండించి పుటంబెట్టి వల్లప్రమాణమును సేవించిన దప్పి హరించు.

రసాదిచూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] రసంంధకకర్పూరైశ్శైలోశిరమరీచకైః ।
నసిద్ధైః క్రమవృద్ధైశ్చ సూక్ష్మం కృత్వాత్వహర్ముఖే ।
త్రిగుంజా ప్రమితంఖాదేత్పర్యుషితాంబుచ ।
భృశంతృష్ణాంనిహంత్యేవ మశ్విభ్యాంచ ప్రకాశితమ్ ॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము 2 భాగములు పచ్చకర్పూరము 3 భాగములు శుద్ధిజేసిన శిలాజిత్తు 4 భాగములు వట్టివేరు 5 భాగములు మిరియాలు 6 భాగములు పంచదార 7 భాగములు యిటుల వీనిని ఖల్వములోనునిచి మెత్తగానూరి 3 గురిగింజలయెత్తును ప్రాతఃకాలమున సేవించి వెంబడిగ 1 రాత్రి యుంచబడిన నీరును త్రాగిన అత్యంతమైన దప్పి హరించు ఇది అశ్వినీ దేవతలచే ప్రకటింపబడియె.

---

* పంచత్వక్కులన—మఱ్ఱి-రావి-అత్తి-జువ్వి-మామిడి-అనువాని వట్టలు.
‡ పంచపల్లవములన మామిడి నేరేడు వెలగ మాదీఫలము మారేడు అనువాని చిగుళ్ళు.

## తృష్ణాహర యోగము.

శ్లో॥ రోగోపసర్గజాత 'యాం ధాన్యాంబుససితంమధు ।
వటప్రరోహాయష్ట్యాహ్వా కణామధుకృతావటీ ।
ముఖస్థాచిర కాలోత్థాం తృష్ణాంహన్యాత్సుదుస్తరామ్ ॥

తా. రోగమువలన దప్పిగలిగిన ధనియాలనీళ్లలో తేనె పంచదారగలిపిత్రాగవలయు. లేక మఱ్ఱిచిగుళ్లనుగాని లేక లేత మఱ్ఱియూడలు అతిమధురము పిప్పళ్లు అనువానినిగాని నూరి యుంటజేసి పుక్కిలియందునిచికొని దాని రసమును మ్రింగుచుండిన చిరకాలముగ జనించి యసాధ్యముగనుండు దప్పి హరించు.

## క్షౌద్రాది గండూషము.

శ్లో॥ సక్షౌద్రమామ్రజంబూత్థం పిబేత్క్వాథంసుపానితమ్ ।
సతృష్ణోమధునాకుర్యాద్గండూషాన్ సలిలాశ్రితమ్ ॥

తా. మామిడి నేరేడు అనువానిని సమభాగములుగ దంచి కషాయముకాచి తేనెవైచి చల్లార్చి త్రాగినను లేక తేనెతో నీళ్లుగలిపి పుక్కిలించి యుమిసినను దప్పి శమించు.

## దాహమునకు చంద్రకళారసము.

శ్లో॥ [నిత్యనాథీయే] గగనదరదయుక్తం శుద్ధసూతంచ గంధం
ప్రహరమధుసుపిష్టం వల్లయుగ్మం నరోద్యాత్ । జ్వరహర
గదసింహో శృంగచేరోదకేన ప్రథమజనిత దాహం తక్ర
భుక్తంచ భోజ్యమ్ ॥

తా. అభ్రకభస్మము శుద్ధిజేసిన యింగిలీకము శుద్ధిజేసిన రసము శుద్ధిజేసినగంధకము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి తేనెతో 1 ఝాము మర్దించి 2 వల్లముల యెత్తును అల్లపురసానుపానముతో సేవించిన వాతప్రకోపమువలన గలిగిన దాహము జ్వరము శమించు పథ్యము. మజ్జిగయన్నమును భుజింపవలయు. ఇది గద సింహారసమనియు జెప్పంబడు.

## రసాది ఘుటికలు.

శ్లో॥ రసబలిఘనసార చందనానాం ననలదసేవ్యపయోద జీవనా

నామ్ । అపహరతిఘుటిముఖస్థితేయం సకలసముత్థిత దాహ
మాశ్రయేత్తామ్ ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము పచ్చకర్పూరము చందనము జటామాంసి వట్టివేరు తుంగముస్తెలు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి నేతిలో గలిపి యుంటలుజేసి నోటియం దునిచికొనిన త్రిదోషమువలన జనించిన దాహము హరించు. కావున నీరసాది ఘుటికలను యెల్లప్పుడు నోటియం దునిచికొనవలయు.

## మృతసంజీవనీ ఘుటికలు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] మధుయష్టిలవంగంచ శిలాజతుత్రుటిస్తథా।
సహస్రభావనాకార్యా నవతండులవారిణా । యామమాత్రం
దృఢంమర్ద్యవటీకోల సమాస్మృతా । కృష్ణకార్పాసనీరేణ
తృష్ణాదాహజ్వరాన్జయేత్ । మూర్ఛాద్యముగ్రరోగంచ
వాతంపిత్తంచ నాశయేత్ । మృతసంజీవనీప్రోక్తా పూజ్య
పాదైరుదీరితా ॥

తా. అతిమధురము లవంగములు శుద్ధిజేసిన శిలాజిత్తు యేలకులు అనువానిని సమభాగములుగ చూర్ణముజేసి క్రొత్తబియ్యపు కడుగుతో 1000 మార్లు భావనజేసి పిదప 1 ఝాము బాగుగమర్దించి రేగుపండంత మాత్రలుజేసి యుంచొక దానిని నల్లప్రత్తియాకురసానుపానముతో సేవించిన దప్పి దాహము జ్వరము మూర్ఛ మొదలగు భయంకర రోగములు వాతజపిత్తజరోగములు నశించు. ఇది పూజ్యపాదునిచే జెప్పంబడియె.

## ఖర్జూరాది చూర్ణము.

శ్లో॥ ఖర్జూరామలబీజాని పిప్పలీచశిలాజతు ।
ఏలామధుకపాషాణ చందనోర్వారుబీజకమ్ ।
ధాన్యకంశర్కరాయుక్తం పాతవ్యంయష్టివారిణా ।
అంగదాహం లింగదాహం గుదజంక్షీణశుక్రజమ్ ।
కర్కరాశ్మరిశూలఘ్నం వృష్యంబలకరంపరమ్ ।
నాశయేన్మూత్రరోగాంశ్చ తథాశుక్రభవానపి ॥

తా. కర్జూరము వుసిరికెవరుగు పిప్పళ్ళు శుద్ధిజేసిన శిలాజిత్తు యేలకులు అతి మధురము కొండపిండివేరు చందనము దోసవిత్తులు కొలిమెర్లు పంచదార వీనిని సమ భాగములుగ చూర్ణముచేసి అతిమధుర కషాయానుపానముతోడ త్రాగిన శరీరము మేహము గుదము అనువానియిందలి తాపము శుక్రక్షయమువలన జనించిన శోషము శర్కరాశ్మరిరోగముల మూత్రరోగము శుక్లదోషమువలన జనించిన రోగము వీనిని హరింపంజేసి వీర్యవృద్ధిని బలమును గలుగంజేయు.

## పిత్తజదాహమునకు చికిత్స.

శ్లో॥ పిత్తజ్వరహరై స్సర్వైః పిత్తదాహేవిధర్మతః॥

తా. పిత్తజదాహమునందు సంపూర్ణముగ పిత్తజ్వర నాశనకర చికిత్సలంజేయవలయు. (అత్తిపాలను పంచదారలోగలిపి భక్షించినదాహముహరించు.)

## చందనాది చూర్ణము.

శ్లో॥ [భైరవకల్పే] చందనోశీరకుష్ఠాబ్ద ధాత్రీచోరక ముత్పలమ్।
మధుకం మధుపుష్పంచ ద్రాక్షాఖర్జూరకంతథా। చూర్ణం
కృత్వాసమసీతం ప్రాతశ్శీతాంబునాపిబేత్। రక్తపిత్తంతథా
శ్వాసంపైత్యంగుల్మంసముద్ధరేత్। అంగదాహంశిరోదాహం
శిరోవిభ్రమమేవచ। కామలాంచ ప్రమేహాంశ్చ పైత్యజ్వర
వినాశనం। చన్దనాద్యమిదంచూర్ణం పూజ్యపాదేనభాషితమ్।

తా. చందనము వట్టివేరు చెంగల్వకోష్టు తుంగముస్తెలు వుసిరికెవరుగు కచోరములు కలువగడ్డలు అతిమధురము యిప్పపువ్వు ద్రాక్షపండు ఖర్జూరము వీనిని సమ భాగములుగ చూర్ణముచేసి దీనికి సమముగ పంచదార గలిపి ప్రాతఃకాలమున నొక రాత్రి యుంచబడిన యుదకముతోడ త్రాగిన రక్తపిత్తము శ్వాసము పిత్తగుల్మము అంగతాపము శిరోదాహము తలదిరుగుట కామిల ప్రమేహము పిత్తజ్వరము హరించు ఇది పూజ్యపాదునిచే జెప్పంబడియె.

## పునర్నవాది తైలము,

శ్లో॥ [పూజ్యపాదీయే] శ్వేతంపునర్నవామూలం పలశత మితం
శుభమ్। కృష్ణాజ్యదుగ్ధమధ్యేచ పేషయేద్గాఢ కేభిషక్।

తత్సమంఖిల్లతైలంచపృథగ్ద్వి వ్యాణియోజయేత్ । ధూపం షోడశభాగంచమరీచాష్టవరాళకమ్ । కచోరోశీరకం శ్వేతం కృష్ణోశీర స్తథైవచ । మంజిష్ఠంరంగచూర్ణంచ శ్రీగంధంరక్త చందనమ్ । కృష్ణాగరుంచరు ద్రాక్షాన్పలమేకం ప్రయోజ యేత్ । తచ్చూర్ణం తైలమధ్యేచ నిక్షిప్త్వాచయేత్సుధీః మేహారికాష్ఠయుక్తేన పాచయేత్కోమలాగ్నినా । సుపక్వం తైలముద్ధృత్య రాత్రావంగంచ మర్దయేత్ । అంగశూలం చాంగదాహ న్నేత్రరోగాన్సపీనసాన్ । పాండుకామలము ష్ణాని సూతికా సన్నిపాతజిత్ । కరదాహ న్పాదదాహ స్తంద్రాంకటిసమీరజాన్ । క్షయకుష్ఠాంశ్చ కండూంశ్చగ జకర్ణాదికంతథా । శిరోరోగా న్భ్రమాన్పిత్తం నేత్రాణాం దృష్టిగోచరమ్ ః తద్వైవాప్యృతతుల్యంచ జ్వరాణాం జీర్ణినా మపి। అస్థిగంతుజ్వరం చైవమేహజ్వర ప్రశాంతయే।సర్వాంగే మర్దనంచైవ మంగళస్నానమాచరేత్ । శివోదితమిదంతైల మశ్విభ్యాం గోచరీకృతమ్ । సర్వరోగహరంచైవ దుర్లభం భిషజాంభువి । సాధయేద్గురుసుఖేనైవ సిద్ధిర్భవతినాన్యథా॥

తా. 400 రూపాయల యెత్తు తెల్లగలిజేరువేరుకు 250 రూపాయల యెత్తు నల్లావు నెయ్యి నల్లావుపాలు అనువానితోనూరి అందు నువ్వులనూనె 406 రూపాయల యెత్తు కరుధూపము 16 రూపాయలయెత్తు మిరియాలు లవంగపుచెక్క 8 భాగములు కచోరములు వట్టివేరు కురువేరు మంజిష్టి కొచు చందనము రక్తచందనము కృష్ణాగరు రుద్రాక్ష అను వాని జూర్ణమును ఒకుసు కొకటింటికి 4 రూపాయలయెత్తు చొప్పు నగలిపి మేహారికాష్ఠములతో మందాగ్నితో తైలపక్వముగ కాచిదించుకొని రాత్రుల సర్వాంగమునందు మర్దనముజేసికొని మంగళస్నానము జేసిన అంగశూల అంగతాపము నేత్రరోగములు పడిసెము పాండురోగము కామిల శరీరమునందలి యుష్ణము బాలింత రోగము సన్నిపాతము చేతులు కాళ్ళు మంటుట తంద్ర కటివాతము క్షయ కు కుష్ఠ ముదురద . జకర్ణము మస్తకరోగము భ్రమ పిత్తము నేత్రరోగము దృష్టిరోగము జీర్ణ జ్వరము అస్థిగతజ్వరము మేహజ్వరము వీనిని హరింపం జేయును. ఈ తైలము పూర్వమున

ఈశ్వరునిచే జెప్పంబడియె. దానిని అశ్వినీదేవతలు ప్రసిద్ధపరచిరి. మఱియు నీతైలము సర్వరోగముల హరింపంజేయు. ఇది భూమియందుండు వైద్యులకు లభించుట దుర్లభము. ఈతైలమును గురుముఖముగ నెఱింగిన ఔషధ సిద్ధి గలుగు. తద్విపరీతంబున సిద్ధి గలుగ నేరదు.

శ్లో॥ సర్వాంగే చందనాలేపశ్చంద్ర కస్తూరికాయుతః ।
సితనీరజలేపో వాధారాగార నివేశనమ్॥

తా. పచ్చకర్పూరము కస్తూరి అనువానితో గూడియుండు శ్రీగంధమును పూసికొనినను లేక తెల్లదామర పుష్పధరించినను లేక జలయంత్రములుగల గృహమున నివసింపుచుండినను తాపముహరించు.

## తృష్ణారోగములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] భ్రష్టముద్గైర్మసూరైర్వాచణకైర్వా
కృతోరసః। రంభాపుష్పంతక్రకూర్చందాక్షాపర్పటవాల
కమ్। కపిత్థంమాలికాకోలం కూశ్మాండకముపోదికా। ఖర్జూ
రందాడిమంధాత్రీకర్కటీ లలదంబుచ।। జంబీరంకరమర్దశ్చ
బీజపూరోగవాంపయః। మధూకపుష్పం హ్రీబేరంతిక్తానిమ
ధురాణిచ। బాలతాళాంబుశీతాంబుపయః పేయంప్రపాన
కమ్। పూతికంసరసీతోయం శతాహ్వా నాగకేసరమ్। ఏ
లాజాతీఫలంపథ్యాకుస్తుంబరి కుచందనమ్। ఘనసారోగంధ
సారః కౌముదీశిశిరోనిలః। చందనార్ద్రప్రియాశ్లేషోముక్తాభర
ణధారణమ్। గాహనం లేపనంచాస్యపథ్యమేతత్తృషాతురే॥

తా. వేయించిన పుసలు చిఱు పెసగలు సెనగలు అనువానిలో దేనితోనైనను జేయబడినకట్టు అరటిపువ్వు మజ్జిగ జున్ను ద్రాక్షపండు పర్పాటకము వట్టివేరు వెలగపండు పువ్వులదండ రేగుపండు గుమ్మడుకాయ బచ్చలికూర ఖర్జూరపండు దాడింబపండు వుసిరికపండు దోసకాయ పారేనీరు నిమ్మపండు ] పలము మాదీఫలము ఆవుపాలు యిప్పపువ్వు కురువేరు చేదుగలరసము మధురరసము లేత తాటినీరు శీతోదకము పాలు పానకము దేనె చెరువులోనినీరు చల్లపిల్లిగడ్డలు నాగకేసరములు యేలకులు జాజికాయ కరక్కాయ కొతిమెర్లు రక్తచందనము పచ్చకర్పూరము కచోరములు వె

స్నైల చల్లనిగాలి చందనము బూసికొనిన స్త్రీలయొక్క యాలింగనము ముత్యాలతో రములు ధరించుట నదులయందు స్నానము జేయుట లేపనము యివి తృష్ణారోగము లందు పథ్యకరంబులు.

## తృష్ణారోగమునం దపథ్యము.

శ్లో॥ స్నేహాంజనం స్వేదన ధూమపానం వ్యాయామనస్యా తపదంతకాష్ఠమ్ । గుర్వన్నమమ్లంలవణం కషాయంకటుత్రికం దుష్టజలానితీక్ష్ణమ్॥

తా. శరీరమునకు తైలము బూసికొనుట అంజనము వేసికొనుట చెమటదీసుట ధూమపానము సేయుట మిక్కుటముగ సంచరించుట నస్యము సేయుట యెండలోదిరుగుట చెడ్డదంతకాష్ఠము జడాన్నము పులుసు వుప్పు వొగరుగలరసములు శొంఠి పిప్పలి మిరియాలు చెడ్డనీరు కారము అనువాని సేవంజేయుట యివి యన్నియు తృష్ణా రోగమునం దపథ్యకరంబులు. అట్లగుటచే వానిని వర్జింపవలయు.

## దాహరోగమునందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] శాలయష్షష్టికాముద్గా మసూరాశ్చణకాయవాః। ధన్వమాంసరసాలాజామండంవైసక్తువాసితా । శతధౌతంఘృతందుగ్ధంనవనీతంపయోభవమ్। కూశ్మాండంకర్కటీమోచాపనసస్వాదుదాడిమమ్ । పటోలపర్పటద్రాక్షాధాత్రీఫలపరూషకమ్ । బింబీతుంబీతథావేరః ఖర్జూరంధాన్యకం మిసీ బాలతాలంప్రియాళంచశృంగాటంచకసేరుకమ్ ।మధూకపుష్పంహ్రీబేరంపథ్యాతిక్తానిసర్వశః। సితాప్రదేహో భూవేశ్మసేకోథ్యంగావగాహనమ్ । ఫుల్లోత్పలదళక్షౌమ శయ్యాశీతలకాననమ్ । కథావిచిత్రాగీతానివాద్యం మంజుళభాషణమ్। ఉశీరచందనోలేపశ్శీ తాంశుశ్శిశిరోనిలః। ధారాగ్రహంప్రియాస్పర్శోప్రతీరంహిమవాలుకమ్। సుధాంశురశ్మయస్నానంమణయోమధురోరసః । పూర్వోక్తానివిధేయానిపిత్తహారిణితానిచ। ఇతిదాహవతాంన్రూణాం పథ్యవర్గఉదాహృతః॥

తా. 60 దినములకు ఫలించెడి వడ్లు పెసలు చిఱుసెనగలు సెనగలు యవలు మిట్టభూమియందలి జంతుమాంసరసము * లాజమండము నేలపిండి పంచదార 100 మార్లు ఉదకముతో గడుగబడిన ఘృతము పాలు పాలయందు తీయబడినవెన్న బూడిద గుమ్ముడుకాయ దోసకాయ అరటిపండు పనసపండు తీపిగల దాడిమపండుపొట్లకాయ పర్పాటకము ద్రాక్షపండు వుసిరికవోలుపు పెద్దయీతపండు దొండకాయ అనపకాయ ఆల్లముఖర్జూరపండుధనియాలు సదాప లేతతాటిముంజులు సారపప్పు పరికెగడ్డ నెయ్యుంటములు పంచదార శీతపదార్థలేపనము భూగృహము సేచనము † అభ్యంజన స్నానము వికసించిన కమలములయొక్క శయ్యపై పరుండుట పట్టుమెత్తపై పరుండుట చల్లనితోట చిత్రకథలను సంగీతమును వాద్యమును వినుట మంచిమాటలాడుట వట్టివేరు విసనకఱ్ఱల యొక్క గాలిని సేవించుట చందనమును బూసికొనుట వెన్నెల చల్లనిగాలి జలగృహము స్త్రీలయొక్క యాలింగనము యేటిగట్టునందు గూర్చుండుట పచ్చకర్పూరము చంద్రకిరణము స్నానము రత్నధారణము మధురరసము పూర్వోక్తపిత్తనాశనకర యోగములు యివి యన్నియు దాహరోగమునందు పథ్యకరంబులు.

దాహరోగమునం దపథ్యము.

శ్లో॥ విరుద్ధాన్యన్న పానాని క్రోధో వేగవిదారణమ్ ।
శ్రమవ్యవాయమాధ్మానం క్షారంపిత్తకరాణిచ ।
వ్యాయామమాతపంతక్రం తాంబూలంమధురామఠమ్ ।
వ్యవాయకటుతిక్తోష్ణాన్ దాహవాన్ పరివర్జయేత్ ॥

తా. క్షీరమత్స్యాది విరుద్ధనమును విరుద్ధపానమును సేవించుట క్రోధమును కొంచుట మలమూత్రాదుల వేగము నడ్డగించుట శ్రమ స్త్రీగమనము కడుపు నుబ్బించెడి పదార్థములు క్షారము పిత్తకరవస్తువులు వీనిని మిక్కుటముగ సేవించుట మిక్కుటముగ సంచారము సేయుట యెండ మజ్జిగ తాంబూలము తేనె యింగువ చేదు కారము వుష్ణముగలపదార్థములు వీనిని సేవించుట యివి దాహరోగమునం దపథ్యకరంబులు. అట్లగుటచే వానిని వర్జింపవలయు.

* లాజమండమన — 1 భాగము పేలాలలో 14 భాగములునీరుబోసి పేలాలుద్రవించి గంజిగనగువరకు నుడికించుటయు.

† సేచనమన — శీతోదకము మొదలగువానికి శరీరముపై జిలకరించుటయు.

## హృద్రోగ నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] అత్యుష్ణామ్లకషాయంచ హృతిస్త్రీవ్యాస
సంతథా। హృదిబాధాంప్రతుర్వంతహృద్రోగంతంప్రచక్షతే॥

తా. అత్యుష్ణము పులుసు వొగరుగల ద్రవ్యములను మిక్కుటముగ సేవించుట మిక్కుటముగ స్త్రీసంభోగము సేయుట వీనివలన రొమ్ములయందు పీడజనించు. ఇది యహృద్రోగ మనంబడు. (హృద్రోగమన—రొమ్మునొప్పి.)

## హృద్రోగ భేదములు.

శ్లో॥ హృద్రోగః పంచధాదోషైః పృథక్సర్వైశ్చజంతుభిః ।
వాతాత్సశూలా హృదయం పిత్తాద్దాహసమన్వితమ్ ।
కఫతోభిగురుస్తబ్ధం సర్వతస్సర్వ లక్షణమ్।
సత్యాజ్యః క్రిమిభిశ్చోత్థో హృతికండూసమన్వితః ॥

తా. విరుద్ధాహార విహారములవలన వాతాదిదోషములు ప్రకోపించి వాతజ పిత్తజ శ్లేష్మజ సన్నిపాతజ కృమిజములన 5 విధములైన హృద్రోగముల గలుగం జేయు. అందు వాతమువలన జనించిన హృద్రోగములో రొమ్మునందు నొప్పిగలుగు పిత్తమువలన జనించిన దానిలో రొమ్ములో తాపముగలుగు. శ్లేష్మమువలన జనించినదానిలోవాత పిత్త శ్లేష్మలక్షణంబులు గలిగియుండు. ఇది అసాధ్యము. కిమ్ముల వలనజనించిన దానిలో మిక్కుటముగ దురదగలుగు (ఏకదోషము వలన జనించిన హృద్రోగములే సాధ్యంబులు ద్విదోష త్రిదోషమువలన జనించిన హృద్రోగములు అసాధ్యంబులు.)

శ్లో॥ మారుతాద్ధృదయంయస్య స్ఫుటితంచాతివేదనమ్ ।
పిత్తాన్మూర్ఛాక్లమస్వేదో ముఖశోషఃప్రజాయతే ।
శ్రమోరుచిశ్చమందాగ్ని కఫసావః కఫాధికే ।
మిశ్రితంద్వంద్వజంజ్ఞేయం సర్వలింగంత్రిదోషజమ్॥

తా. వాతజహృద్రోగమున రొమ్ము పగిలినటుల మిక్కుటముగ నొచ్చును. పిత్తజహృద్రోగమున మూర్ఛ బడలిక చెమట గలిగి ముఖము।వాడినట్లుండును. శ్లేష జహృద్రోగమున శ్రమ అరుచి అగ్నిమాంద్యముగలిగి నోటినుండి కఫము వెడలును.

ద్వంద్వజహృద్రోగమున 2 దోషలక్షణంబులు గలిగియుండును. త్రిదోషజహృద్రోగమున వాతపిత్త శ్లేష్మలక్షణంబులన్నియు గలిగియుండు (ఇది అసాధ్యము.)

### క్రిమిజహృద్రోగ లక్షణము.

శ్లో॥ విద్యాత్రిదోషంత్వపి సర్వలింగంతీవ్రార్తితోదంక్రిమిజంసకం
డుమ్। ఉత్క్లేదఃష్ఠీవనంతోదశ్శూలంహృల్లాసకస్తమః।అరుచి
శ్శ్యావనేత్రత్వంశోషశ్చ క్రిమిజేభవేత్॥

తా. తీవ్రమైన పీడ శూల గురదగలుగుట నోటిలో నీరూరుట వుమియుట సూదులతో బొడుచునటుల పీడగలుగుట నోకరింతలు గలుగుట అరుచి నేత్రముల యందు నలుపువర్ణముశోషగలుగుట ఈ లక్షణంబులు క్రిమిజ హృద్రోగమునగలుగు

### హృద్రోగోపద్రవములు.

శ్లో॥ క్లోమసాదోభ్రమశ్శోషోజ్ఞేయాస్తే షాముపద్రవాః ।
క్రిమిజేక్రిమిజాతీనాంశ్లైష్మికాణాంచయేమతాః ।
సంస్తంభస్సజ్వరం ఘోరం రూక్ష స్పర్శాసహంగురు ।
ఆధ్మానకుక్షి హృత్కంఠ వాతవిణ్మూత్రరోధతా ।
తంద్రారోచక శూలాది తస్య లింగానినిర్దిశేత్ ॥

తా. పిపాసాస్థానమున బడలిక భ్రమ శోషగలిగిన హృద్రోగోపద్రవములని తెలియవలయు, మఱియు క్రిమిజ హృద్రోగమున "శ్లో॥ హృల్లాసమాన్య ప్రసేకమతి పాక మరోచకమ్ । మూర్ఛాఛర్ది తృషా నాహ కార్శ్య శ్వయథు పీనసాః॥" (అనగా ఓకరింతలు. నోటనీరూరుట అన్నము పాకముగాకుండుట అరుచి మూర్ఛ వాంతి దప్పి కడుపుబ్బరముశరీరకృశత్వము వాపు పీనసము అన కఫజక్రిమిరోగోపద్రవంబులును శరీరస్తంభనము భయంకరమైన జ్వరము హృదయమున రూక్ష జడత్వముగలిగి యుష్ణస్పర్శను సహింపకుండుట కడుపుబ్బరము కడుపు ఱొమ్ము. కంఠము అపాన వాతము మలమూత్రములు అడ్డగింపబడుట తంద్ర అరుచి శూల అను నుపద్రవంబులును గలుగు.

### హృద్రోగమునకు రసాయనము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసగంధాభ్రభస్మాని పార్థవృక్షత్వగంబునా ।

ఏకవింశతిధా ఘర్మే భావితాని విధానతః ।
మాషమాత్ర మిదంచూర్ణం మధునాసహ లేహయేత్ ।
వాతజంపిత్తజం శ్లేష్మసంభూతం వాత్రిదోషజమ్ ।
క్రిమిజంచాపి హృద్రోగం నిహంత్యేవనసంశయః॥

తా. రసభస్మము గంధకభస్మము అభ్రకభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి యెండయందునిచి మద్దిచెక్కరసముతో 21 మార్లు భావనజేసి మాషప్రమాణమును తేనెతో సేవించిన వాత పిత్త శ్లేష్మ త్రిదోష క్రిమిజ హృద్రోగములు నిస్సంశయముగ హరించు.

## పైత్య హృద్రోగమునకు పంచసార రసము.

శ్లో॥ [మతాంతరే] శుద్ధసూతం సమంగంధంధా త్రీఫలద్రవై ర్దినమ్॥
యష్టీఖర్జూరద్రాక్షాణాం క్వాథేన మర్దయేద్దినమ్ ।
పంచసారరసోనామ భక్షయేన్మాషమాత్రకమ్ ।
ధాత్రీచూర్ణం సితాచాను పిత్తహృద్రోగ * శాంతయే॥

తా. శుద్ధి జేసినరస గంధకములను సమభాగములుగ ఖల్వములోనునిచి వుసిరిక పండ్లరసముతో 1 దినము యష్టిమధుకము ఖర్జూరపండు దీపద్రాక్ష అనువాని కషాయముతో 1 దినము మర్దించి మాషమెత్తు మాత్రలుజేసి వుసిరికపప్పు చూర్ణము పంచదార అనువాని యనుపానముతోడ సేవించిన పైత్యహృద్రోగము హరించు.

## శ్లేష్మ హృద్రోగమునకు హృదయార్ణవ రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతంసమంగంధం మృతం తామ్ర ద్వయోస్సమమ్ । మర్దయే త్త్రి ఫలాద్రావైః కాకమాచిద్రవైర్దినమ్। చణమాత్రాంవటీంఖాదే ద్రసోయంహృదయార్ణవః । కాకమాచీఫలంశుష్కం త్రిఫలాపల సంయుతమ్ । ద్వాత్రింశత్పలైస్తోయైః క్వాథమష్టావశేషకమ్। అనుపానంపిబేచ్ఛాంత్యై హృద్రోగేచకఫోత్థితే॥

* జిద్భవేత్.

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము యివి సమభాగములు ఈరెంటికి సమము తామ్రభస్మము యిటుల వానినేకముజేసి త్రిఫలములు నల్లకాచాప అను వానిరసములతో 1 దినము మర్దించి పెనగగింజలంత మాత్రలుజేసి యుందొకదానిని యెండిన నల్లకాచిపండ్లు త్రిఫలములు అనువానిని దినుసుకొక్కొక పలము చొప్పున దంచి 32 పలములు నీళ్ళుబోసి అష్టావశేషముగ కషాయముకాచి యీయనుపానముతోడ సేవించిన శ్లేష్మహృద్రోగము హరించు.

## హృద్రోగమునకు గుంజాభద్ర రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] నిష్కత్రయంశుద్ధసూతం నిష్కద్వాదశగంధకమ్। గుంజాబీజంచషణ్ణిష్కంనింబ బీజంజయాతథా। ప్రత్యేకంనిష్కమాత్రంతు సమంనేపాళబీజకమ్ । జయాజంబీరధుత్తూర కాకమాచీద్రవైర్దినమ్ । మర్ద్యంసర్వం రసంకుర్యాద్ఘృతైర్గుంజాద్వయంలిహేత్ । గుంజాభద్రరసోనామ హింగుసైంధవ సంయుతమ్ । శమయత్యేవకించి త్రమురస్తంభం చదుస్సహమ్ । అర్కక్షీరేణసింధూత్థం లేపోవక్షసిదాపయేత్। పద్మకేసరకంద్రాక్షా నింబబీజంజయాతథా। తుల్యాంచతుర్గుణం క్షీరంక్షీరాత్తోయం చతుర్గుణమ్ । క్షీరావశేషం చపచేత్సక్షౌద్రం పాయయేద్భిషక్ । ఉదరాణిక్షతంచైవ హృద్రోగం రక్తపిత్తనుత్ ॥

తా. శుద్ధిజేసినరసము 3 నిష్కములు శుద్ధిజేసిన గంధకము 12 నిష్కములు గురిగింజలు 6 నిష్కములు వేపవిత్తులు 1 నిష్కము తక్కలివిత్తులు 1 నిష్కము శుద్ధిజేసిన నేపాళము 1 నిష్కము యిటుల వానినెల్ల ఖల్వములోనునిచి తక్కలి నిమ్మపండు వుమ్మెత్తాకు నల్లకాచాచు అనువాని రసములతో 1 దినము మర్ధించి 2 గురిగింజలంత మాత్రలుజేసి నెయ్యి యింగువ సైంధవలవణము అనువాని యనుపానముతోడ సేవించిన కడుదుస్తరమైన హృద్రోగము హరించు. మఱియు సైంధవలవణము జిల్లేడుపాలతోనూరి ఱొమ్మునందు లేపనముజేసిన దుస్తరమైన హృద్రోగము హరించు. తామరకేసరములు ద్రాక్షపండు వేపవిత్తులు తక్కలి అనువానిని సమభాగములుగ గ్రహించి వానికి 4 గింతలు ఆవుపాలు ఆవుపాలకు 4 గింతలు నీళ్ళుబోసి పాలు

శేషించునటుల కాచి అందొకింత తేనె 2 గురిగింజలయెత్తు ఔషధమునుగలిపి సేవించిన ఉదరము గాయము హృద్రోగము రక్తపిత్తము హరించు.

## హృద్రోగమునందు పథ్యము

శ్లో॥ [మాధవనిదానే] స్వేదోవిరేకోవమనంచ లంఘనంవస్తిర్విలేపశ్చిరరక్తశాలయః। మృగాదిజంజాంగలసంజ్ఞయాన్వితం యూషారసా ముద్గకుళుత్థసంభవాః। పురాణకూశ్మాండరసానదాడిమం శమ్యాకశాకం? పటోలకంచ। ఏరండతైలం గగనాంబు సైంధవమాజా వితక్రంచ పురాతనోగుడ। శుంఠీయవానీలశునం హరీతకీకుష్ఠంచకుస్తుంబరు కృష్ణమార్ద్రకమ్। సౌవీరశుక్లం మధువారుణీరసః కస్తూరికా చందనకం ప్రమాణమ్। తాంబూలమప్యేష గణస్సుఖాభవేస్మర్త్యస్య హృద్రోగనిపీడితాత్మనః॥

తా. చెమటదీయుట విరేచనము వమనము జేయించుట లంఘనము వేసుట వస్తికర్మంజేసుట లేపనముల జేయించుట కడుప్రాత యెఱ్ఱబియ్యపు వంటకము అడవియందుండు పశుపక్షులమాంసము పెసలకట్టు వులవకట్టు ప్రాతగుమ్మడుకాయ మామిడికాయ దాడిమపండు రేలాకు పొటకాయ ఆముదము వాననీరు సైంధవలవణము మేకగొఱ్ఱె అనువానిమజ్జిగ ప్రాతబెల్లము శొంఠి వోమము వెల్లుల్లి కరకాయ చంగల్వకోష్టు కొతిమెర్లు మిరియాలు అల్లము కలి తెల్లని తేనె సారాయి కస్తూరి చందనము తాంబూలము అనునవి హృద్రోగమునందు పథ్యకరంబులు.

## హృద్రోగమునం దపథ్యము.

శ్లో॥ తృట్ఛర్దిమూత్రానిలశుష్క కాసోద్గారశ్రమశ్వాసవిడశ్రుపేగాః। సింధ్వోందువింద్యాద్రినదీ జలానిమేషీపయోదుష్టలజంకషాయమ్॥

తా. దప్పి వాంతి మూత్రము వాతము పొడిదగ్గు తేనువు శ్రమ శ్వాసము మలము రోదనము అనువాని వేగము నడ్డగించుట సింధునది హిమాలయము వింధ్యపర్వతము అనువానియొక్క జలము బఱ్ఱెపాలు దుష్టజలము నొగరు (వుప్పు కారము దంతెకాష్ఠము రక్తమోక్షణము.) ఇవి హృద్రోగమునం దపథ్యకరంబులు.

విషూచీ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] వివిధై ర్వేదనాభేదై ర్వాయురై ్వభృశకోపితః ॥ సూచీభిరివగాత్రాణి విధ్యతీతివిషూచికా॥

తా. వాతము మిక్కుటముగ బ్రకోపించుటవలన పలువిధ వేదనాభేదములు గలిగి సూదులతో బొడుచునటుల శరీరమును వేధించునది విషూచియనంబడు.

వాతవిషూచీ లక్షణము.

శ్లో॥ తత్రశూలభ్రమానాహ కంపస్తంభాదయోనిలాత్ ॥

తా. కడుపునొచ్చుట భ్రమగలుగుట కడుపుబ్బుట శరీరమువణుకుట శరీరము స్తంభించుట యీ లక్షణములు గలది వాతవిషూచియని దెలియవలయు.

పైత్యవిషూచీ లక్షణము.

శ్లో॥ పిత్తాజ్జ్వరోతిసారశ్చ తంద్రాతృట్ప్రిలపాదయః ।

తా. జ్వరము అతి సారము తంద్ర దప్పిగలుగుట వపరుట ఈలక్షణములుగలది పిత్తవిషూచియని తెలియవలయు.

శ్లేష్మవిషూచీ లక్షణము.

శ్లో॥ కఫాచ్ఛర్ద్యంగగురుతా వాక్సంగః ష్ఠీవనాదయః ।
విషూచ్యా మతివృద్ధాయాం పార్ష్ణి దాహః ప్రశస్యతే ।
సదాహశ్చాపదాచ్చైవం విధివచ్చోపచారయేత్ ॥

తా. వమనంబులగుట శరీరము బలువుగనుండుట నోరుబంధింపంబడి మాటలాడుటకు శక్తిలేకుండుట కొంగబొల్లుగారుట యీ లక్షణములు గలది శ్లేష్మ విషూచి యని తెలియవలయు విషూచి మిక్కుటముగ వృద్ధిం బొందిన మడిమలు మొదలు పాదములవరకు రక్షవేసి యథావిధిగ చికిత్సంపవలయు.

విషూచ్యుపద్రవములు.

శ్లో॥ నిద్రానాశోరతిః కంపో మూత్రాఘాతో విసంజ్ఞతా ।
అమీహ్యుపద్రవాఘోరా విషూచ్యాంపంచదారుణాః ॥

తా. నిద్రాభంగము యేపదార్థమునం దిచ్ఛలేకుండుట వణుకు మూత్ర ప్రతిబంధము మూర్ఛ అననీ 5 ను విషూచియందు దారుణోపద్రవములని తెలియవలయు.

అసాధ్య విషూచీ లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] శూలంవి రేకవమన మానాహో దాహతాపనమ్। విషూచ్యాంపట్ప్రకారేణ మృత్యురేవనసంశయః॥

తా. పైజెప్పంబడిన విషూచులలో శూల విరేచనము నాంతి కడుపుబ్బరము దాహము తాపము అన 6 యుపద్రవములు గలిగిన రోగినిస్సంశయముగ మృతిజెందు

శ్లో॥ [మాధవకల్పే] రసవాదంతవఖాదర కృష్ణతానయనమజ్జన కంపశ్రుతిక్షయః । స్మృతివినాశనకం శిథిలాంగతా మరణ కారణమేతి విషూచికా॥

తా. నాలుక దంతములు గోళ్ళు పెదవులు నల్లగనుండుట నేత్రములు గుంటలుపడుట శరీరము వణకుట చెవులు వినరాకుండుట స్మృతిలేకుండుట అవయవములు శిథిలంబగుట యీ లక్షణములు విషూచిరోగమునందు గలిగిన మరణముగలుగునని తెలియవలయు (ఈ దుర్గుణములు లేకుండెడి విషూచులే సాధ్యంబులని యెఱింగి చికిత్సింపవలయు.)

అలసక లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] కుక్షిరానహ్యతేత్యర్థం ప్రతామ్యేత్పరికూజతి।
నిరుద్ధోమారుతశ్చైనం కుక్షావుపరిధావతి ।
వాతవర్చో నిరోధశ్చ యస్యాత్యర్థం భవేదపి ।
తస్యాలసకమాచష్టే. తృష్ణోద్గారౌతు యస్యచ॥

తా. మిక్కుటముగ కడుపుబ్బుట మోహము జెందుట తీవముగ శబ్దించుట అజీర్ణమువలన వాతంబధోముఖ ప్రతిబంధముగలదై హృదయకంఠాదులయందు సంచరించుట వాత మలములు మిక్కుటముగ బంధింపబడుట దప్పి తేనుపులు గలుగుట యీ లక్షణములు గలది అలసకరోగమని తెలియవలయు.

విలంబికా లక్షణము.

శ్లో॥ దుష్టంతుభుక్తం కఫమారుతాభ్యాం ప్రవర్తతే నోర్ధ్వమధ్య

శ్చయుస్స్యామ్। విలంబికాతాం భృశదుశ్చికిత్స్యా మాచక్షతే శాస్త్రవిదఃపురాణాః॥

తా. కఫవాతముల వలన భుజించిన యన్నము దుష్టంబై పూర్ధ్వముగ గాని లేక అధోమార్గముగ గాని వెడలకుండిన విలంబికయని తెలియవలయు. దీనిని ఆయుర్వేదవేత్తలు అసాధ్యమని వచించెదరు.

అసాధ్యవిషూచి అలసక లక్షణము.

శ్లో॥ యశ్శ్యావదంతోష్ఠ నఖోల్పసంజ్ఞోవమ్యర్ది తో భ్యంతరయాత నేత్రః। క్షామస్వరస్సర్వ విముక్తసంధిర్యా యాన్నరోసౌ పునరాగమాయ॥

తా. దంతములు పెదవి గోళ్ళు నల్లనగుట నొకింత తెలివి గలిగియుండుట వ్యాకులగుట నేత్రములు లోనికేగుట హీనస్వరము గలుగుట సర్వసంధులు శైథిల్యమును జెందుట యీ లక్షణములుగల విషూచి అలసకరోగులు మృతిజెందెదరు.

విషూచులకు చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] విషూచ్యామతివృద్ధాయాం * మస్తుదేయం ముహుర్ముహుః । దధితక్రసదాశీఘ్రం పేయంజీవన హేతవే॥

తా. అధికముగ వృద్ధిజెందిన విషూచులయందు పెరుగుమీదినీళ్ళు పెరుగు చల్ల అనువానిలో దేనినిగాని పలుమారు త్రాగిన రోగి జీవించు.

శ్లో॥ గాఢంప్రచ్ఛర్దనంప్రాక్సలవణసలిలైర్భృంగతో యేనసస్యమ్ । చించాపత్రాంభసాన త్రికటుకపుటయు తేనాగ్నినాపార్ష్ణిదాహః । కల్కాంశుంఠీకణానామ పిస్పృతసలిలైః పేయ ముష్ణప్రకోపః । లుంగామ్లైరోప్యపనక్త్వాహ్వాయ ఫలరజనీత్వాంజనంస్యాద్విషూచ్యామ్॥

తా. విషూచులయందు మొదలుత గాఢముగ వమనము జేయించి పిదప సైంధవలవణమును నీళ్ళతోనూరి శుంటిగలగరాకు రసములో గలిపి నస్యము జేయించినను లేక

* తక్రందధిసమంజలమ్.

చింతాకురసములో త్రికటుకములు సైంధవలవణము గలిపి నస్యముజేయించినను లేక మడిమలయందు రక్షలు వేసినను విషూచి హరించు మఱియు త్రికటుకములను నూరి కల్కము జేసి వుష్ణోదకములోగలిపి త్రాగిన విషూచి హరించి అగ్నిదీపనము గలుగు. త్రికటుకములు కానుగవిత్తులు పసపు వీనిని మాదీఫలరసముతో నూరి అంజనము వేసిన విషూచి హరించు.

## అగ్నిముఖ రసము.

శ్లో॥ [నిత్యనాథీయే] సూతంగంధం విషంతుల్యం మర్దయేదార్ద్రకద్రవైః । అశ్వత్థచించాపామార్గక్షారః క్షారాచటంకణమ్। జాతీఫలంలవంగంచ త్రికటుత్రిఫలాసమమ్ । శంఖక్షారంపంచపట్వం హింగుజీరంద్విభాగకమ్ । మర్దయేదమ్లయోగేన గుంజామాత్రంవటీకృతా । పాచనీదీపనీసద్యోజీర్ణశూలవిషూచికాః । హిక్కాంగుల్మంచోదరంచ నాశయేన్నాత్రసంశయః । రసేంద్రసంహితాయాంచ నామ్నాన్వహ్నిముఖోరసః॥

తా. రసము గంధకము వసనాభి వీనిని శుద్ధిచేసి సమభాగము ఖల్వములో నునిచి అల్లపురసముతో మర్దించి అంగు రావి చింత వుత్తరేణు అనువాని క్షారములను యవక్షారము సర్జక్షారము వెలిగారక్షారము జాజికాయ లవంగములు త్రికటుకములు త్రిఫలములు శంఖభస్మము యవక్షారము అనువాని చూర్ణములను పుష్కరమూలము సర్జక్షారము మోదుగు నువ్వులదంటు యవలు అనువానిక్షారములను సమభాగములుగ గలిపి దానితోడ యింగువ జీలకఱ్ఱ అనువానిని 2 భాగములు జేర్చి నిమ్మపండు పులిచింతమొదలగు పుల్లని ద్రవ్యముల రసములతో మర్దించి గురిగింజత మాత్రలుజేసి సేవించిన అజీర్ణము నూల విషూచిక యెక్కిళ్ళు గుల్మము వుదరము అనువానిని నిస్సంశయముగ హరింపంజేసి పాచన దీపనములు గలుగంజేయు.

## శంఖ వటికములు.

శ్లో॥ [మాధవనిదానే] చింతాశ్వత్థస్నుహిక్షార మపామార్గార్కకంతథా। లవణంపంచసంగృహ్య తతోలవణపంచకాత్।సైంధవాద్యాత్ సమాదాయ సర్వమేతత్పలద్వయమ్ । ద్వాకక్షాచపృథక్కార్యాతథా వై శంఖచూర్ణతః । ఫలత్రయాచ్చ

కర్షైకంద్వికర్ష కర్ష తులవంగకమ్ । ఏతత్సర్వంసమానాద్య శ్లక్ష్ణ చూర్ణీకృతంశుభమ్। భావయేదమ్లయోగేనస ప్తధాచ ప్రయత్నతః । రసశ్శంఖవటీనామ సేవితస్సర్వరోగజిత్ । గుంజమాత్రమిమంఖాదే ద్భవేద్దీపనపాచనమ్ । అజీర్ణంవాతసంభూతంపి త్తశ్లేష్మభవంతథా। విషూచీంశూలమానాహంహన్యాదత్రనసంశయ ॥

తా. చింత రావి జెముడు వుత్తరేణు జిల్లేడు అనువాని క్షారములు పంచలవణములు యివి దినుసుకు 8 రూపాయలయెత్తు శంఖభస్మము 1 రూపాయ యెత్తు త్రిఫలములు 1 రూపాయయెత్తు లవంగములు 2 రూపాయలయెత్తు యిటులవీనిసెల్ల దంచి చూర్ణముజేసి నిమ్మపండ్లరసముతో 7 మార్లు భావనచేసి 1 గురిగింజంతయెత్తు ను సేవించిన సర్వరోగములు వాతపిత్త కఫములవలన జనించిన అజీర్ణము విషూచి శూల అనాహము వీనిని నిస్సంశయముగ హరింపంజేయుటయేగాక దీపనపాచనములు సగా కలుగంజేయు.

సంజీవనీ ఘుటికిలు.

శ్లో॥ విడంగంనాగరంకృష్ణాపథ్యావహ్నివిభీతకాః । వచాగుడూచీ భల్లాతం విషంచాత్ర ప్రయోజయేత్ । ఏతానిసమభాగాని గోమూత్రేణైవపేషయేత్ గుంజాభాంవటికాం కుర్యాద్ద ద్యాదార్ద్రికజైర్రసైః। ఏకామజీర్ణయుక్తస్య ద్వేవిషూచ్యాం ప్రదాపయేత్ । తిస్రోభుజంగదష్టస్య చతస్రస్సన్నిపాతినః । గుటికాజీవనీనామ్నా సంజీవయతిమానవమ్॥

తా. వాయువిడంగములు శొంఠి పిప్పలి కరక్కాయచిత్రమూలపుపట్టతాని కాయ వస తిప్పతీగ జీడి అతివస వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి గోమూత్రముతో ఖల్వమున మర్దించి గురిగింజంత మాత్రలుజేసి అల్లపురసముతో 1 మాత్రను సేవించిన అజీర్ణమును 2 మాత్రల సేవించిన విషూచిని 3 మాత్రల సేవించిన సర్పవిషమును 4 మాత్రల సేవించిన సన్నిపాతమును హరింపంజేయుఇది మనుజునకు సంజీవి తుల్యంబుగనుండుటచే సంజీవనియని జెప్పంబడు.

## విలంబిక అలసక చికిత్స.

శ్లో॥ విలంబికాలసకయో రూర్ధ్వాధశ్శోధనం హితమ్ । నాళీనఫల వర్త్యాచతథాశోధనభేషజైః । దండాద్యలసకేప్యూచై రయ మేవత్రి క్రమః॥

తా. విలంబిక అలసకము అనెడి 2 రోగములయందు వమనము విరేచనముచే యించుట హితకరంబు, మఱియు ఫలవర్తి శోధనౌషధము హితకరంబు; మఱియు దండాలసక రోగమునందుకూడ ఈ చికిత్సలనే చేయవలయు.

## అగ్నిమాంద్య నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] మంద స్తీక్ష్ణోథ విషమ స్సమశ్చేతిచతుర్విధః । కఫపిత్తానిలాధిక్యాత్తత్సామ్యాజ్జాఠరోనలః ॥

తా. కఫపిత్త వాతాధిక్యమువలనగాని లేక వానిసమత్వమువలన గాని జాఠరాగ్నికి 4 అవస్థలుగలుగు. అవెవ్వియనిన-కఫమువలన మాంద్యావస్థ పిత్తమువలన తీక్ష్ణావస్థ వాతమువలన విషమావస్థ త్రిదోష సమత్వమువలన సమావస్థ అనునవియ.

## అగ్నిమాంద్య స్వరూపము.

శ్లో॥ విషమోవాతజాన్ రోగాన్ తీక్ష్ణంపిత్తనిమిత్తజాన్ ।
కరోత్యగ్ని స్తథామందో వికారాన్ కఫసంభవాన్ ॥

తా. విషమాగ్ని వాతజన్యములైన 80 రోగములయం దేదైనా 1 రోగము నుసామాన్య జ్వరాతిసారములను గలుగంజేయు తీక్ష్ణాగ్ని పిత్తజన్యములైన 40 రోగములయందు శోష చోషాదిక రోగములలో దేనినేని గలుగంజేయు, మందాగ్ని కఫజన్యములైన 20 రోగములయం దాలస్యాదుల గలుగంజేయు.

## సమాగ్న్యాది లక్షణము.

శ్లో॥ సమాసమాగ్నే ర్రశితా మాత్రాసమ్యగ్విపచ్యతే ।
స్వల్పాపినైవ మందాగ్నే ర్విషమాగ్నేస్తుదేహినః ।
కదాచిత్పచ్యతేసమ్య క్కదాచిన్నవిపచ్యతే ।
మాత్రాతిమాత్రాప్యశితా సుఖంయస్యవిపచ్యతే ।
తీక్ష్ణాగ్నిరితితం విద్యా త్సమాగ్ని శ్శ్రేష్ఠఉచ్యతే ॥

తా. సమాగ్నియందు భుజించిన యాహారము బాగుగ పచనంబగు మందాగ్నియందు అల్పాహారమును భుజించినను పచనముగాకుండు. విషమాగ్నియం దొకప్పుడు బాగుగపచనంబై మఱియొకప్పుడు పచనము గాకుండు. తీక్ష్ణాగ్నియందు మిక్కుటముగ భుజించినను సుఖముగ పచనంబగు. కావున సర్వాగ్నులలో సమాగ్నియే శ్రేష్ఠంబు (భస్మకమనునగ్ని తీక్ష్ణాగ్నికి వ్యతిరిక్తంబు. కడుతీక్ష్ణాగ్నియే భస్మకమను పేరంబఱంగునని చరకగ్రంథమున జెప్పంబడియున్న యది) యెట్లనిన—

## తీక్ష్ణాగ్ని లక్షణము.

శ్లో॥ [చరకే] నరేక్షీణకఫేపిత్తం కుపితంమారుతానుగమ్। స్వోష్మణాపాచకస్థానేబలమగ్నేః ప్రయచ్ఛతి। తదాలబ్ధబలోదేహం రూక్షయేత్సానిలోనలః। అభిభూయపచత్యన్నం తైక్ష్ణ్యాదాశుముహుర్ముహుః। పక్త్వాన్నంసతతోధాతూన్ శోణితాదీన్ పచత్యపి। తతోదౌర్బల్యమాతంకం మృత్యుంచోపానయేన్నరమ్। భుక్తేన్నేలభతేశాంతిం జీర్ణమాత్రేప్రతామ్యతి। తృట్కాసదాహమోహాస్స్యు ర్వ్యాధయోత్యగ్నిసంభవాః॥

తా. కఫము క్షయించుటవలన బ్రకోపించిన పిత్తము వాతముగలసి పూష్మసహితముగ వర్తమాన పాచకస్థానమును జెంది అగ్నికి బలమును గలుగం జేయుచుండ ఆ యగ్నివాత సహాయమువలన ప్రబలి శరీరమున రూక్షను గలుగంజేయు. మఱియు అగ్ని తనతీవ్రమువలన భుజించిన యన్నమును శీఘ్రముగ పచనము జేసి తదనంతరము రక్తాది ధాతువులసహా పలుమారు పచనము సేయు. దానివలన సత్వహాని రోగము మరణము సగాగలుగు మఱియునన్నము పచనమైనతోడనే మరలభుజించిన సుఖకరంబుగనుండు. ఐనను అన్నము జీర్ణమైనతోడనే మూర్ఛంజెందు ఈయత్యగ్నియందు మూర్ఛాదప్పి దగ్గు దాహము గలుగు.

శ్లో॥ [మాధవనిదానే] ఆధ్మానంశిరసోజాడ్యం స్తైత్యంఛర్ద్యరోచకమ్। ఆలస్యమాన్యవైవర్ణ్యం సర్వంచైవాగ్నిమాంద్యజమ్.

తా. కడుపుబ్బుట తలలో జాడ్యము గలుగుట శరీరము మాత్రిమువలెనుండుట వాంతి అరుచి ఆలస్యము గలుగుట ముఖము వివర్ణంబగుట యీ లక్షణములన్నియు నగ్నిమాంద్యమువలన గలుగు.

## అజీర్ణరోగ భేదములు.

శ్లో॥ [ఆయుర్వేదే] ఆమంవిదగ్ధం విష్టబ్ధం కఫపిత్తానిలైస్త్రిభిః ।
అజీర్ణంకేచిదిచ్ఛంతి చతుర్థంరసశేషత ।
అజీర్ణంపంచమంకేచి న్నిర్దోషందినపాకిచ ।
వదంతిషష్ఠంచాజీర్ణం ప్రాకృతంప్రతివాసరమ్ ॥

తా. కఫ పిత్త వాతములవలన క్రమముగ ఆమాజీర్ణము విదగ్ధాజీర్ణము విష్టబ్ధాజీర్ణము అన 3 అజీర్ణములు జనించు మఱియు ఆహార రసశేషమువలన 4 వ యజీర్ణము జనించునని కొందరు వచించెదరు మఱియు రేయింబగలులో పచనంబగునపుడు కడుపుబ్బరము మొదలగునవి లేకుండిన 5 వ యజీర్ణమని కొందరి మతము మఱియు ప్రతిదినము స్వాభావికముగ (అనగా వికృతిజన్యము గాక) నుండునది 6 వది యని కొందరు వచించెదరు (భుజించిన యన్నము పచనంబగు నిమిత్తము సుశ్రుతమున జెప్పంబడియుండు కొన్నియాచారముల ప్రతిదినము తప్పక నాచరింపవలయునని బోధించెడి నిమిత్తము యీయాఱవ యజీర్ణము జెప్పంబడియె. అవెవ్వియని న—"శ్లో॥ భుక్త్వాశతపదంగచ్ఛే ద్వామపార్శ్వేన సంవిశేత్ । శబ్దరూప రసస్పర్శ గంధాంశ్చ మనసః ప్రియాన్ ।భుక్తవానుపసేవేత తేనాన్నం సాధుతిష్ఠతి॥" అనగా భోజనాంతరము 100 యడుగులు నడచి యెడమపార్శ్వముగ పరుండుట మనస్సుకు ప్రియకరమైనశబ్ద రూప రస స్పర్శ గంధాదులసేవించుట వీనివలన అన్నము బాగుగ పచనమును జెందుననుట).

## అజీర్ణ [కార]ణము

శ్లో॥ అత్యంబుపానా ద్విషమాశనాచ్చ సంధారణాత్స్వ ప్నవిపర్యయాచ్చ । కాలేపిసాత్మ్యం లఘుచాపిభుక్తమన్నంనపాకంభజతేనరస్య. ఈర్ష్యాభయక్రోధ [పరి]క్షితేనలుబ్ధేనశుగ్దైన్యనిపీడితేన । ప్రద్వేషయుక్తేనచ సేవ్యమానమన్నంనసమ్యక్పరిపాకమేతి ॥

తా. మిక్కుటముగ నీరుద్రాగుట అకాలమున భుజించుట మలమూత్రాదివేగముల నడ్డగించుట పగటియందు నిద్రించుట యీ కారణములవలన భోజనకాలమున స్నిగ్ధోష్ణాది గుణయుక్తంబై శరీరప్రకృతి కనుగుణంబై చులకనగనుండు యన్నమును

భుజించినను బాగుగ పచనము జెందకుండు. మఱియు * ఈర్ష్యభయ క్రోధముల యొక్క వ్యాప్తివలన లోభ శోకదైన్యములయొక్క పీడవలన మత్సరగ్రస్తుడుగ నుండువాడు భుజించిన యన్నము బాగుగ పచనము గాకుండు (ఈర్ష్యభయ క్రోధాదులుమానసిక దోషాజీర్ణవిషయమై చెప్పంబడియున్నదని కొందరువచించెదరు.)

## అజీర్ణ లక్షణము.

శ్లో॥ తత్రామేగురుతోత్క్లేద శ్శోథోగండాక్షికూటగః
ఉద్గారశ్చ యథాభుక్త మవిదగ్ధః ప్రవర్తతే॥

తా. శరీరమున జడత్వము ఉత్క్లేదముగలుగుట చెక్కిళ్లు నేత్రములు అనువానియందు వాపుగలుగుట భుజించినట్టుల తేనుపులువచ్చుట యీ లక్షణములుగలది ఆమాజీర్ణమని తెలియవలయు.

## విదగ్ధాజీర్ణ లక్షణము.

శ్లో॥ విదగ్ధే భ్రమతృణ్మూర్ఛాః పిత్తాచ్చ వివిధారుజః ।
ఉద్గారశ్చసధూమామ్లః స్వేదోదాహశ్చజాయతే ॥

తా. భ్రమ దప్పి మూర్ఛగలుగుట పిత్తమువలన పలువిధ శోష చోషాదిక పీడగలుగుట ధూమయుక్తముగ పుల్లగ తేనుపులువచ్చుట శరీరమున చెమట దాహముగలుగుట యీ లక్షణములు గలది విదగ్ధాజీర్ణమని తెలియవలయు.

## విష్టబ్ధాజీర్ణ లక్షణము.

శ్లో॥ విష్టబ్ధేశూలమాధ్మానం వివిధావాతవేదనాః ।
మలవాతాప్రవృత్తిశ్చ స్తంభోమోహోంగపీడనమ్ ॥

తా. శూల కడుపుబ్బరము పలువిధవాతభేదాది కంపవేదనలుగలుగుట మలమువాతము బంధించుట శరీరము స్తంభించుట మోహము అంగపీడనము (అనగా శ్రమవాతలక్షణము) గలుగుట యీ లక్షణములుగలది విష్టబ్ధాజీర్ణమని తెలియవలయు.

## రసశేషాజీర్ణ లక్షణము.

శ్లో॥ రసశేషేన్నవిద్వేషో హృదయాశుద్ధిగౌరవే ॥

* ఈర్ష్యయన-నొకని మేలునోర్వకుండుట.

తా. అన్నద్వేషము హృదయమున అస్వస్థత శరీరజడత్వము గలదిగన శేషాజీర్ణమని దెలియవలయు.

వాతాజీర్ణ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] విష్టంభోవమనంభ్రాంతి ర్హృద్దాహఃపూతిగంధతా । ముఖేశోష_స్తృషా_రిశ్చ వాతాజీర్ణస్యలక్షణమ్॥

తా. మలబద్ధము వాంతి భ్రమ ఱొమ్ములోమంట ముఖమునదుర్గంధము శోష దప్పి పీడగలిగిన వాతాజీర్ణమని దెలియవలయు.

పిత్తాజీర్ణ లక్షణము.

శ్లో॥ రేచనం జఠ రేశూలం వమనంచ ముహుర్ముహుః ।
హస్తపాదాతిసంకోచః పైత్తాజీర్ణస్యలక్షణమ్॥

తా. విరేచనములు కడుపులో శూల పలుమారు వమనము హస్తపాదముల యందు సంకోచము కలిగిన పిత్తాజీర్ణమని దెలియవలయు.

శ్లేష్మాజీర్ణ లక్షణము.

శ్లో॥ వాంతిర్భ్రాంతిర్ముఖేస్వేదో జడతాశీతతాతథా ।
కాష్ఠవజ్జాయతేదేహః కఫాజీర్ణస్యలక్షణమ్॥

తా. వాంతి భ్రమ ముఖమునందు చెమట జడత్వము శీతలముగలుగుట శరీరము కొయ్యబారుట యీ లక్షణములుగలది శ్లేష్మాజీర్ణమని దెలియవలయు.

అజీర్ణోపద్రవములు.

శ్లో॥ మూర్ఛాప్రలాపో వమథుః ప్రసేక స్సదనంభ్రమః ।
ఉపద్రవాభవంత్యేతే మరణంచాప్యజీర్ణతః ॥

తా. మూర్ఛ తలుచుమాటలు వోకర నోటనీరూరుట శరీరశైథిల్యము బడలికలను నీయుపద్రవములు అజీర్ణమువలన గలుగు. మఱియు అజీర్ణము మిక్కుటముగ ప్రకోపించుటవలన మరణము సగా గలుగు.

## అజీర్ణమునకు ముఖ్యకారణము.

శ్లో॥ అనాత్మవంతః పశువ ద్భుంజతే ప్రమాణతః ।
రోగనీకస్య తేమూల మజీర్ణం ప్రాప్నువంతిహి॥

తా. అత్యాశచే జ్ఞానశూన్యుడై పశువువలె మిక్కుటముగ దినుటవలన అనేక రోగములకు మూలంబైన అజీర్ణరోగము జనించు.

## అజీర్ణహర యోగములు.

శ్లో॥ [మాధవనిదానే] లవణం కాంజికంచైవ గుడం జంబీరపల్ల వమ్।పిబేద జీర్ణశాంత్యర్థం వజ్రక్షారం యథాజలైః।నింబ కౌస్తుంబతైలేన మర్దనంచ ప్రశస్యతే ।

తా. ఉప్పు కలి బెల్లము నిమ్మయిగుళ్ళు వీనిని సమభాగములుగ నూరి భక్షించినను లేక బ్రహ్మజెముడు బూడిదను నీళ్ళలోగలిపి త్రాగినను లేక వేపవిత్తులు నూనెనుగాని లేక కుసుమవిత్తులనూనెనుగాని శరీరమునకు లేపనము జేసినను అజీర్ణములు హరించు.

## అజీర్ణహర కల్పము.

శ్లో॥ లాజాచూర్ణ యుతంక్షౌద్రం పథ్యాదేయం ప్రయత్నతః ।
జాతీఫలస్య సంచూర్ణం ద్విగుజం పర్పటీరసమ్ ।
పిబేచ్ఛీతలతోయేన తథాజీర్ణ ప్రశాంతయే॥

తా. పేలపుసత్తు తేనె కరక్కాయలు అనుపానిని సేవించినను లేక జాజికాయచూర్ణములో 2 గురిగింజలయెత్తు పర్పటీరసమునుగలిపి శీతోదకముతోడ సేవించినను అజీర్ణము హరించు.

## అజీర్ణములకు పథ్యాదిచూర్ణము.

శ్లో॥ పథ్యాపలత్రయంచూర్ణం త్రికటుంచపలత్రయమ్ ।
పలైకం పిప్పలీమూలం త్వగేలా పత్రకంపృథక్ ।
కర్షాంశం చూర్ణితంయోజ్యం పంచవింశ త్సలైర్గుడైః ।
పవార్ధ వటికాంఖాదే త్సర్వాజీర్ణ ప్రశాంతయే ॥

తా. కరక్కాయలు 3 పలములు త్రికటుకములు 3 పలములు పోడి 1 పలములవంగపట్ట యేలకులు ఆకుపత్రిక యివి దినుసుకొక్కకకర్షము యిటులవీనినెల్ల చూర్ణము జేసి ఖల్వములోనునిచి 25 పలముల బెల్లముగలిపి మర్దించి ½ పలిమెడు చొప్పున మాత్రలు జేసి సేవించిన సర్వాజీర్ణములు హరించు.

## సర్వాజీర్ణములకు అగ్నికుమార రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతంవిషంగంధం ప్రతినిష్కత్రయం త్రయమ్ । మరిచం సర్వతుల్యంస్యాత్కంటకారీ ఫలద్రవైః । మర్దయేద్భావయేత్తేన భావనాచైకవింశతిః । దేయాగుంజా ద్వయంఖాదే త్సర్వాజీర్ణప్రశాంతయే । విషూచికాం నిహంత్యాశు రసోహ్యగ్ని కుమారకః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిచేసిన నాభి శుద్ధిజేసిన గంధకము యివి దినుసుకు 3 నిష్కములు మిరియాలు 9 నిష్కములు యిటుల వీనిని ఖల్వములోనునిచి నేలములకపండ్ల రసముతో 21 మార్లు మర్దన భావనలుజేసి 2 గురిగింజలయెత్తును అల్లపురసముతో సేవించిన సర్వాజీర్ణములు విషూచి శీఘ్రముగ హరించు.

## అగ్నికుమార రసము.

శ్లో॥ రసేంద్రగంధౌనహటం కణేనసమంవిషంయోజ్య మిహత్రిభాగమ్ । కపర్దికంశంఖమిహత్రిభాగంమరీచమష్టాగుణం ప్రదేయమ్ । సుపక్వజంబీర రసేనఘస్రం సిద్ధోభవేదగ్నికుమారఏషః । * విషూచికారోచక సన్నిపాతే † దేయోద్విగుంజా వటికాత్వజీర్ణే। శ్రీపర్ణఖండేన హిమాంబునాచ యథాబలంచానుపిబేత్సరంతి ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిచేసిన గంధకము పేల్చినవెలిగారము యివి దినుసుకొక్కకభాగము శుద్ధిజేసిన నాభి గవ్వలభస్మము శంఖభస్మము యివి దినుసుకు 1 కి 3 భాగములు మిరియముల చూర్ణము 7 భాగములు యిటుల వానినెల్ల ఖల్వములో

* విషూచికాజీర్ణ సమీరణార్తే । మతియు దద్యాద్విబంధే గ్రహణీగదేచ ॥ అనియు పాఠాంతరములు గలవు.

† దద్యాద్ద్వివల్లం వటికాత్వజీర్ణే॥

నునిచి బాగుగపండిన నిమ్మపండ్లరసముతో 1 దినము మర్దించి రోగబలానుగుణ్యముగ 2 గురిగింజల యెత్తును తమలపాకులో నునిచి భక్షించి వెంబడిగ చారెడు శీతోదక మును ద్రాగిన విషూచి అరుచి సన్నిపాతములు అజీర్ణములు హరించు.

## క్రవ్యాద రసము.

శ్లో॥ [భైరవకల్పే] ద్విపలంగంధకంశుద్ధం ద్రావయిత్వా వినిక్షి పేత్ । పారదంపలమానేనమృతశుల్బాయసీపునః । తేనమా నేన సంమిశ్ర్య పంచాంగుళదళేక్షిపేత్ । తతోవిచూర్ణ్యయ త్నేనినిక్షిప్యాయసపాత్రకే। ఛుల్యాసివేశ్యయత్నేనజ్వాలయే న్మృదుచాలనమ్ । ప్రస్థమాత్రం రసంసమ్యగ్జంబీరస్యప్ర యోజయేత్ । సంమర్ద్యంపంచకోలోత్థైః కషాయైస్సామ్ల వేతసైః । భావనాఖలుదాతవ్యా పంచాశత్ప్రమితాస్తథా। భృష్టటంకణచూర్ణేన తుల్యేనసహమేళయేత్ । తదర్ధంకృష్ణ లవణంసర్వతుల్యం మరీచకమ్ । సప్తధాభావయేత్పశ్చా చ్చణకక్షారవారిణా । తతస్సంశోష్యసంపిష్యకుప్యాం సుజర క్షిపేత్ । అత్యర్థగురుమాంసాని గురుభోజ్యాన్యనేకశః। భక్షిత్వాకంఠపర్యంతం చతుర్వల్లమితం రసమ్।పట్వమ్లతక్ర సహితం పిబేత్తదనుపానతః। క్షిప్రంతజ్జీర్యతేభుక్తంజాయతే దీపనంపునః । రసఃక్రవ్యాదనామాయం ప్రోక్తోమంథాన భైరవైః । సింహలక్షోణిపాలస్య భూరిమాంసప్రియస్యచ । దష్టోగోమాంసమాసాద్య భైరవానందయోగినా । కుర్యా ద్దీపసముద్ధృతంచ పవనందుష్టామయోచ్ఛోషణమ్ । తుంద స్థౌల్యనిబర్హణం గదహతింమూలాత్రిశూలాఘహమ్ । గుల్మ ప్లీహవినాశనం గ్రహణికావిధ్వంసనమ్ ప్రంసనమ్ । వాత గ్రంథిమహోదరాపహరణం క్రవ్యాదనామారసః ॥

తా. శుద్ధిచేసిన కరిగించిన ఆమ్లసారగంధకము 2 పలములు శుద్ధిచేసినరసము 1 పలము తామ్రభస్మము యినుపభస్మము యివి దినుసుకొక్కొకపలము యిటుల తీసి

నెల్లి ఖల్వములోనునిచి చూర్ణముజేసి అముదపాకులో జుట్టి యినుప పాత్రలో నుని
చి దానిపై మఱియొక ఇనుపపాత్రనుమూసి పాయిమీదనునిచి మృద్వగ్నితో పాక
ముజేసి అందొక ప్రస్థము నిమ్మపండ్లరసముబోసి యిగురునటుల కాచి మర్దించి పం
చకోలముల దినుసు కొక్కొక్కతులము చొప్పున దంచి కషాయముకాచి దానిలోడ
ను పుల్లప్రబ్బలి రసముతోడను మర్దన భావనలు చేయవలయు. యిటుల 50 మర్దన
లు భావనలుజేసి దానికిసమముగ పేల్చిన వెలిగారమును వీని కన్నిటికి సమము మిరి
యములచూర్ణమునుగలిపి పెనగబూడిదెనీళ్ళతో 7 భావనలుజేసి పిదప నూరి యెం
డించి గాజుసెప్పెలోనునిచి పాకముజేసి 4 వల్లములయెత్తును సైంధవలవణముపులిసి
నచల్ల అనుపాని యనుపానముతోడ సేవించి కంఠపర్యంతము మిక్కుటముగ గురు
మాంసముల అనేక గురుభోజనముల భక్షించినయెడ శీఘ్రముగ జీర్ణంబై అగ్నిదీపన
ము గలుగు. ఈ క్రవ్యాదిరసము మంథానభైరవునిచే జెప్పంబడియె. మఱియు దీనిని
భైరవానందయోగి బహుమాంసప్రియుండగు సింహాలద్వీపపురాజునకుం జెప్పె ఇయ్యది
అగ్నిదీపనమును గలుగంజేయుటయేగాక ప్రకోపించిన వాతమును దుష్టరోగములను
కడుపు పెలుసుట శరీరతాపము మూలరోగము శూల గుల్మము ప్లీహము గ్రహణి
ప్రంసనము వాతగ్రంధులు మహోదరము అనురోగములను హరింపంజేయు.

## అగ్నిముఖ యోగము.

శ్లో॥ కుడవద్వయంకణాయాః మరీచాశ్చత్వారిచకుడవాని । కుడ
వత్రయంకృశానోస్సైంధవస్యకుడవచతుష్టయంహరీతక్యాః।
విశ్వౌషధసౌవర్చల బిడాలకానాం పృథిగ్ద్వికుడవమ్ । కుడ
వాష్టశతకాంజికేక్షిప్త్వాసాంద్రం యథాభవేద్విపచేత్ । తథా
గ్నిముఖనామాయం ప్రిసః మజీర్ణేగ్ని మాంద్యశూలహరః ॥

తా. పిప్పళ్ళు 2 కుడవములు మిరియాలు 4 కుడవములుచిత్రమూలము 3 కు
డవములు సైంధవలవణము 3 కుడవములు కరక్కాయలు 4 కుడవములు శొంఠిసౌ
వర్చలవణము బిడాలవణము యివి దినుసుకొకటింటికి 2 కుడవములు యిటుల వాని
నెల్లదంచి చూర్ణముజేసి అందు 108 కుడవములు కలిబోసి ముద్దయగునటుల పాకము
జేసి సేవించిన అజీర్ణము అగ్నిమాంద్యము శూల వీనిని హరింపంజేయు.

## అగ్నికుమార రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధసూతం విషంగంధం త్రిక్షారం పటుపంచ

కమ్ । దశకంతుల్యతుల్యాంశ భర్జితావిజయాహ్వతైః । దశానాంతుల్యభాగానాం తస్యార్ధంశిగ్రుమూలకమ్ । తత్సర్వ విజయాద్రావై శ్శిగ్రుచిత్రకభృంగజైః । ద్రవైర్దినద్వయం మర్ద్యం రుద్ధ్వాభాండేపచేల్లఘూ । దిప్తాగ్నినాతుయామైకం శుద్ధపక్వంసముద్ధరేత్ । సప్తధాచార్ద్రకద్రావై శ్చిత్రకైర్భావయేద్భిషక్ । దీప్యకోగ్ని కుమారోయం నిష్కైకంమధునాలిహేత్ । ప్రతికర్షంగుడం శుంఠీమనుస్యాదగ్ని దీపనః॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిననాభి శుద్ధిచేసినగంధకము త్రిక్షారములు పంచలవణములు దశమూలములు (అనగా మారేడు పెద్దగుమ్ముడు తక్కాలి కలిగొట్టు దుందిలము కోలపొన్న నక్కపొన్న చిన్నములక పెద్దములక పల్లేరు అనువాని మూలములు) యివి సమభాగములు దశమూలములకు సమము నేతితో వేయించిన గంజాయియాకు దానిలోసగము మునగవేళ్ళు యిటుల వానినెల్ల ఖల్వములో నునిచి గంజాయియాకు మునగ చిత్రమూలము గుంటగలగర అనువాని రసముతో 2 దినములు మర్దించి కుప్పెలోనునిచి చీలమన్ను లేపనముజేసి కుండలోనునిచి దీప్తాగ్నితో 1 ఝామము లఘుపుటంబిడి స్వాంగశీతలమున దీసి ఖల్వములో నునిచి అల్లము చిత్రమూలము అనువాని రసములతో నేడేడుమార్లు భావనజేసి నిష్కప్రమాణమును తేనెతో సేవించి వెంబడిగ బెల్లము శొంఠి అనువానిని కర్షప్రమాణము చొప్పునసూరికల్కము చేసి ద్రాగిన అగ్నిమాంద్యము హరించు.

## అగ్నిమాంద్య వటికములు,

శ్లో॥ [ఆయుర్వేదే] మృతసూతంవిషంగంధ మజామోదా ఫలత్రయమ్। సర్జక్షారం యవక్షారం వహ్నిసైంధవజీరకమ్ । సువర్చలంవిడంగాని సాముద్రంత్ర్యూషణంసమమ్ । విషముష్టింసర్వతుల్యం జంబీరామ్లేనపేషయేత్ । మరిచంభాం వటీంఖాదేద్వహ్నిమాంద్యప్రశాంతయే। పథ్యాశుంఠీగుడం చానుపలార్ధంభక్షయేత్సదా । అగ్నిమాంద్యవటీంఖాదేత్స ర్వాజీర్ణప్రశాంతయే॥

తా. రసభస్మము శుద్ధిచేసిన నాభి శుద్ధిజేసిన గంధకము వోమము త్రిఫలము లు సర్జక్షారము యవక్షారము చిత్రమూలము సైంధవలవణము జీలకఱ్ఱ సౌవర్చలవణ ము. వాయువిడంగములు సముద్రలవణము త్రికటుకములు యివి సమభాగములు వీని కన్నిటికి సమము పెనుముష్టిచెక్క యిటులవీనినెల్ల ఖల్వములోనునిచి నిమ్మపండ్లర సముతో మర్దించి మిరియపు గింజలంత మాత్రలు జేసి యందొకదానిని కరక్కాయ శొంఠి బెల్లము అనువానని సమభాగములుగనూరి ½ పలము ముద్దజేసి యీయనుపా నముతోడ ప్రత్యహము సేవించుచుండిన అగ్నిమాంద్యము సర్వాజీర్ణము హరించు.

అగ్నిమాంద్యమునకు క్షారాదివటికములు.

శ్లో॥ త్రిక్షారం పంచలవణం మరీచం పంచకోలకమ్ ।
అజామోదం తథాహింగు మాతులుంగ ద్రవైస్సమమ్ ।
గోలాదాడిమతోయైర్వా మర్దితంగోళకీకృతమ్ ।
కర్షంచభక్షయేన్నిత్య సప్తాహంవహ్నిదీప్తయే॥

తా సర్జక్షారము యవక్షారము టంకణక్షారము పంచలవణములు మిరియాలు పిప్పళ్ళు మోడి చవ్యము చిత్రమూలము శొంఠి వోమము యింగువ వీనిని సమభాగ ములుగ ఖల్వములోనునిచి మాదీఫలరసముతో మర్దించి పిదప రేగుపండ్లు రసము తోగాని లేక దాడింబపండ్లరసముతోగాని మర్దించి కర్షప్రమాణము మాత్రలుజేసి 7 దినములు సేవించిన అగ్నిదీపమును గలుగంజేయు.

అగ్నిమాంద్యమునకు తామ్రభస్మ యోగము.

శ్లో॥ మృతతామ్రం కణాచూర్ణం తుల్యంక్షౌద్రైర్విమిశ్రితమ్ ।
నిష్కార్థం భక్షయేన్నిత్యం దుష్టవహ్నిం ప్రదీపయేత్ ॥

తా. తామ్రభస్మము పిప్పళ్ళు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి తేనె తోగలిపి ½ నిష్క ప్రమాణమును ప్రత్యహము సేవింపుచుండిన దుష్టమైన అగ్ని మాంద్యమును హరింపంజేయు.

అగ్నిమాంద్యమునకు అర్ద్రిక కల్పము.

శ్లో॥ ఆర్ద్రికస్య రసంక్షౌద్రం పలమాత్రంపిబేదను ।
యథేష్టంఘృతమాంసాని సద్యోభవతిపావకః॥

తా. 1 పలము అల్లపురసములో 1 పలము తేనెగలిపి సేవించి పిదప యథేష్టముగ నెయ్యిని మాంసమును భక్షించిన తత్క్షణమున అగ్ని దీపనమును గలుగంజేయు.

శ్లో॥ [చికిత్సాసారసిద్ధసంగ్రహే] గోమూత్రే భృంగవాసానాం స్వరసేషుపృథక్పృథక్ । సప్తవారంచమండూరం భృష్ట్వా సంచూర్ణ్యసూక్ష్మకమ్। తచ్చూర్ణంవ్యోష చూర్ణేన సమాంసేన ఘృతాన్వితమ్ । జీవలంవా ఏషేవేత శీతళంచాశునాశయేత్ । జీర్ణ జ్వరంపాండురోగం శోఫంచానలసాధనమ్।

తా. ప్రాత చిట్టెమును చూర్ణముచేసి కొలిమిలో నునిచి యూగ్ని గోమూత్రము గుంటగలగర అడ్డసరము అనువానిరసములలో ప్రతిదానిలో 7 మార్లు వైచి పిదప దానినెండించి సూక్ష్మముగ చూర్ణముజేసి దానికి సమముగ త్రికటుక చూర్ణము గలిపిగాని లేక కలపకగాని నేతితో సేవించిన శీతలము పురాణజ్వరము పాండువు శోఫ వీనిని హరింపంజేయుటయేగాక అగ్ని దీపనమును గలుగంజేయు.

## చింతామణి రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసంగంధ మృతంశుల్బం మృతమభ్ర(?) ఫలత్రికమ్ । త్ర్యూషణంజయపాలంచ సమంఖల్వేవిమర్దయేత్ । ద్రోణపుష్పీరసేభావ్యం శుష్కం తద్వస్త్రగాలితమ్ । చింతామణిరిసోహ్యేష హ్యజీర్ణేనస్య తేసదా । జ్వరమష్టవిధంహంతి సర్వశూలహరఃపరః ! గుంజైకంవా ద్విగుంజంవా హ్యామవాతహరఃపరః।

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిజేసిన గంధకము తామ్రభస్మము అభ్రికభస్మము త్రిఫలములు త్రికటుకములు శుద్ధిజేసిన నేపాళపువిత్తులు వీనినెల్ల సమభాగములుగ ఖల్వములోనునిచి [illegible]మ్మిపూలరసముతో మర్దించి భావనజేసి యెండించి వస్త్రగాలితముజేసి 1 గురిగి[illegible] యెత్తునుగాని లేక 2 గురిగింజలు యెత్తునుగాని సేవిం[illegible] సర్వాజీర్ణములు [illegible]విధములైన జ్వరములు సర్వశూలలు ఆమవాతము హరించు.

## ఆదిత్య రసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] దరదంచవిషంగంధం త్రికటుత్రిఫలాసమమ్।

జాతీఫలంలవంగంచ లవణానిచపంచవై ।
సర్వమేకీకృతంచూర్ణ మమ్లయోగేనసప్తధా।
భావయిత్వావటీకార్యా గుంజార్ధ ప్రమితాబుధైః।
రసోహ్యదిత్యసంజ్ఞోయ మజీర్ణక్షయకారకః॥
భుక్తమాత్రంపాచయతి జఠరానలదీపనః॥

తా. శుద్ధిచేసిన యింగిలీకము శుద్ధిచేసిన నాభి శుద్ధిచేసిన గంధకము త్రికటుకములు త్రిఫలములు జాజికాయ లవంగములు పంచలవణములు వీనినెల్ల సమభాగములుగ ఖల్వములోనునిచి * ఆమ్లవర్గరసములో 7 మార్లు భావనజేసి 6 గురిగింజలయెత్తును సేవించిన అజీర్ణమును హరింపంజేయుటయేగాక అగ్నిదీపనమును సగాకలుగంజేసి దేనిని భక్షించినను పచనంబగునటులం జేయు.

అజీర్ణ బలకాలానల రసము.

శ్లో॥ ద్విపలంశుద్ధసూతంచ గంధకంచ సమంమతమ్ । లోహం తామ్రంహరితాళంవిషంతుత్థంసవంగకమ్। పలప్రమాణంచ పృథగ్లవంగంటంకణంతథా। దంతిమూలం త్రివృచ్చూర్ణయే కైకంపలసమ్మితమ్ । అజామోదా యవానీచద్విక్షారలవణానిచ । పృథగర్ధపలంగ్రాహ్య మేకీకృత్యచభావయేత్ । ఆర్ద్రకస్వరసేనైవ వింశతిఃపంచకోలజైః। దశధాభావయేత్తోయై ర్గుడూచీనాంరసైర్దశ । సర్వార్ధం మరిచందత్వా కాచకుప్యాంచధారయేత్ । చణమాత్రాం వటీంకృత్వా ఛాయాయాంపరిశోషయేత్ ।రసోజీర్ణబలకాలానలఏష ప్రకీర్తితంః॥అనేకకాలనష్టాగ్నే ర్దీపనఃపరమస్మృతః। ఆమవాతకులధ్వంసీ ప్లీహపాండుగదాపహః। ప్రమేహానాహ విష్టంభసూతికాగ్రహణీహరః । శ్వాసకాసప్రతిశ్యాయ యక్ష్మక్షయవినాశనః। ఆమ్లపిత్తంచశూలంచ భగందర గుదోద్భవా। అష్టోదరాణి

* ఆమ్లవర్గమన — రేగు దాడిమ పులిచింత పుల్లప్రబ్బలిమాదీఫలము అనునవి

ప్లీహంచ యకృతంహంతిదారుణమ్ । ఆకంఠంభోజయిత్వా తు ఖాదయేచ్చరసోత్తమమ్ । అర్ధయామేనతత్సర్వంభస్మీ భవతినిశ్చితమ్। చతుర్విధరసోపేతం మహాభోజనమిచ్ఛితః । భోజస్యన్నపతేః కాంతూభోజనేకృపయాకృతః । గహనానం దనాథేనసర్వలోకహితైషిణా ॥

తా. శుద్ధిచేసిన రసము 2 పలములు శుద్ధిచేసిన గంధకము 2 పలములులోహ భస్మము తామ్రభస్మము శుద్ధిచేసిన తాళకము శుద్ధిచేసిన నాభి శుద్ధిచేసిన మైలుతుత్తము తగరభస్మము లవంగములు వేల్చిన వెలిగారము దంతివేరు శుద్ధిచేసిన తెగడ యివి దినుసుకొక్కొకపలము అజామోదము వోమము సర్జక్షారము యవక్షారము పంచలవణములు యివి దినుసుకు ½ పలము యిటుల వానినెల్ల ఖల్వములోనునిచి అల్లపురసముతో 20 భావనలు పంచకోలముల రసముతో 10 భావనలు తిప్పతీగె రసముతో 10 భావనలుజేసి యీ యౌషధమున ½ భాగము మిరియపుచూర్ణము గలిసి సెనగలంత మాత్రలుజేసి గాజుపాత్రలోనునిచి నీడనెండించి యందొకదానిని సేవించిన చిరకాలముగనుండు అగ్నిమాంద్యము ఆనువాతము ప్లీహము పాండువు ప్రమేహము ఆనాహము మలబద్ధము నూతికాగ్రహణి కాసముశ్వాసము పడిసెము క్షయరోగము శరీరకృశత్వము ఆమ్లపిత్తము శూల భగందరము మూలరోగము 8 విధములైన యుదరములు దారుణమైన యకృత్ప్లీహములు వీనిని హరింపంజేయు.మఱియు నిది తృప్తిగ భుజింపబడిన యన్నమునంతయు ½ ఝామునలోపల జీర్ణముగావించు. మఱియు నీరసము భక్ష్యభోజ్య లేహ్య చోష్య రసయుక్తమైన మహాభోజనమునం దిచ్ఛగల భోజమహారాజునకు మిక్కుటముగ భోజనేచ్ఛను గలుగంజేయుటకై సర్వలోక హితమును గోరునట్టి గహనానంద నాథునిచే జెప్పంబడియె.

## శంఖ ద్రావకము.

శ్లో॥ లవణానితథాక్షారాః ప్రత్యేకంపంచభాగకాః । కాసీసంటంకణంతుత్థంగంధకంనింబుకద్రవమ్ । తిలాపామార్గజంక్షారం ప్రత్యేకం వేదభాగమ్ । నవసాగరసౌరాష్ట్రీ సర్జికానేత్ర భాగికాః। ఏతత్సర్వంసమాలోడ్య భావ్యంజంబీరనిరతః । సరంధ్రేనలికాయంత్రే యామయుగ్మంవిపాచయేత్ । శంఖ

దాడిమోంభవే దేశ స్సర్వాజీర్ణనికృంతనః । లోహపాషాణశం
ఖానాం ద్రావకోయంనసంశయః ॥

తా. పంచలవణములు * సర్వక్షారములు యివిదినుసుకు 5 భాగములుశుద్ధిజే
సిన అన్నభేది వెలిగారము శుద్ధిజేసిన మైలుతుత్తము శుద్ధిజేసిన గంధకమునిమ్మపండ్ల
రసము నువ్వులక్షారము వుత్తరేణుక్షారము యివి దినుసుకు 4 భాగములు నవాసాగ
రము పటికారము లేక తొవరిమన్ను సర్జక్షారము యివి దినుసుకు 2 భాగములు యి
టుల వీనినెల్ల నేకముజేసి నిమ్మపండ్లరసముతో మర్దించి రంధ్రముతో గూడియుండు
వళికాయంత్రమున 2 ఝాములు పాకముజేసిన శంఖద్రావకము సిద్ధంబగు. ఇది
సర్వాజీర్ణముల నశింపజేయుటయేగాక యినుము రాయి శంఖము అనువాని సగా
నిస్సంశయముగ ద్రవింపంజేయు.

## అజీర్ణములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] శ్లైష్మికేవమనంపూర్వం పైత్తికేమృదు
రేచనమ్ ॥ వాతికేస్వేదనంవాథ యథావస్థంహితంచతత్ ।
నానాప్రకార వ్యాయామో దీపనానిలఘూనిచ । బహుకాల
సముత్పన్నా ముద్గాలోహితశాలయః । విలేపోలాజమండశ్చ
సుంఠోముద్గరస స్తథా। ఏణోబర్హి శ్శశోలావః క్షుద్రమత్స్యా
శ్చసర్వశః। శాలిశాకంచ వేత్రాగ్రంవా స్తుకంబాలమూలకమ్।
లశునంవృద్ధకూష్మాండం నవీనంకదళీఫలమ్ । శోభాంజనం
పటోలంచ వార్తాకంకలలదంబుజమ్ । కర్కోటకంకారవేల్లం
బార్హ్తతంచమహార్ద్రకమ్ । ప్రసారణీచచాంగేరీ తద్వైవసు
విషణ్ణకమ్ । ధాత్రీఫలంనాగరంచ దాడిమంయవపర్పటాః ।
అమ్లవేతసజంబీరమాతులుంగానిమాక్షికమ్ । నవనీతంఘృతం

---

* సర్వక్షారములన—మొక్కము కొడిసె మోదుగ ఏపి దేవదారు తాడిరేల
జిల్లేడు బొంతజెముడు కలిగొట్టు క్రానుగ అడ్డసరము అరటి చిత్రమూలము నేలమ
డుగుమ్రాను ఎఱ్ఱకాంచనము ఏడాకులయరటి కూరనెల్లి వూసగురువింద బీర అను
వానివేళ్లను ఫలములను ఆకులను కొమ్మలను ప్రత్యేకముగ గాల్చి బూడిదె జేయవల
యు ననుట।

తక్రంసౌవీరకతుషోదకమ్ । ధాన్యామ్లంకటుతైలంచరామఠం లవణంతథా । యవానీమరిచంమేంధీ ధాన్యకం జీరకందధి । తాంబూలం తప్తసలిలం కటుతిక్తో రసోపివా । మందాన లేప్యజీర్ణేచ పథ్యమేత న్నృణాం భవేత్ ॥

తా. శ్లేష్మాధిక్యమువలన అగ్నిమాంద్యము అజీర్ణము విషూచిభస్మకముఅను నవి జనించు. ఐనను వానియందు తొలుత వమనము చేయించవలయు, మఱియు పిత్తాధిక్యమున మృదువుగ రేచనమున కొసంగవలయు, వాతాధిక్యమున స్వేదనక్రియం చేయవలయు. ఇటుల చేసిన హితకరంబుగ నుండు. మఱియు పలువిధములైన*వ్యాయామము దీపన లఘుకర శాకాదికములు దీర్ఘ కాలముమీద ఫలించెడి పెసలు రొట్టబియ్యము పేలాలమండము పెసలమండము జింక నెమలి కుందేలు లావుకపక్షి సన్నజాతి మత్స్యములు అనువానిమాంసము గొలుసుకూర వుదురుగొమ్ము చక్రవర్తి పుకూర లేతముల్లంగిగడ్డలు తెల్లుల్లి పండిన గుమ్మడుకాయ క్రొత్తఅరటికాయ మునగకాయ పొట్లకాయ వంకాయ తామరయగరులు నక్కదోసకాయ కాకరకాయ వార్తాకము అల్లము గొంతెమగోరుకూర పులిచింత సువిషణ్ణకము వుసిరికెకాయశొంఠి దానింబ యవలు పర్పాటకము పుల్లప్రబ్బలి నిమ్మపండు మాదీఫలము తేనె వెన్న నెయ్యి మజ్జిగ రేగుపండు కలి కూటినీళ్లు కారము నూనె యింగువ లవణము వోమము మిరియాలు మెంతులు కొతిమీర్లుజీలకఱ్ఱ పెరుగు తాంబూలము కాచిననీరుచేదు వొగరుగల రసము యివి అగ్నిమాంద్యము అజీర్ణము అను వానియందు పథ్యకరంబులు.

## అజీర్ణములయందపథ్యము.

శ్లో॥ విరేచనానినిర్యూహాన్ మూత్ర వాతవేగవిదారణమ్ । అతిరిక్తంచాధ్యశనంజాగరంవిషమాశనమ్ । రక్తస్రుతింశింబిధాన్యం మత్స్యమాంస ముపోదకమ్ । జలపానంచ విష్టంభంజాంబవ స్సర్వశాలుకమ్ । కూర్చికాంమోరటంక్షీరక కిలాటీ దుష్టవారిచ। విరుద్ధాసాత్మ్యపానానాం విష్టంభీనిగురూణిచ । అగ్నిమాంద్యే ప్యజీర్ణేచ సర్వాణి పరివర్జయేత్ ॥

* వ్యాయామ మన—సంచారము.

**తా.** **విరేచనము** మలమూత్ర అపానవాతముల బంధించుట అధికముగ భుజించుట జాగరణము **విషమాశనము** రక్తస్రావము శింబిధాన్యము మత్స్యమాంసము బచ్చలికూర **జలపానము** సెనగలు మొదలగు కడుపు నుబ్బించెడి పదార్థములు నేరేడు కలవదుంపలు **మొదలగు** సర్వదుంపలు యీనిన 7 దినములకు పిదప పితికబడిన యావుపాలు జున్ను విరిచినపాలు విరుగుడుజున్ను దుష్టమైననీరు విరుద్ధమైన ఆసాత్మ్యమైన అన్నపానములు మలబద్ధకరద్రవ్యములు జడపదార్థములు యివి అగ్నిమాంద్యము అజీర్ణము అనువానియం దపథ్యకరంబులు.

ఇది శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
తృష్ణాదాహ హృద్రోగ విషూచిఅలసక విలం
బిక అగ్నిమాంద్య అజీర్ణరోగ నిదాన
తత్సాధ్యాసాధ్య చికిత్సానుపాన
పథ్యాపథ్య లక్షణయుక్తం
ద్వాదశ ప్రకరణమ్.



శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

### — త్ర యో ద శ ప్ర క ర ణ ము. —

శ్లో॥ మహాదేవం మహాత్మానం దేవేశం శేషభూషణమ్।
శంకరం పార్వతీనాథం నీలకంఠ మహంభజే।

తా. దేవతలలో పెద్దవాడు మహాత్ముడు దేవతలకు ప్రభువు నాగాభరణుడు భక్తులకు సుఖమునిచ్చువాడు పార్వతీ వల్లభుడు నగు నీలకంఠుని నేను భజియించెద

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్య శిఖామణిమ్॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు అని పేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో కడు శ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథముయొక్క త్రయోదశ ప్రకరణమును వచింపుచున్నాడను.

### క్ష ష్ట ని దా న ము.

శ్లో॥ [ఆయుర్వేదే] విరోధీ న్యన్నపానాని ద్రవస్నిగ్ధ గురూణిచ । భజతా మాగతాంఛర్దిం వేగాంశ్చాన్యాన్ ప్రతిఘ్నతామ్ । వ్యాయామమతిసంతాప మతిభుక్త్వాని షేవినామ్ । శీతోష్ణ లంఘనాహారాన్ క్రమంముక్త్వా నిషేవినామ్ । ఘర్మశ్రమ భయార్తానాం ద్రుతం శీతాంబుసేవినామ్ । అజీర్ణాధ్యశనా నాంచ పంచకర్మాపచారిణామ్। నానాన్నదధిమత్స్యాతిలవ ణామ్ల నిషేవిణామ్ । మాషమూలక పిష్టాన్న తిలక్షీర గుడా శినామ్ । వ్యవాయంచాప్య జీర్ణేన్నే నిద్రాంచ భజతాందినా ।

విప్రాన్ గురూన్ ధర్షయతాం పాపం కర్మ చకుర్వతామ్। వాతాదయ స్త్రియోదుష్టా స్త్వగ్రక్తం మాంసమంబుచ। దూషయంతి సకుష్ఠానాం సప్తకో ద్రవ్యసంగ్రహః। అతః కుష్ఠానిజాయంతే సప్తచైకాదశైవచ॥

తా. క్షీరమత్స్యాది విరుద్ధాన్నపానముల ద్రవము స్నేహము జడత్వముగల యన్నపానముల సేవించుట వాంతి మూత్రపురీషాది వేగముల నడ్డగించుట భుజించిన తోడనే మిక్కుటముగ వ్యాయామము సేయుట యెండలోదిరుగుట శీతలము నుష్ణముగల యాహారములను లంఘనమును చెప్పబడిన క్రమమునకు విరుద్ధముగ సేవించుట వేడిశ్రమ భయము అనువానివలన పీడితుడై తత్క్షణమున శీతోదకమును ద్రాగుట అపక్వమైన యన్నమును భుజించుట భుజించినతోడనే మరల భుజించుట వమన విరేచనవస్తిస్వేద నస్య పంచకర్మల చేయునపుడుపచారముచేయుట నవీనాన్నము పెరుగు మత్స్యములు ఉప్పు పులుసు ఉద్దులు ముల్లంగి పిష్టాన్నము నువ్వులు పాలు బెల్లము అనువానిని సేవించుట భుజించిన యన్నము జీర్ణమగుటకు ముందు మైథునము సేయుట పగటియందు నిద్రించుట గురుబ్రాహ్మణుల దిగస్కరించుట పాపకర్మల సేయుట యీ కారణమువలన వాతాది దోషములు ప్రకోపించి దుష్టంబులై త్వగ్రక్త మాంసోదకముల జెఱచి కుష్ఠరోగమును గలుగజేయు. మఱియు కుష్ఠరోగము జనించుటకు వాత పిత్త శ్లేష్మములు త్వగ్రక్తమాంసోదకములు అను నీ 7 ను ముఖ్యకారణ భూతంబులు. అట్లగుటచే 18 కుష్ఠువుల జనింపుచున్నయవి అందు మహా కుష్ఠువులు 11.

## కుష్ఠరోగ పూర్వరూపము.

శ్లో॥ అతిశ్లక్ష్ణకరస్పర్శ స్వేదాస్వేద వివర్ణతాః। దాహఃకండూ స్త్వచిస్వాపస్తోదః కోఠోన్నతిః క్లమః। వ్రణానా మధికం శూలం శీఘ్రోత్పత్తి శ్చిరస్థితిః। రూఢానామపిరూక్షత్వం నిమిత్తేల్పేపికోపనమ్। రోమహర్షో స్సృజఃకార్ష్ణ్యం కుష్ఠలక్షణమగ్రజమ్॥

తా. కుష్ఠరోగము గలుగబోయ్యెడి స్థలమును దానికి మిక్కిలి నున్నగగాని లేక గరగరయనిగాని యుండుట ఆస్థానమున చెమటబట్టుట లేక పట్టకుండుట ఆ స్థలము వివర్ణంబై తాపము దురదగలుగుట చర్మమున స్పర్శజ్ఞానము లేకుండుట పొడిచినటుల పీడగలుగుట కంచిరీగ కరచినటుల దద్దులు లేచుట ఆయాసమును వ్రైద్ధ

కనే శ్రమగలుగుట వ్రణమున మిక్కుటముగ పోట్లుగలుగుట వ్రణము శీఘ్రముగ జనించి చిరకాలంబుండుట పుట్టిన వ్రణము రూక్షగనుండుట వొకింత నిమిత్తమువలన ప్రకోపించుట రోమాంచముగలుగుట రక్తము నల్లగనగుట ఇవియు కుష్ఠరోగమునకు పూర్వరూపంబులు.

## కుష్ఠరోగ భేదములు.

శ్లో॥ [మాధవనిదానే] పుండరీకం సవిస్ఫోటం పామాస్యం గజ
చర్మకమ్। కాకణంకచ్ఛకంబుశ్యజిహ్వాకంచాష్టమంస్మృతమ్
గళితంచమహాకుష్ఠం కాపాలంచాప్యుదుంబరమ్। మండలంచ
విచర్చ్యాఖ్యావై పాదీకిట్టిభంతథా। చర్మదద్రుతథాసిధ్మశతా
రుష్యం దశాష్టకమ్। శ్విత్రికాఖ్యం విసర్పంచ వింశద్భేదాః
ప్రకీర్తితాః॥

తా. పుండరీకకుష్ఠము విస్ఫోటకకుష్ఠము పామాకుష్ఠము గజచర్మకుష్ఠము కాకణకుష్ఠము కచ్ఛకకుష్ఠము బుశ్యజిహ్వాకకుష్ఠము గళితకుష్ఠము అన నీ 8 యు మహాకుష్ఠములు. కపాలకుష్ఠము వుదుంబరకుష్ఠము మండలకుష్ఠము విచర్చికకుష్ఠము వైపాదికుష్ఠము కిట్టిభకుష్ఠము చర్మదద్రుకుష్ఠము సిధ్మకుష్ఠము శతారుష్యకుష్ఠము అన కుష్ఠరోగములు 18 విధంబులు. మఱియు శ్విత్రకుష్ఠము విసర్పకుష్ఠము అను నీ 2 తోడ కుష్ఠరోగములు 20 విధంబులు.

## పుండరీక కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవదానే] పుండరీక * దళాకారం శ్వేతంరక్తాన్తఘనం
గురు। ‡ క్లేదంకండూస్సరాగంచ పుండరీకం కఫాధికే॥

తా. తామర రేకులవలె నుండుట రక్తము వ్యాపించియుండుట వరకు తెలుపుగ దట్టముగ బలువుగనుండుట నీరుగారుచుండుట దురదగలుగుట మధ్యమున రక్తవర్ణముగనుండుట యీ లక్షణములుగలది పుండరీక కుష్ఠమని తెలియవలయును ఇది కఫాధిక్యమువలన జనించు. (ఇది మహాకుష్ఠము.)

---

* దళంతామ్రం శ్వేతరక్తం ఘనంగురుమ్॥

‡ గళగండ సరాగంచ.

### విస్ఫోటక కుష్ఠ లక్షణము.

శ్లో॥ స్ఫోటకండూతీవ్రదాహ మరుణం స్నిగ్ధపాండురమ్ ।
పాణికుక్షిరుజాక్లేదం కుష్ఠవిస్ఫోటలక్షణమ్॥

తా. స్ఫోటకము దురద తీవ్రదాహముగలుగుట యెఱ్ఱగనుండుట మెఱయుచుండుట పాండురవర్ణముగనుండుట చేతులు కడుపు అనువానియందు పీడగలుగుట నీరుగారుట ఈ లక్షణములుగలది విస్ఫోటకకుష్ఠమని తెలియవలయు, (ఇదిమహాకుష్ఠము.)

### పామా కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] సూక్ష్మాశ్చబహ్వ్యః పిటకాస్స్రావవత్యో గుణాన్వితాః । దాహఃకండూః కఫాజ్జాతా పామేత్యుక్త్వా చికిత్సయేత్॥

తా. సూక్ష్మమైన పిటికలు మిక్కుటముగ గలిగియుండుట పిటికలయందు తెల్లని పులినీరుగారుట తాపము దురదగలుగుట యీ లక్షణములు గలది పామా కుష్ఠమని తెలియవలయు ఇది కఫమువలన జనించు. (ఇది మహాకుష్ఠము)

### గజచర్మ కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] * అస్వేదం ఘనకండూశ్చ యన్మత్స్య శకలోపమమ్ । ‡బహుళం హస్తిచర్మాభం తత్కృష్ణం గజచర్మకమ్॥

తా. చెమటపట్టకుండుట మిక్కుటముగ దురదగలుగుట మత్స్యపుతునకలవలె నధికముగనుండుట యేనుగుచర్మముతో సమానముగ నలుపువర్ణముగనుండుట ఈ లక్షణములు గలది గజచర్మకుష్ఠమని తెలియవలయు (ఇది వాత శ్లేష్మాధిక్యమువలన జనించు. ఇది మహాకుష్ఠము.)

### కాకణ కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] యత్కాకచంచుకావర్ణం సపాకం తీవ్రవేదనమ్ । త్రిదోషలింగం తత్కుష్ఠంకాకణంనైవసిధ్యతి॥

---

* ఆస్వేదనం మహావాస్తు.

‡ తదేవకుష్ఠం చర్మాఖ్యం బహుళం హస్తిచర్మవత్.

తా. కాకిముక్కుతో సమానమైన వర్ణము గలదిగనుండుట నొకింతపాకము తీవ్రవేదనగలుగుట త్రిదోషలక్షణయుక్తంబుగనుండుట యీలక్షణములుగలది కాకణకుష్ఠమని తెలియవలయు. ఇది అసాధ్యము. (ఇది మహాకుష్ఠము.)

## కచ్ఛత్వ కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] రక్తంస్నిగ్ధంఘనశ్యామ మతికండూ కఫోద్భవమ్। ఊరుకక్షకటీష్వేవంకచ్ఛత్వకుష్ఠ కాహ్వయమ్॥

తా. ఎఱ్ఱనై మెఱయుచుండుట ఘనమై నల్లగనుండుట కడుదురదగలుగుట తొడలు చంక మొల అనువానియందు జనించుట. ఈ లక్షణములుగలది కచ్ఛత్వకుష్ఠమని తెలియవలయు.

## ఋష్యజిహ్వ కుష్ఠ లక్షణము.

శ్లో॥ కర్కశంరక్తపర్యంత మంతశ్శ్యావ సువేదనమ్।
యదృశ్యజిహ్వసంస్థాన మృశ్యజిహ్వంతదుచ్యతే॥

తా. కఠినముగనుండుట చుట్టునెఱ్ఱగనుండుట మధ్య నల్లగనుండుట వేదనతోగూడియుండుట తప్పి నాలుకవంటి యాకారముగలదిగనుండుట ఈ లక్షణములుగలది ఋశ్యజిహ్వక కుష్ఠమని తెలియవలయు. (ఇది మహాకుష్ఠము.)

## గళకుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] జిహ్వాకృష్ణవర్ణాయా హంతిసత్యంత్రిమాసకే। పాదయోశ్చతథాతాపో వళిస్త్ర్యంగుళికాపివా।
నాసాస్రస్వరభంగంచ గళత్కుష్ఠంత్రిదోషజమ్॥

తా. నాలుక నల్లగనుండుట కాళ్లయందు తాపముగలుగుట మూడంగుళముల ప్రమాణము వళులుగలిగియుండుట ముక్కున నెత్తురుగారుట స్వరము జెడుట ఈ లక్షణములుగలది గళత్కుష్ఠమని తెలియవలయు. ఇది త్రిదోషజనితంబగుటచే మూడుమాసములలో నిశ్చయముగజంపు. (ఇది మహాకుష్ఠము.)

## కపాలకుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] కృష్ణారుణకపాలాభంయదూక్షం*కర్క

---

* పరుషం.

శంతను । † వాతోత్థతోదబహుళం కాపాలకుష్ఠమిాదృశమ్॥

తా. నల్లనిమచ్చలు యెఱ్ఱనిమచ్చలు గలుగుట రూక్షముగ బిరుసుగనూక్ష్మముగనుండుట నూదులతో బొడుచునటుల మిక్కుటముగ పీడగలుగుట ఈ లక్షణములుగలది కపాలకుష్ఠమని తెలియవలయు. (ఇది అసాధ్యము.) ఈ కుష్ఠము వాతాధిక్యమువలన జనించు.

## ఔదుంబర కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] రుగ్దాహరాగకండూభిః పిత్తోత్థంలోమపింజరమ్। ఉదుంబరఫలాభాసం కుష్ఠమౌదుంబరంవదేత్ ॥

తా. శూల మంట యెఱుపువర్ణము దురద అనువానితో వ్యాప్తమైయుండుట వెంట్రుకలు ‡ పీతరక్తాధిక్యముగనుండుట మేడిపండు ఛాయవలెనుండుట ఈలక్షణములుగలది ఔదుంబరకుష్ఠమని తెలియవలయు. ఇది పిత్తాధిక్యమువలన జనించు.

## మండల కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శ్వేతంరక్తంస్థిరంస్త్యానం స్నిగ్ధముత్పన్నమండలమ్ । కృచ్ఛ్రమన్యోన్యసంయుక్తం కుష్ఠం మండలముచ్యతే॥

తా. తెల్లగ యెఱ్ఱగ కఠినముగ దట్టముగ స్నిగ్ధముగ మండలాకారముగనుండుట మండలము లొకదానితో నొకటి గూడియుండుట ఈ లక్షణములుగలది మండలకుష్ఠమని తెలియవలయు. ఇది కష్టసాధ్యము. ఈ మండలకుష్ఠము కఫాధిక్యమువలన జనించు.

## ప్రసూతి కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] అంగతోదోమండలాశ్చ దేహస్పర్శంనవిందతి । తథామారుత పిత్తోత్థం కుష్ఠం ప్రసూతికాక్వచిత్ ॥

తా. అంగములలో నూదులతో బొడుచునటుల వేదన మండలములు గలుగుట శరీరమున స్పర్శజ్ఞానము లేకుండుట యీ లక్షణములుగలది ప్రసూతిక కుష్ఠమని

† కాపాలంతోదబహుళం తత్కుష్ఠంవిషమంస్మృతమ్॥
‡ అనగా యెఱుపధికముగాగల పచ్చరంగు.

కొందరు వచించెదరు. ఇదే గ్రంథాంతరేణ మహాకుష్ఠమని చెప్పంబడు నిది వాతపి త్తప్రకోపమువలన జనించు.

## విచర్చిక కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శ్వేతరక్తాఘనాక్లిన్నా వాతపైత్యోద్భవా బహు। సకండూదాహసంయుక్తా జ్ఞేయంకుష్ఠం విచర్చికా॥

తా. దట్టమైన మచ్చలుగలిగి తెల్లగ యెఱ్ఱగ నుండుట నీరుగారుచుండుట దురద మంటలుగలుగుట యీ లక్షణములుగలది విచర్చికకుష్ఠమని తెలియవలయు. ఇది తఱుచుగ వాత పిత్తాధిక్యమువలన జనించు.

## వైపాదిక కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శ్లేష్మవాతోద్భవంకుష్ఠం స్ఫుటితంతీవ్రవేదనమ్। రూక్షారుణంపాణి పాదంఖ్యాతం వైపాదికంవదేత్॥

తా. పగిలియుండుట తీవ్రమైన వేదనగలుగుట చేతులుకాళ్ళు రూక్షముగయెఱ్ఱగనుండుట యీ లక్షణములుగలది వైపాదిక కుష్ఠమని తెలియవలయు. ఇది వాత శ్లేష్మాధిక్యమువలన జనించు.

## కిట్టిభ కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శ్యావంకిణంఖరస్పర్శం సకండూ పరుషం ఘనమ్। వాతశ్లేష్మోద్భవంఖ్యాతం కిట్టిభం కుష్ఠమీదృశమ్।

తా. మచ్చలు నీలవర్ణముగ బిరుసుగనుండుట దురదగలుగుట రూక్ష విదళము గనుండుట యీలక్షణములుగలది కిట్టభకుష్టమని తెలియవలయు. ఇది వాత శ్లేష్మాధిక్యమువలన జనించు.

## చర్మదళ కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] రక్తంశూలంఖరంకండూః క్లేదస్ఫోటందళత్యపి। స్పర్శంసహ్యంఘనంస్నిగ్ధం కుష్ఠంవై చర్మకంవదేత్॥

తా. యెఱ్ఱనిమచ్చలుగలుగుట శూలయుక్తమై బిరుసుగనుండుట దురదగలుగుట నీరుగారుట బొబ్బలులేచుట పగులుట తాకిన వేదనలేకుండుట దట్టముగనుండుట మెఱయుట యీ లక్షణములుగలది చర్మదళ కుష్టమని తెలియవలయు. (ఇది మహాకుష్టము.)

దద్రు కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] కండూమద్భిస్సరాగైశ్చ గండైరలసకం చితమ్ । పిటికామండలాశ్శుభ్రైర్దద్రూః పిత్తకఫోద్భవమ్॥

తా. వ్రణములు దురదతోగూడియెఱ్ఱగనుండుట అలసకమువలెనే వ్యాపించియుండుట పిటికలు గుండ్రముగ తెల్లగనుండుట యీ లక్షణములుగలది దద్రుకుష్ఠమని తెలియవలయు. ఇది కఫపిత్త ప్రకోపమువలన జనించు. (ఇది మహా కుష్ఠము.)

సిధ్మ కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శ్వేతంతామ్రంచతను యద్రజోఘృష్టంవిముంచతి। * వాతశ్లేష్మోద్భవంసిధ్మమలాబుకుసుమోపమమ్॥

తా. తెలుపు యెఱుపుగలసి సూక్ష్మపు మచ్చలుగలుగుట వొరిసికొనిన పిండివలెరాలుట అనుగపువ్వులతో సమానముగ నుండుట (తలుచుగ ఱొమ్మునందేజనించుట) ఈ లక్షణములుగలది సిధ్మకుష్ఠమని తెలియవలయు. ఇది వాత శ్లేష్మాధిక్యమువలన జనించు.

శతారుష్క కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] రక్తశ్యామంఘనంక్లేదం స్నిగ్ధకండ్వార్తిదాహకమ్। పిత్తశ్లేష్మోత్థితంకుష్ఠంశతారుష్కంబహువ్రణమ్॥

తా. మచ్చలెఱుపుగ నలుపుగదట్టముగనుండుట నీరుగారుచుండుట మెరయుచుండుట దురద శూల మంట అనేక వ్రణములుగలుగుట యీ లక్షణములుగలది శతారుష్కకుష్ఠమని తెలియవలయు. ఇది పిత్తశ్లేష్మాధిక్యమువలన జనించు.

శ్వేతకుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శంఖవర్ణంభవేచ్ఛ్విత్రే సాధ్యాసర్వాంగగోపివా । శుష్కంవైకృచ్ఛ్రసాధ్యంచ గుహ్యే పాణితలానుగమ్ । అగ్నిదగ్ధమసాధ్యం స్యాత్తథావర్జ్యంచిరంతనమ్॥

* ప్రాయేణోరసిత త్సిధ్మ.

తా. * శ్విత్రకుష్ఠము శంఖవర్ణముగలదై సర్వాంగముల వ్యాపించియుండిన అసాధ్యంబనియు శరీరమంతట వ్యాపించి శరీరము గృశించియుండిన కష్టసాధ్యంబనియు గుహ్యము అరచెయ్యి అనువానియందు జనించి యగ్నివలె మండుచుండిన అసాధ్యంబనియు తెలియవలయు, మఱియు చిరకాలముగనుండు కుష్ఠువు సగా అసాధ్యంబు. (ఇది వాతపిత్తాధిక్యమువలన జనించు)

## కుష్ఠురోగ సాధ్యములు.

శ్లో॥ ఉదుంబరంతత్సదృశం శ్విత్రంస్యాచ్ఛంఖసన్నిభమ్ । కాకణం
పక్వగుంజాభం చర్మాఖ్యంగజచర్మవత్ । పుండరీకంస్యాసం
జ్ఞాభం ఋశ్యజిహ్వం తథైవచ । బహువ్రణ శతారుస్స్యాం
దేకాఖ్యంమత్స్యకృత్తివత్ । ఫాణిభేదశ్చర్మదళంపాదభేదో
విపాదికా। దశైతానిసాధ్యాంతే శేషాణ్యష్టౌచసాధ్యవత్।
కపాలమసితంరూక్షం విస్ఫోటాఖ్యంవిసర్పవత్ । కిట్టిభంకిణ
వచ్ఛ్యామందద్రుస్స్యాత్త్వ చిపాకితా। తుంబీపుష్పనిభం
సిధ్మస్నిగ్ధంస్యాన్మండలంస్థిరమ్ । విస్ఫోటదారుణాపామా
సామస్రావా విచర్చికా ॥

తా. ఉదుంబర కుష్టువు మేడిపండువర్ణముగ శ్విత్రకుష్టువు శంఖవర్ణముగ కాకణకుష్టువు పండిన గురువిందవర్ణముగ గజచర్మకుష్టువు యేనుగుతోలుతో సమానముగ పుండరీకకుష్ఠువు తెల్లదామరపువ్వుతో సమానముగ ఋశ్యజిహ్వాకుష్టువు దుప్పి నాలుకతో సమానముగ శతారుష్యకుష్టువు బహువ్రణయుక్తముగ యేకాఖ్యకుష్టువు మీనుచిప్పతో సమానముగ చర్మదళకుష్టువున అఱచేతులు దళమై పగిలినట్లుగనై పాదుక కుష్టువు కాళ్ళుపగిలినట్లుగ నుండు యీ 10 యు నసాధ్యంబులు, కపాలకుష్టువునల్లనై రూక్షముగ విస్ఫోటకకుష్టువు విసర్పితో సమానముగ కిట్టిభకుష్టువు మచ్చలతోగూడి నల్లగ దద్రుకుష్టువు పొక్కులతో గూడినదిగ సిధ్మకుష్టువు సొరపువ్వుతో సమానముగ మండలకుష్టువు మెరుపు కాఠిన్యముగలదిగ పామాకుష్టువు దారుణమైన పొక్కులతో గూడినదిగ విచర్చికాకుష్టువు పులిసీరువు కార్చునదిగనుండు. ఈ 8 యు సాధ్యంబులు.

* శ్విత్రకుష్ఠమన — శిబ్బెము.

## దద్రు కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] కండూమద్భిస్సరాగైశ్చ గండైరలసకం చితమ్ । పిటికామండలాశ్శుభ్రైర్దద్రూః పిత్తకఫోద్భవమ్॥

తా. వ్రణములు దురదతోగూడియెఱ్ఱగనుండుట అలసకమువలెనే వ్యాపించియుండుట పిటికలు గుండ్రముగ తెల్లగనుండుట యీ లక్షణములుగలది దద్రుకుష్ఠమని తెలియవలయు. ఇది కఫపిత్త ప్రకోపమువలన జనించు. (ఇది మహా కుష్ఠము.)

## సిధ్మ కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శ్వేతంతామ్రంచతను యద్రజోఘృష్టంవిముంచతి। * వాతశ్లేష్మోద్భవంసిధ్మమలాబుకుసుమోపమమ్॥

తా. తెలుపు యెఱుపుగలసి సూక్ష్మపు మచ్చలుగలుగుట వొరిసికొనిన పిండివలెరాలుట అనుగపువ్వులతో సమానముగ నుండుట (తఱుచుగ ఱొమ్మువందేజనించుట) ఈ లక్షణములుగలది సిధ్మకుష్ఠమని తెలియవలయు. ఇది వాత శ్లేష్మాధిక్యమువలన జనించు.

## శతారుష్య కుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] రక్తశ్యామంఘనంక్లేదం స్నిగ్ధకండ్వార్తిదాహకమ్। పిత్తశ్లేష్మోత్థితంకుష్ఠంశతారుష్యంబహువ్రణమ్॥

తా. మచ్చ తెలుపుగ నలుపుగదట్టముగనుండుట నీరుగారుచుండుట మెరయుచుండుట దురద శూల మంట అనేక వ్రణములుగలుగుట యీ లక్షణములుగలది శతారుష్యకుష్ఠమని తెలియవలయు. ఇది పిత్తశ్లేష్మాధిక్యమువలన జనించు.

## శ్విత్రకుష్ఠ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శంఖవర్ణంభవేచ్ఛ్విత్రే సాధ్యాసర్వాంగగోపివా । శుష్కంవైకృచ్ఛ్రసాధ్యంచ గుహ్యపాణితలానుగమ్ । అగ్నిదగ్ధమసాధ్యం స్యాత్తథావర్జ్యచిరంతనమ్॥

---

* ప్రాయేణోరసితత్సిధ్మ.

## కుష్ఠరోగ సాధ్యా సాధ్యములు.

శ్లో॥ [ఆయుర్వేదే] సాధ్యంత్వగ్రక్తమాంసస్థంవాతశ్లేష్మాధికంచ యత్ । మేదసిద్వంద్వజం యాప్యంవర్జ్యమజ్జాస్థిసంశ్రితమ్। క్రిమిహృల్లాసమందాగ్నిసంయుక్తం యత్త్రిదోషజమ్। ప్రభిన్నంప్రస్రుతాంగంచరక్తనేత్రంహతస్వరమ్। పంచకర్మగుణాతీతం కుష్ఠంహంతీహ కుష్ఠినమ్॥

తా॥ త్వక్ రక్త మాంసధాతువులవరకు వ్యాపించియుండు కుష్ఠువును వాత కఫములు ప్రధానంబుగనుండు కుష్ఠువును సాధ్యంబులు మఱియు మేదోధాతుగత కుష్ఠువు ద్వంద్వజకుష్ఠువు యాప్యంబులు మఱియు మజ్జ అస్థులవరకు వ్యాపించియుండు కుష్ఠువు శుక్రధాతుగతకుష్ఠువు మఱియు క్రిమి హృల్లాసము మందాగ్ని అను వానితో గూడియుండు కుష్ఠువు త్రిదోషజకుష్ఠువు అసాధ్యంబులు కుష్ఠముపగుల నీరు గారుచుండు కుష్ఠురోగియు ఎఱ్ఱని నేత్రములుగాని లేక హీనస్వరము గాని గల కుష్ఠురోగియు వమనవిరేచనాది పంచకర్మల కనర్హుండగుకుష్ఠురోగియు మృతినొందెదరు.

## అసాధ్య కుష్ఠు లక్షణము.

శ్లో॥ గుహ్యపాణితలోష్ఠేషు జాతమప్యచిరంతనమ్ ।
వర్జనీయంవిశేషేణ కిలాసంసిద్ధిమిచ్ఛతా ॥

తా. గుహ్యము అరచెయ్యి పెదవి అనువానియందు కుష్ఠువు తత్కాలమున జనించినను దానిని విశేషముగ వర్జింపవలయు మఱియు యశస్సుగోరెడువైద్యుడు కిలాసకుష్ఠువును సగా వర్జింపవలయు.

శ్లో॥ ద్విలింగంచథవేత్కుష్ఠంవిశేషేణత్యజేద్భిషక్ ।
బహూపద్రవసంయుక్తమసాధ్యముదితంబుధైః ।

తా. మఱియు ద్వంద్వ లక్షణములతో గూడియుండు కుష్ఠువులను వైద్యుడు వర్జింపవలయు మఱియు పలుయుపద్రవములతో కూడియుండు కుష్ఠురోగంబు అసాధ్యంబని ఆయుర్వేద వేత్తలు పలించెదరు.

## సంసర్గజరోగములు.

శ్లో॥ [మాధవనిదానే] ప్రసంగాద్గాత్రసం స్పర్శాన్ని శ్వాసాత్సహ

భోజనాత్ । సహశయ్యాసనాచ్చాపి వస్త్రమాల్యానులేప
నాత్ । కుష్ఠంజ్వరశ్చ *శోషశ్చ నేత్రాభిష్యంద ఏవచ। ఔప
సర్గికరోగాశ్చసంక్రామంతి నరాన్నరమ్॥

తా. కుష్ఠువు జ్వరము ధాతుశోష నేత్రరోగముగలవారితో సాంగత్యముసే యుట వారి శరీరమునుదాకుట వారియొక్క శ్వాసోచ్ఛ్వాసములు సోకుట యేకపాత్రలో భుజించుట వొకటిగబరుండుట వొకయాసనమున నేకముగ గూర్చుండుటవారు ధరించిన వస్త్రములను పుష్పములను ధరించుట వారు తాకినగంధమును బూసికొనుట ఈ కారణములవలన పూర్వోక్తకుష్ఠాదిరోగములు వొకనివద్దనుండి మఱియొకనికంటును.

శ్వేతకుష్ఠువుకు భృంగ్యాది చూర్ణము.

శ్లో॥ [చింతామణౌ] భృంగీవహ్నిత్రిఫలావచాకణావాకుచీబ్రహ్మి
శుంఠీసకుష్ఠమ్ । భల్లాతాచాశ్వ గంధాశిఖిగరక విశాషోడ
శీభస్మసూతమ్ । కాంస్యేపాత్రేరజశ్చత్రి ఫలజయుతంపాత్రి
రుత్థాయ పీతమ్ । షణ్మాసాద్రోగహారిపలిత పలితహృ
త్స్వర్ణ దేహీశరీరీ॥

తా. గుంటగలగర చిత్రమూలము త్రిఫలములు వస పిప్పళ్లు భావంచి విత్తులుమండూకబ్రహ్మి మలయాళపుశొంఠి చంగల్వకోష్ఠు శుద్ధిజేసిన జీడిగింజల పెన్నేరుగడ్డ శుద్ధిచేసిన మైలుతుత్తము శుద్ధిచేసిన నాభి పసపు రసభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి త్రిఫలకషాయములో భావనజేసి యెండించి కాంశ్యపుగిన్నెలోనునిచి ప్రాతఃకాలమున ప్రత్యహము ధరణమెత్తుచూర్ణమును సేవించి వెంబడిగ చారెడు త్రిఫలకషాయమును పానము సేయువలయు. ఇటుల 6 మాసములు సేయుచుండిన శ్వేతకుష్ఠువు వలీపలితములు హరించి బంగరు ఛాయతో తుల్యమైన శరీరముగలుగు.

శ్వేతకుష్ఠువునకు పశుపతి చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] సురతరుకృతమాలా । వ్యాలదారుర్వరాచ
తపనకనక పుష్పీచాపిగౌరీవిశాలా । సమకృతంశిరేఖా సూత
భస్మాపిభుక్త్వాపశుపతికృతచూర్ణం శ్వేతకుష్ఠంనిహంతి॥

---

* శోఫశ్చ

తా. దేవదారు రేల చిత్రమూలము త్రిఫలములు జీడిగింజలు నేలతంగేడు సమూలము యివి పావుసేరు పసపునాటాకు పాపరవేరునాటాకు వీనికన్నిటికి సమము. క్రొలుగచ్చపిత్తులు యిటుల వీనినెల్ల పంచి చూర్ణముజేసి 1 తులము చూర్ణములో వీసమెత్తు రసభస్మము గలిపి ఆవునేతితో ప్రతిదినము సేవింపుచుండిన 6 మాసములకు శ్వేతకుష్ఠువు హరించు. ఇని శివునిచే జెప్పంబడియె.

గీ॥ తామ్రము భస్మంబు తెలగాచు తపనదుగ్ధ ।
మునను మర్దించియుచ్ఛోటం బూయవలయు ।
మేంక రెండువాముదపుకాయ మీదిపొట్టు ।
పెగనుగాచినమానును శ్వేతకుష్ఠు॥

## పుండరీకకుష్ఠువునకు సర్వాంగసుందర రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] విష్ణుక్రాంతా దేవ దాళీ సర్పాక్షీ తండులీయ
నిః । నీలీబ్రహ్మీసలాశంచ యథాలాభం ద్రవంహరేత్ ।
ద్విత్రిణామేదనిర్యాసై స్సూతసంమర్దయేద్దినమ్ । సూతా
కంద్విగుణం గంధమేకీకృత్య క్షణంపచేత్ । లోహపాత్రేధృ
తంయావత్తథా శుల్బాభ్రికామృతమ్ । కర్పూరంచైవ ప్ర
త్యేకంసూతపాదాం శకంక్షిపేత్ । పుండరీకంహరేన్నిష్క
మనుపాన విశేషతః॥

తా. శుద్ధిచేసిన రసము 1 భాగము శుద్ధిచేసిన గంధకము 2 భాగములు యిటుల వీనిని ఖల్వములో నునిచి విష్ణుక్రాంతను దేవదాలి సర్పాక్షి చిట్టి అవిసె నీలి మండూకబ్రహ్మి మోదుగ అనువానిలో దొరికిన వానిని గ్రహించి రసముదీని ప్రతిదానిలో నొక్కొకదినము మర్దించి అందు పైజెప్పబడిన వృక్షములలో 2 గాని 3 వృక్షములయొక్క బంకనుతెచ్చి మరల మర్దించిముద్దజేసి యినుపగిన్నెలో నునిచి క్షణకాలము పాకముజేసి ఖల్వములోనునిచి అందు తామ్రభస్మము అభ్రకభస్మము శుద్ధిచేసిన నాభి కర్పూరము యివానిలో ప్రతిదానిని రసములో 4 వ భాగము గలిపి మర్దించి నిష్కప్రమాణము మాత్రలుజేసి బావిసెనగాకు రసములో (1 సంవత్సరము) సేవింపుచుండిన పుండరీక కుష్ఠువు హరించు.

## ఉదుంబర కుష్ఠువునకు కనకసంకోచ రసము.

శ్లో॥ [మాధవనిదానే] మృతతామ్రాభ్రకం తుల్యం ద్వయో

న్సూతంచతుర్గుణమ్ । యామైకంమర్దయేత్ఖల్వేచాష్టవిష్టంచ గోళకమ్ । త్రిభిస్తుల్యంశుద్ధగంధంలోహపాత్రితంక్షిపేత్ । తన్మధ్యేగోళకంపాచ్యం యావజ్జీర్ణంతుగంధకమ్ । తావన్మృద్వగ్నినాయత్నా త్సముద్ధృత్యవిచూర్ణయేత్ । గుగ్గులునింబపంచాంగం త్రిఫలాచమృతంవిషా । పటోలంఖాదిరంసారం వ్యాఘ్రఘ్నీంసమంసమమ్ । చూర్ణితంమధునా లేహ్యంనిష్క మౌదుంబరాపహమ్॥

తా. తామ్రభస్మము 1 భాగము అభ్రకభస్మము 1 భాగము రసభస్మము 8 భాగములు యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి విష్ణుక్రాంతము డావరశంగి సర్పాక్షిచెట్టి అవిసె నీలి మండూకబ్రహ్మి మోదుగ అనువాని రసములతో నొక్కొక జాము మర్దించి యుంటజేసి 10 భాగములు శుద్ధిజేసిన గంధకమును యినుపగిన్నెలోవైచి దానిపై యుంటనునిచి దానిపై మరల గంధకమువైచి జీర్ణంబగువరకు మృద్వగ్నితోవండి సాంగశీతలమునదీసి ఖల్వములోనునిచి చూర్ణముజేసిన మహిసాక్షిగుగ్గిలము వేపపువ్వు తానికాయలు దానియాకు దానిపట్ట దానివేరు త్రిఫలములు శుద్ధిచేసిన నాభి అతివస చేతిపొట్ల కాచు రేల అనువానిని నమభాగములుగ చూర్ణముజేసి గలిపి నిష్కప్రమాణమును తేనెలో (సాయంప్రాతఃకాలములయందు 18 మాసములు) సేవించిన ఉదుంబరకుష్ఠువు హరించు.

శ్వేత్రకుష్ఠువునకు చంద్రప్రభాన రసము.

శ్లో॥ [నిత్యనాథీయే] శుద్ధసూతంద్విధాగంధంమర్ద్యంనింబమయూరయోః । ద్వయోర్ద్రావైస్సగోమూత్రైర్దినంవాకుచికాద్రవైః । మూసాపిండితకంక్షిప్త్వా తంరుద్ధ్వాభూధరేపుటేత్ । సాంగశీతంసముద్ధృత్య చూర్ణాద్దశగుణంక్షిపేత్ । తథాచ వాకుచీబీజం గోమూత్రేమర్దయేద్దినమ్ । ద్వినిష్కంవటికాం ఖాదేచ్ఛ్వేత్రకుష్ఠవినాశిని । ఖ్యాతాచంద్ర ప్రభాహ్యేషా కుర్యాత్తక్రేణభోజనమ్ । కాకోదుంబరికామూలం జలైర్ఘృష్టంపిబేదను॥

తా. శుద్ధిచేసినరసము 1 భాగము శుద్ధి చేసిన గంధకము 2 భాగములుయిటుల వీనిని ఖల్వములోనునిచి వేప నెమలియాకు అనువాని రసములతో నొక్కొక్కదినము మర్దించి పిదప గోమూత్రముతోను భావంచాకు రసముతోను మర్దించి తుంగముస్తెలు బ్రమంగవేళ్ళు అనువాని చూర్ణమును గలిపి భూధరపుటంబిడి సాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి చూర్ణముజేసి దానికి 10 యింతలు భావంచివిత్తులచూర్ణగలిపి గోమూత్రముతో 1 దినము మర్దించి 2 నిష్కములంత మాత్రలుజేసి యందొకదానిని సేవించి వెంబడిగ బ్రహ్మమేడివేరు యుదకముతోనూరి దాని రసమును ద్రాగిన 18 మాసములకు శ్వేతకుష్ఠువు హరించు. పథ్యము మజ్జిగయన్నమును భుజింపవలయు. మఱియు చిత్రమూలమును నిమ్మపండురసముతో గంధము దీసి మూత్రాకారము గలిపి లేపనముజేసిన శ్వేతకుష్ఠువు నశించు.

## కాకణకుష్ఠువునకు సూర్యకాంత రసము.

శ్లో॥ పలత్రయంమృతంతామ్రం సూతమేకంద్విగంధకమ్। త్రికటుత్రిఫలాచూర్ణం ప్రత్యేకంస్యాత్పలంపలమ్। నిర్గుండీచార్ద్రకద్రావైర్వహ్నిద్రావై ర్విమర్దయేత్। దినైకంశంనిరుధ్యాథ తుషాగ్నౌచ పచేద్దినమ్। సముద్ధృత్య విచూర్ణ్యాథ వాకుచీతైలమర్దితమ్ త్రిదినం భావయేత్తేన నిష్కమాత్రంచభక్షయేత్। కుష్ఠంచ కాకణంహంతి సర్వకుష్ఠం నిహంత్యలమ్॥

తా. తామ్రభస్మము 3 పలములు శుద్ధిచేసినరసము 1 పలము శుద్ధిచేసినగంధకము 2 పలములు త్రికటుకములు 1 పలము త్రిఫలములు 1 పలము యిటులవీనినెల్ల చూర్ణముచేసి ఖల్వములోనునిచి వావిలాకు అల్లము చిత్రమూలము అనువానిరసములతో నొక్కొకదినము మర్దించి యినుపగిన్నెలోనునిచి పైనమూసి వరియుముకతో 1 దినము పాకముజేసి సాంగశీతలమున దీసి మరల ఖల్వములోనునిచిభావంచివిత్తులతైలముతో మర్దించి 3 దినములు భావనజేసి నిష్కప్రమాణము గొప్పున 18 మాసములు సేవింపుచుండిన కాకణకుష్ఠువు మొదలగు సర్వకుష్ఠువులు హరించు.

## కాకణకుష్ఠువునకు కరంజతైలాది లేపము.

శ్లో॥ తైలంకరంజ బీజోత్థం వహ్నిసైంధవ గాహితమ్।
మార్జితంలేప యేద్ధంతి శీఘ్రమేవతు కాకణమ్॥

తా. చిత్రమూలము సైంధవలవణము అనువానిచూర్ణమును క్రొన్నుగవిత్తుల తైలముతో గలిపి లేపనము సేయుచుండిన కౌకణకుష్ఠువు శీఘ్రముగ హరించు.

## గజచర్మ కుష్ఠువునకు లంకేశ్వర రసము.

శ్లో॥ పలైకం శుద్ధసూతంచ కర్షైకం శుద్ధగంధకమ్। గంధతుల్యాం మృతంతామ్రం సూతాంశం మర్దయేద్విషమ్। సర్వతుల్యాంపు నర్గంధందత్వాకించిద్విమర్దయేత్ ।ఘృతాభ్యక్తేలోహపాత్రే పచేద్యామం సముద్ధరేత్ । రంభాపత్రేపుటీచాథ పాచయే త్పర్పటీంయథా ॥ మాషైకం చూర్ణితంఖాదే ద్గజచర్మనియ చ్ఛతి । నిష్కైకంవాకుచీంక్షౌద్రై శ్లేహోయంగజచర్మణి॥

తా. శుద్ధిచేసిన రసము 1 పలము శుద్ధిచేసిన గంధకము 1 కర్షము తామ్రభస్మము 1 కర్షము శుద్ధిచేసిన నాభి 1 పలము యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి మర్దించి దీనికి సమముగ గంధకముగలిపి వోకింత మరల మర్దించి నెయ్యిబూసిన యినుప గిన్నెలోనునిచి 1 జాము వండి దించికొని సాయంత్రమున అరటియాకులో బిళ్ళజేసియునిచి సన్నపు మంటను నప్పడమువలెగాల్చిచూర్ణముజేసి మాషప్రమాణమును సేవించి వెంబడిగ నిష్కప్రమాణము భావించివిత్తులు చూర్ణములో తేనెగలిపి సేవింపుచుండిన గజచర్మకుష్ఠువు హరించు.

## విచర్చికా కుష్ఠాంతక రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధసూతం విషంగంధంతుల్యాంతాప్యం శిలాజతు । శుల్బందీక్షం మృతంలోహం సర్వంమర్ద్యం దినత్రయమ్ । కాకమాచీ దేవదాల్యోః కర్కోటస్య ద్రవైర్పృథక్ । శోషయేద్భావరేపాచ్యం త్రిదినంతుతుషాగ్నినా । ఆదాయ భావయేచ్ఛాహ సైలైర్వా కుచిసంభవైః । నిష్కార్ధంలేహయేత్క్షౌద్రైః రసఃకుష్ఠనికృంతనః । భల్లాతవాకుచీపథ్యా విడంగం చిత్రకంతథా । జీరకం బదరీమూలం కటుతైలేం గుదేనతు । భక్షయేద నుపానేన హంతికుష్ఠం విచర్చికామ్॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన నాభి శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన స్వర్ణమాక్షీకము శుద్ధిజేసిన శిలాజిత్తు తామ్రభస్మము వృక్కభస్మము యినుపభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నల్లకాచాకు డావరడంగి గొడ్డుకాకర అనువానిని రసములతో ప్రతిదానిచే నొక్కొకదినము చొప్పున 3 దినములు మర్దించి యెండించి మూసలోనునిచి వుసుకతో 3 దినములు భూధరపుటంబిడి స్వాంగశీతలమున దీసి భావంచివిత్తుల తైలముతో 1 దినము భావనజేసి ½ నిష్కప్రమాణము తేనెతో సేవించి వెంబడిగ శుద్ధిజేసిన జీడిగింజలు భావంచివిత్తులు కరక్కాయ వాయువిడంగములు చిత్రమూలము జీలకఱ్ఱ రేసునేపు అనువాని చూర్ణములో తెల్ల ఆవనూనెగాని * కటుతైలముగాని యింగుదీతైలముగాని కలిసి సేవించిన 18 మాసములకు విచర్చికకుష్టువు హరించు.

## ఋష్యజిహ్వక కుష్ఠువునకు శైలేంద్రరసము.

శ్లో॥ [పూజ్యపాదీయే] శుద్ధసూతం సమంగంధం కాంతభస్మవి
షంతథా। వాకుచీ త్రిఫలాచూర్ణం నింబవహ్ని గుళూచిజైః।
దినంభృంగి ద్రవై ర్మర్ద్యం వాకుచ్యాశ్చ కషాయకైః॥ భక్ష
యేల్లోహపాత్రస్థం కర్షార్ధం జిహ్వకాప్రముత్ । గుంజాభ
ల్లాతతైలాభ్యాం నిష్కంవాకుచిచూర్ణకమ్ । లేపయేదనుపా
నేన సర్వకుష్ఠవినాశనః॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిచేసిన గంధకము కాంతభస్మము శుద్ధిచేసిన నాభిభావంచివిత్తులచూర్ణము త్రిఫలచూర్ణము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వేము చిత్రమూలము తిప్పతీగె గుంటగలగర అనువాని రసములలో ప్రతిదానితోడను భావంచివిత్తుల కషాయముతోడను నొక్కొకదినము మర్దించి యినుపగిన్నెలోనునిచి ½ కర్షమును సేవించుటయేగాక గురిగింజవిత్తులు జీడివిత్తులు అనువాని తైలములో నిష్కప్రమాణము భావంచివిత్తులచూర్ణము గలిపి శరీరమునకు లేపనముజేసిన ఋష్యజిహ్వక కుష్టువు మొదలగు సర్వకుష్టువులు హరించు.

---

* కటుతైలమన — శ్లో॥ పృథ్వీకామూల జీమూతా దంతీ కవచశిగ్రుజమ్ । నింబసీకరంజార్కహస్తికర్ణింగుదీభవమ్।శంఖినీ నింబకంతైలం తైలం జ్యోతిష్మతీకృతమ్ కుసుంభసర్షపోద్భూతం తైలంసౌవర్చలంతథా॥ ఇవియు కటుతైలములు.

శతారుష్య కుష్ఠమునకు లంకాధిపేశ్వర రసము

శ్లో॥ సూతాభ్రశుల్బ భస్మాని గంధం * తాప్యం శిలాజితు । అమ్ల వేతసతుల్యాంశం చామ్లేనమర్దయేత్తతః । మధ్వాజ్యాభ్యాం వటీఃకుర్యా ద్విగుంజంభక్షయేత్సదా । † కుష్ఠంశతారుషం హంతి రసోలంకాధిపేశ్వరః । త్రిఫలా నింబమంజిష్ఠా వచా పటోలమూలకం। కటుకీరజనీతుల్యాంక్వాథోయమనుపానతః॥

తా. రసభస్మము అభ్రకభస్మము తామ్రభస్మము శుద్ధిచేసిన గంధకము శుద్ధి చేసిన హేమమాక్షికభస్మము రేక శుద్ధిచేసిన తాళకము శుద్ధిచేసిన శిలాజతు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వీనిని సమముగ పుల్లప్రబ్బలిమార్గను గలిపి నిమ్మపండ్లరసము తేనె నెయ్యి అనువానితో 4 జాములు మర్దించి 2 గురిగింజలయెత్తు మాత్రలుజేసి యందొకదానిని త్రిఫలములు వేము మంజిష్టి వసంచేలిపొట్లవేరు ఆకాకర పసపు అనువాని కషాయానుపానముతోడ సాయం ప్రాతఃకాలముల సేవించిన శతారుష్యకుష్ఠము హరించు.

కచ్ఛకకుష్ఠమునకు కుఠారరసము.

శ్లో॥ [మాధవనిదానే] సూతాభ్ర శుల్బకాంతానాం మృతానాం గంధకంసమమ్ । తేషాం చతుర్గుణంచాజ్య మేతత్క్వాథై ర్విపాచయేత్ । అమృతాముసలీముండి హస్తికర్ణీశతావరీ । అయం పంచామృతక్వాథో ఘృతా చ్చాతుర్గుణోభవేత్ । మార్కవా మృతజీవంతి విదార్యాశ్చ కషాయకమ్ । పూర్వాంశం నిక్షిపేజ్జీర్ణే మస్మిన్‌జీర్ణ మిదంభవేత్ । ఘృతావశేషకంపక్వా సదాసేవేతబుద్ధిమాన్ । సర్వాకుష్ఠాన్నిహంత్యాశు కచ్ఛ కంచవ్యపోహతి॥

తా రసభస్మము అభ్రకభస్మము తామ్రభస్మము కాంతభస్మము యివి దినుసు కొక్కొకభాగముశుద్ధిచేసిన గంధకము 4 భాగములు నెయ్యి 32 భాగములు పంచామృతమను--తిప్పతీగ నేలతాటిగడ్డలు బోడతరము సముద్రపాడపాకు పిల్లిపీచర ను

* తాళం.

† కుష్ఠంహంతినసందేహ

వాని కషాయము 128 భాగములుగలిపి ఘృతము శేషించునటులకాచి దీనికి 4 గిం తలు గుంటగలగర తిప్పతీగ మనుబాల నేలగుమ్ముడు అనువాని కషాయమునుగలిపి యది జీర్ణంబై ఘృతము శేషించువరకు మరలకాచి సేవించిన కచ్ఛపకుష్ఠువు హరించు.

## మండలకుష్ఠువునకు సర్వేశ్వర రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం చతుర్గంధం పలంయామం విమర్దయేత్ । మృతతామ్రాభ్రలోహానాం హింగుళంచ పలం పలమ్ । జంబీరోన్మత్తవాసాభి స్స్నుహ్యర్క ముష్టిజైర్ద్రవైః । మర్ద్యంహయారిజద్రావైః ప్రత్యేకంచదినందినమ్ । ఏవంసప్త దినంమర్ద్యం తద్గోళం వస్త్రవేష్టితమ్ । వాలుకాయంత్ర * కేపాచ్యం త్రిదినం లఘునాగ్నినా । ఆదాయ చూర్ణయేచ్ఛ్లక్ష్ణంపలైకంయోజయేద్విషమ్ । ద్విపలంపిప్పలీచూర్ణం మిశ్రంసర్వేశరోరసః । ద్విగుంజంలేహయేత్క్షౌద్రై † స్సుప్తమండలకుష్ఠనుత్ ॥ వాకుచీం దేవదారుంచకర్ష మాత్రం విచూర్ణితమ్ । లిహేదేరండతైలేనచానుపానంసుఖావహమ్॥

తా. శుద్ధిచేసిన రసము 1 పలము శుద్ధిచేసిన గంధకము 4 పలములుయీరెంటిని ఖల్వములోనునిచి 1 జామునుదించి అందు తామ్రభస్మము అభ్రకభస్మము లోహభస్మము శుద్ధిచేసిన యింగిలీకము అనువానిని దినుసుకొక్కొక్క పలము చొప్పున గలిపి నిమ్మపండ్లరసము వుమ్మెత్తాకురసము అడ్డసరపాకురసముజెముడుపాలు జిల్లేడుపాలు ముష్టిచెక్క గన్నేరు అనువాని రసములలో ప్రతిదానిచే నొక్కొక్క దినము వంతున 7 దినములు మర్దించి ముద్దజేసి బట్టలోగట్టి దానిపై చీలమన్ను లేపనము జేసి లఘ్వగ్నిలో 3 దినములు వాలుకాయంత్రమున పాకముజేసి యందుండి దీసి మరల ఖల్వములోనునిచి సున్నగచూర్ణముజేసి శుద్ధిజేసిన నాభి చూర్ణము 1 పలము పిప్పలి చూర్ణము 2 పలములు గలిపి 2 గురిగింజలయెత్తును తేనెతో భక్షించి వెంబడిగ కర్షప్రమాణము భావంచి దేవదారు అనువాని రసములలో నాముదముగ పి త్రాగిన మొద్దుబారియుండుమండలకుష్ఠువు హరించు.

* సంస్వేద్యం.  † శ్విత్ర.

## వైపాదిక కుష్ఠువునకు మహాకాళ రసము.

శ్లో॥ శుద్ధసూతంమృతంతామ్రంకుష్ఠంగంధకటంకణమ్ । పిప్పలీచ సమంమర్ద్యం మాతులుంగ ద్రవైర్దినమ్ । త్రిఫలాంసర్వ తుల్యాంశమేకీకృత్య చభక్షయేత్। నిష్కైకంచ లిహేచ్చా మధ్వాద్యాంజేవాకుచీరసమ్ । కుష్ఠంవైపాదికంహంతిమహా కాళరసాహ్వయమ్ । ద్విగుంజంభక్షయేన్నిత్యాం తథావిజయ పర్వతీమ్। మూలార్జునంపటురక్తాహ్వా శాలలీభృంగముండికాః । కరంజనింబపంచాంగం నిర్గుండీవాకుచీసమమ్ । మధ్వాజ్యై ర్లేహయేత్కర్ష మనుస్యాత్సర్వకుష్ఠజిత్॥

తా. శుద్ధిజేసిన రసము తామ్రభస్మము చెంగల్వకోష్టు శుద్ధిజేసిన గంధకము వెలిగారము పిప్పళ్ళు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మాదీఫల రసము తో 1 దినము మర్దించి దానికిసమముగ త్రిఫలచూర్ణముగలిపి మర్దించి మట్టిపాత్రలోనునిచి నిష్క ప్రమాణమును భావంచివిత్తులు రసానుపానముతోడ సేవించిన వైపాదికకుష్టువుహరించు. మఱియు మాలార్జునము (కాచు) సైంధవలవణము చిత్రమూలము బూరుగగుంటగలగర బోడతరము గోరింట వేపపువ్వు దానికాయల ఆకు చెక్క వేరు వావిలి భావంచివితులు వీనినిసమముగ కర్ష ప్రమాణము గ్రహించి తేనె నెయ్యి వీనితోనూరి 2 సురిగింజల యెత్తు విజయ పర్వటీరసమునుగలిపి సేవించిన 16 మాసములకు సర్వకుష్టువులు హరించు.

## విస్ఫోటక కుష్ఠువునకు బడబానల రసము

శ్లో॥ [మాధవనిదానే] సూతకస్యపలేద్వేచ చత్వారిగంధకస్యచ । వాలుకాయంత్రపక్వంతుజాయతే భస్మసూతకమ్ । అస్యసూతస్యభాగైకంటంకణాంస ప్తమాంశకమ్ । గంధకంచతుష్పే త్తత్ర శుల్బచూర్ణంతథైవచ । నాగరంకుష్ఠచూర్ణంచపిప్పలీచూర్ణ మేవచ । మాతులుంగరసైర్భావ్యంలేహయేన్మధుసర్పిషా । సప్తసప్తప్రయోగేణహంతికుష్ఠాష్టకందశ । షణ్మాసంచత్రయోగేణదేహసిద్ధిః ప్రజాయతే। సంవత్సరప్రయోగేణాభవేద్రు ద్రసన్నిభః । తస్యమూత్రపురీషాణి శుల్బంభవతికాం॥

తా. శుద్ధిచేసిన రసము 2 పలములు శుద్ధిజేసిన గంధకము 4 పలములు యీ రెంటిని ఖల్వములోనునిచి మర్దించి కుప్పెలోనునిచి వాలుకా యంత్రమున పాకము జేసిన రసము భస్మంబగు పిమ్మట వాసభస్మము 1 సేరు పేల్చిన వెలిగారము శుద్ధిచేసిన గంధకము తామ్రభస్మము శొంఠి చంగల్వకోష్టు పిప్పలి అనుపానిలో ప్రతిదినము 5 చిన్నముల యెత్తును తేనె నెయ్యి అనుపాని యనుపానములోడ నేడేసిదినముల చొప్పున 7 మార్లు సేవించిన 18 కుష్టువుల హరింపజేయు. మఱియుదీనిని 6 మాసములు సేవింపుచుండిన కాయసిద్ధిగలుగు. 1 సంవత్సరము సేవింపుచుండిన యీశ్వరునితో సమానుండగుటయే కాక వానిమూత్రపురీషములయందు తామ్రస్వర్ణము లుత్పత్తియగు.

## పామాకుష్ఠ చికిత్స.

శ్లో॥ [ఆయుర్వేదే] వాకుచ్యాస్తైలలేపేన తైలైర్వారాజవృక్షజైః । పుత్రజీవోత్థతైలైర్వాలేపః పామాం వినాశయేత్॥

తా. భావంచివిత్తుల తైలమును గాని లేక రేలతైలమును గాని లేక పుత్రజీవితైలమును గాని లేపనము జేసిన పామాకుష్టువు హరించు.

శ్లో॥ గంధకంతిలతైలేన నిష్కమాత్రంసదాపిబేత్ ।
క్షీరశాల్యన్నభోజ్యంచ పామాకండూహరంపరమ్॥

తా. నువ్వులనూనెలో నిష్కప్రమాణము శుద్ధిజేసిన గంధకమునుగలిపి పానము జేసిన పామాకుష్టువు దురద హరించు. పథ్యము పాలతోడ వరిబియ్యపు వంటకమును భుజింపవలయు.

## కపాలకుష్ఠమునకు సోమేశ్వర రసము.

శ్లో॥ [నిత్యనాథీయే] శుద్ధసూతంమృతంచాభ్రంగంధకంమర్దయేత్సమమ్। దినంనిర్గుండికాద్రావైరుద్ధ్యాహ్నిభూధరేపచేత్ । ఉద్ధృత్యవాకుచీతైలే వాకుచ్యావాకషాయకే । దినైకంభావయేద్ఘర్మే నిష్కమాత్రంతుభక్షయేత్ । వాకుచింకాకమాచీంచ త్రిఫలాంచూర్ణయేత్సమమ్ । మధ్వాజ్యైకర్షమాత్రంచలేహయేదనుపానకమ్ । కపాలంవిషమంకుష్ఠం హంతి సోమేశ్వరోరసః॥

తా. శుద్ధిచేసిన రసము అభ్రకభస్మము శుద్ధిజేసిన గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వావిలియాకు రసముతో 1 దినము మర్దించి మూసలోనునిచి దానిమూతినిమూసి భూధరపుటంబిడి సాంగశీతలమునదీసి భావంచివితులుతైలముతోగాని లేక భావంచి సమూలపాయసముతోగాని 1 దిన మెండలోనునిచి భావనజేసి నిమ్మ ప్రమాణమును భావంచివిత్తులు కాచాసు త్రిఫలములు అనువానినొక్క కర్ష ప్రమాణచూర్ణములో తేనె నెయ్యికలిపి యీ యనుపానముతోడ భక్షించిన కపాలకుష్టువు విషమకుష్టువు హరించు.

## మండలకుష్ఠువునకు విద్యాధర రసము.

శ్లో॥ [అయుర్వేదే] శుద్ధసూతం ద్విధాగంధం లోహపాత్రేక్షణం పచేత్ । శీతలంచూర్ణయేత్పశ్చాద్బధ్వావస్త్రేచతుర్గుణే । శోషయేత్పాచయేత్పశ్చాద్దశాంశంవత్సనాభకమ్ । క్షిప్త్వాసర్వం త్ర్యహంభావ్యం తైలైర్వాకుచిజైర్భవేత్ । గుగ్గులుత్రిఫలాగంధంసమమేరండతైలకే । ద్వినిష్కమను పానంస్యాన్నిష్కం మండలకుష్ఠనుత్ ॥

తా. శుద్ధిచేసిన రసము 1 భాగము శుద్ధిచేసిన గంధకము 2 భాగములు యీ రెంటిని ఖల్వములోనునిచి మర్దించి యినుపగిన్నెలోనునిచి క్షణకాలమువండి చల్లారిన పిదప ఖల్వములోనునిచి చూర్ణముచేసి 4 మడతలుగల బట్టలలోనునిచి చీలమన్ను లేపనముజేసి యెండించి పాకముచేసి పిదప పైయౌషధమునకు 10 వ భాగము శుద్ధిచేసిన నాభికలిపి భావంచివిత్తుల తైలములో 3 దినములు భావనచేసి నిమ్మ ప్రమాణమును శుద్ధిచేసిన మహిషాక్షిగుగ్గిలము త్రిఫలములు శుద్ధిచేసిన గంధకము వీనిని సమభాగములుగ నాముదములో మర్దించి 2 నిమ్మములయెత్తు ముద్దచేసి యీ యనుపానముతోడ సేవించిన మండలకుష్ఠువు హరించు.

## కిట్టిభకుష్ఠువునకు వజ్రపాణిరసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతంమృతంచాభ్రంమృతంతామ్రంవిషంసమమ్। మర్దయేద్వాకుచీతైలేయామైకంకృతగోళకం ద్విగుణే పాచయేద్గంధే సతైలే లోహపాత్రకే ॥ గ–

విజ్ఞేతు తద్గోళాంశం మృతాయసమ్ । పంచాంగనింబసంయుక్తం మధునాగోళకీకృతమ్ । నిష్కైకం కిట్టిభంహంతి వజ్రపాణిర్మహారసః । నిశాకణా నాగరంచ వేల్ల చిత్రకతాప్యకమ్ । క్రమోత్తర గుణంపిష్ట్వా గోమూత్రేణపిబేదను ॥

తా. రసభస్మము అభ్రకభస్మము తామ్రభస్మము శుద్ధిచేసినశాభి వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి భావంచివిత్తుల తైలములో 1 జాము మర్దించి యుద్దజేసి యినుపగిన్నెలో నునిచి దానికి 2 యింతలు శుద్ధిచేసిన గంధకము తెల్ల ఆవనూనె గలిగి గంధకము దెల్ల ఆవనూనె జీర్ణమగువరకు వండి ముద్దచేసిన దానికి సమముగ అయోభస్మము వేపపంచాంగముల చూర్ణము గలిపి తేనెతో మర్దించి నిష్కప్రమాణము మాత్రలు జేసి యందొక దానిని సేవించి వెంబడిగ పసపు 1 భాగము పిప్పళ్ళు 2 భాగములు శొంఠి 3 భాగములు పెద్దమాను చెక్క 4 భాగములుంచి త్రమూలము 5 భాగములు శుద్ధిచేసిన హేమమాక్షికము 6 భాగములు యిటుల వీనిని గోమూత్రములో నూరి త్రాగిన కిట్టిభవస్తువు హరికను

## దద్రు కుష్ఠువునకు పారిభద్ర రసము.

శ్లో॥ [రసరత్నాకరే] మూర్ఛితంసూతకంధాత్రీ ఫలంనింబస్యదాహరేత్ । తుల్యాంశంఖదిరక్వాథై ర్దినంమర్ద్యంచభక్షయేత్ । నిష్కైకందద్రుకుష్ఠఘ్నః పారిభద్రాహ్వయోరసః। మయూరముష్కకక్షారం శుద్ధసూతంచగంధకమ్। త్ర్యూషణంటంకణం సర్జతామ్రచూర్ణం సమందినమ్ । మేషశృంగీద్రవైర్మర్ద్య ంలేపాద్దద్రువినాశనమ్॥

తా. మూర్ఛజెందిన రసము వుసిరికపండు వేపపండు వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి తెల్లతుమ్మచెక్క కషాయముతో 1 దినముమర్దించి నిష్కప్రమాణము మాత్రలుచేసి యందొకదానిని సేవించుటయేగాక నెమలి చెక్కక్షారము పెడక్కపుచెట్టుక్షారము శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన గంధకము త్రికటుకములు వెలిగారము సర్జక్షారము తామ్రభస్మము అనువానిని సమభాగములుగ ఖల్వములోనునిచి పొడక్కపుచెక్కరసములో 1 దినమునూరి శరీరమునకు 6 మాసములు లేపనము జేసిన దద్రువస్తువు హరించు.

## సిధ్మకుష్ఠువునకు పారదాది లేపనము.

శ్లో॥ [మాధవనిదానే] పారదంటంకణంగంధం మూలకార్ద్రవ యోార్ద్రవైః। దినంమర్ద్యంచతల్లేపాత్సిధ్మంహంతిమహోద్భుతమ్॥

తా. రసము వెలిగారము గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ముల్లంగి అల్లము అనువాని రసములతో 1 దినము మర్దించి శరీరమున 6 మాసములు లేపనముజేసిన సిధ్మకుష్టువు హరించు.

## బేతాళ రసము.

శ్లో॥ [మాధవనిదానే] అభ్రకంమృతలోహంచ శుద్ధసూతం శిలాజతు । తాప్యం * చాంకోలబీజాని త్రిఫలాముసలీసమమ్ । సవ్యోషం చూర్ణితం లేహ్యం మధునా నిష్కమాత్రకమ్ । మాసైకంనాశయేత్సిధ్మ బేతాళోయంమహారసః ॥

తా. అభ్రకభస్మము లోహభస్మము శుద్ధిచేసిన రసము శుద్ధిజేసిన శిలాజిత్తు స్వర్ణమాక్షికభస్మము పూడుగవిత్తులు లేక భావంచివిత్తులు త్రిఫలములు నేలతాటిగడ్డలు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అందు త్రికటుకచూర్ణము గలిపి నిష్కప్రమాణమును తేనెతో 1 నెల సేవించిన సిధ్మకుష్టువు హరించు.

## విచర్చికా కుష్ఠువునకు కుష్ఠనికృంతన రసము.

శ్లో॥ [శారీరే] శుద్ధసూతం విషంగంధం తుల్యంతాప్యం శిలాజతు । శుల్బంతీక్ష్ణం మృతంలోహం సర్వంమర్ద్యం దినత్రయమ్ । కాకమాచీ దేవదాల్యోః కర్కోట్యాశ్చ ద్రవైర్ద్రవైః ధమ్ । రుద్ధ్వాహిమ్నాభూధరేపాచ్యం త్రిదినంతుతుషాగ్నినా । నిష్కార్ధం లేహయేత్క్షౌద్రైరసః కుష్ఠనికృంతనః । భల్లాతవాకుచీపథ్యా † విడంగా లాంగలీతిలాః । జీరకంబరీమూలం † తుల్యాం తుల్యాం గుడంసమమ్ । భక్షయే దనుపానేన హంతి కుష్ఠంవిచర్చికామ్॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన నాభి శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన సువర్ణమాక్షికము శుద్ధిచేసినశిలాజిత్తు తామ్రభస్మము వుక్కభస్మము లోహభస్మము

* వావుచిబీజాని † విడంగంచిత్రకంతధా. † కటుతైలేంగుదే

సమభాగములుగ ఖల్వములోనునిచి కాచివేళ్ళరసముతో 1 దినము డావరడంగిచెక్క రసముతో 1 దినము కాకరాకురసముతో 1 దినము మర్దించి ముద్దజేసి మూసము లోనునిచి దానిమూతినిమూసి 1 దినము భూధరపుటములో గాని లేక 3 దినములు వుసుకమంటలో గాని పాకము జేసి ½ నిష్కమును తేనెతోడ గాని లేక జీడివిత్తులు భావంచివిత్తులు కరకపప్పు వాయువిడంగములు చెన్నచర్లగడ్డ నువ్వులు జీలకఱ్ఱ రేగువేరు యివి సమభాగములు వీనికన్నిటికి సమము బెల్లముగలిపి త్రొక్కి ముద్దజేసి యీ యనుపానముతోడ గాని 18 మాసములు సేవింపుచుండిన విచర్చిక కుష్ఠువు హరించు.

గీ॥ కోలముక్కి చెక్క నాలుగుభాగాలు ।
నోషుమొక్కపాలు పేరిమతోడ ।
సిందురంబుగూర్చి సేవింపమానును ।
గుష్ఠువ్యాధులెల్లఁ గువలయమున ॥

క॥ వారిజపుచెక్కరసమునఁ। బేరెన్నికసిందురంబుఁబిప్పలిమోఁడిఁ
గూరిచిసేవించినచో । మారాడెడికుష్ఠగండమాలలడంగుఁ

గీ॥ కలియుగంబున మనుష్యులకరకకాయ ।
లించుకనిచూడఁ బోవకయేపుమీఱ ।
మండలంబారగించ భూమండలమున ।
గండమాలలుఁ గుష్ఠరోగములుమాను।

కుష్ఠరోగమునకు రసభస్మ యోగము.

శ్లో॥ [మాధవకల్పే] గంధకస్యపలేద్వేతు సూతకస్యపలంతథా ।
కచ్ఛపయంత్రగతంపక్వం లేహయే న్మధుసర్పిషా ।
మాషమాత్రప్రయోగేణ కుష్ఠంహరతిదారుణంబు॥

తా. శుద్ధిచేసిన గంధకము 2 పలములు శుద్ధిచేసిన రసము 1 పలము యీరెం టిని ఖల్వములోనునిచి మర్దించి కచ్ఛపయంత్రమున పాకముజేసిన భస్మంబగు అం దుమాషప్రమాణమును అద్దుగయెత్తు తేనెతో గాని లేక నేతితో గాని 18 మాసము లు సేవించిన దారుణమైన కుష్ఠువును హరింపంజేయు.

శ్లో॥ గంధకంత్రిఫలాయుక్తం ఘృతేన మధునాసహ ।
భక్షితంతు మహారోగాన్ హంతిమాసేనదారుణమ్॥

తా. శుద్ధిచేసిన గంధకము కరక్కాయ తానికాయ వుసిరికవరుగు వీనిని దినుసు కొక్కొత సేరు చొప్పున కలిపి ప్రతిదినము మాషమెత్తును నేతితోగాని లేక తేనెతోగాని 18 మాసములవరకు సేవించుచుండిన * మహారోగముల హరింపంచేయు. (లేక ఈ గ్రంథములో జెప్పంబడిన గంధక కల్పమును సేవించినను సర్వకుష్టువులు హరించు)

## కుష్ఠువులకు బడబానల రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] హింగూలసంభవంసూతం గంధకం మృతతామ్రకమ్ । సమ్యక్సూతంతథా కాంతంవంగంచాపిశిలాజతు। తుత్థంరసాంజనంచైవతాళకంశుద్ధమేవచ । వరాటకంచాపి తుల్యాం నేపాళం ద్విగుణీకృతం । హావుషాంపంచలవణం షుచైవకటుకానిచ । విడంగంపిప్పలీమూలం ప్రియంగురజమోదకం। ద్వావుష్ఠౌ రాకుష్ఠమేలాచ లవంగంజీరకద్వయం। శటీదంతి త్రివృచ్చైవ త్రిఫలాగజపిప్పలీ । సర్వమేకత్రసంచూర్ణ్య భావయేత్త్రిఫలాజలై । సప్తథా లఘుపాషాణే ప్రచండాతపశోషితం । హరీతకీరసేనాథ పునస్సంచూర్ణ్య యత్నతః। పంచరక్తీప్రమాణంతు వటికాంకారయేద్భిషక్। ఏకైకాంఖాదయేత్ప్రాయ శృంగబేర రసాప్లుతాం । వాంతికుష్ఠం తథామేద ఆమమారుతమేవచ। శ్లీపదం గండమాలాంచ గళగండంభగందరం । నాడీదుష్టవ్రణః చైవహ్యాంత్రవృద్ధించదారుణం । ఆమ్లపిత్తం రక్తపిత్తం పంక్తిశూలం హలీమ్లకం । వాతరక్తం । వాతకఫముపదంశసపీనసం।

* శ్లో॥ వాతవ్యాధ్యశ్శరీకుష్ఠ మేహోదరభగందరాః। ఆర్శాంసిగ్రహ ణ్యష్టౌ మహారోగాః ప్రకీర్తితాః॥ వాతరోగము అశరి కుష్ఠువు మేహము న ము భగంధరము అర్శస్సు గ్రహణి అన 8 దియూ మహారోగంబులు.

పంచగుల్మాం స్తథానాహం ప్లీహశోఫజ్వరానపి । ఉదరాణి తథాకాసాన్ రసోయంబడబానలః ॥

తా. యింగిలీకములో దీయబడినరసము శుద్ధిచేసిన గంధకము తామ్రభస్మము రసభస్మము కాంతభస్మము వంగభస్మము శుద్ధిచేసిన శిలాజిత్తు శుద్ధిచేసిన మైలుతుత్తము * రసాంజనము శుద్ధిచేసిన తాళకము గవ్వలభస్మము యివి సమభాగములు వీనికి రెండింతలు శుద్ధిజేసిన నేపాళములు బోడతరము పంచలవణములు పంచకటుకములు వాయువిడంగములు మోడి త్రేంకణము అజామోదము సర్జక్షారము యవక్షారము చంగల్వకోష్టు యేలకులు లవంగములు జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ కచ్చూరములు దంతివేరు శుద్ధిజేసిన తెగడ త్రిఫలములు యేనుగపిప్పలి యిటుల వీనినెల్లదంచి చూర్ణముజేసి త్రిఫలరసముతో 7 మారులుభావనజేసి దళముతేని పెంకులోనునిచి తీక్ష్ణమైన యెండనెండించి మరల కరక్కాయల రసముతో మర్దించి 5 రక్తికా ప్రమాణములంత మాత్రలుచేసి యందొకదానిని ప్రాతఃకాలమున అల్లపు రసములోగలిపి సేవించిన సర్వకుష్టువులు మేహరోగము ఆమవాతము శ్లీపదము గండమాల కంఠగండమాల భగందరము నాడీవ్రణము దుష్టవ్రణము దారుణమైన అంత్రవృద్ధి ఆమ్లపిత్తము రక్తపిత్తము పంక్తిశూలము హలీమకము వాతరక్తము వాతకఫము వుపదంశము పీనసము పంచగుల్మము ఆనాహము ప్లీహము శోఫజ్వరము వుదరరోగములు కాసము వీనిని హరింపంజేయు.

తాళక భస్మ యోగము,

శ్లో॥ [సిద్ధరసార్ణవే] అపామార్గస్యభస్మాని ఘటేనిక్షిప్యయత్నతః ।
తన్మధ్యేతాళకంక్షిప్త్వా పచేద్ద్వాదశయామకమ్ ।
ధవళంజాయతేభస్మ సర్వకుష్ఠ నివారణమ్ ।
సర్వవాత ప్రశమనం సర్వరోగ నివారణమ్ ।

తా. వుత్తరేణు బూడిదెను నీళ్ళతోనూరి పెద్దముంటగజేసి యెండించి దానిందొలిచి శుద్ధిచేసిన తాళకముతో నిండించి దానిపై వుత్తరేణు బూడిదెను దళముగమెత్తి దానిముఖముల చీలమన్ను లేపనముజేసి యెండించి అడుగునరంధ్రము జేయుబడిన కుండలోనునిచి 12 ఝాములువండిన తాళకము తెల్లగభస్మంబగు అందొ

* రసాంజనమన—మానిపసుపును అష్టమాంశముగ కషాయముకాచి దానిచసమముగ మేకపాలుబోసి గట్టిపడుగువరకు సిసుపబాణలిలో కాచి యెండించిచూర్ణముజేయుట.

క భాగమును 2 భాగములు పిప్పలిచూర్ణములోగలిపి తెల్ల ఆవనూనెతో గాని లేక తేనెతో గాని సేవించిన 18 కుష్టువులు 80 వాతరోగములు సర్వరోగములు వీనిని హరింపంజేయు.

శ్లో॥ [ఆయుర్వేదే] కువటీతాళకంతుల్యాం స్నుహీక్షీరేణ మర్దితమ్।కృత్వాతచ్చక్రికాంశోష్య కింశుకస్యతుభస్మనా। ఖర్పరింఘటమాత్రంచ విధాయాస్మిన్ నివేశయేత్। చక్రికోపరిచోంచాద్య క్షారైశ్చుల్యాంవిపాచయేత్।. పూరితంచఘటీయంత్రే క్షారేణైవపిధాయచ। క్రమాగ్నినాచైకదినం సాంగశీతలముద్ధరేత్। సంమర్ద్యచవ్రీహిమాత్రం శర్కరేణఘృతేనవా।ప్రాతస్సాయంప్రదాతవ్యం సర్వవాతవికారజిత్। వాతగ్రంథౌధాతుశోషే ప్రస్మృతౌరసవైకృతౌ। అష్టాదశ సుకుష్ఠేషు గవ్యాజ్యం దధితక్రకమ్॥

తా. శుద్ధిచేసిన తాళకమునకు సమముగ శుద్ధిచేసిన మణిశిలచూర్ణము గలిపి బ్రహ్మజెముడుపాలతో మర్దించి బిళ్ళచేసి యెండించి మోదుగక్షారమును నూరి మూకుడువలె నోరు వెడల్పుగనుండునటుల 1 కుండనుజేసి అందు చింత మొదలగు వాని క్షారములపరచి దానిపై తాళకపుబిళ్ళనునిచి దానిపై చింత మొదలగు వాని క్షారములపరచి మఱియొకకుండలో నునిచి దానినిండ చింత మొదలగువాని క్షారములబోసి గట్టించి బాగుగ చీలమన్ను లేపనముజేసి పొయిమీదనునిచి క్రమాగ్నులతో 1 దినము వండియుంచని తాళకపుబిళ్ళల సాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి మర్దించిన తెల్లగభస్మంబగు యీ తాళకభస్మములో వరిగింజయెత్తును పంచదారతో గాని లేక నేతితోగాని సాయంప్రాతఃకాలముల సేవింపుచుండిన 80 వాతరోగములు వాతగ్రంథులు సప్తధాతువులు శోషించుట వాపు రసవైకృతము 18 కుష్టువులు వీనిని నశింపంజేయు పథ్యము ఆవునెయ్యి పెరుగు చల్ల వీనిని సేవింపవలయు (శుద్ధిచేసిన తాళకమును ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో 1 దినము వేపాకురసముతో 3 దినములు మర్దించి రెండుప్రగకణికలుజేసి యెండించి పిదప యేపి విభూతినియుంటగ గట్టి దానింబోలిచి అందు తాళకపుగణికెలనునిచి దానిపైయేసి బూడిదబోసి గట్టించి దానిపై చీలమన్ను లేపనముజేసి యెండించి 4 ఝాములువంచిన భస్మంబగు. ఇట్టి తాళకపు భస్మములో 1 భాగమును గ్రహించి దానితోడ 2 భా

గముల పిప్పలి చూర్ణమునుగలిపి తేనెతోనూరి సేవించిన క్షయము పాండువు చిప్పి కా కాసము అతిసారము వాతరోగము కుష్టువు వీనిని హరింపంజేయు పథ్యము(నల్ల వరిబియ్యపు వంటకము నెయ్యి గోటకూర వీనిని భక్షింపవలయు.

శ్లో॥ దేహేకిలా సేసంజాతే కండ్వావాచర్మపీడితమ్ ।
నాసమర్దక బీజానిమూలకానాంతథైవచ ।
గంధపాషాణమిశ్రాణిసిధ్మంహంతి నసంశయః॥

తా. శరీరమున శిబ్బెముగలిగి దురదవలన చర్మము పొట్టువలె రాలుచుండిన దురదగొండి విత్తులు ముల్లంగివిత్తులు గంధకము వుల్లిపాషాణము వీని నుదకముతో నూరి లేపనముజేసిన శిబ్బెము నిస్సంశయముగ హరించు.

## గంధకోత్పత్తి తత్సేవనా క్రమము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] శృణుదేవిప్రవక్ష్యామియత్రోత్పన్నశ్చగంధకః
తమహంకథయిష్యామి శృణుష్వాయతలోచనే । అమృతో
దోత్థితస్సాక్షాద్దివ్యతేజామహాగుణః । పీతశ్చైవతథాశ్వేతః
కపోతశ్చతృతీయకమ్ । ఆరక్తశ్చచతుర్థస్స్యాత్క్రమోత్తర
గుణంప్రియే। తస్యగంధస్యగంధేనమోహితాశ్చాపిదానవాః ।
గంధకోనామతేనైవ విఖ్యాతఃక్షితిమండలే । తథాక్రమగుణా
శ్చైవ భవంతిగిరిజాఅపి । తత్రక్షీరోత్థితస్యైవ శుద్ధింకు
ర్యాద్విచక్షణః। తత్రాసీత్క్రమేణైవతృతీయంచసమాహితః।
*వమనంరేచనంకుర్యాత్కర్తవ్యస్యచనిశ్చయః । క్రియాం
కృత్వాప్రయత్నేన శుచిర్గంధంసమాచరేత్ । శుభేముహూ
ర్తేనక్షత్రే హ్యర్చయిత్వాజగద్గురుమ్ । విధినైవతుసుప్రాజ్ఞః
కర్తవ్యోనిత్యమేవహి॥

తా. ఓపార్వతీ! గంధకము జనించునట్టిస్థలమును వచించెదవినుము గంధకము క్షీరసముద్రమునజనించి దివ్యమైన తేజస్సుమహాగుణసంపత్తిగలదై పసపువర్ణము

* వమనం రేచనంపూర్వం శుద్ధించైవ సమాచరేత్॥

శుభ్రవర్ణము కపోతవర్ణము యొకింతరక్తవర్ణము అన 4 విధంబులు గలదై 1 దాని కంటె నొకటి గుణాధిక్యము గలదిగనుండు ఈగంధకము యొక్క పరిమళముతలని దానవులు మోహితులైనందున దీనికి గంధకమను నామము భూమండలమునగలిగె ఇటుల నేపర్వతమున జనించిన గంధకము సగా 4 విధంబులుగలదై 1 దానికంటె నొకటి గుణాధిక్యము గలదిగనుండు. భూమియందు జనించిన 4 విధములగు గంధకములలో కపోతకమను దానిని బుద్ధిమంతుడగు వైద్యుడు క్రమముగ శుద్ధిచేసిన రోగికి వమనవిరేచనంబులు చేయించి తాను స్నానాదులచే శుద్ధుడై సుముహూర్తనక్షత్రంబున విధిప్రకారము జగద్గురువును బూజించి గంధకకల్పము నొసంగవలయు మఱియు గంధకకల్పము నొసంగునపుడెల్ల యీ విధినే వైద్యుడాచరింపందగు.

## గంధక సేవనయందు పథ్యాపథ్యములు.

శ్లో॥ భోజ్యానిచ ప్రవక్ష్యామి త్యాజ్యానివివిధాపిచ ।
షష్ఠికాశ్చతథా శాల్యో గోధూమాశ్చవిశేషతః ।
జాంగలానీచమాంసాని † లాఘవానిప్రదాపయేత్ ।
ఏవంముద్గాసితాస్సర్పి స్సితాక్షీరంమధూత్కరమ్ ।
ఏవంభోజ్యం తథాపథ్యం మయాఖ్యాతం వరాననే॥

తా. గంధకసేవన కాలమున 60 దినములకు ఫలించిన వడ్లబియ్యము గోధుములు జాంగలమాంసము లఘుకరద్రవ్యములు నల్లపెసలు నెయ్యి పంచదార పాలు మద్యము అనువానిని పథ్యమునందు గ్రహింపవలయు. సుందరమైన ముఖముగల యోపార్వతీ! యిటుల పథ్యాపథ్యంబులు నాచే జెప్పంబడియె.

## గంధక సేవనోపయుక్త మంత్రము.

శ్లో॥ అథమంత్రం ప్రవక్ష్యామి గంధకస్యచభక్షణే ।
ఓంనమోమృతశిఖాయ అమృతరూపజీవనే ।
దానవేందేణిచాజ్ఞాత అమృతత్వం దేహిస్వాహా॥

తా. గంధకము సేవించునపుడు "ఓంనమో" అను మంత్రమును పఠింపవలయు.

† ఛాగలానిప్రయోజయేత్ — మేకమాంసము.

## కుష్ఠురోగమునకు గంధకకల్పము.

శ్లో॥ గంధకస్య పలంచైవ సూతకస్య పలంతథా । గగనస్య పలం చైవహాటకస్య పలంతథా । నీలాంజనం పలంచైవ త్రిఫలానాం పలత్రయమ్ । ద్విసప్తకంతు పక్షంవా షణ్మాసంవా ప్రయోగతః। వలీపలిత నిర్ముక్తో సర్వరోగ వివర్జితః । దివ్యదృష్టిః ప్రవర్తేత జీవేదబ్దాయుతంనరః । వాతారి తైల సంయుక్తం త్రిఫలా గుగ్గులేనచ ॥

తా. శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన రసము అభ్రకభస్మము స్వర్ణభస్మము చేసిన నీలాంజనము యివి దినుసుకొకొక్కపలము త్రిఫలములు 3 పలములు యివీనినెల్ల చూర్ణముజేసి ఆముదము త్రిఫలములు శుద్ధిజేసిన మహిసాక్షిగుగ్గిలము వాని యనుపానముతోడ 14 దినములుగాని లేక 15 దినములుగాని లేప 6 మాసలుగాని సేవించిన వలీపలిత విముక్తుండై సర్వరోగవివర్జితుండై దివ్యదృష్టికలదై 10000 సంవత్సరములు జీవించు.

శ్లో॥ గంధకస్య పలంచైకం రసస్యార్థం క్షిపేత్తథా । కుమారీ రససంఘృష్టం దినైకం గోళకీకృతమ్ । అంధమూషా కృతం ధ్మాతం లేహయే న్మధుసర్పిషా । మాషమాత్ర ప్రయోగేణ జరా దారిద్ర్యనాశనమ్॥

తా. శుద్ధిచేసిన గంధకము 1 పలము శుద్ధిచేసిన రసము ½ పలము యీరెంని కలబందరసముతో 1 దినము కొటుకవలెమర్దించి ముద్దజేసి అంధమూషలోనిచి సంధిలేపనముజేసి నిప్పలోబెట్టి యూదిదానిని దీసి మాషప్రమాణమును తేలేక నేతితో భక్షించిన జరాదారిద్ర్యముల హరింపంజేయు.

శ్లో॥ గంధకస్యపలేద్వేతు సూతకస్యపలంతథా ।
కచ్ఛయంత్రగతంపక్వం లేహయేన్మధుసర్పిషా ।
మాషమాత్ర ప్రయోగేణ కుష్ఠం హరతిదారుణమ్॥

తా శుద్ధిచేసిన గంధకము 2 పలములు శుద్ధిచేసిన రసము 1 పలముయీరెంని కజ్జలిగనూరి కచ్ఛపయంత్రములో నునిచిపాకముజేసిన భస్మంబగు అందొకమాషప్రమాణము తేనె నేతితో భక్షించిన దారుణమైన కుష్ఠమును హరింపంజేయు.

శ్లో॥ త్రిఫలా గంధకంచూర్ణం భృంగరాజ సమన్వితమ్ ।
సంవత్సర ప్రయోగేణ జీవేద్వర్ష శతంనరః ॥

తా. త్రిఫలములు శుద్ధిచేసిన గంధకము వీనినిచూర్ణముజేసిగుంటగలగరాకుర సములో 1 సంవత్సరమువరకు సేవింపుచుండిన 100 సంవత్సరములు జీవించు.

శ్లో॥ గంధకస్యపలంచైవ పిబేత్క్షీరేణవా నిశి ।
అర్థమాసప్రయోగేణ హంతికండూంవిచర్చికామ్ ॥

తా. 1 పలము శుద్ధిచేసిన గంధకమును రాత్రులయందు పాలలోవైచి గాని ½ మాసమువరకు సేవింపుచుండిన దురద విచర్చిక కుష్టువు హరించు.

శ్లో॥ ఘృతంగవ్యం పలంచైవ తదర్థం చైవసూతకమ్ ।
గంధకం పలమాత్రేణ జరావ్యాధి వినాశనమ్ ।
వాచస్పతి సమోబుధ్యా షణ్మాసా చరణేన తు ॥

తా. ఆవునెయ్యి 1 పలము శుద్ధిజేసిన రసము½ పలము శుద్ధిచేసిన గంధకము 1 పలము యిటుల వీని నేకముజేసి 6 మాసములు సేవించిన ముదిమిని హరింపంజేయు టయేగాక బృహస్పతితో సమానమైన బుద్ధిని గలుగంచేయు.

శ్లో॥ గంధకం త్రిఫలాయుక్తం ఘృతేన మధునాసహ ।
భక్షితంతు మహారోగం హంతిమాసేనదారుణమ్ ॥

తా. శుద్ధిజేసిన గంధకము త్రిఫలములు వీనిని చూర్ణముజేసి నేతిలోగాని తేనెలోగాని 7 మాసమువరకు సేవింపుచుండిన దారుణమైన కుష్టువు హరించు.

## స్వర్ణ కరణ విధి.

శ్లో॥ గంధకం చాంధమూషస్థం సబీజం చైవమర్దితమ్ ।
భూమిస్థం మాసమేకంతు తారం భవతికాంచనమ్॥

తా. శుద్ధిజేసిన గంధకమును కాలకూటము వత్సనాభిశృంగము ప్రదీపనము హాలాహలము బ్రహ్మపుత్రము హారిద్రము సక్తుకము సౌరాష్ట్రికము అన మహావిషం బులచే మర్దింపంబడి సప్తకంచుక దోషరహితముగ చేయబడినరసము నేకముజేసి కాటుకవలె మర్దించి అంధమూషలో నునిచి 1 మాసము భూస్థాపనముజేసి దానిని కరగించి వెండిలోడగలిపిన బంగారమగు,

## గంధకకల్ప సేవనామహిమ.

శ్లో॥ అభ్రకం హాటబీజంచ షడంశేనతు కాంచనమ్ । ధ్మాతంప్రస్రుత
మూషాయాం గంధకేన సుసంయుతమ్ । మూషాంత్యక్త్వా
సమాదాయ హేమదూర్వాంతుఖగవద్రసః । రాజికార్ధార్ధమాత్రేణ
పర్వతానపి వేధయేత్ । రాజసర్షపమాత్రేణ తద్రసంయది
భక్షితమ్ । ఖేచరత్వమవాప్నోతి క్రీడతేనిర్జరైస్సహ ॥

తా. అభ్రకభస్మము పైప్రకారము శుద్ధిచేయబడిన రసము యీ 2 కి 6 వ భాగము సువర్ణభస్మము శుద్ధిచేసిన గంధకమును గ్రహించి విశాలమైన మూషలోనునిచి మూసిన రసము పక్షివలె పొడవుగ నెగురును, పిదప నారసములో రాజికార్ధప్రమాణమును సేవించిన పర్వతముల భేదింపదగిన బలముగలవాడగు మఱియు తెల్లఆవగింజంత సేవించిన దేవత్వమునుజెంది దేవతలతో క్రీడించు.

శ్లో తుల్యాయసంతథాసూతంగంధరాజేన రంజితమ్ । మ్లేచ్ఛంచ
ఘటియంత్రేణతైర్దైర్వపిధాయచ । క్రమాగ్నినాచైకదినం
సాంగశీతలముద్ధరేత్ । సమూర్ఛ్యంచవ్రీహిమాత్ర శర్కరేణ
ఘృతేన వా । ప్రాతస్సాయంప్రదాతవ్యంసర్వవాతవికారజిత్ ।
వాతగ్రంధౌ ధాతుశోషే ప్రసారే రసవైకృతౌ । అష్టాదశ
సుకుష్ఠేషు గవ్యాజ్యం దధితక్రకమ్ ॥

తా. ఇనుపభస్మము శుద్ధిచేసిన రసగంధకములు తామ్రభస్మము వీనిని సమభాగములుగ మర్దించి ఘటికాయంత్రములో నునిచి దానిని చింత మొదలగు వానిక్షారములతో మూసి క్రమాగ్నులతో 1 దినము వండి సాంగశీతలమునదీసి మర్దించి వడ్లగింజంతను శర్కరతోగాని లేక నేతితోగాని సాయం ప్రాతఃకాలముల సేవింపుచుండిన సర్వవాత వికారములు వాతగ్రంథులు ధాతుశోష అతిసారము రసవైకృతము 18 కుష్టువులు వీనిని హరింపంజేయు. ఆవుపెయ్యి ఆవుపెరుగు ఆవుచల్ల వీనిని పథ్యమునం దునిచికొనవలయును.

## సువర్ణ కరణ విధి.

శ్లో॥ హేమనాగటిక సంయుక్తం సమాంశం గంధకంరసమ్ ।
దేవదాళీ రసేనైవ తారం భవతి కాంచనమ్॥

తా. బంగారు కౌవిరాయి యివి దినుసు కొక్కొక భాగము శుద్ధి చేసిన రసగంధకములు దినుసుకు 2 భాగములు యిట్టుల వీనిని ఖల్వములోనునిచి ద్రావకదంగిరసముతో మర్దించి వెండిపై లేపనముజేసి పుటంబిడిన బంగారమగు.

శ్లో॥ సూతకేన సమాయుక్తం ధాత్రీగంధకసంయుతమ్ ।
సంవత్సర ప్రయోగేణ చిరాయుః పురుషోభవేత్ ॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన నెల్లికాయగంధకము యీ 2 ని మర్దించి పుటంబిడిన రసభస్మంబగు. ఈ రసభస్మమును నొకవత్సరము సేవింపుచుండిన నరుడు దీర్ఘాయువుగల వాడగు.

శ్లో॥ తారంసుగంధంస హషోడశాంశం శుల్బంభవేత్సూర్యశశాంకవర్ణమ్। మయూరకేణసంయుక్తంపాండురోగంవినాశయేత్ ।
మహాకాలాయ సంయుక్తం హరేత్కుష్ఠాన్యశేషతః॥

తా. రజతభస్మము శుద్ధిజేసిన నల్లగంధకము యివి సమభాగములు, ఈ రెంటికి 16 వ భాగము. తామ్రభస్మము కలిపి మర్దించి పుటంబిడిన సూర్యచంద్రవర్ణ తుల్యంబుగనగు. దీనిని బ్రహ్మమేడిమార్గములో కలిపి భక్షించిన పాండువును మహాముసిణిచెక్క చూర్ణముతోడంజేర్చి భక్షించిన కుష్టువులు హరించు.

శ్లో॥ శుల్బస్య గగనస్యాపి హేమధాతో పథాసివా ।
సమాంశం పిష్టకంకృత్వా అంధమూషా నివేశితమ్ ।
నింబపంచాంగసంయుక్తం కుష్ఠమౌదుంబరంజయేత్ ।
శశిరేఖా సమాయుక్తం కల్పాయుర్జాయతేనరః ॥

తా. తామ్రభస్మము అభ్రకభస్మము సువర్ణభస్మము వీనిని సమభాగములుగనూరి ముద్దచేసి అంధమూషలోనునిచి పుటంబిడి వేపపంచాంగానుపానముతోడ భక్షించిన ఔదుంబరకుష్టమును హరింపంజేయు. మఱియు దీనిని తిప్పసత్తుతోడభక్షించిన నొకకల్పకాలమువరకు జీవించు.

## గంధక రసాయనము.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధోబలిర్గో పయసావిభావ్య తతశ్చతుర్జాతగుడూచికాభిః। పథ్యాక్షధాత్ర్యౌషధభృంగరాజైర్భావ్యోష్ట

వారం పృథగార్ద్రికేణ । సిద్ధేసితాం యోజయతుల్యభాగాం రసాయనంగంధకసంజ్ఞితంస్యాత్ । ధాతుక్షయంమేహగణా గ్నిమాంద్యం శూలంతథాకోష్ఠగతాంశ్చరోగాన్ । కుష్ఠా న్యథాష్టా దశభేదవంతి నివారయత్యేవ చరాజరోగమ్ । కర్షోన్మితంసేవితమేతిమర్త్యో వీర్యంచపుష్టిం బలవాన్ ప్రదీప్తిమ్ । వమనం రేచనంపూర్వం శుద్ధించైవ సమాచరేత్ । జాంగలాని తుమాంసాని ఛాగలాని ప్రయోజయేత్ ॥

తా. ఆవుపాలతో శుద్ధిచేయబడిన గంధకమును చాతుర్జాతకములు త్రిఫల త్రికటుకములు గచ్చపలుకులు వుసిరికెవరుగు శొంఠి గుంటగలగర అల్లము అనువాని రసములలో ప్రతిదానిచే 8 దేసి మార్లు భావనచేసి పిదప దానికి సమముగ పంచదారగలిపిన గంధకరసాయన మనంబడు దీనిని కర్ష ప్రమాణము సేవించిన ధాతుక్షయము సర్వమేహములు అగ్నిమాంద్యము శూల శోష గతోపద్రవములు సర్వకుష్ఠువులు మొదలగు బలిష్ఠమైన రోగముల హరింపంజేయుటయేగాక పరాక్రమము పుష్టి బలము వీనిని సదా గలుగంజేయు మఱియు నీ రసాయనము నిచ్చుటకుముందు వమన రేచనముల కొసంగవలయు. మఱియు జాంగలమాంసమును మేకమాంసమును భోజనమునందు జేర్చికొనవలయు.

శ్లో॥ యావనాళంచ తక్రంచ వ్యంజనం తైలపాచితమ్ । దుగ్ధం మాహిషసర్పిశ్చలవణంచవివర్జయేత్ । తథాతీక్ష్ణకషాయాశ్చ కాంజికం కేవలంతథా । అత్యుష్ణంచాతిశీతంచనసేవేత కదాచన । యవాన్నక్షుద్రధాన్యాని విషమాన్నంవ్యవాయకమ్ । సంజాతంచ పతేద్వీర్యం తస్మాత్సర్వం పరిత్యజేత్ । స్త్రీయం యానాధిరోహంచ వహ్నించైవా తపంతథా । యదిదం పరమంగుహ్యం తతః ప్రీతా నుయోదితమ్ । గోపనీయం ప్రయత్నేనన దేయంయస్యకస్యచిత్ । అమృతంచతథాచైవ శుద్ధం కృత్వాతుగంధకమ్ । అమృతం విధిసంయుక్తం విధిహీనంచ తద్విషమ్ । యస్త్వవై భక్షయేన్మోహా త్సాధకస్సిద్ధికాంక్షయా । సమూఢోగన్ధకంప్రాప్య క్షిప్రంపశ్యేద్యమాలయమ్॥

తా. పైయోగములను సేవించునపుడు జొన్నలు మజ్జిగ నూనెతో చేయబడిన పదార్థములు బర్రెపాలు బర్రెనెయ్యి లవణము తీక్ష్ణద్రవ్యములు కషాయద్రవ్యము కలి అత్యుష్ణము అతిశీతలముగల ద్రవ్యములు యవాన్నము క్షుద్రధాన్యములు విషమాన్నము * వ్యవాయికద్రవ్యములు స్త్రీసంపర్కము వాహనము అగ్ని యెండ అనువానిని వర్జింపవలయు. ఇట్లు జేయని యెడల శుక్రము నష్టంబగు ఓ పార్వతీ! ఇట్టి మహారహస్యముగల యీ యోగములను ప్రీతివలన నీకు నేను వచించితిని కావున దీని నెవ్వరికిం జెప్పక రహస్యముగ నుంచుకొనుము. క్రమముగ శుద్ధిచేయబడినగంధకమును సేవించిన అమృతప్రాయంబగు విధి విహీనముగ సేవించిన విషతుల్యంబగు గంధక భక్షణయం దిచ్ఛగలవాడు అజ్ఞానము వలన దానిని విధివిహీనముగ భక్షించిన యమాలయంబున కేగు.

శ్లో॥ గంధకస్య పలంన్యస్య సూతకస్య పలంతథా । నాగస్యతు పలంచైవ టంకణస్యపలంతథా । కన్యాపలత్రయంచైవ విషాణస్య పలత్రయమ్।ద్విస ప్తకాద్విశేషేణ షణ్మాసాత్తు ప్రజాయతే । దివ్యదృష్టిః ప్రవర్తేత జీవేదా చంద్రతారకమ్॥

తా. శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన రసము నాగభస్మము వెలిగారము యివి దినుసు కొక్కొకపలము కలుబంద 3 పలములు దుప్పిభస్మము 3 పలములు యిటుల వీని నేకముజేసి 14 దినములు భక్షించిన సర్వకుష్ఠువులు హరించు. మరియు దీనిని 6 మాసములు భక్షించిన దివ్యదృష్టిగలవాడై చంద్రసూర్యులుండువరకు జీవించు.

శ్లో॥ గంధకంత్రిఫలాయుక్తం మధురత్రయమిశ్రితమ్ ।
భక్షమేత్ప్రాతరుత్థాయ వలీపలితశాంతయే॥

తా. శుద్ధిచేసిన గంధకములో త్రిఫలచూర్ణముగలిపి పంచదార తేనె నెయ్యి అనువాని యనుపానముతో ప్రాతఃకాలమున సేవించిన వలీపలితములు హరించు.

### కుష్ఠువులయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] శాలీయయవగోధూమాః శ్యామాకాశ్చ ప్రియంగవః। ముద్గామసూరాస్తువరీ తిక్తశాకానిజాంగలమ్। వరాపటోల ఖదిర నింబశ్చ బృహతీఫలమ్ । కస్తూరిగంధ

* వ్యవాయికరద్రవ్యములన—గంజావిత్తాకు నల్లమందు మొదలగునవియు

సారశ్చ కుంకుమంచ సరావ రమ్ । యథాదోషం సమస్తాని పథ్యాన్నేతానికుష్ఠినామ్॥

తా. ప్రాతవడ్లు యవలు గోధుమలు చామలు కొఱ్ఱలు పచ్చపెసలు చిఱుసెనగలు కందులు చేదుగలకూరలు జాంగలమాంసము పిల్లిపీచర పొట్లకాయ చంద్రసేపపువ్వు నేలములకపండ్లు కస్తూరి చందనము కుంకుమపువ్వు యింగువ యివికుష్ఠవులయందు దోషానుగుణ్యముగ పథ్యకరంబులు.

కుష్ఠవులయం దపథ్యము.

శ్లో॥ అన్నపానం హితంకుష్ఠే నత్వామ్లలవణోషణమ్ ।
దధిదుగ్ధగుడంసూప తిల మాషాం త్యజేన్నరః॥

తా. పులుసు వుప్పు కారముగల యన్నపానములు పెరుగు పాలు బెల్లము పప్పునువ్వులు మినుములు యివి కుష్ఠరోగమునం దపథ్యకరంబులు.

విసర్ప నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] లవణామ్లకటూష్ణాదిసంసేవాద్దోషకోపతః
విసర్పస్సప్తధాజ్ఞేయ స్సర్వతః పరిసర్పణాత్ ।

తా. ఉప్పు పులుసు కారము ఘష్ణము మొదలగు పదార్థముల సేవించుటవలన వాతాదిదోషములు ప్రకోపించి 7 విధములైన విసర్పరోగముల గలుగంజేయు. ఇది సర్వశరీరమునందు వ్యాపించుటచే విసర్పమనంబడు.

శ్లో॥ రక్తంలసీకాత్వ జ్మాంసం దూష్యం దోషాస్త్రయోమలాః ।
సవిసర్పాణాం సముత్పాతౌ విజ్ఞేయాస్సప్తధాతవః।

తా. రక్త రస త్వఙ్మాంసములు వాత పిత్తశ్లేష్మములు దుష్టంబులగుటవలన సప్తధాతువులయందు విసర్పరోగము జనించు.

వాతవిసర్ప లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] వాతాత్కుత్థ సదృశాస్ఫోటాస్స్యా శ్చాగ్నిదగ్ధవత్ ॥ సంజ్ఞానాశో వ్యథాశోషోదాత్రి శ్వాసక జ్వరా । యథావాత జ్వరేచిహ్నం తథావాత విసర్పకే విరేచవమనంచైవ లేపనాసృగ్విమోక్షణై ॥

తా. ఉలవలతో సమానముగ పొక్కులుగలిగి కాలినట్లుండుట ప్రష్ఠలేపం డుట వేదన శోషగలుగుట మిక్కుటముగ నిసురవుబ్బసము జ్వరము వాతజ్వరచిహ్న ముగలుగుట ఈలక్షణములుగలది వాతవిసర్పియని తెలియవలయు. దీనియందు రేచన వమనముల కొసంగుటయే గాక లేపనములను జలగలవలన రక్తస్రావకములు జేయింప వలయు.

## పిత్త విసర్ప లక్షణము.

శ్లో॥ పిత్తాత్పిత్తజ్వరేయస్య చిహ్నంద్రుతగతి స్తథా ॥

తా. పిత్తజ్వర లక్షణంబులన్నియుంగలిగిపిత్తధాతువు తీవ్రముగనడుచుచుం డిన పిత్తవిసర్పియని తెలియవలయు.

## శ్లేష్మవిసర్పలక్షణము.

శ్లో॥ కఫాత్కండూయుతస్స్నిగ్ధః కఫజ్వర సమానరుక్ ॥

తా. దురద మెఱుపు శ్లేష్మజ్వరలక్షణములు గలిగియుండిన శ్లేష్మ విసర్పి యని తెలియవలయు.

## సన్నిపాత విసర్ప లక్షణము.

శ్లో॥ సన్నిపాతసముత్థశ్చ సర్వరూపసమన్వితః॥

వాత పిత్త శ్లేష్మ విసర్పిలక్షణంబు లన్నియుగలది సన్నిపాత విసర్పి యని తెలియవలయు.

## కర్దమ విస్పరలక్షణము,

శ్లో॥ [సిద్ధరసార్ణవే] కఫపిత్తా జ్వర స్తంభోనిద్రా తంద్రాశిరోరుజః। అంగావసాదవిక్షేప ప్రలాపారోచకభ్రమాః । మూర్ఛాగ్నిహానిర్భేదోస్థ్నాం పిపాసేంద్రియ గౌరవమ్ । ఆమోపవేశనంలేప స్స్రోతసాంసవిసర్పతి । ప్రాయేణామాశయంగృహ్ణన్నేకదేశంనచాతిరుక్ । పిండకై రివకీర్ణోతి పీతలోహిత పాండురైః । స్నిగ్ధోసితో మేచకాభో మలిన శ్శోఫవాన్గురుః । గంభీరపాకః ప్రాజ్యోష్మా స్పృష్టః క్లిన్నోవదీర్యతే । పంకవచ్ఛీర్ణమాంసశ్చ స్పష్టస్నాయు సిరాగణః । శవగంధిశ్చవిసర్పః కర్దమాఖ్య మశంతితమ్॥

తా. కఫ పిత్తమువలన తాపము కలుగుట స్తంభించుట నిద్ర తంద్ర తల నొప్పి శరీరమున బడలిక కలుగుట కాళ్ళుచేతు లీడ్చుట తలు మట వదరుట అరుచి భ్రమ మూర్ఛ అగ్నిమాంద్యముగలుగుట యెముకలుపగిలినటులనొప్పుటదప్పియింద్రియములయందు జడత్వముగలుగుట ఆమముబడుట ముఖాదిస్రోతస్సులయందు కఫము నిండి లేపనము జేయించబడినటులుండుట ఆమాశయముపైజనించి కడువేదనారహితంబై పసపు యెఱుపు తెలుపువర్ణముగల మొటిమలతోగూడినదై సర్వశరీరమునందు వ్యాపించియుండుట మెఱయుచునల్లవై నెమలికన్నులయొక్క వర్ణముగలదై మలయుక్తమై వాపు జడత్వము అనువానితో గూడియుండుట లోనంబడుట మిక్కుటముగ యూష్మము గలిగియుండుట అదిమినతోడనే చెమ్మగలుగుట చిట్టినట్లుండుటబురద వలెనే మాంసము శిథిలంబై సిరాస్నాయువులు తెరచికొనియుండుట పీనుగవాసన వేయుట యీలక్షణములుగలది కర్దమవిసర్పియని తెలియవలయు.

## గ్రంథివిసర్ప లక్షణము.

శ్లో॥ [పూజ్యపాదీయే] ఫేనరుద్ధః పవనః భిత్వాతం బహుధా
కఫమ్।రక్తంవావృద్ధరక్తస్య త్వక్సిరాస్నాయుమాంసగమ్।
దూషయిత్వాచదీర్ఘాణువృత్తస్థూలఖరాత్మనాం । గ్రంథీ
నాం కురుతేమాలాం శక్తానాం తీవ్ర రుగ్జ్వరామ్ । శ్వాస
కాసాతిసారస్య శోషహిక్కా వమిభ్రమైః । మోహవై
వర్ణ్యమూర్ఛాంగ భంగాగ్ని సదనైర్యుతామ్ । ఇత్యయం
గ్రంథివిసర్పః కఫమారుతకోపజః॥

తా. స్వకారణమువలన ప్రకోపించిన కఫముచే నడ్డగింపంబడిన వాతముకఫమునుగాని లేక వృద్ధిబొందిన రక్తముగాని భేదించి చర్మము సిరలు స్నాయువులు మాంసము అనువానిరెండించి దోషయుక్తముగజేసి పొడవుగ చిన్నదిగ గుండ్రముగ లావుట గరగరగ యెఱ్ఱగనుండు గ్రంధులసరముసు గలుగంజేయుట వానియందు మిక్కుటమైనశూల బలమైన జ్వరము శ్వాసముదగ్గు అతిసారమునోరెండుటయెక్కిళ్ళు వాంతిభ్రమ భ్రాంతి వైవర్ణ్యము మూర్ఛ వొడలువిరుపు అగ్నిమాంద్యముగలుగుట యీలక్షణములుగలది గ్రంథివిసర్పియని తెలియవలయు ఇది కఫవాత ప్రకోపమువలన జనించు.

## అగ్నివిసర్ప లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] వాతపిత్తాజ్జ్వరచ్ఛర్ది మూర్ఛాతీ సారతృ
డ్భ్రమైః। అస్థిభేదాగ్నిసదన తమకారోచకైర్యుతః। కరోతి
సర్వమంగంచ దీప్తాంగారావకీర్ణవత్। యంయం దేశంవిసర్ప
శ్చవిసర్పతిభవేచ్చసః। శాంతాంగారాసితోనీలో రక్తోవా
శూపచీయతే। అగ్నిదగ్ధఇవస్ఫోటైశ్శీఘ్రగత్వాద్ద్రుతంచసః।
మర్మానుసారీవిసర్పస్స్యాద్వాతోతిబలవత్తతః। వ్యథేతాం
గంహరేత్సంజ్ఞాం నిద్రాంచశ్వాసమీరయేత్। హిక్కాంచ
సగతోవస్థా మీదృశీంలభతేనరః। క్వచిచ్ఛర్మారతిగ్రస్తో
భూమిశయ్యాసనాదిషు। చేష్టమానస్తతః క్లిష్టోమనోదేహస
ముద్భవామ్।దుర్బోధామశ్నుతేనిద్రాంసోగ్నివిసర్పఉచ్యతే॥

తా. వాతపిత్తమువలన గలిగిన విసర్పమునందు జ్వరము వాంతి మూర్ఛ అతి సారము దప్పి వొడలువిఱుగుట యెముకలు విరిగినటుల దోచుట అగ్నిమాంద్యము నేత్రములయందుమబ్బు అన్నద్వేషము అనునవిగలుగు దానిసంబంధముగలనసర్వశరీర ముపై నిప్పులు బోసినటులుండుట విసర్పివ్యాపించుచుండు స్థలమున నల్లగ నీలముగ యెఱ్ఱగనుండునదై త్వరితముగ వాపుగలుగుటఅగ్నిదగ్ధంబైనటుల పైనబొబ్బలులేచి శీఘ్రగతిగలదై కడుతీవ్రముగ హృదయమునుజెందుట లేక వాతముకడుబలిష్ఠంబగుట వలన శరీరమున వ్యథనుగలుగంజేయుటసంజ్ఞను నిద్రనునశింపంజేయుట శ్వాసమును వృద్ధిపరచుట యెక్కిళ్ళుగలుగుట భూమిమీదగాని లేక పడకమీదగాని గూర్చుండి నను సుఖముగలుగకుండుటసంచారమువలన క్లేశముగలుగుటమనోదేహములకుక్లేశము వలనగలిగెడి దుర్బోధనిద్ర (అనగా మరణరూపకమైననిద్ర) ప్రాప్తంబగుట యీల క్షణములుగలది అగ్నివిసర్పమని తెలియవలయు.

## క్షతవిసర్ప లక్షణము.

శ్లో॥ బాహ్యహేతోః క్షతాత్క్రుద్ధ సరక్తంపిత్తమీరయన్।
విసర్పంమారుతఃకుర్యాత్కుళుత్థసదృశైశ్చితమ్।
స్ఫోటైశ్శోథజ్వరరుజా దాహాఢ్యంశ్యావశోణితమ్॥

తా. బాహ్యకారణమువలన గాయముగలిగిన దానివలన వాతము ప్రకోపించి రక్తసహిత పిత్తమును వ్రణమునందుజేర్చి విసర్పమును గలుగంజేయుట దానిపై వులవలతో సమానమైన శ్యామలవర్ణముగల కురుపులు వాపు గలుగుట జ్వరమువచ్చుట శూల దాహముగలుగుట రక్తము శ్యామలవర్ణముగనుండుట యీలక్షణములుగలది క్షతజ విసర్పియని తెలియవలయు.

## విసర్పోపద్రవములు.

శ్లో॥ జర్వాతిసారవమథు తృణ్మాంసదరణంక్లమః।
ఆరోచకావిపాకౌచ విసర్పాణాముపద్రవాః॥

తా. జ్వరము అతిసారము వాంతి దప్పిగలుగుట మాంసము పగులుట అనాయాసముగ శ్రమ అరుచిగలుగుట అన్నము జీర్ణముగాకుండుట అనునవియ విసర్పిరోగోపద్రవములు.

## విసర్ప సాధ్యాసాధ్య లక్షణము,

శ్లో॥ సిధ్యంతివాతకఫపిత్తకృతావిసర్పా స్సర్వాత్మకః క్షతకృశ్చ
వసిద్ధిమేతి । పిత్తాత్మకోంజనవపుశ్చభవేదసాధ్యః । కృచ్ఛ్రా
శ్చమర్మసుభవంతిహి సర్వఏవ ॥

తా. వాతపిత్త కఫములవలనగలిగిన విసర్పముసాధ్యము సన్నిపాత క్షతముల వలనగలిగిన విసర్పము అసాధ్యము పిత్తమువలనగలిగిన విసర్పములో వొడలు నల్లగ నగుటవలన నసాధ్యంబు మర్మస్థానమున గలుగు సర్వవిసర్పులు కష్టసాధ్యంబులు

శ్లో॥ [ఆయుర్వేదే] అంతర్బహిశ్చవిస్ఫోటై ర్విసర్పిస్స్యాద్విసర్ప
ణాత్ । సామాన్యంతస్యసంస్థానంనజ్వరశ్శోఫదాహరుక్ ॥
అంతఃకృచ్ఛ్రో బహిస్సాధ్యోమశ్చికిత్స్యోద్విరాశ్రయమ్ ।

తా. లోపల వెలుపల పొక్కులు వ్యాపించుటవలన విసర్పియనంబడు. దీనియందు జ్వరము వాపు దాహము వేదన గలిగియుండుట సామాన్యలక్షణము. లోనిబుట్టిన విసర్పి కష్టసాధ్యము వెలిపట జనించిన విసర్పిసాధ్యము లోన వెలుపటజంచిన నది యసాధ్యము.

విసర్పులకు కాలాగ్నిరుద్ర రసము.

శ్లో॥ [మాధవనిదానే] సూతకాంతాభ్రతీక్ష్ణానాం భస్మమాక్షిక గంధకమ్। వంధ్యాకర్కోటకీద్రావైస్తుల్యంమర్ద్యదినావధి। వంధ్యా * కర్కోటకీకందే క్షిప్త్వా లేప్యం మృదాబహిః। భూధరాఖ్యే పుటేపాచ్యం దినైకంతద్విచూర్ణయేత్। దశ మాంశంవిషం యోజ్యంమాషమాత్రంతుభక్షయేత్। రసః కాలాగ్నిరుద్రోయంద శాహేనవిసర్పనుత్। పిప్పలీమధుసం యుక్తమనుపానం ప్రకల్పయేత్॥

తా. రసభస్మము కాంతభస్మము అభ్రకభస్మము వుక్కుభస్మము శుద్ధిచేసిన హేమమాక్షికము శుద్ధిజేసినగంధకము వీనినిసమభాగముగ ఖల్వములోనునిచి గొడ్డు కాకరాకురసముతో 1 దినము మర్దించి ముద్దజేసి మద్యమున ఛిద్రము జేయబడినగొడ్డు కాకరగడ్డలోనునిచి దానిపై చీలమన్ను లేపనముజేసి యొకదినము భూధరపుటంబిడి సాంగశీతమునదీసి ఖల్వములోనునిచి చూర్ణముజేసి దానికి 10 వ భాగము శుద్ధిజేసిన నాభినిగలిపి మర్దించి మాషప్రమాణమును పిప్పలితేనె అనువాని యనుపానముతోడ 10 దినములు సేవించిన వాతవిసర్పిహరించు.

పిత్తవిసర్పికి ప్రపౌండరీకాది లేపనము.

శ్లో॥ [శారీరే] ప్రపౌండరీక మంజిష్ఠా పద్మకోశీరచందనైః।
† మేషశృంగీశమంయష్టి క్షీరమిశ్రం ప్రలేపయేత్॥
దినసప్తప్రయోగేణ విసర్పంపైత్యకంహరేత్॥

తా. అంతరదామర మంజిష్ఠ పుష్కరమూలము వట్టివేరు శ్రీగంధము వద్ది యష్టిమధుకము వీనిని సమభాగములుగ పాలతోనూరి 7 దినములు శరీరమున లేపనము జేసిన పిత్తవిసర్పి హరించు.

క॥ చందనముమ జమ్మ్రాకును। చందనమును గూడపాలసద్యో
ఘృతముగ।పొందించిరాగియలదిన।సందియమునులేదువే
విసర్పులుమానుగ॥

* కర్కోటికాంపిష్ట్వాస్థాప్యంలేప్యం మృదాబహిః॥
† సమష్టిందేవరైః పిత్తేక్షీరపిష్టైశ్చలేపనమ్॥

## శ్లేష్మవిసర్పికి మదనాది చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] మదనంమధుకంనింబంవత్సకస్యఫలానిచ ।
* అనేనవమనం దేయం విసర్పేకఫసంభవే॥

తా. మ్రంగ యిప్ప వేము కొడిసెకాయ దీనిని సమముగ చూర్ణముచేసి వమన న కొసంగిన శ్లేష్మ విసర్పలు హరించు.

## శ్లేష్మపిత్త విసర్పికి వారిసాగర రసము.

శ్లో॥ [సింధూరమణిదర్పణే] శుద్ధసూతంవిషంగంధంమృతాభ్రం టంకణంశిలామ్ । ముసలీంహయమారంచప్రత్యేకంచవిమర్దయేత్ । ద్విగుంజం భక్షయేన్నిత్యం శ్లేష్మపిత్తవిసర్పనుత్ । దురాలభాపర్పటీరం పటోలంకటుకీతథా । త్రిఫలాగుగ్గులూంతుల్యం కషాయమనుపాయయేత్॥

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన నాభి శుద్ధిచేసిన గంధకము అభ్రకభస్మము లిగారము శుద్ధిచేసినమణిశిల వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి తాటిగడ్డల రసముతో 1 దినముగన్నేరురసముతో 1 దినముమర్దించి 2 గురిగింజలయెత్తును దురద 'ండి పర్పాటకను చేతిపొట్ల కాకర త్రిఫలములు శుద్ధిజేసిన గుగ్గిలము వీనినిసమ భాగములుగదంచి కషాయము కాచి యీయనుపానములోడసేవించిన శ్లేష్మపిత్తవిస ర్పలు హరించు.

## శ్లేష్మవాత విసర్పికి చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] సూతంగంధందగ్ధశంఖంమాక్షీకంచశిలాజతు । దినిశాచామృతాచైవ తుల్యాంశంనీలికారసైః । మర్ద్యాజ్యాభ్యాంసహాపేష్యం విసర్పే లేపయేత్తథా । దేయః కాలాగ్నిరుద్రోత్ర రసంగుంజాద్వయంహితమ్ । పటోలత్రిఫలానింబః మధునా లేహయేదను॥

తా. రసము గంధకము కాల్చినశంఖము హేమమాక్షికము శిలాజిత్తు పచ్చి నపు మ్రానిపసపు తిప్పతీగె వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నీలియాకు

* వమనంచవిధాతవ్యం విసర్పేకఫపిత్తజిత్.

రసము తేనె నెయ్యి అనుపానితో మర్దించి విసర్పియందు లేపము జేయుటయేగాక 2 గురిగింజలయెత్తు కాలాగ్నిరుద్రరసమును చేతిపొట్లవిత్తులు త్రిఫలములు వేపచిగుళ్ళు వీనిని తేనెతోనూరి యీయనుపానముతో సేవించిన శ్లేష్మవాత విసర్పులుహరించు

వాతపిత్తవిసర్పికి గుళూచ్యాది లేపము.

శ్లో॥ [ఆయుర్వేదే] గుళూచీపిచుమందాంబు బదరేంద్రయవాం
బుదాః। విస్ఫోటంనాశయంత్యాశు వాయుపిత్త విసర్పకమ్॥

తా. తిప్పతీగె వేము కురువేరు రేగు కొడిసెపాల తుంగముస్తెలు వీనిని సమ భాగములుగనూరి లేపనముజేసిన విస్ఫోటకము వాతపిత్త విసర్పులు హరించు.

విసర్పమునకు శోభాంజనాది లేపనము.

శ్లో॥ శోభాంజనంగంధమూలం లవణంకాంజికైస్సహ।
లేపాత్స్నాయుగతంహంతి విసర్పమతిదుస్సహమ్।

తా. మునగచెక్క కురువేరు వుప్పు వీనిని కలితోనూరి శరీరమున లేపనము జేసిన కడుదుస్సహమైన స్నాయుగత విసర్పిని హరింపజేయు.

సన్నిపాత విసర్పమునకు చికిత్స.

శ్లో॥ రసఃకాలాగ్నిరుద్రోత్ర మధుమాగధిమిశ్రితమ్।
పటోలనింబవాసాశ్చ సప్తపర్ణీ ఫలత్రికమ్।
గుళూచీకటుకీముస్తా ఏభిస్సంపాచయేద్ఘృతమ్।
పానాశ్చ లేపనాద్ధంతి సవిస్ఫోటంవిసర్పకమ్॥

తా. కాలాగ్నిరుద్రరసమును తేనె పిప్పలితో సేవించినను లేక చేతిపొట్లవేము అడ్డసరము యేడాకులయరటిగడ్డ త్రిఫలములు తిప్పతీగె కాకర తుంగముస్తెలు అను వానిని సమభాగములుగదంచి చూర్ణముజేసి నేతిలోగలిపివండిసేవన లేపనములజేయు చుండినను బొబ్బలతో గూడియుండు విసర్పిహరించు. శ్రీగంధము చందనపుచూర గూడపాలగంధము జమ్మియాకురసము ఆవునెయ్యి వీనిని సమముగగలిపి అందుసగ మును పానముజేసి తక్కినసగమును శరీరమునలేపనముజేసిన సర్వవిసర్పులు హరించు.

విసర్పోపచార క్రమము.

శ్లో॥ [అశ్వినీనిఘంటా] తత్రవై ఘనంశస్తంతథాశోణితమోక్షు

ణమ్। ప్రశస్తం సర్వవిసర్పాపర్ణీనాంవాచతుష్టయమ్। బలా త్రయంవాసఘృతంపాన లేపన సేచనైః॥

తా. పైజెప్పబడిన సర్వవిసర్పలయందు వమన విరేచనములు రక్తస్రావము జేయించుట ప్రశస్తము మఱియు కోలపొన్న ముయ్యాకుపొన్న కారుపెసలు కారు మినుములు వీనినిసమముగ కషాయముకాచి అంచావునెయ్యికలిపిగాని లేక * బలా త్రయమును కషాయముకాచి అందులావునెయ్యి కలిపిగాని సేవనలేపన సేచనముల జేయు చుండిన సర్వవిసర్పలు హరించు.

శ్లో॥ పక్వేతువ్రణనిర్దిష్టాం చికిత్సాంకారయేద్భిషక్ ।

తా. విసర్పలు పక్వంబులైన వైద్యుడు వ్రణచికిత్సం జేయవలయు.

## ప్రపున్నాటాది లేపనము.

శ్లో॥ ప్రపున్నాటబీజం నిశానింబపత్రం నవంవైకపాలంతథైవాభ యాచ । స్నుహీంపత్రతోయేన పిష్ట్వాప్రలేపః క్షణాద్దేహద ద్రూవిసర్పాపహంతా॥

తా. తగిరిసెవిత్తులు పసుపు వేపాకు క్రొత్తచిల్లపెంకులు కరక్కాయలు వీనిని జెముడాకురసముతోనూరి (పటుదామెరపైన) మంగలకత్తితోగీచి లేపనము జేసిన పటుదామెర దద్రువు విసర్పలు తత్క్షణమున హరించు,

(శొంఠి మిరియాలు నల్లేరువేరు తేనె నువ్వులు ఆవాలుతగిరిసెవిత్తులు వోమ ము వెల్లుల్లి పంచదార వీనినిసముభాగములుగ నుదకముతోనూరి పటుదామెరను రేగ గోకి దానిపై లేపనము జేసినను లేక నాగమల్లెవేరును నిమ్మపండ్లరసముతోగంధముదీసి లేపనముజేసిన పటుదామెరను మంగలకత్తితో రేగగోకి బీట్లవేరును కలిసిగంధము దీసి లేపనముజేసినను లేక రేలకొనలు వెల్లుల్లి చిన్నంగివేరు కరక్కాయమైలుతుత్త ముచీనిని నిమ్మపండ్లరసముతో గంధముదీసిపటుదామెరను రేగగోకి లేపనముజేసినను లేక ఖై యెత్తుతగిరిసెవిత్తులను ఖై యెత్తుకరకపప్పునుసీరుకలియని 1 సేరుబర్రెపాలలో 3 దినములు నానబెట్టియందు ఖై సులమణిశిల ఖై యెత్తు బెల్లముగలిపి బాగుగనూరి రేగగోకిన పటుదామెరపైలేపనము జేసినను పటుదామెరమానును. ఈక్రియలనొకమం డలమువరకు జేయవలయు.

---

* బలాత్రయమన—ముత్తవపులగము పెదముత్తవపులగము నాగబలయనునవి

## విసర్పమునందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] పురాణయవగోధూమ కంగుషష్టికశాలయః। ముద్గామసూరాశ్చణకాస్తువర్యోజాంగలోరసః। నవనీతం ఘృతంద్రాక్షా దాడిమం కారవేల్లకమ్। వేత్రాగ్రంకులకంధాత్రీఖదిరోనాగకేసరః । ద్రాక్షాశిరీషకర్పూరంచందనంతిలలేపనమ్। యథాదోషంపథ్యమిదం సేవితవ్యంవిసర్పిభి॥

తా. ప్రాతయవలు గోధుమలు కొఱ్ఱలు 60 దినములకు ఫలించెడివడ్లు పెసలు చిరుసెనగలు సెనగలు కందులు జాంగలమాంసరసము వెన్న నెయ్యి ద్రాక్షపండు దాడిమపండు కాకరకాయ వెదురుగొమ్ము చిట్టితుమికీనూర వుసిరికపండుచంద్రనాగకేసరములు ద్రాక్ష దిరిసెనము కర్పూరము చందనము నువ్వులు అనువాని లేపనము దోషానుగుణ్యముగ విసర్పిరోగమునందు పథ్యకరంబులు.

## విసర్పమునం దపథ్యము.

శ్లో॥ వ్యాయామామహ్ని శయనంసురతంప్రవాతం క్రోధంశుచం వమనవేగవిధారణంచ । గుర్వన్నపానముఖలంలశునంకులుత్థాన్మాషాంస్తిలాన్ సకలమాంసమజాంగలంచ । స్వేదం విదాహిలవణామ్లకటూని మద్యమర్కప్రభామపివిసర్పగదీత్యజేత్తత్ ॥

తా. సంచారము పగలునిద్ర మైథునము గాలి క్రోధము దుఃఖము వమనమలమూత్రవేగ ధారణము జడాన్నము జడకరమైనపానము వెల్లుల్లి వులవలు మినుములు నువ్వులు అరణ్యమునందలి సర్వజంతుమాంసము చెమటదీయుటవిదాహకరద్రవ్యములు వుప్పు పులుసు కారము మద్యము యెండ వీనిని విసర్పిరోగము గలవారు వర్జింపవలయు.

సీ॥ వాయువిడంగలవంగములేలకుల్ జాపత్రికాచును జాజికాయ। ప్రాంతకొబ్బెరంతమం భ్రాకశెల్లంబునుబోంకలుత్రికటంబువోమపొట్టు। పిప్పలిమూలంబు వెసజీడిగింజలు గురుతైనయట్టియాకొడిసెపాలు । యిన్నియుసమగూర్చి యన్నియు సమభాగములుగూర్చి త్రొక్కియుం బొసంగమాత్ర॥

లమరఁజేసియుమండలం బవనియందు । శ్వేతరోగంపుమను జులుసేవఁజేసి । పరఁగఁపథ్యంబులుండినఁ బాటిపోవు। బ్రహ్మ యమేఘునిహాయువు తొలచునట్లు॥

## విస్ఫోటక నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] కట్వమ్లతీక్ష్ణోష్ణ విదాహరూక్ష క్షారైరజీర్ణాధ్యశనాతపైశ్చ । తథర్తుదోషేణవిపర్యయేణకుప్యంతిదోషాః పవనాదయస్తు। త్వచమాశ్రిత్య తేరక్త మాంసాస్థీని ప్రదూష్యచ । ఘోరాన్ కుర్వంతివిస్ఫోటాన్ సర్వాన్ జ్వరపురస్సరాన్ ॥

తా. కారము పులుసు తీక్ష్ణము వుష్ణము విదాహము రూక్షక్షారముగల రసములు సేవించుటవలనగాని లేక ఆజీర్ణము వలన గాని లేక అధికముగ భుజించుట వలనగాని యెండ ఋతువిపర్యయ దోషము అనువాని వలనగాని వాతాదిదోషము లు దుష్టంబులై చర్మము నాశ్రయించి రక్తమాంస అస్థులం జెరచి కడుభయంకరమై కురుపుల గలుగంజేసిన విస్ఫోటక మనంబడు దానియందు జ్వరము గలిగియుండు (సర్వవిస్ఫోటకములకు రక్తపిత్తములే ముఖ్యకారణంబులు.)

## విస్ఫోటక స్వరూపము.

శ్లో॥ అగ్నిదగ్ధనిభాస్ఫోటాః సజ్వరారక్తపిత్తజాః।
క్వచిత్సర్వత్రవా దేహే విస్ఫోటాఇతి తేస్మృతాః॥

తా. రక్తపిత్తములవలన గలిగిన సర్వ విస్ఫోటకములయందు తొలుత జ్వరముగలిగి అగ్నివలన గాల్చబడినట్టి కాంతిగల విస్ఫోటకములు శరీరము యొక్కయొక ప్రదేశమునందు గాని లేక సర్వశరీరమునందుగాని జనించు. దీనినే విస్ఫోటక మనియెదరు.

## వాతవిస్ఫోటక లక్షణము.

శ్లో॥ శిరోరుక్శూలభూయిష్ఠం జ్వరతృట్పర్వభేదనమ్ ।
సకృష్ణవర్ణతా చేతి వాతవిస్ఫోటలక్షణమ్॥

తా. కపాలము నొచ్చుట కీలుప్పులయందు కడుశూలగలుగుట జ్వరముదప్పి గల్గియుండుట సంధులు పగిలినటుల నొచ్చుట కురుపులు నల్లగనుండుట యీలక్షణములు గలది వాతవిస్ఫోటకమని తెలియవలయును.

## పిత్తవిస్ఫోటక లక్షణము.

శ్లో॥ జ్వరదాహరుజాస్రావ పాకతృష్ణాభిరన్వితమ్॥
పీతలోహితవర్ణంచ పిత్తవిస్ఫోటలక్షణమ్॥

తా. జ్వరము దాహము పోట్లు స్రావము పాకము దప్పి గలుగుట పచ్చగాని లేక యెఱ్ఱగాని యుండుట యీ లక్షణములు గలది పిత్తవిస్ఫోటకమని తెలియవలయు.

## కఫవిస్ఫోటక లక్షణము.

శ్లో॥ ఛర్ద్యరోచకజాడ్యాని కండూకాఠిన్యపాండుతాః।
అవేదనశ్చిరాత్పాకీ సవిస్ఫోటఃకఫాత్మకః॥

తా. వాంతి అరుచి జడత్వము దురద కాఠిన్యము గలుగుట తెల్లగ నుండుట అల్పవేదన చిరకాలము మీద పాకము యీ లక్షణములు గలది విస్ఫోటక మని తెలియవలయు.

## కఫపిత్తవిస్ఫోటక లక్షణము.

శ్లో॥ కండూర్దాహోజ్వర శ్ఛర్ది రేతై స్తుకఫపైత్తికః।

తా. దురద దాహము జ్వరము వాంతి గలిగిన కఫపిత్త విస్ఫోటకమని తెలియవలయు.

## వాతపిత్త విస్ఫోటక లక్షణము.

శ్లో॥ వాతపిత్తకృతోయస్తు కురుతే తీవ్రవేదనామ్॥

తా. మిక్కుటముగ పోట్లు గలిగిన వాతపిత్త విస్ఫోటకమని తెలియవలయు

## కఫవాత విస్ఫోటక లక్షణము.

శ్లో॥ కండూ స్తైమిత్యగురుభి ర్జానీయాత్కఫవాతికమ్ ।

తా. దురద స్తబ్ధత్వము జడత్వము గలది వాతకఫ విస్ఫోటక మని తెలియవలయు.

## సన్నిపాత విస్ఫోటక లక్షణము.

శ్లో॥ మధ్యేనిమ్నోన్నతోంతేచ కఠినోల్పప్రపాకవాన్ ।
దాహరాగతృషామోహ ఛర్దిమూర్ఛారుజోజ్వరః।
ప్రలాపో వేపథుస్తంద్రా సోసాధ్యశ్చత్రిదోషజః॥

తా॥ మధ్యప్రదేశము పల్లముగ చుట్టూ మిట్టగకఠినముగా గాని లేక యేకొంత పండినట్లుగా గాని యుండిన త్రిదోషజ విస్ఫోటక మనితెలియవలయు. దానిసంబంధమగు తాప దాహము జొల్లు కారుట దప్పి మోహము వోకర మూర్ఛ పొల్లు జ్వరము తెలియక మాటలు కంపము నుబ్బు ఆనునవికలుగు. ఈ విస్ఫోటకం బసాధ్యము.

## రక్తజ విస్ఫోటక లక్షణము.

శ్లో॥ రక్తారక్తసముత్థానా గుంజాఫలనిభాస్తథా ।
వేదితవ్యాస్తురక్తేన పైత్తికేనచహేతునా।
నతేసిద్ధింసమాయాంతి సిద్ధైర్యోగశతైరపి॥

తా. గురిగింజవలె నెఱ్ఱనై పిత్తదోష యుక్తంబై రక్తదూష్యంబై యుండిన ది రక్తజ విస్ఫోటకమని తెలియవలయు దీనియం దనేకోపచారములం జేసినను సాధ్యంబుగాకుండు.

## విస్ఫోటక సాధ్యాసాధ్య లక్షణములు.

శ్లో॥ ఏకదోషోత్థితస్సాధ్యః కృచ్ఛ్రసాధ్యోద్విదోషజః।
సర్వరూపాన్వితోఘోర స్త్వసాధ్యోభూర్యుపద్రవః॥

తా. ఏకదోష విస్ఫోటకము సాధ్యము. ద్విదోషజ విస్ఫోటకము కష్టసాధ్యము. త్రిదోష జనితంబై యనేకోపద్రవ యుక్తంబై భయంకరముగనుండు విస్ఫోటక మసాధ్యము.

## విస్ఫోట కోపద్రవములు.

శ్లో॥ హిక్కాశ్వాసోరుచిస్తృష్ణా * చాంగసాదోహృదివ్యథా ।
విసర్పజ్వరహృల్లాసా విస్ఫోటానాముపద్రవాః॥

* చాంగమర్దో.

తా. ఎక్కిళ్ళు వుబ్బసము అరుచి దప్పి వొడలు కృశించుట ఒళ్ళునొప్పి విసర్పము జ్వరము నోటకారముగ నీళ్ళూరుట యివి విస్ఫోట కోపద్రవములని తెలియవలయు.

## విస్ఫోటకమునందు సామాన్యోపచారము.

శ్లో॥ [ఆయుర్వేదే] తత్రాదౌలంఘనంకార్యం వమనంపథ్యభోజనమ్ । యథాదోషంబలంవీక్ష్య ప్రోక్తంయుక్తంచ రేచనమ్॥

తా. విస్ఫోటకమున తొలుత లంఘనము జేయించి పిదప వమనమున కొసంగి పథ్యకరమైన భోజనముల భుజింపం జేయవలయు మఱియు విస్ఫోటక దోషబలము నెఱింగి యథాయోగ్యముగ విరేచనము జేయించవలయు.

## ద్విపంచమూలాది కషాయము.

శ్లో॥ ద్విపంచమూలంరాస్నాచ దార్వుశీరందురాలభామ్।
సామృతంధాన్యకంముస్తాం క్వాథయిత్వాశృతంపిబేత్
విస్ఫోటంవాతసంభూతం హంత్యేతన్నాత్రసంశయః ॥

తా. దశమూలములు సన్నరాష్ట్రము మాఁని పసపు వట్టివేర ముళదుగొండి తిప్పతీగె ధనియాలు తుంగముస్తెలు వీనిని సమభాగములుగ దంచి కషాయము కాచి త్రాగిన వాతవిస్ఫోటకము నిస్సంశయముగ నశించు.

## ద్రాక్షాది కషాయము.

శ్లో॥ ద్రాక్షాకాశ్మర్యఖర్జూర పటోలారిష్టవాసకైః ।
లాజాకుశకదుస్పర్శైః క్వాథశ్శర్కరయాయుతః ।
విస్ఫోటంపిత్తజంహంతి సోపద్రవమసంశయమ్॥

తా. ద్రాక్ష గుమ్ముడు ఖర్జూరము చేతిపొట్ల వేప అడ్డసరము పేలాలు చిట్టితుమికి దురదగొండి వీనిని కషాయముగాచి అందు శర్కర గలిపి త్రాగిన వుపద్రవములతో గూడియుండు పిత్త విస్ఫోటకము నిశ్చయముగ హరించు.

## భూనింబాది కషాయము.

శ్లో॥ భూనింబనింబయాసాశ్చ త్రిఫలేంద్రవవాసకాః ।
పిచుమందఃపటోలీచ క్వాథమేషాంసశర్కరమ్ ॥

పీత్వావిముచ్యతేనూనం కఫవిస్ఫోటకాన్నరః ॥

తా. నేలవేము వేము దురదగొండి త్రిఫలములు కొడిసెపాలవిత్తులు అడ్డసరము కటునింబ చేతిపాట్ల వీనిని కషాయముకాచి అందుపంచదారకలిపి త్రాగిన కఫవిస్ఫోటకము హరించు.

## ద్వాదశాంగ కషాయము.

శ్లో॥ కిరాతతిక్తకారిష్ట యష్ట్యాహ్వాంబుదపర్పటైః ।
వటోలవాసకోశీర త్రిఫలాకౌటజైశ్శృతమ్।
ద్వాదశాంగంనరఃపీత్వా విస్ఫోటేభ్యోవిముచ్యతే ।
ద్వంద్వజేభ్యస్త్రిదోషోత్థ రక్తజేభ్యోహితాశనః ।

తా. నేలవేము వేము అతిమధురము తుంగముస్తెలు పర్పాటకము చేతిపాట్ల అడ్డసరము వట్టివేరు త్రిఫలములు కొడిసెపాలవిత్తులు వీనిని కషాయముకాచి త్రాగి నద్వంద్వ త్రిదోష రక్తదోషమువలన గలిగిన విస్ఫోటకము హరించు మఱియు దీని యందు లఘుకరముగనుండు పదార్థముల సేవించుట పథ్యకరము.

## అమృతాది కషాయము.

శ్లో॥ అమృతవృష పటోలంముస్తకం సప్తవర్ణంఖదిరస సితవేత్రం
నింబపత్రంహరిద్రే । శృతమితిసవిసర్పాన్ కుష్ఠవిస్ఫోటకం
డూరపనయతిమసూరిం శీతపిత్తజ్వరంచ॥

తా. తిప్పతీగె అడ్డసరము చేతిపాట్ల తుంగముస్తెలు యేడాకులఅరటి చండ్ర వెదురుగొమ్ము వేపాకు పసపు మ్రానిపసపు వీనిని కషాయముకాచి పంచదారగలిపి త్రాగిన విసర్పి కుష్ఠువు విస్ఫోటకము దురద మసూరిక పిత్తజ్వరము హరించు.

## పటోలాది కషాయము.

శ్లో॥ పటోలామృత భూనింబవాసారిష్టకపర్పటైః ॥
ఖదిరాష్టయుతైః క్వాథోవిస్ఫోటజ్వరశాంతయే

తా. చేతిపాట్ల తిప్పతీగె నేలవేము అడ్డసరము వేము పర్పాటకము ఖదిరాష్టకము వీనిని కషాయముకాచి త్రాగిన విస్ఫోటకము జ్వరము హరించు. (ఖదిరాష్టకమన—చండ్ర త్రిఫలములు చేతిపాట్ల తిప్పతీగె అడ్డసరము వేము అనునవి.)

## విస్ఫోటకములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] విస్ఫోటక హితార్థాయ సేవయేచ్ఛ్రయవాదిభిః । ముద్గాఢకి మసూరాణాంరసైర్వావిశ్వాసంయుతైః । సునిషణ్ణక వేత్రాగ్రం తండులీ సుకటిల్లకైః । కులకాభిరుకైరేభిస్స్వపర్పటసతీనకైః । తిక్తయూషసమాయుక్తైరోభ్యజనం సంప్రయోజయేత్ ॥

తా. యవలు పెసలు కందులు చిఱుసెనగలు వీనికట్టులో శొంతిచూర్ణమును గలిపిగాని చెంచలికూర వెదురుగొమ్ము చిత్తికూర కాకరకాయ చిట్టితుమ్మాకు పిల్లిపీచర పర్పాటకము లంకలనెదు వండ్లు చేదుగలయూషము అనువానినిగాని విసర్పిరోగమునందు భుజించుట పథ్యకరము.

## విస్ఫోటకములయందపథ్యము.

శ్లో॥ తిలాన్మాషాన్ కుళుత్థాంశ్చలవణామ్లకటూనిచ ।
విదాహిరూక్షముష్ణంచవిస్ఫోటీపరివర్జయేత్॥

తా. నువ్వులు వుద్దులు వులవలు వుప్పు పులుసు కారము దాహకర పదార్థములు రూక్ష వుష్ణము వీనిని విస్ఫోటకరోగముగలవారు వర్జింపవలయు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీతే శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
కుష్ఠవిసర్పి విస్ఫోటక రోగ నిదాన
తత్సాధ్యాసాధ్య చికిత్సానుపాన
పథ్యాపథ్య లక్షణయుక్తం
త్రయోదశ ప్రకరణమ్.

శ్రీ ర స్తు.

# బసవరాజీయము.

## ఆంధ్ర తాత్పర్యము.

## — చతుర్దశ ప్రకరణము. —

శ్లో॥ శ్రీజంగమేశ పాదాబ్జ భృంగం శుద్ధం మహేశ్వరమ్ ।
సర్వజ్ఞం సకలాధారం బసవేశ మహంభజే.

తా. జంగమేశ్వరుని పాదపద్మముల సేవించువాడు శుద్ధుడు మహేశ్వరుడు సర్వజ్ఞుడు సకల జగత్తున కాధారభూతుడు నగు బసవేశ్వరుని నేను భజించెదను.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహంవైద్య శిఖామణిమ్।

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు అని పేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథముయొక్క చతుర్దశ ప్రకరణమును వచింపుచున్నాడను.

### అర్శోరోగ స్వరూపము.

శ్లో॥ [చికిత్సాసారసిద్ధసంగ్రహే] అర్శాంసిశుక జిహ్వాశ్చకొక్కు టం జలుక స్తథాః ప్లక్షోదుంబర సంకాశా న్యే తాన్యర్శాం సిపంచచ.

తా. కొన్ని మూలరోగముల చిలుకనాలుక కోడిజుట్టు జలగ జువ్వికాయ మేడికాయ అనువానితో తుల్యముగనుండును ఇటుల మూలరోగంబులు 5 విధంబులు.

శ్లో॥ బింబీకర్కంధుఖర్జూర కార్పాసీఫలసన్నిభాః ।
కేచిత్కదంబపుష్పాభాః కేచిత్సిద్ధార్థకోపమాః ।
బహుస్రావీశోష్ట జిహ్వాశంబూ కావ ర్తతుల్యభమ్ ।
భేషజక్షారశస్త్రాగ్ని * సాధ్యానాంచప్రశస్యతే।

* సాధ్యత్వం యాప్యముచ్యతే.

తా. మఱియు మూలరోగములు దొండపండు రేగుపండు ఖర్జూరకాయ ప్రత్తికాయ అనువానితో తుల్యములుగ కొన్నికడిమిపువ్వులతో తుల్యములుగ మఱి కొన్ని యావాలతో తుల్యములుగ యెల్లపుడు స్రావముగలవిగ ఒంటెనాలుకతో సమానములుగ వర్తుల్లతో సమానమైన వలయములు గలవిగనుండును. అందు సాధ్యంబులుగనుండు అర్శోరోగముల ఔషధ క్షార శస్త్రాగ్ని కర్మలవలన చికిత్సింపవలయు.

శస్త్రోపయుక్త యంత్ర లక్షణము,

శ్లో॥ బాలానాంగోస్తనాకారం యంత్రకంచతురంగుళమ్ ।
సహింపంచాంగుళ పుంసాం ప్రమదానాంపడంగుళమ్ ।
ద్విచ్ఛిద్రమర్శసాం వేధే హ్యేకచ్ఛిద్రంతుకర్మణి ।
అధస్థంత్ర్యంగుళం ఛిద్రమంగుష్ఠోదరవిస్తృతమ్

తా. మూలరోగోపయుక్తయంత్రము గోస్తనాకారముగలదై పట్టికొనుటకు క్రిందిభాగమున మూడంగుళముల పొడవు అంగుష్ఠోదర ప్రమాణమైన వెడల్పుగలదై 2 ఛిద్రములుగలదిగ నుండవలయు మఱియు అంగుళముల పొడవుగల యంత్రముతో బాలురకును 5 అంగుళముల పొడవుల దానితో పురుషులకును 6 అంగుళముల పొడవుగల దానితో స్త్రీలకును చికిత్సింపవలయు మఱియు 2 ఛిద్రములుగల యంత్రమును మూలరోగమును వేధించుటయందును 1 ఛిద్రముగల దానిని శస్త్రకర్మయందును నుపయోగింపందగు.

అర్శోరోగ సామాన్య గుణములు.

శ్లో॥ అరోచకాగ్ని మాంద్యంచ హ్యాంత్ర కూజనమేవచ। గుల్మం ప్లీహంచశ్వయథుర్నేత్రే కర్ణధ్వనిర్భ్రమః । అష్ఠీలకముదావర్తోమలబంధస్తథైవచ । కట్యూరువంక్షణేశూలంజ్వరమన్నేచద్వేషితా । శోషాద్వివర్ణతాదేహే హ్యర్శసాం లక్షణంవిదుః ।

తా. అరుచి అగ్నిమాంద్యము ప్రేగులరచుట గుల్మము ప్లీహము నేత్రములయందు వాపు చెవిలో ధ్వనిగలుగుట వొడలు దిరుగుట అష్ఠీలికావాతము వుదావర్తముగలుగుట మలము బద్ధగించుట నడుము తొడలు గజ్జలు అనువానియందు శూలగలుగుట జ్వరము అన్నద్వేషము శోష శరీరవైవర్ణ్యముగలుగుట ఇవియమూలరోగమున సామాన్యలక్షణంబులు,

## ఆర్శోరోగ భేదములు.

శ్లో॥ [మాధవనిదానే] అర్శాంసిషట్ప్రకారాణి రక్తదోషాత్త్రిదోషతః । జాయంతేమారుతాత్పిత్తా త్కఫాద్ద్వంద్వా ద్వళిత్రయే ॥

తా. రక్తార్శస్సు త్రిదోషార్శస్సు వాతార్శస్సు పిత్తార్శస్సు శ్లేష్మార్శస్సు ద్వంద్వార్శస్సు అన మూలరోగములు 6 విధంబులు.

## ఆర్శోరోగ సాధ్యాసాధ్యములు.

శ్లో॥ ఏకదోషోత్థితంబాహ్యం సుఖసాధ్యం తథాచిరాత్ ।
ద్వంద్వజంయాప్యకంచైవ కృచ్ఛ్రసాధ్యం భిషగ్వరైః ।
అంతర్వళి త్రిదోషోత్థా న్యసాధ్యార్శాంసితానిచ ।
కుర్వంతిసర్వరోగాంశ్చ తస్మాద్యత్నేన తజ్జయేత్ ॥

తా. మూలరోగము ఏకదోషమువలనగాని లేక వెలపటివళియందుగాని జనించియుండినను మఱియు జనించి చిరకాలము గాక యుండినను సుఖసాధ్యంబు. ద్వంద్వదోషమువలన జనించిన మూలరోగము కష్ట సాధ్యంబగుటచే యాప్యంబు, అంతర్వళియందు జనించిన మూలరోగంబును త్రిదోషమువలన జనించిన మూలరోగంబును అసాధ్యంబులు. మఱియు మూలరోగము సర్వరోగోత్పత్తికి కారణంబగుటచే దానిని సర్వప్రయత్నములవలన హరింపజేయవలయు.

## అర్శోరోగ పూర్వరూపము.

శ్లో॥ విష్టంభోజఠరాటోప శ్శ్వార్శసిగ్రహణీతథా ।
కార్శ్యముద్గారబాహుళ్యం పూర్వలక్షణముచ్యతే ।

తా. అన్నము జీర్ణముగాకుండుట కడుపులో గుడగుడశబ్దముగలుగుట గ్రహణీరోగముగలుగుట శరీరము కృశించుట మిక్కుటముగ వోకరింతలు గలుగుట యివియ అర్శోరోగ పూర్వలక్షణంబులు.

## వాతార్శస్సునకు కారణము.

శ్లో॥ కటుతిక్తకషాయైశ్చ రూక్షతీక్ష్ణాతిశీతలైః ।
భోజనైర్లంఘనైర్వాపి మద్యమైథునసేవనైః ।
జాయంతేహ్యంకురైశ్శ్యామైశ్శుష్కార్శాంసిచమారుతాద్ ॥

తా. కారము చేదు వగరు రూక్షతీక్ష్ణము కడుశీతలముగల పదార్థముల భుజించుట వుపవాసముసేయుట మిక్కుటముగ మద్యపానము స్త్రీసంభోగముసేయుట యీకారణములవలన నల్లనై ఉప్పుమైన మొలకలతోఁగూడియుండు వాతార్శస్సుజనించు.

## వాతార్శస్సు లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] బింబసర్ష పకార్పాస బీజవత్స్ఫుటితాననః।
సశబ్దధూమసంయుక్తం స్తోకంవాధప్రవాహికా
విష్టంభదాహకంశూలం నానారోగాశ్చమారుతాత్ ॥

తా. మొలకలు దొండపండు ఆవాలు ప్రత్తిగింజలు అనువానితో సమానంబై పగిలియుండుట గుదమున శబ్దముగలుగుట పొగవెడలుచుండుట పలుమారు కొంచ కొంచముగ విరేచనములగుట మలము బద్ధగించుట మంటలు శూల పలువిధ రోగములు గలుగుట యీ లక్షణములు గలది వాతార్శస్సని దెలియవలయు.

## వాతార్శకారణ తల్లక్షణములు.

శ్లో॥ [చరకే] కట్వమ్లలవణోష్ణాసివ్యాయామాగ్న్యాతపశ్రమాః।
సేవనాత్సిరివతేర క్తం నీలపీతోష్ణవర్చసః ।
రక్తానలాస్సితాఃపీతా మృదవశ్చాంకురా స్తథా ।
దాహపాకజ్వరస్వేద తృణ్మూర్ఛాః పిత్తజార్శసామ్॥

తా. కారము పులుసు వుప్పు వుష్ణము వ్యాయామము అగ్ని యెండ శ్రమ అనువానిసేవనవలన రక్తము గారుట మలము నల్లగ పచ్చగ వుష్ణముగ వెడలుట యెఱ్ఱగ నల్లగ తెల్లగ పచ్చగ మృదువుగనుండు మొలకలు జనించుట మంట పాకము జ్వరము చెమట దప్పి మూర్ఛ కలుగుట యీ లక్షణములుగలది పిత్తార్శస్సని తెలియవలయు.

## శ్లేష్మార్శ నిదాన తల్లక్షణములు.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] అతిశీతగురుస్నిగ్ధ తూరామ్లస్వాని షేవణాత్ ।
శ్లేష్మోల్బదాత్తిరంశుభ్రం పిత్తార్శఃగో స్తనీసమమ్ ।
స్పర్శేఃకండ్వాః ప్రియంస్నిగ్ధం నానారోగ కరం కిల।
వసాభసకఫప్రాయః పురీషాస్స్రపం-పి-కాః।
జ్ఞేయాశ్లేష్మా ర్శసాహ్యేషాం రక్తమోతాత్సుఖావహమ్ ।

శ్లేష్మార్శపాంగుదేపార్శ్వే రక్తమోక్షంజలూకయా ।
కృత్వాచార్కరసైర్లేప్యం దాహశ్చాత్రాపిశస్యతే ॥

య. కడుశీతలము జడము స్నిగ్ధము క్షారము పులుసుగల పదార్థములుసేపించుటవలన శ్లేష్మము ప్రకోపించి కఠినముగ తెల్లగ పచ్చగ గోస్తనాకారముగ నుండు మొలకల గలుగంజేయు తాకిన నవశమించుట మెఱయుచుండుట పలువిధరోగములకు కారణంబుగనుండుట మలము మాంసపుప్రోవ్వుతో సమానముగ ఆమయుక్తముగ నీరుతో సమానముగ వెడలుట యీ లక్షణములు గలది శ్లేషార్శస్సని దెలియవలయు దీనియందు రక్తస్రావమును జేయించుట సుఖకరము. మఱియు దీనియందు గుదపార్శ్వమున జలగలతో రక్తస్రావమును జేయించుటయే గాక జిల్లేడుపాల లేపనమును దాహకర్మను సగాజేయుట ప్రశస్తంబు.

అర్శోభేద లలితము.

శ్లో॥ [పూజ్యపాదీయే] గుదద్వారా త్పృష్ఠదేశే జాయంతే పాండురాంకురాః । లలితానేవిశుష్యంతే మూలరోగస్య లక్షణమ్। శ్లేష్మార్శసామయంభేదో హన్యాల్లేపరసాయనైః॥

తా. గుదమునకు పైభాగమున మృదువైన తెల్లనిమొలకలు జనించిశుష్కించు. ఇదియ మూలరోగ లక్షణము ఇది శ్లేష్మార్శస్సులో భేదముగలదిగ నుండు. దీనిని లేపనరసాయనములచే హరింపం జేయవలయు.

ద్వంద్వ త్రిదోషార్శో లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] మిశ్రితేద్వంద్వజంజ్ఞేయం సర్వరూపంత్రిదోషజమ్ । నస్రవంతేసభిద్యంతె స్నిగ్ధపాండు త్వగాదయః॥

తా. 2 దోషలక్షణములు గలది ద్వంద్వజార్శస్సనియు వాతపిత్త శ్లేష్మలక్షణయుక్తంబై స్రావభేదనరహితంబై చర్మాదులు మెఱయుచు పాండురవర్ణముగ నుండిన త్రిదోషార్శస్సనియు తెలియవలయు.

రక్తార్శో లక్షణము.

శ్లో॥ [భేషజకల్పే] రక్తోల్బణగుదేకీలాఃపిత్తాకృతిసమన్వితాః ।
శృంగాద్యైశ్శోణితస్రావో హ్యగ్నోవాయుర్నగచ్ఛతి ।

వాతపిత్తకఫాహ్యత్ర ద్వంద్వజాశ్చ త్రిదోషజాః ।
లక్షణైః పూర్వవజ్జ్ఞాత్వా చికిత్సాచ్ఛోణితార్శసామ్ ॥

తా. గుదమున రక్తము స్రవించుట మొలకలు పిత్తార్శలక్షణయుక్తంబులు గనుండుట వాతమధోముఖముగ సంచరింపనుండుట పూర్వోక్తవాత పిత్తశ్లేష్మ ద్వంద్వ త్రిదోషలక్షణయుక్తంబుగ నుండుట ఈలక్షణములుగలది రక్తార్శస్సని తెలియవలయు. దీనియందు కొమ్ములు సారకాయబుడ్డలు మొదలగు వానిచే రక్తస్రావము జేయించుటయేకాక వాతపిత్తశ్లేష్మ ద్వంద్వ త్రిదోషార్శ చికిత్సలను సగా జేయవలయు.

అర్శోరోగ సామాన్య లక్షణములు.

శ్లో॥ [మతాంతరే] మాంసకీలానిగుదజా న్యర్శాంసిమునయోవిదుః।
తద్రక్తజంచసహజం దోషజంసాన్నిపాతకమ్।
సామాన్యలక్షణంతేషాం మలస్రంసోగ్నిమందతా ।
నిస్సారతావివర్ణత్వం సకలామయసంభవః॥

తా. గుదమున మాంసపు మొలకలు జనించిన అర్శస్సని మునులు వచించెదరు. అది రక్తజ సహజ వాతజ పిత్తజ శ్లేష్మజ సన్నిపాతజములన 6 విధంబులు. అందు మలము పలచగ వెడలుట అగ్నిమాంద్యము గలుగుట సత్వములేనుండుట శరీరము వివర్ణంబగుట సర్వరోగోత్పత్తికి కారణంబుగనుండుట అనునవి సామాన్యలక్షణములు.

శ్లో॥ [మతాంతరే] దోషజంసాధ్యంశిష్టే ద్వేతుపరిత్యజేత్ ॥

తా. అందేకదోషము వలన జనించిన అర్శస్సు రక్తార్శస్సు సాధ్యంబులు త్రిదోషార్శస్సు సహజార్శస్సు అసాధ్యంబులు.

అసాధ్యార్శోపద్రవములు.

శ్లో॥ [బాహటే] హస్తపాదేముఖేనాభౌగుదే వృషణయోర్గుదే।
హృత్పార్శ్వశూలమోహంచ ఛర్దిస్తృష్ణా జ్వరారుచి ।
రక్తాతిసారోరుక్కార్శ్యమర్శాంసిమారయంతితమ్॥

తా. చేతులు కాళ్ళు ముఖము నాభి వృషణములు గుదము అనువానియందు వాపుగలుగుట రొమ్ము పార్శ్వములు శూలించుట మోహము వాంతి దప్పి జ్వరము అరుచి రక్తాతిసారము పీడ శరీరకృశత్వముగలుగుట యీ యుపద్రవములుగల అర్శోరోగులు మరణము నొందెదరు.

శ్లో॥ సహజానిత్రిదోషాణి యానిచాభ్యంతరాం వలిమ్ ।
జాయంతేర్శాంసిసంశ్రిత తాన్యసాధ్యాని నిర్దిశేత్ ॥

తా. జననకాలము మొదలు స్వాభావికముగ కలిగియుండు అర్శస్సు త్రిదోషార్శస్సు లోనివళులయందు జనించియుండు అర్శస్సు అసాధ్యంబులు.

శ్లో॥ హృత్పార్శ్వశూలం సమ్మోహశ్ఛర్ది రంగస్య రుగ్జ్వరః ॥
తృష్ణాగుదస్యపాకశ్చ నిహన్యుర్గుదజాతురమ్ ॥

తా. హృదయపార్శ్వములయందు శూల యింద్రియమనస్సులయందు మోహము వాంతి శరీరశూల జ్వరము దప్పి గుదవ్రణము యీ లక్షణములతో గూడియుండు మూలరోగి మృతిజెందు.

శ్లో॥ తృష్ణారోచకశూలార్త మతిప్రస్సృతశోణితమ్ ।
శోథాసారససంయుక్త మర్శాంసిక్షపయంతిహి ॥

తా. దప్పి అరుచి శూల కడురక్తస్రావము శోఫ అతిసారముగల మూలరోగిమృతిజెందు.

అర్శోరోగ సుఖసాధ్య లక్షణము.

శ్లో॥ బాహ్యాయాంతువలౌ జాతా న్యేకదోషోల్బణానిచ ।
అర్శాంసిసుఖసాధ్యాని వత్సరోత్పతితానిచ॥

తా. వెలపటి వళియందు జనించిన మూలరోగము యేకదోష ప్రకోపమువలనజనించిన మూలరోగము 1 సంవత్సరకాలము గతించనుండెడి మూలరోగము సుఖసాధ్యంబులని తెలియవలయు.

అర్శోరోగ కృచ్ఛ్రసాధ్య లక్షణము.

శ్లో॥ ద్వంద్వజానిద్వితీయాయాం వళౌ యాన్యాశ్రితానిచ ।
కృచ్ఛ్రసాధ్యానితాన్యానితాన్యాహుః పరిసంవత్సరాణిచ ॥

తా. ద్వంద్వదోషము వలన జనించిన అర్శస్సు 2 వ వళియందు జనించిన అర్శస్సు 1 సంవత్సరకాలము గతించిన అర్శస్సు కష్టసాధ్యంబులని తెలియవలయు. (మఱియు వెలపట ద్విదోషప్రకోపమువలన జనించిన అర్శస్సు మఱియు యేకదోష ప్రకోపమువలన 2 వ వళియందు జనించిన అర్శస్సు కష్ట సాధ్యంబులు.)

## అర్శోత్పత్తికి స్థానాంతరము.

శ్లో॥ మేఢ్రాదిష్వపివక్ష్యంతే యథాస్వంనాభిజాన్యపి ।
గండూపదాస్యరూపాణి పిచ్ఛిలానిమృదూనిచ ॥

తా. మేఢ్రము నాసిక కర్ణములు మొదలగు వానియందు దోషభేదములవలన అర్శస్సు (అంకురము) జనింపుచున్నదని ముందుగ జెప్పంబడియున్నది అట్లేయుం గునసే నాభియందు సగా అర్శస్సు జనించి ఆడ యెఱ్ఱముఖముతో సమానముగ జిగటగ మృదువుగనుండు.

## వాతార్శస్సునకు అర్శంకుఠార రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతంపలైకంతు ద్విపలంశుద్ధగంధక మ్ । మృతంతామ్రం మృతంలోహం ప్రత్యేకంచపలత్రయ మ్ । త్ర్యూషణం లాంగలీదంతి చిత్రకం * పీలుకంతథా । ప్రత్యేకం ద్విపలంయోజ్యం యవక్షారంచటంకణమ్ । ఉభేపంచపలేయోజ్యే సైంధవపలపంచకమ్ ।. ద్వాత్రింశత్పల గోమూత్రం స్నుహీ క్షీరంచతత్సమమ్ ॥ † మృద్వగ్నినాపచే త్సమ్య క్స్థాల్యాం యావత్సుపిండిత మ్ । మాషద్వయంసదాఖాదే ద్రసోహ్యర్శఃకుఠారకః ।

తా. శుద్ధిజేసిన రసము 1 పలము శుద్ధిచేసిన గంధకము 2 పలములు తామ్ర భస్మము లోహభస్మము యివి దినుసుకు 3 పలములు త్రికటుకములు చెన్నచర్లగడ్డ నేలదంతి చిత్రమూలము దొండ లేక పుష్కరమూలము యివి దినుసుకు రెండేసి పలములు యవక్షారము టంకణక్షారము యివి 5 పలములు సైంధవలవణము 5 ఫలము లు యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి నూరి చూర్ణముజేసి గోమూత్రము 32 పలము లు బొంత జెముడుపాలు 32 పలములుగలిపి మృద్వగ్నితో ముద్దయగువరకు బాగుగ వండి 2 మాషములయెత్తును యెల్లపుడు సేవింపుచుండిన మూలరోగము హరించు.

శ్లో॥ వచాహింగువిశంగాని సైంధవంజీర నాగరైః ।
మరీచంపిప్పలీకుష్ఠం వధ్యాచహ్న్యజమోదకమ్ ।

* పుష్కరంతథా † మృద్వగ్నినాపచేత్సర్వం యావత్తచ్చసుపిండితము.

క్రమోత్తరగుణంచూర్ణం సర్వేషాం ద్విగుణంగుడమ్ ।
అక్షంముద్గజలైశ్శ్వాను పిబేద్వాతార్శసాంజయేత్ ॥

తా. వస 1 భాగము యింగువ 2 భాగములు వాయువిడంగములు 3 భాగములు సైంధవలవణము 4 భాగములుజీలకఱ్ఱ 5 భాగములు శొంఠి 6 భాగములుమిరియాలు 7 భాగములు పిప్పళ్ళు 8 భాగములు చంగల్వకోష్టు 9 భాగములు కరక్కాయ 10 భాగములు చిత్రమూలము 11 భాగములు వోమము 12 భాగములు యిటుల వీని నెల్లచూర్ణముజేసి దీనికిరెండింతలు బెల్లముగలిపి మర్దించి అక్షుప్రమాణమును భక్షించి వెంబడిగ పెసరనీరును త్రాగిన వాతార్శస్సుహరించు.

పిత్తార్శస్సునకు రాజవల్లభ రసము.

శ్లో॥ లోహభస్మవిళంగాని త్రిఫలానిశిలాజతు ।
తూర్యూషణంపిప్పలీమూలం చవ్యాకృష్ణతిలాస్సమమ్ ।
లోహస్యత్రిగుణంవహ్నిర్లోహాద్భల్లాతకీతధా ।
చాతుర్జాతంచలోహాంశం సర్వస్యద్విగుణంగుడమ్ ।
కర్షంభుక్త్వానిహంత్యాశు హ్యర్శోమందాగ్ని పాండుకమ్ ।
శ్వాసంభగందరంకాసం శ్వయథుంచవినాశయేత్ ॥

తా. లోహభస్మము వాయువిడంగములు త్రిఫలములు శుద్ధిజేసిన శిలాజిత్తు త్రికటుకములు మోడి చెవ్యము నల్లనువ్వులు యివి దినుసుకొక్కొకభాగము చిత్రమూలము 3 భాగములు శుద్ధిజేసిన జీడివిత్తులు 3 భాగములుయేలకులు లవంగములు ఆకుపత్రిక నాగకేసరలు యివి దినుసుకొక్కొకభాగము యిటుల వీనినెల్ల చూర్ణముజేసి దీనికి రెండింతలు బెల్లముగలిపి కర్షప్రమాణమును4మాసములవరకు సేవింపుచుండిన పిత్తార్శస్సు అగ్నిమాంద్యము పాండువు శ్వాసము భగందరము కాసము వాపు వీనిని హరింపంజేయు.

సామాన్య చికిత్స.

శ్లో॥ [రసరత్నాకరే] సూరణం కాసమర్దంచ శిగ్రువార్తాకవాలుకమ్ ॥ సుపక్వంయోజయేచ్ఛాకం వధ్యంగోధూమ తండులమ్ । కుసుంభమృదుపత్రాణి హ్యర్శసాం శేనపేషయేత్ ।

భక్షయేచ్చాకవచ్ఛాత్రైః స్వయమగ్నిరసస్తథా ।
నిష్కత్రయంత్రయంనిత్యం గుంజంవానందభైరవమ్ ॥

తా. కందగడ్డ తీటకసింద మునగ వంకాయ కూతురుబుడమ పీనిని పక్వముగ వండి భుజింపవలయు. పథ్యము గోధుమలను బియ్యపువంటకము భుజింపవలయు. మఱియు లేతకుసుంబ చిగుళ్ళనుకలిసి నూరిశాకమువలెనే భక్షింపవలయు మఱియు 3 నిష్కములయెత్తు స్వయమగ్ని రసముగాని లేక గురిగింజయెత్తు అనందభైరవము నుగాని ప్రత్యహము సేవింపవలయు.

శ్లో॥ కాకతుండీంద్రవారుణ్యోర్దేవదాళ్యాశ్చ బీజకమ్ ।
సగుడంగుదలేపేన మూలరోగహరంపరమ్ ॥

తా. పెద్దగురిజవేరు సాపర డావరడంగివిత్తులు బెల్లము పీనిని నూరి గుదము నందు లేపనమును మూలరోగము హరించు.

సూరణాది లేపము.

శ్లో॥ సూరణంరజనీవహ్ని టంకణంగుడమిశ్రితమ్ ।
పిష్ట్వారనాళకైర్లేపో హంత్యర్శాంసిమహాంత్యపి ॥

తా. కంద పసపు చిత్రమూలము వెలిగారము బెల్లము వీనిని కలితో నూరి లేపనము జేసిన త్రిదోషార్శస్సు మొదలగు బలిష్ఠములైన అర్శస్సులు హరించు,

నింబాది లేపము.

శ్లో॥ నింబార్కస్థిస్యపత్రాణాం లేపోమర్శావినాశనః ।
ఆరనాళేనవాహన్యా త్సగుడాకటుతుంబికా॥

తా. వేపాకు జిల్లేడాకు పీనిని నూరి లేపనముజేసినను లేక చేదుసొరకాయ బెల్లము వీనిని కలితో నూరి లేపనముజేసినను మూలవ్యాధి హరించు,

స్నుహ్యాది లేపము.

శ్లో॥ స్నుహ్యగ్నిలాంగలీదంతీ మూత్రైర్లేపోర్శసాంహితః ॥

తా. బొంతజెముడుపాలు చిత్రమూలము చెన్నచల్లగడ్డ దంతివేరు పీనిని నూరి మూలరోగమునందు లేపనము జేయుట హితకరంబు.

## అర్కాది లేపనము.

శ్లో॥ అర్కం పయస్సుధాకాండం కటుకా లాబుపల్లవా। ॥
కరంజోబస్త మూత్రేణ లేపనం శ్రేష్ఠమర్శసామ్ ॥

తా. జిల్లేడుపాలు జెముడుపాలు కటుకరోహిణి చేదుసొరచిగుళ్ళు క్రానుగ విత్తులు వీనిని మేకమూత్రముతోనూరి మూలరోగమునందు లేపనముజేయుట కడు శ్రేష్ఠకరంబు.

## న్యగ్రోధపత్ర లేపము.

శ్లో॥ దగ్ధ్వాన్యగ్రోధపత్రాణి తైలేన సహలేపయేత్ ॥

తా. మఱ్ఱియాకులగాల్చి బూడిదజేసి నూనెతోమర్దించి లేపనముజేసిన మూలరోగము హరించు.

## దేవదాళ్యాది లేపము.

శ్లో॥ [శారీరే] దేవాదాల్యాశ్చబీజాని సైంధవేన సుచూర్ణితమ్ ।
ఆరనాళేన లేపోయం మూలరోగ నివృత్తయే।

తా. దావరదంగివిత్తులు సైంధవలవణము వీనిని కలిలోనూరి లేపనముజేసిన మూలరోగము హరించు.

## త్రిదోషార్శస్సునకు వైక్రాంతాఖ్య రసము.

శ్లో॥ [రసరత్నాకరే] మృతసూతాభ్రవైక్రాంత కాంతతామ్రం సమంసమమ్ । సర్వతుల్యేనగంధేన మర్ద్యంభల్లాతకాన్వితమ్। దినైకంతద్ద్రవై రేవ వటీంకుర్యాద్ద్విగుంజకామ్ । భక్షయే ద్గుదజాన్‌హంతి ద్వంద్వజంచత్రిదోషజమ్ : ప్రత్యేకమష్టముసలీ వహ్నిభాగాఃకుష్ఠస్యషోడశ । పిప్పలీపిప్పలి మూలంత్ర్యూషేద్భాగద్వాయంద్వాయమ్ । చతుష్కంతు విడంగస్య మరిచం కటుశుంఠికా । బ్రహ్మదండిత థైకైకం చూర్ణితంద్విగుణంగుడమ్ కర్షాంశంభక్షయేచ్చానుహ్యర్శోరోగ ప్రశాంతయే। వైక్రాంతాఖ్య రసోనామ సాధ్యాసాధ్యార్శ తాంతయో

తా. రసభస్మము అభ్రకభస్మము వైక్రాంతభస్మము కాంతభస్మము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వీనికిసమముగ శుద్ధిజేసిన గంధకచూర్ణము శుద్ధిచేసిన జీడిగింజలచూర్ణము గలిపి జీడివిత్తులతైలముతో 1 దినముమర్దించి 2 గురిగింజలంత మాత్రలుజేసి యందొకదానిని నేలతాటిగడ్డలు 8 భాగములు చిత్రమూలము 8 భాగములు చంగల్వకోష్టు 16 భాగములు పిప్పళ్ళు మోడి రెండేసి భాగములు వాయువిడంగములు 4 భాగములు మిరియాలు చేదుబీరకొంతి బ్రహ్మదండి యివి దినుసుకొక్కొకభాగము యిట్టుల వీనినెల్లచూర్ణముజేసి దీనికి రెండింతలు బెల్లముగలిపి కర్ష ప్రమాణానుపానముతో సేవించిన అర్శస్సుద్వంద్వార్శస్సు త్రిదోషార్శస్సు సాధ్యాసాధ్యార్శస్సులు హరించు.

అభ్రక హరీతకి.

శ్లో॥ [మాధవనిదానే] మృతాభ్రక పలంవింశ న్మృతలోహస్య పంచకమ్ । గంధకస్య పలంపంచ త్రిభిర్ద్విగుణమాక్షికమ్ । పథ్యాశతపలంయోజ్యం ధాత్రీపలశతద్వయమ్ । సర్వమేకత్ర తచ్చూర్ణంజంబీరైర్భావయేద్దినమ్। భృంగీపునర్నవాద్రావైః * కుమార్యైర్గుడసంయుతైః । భల్లాతవహ్నిగోరంటైర్హస్తిశుండీతులాంగలీ । క్షీరిణీజలకుంబీజప్రత్యేకం ప్రత్యహందవైః భావయేన్మర్దయేద్ధిత్థం మధ్వాజ్యాభ్యాం విలోలయేత్ । స్నిగ్ధభాండేస్థితంఖాదే న్నిత్యాం నిష్కద్వయంద్వయమ్ । సిద్ధశాబరయోగోయం త్రిదోషార్శాం వినాశయేత్ ॥

తా. అభ్రకభస్మము 20 పలములు లోహభస్మము 5 పలములు శుద్ధిచేసిన గంధకము 5 పలములు స్వర్ణమాక్షికము 60 పలములు కరకబెరడు 100 పలములు వుసిరికపప్పు 200 పలములు యిట్టుల వీనినెల్ల చూర్ణముజేసి నిమ్మపండ్లరసముతో 1 దినము భావనజేసి యెండించి పిదప గుంటగలగర గలిజేరు కలబంద బెల్లము జీడిపలుకులు చిత్రమూలము గోరింట హస్తికుండి (యేనుగపిప్పళ్ళు) చన్నచర్లగడ్డ తవక్షీరి (అడవిబర్రెపాలు) చేదానుగ అనువాని రసములలో ప్రతిదానిచే నొక్కొకదినము మర్దించి భావనజేసి తేనె నెయ్యిగలిపి నేతితోమాగిన కుండలోబెట్టి ప్రతిదిన

* పాఠాంతరకరుడాకుణై ॥ — దూసరితీగ నేలతంగేడు.

ము 2 నిష్కములయెత్తును సేవింపుచుండిన త్రిదోషార్శస్సు హరించు. ఈయోగము సిద్ధశాబరునిచే జెప్పంబడియె.

## అర్శోరోగములకు సూరణ వటకములు.

శ్లో॥ పలానిపంచపథ్యాయాః పలంమరిచకంతథా । పిప్పలీపిప్పలీ మూల చవ్యచిత్రకనాగరమ్।పలవృద్ధిక్రమేణైన యవక్షారం పలత్రయమ్। సూరణస్యపలాన్యష్టౌతథాభల్లాతకస్యచ । గుడే నగుళికాంకుర్యా దక్షమాత్రప్రమాణకామ్ । సాభక్షితాహా రత్యర్శ శ్చామ్లతక్రాను పానతః। కాంకాయనేనకథితం శస్త్ర క్షారాగ్నిభీరుణః ॥

తా. కరకబెరడు 5 పలములు మిరియాలు 1 పలము పిప్పళ్ళు 1 పలము మోడి 2 పలములు చెవ్యము 3 పలములు చిత్రమూలము 4 పలములు శొంఠి 5 పలములు యవక్షారము 3 పలములు కందగడ్డ 8 పలములు శుద్ధిజేసిన జీడిగింజలు 8 పలములు యిటులవీనినెల్ల దంచిచూర్ణముజేసి బెల్లముగలిపి త్రొక్కి అక్షప్రమాణము మాత్రలుజేసి పుల్లనిచల్లతో 1 సంవత్సరముగరకు సేవింపుచుండిన అర్శోరోగము హరించు. ఈ యోగమును కాంకాయనుడనువాడు శస్త్రక్షారాగ్ని కర్మలకు భయపడువారి నిమిత్తమైవచించె.

## అర్శోరోగ చికిత్స.

శ్లో। అరుష్కరే మూలరోగే చిత్రకం వాప్యరుష్కరమ్ ॥

తా. చిత్రమూలమునుగాని లేక శుద్ధిజేసిన జీడిగింజనుగాని సేవించిన వేదనతోగూడియుండు అర్శోరోగము హరించు. (లేక నేలగొలిమిడి చూర్ణము 1 భాగము చ[illegible]చూర్ణము 1 భాగము పిప్పళ్ళు ½ భాగము మోడి ½ భాగము యిటు [illegible]వీనినె[illegible] జేసి సేవిం[illegible]సలలో[illegible] పుల్లకందనునూరి వెన్నతో సేవించినను వేదనతీరెడి[illegible] జింపవలయు[illegible]జేసినను. పథ్యము పుల్లకంగవంటకమును భు[illegible] పైనుంచి దానితోడ కమికెడన్నము ను భుజింపవలయు.)

రక్తార్శస్సునకు భల్లాతకా మృతము.

శ్లో॥ [సూత్రస్థానే] భల్లాతకచతుష్షష్టి పలందుగ్ధంచ తత్సమమ్ । దుగ్ధాచ్చతుర్గుణంవారిపాచ్యం దుగ్ధావశేషకమ్। దుగ్ధతుల్యం ఘృతంయోజ్యం ఘృతపాదంసితాంక్షిపేత్ । మధుధాత్రీ సితాతుల్యం సితార్ధ మభయారజః । మృతలోహం గుడూచ్యాశ్చ ప్రత్యేకమభయార్ధకమ్ । క్షిపేత్స్నిగ్ధఘటేసర్వం ధాన్యరాశౌనివేశయేత్ । సప్తాహాదుద్ధృతంతత్తు ఖాదేన్నిష్క-త్రయంత్రయమ్ । భల్లాతకామృతంనామ హంతిరక్తార్శసాంకిల।తీక్ష్ణం నభో క్తవ్యంతైలాభ్యంగంచ వర్జయేత్ ॥

తా. 64 పలముల శుద్ధిజేసిన జీడిగింజలలో 64 పలములపాలు 256 పలముల నీళ్ళుబోసి పాలుమిగులునటుల కాచి ఆపాలపసమముగ నెయ్యి నేతికి 4 వ భాగము పంచదార పంచదారయెత్తు తేనె వుసిరికపప్పు పంచదార ½ భాగము కరక్కాయల పొడి కరకపొడి ½ భాగము లోహభస్మము లోహభస్మమునకు సమము దిప్పతీగ చూర్ణము గలిపి నేతితో మాగినకుండలోనునిచి ధాన్యరాశిలో 7 దినంబులిడి మూ జేసి నిష్కాలయెత్తును సేవింపుచుండిన రక్తార్శస్సు హరించు. దీనిసేవన కాలంబున వుప్పు తీక్ష్ణద్రవ్యము తైలాభ్యంజనము అనుపానిని వర్జింపవలయు. (రక్తార్శస్సు హరించుటకై యోగరాజగుగ్గులమును సగా సేవింపవలయు.)

అర్శో రోగోపచారము.

శ్లో॥ అర్శస్సుచ గుడంచైవ కాకోదుంబరికాన్వితమ్ ।
ముండ్యార్ద్రకరసంచైవ ఖాదిరంచ ప్రయోజయేత్ ॥

తా. బెల్లము బ్రహ్మమేడికాయలరసము అనుపానిలోగాని లేక బోడతరరసము అల్లపురసము అనుపానిలోగాని లేక చంద్రచెక్కరసములో గ్గా [illegible] దూరము గలిపి సేవించిన అర్శోరోగము హరించు. [illegible] సము [illegible] చే వాకి [illegible] లిపి నేతితో [illegible]

ఔషధ [illegible] ము.

[illegible] రై ॥—

శ్లో॥ క్షయార్శ శ్శ్వా [illegible] ష్మేమాస చతుష్టయమ్ ॥

తా. క్షయము అర్శస్సు శూల గుల్మముగలవారలు తత్తద్రోగోక్తౌషధముల 4 మాసములవఱకు సేవింపవలయు పైజెప్పబడిన ఔషధములవలన అర్శోరోగము మానకుండిన మాడయెత్తు గౌరీపాషాణమును కమికెడు మంచివేపకొనలను వుదకముతో 4 ఝాములునూరి 8 దినములు పట్టించి అగ్నియందుకాచిన అర్శస్సులు ఊడిపడును పిదప వేపాకు నుడికించి కట్టిన వ్రణముమానును.

## గౌరీపాషాణ లేపము.

శ్లో॥ గౌరీపాషాణైకకర్షం స్నుహీకాండేవినిక్షిపేత్ ।
పాచయేత్పుటపాకేన తతఉద్ధృత్యయత్నతః ।
రేవాచినీచకుష్ఠంచ కల్కీకృత్యత్రయంసమమ్ ।
లేపయేత్తేనచార్శాంసి నివార్యంతేనసంశయః ॥

తా. జెముడు కాడల యందొక కర్ష ప్రమాణముగౌరీపాషాణమునునిచి * పుటపాకములో పక్వము జేసి పిదప దానితోడ రేవల్చిన్ని చంగల్వకోష్ఠు సన్నరాస్న ము అనువానిని సమభాగములుగ జేర్చి మర్దించి కల్కముజేసి లేపనముజేసిన మూలరోగము నిస్సంశయముగ హరించు.

## అర్శరోగహర ధూపము.

శ్లో॥ [చరకే] అర్కమూలంశమీపత్రం నృకేశాస్సర్పకంచుకః ।
మార్జాలచర్మసాజ్యంచ గుదేధూపోర్శసాహితః ॥

తా. జిల్లేడువేళ్ళు జమ్మియాకు మనుజుని వెంట్రుకలు నాగుబాముకుబుసము పిల్లిచర్మము వీనిని చూర్ణముచేసి నేతిలోదడిపి 40 దినములు ఆసనమున పొగవేసిన అర్శోరోగములు హరించు మఱియు యెండిన 7 పందికొక్కులచర్మము సోలెడు మంచివేపవిత్తులు తులము తాళకము వీనిని చూర్ణముజేసి కానుగకాయలగాల్చి నిప్పుచేసి దానిపై యీ చూర్ణమునవైచి 7 దినములు రేపుమాపు ఆసనమున పొగవేయు

---

* పుటపాకమన—పచ్చి వనస్పతులనుపంచి నుద్దజేసి దానిని గుమ్ముడు మఱ్ఱి నేరేడు మొదలగువానిని యాకులలో దేనిచేనైననుజుట్టి 2 అంగుళముల ప్రమాణంబైనను అంగుళప్రమాణంబైనను మన్ను లేపనముజేసి యిది యెఱ్ఱగనగువరకు పిడకలపుటంబున నునిచి పిదప దానియందుండిదీసి పైమంటిని ఆకులను నూడదీసి లోపలిముద్దను బిసికి రసమును దీసికొనుటయు.

చుండిన అర్శోరోగములుమానును. పిదప గచ్చకాయల నాయుదముతో దడిపి వెచ్చజేసి రేపుమాపు ఆసనమున కట్టుగట్టవలయు మఱియు నాసనమున పసపు నీళ్లతో గడుగుచుండవలయు. నేలగొలిమిడియాకు రసములో మిరియపుచూర్ణము ఆవునెయ్యి గలిపి త్రాగవలయు చప్పిడియన్నము ఆవుపాలు వీనిని పథ్యమునం దునిచికొనవలయు మఱియు, పంది పురీషమునుపొగ వేసిన అర్శోరోగము హరించు.

## కపిత్థాది యోగము.

శ్లో॥ కపిత్థబిల్వమజ్జాశ్చ శుంఠీసైంధవకంసమమ్ ।
పిబే త్తక్రేణచార్శాంసి ప్రవాహం గ్రహణీంజయేత్ ॥

తా. వెలగగుజ్జు మారేడుగుజ్జు శొంఠి సైంధవలవణము వీనిని సమభాగములుగ చల్లతోనూరి సేవించిన అర్శస్సు అతిసారము గ్రహణి హరించు.

## మూలరోగమునందు పథ్యము.

శ్లో॥ కతకకందపటోలపునర్నవం తక్రమాజ్యనవసీతరామురమ్ ।
మరిచకంసురదారుఫలంతథా పటుబృహతిద్వయజీవనీవచా ।
సమిసినవ్యముసుంబరవాస్తుకం ఇతిహితంగుదకీలగదేషుచ ॥

తా. ఇందుపుకాయ కందగడ్డ పొట్లకాయ గలిజేరుకూర ఆవుచల్ల ఆవునెయ్యి ఆవువెన్న యింగువ మిరియాలు దేవదారుకాయలు సైంధవలవణము చిన్నములకకాయలు పెద్దములకకాయ మనుబాలకూర వస చేతలాసికూర లేతమేడికాయ చిట్టికూర యివి అర్శోరోగమునందు పథ్యకరంబులు.

## మూలరోగమునం దపథ్యము.

శ్లో॥ పిండాలమాషపిణ్యాక తదమత్స్యాతిశీతలమ్ ।
అలాబూవా ర్తకంచైవ పిష్టబిల్వముపోదకీ ।
హింసాంబుసూపమాంసాని కఠినంకుక్కుటాసనమ్ ।
అశ్వాద్యారోహణంస్నాన మపథ్యంపాయురర్శసామ్ ॥

తా. చారకంప మనప్పప్పు తెలికపిండి పెఱుగు మత్స్యములు కడుశీతకరద్రవ్యములు అనుగపుకాయ వంకాయ పిండివంటకను మారేడుకాయ బచ్చలికూర

శీతోదకము పప్పు మాంసము కఠినపదార్థములు గొంతుగూర్చుండుట గుఱ్ఱము మొదలగువాని నెక్కుట స్నానము యివి అర్శోరోగమునందపథ్యకరంబులు.

## * ఉపదంశరోగ నిదానము.

శ్లో॥ [నిత్యనాధీయే] హస్తాభిఘాతాన్నఖదంతఘాతాదధావనాద్ర
త్యతిసేవనాద్వా। యోనిప్రదోషాచ్చభవంతిశిశ్నే పంచోప
దంశావివిధాపచారైః ॥

తా. చేతులతో బిసుకుట గోళ్లతో గీచుట దంతములతో కొరుకుట యీ మొదలగువానియొక్క యభిఘాతమువలన సురతానంతరము మేఢ్రమును గడుగక వుపేక్షించుట కడు మైథునము సేయుట యోనిదోషము చకారమువలన దుర్గంధముగల యుదకముతో కడుగుట యీ కారణములవలన శిశ్నమున 5 విధములైన వుపదంశరోగములు జనించు.

శ్లో॥ [మతాంతరే] శేఫోపర్యుపదంశస్స్యాత్సచపంచవిధస్స్మృతః।
స్తబ్ధమేఢ్రోతిరుగ్వాతాః త్పిత్తాద్రక్తాతిదాహవాన్ ।
కఫాత్కాఠిన్యకండూవాన్ రక్తజఃపిత్తలక్షణః।
సర్వలింగస్త్రిదోషాఖ్య స్సతులింగవినాశకః॥

తా. మేఢ్రముమీద వాత పిత్తశ్లేష్మ రక్త త్రిదోషజములన 5 విధములైన యుపదంశరోగములు జనించు. అందు వాతోపదంశమున మేఢ్రము ప్రమానుపడికడు నొప్పితో గూడియుండు పైత్యోపదంశముల మేఢ్రము యెఱ్ఱనై మంటలతో గూడియుండు శ్లేష్మోపదంశమున మేఢ్రముకఠినమై దురదతో గూడియుండు రక్తోపదంశము పైత్యోపదంశ లక్షణయుక్తంబుగనుండు త్రిదోషోప దంశమున మేఢ్రమునశించు. (యిది అసాధ్యము.)

### వాతోపదంశ లక్షణము.

శ్లో॥ సతోదభేద స్ఫురణై కృష్ణై స్స్ఫోటై ర్వ్యవస్యే త్పవ
నోపదంశమ్॥

---

* వుపదంశమన—కొరుకుజాడ్యము.

తా. మేఢ్రమున నల్లనికురుపులు జనించు నూసులతో బాధుచునటుల వేసన పగుళ్ళు చలనము అనునవి గలిగియుండిన వాతోపదంశమని దెలియవలయు.

పిత్తరక్తోపదంశ లక్షణములు.

శ్లో॥ పిత్తైర్బహుక్లేదయుతైస్సదాహైఃపిత్తేనరక్తాత్పిశితావభాసైః॥

తా. పసపువర్ణముగల కురుపులు జనించి కడు స్రావము మంటలు గలిగియుండిన పిత్తోపదంశమనియు మాంసమువంటియెఱ్ఱని కురుపులు జనించిన రక్తోపదంశమనియు దెలియవలయు.

కఫోపదంశ లక్షణము.

శ్లో॥ సకండురైః శ్వోథయుతైర్మహద్భిశ్శుక్లైర్ఘన స్రావయుతైః కఫేన॥

తా. దురద నాపు అనువానితోడంగూడి తెల్లనివర్ణముగల పెద్దకురుపులవలన వ్యాప్తంబై గట్టిగ చీమును గార్చుచుండిన కఫోపదంశమని దెలియవలయు.

సన్నిపాతోపదంస లక్షణము.

శ్లో॥ నానావిధ స్రావరుజోపపన్న మసాధ్య మాహుస్త్రిమలోపదంశమ్॥

తా. పలువిధస్రావ వేదనలంగలది సన్నిపాతోపదంశమని దెలియవలయు. యిది అసాధ్యము.

అసాధ్యోపదంశ లక్షణము.

శ్లో॥ విశీర్ణమాంసంక్రిమిభిఃప్రజగ్ధంముష్కావశేషం పరివర్జయేత్తు॥

తా. శిథిలమైనమాంసముగల వుపదంశరోగిని క్రిములవలన మేఢ్రము భక్షింపబడి వృషణములుమాత్రము శేషించియుండు వుపదంశరోగిని వైద్యుడు వర్జింపవలయు

శ్లో॥ సంజాతమాత్రేనకరోతి మూఢః క్రియాంనరోయోవిషయే ప్రసక్తః। కాలేనశోథక్రిమిదాహపాకైర్విశీర్ణశిశ్నోమ్రియతేసతేన॥

తా. వుపదంశరోగము జనించిన తోడనే చికిత్సం జేసికొనక విషయాసక్తుడై యుండు మూర్ఖ పురుషునియొక్క మేఢ్రముకొంత కాలమునకు పిదపవాపు పురుగులు తాపము పాకము అనువానితోడంగూడి శిథిలంబగు దానివలన ఆయుపదంశ రోగివ్మృతిజెందు.

లింగవర్తి లక్షణము.

శ్లో॥ అంకురై రివసంఘాతై రుపర్యుపరిసంస్థితైః క్రమేణజాయతేవర్తి స్తామ్రచూడశిఖోపమా । కోశస్యాభ్యంతరేసంధౌ సర్వసంధిగతాపివా । లింగవర్తిరితిఖ్యాతా లింగార్శ ఇతివాపరే । కుళుత్థాకృతయః కేచి త్కేచిత్పద్మదళోపమాః। మేఢ్రసంధౌ నృణాంకేచి త్కేచిత్సర్వాశ్రయాస్మృతాః । రుజాదాహార్తిబహులా స్తృష్ణాతోదసమన్వితాః । స్త్రీణాంపుంసాంచ జాయంతే హ్యుపదంశా స్సుదారుణాః॥

తా. మేఢ్రముపై మాంసపుమొలక లొకదానిపై 1 టి జనించి కోడిజుట్టువలె వర్తిగనై వృషణములకు లోనగాని లేక సర్వసంధులయందుగాని జనింపుచున్నయవి. ఈరోగమును లింగవర్తియనియు కొందరు లింగార్శమనియు వచించెదరు అందు కొన్ని వులవలతో సమానముగ కొన్ని తామర దళములతో సమానముగ కొన్ని మేఢ్రసంధులయందుగాని మఱికొన్ని సర్వశరీరమునందుగాని జనించి త్రిదోష జన్యంబుగ నుండుటచే మిక్కుటముగ-వేదన తాపము కడుపీడ దప్పి సూదులతో బొడుచునటుల వేదన అనువానితోడంగూడి యుండు మఱియు త్రిదోషజన్యంబై దారుణముగనుండు నీయుపదంశము స్త్రీపురుషుల కిరువురికి జనించుటగలదు.

ఉపదంశమునకు ప్రతిక్రియ.

శ్లో॥ స్నిగ్ధస్విన్న శరీరస్య మేఢ్రమధ్యే సిరావ్యధః ।
జలూకాపాతసంవాస్యా దూర్ధ్వాధశ్శోధనంతథా ।
సద్యోహి హృతదోషస్య రుక్శోథా వుపశామ్యతః ।
పాకోరక్ష్యః ప్రయత్నేన శిశ్నక్షయ కరోహిసః॥

తా. సర్వాంగముల చమురు బట్టించి కాచి మేఢ్రమధ్యమునందు సిరను వేధించుటవలనగాని లేక జలగలవలనగాని రక్తమును స్రవింపంజేసి పిదప వమన విరే

చనంబుల కొసంగిన దోషము నివర్తించి తత్క్షణమున దక్ష్యోథలు హరించు. మఱియు సిరావ్యధవలనగాని జలగలవలనగాని గలిగిన వ్రణమును ప్రయత్నపూర్వకముగ మాన్పవలయు లేకున్న తల్లోపంబున మేఢ్రము నశించు.

## లింగరోగ చికిత్స.

శ్లో॥ పక్వంవిపాట్యమతిమాన్ వ్రణవత్సముపాచరేత్ ॥

తా. వృషణంశము పక్వంబైనపిదప మేఢ్రమునందలి దుర్మాంసమును చివ్వి వ్రణమువలెనే బుద్ధిమంతుడగువాడు చికిత్స జేయవలయు.

## లింగరోగహర లేపనములు.

శ్లో॥ మహాశంఖంజలైః పిష్ట్వా తేనలింగంప్రలేపయేత్ । లింగరోగం నిహన్త్యాశు లేపోయం వ్యాధినాశకః । కుష్ఠంపూగం వచా తోయై స్సారం వాఖాశిరోత్థితమ్ । జలైర్ఘృష్టం ప్రలేపోయంలిఙ్గరోగ హరఃపరమ్ । క్షాళయే త్త్రిఫలాక్వాథైః పక్వంలింగం పునఃపునః । తచ్చూర్ణ లేపమాత్రేణ చాంకురంచ జయేద్ధ్రువమ్ ॥

తా. పెద్దశంఖము నుదకముతో సాది లింగమునందు లేపనము చేసిన లింగరోగము శీఘ్రముగ నశించులేక చంగల్వకోష్టు పోకచెక్క వస వీనినిగాని కొచును గాని నీళ్ళతో నూరి లింగముమీద లేపనముచేసిన లింగరోగము హరించు లేక వాపు పక్వమైన పిదప త్రిఫల కషాయములో లింగమును పలుమారుకడిగిన లింగముయొక్క వాపు హరించు. లేక త్రిఫలముల గాల్చి మసిజేసి దానిని పట్టించిన మేఢ్రమునందలి అంకురములు నిశ్చయముగ హరించు.

శ్లో॥ సగంధక ఘృతైర్లేప్యం పక్వంలింగం సుఖావహమ్ ।
నింబం ఖదిరమంజిష్ఠ చూర్ణంవా లేపయేజ్జయేత్ ।
వటోదుంబర మశ్వత్థం చూతజంబూత్వచం సమమ్ ।
జలైః క్వాథ్యంచ తేనైవ క్షాళయే ల్లింగపాకనుత్ ॥

తా. గంధకమును నేతితోవండి పక్వమైన లింగముపై లేపనముజేసినను లేక వేపాకు చండ్రచెక్క మంజిష్టి వీనిచూర్ణమును లేపనము జేసినను లేక మఱ్ఱి మేడి రావి మామిడి నేరేడు అనువాని చెక్కల సమభాగములుగ చూర్ణముజేసి యుదకములోని కషాయముకాచి దానిచేలింగమును గడుగుచుండినను లింగపాకముహరించు

శ్లో॥ కుమారీ రససంపిష్టం జీరకం లేపయేచ్ఛరుక్ ।
తేనదాహశ్చ పాకశ్చ శాంతిమాప్నోతి నిశ్చితమ్॥

తా. కలబందరసములో తెల్లజీలకఱ్ఱ నూరి లేపనముజేసిన లింగరోగము లింగరోగమునందలి నొప్పి మంట పాకము నిశ్చయముగ శమించు.

పంచారవిందక ఘృతము.

శ్లో॥ మృణాళం పద్మబీజాని నాళంపద్మంచ కేసరమ్ ।
సర్వంస ప్త పలంకుర్యా త్త్రింశత్పలంచ గోఘృతమ్ ।
ఘృతా చ్చతుర్గుణంక్షీరం ఘృతశేషం విపాచయేత్ ।
పాకాంతే చూర్ణమేషాంచ క్షిప్త్వా తదవతారయేత్ ।
పాయయేల్లింగరోగఘ్నం ఘృతం పంచారవిందకమ్.॥

తా. ఆవునెయ్యి 30 పలములు ఆవుపాలు 120 పలములు వీనిని గలిపి నెయ్యి శేషించు వఱకుకాచి పాకాంతమున తామరగడ్డలు తామరవిత్తులు తామరతూండ్లు దానిపువ్వులు దాని కేసరములు అన 5 దినుసులు 7 పలములు గ్రహించి చూర్ణముజేసి వైచి దించుకొని సేవింపుచుండిన లింగరోగము హరించు.

శ్లో॥ [మాధవనిదానే] తుత్థం * గైరికకాశీసం శిలాతాళంరసాంజనమ్ । సౌరాష్ట్రీ సైంధవంచైలాం † లోధ్రకం రేణుపుష్ప కమ్ । పిష్ట్వాక్షౌద్రేణసంయోజ్య లేపోలింగరుజాపహః॥

తా. మైలుతుత్తము కావిరాయి అన్నభేది శిలాజిత్తు తాళకము రసాంజనము తోవరిమన్ను సైంధవలవణము యేలకులు లొద్దుగచెక్క రేణుకలు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసి తేనెలోగలిపి లేపనముజేసిన లింగపీడ హరించు.

శ్లో॥ తిలకల్కం క్షౌద్రయుతం లేపోలింగ రుజాపహః ॥

తా. నువ్వుల కల్కములో తేనెగలిపి లేపనముజేసినలింగరోగము హరించు.

సర్వ వృషదంశములకు వ్యాధిహరణ రసము.

శ్లో॥ హింగుళోత్థరసంభాగం ద్విభాగా రసకర్పురమ్ । రసతుల్యం బలిందద్యా త్ఖలంమధ్యేతు కజ్జలీమ్ । దశాండేమ్నుత్ను

* టంకణ

† సింధూరం రేణుభూషణమ్.

టంపంచ వాలుకాయంత్రగం పచేత్ । దినేకంతు క్రమా గ్నౌతు సాంగశీతం సముద్ధరేత్ । పూజయే ద్గురువిప్రాదీ న్యథారోగం ప్రయోజయేత్ । గుంజా చతుష్టయంఖాదే న్నాగవల్లీ దళైర్యుతమ్ । షండోపిలభతే పుంస్త్వం వాజీ కరణముత్తమమ్ । అపుత్రః పుత్రమాప్నోతి జీవేచ్ఛ శర దాంశతమ్ । వలీపలిత మృత్యుఘ్నం వాతశ్లేష్మ నిబర్హ ణమ్ । అయంవ్యాధి హారస్సూతః పూజ్యాపాదేన నిర్మితః॥

తా. ఇంగిలీకములో దీయబడిన రసము 1 భాగము శుద్ధజేసిన రసకర్పూరము 2 భాగములు శుద్ధిచేసిన గంధకము 1 భాగము యీవుల వీనిని ఖల్వములోనునిచి 3 దినములు మర్దించి కజ్జలిజేసి దానిని కోడిగ్రుడ్డులోనునిచి దానిపై 5 చీలమన్నులిచ్చి 1 దినము వాలుకాయంత్రమున క్రమాగ్నులతో వండి సాంగశీతలమున దీసి గురు బ్రాహ్మణుల బూజించి 4 గురిగింజలయెత్తును రోగబలానుగుణ్యాముగ తమలపాకులో నునిచి సేవించిన షండత్వము ముదిమి బొమ్మనొప్పి కఫవాతము వుపదంశము వీని ని హారింపంజేసి పుంసత్వమును అపుత్రవంతునికి సంతానంబును 100 సంవత్సరంబు లాయువును మిక్కుటముగ వీర్యవృద్ధిని గలుగంజేయును. ఈరసము పూజ్యపాదునిచే జెప్పంబడియె.

## సూతాది వటికములు

శ్లో॥ శుద్ధసూతంచభల్లాతంపిప్పలీమూలపిప్పలీ । ఆకల్లకంజాతిపత్రీ ఖురకం దేవపుష్కరమ్ । మర్దయే త్సమభాగేన పురాణగుడ మిశ్రితమ్ । ఉపదం శేషు సర్వేషు ప్రమాణం రక్తికావటీ॥

తా. శుద్ధిజేసినరసము జీడి మోడి పిప్పళ్ళు అక్కలకఱ్ఱ జాపత్రి వంగభస్మ ము లవంగములు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ప్రాతబెల్లము గలిపి మ ర్దించి గురిగింజంత మాత్రలుజేసి యందొకదానిని సేవించిన సర్వమైన వుపదంశము లు హరించు.

## ఉపదంశ కుఠారము.

శ్లో॥ కంకుష్ఠంకుష్ఠకంచైవ తోలైకంతుపృథక్పృథక్ । తోలార్ధం తుత్థకంగ్రాహ్యంశృంగబేరరసేనతు।మర్దయిత్వావటీకార్యా

బదరాస్థిమితాభిషక్ । శృంగబేరరసేనైవ సాయంప్రాతశ్చ భక్షయేత్ । మధురామ్లం మత్స్యదుగ్ధం కూశ్మాండంచ వివర్జయేత్ । ఉపదంశకుఠారోయం రసస్సర్వత్ర పూజితః ॥

తా. మదారుసింగు 1 తులము చంగల్వకోష్టు 1 తులము శుద్ధిజేసిన మైలుతుత్తము ½ తులము యిటుల వీని నేకముజేసి అల్లపురసముతో మర్దించి రేగువిత్తంత మాత్రలుజేసి సాయంప్రాతఃకాలముల అల్లపురసానుపానముతో సేవించిన నుపదంశము హరించు. దీని సేవనకాలంబున మధురము పులుసు మత్స్యములు పాలు గుమ్మడుకాయ అనువానిని వర్జింపవలయు. ఈ రసము సర్వత్ర పూజింపంబడు.

## రసగంధక కజ్జలి.

శ్లో॥ కర్షమాత్రం రసంశుద్ధం ద్వికర్ష గంధకంస్మృతమ్ । విధివత్కజ్జలీంకృత్వా తచ్చగోఘృతసంయుతమ్ । మాషమాత్రం ప్రతిదినం దద్యాదేవత్రిసప్తకమ్ । గోధూమాన్నం ఘృతం పథ్యం కారయేల్లవణంవినా। ఉపదంశాపహశ్చైషో యోగో మునిభిరీరితః ॥

తా. శుద్ధిజేసిన రసము 1 కర్షము శుద్ధిజేసిన గంధకము 2 కర్షములు యీ 2 కాటుకవలె మర్దించి మాషమెత్తును ఆవునేతిలోగలిపి 21 దినములు సేవించిన నుపదంశము హరించు. దీనియందు లవణమును వర్జించి గోధూమాన్నమును నెయ్యిని సేవింపవలయు.

## బాలహరీతక్యాది యోగము.

శ్లో॥ బాలపథ్యాపలైకంచ తుత్థంశాణమితంతథా । నింబుద్రవేణ సంమర్ద్యం దృఢంసప్తదినానివై । గుటికాంచణకప్రాయాం ఛాయాశుష్కాంతుకారయేత్ । శీతోదకానుపానేన నిత్యమేకాంప్రదాపయేత్ । ఘస్రాణామేకవింశత్యాముచ్యతే తూపదంశతః । శాలిగోధూమముద్గాశ్చ గోసర్పిః పథ్యమీరితమ్ ॥

తా. కరకపిందెలు 4 రూపాయలయెత్తు శుద్ధిజేసిన మైలుతుత్తము ½ రూపాయయెత్తు యీరెంటిని నిమ్మపండ్లరసముతో 7 దినములు భావనజేసి మర్దించి సెనగింజంత మాత్రలుజేసి నీడనెండించి శీతోదకముతో 21 దినము సేవించిన నుపదం

ము హరించు. దీనియందు వరియన్నపు వంటకము గోధుమాన్నము పెసలు ఆవునెయ్యి అనువానిని పథ్యమునందు జేర్చికొనందగు.

పారదాది లేపము.

శ్లో॥ పారదంగంధకంతాళం టంకంచమనశ్శిలామ్ । పృథక్కర్షం ద్వికర్షంచ ముద్దారంశంఖజీరకమ్ । విధాయకజ్జలింఖల్వే మర్దయేత్సురసారసైః । ఛాయాశుష్కం తతఃకృత్వా పునరున్మత్తజద్రవైః । విమర్ద్యాథవటీకార్యా హ్యుపదంశే ప్రయోజయేత్ । గోఘృతేన ప్రలేపోయం వ్రణానాం రోపణేహితః ॥

తా. రసము గంధకము తాళకము యింగిలీకము మణిశిల యివి దినుసుకొక్కొకకర్షము ముదారుసింగు సీమరాతినార యివి దినుసుకు 2 కర్షములు యిటుల వీనిని ఖల్వములోనునిచి కాటుకవలెనూరి పిదప తులసియాకు రసముతో మర్దించి నీడనెండించి నారల వుమ్మెత్తాకు రసముతో మర్దించి యుంటజేసి ఆవునేతితోసాది లేపనముజేసిన వుపదంశము హరించుటయేగాక వ్రణమును మాంసపూరితంబగు.

త్రిఫలాది ప్రక్షాళనము.

శ్లో॥ త్రిఫలాయాః కషాయేణ భృంగరాజ రసేనవా ।
వ్రణ ప్రక్షాళనంకుర్యా దుపదంశే ప్రశాంతయే ॥

తా. త్రిఫలకషాయముతోగాని లేక గుంటగలగర కషాయముతోగాని వుపదంశమును గడిగిన శమించు.

శూకదోష నిదానము.

శ్లో॥ అక్రమాచ్ఛేపసోవృద్ధిం యోభివాంఛతి మూఢధీః ।
వ్యాధయస్తస్యజాయంతే దశచాష్టౌచశూకజాః ।

తా. మందబుద్ధివలన క్రమవిహీనుడై మేఢ్రము లావుగ గావలయునని యెడి యిచ్ఛచే విషజంతువుల (అనగా జలమునందుండు కప్పను) లేపనము సేయుటవలన దుష్టయోని సంబంధమువలన యోనిలో వెంట్రుకలుగల స్త్రీసంబంధమువలన 18 విధములగు శూకరోగములు జనించు.

## సర్షపికా లక్షణము.

శ్లో॥ గౌరసర్షపసంస్థానా శూకదుర్భగ్న హేతుకా ।
పిటికా శ్లేష్మవాతాభ్యాం జ్ఞేయా సర్షపికా చ సా ॥

తా. జలమునందుండు కప్పను లేపనము సేయుటవలన దుష్టయోని సంబంధము వలన కఫవాతములు ప్రకోపించి తెల్లయావాల ప్రమాణముగల కురుపు మేఢ్రమున గలుగంజేయు. ఇదియ సర్షపిక మనంబడు.

## అష్ఠీలికా లక్షణము

శ్లో॥ కఠినా విషమైర్భగ్నై ర్వాయునాష్ఠీలికా భవేత్ ॥

తా. అప్రశస్తమైన * శూకముల లేపనము సేయుటవలన వాతము ప్రకోపించి గుండ్రముగ కఠినముగనుండు కురుపుల గలుగంజేయు. ఇదియ అష్ఠీలికమనంబడు

## గ్రథిత లక్షణము

శ్లో॥ శూకై ర్యత్పూరితం శశ్వ ద్గ్రథితం నామ తత్కఫాత్ ॥

తా. ఎల్లపుడు శూకముల లేపనము సేయుటవలన కఫము ప్రకోపించి మేఢ్రముపై గంటు జనించు, ఇదియ గ్రథిత మనంబడు.

## కుంభికా లక్షణము.

శ్లో॥ కుంభికా రక్తపిత్తోత్థా జాంబవాస్థి నిభాశుభా ॥

తా. శూక లేపనమువలన రక్తపిత్తము ప్రకోపించి నేరేడువిత్తులవంటి నల్లనికురుపుల గలుగంజేయు. ఇదియ కుంభిక మనంబడు.

## అలజీ లక్షణము.

శ్లో॥ తుల్యాజాంత్వాలజీం విద్యా ద్యథా ప్రోక్తాం విచక్షణైః ॥

తా. శూక లేపనమువలన ప్రమేహ పిటికా నిదానమున జెప్పంబడిన అలజీ లక్షణ తుల్యంబై యుండు కురుపులు జనించిన అలజి యనంబడు.

## మృదిత లక్షణము

శ్లో॥ మృదితం పీడితం యత్తు సంరబ్ధం వాతకోపత ॥

---

* శూకము — అనగా జలమునందుండు కప్ప.

తా. శూక లేపనానంతరము మేఢ్రమును విసుకుటవలనగాని లేక అదుముట వలనగాని వాతము ప్రకోపించి మేఢ్రమును వాపును గలుగంజేసినమృదితమనంబడు

## సంమూఢ పిటికా లక్షణము.

శ్లో॥ పాణిభ్యాంభృశసంమూఢే సంమూఢపిటికాభవేత్ ॥

తా. లేపనానంతరము 2 చేతులతో మేఢ్రమును మిక్కుటముగ విసుకుటవల న రోగులేనందు పిటికలు జనించు. ఇదియ మూఢపిటిక యనంబడు.

## అవమంథ లక్షణము.

శ్లో॥ దీర్ఘాబహ్వ్యశ్చ పిటికా దీర్యంతే మధ్యతస్తుయాః ।
సోవమంథః కఫాసృగ్భ్యాం వేదనా రోమహర్షకృత్ ॥

తా. శూకలేపనముపలన కఫరక్తము ప్రకోపించి పొడవుగ మిక్కుటముగ మధ్యమధ్య పగిలినవిగనుండు కురుపుల మేఢ్రముపైగలుగంజేయు. దానిసంబంధము వలన వేదనగోమాంచము గలుగు యిదియు అవమంథ మనంబడు.

## పుష్కరికా లక్షణము.

శ్లో॥ పిత్తశోణితసంభూతా పిటికాపిటికాచితా ।
పద్మకర్ణికసంస్థానా జ్ఞేయాపుష్కరికాచసా ॥

తా. శూకదోషజనిత పిత్తరక్తమువలన కురుపులు జనించి పండి చుట్టునున్న ని కురుపులతో వ్యాప్తంబై ఒకటిగ జేరుటవలన కమలముయొక్క కర్ణికమువలె గ నుపించు ఇదియు స్పర్శహాని యనంబడు.

## స్పర్శహాని లక్షణము.

శ్లో॥ స్పర్శహానింతుజనయే చ్ఛోణితంశూకదూషితమ్ ॥

తా. శూకలేపనమువలన రక్తముదుష్టంబై చర్మమున స్పర్శజ్ఞానము లేకుండు టులంజేయు ఇదియ స్పర్శహాని యనంబడు.

## ఉత్తమా లక్షణము

శ్లో॥ ముద్గమాషోద్గమూరక్తార క్తపిత్తోద్భవాశ్రయా ।
వ్యాధి రేషోత్తమానామ శూకాజీర్ణనిమత్తజ ॥

తా. శూకములను పలుమారు లేపనము సేయుటవలన రక్తము కుపితం పెసలు వుద్దులు అనువాని ప్రమాణముగలదై యెఱ్ఱగనుండుకురుపుల మేఢ్రము గలుగంజేయు. ఇదియు పుత్తమ మనంబడు.

## శతపోనక లక్షణము.

శ్లో॥ ఛిద్రైర్గణుముఖైర్లింగం చితంయస్యసమంతతః ।
వాతశోణితజోవ్యాధి ర్విజ్ఞేయశ్శతపోనకః ॥

తా. శూకదోషజనిత వాతరక్తమువలన లింగముపైననేక సూక్ష్మముఖము గల ఛిద్రములు గలిగిన శతపోనక మనంబడు.

## త్వక్పాక లక్షణము.

శ్లో॥ వాతపిత్తకృతోయస్తుత్వక్పాకోజ్వరదాహవాక్ ॥

తా. శూకదోషజనిత వాతపిత్తమువలన మేఢ్రముయొక్క చర్మము పండి జ్వరదాహములు గలిగిన త్వక్పాకమనంబడు.

## శోణితార్బుద లక్షణము.

శ్లో॥ కృష్ణైస్ఫోటైస్సరక్తాభిపిటికాభిర్నిపీడితమ్ ।
యస్యవాస్తురుజాచోగ్రా జ్ఞేయంతచ్ఛోణితార్బుదమ్ ॥

తా. శూకదోషమువలన మేఢ్రముపై నల్లగ లేక యెఱ్ఱగనుండు కురుపులు జనించి వ్రణస్థానమున మిక్కుటముగ పోట్లుగలిగిన శోణితార్బుద మనంబడు.

## మాంసార్బుద లక్షణము.

శ్లో॥ మాంసదోషేణజానియూా దర్బుదంమాంససంభవమ్ ॥

తా. శూకదోషముచే మాంసముదుష్టంబగుటవలన మాంసార్బుదము జనించు.

## మాంసపాక లక్షణము.

శ్లో॥ శీర్యంతేయస్యమాంసాని యస్యసర్వాశ్చవేదనాః ।
విద్యాత్తంమాంసపాకంతు సర్వదోషకృతంభిషక్ ॥

తా. శూకదోషమువలన మేఢ్రమునందలి మాంసముకుళ్ళి వూడిపడి పలువిధ పీడల గలుగంజేయుచుండిన మాంసపాక మనంబడు. ఇది త్రిదోషమువలన జనించు

## విద్రధి లక్షణము,

శ్లో॥ విద్రధింసన్నిపాతేన యథోక్తమభినిర్దిశేత్ ॥

తా. శూకదోషమువలన జనించి విద్రధిరోగనిదానమున జెప్పంబడిన సన్నిపాత విద్రధి లక్షణతుల్యంబయి యుండునది విద్రధియనంబడు.

## తిలకాలక లక్షణము.

శ్లో॥ కృష్ణానిచిత్రాణ్యథవా శూకానిసవిషాణితు ।
పాతితానిపచంత్యాశు మేఢ్రంనిరవశేషతః ।
కాలానిభూత్వామాంసాని శీర్యంతేయస్యదేహినః ।
సన్నిపాతసముత్థాంస్తు తాన్విద్యాత్తిలకాలకాన్ ॥

తా. నల్లగలేక చిత్రవిచిత్రమైన ఛాయగలనిగనుండు విషశూకముల లేపనము సేయుటవలన తక్షణమున మేఢ్రంబంతయుంబండి అందలి సర్వమాంసము తిలలవలెనల్లనై రాలిన తిలకాలక మనంబడు. ఇది త్రిదోషమువలన జనించు.

## అసాధ్య శూకదోష లక్షణము.

శ్లో॥ తత్రమాంసార్బుదంయచ్చ మాంసపాకశ్చయస్స్మృతః ॥
విద్రధిశ్చనసిధ్యంతి యేచస్యుస్తిలకాలకాః ॥

తా. శూకదోషములో మాంసార్బుదము మాంసపాకమువిద్రధి తిలకాలకము అనునవి యసాధ్యంబులు.

## శూకదోష చికిత్స.

శ్లో॥ హితంచసర్పిషఃపానం పథ్యంచాపివిరేచనమ్ ।
హితశ్శోణితమోక్షశ్చ శూకరోగేషుదేహినామ్ ॥

తా. శూకరోగమున ఘృతపానము విరేచనము రక్తమోక్షణము హితరంబులు,

## సార్షప చికిత్స

శ్లో॥ ఉల్లిఖ్యసార్షపితిలపత్రైస్తథ ప్రలేపయేత్ ।
తిందుకత్రిఫలాలోధ్రైర్గోమూత్రపరిపేషితైః ॥

తా. సార్షపమను శూకదోషమున నువ్వులయాకులతో * లేఖన క్రియంజేసిరు మికి త్రిఫలములు లొద్దుగుచెక్క అనువానిని గోమూత్రముతోనూరి లేపనము సేయవలయు.

అష్ఠీలికా చికిత్స.

శ్లో॥ అష్ఠీలాయాంహృతేరక్తే శ్లేష్మగ్రంధిక్రియాంచరేత్॥

తా. అష్ఠిలికమను శూకరోగమున రక్తస్రావము జేయించి శ్లేష్మగ్రంధివలెనే చికిత్సింపవలయు.

శ్లో॥ స్వేదయేద్గ్రథితంయచ్చ నాడీస్వేదేనబుద్ధిమాన్ ।
సుఖోష్ణైరుపనాహైశ్చ వ్రణోక్తైరుపనాహయేత్ ॥

తా. గ్రథితమను శూకదోషమున బుద్ధిమంతుడగు వైద్యుడు గొట్టముతో శాకమునిచ్చి చెమటను దీయుటయే గాక వ్రణమునకై జెప్పంబడియుండు కట్లను సుఖోష్ణముగ దీనియందును గట్టవలయు.

కుంభికా చికిత్స.

శ్లో॥ కుంభికాయాంహరేద్రక్తం పక్వాయాంశోధితేవ్రణె ।
తిందుకత్రిఫలాలోధ్రైః లేప స్తైలంచరోపణమ్ ॥

తా. కుంభికమను శూకదోషమున రక్తమును దీయవలయు అది పండినయెడల వ్రణశోధన క్రియజేసి పిదప తుమికి త్రిఫలములు లొద్దుగుచెక్క అనువాని లేపనమును మఱియు నాద్రవ్యములతో సిద్ధము జేయబడిన తైలలేపనమును జేసిన వ్రణముమానును.

అలజికా చికిత్స.

శ్లో॥ అలజ్యాంహృతరక్తాయాం పూర్వాపవక్రియాక్రమః ॥

తా. అలజియను శూకదోషమున పైజెప్పబడిన ప్రకారము రక్తమునుదీసి కుంభికమువలెనే చికిత్సింపవలయు.

* లేఖన క్రియయన... రుద్దుట.

## అవమంథ చికిత్స.

శ్లో॥ క్రియేయమవమంథేపి రక్తంశోధ్యంయథాభయోః

తా. అవమంథమను శూకరోగమున పూర్వోక్తమంబికా అలజీవలెనే రక్త స్రావమును జేయించవలయు.

## పుష్కరీ మూఢపిటికా చికిత్స.

శ్లో॥ క్రమఃపిత్తవిసర్పోక్తః పుష్కరీమూఢయోర్హితః ॥

తా. పుష్కరికము మూఢపిటికము అననీ 2 శూకదోషములయందు పిత్తవిసర్పమునకై జెప్పంబడిన చికిత్సంజేయవలయు.

## ఉత్తమా శూకరోగ చికిత్స.

శ్లో॥ ఉత్తమాఖ్యాంతుపిటికాం సంసేద్యబహుశోఘృతైః ।
కల్కచూర్ణైఃకషాయైశ్చ క్షౌద్రయుక్తైరుపాచరేత్ ॥

తా. ఉత్తమాఖ్యమను శూకరోగమున విశేషముగ నొత్తడమునిచ్చి పిదప ఘృతకల్క చూర్ణకషాయములలో మద్యమునుజేర్చి దానితో నుపచరించవలయు.

## శతపోనక చికిత్స.

శ్లో॥ రసక్రియావిధాతవ్యా లిఖితేశతపోనకే।
పృథక్పర్ణ్యాదిభిస్సిద్ధం తైలందేయమనంతరమ్ ॥

తా. శతపోనకమను శూకరోగమున తొలుత లేఖనక్రియంచేసి పిదప పాతద్రక్రియను చేయుటయేగాక శాలిపర్ణి మొదలగు వానియుక్తముగ సిద్ధము చేయబడిన తైలము నొసంగవలయు.

## త్వక్పాక స్పర్శహానీ మృదితములకు చికిత్స.

శ్లో॥ త్వక్పాకేస్పర్శహానౌచ సేచయేన్మృదితేపునః ।
బలాతైలేనకోష్ణేన మధురైశ్చోపనాహయేత్ ॥

తా. త్వక్పాకము స్పర్శహాని మృదితము అను శూకరోగములయందు మందోష్ణముగల బలాతైలమువలన సేచనక్రియంచేసి వానిపై మధురౌషధముల నునిచి కట్టుగట్టవలయు.

## తిలకాలక చికిత్స.

శ్లో॥ తిలకాలంసముల్లిఖ్య క్షురేణులఘుపాణినా ।
భిషజాధాత్రికర్తవ్య స్సద్యో వ్రణవినిర్మితః ॥

తా. తిలకాలకమును శూకరోగమును మంగలకత్తితో లఘువుగ గీచినద్యో వ్రణచికిత్సం చేయవలయు. (ఇట్లునే మాంసార్బుదము మాంసపాకము విద్రధి అనువానిని సగా చికిత్సింపందగు.)

## ఉపదంశములయందు పథ్యము.

శ్లో॥ ఛర్దిర్విరేకో ధ్వజ మధ్యనాడీ వేధోజలూకాపరిపాతనంచ సేకః ప్రలేపోయవశాలయశ్చ ధన్వామిషంముద్గరసోఘృతాని। కటిల్లకంశిగుఫలంపటోలంశాలించశాకంనవమూలకంచ। తిక్తంకషాయం మధుకూపవారి తైలంచ హన్యాదుపదంశరోగమ్ ॥

తా. వమనవిరేచనముల చేయించుటలింగమధ్యమునందు సిరసువేధించుటజలగలనంటించుట సేచన లేపనములంచేసుట యవధాన్యము అరణ్యసంబంధమైనమాంసము పెసరకట్టు నెయ్యి కాకరకాయ మునక్కాయ పొట్లకాయ వరియన్నము * శాకము లేతముల్లంగి చేదు వగురు తీపిగలరసములు బావినీళ్ళు నూనె యివి యుపదంశరోగమును హరింపంచేయు.

## ఉపదంశాదులయం దపథ్యము.

శ్లో॥ దివానిద్రా మూత్రవేగం గుర్వన్నం మైథునంగుడం ।
వ్యాయామ మమ్లంతక్రంచ వర్జయేదు పదంశవాన్ ॥

తా. పగలు నిద్రించుట మూత్రవేగము సడ్డగించుట జడాన్నమును సేవించుట మైథునముసేయుట బెల్లమునుభుజించుట వ్యాయామముసేయుట పులుసు మజ్జ

* శాకమన —బచ్చలిమొదలగు ఆకుకూరలు అరటి మొదలగువాని పువ్వులు వెదురుగొమ్ము మొదలగునవి ములక లవంగము మొదలగువానిపట్టలు గుమ్మడుమొదలగువాని కాయలు కంద మొదలగువానిగడ్డలు పులిచింత మొదలగువాని చిగుళ్ళు కంకులు మొదలగువానిపప్పు హస్తిశాకము మొదలగువాని కాడలు అనునవి.

అనువానిని సేవించుట యివి యుపదంశరోగమునం దపథ్యకరంబులగుటచే వానిని వర్జింపవలయు.

## అండవృద్ధి నిదానము.

శ్లో॥ క్రుద్ధోనూర్ధ్వగతిర్వాయుశ్శోథశూలకరశ్చరన్ ।
ముష్కౌ వంక్షణతః ప్రాప్య ఫలకోశాభివాహినీః ।
ప్రపీడ్య ధమనీర్వృద్ధిం కరోతి ఫలకోశయోః ॥

తా. అన్నపానాది వైషమ్యమువలన అధోముఖముగ సంచరించు వాతము దుష్టంబయి వృషణములయందు వ్యాపించి వాపును శూలను గలుగంచేయుచు గజ్జల మూలముగ వృషణకోశములయందు వ్యాపించెడి నాడుల దుష్టంబులుగచేసి వృషణములయందలి విత్తులలో నొకటినైనను లేక రెంటినైనను వృద్ధిచేయుచున్నయది.

## అండవృద్ధి భేదములు.

శ్లో॥ దోషాస్రమేదోమూత్రాంత్రైస్స వృద్ధిస్సప్తధాగదః ।
మూత్రాంత్రజావప్యనిలాద్ధేతుభేదస్తు కేవలం ॥

తా. అండవృద్ధి వాతజము పిత్తజము శ్లేష్మజము రక్తజము మేదోజము మూత్రజము అంత్రజము [అనగా నరములు దిగబడుట) అన 7 విధంబులు, అందు మూత్రము అంత్రజము అన నీ 2 వృద్ధులు వాతమువలన జనించు. ఐనను కారణము మాత్రము వేరుగనుండు.

## వాతాద్యండవృద్ధి లక్షణము.

శ్లో॥ వాతపూర్ణదృతిస్పర్శోరూక్షో వాతాదహేతురుక్ ।
పక్వోదుంబర సంకాశః పిత్తాద్దాహోష్మపాకవాన్ ।
కఫాచ్ఛీతో గురుస్స్నిగ్ధః కండూమాన్ కఠినోల్పరుక్ ।
కృష్ణస్ఫోటావృతః పిత్తాన్వృద్ధిలింగశ్చ రక్తజః ॥
కఫవన్మేదసో వృద్ధిర్మృదుస్తాలఫలోపమః ॥

తా వాయువువలన పూరింపబడిన తిత్తిని దాకినయెట్టిస్పర్శగలుగునో అట్టి స్పర్శతో తుల్యంబయి రూక్షనిష్కారణమునొప్పిగలదై యుండునది వాతజవృద్ధియనియు మేడిపండుతో సమానంబయి తాపము వుష్ణము పాకము వానితోఢం

గూడియుండునది పిత్తజవృద్ధియనియు చల్లగ జడముగ నునుపుగ దురద కాఠిన్యము అల్పవేదనగలదిగ నుండునది శ్లేష్మజవృద్ధియనియు నల్లనినరుపులతో వ్యాప్తంబయి మృదువుగ, పండినతాళఫలమువలె నల్లనిచాయగలదిగ గుండ్రముగ నుండునది మేదోజవృద్ధియనియు తెలియవలయు.

## మూత్రవృద్ధి లక్షణము.

శ్లో॥ మూత్రధారణ శీలస్యమూత్రజ స్సతుగచ్ఛతః ।
అంభోభిః పూర్ణదృతి వత్ క్షోభంయాతి సరుఙ్మృదుః ।
మూత్రకృచ్ఛ్రమధస్స్యాచ్చచల యన్ఫలకోశయోః ॥

తా. మూత్రము నడ్డగించెడి యభ్యాసముగల వానియొక్క అండము ముడు చుచుండునపుడు రక్తముతో నిండింపబడిన తోలుతిత్తివలె క్షోభ నొకింతనొప్పి చేతితో దాకిన మృదుత్వముగలదై మూత్రము సాధారణముగ వెడలక అండతిత్తుల యందు పూరితంబయి యిటునటు చలించుచుండిన మూత్రవృద్ధియని తెలియవలయు.

## ఆంత్రవృద్ధి లక్షణము.

శ్లో॥ వాతకోపిభిరాహారై శ్శీతతోయావగాహనైః ।
ధారణేరణభారాధ్వ విషమాంగ ప్రవర్తనైః ।
క్షోభణైః క్షుభితోన్యైశ్చ క్షుద్రాంత్రావయవంయదా ।
పవనోద్విగుణీకృత్య స్వనివేశాదధో నయేత్ ।
కుర్యాద్వంక్షణ సంధిస్థో గ్రంథ్యాభంశ్వయథుంతదా॥

తా. వాతమును బ్రకోపింపంచేసెడి యాహారములు సేవించుట శీతోదకమ లో గ్రుంకుట వుపస్థిత మలమూత్రాది వేగము నడ్డగించుట మలమూత్రాదులయొక్క అప్రాప్తవేగమును ప్రేరణసేయుట కడుభారమును మోయుట బహుదూరము నడుచుట వక్రముగనడుచుట మొదలగుకార్యముల సేయుట యితరులచే చేయంబడు బలవిద్వ గ్రహాదులవలన క్షోభంజెందుట యీ కారణములవలన వాతము బ్రకోపించి సన్నని ప్రేగులయొక్క నొకభాగము నాశ్రయించి వాని సంకోచమునుగాని లేక స్వస్థానమున నుండి క్రిందికి దిగునపుడు గజ్జల సంధులయందు గంటువలె వాపునుగాని గలుగంజేయుచున్నయది.

## ఉపేక్షిత అండవృద్ధి పరిణామము.

శ్లో॥ ఉపేక్షమాణస్యచ ముష్కవృద్ధి మాధ్మానరుక్షం భవతీం సవాయుః । ప్రపీడితోంత స్స్వనవాన్ప్రయాతి ప్రధ్మాపయన్నేతి పునశ్చముక్తః ॥

తా. వాపు పోట్లు యీడుపుగల యండవృద్ధియందు చికిత్సంజేయక నుపేక్షించుటవలన అండమును బిసికిన యంవలి వాతము కోకోయను శబ్దమునుచేయుచు పైకేగు. దానిని విడిచిన మరల వాయువు దిగి యండమునందు వాపును గలుగంచేయు.

## అసాధ్యాండవృద్ధి లక్షణము.

శ్లో॥ క్షుద్రాంత్రావయవాశ్లేషాన్ముష్కయోర్వాత సంచయాత్ । ఆంత్రవృద్ధి రసాధ్యోయం వాతవృద్ధిస మాకృతిః॥

తా. సన్ననినరములయొక్క సంబంధమువలన అండమునందు వాతము చేరుటవలన వాతవృద్ధిలక్షణయుక్తంబయి జనించునట్టి ఆంత్రవృద్ధి అసాధ్యము (ఈ యండవృద్ధినే కొందరు కురంటికమనియు ఆంత్రవృద్ధియనియు వచించెదరు. మఱియు గ్రంథాంతరములయందు అండవృద్ధి నిదానంబున వర్ధ్మనిదానంబును జెప్పంబడియున్నయది. ఎట్లనిన—"శ్లో॥ అత్యభిష్యందిగుర్వాను సేవనాన్నిచయంగతః । కరోతి గ్రంథివచ్ఛోభం దోషోవంక్షణసంధిషు । జ్వరశూలాంగదాహార్తిం తంవర్ధ్మ మితినిర్దిశేత్॥" అనగా అత్యంతస్రోతస్స్రావి. జడము ఆమముగలయన్నమును సేవించుటవలన వృద్ధిందెందిన దోషము గజ్జలయొక్క సంధులయందు గంటవలె వాపును గలుగంచేయుచున్నయది. దానివలన జ్వరము పోట్లు శరీరమున జిలజిల అనునవి గలుగు. ఈ రోగమును వర్ధ్మమని వచించెదరు.

## దార్వ్యాంది చూర్ణము.

శ్లో॥ చూర్ణందార్వ్యాహరిద్రా యాగవాంమూత్రేచనిష్కకం । పిబేచ్చిరోత్థితాంహంతిచాంత్ర వృద్ధింన సంశయః ॥

తా. మ్రానిపసుపు పసుపు వీనిని చూర్ణముచేసి నిష్కప్రమాణమును గోమూత్రములోగలిపి త్రాగిన చిరకాలముగనుండు ఆంత్రవృద్ధి హరించు.

## వృద్ధినాశన రసము.

శ్లో॥ రసగంధ సమాంతాభ్యాం ద్విగుణం హేమమాక్షికమ్ ।
పథ్యారసేన త్రిదినం రుబుతైలేన వాసరమ్ ।
మర్దితం సిద్ధిమాయాతి రసేంద్రో వృద్ధినాశనః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము యివిరెండును ఒక్కొక భాగము శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము 2 భాగములు యిటుల వీనిని ఖల్వములోనుంచి కరక్కాయ కషాయముతో 3 దినములు ఆముదముతో 1 దినము మర్దించి సిద్ధముజేసి దానిని సేవించిన అండవృద్ధి నశించు.

## అజాజ్యాది లేపము.

శ్లో॥ అజాజీహపుషా కుష్ఠం గోమయం బదరాన్వితమ్ ।
కాంజికేనతు సంపిష్టం కుర్యాద్వర్ధ్మ లేపనమ్ ॥

తా. జీలకఱ్ఱ సోపు చంగల్వకోష్టు ఆవుపేడ రేగు వీనిని కలితో నూరి లేపనము జేసిన అండవృద్ధి ముష్కరోగము అంత్రవృద్ధి హరించు.

## లాక్షాది లేపము.

శ్లో॥ లాక్షాకరంజ బీజంచ శుంఠీ దారుసశారికమ్ ।
కుందరంచ సమంకృత్వా చూర్ణయే న్మతిమాన్ భిషక్ ।
కాంజికేనతు సంపేష్య ముష్కశ్వయథునాశనః ॥

తా. లక్క కానుగవిత్తులు శొంఠి దేవదారు కావిరాయి యివి సమభాగములు వీనికి సమము కుందురుగడ్డిచూర్ణమును గలిపి కలితో మర్దించి కించిదుష్ణముజేసి లేపనముజేసిన అండవృద్ధి నశించు.

## అసాధ్యాంత్రవృద్ధి లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] వృద్ధిస్సప్త విధాజ్ఞేయా ఫలకోశ విదుషణాత్ ఆంత్రజాధ్మాతవస్తిస్స్యాచ్ఛ్వాసశూలానసిధ్యతి

తా. అపానవాతము ప్రకోపించిన సప్తవృద్ధుల గలుగంజేయు అపానము అండములయందు వ్యాపించి దోషయుక్తంబుగజేసి వస్తియందు ప్రేగుల నుబ్బినను లేక శ్వాస శూల అనువాని గలుగంజేసినను అంత్రవృద్ధిరోగము అసాధ్య

శ్లో॥ [మాధవనిదానే] లశునాదికమేరండతైలంవృద్ధివినాశనమ్ ॥
స్రావయేన్మూత్రజాం వృద్ధిమాంత్ర వృద్ధిందహేద్భిషక్ ॥

తా. లశునాద్యేరండతైలము సర్వవృద్ధులహరింపంజేయు. మూత్రవద్ధియందు శలాకతోడం బొడిచి నీరును స్రవింపజేయువలయును. అంత్రవృద్ధియందు కతవేయ వలయు.

శ్లో॥ [శారీరే] పిత్తైర క్తం స్రావయేచ్చ జలూకాభి ర్విశేషతః ॥

తా. పిత్తమువలన జనించిన అంత్రవృద్ధియందు జలగలచేత రక్తమును బైలు పుచ్చవలయు. (పాదములయందు శూలజనించి పాదములయొక్క వెనుకటి పార్శ్వముగ భుజమువందు వ్యాపించి యందుండి వృషణములంజొచ్చి ఆవృషణ నరముల యొజ్జలవలె జుట్టుకొనునటులంజేసి వాని నుబ్బించిన పాదవృద్ధియనంబడు. శిరము నందొకపార్శ్వమున శూలజనించి భుజములమూలముగ వృషణమువందుజొచ్చి 1 బీజమును ప్రక్కవాటుగ నొరగదీసిన పార్శ్వవృద్ధియనంబడు 1 వృషణంబుబ్బి శూలించిన నొరబీజమునంబడు.)

## సప్తవృద్ధి చికిత్సలు.

శ్లో॥ సప్తవృద్ధిషుక త్రివ్యాం కరంజార్కపునర్నవైః ।
పురందరలతాభిర్వా లేపనంశోఫనాశనమ్ ॥

తా. క్రొనుగాను జిల్లేడాకు గలిజేరాకు అనువానినిగాని లేక చాపరవేరును గాని నూరి సప్తవృద్ధులయందు లేపనముజేసిన వాపు హరించు.

శ్లో॥ మూలైరేరండ నిర్గుండీ నాసారేయ శ్చృతంజలమ్ ।
సైంధవైరండతైలాఢ్యం సప్తవృద్ధిషుపాయయేత్ ॥

తా. చిట్టాముదపువేరు వావిలివేరు ములుగోరింటవేరు వీనిని సమభాగములు గదంచి కషాయముకాచి అందు సైంధవలవణము ఆముదము గలిపి త్రాగిన సప్తవృ ౦లుహరించు.

శ్లో॥ [మతాంతరే] సరామఠంకుబేరాక్షి కుభృత్తలశునై ర్ఘృతమ్ ।
సలిలంఘ్నుత సంయుక్తం సప్తవృద్ధిషుపాయయేత్ ।
ఇంద్రవల్లీప్రసారిణ్యోః క్వాథస్స్యాత్సప్తవృద్ధి జిత్ ।

మహిషాక్షస్యచూర్ణంతు శర్కరా మధుసంయుతమ్ ।
పిబేద్గుళూచీక్వాథేన సప్తవృద్ధ్యుపశాంతయే ॥

తా. యింగువ గచ్చపలుకులు వులవలు వెల్లుల్లి వీనిలోనుసకముబోసి కషాయముకాచి అందునెయ్యి గలిపిత్రాగినను లేక పాపరవేరు గొంతెమగోమురువేరు వీనిని కషాయముకాచి త్రాగినను లేకతిప్పతీగ కషాయములో శుద్ధిజేసిన మహిషాక్షీగుగ్గిల చూర్ణమును పంచదారను తేనెనుగలిపి త్రాగినను సమస్తవృద్ధులుహరించు.

శ్లో॥ మోరటమూలకషాయ విమిశ్రం హింగు మహౌషధసైంధవ కృష్ణాః । చూర్ణమిదం ప్రపిబేచ్చదినాదౌ సప్తవృద్ధిమపహంతిచసద్యః । సువర్చకసైంధవ హింగుజీరకై కరంజయుగ్మశ్రవణాహ్వభేషజైః । కటుత్రికై శ్చూర్ణయుతం పయఃపిబేత్కరోతి ముష్కంకరి ముష్కసన్నిభమ్ ॥

తా. చాగవేరు కషాయములో యింగువ శొంఠి సైంధవలవణము పిప్పళ్ళు అనువాని చూర్ణమును గలిపి ప్రాతఃకాలమున త్రాగిన తక్షణమున సప్తవృద్ధులుహరించు. సౌవర్చలవణము సైంధవలవణము యింగువ జీలకఱ్ఱ కానుగచెక్క నెమలిచెక్క బోడతరము శొంఠి త్రికటుకములు వీనిని సమభాగములుగ చూర్ణముజేసిపాలలో గలిపిద్రాగిన వృషణములు యేనుగవృషణమువలె చిన్నవిగ నగు.

శ్లో॥ జటిలాముండిశిగ్రూశ్చ చించాపత్రరసాఢకే ।
తైలంప్రస్థంపచేల్లేపా త్సప్తవృద్ధిమపోహతి ।

తా. ఆఢక ప్రమాణము చింతాకురసములో 1 ప్రస్థమునూనె గలిపి తైలముశేషించునటుల కాచి అందు వస బోడతరము మునగచెక్క అనువాని చూర్ణమును గలిపి దించికొని 6 మాసములు లేపనముసేయుచుండిన సప్తవృద్ధులు హరించు (సప్తవృద్ధులయందు బెండాకును పుట్టమన్నును నూరి దానిలో 4 గడియలునొత్తడమునిచ్చి కట్టుగట్టవలయును. యిటుల 3 మాసములుజేసిన కోడిగ్రుడ్లముల్లువలె స్రవించెడిసప్తవృద్ధులు హరించు.

గీ॥ వెలయనీచేంతరాసియు వేళ్ళరసము ।
మిరియమును గూర్చి వేగమమెసంగనొకటి ॥

చెలఁగిదు శ్చేరు గంధంబు సేవఁగూడి।
యాకుకబళానబుడ్డలు నడఁగిపోవు॥

శ్లో॥ [మాధవనిదానే] కర్షైకంతిల తైలంతుపలై కంచార్ద్రికద్రవ
మ్ । యఃపిబేత్ప్రాతరుత్థాయ తస్యాంత్రవృద్ధిహృద్భవేత్ ॥

తా. కర్షప్రమాణము నూనెలో 1 పలము అల్లపురసముకలిపి ప్రాతఃకాల
మున ద్రాగిన అంత్రవృద్ధి హరించు.

శ్లో॥ గోమూత్రమేరండతైలం ఛాగమాంసరసస్తథా।
త్రిఫలాక్వాథతుల్యాంశం తైలశేషం విపాచయేత్ ।
తత్తైలంతుపిబేత్కర్షం సూంత్రవృద్ధి ప్రశాంతయే॥

తా. గోమూత్రము మేకమాంసరసము త్రిఫలములు వీనిని సమభాగములుగ
కషాయముకాచి దీనికిసమముగ నాముదముగలిపి చిక్కగకాచి కర్ష మెత్తును సేవిం
చిన అంత్రవృద్ధి హరించు.

శ్లో॥ [శారీరే] అంత్రవృద్ధౌ మహావృద్ధౌ శస్యతేచప్రసర్పణా ॥

తా. అంత్రవృద్ధి మహావృద్ధులయందు గలిజేరాకు నుడికించి 6 నెలలు కట్టు
గట్టుట ప్రశస్తంబు (లేక అంత్రవృద్ధియందు చక్రాకారముగ రక్తవేయవలయును.
మూత్రవృద్ధియందు దానింజించి కార్చవలయు. ఆసనవృషణముల మధ్యమున నడ్డ
ముగ రక్తవేసిన బుడ్డహరించు. మఱియుబీజముయొక్క నరము యెఱ్ఱలవలె జుట్టుకొ
ని దిరుగుచుండిన దానియందును రక్తవేయవలయు.

శ్లో॥ [మాధవనిదానే] అంత్రవృద్ధిహరంపానం మాయూరైస్తిత్తి
రిద్రవైః । వాతాంత్రేకౌక్కుటం పాచ్యం తద్రసంపానభోజ
నే । యోజయేదాంత్ర వృద్ధ్యార్తోశమమాప్నోతినాన్యథా ॥

తా. నెమలి తిత్తిరిపక్షి అనువాని రసములంద్రాగిన అంత్రవృద్ధి హరించు.
మఱియు కోడిరసమును పానభోజనములయం దుపయోగించికొనిన వాతాంత్రవృద్ధి
శమించు.

శ్లో॥ మణ్డూసంసేవయేన్నిత్యం శస్త్రవృద్ధి హరంపరమ్ ॥

తా. పైజెప్పబడిన యౌషధముల 6 మాసములు ప్రత్యహము సేవింపుచు కబళమూలం గట్టుచుండిన సప్తవృద్ధులు హరించు.

## ఆంత్రవృద్ధియందు పథ్యము.

శ్లో॥ సంశోధనంవస్తిరసృగ్విమోక్షస్స్వేదః ప్రలేపోరుణశాలయశ్చ। ఏరండతైలంసురభీజలంచ ధన్వామిషంశిగ్రుఫలంపటోలమ్। పునర్నవాగోక్షురకాగ్నిమంథ తాంబూలపథ్యారసనారసోనమ్। హంతిస్తథాగృంజనకం మధూనికౌంభం ఘృతం తప్తజలంచతక్రమ్। అర్ధాకృతిర్వంక్షణ యోశ్చదాహో వ్యత్యాసతోబాహుసిరావ్యధశ్చ। యదామయం శస్త్రవిధిశ్చ వర్గోదుర్వర్ధక వృధ్యామయినాంసుఖాయ॥

తా. విరేచనము జేయించుట వస్తికర్మంజేసుట రక్తముదీయుట చెమటను దీయుట లేపము యెఱ్ఱబియ్యము ఆముదము గోమూత్రము నిర్జలప్రదేశమునందలి జంతుమాంసము మునగకాయ పొట్లకాయ గలిజేరు పల్లేరు కూరనెల్లి తాంబూలము కరక్కాయ సన్నరాస్నము వెల్లుల్లి అనువానిని సేవించుట వమనము సేయించుట యెఱ్ఱవుల్లిగడ్డ తేనె కుండలోని నెయ్యి వుష్ణోదకము మజ్జిగ అనువానిని సేవించుట అండసంధుల యందర్ధచంద్రాకారముగ గొల్లువేసుట కుడితట్టు వృద్ధిజెందియుండిన యెడముచేతియొక్క సిరను వేధించుట యెడమతట్టయిన కుడిపార్శ్వము చేతియొక్క సిరను వేధించుట శస్త్రముజేయుట యివి వర్త్మ అండవృద్ధి అనువానియందు హితకరంబులు.

## ఆంత్రవృద్ధియందపథ్యము.

శ్లో॥ ఆనూపమాంసానిదధీనిమాషాః పిష్టాన్న దుష్టాన్న ముపోదికాంచ। గురూణిశుక్రోత్థిత వేగరోధస్స్యర్వర్ధ్మవృద్ధ్యామయినామమిత్రమ్॥

తా. జలముగల ప్రదేశమునందుండు జంతుమాంసము పెరుగు వుద్దులు పిష్టాన్నము దుష్టమైన యన్నము బచ్చలికూర గురుకరపదార్థములు అనువానిని సేవించుట శుక్రవేగము నడ్డగించుట యివివర్త్మ అండవృద్ధి అనువానియందు హితకరంబులు

శ్లో॥ [మతాంతరే] వేగాహతిః ప్రస్థయానంవ్యాయామం మైథు
సంతథా ॥ అత్యాశనమథాధ్వాన ముపవాసంపరిత్యజేత్ ॥

తా॥ మలమూత్రవేగము నడ్డగించుట గుఱ్ఱము మొదలగువాని నెక్కి సంచ
రించుట శ్రమజెందుట మైధునముసేయుట మిక్కుటముగ భుజించుట మార్గమునడు
చుట వుపవాసముసేయుట వీనిని అండవృద్ధిగలవారు వర్జింపవలయు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠకొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
అర్శోరోగనిదాన తత్సాధ్యాసాధ్య
చికిత్సానుపాన పథ్యాపథ్యలక్షణయుక్తం
చతుర్దశ ప్రకరణమ్.



శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆ ం ధ్ర తా త్ప ర్య ము.

### — ప ం చ ద శ ప్ర క ర ణ ము. —

శ్లో॥ సర్వజ్ఞం జగదాధారం శూలహస్తం నగేశ్వరమ్ ।
ముక్తిప్రదాయకం దేవం నీలకంఠమహంభజే ॥

తా. సర్వజ్ఞుడు జగత్తునకాధారభూతుడు శూలహస్తుడు కైలాసపర్వతము
ధిపతి ముక్తిప్రదాత స్వయంప్రకాశభూతుడు నగు నీలకంఠుని నేను భజించెద.

శ్లో॥ శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామ వృషరాజీయ మహంవైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని
బడిన నేను వైద్యగ్రంధములలో కడు శ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ
ంధముయొక్క పంచదశ ప్రకరణమును వచింపుచున్నాడను.

### వంధ్యా నిదానము.

శ్లో॥ [నిత్యనాధీయే] అష్టదోషాః స్త్రీయఃపుంసాం నవమీశుక్ల
హీనతా । రక్తపిత్తమరుచ్ఛ్లేష్మ సన్నిపాతాభిచారకృత్ ।
దేవగ్రహకృతాదోషా రేతోహీనస్తతఃపుమాన్ ॥

తా. స్త్రీపురుషులకు రక్తదోషము పైత్యదోషము వాతదోషము శ్లేష్మదోష
సన్నిపాతదోషము అభిచారదోషము దేవద్రోహదోషము గ్రహకోపదోషములన
8 దోషంబులు సహజంబులుగ జనించు. ఐనను పురుషులకు మాత్రము తొమ్మిద
యగు శుక్లహీనత దోషంబొకటి యధికంబుగ జనించు.

## వంధ్యావిభాగము.

శ్లో॥ మృతవంధ్యాజన్మవంధ్యా కాకవంధ్యాతుమోచికా ।
గర్భస్రావీతిగీయంతే ద్దోషైరేతైరుక్తితః స్త్రియః ॥

తా. మృతవంధ్య జన్మవంధ్య కాకవంధ్య కదళివంధ్య అన వంధ్యలు 4 విధ బులు (అంను సంతానముగలిగి మృతిజెందిన మృతవంధ్యయనియు సంతానమే గా గకుండిన జన్మవంధ్యయనియు 2 సంతానములంబడసి గొడ్రాలైన స్త్రీ కాక వ ధ్యయనియు 1 సంతానముంబడసి గొడ్రాలైన స్త్రీ కదళీవంధ్యయనియు జెప్పం డు.) మఱియు పూర్వోక్తదోషములవలన స్త్రీకిగర్భస్రావమును గలుగు.

శ్లో॥ ఏతద్దోషాంశవిజ్ఞాయ తతఃకర్మసమాచరేత్ ॥

తా. పైవాతాదిదోషముల నెఱింగి చికిత్సచేయవలయు.

## వాతదుష్టార్తవ లక్షణము.

శ్లో॥ అతిస్వచ్ఛతరంరక్తం తద్వాదంభోజసన్నిభం ।
కటిశూలంభవేద్యస్యా యోనిశూలంచసజ్వరం ।
మారుతస్యవికారోయ మాపధంతత్రకథ్యతే ॥

తా. ఋతుకాలమున వెడలెడు రక్తము నిర్మలమై యొఱ్ఱతామర పువ్వువం టివర్ణముగలదై యుండుట రొంటిశూల యోనిశూల జ్వరముగలుగుట యీ లక్షణ ములతో గూడియుండునది వాతజ దోషమని తెలియవలయు. దానికి నౌషదమును వచించెద.

## వాతార్తవమునకు త్రివృదాది యోగము.

శ్లో॥ త్రివృదేతండచూతానాం మూలంతు్క రేణపాయయేత్ ।
పంచాహంస ప్తరాత్రంవా యావత్స్రవతిశోణితం ॥

తా. శుద్ధిచేసిన తెగడ ఆముదపు వేరు మామిడివేరు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ప్రత్యహము 4 మాడలయెత్తును ఆవుపాలలోగలిపి 5 దినములుగాన లేక 7 దినములుగాని లేక ప్రవహించెడు రక్తము నిలుచువరకుగాని సేవించుటచే యోనిశుద్ధంబగు.

## వాతదుష్టార్తవ చికిత్స.

శ్లో॥ వాతాద్యోనావిశుద్ధాయాం లక్ష్మణాక్షీరసంయుతా ।
నస్యపానేచదాతవ్యా తేనసాలభతేసుతమ్ ।
పురుషందక్షిణేఘ్రాణే వామేకన్యాంమనోహరామ్ ।
యస్యావాతాహతంపుష్పం ఫలంతస్యానవిద్యతే ॥

తా. పైయౌషధ సేవనవలన యోనిగత వాతదోషము శుద్ధంబైన పిదపలక్ష్మణపంజిసమూలమును చూర్ణముజేసి నస్యమును 4 మాడలయెత్తును ఆవుపాలలో గలిపి పానమును జేయించవలయు. కుడిముక్కునందు నస్యము జేయించిన పురుష శిశువును యెడమముక్కునందు నస్యము చేయించిన సౌందర్యవతియైన స్త్రీశిశువును గనును వాతదోషమువలన పుష్పము హతమైన స్త్రీకిసంతానము గలుగనేరదు.

## శ్లేష్మదోష లక్షణము.

శ్లో॥ ఏవంశ్లేష్మణివాతేన తస్యరూపంనిగద్యతే ।
పిచ్ఛిలంబహుళంరక్తం నాభిశూలంతుదారుణమ్ ॥

తా. పైజెప్పబడిన వాతదోష లక్షణంబులే శ్లేష్మదోషమునందును గలిగి యుండును శ్లేష్మదోషమున ఋతుకాలరక్తము బంకగ అధికముగ బొడ్డులో దారుణమైన శూలయుక్తముగ స్రవింపుచుండు.

## శ్లేష్మదోషమునకు అర్కమూలాది యోగము.

శ్లో॥ అర్కమూలం ప్రియంగుశ్చ కుంకుమంనాగకేసరమ్ ॥
బలాచాతిబలాఛాగీ క్షీరంపీత్వాదినత్రయమ్ ।
విశుద్ధాయాంతథాయోనౌ దద్యాన్మూత్రేమహౌషధమ్ ॥

తా. జిల్లేడువేరుపట్ట ప్రేంకణపుపువ్వుకుంకుమపువ్వు నాగకేసరములు ముత్తవపులగము పెద్దముత్తవపులగము వీనిని సమభాగములుగ చూర్ణము చేసి మేకపాలలోగలిపి 3 దినములుద్రాగిన యోనిశుద్ధంబగు. పిదప శొంఠిని గోమూత్రములోనూరి సేవింపవలయు.

శ్లో॥ లక్ష్మణాంగోపయోయుక్తాం నస్యేపానేప్రదాపయేత్ ।
తేనస్త్రీలభతేపుత్రం లక్షణాఢ్యంసుపండితమ్ ॥

తా. లక్ష్మణపంజి సమూలమును చూర్ణముజేసి 4 మాడలయెత్తును ఆవుపాలలోగలిపి త్రాగుటయేగాక యీ చూర్ణము నే ఆవుపాలతో నస్యముజేసిన గొడ్రాలైనను లక్షణవంతుడు సుపండితుడగు కొమరునింగనును.

పిత్తదోష లక్షణము.

శ్లో॥ పక్వజంబూఫలాకారం కృష్ణం స్రవతిశోణితమ్ ।
కటిశూలేనసంతాపో హ్యేతత్పిత్తస్యలక్షణమ్ ॥

తా. ఋతుకాలంబున రక్తము నేరేడుపండువలె నల్లగ స్రవించుట నడుమునొచ్చుట శరీరముమండుట యీ లక్షణములుగలది పైత్యరక్తదోషమని తెలియవలయు.

పిత్తదోషమునకు ఉత్పలాది యోగము.

శ్లో॥ ఉత్పలంతగరంకుష్ఠం యష్టిమధుకచందనం ।
అజాక్షీరేణసంపేష్య దాపయేత్పంచవాసరమ్ ॥

తా. నల్లకలువగడ్డ గ్రంథితగరము చంగల్వకోష్టు యష్టిమధుకము శ్రీగంధము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి మేకపాలలోగలిపి 5 దినములుగాని లేక రక్తస్రావము నిలుచువరకుగాని త్రాగుటయేగాక నస్యముగాచేసిన పైత్యరక్త దోషము హరించు.

సన్నిపాతదోష లక్షణము.

శ్లో॥ సన్నిపాతహా తేపుష్పే కృష్ణముష్ణంచశోణితమ్ ।
కుక్షినాభ్యుదరేశూలం నిద్రాతీవ్రాంగభంగతా ॥

తా. పుష్పముజెడి రక్తము నలుపుగ వుష్ణముగ స్రవించుట కుక్షి నాభి వుదరము అనువానియందు శూలగలుగుట నిదురగలుగుట శరీరము మిక్కుటముగ నొచ్చుట యీ లక్షణములుగలది సన్నిపాతరక్తదోషమని తెలియవలయు. (యిది అసాధ్యము.)

సన్నిపాతదోషమునకు ఉత్పలాది యోగము.

శ్లో॥ ఉత్పలంతగరంకుష్ఠ యష్టిచూతంచరాక్షసీమ్ ।
చందనం ఛాగదుగ్ధేన దాపయేత్పంచవాసరమ్ ॥

తా. నల్లకలువగడ్డలు గ్రంథితగరము చంగల్వకోష్టు యష్టిమధుకముమామిడివేరు బలురక్కసిగడ్డ శ్రీగంధము వీనినిసమభాగములుగ చూర్ణముచేసి 4 మాడల

రొత్తును మేకపాలలో గలిపి 5 దినములు త్రాగిన యోనిశుద్ధంబగు. ప్రిదప తెల్లజిల్లేడువేరు తెల్లగంటెనవేరు గొల్లజిడ్డివేరు గొడ్డుకాకరదుంపలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఆవుపాలలోగలిపి త్రాగుటయేగాక నస్యము సగా చేయవలయు ఋతుకాలంబున స్త్రీసంగమంబొనర్చిన రోగములు హరించి సంతానము గలుగు. మఱియు పైజెప్పబడిన వంధ్యారోగములయందు పుత్త్రాభిముఖుడై చంద్రగసికెను ద్రవ్వి "ఓంసర్వార్ణసాధిస్త్యైస్వాహా" అనుమంత్రమును జపించుచు చంద్రవేరును బెరికి దానిని "ఓంకుమార జనన్యైస్వాహా" అనుమంత్రముతో నభిమంత్రించి త్రాగింపవలయునని గ్రంథాంతరమున జెప్పంబడియున్నయది. వంధ్యారోగములయం దౌషధము సేవంగునపుడు "ఓంకుమారజనన్యైస్వాహా" అనుమంత్రమును నభిమంత్రింపవలయు.

## స్త్రీపురుష నపుంసకోత్పత్తి కారణము.

శ్లో॥ రక్తాధిక్యేభవత్త్రీచ శుక్లాధిక్యేభవేత్పుమాన్ ।
తత్సమత్వేతుషండశ్చ పుంసోరేతః క్షయేబలా ।
గర్భంగృహ్ణాతినోవస్త్రాశుక్లవృద్ధ్యామహౌషధం ॥

తా. స్త్రీకిరక్తాధిక్యమువలన ఆడశిశువును శుక్లాధిక్యమువలన మొగశిశువును శుక్లశోణిత సమత్వంబున నపుంసకుండునుజనించు. శుక్లహీనతగల పురుషునివలన స్త్రీకిగర్భమునిలువకుండు కావున శుక్లహీనతగల పురుషునికి వీర్యవృద్ధికరౌషధముల సంగందగు.

## శుక్రవృద్ధికి ధాత్రీఫలాది యోగము.

శ్లో॥ ధాత్రీ ఫలోద్భవంచూర్ణం రసేచేతస్సుభావితం ।
శర్కరామధు సంయుక్తంగోక్షీరంవై పిబేన్నరః ।
శుక్లంప్రవర్ధతే తేన పుంసాం ప్రక్షీణతేజసాం ॥

తా. ఉసిరికపప్పును చూర్ణముచేసి దానిరసముతో 21 మార్లు భావనచేసి డసెండించి దానికి సమముగ పంచదార తేనెగలిపి సేవించి వెంబడిగ ఆవుపాల త్రాగవలయు. ఇటుల 2 మండలములు చేసిన రేతోదోషము హరించుటయేగాక శుక్రవృద్ధిగలిగి సంతానము గలుగు.

శ్లో॥ [నిత్యానాధీయే] పిబేత్కల్యాణఘృతకంవద్ధ్యాచలభతేసుతం ॥

తా. గొడ్రాలు కల్యాణ ఘృతమును సేవించిన సంతానము గలుగు.

## కల్యాణ ఘృతము.

శ్లో॥ విశాలాత్రిఫలాకాంత దేవదార్వేల వాలుకం । స్థిరానంతా హరిద్రేద్వే శారిబేద్వే ప్రియంగుకా । నీలోత్పలైలామంజిష్టి దంతిదాడిమ కేసరం । విడంగం పృశ్నిపర్ణీచ కుష్ఠం చందన ప్రతకం । తాళీసపత్రంబృహతీమాలత్యాః కుసుమంసమం । అష్టావింశతిభిః కల్కైసితామత్షి సమన్వితం । చతుర్గుణం జలందత్వా ఘృతంప్రస్థంవినాచయేత్ । అపస్మారేజ్వరేకాసే శోషే మందానలేక్షయే । వాతరక్తే ప్రతిస్యాయే తృతీయక చతుర్థకే । మూత్రకృచ్ఛ్రేషుసర్వేషు విసర్పేదాహకేషుచ । కండూపాండ్వామయోన్మాద వింశన్మేహజ్వరేషుచ । భూతావేశేపిచింతాయాం తద్దదేకామచేతసాం । శస్త్రంస్త్రీణాంచ వన్ధ్యానాంధన్యమాయుర్బలప్రదం । అలక్ష్మీపాపరక్షోఘ్నం సర్వగ్రహనివారణం । కల్యాణఘృతమేతద్ధి శ్రేష్ఠంత్రిభువనేపిచ ॥

తా. పెద్దపాపర త్రిఫలములు మామిడివిత్తులు దేవదారు కూతురుబుడమ ముయ్యాకుపొన్న దురదగొండి పసపు మ్రానిపసపు సుగంధిపాల నల్లసుగంధిపాల ప్రేంకణము నల్లకలువగడ్డలు యేలకులు మంజిష్టి దంతివేరు దాడిమచిగుళ్ళు వాయువిడంగములు కోలపొన్న చంగల్వకోష్టు శ్రీగంధము లవంగపత్రిక తాళిసెపత్రి పెద్దములక చిన్నములక జాజిపువ్వులు అన నీ 28 ద్రవ్యముల సమభాగములుగనూరి కల్కముచేసి 4 గింతలు నీళ్లు ఘృతము 1 ప్రస్థము గలిపి ఘృతావశేషముగ కాచి పంచదార తేనె గలిపి సేవించిన అపస్మారము జ్వరము కాసము శోష అగ్నిమాంద్యము క్షయము వాతరక్తము పీనస త్ర్యాహిక చాతుర్థికజ్వరములు సర్వమూత్రకృచ్ఛ్రములు విసర్పి తాపము దురద పాండురోగము వున్మాదము 20 మేహములు జ్వరములు భూతావేశము చింతస్వరభంగము కామమువలన గలిగినరోగము వీనిని హరినపంజేయు. దీని సేవనవలన ఆయుర్వృద్ధి బలము గలుగుటయేగాక అభాగ్యము పాపము బ్రహ్మరక్షస్సు సర్వగ్రహములు నగా పోలంను. మఱియు వంధ్యా స్త్రీగర్భమును ధరించు. ఈ కల్యాణ ఘృతము త్రిలోకములయందు కడుశ్రేష్ఠంబు. (ఈ కల్యాణఘృత సేవనవలన గర్భిణి స్త్రీయొక్క సంతానము జీవించు. వెణుతురువేళ్ళరసములోనూనెగలిపి తైలపక్వముగ కాచి దానిని సేవించినను లేక వెణుతురువేళ్ళర

సములో ఆవునెయ్యిగలిపి ఘృతపక్వముగ కాచి 7 వ మాసమున సేవించినను మృతవంధ్యాత్వము హరించు. వెణుతురువేళ్ళచెక్క కొరనపవేళ్ళు పెద్దమ్రాని చెక్క చేతలాసి అనువాని రసములలో నూనెగలిపి కాచి సేవించిన మృతవంధ్యా స్త్రీసంతానము జీవించు )

## కాకవంధ్యకు విష్ణుక్రాంత యోగము.

శ్లో॥ పూర్వంపుత్ర వతీయాసా క్వచిద్వంధ్యా భవేద్యది । కాకవన్ధ్యాతుసాజ్ఞేయా చికిత్సాతస్యకథ్యతే । విష్ణుక్రాన్తాం సమూలాంతుపిష్ట్వాక్షీరై శ్చమహిషైః । మహిషీనవనీతేన ఋతుకాలేతుభక్షయేత్ । ఏవం సప్తదినంకుర్యాద్వత్స యుక్తాచ పూర్వవత్ । గర్భంచ లభతేనారీ కాకవంధ్యా శుభప్రదం ॥

తా॥ తొలుత బుత్రవతియై కొంతకాలమునకు పిదప గొడ్రాలైన స్త్రీ కాకవంధ్యయనంబడు. దానికి చికిత్స వచించెద. విష్ణుకాంత్ర సమూలమును నీడనెండించి చూర్ణముచేసి బర్రెపాలతో భావనచేసి బర్రెవెన్నతో 7 దినములు ఋతుకాలమునందు కాకవంధ్య సేవించిన శుభప్రదమగు సంతానముగలుగు. మఱియు పలుమారు గర్భమును ధరింపుచుండు.

## వంధ్యలకు మహాద్రాక్షాది చూర్ణము.

శ్లో॥ [ఆయుర్వేదే] ద్రాక్షాదాడిమఖర్జూరచాతుర్జాత కటుత్రయం । తపక్షీరీ నారికేళం చందనం మధుకంశివం । ప్రియాళుమజ్జాహ్రీబేర ముశీరంజాతి పత్రికం । విదారీగోక్షురంమోచా కపికచ్ఛూచవంతథా । జాతీఫలంచ తక్కోలం రుజ్మాషాస్తిలవంశజః । యవమజ్జానాగద్రపుష్పం ముస్తానాగబలాశణా। ద్విజీరకే హ్యజామోదం మెంతీతాళీసపత్రకం । సైంధవంధాన్యకం భార్గీ శృంగీభృంగీ పునర్నవా । అరుష్కారామరీబీజంచ సమ్యాజ్మారితమభ్రకం । ఏతత్సర్వం సమంకృత్వాద్విగుణాం శర్కరాంక్షిపేత్ ః అస్యచూర్ణస్యకర్షాంశం ఘృతక్షీరయుతంపిబేత్ । దినపూర్వేతథా పశ్చాదృతుకాలే

విశేషతః । క్షయంచర క్తపిత్తంచ పాదదాహమసృగ్దరం। విని హంతి ప్రమేహంచ సోమరోగంచ శర్కరాం । మూత్రా ఘాతం మూత్రకృచ్ఛ్రం వాత కుండలికాంతథా । వాంత్యరోచక మత్యుగ్రం శ్వాసకాస జ్వరభ్రమం । పీనసంచప్రతి శ్యాయంప్లీహానంచోద రామయం । అమ్లపిత్తాంగదాహంచ ధాతునాశంజరామయం । సర్వం దుర్నామరోగంచ తథా పాండుకకామిలం । హృద్రోగంచ శిరశ్శూలమూవాహమతి దారుణం । కండూతిం శీతపిత్తంచ విబంధా న్ద్వివిధానపి । సంసేవ్య భేషజంచైవ వృద్ధోపిజనయేత్సుతం । పుత్రంసర్వగుణోపేతం శతాయుషమనామయం । మృతగర్భాచయానారీయాచగర్భావసారిణీ । సాపిసూతే సుతంతద్వ న్నారాయణపరాయణం । వంధ్యాపిలభతేపుత్రం వృద్ధోపితరుణాయతే । తురంగ మివసంధృష్టోమాతంగ బలవిక్రమః । సదాభేషజ్య సేవీ యో భవే న్నారుతివిక్రమః । మహాద్రాక్షాదిచూర్ణోయం సర్వరోగ నికృంతనః ॥

తా. ద్రాక్షపండు దాడింబపండు ఖర్జూరపండు చాతుర్జాతకములుత్రికటుకములు అడవిబబ్బెరపాలు కొబ్బరి శ్రీగంధము యష్టిమధుకము పుసిరికపప్పు సారపప్పు కురువేరు వట్టివేళ్ళు జాపత్రి నేలగుమ్ముడుగడ్డ పల్లేరు అరటిగడ్డ దూలగొండివిత్తులు జాజికాయ తక్కోలపుట్లు చెంగల్వకోష్టు మినుములు నువ్వులు వెదురుబియ్యము యవలబియ్యము లొద్దుగపువ్వు తుంగముస్తెలు జిబిలికెవేళ్ళు జనపవిత్తులు నల్లజీలకఱ్ఱ జీలకఱ్ఱ అజామోదము మెంతులు తాళిసెపత్రి సైంధవలవణము కొత్తిమెర్లు గంటుభారంగి కర్కాటకశృంగి గుంటగలగర గలిజేరువేళ్ళు జీడిపలుకులు మామిడిపలుకులు ఆసుకు లేసుండు అభ్రకసిందూరము వీనిని సమభాగములుగ చూర్ణము చేసి దీనిని రెండింతలు పంచదార గలిపి కర్ష మెత్తును ఆవునేతితోగాని ఆవుపాలతోగాని బుధువుకాలము మొదలుకొని 4 మాసములు ప్రాతఃస్సాయంకాలముల సేవించిన క్షయమురక్తపిత్తముపాదదాహము అసృగ్దరము ప్రమేహము సోమరోగము మూత్రశర్కర మూత్రాఘాతము మూత్రకృచ్ఛ్రము వాతకుండలి అత్యుగ్రమైనవారి

తి అరుచి శ్వాసకాసలు జ్వరము భ్రమ పీనస పడిసెము ప్లీహాము వుదరరోగము ఆమ్లపిత్తము అంగదాహము రసాదిధాతు నాశనము మదిమి సర్వార్శస్సులు పాండువు కామిల ఱొమ్మునొప్పి తలనొప్పి కడుదారుణమైన కడుపుబ్బరము దురద శీత పిత్తము మలమూత్రబద్ధము వీనిని హరింపంజేయు. దీని సేవనవలన వృద్ధుడు సగా పుత్రోత్పత్తిని గలుగంజేయుదగిన వీర్యవృద్ధిగలవాడగు. మఱియు మృతగర్భముగల స్త్రీ గర్భస్రావముగల స్త్రీ సర్వగుణయుక్తుండై రోగవిహీనుడై నారాయణభక్తిగల వాడై 100 సంవత్సరంబులు జీవింపఏగిన పుత్రునింగనును. మఱియు దీనిసేవనవలన గొడ్రాలుసగా పుత్రునింగనును. మఱియు వృద్ధులు సగాయౌవనము గలవారై గుఱ్ఱముతో సమానమైన గర్వము యేనుగుతో సమానమైనబలము పరాక్రమముగలవారలయ్యెదరు. దీనిని సగాసేవింపుచుండువాడు హనుమంతునితో సమానమైన బలముగలవాడగు. ఈద్రాక్షాచూర్ణము సర్వరోగముల హరింపంజేయు.

శ్లో॥ వంధ్యాకర్కోట కీమూలచూర్ణం గోపయసాతథా ।
ఋతుస్నాతాపిబేత్సం పీతా గర్భపాత నివారయేత్ ॥

తా. 4 మాడలయెత్తు గొడ్డుకాకర చూర్ణమును ఆవుపాలలో గలిపి ఋతుకాలమునందు సేవించిన గర్భపాతము హరించు.

## వంధ్యలకు మంజిష్ఠాది ఘృతము.

శ్లో॥ మంజిష్ఠామధుకోత్పలంద్వి బృహతీకాంత్యశ్వగంధామృతా ।
తిక్తాగ్రాహికహింగు గ్రంథితగరంరుక్కాంచ నీపద్మకం ।
సిద్ధంభాస్కరకాక్షులోచన వృషాశుక్లా ఘృతేపాచతాః ।
శార్ఙ్గేష్టాస్వరసేషు గర్భజననః వంధ్యాప్రసూతేసుతం ॥

తా. మంజిష్ఠి యష్టిమధుకము నల్లకలువ చిన్నములక పెద్దములక రేణుకలు వెన్నెదుగడ్డ తిప్పతీగె జేతిపాట్ల వెలక యింగువ గ్రంథితగరము చంగల్వకోష్టు పసపు తామరతూండ్లు జిల్లేడు గచ్చపలుకులు నారికేళము అడ్డసరము నేలగుమ్ముడు కాకిదొండ వీనిలో సమభాగములుగ రసముదీసి నేతిలోవైచి ఘృతపక్వముగ కాచిసేవించిన వంధ్యాత్వము మృతవంధ్యాత్వము హరించి పుత్రునింగనును.

## తిలాది యోగము.

శ్లో॥ [నిత్యనాథీయే] తిలాశ్చశర్కరాః పద్మకందేన మధునాన్వి
తాః । భక్షితాధారయత్యేవ పతంతం గర్భమంగనా ॥

తా. యెఱ్ఱనువ్వులు పంచదార తామరగడ్డలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి జుంటితేనెలో గలిపి సేవించినగర్భస్రావముగ స్త్రీగర్భము ధరించు.

## గర్భపాతమునకు లజ్జాళు యోగము.

శ్లో॥ లజ్జాళుధాతకీపుష్ప ముత్పలంమధులోధ్రకం ।
ఋతుస్నాతస్త్రియాపీతం గర్భపాతం నివారయేత్ ॥

తా. మునుగుదామెర ఆరెపువ్వు నల్లకలువగడ్డ యష్టిమధుకము లొద్దుగచెక్క వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఆవుపాలుగలిపి ఋతుస్నానము చేసిన 4 వ దినమున సేవించిన గర్భస్రావము గలుగకుండు.

శ్లో॥ [మతాంతరే] సమభాగసితాయుక్తం శాలితండుల చూర్ణక మ్ । ఉదుంబర శిఫాక్వాథం పీతంగర్భస్సురక్షితః ॥

తా. పంచదార రాజన బియ్యపుపిండి వీనిని సమభాగములుగ గూర్చి మేడి చెట్టుయొక్క యూడలకషాయముతో సేవించిన గర్భస్రావముగల స్త్రీకిగర్భము స్థిరముగనిలుచు. యష్టిమధుకము తామరగడ్డలు పంచదార వీనిని సమభాగములుగ గూర్చి మర్దించి వుదకములో కలిపి త్రాగిన గర్భస్రావము గలుగకుండుట యే గాక మంటలు శమించి చల్లగనుండు.

## ఉత్పలాది యోగము.

శ్లో॥ ఉత్పలోత్పలశాలూక శ్యామాలోధ్రకచందనం ।
తండులోదకపీతంచ గర్భస్రావంనివారయేత్ ॥

తా. నల్లకలువగడ్డలు కలువగడ్డలు సుగంధిపాల లొద్దుగచెక్క శ్రీగంధము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి బియ్యపు కడుగుతో గలిపి సేవించిన గర్భస్రావము గలుగక గర్భము స్థిరముగనిలుచు.

## ఆమ్రమూల యోగము.

శ్లో॥ [మతాంతరే] ఆమ్రికామూల మాహృత్య పిష్ట్వా క్షీరేణ పాయయేత్ ।నారీణాంనష్టపుష్పాణాం తథారక్తంప్రవర్తతే॥

తా. మామిడివేరుచెక్కను ఆవుపాలలోనూరి త్రాగిన రజోనష్టముగల స్త్రీ లకురజస్సుబైలువెడలు.

## గర్భస్థ క్రిమినాశకర యోగము:

శ్లో॥ [మాధవకల్పే] పత్రంనిధాయజఠరే పరిబంధనేన పాతాళ
మూలజనితంశిస ప్తవారమ్ । శూలానిసూక్ష్మ బహుళక్రి
మయఃపతంతి స్త్రీణామపత్యకరబీజహరశ్చకీటః ॥

తా. దూసరితీగెయాకులను కడుపుపై నునిచి రాత్రులయందు 7 దినములుగ
ట్టిన యోనిశూల హరించుటయేగాక కడుపులో మిక్కుటముగ గర్భనాశనకరముగ
నుండు సూక్ష్మమైన యనేకపురుగులు పుత్రోత్పత్తికి కారణభూతమైన బీజమును
పానముజేసెడు పెరుగులువ్రాడిపడు. (పల్లేరువేరుమఱ్ఱిచెక్క రావిచెక్క మేడిచెక్క
యష్టిమధుకము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి అంను. శర్కర పాలు గలిపి
త్రాగిన స్త్రీలఋతుశూల రక్తశూల హరించి గర్భము నిలుచు.)

## అభయాది యోగము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] అభయాదీప్యకంహింగు కృష్ణజీరకసైంధ
వమ్ । యవక్షారార్కమూలాన వర్షాభూవ్యోషమమేళకమ్ ।
లశునంచసమాంశేన ఛాగక్షీరేణపేషయేత్ । తక్షీరంపా
యయేద్వంధ్యా మృతుకాలేచసేవయేత్ । రక్తశూలంయో
నిశూలంపిత్తశూలంతథైవచ । మక్కల్లశూలకంచైవ సర్వ
శూలహరంపరమ్ ॥

తా. కరక్కాయలు వాము యింగువ నల్లజీలకఱ్ఱ సైంధవలవణము యవ
క్షారము జిల్లేడువేరుచెక్క గలిజేరువేరుత్రికటుకములు గచ్చపలుకులు వెల్లుల్లిపాయ
లు వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి మేకపాలతో 7 మార్లుమర్దించి భా
వనజేసి నీడనెండించి 4 మాడలయెత్తును మేకపాలతో ఋతుకాలము మొదలు4మా
సములు గొ్రడాలు సేవించిన యోనిశూల పిత్తశూల మక్కల్లశూల మొదలగు సర్వ
శూలలు హరించు.

శ్లో॥ శంఖద్రావమితిఖ్యాత మృతుకాలేతుసేవయేత్ ।
రక్తశూలంయోనిశూలం సర్వశూలంనిబర్హయేత్ ॥

తా. ప్రసిద్ధమైన శంఖద్రావకము ఋతుకాలము మొదలుకొని సేవింపుచుం
డిన రక్తశూల యోనిశూల సర్వశూలలు హరించు. (మఱియు సర్వశూలలు హరిం

చుటకై గుదికాలులోపల చీలమండకు 3 వేళ్ల ప్రదేశమున రక్తు (గొల్లు) వేయవలయు. మఱియు వంధ్యారోగనిదానమున పురుషునికి జనించు రేతోహీనదోషము హరించి వీర్యవృద్ధిగలుగుటకై జెప్పంబడిన చికిత్సలనే గర్భస్రావముగల స్త్రీలకును జేయందగు.)

గీ॥ మెట్టదాసరితాఁబేటిమీఁదదీప ।
ముంచేఁదల వెళ్ళునదియును ద్రుంచిమసియుఁ ।
జేసివెన్నయుఁ జేరిచిపూసెనేని ।
కాంతలకుయోని దుర్మాంసగణములడఁగు ॥

శ్లో॥ [సిద్ధరసార్ణవే] అకస్మాత్ప్రథమేమాసే గర్భేభవతివేదనా ।
గోక్షీరేణేవ యేత్తుల్యాం పద్మకోశీరచందనమ్ ।
పలమాత్రంపిబేన్నారీ త్యాద్యాగర్భస్థిరోభవేత్ ॥

తా. ఆకస్మాతుగ ప్రథమమాసమున గర్భవేదనగలిగిన బైలుదామెర వట్టివేను శ్రీగంధము వీనిని సమభాగములుగ ఆవుపాలుతోనూరి 1 పలమెత్తును సేవించిన ప్రథమమాసమున గర్భిణీస్త్రీకిగలిగిన గర్భవేదనహరించి గర్భము స్థిరముగ నిలుచు.

రెండవమాస గర్భ చికిత్స.

శ్లో॥ నీలోత్పలమ్మృణాళంచ శశికర్కటశృంగికమ్ ।
మాసేద్వితీయేగోక్షీరైః పీత్వాశామ్యతివేదనా ॥

తా. నల్లకలువగడ్డ తామరతూండ్లు బొల్లిపూసవిత్తులు కర్కాటకశృంగి వీనిని సమభాగములుగ ఆవుపాలతోనూరి 1 పలమెత్తును సేవించిన 2 వమాసమునగర్భిణిస్త్రీకిగలిగిన గర్భవేదనహరించి గర్భము స్థిరముగనుండు

మూడవమాస గర్భ చికిత్స.

శ్లో॥ శ్రీఖండంతగరంకుష్ఠం మృణాళంపద్మకేసరమ్ ।
పిబేచ్ఛీతోదకైఃపిష్టం తృతీయేవేదనావతీ ॥

తా. శ్రీగంధము గంథితగరము చెంగల్వకోష్టు తామరతూండ్లు తామరఅగరలు వీనిని సమభాగములుగ శీతోదకముతో నూరి పలమెత్తును ద్రాగిన 3 వ మాసమున గర్భిణి స్త్రీకి గలిగిన గర్భవేదన హరించు.

## నాలవమాస గర్భ చికిత్స.

శ్లో॥ నీలోత్పలమృణాళాని గోక్షురంసకశేరుకమ్ ।
చతుర్థమాసేగోక్షీరైః పిబేచ్ఛామ్యతి వేదనా ॥

తా. నల్లకలువగడ్డలు తామరతూండ్లు పల్లేరు నెయ్యిటములు వీనిని ఆవుపాలతోనూరి ½ సేరత్తును త్రాగిన 4 వ మాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన హరించు.

## ఐదవమాస గర్భ చికిత్స.

శ్లో॥ పునర్నవాథకాకోళీ తగరంనీలముత్పలమ్ ॥
గోక్షీరైః పంచమేమాసే గర్భక్లేశహారంపిబేత్ ॥

తా. గలిజేరు కాకోళి గ్రంథితగరము నల్లకలువగుంపలు వీనిని సమభాగముగ ఆవుపాలతో నూరి త్రాగిన 5 వ మాసమున గర్భిణిస్త్రీకి గలిగిన గర్భవేదన హరించు.

## ఆరవమాస గర్భ చికిత్స.

శ్లో॥ సితాకపిత్థమంజిష్ఠ శీతతోయేన పేషయేత్ ।
షష్ఠేమాసేగవాంక్షీరైః పిబేచ్ఛామ్యతి వేదనా ॥

తా. పంచదార వెలగపంటిబేసము మంజిష్ఠి వీనిని శీతోదకముతోగాని లేక ఆవుపాలతోగాని నూరి త్రాగిన 6 వ మాసమున గర్భిణిస్త్రీకిగలిగిన గర్భవేదన హరించు.

## ఏడవమాస గర్భ చికిత్స

శ్లో॥ కచోరంపౌష్కరంమూలం తోయైర్వానీలముత్పలమ్ ।
పీత్వాతు సప్తమేమాసే పిష్ట్వాక్షీరైః ప్రశామ్యతి ॥

తా. కచోరములు పుష్కరమూలమునల్లకలువగడ్డలు వీనినినుదకముతోగాని ఆవుపాలతోగానినూరి త్రాగిన 7 వ మాసమునగర్భిణి స్త్రీకిగలిగినగర్భవేదనహరించు.

## ఎనిమిదవమాస గర్భ చికిత్స

శ్లో॥ యష్టీపదాతుకంముస్తా కశేరుగజపిప్పలీ ।
నీలోత్పలంగవాంక్షీరైః పిబేన్మాసాష్ట కేసతీ॥

తా. యష్టిమధుకము బయులుదామెర గచ్చపలుకులు తుంగముస్తెలు నెమ్మ టములు గజపిప్పళ్ళు నల్లకలువగడ్డలు వీనిని అవుపాలతో నూరి త్రాగిన 8 వ మాసమున గర్భిణీస్త్రీకి గలిగిన గర్భవేదన హరించు.

తొమ్మిదవమాస గర్భ చికిత్స.

శ్లో॥ నిశాలాబీజమంకోలం మధునాసహ లేపయేత్ ।
వేదనానవమేమాసే శమమాప్నోతినిశ్చయమ్ ।
నవమేమధుకానంతా శారిబాః పయసాపి బేత్ ॥

తా. పాపరవిత్తులు వూడుగవిత్తులు వీనిని తేనెతోనూరి కడుపుపై బూసిన 9 వ మాసమున గర్భిణిస్త్రీకిగలిగిన గర్భవేదన నిశ్చయముగ హరించు మఱియు యష్టిమధుకము దురదగొండి సుగంధిపాల వీనిని పాలతోనూరి త్రాగవలయు.

పదియవమాస గర్భ చికిత్స.

శ్లో॥ పిష్టాతుశర్కరాంద్రాక్షాం సక్షౌద్రంనీలముత్పలమ్ ।
పాయయేద్దశమేమాసి గనాంక్షీరైః ప్రశాంతయే॥

తా. పంచదార ద్రాక్షపండు నల్లకలువగడ్డలు వీనిని పాలతోనూరి తేనెలో గలిపి సేవించిన 10 వ మాసమున గర్భిణికిగలిగిన గర్భవేదన హరించు.

గర్భశూలహర చికిత్సలు

శ్లో॥ పద్మకంద స్రుతంవారి సక్షీరంపాయయేద్వధూమ్ ।
గర్భస్రావహరం శ్రేష్ఠ శర్కరామిశ్రితంనిశామ్ ।
బలాశుంఠ్యోశ్చనిక్వాథం గర్భిణీసర్పిషాసహ ।
తైలేనవాసమంపీత్వా గర్భశూలాత్ప్రముచ్యతే ॥

తా. తామరదుంపలదంచి రసముదీసి ఆవుపాలు పంచదార పసపు గలిపి స్త్రీ సేవించిన గర్భస్రావము హరించు. మఱియు ముత్తవపులగసుతు శొంఠినినూరి యుడికించి నేతితోగాని లేక నూనెతోగాని సేవించిన గర్భశూలహరించు.

శ్లో॥ [మాధననిదానే] బలానాగరచిత్రాణాం క్వాథంపారాగ్ని మంథయోః । పీత్వావిముచ్యతే సాజ్యంగర్భిణీగర్భశూలతః॥

తా. ముత్తవపులగము శొంఠి చిత్రమూలము శిరుబొద్ది కూరనెల్లి వీనిని కషాయముకాచి అందునెయ్యిగలిపి త్రాగిన గర్భిణీస్త్రీయొక్క శూలలు హరించు.

శ్లో॥ [మాధవనిదానే] శుంఠీబిల్వ బలాక్వాథం భ్రష్టసైంధవసం
యుతమ్ । సరామఠంపిబేత్సర్పిర్గర్భిణీశూలనాశనమ్ ॥

తా. శొంఠి మారేడువేరు ముత్తవపులగము వీనిని సమభాగములుగ దంచికి షాయముకాచి అందు వేల్చిన సైంధవలవణము యింగువ నెయ్యి గలిపి సేవించిన గర్భిణీస్త్రీ శూలలు మానును.

శ్లో॥ [అన్యశాస్త్రే] అర్ద్రకక్వథితంసిద్ధం సక్షీరాజ్యగుడంపిబేత్ ।
పిప్పలీచూర్ణసంయుక్తం గర్భిణీశూలనాశనమ్ ।

తా. అల్లపుకషాయములో పాలు నెయ్యి బెల్లము పిప్పలిచూర్ణము గలిపి సేవించిన గర్భిణి శూలలు హరించు.

## అహింపత్య చూర్ణము.

శ్లో॥ ధాత్రీవిడంగత్రిసుగంధముస్తా వ్యోషంచపథ్యా త్రివృతం
త్రిభాగమ్ ॥ చూర్ణంసమశర్కరయా సమేతదుష్ణోదకేనై
వపిబేన్నిహంతి । శూలాగ్నిమాంద్యం గుదజాంకురాణి కుష్ఠ
ప్రమేహక్రిమిగర్భశూలమ్ వాతంచపైత్తంచ కఫంచపాండు
హృద్రోగమాశుత్వహింపత్యచూర్ణమ్ ॥

తా. వుసిరికపప్పు వాయువిడంగములు యేలకులు లవంగపుచెక్క ఆకుపత్రిక తుంగముస్తెలు త్రికటుకములు కరక్కాయలు వీనిచూర్ణము దినుసు కొకొక్కభాగము తెగడచూర్ణము 3 భాగను యీ రెంటికి సమముగ పంచదారగలిపి యుష్ణోదకనుతో సేవించిన విరేచనంబై శూల అగ్నిమాంద్యము మూలరోగము కుష్ఠుపు ప్రమేహము క్రిములు గర్భశూల వాతపిత్త కఫ పాండువులు హృద్రోగము వీనిని హరింపంజేయు.

## యోనిశూల చికిత్స.

శ్లో॥ [ఆయుర్వేదే] యోనౌక్రిమోచ్ఛసంజాతే తేసశూలంభవేద
తన్నామక్రిమిశూలంచ కర్తవ్యంభిషగుత్తమైః ।

నింబద్రావైస్సుసంపిష్టం నింబైరండస్యబీజకమ్ ॥
యోనిశూలహరక్షిప్తం గోళకంయోనిమధ్యగమ్ ॥

తా. యోనియందు క్రిములు జనించి దానివలన శూలగలిగిన క్రిమిశూల యనంబడు. దీని నివారణార్థంబై వైద్యుడు చికిత్సంజేయవలయు. ఎట్లనిన, వేపవిత్తులు ఆముదపుపప్పు వీనిని వేపాకురసముతో నూరి ముద్దజేసి యోనియందు ధరింపంజేయవలయుననుట.

శ్లో॥ [అశ్వినీకల్పే] సోమరాజీదేవదారునిశానింబాస్సమాంశకాః ।
తచ్ఛపిష్ట్వాప్రలేపోయం యోనిశూలహరఃపరః ॥

తా. భావంచివిత్తులు దేవదారు పసుపు వేపాకు వీనిని సమభాగములుగ నూరి యోనియందు లేపనముజేసిన యోనిశూల హరించు.

శ్లో॥ లశునంగృహధూమంచ విశాలాంచవిశంగకమ్ ।
కంటకారీఫలరసైః పిష్ట్వాయోనిం ప్రలేపయేత్ ।
క్రిమిశూలహరంఖ్యాతం సప్తరాత్రమసంశయమ్ ॥

తా. వెల్లులిపాయలు కరుభూపము పాపర వాయువిడంగములు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నేలములకపండ్లరసముతో నూరి యోనియందు 7 దినములు లేపనముజేసిన యోనియందలి క్రిమిశూల నిస్సంశయముగ హరించు.

## యోనిమర్మాంస నిదాన తచ్చికిత్స.

శ్లో॥ గుహ్యావాయురథమన్మథస్థలం సంవిశేద్భవతిదుష్టమాంసకమ్ ।
తత్రవాతహరఛాదనేనవాఛాదయేదితరథేభేషనకమ్ ।

తా. అపానవాతము యోనిగతంబైన యోనియందు దుర్మాంసము జనించు. దానియందు నెయ్యిచరిమి వాతహరమైన యాకులు పెట్టికట్టుగట్టినను లేక ¼ పడిబ్రహ్మ మేడికాయల ద్రాక్ష యుడికించి కట్టుగట్టినను యోనిదుర్మాంసముహరించు.

శ్లో॥ యస్యావాతాహతంపుష్పం వ్రణమద్గంధపీడితమ్ ।
తత్రదోషస్సువిజ్ఞేయ స్తతఃకర్మసమాచరేత్ ॥

తా. ఏస్త్రీకి వాతదోషమువలన పుష్పము జెడి యోనియందు వ్రణముబుట్టిదుర్గంధముగలిగి యుండెడినో అట్టిస్త్రీయొక్క దోషమును బాగుగ నెఱింగి చికిత్సింపవలయు.

శ్లో॥ జాతీనింబపటోలపత్రకటుకా దార్వీనిశాశారిబా ।
మంజిష్ఠాభయతుత్థసిక్థమధుకై ర్నక్తాహ్వబీజైస్సమైః ।
సర్పిస్సిద్ధమనేనసూక్ష్మవదనే యోనౌసదాస్రావిణీ ।
దుర్గంధశ్చరుజా వ్రణానిచ గదాశుద్ధ్యంతిలేపేనచ ।
నిత్యంప్రక్షాళితంకుర్యా ద్యోనిదుర్గంధనాశనమ్ ॥

తా. జాపత్రి మంచివేపకొనలు చేతిపొట్లాకు చేతిబీరపలుకులు మ్రానిపసపు పసపు గూడపాల మంజిష్ఠ కరక్కాయలు మైలుతుత్తము మైనము యష్టిమధుకము క్రానుగవిత్తులు వీనిని సమభాగములుగగూర్చి నేతినివండి యోనియందు బూసిన యోనిసంపంచితదోషము సదాయోనియందు స్రావము యోనిదుర్గంధము యోనిశూల యోనివ్రణము శుద్ధంబై మానును. గావున ప్రతిదినముగడిగి లేపనము జేయవలయు. (యోగరాజగుగ్గులమును సేవింపవలయు. )

## గుదభ్రంశ చికిత్స.

శ్లో॥ గుదభ్రంశంఘృతాభక్తం వాతఘ్నైరుపనాహయేత్ ॥

తా. వాతదోషము గుదగతంబైన గుదభ్రంశముగలుగు. దానియందు నెయ్యి చరిమి లోనికిద్రోసి వాతహరమైన యాకులంగట్టవలయు. లేక బహ్మమేడికాయల గాని అంతరదామెరనుగాని కాలుపడి ద్రొక్కియుడికించికట్టుగట్టవలయు. ఈయుపచారములచే గుదభ్రంశము హరించు.

## పుష్పావరోధ నిదానము.

శ్లో॥ వాతోల్బణాచ్చ యోనిస్థం పుష్పస్థానచలంభవేత్ ।
పుష్పారోధమిత్యుక్తం తన్నామమునిపుంగవైః ॥

తా. వాతముప్రకోపించి యోనిగతంబై పుష్పస్థానమును దొలగించి నొప్పిగలుగంజేసిన పుష్పావరోధమని మునులువచించెదరు.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] లాంగలీ కందచూర్ణంచ మూలంవాహ్యాప మార్గజమ్ । ఇంద్రవారుణికామూలంమూనిస్థంపుష్పరోధనుత్

తా. చెన్నచర్ల గడ్డ వుత్తరేణువేరు పాపరవేరు వీనిలో నేదినేని నూరిముద్ద జేసియోనియందునిచికొనిన పుష్పావరోధము నివృత్తించు.

శ్లో॥ [మాధవనిదానే] తిలమూల కషాయేణ బ్రహ్మదండీయమూలకమ్ । యష్టిత్రికటుకంచూర్ణం క్వాథయుక్తంచపాయయేత్ । పుష్పరోగేర క్తగుల్మే స్త్రీణాంపథ్యంప్రశస్యతే ॥

తా. బ్రహ్మదండివేళ్ళను నువ్వులవేళ్ళకషాయములోనూరి పుష్పావరోధనమునందు లేపనము జేయుటయేగాక నువ్వులవేళ్ళకషాయములో యష్టిమధుకము త్రికటుకములు అనువాని చూర్ణమునుగలిపి సేవించిన పుష్పావరోధము రక్తగుల్మము నివృత్తించు.

శ్లో॥ [అశ్వినీకల్పే] తిలక్వాథేగుడంవ్యోషం తిలభార్గీయుతేపివా । పాతేర క్తస్రవేగుల్మేనష్టపుష్పేచపాయయేత్ ॥

తా. నువ్వులకషాయములో బెల్లమును శొంఠి పిప్పలి మిరియాలుఅను వానిని గాని లేక నువ్వులు గంటుభారంగి అనువానిలో బెల్లమును త్రికటుకచూర్ణమును గానిగలిపి సేవించిన గర్భపాతము రక్తస్రావము గుల్మము పుష్పావరోధము నివృత్తించు.

శ్లో॥ చణకానాంరసంచైవ శృతంక్షీరఘృతేనవా । శర్కరామధుసంయుక్తం రక్తదోషహారంపిబేత్ ॥

తా. సెనగకట్టులో పాలు నెయ్యి గలిపి కాచి పంచదారగాని తేనెగాని కలిపి సేవించిన (పుష్పావరోధము) హరించు.

శ్లో॥ షణ్మాసంసేవయేన్నిత్యం పుష్పరోధోనివర్తతే ॥

తా. పుష్పావరోధము నివృత్తించుటకై 6 మాసములవరకు పూర్వోక్తౌషధముల సేవింపవలయు.

## గర్భిణీజ్వర చికిత్స

శ్లో॥ వయస్థాశారిబాపాఠా తోయతోయదనాగరైః । శృతంశీతంపిబేద్వారి గర్భిణీజ్వరనాశనమ్ ॥

తా. కరక్కాయలు గూడపాల శిరుబొద్ది వురువేరు తుంగముస్తెలు శొంఠి నిని సమముగదంచి కషాయముకాచి చలార్చి త్రాగిన గర్భిణిస్త్రీజ్వరముహరించు.

## గర్భిణ్యాతిసార చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] దురాలభాబలాపాఠా నాగరాంబుద సం
శృతమ్ । గర్భిణీం పాయయేత్తోయ మతిసారేషు సర్వదా॥

తా. దురదగొండి ముత్తివపులగము శిరుబొద్ది వేరు శుంగముస్తెలు శొంఠి వీనిని కషాయముకాచి త్రాగిన గర్భిణీ స్త్రీ అతిసారము హరించు.

## గర్భిణీశోఫ చికిత్స.

శ్లో॥ పునర్న వార్ద్రిక క్వాథం సక్షీర మనిశంపిబేత్ ।
శోఫోదా వర్తగుల్మార్శ శ్శాంత్యర్థం గర్భిణీనిశి ॥

తా. గలిజేరు వేరు అల్లము వీనిని కషాయము కాచి అందు పాలుగలిపి రాత్రుల యందు త్రాగిన గర్భిణీ స్త్రీ శోఫ ఉదావర్తము గుల్మము అర్శస్సు హరించు.

శ్లో॥ వర్షాభూ మూలనిర్యాసం సఘృతం గుడసంయుతమ్ ।
గర్భిణీం పాయయే దేత చ్ఛోఫోదా వర్తనాశనమ్ ॥

తా. గలిజేరు వేరును కషాయము కాచి నెయ్యి బెల్లము గలిపి త్రాగిన గర్భిణీ స్త్రీ శోఫలు ఉదావర్తము హరించు.

## గర్భిణీకాసరోగ చికిత్స.

శ్లో॥ [మాధవకల్పే] చూర్ణంవై మరిచానాంతు సితాక్షౌద్ర ఘృ
తైస్సహ । లిహ్యాత్కాసహరంపథ్యం గర్భిణీనాంప్రశస్యతే ॥

తా. మిరియపుచూర్ణము పంచదార వీనిని తేనెలోగాని నేతితోగాని గలిపి సేవించిన గర్భిణీ స్త్రీ దగ్గు హరించు.

## గర్భిణీశ్వాస చికిత్స.

శ్లో॥ [ఆయుర్వేదే] స్వరసంమాతులుంగస్య పిప్పలీమరిచాన్వితమ్ ।
గర్భిణీం పాయయేద్వ్యక్త్యా శ్వాసహృద్రోగ కాసహృత్ ॥

తా. మాదీఫల రసములో పిప్పలిచూర్ణము మిరియపుచూర్ణము గలిపి సేవించిన గర్భిణీ స్త్రీ శ్వాసము, హృద్రోగము కాసము హరించు.

శ్లో॥ [ఆయుర్వేదే] శృంగీభార్ఙివచావ్యోషా గిరి మృత్కటుకా
భయాః । గర్భిణీ శ్వాసకాసస్య పిబేత్సఘృత మాక్షికాః ॥

తా. కర్కాటకశృంగి గంటుభారంగి వసత్రికటుకములు కావిరాయికటుక రోహిణి కరక్కాయలు వీనిని సమభాగములుగ నూరి కల్కముజేసి అందు నెయ్యి గాని లేక తేనెగాని కలిపి సేవించిన గర్భిణీస్త్రీ కాసశ్వాసలు హరించు

గర్భిణీ రక్తపిత్త చికత్స.

శ్లో॥ ద్రాక్షాస్థిరా బలాధాత్రీ వాసా మధుక[illegible]వాలుకమ్ ।
క్వాథఃక్షీర యవాగూర్వా గర్భిణ్యా రక్తపిత్తజిత్ ॥

తా. ద్రాక్షపండు ముయ్యాకుపొన్న ముత్తవపులగము వుసిరికెపప్పు అడ్డసరపు యీనెలు యష్టిమధుకము కూతురుబుడమ వీనిని కషాయముకాచిగాని లేక అద్రవ్య ములదంచిపాలుబోసి యవాగుకాచిగాని సేవించిన గర్భిణీస్త్రీరక్తపిత్తము హరించు

గర్భిణీనాసారక్త చికిత్స.

శ్లో॥ ఉదుంబర ఫలక్వాథం ఘృతైః పక్వం సితాయుతమ్ ।
ఏలామరిచ నేత్రైశ్చ తోయదతోయద నాగరైః ।
శృతమే తత్పిబేద్నారి గర్భిణీ నాసరక్తజిత్ ॥

తా. మేడిపండు కషాయములో నెయ్యి పంచదారగలిపి పక్వముజేసి గాని లేక యేలకులు మిరియాలు వట్టివేరు కురువేరు తుంగముస్తెలు శొంఠి వీనిని కషాయము కాచిగాని సేవించిన గర్భిణీస్త్రీలకు ముక్కునగారెడి రక్తము హరించు.

గర్భిణీఛర్ది చికిత్స.

శ్లో॥ బిల్వాలాజాంబు నేత్రైశ్చ పిబేచ్ఛర్దిషు గర్భిణీ ॥

తా. మారేడువేరు పేలాలు కురువేరు వట్టివేరు వీనికల్కమును త్రాగిన గర్భిణీస్త్రీవాంతులు హరించు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] మధుకో శీరసిద్ధంవా ద్రాక్షామధుకసాధితమ్
పీతం సశర్కరం స్త్రీణాం ఛర్దిందాహ రుజాంజయేత్ ॥

తా. యష్టిమధుకము వట్టివేరు అనువాని కషాయములోగాని లేక ద్రాక్షపండు యష్టిమధుకము అనువాని కషాయములోగాని పంచదార గలిపి సేవించిన గర్భిణిస్త్రీవాంతులు దాహము హరించు.

## గర్భిణీ అగ్నిమాంద్య చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] అజామోదాశ్వగంధాభ్యాం జీరకరంపిప్ప
లీద్వయమ్ । సక్షౌద్రంసగుడం లేహ్యంగర్భిణ్యావహ్నిదీపనం॥

వా. ఓమము పెన్నేరుగడ్డ జీలకఱ్ఱ పిప్పలి మోడి వీనిని సమభాగములుగ చూర్ణముజేసి తేనె బెల్లముగలిపి లేహ్యాపక్వముగ వండి సేవించిన గర్భిణి యొక్క అగ్నిమాంద్యము హరించు. (స్త్రీకిప్రసవించిన పిదప అగ్నిమాంద్యము తఱుచుగజనించు. తన్నివారణార్థంబును గ్రహణ్యతిసారములు జనించిన తన్నివారణార్థంబును అమృతైత్యమునకై చెప్పంబడిన మహాసంజీవనీ రసమునుగాని లేకప్రాణేశ్వర రసమునుగాని సేవింపవలయు దీనిచే బాలింత రోగములు హరించు.)

## గర్భిణీవాత చికిత్స.

శ్లో॥ [సింహూరమణిదర్పణే] బిల్వాగ్నిమంథపక్వంవా పాటలీ
నాగరేణవా । సిద్ధంక్షీరంరసోవాపి గర్భిణీ వాతరోగనుత్ ॥

తా. మారేడువేరు కూరనెల్లి అనువానినేని లేక కలిగొట్టు శొంఠిఅనువానినేని పాలయుక్తముగకాచిగాని లేక కల్కముజేసిగాని సేవించిన గర్భిణిస్త్రీవాతరోగము హరించు.

శ్లో॥ అథవా దశమూలాంబు విశ్వోషణ సమాయుతమ్ ।
దేవదారు బలారాస్నా శుంఠ్యేరండక సాధితమ్ ।
సలిలం తైలసంమిశ్ర మనిలార్తా సదాపిబేత్ ॥

తా. మారేడు కూరనెల్లి నుమ్ముడు తక్కలి కలిగొట్టు దుండిలముకొలపొన్న నక్కపొన్న పెద్దములక నేలములక అనని దశమూల కషాయములో శొంఠి పిప్పలి చూర్ణముగలిపి సేవించినగర్భిణిస్త్రీవాతనొప్పులు హరించు లేక దేవదారు ముత్తవపులగము సుంపరాస్నముశొంఠి ఆముదపువేరు వీనికషాయముకాచి యందామితైలము

బొట్టుగలిపి త్రాగిన గర్భిణిస్త్రీ వాతనొప్పులు హరించు. (ఇక ప్రసవానంతరము గలుగు వాతములకు చికిత్స వచించెద.)

## సూతికావాతమునకు బడబానల రసము.

శ్లో॥ [రసరత్నాకరే] శుద్ధసూతస్య భాగస్స్యాత్తామ్రచూర్ణంచ తత్సమమ్। ద్విభాగం గంధకంచైవ త్రిభాగంచ కటుత్రయమ్। వహ్నితత్పర భాగైకం కుష్ఠంభాగ సమన్వితమ్ । జ్వాలాముఖీ రసైర్మర్ద్యం బదరాస్థి ప్రమాణకమ్ । బడబానలకః ప్రోక్తః ప్రసూతీ వాతనాశనః ॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము తామ్రభస్మము 1 భాగము శుద్ధిజేసినగంధకము 2 భాగములు శొంఠి పిప్పలి మిరియాలు చిత్రమూలము చంగల్వకోష్టు యివి దినుసు కొక్కొకభాగము యిట్టుల వీనినెల్ల ఖల్వములో నునిచి జ్వాలాముఖీరసముతో 4 ఝాములు మర్దించి రేగువిత్తంత వటికములుజేసి యందొకదానిని ఆవునెయ్యి మిరియపుచూర్ణము అనువానితోగాని లేక మినుపకట్టు వెల్లుల్లిరసము అనువానిలో నూనెబొట్టువేచి యీయనుపానముతోడగాని లేక నీరుగొలిమిడారసరసము మిరియపు చూర్ణము అనువానితోగాని సేవించిన ప్రసూతి వాతము హరించు. (లేక ప్రసూతి వాతమున వాతవిధ్వంసనీ రసమునైనను సేవింపవచ్చును.)

## గర్భిణీస్త్రీలకు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] ముద్గగోధూమషష్టిక శాలిజాంగలజారసాః।
బిల్వకూశ్మాండపత్తూర పటోలం బాలమూలకమ్ ।
కారవేల్లక వార్తాక జీవంతీ తండులీయకమ్ ।
ద్రాక్షాదాడిమ ఖర్జూరం క్షీరంతక్రం ఘృతాన్వితమ్ ।
లఘుపథ్యంచ యద్ద్రవ్యం గర్భిణ్యాం హితముచ్యతే ॥

తా. పెసలు గోధుమలు 60 దినములకు ఫలించెడి వడ్లు జాంగలమాంసరసము మారేడుకాయ ముదురుగుమ్మడుకాయ పొన్నగంటికూర పొట్లకాయ లేతముల్లంగిగడ్డలు కాకరకాయ వంకాయ మునుబాలకూర చిట్టికూర ద్రాక్షపండు దాడింబపండు ఖర్జూరపండు ఆవుపాలు చల్ల నెయ్యి లఘుకరద్రవ్యములు. మఱియు పథ్యకరద్రవ్యములు. ఇవి గర్భిణీస్త్రీలకు పథ్యకరంబులు.

## గర్భిణీస్త్రీలకు అపథ్యము.

శ్లో॥ అతివ్యాయామనిద్రాచ భారస్యవహనంపరమ్ । అథజాగరణంస్వప్నః కఠినే కుక్కుటాసనమ్ । శోకక్రోధ భయం వేగం పీడా వమన రేచనే । ఉపవాసశ్చతీక్ష్ణోష్ణం గురువిష్టంభిభోజనమ్ । రక్తం విశ్వాసనంశ్వభ్రే శయనం మద్యసూపిహం । ఉత్తాన శయనంయచ్ఛ గర్భిణీ తుత్యజేత్సదా॥

తా. మిక్కుటముగ సంచారము సేయుట పగలు నిద్రించుటకడు భారమును మోసుట జాగరణసేయుట కఠినాసనమునని ద్రించుట గొంతుగూర్చుండుట యేడ్చుట కోపమును జెందుట భయపడుట మలమూత్ర వేగము నడ్డగించుట పీడం జెందుట వమన విరేచనములను సేవించుట వుపవాసముసేయుట యొంటలో దిరుగుట నిప్పు సెగయందుండుట గురుకరద్రవ్యముల మలబద్ధకరద్రవ్యములు సేవించుట రక్తమును దీయుట నిట్టూర్పువాతమును విడుచుట పల్లములోగూర్చుండుట (నేలపై బరుండుట) కల్లును బట్టి పెరుగును ద్రాగుట వెల్లకిలబరుండుట యివి గర్భిణిస్త్రీల కపథ్యకరంబులగుటచే వానిని వర్జింపవలయు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి ఘనిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతుర్ధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
వంధ్యాస్వరూప దుష్టార్తవ యోనిశూల యోని
దుర్గంధ ప్రసూతిగ్రహరోగ నిదాన
తచ్చికిత్సానుపాన గర్భిణీ రోగ
చికిత్సాక్రమ పథ్యాపథ్య
లక్షణయుక్తం పంచదశ
ప్రకరణమ్.

శ్రీ ర స్తు

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

### — షో డ శ ప్ర క ర ణ ము. —

శ్లో॥ శంభుం పినాకినం బాల చంద్రభూషం కృపార్ణవమ్ ।
సర్వ పాప హరం నిత్యం నీలకంఠ మహంభజే ॥

తా. సుఖస్వరూపుడు పినాకమను ధనుస్సు ధరించినవాడు చంద్రశేఖరుడు కరుణాపరిపూర్ణుడు సర్వపాతకముల బోకడచువాడు ఆద్యంతరహితుడు నగు నీల కంఠుని నేను భజియించెద.

శ్లో॥ శ్రీ నీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని పేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథముయొక్క షోడశ ప్రకరణమును వచింపుచున్నాడను.

## అసృగ్ధర నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] శాకోపవాసా దతిమైథునాచ్చ విదాహిభి
శ్చాస్ర మతీవమిష్టమ్ । ప్రవర్తతే యోనిషు నాదశాలీ
హ్యసృగ్ధరంతం ప్రబలంహివిద్యాత్ ॥

తా. మిక్కుటముగ కూరల భుజించుట వుపవాసము సేయుట అతిమైథు ము సేయించుకొనుట దాహకరద్రవ్యముల సేవించుట ఈకారణములవలన రక్తము మిక్కుటమైగ జెడి శబ్దముతో గూడి యోనియందుముగ స్రవించు. ఇదియే అసృగ్ధర మనంబడు. (అసృగ్ధరమన పసుమరోగము.)

## వాతాద్యసృగ్ధర లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] వాతాత్సశూలం సంజాతం సఫేనం కింశుకం భవేత్ । పిత్తాత్ క్షరక్తం కృష్ణం వా రక్తముష్ణం ధృతజ్వరమ్ పాండువర్ణం కఫాద్రక్తం పిచ్ఛిలం బహుళం స్థితమ్ । త్యజే త్సర్వాచ్చ జ్వరయుతం త్రితయం సాన్నిపాతకమ్ ॥

తా. శూలగలుగుట రక్తము నురుగుతోగూడి మోదుగుపువ్వు వర్ణముగ వెడలుట యీలక్షణములుగలది వాతాసృగ్ధరమనియు రక్తము యెఱ్ఱగ లేక నల్లగ వెడలుట వుష్ణముగ రూక్షముగ నుండుట యీలక్షణములు గలది పిత్తాసృగ్ధరమనియు రక్తము పాండురవర్ణమై జిగటగ విస్తారముగ గట్టిగ వెడలిన శ్లేష్మాసృగ్ధరమనియు వాతపిత్త శ్లేష్మాసృగ్ధరలక్షణంబులంగలది సన్నిపాతాసృగ్ధరమనియు తెలియవలయు ఈ సన్నిపాతాసృగ్ధరం బసాధ్యము. ఈ 4 విధములైన అసృగ్ధరములలో దేనియందేని మూర్ఛజ్వరము గలిగియుండిన అసాధ్యంబు.

శ్లో॥ [మాధవనిదానే] వాతాత్సశూలంరుధిరం పిత్తేనీలం జ్వరాన్వితమ్ । కఫాత్పిచ్ఛం త్రిలింగంతు త్యజేత్సర్వం జ్వరాన్వితమ్ । అపథ్యవర్తనగం స్త్రీణాం రక్తపిత్త మసృగ్ధరమ్ ॥ శాల్యన్నం పయసఃపానం శీతంశస్తం విరేచనమ్ ॥

తా. యోనిశూలించిరక్తము వెడలిన వాతాసృగ్ధరమనియు నీలముగ వుష్ణముగ వెడలిన పిత్తాసృగ్ధరమనియు జిగటగ వెడలిన శ్లేష్మాసృగ్ధరమనియు వాతపిత్త శ్లేష్మాసృగ్ధరలక్షణంబులంగలది సన్నిపాతాసృగ్ధరమనియు తెలియవలయు. ఈసన్నిపాతాసృగ్ధరంబసాధ్యము కుసుమరోగముల యందపథ్యము సేయుటవలన రక్తపిత్తాసృగ్ధరముజనించు. (మఱియు జ్వరముగాని లేక క్షయముగాని లేక శ్వాసముగాని లేక క్షయోపద్రవంబులుగాని గల కుసుమ రోగిని వర్జింపవలయు) కుసుమరోగమున శాల్యన్నమును పాలను సేవించుట పథ్యకరంబు. మఱియు కుసుమరోగమున చల్ల! విరేచనమున కొసంగవలయు.

శ్లో॥ [నిత్యనాథీయే] అపథ్యారోపత స్త్రీణాం వైరక్తపిత్తమసృగ్ధరమ్ । తదేవప్రదరం ప్రోక్తం క్రియాకార్యాస్రపైత్తికే ॥

తా. అసృగ్దరరోగములలో స్త్రీలు అపథ్యంబులుజేసిన రక్తపైత్తాసృగ్దరము జనించు. ఇదియ ప్రదరరోగమనంబడు. ఇది హరించుటకై రక్తపిత్త చికిత్సంజేయ వలయు.

## అసృగ్దర చికిత్స.

శ్లో॥ ససితం శైలనిర్యాసం పీతంతండులవారిణా ।
అసృగ్దరం నిహంత్యాశు సువర్ణ ఇవపన్నగాన్ ॥

తా. మాడయెత్తును శుద్ధిజేసిన శిలాజిత్తుపంచదార యీరెంటినిబియ్యపుకడుగుతో నూరిత్రాగిన "గరుత్మంతునిచే సర్పములు హతంబగు చందంబున" కుసుమ రోగములు హతంబగు. (లేక నేతిబీరాకురసములో రాయపురి పంచదార జీలకఱ్ఱ చూర్ణముగలిపి త్రాగిన కుసుమరోగములు హరించు.)

శ్లో॥ పద్మకేసరసంసృష్టం నవనీతం సలోధ్రకమ్ ।
సితాసనాథంజయతి మహావేగ మసృగ్దరమ్ ॥

తా. తామరయగరులు లొద్దుగచెక్క వీనిని నూరి ఆవువెన్న పంచదార గలిపి సేవించిన ప్రబలమైన కుసుమరోగములు హరించు.

గీ॥ ఆరెచెక్కలయూటయు నందుఁబంచ
దారయునుసూనెఁ జేరిచి త్రాగకొకటి ।
జాతిఫలములఁ దగనావు నేతవండి
కడఁగి సేపఁపఁ గుసుమరోగములుమాను ॥

సీ॥ శీకరంబుగగొల్ల జట్టిపాకురసంబు బట్టెపెరుగున ననుపాన
మొప్ప । నరుదొండపులిసేరు నాకురసంబును బట్టెపెరుగున
ననుపానమొప్పఁ । జేకొనిదుచ్చేరు నాకురసంబును బట్టె
పెరుగుననను పానమొప్ప । రక్తమండలపాకు రససంయుతము
చేసి బట్టె పెరుగున ననుపానమొప్ప । రమణతోఁబొట్లబెండా
కు రసముపెరుగు । సరవిగా రావిచెక్క రసంబుపెరుగు ;
పథ్యముగ నారగింపంగ భవ్యముగను । గామినీజాలకుసుమ
రోగములుమాను ॥

సీ॥ వెండియుక్కోమ్మనపిండి వేళ్ళరసంబు దగబంచదారతోఁ ద్రా
గవలయు। నరయఁగజిన్నంగియాకు రసంబును దగఁబంచదా
రతోఁ ద్రాగవలయు సన్నపావలిమున్న జొన్నలకడుగును
దగఁ బంచదారతోఁ ద్రాగవలయు। వెలగయాకు రసంబు
వెస జీలకఱ్ఱయుఁ దగఁబంచదారతోఁ ద్రాగవలయు। మేలు
గా రేఁగు కంతు ఖమేకపాలు। చౌటపరిఘాకురసమును ఛాగ
దుగ్ధ। పానములు సేయునప్పుడు పథ్యమున్నఁ। గామినిజా
లకుసుమ రోగములుమాను॥

## ప్రదారాంతక రసము.

శ్లో॥ [చరకే] శుద్ధసూతం తథాగంధం శుద్ధవంగకమాప్యకమ్।
ఖర్పరంచవరాటంచ శాణతోలం పృథక్పృథక్।
తృతీయతోల కంగ్రాహ్యంలోహ చూర్ణందదేత్సుధీః।
కన్యానీరేణ సంమర్ద్య దినమేకం భిషగ్వరః।
అసాధ్యప్రదరంహంతి భక్షణాన్నాత్రసంశయః॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము తగరభస్మము రజతభస్మము శుద్ధిజేసిన కఫరి గవ్వలభస్మము యివి దినుసుకొకటింటికి శాణప్రమాణము లోహభస్మము తులములో 3 వ భాగము యిట్టుల వీనినెల్ల నేకముజేసి ఖల్వములోనుంచి కలబంద రసములో 1 దినము మర్దించి మాత్రలుజేసి సేవించిన అసాధ్యప్రదరము నిస్సంశయముగ హరించు.

## కుసుమములకు బాలసూర్యోదయము.

శ్లో॥ [చరకే] సూతంత్రైగుణ్యగంధం పరిమితమమృతంభాను
తీక్ష్ణంచనేత్రమ్। అభ్రాభంతచ్చతుర్థంగగన శరయుతంనూ
చంనర్వతుల్యమ్। ఏతందద్యాన్నిహంతి జ్వరవనదహనంగ
సకాశంచఛర్దిమ్। వాండుప్లీహప్రమేహం క్షయగుదజర
రోగదోషంచపుంసామ్। నారీణాంయోనిదోషం బహ

ప్రదరాం మూత్రకృచ్ఛ్రించ సర్వమ్ । నామ్నాయంబాల
సూర్యోదయమఖిలగదహరోఖ్యాపితో యంమునీంద్రైః ॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధి జేసిన గంధకము 3 భాగములు శుద్ధి జేసిన వసనాభి 3 భాగములు తామ్రభస్మము వుక్కుభస్మము యివిదినుసుకు 2 భాగములు యింగువ ½ భాగము అభ్రకభస్మము 5 భాగములు మిరియాలు 16½ భాగము యిటుల వీని నెల్లఖల్వములోనునిచి చూర్ణము జేసి 5 చిన్నములయెత్తును (ఆవు నేతితో గాని లేక జాజికాయచూర్ణముతో గాని లేక మేడిచెక్క రసముతో గాని లేక మేడికాయల రసముతో గాని లవంగములు జీలకఱ్ఱ అనువాని యనుపానముతో గాని లేక ఆరెచెక్క రసముతో గాని లేక తత్తద్రోగాను గుణ్యానుపాన విశేషములతో గాని) సేవించిన జ్వరము శ్వాసకాసములు వాంతి పాండువు ప్లీహము ప్రమేహము క్షయము మూలవ్యాధి వుపదంశాది లింగరోగములు యోనిదోషము ప్రదరము మొదలగు కుసుమరోగములు సర్వమూత్ర కృచ్ఛ్రములు వీనిని హరింపంజేయు. (మఱియు నీ బాలసూర్యోదయమును తామరయగరులు ఆవువెన్న పంచదార అనువాని యను పానముతోడ సేవించిన కుసుమరోగములు హరించు.

## చంద్రకళారసము.

శ్లో॥ [ఆయుర్వేదే] ప్రత్యేకం * కర్షమాత్రంస్యాత్సూతం† తా
మ్రంతథాభ్రకమ్। ద్విగుణంగంధకంచైవ కృత్వా కజ్జలికాం
శుభామ్। ముస్తాదాడిమదూర్వాఖ్యైః కేతకీస్తనజద్రవైః। సహ
దేవ్యాఃకుమార్యాశ్చ పర్పటస్యాపివారిణా । రామశీతలికా
తోయైఃశ్చ్యతావర్యారసేనచ । భావయిత్వాప్రయత్నేన దివసే
దివసేపృథక్ । తిక్తాగుడూచికాసత్వం పర్పటోశీరమాగధీ ।
శ్రీగంధంశారిబాచైవ పాంసమాంశంసూక్ష్మచూర్ణితమ్ । ద్రా
క్షాదికకషాయేణ సప్తధాపరిభావయేత్ । తతోధాన్యాత్ర
యంకృత్వా వట్యఃకార్యాశ్చణోపమాః । అయంచంద్రకళా
నామ్నారసేంద్రఃపరికీర్తితః । సర్వపిత్తగదధ్వంసీ వాతపిత్తగ

* తోలమూడాయనూతం † కాంతిం.

దాపహః। అంతర్బాహ్యమహాదాహ విధ్వంసనమహాఘనః। గ్రీష్మకాలేశరత్కాలే విశేషేణ ప్రశస్యతే । కురుతేనాగ్ని మాంద్యంచ మహా దాపజ్వరంహరేత్ । భ్రమిమంమూర్ఛాం హరత్యాశు స్త్రీణాంరక్తం మహాస్రుతమ్ । ఊర్ధ్వాధోరక్త పిత్తంచ రక్తవాంతింవిశేషతః। మూత్రకృచ్ఛ్రాణిసర్వాణి నాశయేన్నాత్రసంశయః ॥

తా. శుద్ధిజేసిన రసము తామ్రభస్మము లేక కాంతభస్మము అభ్రకభస్మము యివి దినుసుకు కర్ష ప్రమాణము శుద్ధిజేసిన ఆమ్లశిలగంధకము 6 కర్షములు యిట్టుల వానివెల్ల ఖల్వములోనునిచి కాటుకవలె మర్దించిపిదప భద్రముస్తెలు దాడిమపండు గరికవేళ్ళు మొగలిచన్ను సహదేవి కలబంద పర్పాటకము తామరతూండ్లు అడవి సదాప పిల్లిపీచర అనువాని రసములలో ప్రతిదానిచే నొక్కొకదినము భావనజేసి దానికి సమముగ చేదుబీర తిప్పసత్తు పర్పాటకము వట్టివేరు పిప్పళ్ళు శ్రీగంధము గూడపాలవేరు అనువానిని సమభాగములుగ సూక్ష్మముగ చూర్ణముజేసి గలిపి పిదప ద్రాక్షపండు ఖర్జూరపండు పంచదార యిప్పపువ్వు తేనె తవక్షీరి యష్టిమధుకము అనువాని కషాయముతో 7 దినములుభావనజేసి సెనగగింజలంత మాత్రలుజేసి15దిన ములు ధాన్యరాశియందునిచి ద్రాక్షపండు తేనె అనువాని యనుపానముతోడ సేవిం చిన సర్వపిత్తరోగములు వాతపిత్తరోగము లోన మిక్కుటముగ తాపము వెలపటి తాపము అగ్నిమాంద్యము కడుతాపజ్వరము భ్రమ మూర్ఛ అధికమైన స్రావముగల కుసుమరోగములు ఊర్ధ్వాధోగత రక్తపిత్తములు రక్తపువాంతి సర్వమూత్రకృచ్ఛ్ర ములు వీనిని నిస్సంశయముగ హరింపంజేయు. మఱియునీరసమును గ్రీష్మశరత్కాల ముల యందు సేవించుట కడుప్రశస్తంబు లేక నీరసమును జాజికాయ నెయి వీనిని నేతితోవండి యీ యనుపానముతోడగాని లేక ఖర్జూరపండు తేనె అ నితో గాని లేక గుమ్ముడుపండు తేనె అనువానితోగాని సేవించిన కుసుమరోగములు అస్థిస్రావము రక్తపిత్తము హరించు. లేక కరక్కాయచూర్ణము అభ్రకభస్మము పంచదార సింధూరము వీనిని సేవించినను లేక పూర్వోక్త బాలసూర్యోదయరసము నను మహాచంద్ర కళారసము ననుపానముగజేసి సేవించినను అసృగ్ధరము అస్థిస్రా వము వీనిని హరింపంజేయు. మామిడిచెక్కరసములో 7 నూనెబొట్లు 4 సున్నపు బొట్లు గలిపిత్రాగిన యెట్టి కుసుమరోగమైనను హరించు.

## సిందూరాది వటకములు.

శ్లో॥ [సిందూరమణిదర్పణే] సిందూరంగో_స్తనీక్షౌద్రం భక్ష్యతే మాసపంచకమ్ । అసృగ్దరాస్థిప్రదరం శామ్యతేనాత్ర సంశయః ॥

తా. దీపద్రాక్షపండు చండిరము (అనగా సిందూరము) వీనిని తేనెతో మర్దించి మాత్రలుజేసి 5 మాసములు సేవించిన కుసుమరోగము అస్థిస్రావము వీనిని నిస్సంశయముగ హరింపంజేయు.

## పాఠాదిఘృతము.

శ్లో॥ [మాధవనిదానే] పాఠాగైరికమోచ దాడిమ మహానింబ ప్రియంగ్వంబుదైః । ద్రాక్షోదుంబర చందనాగరువిషాలోద్రాంబుజంబ్వస్థిభిః । హవుషైస్తైర్మసలీమృణాల కదళీకందా స్విాతైస్సాధయేత్ । సక్షీరంతుజపారసే ఘృతమిదంస్త్రీణాం మహాశోణితమ్ ॥

తా. శిరుబొద్ది కావిరాయి బూరుగబంక దాడింబపండు పెద్దవేపచెక్క ప్రేంకణము కురువేరు ద్రాక్షపండు మేడిచెక్క శ్రీగంధము అగరు అతివస లొద్దుగుచెక్క వట్టివేరు నేరేడుపలుకులు బోడతరపాకు నేలతాటిగడ్డలు తామరతూండ్లు అరటిదుంపలు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి వానికి 4 గింతలు దాసాని పువ్వుల రసముగలిపి వీనికన్నిటికి రెండింతలు ఆవుపాలు ఆవునెయ్యి గలిపి పక్వముగవండి 4 మాడలయెత్తును సేవించిన కుసుమరోగములు హరించు.

## జంబ్వాది ఘృతము.

శ్లో॥ [పూజ్యపాదీయే] ఆదాయశుష్కం జంబూనా మాథకం సాధుకుట్టితమ్ । వల్కలస్యద్రోణ జలేపక్త్వా పాదావశేషితే । దధిమస్తుగుడంచైవ ఘృతం పాతాళగారుడమ్ । ప్రస్థంప్రస్థం ప్రదాతవ్యం కల్కంకుడవ మావపేత్ । బిల్వాం సమధుకంలోధ్ర మోచం పద్మం సకేసరమ్ । ద్రాక్షా కుటజ బీజాని ధాతకి కుసుమంతథా । ఖర్జూరం నాగపుష్పంచ సమంగాదాడిమీఫలమ్ । పాఠా ముస్తాజమోదంచ మాత జంబూ ఫలంతథా । కశేరుక కపిత్థంచ కా

రభిః పృశ్నిపర్ణికా । ఏతైఃపక్వైశ్శృతేభాండే ప్రయోజ్యం భిషగుత్తమైః । రక్తపిత్తమతీసారం సరక్తంచాప్యసృగ్దరమ్ । యోనిదోషాస్థిస్రావం రక్తార్శశ్చవినాశయేత్ ॥

తా. అథక ప్రమాణ మెంఁడిన నేరేడుపట్టను జిదియఁగొట్టి ద్రోణప్రమాణము నీళ్ళుబోసి 4 వ భాగముగ కషాయముకాచి అందు పెలుఁగుమీదిమీగడ బెల్లము ఆవు నెయ్యి దూసరితీగరసము అనువానిని దినుసు కొక్కొక ప్రస్థము చొప్పునగలిపి పిదప యందుమారేడువరుగు యిప్పపువ్వు లొద్దుగచెక్క బూరుగబంక తామరయగ రలు ద్రాక్షపండు కొడిసెపాలవిత్తులు ఆరెపువ్వులు ఖర్జూరపండు సంపంగిపూవులు మంజిష్టి దాడింబపండు శిరుబొద్ది తుంగముస్తెలు అజామోదము మామిడివరుగు నేరేడు పలుకులు నెమ్ముటములు వెలగపండు యిలిందవేరు నక్కతోకపొన్న అనువాని కల్కమును దినుసుకు కుడవప్రమాణము చొప్పునగలిపి పక్వముగవండి సేవించిన రక్త పిత్తము రక్తాతిసారము అసృగ్దరము యోనిదోషము అస్థిస్రావమురక్తార్శస్సుహరించు.

కుసుమరోగ చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] జంబూమ్రంబరవల్కలం ఖదిరజాసారం ప్రసూనంతథా । నారికేళభవంచకృష్ణకదళీకందంతథాతండు లమ్ । లాక్షాచూర్ణవిమిశ్రితం మధుయుతంరాత్రిస్థితంపాయ యేత్ । గర్భాసృక్ప్రదరాస్రపిత్త సికతామేహార్భశం పీడితాః ॥

తా. నేరేడుచెక్క మేడిచెక్క చంద్రకొనలు నారికడపుపువ్వు నల్లయరటి గడ్డ బియ్యము లక్క వీనిని సమభాగములుగ చూర్ణముచేసి తేనెలోగలిపి యొక రాత్రియుంచి సేవించిన గర్భిణీ స్త్రీయొక్క రక్తస్రావము ప్రదరము (అనగా చీర వ్యాధులు రక్తపిత్తము సికతామేహము హరించు.

సీ॥ వసుధవిష్ణుక్రాంత రసము లవంగంబు జీలకఱ్ఱయువండి సేవ నొకటి । మేడిచెక్కలవ్రూటతోడ లవంగంబు నేలకిగూరిచి క్రోలనొకటి । వెనపైడిప్రత్తాకు రసజాతిఫల లవంగంటులేలకి జీలకఱ్ఱనొకటి । యేడుతాడులకల్లునెడు సేరులనూనె బెల్లంబు మిరియంబునెల్లమూఁడు । సేరులునుగూర్చి వేడ్కకసేవనొకటి

అరయునే యాపథ్యంబైన ననుభవించి । పథ్యములుసేయ
మానునుదథ్యముగను । గాటిలంబైన కుసుమరోగంబులెల్ల ॥

గీ॥ తమిదపిండిని జెన్నున దడిపి కొన్ని ।
కుడుములుగవండి యవియును గోవ్రు నేత ।
రాయపురి పంచదారయు రమణతోడఁ ।
బానములుసేయఁ గుసుమరోగములు మాను ॥

ఉ॥ చిక్కని జీడిగింజ లొకసేరును నోమపుపొట్టు సేరుసుం ।
జక్కెర పాతగొబ్బెరయుఁ జయ్యపరెండును రెండుపావులున్ ।
ద్రాక్షి కలంగ పత్రమును దోరపుచిక్కుడుపత్రతోయముల్
మక్కువనేతితో గొనగ మానును గాంతల యొట్టుచీరలున్

## అస్థిస్రావ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శుభ్రంరక్తం వాథవాశారవర్ణ మచ్ఛం
విస్రం యోనిజంస్రావమాహుః । అస్థిస్రావంత్వస్థి మజ్జాప
కర్ష మాంత్రేపీస్యాచ్ఛోషశూలప్రదంచ ॥

తా. రక్తము తెల్లగగాని లేక * శారవర్ణముగగాని లేక తేటగగానిగలదై దుర్గంధముగ యోనిమార్గముగ వెడలిన అస్థిస్రావ మనంబడు. ఇది యస్థులయందు నుజ్జనాకర్షించి ప్రేగులయందు శోషను శూలను గలుగంజేయు.

## అస్థిస్రావ నిదానము.

శ్లో॥ భవేద్రసావిదాహేన యథాతద్వర్ణ మార్తవమ్ ।
తదస్థిస్రావమాఖ్యాత మతికార్శ్య ప్రదర్శనమ్ ॥

తా. స్త్రీకి రసవిదాహమువలన రక్తము రసవర్ణముగ బైలువెడలిన అస్థిస్రావ మనంబడు. దీనియందు దధికముగ శరీరము కృశించు. (మఱియు అస్థిస్రావరోగమున జ్వరముగాని లేక క్షయోపద్రవములుగాని లేక శ్వాసముగాని లేక మేహోపద్రవం బులుగాని గలిగియుండిన యసాధ్యంబనియు లేకుండిన సాధ్యంబనియుదెలియవలయు

* శారవర్ణమన—యొచ్చగు పచ్చనిరంగుగల నీలవర్ణము.

మఱియు సాధ్యంబుగనుండు అస్థిస్రావరోగము నివర్తించుటకై 4 మాసములు పూర్ణ చంద్రోదయమును సేవింపవలయు.)

## శతావరీ ఘృతము.

శ్లో॥ పచేద్ఘృతస్యద్విప్రస్థం శతావర్యారసాఢకే। ఆఢకంమహిష క్షీరం ప్రస్థం గోక్షురకంతథా । ప్రస్థంచ మాషయూషస్య దత్వాకల్కే కృతైర్ఘటే । శారిబామధుకంద్రాక్షా చందనో శీరవత్సకైః । ముస్తయాచమృణాళేన కాకోల్యాదిగణేనచ । పయాపద్మకింజల్క సమంగోత్పలకర్షకైః । సిద్ధేపూతేక్షిపే త్ప్రస్థం సితాయా మాక్షికస్యవా । ఏతత్సమ్యక్ప్రయుంజీత ప్రదరేస్థివిస్రుతౌ । అంతర్దాహేరక్తపిత్తేక్షీణేరేతసిపైత్తికే మూత్రకృచ్ఛ్రేక్షయేచాన్యా దేతృణ్ణామాం బృహణాపరమ్ ॥

తా. ఆవునెయ్యి 2 ప్రస్థములు పిల్లిపీచర వేళ్ళరసము 2 ఆఢకములు బఱ్ఱె పాలు ఆడకము పల్లేరుగసము 1 ప్రస్థము మినుపకట్టు 1 ప్రస్థము యిటుల వీనినెల్ల బెట్టి బానలోబోసి అందు గూడసుగంధపాల యష్టిమధుకము ద్రాక్షపండు శ్రీగంధము వట్టి వేరు కొడిసెపాల తుంగముస్తెలు తామరతూండ్లు కాకోల్యాదిగణములో జెప్పబడిన ద్రవ్యములు ఖర్జూరపండు తామరకేసరములు మంజిష్టి నల్లకలువదుంపలు అనువాని కల్కమును దినుసు కొక్కొక కర్షము చొప్పున గలిపి పక్వముగ గాచి వడియగట్టి యందు పంచదారగాని తేనెగాని 1 ప్రస్థముగలిపి సేవించిన ప్రదరము అస్థిస్రావము అంతర్దాహము రక్తపిత్తముక్షీణరేతోదోషముపిత్తరోగము మూత్రకృచ్ఛ్రము క్షయము ఉన్మాదము దప్పి వీనిని హరింపంజేయుటయేగాక శరీరపుష్టిని సగా। గలుగంజేయు.

## ముసల్యాది కషాయము.

శ్లో॥ [ఆయుర్వేదే] ముసలీఖదిరామలకీత్రికంటక జంబూత్వగ్వరీ క్వాథః । అస్థిస్రావం ప్రదరం ప్రవాహికాస్రపిత్తమాశు నాశయతిధ్రువమ్ ॥

తా. నేలతాటిగడ్డలు చండ్రచెక్క వుసిరికెపప్పు పల్లేరు నేరేడుచెక్క పిల్లి పరవేరు వీనిని సమభాగములుగ దంచి కషాయముకాచిత్రాగిన అస్థిస్రావముప్రదరము ప్రవాహిక రక్తపిత్తము శీఘ్రముగ హరించు.

బలాది కషాయము.

శ్లో॥ [మతాంతరే] బలాఛిన్నరుహాధాత్రీవల్కాలంచారిమేదకమ్ ।
క్వాథోసృగ్దరపిత్తాస్రగస్థిస్రావనిషూదనః ॥

తా. ముత్తవపులగము తిప్పతీగె వుసిరికెపప్పు తెల్లతుమ్మకొనలు వీనిని కషాయముకాచి త్రాగిన ప్రదరము రక్తపిత్తము అస్థిస్రావము (తెల్లచీరరోగము) వీనిని హరింపజేయు. (లేక ఆరెదొండ వేరు గంధకము కొతిమెర్లు పిప్పలి అనువాని చూర్ణముగాని లేక యోగరాజగుగ్గిలమునుగాని గలిపి సేవించిన అస్థిస్రావముహరించు.)

ఉ॥ తంగేడువేరు చెక్కయు నుదారత నల్లని ప్రత్తిమూకులుం ।
సంగతి నుత్తరేణువు రసంబును నొక్కొకద్రవ్యమందునన్ ।
వంగ విభూతిశర్కర యువర్యమరీచముఁగూర్చి సేవచే ।
నంగెడు వేగమూను వసుధాస్థలికాంతల చీరరోగముల్ ॥

సీ॥ గొడ్డుకాకరచెట్టు గడ్డరసంబును జల్లయు వంగభస్మంబు నొకటి । కువలయంబును దుప్పికొమ్ముగంధంబును జల్లయు వంగభస్మంబు నొకటి । వెలసిన తంగేడు విత్తులచూర్ణంబు చల్లయు వంగభస్మంబునొకటి । మీఱిన యాదొండవేరును గొతిమెర్లు చల్లయు వంగభస్మంబు నొకటి చెలఁగి యూ యౌషధంబును సేవఁజేసి।పథ్యముగనున్న మానును బరగ వేగ । వ్యాధులెల్లను ధరణి నవశ్యముగను । తేలు విష మెక్కి మంత్రాన దిగినయట్లు ॥

క॥ తాటిరేకులచూర్ణంబు తగిన పంచ ।
దారమిరియంబు గూర్చియు ద్రాగినపుడె ।
మీన నేత్రల కడుపులలోన నున్న ।
పలువిధంబులఁ దెల్ల జీరలు దొలంగు ॥

కుసుమరోగమునందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే]ముద్గగోధూమషాష్టిక శాలిజాంగలజారసాః।
పక్వకూశ్మాండ పత్తూర పటోలం తండులీయకమ్ ।

ద్రాక్షాదాడిమ ఖర్జూరం ధాత్రీఫల ఘృతంమధు ।
ప్రదరే రక్తపిత్తేచ పథ్యవర్గముదాహృతమ్ ॥

తా. పెసరకట్టు గోధుమలు 70 దినములకు పండిన వడ్లు జాంగలమాంస రసము ముదుగుమ్మడుకాయ పొన్నగంటికూర (కొయ్యతోటకూర) పొట్లకాయ బీరకూర ద్రాక్షపండు దాడింబపండు ఖర్జూరపండు వుసిరికెపండు నెయ్యి తేనె యివి కుసుమరక్తపిత్త రోగములయందు పథ్యకరంబులు.

శ్లో॥ [అన్యశాస్త్రే] పయస్యాముద్గయూషేనభోజనంస్యాదసృగ్దరే ।
ఉదుంబరశలాటూని దుగ్ధంమధుపిబేత్తథా ।
అసృగ్దరవినాశాయతథాసృక్పిత్తశాంతయే ॥

తా. పాలయుక్తముగ గాచబడిన పెసరకట్టు ముదిరిన * మేడికాయలు వుపాలు తేనె యివి అసృగ్ధర పిత్తరోగములయందు సీతకరంబులు.

కుసుమరోగమునం దపథ్యము.

శ్లో॥ కట్వమ్లలవణక్షారమత్స్యమద్యవిదాహినః ।
మాషానిష్పావతిలజ కుళుత్థంలశునందధి ।
ప్రదరేరక్తపిత్తేచా ప్యపథ్యమితికథ్యతే ॥

తా. కారము పులుసు వుప్పు క్షారములు మత్స్యములు కల్లు విదాహకర ద్రవ్యములు మినుములు అనుములు (చిక్కుడుకాయ) నువ్వులు వులవలు వెల్లుల్లిపాయ పెరుగు. యివి ప్రదర రక్తపిత్త అస్థిస్రావ రోగములయం దపథ్యకరంబులు.

యోనివ్యాపత్తి నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] వింశతిర్వ్యాపదోయోనే ర్నిర్దిష్టారోగసంగ్రహే । మిథ్యాచారేణతాస్త్రీణాం ప్రదుష్టేనార్తవేనచ ।
జాయంతేబీజదోషాచ్చదైవాచ్చశృణుతాఃపృథక్ ॥

తా. యోనిదోషములు 20 విధంబులని రోగసంగ్రహమునందు జెప్పంబడి యున్నయది యివి మిథ్యాహార విహారములవలన దుష్టరక్తమువలన బీజదోషమువలన దైవయోగమువలన స్త్రీలకు జనించు వానిలక్షణంబుల బ్రత్యేకంబుగ వచించెద.

* ఇదే అ...కాయ.

శ్లో॥ నా ఫేనిలముదావృత్తా రజఃకృచ్ఛ్రేణముంచతి । వంధ్యాం దుష్టార్తవాంవిద్యా ద్విప్లుతాంనిత్యవేదనామ్ ॥ పరిప్లుతా యాం భవతి గ్రామ్యధర్మేణరుగ్భృశమ్ । వాతలాకర్కశా స్తబ్ధాశూలనిస్తోదపీడితా । చతసృష్వపిచాద్యాసుభవంత్యనిలవేదనాః ॥

తా. యోనివలన నార్తవము నురుగుతోఁగూడి కడుకష్టంబగుటవలన వెడలిన వుదావర్తమనంబడు. ఆర్తవము దుష్టంబగుటవలన వంధ్యయనంబడు. ఎల్లపుడు వేదనగలిగి యుండిన విప్లుతమనంబడు. మైధునమువలన కడుపీడగలిగిన పరిప్లుతమనంబడు. కాఠిన్యము శూలగలిగియుండిన వాతమనంబడు మఱియు పైజెప్పబడిన వుదావర్తవంధ్యవిప్లుత పరిప్లుతములను 4 యోనిరోగములయందు వాతవేదన గలిగియుండు.

శ్లో॥ సదాహంక్షీయతేరక్తం యస్యాస్సాలోహితక్షయా । సవాతముద్వమేద్బీజం వామినీరజసాన్వితమ్ । ప్రస్రంసినీస్రంసతేతుక్షోభితాదుఃప్రజాయినీ। స్థితంస్థితం హంతిగర్భంపుత్రఘ్నీరక్తసంక్షయాత్ । అత్యర్థంపిత్తలాయోనిర్దాహపాకజ్వరాన్వితా । చతసృష్వపిచాద్యాసుపిత్తలింగోచ్ఛ్రయోభవేత్ ॥

తా. యోనివలన వేడిగ అధికముగ రక్తము వెడలిన లోహితక్షయ మనంబడు రజోయుక్తశుక్రము వాతయుక్తముగ స్రవించిన వామిని యనంబడు. యోనిస్థానమువలన నార్తవము భ్రష్టంబైన ప్రస్రంసిని యనంబడు. దీనియందు మర్దనవలన పగా బాగుగాస్రావము గలుగకుండు దానంజేసి దుఃఖప్రసవమునకు కారణంబగు, యోనియందు రక్తక్షయమువలన గర్భమునిలువకుండిన వుత్రఘ్ని యనంబడు. యోని కడు దాహయుక్తమై పండి జ్వరయుక్తముగనుండిన పిత్తళయనంబడు. పైజెప్పబడిన రక్తక్షయ వామిని స్రంసిని వుత్రఘ్ని అను 4 యోనిరోగములయందు పిత్తలక్షణంబులే యధికముగ గలిగియుండు.

శ్లో॥ అత్యానందాతిసంతోషం గ్రామ్యధర్మేణగచ్ఛతి ।
కర్ణిన్యాంకర్ణ కాయోనా శ్లేష్మాసృగ్భ్యాంప్రజాయతే ।
మైథునాచరణాత్పూర్వం పురుషాదతిరిచ్యతే।

బహుశశ్చాతిచరణా తయోర్బీజంనవిందతి ।
శ్లేష్మలాపిచ్ఛిలాయోనిః కండూయుక్తాతిశీతలా ।
చతసృష్వపిచాద్యాసు శ్లేష్మలింగోచ్ఛ్రయోభవేత్ ॥

తా. దృఢమైథునమువలన సగా సుఖమును పొందకుండెడి యోని అత్యానంద మనంబడు. యోనియందు కఫరక్తమువలన కమలముయొక్క మిద్దెవలె మాంసకం దముగలిగిన కర్ణికయనంబడు. పురుషునికిసురతమువలన సుఖముగలుగుటకు ముందే ద్రవించి విరామమును జెందెడి యోని చరణమనంబడు. పలుమారు రతికేళిం దేనిచే ద్రవింపక పురుషునికిబిదప ద్రవించెడియోని అతిచరణమనంబడు. (చరణ అతిచరణ దోషములుగల యోనియందు గర్భధారణము గలుగకుండు.) బంకగకడుయుక్తము, కడుచల్లగనుండుయోని శ్లేష్మళమనంబడు. పూర్వోక్త అత్యానందకర్ణిక చరణ అతి చరణములను 4 యోనిరోగములయందు కఫలక్షణములే యధికముగ గలిగియుండు.

శ్లో॥ అనార్తవా స్తనీషండి ఖరస్పర్శాతుమైథునే ।
అతికాయగృహీతా స్తరుణ్యా స్త్వండినీభవేత్ ।
వివృతాతిమహాయోని స్సూచీవక్త్రాతిసంవృతా ।
సర్వలింగసముత్థానా సర్వదోష ప్రకోపజా ।
చతసృష్వపిచాద్యాసు సర్వలింగనిదర్శనమ్ ।
పంచసాధ్యాభవంతీహ యోనయ స్సర్వదోషజాః ॥

తా. ఋతువు స్తనములు లేక మైధునకాలమున గరగరగనుండు భగము గలస్త్రీ షండిని యనంబడు. యౌవనముగలస్త్రీకి స్థూలమైన లింగ సంబంధము వలన యోనియండమువలె బైలువెడలిన అండినియనంబడు యోనిముఖము కడువి వృతంబై యుండిన మహాయోనియనంబడు. కడుసంకుచితమైన ద్వారముగలయోని సూచివక్త్రిమనంబడు. సర్వదోషములయొక్క ప్రకోపమువలన సర్వలక్షణంబులం గల యోనిసాన్నిపాతిక మనంబడు. మఱియు పూర్వోక్తషండిని అండిని మహా యోని సూచివక్త్రిను అన 4 యోనిరోగములలో సర్వదోషలక్షణంబులు గల్గి యుండుటవలన 4 ను త్రిదోషమువలన జనించిన 5 వదియగు సాన్నిపాతిక యోని రోగంబును అసాధ్యంబులు.

## కదంబాది కషాయము.

శ్లో॥ [మాధవనిదానే] కదంబమూలవల్కంచ ఖదిరాంగారమిశ్రితమ్ । మాసంనారీపిబేత్క్వాథం యోనిశూలనిపీడితః ॥

తా. మొగులు కడిమి వేరుపట్ట చంద్ర గుంటగలగర వీనిని కషాయముకాచి 1 మాసము స్త్రీ త్రాగిన యోనిశూల హరించు.

శ్లో॥ రాస్నాశ్వగంధావాసాభి శ్శృతలఘుశూలనుత్పయః ।
వాసోపకుంచి కాజాజి వచారాస్నాచచిత్రకమ్ ।
యవానీసైంధవంక్షారం పిష్ట్వాయుక్తంఘృతేనతు ।
మర్మయోనిజశూలఘ్నం పేయముష్ణోదకాదిభిః ॥

తా. సన్నరాస్నము పెన్నేరుగడ్డ అడ్డసరము వీనిని పాలలోవైచి కాచి త్రాగినను లేక అడ్డసరము నల్లజీలకఱ్ఱజాజికాయ వస సన్నరాస్నము చిత్రమూలము వోమము సైంధవలవణము వీని నుష్ణోదకముతో నూరియందు నెయ్యిగలిపి త్రాగినను మర్మస్థానములయందు శూల యోనిశూల హరించు.

శ్లో॥ పేటికామూలలేపాచ్చ యోనిర్భిన్నాప్రశామ్యతి ॥

తా. పేటికొలమూలమును నూరి లేపనముజేసిన యోనిపగుళ్ళు మానును.

## ఫల ఘృతము.

శ్లో॥ [అశ్వినే] మంజిష్ఠామధుకంకుష్ఠం త్రిఫలాశర్కరాబలా । మేదాపయస్యాకాకోలీమూలంచైవాశ్వగంధజమ్ । అజామోదాహరిద్రేద్వేతథా కటుకరోహిణీ । ఉత్పలంకుముదంద్రాక్షా కాకోలీచందనద్వయమ్ । ఏతేషాంకార్షికైర్భాగై ర్ఘృతప్రస్థంవిపాచయేత్ । శతావరీరసంక్షీరం ఘృతాద్దేయంచతుర్గుణమ్ । సర్పిరేతన్నరఃపీత్వా స్త్రీషునిత్యంవృషాయతే । పుత్రాన్సంజనయేన్నారీమేధాఢ్యాన్ప్రియదర్శనాన్ । యాచైవాస్థిరగర్భాస్యా ద్యాచవాజనయేన్మృతమ్ । స్వల్పాయుషంవాజనయే ద్యాచకన్యాం ప్రసూయతే । యోనిదోషేరజో

దోషేపరిస్రావేచశస్య తే। ప్రజావర్ధనమాయుష్యంసర్వగ్రహని
వారణమ్। నామ్నాఫలఘృతం హ్యేతదశ్విభ్యాంనిర్మితంపురా॥

తా. మంజిష్టి అతిమధురము చంగల్వకోష్టు త్రిఫలములు పంచదార ముత్తవ పులగము మేద పిన్నపాల తేలుమణివేరు పెన్నేరుగడ్డ అజామోదము పసుపు మ్రాని పసపు కటుకరోహిణి నల్లకలువగడ్డలు తెల్లకలువగడ్డలు ద్రాక్షపండు కాకోళి క్షీర కాకోళి చందనము రక్తచందనము వీనిలో ప్రతిదానిని కర్ష ప్రమాణము గ్రహించి కల్కముజేసి ప్రస్థప్రమాణము నేతిలోగలిపి నేతికి 4 గింతలు పిల్లిపీచరవేళ్ళరసము పాలుగలిపి ఘృతము శేషించునటుల కాచి పురుషుడు సేవించిన వీర్యవృద్ధి గలవాడై ప్రతిదినము స్త్రీతో సంభోగము సేయు మఱియు దీనిని గర్భస్రావము మృతప్రసవము గలస్త్రీ అల్పాయువుగల సంతానమును పుట్టించెడి స్త్రీ కన్యకలప్రసవించెడి స్త్రీ సేవించిన మేధ సౌందర్యముగల పుత్రులంగను. యీ ఘృతము యోనిరోగము రజో దోషము (పరిస్రావదోషము సర్వగ్రహదోషములు) వీనిని హరింపజేసి సంతానవృద్ధిని ఆయువునుగలుగంజేయు. ఈ ఫలఘృతము అశ్వినీ దేవతలవలన నిర్మింపంబడియె.

## సిద్ధార్థకాది ఘృతము.

శ్లో॥ [మాధవనిదానే] సిద్ధార్థకం వచాబ్రాహ్మీశంఖపుష్పీపున
ర్నవా । పయస్యాతి త్రిఫలాకుష్ఠం తథా కటుకరోహిణీ ।
శారిబాద్వయ యష్ట్యాహ్వ చోరకం సుమనోలతా । వృషా
పుష్పంసమంజిష్టా దేవదారుర్మహౌషధమ్ । పిప్పల్యౌభృంగ
రాజంచ నిశాశ్యామా సువర్చలా । దశమూల మపామార్గ
మశ్వగంధా శతావరీ । జలద్రోణే పచేదేతా న్భాగై ర్ద్విపల
కై రిమాన్ । తత్కషాయంపరిస్రావ్యఘృతస్యాఢాఢకే పచేత్
పాచితం తచ్ఛృతంయుక్త్యా గాయత్ర్యాచాభి మంత్రితమ్ ।
ద్విమాస గర్భిణీనారీ షణ్మా సానుపయోజయేత్ । సర్వజ్ఞం
జనయేత్పుత్రంసర్వామయవివర్జితమ్। అస్యప్రభావాకుక్షిస్థ
స్ఫుటవాగ్వ్యాహరత్యపి । యోనిదుష్టాశ్చయానార్యో రేతో
దుష్టాశ్చయేనరాః। వన్ధ్యాపిలభతేగర్భంశూరంపణ్డితమానిన।

తా. తెల్లావాలు వస మండూకబ్రహ్మి శంఖపుష్పి గలిజేరు పిన్నపాల త్రిఫలములు చంగల్వకోష్టు కటుకరోహిణీ * గూడపాల నల్లగూడపాల అతిమధురము చోరకము జాజితీగె అడ్డసరపువ్వులు మంజిష్టి దేవదారు శొంఠి పిప్పలి గజపిప్పలి గుంటగలగర పసపు నల్ల తెగడ సౌవర్చలవణము దశమూలములు వృత్తరేణు పెన్నేరు గడ్డపిల్లిపీచర వీనిని దినుసుకు 2 పలములు చొప్పున దంచి ద్రోణప్రమాణ ముదకము బోసి కషాయముకాచి వడియగట్టి అర్ధప్రమాణము నెయ్యిగలిపి ఘృతము శేషించునటుల కాచి గాయత్రీమంత్రముతో నభిమంత్రించి గర్భము ధరించిన 2 మాసములు మొదలారవమాసమువరకు సేవించినసర్వరోగవివర్జితురాలై సర్వజ్ఞుడైనపుత్రునింగను. ఈ ఘృతముయొక్క ప్రభావమువలన గర్భమందలి శిశువునకు స్ఫుటమైనవాక్కుగలుగు. మఱియు నిది స్త్రీయొక్క యోనిరోగమును పురుషునియొక్క శుక్రదోషమును హరింపంజేయు. మఱియు గొడ్రాలైన స్త్రీ గర్భముధరించిపండితుడగు కొమరునింగను.

## వచాద్యవ లేహము.

శ్లో॥ వచోప కుంచికాజాజీ కృష్ణావృషభ సైంధవమ్ ।
అజామోదా యవక్షార చిత్రకం శర్కరాన్వితమ్ ।
పిష్ట్వా ప్రసన్నయాలోడ్య ఖాదేత్తద్ఘృతభర్జితమ్ ।
యోనిపార్శ్వార్తి హృద్రోగ గుల్మార్శోభ్యో వినివృత్తయే ॥

తా. వస నల్లజీలకఱ్ఱ జీలకఱ్ఱ పిప్పళ్ళు అడ్డసరము సైంధవలవణము అజామోదము యవక్షారము చిత్రమూలము అనువాని చూర్ణమును నేతిలో వేయించి శర్కరగలిపి ప్రసన్నయను పేరుగల పద్యముయొక్క యనుపానముతోడ సేవించిన యోని పార్శ్వభాగమునందలి శూల హృద్రోగము గుల్మము అర్శస్సు వీనిని హరింపంజేయు.

## యోనికంద నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] దివాస్వప్నాదతి క్రోధాద్వ్యాయామాదతి మైథునాత్ । క్షతాచ్చ నఖదంతాద్యైర్వాతాద్యాః కుపితా మలాః । పూయశోణిత సంకాశం లకుచా కృతిసన్నిభమ్ । ఉత్పద్యతే యదాయోనౌ నామ్నా కందస్సయోనిజః ॥

* ఇదే సుగంధిపాల.

తా. పగలు నిద్రించుట కడుక్రోధమును శ్రమను జెందుట అతిమైధునము నందు ప్రవర్తించుట నఖదంతాదులవలన యోనియందు గాయము దగులుట ఈ కారణములవలన యోనియందు వాతాదిదోషములు ప్రకోపించి చీము రక్తము అను వానితో దుల్యమైనవర్ణము నిమ్మపండుయొక్క ప్రమాణముగలదై గుండ్రముగనుండు మాంసపుయుంటలను గలుగంజేసిన యోనికంద మనంబడు.

## వాతయోనికంద లక్షణము.

శ్లో॥ రూక్షం వివర్ణం స్ఫుటితం వాతకందం వినిర్దిశేత్ ॥

తా. రూక్షవివర్ణముగలిగి పగిలియుండినవాతయోనికందమని తెలియవలయు.

## యోనికంద చికిత్స.

శ్లో॥ గైరికామ్రాస్థి జఠర రజన్యం జినకట్ఫలాః ।
పూరయేద్యోని మేతేషాం చూర్ణైః క్షౌద్ర సమాన్వితైః ।
త్రిఫలాయాః కషాయేణ సక్షౌద్రేణచ సేచయేత్ ।
ప్రమదా యోనికందేన వ్యాధినా పరిముచ్యతే ॥

తా. కావిరాయి మామిడిపప్పు పసపు సురమటాయి కాయఫలము వీనిని చూర్ణముజేసి తేనెలోగలిపి యోనియందు ధారణముజేసినను లేక త్రిఫలకషాయములో తేనెగలిసి సేచనముజేసినను యోనికందము హరించు.

## ఆఖుతైలము.

శ్లో॥ ఆఖోర్మాంసం సపది బహువా సూక్ష్మఖండీకృతం తత్తైలేఖ
పాచ్యం ద్రవతినియతం యావ దేతేనసమ్యక్ । తత్తైలాక్తం
వసనమనిసం యోని భాగేదధానా సత్యం ప్రీడాజనకమబలా
యోనికందంనిహంతి ॥

తా. ఎలుకమాంసముయొక్క సన్నని తునకల నూనెలోవైచి ద్రవించి లములో గలియువరకు కాచి దానిలో వస్త్రముదడిపి యోనియందు ధరించిన జ్జాకారక యోనికందము హరించు.

## పిత్తజ యోనికంద లక్షణము.

శ్లో॥ దాహరాగజ్వరయుతంవిద్యాత్పిత్తాత్మకంతుతమ్ ॥

తా. దాహయుక్తముగ యెఱ్ఱగ తాపయుక్తముగనుండిన పైత్తకయోని కందమని తెలియవలయు.

కఫయోనికంద లక్షణము.

శ్లో॥ నీలపుష్ప ప్రతీకాశం కండూమంతం కఫాత్మకమ్ ॥

తా. నీలపుష్పవర్ణముగ కండూయుక్తముగ నుండిన కఫజ యోనికందమని తెలియవలయు.

సన్నిపాతజ యోనికంద లక్షణము.

శ్లో॥ సర్వలింగ సమాయుక్తం సన్నిపాతాత్మకంవదేత్ ॥

తా. పూర్వోక్త వాతపిత్తకఫలక్షణయుక్తంబుగనుండిన సన్నిపాతజయోని కందమని తెలియవలయు.

గుడూచ్యాది వర్తి.

శ్లో॥ గుడూచీ త్రిఫలాదంతి క్వాథ్యైవ పరివేష్టితైః ।
పిప్పలీ మరిచై ర్మాషైః శ్యతాహ్వా కుష్ఠసైంధవైః ।
వర్తిస్తుల్యా ప్రదేశిన్యా ధార్యాయోని విశోధిని ॥

తా. తిప్పతీగె త్రిఫలములు దంతివేరు వీనిని కషాయముతో పిప్పళ్ళు మిరియాలు వుద్దులుపిల్లిపీచర చెంగల్వకోష్టు సైంధవలవణము అనువానిని నూరివస్త్రమునకు బట్టించి జుట్టును ప్రేలులావంత వర్తి జేసి యోనియందుధరించిన యోనిరోగము హరించు. యోనిస్వచ్ఛముగ నగు.

పిష్టజంబూక లేపము।

శ్లో॥ పిష్టజంబూక సంపిష్టం పక్వంతిం త్రిణిసంయుతమ్ ।
లేపమాత్రేణ నారీణాం యోనికందహరంపరమ్ ॥

తా. పిష్టజంబూకమను (పీతలోధ్రమును) దంచి చూర్ణముజేసి చింతపండుతోగలిపి పక్వముగవండి యోనిపై బూసిన యోనికందము హరించు.

గర్భపాత నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] భయాభిఘాతతీక్ష్ణోష్ణ పానాశననిషేవణాత్ ।
గర్భః పతతిర క్తస్యసశూలం దర్శనంభవేత్ ॥

తా. భయము అభిఘాతము వీనిం జెందుట తీక్ష్ణము వుష్ణముగలయన్నోదకముల సేవించుట ఈకారణములవలన శూలయుక్తముగ గర్భస్రావమురజోదర్శనముగలుగు.

## గర్భస్రావ పతన కాలము.

శ్లో॥ ఆచతుర్థాత్తతోమాసా త్ప్రస వేద్గర్భవిద్రవః ।
తతస్థిర శరీరస్య పాతః పంచమషష్ఠయోః ॥

తా. 4 మాసములవరకు గర్భము ద్రవముగనుండు. ఇది స్రవించిన స్రావమనంబడు. 5 వ లేక 6 వ మాసమున గర్భము కఠినంబుగ నుండు. ఇది పడిన గర్భపాతమనంబడు.

## గర్భస్రావ కారణము.

శ్లో॥ గర్భోభిఘాతవిష మాసనపీడ నాద్యైః పక్వంద్రుమాదవ
ఫలం పతతిక్షణేన ॥

తా. అభిఘాతము విషమముగ గూర్చుండుట పీడ మొదలగు కారణముల వలన "పక్వమైన ఫలమొకింతయభిఘాతమువలన వృక్షమునుండిపడుచందంబున" గర్భము స్వస్థానమునందుండి తక్షణమున పతనంబగు.

## గర్భపాతోపద్రవములు.

శ్లో॥ ప్రస్రంసమానే గర్భేస్యా ద్దాహశ్శూలశ్చపార్శ్వయోః
పృష్ఠరుక్ప్రదరానాహా మూత్ర సంగశ్చజాయతే ॥

తా. గర్భస్రావకాలంబున దాహము పార్శ్వ పృష్ఠములయందు శూల ప్రదరము ఆనాహము మూత్రప్రతిబంధము అను నుపద్రవంబులు గలుగు.

## స్థానాంతరగత గర్భోపద్రవము.

శ్లో॥ స్థానాత్స్థానాంతరేతస్మి న్ప్రయాత్యపిచజాయతే
ఆమపక్వాశయాదౌతు క్షోభపూర్వాహ్యుపద్రవాః ।

తా. గర్భము స్వస్థానమునుండి చలించి యితరస్థానగతంబైన ఆమపక్వాశయములయందు క్షోభపూర్వకమైన యుపద్రవములు గలుగు.

## ప్రతిమాస గర్భౌషధములు.

శ్లో॥ [నిత్యనాథీయే] మధుకంశాకబీజంచ పయస్యాసురదారుచ । అశ్మంతకః కృష్ణతిలా స్తామ్రవల్లీ శతావరీ । వృక్షాదనీపయస్యాచలతా చోత్పలశారిబా । అనంతా శారిబా రాస్నా పద్మా మధుకమేవచ । బృహతీద్వయకాశ్మర్యః క్షీరీశృంగా స్త్వచో ఘృతమ్ । పృశ్నిపర్ణీ బలాశి(గ్రుశ్వదంష్ట్రా) మధుపర్ణికా । శృంగాటకంబిసంద్రాక్షా కసేరుమధుకంసితా ః సప్తైతాన్యయసాయోగాన్నర్థశ్లోకసమాపనాత్ । క్రమాత్సప్తసు మాసేషుగర్భే స్రవతి యోజయేత్ । ఏతా ఓషధయః కర్షమితాశ్శీతతోయేన సంపిష్యపలమితేనదుగ్ధేనాలోడితాః పాతవ్యాః॥

తా. ప్రథమమాసమున గర్భపాతముగలిగిన అతిమధురము మునగవిత్తులు క్షీరకాకోళి దేవదారు అనువానిని 2 వ మాసమున అశ్మంతకము నల్లనువ్వులు మంజిష్టి పిల్లిపీచర అనువానిని 3 వ మాసమున ఒడలిక క్షీరకాకోళి నల్లకలువ సుగంధిపాల అనువానిని 4 వమాసమున దురదగొండి సుగంధిపాల సన్నరాస్న మామునుగుదామెర అతిమధురము అనువానిని 5 వ మాసమున చిన్నములక పెద్దములక నేలగుమ్మడు కర్కాటకశృంగి దాల్చిన్ని నెయ్యి అనువానిని 6 వ మాసమున కోలపొన్న ముత్తవపులగము మునగపల్లేరు గుమ్మడు అనువానిని 7 వ మాసమున పరికెగడ్డ తామరతూండ్లు ద్రాక్షపండు కచోరములు అతిమధురము శర్కర అనువానిని ప్రతిమాసమునకొక కర్ష ప్రమాణము చొప్పున తెచ్చించి శీతోదకముతో నూరి పలమెత్తు పాలలోగలిపి త్రాగిన గర్భపాతము గలుగకుండు.

## గర్భపాతమునకు లజ్జాళుకాది కషాయము.

శ్లో॥ [మాధవనిదానే] లజ్జాళుర్ధాతకీపుష్ప ముత్పలంమధులోధ్రకమ్ । జలస్థమా స్త్రియాపీతంగర్భపాతంనివారయేత్ ॥

తా. అంతరదామెర ఆరెపువ్వు నల్లకలువ అతిమధురము లొద్దుగ వీనిని కషాయముకాచి స్త్రీని నీళ్ళలోగూర్చుండబెట్టి పానముజేయించిన గర్భపాతము హరించు.

## గర్భపాతమునకు శర్కరాది యోగము.

శ్లో॥ శర్కరాబిసతిలంసమాంశకం మాక్షికేనసహభక్ష్యతేయదా ।
నాస్తిగర్భపతనోద్భవం భయంపాపభీతి రివతీర్థసేవయా ॥

తా. శర్కర తామరతూండ్లు నువ్వులు వీనిని సమభాగములుగ నూరి తేనె యనుపానముతోడ భక్షించిన "తీర్థసేవన జేయునారలకు పాపభీతిలేకుండు చందంబున" గర్భపాతభీతి గలుగకుండు.

## గర్భచలనమున హ్రీంబేరాది కషాయము.

శ్లో॥ హ్రీంబేరాతివిషాముస్తా మోచశక్రైశ్శృతంజలమ్ ।
దద్యాద్గర్భేప్రచలితే ప్రదరేకుక్షిరుజ్యపి ॥

తా. వట్టివేరు అతివస తుంగముస్తెలు బూరుగబంక కొడిసెపాలవిత్తులు వీని కషాయముకాచి త్రాగిన గర్భచలనము ప్రదరము శూల హరించు.

## మూఢగర్భ లక్షణము.

శ్లో॥ మూఢఃకరోతిపవనః ఖలుమూఢగర్భంశూలంచ యోనిజఠ
రాదిషుమూత్రసంగమ్ ॥

తా. కుంఠితగతిగల వాతము యోని కడుపు అనువానియందు శూలను మూత్రప్రతిబంధమును గలుగంజేయుటవలన గర్భము బైలువెడలకుండు. ఇదియు మూఢ గర్భమనంబడు.

## మూఢగర్భగతి తద్భేదములు.

శ్లో॥ [ఆయుర్వేదే] భుగ్నోనిలేనవిగుణేనతత స్సగర్భసంఖ్యామతి
త్యబహుధానముపైతియోనిమ్ । ద్వారంనిరుధ్య శిరసాజఠ
రేణకశ్చిత్కశ్చిచ్ఛరీర పరివర్తిత కుబ్జదేహః । ఏకేనకశ్చిదపర
స్తుభుజద్వయేన తిర్యగ్గతో భవతి కశ్చినవాఙ్ముఖోన్యః ।
పార్శ్వాపవృత్తగతి రేతిత థైవకశ్చిదిత్యష్టధాగతిరియమ్మి పరా
చతుర్థా । సంకీలకఃప్రతిముఖఃపరిఘోధబీజ స్తేషూర్ధ్వబాహు
చరణైశ్శిరసాచయోనిమ్ । సందీచయోభవతికీలకవత్సకీలో

దృష్టైఃఖురైః ప్రతిఖురస్సహికాయసంగీ । గచ్ఛేచ్చభుజద్వయ
శిరాస్సచబీజకాభ్యోయోనౌస్థితస్సపరిఘః పరిఘేనతుల్యః ॥

తా. వికుణవాతమువలన గర్భము విపరీతమై అడ్డమై అనేకవిధములుగ యోని ద్వారముల జెందు. అది ముఖ్యముగ 8 విధంబులు యెట్లనిన—గర్భము యోనిముఖ మును మస్తకమువలన నడ్డగించుట వుదరముచే నడ్డగించుట శరీరము పొర్లుటచే సంకుచితదేహముగలదై యడ్డగించుట 1 భుజముతోగాని లేక 2 భుజములతోగాని యడ్డగించుట అడ్డమైన ముఖముగలదై యడ్డగించుట అధోముఖమై యడ్డగించుట పార్శ్వభంగమువలన మళ్ళినగతిగలదై యడ్డగించుట యీ ప్రకారముగ యోనిముఖ మునకు గర్భమువలన 8 విధములైన గతులుగలుగు (రెండవప్రకారముగ గతిగల గర్భమునువచించెద) గర్భమునకు సంకీలకము ప్రతిఖురము పరిఘము బీజము అన 4 విధములైన గతులుగలుగు. అందు గర్భము హస్తపాదముల పొడవుగ నునిచికొని శిరమును ముందుగ జేసికొని యోనిముఖమును జెంది గూటమువలె ద్వారమునందుండిన సంకీలకమనియు హస్తపాదములు గొరిసెలవలె బైట గనుపించుచు తక్కినశరీరము లోన నే దగులుకొనియుండిన ప్రతిఖురమని యు2భుజములు తలముందుగ గలదైనబీజక మనియుగడియవలె యోనిముఖము నంపడ్డపడియుండిన పరీఘమనియు తెలియవలయు

## అసాధ్యమూఢగర్భ లక్షణము.

శ్లో॥ అపవిద్ధశిరాయాతు శీతాంగీనిరపత్రపా ।
నీలోత్థతసిరాహంతి సాగర్భంసచతాంతథాః ॥

తా. మెడవిరిగినటుల నిలువకుండుట శరీరముచల్లగ నుండుట ప్రజ్ఞ లేకుండుట ప్రక్కలయందు పచ్చనివర్ణము లేక నీలవర్ణముగల సిరలువ్యాపించియుండుట యిట్టి లక్షణములుగల గర్భిణిగాని లేక దానియొక్క గర్భముగాని మృతిజెందునని దెలియవలయు.

## గర్భమూల లక్షణము.

శ్లో॥ గర్భాస్పందనమావీనాం ప్రణాశశ్శ్యావపాండుతా ।
భవేదుచ్ఛ్వాసపూతిత్వం శూనతాంతర్మృతేశిశౌ ॥

తా. గర్భము చలింపకుండుట ప్రసవవేదననిలుచుట వొడలు కపిలవర్ణముగ గాని లేక తెల్లవర్ణముగగాని యుండుట శ్వాసోచ్ఛ్వాసములయందు దుర్గంధము

వేసుట కడుపుబ్బుట ఈ లక్షణములవలన లోనగర్భము మృతిజెందినదని తెలియవలయు.

## గర్భమరణ హేతువు.

శ్లో॥ మానసాగంతు భీర్మాతు రుపతాపైః ప్రపీడితః ।
గర్భోవ్యాపద్యతేకుక్షౌ వ్యాధి భిశ్చప్రపీడితః ॥

తా. మాతృవుయొక్క మానసిక ఆగంతుక దుఃఖములవలనగాని లేక వ్యాధివలన గాని గర్భపీడగలిగి గర్భము గర్భాశయమున మృతిజెందు.

## అసాధ్యగర్భిణీ లక్షణము.

శ్లో॥ యోనిసంవరణాంసంగః కుక్షౌమక్కల్ల ఏవచ ।
హన్యుః స్త్రియంమూఢగర్భేయథోక్తాశ్చాప్యుపద్రవాః ॥

తా. వాయువుయొక్క సంబంధమువలన యోనిసంకోచం బగుట ప్రక్కలయందు గర్భము పసలుకొనియుండుట మక్కల్లశూల ఆక్షేపకము కాసము శ్వాసాద్యుపద్రవములు గలుగుట ఈలక్షణములుగల గర్భిణి మృతిజెందునని దెలియవలయు

## వికృతాకృత గర్భ లక్షణము.

శ్లో॥ ఋతుస్నాతాతుయానారీ స్వప్నే మైథునమాచరేత్ । ఆర్తవంవాయురాదాయకుక్షౌగర్భంకరోతిహి । మాసిమాసివివర్ధేత గర్భిణ్యాగర్భలక్షణమ్ । కలలంజాయతేతస్యావర్జితంపైతృకైర్గుణైః । సర్పవృశ్చికకూశ్మాండ వికృతాకృతయశ్చయే । గర్భాస్త్వేతేస్త్రియాశ్చైవజ్ఞేయాః పాపకృతోభృశమ్ ॥

తా. ఋతుస్నానముజేసిన దినమున మైథునము జేయబడినటుల స్వప్నముగాంచెడి స్త్రీయొక్క వాతము రక్తమునుగ్రహించి ప్రక్కలయందు గర్భము లె పిండాకృతిగంజేసి ప్రతిమాసమున వృద్ధింజెందించును సర్వగర్భలక్షణములు గలుగ జేయు. ఐనను దానియందు పితృగుణసంబంధములగు అస్థులు వెంట్రుకలు మొదలగునవి లేకుండుటజేసి సర్పము తేలు గుమ్మడికాయ మొదలగువానిలో నేదైన నొకదానియొక్క యాకారముగ బడిగనను. ఈ మాడాకృతులుగల గర్భము పాపకృతంబని దెలియందగు.

## యోనిసంవరణ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] వాతలాన్యన్నపానాని గ్రామ్యధర్మంప్రజాగరమ్। అత్యర్థంసేవమానాయాగర్భిణ్యాయోనిమార్గజః। మాతరిశ్వాప్రకుపితో యోనిద్వారస్యసంవృతిమ్। కురుతే రుద్ధమార్గత్వా పునరంతర్గతోనిలః। నిరుణద్ధ్యాశయద్వారం పీడయన్గర్భసంస్థితిమ్। నిరుద్ధవదనోచ్ఛ్వాస సోగర్భశ్చాశువిపద్యతే। ఉచ్ఛ్వాసరుద్ధహృదయాం నాశయత్యథగర్భిణీమ్। యోనిసంవరణం నామవ్యాధిమేతంప్రచక్షతే। అంతకప్రతిమంఘోరం నారభేత్తు చికిత్సితుమ్॥

తా. వాతకర అన్నపానములు మైథునము జాగరణము అనువానిని మిక్కుటముగ గర్భిణి సేవించుటవలన యోనిమార్గమునందు వాతము ప్రకోపించి యోనిమార్గమును సంకుచితముగజేసి దానివలన లోనంబ్రవేశించి గర్భాశయముఖము నడ్డించి పీడను గలుగంజేయును. దానివలన గర్భముయొక్క నోరు ముక్కు నడ్డగింప శ్వాసోచ్ఛ్వాసములు వెడలక గర్భము చేని లేక గర్భిణియొక్క శ్వాసోచ్ఛ్వాసములు బంధింపబడుటవలన గర్భిణి నేని నశింపంజేయును. ఈ రోగమును యోనిసంవరణమని వచించెదరు. ఇది యమునితో దుల్యంబగుటచే చికిత్సానర్హంబు.

## వాతసంకుచిత గర్భ లక్షణము.

శ్లో॥ వాతేనగర్భసంకోచా త్ప్రసూతిసమయేపివా।
గర్భంనజనయేన్నారీ తస్యాశ్శృణు చికిత్సితమ్।
కుట్టయేన్ముసలేనైషా కృత్వాధాన్యములూఖలే।
విషమంచాసనంయానం సేవేతప్రసవార్థినీ॥

తా. ప్రసవకాలము వాతమువలన గర్భము సంకోచమునుజెంది ప్రసవము గాకుండిన రోటిలోధాన్యమువేసి రోకలితో చాలకాలమువరకు దంచునటులం జేయవలయును. మఱియు విషమాసనమును విషమమైన యానమును సేవించునటులం జేయవలయును.

## కృష్ణాది లేపము

శ్లో॥ కృష్ణావచా చాపి జలేన పిష్ట్వా సైరండతైలా ఖలునాభిలేపాత్ । సుఖప్రసూతిం కురుతేంగనానాం నిపీడితానాం బహుభిః ప్రమాదైః ॥

తా. పిప్పళ్ళు వస వీనిని నుదకముతో నూరి ఆముదముగలిపి బొడ్డుపై లేపనముజేసిన కడు ప్రమాదమువలన మిక్కిలిటముగ పీడ జెందుచుండు స్త్రీ సుఖముగ ప్రసవించు.

## మాతులుంగాది లేపము.

శ్లో॥ మాతులుంగస్య మూలంతు మధుకంసంయుతం తథా ।
ఘృతేన సహితంపీత్వా సుఖంనారీ ప్రసూయతే ॥

తా. మాదీఫలపువేరు అతిమధురము అనువానిచూర్ణమును నేతిలో కలిపి త్రాగిన స్త్రీ సుఖముగ ప్రసవించు.

## ఇక్షుమూల బంధము

శ్లో॥ ఇక్షోరుత్తరమూలం నిజ తనుమానేన తంతునా బధ్వా ।
కటివిషయేగర్భవతీ సుఖేనసూతేవిలంబతేనాపి ॥

తా. చెఱుకుయొక్క ఉత్తరపుతట్టు వేరును తనంత పొడవుగల నూలుతో బంధించి నడుము నందు గట్టుకొనిన ఆలస్యములేక స్త్రీ సుఖముగ బ్రసవించు.

## సుఖ ప్రసవము.

శ్లో॥ తాళస్యచోత్తరంమూలం స్వప్రమాణేనతంతునా
బధ్వాకట్యాంతునియతం సుఖంనారీ ప్రసూయతే ॥

తా. తాటిచెట్టుయొక్క ఉత్తరపు తట్టు వేరును తనంత పొడవుగల నూలుతో బంధించి నడుమునందు గట్టికొనిన స్త్రీ సుఖముగ బ్రసవించు.

## అపామార్గ బంధము.

శ్లో॥ ప్రత్యక్పుష్పాఖ్యః పారిభద్రస్యయద్వా మూలం యద్వాకాజంఘాసముత్థమ్ । కట్యాంబద్ధంయోషితాం సత్ప్రసూతిం యోగాయుక్త్వాసంస్మృతం సాధుకుర్యాత్ ॥

తా. తెల్లయుత్తరేణువేరు వేపవేరు వెలుమసంధివేరు అనువానిలో దేనిని గాని శుభవారనక్షత్ర యోగములయందు దెచ్చి నడుమునందు గట్టుకొనిన స్త్రీ సుఖముగ బ్రసవించు.

## గర్భోద్ధరణ విధి.

శ్లో॥ [ఆయుర్వేదే] హస్తేనసర్పిషాక్తేన యోనేరంతర్గ తేనసా ।
మృతేతుగర్భేగర్భిణ్యా యోనౌశస్త్రం ప్రవేశయేత్ ।
శస్త్రశాస్త్రార్థనిపుణా లఘుహస్తా భయోజ్ఝితాః ॥

తా. గర్భమున శిశువు మృతిజెందిన శస్త్రశాస్త్రార్థనిపుణుడు హస్తలాఘవముగలవాడు నగువైద్యుడు హస్తమునకు నెయ్యినిబూసికొని భయవిహీనుడై శస్త్రమును యోనియందు బ్రవేశింపంజేసి మృతగర్భమును ఛేదింపవలయు.

శ్లో॥ సచేతనంతుశస్త్రేణ నకథంచచారయేత్ ।
సధార్యమాణోజననీ మాత్మానంచాపి మారయేత్ ।
నోపేక్షేతమృతంగర్భం ముహూర్తమపిపండితః ।
సచాశుజననీంహంతి ప్రభూతాన్నంయథా పశుం ॥

తా. గర్భస్థశిశువు జీవించియుండిన సాహసాదులచే ఛేదింపంజనదు, అటు ... శిశువు గర్భిణీ స్త్రీ నశించెదరు. మఱియు మృతగర్భమును బుద్ధిమంతుండగు వైద్యుడు క్షణకాలంబైన నుపేక్షింపంజనదు. ఏలయనిన మిక్కుటముగ పశువుచే భుజింపబడిన యన్నము జీర్ణము గాక దానింజంపు చందంబున శిశువు గర్భిణినిజంపు.

## మృతగర్భ ఛేదనవిధి.

శ్లో॥ యద్యదంగంహిగర్భస్య యోనౌసజ్జతితద్భిషక్ ।
సమ్యగ్వినిర్హ రేచ్ఛిత్వా రక్షేన్నారీంప్రయత్నతః ॥

తా. యోనిద్వారమున దగులుకొనియుండు మృతశిశువుయొక్క అంగముల జాగరూకుడై ఛేదించి వెలిపరచి స్త్రీని రక్షింపవలయు.

## సూతికారోగ నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] అంగమర్దోజ్వరః కంపః పిపాసాగురుగా త్రతా । శోథశ్శూలాతిసారౌచ సూతికారోగలక్షణం ।

మిథ్యోపచారాత్సంక్లేశా ద్విషమాజీర్ణభోజనాత్ । సూతి కాయాశ్చ యేరోగా జాయంతేదారుణాస్తుతే । వాయుః ప్రకుపితఃకుర్యా త్సంరుధ్యరుధిరంచ్యుతమ్ । సూత్యాస్తు హృచ్ఛిరోవస్తి శూలం మక్కల్ల సంజ్ఞకమ్। జ్వరాతిసారశో ఫాశ్చశూలానాహ బలక్షయాః । తంద్రారుచిప్రసేకాద్యాః కఫవాతామయోద్భవాః। కృచ్ఛ్రసాధ్యాహితేరోగాః క్షీణ మాంసజలాగ్నితః । తేసర్వేసూతికానామ్నా రోగాస్తేచా ప్యుపద్రవాః ॥

తా. ఒడలునొప్పి జ్వరము వణుకు దప్పి శరీరమునబలువు వాపు శూల విరేచనములు ఈ లక్షణములు గలిగిన సూతికా (బాలింత) రోగమని దెలియవలయు. మఱియు బాలింతయగు స్త్రీకి అన్యథోపచారములం జేయించుటవలనగాని క్లేశము వలనగాని లేక దుష్టాన్నపానములవలనగాని విషమాశనము అజీర్ణభోజనము మొదలగువాని సేవనవలనగాని కడుభయంకరమైన సూతికారోగముజనించు. మఱియు నీ సూతికారోగంబున వాతము ప్రకోపించి స్వస్థానమువలన విడువబడిన రక్తము నడ్డగించి బాలింతయొక్క హృదయము మస్తకము పొత్తికడుపు అను వానియందు శూలనుగలుగం జేయు. ఈ శూల మక్కల్లకమను పేరంబరగు. మఱియు జ్వరము విరేచనములు వాపు శూల కడుపుబ్బరము అశక్తత కఫవాత రోగములవలన గలిగిన తంద్ర అన్నద్వేషము నోటిలో నీరూరుట యిట్టి వికారంబులుగలిగిన కఫవాతములవలన గలిగిన సూతికారోగమని దెలియవలయు. అందు మాంసము బలము అగ్ని క్షీణించియుండిన కష్టసాధ్యము. ఇవి యన్నియు సూతికారోగములనియు సూతికోపద్రవములనియు దెలియందగు.

## సూతికారోగ సామాన్య చికిత్స

శ్లో॥ సూతికారోగశాంత్యర్థం కుర్యాద్వాతహరీంక్రియామ్ ॥

తా. సూతికారోగము శమించుటకై వాతనాశకర చికిత్సం జేయవలయు.

## అమృతాది కషాయము.

శ్లో॥ అమృతానాగరసహచరభద్రోత్కటపంచమూలకంజలదః ।
శృతశీతంమధుయుక్తంశమయత్య చిరేణసూతికాతంకమ్ ॥

తా. తిప్పతీగ శొంఠి ముఱుగోరింట వావిలి లవంగపట్ట పంచమూలములు తుంగముస్తెలు వీనిని కషాయముకాచి చల్లార్చి యొకింత తేనెగలిపి త్రాగిన తత్-క్షణమున సూతికారోగము హరించు.

## దేవదార్వాది కషాయము.

శ్లో॥ [సింధూరమణిదర్పణే] దేవదారు వచాకుష్ఠం పిప్పలీ విశ్వభేషజమ్ । కట్ఫలంముస్తభూనింబ తిక్తాధాన్యహరీతకీ ॥ గజకృష్ణాచ దుస్స్పర్శా గోక్షురం ధన్వయాసకమ్ । బృహత్యతివిషాఛిన్నా కర్కటం కృష్ణజీరకమ్ । సమభాగాన్వితై రేతైసింధురామఠసంయుతైః । క్వాథమష్టావశేషంతుప్రసూతాం పాయయేత్ స్త్రియమ్ । శూలకాసజ్వర శ్వాసమూర్ఛాకంపశిరో ర్తిభిః । యుక్తంప్రలాపతృడ్దాహతంద్రాతిసారశాంతిభిః । నిహంతిసూతికారోగం వాతపిత్తకఫాన్వితమ్ ॥

తా. దేవదారు వస చెంగల్వకోష్టు పిప్పళ్ళు శొంఠి గుమ్మడుతేకు తుంగముస్తెలు నేలవేము కటుకరోహిణి ధనియాలు కరక్కాయ గజపిప్పలి రేగటిదూలపల్లేరు దురదగొండి నేలములక అతివస తిప్పతీగె కర్కాటకశృంగి నల్లజీలకఱ్ఱ వీనిని సమభాగములుగ దంచి అష్టావశేషముగ కషాయము కాచి అందు సైంధవలవణము నేతిలో పొంగించబడిన యింగువ గలిపి బాలింత త్రాగిన శూల కాసము జ్వరము శ్వాసము మూర్ఛ వణుకు తలనొప్పి వదరుట దప్పి దాహము తంద్ర అతిసారము వాంతులు అనువానితో గూడియుండు సూతికారోగమును త్రిదోషజనిత సూతికారోగమును హరింపంజేయు.

## వజ్రకాంజికము.

శ్లో॥ పిప్పలీపిప్పలీమూలం చవ్యంశుంఠీయవానికా । జీరకేద్వేహరిద్రేచబిడాసౌవర్చలంతథా । ఏతై రేనౌషధైః పిష్టైరారనాళం విపాతయేత్ । ఆమవాత హరంవృష్యం కఫఘ్నం వహ్నిదీపనమ్ । వజ్రకం కాంజికంనామ స్త్రీణామగ్ని వివర్ధనమ్ । సూతికారోగశమనం శూలఘ్నం క్షీరవర్ధనమ్ ॥

తా. పిప్పలి మోడి చెవ్యము శొంఠి వోమము జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ పసపు మ్రానిపసపు బిడాలవణము సౌవర్చలవణము వీనిని దంచి సమముగ కలిపి కాచిన త్రాగిన ఆమవాతము కఫము బాలింతరోగము శూల వీనిని హరింపంజేయుటయేగాక వీర్యవృద్ధి అగ్నిదీపనమును స్తన్యములయందు పాలయొక్క వృద్ధిని గలుగంజేయు.

## గర్భవిలాస రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసగంధక తుత్థంచ త్ర్యహంజంబీరమర్దితమ్ ।
త్రిర్భావితం త్రికటునా దేయం గుంజా చతుష్టయమ్ ।
గర్భిణ్యా శ్శూలవిష్టంభ జ్వరా జీర్ణేషు కేవలమ్।

తా. రసము గంధకము మైలుతుత్తము వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో 3 దినములు మర్దించి పిదప త్రికటుక కషాయముతో 3 భావనలుజేసి 4 గురిగింజలయెత్తును సేవించిన గర్భిణీశూల విష్టంభము జ్వరము అజీర్ణము హరించు.

## గర్భచింతామణి రసము.

శ్లో॥ జాతీఫలంటంకణంచవ్యోషంద్వై త్యేంద్రర క్తకమ్ । తచ్చూర్ణం సమభాగేన మర్దితం ప్రహరద్వయమ్ । జంబీర రసయోగేన వటీంకుర్యా ద్విచక్షణః । గుంజాద్వయం ప్రమాణేన కృత్వా వైద్యః ప్రయత్నతః ఆర్ద్రకస్య రసేనైవ భక్షయే దుష్ణ వారిణా। నిహంతి సూతికారోగం భాస్కర స్తిమిరంయథా॥

తా. జాజికాయ వెలిగారము త్రికటుకములు బలురక్కసి కొడిశె కేంకుమ పువ్వు వీనిచూర్ణమును సమభాగములుగ ఖల్వములోనునిచి 2 ఝాములు నిమ్మపండ్ల రసముతోమర్దించి 2 గురిగింజలంత మాత్రలుజేసి అల్లపురసముతోగాని లేక వుష్ణోదకాను పానముతోగాని సేవించిన "సూర్యుడుదయించుటచే నంధకారము తొలంగునట్లు" సూతికారోగము దొలగు.

శ్లో॥ [మతాంతరే] రసంతాళం తథాలోహం ప్రత్యేకం కర్షమాత్రకమ్ । కర్ష త్రయంతథాచాభ్రంకర్పూరంవంగతా మ్రకమ్ జాతీఫలంతథావ్యోషం గోక్షురంచశతావరీ । బలాతిబలయో

ర్యాలం ప్రత్యేకం తోలకంశుభమ్ । వారిణా వటికాకార్యా ద్విగుంజఫలమానతః । సన్నిపాతంనిహంత్యాశు స్త్రీణాంచైవ విశేషతః । గర్భిణ్యాజ్వరదాహంచ ప్రదరంసూతికామయమ్

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన తాళకము లోహభస్మము యివి దినుసుకు కర్ష ప్రమాణము అభ్రకభస్మము 3 కర్షములు కర్పూరము వంగభస్మము తామ్రభస్మము జాజికాయ త్రికటుకములు పల్లేరు చల్లపిల్లిగడ్డ ముత్తవపులగపువేరు పెద్దముత్తవపులగపువేరు యివి దినుసుకు తులప్రమాణము యిట్టి వీనినెల్ల ఖల్వములోనునిచి పుష్పోదకముతో మర్దించి 2 గురిగింజలంత మాత్రలుజేసి సేవించినవిశేషముగ స్త్రీలయొక్క సన్నిపాతము గర్భిణీ స్త్రీజ్వరదాహములు ప్రదరము సూతికారోగము హరించు.

## బృహద్గర్భ చింతామణి రసము.

శ్లో॥ [మాధవనిదానే] సూతంగంధం తథాస్వర్ణం లోహం రజతమాక్షికమ్ । హరితాళంవంగభస్మాన్యభ్రకంసమభాగకమ్। భావనాఖలుదాతవ్యా రసైరేషాంపృథక్పృథక్ । బ్రాహ్మీ వాసా భృంగరాజ పర్పటందశమూలకమ్ । సప్తధాభావయే ద్వైద్యో గుంజామానాం వటీంచరేత్ । గర్భ చింతామణి రయంపూర్వవత్కథితాగుణాః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము స్వర్ణభస్మము లోహభస్మము రజతభస్మము స్వర్ణమాక్షికము శుద్ధిజేసిన తాళకము తగరభస్మము అభ్రకభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మండూకబ్రహ్మి అడ్డసరము గుంటగలగర పర్పాటకము దశమూలములు అనువానిరసములలో ప్రతిదానిచే నేడేసి మార్లుభావన చేసి గురిగింజలంత మాత్రలుజేసి సేవించిన పూర్వోక్త గర్భచింతామణిరసములో జెప్పంబడిన రోగములు హరింపంజేయు.

## గర్భవినోద రసము.

శ్లో॥ త్రిభాగం త్రికటుందేయం చతుర్భాగంచ హింగుళమ్ । జాతీకోశంలవంగంచప్రత్యేకంచ త్రికర్షమ్ । సువర్ణమాక్షికంచైవ పలార్ధం ప్రక్షిపేద్బుధః। జలేనమర్దయిత్వాథ చణమాత్రా వటీకృతా । నిహంతిగర్భిణీరోగం భాస్కరస్తిమిరంయథా ॥

తా. త్రికటుకములు 3 భాగములు శుద్ధిజేసిన యింగిలీకము 4 భాగములు జాజిమొగ్గలు లవంగములు యివి దినుసుకు 4 కర్షములు శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము ½ పలము యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి వుష్ణోదకముతో మర్దించి సెనగగింజ యంత మాత్రలుజేసి సేవించిన "సూర్యుడుదయించుటచే నంధకారము దొలంగు భంగి" గర్భిణీ రోగము హరించు.

## బృహత్సూతి వినోద రసము.

శ్లో॥ [నిత్యనాధీయే] శుంఠ్యాభాగోభవేదేకో ద్వౌభాగామరిచస్యచ । పిప్పల్యాశ్చ త్రిభాగంస్యా దర్ధభాగంచ రోమకమ్ । జాతికోశస్యభాగౌద్వౌ ద్వౌభాగౌతుత్థకస్యచ । సింధువారజలేనైవ మర్దయే దేకయామతః । మధునా సహభోక్తవ్యం సూతికా తంకనాశనమ్ ॥

తా. శొంఠి 1 భాగము మిరియాలు 2 భాగములు పిప్పలి 3 భాగములు సౌవర్చలవణము ½ భాగము జాజిమొగ్గలు 2 భాగములు శుద్ధిజేసిన మైలుతుత్తము 2 భాగములు యిటుల వీనిని ఖల్వములోనునిచి వావిలాకురసముతో 1 జాము మర్దించి మాత్రలుజేసి తేనెతో సేవించిన సూతికారోగము హరించు.

## సూతికారి రసము.

శ్లో॥ రసగంధక కృష్ణాభ్రం తదరం మృతతామ్రకమ్। చూర్ణితం మర్దయేద్యత్నా ద్భేకపర్ణీరసేనచ । ఛాయాశుష్కావటీకార్యా ద్విగుంజాఫలమానతః । క్షీరత్రికటునాయుక్తా సూతికాతంకనాశినీ । జ్వరంతృష్ణారుచీశోథం హంత్యసాధ్యంనసంశయః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన కృష్ణాభ్రకము యివి దినుసు కొక్కొకభాగము తామ్రభస్మము ½ భాగము యిటుల వీనిని చూర్ణముజేసి ఖల్వములోనునిచి మండూకపర్ణీరసముతో మర్దించి గురిగింజలంత మాత్రలుజేసి నీడ నెండించి యందొక దానిని త్రికటుకముల పాలతోనూరి యీ యనుపానము తోడ సేవించిన అసాధ్యమైన సూతికారోగము జ్వరము దప్పి అరుచి శోఫ వీనిని నిశ్చయముగ హరింపంజేయు.

## సూతికాహార రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] లవంగంరసగంధౌచయవక్షారంతథాభ్రకమ్ । లోహంతామ్రంసోమకంచ పలమానంసమాహరేత్ । జాతీఫలం కేసరామ్ల వరాంగై లేయముస్తకమ్ । ధాతకీంద్రయవా పాఠా శృంగీ బిల్వంచవాలకమ్ । కర్ష ప్రమాణంసంచూర్ణ్య సర్వ మేకత్రకారయేత్ । బదరాస్థ్యప్రమాణేన వటికాం కారయేత్సుధీః । గంధాలికా పత్రరసై రనుపానం ప్రదాపయేత్ । సర్వాతిసార శమనం సర్వశూల నివారణమ్ । సూతికా శోఫపాండుఘ్నం సర్వజ్వర నివారణమ్ ॥

తా. లవంగములు శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము యవక్షారము అభ్రకభస్మము లోహభస్మము తామ్రభస్మము గుమ్మడు యివి దినుసు కొక్కొక ఫలము జాజికాయ మాదీఫలము లవంగపుచెక్క కూతురుబుడమ తుంగముస్తెలు ఆరెపువ్వు కొడిసెపాల శిరుబొద్ది కర్కాటకశృంగి మారేడువేరు కురువేరు యివి దినుసుకు కర్ష ప్రమాణము యిటుల వీనినెల్ల నేకముజేసి వృష్ణోదకముతో నూరి రేగుగింజంత మాత్రలుజేసి తృణపుంకుమరసముతో సేవించిన సర్వాతిసారములు సమస్త శూలలు బాలింతరోగము వాపు పాండువు సర్వజ్వరములు వీనిని హరింపంజేయు.

## స్తనరోగ నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] సక్షీరా వాప్యదుగ్ధావా దోషఃప్రాప్య స్తనౌస్త్రియః । ప్రదూష్యమాంస రుధిరే స్తనరోగాయ కల్పతే । పంచానామపి తేషాంహి రక్తజం విద్రధింవినా । లక్షణాని సమానాని బాహ్యావిద్రధి లక్షణైః॥

తా. వాతాదిదోషంబులు దుష్టంబులై గర్భిణికిగాని లేక ప్రసవించిన స్త్రీకిగాని స్తన్యములయందుజేరి వానియందు మాంసరక్తములంజెరచి వాతపిత్త కఫసన్నిపాత ఆగంతుకభేదమువలన 5 విధములైన స్తన్యరోగముల గలుగంజేయు. ఇవి రక్తవిద్రధిలక్షణ హీనంబులై తక్కినవి బాహ్యవిద్రధిలక్షణ యుక్తంబులై యుండు.

## స్తనరోగ చికిత్స.

శ్లో॥ లేసోపిశాల మూలేన హంతి పీడాం స్తనోత్థితామ్ ॥

తా. పాపరవేరును గంధము దీసిగాని (లేక అడవిప్రత్తిగింజలనేతి లేక సొరకాయ విత్తులనేని గోధుమగంజితోనూరిగాని) లేపనము జేసిన స్తన్యసంబంధమైన పీడ హరించు.

వాతాది దుష్టదుగ్ధ లక్షణము.

శ్లో॥ కషాయం సలిలప్లావి స్తన్యమారుత దూషితమ్ । కట్వమ్ల లవణంపీత రాజమత్పి త్తసంజ్ఞితమ్ । కఫదుష్టం ఘనంతోయే నిమజ్జతి సుపిచ్ఛిలమ్ । ద్విలింగం ద్వంద్వజంవిద్యా త్సర్వ లిఙ్గం త్రిదోషజమ్ ॥

తా. ఒగరుగ నీళ్ళలోవేసిన తేలునదిగ నుండుపాలు వాతదుష్టమనియు కారముగ పుల్లగ వుప్పగ నైన పచ్చనిరేఖలుగలదిగ నుండుపాలు పిత్తదుష్టమనియు గట్టిగ నీళ్ళలోవేసిన మునుగునదిగ బంకగనుండుపాలు కఫదుష్టమనియు 2 దోష లక్షణములంగలపాలు ద్వంద్వ దుష్టమనియు 3 దోషలక్షణములం గలది త్రిదోష దుష్టమనియు తెలియవలయు.

వాతరోగ స్తన్య చికిత్స.

శ్లో॥ జాతేవాతాత్మకేస్తన్యే దశమూలం త్ర్యహంపిబేత్ ।
వాతవ్యాధి హరంసర్పిః సిత్వామ్సు నిరేచయేత్ ॥

తా. వాతదోషమువలన స్తన్యము దుష్టంబై యుండిన 3 దినములు దశమూల కషాయమును పానము జేయించుటయేగాక వాతహర ఘృతపానమువలన లఘువుగ విరేచనంబును జేయించవలయు.

శుద్ధదుగ్ధ లక్షణము

శ్లో॥ అదుష్టం చాంబునిక్షి ప్త మేకీ భవతిపాండురమ్
మధురంచా వివర్ణంచ తత్ప్రసన్నం వినిర్దిశేత్ ॥

తా. పాలను వుదకములోవేసిన నీళ్ళతోగలసి తెల్లగ మధురరసముగలదినై వివర్ణము జెందకుండిన శుద్ధమైనదని తెలియవలయు.

కఫదుష్ట స్తన్య చికిత్స.

శ్లో॥ కఫేదుష్టే ఘృతంపేయం యష్టీసైంధవసంయుతమ్ ।

రామపుష్పైస్త నాలింపే చ్ఛిశోశ్చ దశనచ్ఛదౌ ।
సుఖమేవం నమేద్బాలః కఫకోపశ్చ శామ్యతి ॥

తా. కఫమువలన స్తన్యము దుష్టంబైన అతిమధురచూర్ణమును సైంధవలవణ చూర్ణమును నేతిలోగలిపి తాగించుటయేగాక అశోకపుష్పమునునూరి స్తన్యముల యందును శిశువుయొక్క పెదవియందును లేపనము జేసిన శిశువునకు సుఖముగ వమనంబై కఫప్రకోపము శమించు.

తత్త స్తన్య దుష్ట చికిత్స.

శ్లో॥ పిత్తేదుష్టే మృతాభీరు పటోలం నింబచందనమ్ ।
ధాత్రీంకుమారంచపిబేత్క్వాథయిత్వాసశర్కరమ్ ॥

తా. పిత్తమువలన స్తన్యము దుష్టంబైన తిప్పతీగె పిల్లిపీచర చేదుపొట్ల వేప చందనము అనువానిని కషాయముకాచి అందు శర్కరగలిపి స్త్రీ శిశువు లిరువురికి పానము జేయించవలయు.

స్తన్యజనన విధి.

శ్లో॥ భూమికూశ్మాండ మూలస్య క్షీరపిష్ట స్యయోరసః ।
పిబేత్సశర్కరం తస్యాః క్షీరంబహు వివర్ధతే ॥

తా. నేలగుమ్మడుగడ్డను పాలతోనూరి దాని రసమును పిండికొని అందు శర్కరగలిపి త్రాగిన పాలు వృద్ధింకెందు.

శతావారీ పానము.

శ్లో॥ శతావరీ క్షీరపిష్టా పీతా స్తన్య వివర్ధినీ ।
కవోష్ణం కణయాపీతం క్షీరంక్షీర వివర్ధనమ్ ॥

తా. పిల్లిపీచరవేళ్ళను పాలతోనూరి త్రాగిన లేక మందోష్ణముగనుండు పాలలో పిప్పలిచూర్ణముగలిపి త్రాగినను పాలువృద్ధిజెందు.

సోమరోగ నిదానము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] శోకాచ్ఛ్రమాద్వైషనితాతిసంగా ద్గరేణ చాపః క్షుభితాస్రవంతి । దేహస్థితావస్తి ముఖంప్రపన్నా

హ్యరత్కరాని గ్గతగంధవర్ణాః । శీతాశ్శితా స్తేవ ముఖోష్ఠ తాలు శోషశ్శిరశ్శూల మశక్తతాచ । జిహ్వావిలేపో విపి ధైశ్చభక్ష్యై రతృప్తితామూర్ఛన జృంభతృష్ణాః । భవే ద్గేహేక్షమా దేహిని శ్చేష్టః కష్ట ఆమయః । సోమరోగమితి ప్రాహుః దేహసారక్షయంన్నృణామ్ ॥

తా. శోకము శ్రమ అతిమైథునము విషదోషము అనువానివలన శరీరమంతట వ్యాపించియుండు నుదకము క్షోభము జెంది స్రవించి వస్తిగతంబై వేదనతోగూడి గంధవర్ణ రహితంబై నిర్మలమై చల్లగ మూత్రద్వారమువలన వెలువెడలు. అందు ముఖము పెదవిదవడలు యెండుట తలలో నొదులతో బాడుచునటులనొచ్చుట సత్వము లేకుండుట నాలుక బంకగనుండుట పలువిధభక్ష్యముల సేవించినను తృప్తి లేకుండుట మూర్ఛ ఆవులింతలు దప్పిగలుగుట శరీరమున నోర్పులేకుండుట చేష్టా విహీనుడగుట అను నీ లక్షణంబులు గలుగు. ఇదియ సోమరోగ మనంబడు. ఇది కష్టసాధ్యము. దీనియందు శరీరమునందలి బలము క్షయించు.

సోమరోగ చికిత్స.

శ్లో॥ [భేషజకల్పే] ధాత్రీఫలస్య స్వరసేనరంభా ఫలంమధూకం ససితం పిబేద్వా । పీతంమషూకం మధుకంవిదారి మాషంచ దుగ్ధై స్సహసోమరోగీ ॥

తా. ఉసిరికపండు రసములో అరటిపండు యిప్పపువ్వు పంచదారగలిపి త్రాగినను లేక యిప్పపువ్వు యష్టిమధుకము నేలగుమ్మడు అనువానియొక్క మాష ప్రమాణ చూర్ణమును పాలలోగలిపి త్రాగినను సోమరోగము హరించు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] ఉశీరంవాలుకాపత్రం కుష్ఠంధాత్రీచమాంసలీ । ఏలాచరేణుకాద్రాక్షా కుంకుమంనాగకేసరమ్ । పద్మకేసర కందంచ కర్పూరం చందనద్వయమ్ । వ్యోషామధూకం లాజాశ్చహ్యశ్వగంధాశతావరీ । గోక్షురం కర్కటాఖ్యంచ జాతీతక్కోలమేవచ । ఏతాని సమభాగాని ద్విగుణా మ్బత శర్కరా । మధ్వాజ్య సితయాయుక్తం భక్షయే త్ప్రాత

రుత్థితః । క్షయంచ రక్తపిత్తంచ పాదదాహ మసృగ్దరమ్ ।
మూత్రాఘాతంమూత్రదోషం కృచ్ఛ్రింవై వాతకుండలీమ్ ।
వినిహన్యాత్ప్రమేహంచసోమరోగంహాలీమకమ్ । సర్వాంగ
దాహ శమనం రక్తస్రావా మయేషుచ ॥

తా. వట్టివేరు కురువేరు ఆకుపత్రిక చెంగల్వకోష్టు పుసిరికవరుగు నేలతాటి గడ్డలు యేలకులు రేణుకలు ద్రాక్ష కుంకుమపువ్వు నాగకేసరములు తామరకేసరములు తామరగడ్డలు కర్పూరము చందనము రక్తచందనము త్రికటుకములు యిప్పపువ్వు పేలాలు పెన్నేరుగడ్డ పిల్లిపీచర పల్లేరు కర్కాటకశృంగి జాజిమొగ్గలు తక్కోలపుట్లు వీనిని సమభాగములుగ గ్రహించి రెండింతలు తిప్పసత్తు గలిపి తేనె నెయ్యి పంచదార అనువాని యనుపానముతోడ ప్రాతఃకాలమున సేవించిన క్షయమురక్త పిత్తము కాళ్ళుమంటుట అసృగ్దరము మూత్రఘాతము మూత్రదోషము మూత్రకృచ్ఛ్రము వాతకుండలి ప్రమేహము సోమరోగము హాలీమకము సర్వాంగి తాపము రక్తస్రావరోగములు వీనిని హరింపంజేయు.

## గర్భిణీరోగములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే]శాలయష్షష్టి కాముద్గ గోధూమా లాజస
క్తవః । నవనీతం ఘృతంక్షీరం రసాస్స మధుశర్కరాః । పన
సంకొదళంధాత్రీద్రాక్షామ్లంస్వాదుశీతలమ్ । కస్తూరీచందనం
మాలా కర్పూరంమధులేపనమ్ । చంద్రికాస్నానమభ్యంగో
మృదు శయ్యాహిమానిలాః । సంతర్పణంప్రియాశ్లేషో విహా
రాశ్చ మనోరమాః । ప్రియంకరం చాన్నపానం గర్భిణీనాం
హితంసదా ॥

తా. 60 దినములకు ఫలించెడి వడ్లబియ్యము పెసలు గోధుమలు పేలపిండి వెన్న నెయ్యి పాలు తేనె పంచదార అనువానితోగూడియుండు రసములు పనసపండు అరటిపండు ఉసిరికపండు పుల్లద్రాక్షపండు తీపుగలపదార్థములు శీతకరపదార్థములు కస్తూరి చందనము పుష్పమాల కర్పూరము తేనె లేపనము వెన్నెల స్నానము అభ్యంజనము మృదువుగనుండు పడక చల్లనిగాలి తృప్తికరమైన యన్నము ప్రియాలింగనము మనోహరమైన విహారము ప్రియమైన యన్నపానములు ఇవి గర్భిణీరోగములయం దెల్లపుడు హితకరంబులు.

## గర్భిణీరోగములయందపథ్యము

శ్లో॥ స్వేదనం వమనంక్షారం కదన్నం విషమాశనమ్ ।
అపథ్య మిదముద్దిష్టం గర్భిణీనాం మహర్షిభిః ।
సూతికాఖ్యేషు రోగేషు వాతశ్లేష్మోద్భవేషుచ ॥
తత్రరోగాను కల్పేన పథ్యాపథ్యా వినిర్దిశేత్ ॥

తా. వేడిగా నొత్తడమునిచ్చుట వాంతి క్షారము కుత్సితాన్నము విషమాశనము ఇవి గర్భిణీస్త్రీల కపథ్యకరంబులు. మఱియు సూతికారోగము వాతకఫాత్మక రోగము అనువానియందు యుక్తానుసారముగ పథ్యము నొసంగవలయు.

ఇది శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కౌరాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్య సహితే
అసృగ్దర అస్థిస్రావ యోనికంద గర్భపాతన
మూఢగర్భ యోనిసంకుచిత సూచికాస్తన
సోమరోగ నిదాన తల్లక్షణ తత్సాధ్యా
సాధ్య తచ్చికిత్సానుపాన పథ్యా
పథ్య లక్షణ యుక్తం
షోడశ ప్రకరణమ్.



శ్రీరస్తు.

# బసవరాజీయము.

## ఆంధ్ర తాత్పర్యము.

## — సప్తదశ ప్రకరణము. —

శ్లో॥ వీరభద్రం విరూపాక్షం నారసింహ మదాంతకమ్ ।
అహిభూషం శుభాకారం భజేహం వీరశేఖరమ్ ॥

తా. విషమదృష్టిగలవాడు నృసింహునిమదము నణంచినవాఁడు సర్పములే భూషణముగగలవాడు మంగళకరమైన యాకారముగలవాడు శూరాగ్రగణ్యుడు నగు వీరభద్రుని నేను భజించెద.

శ్లో॥ శ్రీ నీలకంఠవంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని పేరొందఁబడిన నేను వైద్యగ్రంథములలో కడు శ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథముయొక్క సప్తదశ ప్రకరణమును వచింపుచున్నాడను.

### నేత్రరోగ సంఖ్య.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] కృష్ణేపంచసన్వై వసంధిషుదశ త్రీణ్యాత్రశుక్లే
ఖిలే । జాతాష్షోడశవర్త్మజాః ఖలుచతుర్వింశా స్తథావిం
శతిః। సప్తాతంతుయుతాశ్చతుర్నవతిరిత్యక్ష్ణోర శేషామయాః।
యో వేత్తిన్యవహర్తుమేషవిదుషా మగ్రేసమర్థోభవేత్ ॥

తా. నేత్రములయందు జనించురోగములు 94 విధంబులు అందు కంటినల్ల గ్రుడ్డునందు 5 సంధులయందు 9 తెల్లగుడ్డునందు 18 నేత్రపుటలయందంతట 16 కంటి రెప్పలయందు 24 నేత్రనాడులయందు 27 ఈ 94 విధంబులు వీనిభేదములనెఱింగి చికిత్సించునాతడే వైద్యులలో శ్రేష్ఠుండు.

## అభిష్యంద భేదము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] వాతపిత్తకఫాద్రక్తా దభిష్యందశ్చతుర్విధః ।
తత్ర తానుచితైః పత్రై ర్బధ్నీయా త్త్రిదినంభిషక్ ॥

తా. * అభిష్యందము వాత పిత్త శ్లేష్మరక్త భేదములవలన 4 విధంబులు. (అందు వాతాభిష్యందమున నేత్రము లెఱ్ఱనై నీరుగారుచు పోట్లతోఁగూడియుండు పిత్తాభిష్యందమున కన్ను లెఱ్ఱనై కడుపుమంటలతోడంగూడి మెరమెరలాడుచుండు శ్లేష్మాభిష్యందమున కండ్లు పుసిగట్టి దురదతోఁ గూడియుండు రక్తాభిష్యందమున కండ్లలోఁ దుర్మాంసము బెరిగియుండు వానియందు తొలుత క్రొంను గాకునుగట్టి పిదప ఉమ్మెత్తాకును తమలపాకును మూడుదినములు గట్టిన నేత్రాభిష్యందము హరించు.

## నేత్రరోగ నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] ఉష్ణాభితప్తస్య జలప్రవేశా దూరేక్షణా
త్స్వప్నవిపర్యయాచ్చ। స్వేదాత్రజోధూమ నిషేవణాచ్ఛ
ర్దేర్విఘాతా ద్వమనాతియోగాత్ । ద్రవాన్నపానాతి
నిషేవణాచ్చ విణ్మూత్రవాత క్రమనిగ్రహాచ్చ । ప్రసక్త
సంరోదన శోకకోపా చ్ఛిరోభిఘాతా దతిమద్యపానాత్ ।
తథాఋతూనాంచ విపర్యయేణ క్లేశాభిఘాతా దతిమైథు
నాచ్చ । బాష్పగ్రహాత్సూక్ష్మ నిరీక్షణాచ్చ నేత్రేవికారా
ఞ్జనయంతిదోషాః॥

తా. ఎండలోఁ నొడలును గాచికొనినపిదప శీతోదకములోఁ బ్రవేశించుటవలన (అనగా శరీరము చలివలన వ్యాప్తంబై శరీరమునందలి యుష్ణ మూర్ధ్వగతంబై నేత్రములయందలి తేజస్సు పరాభవపరచి నేత్రరోగమును గలుగంజేయుననుట) దూరముగనుండు పదార్థములంజూచుట స్వప్నవిపర్యయము (అనగా పగలు నిద్రించుట రాత్రులయందు జాగరణము సేయుట) కండ్లయం దావిరిదగులుట లేక చెమటపట్టి కంటిలోనే జీర్ణంబగుట కంటిలోఁ దుమ్ముపడి యందునిలిచియుండుట పొగదగులుట వాంతి వేగమునడ్డగించుట అధికముగ వమనంబులగుట ద్రవముగనుండు నన్నపానాదుల మిక్కుటముగ సేవించుట మల మూత్ర అపానవాత వేగము నడ్డగించుట

* అక్షిష్యందమున నేత్రముల నీరుగారుట.

ఎల్లప్పుడు కన్నీరువిడుచుట దుఃఖించుట కోపము జెందుట తలపై యభిఘాతమును జెందుట మిక్కుటముగ మద్యపానము సేయుట శీతకాలమున ఉష్ణము ఉష్ణకాలమున శీతలముగలుగుట క్లేశము (అనగా మనోదుఃఖమునుగాని లేక కామాదిదుఃఖములనుగాని) జెందుట అభిఘాతము (అనగా పీడనుగాని లేక దుఃఖమునుగాని) జెందుట మిక్కుటముగ మైధునము సేయుటకంటినీరుయొక్క వేగమునడ్డగించుట సూక్ష్మపదార్థములజూచుట ఈ కారణములవలన వాతాదిదోషములు ప్రకోపించి నేత్రరోగములను గలుగంజేయుచున్నవి. మఱియు (సుశ్రుతే॥ "సిరానుసారిభిర్దోషైర్విగుణై రూర్ధ్వమాశ్రితైః । జాయంతే నేత్రభాగేషు రోగాః పరమదారుణాః"॥ అనగా ప్రకోపించిన వాతాదిదోషములు కంటిసిరలయందు వ్యాపించి వాత పిత్త కఫ రక్త సన్నిపాత ఆగంతుక భేదములవలన 76 విధంబులగు భయంకరమైన నేత్రరోగముల గలుగంజేయుననుట సుశ్రుతాచార్యుని యొక్క మతము.)

## అభిష్యంద రోగములు.

శ్లో॥ వాతాత్పిత్తా త్కఫాద్రక్తా దభిష్యంద శ్చతుర్విధః ।
ప్రాయేణ జాయతేఘోర స్సర్వనేత్రా మయాకరః ॥

తా. అభిష్యందరోగము వాత పిత్త కఫ రక్త భేదములవలన 4 విధంబులు వానివేదనను సహించుట కడునశక్యము. ఇది అధిమంథాది సర్వనేత్రరోగములకు నుత్పత్తిస్థానంబు (ఇక సర్వనేత్రములయందు జనించు రోగముల వచించెద.)

## వాతాభిష్యంద లక్షణము.

శ్లో॥ నిస్తోదన స్తంభన రోమహర్షసంఘర్ష పారుష్యశిరోభితాపాః ।
విశుష్కభావశ్శిశిరాశ్రుతా చ వాతాభిపన్నే నయనే భవంతి ॥

తా. సూదులతో బొడుచునటుల పీడగలుగుట నేత్రములు జడముగనుండుట శరీరమున రోమాంచముగలుగుట కంటిరెప్ప లొరసికొనుట కఠినముగనుండుట శిరము వేడిగనుండుట నేత్రము ఎండియుండుట నేత్రములయందు చల్లనినీరు గారుట ఈ లక్షణములుగలది వాతాభిష్యందమని దెలియవలయు.

## పిత్తాభిష్యంద లక్షణము.

శ్లో॥ దాహప్రపాకౌశిశిరాభినందో ధూమాయనంబాష్పసముచ్ఛ్రి
యశ్చ।ఉష్ణాశ్రుతాపీతకనేత్రతాచ పిత్తాభిపన్నేనయనేభవన్తి॥

తా మిక్కుటముగ మండుట నేత్రములచుట్టు నురుపులు జనించుట నేత్రములయందు శీతపదార్థమునుబూయుటయం దిచ్ఛగలుగుట నేత్రముల పొగవెడలుట నేత్రములయందెల్లపుడు వొకింతవేడిగ స్రవించుట నేత్రములు పచ్చగనుండుట ఈ లక్షణములుగలది పిత్తాభిష్యందమని దెలియవలయు.

కఫజాభిష్యంద లక్షణము.

శ్లో॥ ఉష్ణాభినందోగురుతాక్షిశోథః కండూపదేహోవతిశీతతాచ ।
స్రావోబహుః పిచ్ఛిలయేవచాపి కఫాభిపన్నే నయనేభవంతి ॥

తా. కండ్ల కావిరి నివ్వవలయునవెడియిచ్ఛ జడత్వము నేత్రములయందు వాపు దురదగలుగుట నేత్రములు బంకగ చల్లగనుండుట మిక్కుటముగ బంకగనుండు నీరుగారుట ఈ లక్షణములుగలది కఫాభిష్యందమని దెలియవలయు.

రక్తాభిష్యంద లక్షణము.

శ్లో॥ తామ్రాశ్రుతా లోహితనేత్రతాచ రాజ్యస్సమంతా దతి
లోహితాశ్చ । పిత్తస్యలిఙ్గాని చయానితాని రక్తాభిపన్నే
నయనేభవన్తి ॥

తా. కంటిలోనెఱ్ఱనినీరుగారుట నేత్రము లెఱ్ఱగనుండుట కంటిచుట్టు యెఱ్ఱగనుండు రేఖలువ్యాపించియుండుట పిత్తాభిష్యందలక్షణయుక్తంబుగ నుండుట ఈలక్షణములుగలది రక్తాభిష్యందమని దెలియవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] వృద్ధైరేతై రభిష్యందై ర్నరాణామ క్రియా
వతామ్। తావంత స్త్వధిమంథాస్స్యుర్నయనేతీవ్రవేదనాః ॥

తా. అభిష్యందరోగమున ఉపచారము సేయంబడకుండుటచే వృద్ధిజెంది విధములైన * అధిమంథరోగముల గలుగంజేయు. దాని సంబంధమువలన నేత్రములయందు తీవ్రవేదనగలుగు అదియ అధిమంథసామాన్యలక్షణము.

శ్లో॥ ఉత్పాట్యత ఇవాత్యర్థం నేత్రం నిర్మథ్యతేతథా ।
శిరసోర్ధం చ తంవిద్యా దధిమంథం స్వలక్షణైః ॥

* అధిమంథమన—కండ్లు కలకబారి పోట్లుగలుగుట.

తా. శిరముయొక్క అర్ధభాగము బగులగొట్టినట్టులనొచ్చుట కండ్లలోనిసుక బోసినటుల కడునేదనగలుగుట రోగప్రభావమువలన అర్ధతలయందు వేదనగలుగుట ఈ లక్షణములుగలది అధిమంథమని తెలియవలయు మఱియు దీనియందు వాతాభిష్యంద లక్షణములే గలిగియుండు.

శ్లో॥ హన్యాద్దృష్టిం శ్లైష్మికస్సప్తరాత్రా ద్యోధిమంథో రక్తజః పంచరాత్రాత్ । షడ్రాత్రాద్వావాతికోవై నిహన్యాన్మిథ్యాచారాత్పైత్తికస్సద్య ఏవ ॥

తా. శ్లైష్మిక అధిమంథము 7 దినములకు రక్తజ అధిమంథము 5 దినములకు వాతిక అధిమంథము 6 దినములకు పైత్తిక యధిమంథము మిథ్యోపచారముల వలన తత్కాలమున (అనగా మూడుదినములలో) కండ్లదృష్టిని నశింపంజేయు. (కాపున లంఘన ప్రలేపాది క్రియార్థంబై అంజన నిషేధార్థంబై వ్యాధిస్వభావమునుబట్టి కాలావధి జెప్పంబడియె.)

ఆమనేత్ర లక్షణము.

శ్లో॥ ఉదీర్ణ వేదనంనేత్రం రాగోద్రేక సమన్వితమ్ ।
ఘర్షనిస్తోద శూలాశ్రు యుక్త మామాన్వితంవిదుః॥

తా. నేత్రములు మిక్కుటముగ వేదనాయుక్తంబులై కడుజెఱ్ఱనై యిసుక బోసినటుల గరగరలాడుచు సూదులతో బొడుచునట్టుల వేదనగలవై చురుకుతో గూడి నీరుంగార్చుచుండిన ఆమయుక్తనేత్రములని తెలియవలయు. (ఈ లక్షణము అంజనాది నిషేధముకొరకై లఘ్వన్నము నిచ్చుటకై జెప్పంబడియె.)

నిరామ లక్షణము.

శ్లో॥ మందవేదనతా కండూ స్సంరంభాశ్రు ప్రశాంతతా ।
ప్రసన్న వర్ణతాచాక్ష్ణో స్సంపక్వం దోషమాదిశేత్ ॥

తా. వేదన మరడతగ్గి వాపుదీసి నేత్రములు నిర్మలముగనుండిన దోషము పక్వమైనదని తెలియవలయు.

### శోఫయుక్త అక్షిపాక లక్షణము.

శ్లో॥ కండూపదేహాశ్రుయుతః పక్వోదుంబరసన్నిభః ।
సంరంభీః చ్యతే యస్తు నేత్రపాకస్సశోఫజః ।
శోథహీనానిలింగాని నేత్రపాకేత్వశోథజే ॥

తా. నేత్రములయందు వాపుజనించి పండుటవలన పండిన మేడిపండుతో సమానంబై దురదగలిగి జిగటనీరుగారిన శోఫజన్య నేత్రపాకమని తెలియవలయు. మఱియు వాపులేక నేత్రపాకముగలిగి తక్కినలక్షణములతో గూడియుండిన త్రిదోషజనిత అధిమంథమని తెలియవలయు.

### హతాధిమంథ లక్షణము.

శ్లో॥ ఉపేక్షణాదక్షి యదాధిమంథో వాతాత్మకస్సాదయతిప్రసహ్య । రుజాభిరుగ్రాభి రసాధ్యయేష హతాధిమంథః ఖలు నేత్రరోగః ॥

తా. వాతజ అధిమంథమునకు జికిత్సంజేయక నుపేక్షించుటవలన నేమ్మత్రలు శోషించి దానివలన సూదులతో బొడుచునటుల వేదనతాపము మొదలగు కడుపీడలు గలుగు. ఇదియు హతాధిమంథమనంబడు ఈ నేత్రరోగం బసాధ్యము.

### వాతపర్యయ లక్షణము.

శ్లో॥ వారంవారంచపర్యేతి భ్రువౌనేత్రేచమారుతః ।
రుజశ్చవివిధాస్త్రీవ్రాస్సజ్ఞే యోవాతపర్యయః ।

తా. వాతము క్రమముగ పలుమారు కనుబొమలయందుజేరి యందుండి నేత్రములయందు పలుమారు వ్యాపించి పలువిధములైన తీవ్రపీడల గలుగంజేసి వాతపర్యయమనంబడు.

### శుష్కాక్షిపాక లక్షణము.

శ్లో॥ యత్కూణితం దారుణరూక్షవర్త్మ సందహ్యతేచావిలదర్శనంచ । సుదారుణంయత్ప్రతిబోధనేచ శుష్కాక్షిపాకో పహతంతదక్షి ॥

తా. నేత్రములు మూతపడి ఱెప్పలు కఠినంబులై రూక్షముతో గూడినవై మంటలుపొచ్చుట నేత్రములు లోనికీగుట తెరచుట కశక్యంబగుట ఈ లక్షణములు గలది శుష్కాక్షిపాకమని తెలియవలయు. ఇది రక్తసహితమువలన గలుగు.

## అన్యతోవాత లక్షణము.

శ్లో॥ యస్యావటూకర్ణ శిరోహనుష్ఠో మన్యాగతోవాప్యనిలో
తోవా। కుర్యాద్రుజంవై భ్రువిలోచనేచ తమన్యతోవా
ముదాహరంతి॥

తా. ముచ్చిగుంట చెవులు శిరము * కటుమర్లు పెడతల పెద్దనరము వాని యందేని ఇతరస్థలములయందేని యుండువాతము కనుబొమల మధ్యము లేక నేత్రములయందుగాని తోద భేదాదిపీడల గలుగంజేయు. ఈ రో అన్యతోవాతమని వచించెదరు.

## అమ్లాధ్యుషిత లక్షణము.

శ్లో॥ శ్యావంలోహిత పర్యంతంసర్వంచాక్షి ప్రపచ్యతే।
సదాహశోఫంస స్రావమమ్లాధ్యుషితమమ్లతః॥

తా. మధ్యమున నొకింత నీలవర్ణముగ చుట్టుప్రక్కల యెఱ్ఱగను సర్వనేత్రముపండుట (పండుట అనగాపసపుచాయగల కురుపులులేచుట) తాపము వాపుగలుగుట నీరునుగారుట ఈలక్షణములుగలది అమ్లాధ్యుషితము యనబడును. ఇది పులుసుగల భోజనాదుల మిక్కుటముగ సేవించుటవలన జ

## సిరోత్పాత లక్షణము.

శ్లో॥ అవేదనావాపి సవేదనావా యస్యాక్షి రాజ్యో హిభవ
తామ్రాః. ముహుర్విరజ్యంతిచయాస్సతాదృ గ్వ్యాధి
రోత్పాత ఇతిప్రదిష్టః॥

తా. నేత్రమునందుండు సిరలు వేదనారహితంబులై గానిలేక వేదనా బులై గాని యెఱ్ఱనై పలుమారు అధికాధికముగ యెఱ్ఱగనగుచుండిన సిరోత దెలియవలయు. (ఇది రక్తదోషమువలన జనించు.)

## సిరాహర్ష లక్షణము.

శ్లో॥ మోహాత్సిరోత్పాతఉపేక్షితస్తుజాయేతరోగస్తు సిరాప్రహ
తామ్రాస్రమచ్ఛంస్రవతిప్రగాఢంతథానశక్నోత్యభివీక్షి

* కటుమర్లు అనగా—కంటిక్రిందమొదలుకొని చెక్కిళ్ళపార్శ్వభాగ

తా. అవివేకముచేత శిరోత్పాతరోగమునకు జికిత్సంజేయక నుపేక్షించుటచే శిరాప్రహర్ష మనురోగము జనించు. దీనియందు నేత్రములయందెఱ్ఱగ స్వచ్ఛముగ నీరును గార్చుచుండుటవలన నేత్రములదెరచి చక్కగా జూచుట కశక్యంబుగ నుండు. (ఇటుల నేత్రమునందంతట జనించు 16 విధములగు రోగలక్షణంబులు జెప్పంబడియె.)

## నల్లగ్రుడ్డుయందు జనించు రోగములు

### సవ్రణశుక్ర లక్షణము.

శ్లో॥ నిమగ్నరూపంతుభవేద్ధి కృష్ణేసూచ్యేవవిద్ధం ప్రతిభాతియద్వై ।
స్రావంస్రవేదుష్ణమతీవయచ్చతత్సవ్రణం శుక్రముదాహరంతి ॥

తా. నేత్రములయొక్క నల్లగుడ్డునందు జనించురోగము సవ్రణశుక్ల మనంబడు నేత్రములయొక్క నల్లగ్రుడ్డునందు పువ్వుజనించి లోనమునింగినట్లుగ మధ్యభాగమున సూదితో బెజ్జముజేయబడినట్లుగ నుండినదై అత్యుష్ణముగ మిక్కుటముగ నీరును గార్చుచుండిన సవ్రణశుక్లమనంబడు ।(దీనిలో పీడగలిగియుండు క్షణమున పీడగలుగుట సహజంబే. ఐనను నేత్రములవంటి సుకుమారస్థలంబున గలిగెడి విశేషపీడనుసహించుట కశక్యంబనిభోజాదిములువచించెదరు.) ఈసవ్రణశుక్లంబసాధ్యము. ఐన నవస్థాభేదమువలన నొకానొకపుడు సాధ్యంబగు అవస్థాభేదం బెద్దియనిన.

### అవస్థాభేదసాధ్య శుక్రవివరణము.

శ్లో॥ దృష్టేస్సమీపేనభవేత్తుయత్తు వచావగాఢంనచసంస్రవేద్ధి ।
అవేదనంవానచయుగ్మశుక్రంతిత్సిద్ధిమాయాతికదాచిదేవ ॥

తా. పువ్వు దృష్టికిసమీపమునగలుగక లేక లోతుగ వ్యాపించక లేక కడు హావము పోట్లులేక యుండెడి శుక్రమొకానొకపుడు సాధ్యంబగు. మఱియు రెండు క్రములు జనించిన యసాధ్యంబు.

### అవ్రణశుక్ర లక్షణము.

శ్లో॥ స్యందాత్మకం కృష్ణగతంసచోషం శంఖేందుకుందప్రతిభావ
భాసమ్। వైహాయసాభ్రప్రతను ప్రకాశమథావ్రణం సాధ్య
మితమావదంతి ॥

తా అభిష్యందములవలన జనించి కంటియొక్క నల్ల గుడ్డునందు చోషముతో గూడి శంఖము చంద్రుడు మొల్లపువ్వు అనువానివలె తెల్లనై ఆకాశమునందుండు మేఘమువలె సూక్ష్మప్రకాశముగలదై వ్రణరహితంబై యుండు శుక్రము సుఖసాధ్యమని వచించెదరు.

## అవ్రణశుక్ర కృచ్ఛ్ర సాధ్యత్వము.

శ్లో॥ గంభీరజాతంబహుళంచశుక్రం చిరోత్థితంవాపివదంతికృచ్ఛ్రమ్॥

తా. కంటి నల్లగుడ్డునందు రెండుపొరలకులోన జనించి విశాలంబై బహుకాలమునకు ముందు జనించియుండు శుక్రము కష్టసాధ్యంబు.

## అవ్రణశుక్రా సాధ్యత్వము.

శ్లో॥ విచ్ఛిన్నమధ్యంపిశితావృతంవా చలంసిరాసూక్ష్మ మదృష్టి
కృచ్ఛ । ద్విత్వగ్గతం లోహితమంతతశ్చ చిరోత్థితంచాపివివర్జ
నీయమ్॥

తా. శుక్రముయొక్క మధ్యమునందుండు మాంసము కరిగి దానివలన ఛిద్రము (అనగా మధ్యమునందు పల్లము) గలదిగాని లేక శుక్రమునకు చుట్టూ మాంసము పెరిగి చలనముగలదిగ గాని యుండినదై సిరలవలన వ్యాప్తంబగుటవలన సూక్ష్మమై దృష్టిని నశింపజేయుచు రెండవపటలమునందు వ్యాపించి చుట్టుప్రక్క లెఱ్ఱగా జనించి చిరకాలంబైయుండు శుక్రము అసాధ్యంబు అట్లగుటచే దానిని వర్జింపవలయు.

## ప్రకారాంతర అవ్రణశుక్రా సాధ్యత్వము.

శ్లో॥ ఉష్ణాశ్రుపాతః పిటికాచనేత్రే యస్మిన్భవేన్ముద్గనిభంచశు
క్రమ్ । తదప్యసాధ్యం ప్రవదంతికేచిదన్యచ్చ యత్తిత్తిరిప
క్షతుల్యమ్ ॥

తా. నేత్రములయొక్క 2 వ పటలమునందు శుక్రము వ్యాపించుటవలన గడు వేడిమిగ అశ్రువులు స్రవించుటయేగాక సన్నని గుల్లలవలన వ్యాప్తంబై పెసరపప్పుతో సమానంబైన శుక్రముగలిగిన యసాధ్యము, మఱియు నాశుక్రము తిత్తిరిపక్షియొక్క ఱెక్కవర్ణముతో సమానముగనుండిన అసాధ్యమని కొందరు వచించెదరు.

## అక్షిపాకాత్యయ లక్షణము.

శ్లో॥ శ్వేతస్సమాక్రామతి సర్వతోహి దోషేణ యస్యాసితమణ్డ

మనియు కఠినంబై ప్రసరించునదియై స్రావరహితంబై యుండు మాంసము జనించిన స్నాయ్వర్మమనియు జెప్పంబడు.

శుక్తిరోగ లక్షణము.

శ్లో॥ శ్యావాస్స్యుః పిశితనిభాస్తుబిందవో యే శుక్త్యాభాసిప్సితని యతాస్స శుక్తిసంజ్ఞః॥

తా. కంటియొక్క తెల్లగుడ్డుపైనల్లగ మాంసతుల్యముగ ముత్యపుచిప్పవర్ణ తుల్యముగ బిందువులు జనించిన శుక్తియనంబడు.

అర్జున లక్షణము.

శ్లో॥ ఏకోయశ్శశరుధిరోపమశ్చబిందుశ్శుక్లస్థోభవతితదర్జునంవదంతి ॥

తా. కంటియొక్క తెల్లని భాగమున రక్తమువలె నొక బిందువు జనించిన అర్జున మనంబడు.

పిష్టక లక్షణము.

శ్లో॥ శ్లేష్మమారుతకోపేన శుక్లేమాంసం సమున్నతమ్ ।
పిష్టవత్పిష్టకం విద్ధిమలాక్తా దర్శసన్నిభమ్ ॥

తా. కఫవాతములవలన నేత్రములయొక్క తెల్లని గ్రుడ్లయందు పిండివలె తెల్లగ నుండుమాంసము జనించిన పిష్టకమనంబడు. ఇది మలయుక్తమైన యద్ధము వలె గనుపించు.

సిరాజాల లక్షణము.

శ్లో॥ జాలభఃకఠిన శిరోమహాంత్సరక్త స్సంతానస్స్మృత ఇహజాల సంజ్ఞితస్తు ॥

తా. కంటియొక్క తెల్లనిగుడ్డునందు కఠినముగ గొప్పగ యెఱ్ఱగనుండు * సిరలు వ్యాపించి వలలో సమానంబైయుండిన సిరజాల మనంబడు.

సిరాజ పిటిక లక్షణము.

శ్లో॥ శుక్లస్థాస్సితపిటికాస్సి రావృతాయాస్తాబ్రూయాదసితసమీపజాస్సిరాజాః ॥

---

* సిరయనన — బోలునరము.

తా. కంటియొక్క తెల్లనిగుడ్డుపైనుండు నల్లనిభాగమునకు సమీపము సిరలు వ్యాపించి తెల్లనై సన్ననికురుపుల గలుగంజేసిన సిరాజపిటిక యనంబడు

బలాస లక్షణము.

శ్లో॥ కాంస్యాభోమృదురథ వారిబిందుకల్పో విజ్ఞేయో నయనసి బలాససంజ్ఞః ॥

తా. కంటియొక్క తెల్లనిభాగమున కంచుతో సమానమైన కాంతిగలది కఠినముగ లేక నీటిబిందువుతో దుల్యముగనుండు గ్రంధి జనించి యొకింత యుబ్బు గుండ్రముగనుండిన బలాసమనంబడు. (ఇటుల కంటితెల్లగుడ్డునందు జనించు రోగములు జెప్పంబడియె.)

పూయాలస లక్షణము.

శ్లో॥ పక్వశ్శోథ స్సంధిజోయస్సతోద స్స్రవే త్పూయం పూతి పూయాలసాఖ్యః ॥

తా. నేత్రసంధియందు వాపుజనించి పండి సూదులతో బొడుచునటు వేదనతోడంగూడి దుర్గంధముగ చీమును గార్చుచుండిన పూయాలస మనంబడు

ఉపనాహ లక్షణము.

శ్లో॥ గ్రథిర్నాల్పో దృష్టిసంధావపాకీకణ్డు ప్రాయోనీరుజస్తూపనాహః ॥

తా. నేత్రసంధియందు లావుగ నొకింత పక్వముగలదిగ కడుదురదతో గూడినదిగ వేదనారహితముగనుండు గ్రంధి జనించిన వుపనాహ మనంబడు.

నేత్రనాడీ లక్షణము.

శ్లో॥ గత్వాసంధీనశ్రుమార్గేణదోషాః కుర్యుస్స్రావా౯ లక్షణై స్స్వైరుపేతా౯ । తంహిస్రావంనేత్రనాడీతిచైకే తస్యాల్యింగంకీర్తయిష్యే చతుర్థా ॥

తా. వాతాదిదోషములు * అశ్రువులయొక్క మార్గమువలన సంధులయందు ప్రవేశించి తమతమ లక్షణములతోడంగూడి స్రావమును గలుగంజేసిన నేత్రనాడి యని కొందరు వచించెదరు. అది 4 విధంబులు ఎట్లనిన.—

* అశ్రువులన—కంటినీరు.

॥శ్లో॥ పాకస్సంధౌ సంస్రవేద్యస్తు పూయంపూయాస్రావో సౌగద
స్సర్వజస్తు। శ్వేతంసాంద్రంపిచ్ఛిలం సంస్రవేద్ధి శ్లేష్మాస్రావో
సావికారోమతస్తు । రక్తాస్రావశ్శోణితాన్వో వికారస్స్రవేదు
ష్ణం తత్రరక్తంప్రభూతమ్ । హారిద్రాభం పీతముష్ణంజలంవా
పిత్తాస్రావస్సం స్రవేత్సంధి మధ్యాత్ ॥

తా. నేత్రసంధియందు వాపుజనించి పండి చీమునుగార్చుచు సన్నిపాతా త్మకయుక్తంబై యుండిన పూయాస్రావ మనంబడు. మఱియు తెల్లగ గట్టిగ బంకగ చీమును గార్చుచుండిన శ్లేష్మాస్రావ మనంబడు. రక్తప్రకోపమువలన విశేషముగ ఊష్ణముగ నేత్రసంధులవలన రక్తస్రావముగలది రక్తజస్రావ మనంబడు. నేత్రసంధుల యందు పసపుచాయగా లేక పచ్చగ వుష్ణముగ నీరుగార్చుచుండునది పిత్తస్రావ మనంబడు.

## పర్వణీ అలజీలక్షణము.

శ్లో॥ తామ్రాతన్వీదాహ పాకోపపన్నా జ్ఞేయాపైదైవ్యః . పర్వణీ
వృత్తశోథా। జాతాసంధౌశుక్లకృష్ణే లజీస్యాత్తస్మిన్నేవఖ్యా
పితాపూర్వలింగైః ॥

తా. కంటియొక్క తెల్లని సంధిపైగాని లేక నల్లనిసంధిపైగాని యెఱ్ఱగ చిన్నదిగ గుండ్రముగనుండు పిటికలుజనించి తాపయుక్తమై పండిన పర్వణియనియు అస్థానంబుననె పూర్వోక్త ప్రమేహపిటికాలక్షణయుక్తంబై పెద్దవిగనుండు పిటికలు జనించిన అలజియనియు జెప్పంబడు.

## కృమిగ్రంథి లక్షణము.

శ్లో॥ కృమిగ్రంథి ర్వర్త్మనః పక్ష్మణాశ్చ కండూంకుర్యుః కృమయ
స్సంధిజాతాః । నానారూపావర్త్మ శుక్లాంతసంధౌ చరం
త్యంతర్న యనం దూషయంతః ॥

తా. కంటి రెప్పలయందును రెప్పవెండ్రుకల సంధులయందును పలువిధ ములైన క్రిములు దురద జనించిన గ్రంథియనంబడు. మఱియు నది కంటియొక్క తెల్లభాగమునందలి సంధులయందు వ్యాపించి కంటియొక్క లోభాగమును జెరచి లోనరుగుచుండిన క్రిమిగ్రంథి యనంబడు.

## వర్త్మరోగము ఉత్సంగపిటికా లక్షణము.

శ్లో॥ అభ్యంతరముఖితామ్రా బాహ్యతో వర్త్మతశ్చయా ।
సోత్సంగోత్సంగపిటికా సర్వజాస్థూల కండురా ॥

తా. కంటియొక్క లోభాగమున ముఖముగల కురుపుజనించి యెఱ్ఱనై కఠినంబై దురదతోఁగూడినదై కంటిరెప్పలయొక్క బైటి మధ్యభాగమున నుబ్బియుండిన ఉత్సంగ పిటికయనంబడు. ఇది త్రిదోషమువలన జనించు.

## కుంభికా లక్షణము.

శ్లో॥ వర్త్మాంతే పిటికాధ్మాతా భిద్యంతేచ స్రవంతిచ ।
కుంభీక బీజసదృశాః కుంభికా స్సన్నిపాతజాః ॥

తా. కంటియొక్క నొకపార్శ్వమున దాడిమవిత్తువలెనుండు కురుపు జనించి యదిమిన నుబ్బుచు పగిలి మసివలె స్రావమును గలుగంజేయుచుండిన కుంభికయనంబడు. ఇది త్రిదోషమువలన జనించు.

## పోథకీ లక్షణము.

శ్లో॥ స్రావిణ్యః కండురాగుర్వ్యో రక్తసర్షప సన్నిభాః ।
రుజావంత్యశ్చ పిటికాః పోథక్య ఇతికీర్తితాః ॥

తా. రెప్పలయొక్క లోభాగములో యెఱ్ఱావాలప్రమాణముగల కురుపులు జనించిన రక్తమునుగార్చుచు దురదతోఁగూడి జడత్వము కడుపునొప్పిగలవై యుండిన పోథకీ యనంబడు.

## వర్త్మశర్కరా లక్షణము.

శ్లో॥ పిటికాయాఖరాస్థూలసూక్ష్మాభిరభి సంవృతా ।
వర్త్మస్థాశర్కరా నామసరోగో వర్త్మదూషకః ॥

తా. కంటియందు కఠినముగ లావుగ నుండుకురుపు జనించి చుట్టు సన్నని కురుపులవలన వ్యాప్తంబైయుండిన వర్త్మశర్కరయనంబడు. ఇది కంటిరెప్పలంజెరచు.

## అర్శోవర్త్మ లక్షణము.

శ్లో॥ ఉర్వారు బీజప్రతిమాః పిటికా మందవేదనాః ।
శ్లక్ష్ణాః ఖరాశ్చ వర్త్మస్థా స్తదర్శో వర్త్మకీర్త్యతే ॥

## పరిమ్లాయిరోగ విశేషలక్షణము.

శ్లో॥ అరుణంమండలం దృష్ట్యాం స్థూలకా చారుణప్రభమ్ ।
పరిమ్లాయినిరోగేస్యాత్ మ్లాయినీలంచ మండలమ్ ।
దోషక్షయాత్కదాచిత్స్యాత్స్వయంతత్ర ప్రదర్శనమ్ ॥

తా. పరిమ్లాయిరోగమునందు దృష్టికిపైన లావుగ గాజువలె నెఱ్ఱగ నుండు మండలము జనించి పచ్చగ నీలముగనుండు. దానియందు దోషము తగ్గినయెడల నొకానొకప్పుడు నేత్రములు తనంతటతానే గనుపించు. (ఇచట దోషశబ్దమునకు కొందరు జన్మాంతర కర్మమనియు వచించెదరు.)

## దృష్టిమండలగత రోగలక్షణము.

శ్లో॥ అరుణం మండలం వాతా చ్చంచలం పరుషంతథా । పిత్తా
న్మండలమా నీలంకాంస్యాభం పీతమేవచ । శ్లేష్మణాబహుళం
స్నిగ్ధం శంఖ కుందేందుపాండురమ్ । చలత్పద్మపలాశస్థశ్శుక్లో
బిందురివాంభసః । మృద్యమానేచ నయనే మండలం తద్విస
ర్పతి । ప్రవాళ పద్మపత్రాభం మండలం శోణితాత్మకమ్ ।
దృష్టిరాగో భవేచ్చిత్రో లింగనాశేత్రిదోషజే । యథాస్వం
దోషలింగాని సర్వేష్వేవ భవంతిహి ॥

తా. వాతమువలన దృష్టిమండలము యెఱ్ఱగ చంచలముగ గరగరగనుండు పిత్తమువలన నొకింత నీలముగ కాంస్యమువంటి వర్ణముగలదిగ లేక పసుపువర్ణము గలదిగనుండు కఫమువలన విస్తారముగ జిగటగ శంఖము మొల్లపువ్వు చంద్రుడు అనువానివలె తెల్లగనుండు మఱియు, కన్నుల నలచిన తామరాకునైౖ కదలుచుండు తెల్లని నీటిబిందువులవలె యిటునటు నీరుకదలుచుండు రక్తమువలన దృష్టిమండలము పగడమువలెగాని లేక యెఱ్ఱతామర పుష్పమువలె యెఱ్ఱగగాని యుండుత్రిదోషజ లింగనాశనమున విచిత్రఛాయగల మండలములుగలుగు. మఱియు సర్వలింగ నాశన రోగమునం దాయారోగ దోషలక్షణంబులు గలుగు.

## దృష్టిరోగ సంఖ్య.

శ్లో॥ షడ్లింగనాశాష్షడిమేచరోగాదృష్ట్యాశ్రయాష్షట్చషడేవచస్యుః॥

తా. పూర్వోక్త 6 విధములైన లింగనాశనంబులును వుత్తరోత్ర జెప్పంబడు 6 విధములైన పిత్తవిదగ్ధ దృష్ట్యాదిరోగంబులునుజేరి 12 విధములైన దృష్టిరోగంబులుగ నగు.

పిత్తవిదగ్ధ దృష్టి లక్షణము:

శ్లో॥ పిత్తేనదుష్టేన గతేన వృద్ధిం పీతాభవేద్యస్య నరస్యదృష్టిః।
పీతాని రూపాణిచ తేన పశ్యేత్సవై నరఃపిత్త విదగ్ధదృష్టిః॥

తా. పిత్తము దుష్టంబగుటవలన వృద్ధింజెంది దృష్టియందు పసపువర్ణమును గలుగంజేయు. దానిసంబంధమువలన సర్వపదార్థములు పచ్చగగనుపించు. ఇదియ పిత్తవిదగ్ధ దృష్టియనంబడు.

దివాంధ్య లక్షణము.

శ్లో॥ ప్రాప్తేతృతీయం పటలంచదోషే దివాసపశ్యేన్ని శివీక్షతేసః।
రాత్రౌసశీతానుగృహీతదృష్టిః పిత్తాల్పభావా దపి తాని పశ్యేత్॥

తా. 3 వ పటలమునందు పిత్తదోషము వ్యాపించుటవలన పగటియందు నేత్రములు గనుపించకుండు రాత్రియందు చల్లగనుండుటచే పిత్తము కొరవడు దాని వలన రాత్రులయందు నేత్రములు గనుపించు ఇదియ దివాంధ్యమనంబడు.

కఫవిదగ్ధ దృష్టి లక్షణము.

శ్లో॥ తథానరశ్శ్లేష్మ విదగ్ధదృష్టి స్తాన్యేవశుక్లాని హిమన్యతేతు॥

తా. అటులనే కఫవిదగ్ధదృష్టిగలవానికి సర్వపదార్థములును తెల్లగగనుపించు

* నక్తాంధ్య లక్షణము.

శ్లో॥ త్రిషుస్థితోయః పటలేషుదోషో నక్తాంధమాపాదయతిప్రసహ్య। దివాససూర్యానుగృహీతదృష్టిః పశ్యేత్తురూపాణి కఫాల్పభావాత్॥

తా. కఫము 3 వ పటలమును జెందుటవలన నక్తాంధ్యము జనించు అందు సూర్యుని తాపమువలన పగటియందు కఫము కొరవడుటచే పగటియందు నేత్రము గనుపించు.

* నక్తాంధ్యమన—రేచీకటి.

## ధూమదర్శి లక్షణము.

శ్లో॥ శోకజ్వరాయాసశిరోభితాపైరభ్యాహతాయస్య నరస్య దృష్టిః। ధూమ్రాం స్తథాపశ్యతి సర్వభావాన్సధూమదర్శీతి నరః ప్రదిష్టః॥

తా. శోకము జ్వరము ఆయాసము మస్తకతాపము అనువానివలన పిత్తము ప్రకోపించి దృష్టియందు వికారమును గలుగజేయుటవలన సర్వపదార్థములు పొగచే నాచరింపంబడినటుల గనుపించు. ఈ రోగము శోకవిదగ్ధదృష్టియని చెప్పంబడు అందు సర్వవస్తువులు పగటియందు మాత్రము పొగ గమ్మినటుల గనుపించు. రాత్రియందు పిత్తము కొరవడుటవలన నిర్మలముగ గనుపించు.

## హ్రస్వదృష్టి లక్షణము.

శ్లో॥ యోహ్రస్వజాడ్యో దివసేషుకృచ్ఛ్రాద్ధ్రస్వాని రూపాణిచ తేనపశ్యేత్॥

తా. దోషము దృష్టిమధ్యగతంబగుటవలన పగటియందు లావుగనుండు పదార్థములు సన్నగగనుపించిన హ్రస్వదృష్టియనంబడు. (ఈ రోగము పిత్తమువలన జనించు.)

## నకులాంధ్య లక్షణము.

శ్లో॥ విద్యోతతేయస్య నరస్య దృష్టిర్దోషాభిపన్నానకులస్యయద్వత్। చిత్రాణిరూపాణిదివాసపశ్యేత్సవై వికారోనకులాంధసంజ్ఞః॥

తా. దృష్టిదోషముచే వ్యాప్తంబై ముంగిస దృష్టితో సమానంబై పగటియందు పలువిధరూపములుగ నగుపడుచుండిన నకులాంధ్య మనంబడు.

## గంభీరదృష్టి లక్షణము.

శ్లో॥ దృష్టిర్విరూపాశ్వసనోపసృష్టా సంకోచమభ్యంతరతశ్చయాతి।రుజావగాఢంచతమక్షిరోగం గంభీరికేతిప్రవదంతితద్జ్ఞాః

తా. దృష్టి వాతమువలన వికృతంబై లోన సంకోచముగలదై పోట్లతో గూడియుండిన గంభీరదృష్టి యనంబడు.

## ఆగంతుక లింగనాశనము.

శ్లో॥ బాహ్యౌపునర్ద్వావిహసం ప్రదిష్టౌనిమిత్తతశ్చాప్యనిమిత్తతశ్చ॥నిమిత్తతస్తత్రశిరోభితాపోజ్ఞేయస్త్వభిష్యందనిదర్శనస్సః॥

తా. అభిఘాతలింగనాశనము 2 విధంబులు. అందొకటి యేదో యొక కారణంబువను 2 వది నిష్కారణంబునను జనించు. అందు విషవృక్ష పుష్పముపైనుండి వచ్చినగాలియొక్క స్పర్శమువలన తల తపించి యాయుష్ణము కండ్లను దిగి కండ్లు గానరాకుండంజేయునది శిరోభితాప మనంబడు. ఇది నిమిత్తజన్యము. దీనియందు రక్తాభిష్యంద లక్షణములే గలుగు.

అనిమిత్తజ లింగనాశ లక్షణము.

శ్లో॥ సురర్షి గంధర్వ మహోరగాణాం సందర్శనేనాపిచభాస్కరస్య। హన్యేతదృష్టిర్మను జస్యయస్య లింగనాశ స్త్వనిమిత్త సంజ్ఞః । తత్రాక్షి విస్పష్టమివావభాతి వైడూర్యవర్ణావిమలాచదృష్టిః॥

తా. దేవఋషి గంధర్వ మహాసర్ప సూర్యాదుల నురిమిజూచుటవలన దృష్టి నష్టంబైన అనిమిత్తజ లింగనాశన మనంబడును. నేత్రములు స్వచ్ఛముగ దృష్టి శ్యామల వర్ణముగ నుండు. (ఇటుల దృష్టిగత తిమిరరోగ లక్షణంబులు జెప్పంబడియె.)

కంటి తెల్లగుడ్డునందు జనించు రోగములు.

* అర్మరోగ భేదములు.

శ్లో॥ ప్రస్తార్యర్మతను స్తీర్ణం శ్యావంరక్త నిభంసితే ।
సశ్వేతంమ్మృదు శుక్లార్మ శుక్లేతద్వర్ధతేచిరాత్ ।
పద్మాభంమ్మృదు రక్తార్మయన్మా సంచీయతేసితే ।
పృథుమ్మృద్వధిమాం సార్మబహుళంచ యకృన్నిభమ్ ।
స్థిరంప్రస్తారిమాం సాఢ్యంశుష్కంస్నాయ్వర్మ పంచమమ్ ॥

తా. అర్మరోగంబులు 5 విధంబులు. అందు కంటియొక్క తెల్లనిభాగముపై తేటగ విస్తీర్ణముగ నల్లగ యెఱ్ఱగనుండు మాంసము జనించిన ప్రస్తారికమనియు తెల్లగ మృదువుగనుండు మాంసము జనించి కాలక్రమమున వృద్ధింజెందిన శుక్లార్మమనియు తామరవలె నెఱ్ఱగ మృదువుగనుండు మాంసము జనించిన రక్తార్మమనియు విస్తీర్ణముగ మృదువుగ యకృత్తువలె స్థూలముగ నల్లగ గనుపించిన అధిమాంసార్మ

* అర్మమన—దుర్మాంసము.

లస్తు । తమక్షిపాకాత్యయమక్షి పాకం సర్వాత్మకం వర్జయి
వ్యమూహుః ॥

తా. కంటియొక్క నల్లగుడ్డునందు దోషసంబంధమువలన గుడ్డునం దంతట శుక్రము వ్యాపించిన సన్నిపాతజ అక్షిపాకాత్యయమనంబడు. ఇది అసాధ్యంబగుటచే వైద్యుడు వర్జింపవలయు.

## అజాకాజాత లక్షణము.

శ్లో॥ అజాపురీష ప్రతిమోరుజావాన్ సలోహితో రోహితపిచ్ఛి
లాశ్రుః । విగృహ్యకృష్ణం ప్రచయోభ్యుపైతి తచ్చాజకా
జాత మితివ్యవస్యేత్ ॥

తా. నల్లగుడ్డుయొక్క 3 వ పొరయందు నాశ్రయించియుండెడి మేకపెంటికవలెనున్నతమైననొప్పిగలదై యొకింతయెఱ్ఱనై యెఱ్ఱగ చిక్కగ నీరును గార్చుచుండిన అజకాజాతమనంబడు. (ఇటుల కంటినల్లగుడ్డునందు జనించు నేత్రరోగములు జెప్పంబడియె.)

## దృష్టిగత తిమిర రోగములు.

## ప్రథమ పటలస్థదోష లక్షణము.

శ్లో॥ ప్రథమే పటలేయస్య దోషాదృష్ట్యాం వ్యవస్థితః ।
అవ్యక్తానిచ రూపాణి కదాచి దథపశ్యతి ॥

తా. నేత్రముయొక్క మొదటిపటలమున (అనగాఅంతటికిలోపల) వాతాది దోషములు వ్యాపించి దృష్టికిపైననుండు దానివలన నాకానొకపుడు ఘటపటాది పదార్థముల స్పష్టములుగ గనుపించు.

## ద్వితీయ పటలస్థదోష లక్షణము.

శ్లో॥ దృష్టిర్భృశంవిహ్వలతి ద్వితీయంపటలంగతే । మక్షికామశ
కాన్కేశా న్జాలకా నిచపశ్యతి । మండలాని పతాకాంశ్చ
మరీచిం కుండలానిచ । పరిప్లవాంశ్చ వివిధా న్వర్షమభ్రంత
మాంసిచ । దూరస్థానిచ రూపాణి మన్యతేచ సమీపతః ।
సమీపస్థానిదూరేచదృష్టేర్గోచరవిభ్రమాత్ । యన్నవాన
పిచాత్యర్థం సూచీపాశం నపశ్యతి ॥

తా. 2 వ పటలమున దోషము వ్యాపించుటవలన దృష్టికి పదార్థము బాగుగ గనుపించకుండు అటులనే నేత్రములకెదుట ఈగలు దోమలు వెంట్రుకలు వలలు మండలము పతాకము కిరణము కుండలము నానాప్రకారముగ కప్పలు మొదలగునవి దుముకునటుల వర్షము మబ్బు అంధకారము ఇవి లేకుండునపుడు దృష్టికగుపడుట విషయభ్రాంతివలన దూరముననుండు పదార్థములు సమీపముగ సమీపముగనుండు పదార్థములు దూరముగనుండునటుల దోచుట కడుప్రయత్నము జేసినను సూదిముఖము గనుపించకుండుట అను నీలక్షణంబులు గలుగు.

## తృతీయ పటలస్థ తిమిర లక్షణము.

శ్లో॥ ఊర్ధ్వంపశ్యతి నాధస్తాత్తృతీయం పటలంగతే । మహాంత్యపిచరూపాణి ఛాదితానీవ చాంబరైః । కర్ణనాసాక్షిహీనాని వికృతానిచపశ్యతి । యథాదోషంచరజ్యేత దృష్టిర్దోషేబలీయసి । అధస్స్థేతుసమీపస్థం దూరస్థంచోపరిస్థితే । పార్శ్వస్థితేపునర్దోషేపార్శ్వస్థంనైవపశ్యతి । సమంతతస్థితేదోషే సంకులానీవపశ్యతి । దృష్టిమధ్యస్థితేదోషేమహద్ధ్రస్వంచ పశ్యతి । ద్విధాస్థితే ద్విధాపశ్యే ద్బహుధా చానవస్థితే । దోషేదృష్టిస్థితేతిర్య గేకం ద్వైమన్యతేద్విధా ॥

తా. మూడవపటలమున దోషము వ్యాపించుటవలన పొడవుగనుండుపదార్థములు గనుపించుట క్రిందనుండుపదార్థములు గనుపించకుండుట పెద్దవిగనుండుపదార్థములు వస్త్రముతోగప్పంబడినటుల గనుపించుట మనుజులు ముక్కు చెవులు కండ్లు లేనివారుగ వికారరూపముగలవారలుగ గనుపించుట రక్తమాంసమేద అదికసవయమువలన వాతాదిదోషములు బలిష్ఠంబులగుచుండ దృష్టికి వాతాదిదోషమువలె ఎఱుపు పసుపు తెలుపు వర్ణములు గలుగుట దోష మధోభాగమునందుండుటవలన సమీపముననుండు పదార్థములు బాగుగ గనుపించకుండుట పైభాగమునం దుండుటవలన దూరముగానుండు పదార్థములు బాగుగగనుపించకుండుట ప్రక్కలయందుండుటవలన ప్రక్కలయందుండు పదార్థములు బాగుగ గనుపించకుండుట దోషంబంతట వ్యాపించి యుండుటవలన పదార్థము లొకదానితోనొకటి జేరియుండు నటుల గనుపించుట దృష్టి మధ్యమునం దుండుటవలన స్థూలపదార్థములు చిన్నవిగ గనుపించుట రెండుస్థలములయందు దోషము నిలిచియుండుటవలన రెండు రెండుపదార్థము

లుగ గనుపించుట దోషము చంచలముగ నుండుటవలన నొకపదార్థం బనేకరూపములు గలదిగ గనుపించుట దృష్టిగతదోషము అడ్డముగ నుండిన 1 పదార్థము రెండుగగను పించుట అను నీ లక్షణములు గలుగు.

## చతుర్థ పటలస్థ తిమిర లక్షణము.

శ్లో॥ తిమిరాఖ్య స్సవై రోగ శ్చతుర్థ పటలంగతః । రుణద్ధిసర్వతో దృష్టింలింగనాశమతః రమ్ । అస్మిన్నపి తమోభూతేనాతి రూఢే మహాగదే । చంద్రాదిత్యౌ సనక్షత్రా వంతరిక్షేచ విద్యుతః । నిర్మలానిచ తేజాంసి భ్రాజిష్ణూనిచపశ్యతీ ॥

తా. వాతాదిదోషములు నాలవపటలమును జెందుటచే తిమిరమనుపేరం బరంగుచు దృష్టినంతట నడ్డగించు నిదియ * లింగనాశనమునంబడు. ఇది వృద్ధిం జెందనుండు కాలమున ఆకాశమున చంద్ర సూర్య నక్షత్రములు మెఱుపులు నిర్మలముగ దీప్తతేజములుగలవిగ గనుపించు.

## ప్రకారాంతర లింగనాశస్వరూపము.

శ్లో॥ సఏవ లింగనాశస్తు నీలికా కాచసంజ్ఞితః ॥

తా. తృతీయపటలమున జెందియుండు కాచబిందువు నుపేక్షించుటవలన యాది 4 వ పటలమును జెందిన లింగనాశన మనియు నీలికయనియు జెప్పంబడు. ఇది అసాధ్యము.

శ్లో॥ తత్రవాతేన రూపాణి భ్రమంతీ వహిపశ్యతి । ఆవిలాన్యరుణాభానివ్యావిద్ధానీవమానవః । పిత్తేనాదిత్యఖద్యోత శక్రచాప తటిద్గణా । నృత్యతశ్చైవశిఖినస్సర్వనీలంచపశ్యతీ । కఫేన పశ్యేద్రూపాణి స్నిగ్ధానిచ సితానిచ । సలిలప్లావితానీవ పరిజాడ్యనిమానవః । పశ్యేద్రక్తేనరక్తానితమాంసివివిధానిచ । ససితాన్యథకృష్ణానిపీతాన్యపిచమానవః । సన్నిపాతేనచిత్రాణివిప్లుతానిచ పశ్యతి । బహుధాచ ద్విధావాపి సర్వాణ్యేవ సమంతతః। హీనాగాన్య ధికాంగానిజ్యోతీంష్యపిచపశ్యతి॥

---

* ఇంద్రియశక్తిని నశింపజేయుటచే లింగనాశనమనంబడు.

తా. పైజెప్పంబడిన సర్వపటలమునందు వ్యాపించియుండు వాతదోషము వలన రూపము దిరుగునట్లుగ కల్మషముగ యెఱ్ఱగ వంకరగ గనుపించు పిత్త దోషమువలన సూర్యుడు మిణుగురుపురుగు యింద్రధనస్సు మెరుపు అనువానిని నృత్యముసలుపునట్టి నెమళ్ళను సర్వవస్తువులను నీలముగగాంచు కఫదోషమువలన స్నిగ్ధముగ తెల్లగ నీటిలోనుంచి తీసినట్లుగ మందముగ గనుపించు రక్తదోషమువలన యెఱ్ఱగనొకింత తెల్లగ నల్లగ పసుపుగ గనుపించు. సన్నిపాతదోషమువలన పలువిధవర్ణములుగ విపరీతముగ (అనగా 1 వస్తువు 2 గ గాని లేక అనేకరూపములుగగాని) గను పించు. మఱియు జ్యోతిస్సులు హీనమై అంగములుగలవిగగాని లేక అధికాంగములుగలవిగగాని నానాప్రకారములుగగాని గనుపించు.

పరిమ్లాయిక లక్షణము.

శ్లో॥ పిత్తంకుర్యాత్పరిమ్లాయిమూర్ఛితంరక్తతేజసా।
పీతాదిశక్తనోదిక్ తాంనవించాపినపశ్యతి ।
వికీర్యమాణాన్ఖద్యోతైర్వృక్షాం స్తేజోభిరేవచ ॥

తా. పిత్తము రక్తబలముతో మిశ్రమమై పరిమ్లాయియను తిమిరరోగమును గలుగచేయుచున్నయది. దాని సంబంధమువలన దిక్కులు యెండ సూర్యుడు పసుపు వర్ణముగ మఱియు వృక్షములు మిణుగురుపురుగులు తేజస్సు అనువానితో వ్యాప్తంబైనవిగ గనుపించు.

రాగభేదమువలన లింగనాశ వివరము.

శ్లో॥ వక్ష్యామిషడ్విధంరాగైర్లింగనాశమతఃపరమ్ । రాగోరుణో మారుతజః ప్రదిష్టో మ్లాయీచ నీలశ్చ తథైవపిత్తాత్ ।
కఫాత్సిత శ్శోణితజస్సరక్త స్సమస్తదోష ప్రభవోవిచిత్రః ॥

తా. వర్ణభేదసంఖ్యవలన లింగనాశనమను రోగము ఆరువిధంబులగు. అందు వాతజలింగనాశనం యెఱ్ఱగనుండు. పిత్తజలింగనాశనము పచ్చగ నీలముగనుండు. కఫజలింగ నాశనము తెల్లగనుండు రక్తజలింగనాశనం యెఱ్ఱగనుండు సర్వదోషజ లింగనాశనములుపలువిధవర్ణములు గలవిగనుండు

శిఖితుత్థం శిలాచూర్ణం కర్షాంశాం వస్త్రగాలితమ్ । మధ్వా
జ్యస్తన్యతోఖ ప్లుతం సర్వనేత్రరుజాపహమ్ ॥

తా. తామ్రమభస్మము దాన్యాభ్రకము మైలుతుత్తము శుద్ధిజేసిన కఫరి వీనిని దినుసుకు 10 నిష్కములయెత్తుచొప్పున చూర్ణముగావించి యేకముజేసి మూకుడులోనునిచి పొయిమీదబెట్టి అందు శుద్ధిజేయబడి చూర్ణజేయబడిన 30 కర్షముల గంధకమును పలుమారు కొంచెకొంచెముగా వేయుచు దానివాగ బైలువెడలకుండునటుల పైమూకుడుమూతిని మఱియొకమూకుడుచే మూయుచు గంధకంబంతయు జీర్ణంబగువఱకు పాకముజేసిన శుద్ధంబగు. పిదప దానిని సాంగశీతలమునదీసి 1 ప్రస్థపు నీళ్ళలోగలిపి మర్దించి నీళ్ళకడుగుననుండు మష్టును వర్జించి మఱియొక కుండలోబోసి గట్టియగువఱకు యెండసెండించి అందు కర్షప్రమాణము శుద్ధిచేసిన మైలుతుత్తమును శుద్ధిజేసిన శిలాజిత్తును చూర్ణముగావించి వస్త్రగాలితముజేసి కలిపికణికలుజేసి తేనెతోగాని లేక నేతితోగాని లేక చనుబాలతోగాని చాది కన్నులబెట్టిన సర్వనేత్రరోగములుహరించు.

## రసాంజనాద్యంజనము.

శ్లో॥ [చరకే] శుక్లార్మజేవిపంకృష్ణా యుక్తంగోమూత్రభావితమ్ ।
సాముద్రఫేనంవటికం కురువిందరసాంజనమ్ ।
కుంగ్మపృష్ఠంచతుల్యాంశం సర్వాంశంచమనశ్శిలా ।
శిలాయాద్విగుణంవ్యోషం వ్యోషాద్ద్విగుణసైంధవమ్ ।
లోహచూర్ణంవిషంచైవ ప్రత్యేకంసైంధవాంశకమ్ ।
పిష్ట్వాక్షౌద్రయుతంచాజ్యం పిల్ల శుక్లార్మకంజయేత్ ॥

తా. అతివస పిప్పళ్ళు ఈరెంటిని గోమూత్రముతో భావనజేసి చాదకన్నులబెట్టిన కంటిపువ్వులు నీరుగారుట హరించు. మఱియు సముద్రపునురుగు పటికయింగిలీకము రసాంజనము తాబేటిచిప్పు పుర్రె ఇవి సమభాగములు వీనికి సమముశుద్ధిజేసిన రక్తమణిశిల రక్తమణిశిలకు రెండింతలు త్రికటుకములు దానికి రెండింతలు సైంధవలవణము సైంధవలవణమునకు సమము లోహభస్మము లోహభస్మమునకు సమము అతివస ఇటుల వీనినెల్ల నేకముజేసి తేనెతోగాని లేక నేతితోగాని నూరి కణికలుజేసి కన్నులబట్టిన కంటిపుసి కంటిపువ్వులు అర్మరోగము వీనిని హారింపంజేయు.

## సైంధవాద్యంజనము.

శ్లో॥ [మాధవనిదానే] సైంధవంసూతకం * నాగం ధాత్రీచూ
ర్ణంరసాంజనమ్ । కణాఘృతంసితాక్షౌద్రం నాగవల్లీ దళద్ర
వైః । కాంస్యపాత్రేతామ్రముష్ట్యా దినమేకంవిమర్దయేత్ ।
వర్తింకృత్వాంజనేహంతి సర్వనేత్రగతామయాన్ ॥

తా. సైంధపలవణము రసభస్మము సీసభస్మము ఉసిరికెపప్పు చూర్ణము రసాంజనము పిప్పళ్ళు ఇవిని సమభాగములుగ కంచుపాత్రలోనునిచి నెయ్యి పంచదార పానకము తేనె తమలపాకులరసము అనుపానితో నొకదినము రాగిగుండుతో మర్దించి కణికలుజేసి కన్నులబెట్టిన కంటిపుసి యెఱుపు దురద మొదలగు సర్వనేత్రరోగములు హరించు.

## తారకాద్య వటికములు.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] తారంతామ్రంరసంతుత్థం ఖర్పరీపీతరోహిణీ ।
రసాంజనంకాంస్యశంఖం హంసపాద్యాద్రవైర్దినమ్ ।
వర్తింకృత్వాంజనాద్ధంతి సమస్తంనేత్రజామయమ్ ॥

తా. వెండిభస్మము తామ్రభస్మము రసభస్మము శుద్ధిజేసినమైలుతుత్తముశుద్ధిజేసినకఫరి మ్రానిపసపు కటుకరోహిణి రసాంజనము కంచుభస్మము శంఖము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి హంసపాదియాకు రసముతో నొకదినము మర్దించికణికలుజేసి నీళ్ళతో జాది కన్నులబెట్టిన సర్వనేత్రరోగములు హరించు.

## గ జ కే స రి.

శ్లో॥ [చరకే] మనశ్శిలాహాత్తునాగం నాగాద్ద్విగుణ † తుత్థకం ।
కించిత్కర్పూరకంమర్ద్యం ద్రోణపుష్పరసైర్దినమ్ ।
వర్తిరేషాహ్యభిష్యంది నాశాయగజకేసరీ ॥

తా. శుద్ధిజేసిన మణిశిల సీసభస్మము సీసభస్మమునకు రెండింతలు శుద్ధిచేసిన మైలుతుత్తము వొకింత పచ్చకర్పూరము వీనిని ఖల్వములో నునిచి తుమ్మిపూలరసముతో 1 దినము మర్దించి కణికలుజేసి కన్నులబెట్టిన అభిష్యందము హరించు.

---

* సీసంకర్పూరం ఖర్పరంతథా. † రూప్యకమ్.

## చంద్రకాంజనములు.

శ్లో॥ [చంద్రభాష్యే] తుత్థంతామ్రమయోరజోమధువచా క్షీరం
వరంసైంధవమ్ । శంఖవ్యోషవిళంగసూతకతకం దార్వీచన్య
గ్రోధకమ్ । ధాత్రీతాళకరంజమంజనయుతం చామ్లైశ్చలుంగ
ద్రవైః।పుష్పంనేత్రవికారకాశ్చహరతిశ్చంద్రస్యవాక్చంద్రకమ్॥

తా. శుద్ధిజేసిన మైలుతుత్తము తామ్రభస్మము యినుపభస్మము యష్టిమధుకము వసపాలతుత్తము లవంగములు సైంధవలవణము శంఖము త్రికటుకములు వాయువిడంగములు రసభస్మములు చిల్లగింజలుమానిపసపు మఱ్ఱియూడలు ఉసిరికపప్పు శుద్ధిజేసినతాళకము కానుగవిత్తులు నీలాంజనము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నిమ్మపండ్లరసముతో మాదీఫలరసముతోను మర్దించి కణికలుజేసి నీళ్ళతో జాదికన్నుల బెట్టిన పువ్వులు సర్వనేత్రరోగములు హరించునని చంద్రుడు వచించె.

శ్లో॥ [చంద్రభాష్యే] పటికాంలోధ్రరసాంజనంచతగరంతుత్థంతథా
నాగకమ్।రసకంసైంధవనక్తమాలమధుకం వ్యోషంవిడంగం
సమమ్ । పథ్యాభృంగక మాతులుంగకరసైః రక్తేచనేత్రే
క్షిపేత్ ।పటలంపుష్పక కాచకస్తుహరతిశ్చన్ద్రస్యవాక్చన్ద్రికమ్॥

తా. పటిక లొద్దుగచెక్క రసాంజనము తగరభస్మము శుద్ధిజేసిన మైలుతుత్తము సీసభస్మము శుద్ధిజేసిన కపురి సైంధవలవణము కానుగవిత్తులు యష్టిమధుకము త్రికటుకములు వాయువిడంగములు కరక్కాయ వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గుంటగలగరరసము మాదీఫలరసము అనుపానితో మర్దించి కణికలు జేసి కన్నుల బెట్టిన కంటియెఱుపులు పొరలు పువ్వులు కాచము దురద వీనిని హరింపం జేయునని చంద్రుడు వచించె.

శ్లో॥ [చంద్రభాష్యే] కతకమణిశిలాహ్వధాత్రికాక్షీరతుత్థందరద
మధుకలోధ్రం తాళకాఖ్యంస వీరమ్ । త్రికటుక ద్వికరంజం
దారు దార్వీసవేల్లం పటికకుముద శంఖం తామ్రనాగాభ్ర
కాంతమ్ । కనటిమణిశిలా నై లాళకంత్రపణకంచ జలధిలవణ
ఫేనం గైరికాఖ్యంచ సర్వమ్ । నగనవటక విశ్వా భృంగకం

చార్ద్రికం చాప్యమృతమధుఘృతై స్యాత్కల్పితం నేత్రవర్తి ।
పటలతిమిరపుష్పం కండుకంలోహితంచ శ్వయథుజలనిబ
ర్హాం చంద్రవాక్చంద్రకంచ ॥

తా. చిల్లగింజ శుద్ధిజేసిన మణిశిల పుసిరికపప్పు శుద్ధిజేసిన పాలతుత్తము శుద్ధిజేసిన యింగిలీకము యష్టిమధుకము లొద్దుగచెక్క శుద్ధిజేసిన తాళకము శుద్ధిజేసిన సౌవీరము త్రికటుకములు క్రౌనుగచెక్క నెమలిచెక్క దేవదారు మానిపసపు మిరియాలు పటిక తెల్లకలువ శంఖము తామ్రభస్మము నాగభస్మము అభ్రకభస్మము కాంతభస్మము శుద్ధిజేసిన రక్తమణిశిల శుద్ధిజేసిన తాళకము పిప్పళ్ళు పుష్పు సముద్రపునురుగు కావిరాయి వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మత్తియూడలు శొంఠి గుంటగలగర అల్లము అనువానిరసములతో మర్దించి కణికలుజేసి ఆవువెన్నతోగాని తేనెతోగాని నేతితోగానిచాది కన్నులబెట్టిన కంటిపొరలు తిమిరములు కంటిపువ్వులు దురదయెఱుపు కంటివాపు నీరుగారుట వీనిని హరింపంజేయునని చంద్రుడు వచించె.

## నయనామృతము.

శ్లో॥ [ఆయుర్వేదే] మయూరతుత్థంసింధూత్థం తుత్థంఫేనం రసాంజనమ్ । టంకణం మరిచం తుల్యం జంబీర రసపేషితమ్ ।
త్రిరాత్రం తామ్రపాత్రస్థం కాచార్మ పటలాపహామ్ । కండూవ్రణహరంనామ్నా నయనామృతముత్తమమ్ ॥

తా. శుద్ధిజేసిన మైలుతుత్తము సైంధవలవణము శుద్ధిజేసిన పాలతుత్తముసముద్రపునురుగు రసాంజనము వెలిగారము మిరియాలు వీనిని సమభాగములుగ తామ్రపుపాత్రలోనునిచి నిమ్మపండ్లరసముతో 3 దినములు మద్దించి కన్నులబెట్టిన కాచము అర్మము పొరలు దురద వ్రణము హరించు.

## ఖర్పర్యాద్యంజనము.

శ్లో॥ [మాధవనిదానే] ఖర్పరితుత్థ రసాంజనంఫేనం శంఖశిలాశ్శ పునర్నవత్రిఫలా । నింబరసేన విమర్ద్యచవటికాః కం చతిమిర పటలానిచపుష్పమ్ ॥

తా. శుద్ధిజేసినకఖరి శుద్ధిజేసిన మైలుతుత్తము రసాంజనము సముద్రపునురుగు శంఖము శుద్ధిజేసిన మణిశిల తెల్లగలిజేరు త్రిఫలములు వీనిని సమభాగములుగ ఖల్వ

తా. రెప్పలు రెప్పవెంట్రుకలు వీనిమూలమునందుండు పిత్తము ప్రకోపించుటవలన వెంట్రుకలూడి రెప్పలయందు దురదను దాహమును గలుగంజేసిన పక్ష్మశాతమనంబడు.

## త్రికటుకా ద్యంజనము.

శ్లో॥ [ఆయుర్వేదే] కటుత్రయంచాపి ఫలత్రయంచ జ్యోతిష్మతీ వేల్లకరంజబీజమ్। ప్రపౌండరీకం మధుకంచతామ్రం సింధూద్భవంవై పటికంచశంఖమ్। రసాంజనం గైరిక చందనేద్వే ద్రాక్షానిశాశాబరలోధ్రకంచ। తుత్థంచపీతాహ్వయరోహిణీచ పేష్యంకరంజ స్వరసేనసర్వమ్। తుత్థాదికే ద్విగుణో రసాదిః ప్రపౌండరీకాది గణాంత్రిభాగమ్। శేషం చతుర్భాగమిదంనిహన్యాద్వర్తిస్సునేత్ర స్సకలాంశ్చరోగాన్। కాంచపుష్పంపటలంవ్రణంచదుర్మాంసకండూపిటకంకుకూనమ్। దాహంచరాగంచనిశాన్ధతాంచతథాధి మన్థంవినిహంతిశీఘ్రమ్॥

తా. త్రికటుకములు కరకతాండ్ర యుసిరికెలు పెద్దదుంపవిత్తులు వాయువిడంగములు కానుగవిత్తులు యివి దినుసుకు నాలుగేసిభాగములు ప్రపౌండరీకము అతిమధురము తామ్రభస్మము సైంధవలవణము పటికశంఖము యివి దినుసుకు 3 భాగములు రసాంజనము కావిరాయి శ్రీగంధము రక్తచందనము ద్రాక్షపండు పసపు తెల్లలొద్దుగ లొద్దుగ ఇవి దినుసుకు రెండేసిభాగములు మైలుతుత్తము మ్రానిపసపు కటుకరోహిణి ఇవి దినుసుకొక్కొకభాగము ఇటుల వానినెల్ల ఖల్వములోనునిచి కానుగచెక్క రసముతో మర్దించి కణికలుజేసి ఉచితముతో జాదికన్నునబెట్టిన కాచము పువ్వులు పటలములు వ్రణములు దుర్మాంసము దురదలు పొక్కులుకూనలు కంటియందుమంట యెఱుపులు రేచీకటి అధిమంథము మొదలగు సర్వనేత్రరోగముల తీవ్రముగ హరింపంజేయు.

## కతకా ద్యంజనము.

శ్లో॥ [మాధవనిదానే] కతకస్యఫలంశంఖస్సైంధవం త్ర్యూషణం సితా। ఫేనోరసాంజనంక్షౌద్రం విడంగానిమనశ్శిలా। కుక్కుటాండకపాలం చ ఖల్వే ద్వే వినిక్షిపేత్। సర్వమేతత్సమం

కృత్వానారీ క్షీరేణపేషయేత్ ।తిమిరం పటలంకాచ మర్మ శుక్రం వ్యపోహతి। కండూక్లేదార్బుదంహంతిమలంబాహ్యాం జయేత్తతః॥

తా. చిల్లగింజ శంఖము సైంధవలవణము త్రికటుకములు పంచదార సముద్రపునురుగు రసాంజనము తేనె వాయువిడంగములు మణిశిల కోడిగుడ్డు పెంకులు వీనినిసమభాగములుగ ఖల్వములోనునిచి చనుబాలతో మర్దించి కణికలుజేసి నిమ్మపండ్లరసముతో చాది కన్నులబెట్టిన (వర్త్మరోగము కండ్లదృష్టిని పోగొట్టెడి రోగము) తిమిరము * పటలము కాచము అర్మరోగము కంటిపువ్వులు దురదనీరుగారుట నేత్రార్బుదము కండ్లపుసి హరించు.

## గరుడాంజనము.

శ్లో॥ [పూజ్యపాదీయే] త్రుటిచ మరిచతుత్థం సైంధవం వారిఫేనం పటికదరదశంఖంచందనంకుష్ఠలాక్షా । రజనినరకపాలంకుక్కుటాండంకునట్యా కతకశశిసురాహ్వా తార్క్ష్యశైలంసరాళమ్ । అజపయసిచ వర్షా మీనదృగ్భృంగిసీలి సలిలజ విజయాభిర్ఘృష్ట తంసప్తవారమ్ । తిమిరపటలకాచం ధూమ దృక్చాంధకారం కుకున కుసుమక్లేదం సింధురం నేత్రపాకమ్ । గరుడ సదృశదృష్టిం నిర్మలత్వం ప్రభావ మనుజ హితకరార్థం భాషితం పూజ్యపాదైః॥

తా. ఏలకులు మిరియాలు శుద్ధిజేసిన మైలుతుత్తము సైంధవలవణము సముద్రపునురుగు పటిక ఇంగిలీకము శంఖము శ్రీగంధము చెంగల్వకోష్టు లక్కబిద్యము పసపుమనుజుని తలపుర్రె కోడిగుడ్డు పెంకులు మణిశిల చిల్లగింజలు పచ్చకర్పూరము కేవదారు రసాంజనము గుగ్గిలము వీనిని సమభాగముగ ఖల్వములోనునిచి మేకపాలు చేదు పొన్నగంటి గుంటగలగర నీలి తెల్లకలువ తక్కలి అనువాని రసములలో ప్రతిదానిచే నొక్కొకమారు మర్దించి కణికలుజేసి ఉదకముతోచాది కన్నుల బెట్టిన తిమిరము పొరలు కాచము పొగగప్పిన కన్నులు గనుపించని గన్నులు కూనలుకంటి పువ్వులు కంటిపుసి కంటియెఱుపు నేత్రపాకము హరించి గరుడునితో సమానమైన దృష్టి నైర్మల్యము గలుగు. ఇది లోకహితార్థమై పూజ్యపాదునిచే జెప్పంబడియె.

---

* పటలమన—కంటిపొర.

## నయనామృతము.

శ్లో॥ [ఆయుర్వేదే] కర్పూరమంజనంతుత్థంతార్క్ష్యపీతకరోహిణి।
వరాటంసైంధవంవ్యోషం ఫేనంమధుకచందనమ్।
శంఖంచతత్సమంపిష్ట్వా మాతులుంగరసేనతు।
మధుసర్పిర్యుతంచైవప్యంజనం నయనామృతమ్।

తా. పచ్చకర్పూరము శుద్ధిజేసిన సౌవీరాంజనము శుద్ధిజేసిన మైలుతుత్తము రసాంజనము మ్రానిపసపు కటుకరోహిణి గవ్వలు సైంధవలవణము త్రికటుకములు సముద్రపు నురుగు యష్టిమధుకము శ్రీగంధము శంఖము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మాదీఫలరసముతో మర్దించి కణికలుజేసి తేనెతోగాని లేక నేతితోగాని చాది కన్నుల బెట్టిన సర్వనేత్రరోగములు హరించు.

## గరుడాంజనము.

శ్లో॥ [రసరత్నాకరే] కతక సైంధవ తుత్థకటుత్రయం వటికశంఖ
వరాట రసాంజనమ్। కునటితామ్ర మయోహి మరోహిణీ
జలధిఫేనవచా న్నకరోటికా। ఉరగ పారదటంకణమంజనం
త్రిఫలయా మధుగోచనకంయుతమ్। కరజవల్కరసేన సుపే
షితం గరుడదృష్టి సం కురు తేదృతమ్॥

తా. చిల్లగింజలు సైంధవలవణము శుద్ధిజేసిన మైలుతుత్తము త్రికటుకములు పటిక శంఖము గవ్వలు రసాంజనము రక్తమణిశిల తామ్రభస్మము యినుపభస్మము పచ్చకరూరము కటుకరోహిణి సముద్రపు నురుగు వస టనుజుని తలపుర్రె సీస భస్మము రసభస్మము వెలిగారము సౌవీరాంజనము కరకతాండ్ర యుసిరికెలు యష్టి మధుకము గోరోచనము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి కానుగచెక్క రసముతో బాగుగ మర్దించి కణికలుచేసి నీళ్ళతోజాది కన్నులనెట్టిన గరుత్మంతు నితో సమానమైన దృష్టిగలుగు.

## నేత్రరోగమునకు రసక్రియ.

శ్లో॥ [మాధవనిదానే] పారదోవిద్రుమంనాగ సీసంచరసాంజనమ్।
సైంధవ త్ర్యూషణంతామ్రుం తుత్థం గైరి కలోధ్రికమ్।

పుత్రజీవీశిలాముస్తా గిరికర్ణ్యభయాసమమ్ ।
చించాసా వీరకంశుద్ధం నింబపత్రద్రవైస్త్రితమ్ ।
పిష్ట్వాతామ్రమతలేహ్యాద్యైః వర్తికాచార్మ శుక్లజిత్ ॥

తా. రసభస్మము పగడము సీసభస్మము కాసీసము రసాంజనము సైంధవలవణము త్రికటుకములు తామ్రభస్మము శుద్ధిజేసిన మైలుతుత్తము కావిరాయి లొద్దుగచెక్క పుత్రజీవివిత్తులు శుద్ధిజేసిన మణిశిల తుంగముస్తెలు తెల్లగంటెనవిత్తులుకరక్కాయ చింతగింజలు శుద్ధిజేసిన సౌవీరాంజనము వీనిని సమభాగములుగ ఖల్వాములోనునిచి వేపాకురసముతో మర్దించి ముద్దజేసి తామ్రపుపాత్రలోనునిచి తేనెబోసి రాగిగిన్నెతో మర్దించి కణికలుజేసి తేనెతోజాది కన్నులబెట్టిన ఆర్మము కంటిపువ్వులు హరించు.

## నేత్రాంజనము.

శ్లో॥ [ఆయుర్వేదే] కణాసౌవీరకర్పూర నాగ పారదతీక్ష్ణకమ్ ।
విషంచలోహ పాత్రేతు నంద్యావర్త రసైర్దినమ్ ।
మర్దయేల్లోహ ముష్ట్యాథపటికం చూర్ణితంక్షిపేత్ ।
మర్దితం మర్దయేద్యావో వర్తి శ్శుక్లామ్ల పిత్తజిత్ ॥

తా. పిప్పళ్ళు సౌవీరాంజనము కర్పూరము సీసభస్మము రసభస్మము యినుపభస్మము శుద్ధిజేసిన వసనాభి వీనిని సమభాగములుగ నినుపపాత్రలోనునిచి నంద్యావర్తపు రసముతో నొకదినము యినుపగుండుతో మర్దించి పటికచూర్ణముగలిపిమరల మర్దించి కణికలుజేసి యెండించి కన్నులబెట్టిన కంటిపువ్వులు ఆమ్లపిత్తము హరించు

## తామ్రాద్యంజనము.

శ్లో॥ [మాధవనిదానే] మృతతామ్రం నథాన్యాభ్రం శిఖితుత్థంచ ఖర్పరీ । దశనిష్కంపృథక్చూర్ణమేకీకృత్యచఖర్పరే । క్షిప్త్వా మందాగ్నినాపాచ్యంతద్గర్భే శుద్ధగంధకమ్ । దత్వాల్పమల్పం భూయోహిరుధ్వాధూమం ప్రయత్నతః । చూర్ణితంజాయతే శుద్ధం త్రింశత్కర్షంతు గంధకమ్। సముత్తార్య క్షిపేల్లోహే ప్రస్థమాత్రేతుమర్దయేత్ ।తజ్జలంచాన్యభాండస్థంకృత్వాధః కిట్టివర్జితమ్। తజ్జలంచాతపేశోష్యంఘుసీభూతే విమిశ్రయేత్ ॥

తా. కంటిరెప్పలయందు దోసవిత్తులతో సమానంబులుగ అల్పవేదననునుపు కాఠిన్యము గలవిగనుండు కురుపులు జనించిన అర్శోవర్త్మమనంబడు.

## శుష్కార్శో లక్షణము.

శ్లో॥ దీర్ఘాంకురః ఖరస్తబ్ధో దారుణో భ్యంతరోద్భవః ।
వ్యాధిరేషోతి విఖ్యాత శ్శుష్కార్శో నామనామతః ॥

తా. కంటిలోపల పొడవుగ గరగరగ కఠినముగ దుఃఖకరముగనుండు మాంసపు మొలక జనించిన శుష్కార్శమనంబడు. ఇది త్రిదోషమువలన జనించు.

## అంజన లక్షణము.

శ్లో॥ దాహతోదవతీతామ్రా పిటికావర్త్మసంభవా ।
మృద్వీమందరుజా సూక్ష్మా జ్ఞేయా సాంజననామికా ॥

తా. దాహము పోట్లు అనువానితోడంగూడి యెఱ్ఱగ మృదువుగ చిన్నదిగ నొకింత వేదనగలదిగనుండు కురుపు రెప్పలయందు జనించిన అంజనమనంబడు ఇది త్రిదోషమువలన జనించు.

## బహుళవర్త్మ లక్షణము.

శ్లో॥ వర్త్మోపచీయతేయస్య పిటికాభి స్సమంతతః ।
సవర్ణాభిస్సి రాభిశ్చ విద్యాద్బహుళవర్త్మతత్ ॥

తా. రెప్పలయొక్క సర్వప్రదేశము చర్మముతోసమానముగ కఠినముగనుండు కురుపువలన వ్యాప్తంబై యుబ్బియుండిన బహుళవర్త్మమనంబడు ఇది త్రిదోషము వలన జనించు.

## వర్త్మబంధ లక్షణము.

శ్లో॥ కండూమతాల్పతోదేన వర్త్మశోథేనయోనరః ।
నసమంఛాదయేదక్షీ యత్రాసౌవర్త్మబంధకః ॥

తా. రెప్పలువాచిదురద నొకింతవేదన అనువానితోడంగూడియుండుటవలన మూయుట కనుకూలించకుండిన వర్త్మబంధమనంబడు. ఇది త్రిదోషమువలన జనించు.

## క్లిష్టవర్త్మ లక్షణము.

శ్లో॥ మృద్వల్పవేదనంతామ్రం యద్వర్త్మసమమేనచ ।
అకస్మాచ్చభవేద్రక్తం క్లిష్టవర్త్మేతితద్విదుః ॥

తా. నేత్రములయొక్క క్రిందిరెప్పలు పైరెప్పలు ఏకకాలంబునమ్రుదువులై అల్పవేదనగలవై యెఱ్ఱనై యకస్మాత్తుగ గడునెఱ్ఱగనైన క్లిష్టవర్త్మమనంబడు. ఇది కఫరక్తమువలన జనించు.

## వర్త్మకర్దమ లక్షణము.

శ్లో॥ క్లిష్టంపునః పిత్తయుతం శోణితం విదహేద్యదా ।
తతాక్లిన్న త్వమాపన్న ముచ్యతే వర్త్మకర్దమః ॥

తా. పూర్వోక్తక్లిష్టవర్త్మమునందు మరల పిత్తయుక్తరక్తం బెపుడుదిగనో అపుడది బురదవలెనగు. ఇదియ వర్త్మకర్దమ మనంబడు. ఇది పిత్తాధిక సన్నిపాతమువలన జనించు.

## శ్యావవర్త్మలక్షణము.

శ్లో॥ వర్త్మయద్బాహ్యతోఽంతశ్చ శ్యావంశూనంసవేదనమ్ ।
తదాహుశ్శ్యావవర్త్మేతి వర్త్మరోగవిశారదాః ॥

తా. రెప్పలయొక్క పైభాగము లోభాగము నల్లనై వాచి పోటుతో గూడియుండిన శ్యావవర్త్మమనంబడు. ఇది వాతాధిక త్రిదోషమువలన జనించు.

## ప్రక్లిన్నవర్త్మ లక్షణము.

శ్లో॥ అరుజంబాహ్యతశ్శూనం వర్త్మ యస్యనరస్యహి ।
ప్రక్లిన్నవర్త్మ తద్విద్యాత్క్లిన్న మత్యర్థమంతతః ॥

తా. రెప్ప యొకింత వేదన వెలపట వాపుగలదై రెప్పకొలుకులకు సమీపమున మిక్కుటముగ చితచితలాడుచుండిన ప్రక్లిన్న వర్త్మమనంబడు. ఇది కఫాధిక్యమువలన జనించు.

## అక్లిన్నవర్త్మ లక్షణము.

శ్లో॥ యస్యధౌతాన్యధౌతాని సంబధ్యంతే పునః ।
వర్త్మాన్యపరిపక్వాని విద్యాదక్లిన్న వర్త్మతత్ ॥

తా. కంటిరెప్పల గడిగినను లేక గడుగకున్నను బంకవలె వలుమారు కరచుకొని లోభాగము బండక చీముతో గూడకనుండిన అక్లిన్నవర్త్మమనంబడు.

## వాతహతవర్త్మ లక్షణము.

శ్లో॥ విముక్తసంధిని శ్చేష్టం వర్త్మయస్య నమీల్యతే ।
ఏతద్వాతహతంవర్త్మ జానీయాదక్షిచింతకః ॥

తా. అప్పసంధులు వీడుటవలన కన్నులదెరచుటను మూయుట కశక్యంబై చిన్నవియై రెప్పలు మూతపడకుండిన వాతహతవర్త్మమనంబడు.

## అర్బుద లక్షణము.

శ్లో॥ వర్త్మాంతరస్థంవిషమం గ్రంధిభూతమవేదనమ్ ।
ఆచక్షతేర్బుదమితి సరక్తమవిలంబితమ్ ॥

తా. అప్పలయొక్క లోభాగము మంతవేదనగలదై వొకింత యెఱ్ఱనై శీఘ్రముగ వృద్ధి జెందునదియై విషమమై దానియందు గ్రంధిజనించిన అర్బుదమనంబడు. ఇది త్రిదోషములవలన జనించు.

## నిమేష లక్షణము.

శ్లో॥ నిమేషిణీ స్సిరావాయుః ప్రవిష్టోవర్త్మసంశ్రయః ।
ప్రచాలయతి వర్త్మాని నిమేషం నామతంవిదుః ॥

తా. అప్ప నాశ్రయించియుండు వాయువుని మేషోన్మేషముల జేయునట్టి సిరలయందుజేరి రెప్పల గదలింపుచుండిన నిమేషమనంబడు.

## శోణితార్శో లక్షణము.

శ్లో॥ వర్త్మస్థోయోవివర్ధేత లోహితోమృదురంకురః ।
తద్రక్తజంశోణితార్శ ఛిన్నంఛిన్నంప్రవర్ధతే॥

తా. రక్తసంబంధమువలన రెప్పలయొక్క లోభాగమున యెఱ్ఱగ మృదువుగ నుండు మొలకలుజనించిన శోణితార్శమనంబడు. దీనిని బలుమారు గోసినను మరల బెరుగుచుండు.

## లగణ లక్షణము.

శ్లో॥ అపాకీ కఠినస్థూలో గ్రంథిర్వర్త్మ భవోరుజః ।
సకండూః పిచ్ఛిలః కోల సంస్థానో లగణస్తునః ॥

తా. రెప్పలయందు రేగుకాయవలె కఠినముగ స్థూలముగ కండూయుక్తముగ జిగటగనుండు గ్రంథి జనించిన లగణమనంబడు. ఇది కఫాధిక్యమువలన జనించు. దీనియందు పోట్లుపాకము (పండుట) లేకుండు.

## బిసవర్త్మ లక్షణము,

శ్లో॥ త్రయోదోషాబహిశ్శోథం కుర్యుచ్ఛిద్రాణివర్త్మనోః ।
ప్రస్రవత్యంతరుదకం బిసవద్బిసవర్త్మతత్ ॥

తా. దోషత్రయప్రకోపమువలన రెప్పల పైభాగము వాచి ఛిద్రములతోగూడి తామరతూండ్లవలె లోన నీరునుగార్చుచుండిన బిసవర్త్మమనంబడు.

## కుంచన లక్షణము,

శ్లో॥ వాతాద్యావర్త్మ సంకోచం జనయంతియదామలాః ।
తదా ద్రష్టుంనశక్నోతి కుంచనంనామతద్విదుః ॥

తా. ప్రకోపించిన వాతాదిదోషములు రెప్పల చిన్నవిగజేసిన నేత్రముల దెరచి చూచుట కశక్యంబగు. ఈ రోగము కుంచనమనియు లేక కృచ్ఛ్రోన్మీలసమనియు జెప్పంబడు.

## పక్ష్మకోప లక్షణము.

శ్లో॥ ప్రచాలితాని వాతేన పక్ష్మాణ్యక్షి విశంతిహి ।
ఘృష్యంత్యక్షి ముహుస్తాని సంరంభం జనయంతిచ ।
అసితేసితభాగేచ మూలకోశాత్పతంత్యపి ।
పక్ష్మకోపస్సవిజ్ఞేయో వ్యాధిఃపరమదారుణః ॥

తా. వాతముచే కంటిరెప్పలు చలింపజేయబడుటవలన వెంట్రుకలు కంటిలో బ్రవేశించి పలుమారు తెల్లగుడ్డునందుగాని నల్లగుడ్డునందుగాని నొరసికొనుటచే వాపుగలిగి వెంట్రుకలు మూలమునుండి పడును. ఇదియ. పక్ష్మకోపమనియు అథవాపుపక్ష్మమనియు జెప్పంబడు యిది కడుభయంకరమైనది.

## పక్ష్మశాత లక్షణము.

శ్లో॥ వర్త్మ పక్ష్మాశయగతం పిత్తం రోమాణిశాతయేత్ ।
కండూదాహంచ కురుతే పక్ష్మశాతం తమాదిశేత్ ॥

ములోనునిచి నిమ్మపండ్లరసముతో బాగుగనూరి కణికలుజేసి నీళ్ళతోఁజాది కన్నుల బెట్టిన కాచము తిమిరము పొరగప్పిన కండ్లు కంటిపువ్వు హరించు.

## తిలపుష్పాంజనము.

శ్లో॥ [భావప్రకాశే] మరీచంఖర్పరీచైవ తిలపుష్పంతథైవచ।
పక్షైకంద్విగుణంప్రోక్తం జంబునీరేణపేషయేత్ ।
నాశయే త్తిమిరంకండూం పటలాన్యర్బుదానిచ ।
అతిరక్తానిమాంసాని హ్యేకరాత్రేణనాశయేత్ ॥

తా. మిరియాలు 2 భాగములు శుద్ధిజేసిన కఫరి 4 భాగములు నువ్వులపువ్వు 8 భాగములు యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో మర్దించి కణికలుజేసి కన్నులబెట్టిన * తిమిరములు దురద కంటిపొరలు అర్బుదము కంటియె ఱుపు దుర్మాంసము 1 దినములో హరించు.

## మరిచాంజనము.

శ్లో॥ [ఆయుర్వేదే] మరిచామలకం కరంజబీజం క్రమవృద్ధ్యాత్తర భృంగతోయవర్తిః । తిమిరంపటలం హంతికాచం సుకృతం కర్మయథాకృతంభవేత్తత్ ॥

తా. మిరియాలు 1 భాగము పుసిరికవరుగు 2 భాగములు కానుగవిత్తులు 3 భాగములు యిటుల వీనిని ఖల్వములోనునిచి గుంటగలగరాకురసముతో నూరి కణికలుజేసి నేత్రములయందంజనము జేసిన కానరానికన్నులు పొరలు కాచము జన్మాంతర సుకృతకర్మవలన హరించు.

## చంద్రప్రభాంజనము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] ఫేనంచముండం కతకస్యబీజం నారంకపారంసహకుక్కుటాండమ్ । మనశ్శిలామాధవ సంప్రయుక్త మాజన్మజాతం కుసుమంవిహంతి ॥

తా. సముద్రపునురుగు యినుపభస్మము చిల్లగింజ వరునికపాలము కోడిగుడ్ల పెంకులు శుద్ధిజేసిన మణిశిల వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి జీలకఱ్ఱ

* తిమిరమనగా—కండ్లు గానరాకుండుట.

కషాయములో నూరి కణికలు జేసి కన్నుల బెట్టిన జనించినది మొదలుకొని యుండుకంటిపువ్వులు హరించు.

## చంద్రోదయవర్తి.

శ్లో॥ [ఆయుర్వేదే] * హరిద్రానింబపత్రాణి పిప్పలీమరిచానిచ । ‡ విభీతకికరంజాని శంఖనాభిర్మనశ్శిలా। † ఏతానిసమభాగాని ప్యాజామూత్రేణపేషయేత్ । ‡ నాశయే త్తిమిరంకండూం పటలాన్యర్బుదానిచ । అప్రితివార్షికంశుక్రం మాసేనైకేన నాశయేత్ । అధికానిచమాంసాని రాత్ర్యంధత్వంతథైవచ । వర్తిశ్చంద్రోదయానామ నృణాందృష్టివిశోధనీ ॥

తా. పసపు వేపచిగురు పిప్పళ్ళు మిరియాలు తానికాయలలోని పలుకులు కానుగవిత్తులు శంఖము శుద్ధిజేసిననాభి శుద్ధిజేసిన మణిశిల వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మేకపంచితముతో నూరి కణికలుజేసి నీళ్ళతో చాది కన్నుల బెట్టిన కండ్లుకానరాకుండుట దురద పొరలు అర్బుదము 3 సంవత్సరములుగనుండు కంటిపువ్వులు గుర్మాంసములు రేచీకటి వీనిని 1 మాసములో హరింపంజేయు.

## నేత్రరోగములకు దార్వ్యాద్యంజనము.

శ్లో॥ [శారీరే] దార్వ్యంచపటలంకాంచం పిల్లరక్తం తథార్జునమ్ । స్రావార్మనక్తరోగాణి కండూక్లేదంవ్యపోహతి । యూధికాఘర్షణంశూలం వర్త్మరోగంవినాశయేత్ । నాశయేచ్ఛుక్లరోగాంశ్చ విజానీయా ద్విశేషతః ॥

తా. రసాంజనము కన్నులబెట్టిన కంటిపొరలు కాచము కంటిపుసియొలుపు ఆర్జునము నీరుగారుట అర్మరోగము రేచీకటి దురద కండ్లుబ్బుకొనుట వీనిని హరింపంజేయు మఱియు అడవిమొల్ల గంధమును కన్నులబెట్టిన కంటినొప్పి వర్త్మరోగము పువ్వులు వీనిని హరింపంజేయు.

* హరీతకీనచాకుష్ఠ ‡ విభీతకస్యమజ్జాచ. † సర్వమేతత్సమంకృత్వా
‡ వారికండూంచ తిమిరమర్బుదంపటలానిచ । అతిరక్తాని మాంసాని
పుష్పం వర్త్మనిహంతిచ.

గిరికర్ణి కాద్యంజనము.

శ్లో॥ [అన్యశాస్త్రే] సితగిరికర్ణిమూలం బీజంపుష్పాణిపేషయేద్వర్తిమ్ । శంఖంనిశాభయశుంఠిగతమపిచక్షుర్నివర్తయేత్ ॥

తా. తెల్లగంటెనవేరు దానివిత్తులు పువ్వులు శంఖము పసుపు కరక్కాయ శొంఠి వీనిని సమభాగములుగ గ్రహించి గంటెనవేరురసముతో మర్దించి కన్నుల బెట్టిన పోయిన కన్నులుకూడ మరలవచ్చును.

కుమారికా వర్తి.

శ్లో॥ [వృతాంతరే] అశీతిస్తిలపుష్పాణి మరిచానిచషోడశ ।
పంచాశజ్జాతిపుష్పాణి షష్టిఃపిప్పలితండులాః ।
* ఇయాంచంద్రప్రభానామ వర్తిస్తిమిరనాశిని ॥

తా. నువ్వులపువ్వులు 80 మిరియాలు 16 జాజిపువ్వులు 50 పిప్పలిబియ్యము 60 యిటుల వీనినెల్లనూరి కణికలుజేసి కన్నులబెట్టిన తిమిరములు హరించు.

శిలాద్యంజనము.

శ్లో॥ [సూరసూత్రే] శిలామాగధికర్పూరంపురాణంతింత్రిణీఫలమ్।
కరజంసూరసూత్రేణ దివానక్షత్రదర్శనమ్ ॥

తా. శుద్ధిజేసిన మణిశిల పిప్పళ్ళు పచ్చకర్పూరము ప్రాతచింతపండు క్రానుగవిత్తులు వీని నువకముతోనూరి కన్నులకుబెట్టిన పగటియందు నక్షత్రములు గనుపించు.

నారికేళాంజనము.

శ్లో [భేషజకల్పే] దార్వీవరామధుకమంభసినారికేళపక్వాపభాగపరిశిష్టరసంపునస్తత్ । సాంద్రంవిపాచ్యసశిసైంథవ మాక్షీకాఢ్యం † హంత్యర్మకాచతిమిరార్బుదవర్త్మరోగాన్ ॥

* ఏషాకుమారికావర్తిర్గతంచక్షుర్నివర్తయేత్ ॥ పోయిన కండ్లుకూడా మరల వచ్చును.

* యుంజాద్వ్రిణార్తి—తిమిరార్తిషుపిత్తజేషు ॥...పిత్తమువలన గలిగిననేత్రవ్రణము తిమిరము.

తా. ద్రాక్షపండ్లు కరక తాండ్ర యుసిరికెలు యష్టిమధుకము వీనిని దినుసు యొకటింటికి కాకొక్క పలముచొప్పున నలగగొట్టి కుంచెడు నారికడపుకాయ నీటిలో వైచి 8 వ భాగము శేషించునటుల కషాయముకాచి మరియొకకుండలోబోసి సన్నపుసెగను సోలెడు శేషించునటులకాచి చల్లార్చి యందు 4 మాడలయెత్తు పచ్చ కర్పూరము మాడయెత్తు సైంధవలవణము 5 చిన్నములయెత్తు తేనెగలిపి కన్నుల బెట్టిన అర్మముకాచము తిమిరము అర్బుదము వర్త్మరోగము (నీరుగారుట) వీనిని హరింపంజేయు.

నేత్రరోగములకు మహానారికేళాంజనము.

శ్లో॥ [ఆయుర్వేదే] మధుకవరాద్రాక్షాణాం పృథక్పలానాంనారికేళసలిలస్య। ప్రస్థేవిపచేదేతత్తు ల్యాంశంతత్పునఃపచేత్పాత్రే। తత్థ:శశిఫేనగైరిక సిందూత్థరసాంజనాని మరిచంచ। పృథక్పృథక్పాదనిష్కం క్షీపేదాలోడ్యమాక్షికవిష్కశమ్। అంజనమఖిలేనేత్ర షడధిక నవతింనిహంత్యాశు॥

తా. యష్టిమధుకము కరక తాండ్రయుసిరికెలు ద్రాక్షపండ్లు వీనిని దినుసు కొక్కొక పలముచొప్పున దంచి 1 ప్రస్థపు నారికడపుకాయ నీటిలోవైచి 8 వ భాగము మిగులునటుల కషాయముకాచి మరియొకకుండలోబోసి సన్నపుసెగను మరల కాచి 5 పలములుగ దించుకొని చల్లార్చి పిదప యందు శుద్ధిజేసిన మైలుతుత్తము పచ్చకర్పూరము సముద్రపునురుగు కావిరాయి సైంధవలవణము గసాంజనము మిరియాలు అనువాని చూర్ణమును దినుసు కాలునిష్కము చొప్పున గలిపి తేనె 1½ తులముబోసి కన్నులకుబెట్టిన 96 నేత్రరోగములు హరించు.

శంఖాది వటికములు.

శ్లో॥ [ఆయుర్వేదే] శంఖస్యభాగాశ్చత్వార స్తదర్ధంచమనశ్శిలా। మనశ్శిలార్ధంమరిచంమరీచార్ధంచ * సైంధవమ్। అజాక్షీరేణసంమర్ద్య ఘుటికాంకారయేద్బుధః। నిశాంధ్యంతిమిరం కాచంపుష్పాణిపటలానిచ। అతిమాంసానిరక్తాని సప్తరాత్రేణనాశయేత్। వారిణాతిమిరంహంతి పూయార్బుదంహంతిమస్తునా। పిచ్చటంమధునాహంతి స్త్రీక్షీరేణ తథార్జునమ్॥

* పిప్పలీ.

తా. శంఖము 4 భాగములు శుద్ధిజేసినరక్తమణిశిల 2 భాగములుమిరియాలు 1 భాగము సైంధవలవణము ½ భాగము యిట్టులవీనినెల్ల నేకముజేసి మేకపాలతో మర్దించి కణికలుజేసి కన్నుల బెట్టిన రేజీకటి కండ్లుగానరాకుండుట కాచము కంటి పూలు పొరలు గుర్మాంసములు కంటియెఱుపులు 7 దినములలో హరించు. నీళ్ళతో జాదివేసిన తిమిరము హరించు. పెరుగుమీది నీళ్ళతో జాదివేసిన అర్బుదము హరిం చు. తేనెతో జాదివేసిన పిచ్చటమను నేత్రరోగము చనుబాలతో జాధివేసిన దర్జునము హరించు.

## పుష్పాంజనము.

శ్లో॥ మంజిష్ఠామధుకోత్పలందధికణా త్వక్పథ్యగోరోచనమ్ ।
మాంసీచందనశంఖకం గిరిమృదాతుత్థంసపుష్పాంజనమ్ ।
సర్వంచైవసమానమంజనమిదం యోజ్యంసదాచక్షుషామ్ ।
కండూక్లేదమలంచశోణితరుజంపిల్లంచ శుక్లాపహమ్॥

తా. మంజిష్ఠ అతిమధురము కలువపువ్వు పెరుగుపిప్పలిలవంగపట్ట చవ్యము గోరోచనము జటామాంసి చందనము శంఖము కావిరాయి శుద్ధిజేసిన మైలుతుత్తము పుష్పాంజనము వీనిని సమభాగములుగనూరి నేత్రములయందు సదా అంజనము వేయుచుండిన దురద నీరుగారుట కెంటిపుసి యెఱుపు కంటినొప్పి పిల్లము శుక్రము హరించు.

## గోదంతాద్యంజనము.

శ్లో॥ గోదంతంకుక్కుటాండంమకరజ దశనంశంఖచూర్ణంవరాట
మ్। సారంగోద్భూతదంతా జలధిమలయుతం తామ్రచూర్ణం
సతుత్థమ్ । కర్పూరంరాస్నకంసై పటికమణిమధూచ్ఛిష్టమం
దాగ్నిఘృష్టే । పుష్పంచార్మార్జునంత త్తిమిర పటలకాంకా
చకం హంతినేత్రే ॥

తా. ఆవుయొక్కదంతము కోడిగుడ్డుపెంకులు ముసలిదంతము శంఖచూర్ణము గవ్వలచూర్ణము జింకపండ్లు సముద్రపునురుగు తామ్రచూర్ణము శుద్ధిజేసిన మైలు తుత్తము పచ్చకర్పూరము సన్నరాష్ట్రము చంద్రకాంతమణి జుంటిమైనము వీనిని పాత్రలోనిడిమందాగ్నిపైనునిచి బాగుగ మర్దించిపిమ్మట నిమ్మపండ్లపులుసుతోమర్ధించి

కణికలుజేసి నేత్రములయం దంజనమువేసిన కంటిపువ్వులు అర్మము అర్జునము తిమిరము కంటిపొరలు కాచము వీనిని హరింపంజేయు.

## ధాత్ర్యంజనము.

శ్లో॥ [మాధవనిదానే] దాత్రీపథ్యావిభీతానాం ఫలమజ్జావిచూర్ణితమ్ । వారిణాపూరితంచక్షు స్తిమిరంహంతినిర్భరమ్ ॥

తా. ఉసిరికపప్పు కరక్కాయ తానికాయ వీనిపప్పును చూర్ణముజేసి నిమ్మపండ్లరసముతో మర్దించి కణికలుజేసి నేత్రములయం దంజనమువేసిన కండ్లలోనీరు గారుట తిమిరము హరించు.

## ఉత్పలాద్యంజనము.

శ్లో॥ ఉత్పలంసైంధవంరక్తం చందనంత్రిఫలాతథా ।
నిశాంధ్యంతిమిరంహంతి పటలంచక్షురంజనమ్ ॥

తా. కలువపువ్వులు సైంధవలవణము రక్త చందనము త్రిఫలములు వీనిని నిమ్మపండ్లరసముతో మర్దించి అంజనము వేసిన రేజీకటి తిమిరము కంటిపొరలు హరించు.

## అర్ధచంద్రోదయము.

శ్లో॥ కర్పూరంపటికంశంఖం చందనంమధుశారిబా । మంజిష్ఠారజనీద్వేచకతకంగైరికంసమమ్ । సర్వైస్సమంచతుర్థంచజంబీరరసమర్దితమ్ । రాత్ర్యాంధ్యంతిమిరంకండూం పటలంకాచమేవచ। వర్త్మాంతేజాయతేపుష్పం మాసేనైకేనశామ్యతి ।
అర్ధచంద్రోదయోనామ్నా సర్వనేత్రేరుజాపహః ॥

తా. పచ్చకర్పూరము పటిక శంఖము చందనము యష్టిమధుకము గూడపాల మంజిష్టి పసపుమ్రానిపసపు చిల్లగింజ కావిరాయి యివిసమభాగములు వీనికన్నిటికి సమము శుద్ధిజేసిన మైలుతుత్తము యిటుల వీనిని ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో మర్దించి అంజనము వేసిన రేచీకటి తిమిరము దురద పొరలు కాచము వంటిరెప్పకొనయందు జనించురోగము పువ్వులు మొదలగు సర్వనేత్రరోగములు 1 మాసములోహరించు, (శుద్ధిజేసిన మైలుతుత్తము మూడేగానులుయెత్తును శుద్ధిజేసిన కర్పూరతులము శుద్ధిజేసిన పటిక 1 తులము 10 జీడిగింజలమని యిటుల వీనినెల్ల నిమ్మ

పండ్లరసముతో మర్దించి రాగితట్టలోనుంచి ఆవువెన్నగలిపి రాగిముంతతో మరల మర్దించి 23 దినములు కరాటమున నునిచి పిదప దానినిదీసి మరలమర్దించి మరల కరాటమున 33 దినములునిచి కన్నులబెట్టి నేత్రరోగములు మాదకండ్లు దూల మాదలు తిమిరమాదలు పుసిమాదలు నీరుగారుట దురదకామిల పసరుకామిల రేచీకటి పటలములు శిరోవాతములు కపాలశూలలు కన్నులదరుట పక్షాఘాతము శిరోవాతము దుర్మాంసము కంటియెరుపు నిలువకండ్లు పిల్లములు అభిష్యందము హరించు)

## కాయకండ్లకు చికిత్స.

సీ॥ పెనురేకుతాళకంబును రక్తమణిశిల । పసపును మిరియంబు పటికశంఖ । గంధకసారంబుసైంధవలవణంబు । సమభాగములుగూర్చిజంబుఫలము । సారంబుతోనూరి సరవిగామర్దించి । కణికలుచేసియుగన్నుఁగవల । గంధంబుదీసియు ఘటియింపఁ గాగాఁయ। కన్నులునుర్మాంసగతులుపొరలు। గప్పనవియును నెఱుఁగనికన్నుఁగవను। నిశివిరిసినీరుగారెడి నేత్రములును । గంటిపువ్వులునూనుఁ బ్రఖ్యాతముగను । ప్రజలకెల్లను నాద ప్రమరముగను ॥

సీ॥ ఘనతామ్రభస్మంబు గరకకాయలుజీడి । గింజలమసియును మంజులముగ॥ వెన్నతోఁగూరిచినెనరాగిముంతపై । దగమర్దనము చేసిథరణియందు । నక్షిరోగులకండ్లనమరంగవైచిన । కామిళ్ళమాదలుకండ్లదూల । మాదలుతిమిరంపు మాదలు పుసిమాద।దుర్మాంసరేచిక్కుదురదకండ్లు। నేత్రవాతంబులెరుపులునేత్రశూల । పక్షవాత శిరోవాత పసరుకామి లలుక పాలంపుశూల లత్యలఘుసన్ని । గండమాలలు మరిసూతిపుండ్లడంగు ॥

## నేత్రరోగములకు నృపవల్లభ తైలము.

శ్లో॥ [మాధవనిదానే] ఏరండమూలం తగరంశతాహ్వా జీవంట
రాస్నాసహాసైంధవంచ । భృంగంవిడంగం మధుయష్టికంచ

విశ్వౌషధంకృష్ణతిలన్యతైలమ్ । అజాపయశ్చైలవినిఃశ్రితంచ
చతుర్గుణంభృంగరసంచయుక్తం । షడ్బిందవోనాసికయోర్విధేయాశ్శీఘ్రంనిహన్యుశ్శిరసో వికారాన్ । చ్యుతాంచకేశాన్ సలితాంశ్చదంతాన్ దుర్గంధమూలాంశ్చవ్యపాకరోతి ।
సుపర్ణదృష్టిప్రతిమంచ చక్షుశ్శిరో ర్తినాశంచ కరోతిసమ్యక్॥

తా. ఆముదపు వేరు గ్రంథితగరము సదాప మనుబాల దుంపరాష్ట్రము పైం ధవలవణము గుంటనలగర వాయువిడంగములు యష్టిమధుకము శొంఠి వీనిని సమ భాగములుగ చూర్ణముజేసి యందు నల్లనువ్వులనూనె మేకపాలు శిలాజిత్తు నూనెకు 4 గింతలు గుంటగలగరాకురసము గలిపి చిక్కగ తైలముకాచి 6 బిందువులను నస్యముజేయించిన శిరోరోగమును శీఘ్రముగ నశింపంజేయు. మఱియు రాలిపోయిన వెంట్రుకలు మరల మొలుచు నసిన వెంట్రుకలు నల్లగనగు దంతమూలములయందలి దుర్గంధము హరించు. నేత్రరోగములుమాని గరుత్మంతునితో సమానమైన దృష్టి గలుగు. తలనొప్పిహరించు.

## యష్ట్యాదితైలము.

శ్లో॥ యష్టీకుష్ఠమధూకచోరకపరాగోపీవిదారీబలా ।
మోచాంభోరుహకందకే సరనతంశీతాంబుపాండూత్పలైః ।
శ్రీఖండేనయుతైశ్శృతంతి లభవంధాత్రీగుళూచీజయా ।
ఛాగీమగ్ధసమంశిరోనయనజాన్నస్యాత్సమస్తాన్ గదాన్ ॥

తా. యష్టిమధుకము చెంగల్వకోష్టు యిప్పపువ్వులు కచోరములు పిల్లిపీచర గూడపూల నేలగుమ్ముడుగడ్డ ముత్తవపులగము పెద్దముత్తవపులగము బూరుగబంక తామరగడ్డలు తామరగరులు గ్రంథితగరము కురువేరు తెల్లకలువగడ్డ శ్రీగంధపు పునిరికెపప్పు తిప్పతీగె కరక్కాయలు శొంఠి సమభాగములుగ దంచికషాయము కాచి దానికి సమముగ మేకపాలు నూనెగలిపి చిక్కగకాచి నస్యముజేయించిన సర్వరోగములు కంటినొప్పి సర్వనేత్రములు హరించు. (తిప్పతీగాకు గుంటగలగ రాకు దొండాకు తులసియాకు నేలతులసియాకు పొన్నగంటాకు అనువాని యొక్క రసమును దినుసు కొక్కొకభాగము నెయ్యి 6 వ భాగము గలిపి చిక్కగకాచి నస్యముజేయించిన నేత్రరోగములు హరించు.)

## నేత్రరోగములయందు పథ్యము.

శ్లో॥ శాలితండులగోధూమముద్గసైంధవగోఘృతమ్ ।
గోపయశ్చసితా క్షౌద్రంపథ్యంనేత్రామయేస్మృతమ్ ॥

తా. వరిబియ్యము గోధుమలు పెసలు సైంధవలవణము ఆవునెయ్యిఆవుపాలు పంచదార తేనె యివి నేత్రరోగములయందు పథ్యకరంబులు.

## నేత్రరోగములయం దపథ్యము.

శ్లో॥ సర్వశాకమచక్షుష్యంచక్షుష్యంశాకపంచకమ్ । జీవంతీవాస్తుమత్స్యాక్షీ మేఘనాదఃపునర్నవా । అచక్షుష్యంభవేచ్ఛాకమచక్షుష్యంసురారథి । తథాన్నై హింగులవణంపిణ్యాకంపిష్టమాషకమ్ । స్నానవ్యాయామతాసీయం తాంబూలంక్రోధఆతపః । తేజోనిరీక్షణంజ్వాలామక్షిరోగీవివర్జయేత్ ॥

తా. మనుబాల చక్రవర్తికూర పొన్నగంటికూర చిట్టికూర గలిజేరు అన నీ 5 తప్ప తక్కిన యాకుగూరల సర్వమైన యాకుకూరలు కల్లు పెరుగు యింగువ వుప్పు తెలికపిండి పిండివంటకములు స్నానము సంచారము వుదకపానము తాంబూలము కోపము యెండ తేజస్సునుజూచుట అగ్నిజ్వాల వీనిని నేత్రరోగము గలవారు వర్జింపవలయు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థ ప్రసాద ఘారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కౌరాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
నేత్రరోగ నిదాన తల్లక్షణ తచ్చికిత్సాను
పాన పథ్యాపథ్య లక్షణయుక్తం
సప్తదశ ప్రకరణమ్.

శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

### —అ ష్టా ద శ ప్ర క ర ణ ము.—

శ్లో॥ భూతేశం సర్వభూతేశం నాయకం సర్వనాయకమ్ ।
దేవం దేవ మహాదేవం శంభుమూర్తి మహంభజే ॥

తా. భూతప్రేత పిశాచాదులకు ప్రభువు పృథివ్యాది పంచభూతములకు ప్రభువు నాయకుడు సర్వప్రపంచమునకు నాయకుడు। సర్వదేవతలకు దేవుడు మహాదేవుడునగు పరమేశ్వరుని నేను భజించెద.

శ్లో॥ శ్రీనీలకంఠ వంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహంవైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠ వంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజు యని పేర్కొనబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీ గ్రంథముయొక్క అష్టాదశ ప్రకరణమును వచింపుచున్నాడను.

#### స్థౌల్యరోగ నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] అవ్యాయామ దివాస్వప్న శ్లేష్మాహార నిషేవణాత్ । * న స్నేహైః ర్మధురై ర్మాంసై ర్మేదోవర్ధతి నాన్యథా । మేద సావృత మార్గత్వా త్పుష్యం త్యన్యేన ధాతవః । మేదస్తు చీయతేయస్మా దశక్తస్సర్వకర్మను ॥

తా. సంచారము సేయకుండుట పగలునిద్రించుట కఫకరపదార్థముల సేవించుట స్నేహయుక్తపదార్థములగాని లేక జిగటుగల పదార్థములగాని లేక మధుకర రసములగాని సేవించుట మిక్కుటముగ మాంసమును భుజించుట యీకారణముల

---

* మధురోన్న రసః ప్రాయా స్స్నేహా న్మేదో వివర్ధతే॥

వలన మేదోరోగము జనించు. మఱియు మేదస్సుచే మార్గము నడ్డగింపబడుటవలన యితర ధాతువులు వృద్ధిం జెందకుండు దానంజేసి స్థౌల్యరోగముగలవాడు సర్వకర్మలయందు నశక్తుండగు. (రసవాహినీ సిరోమార్గములయందు మేదస్సు వ్యాపించి అస్థి మొదలగు వానికి శుక్రమునకు పోషణను గలుగంజేయకుండుటవలన మేదస్సు అధికాధికముగ వృద్ధిం జెందు.)

## స్థౌల్యరోగ లక్షణము.

శ్లో॥ స్థూలత్వం తుందవృద్ధిశ్చ క్షుద్రశ్వాసః క్రమాద్భవేత్ । అతిస్వేదోల్పదౌర్గంధ్యమల్పప్రాణోల్పమైథునః। ఆహారః పచ్యతే శీఘ్రం పునః కాంక్షతిభోజనమ్ । వికారాశ్చైవ తేఘోరాః కాంశ్చిత్కాల వ్యతిక్రమాత్ । అతిస్థౌల్యే తృషామోహ జ్వరంవాథ భగందరమ్। వ్రణంకృచ్ఛ్రంమేహకుష్ఠం కాసం శ్వాసంకరోతిచ । తత్రమేదోనిలశ్లేష్మనాశనం సర్వమిష్యతే । శ్యామాయవ కుళుత్థాన్నం ముద్గాన్నైస్సముపాచరేత్ । మధూదకైస్సురాపానైర్లఘురూక్షోష్ణభోజనైః । కటుతిక్త కషాయాతి చింతా వ్యాయామజాగరైః । లంఘనై రుపవాసైర్వా స్థౌల్యరోగ ముపాచరేత్ ॥

తా. శరీరము బలిసి కడుపు పెరిగి క్షుద్రశ్వాసముగలుగుట మిక్కుటముగ చెమటబట్టుట శరీరమొకింతకంపువేసుట బలముతగ్గుట మైథునశక్తిలేకుండుట కొంత కాలము గడచిన పిదప భయంకరములగు కొన్నివాతాది వికారములు గలుగుట అతిస్థౌల్యముగలుగుట దప్పి మోహము జ్వరము భగందరము వ్రణములు మూత్రకృచ్ఛ్రము మేహము కుష్ఠువు దగ్గు వుబ్బసముగలుగుట మేదోరోగమువలన మేదస్సు వాత శ్లేష్మములు మొదలగునవి యన్నియు నశించుట యీ లక్షణంబులు స్థౌల్యరోగముల గలుగునని దెలియవలయు. దీనిని చామలవంటకమ్ము యవలు వులవయన్నము పెసర పులగము పానకము సురాపానము లఘువై రూక్షకరమై యుష్ణముగనుండు వంటకము కారమువొగరు చేదుగల ద్రవ్యములు మిక్కుటముగ జింతించుట వ్యాయామము జాగరణము లంఘనము లేక ఉపవాసము అనువానివలన నుపచరింపవలయు.

## మేదోవృద్ధి లక్షణము.

శ్లో। క్షుద్రశ్వాస తృషామోహ స్వప్నక్రథనసాదనైః ।
యుక్తః క్షుత్స్వేదదౌర్గంధ్యై రల్పప్రాణోల్పమైథునః॥

తా. మేదస్సు వృద్ధిం జెందుచుండ క్షుద్రశ్వాసము దప్పి మోహము అని అకస్మాత్తుగ శ్వాసమునకు ప్రతిబంధము లేక నిద్రించునపుడు బలముగ గురకలు విడుచుట శరీరమున బడలిక తుమ్ములు చెమట దౌర్గంధ్యము అల్పశక్తి అల్పమైథునము అనునవి గలుగు.

శ్లో॥ మేదస్తు సర్వభూతానా ముదరే హ్యస్థిషుస్థితమ్ ।
అత ఏవోదరే వృద్ధిః ప్రాయో మేదస్వినోభవేత్ ॥

తా. మేదస్సు విశేషముగ సర్వప్రాణుల యొక్క యుదరమధ్యమునందును అస్థులయందునుండు దానివలన మేదస్సుగల పురుషునికి విశేషముగ నుదరము వృద్ధిం జెందు.

## స్థూల లక్షణము.

శ్లో॥ మేదోమాంసాతి వృద్ధత్వా చ్చలస్ఫిగుదర స్తనః ।
అయథోపచయోత్సాహో నరోతి స్థూల ఉచ్యతే ॥

తా. మేదస్సు మాంసము మిక్కుటము వృద్ధిం జెందుటవలన నరుని యొక్క స్ఫిక్కు వుదరము స్తన్యములు నడుచునపుడు దిగబడి కదలుట మునుపటివలె శరీర వృద్ధి వుత్సాహము లేకుండుట యీలక్షణములుగలిగిన స్థూలరోగమని తెలియవలయు

## మేదోరోగాసాధ్యత్వము.

శ్లో॥ మేదస్యతీ వసంవృద్ధే సహసైవా నిలాదయః ।
వికారాన్ దారుణాన్ కృత్వా నాశయంత్యాశు జీవితమ్ ॥

తా. మేదస్సు మిక్కుటముగ వృద్ధిం జెందుటవలన వాతాదిదోషములు దుష్టంబులై యకస్మాత్తుగ భయంకర వికారములు (అనగా ప్రమేహ పిటికా జ్వర భగందర విద్రధి వాతరోగములు) గలుగంజేసి తీవ్రముగ ప్రాణముల హరింపంజేయు.

## చవ్యాది చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] సచవ్యజీరకవ్యోషహింగుసౌవర్చలానలాః ।
మధునాస క్తవః పీతా మేదోఘ్నా వహ్నిదీపనాః ॥

తా. చెవ్యము జీలకఱ్ఱ త్రికటుకములు యింగువ సౌవర్చలవణము చిత్రమూలము వీనిని చూర్ణముజేసి తేనెతో సేవించిన స్థవుల్యము అగ్నిమాంద్యము హరించు.

## త్రికటుకాది చూర్ణము.

శ్లో॥ త్ర్యూషణంకటుకం శిగ్రు బృహతీకంటకారికా ।
శాలిపర్ణీపృశ్నిపర్ణీ వారాహీంచ సువర్చలమ్ ।
ద్వినిశాతి విషాహింగు యవానీజీరకద్వయమ్ ।
విళంగంహపుషా ధాన్యా సర్వంమేదోత్థితంజయేత్ ॥

తా. త్రికటుకములు కటుకరోహిణి కారుమునగ చిన్నములక పెద్దములక కోలపొన్న నక్కతోకపొన్న నేలతాటిగడ్డలు సౌవర్చలవణము పసపు మానిపసపు అతివస యింగువ కొడిసెపాల జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ వాయువిడంగములు బోడతరము కొతిమెర్లు వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి (దీనికి సమముగ లోహభస్మ మును గలిపి 4 మాడలయెత్తును తేనెతో) సేవించిన స్థౌల్యరోగము హరించు.

## గుళూచ్యాది చూర్ణము.

శ్లో॥ [అన్యశాస్త్రే] గుళూచీ మభయాంముస్తా . క్షౌద్రైఃకర్షం లిహేదను ॥

తా. తిప్పతీగె కరక్కాయలు తుంగముస్తెలు వీనిని సమభాగములుగ చూర్ణ ముజేసి (దీనికిసమముగ లోహభస్మమును గలిపి) కర్ష మెత్తును తేనెతో సేవించిన స్థపుల్య రోగము హరించు.

## తామ్రభస్మ యోగము.

శ్లో॥ [మతాంతరే] మృతతామ్రం కణాక్షౌద్రం మాషమాత్రం నియోజయేత్ ॥

తా. తామ్రభస్మము పిప్పళ్ళు. వీనిని తేనెతో మాషమెత్తును సేవించిన స్థపుల్యరోగము హరించు.

## జయంత్యాది చూర్ణము.

శ్లో॥ [మతాంతరే] వత్సామలక చూర్ణేన జయంతీవా జయా భయా। భక్షయేన్నాశయేత్స్థౌల్యంసుదమేదోత్థితాఽగదాః ॥

తా. కొడిసెపాల వుసిరికెపప్పు తక్కాలి వీనిని గాని లేక తక్కాలి కర క్కాయ అనువానినిగాని సమభాగములుగ దంచిచూర్ణముజేసి (వుదకములో)సేవిం చిన స్థవుల్యరోగము హరించు.

## గుగ్గుల్వాది చూర్ణము.

శ్లో॥ [బాహటే] గుగ్గులుత్రిఫలాత్ర్యూషం వహ్నిముస్తావిడంగ కమ్ । తుల్యాంశంభక్షయేత్కర్షం మేదశ్లేష్మమదాత్యనుత్ ॥

తా. శుద్ధిజేసిన మహిసాక్షి గుగ్గిలము త్రిఫలములు త్రికటుకములు చిత్రమూ లము తుంగము స్తెలు వాయువిడంగములు వీనినిసమభాగములుగ చూర్ణముచేసి కర్ష మెత్తును (తేనెతో) సేవించిన మేదస్సు శ్లేష్మరోగము మదాత్యయము హరించు.

## గంధక కల్పము.

శ్లో॥ [గ్రంథాంతరే] గంధకంమధుతైలాభ్యాం కర్షమాత్రం లిహే త్సదా ॥ మేదోవాతకఫంహంతిమాసమాత్రేనసంశయః ॥

తా. శుద్ధిజేసిన గంధకమును యిప్పనూనెతో మర్దించి కర్ష మెత్తును సేవిం చిన 1 మాసములో స్థవుల్యరోగము వాతకఫరోగములు నిశ్చయముగ హరించు.

## స్థూలాంతక రసము.

శ్లో॥ [పూజ్యపాదీయే] వంధ్యాకర్కోటకీకంద ద్రవైర్మర్ద్యేద్దిన త్రయమ్ । తాళకంచ మృతంతామ్రం ద్విగుంజం మధునా లిహేత్ । పిబేత్తక్రోదకంచానుస్థౌల్యరోగంప్రణాశయేత్ ॥

తా. శుద్ధిజేసిన తాళకము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వము లోనునిచి గొడ్డుకాకరగడ్డరసముతో 3 దినములు మర్దించి 2 గురిగింజల యెత్తుమా త్రలుజేసి యందొకదానిని తేనెతోభక్షించి వెంబడిగ వుప్పునీరును త్రాగిన స్థవుల్య రోగము హరించు.

## స్థౌల్యరోగ హరోపాయములు.

శ్లో॥ శ్రమచింతావ్యవాయాధ్వ క్షౌద్రజాగరణంస్త్రియః । హంత్యవశ్యమతిస్థౌల్యం యవశ్యామాకభోజనమ్ ॥

తా. శ్రమ చింత మైధునము మార్గగమనము తేనె జాగరణము స్త్రీయవలు శ్యామకంటకము అనువాని సేవనవలన స్థూలరోగము హరించు.

## బడబాగ్ని రసము.

శ్లో॥ శుద్ధసూతంమృతంతామ్రం తాళంబోళసిమంసమమ్ ।
అర్కక్షీరైర్దినం మర్ద్యంక్షౌద్రై ర్లేహ్యంద్విగుంజకమ్ ।
బడబాగ్నిరసో నామస్థౌల్య బృందంసియచ్ఛతి ।
పలంక్షౌద్రపలంతోయ మనుపానంపిబేత్సదా ॥

తా. రసభస్మము తామ్రభస్మము శుద్ధిజేసిన తాళకము రక్తభోళము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి జిల్లేడుపాలతో 1 దినము మర్దించి 2 గురిగింజల యెత్తు మాత్రలుజేసి తేనెతో సేవించిన వెంబడిగ 1 * పలప్రమాణ ముదకములో పలప్రమాణము తేనెగలిపి త్రాగిన స్థౌల్యరోగము హరించు.

## రసభస్మ యోగము.

శ్లో॥ రసభస్మవల్ల మాత్రంలీఢ్వామధునా పిబేదనుక్షౌద్రమ్ ।
కోష్ణాంబునాసమేతంత త్స్థౌల్యంమేద కృతంజయతి ॥

తా. వల్లప్రమాణ రసభస్మమును తేనెలోకలిపి సేవించి। వెంబడిగ సుఖోష్ణముగనుండు నుదకములో తేనెగలిపి త్రాగిన స్థూలరోగము హరించు.

## త్రిమూర్తి రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] సూతంగంధమయోభస్మ సమంసంయోజ్య భావయేత్ । నిర్గుండీపత్రతోయేన ముసలీకందవారిణా। తత స్సిద్ధమముంమాష మాత్రంరస మనుత్తమమ్। లోధ్రక్షౌద్రేణచాశ్నీయాచ్చూర్ణంమాషోన్మితంహితమ్ । సట్కటుత్రిఫలా పంచలవణా వల్గుజంచతత్ । మేదశోథాగ్ని మాంద్యామ వాతశ్లేష్మగదప్రణుత్ ॥

* పలమన 3 రూపాయిలు యెత్తు.

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము లోహభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వావిలియాకు నేలతాటిగడ్డలు అనువానిరసములో ప్రతిదానిచే భావనజేసి మాషమెత్తును మాషమెత్తు లొద్దుగచూర్ణము తేనె అనువానియనుపానముతోడ సేవించి పిదప త్రికటుకములు మోడి చెవ్యము చిత్రమూలము త్రిఫలములు పంచలవణములు భావంచివిత్తులు అనువాని చూర్ణమును భక్షించిన మేదస్సు వాపు అగ్నిమాంద్యము అనువాతము కఫరోగము వీనిని హరింపంజేయు.

## మేదోరోగమునందు పథ్యము.

శ్లో॥ [ఆయుర్వేదే] చింతాంశ్రమంజాగరణం వ్యవాయంప్రోద్వర్తనంలంఘనమాతపశ్చ । హస్త్యశ్వయానం భ్రిమణంవిరేకః ప్రచ్ఛర్దనంచాప్యథతర్పణంచ । పురాతనావైణవకోరదూషశ్యామాకనీవారప్రియంగుజూర్ణాః ॥ యవాఃకులుత్థాశ్చణకామసూరాముద్గాస్తువర్యస్తుమధూనిలాజాః । కటూనితిక్తానికషాయకానితక్రంసురాపింగళమత్స్యఏవ । దగ్ధానివార్తాకఫలానిచాపిఫలత్రయంగుగ్గులుపాలసంచ । కటుత్రయంసర్షపతైలమేలాక్షారాణి సర్వాణ్యపిచాక్షతైలమ్ । పత్రొత్థశాకాగరుదీపనాని ప్రతప్తనీరాణిశిలాజతూని । ఏతానిసర్వాణి నిషేవితాని మేదోగదంసత్వరమాక్షిపంతి ॥

తా. చింత శ్రమ జాగరణము స్త్రీసంగము నలుగుబెట్టుకొనుట లంఘనము యెండ యేనుగు గుఱ్ఱము మొదలగు వానినెక్కి సంచరించుట విరేచనము వాంతి * తర్పణక్రియ ప్రాతవెదురుబియ్యము అరికలు చామలు అనుధాన్యము నీవారధాన్యము కొఱ్ఱలు జొన్నలు యవలు ఫులవలు సెనగలు చిఱు సెనగలు పెసలు కందులు తేనెపేలాలు కారము చేదు వగరుగలరసములు మజ్జిగ మద్యము పింగళవర్ణముగల మత్స్యములు వేయించినవంకాయలు త్రిఫలములు గుగ్గిలము పాయసము త్రికటుకములు తెల్లావనూనె యేలకులు సర్వక్షారములు గచ్చనూనె ఆకుకూరలు అగరులేపనములు వోమము వుష్టోదకము శిలాజిత్తు అనువాని సేవనవలన మేదోరోగము హరించు.

* తర్పణమన—తృప్తికరమగు నౌషధములతో జకిత్సించుట.

## మేదోరోగమునం దపథ్యము.

శ్లో॥ స్నానంరసాయనంశాలీన్ గోధూమాన్సుఖశీలతామ్ ।
క్షీరేక్షువికృతింమాషాన్ సౌహిత్యంస్వేదనానిచ ।
మత్స్యమాంసందివానిద్రాం సుగంధాన్మధురాణిచ ।
అతిమాత్రంతుపచితం ద్విశేషాద్వమనక్రియామ్ ।
స్వభావస్థాత్మమన్విచ్ఛన్ మేదస్వీపరివర్జయేత్ ॥

తా. స్నానము రసాయనము శాలిబియ్యము గోధుమలుసుఖము పాలు చెఱకు లన నుత్పత్తిజేయబడుపదార్థములు వుద్దులు తృప్తికర భక్షణము చెమటదీసుట మత్స్యములు మాంసములు పగటినిద్ర సుగంధపదార్థములు మధురాన్నము చిమిడిన యన్నము వమనము వీనిని మేదోరోగముగలవారు వర్జింపవలయు.

## కార్శ్యమునం దుపచారము.

శ్లో॥ [ఆయుర్వేదే] కృశానాంబృంహణందేయం సర్వపానాన్నభే
దజైః । నిద్రాచైవదివారాత్రౌ ఛాగమాంసాశనం సదా ॥

తా. కార్శ్యరోగమున హితకరాన్న పానాద్యౌషధములవలన బృంహణ క్రియను చేయించుటయేగాక రేయింబవలు నిద్రించునటులం జేయవలయు. మఱియు మేకమాంసము నెల్లపుడు భుజింపంజేయవలయు.

## కృశత్వమునకు పూర్ణచంద్ర రసము.

శ్లో॥ మృతసూతాభ్రలోహానాం శిలాజతువిశంగకమ్ ।
తాప్యంక్షౌద్రంసమంసర్పి రేకీకృత్యవిమర్ధయేత్ ।
పూర్ణచంద్రరసోనామ మాషైకంభక్షయేత్సదా ।
శాల్మలీపుష్పచూర్ణంతు క్షౌద్రంకర్షంలిహేదను ।
దుర్బలోబలమాప్నోతి మాసైకేనయథాశశీ ॥

తా. రసభస్మము అభ్రకభస్మము లోహభస్మముశుద్ధిజేసిన శిలాజిత్తు వాయు విడంగములు శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము తేనె నెయ్యి వీనిని సమభాగములుగ ఖల్వ ములోనునిచి మర్దించి మాషప్రమాణము మాత్రలుజేసి యందొకదానిని కర్షప్రమా

ణము బూరుగపువ్వు చూర్ణములో తేనెగలిపి యీ యనుపానముతోడ 1 మాసము వరకు సేవింపుచుండిన కరీరదార్ఢ్యముగలిగి చంద్రునివలె వృద్ధింజెందు.

కార్శ్యస్ఫోటక రసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] రసభస్మద్విధాగంధ ముభౌమర్ద్యా గవాంజలైః। తేనపీతవరాటాని పూరయిత్వాథటంకణమ్ । అశ్వగంధిపలైకంతు గవాంక్షీరైః పిబేదను । కార్శ్యస్ఫోటమితిఖ్యాతం దుర్బలేబలదాయికమ్ ॥

తా. రసభస్మము 1 భాగము గంధకము 2 భాగములు యీ రెంటిని ఖల్వములోనునిచి ఆవుపంచితముతో మర్దించి పచ్చనిగవ్వలలోనునిచి దానిపై వెలిగారమును నూరిమెత్తి పుటంబిడి స్వాంగశీతలమునదీసి యందొక గురిగింజయెత్తును సేవించి వెంబడిగ 1 పలము పెన్నేరుగడ్డ చూర్ణములో ఆవుపాలు గలిపిత్రాగిన కృశత్వము హరించి బలముగలుగు.

శ్లో॥ [మాధవనిదానే] ముసలీహయగంధాభ్యాం మాషైకంసితయాయుతమ్ । భక్షయిత్వాపిబేచ్చాను క్షీరాజ్యంశర్కరాయుతమ్। పుష్టిప్రదంకృశానాంతు దుర్బలత్వంనియచ్ఛతి ॥

తా. నేలతాటిగడ్డ పెన్నేరుగడ్డ పంచదార వీనిని సమభాగములుగ జేర్చి మాషప్రమాణమును పాలు నెయ్యి పంచదార అనువాని యనుపానముతోడ సేవించిన శరీరకృశత్వము హరించి పుష్టిగలుగు.

శ్లో॥ [సింధూరమణిదర్పణే] విష్ణుక్రాంతామూలకంతు ఖాదేన్ముష్టింబలంభవేత్ । బ్రహ్మదండ్యాశ్చపాదాగ్రం క్షీరంపీత్వాబలప్రదమ్ ॥

తా. పిడికెడు విష్ణుక్రాంతపువేరును క్షై సేర ఆవుపాలతోనూరి సిందూరము గలిపి సేవించినను లేక బ్రహ్మదండివేరును ఆవుపాలతోనూరి సిందూరము గలిపి సేవించిన కృశత్వము హరించి బలముగలుగు.

కృశత్వరోగము గలవారికి ఉద్వర్తనము.

శ్లో॥ [రసరత్నాకరే] రసంగంధం సమంశుద్ధం విష్ణుక్రాంతా

ద్రవైర్దినమ్। అలక్తాగ స్త్రిజద్రావైస్త్రీ స్తన్యేసవిమర్దయేత్ ।
మధ్వాజ్యయవసంయుక్త మేతదుద్వర్తనంహితమ్ । కార్శ్యం
జయతిపణ్మాసా ల్లేపనాన్మేదసంతథా ॥

తా. రసము గంధకము వీనిని శుద్ధిజేసి సమభాగములుగ ఖల్వములోనునిచి విష్ణుక్రాంతరసములో 1 దినముమర్దించి పిదప లత్తుకకషాయము అగసిరసము చను బాలు అనువానితో మర్దించి తేనె నెయ్యి కొడిసెపాల గలిపి 6 మాసములు శరీర మునకు లేపనము సేయుచుండిన కృశత్వము స్థౌల్యరోగము హరించు.

ఉద్వర్తనము.

శ్లో॥ భూతాంకుశస్యమూలంతు కృష్ణగోమూత్రపేషితమ్ ।
అంగేషూద్వర్తనంనిత్యం వృద్ధిపుష్టిబలంభవేత్ ॥

తా. భూతాంకుశపువేరును నల్లావు పంచితముతోనూరి ప్రతిదినము శరీరమున లేపనము సేయుచుండిన కృశత్వముహరించి వృద్ధిపుష్టి బలముగలుగు.

మదాత్యయ నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] యేవిషస్యగుణాఃప్రోక్తా స్తేపిమద్యేప్రతిష్ఠితాః ।
తేనమిథ్యోపయుక్తేన భవత్యుగ్రోమదాత్యయః ।
కింతుమద్యంస్వభావేన యథైవాన్నం తథాస్మృతమ్ ।
అయుక్తియుక్తంరోగాయయుక్తియుక్తంయథామృతమ్ ॥

తా. విషమునకు జెప్పంబడిన 10 గుణములు మద్యమునందుండు అట్లగుటం జేసి విధివిహీనముగ పానము సేయుటవలన నుగ్రమైన మదాత్యయరోగముజనించు. మఱియు మద్యము స్వభావమువల్ల నన్నముతో దుల్యంబైయుండు ఐనను విధిహీనముగ పానము సేయుటవలన రోగముజనించు విధిపూర్వకముగ పానముజేసిన నన్న మువలె నమృత తుల్యంబగు ఎట్లన—“శ్లో॥ ప్రాణాః ప్రాణభృతామన్నం తదయుక్తాని హంత్యసూ- విషంప్రాణహరం తచ్చయుక్తియుక్తం రసాయనమ్” అనగా సర్వప్రాణులయొక్క ప్రాణమన్నాశ్రయంబైయుండుటచే నన్నమే ప్రాణస్వరూపంబు ఐనను దానిని ప్రమాణాతీతముగ భుజించిన ప్రాణముల నశింపంజేయు మఱియు విషము సగాప్రాణమును హరింపంజేయు ఐనను వానిని యథాశాస్త్రముగ

సేవించిన యెడ రసాయనతుల్యంబై శరీరధారణమును సేయుచుండునునుట. దానికి ప్రమాణం బెద్దియనిన. "శ్లో॥ విధి—మాత్రయా కాలే హితైరన్నైర్యథాబలమ్ । ప్రహృష్టో యః పిబేన్మద్యం తస్య స్యాదమృతం యథా । స్నిగ్ధైస్సదన్నైర్మాంసై ర్భక్ష్యైశ్చ సహ సేవితమ్। భవేదాయుః ప్రకర్షాయ బలాయోపచయాయచ॥" యథోక్త విధిగ ప్రమాణానుగుణ్యముగ యథాకాలమునందుగాని లేక శరీరప్రకృతి కనుగుణ్యముగ గాని సేవింపబడిన యన్నము బలములు గలుగంజేయు. ఇట్లగుననే స్నిగ్ధమై ప్రకృతి కనుగుణ్యమైయుండు అన్నమాంస భక్ష్యయుక్తముగ గాని సేవింపబడిన మద్యమమృతతుల్యంబై సంతోషమును ఆయుర్వృద్ధినిబలమునువృద్ధినిగలుగంజేయు.

శ్లో॥ కాన్తిరారోగ్యమనసస్తుష్టి స్తేజో విక్రమమేవచ ।
విధివత్సేవ్యమానేతు మద్యే సంతిహితాగుణాః ॥

తా. మద్యమున్ను విధిపూర్వకముగ సేవించిన సౌందర్యము మనస్సంతోషము వుత్సాహము పరాక్రమము వీనిని గలుగంజేయు. (ఆహారమును వర్జించి యెల్లపుడు మద్యమును పానము చేయుచుండుటవలన పలువిధవికారములు జనించి శరీరమును నశింపంజేయు.

## వాతమదాత్యయ లక్షణము.

శ్లో॥ హిక్కా శ్వాసశిరఃకంప పార్శ్వశూలప్రజాగరైః ।
విద్యాద్బహుప్రలాపస్య వాతప్రాయంమదాత్యయమ్ ॥

తా. ఎక్కిళ్ళు శ్వాసము తలవణుకు పార్శ్వశూల నిద్రాభంగము కడు ప్రలాపము అనునీలక్షణంబులు గలిగిన వాతిమదాత్యమని దెలియవలయు.

## పిత్తమదాత్యయ లక్షణము.

శ్లో॥ తృష్ణాదాహజ్వరస్వేద మోహాతీసారవిభ్రమైః ।
విద్యాద్ధరితవర్ణస్య పిత్తప్రాయంమదాత్యయమ్ ॥

తా. దప్పి తాపము దాహము జ్వరము చెమట మోహము అతిసారము భ్రమ రీరమున కొంపసపువర్ణము అను నీ లక్షణంబులు గలిగిన పిత్తమదాత్యయమని తెలియవలయు.

## కఫమదాత్యయ లక్షణము.

శ్లో॥ ఛర్ద్యరోచకహృల్లాస తంద్రా స్తైమిత్యగౌరవైః ।
విద్యాచ్ఛీతపరీతస్య కఫప్రాయంమదాత్యయమ్ ॥

తా. వాంతి అరుచి జొల్లుగారుట తంద్ర స్తబ్ధత్వము జడత్వము శీతప్రాబల్యము అను నీ లక్షణంబులు గలిగిన కఫమదాత్యయమని తెలియవలయు.

## త్రిదోషజ మదాత్యయ లక్షణము.

శ్లో॥ జ్ఞేయస్త్రిదోషజశ్చాపి సర్వలింగైర్మదాత్యయః ।

తా. వాత పిత్త శ్లేష్మ మదాత్యయ లక్షణములం గలది త్రిదోషమదాత్యయమని దెలియవలయు.

## అసాధ్య మదాత్యయ లక్షణము.

శ్లో॥ హీనోత్తరౌష్ఠమతిశీతమమందదాహం తైల ప్రభాస్యమతి
పానహతంత్యజేత్తు । జిహ్వోష్ఠదంత మసితంత్వథవాపినీలం
నీతేచయస్యనయనేరుధిర ప్రభేవా ॥

తా. పైపెదవి యొకింతన్యూనమై వ్రేలాడుచుండుట శరీరముయొక్క వెలపటి భాగము చల్లగ లోభాగము తాపయుక్తముగనుండుట ముఖముపై నూనెబూసినటుల మినమినలాడుచుండుట యీలక్షణములుగల మద్యపానరోగిని నాలుక పెదవి దంతములు నల్లగ లేక నీలవర్ణముగనుండుట నేత్రములు పచ్చగ లేక రక్తవర్ణముగ నుండుట యీలక్షణములుగల మద్యపానరోగిని వైద్యుడు వర్జింపవలయు.

శ్లో॥ హిక్కాజ్వరౌవమథువేపథుపార్శ్వశూలాః కాసభ్రమావ
పిచపానహతంత్యజేత్తు ॥

తా. ఎక్కిళ్ళు జ్వరము వాంతి వణుకు పార్శ్వశూల దగ్గు భ్రమ మొదలగు నుపద్రవములు మిక్కుటముగ మద్యపానము సేయువానికి జనించిన వానిం జంపు

## మదాత్యయరోగ చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] మదాత్యయశ్చాతిమిదః తత్రమద్యంప్రదా
పయేత్ । వ్యోషాసౌవర్చలోపేతంస క్తుభిర్వాసమాయుతమ్ ॥

తా. మద్యపానమువలన గడుమదము గలిగిన మదాత్యయ మనంబడు. దాని యందు త్రికటుకములు సౌవర్చలవణము అనువాని యుక్తముగ గాని వేలపిండియు క్తముగగాని మద్యమును పానము జేయించవలయు.

శ్లో॥ మదాత్యయే నింబనీరం సితాయుక్తంచ దాపయేత్ ॥

తా. వేపాకురసములో పంచదారగలిపి సేవించిన మదాత్యయము హరించు.

వాతమదాత్యయమునకు సౌవర్చలాది యోగము.

శ్లో॥ మద్యం సౌవర్చలవ్యోష యుక్తంకించి జ్జలాన్వితమ్ ।
జీర్ణమద్యాయ దాతవ్యం వాతపానా త్యయాపహమ్ ॥

తా. మద్యము సైంధవలవణము త్రికటుకములు అనువాని నేకముజేసి యందొ కింత యుదకముగలిపి మద్యపానజీర్ణానంతరము త్రాగిన వాతమదాత్యయముహరించు

సూక్త శృంగ్యాది యోగము.

శ్లో॥ సూక్త సౌవర్చల శృంగీ త్ర్యూషణార్ద్రికదీపకైః ।
మద్యం పీత్వాజయత్యుగ్రం పవనోత్థం మదాత్యయమ్ ॥

తా. కలి సైంధవలవణము కర్కాటకశృంగి త్రికటుకములు అల్లము వోమ ము అనువాని చూర్ణమునకు సమముగ మద్యముగలిపి త్రాగిన భయంకరమైన వాత పానాత్యయమును హరింపంజేయు.

క్షుద్రామలకాది యోగము.

శ్లో॥ క్షుద్రామలక ఖర్జూర పరూషక హిమంపిబేత్ ।
సితా విమిశ్రితం పీతం పానాత్యయ వికారనుత్ ॥

తా. నేలయుసిరికె ఖర్జూరము * ఫలాసాపండ్లు పచ్చకర్పూరము పంచ దార అనువానిని నేకముజేసి మద్యములోగలిపిత్రాగిన పిత్తపానాత్యయవికారమును హరింపంజేయు.

కఫమదాత్యయోపచారము.

శ్లో॥ పానాత్యయే కఫోత్థేతు వమనాయ ప్రదాపయేత్ ।
యధాబలం లంఘనంచ దీపనీ యౌషధానిచ ॥

* ఇదే పేరీతపండనియు జెప్పంబడు.

తా. కఫమువలన జనించిన పానాత్యయమున వమనము శక్త్యనుగుణ్యముగ లంఘనము అగ్నిదీప్తికరౌషధసేవనము అనువానిని జేయించవలయును.

సన్నిపాత మదాత్యయోపచారము.

శ్లో॥ సర్వజే సర్వమేవేదం ప్రయోక్తవ్యం చికిత్సితమ్॥

తా. త్రిదోషమువలన జనించిన మదాత్యయమున పై జెప్పబడిన సర్వచికిత్సలం జేయవలయు.

శ్లో॥ మథితం గోదధిసహితం తైలం కర్పూరసంమిశ్రమ్ ।
ఆస్వాద్య పీతమాశు క్షపయతి పానాత్యయం రోగమ్।

తా. ఆవుపెరుగు నూనె వీని నేకముజేసి బాగుగజిలికి అందు కర్పూరము గలిపి నస్యపానములు జేయించిన పానాత్యయరోగము తక్షణమున హరించు.

శ్లో॥ మద్యంపీత్వాయదివాతత్క్షణమేవ లేహ్యశర్కరాసఘృతా ।
మదయతి నజాతుమద్యం మనాగపి పక్షిశపీర్య్యమపి ॥

తా. మద్యపానానంతరము పంచదార నెయ్యి వీని నేకముజేసి భక్షించిన క్లిష్టంబైన మద్యము సగా వీర్యవిహీనం బగు.

మదాత్యయమునందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] సంశోధనంసంయమనం స్వపనంలంఘనం
భ్రమః । సంవత్సర సముత్పన్నా శాలయష్షష్టికాయవాః ।
ముద్గాశ్చమాషగోధూమాంలావతిత్తిరకాదయః । వేసవా గో
విచిత్రాన్నం హృద్యంమద్యం పయస్వితా । తండులీయం
పటోలంచ మాతులుంగం పరూషకమ్ । ఖర్జూరందాడిమం
ధాత్రీ నారికేళంచగోస్తనీ । సర్పిఃపురాణంకర్పూరంప్రతీరం
శశినోనిలః । ధారాగ్రహం చంద్రపాదా మణయో మిత్ర
సంగమః । క్షౌమాంబరం ప్రియాశ్లేషో గీతం వ్యాత్రముద్ధ
తమ్ । శీతాంబు చందనస్నానం సేవ్యమేతన్మదాత్యయే ॥

తా. విరేచనము రతిబంధము నిద్ర లంఘనము సంచారము ] సంవత్సరము గినప్రాతవడ్లు 60 దినములకుఫలించెడు యవధాన్యము పెసలు వుస్తులు గోధుమలు

లావుకపిట్టమాంసము తిత్తిరిపక్షి మొదలగువాని మాంసములు వేసవారము కిచ్చిడి ప్రయకరమైన మద్యము పాలు పంచదార చిట్టీహూర పొట్లకాయ మాదీఫలము ఫలాసాపండ్లు ఖర్జూరము దానిమ్మపండ్లు వుసిరికపండు టెంకాయ ద్రాక్షపండు ప్రాత నెయ్యి కర్పూరము నదీతీరము చల్లగాలి జలమందిరము చంద్రకిరణములు మణిహారములు మిత్రసమాగమము పట్టువస్త్రములు ప్రియాలింగనము సంగీతము వాద్యములు శీతోదకము చందనము స్నానము అనునవి మదాత్యయరోగమున హితకరంబులు.

## మదాత్యయమునం దపథ్యము.

శ్లో॥ స్వేదోంజనంధూమపానం నావనందంతఘర్షణమ్ ।
తాంబూలంచాప్యపథ్యం స్యాన్మదాత్యయవికారిణామ్ ॥

తా. చెమటదీసుట అంజనము ధూమపానము నస్యము దంతధావనము తాంబూలము అనునవి మదాత్యయమునం దపథ్యకరంబులు.

## నాసారోగ నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] ఆనహ్యతేయస్య విశుష్యతేచ ప్రక్లిద్యతే
ధూప్యతిచైవనాసా । నవేత్తియోగంధరసాంశ్చజంతుర్జుష్టం
వ్యవస్యేత్సతు పీనసేన । తంచానిలశ్లేష్మ భవం వికారం
బ్రూయాత్ప్రతిశ్యాయ సమానలింగమ్ ॥

తా. ముక్కడచికొనుట యెండుట ముక్కులో నీరుగారుట పొగవెడలుటుల సంతాపము గలుగుట గంధరసము దెలియకుండుట యీ లక్షణములు గలది పీనసమని దెలియవలయు. ఈ వాతశ్లేష్మజవికారము ప్రతిశ్యాయతుల్య లక్షణయుక్తంబైయుండు.

## నాసారోగ చికిత్స.

శ్లో॥ సర్వేషు పీనసేష్వాదౌ నివాతాగారగోభవేత్ ।
శిరసో భ్యంజనైః స్వేదై ర్నస్యై ర్మందోష్ణభోజనైః ।
వమనైర్ఘృతపానైశ్చ యథాదోష ముపాచరేత్ ॥

తా. సర్వపీనసరోగములయందు తొలుత వాతవిహీనస్థలము మస్తకాభ్యంజనము స్వేదకర్మ నస్యము మందోష్ణభోజనము వమనము ఘృతపానము అనువానిచే దోషానుగుణ్యముగ నుపచరింపవలయు.

## సర్వ పీనసములకు చికిత్స.

శ్లో॥ సర్వేషు సర్వకాలం పీనసరోగేషు జాతమాత్రేషు ।
మరిచంగుడేన దధ్నా భుంజీతదా సుఖంలభతే ॥

తా. సర్వపీనసములయందు పెరుగులో మిరియాలుపొడి బెల్లముగలిపి యెల్లప్రుడు సేవింపుచుండిన సర్వపీనసములు హరించి సుఖముగలుగు.

## గుడాది యోగము.

శ్లో॥ గుడమరిచవిమిశ్రం పీతమాశుప్రకామం హరతిదధినరాణాం
పీనసందుర్నివారమ్ । యదితుసఘృతమన్నం శ్లక్ష్ణగోధూమ
చూర్ణైః కృతముపహరతేసా తత్కుతోస్యావకాశః ॥

తా. బెల్లము మిరియాలచూర్ణము వీని నొకటిగజేర్చి పెరుగులోగలిపి త్రాగిన దుర్నివారమైన పీనసమును శీఘ్రముగ హరింపంజేయు. మఱియు నేతితోగూడియుండు గోధుమచూర్ణాన్నమును భుజించిన పీనసము హరించు.

## వేల్లగోధూమ యోగము.

శ్లో॥ వేల్లగోధూమ భోజీచ నిద్రాకాలేచ శీతలమ్ ।
జలం పిబతియోరోగీ పీనసాన్ముచ్యతేనరః ॥

తా. మిరియాలపొడిని గోధుమాన్నమును భక్షించి శయనించునపుడు శీతోదకమును త్రాగిన పీనసము హరించు.

## పూతినస్య లక్షణము.

శ్లో॥ దోషైరిద్విగ్ధై ర్గళతాలుమూలే సంమూర్ఛితోయస్యసమీరణస్తు । నిరేతి పూతిర్ముఖనాసికాభ్యాం తంపూతినస్యంప్రవదంతిరోగమ్॥

తా. గొంతు లోదౌడ అనువాని మధ్యమున దుష్టమైన పిత్తరక్తాది దోషములతో వాతము మిశ్రమమై నోరు ముక్కు అనువానియందు దుర్గంధముగ బైలువెడలిన పూతినస్య మనంబడు.

### వ్యాఘ్రీతైలము.

శ్లో॥ వ్యాఘ్రీదంతివచాశిగ్రుసురసావ్యోషసైంధవైః ।
సిద్ధం తైలంనసిక్షిప్తంపూతినాసాగదాపహమ్ ॥

తా॥ నేలములక దంతివేరు వస మునగ సన్నరాష్ట్ర త్రికటుకములు సైంధవలవణము అనువాని కల్కములోగాని లేక కషాయములోగాని తైలము గలిపి పక్వముజేసి నస్యముజేయించిన పూతినాసారోగము హరించు.

### శిగ్రుతైలము.

శ్లో॥ శిగ్రుసింహీని కుంభానాం బీజైస్స వ్యోషసైంధవైః ।
బిల్వపత్ర రసేసిద్ధం తైలంస్యా త్పూతినస్యనుత్ ॥

తా. మునగవిత్తులు నేలములకవిత్తులు నాగదంతివిత్తులు త్రికటుకములు సైంధవలవణము మారేడాకులరసము వీనిలో తైలముబోసి పాకముజేసి నస్యము జేయించిన పూతినాసారోగము హరించు.

### నాసాపాక లక్షణము.

శ్లో॥ ఘ్రాణాశ్రితంపిత్తమరూంషి కుర్యాద్యస్మిన్వికారేబలవాంశ్చ పాకః। తన్నాసికాపాకమితివ్యవస్యేద్విక్లేదకోధావథవాపియత్ర ॥

తా. నాసికము నాశ్రయించియుండు పిత్తము దుష్టంబగుటవలన నాసికములో వ్రణము జనించి లోపపండి చీముచే దడిసి దుర్గంధముగ స్రావముగలిగిన నాసికాపాకమనంబడు.

### సర్జకాది ఘృతము.

శ్లో॥ శర్జార్జునోదుంబరవత్సకానాంత్వచాకషాయైః పరిధావనేన ।
కషాయకల్కైరపిచేభిరేవ సిద్ధంఘృతంఘ్రాణ విపాకనాశి ॥

తా. సర్జరసము మద్ది అత్తి కొడిసె అనువాని పట్టలను కషాయముకాచి దానిచే నాసావ్రణమును గడుగుటయేగాక పైద్రవ్యములయొక్క పట్టల కషాయములోగాని లేక కల్కములోగాని ఘృతముగలిపి పాకముజేసి త్రాగిన నాసాపాకముహరించు.

### వ్యోషాది వటికములు.

శ్లో॥ వ్యోషాచిత్రక తాళీన తిత్రిడీ చామ్లవేతసమ్ । సచవ్యాజాజి

తుల్యాంశమేలాత్వక్పత్రపాదికమ్ । వ్యోషాదికమిదంచూర్ణం
పురాణగుడమిశ్రితం। పీనసశ్వాస కాసఘ్నంరుచిస్వరకరంపరమ్॥

తా. త్రికటుకములు చిత్రమూలము తాళిసపత్రి చింత్రపుల్ల ప్రబ్బలిచెవ్యము జీలకఱ్ఱ యివి దినుసు కొక్కొక భాగము యేలకులు లవంగపట్ట లవంగపత్రి యివి దినుసుకు ¼ భాగము యిటుల వీనినెల్ల చూర్ణముజేసి ప్రాతబెల్లములోగలిపి యుండలుజేసి భక్షించిన పడిసెము పుబ్బసము దగ్గు వీనిని హరింపంజేసి నోటికి రుచిని గలుగంజేయు.

పాఠాది తైలము.

శ్లో॥ పాఠాద్వి రజనీ మూర్వా పిప్పలీ జాతిపల్లవైః ।
ఏభిశ్చ తైలం సంసిద్ధం నస్యతః పీనసాపహమ్ ॥

తా. అగరుశొంఠి లేక విషబొద్ది పసపు మ్రానిపసపు చాగవేరు పిప్పలి వీని కషాయములో జాజియాకురసమును తైలమును గలిపి చిక్కగకాచి నస్యము జేయించిన పీనసము హరించు.

పూయరక్త లక్షణము.

శ్లో॥ దోషైర్విదగ్ధైరథవాపిజంతో ర్లలాటదేశేభిహతస్యతైస్తైః ।
నాసాస్రవేత్పూయ మసృగ్విమిశ్రం తంప్రూయరక్తంపవ
దన్తి రోగమ్ ॥

తా. వాతాదిదోషములు దుష్టంబులగుటచేనేని లేక నుదుటియందు దెబ్బ తగులుటచేనేని ముక్కునందు చీము రక్తము స్రవించిన పూయరక్త మనంబడు.

పూయరక్త చికిత్స

శ్లో॥ పూయాస్త్రేరక్తపిత్తఘ్నాః కషాయా నావనానిచ ।
పాకదాహాది రోగేషు శీతలే హాదికాక్రియాః ॥

తా చీమురక్తము స్రవించెడి నాసారోగమున రక్తపిత్తహర కషాయములు నస్యములు మొదలగువానితో చికిత్సింపవలయు మఱియు దానియందు పాకదాహాదులు గలిగియుండిన శీతకరలేపనము సేకము మొదలగువానితో జికిత్సింపవలయు.

షడ్బిందు ఘృతము

శ్లో॥ భృంగంలవంగమధుకం చకోష్ఠంసనాగరంగోఘృత మిశ్రితం
చ । షడ్బిందునాసాస్థిగతంచపీనసంశిరోగతంరోగశతంనిహంతి ॥

తా. గుంటగలగర లవంగములు యష్టిమధుకము చెంగల్వకోష్టు శొంఠి అను వాని కషాయములో ఆవునెయ్యిగలిపి పక్వముజేసి యందు 6 బిందువులను నస్యము జేయించిన నాసాస్థిగత పీనసము శిరోరోగము మొదలగు సర్వరోగములు హరించు.

## క్షవథు లక్షణము.

శ్లో॥ ఘ్రాణాశ్రితే మర్మణిసంప్రదుష్టో యస్యానిలోనాసికయానిరేతి । కఫానుయాతో బహుశోతిశబ్దం తంరోగ మాహుః క్షవథుంవిధిజ్ఞాః ॥

తా. నాసికము నాశ్రయించియుండు శృంగాటకమను మర్మస్థానమునందు వాతము దుష్టంబై కఫముతోగలసి గొప్పశబ్దమును సేయుచు నాసికముకువలన బైలువెడలిన * క్షవథు యనంబడు.

## శుంఠ్యాది ఘృతము.

శ్లో॥ శుంఠీకుష్ఠ కణాబిల్వ ద్రాక్షాకల్క కషాయవత్ ।
తైలంపక్వ మథాజ్యంవా నస్యాత్క్షవథునాశనమ్ ॥

తా. శొంఠి చెంగల్వకోష్టు పిప్పళ్ళు మారేడు ద్రాక్ష అనువాని కల్కములోగాని లేక కషాయములోగాని నూనెలేక నెయ్యిగలిపి పక్వముజేసి నస్యము జేయించిన క్షవథు నశించు.

## ఆగంతుక క్షవథు లక్షణము.

శ్లో॥ తీక్ష్ణోపయోగాదతి జిఘ్రతోవా భావాన్కటూనర్కనరీక్షణాద్వా । సూత్రాదిభిర్వా తరుణాస్థి మర్మణ్యుద్ఘాటితేన్యః క్షవథుర్నిరేతి ॥

తా. ఆవాలు మొదలగు తీక్ష్ణపదార్థముల సేవించుటచేనైని లేక † కారము గల పదార్థముల పీల్చుటచేనైని లేక సూర్యునిజూచుటచేనైని లేక నాసికములో వర్తి నునుచుటచేనైని తరుణాస్థిమర్మము (అనగా ఫణామర్మము) చలితంబై ఆగంతుక క్షవథును గలుగంజేయు. మఱియు ఆగంతుక దోషజక్షవథులు 2 ను సమానంబులు.

* క్షవథువన—తుమ్ము.
† కారమన—శొంఠి వస పిప్పలి మొదలగునవి.

## భ్రంశథు లక్షణము.

శ్లో॥ ప్రభ్రశ్యతే నాసిక యాహియస్య సాంద్రో విదగ్ధో లవణః కఫశ్చ । ప్రాక్సంచితో మూర్ధనిసూర్యతప్తే తంభ్రంశథుం వ్యాధిముదాహర్మంతి ॥

తా. పూర్వము శిరమునందు సంచితంబైయుండు కఫము సూర్యతాపము వలన ద్రవించి గట్టిగ రక్తాధిక పీతవర్ణముగ వుప్పగ నాసికారంధ్రమువలన నధికముగ వెడలిన భ్రంశథు వనంబడు.

## దీప్తనాసా లక్షణము.

శ్లో॥ ఘ్రాణే భృశందాహ సమన్వితేతు వినిస్సరే ద్ధూమఇవేహ వాయుః । నాసాప్రదీప్తే వచయస్యజంతో ర్వ్యాధింతుతం దీప్తముదాహరంతి ॥

తా. నాసికము కడుతాపయుక్తమైయుండు వాతము పొగవలె బైలువెడలుచు నాసికమునకు బ్రదీప్తిని గలుగంజేయుచుండిన దీప్తనాసారోగమనంబడు.

## దీప్తనాసా చికిత్స.

శ్లో॥ నస్యంహితం నింబరసాంజనాభ్యాం దీప్తేశిరస్స్వేదన మత్ర శస్తమ్ । నస్యేకృతే క్షీరజలావసేకాః శంసంతి భుంజీతచ ముద్గయూషైః ॥

తా. వేపరసము రసాంజనము అనువానియొక్క నస్యమును కుంభీశాకముల వలన నొకింత స్వేదమును నస్యానంతరము పాలను నీరునుజేర్చి సేచనమునుజేయించుటయేగాక పెసరకట్టును పథ్యమునందొసంగిన దీప్తనాసారోగమునుహరింపంజేయు.

## ప్రతీనాహ లక్షణము.

శ్లో॥ ఉచ్ఛ్వాస మార్గంతు కఫస్సవాతో రుంధ్యాత్ప్రతీనాహ ముదాహరేత్తమ్ ॥

తా. వాతసహిత కఫము వుచ్ఛ్వాసమార్గము నడ్డగించుటవలన నాసికారంధ్రముల శ్వాసము బాగుగ బ్రవర్తింపకుండిన ప్రతీనాహ మనంబడు.

## ప్రతీనాహ చికిత్స.

శ్లో॥ నాసావనాహేకర్తవ్యం పానంగవ్యస్యసర్పిషః ॥

తా॥ ఆవునెయ్యిని పానముజేయించిన ప్రతీనాహము హరించు.

## నాసాస్రావ లక్షణము.

శ్లో॥ ఘ్రాణాద్ఘనః పికసిత స్తనుర్వా దోషస్స్రవేత్స్రావముదాహరేత్తమ్ ॥

తా॥ నాసికమువలన గట్టిగ పసపువర్ణముగ లేక తెల్లగ తేటగ కఫముస్రవించిన నాసాస్రావ మనంబడు.

## నాసాస్రావ చికిత్స.

శ్లో॥ నాసాస్రావేఘ్రాణయోస్స్యాచ్చూర్ణయుక్తం నాడ్యాదేయంచావపీడాశ్చపథ్యాః । తీక్ష్ణాధూమాన్దేవదార్వగ్ని కాభ్యాంమాంసంచాజంపథ్యమత్రాదిశంతి ॥

తా॥ నాసాస్రావమునందు కరక్కాయచూర్ణమును గొట్టముతో బ్రయోగించుట * అవపీడనము దేవదారు చిత్రమూలము మొదలగు వానియొక్క తీక్ష్ణకర ధూమములు వీనిచే నుపచరింపవలయు. మఱియు దీనియందు మేకమాంసమును భుజించుట పథ్యకరంబు.

## నాసాపరిశోష లక్షణము.

శ్లో॥ ఘ్రాణాశ్రితేస్రోతసి మారుతేనగాఢంప్రదీప్తేపరిశోషితేచ। కృచ్ఛ్రాచ్ఛ్వసేదూర్ధ్వమధశ్చజంతుర్యస్మిన్సనాసాపరిశోషఉక్తః ॥

తా॥ వాతమువలన నాసికాద్వారములు నిక్కుటముగ తపించి యెండుటచే నరుడు కడుకష్టముమీద క్రిందపైన శ్వాసమునువిడిచిన నాసాపరిశోష మనంబడు.

## నాసాపరిశోష చికిత్స.

శ్లో॥ నాసాశోషేక్షీరపానం ససితంచప్రశస్యతే ॥

* అవపీడనమన శొంఠి మిరియాలు వస మొదలగు తీక్ష్ణకరౌషధముల కల్కముజేసి నాసికములో పిండుట.

తా. నాసాశోషమునపాలులో పంచదారగలిపిపానము సేయుట ప్రశస్తంబు.

## అపక్వపీనస లక్షణము.

శ్లో॥ శిరోగురుత్వమరుచి ర్నాసాస్రావ స్తనుస్స్వరః ।
క్షామఃష్ఠీవే త్తథాభీక్ష్ణ మామపీనసలక్షణమ్ ॥

తా. శిరము జడముగనుండుట అరుచిగలుగుట నాసికములోనుండి తేటనీరు గారుట స్వరము హీనంబగుట పలుమారు నాసికములయందుండు చీమిడి నాకర్షించి యుమియుట యీ లక్షణములుగలది అపక్వపీనసమని తెలియవలయు.

## పక్వపీనస లక్షణము.

శ్లో॥ ఆమలింగాన్వితశ్శ్లేష్మా ఘనస్స్వేషు నిమజ్జతి ।
స్వరవర్ణవిశుద్ధిశ్చ పరిపక్వస్యలక్షణమ్ ॥

తా. పూర్వోక్త అపక్వలక్షణయుక్తంబై యుండుకఫము ఘనీభవించి నాసికము మొదలగువాని స్రోతస్సులయందు నిలుచుట స్వర్ణవర్ణములు స్పష్టములుగనుండుట యీ లక్షణములు గలిగిన పీనసము పక్వంబైనదని తెలియవలయు.

## ప్రతిశ్యాయోత్పత్తి.

శ్లో॥ సంధారణాజీర్ణరజోతిభాషా క్రోధర్తు వైషమ్యశిరోభితాపైః । ప్రజాగరస్వప్న నవాంబుశీతా వశ్యాయకైరైర్మధున బాష్పసేకైః । సంస్త్యానదోషే.శిరసిప్రవృద్ధోవాయుః ప్రతిశ్యాయ ముదీరయేత్తు ॥

తా. మలమూత్రాదివేగముల నడ్డగించుట జీర్ణము గాకుండుట ముక్కులో దుమ్ము ప్రవేశించుట మిక్కుటముగ మాటలాడుట కోపము సేయుట ఋతువుమారుట యెండవలన శిరము తపించుట జాగరణము సేయుట పగలు నిద్రించుట క్రొత్త నీరును త్రాగుట శీతపదార్థములను మంచును సేవించుట మిక్కుటముగ మైదునము సేయుట నేత్రములయందు నీరుగారుట యీ కారణములవలన మూలాధారమైన కఫము శిరమున ఘనీభావమును జెందుటచే వాతము ప్రకోపించి పడిసెమును గలుగంజేయు. ఈ కారణములవలన తక్షణమున పడిసెము గలుగు.

## ప్రతిశ్యాయోత్పత్తి కారణము.

శ్లో॥ చయంగతామూర్ధనిమారుతాదయః పృథక్సమస్తాశ్చతథైవ శోణితమ్ । ప్రకుప్యమానావివిధైః ప్రకోపనైస్తతఃప్రతిశ్యాయకరాభవంతి ॥

తా. శిరముశ ప్రత్యేకముగ వాతాదిదోషములు సర్వదోషములు రక్తము సంచితంబులై బలవద్విగ్రహ దివాస్వప్నాది కారణములవలన బ్రకోపించిన ప్రతిశ్యాయమును గలుగఁజేయు.

## ప్రతిశ్యాయ పూర్వరూపములు.

శ్లో॥ క్షవప్రవృత్తిశ్శిరసోతిపూర్ణతా స్తంభోంగమర్దః పరిహృష్టరోమతా । ఉపద్రవాశ్చాప్యపరేపృథగ్విధా నృణాంప్రతిశ్యాయపురస్సరాస్స్మృతాః ॥

తా. తుమ్ములువచ్చుట తల బరువుగనుండుట శరీరము స్తంభించుట శరీరము నొచ్చుట గగుర్పాడుచుట పలువిధరోగములు (అనగా ఘ్రాణధూమాయనాదికములు) గలుగుట యివియ ప్రతిశ్యాయమునకు పూర్వరూపములు.

## ప్రతిశ్యాయ చికిత్స.

శ్లో॥ ప్రతిశ్యాయేషుసర్వేషు గృహంవాతవివర్జితమ్ ।
వస్త్రేణగురుణోష్ణేన శిరసావేష్టనంహితమ్ ॥

తా. సర్వప్రతిశ్యాయములయందు వాతవిహీనస్థలమునం దుండుట దళముగ పుష్టముగనుండు వస్త్రముల శిరమునకుజుట్టుట హితకరంబు.

## బాలమూలక యూషము.

శ్లో॥ బాలమూలక యూషశ్చ కుళుత్థోత్థశ్చపూజితః ।
స్వేదఉష్ణంహిమంభోజ్యం పాచనాయప్రశస్యతే ॥

తా. ప్రతిశ్యాయమునందు లేతముల్లంగి వులవలు అనువానియూషము స్వేదకర్మ పుష్టకరభోజనము శీతోదకము అనువాని సేవనవలన ప్రతిశ్యాయము పక్వంబగు.

## పిప్పల్యాది నస్యము.

శ్లో॥ తతఃపక్వంకఫంజ్ఞాత్వా హరేచ్ఛీర్ష విరేచనైః ।
పిప్పల్యశ్శిగ్రుబీజాని విడంగం మరిచానిచ ।
అవపీడః ప్రశస్తోయం ప్రతిశ్యాయ నివారణః ॥

తా. కఫము పక్వమైనపిదప మస్తకరేచనముజేయించి దానినిదీసి వేయవలయు మఱియు పిప్పళ్ళు మునగవిత్తులు వాయువిడంగములుమిరియాలు వీనినినస్యము చేయించవలయును యివి ప్రతిశ్యాయమును హరింపంజేయుటయందె ప్రశస్తంబులు.

## వాతప్రతిశ్యాయ లక్షణము.

శ్లో॥ ఆనద్ధాపిహితానాసా తనుసావ ప్రసేకినీ ।
గళతాల్వోష్ఠశోషశ్చ నిస్తోదశ్శంఖయోరపి ।
భవేత్స్వరోపఘాతశ్చ ప్రతిశ్యాయే నిలాత్మజే ॥

తా. ముక్కుకట్టంబడినటులుండుట అడచికొనియుండుట తేటగనీరుగారుట గొంతులోదౌడ పెదవియెండుట కణతలలో పొడుచునటులుండుట గొంతులో ఘుర్ఘురశబ్దము గలుగుట యీలక్షణములుగలది వాతప్రతిశ్యాయమని తెలియవలయు

## వాతజప్రతిశ్యాయ చికిత్స.

శ్లో॥ వాతికేతుప్రతిశ్యాయే పిబేత్సర్పిర్యథాక్రమమ్ ।
పంచభిర్ల వణైస్సిద్ధం ప్రథమేనగణేనచ ॥

తా. పంచలవణము యుక్తముగాని లేక పంచమూలయుక్తముగానిసిద్ధము జేయబడిన ఘృతమును పానముజేసిన వాతజప్రతిశ్యాయము హరించు.

## పిత్తప్రతిశ్యాయ లక్షణము.

శ్లో॥ ఉష్ణస్సపీతకస్స్రావో ఘ్రాణాత్స్రవతిపైత్తికే ।
కృశోతిపాండుస్సంతప్తో భవేత్తృష్ణాభిపీడితః ।
సధూమమగ్నింసహసా వమతీవచనాసయా ॥

తా. నాసికనునుండి వేడిగ పసుపువర్ణముగ స్రావముగలుగుట దానిసంబంధమువలన శరీరముకృశించి కడుతెల్లగనుండుట దాహముగలుగుట పూష్మమునుసహింప

లేకుండుట నాసికమువలన పొగతోడ నగ్ని వెడలునటులుండుట యీ లక్షణములు గలది పైత్తిక ప్రతిశ్యాయమని తెలియవలయు.

## చికిత్స.

శ్లో॥ హితంపిత్తప్రతిశ్యాయే పాచనార్థంఘృతంపయః ।
శృంగబేరేణ పయసా శృంగబేరనుథాంపివా ॥

తా. పిత్తజ ప్రతిశ్యాయమునందు పాచనార్థమై నెయ్యి పాలు అల్లపురసము అనువాని నేకముజేసిగాని లేక పాలలో అల్లపురసముగలిపిగాని పానము జేయించుట హితకరంబు.

## కఫజప్రతిశ్యాయ లక్షణము.

శ్లో॥ ఘ్రాణాత్కఫః కఫకృతే శ్వేతశ్శీతస్స్రవేద్బహుః ।
శుక్లావభాసశ్శూనాక్షో భవేద్గురుశిరానరః ।
కంఠతాల్వోష్ఠశిరసాం కండూభిరభిపీడితః ॥

తా నాసికమువలన చీమిడి తెల్లగ శీతలముగ మిక్కుటముగ పలుమారు కారుట శరీరము తెల్లగనగుట కండ్లుబ్బుట తలబరువుగనుండుట గొంతులో దౌడ పెదవి శిరము అనువానియందు దురదగలుగుట యీ లక్షణములుగలది కఫజప్రతిశ్యాయమని తెలియవలయును.

## చికిత్స.

శ్లో॥ కఫజేసర్పిషాస్నిగ్ధం తిలమాషవిపక్వయా ।
యవాగ్వాపాయయిత్వాతు శ్లేష్మఘ్నం క్రమమాచరేత్ ॥

తా. కఫజనాసారోగమున దొలుత ఘృతమువలన స్నిగ్ధముగజేసి పిదప నువ్వులు వుద్దులు అనువాని యుక్తముగ సిద్ధముజేయబడిన యవాగున పానము జేయించి కఫకరౌషధమువలన నొసంగవలయు.

## ధూమపాన వర్తి.

శ్లో॥ దార్వింగుదనికుంభైశ్చ కిణిహ్యాసరళేనచ ।
వర్తయోత్రకృతాయోజ్యా ధూమపానేయథావిధిః ॥

తా. ప్రాంనిపసపు గారెపట్టి దంతి వృత్తరేణు సర్జరసము వీని నుదకముతో నూరి వస్త్రమునకు బట్టించి వత్తిజేసి యథావిధిగ ధూమపానము సేయవలయు.

## సన్నిపాత నాసారోగ లక్షణము.

శ్లో॥ భూత్వాభూత్వా ప్రతిశ్యాయో యస్యాకస్మాన్నివర్తతే।
సంపక్వోవాప్యపక్వోవా సతుసర్వభవస్స్మృతః ॥

తా. పడిసెము పలుమారు జనించి పండిగాని లేక పండక యకస్మాత్తుగ గాని నివర్తించిన త్రిదోషజప్రతిశ్యాయ మనంబడు.

## దుష్టప్రతిశ్యాయ లక్షణము.

శ్లో॥ ప్రక్లిద్యతేపునర్నాసా పునశ్చపరిశుష్యతి ।
పునరానహ్యతేచాపి పునర్విశ్రీయతేతథా ।
నిశ్వాసోవాతిదుర్గంధో నరోగంధంనవేత్తిచ ।
ఏవందుష్టప్రతిశ్యాయం జానీయాత్కృచ్ఛ్రసాధనమ్ ॥

తా. నాసికము పలుమారు తడిసినట్లుండుట మరల నెండుట మరల నాసిక ముడచికొనుట మరల నాసికము దెరచికొనుట దుర్గంధముగ నిశ్వాసము బైలువెడలుట వాసన తెలియకుండుట యీ లక్షణములుగలది దుష్టప్రతిశ్యాయ మనంబడు. ఇది కష్టసాధ్యము. (ఈ ప్రతిశ్యాయ మైదింటిలో నవస్థాభేదముగలదిగ నుండుటం జేసి 6 వదిగ గణనము జేయందగదు)

## చిత్రక హరీతకీ రసాయనము.

శ్లో॥ చత్వార్యతిశతానిచిత్రకజటాయుక్పంచ మూలామృతా ।
ధాత్రీశాముదకర్క్ష ణేత్రిభిరపాంద్రోణైశ్చసంక్వాథయేత్ ।
పాదస్థేక్వథనేగుడస్యచశతంపథ్యాథకేనాన్వితమ్ ।
పక్తవ్యంశ్రుతశీతలేచమధునః ప్రస్థార్ధమాత్రంక్షిపేత్ ।
వ్యోషస్యత్రిసుగంధికస్యచ పలాన్యత్రైవషట్ప్రక్షిపేత్ ।
క్షారస్యార్ధపలంరసాయన మిదంసంసేవ్యతేసర్వదా ।
శోషశ్వాసమలానకాశన మధుశ్లేష్మప్రతిశ్యాయిభి ।
క్షీణోరఃక్షతహిక్కికాకఫ శిరోరోగప్రసన్నాగ్నిభిః ॥

తా. చిత్రమూలము పంచమూలములు తిప్పతీగె వుసిరికెవరుగు వీనిని 400 పలములు గ్రహించి 3 ద్రోణముల నుదకములో వైచి చతుర్థాంశముగ కషాయము కాచి దించుకొని అందు 100 పలముల బెల్లము అథకప్రమాణము కరక్కాయలు వైచి పాకముజేసి చల్లారిన పిదప ½ ప్రస్థము తేనె 6 పలములు త్రికటుకములు త్రిసుగంధములు ½ పలము యవక్షారముగలిపి సదా సేవింపుచుండిన శోష శ్వాసము మలబద్ధము వాంతి దగ్గు పడిసెము కృశత్వము వురఃక్షతము యెక్కిళ్ళు కఫజశిరోరోగము మందాగ్ని వీనిని హరించును.

## హింగ్వాది తైలము.

శ్లో॥ హింగువ్యోష విడంగకట్ఫల చారుతీక్ష్ణగంధైర్యుతైః ।
లాక్షా శ్వేతపునర్నవాబ్దకుటజైః పుష్పోద్భవైస్సారభైః ।
ఇత్యేభిఃకటు తైలమేతదనలేమం దేసమూత్రంశృతమ్ ।
పీతం నాసికయాయథావిధిభవేన్నాసామయేభ్యోహితమ్ ॥

తా. ఇంగువ శొంఠిమిరియాలు పిప్పళ్ళు వాయువిడంగములు కాయఫలము (గుమ్మడుతేపు) వస చెంగల్వకోష్టు నల్లమునగ లక్క తెల్లగలిజేరు తుంగముస్తెలు కొడిసెవిత్తులు లవంగములు అనువాని కషాయములోగాని లేక కల్కములోగాని తెల్లావనూనె గోమూత్రముకలిపి మందాగ్నితో పాకముజేసి యదావిధిగ నస్యము జేయించిన దాసారోగము హరించు.

## పీనస సామాన్య చికిత్స.

శ్లో॥ రక్తపిత్తంచశోథశ్చ తథార్శాంస్యర్బుదానిచ ।
నాసికాయాంస్యురేతేషాం స్వంస్వంకుర్యాచ్చికిత్సితమ్ ॥

తా. రక్త పిత్తము వాపు అర్శస్సు అర్బుదము అనురోగములు నాసికమున జనించిన ఆయారోగోక్తచికిత్సం జేయవలయు

శ్లో॥ గృహధూమకణాదారు క్షారనక్తాహ్వసైంధవైః ।
సిద్ధంశిఖరిబీజైశ్చ తైలంనాసార్శసాంహితమ్ ॥

తా. కరుధూపము పిప్పళ్ళు దేవదారు యవక్షారము నఖము సైంధవలవణము వుత్తరేణివిత్తులు వీనితో తైలమును పక్వముజేసి నాసికములోవైచిన నాసార్శస్సు హరించు.

## కరవీరాది తైలము.

శ్లో॥ రక్తస్య కరవీరస్య పుష్పంజాతేశ్చ మల్లికా ।
తిలతైలం సమం త్వైతైః పక్వందానార్శసాం హితమ్ ॥

తా. యెఱ్ఱగన్నేరుపువ్వులు జాజిపువ్వులు మల్లెపువ్వులు వీనితోసమముగ తిలతైలమును పక్వముచేసి వాసికములోవైచి నాసార్శస్సు హరించు.

## నాసాశోషోపచారము.

శ్లో॥ నాసాశోషే క్షీరసర్పిః ప్రధానం తైలం సిద్ధంచాణు తైలేన నస్యే । సర్పిః పానంభోజనం జాంగలైశ్చ స్నేహాస్వేదై స్సైన్నహిక శ్చాత్రధూమః ॥

తా. నాసాశోషమున పాలు నెయ్యి సూనె అనువానితో ముఖ్యముగ నుపచరింపవలయు. మఱియు అణుతైలముయొక్క నస్యము ఘృతపానము జాంగలసంయుక్తభోజనము స్నేహయుక్త ద్రవ్యములచే చెమటను వెడలింపంజేయుట స్నేహసంయుక్తిధూమము హితకరంబులు.

## రక్తప్రతిశ్యాయ లక్షణము.

శ్లో॥ రక్తజేతు ప్రతిశ్యాయే రక్తస్రావః ప్రవర్తతే ।
తామ్రాక్షశ్చ భవేజ్జంతు రురోఘాత ప్రపీడితః ।
దుర్గంధో ఛ్ఛ్వాసవదనో గంధానపి నవేత్తిసః ॥

తా. ముక్కులోనుండి రక్తముస్రవించుట నేత్రములెఱ్ఱగనగుట ఉరఃక్షతపీడతోసమానమైన పీడగలుగుట వుచ్ఛ్వాసము నోరు ముక్కు అనువానియందు కంపువేసుట వాసన దెలియకుండుట యీ లక్షణములుగలది రక్తప్రతిశ్యాయ మనంబడు,

## చికిత్స.

శ్లో॥ రక్తపిత్తోద్భవేపేయం సర్పిర్మధుకరైశ్శృతమ్ ॥

తా. రక్తపిత్తమువలన గలిగిన ప్రతిశ్యాయమున తుమ్మెదల కషాయముకాచి అందు నెయ్యిగలిపి పాకముజేసి దానిని త్రాగవలయు,

ధాత్రీలేపము.

శ్లో॥ సర్పిషా ఘృష్టయధాత్ర్యా శిరసో లేపతఃక్షణాత్ ।
నాసాయాం సంప్రవృత్తంచ రుధిరంచ వినశ్యతి ॥

తా. నేతిలో వుసిరికవరుగునుసూరి శిరమున లేపనముజేసిన నాసికారక్తము తత్క్షణమున హరించు.

ప్రతిశ్యాయ సామాన్య చికిత్స.

శ్లో॥ విడంగం సైంధవాహింగు గుగ్గులు స్సమనశ్శిలః ।
ప్రతిశ్యాయే వచాయుక్తం సక్తుధూమం పిబేన్నరః ।
ఏతచ్చచూర్ణ మాఘ్రాతం ప్రతిశ్యాయం వినాశయేత్ ॥

తా. వస పేలపిండి అనువానియొక్క ధూమమును ప్రాశనము జేసి పిదప వాయువిడంగములు సైంధవలవణము యింగువ గుగ్గిలము మణిశిల అనువాని చూర్ణమును మూటగట్టి వాసన జూచుచుండిన ప్రతిశ్యాయము హరించు.

సక్తుధూమము.

శ్లో॥ ఘృతతైల సమాయుక్తం సక్తుధూమం పిబేన్నరః ।
సధూమస్యాత్ప్రతిశ్యాయ కాసహిక్కా హరఃపరః ।

తా. నెయ్యి నూనె వీనిలో పేలపిండినికలిపి దాని ధూమమును పానము జేసిన పడిసెము దగ్గు యెక్కిళ్ళుహరించు.

ధూమచూర్ణము.

శ్లో॥ ప్రతిశ్యాయే పిబేద్ధూమం సర్వాంగవ్య సమాయుతమ్ ।
చాతుర్జాతక చూర్ణంవా ఘ్రేయంవా కృష్ణజీరకమ్ ॥

తా. సర్వపడిసెనుయందు ఆవు నేతిలో యుక్తమైన ద్రవ్యములగలిపిధూమ పానము జేయవలయు మఱియు చాతుర్జాతకములగాని లేక నల్లజీలకఱ్ఱనుగానిచూర్ణ ముబట్టలోగట్టి వాసన జూడవలయు.

నవసాగర యోగము.

శ్లో॥ ప్రతిశ్యాయేషు సశిరః పీడేషు నవసాగరమ్ ।
సమానం కలికాచూర్ణం సూక్ష్మతం చూర్ణితంద్వయమ్ ।

గుంజామాత్రంతు తచ్చూర్ణం నస్యప్రధమనం చరేత్ ।
నశ్యంత్యనేన యత్నేన ప్రతిశ్యాయ శిరోరుజః ॥

తా. శిరమున శూలయుక్తముగ ప్రతిశ్యాయము గలిగిన నవాసాగరము సున్నము వీనిని సమభాగములుజేర్చి ఖల్వములోనునిచి నూరి గురిగింజయెత్తును నాసికమున * ప్రధమననస్యముజేసిన పడిసెము మస్తకశూల వీనిని హరింపంజేయు.

## ప్రతిశ్యాయహర నస్యము.

శ్లో॥ వచాయా శ్చూర్ణమాఘ్రాయ వాససా పోటలీకృతమ్ ।
కారవీం వస్త్రబద్ధాంవా ప్రతిశ్యాయ మపోహతి ॥

తా. వసనుగాని లేక వోమమునుగాని చూర్ణముజేసి బట్టలోగట్టి వాసనను బీల్చిన పడిసెము హరించు.

## శఠ్యాది చూర్ణము.

శ్లో॥ శఠీసామలకీ వ్యోష చూర్ణంసర్పి ర్గుడాన్వితమ్ ।
హరేద్ఘోరం ప్రతిశ్యాయం పార్శ్వహృద్వస్తి శూలనుత్ ॥

తా. కిచ్చిలిగడ్డ వుసిరికవరుగు త్రికటుకములు వీనిని చూర్ణముజేసి నెయ్యి బెల్లము వీటిలోగలిపి భక్షించిన కడుభయంకరమైన పడిసెము పార్శ్వము రొమ్ము వస్తి అనువాని యందలి శూల హరించు.

## అసాధ్యప్రతిశ్యాయ లక్షణము.

శ్లో॥ సర్వఏవ ప్రతిశ్యాయా నరస్యా ప్రతికారిణః ।
దుష్టతాం యాంతి కాలేన తదాసాధ్యా భవంతిచ ।
మూర్ఛంతి క్రిమయశ్చాత్ర శ్వేతాస్స్నిగ్ధా స్తథాణవః ।
క్రిమిజోయ శ్శిరోరోగ స్తుల్యంతే నాస్యలక్షణమ్ ॥

* ప్రధమననస్యమన...6 అంగుళములపొడవు అగ్రమున 2 రంధ్రములుగల గొట్టమును సరళముగ జేయించి అందు చూర్ణమునుపైచి నాసికమునందు నునిచి ముఖవాతముతో వూదుట.

తా. సర్వప్రతిశ్యాయముల నుపేక్షించుటవలన కాలాంతరమున దుష్టంబులై అసాధ్యంబులై తెల్లగనున్నగ సన్నముగనుండు క్రిములు నాసికములో జనించు. దానియందు క్రిమిజ శిరోరోగము లక్షణంబులు గల్గుగు.

### ప్రతిశ్యాయోపేక్షజ వికారములు.

శ్లో॥ బాధిర్యమాంద్య మఘ్రిత్వం ఘోరాంశ్చ నయనామయాన్।
శోథాగ్ని సాధకాసాదీ న్వృద్ధాకుర్వంతి పీనసాః ॥

తా. సర్వపీనసములు వృద్ధి జెందినచెవుడు మందదృష్టి వాసనదెలియకుండుట భయంకరమైన నేత్రరోగము వాపు అగ్నిమాంద్యము దగ్గు మొదలగునవి గలుగు.

### క్రిమినాసా చికిత్స.

శ్లో॥ కృమిఘ్నా యేక్రమాః ప్రోక్తా స్తావై న్కృమిషు యోజయేత్ ।
ధావనానికృమిఘ్నానిని భేషజానిచ బుద్ధిమాన్ ॥

తా. కృమిరోగోక్త ఔషధములవలనను కృమి నాశ కరౌషధముల వలనను కృమిజనాసారోగము గడుగుటయేగాక కృమినాశ కరౌషధముల సేవనను జేయించ వలయు.

### కృమిహర చికిత్స.

శ్లో॥ రక్తామ్ర స్వరసశ్శుద్ధ స్తక్రేణ సహనస్యతః ।
తస్యపర్ణాని పిష్ట్వాచ బధ్నీయా న్నాసికాముఖే ।
పతంతి కీటకాస్సద్యో యోగోయంత్రి దినేహితః ।
పీనసా న్ముచ్యతేరోగీ శతశోను మితంత్విదమ్ ॥

తా. ఎఱ్ఱగోగుహర స్వరసమును వడియగట్టి మజ్జిగలోగలిపి నస్యముజేయించుటయేగాక యెఱ్ఱగోగాకునునూరి నాసికాముఖమున నునిచి కట్టుగట్టవలయు ఇటుల 3 దినములుచేసిన తక్షణమున పురుగులుపడిసెము హరించు. ఇది యనుభవ సిద్ధంబులు.

### నాసారోగములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] స్వేదస్నే శిరోభ్యంగః పురాణాయవశాలయః । కులుత్థ ముద్గయోర్యూషో గ్రామ్యజాంగలజారసాః।

వార్తాకం కుళకంశిగ్రు కర్కోటం బాలమూలకమ్ । లశు
నందధితప్తాంబు వారుణీచ కటుత్రయమ్ । కట్వమ్లలవణం
స్నిగ్ధ ముష్ణంచ లఘుభోజనమ్ । నాసారోగే పీనసాదౌ నే
వ్యాపే తద్యథామలమ్ ॥

తా. స్వేదము స్నేహము మస్తకాభ్యంజనము పాతయవలు బియ్యము వుల
వలు పెసలు అనువాని యూషము గ్రామ్యమాంసరసము జాంగలమాంసరసము వం
కాయ చేతిపాట్ల మునక్కాయ మారేడుకాయలు లేతముల్లంగి వెల్లుల్లి పెరుగు
వుష్ణోదకము మద్యము త్రికటుకములు కారము పులుసు వుప్పు జిగటగలపదార్థములు
వుష్ణము లఘుకరభోజనము యీ మొదలగు వానిని నాసారోగమునందు దోషాను
గుణ్యముగ పథ్యమునందు గ్రహింపందగు.

నాసారోగములయం దపథ్యము.

శ్లో॥ స్నానక్రోధం శకృన్మూత్ర వాతవేగాన్ శుచంద్రవమ్ ।
భూమిశయ్యాంచ యత్నేన నాసారోగీ పరిత్యజేత్ ॥

తా. స్నానము క్రోధము మలమూత్ర వాతవేగముల నడ్డగించుట శోకము
ద్రవపదార్థములు భూమిపైబరుండుట వీనిని నాసారోగంబులు గలవారు ప్రయత్న
పూర్వకముగ వర్జింపవలయు.

పీనసరోగ నిదానము.

శ్లో॥ [శారీరే] పూయంస్రవతిదుర్గంధం నాసాయా మతితాపకృత్ ।
తత్రౌషధం ప్రదాతవ్యం శ్వేతజీర సితాద్రవైః ।
ఘృతాక్తం కుంకుమంఘృష్టం నస్యేత్పీనస రోగనుత్ ॥

తా. ముక్కున కడుతాపముగలిగి దుర్గంధముగ చీముగారిన తెల్లజీలకఱ్ఱ
పంచదార వీని నుదకముతో నూరిగాని లేక కుంకుమపువ్వును నేతితోనూరిగాని
నస్యముజేయించిన మరికి పీనసములు హరించు. (దుందిలపుచెక్క అనుములువీని
వండి భక్షించిన మరికి పీనసములు నాసికావ్రణములు హరించు.)

పీనసరోగ భేదములు.

శ్లో॥ రక్తంపీతం తథాశ్వేతం నీలంహారిద్ర మిశ్రితమ్ ।
పూయం స్రవతిదుర్గంధం పీనసాఖ్యంచ సప్తకమ్ ॥

తా. రక్తవర్ణము సీతవర్ణము శ్వేతవర్ణమునీలవర్ణము పసపువర్ణముమిశ్రవర్ణము పూయవర్ణము అనపీనసములు 7 విధములు యివి దుర్గంధములుగ స్రవించు.

## పీనసహర నస్యములు.

శ్లో॥ [అశ్వినీకల్పే] ఉష్ణోదకేన వానస్యం పిప్పలీ వాగరంనిశా ।
దేవదారు ఫలాగ్రేణ గుంజైకం శీతవారిణా ।
సప్తాహే పీనసంహంతి నాసారోగంచ నాశయేత్ ॥

తా. పిప్పళ్ళు శొంఠి పసపు వీని నుష్ణోదకముతో నూరి నస్యముజేయించిన పీనసములు హరించు. మఱియు దేవదారుపండు అల్లము వీనిని శీతోదకముతోనూరి గురిగింజ ప్రమాణమును 7 దినములు నస్యముజేయించిన పీనసము నాసారోగము హరించు. (మఱియు పాపరపండును నస్యముజేయించిన పీనసముహరించు.)

## ద్రాక్షాదిస్నేహము.

శ్లో॥ [మాధవనిదానే] ద్రాక్షాశుంఠీవిళంగాని పిప్పలీకుష్ఠచూర్ణితమ్।తతోదశగుణైస్తోయైః క్వాథయేత్పాదశేషితమ్। ఘృతం చూర్ణ సమంక్షిప్త్వా ప్యాజంవా తిలంతైలకమ్ । స్నేహావశేషం తత్పాచ్యం నస్యేన్నాసా మయంజయేత్ ।

తా. ద్రాక్షపండు శొంఠి వాయువిడంగములు పిప్పళ్ళు చెంగల్వకోష్టు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దానికి 10 రెట్లువుదకముబోసి 4 వభాగముగ కషాయముకాచి అందుపైచూర్ణమునకు సమముగ మేకనెయ్యినికాచి నువ్వులనూనెను గానికలిపి స్నేహావశేషముగ కాచి నస్యముజేయించిన నాసారోగము హరించు.

## జీవంత్యాది కషాయము.

శ్లో॥ [మాధవనిదానే] ద్వాత్రింశత్పల దుగ్ధంతు పాచయేత్సమ వారిణా । జీవంతి దశకంచూర్ణం తస్మిన్దశ పలంక్షిపేత్ । క్వాథశేషం హరేత్పాదం నస్యే త్పీనసనాశనమ్ ॥

తా. మనుబాల దశమూలములు వీనిని దినుసుకు పలముచొప్పునదంచి చూర్ణముజేసి పాలు 32 పలములు గలిపి 4 వ భాగముగ కషాయముకాచి నస్యముజేయించిన పీనసములు హరించు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే]అశ్వగంధాదితైలేన నస్యేన్నాసారుజంహరేత్।
సైరేయకాదితైలేన శిరోలేపాచ్ఛతం జయేత్ ॥

తా. అశ్వగంధాది తైలమునుగాని లేక సైరేయకాది తైలమునుగాని నస్యము అభ్యంజనము జేయించిన పీనసము హరించు.

## కణాది నస్యము.

శ్లో॥ [పూజ్యపాదీయే] కణాసైంధవ కం పిష్ట్వా హ్యుష్ణ నీరేణ
నస్యతః । నాసా శ్రవణవాతంచ కంఠవాతంచ నాశయేత్ ॥

తా. పిప్పలి సైంధవలవణము వీని నుష్ణోదకముతోనూరి నస్యము జేయించిన పీనసము చెవినొప్పి కంఠవాతము హరించు.

శ్లో॥ కృష్ణజీరం వస్త్రబద్ధ మాఘ్రాతం పీనసప్రణుత్ ।
అఘ్రాయ రజనీధూమం సద్యశ్లేష్మ హరంభవేత్ ।
అర్కమూల కృతంనస్యం కామిలాం దుస్సహాంహరేత్ ॥

తా. నల్లజీలకఱ్ఱను బట్టలో మూటగట్టి వాసనజూచిన పీనసముహరించు. మరియు పసపుపొగ నాఘ్రాణించిన దగ్గు తక్షణమున హరించు. జిల్లేడువేరును నస్యము జేయించిన ప్రబలమైన కామిలహరించు.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] నిర్గుండీరసమాత్రేతు తైలప్రస్థంవిపాచయేత్।
త్రిఫలా త్ర్యూషణంచైవ జీరకద్వయ సైంధవమ్ ।
పునర్నవాయా మూలంచ మాయూరం బీజమేవచ ।
కల్కీకృత్య ప్రదాతవ్య మజాక్షీరంచ దాపయేత్ ।
నస్యమే తత్ప్రయోక్తవ్యం నాసారోగ వినాశనమ్ ॥

తా. [వావిలియాకురసము] ప్రస్థము నూనె ] ప్రస్థము వీనిలో త్రిఫలములు త్రికటుకములు తెల్లజీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ సైంధవలవణము తెల్లగలిజేరువేరు నెమలి విత్తులు అనువాని కల్కమును. 2 శేర్లు మేకపాలుఁగలిపి తైలపక్వముగ కాచి నస్యము జేయించిన నాసారోగము హరించు.

## నస్యములు.

క॥ అలనాగరసపు గడ్డయు।దిలసారముగూర్చివండి తెలివిగధరరో।
గులకు న్మరినస్యంబులు।సలుపంగనుమురికి పీనసంబులుమానున్॥

సీ॥ మోదమలరంగ విను మునిమోరగడ్డ ।
త్రొక్కి యదియును దైలంబుతోడవండి ।
నవయుచున్నట్టి ధరణి మానవులకెల్ల ।
నస్యములుచేయ మురికి పీనసములునూను ॥

విడంగాది చూర్ణము.

శ్లో॥ [ఆయుర్వేదే] విడఙ్గత్ర్యూషణంహిఙ్గు గుగ్గులుంచ మనశ్శిలామ్।
అభయా చూర్ణమాఘ్రాయ ప్రతిశ్యాయా త్ప్రముచ్యతే ॥

తా. వాయువిడంగములు త్రికటుకములు గుగ్గిలము మణిశిల కరక్కాయ వీనిని సమభాగములుగ చూర్ణముజేసి ఆఘ్రాణించిన పీనసము హరించు.

శ్లో॥ ఉష్ణోదకై ర్గుడంశుంఠీ చూర్ణంవా సైంధవంకణాః ।
ఉష్ణోదకె ఘృతంనస్యే ఘ్రాణేచే త్పీనసంహరేత్ ॥

తా. బెల్లము శొంఠి అనువానినిగాని లేక సైంధవలవణము పిప్పలి అనువానినిగాని వుష్ణోదకముతోనూరి నస్యముజేయించినను లేక వుష్ణోదకములో నెయ్యిగలిపి నస్యము జేయించినను పీనసము హరించు. (గుంటగలగర దొండ వావిలి అల్లము అడ్డసరము పసపు వుస్తె కొయ గుంపరాస్నము మిరియాలు శొంఠి అనువాని కల్కములో నూనెగలిపి తైలపక్వముగ కాచి నస్యముజేయించిన పీనసములు హరించు.)

మ॥ గలిజేరు మ్మలిదొండవావిలియు లోకఖ్యాతిగానున్నయా ।
నలముక్క డ్డరసంబుసూనె పసపు న్నాద్యంబు వుచ్చిత్తయు ।
న్నొలయన్నిందులరాస్నమున్మిరి యమున్విశ్వంబులున్నిండియిం।
పలరం దైలమువండి నస్యములుచేయం బీనసల్మానదే ॥

నాసికార్శో లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] నాసికారంధ్ర యాశ్చైవ హ్యాజస్తన వదుద్భవేత్ । తన్నామ మునిభిఃప్రోక్తం నాసికార్శ ఆతిధ్రువమ్ ॥

తా. నాసికారంధ్రములయందు మేకచన్నులవలె జనించిన నాసికార్శస్సని మునులు వచించెదరు.

## నాసికార్శ నివర్తనోపాయము.

శ్లో॥ నాసారంధ్రే గుళీస్థాప్య నాసికార్శశ్చ పీడితమ్ ।
వక్త్రే ప్రవిష్టం యుక్త్యైవ పాతయే ద్వ్యాధివేదిభిః ॥

తా. నాసికారంధ్రములలో వ్రేళ్ళను బ్రవేశింపంజేసి యదిమినకొండనాలిక వద్దగాని లేక అంగిటియందుగాని నాసికార్శస్సు దిగును. దానిని వేళ్ళతో బట్టికొని యుక్తిచే దెంపివేయవలయు.

శ్లో॥ అశ్వగంధాది తైలేన నస్యే న్నాసార్శసో హరమ్ ।
అహింసపత్రం లశునం మరీచంచ తథా స్మృతమ్ ॥

తా. అశ్వగంధాదితైలమును నస్యముజేయించినను లేక ఆరెదొండ తైలములో వెల్లుల్లిపాయలు మిరియాలు గలిపి మర్దించి 5 మార్లు నస్యము జేయించినను నాసికార్శస్సు (ముక్కున చీముగారుట) హరించు.

## పీనసరోగములయందు పథ్యము.

శ్లో॥ లఘ్వన్నం స్నిగ్ధలవణ ముష్ణభోజనమార్ద్రికమ్ ।
పక్షిమాంసం గుడక్షీరం చణకా స్త్రికటూత్కటమ్ ।
బాలమూలక జోయూష కుళుత్థస్యచ పూజితమ్ ॥

తా. లఘుకరాన్నము సముద్రలవణము వేడివంటకము అల్లము పిట్టమాంసము బెల్లము పాలు సెనగలు త్రికటుకములు లేతముల్లంగి యుక్తముగ కాచబడిన యూషమువులవకట్టు చకారమువలన పెసరకట్టు యివి పీనసములయందు పథ్యకరంబులు. (మఱియు వొత్తడమునిచ్చుట పొగ నాఘ్రాణించుట పీనసములయందు ప్రశస్తంబు.)

## శిరోరోగ భేదములు.

శ్లో॥ శిరోరోగాశ్చ జాయంతే వాతపిత్త కఫై స్త్రిభిః ।
సన్నిపాతేన రక్తేన క్షయేణ కృమిభి స్తథా ।
సూర్యావర్తానంతవా తార్ధావభేదకశంఖకైః ॥

తా. వాత పిత్త కఫ సన్నిపాత రక్త క్షయ క్రిమి సూర్యావర్తము మనంతవాత అర్ధావభేదక శంఖమువలన 11 విధములైన శిరోరోగంబులు జనించు, వాని లక్షణంబు లెవ్వియనిన. —

## వాతజ శిరోరోగ లక్షణము.

శ్లో॥ యస్యానిమిత్తం శిరసోరుజశ్చ భవంతితీవ్రానిధచాతిమాత్రమ్।
బంధోపతాపైః ప్రశమశ్చయత్ర శిరోభితాపస్సమీరణేన ॥

తా॥ కారణములేకనే యకస్మాత్తుగ దలనొచ్చుట రాత్రులయందుమిక్కుట ముగ నొచ్చుట కట్టువలనగాని లేక ఆవిరివచ్చుటవలనగాని తలనొప్పి శమించుట యీ లక్షణములు గలది వాతజశిరోరోగ మని తెలియవలయు.

శ్లో॥ యస్యోష్ణమంగారచితంతథైవ భవేచ్ఛిరోదహ్యతివాక్షినాసా
శీతేనరాత్రౌచభవేచ్ఛమశ్చ శిరోభితాపస్సపిత్తకోపాత్ ॥

తా. మస్తకముపై నిప్పుజల్లనటుల దపించుట నేత్రములు నాసికము అను వానియం దావిరివెడలుట శీతకరపదార్థములవలన గాని లేక రాత్రులయందుగాని శమించుట యీ లక్షణములుగలది పిత్తప్రకోపమువలన గలిగిన శిరశ్శూల యని తెలియవలయు.

## కఫజ శిరోరోగ లక్షణము.

శ్లో॥ శిరోభవేదస్య కఫోపదిగ్ధం గురుప్రతిష్టబ్ధ మథోహిమంచ ।
శూనాక్షికూటంవదనంచయస్య శిరోభితాపస్సకఫప్రకోపాత్ ॥

తా. శిరము కఫమువలన పూయంబడినటులుండుట బలువుగనుండుట బంధింప బడినటులుండుట చల్లగనుండుట కంటిరెప్పలు ముఖము వుబ్బుట యీ లక్షణములుగలది శ్లేష్మజ శిరశ్శూల యని తెలియవలయు.

## సన్నిపాత శిరోరోగ లక్షణము.

శ్లో॥ శిరోభితాపేత్రితయప్రవృత్తే సర్వాణిలింగాని సముద్భవంతి ॥

తా. వాత పిత్త కఫ శిరోరోగలక్షణంబు లన్నియు గలది సన్నిపాతజ శిరోరోగ మని తెలియవలయు.

## రక్తజ శిరోరోగ లక్షణము.

శ్లో॥ రక్తాత్మకఃపిత్తసమానలింగ స్స్పర్శాసహత్వం శిరసోభవేచ్చ॥

తా. పిత్తజ శిరోరోగ లక్షణయుక్తంబై శిరమున స్పర్శసహనము లేకుండు నది రక్తజ శిరోరోగ మని తెలియవలయు.

## క్షయజ శిరోరోగ లక్షణము.

శ్లో॥ అసృగ్వసాశ్లేష్మ సమీరణానాం శిరోగతానా మిహసంక్షయేణ। క్షవప్రవృత్తి శ్శిరసోభితాపః కష్టోభవేదుగ్ర రుజోతిమాత్రమ్। సంస్వేదనచ్ఛర్దనధూమనస్యై రసృగ్విమోక్షైశ్చ వివృద్ధిమేతి ॥

తా. శిరమునందలి రక్తము వస కఫము వాయువు క్షయించుటవలన కష్టకరమైన కడుభయంకరమైన మస్తకశూల జనించి మిక్కుటముగ తుమ్ములు వచ్చుట శిరము తపించుట స్వేదనక్రియ వాంతి ధూమపానము నస్యము రక్తస్రావము అను వానివలన వృద్ధిం జెందుట యీ లక్షణములుగలది క్షయజశిరోరోగ మని తెలియవలయు.

## కృమిజ శిరోరోగ లక్షణము.

శ్లో॥ నిస్తుద్యతే యస్యశిరోతిమాత్రం సంభక్ష్యమాణం స్ఫురతీవ చాంతః। ఘ్రాణాచ్చగచ్ఛేద్రుధిరంసపూయం శిరోభితాపః కృమిభిస్సఘోరః ॥

తా. శిరమున సూదులతో బొడుచునటుల మిక్కుటముగ పీడగలుగుట శిరమునందలి మెదడు పురుగులవలన భక్షింపబడునటులుండుట శిరములో మిక్కుటముగ చలించినటులుండుట ముక్కువలన చీముతోడ రక్తము స్రవించుట ముక్కులో నుండి క్రిము లొకానొకప్పుడు వెడలుట యీ లక్షణములు గలది క్రిమజ శిరోరోగ మని తెలియవలయు. భయంకరమై యీ రోగము ప్రాణముల హరింపంజేయు.

## సూర్యావర్త లక్షణము.

శ్లో॥ సూర్యోదయం యాప్రతిమందమంద మక్షిభ్రువంరుక్సముపైతిగాఢా। వివర్ధతేచాంశుమతాసహైవ సూర్యాప్రవృత్తౌ వినివర్తతేచ। శీతేనశాంతిం లభతేకదాచి దుష్ణేనజంతు స్సుఖమాప్నుయాద్వా। సర్వాత్మకం కష్టతమంవికారం సూర్యాపవర్తం తముదాహరంతి ॥

తా. సూర్యోదయము మొదలు నేత్రములు కనుబొమలు మెల్ల మెల్లగ నొప్పుటకు ప్రారంభించి వృద్ధి జెందునటుల నే శూలము వృద్ధి జెంది అస్తంగతుడగు సూర్యుని చందంబున కొంచెకొంచెముగ శూలతగ్గుమ సూర్యాస్తమయకాలమునకు నిశ్శేషం

బగుట ఒకానొకపుడు శీతోపచారమువలన గాని లేక వుష్ణోపచారమువలన గాని సుఖముగలుగుట నన్నిపాతవికారముగనుండుట యీ లక్షణములుగలది సూర్యావర్తమని తెలియవలయు. ఇది కష్టసాధ్యము.

## అనంతవాత లక్షణము.

శ్లో॥ దోషాస్తుదుష్టాస్త్రయఏవమన్యాం సంపీడ్యగాఢంసరుజాం సుతీవ్రాం। కుర్వంతిసాక్షి భ్రూవిశంఖదేశే స్థితంకరోత్యాశు విశేషతస్తు। గండస్యపార్శ్వేచ కరోతికంపం హనుగ్రహం లోచనజాంశ్చరోగాన్।అనంతవాతంతముదాహరంతి దోషత్రయోత్థం శిరసోవికారమ్ ॥

తా. వాతపిత్తకఫములు దుష్టంబులై మెడయొక్క వెనకటిసిర నాశ్రయించి బలముగనీడ్చుట నేత్రములు కనుబొమల కణత అనువాని ,జెంది కడుతీవ్రమైన పీడను గలుగంజేయుట దానిసంబంధమువలన చంపలయొక్క పార్శ్వములు మిక్కుటముగ వణుకుట చెక్కిళ్ళు ,కిట్టికొనుట నేత్రరోగముగలుగుట యీ లక్షణములు గలది అనంతవాతమని తెలియవలయు, ఇది త్రిదోషమువలన బనించు.

## అర్ధావభేద లక్షణము.

శ్లో॥ రూక్షాశనాత్యధ్యశన ప్రాగ్వాతావశ్యమైథునైః ।
వేగసంధారణాయాస వ్యాయామైః కుపితోనిలః ।
కేవలస్సకఫోవార్ధం గృహీత్వాశిరసోబలీ ।
మన్యాభ్రూశంఖకర్ణాక్షి లలాటార్ధేతి వేదనామ్ ।
శస్త్రారణినిభాంకుర్యా త్తీవ్రాంసోర్ధావభేదకః ।
నయనంవాధవాశ్రోత్ర మభివృద్ధోవినాశయేత్ ॥

తా. రూక్షాన్నము సేవించుట అజీర్ణముగ నుండునపుడు భుజించుట తూర్పుగాలి మంచు మైథునము వీనిని సేవించుట మలమూత్రవేగము నడ్డగించుట శ్రమవ్యాయామము యివి మొదలగువానివలన వాతముగానిలేక వాతకఫముగాని ప్రకోపించి అర్ధశిరము నాశ్రయించి పెడతల పెద్దనరము కనుబొమ కణతచెవి నేత్రములలాటము అనువానియొక్క 1 పార్శ్వమునందు వ్యాపించి బలిష్ఠమై శస్త్రముగో బాడుచునటుల గాని లేక అగ్నిదీపెడి కఱ్ఱను మథించునటుల గాని తీవ్రవేదనను గలుగంజేసిన

అర్థావభేదక మనంబడు. ఇది మిక్కుటముగ వృద్ధిం జెందిన ఆ భాగముయొక్క నేత్రమునుగాని లేక చెవినిగాని నశింపంజేయు,

## శంఖ లక్షణము.

శ్లో॥ పిత్తరక్తానిలాదుష్టా శంఖదేశేవిమూర్ఛితాః ।
తీవ్రరుగ్దాహరాగంహి శోథంకుర్వంతిదారుణమ్ ।
సశిరో విషవద్వేగీ నిరుంధ్యాశుగళంతథా ।
త్రిరాత్రాజ్జీవితంహంతి శంఖకోనామనామతః ।
త్ర్యహాజ్జీవతిభైషజ్యం ప్రత్యాఖ్యాయాస్యకారయేత్॥

తా. పిత్తము రక్తము వాతము అనునవి దుష్టంబులై (కఫముతో గలసి మిక్కుటముగ వృద్ధింజెంది) కణతలయందు వ్యాపించి మిక్కుటముగ పోట్లను మంటను యెఱుపువర్ణమై భయంకరమైన వాపును గలుగంజేయు. ఈవాపు విషవేగము గలదై మస్తకమువలన గొంతువఱకు వ్యాపించి శీఘ్రముగ గొంతునుపట్టికొనిౘ దిన ములలో మనుజుని జంపు, ఇదియు శంఖకమనంబడు. రోగి 3 దినములకు పిదప జీవించియుండిన సాధ్యమనియెఱింగి బుద్ధిమంతుడగు వైద్యుడు చికిత్సంజేయవలయు.

## వాతజశిరోరోగ చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] శిరోభిఘాతేనిలజే వాతవ్యాధివిధించరేత్ ।
ఘృతేనాక్తంశిరోరాత్రౌ సభేద్యూషంపయోనువా ।

తా. వాతజశిరోభిఘాతమునందు వాతరోగి చికిత్సంజేయువలయు. మఱియు రాత్రియందు శిరమున నెయ్యి పట్టించి యూషమునుగాని లేక పాలనుగాని పానము జేయించవలయు.

## ఏరండాది లేపనము.

శ్లో॥ ఏరండచక్రమర్దోత్థ బీజంపిష్ట్వారనాళకైః ।
లలాటేలేపనాద్ధంతి వాతకోపశిరోరుజమ్ ॥

తా. ఆముదపువిత్తులు తగిరిసెవిత్తులు వీనిని పుల్లని కలితోనూరి నుదుర యందు లేపనముజేసిన వాతజ శిరోరోగము హరించు.

శ్లో॥ వాతజాతశిరోరోగే స్నేహస్వేదవిమర్దనమ్ ।
పానాహారోపనాహాచ్చ కుర్యాద్వాతామయాపహః ।

తా. వాతజ శిరోరోగమున వాతనాశకరస్నేహము చలనస్వేదము మూర్ధ్నః పానము ఆహారము కట్టుగట్టుట మొదలగు నుపచారముల సేయవలయు.

## కుష్ఠాది లేపము.

శ్లో॥ కుష్ఠమేరండమూలంచ నాగరంత క్రపేషితమ్ ।
కటుస్తంచశిరః పీడాం మాత్రా లేపనతో హరేత్॥

తా. చెంగల్వకోష్టు ఆముదపు వేరు శొంఠి వీనిని మజ్జిగతో నూరి యుడికించి కొంచెముష్ణముగ దళముగ లేపనము జేసిన వాతజ శిరశ్శూల హరించు.

## కుష్ఠాది లేపము

శ్లో॥ కుష్ఠమేరండమూలంచ లేపః కాంజకపేషితః ।
శిరో ర్తింవాతజాంహన్యా త్పుష్పంవాముచుకుందజమ్॥

తా. చెంగల్వకోష్టు ఆముదపు వేరు అనువానిని గాని లేక ముచుకుం పూలను గాని కలితో నూరి లేపనము జేసిన వాతజశిరశ్శూల హరించు.

## వాతజశిరోరోగ హరవస్తికర్మ.

శ్లో॥ వేశిరోవ్యాపితిచ్చర్మ షోడశాంగుళముచ్ఛ్రితమ్ । తేనవేష్ట్యశి
శిరోధస్స్నాన్మాషకల్కేన లేపయేత్ । నిశ్చలస్యోపవిష్టస్య తైలైః
కోష్ణైః ప్రపూరయేత్ । ధారయేదారుజశ్శాంతే ర్యామంయా
మార్ధమేవవా । శిరోవస్తిర్హరత్యేషశిరోరోగంచవాతజమ్ ।
హనుమన్యాక్షికర్ణానాం మర్దితంమూర్ధకంపనమ్ । విరాభోజ
నమేవైష శిరోవస్తిః ప్రయుజ్యతే । పంచాహంషడహంవాపి
సప్తాహంచైవమాచరేత్ ॥

తా. శిరోరోగమున శిరమునకు తగిన 16 అంగుళముల పొడువు వెడల్పుగల తోలునుతలయందు చుట్టి పచ్చివలెజుట్టి దానిచుట్టు వుద్ది పిండిని లేపనముజేసిరోగినికూర్చుం డబెట్టి నూనెను కాచి గోరువెచ్చగ నందునపుడందుబోసి తలనొప్పి శమించువరకు గాని 1 ఝాముగాని లేక 3 ఘడియలుగాని ధరింపజేయుటయు శిరోవస్తియనంబడు. ఈశిరోవస్తి 5 దినములైనను లేక 6 దినములైనను 7 దినములైనను జేసిన వాతములను

గలిగిన శిరోరోగము చెక్కిళ్ళు పెడతల పెద్దనరము నేత్రములు చెవులు అనువాని యందు గలుగురోగములు అర్దితవాతము తలవణంకు వీనిని హరింపఁజేయు. ఈ శిరో వస్తిని భోజనాత్పూర్వమే జేయించవలయు.

పిత్తజ శిరోరోగ చికిత్స

శ్లో॥ పిత్తాత్మకే శిరోరోగే స్నిగ్ధం సమ్యగ్విరేచనమ్ ।
మృద్వీకాత్రిఫలేక్షూణాం రసైః క్షీరై ర్ఘృతైరపి ॥

తా. పిత్తశిరోరోగమున ద్రాక్షపండు త్రిఫలములు చెఱుకు అనువాని రసములచేతను పాలు నెయ్యి అనువానిచేతను బాగుగ విరేచనము జేయించవలయు.

కుముదాది బంధనము.

శ్లో॥ కుముదోత్పలపద్మానాం శీతానాం చందనాంబుభిః ।
స్పర్శాస్సుఖాశ్చపవనా స్సేవ్యా దాహార్తి శాంతయే ॥

తా. తెల్లకలువ నల్లకలువ కమలము అనువానిపైచందనోదకమునుచల్లి మస్తకమునందుకట్టుగట్టి సుఖకరమైన గాలిని యనుభవింపంజేసినదాహనుపోట్లుశమించు.

కఫజ శిరోరోగ చికిత్స.

శ్లో॥ శ్లైష్మికే చందనై రూక్షై ర్లేపస్స్వేదాదికారయేత్ ।

తా. కఫజ శిరోరోగమున చందనము రూక్షకరద్రవ్యములు అనువాని లేపనము స్వేదాదిక్రియను జేయవలయు.

హరేణ్వాది లేపము.

శ్లో॥ హరేణునతశైలేయ ముస్తైలాగరుదారుభిః ।
మాంసీరాస్నారుబూకైశ్చ కోష్ణో లేపః కఫార్తినుత్ ॥

తా. రేణుకలు గ్రంధితగరము శిలాజిత్తు తుంగముస్తెలు యేలకులు కృష్ణాగురు దేవదారు జటామాంసి సన్నరాష్ట్రము ఆముదపువేరు వీనిని నూరి యుడికించి హింతోష్ణముగ లేపనముజేసిన కఫజ శిరోరోగము హరించు.

ప్రపున్నాటాది లేపము.

శ్లో॥ శుంఠీ కుష్ఠ ప్రపున్నాట దేవకాష్ఠైస్సమాహితైః ।

మూత్రపిష్టైస్సుఖోష్ణైశ్చ లేపశ్శ్లేష్మశిరోర్తినుత్ ॥

తా. శొంఠి చెంగల్వకోష్టు తిరికెవిత్తులు దేవదారు మహిసాక్షీగుగ్గిలము వీనిని ఆవుపంచితముతో నూరి యుడికించి సుఖోష్ణముగ లేపనము జేసిన కఫమువలన జనించిన మస్తకశూలను హరింపంజేయు.

## సాన్నిపాతక శిరోరోగ చికిత్స.

శ్లో॥ సన్నిపాతసముత్థేత్ర ఘృతం తైలంచ వస్తయః ।
ధూమనస్య శిరోరేకో లేపస్స్వేదాద్య మాచరేత్ ॥

తా. సన్నిపాత శిరోరోగము నెయ్యినూనె అనువాసనతో శిరోవస్తి జేయించు టయేగాక నాసికమున ధూమపానమును జేయింపవలయు. మఱియు మస్తకరేచనము లేపనము స్వేదము సేచనము మొదలగు క్రియలను జేయింపవలయు.

శ్లో॥ స్వేదనం ఘృతగోధూమై ర్నిర్గుండ్యాః క్వథితేనవా ।
సన్నిపాతోద్భవాం హంతిపీడాం హి హితపాచనైః ॥

తా. సన్నిపాతశిరోరోగమున ఘృతగోధుములను గాని లేక వావిలినిగాని కషాయముకాచి దానివలన స్వేదనకర్మము జేయించుటయేగాని హితకరమైన పాచనమునకు సగా యొసంగిన సన్నిపాత శిరోరోగము శమించు.

## రక్తజ శిరోరోగ చికిత్స.

శ్లో॥ రక్తజే పిత్తవత్సర్వం భోజనాలేపసేచనమ్ ।
శీతోష్ణయోశ్చ విన్యాసో విశేషాద్రక్తమోక్షణమ్॥

తా. సర్వపిత్తనాశకరభోజనము లేపనము సేచనము శీతోష్ణపదార్థముల శిరమున ధరించుట విశేషముగ రక్తస్రావమును జేయించుట యీ మొదలగువానిని రక్తజ శిరోరోగమున జేయవలయు.

## కృష్ణాది లేపము.

శ్లో॥ కృష్ణాంబుశుంఠీమధుక శతాహ్వోత్పలవాలకైః ।
జలపిష్టైశ్శిరోలేప స్సద్యశ్శూలనివారణః ॥

తా. పిప్పలి వట్టివేరు శొంఠి అతిమధురము పిల్లిపీచర నల్లకలువ కురువేరు వీనిని నుదకముతోనూరి మస్తకమున లేపనముజేసిన తత్క్షణమున శూల హరించు.

## నాగరాది నస్యము.

శ్లో॥ నాగరకల్కవిమిశ్రం క్షీరంనస్యేనయోజితం పుంసా ।
నానాదోషోద్భూతాం శిరోరుజంహంతి తీవ్రాంచ ।
శిరోర్తిం నాశయత్యాశు పుష్పంవాముచుకుందజమ్ ॥

తా. శొంఠి కల్కములో పాలుగలిపి నస్యము జేయించిన పలువిధదోషముల వలన గలిగి తీవ్రమైన మస్తకశూల శీఘ్రముగ హరించు.

## దాడింబాది యోగములు.

శ్లో॥ శిరశ్శూలేతు సంజాతే నాసారక్తం స్రవే ద్యది ।
దాడిమీపుష్పదూర్వోత్థ రసంకర్పూర మాక్షికమ్ ।
క్షుమం దుగ్ధం శిరోమర్ధ నస్యేపానేసితాన్వయః ॥

తా. దాడింబపువ్వు గరికె అనువాని రసమునుగాని లేక కర్పూరము తేనె పాలు అనువానిని గాని శిరోమర్దనము నస్యము పానము చేయించిన మస్తకశూల వలన గలిగిన రక్తస్రావము హరించు. మఱియు పానము సేయునెడల దానియందు పంచదార పాలు కలుపవలయును.

## ఉదుంబర ఫలయోగము.

శ్లో॥ ఉదుంబరఫలంపక్వం ఘృతపక్వం సితాయుతమ్ ।
ఏలామరీచసంయుక్తం భుక్తంస్యా ద్రక్తశాంతయే ।
కంటకారీఫలరసం లిప్త్వాహంతి శిరోరుజమ్ ॥

తా. పండిన అత్తిపండులో నెయ్యి పంచదారకలిపి పాకముజేసి యేలకులు మిరియాలు గలిపి భక్షించిన నాసికారక్తస్రావము హరించు. మఱియు ములకపండ్ల లో రసముదీసి శిరమున లేపనము జేసిన మస్తకశూల హరించు.

## నింబాది గుగ్గులము.

శ్లో॥ నింబత్వక్త్రి ఫలావాసా చూర్ణం కటుపటోలికా ।
తోయైశ్చతుర్గుణైః క్వాథే పాదాంశే వస్త్రగాలితమ్ ।
ఆదాయగుగ్గులుం తుల్యం క్షిప్త్వా తస్మి న్పునః పచేత్ ॥

పిండీతం భక్షయే త్కర్షం స్నిగ్ధముష్ణంచ భోజయేత్ ।
వాతశ్లేష్మోత్థితాం పీడాం దుస్సహాంచ శిరోరుజమ్ ।

తా. వేపపట్ట త్రిఫలములు అడ్డసరము చేతిపొట్ల వీనిని సమభాగములుగ దంచి 4 గింత లుఎకముబోసి చతుర్థాంశముగ కషాయముకాచి వడియగట్టి దానికి సమముగ శుద్ధిజేసిన గుగ్గిలముగలిపి గట్టియగువరకు మరలకాచి ప్రతిదిన మొకకర్ష మెత్తును సేవింపుచుండిన వాతకఫములవలన గలిగిన దారుణమైన మస్తకశూలను హరింపంజేయు. దీనియందు స్నిగ్ధముగ వుష్ణముగనుండు భోజనమును భుజింపం జేయవలయు.

## శిగ్రుపత్రాది లేపము.

శ్లో॥ శిగ్రుపత్ర రసైర్మర్ద్యం మరీచం మూర్ధశూలజిత్ ॥

తా. మునగాకు రసముతో మిరియములను లేపనము జేసిన మస్తకశూల హరించు.

## పిప్పల్యాదినస్యము.

శ్లో॥ పిప్పలీ సైంధవం పాచ్యం తైలే నాజ్యేననస్యతః ।
శిరశ్శూలం నిహంత్యాశు తమస్సూర్యోదయో యథా ॥

తా. పిప్పళ్ళు సైంధవలవణము వీని చూర్ణమును నూనెలోగాని లేక నేతిలోగాని కలిపి పాకముజేసి నస్యముజేయించిన "సూర్యోదయమువలన నంధకారము హరించుభంగి" మస్తకశూల శీఘ్రముగ హరించు.

## క్రిమిజ శిరోరోగ చికిత్స.

శ్లో॥ క్రిమిజేతు శిరోరోగే వ్యోషనక్తాహ్వశిగ్రుజైః ।
అజామూత్రేణ సపిష్టై ర్నస్యా క్రిమిహరం పరమ్ ॥

తా. త్రికటుకములు క్రానుగపట్ట మునగపట్ట వీనిని మేకపంచితముతో నూరి నస్యముజేయించిన క్రిమిజ శిరోరోగము హరించు. ఇది క్రిములు నశింపంజేయుట యందు కడుశ్రేష్ఠంబైనదిగ నున్నయది.

## విడంగాది తైలము.

శ్లో॥ విడంగం సర్జకాదంతీ హింగు గోమూత్రసంయుతమ్ ।
విపక్వం సార్షపం తైలం క్రిమిఘ్నం నస్యతః స్మృతమ్ ॥

తా. వాయువిడంగములు సర్జక్షారము దంతివేరు యింగువ వీని నావుపంచితనూరి కల్కముజేసి అందు తెల్లావనూనె గలిపి కాచి నస్యము జేయించిన క్రిమిజశిరోరోగము హరించు.

## సూర్యావర్త చికిత్స.

శ్లో॥ సూర్యావర్తప్రశమనం పాయయే త్సగుడంహవిః ।
తిలదుగ్ధప్రలేపేన సూర్యావర్తం జయే త్త్ర్యహాత్ ॥

తా. నెయ్యిలో బెల్లముగలిపి త్రాగినను లేక నువ్వులను పాలతోనూరి లేపనము జేసినను 3 దినములలో సూర్యావర్తము హరించు.

## సూర్యావర్త శిరోరోగ చికిత్స.

శ్లో॥ సూర్యావర్తే శిరావేధో నావనం క్షీరసర్పిషోః ।
హితః క్షీరఘృదాభ్యాస స్తాభ్యా మేవ విరేచనమ్ ॥

తా. సూర్యావర్త మన శిరోరోగమున సిరను వేధించుటయేగాక పాలు నెయ్యి అనువానియొక్క నస్యమును పానమును జేయించవలయు. మఱియు వానిచేతనే విరేచనము జేయించవలయును.

## సూర్యావర్త రసము

శ్లో॥ మృతసూతాభ్రకం తీక్ష్ణం ముండంతామ్రంమృతంసమమ్ ।
స్నుహిక్షీ రేదినంమర్ద్యం పిండితం గాక్షమాత్రకమ్ ।
మధునామర్దితం భక్షే ల్లోహపాత్రేదినేదినే ।
సప్తాహాత్సూర్యవర్తాదీ న్ శిరోరోగా న్నివారయేత్ ।
సూర్యోదయరసోనామ్నా సర్వమూర్ధగదాపహః ॥

తా. రసభస్మము అభ్రకభస్మము లోహభస్మము యినుపభస్మము తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి జెముడుపాలతో 1 దినము తేనెతో 1 దినము మర్దించి మాషప్రమాణము మాత్రలు జేసి లోహపాత్రలో నునిచి ప్రతిదినము సేవింపుచుండిన 7 దినములలో సూర్యావర్తము మొదలగు సర్వ శిరోరోగములు అర్ధ తలనొప్పి వీనిని హరింపంజేయు.

## మహాలక్ష్మీ విలాసినీ రసము.

శ్లో॥ లోహమభ్రంవిషంముస్తం త్రిఫలాత్రికటుంతథా । ధుత్తూరంవృద్ధదారుంచ బీజమింద్రాశనస్యచ । గోక్షురకద్వయం చైవ పిప్పలీమూలమేవచ । ఏతేషాంసమతాచూర్ణం రసైర్ధుత్తూరకస్యచ । నిష్పిష్యవటికాకార్యా బదరాస్థిప్రమాణతః । అనుపానంప్రయోక్తవ్యం శుంఠీచూర్ణం ద్విమాషకమ్ ॥ ఆర్ద్రికస్యరసంచైవ తోలకద్వయమేవచ। మహాలక్ష్మీ వినాసోయం సన్నిపాతనివారకః ॥

తా. లోహభస్మము అభ్రకభస్మము అతివస తుంగముస్తెలు త్రిఫలములు త్రికటుకములు వుమ్మెత్తవిత్తులు బొద్దివిత్తులు యింద్రాశనము పల్లేరు నేనుగపల్లేరు మోడి వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి వుమ్మెత్తరసముతో మర్దించి రేగు గింజంత మాత్రలుచేసి యందొక దానిని 2 మాషములయెత్తు శొంఠి చూర్ణానుపానముతో గాని లేక 2 తులములయెత్తు అల్లపురసముతోగాని సేవించిన సన్నిపాతాత్మక మస్తకశూల హరించు.

## దశమూలాది నస్యము.

శ్లో॥ దశమూలీకషాయంతు సర్పిస్సైంధవసంయుతమ్ ।
నస్యమర్ధావభేదఘ్నం సూర్యావర్తంశిరోర్తినుత్ ॥

తా. దశమూలముల కషాయములో నెయ్యి సైంధవలవణము గలిపి నస్యము చేయించిన అర్ధశిలనొప్పి సూర్యావర్తము మస్తకశూల వీనిని హరింపంజేయు.

## శారిబాద్ లేపము.

శ్లో॥ శారిబోత్పలకుష్ఠాని మధుకంచామ్లపేషితమ్ ।
సర్పిస్తైలయుతోలేప సూర్యావర్తార్ధభేదయోః ॥

తా. సుగంధిపాలవేరు నల్లకలువగడ్డ చెంగల్వకోష్టు అతిమధురము వీనిని ఆమ్లద్రవ్యములతో నూరి ఆంపు నెయ్యి నూనెగలిపి లేపనము చేసిన సూర్యావర్తము శిరశ్శూలనొప్పి హరించు.

## భృంగరాజాది నస్యము.

శ్లో॥ భృంగరాజరసశ్ఛాగ క్షీరతుల్యోర్క తాపితః ।
సూర్యావర్తం నిహంత్యాశు నస్యేనైవప్రయోగరాట్॥

తా. గుంటగలగరరసమునకు సమముగ మేకపాలుగలిపి సూర్యపుటం బిడి నస్యము జేయించిన సూర్యావర్తము శీఘ్రముగ హరించు.

## అనంతవాత శిరోరోగ చికిత్స.

శ్లో॥ అనంతవాతే కర్తవ్య స్సూర్యావర్తహితోవిధిః ।
సిరావేధశ్చ కర్తవ్యోనంతవాతప్రశాంతయే ॥

తా. అనంతవాతమున సూర్యావర్త నివారణార్థంబై జెప్పంబడియుండు చికిత్సలను సిరా వేధనమును జేసిన అనంతవాతము శమించు.

## శుంఠ్యాది నస్యము.

శ్లో॥ శుంఠ్యానస్య మజాక్షీరే కృతంతద్ధిశిరోర్తినుత్ ॥
తా. శొంఠిని మేకపాలతో జాది నస్యము జేయించిన తలనొప్పి హరించు.

## కుంకుమ ఘృతము.

శ్లో॥ కుంకుమం ఘృతసంయుక్తం వస్యే దర్ధశిరోవ్యథామ్ ।
నాశయే త్తత్క్షణాదేవ హితమేత చ్ఛిరోరుజి ॥

తా. కుంకుమపువ్వును నేతితోనూరి నస్యము జేయించిన తత్క్షణమునఅర్ధతల నొప్పిని హరింపంజేయు. ఇది తలనొప్పియందు కడుహితకరంబు.

## గాంధార్యాది నస్యము.

శ్లో॥ గాంధారీచ జటామాంసీ ఘృతేన సహపాచయేత్ ।
తదాజ్యంనస్యమాత్రేణ నిహంత్యర్ధశిరోరుజమ్॥

తా. గంజాని జటామాంసి అనువానికల్కములో నెయ్యి గలిపి కాచి నస్యము జేయించిన తత్క్షణమున అర్ధతలనొప్పి హరించు.

తువర్యాది నస్యము.

శ్లో॥ అర్ధావభేదేతువరీదలోద్భవం రసంసుదూర్వారసమిశ్రితంచ।
నస్యేనయుక్త్వా పురుషస్తుబుద్ధిమాన్ శిరోరుజం నాశయతి
స్మ తత్క్షణమ్॥

తా. కందియాకులు గరిక అనువానిరసములను నస్యము జేయించిన తక్షణమున అర్ధతలనొప్పి హరించు.

విడంగాది నస్యము.

శ్లో॥ విడంగాది తిలాః కృష్ణాః సమాః పిష్ట్వావిలేపయేత్।
నస్యంచాథాచరేత్తస్మా దర్ధభేదం వ్యపోహతి॥

తా. వాయువిడంగములు నల్లనువ్వులు వీనిని సమభాగములుగనూరి లేపన నస్యములు జేయించిన అర్ధతలనొప్పి హరించు.

గిరికర్ణ్యాది నస్యము.

శ్లో॥ గిరికర్ణీ ఫలంమూలం సజలం నస్యమాచరేత్।
మూలంవా బంధయేత్కర్ణే నిహం త్యర్ధశిరోరుజమ్॥

తా. తెల్లగంటెనవిత్తులనుగాని లేక దానివేరునుగాని వుదకములోనూరి నస్యము చేయించినను లేక దానివేరును చెవిలో గట్టినను అర్ధతలనొప్పి హరించు.

మరీచాది లేపము.

శ్లో॥ మరీచం భృంగజై ర్ద్రావై ర్మరిచా శాలితండులైః।
అర్ధశీతవ్యథాంహంతి లేపోవాశుంఠివారిణా॥

తా. మిరియాలనుగాని లేక మిరియాలు బియ్యము అనువానిని గాని గుంటగలగరాకు రసముతో నూరి లేపనము జేసినను లేక శొంఠి వుదకముతో నూరి లేపనము జేసినను అర్ధతలనొప్పి హరించు.

శారిబాది లేపనము.

శ్లో॥ శారిబాకుష్ఠమధుక వచా కృష్ణోత్పలైః స్తథా।
లేపస్స కాంజికస్స్నేహ స్స్యాద్వ్యానర్త్ర్యార్ధభేదయోః॥

తా. సుగంధిపాలవేరు చెంగల్వకోష్ఠు అతిమధురము వస పిప్పలి నల్లకలువ వీనిని కలితో గాని లేక నేతితో గాని నూరి లేపనముజేసిన సూర్యావర్తము అర్ధతల నొప్పి హరించు.

## దుగ్ధమర్దనాది నస్యము.

శ్లో॥ సితోపలయుతం ఘృష్టం మదనం గోపయోన్వితమ్ ।
నస్యాన్నుదితే సూర్యే నిహంత్యే వార్ధభేదకమ్ ॥

తా. ఖండశర్కర మ్రంగకాయ వీనిని చూర్ణము జేసి ఆవుపాలతో కాచి సూర్యావర్తమను తలనొప్పి దగులుటకుముందు నస్యముజేయించిన సూర్యావర్తము అర్ధతలనొప్పి హరించు.

## శశాది యోగము.

శ్లో॥ శశముండరసం పీత్వా మరిచైరవచూర్ణితమ్ ।
భోజనాదౌతు సప్తాహాత్సూర్యావర్తార్ధభేదకౌ ।
హంతి సర్వాత్మకౌ శీఘ్రౌ దుఃఖదౌ భృశదారుణౌ ॥

తా. బాలింతబోళము భోజతరము అనువానిరసములో మిరియపుచూర్ణము కలిపి 8 దినములు భోజనాత్పూర్వము ద్రాగిన కడుపీడతో గూడి భయంకరముగ నుండు అర్ధావభేదకము సన్నిపాతక సూర్యావర్తము వీనిని హరింపంజేయు.

## దార్వ్యాది లేపము.

శ్లో॥ దార్వీహరిద్రామంజిష్ఠా సనింబోశీరపద్మకమ్ ।
ఏతత్ప్రలేపనం కుర్యాచ్ఛంఖకస్య ప్రశాంతయే ।

తా. మ్రానిపసుపు మంజిష్ఠ వేపవేరు పట్టివేరు పద్మకాష్ఠము వీనిని నూరి లేపనముజేసిన శంఖకము హరించు.

## బలాది లేపము.

శ్లో॥ బలానీలోత్పలం దూర్వా తిలాః కృష్ణాః పునర్నవా ।
శంఖకేనంతవాతేచ లేపస్సర్వాశ్శిరోర్తినుత్ ॥

తా. ముత్తవపులగము నల్లకలువగరిక నల్లనువ్వులు తెల్లగలిజేరు వీనిని నూరి లేపనముజేసిన శంఖము అనంతవాతము సర్వమస్తకరోగములు వీనిని హరింపంజేయు.

కరంజాదిచూర్ణ విరేచనము.

శ్లో॥ కరంజశిగ్రుబీజాని పత్రికం సర్షపత్వచః ।
సర్వేషాం శీర్షరోగాణా మేతచ్ఛీర్షవిరేచనమ్ ॥

తా. క్రానుగవిత్తులు మునగవిత్తులు లవంగపత్రి తెల్లావాలు లవంగపట్ట వీని చూర్ణముతో శిరోవిరేచనము జేయించుట సర్వశిరోరోగములయందు ప్రశస్తము.

గుడాది నస్యము.

శ్లో॥ నావనం సగుడంవిశ్వం పిప్పలీసైంధవాంబునా ।
భుజస్తంభాదిరోగేషు సర్వమూర్ధగదేషుచ ॥

తా. బెల్లము అల్లపురసము పిప్పలి సైంధవలవణము వీని నుదకముతో నూరి నస్యముజేయించిన భుజస్తంభాదికరోగములు సర్వశిరోరోగములు వీనిని హరింపం జేయు.

శర్కరాది నస్యము

శ్లో॥ సశర్కరం కుంకుమమాజ్యభృష్టం నస్యం విధేయం పవనా న్నగుత్థే । భూశంఖకర్ణాక్షిశిరోర్ధశూలే దినాభివృద్ధి ప్రభ వేచరోగే ॥

తా. నేతితో వేయించబడిన కుంకుమపువ్వును పంచదారలోగలిపి నస్యము జేయించిన వాతకరక్తములవలన కనుబొమలు కణతలు చెవి నేత్రములు అనువాని యందు గలుగు శూల అర్ధతలనొప్పి ప్రొద్దెక్కిన కొల్ల వృద్ధిజెందెడి శూలహరించు.

క్షీరాది నస్యము.

శ్లో॥ గుడనాగరకల్కస్య నస్యం మస్తకశూలనుత్ ।
నాగరకల్కవిమిశ్రం క్షీరం నస్యేనయోజితం నృణామ్ ।
నానాదోషోద్భూతాం శిరోరుజంహంతితీవ్రతరామ్ ॥

తా. బెల్లము శొంఠి అనువానికల్కమును నస్యము జేయించిన తలనొప్పి హరింపంజేయు మఱియు శొంఠికల్కములో పాలు గలిపి నస్యముజేయించినంపలు విషదోషమువలన గలిగిన దారుణమైన తలనొప్పి హరింపజేయు.

## నీలోత్పలాది తైలము.

శ్లో॥ నీలోత్పలకణాయష్టి చందనంపుండరీకమ్ ।
ప్రతినిష్కచతుష్కంస్యా త్తైలంషోడశకంపలమ్ ।
చతుష్షష్టిపలంధాత్రీ పలానాంరసమాహరేత్
పచేత్తైలావశేషంతు నస్యేనాభ్యంజనేనవా ।
యోజ్యంహంతిశిరస్తోదం ఫలితంచవినాశయేత్ ॥

తా. నల్లకలువ పిప్పలి అతిమధురము చందనము తెల్లతామరపువ్వు యివి దినుసుయొకటింటికి 4 నిష్కములు నువ్వులనూనె 16 పలములు వుసిరికకాయల రసము 64 పలములు యిట్టుల వీనినెల్ల నేకముజేసి తైలపక్వముగ కాచి నస్యము అభ్యంజనము జేయించిన మస్తకశూల పలితము వీనిని హరింపంజేయును.

## శిరోరోగమునందు పథ్యము.

శ్లో॥ స్వేదోనస్యం ధూమపానం విరేకోలేపస్సేకోలంఘనం శీర్షవ
స్తిః।రక్తోస్రుక్తిర్వహ్నికర్మోపనాహోజీర్ణంసర్పిశ్శాలయష్షష్టి
కాశ్చ। యూషోదుగ్ధంధన్వమాంసంపటోలం శిగ్రుర్ద్రాక్షా
వాస్తుకంకారవేల్లమ్ । ఆమ్రధాత్రీదాడిమంమాతులుంగం
తైలంతక్రంకాంజికంనారికేళమ్ । పథ్యాకుష్టం భృంగరాజః
కుమారీముస్తోశీర్షంచంద్రికాగంధశాలాః । కర్పూరంచఖ్యాతి
మానేషవర్గస్సేవ్యోమర్త్యైశ్శీర్షరోగేయథాస్వమ్ ॥

తా. ఆవిరి మొదలగువానిచే చెమటదీయుట నస్యము ధూమపానము విరేచనము లేపనము సేచనము లంఘనము శిరోవస్తి రక్తస్రావము రతువేయుట కట్టుగట్టుట ప్రాతనెయ్యి 60 దినములకు ఫలించినబియ్యము యూషము పాలు అడవి మృగమాంసము పొట్లకాయ మునగకాయ ద్రాక్షపండు చక్రవర్తికూర కాకరకాయ మామిడికాయ వుసిరికకాయ దాడింబకాయ మాదీఫలము నూనె మజ్జిగకలి టెంకాయ కరక్కాయ చెంగల్వకోష్టు గుంటగలగర కలబంద తుంగముస్తెలు వట్టివేరు వెన్నెల చందనము కర్పూరము యివి శిరోరోగమున పథ్యకరంబులు.

## శిరోరోగమునం దపథ్యము.

శ్లో॥ క్షువంజృంభాం మూత్రబాష్పం నిద్రా విద్వేగమంజనమ్ ।
దుగ్ధం నీరం విరుద్ధాన్నంవిరుద్ధ జలమజ్జనమ్ ।
దంతకాష్ఠం దివానిద్రాం శిరోరోగీ పరిత్యజేత్ ॥

తా. తుమ్ములు ఆవలింతలు మూత్రము కంటినీరు నిద్రమలవేగము వీని నడ్డగించుట అంజనము పాలు వుదకము విరుద్ధాన్నము దుష్టమైన యుదకములో స్నానము జేయుట దంతకాష్ఠము పగటినిద్ర యివి శిరోరోగమున అపథ్యకరంబు లగుటచే వానిని వర్జింపవలయు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
స్థౌల్య మదాత్యయ నాసారోగ ప్రతిశ్యాయ
నాసికార్శ శిరోరోగ నిదాన తత్సాధ్యా
సాధ్య తచ్చికిత్సానుపాన పథ్యా
పథ్య లక్షణయుక్తం
అష్టాదశప్రకరణమ్.



శ్రీ ర స్తు.

# బసవరాజీయము.

## ఆంధ్రతాత్పర్యము.

## —ఏకోనవింశ ప్రకరణము.—

శ్లో॥ కందర్ప నాగపంచాస్యం గజదైత్యవినాశనమ్ ।
మహాతాండవశాలీనం లింగమూర్తి మహం భజే ॥

తా. మన్మథజయశీలుండు గజాసురసంహారకుండు నటనప్రియుండు లింగస్వరూపుండు నగు పరమేశ్వరుని నేను భజించెద.

శ్లో॥ శ్రీనీలకంఠ వంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడు శ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీగ్రంథము యొక్క యేకోనవింశప్రకరణమును వచింపుచున్నాను.

### గుల్మరోగ నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే]దుష్టావాతాదయోత్యర్థంమిథ్యాహారవిహారతః ।
కుర్వంతి పంచధాగుల్మం కోష్ఠాంతర్గ్రంథిరూపిణమ్ ॥

తా. మిథ్యాహారవిహారములవలన వాతపిత్తశ్లేష్మములు మిక్కుటముగ ప్రకోపించి కోష్ఠమధ్యమున గ్రంథిరూప మైన 5 విధముల గుల్మములు గలుగంజేయు.

### గుల్మరోగ భేదములు.

శ్లో॥ తేషాం పంచవిధస్థానం పార్శ్వ హృన్నాభివస్తయః ।
సశోణితైః పృథగ్ద్వంద్వ సంఘాతైః కేచి దష్టధా ॥

తా. ఇరుపార్శ్వములు హృదయము నాభిపొత్తికడుపు అనునవి 5 ను గుల్మమునకు స్థానంబులు. మఱియు రక్తగుల్మము వాతగుల్మము పిత్తగుల్మము శ్లేష్మగుల్మము.

వాతపిత్తగుల్మము వాతశ్లేష్మగుల్మము పిత్తశ్లేష్మగుల్మము సన్నిపాతగుల్మము అన గుల్మములు 8 విధంబులని కొందరు వచించెనరు.

## గుల్మరోగ సామాన్యరూపములు.

శ్లో॥ అరుచిః కృచ్ఛ్రి * విణ్మూత్ర మగ్నిమాంద్యాంత్ర కూజనమ్।
అనాహశ్చోర్ధ్వవాతత్వం సర్వగుల్మేషు లక్షయేత్ ॥

తా. అరుచిగలుగుట మలమూత్రములు కడుకష్టముమీద వెడలుట అగ్నిమాంద్యము గలుగుట వాతమువలన ప్రేగులఱచుట కడుపుబ్బుట వాతమూర్ధ్వముఖంబగుట యీలక్షణములు సర్వగుల్మములయందు సాధారణంబుగ నుండు.

## వాతగుల్మ లక్షణము.

శ్లో॥ యస్థాన సంస్థాన రుజా వికల్పం విడ్వాత సంగం గరవక్త్రి శోకమ్ । శ్యావా రుణత్వం శిశిరజ్వరంచ హృత్కుక్షి పార్శ్వాంస శిరోరుజంచ । కరోతిజీర్ణేత్యధికంప్రకోపం భుక్తే మృదుత్వం సముపైతియశ్చ । వాతా త్సగుల్మోనచ తత్ర రూక్షం కషాయతిక్తం కటుసేవనంచ ॥

తా. ఒకానొకపుడు నాభివస్తిపార్శ్వములు అనవానియందు వ్యాపించుట వొకానొకపుడు సూక్ష్మముగ లావుగ గుండ్రముగ లేక పొడవుగనుండుట వొకానొకపుడు మృదువుగ మఱియొకపుడు కఠినముగ పలువిధవేదనలు గలదిగనుండుట మలవాతముల నడ్డగించుట కంఠము నోరుయెండుట శరీరము నీలవర్ణయుక్తముగాని లేక యెఱ్ఱగానియుండుట శీతజ్వరముగలుగుట హృదయము కడుపు పార్శ్వములు భుజశిరస్సులు అనువానియందు శూల గలుగుట అన్నము జీర్ణంబైన పిదప మిక్కుటముగ ప్రకోపించుట భోజనానంతరము మృదువగుట యీ లక్షణములుగలది-వాతగుల్మమని తెలియవలయు. దీనియందు రూక్షము వగరుచేదు కారముగల పదార్థముల సేవింపంజేసినను సుఖము గలుగకుండు.

## పైత్యగుల్మ లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] జ్వరస్తృష్ణాంగ తాపశ్చాప్యన్నే జీర్ణేతి శూల తా। స్పర్శాసహోభ్రమస్వేదః పైత్యగుల్మస్య లక్షణమ్ ॥

---

* విణ్మూత్రం వాతే నాంత్రవికూజనమ్-వా. ప్రకోపమువలన ప్రేగులఱచుట.

తా. జ్వరము దప్పి గలుగుట అవయవములు మండుట అన్నము జీర్ణంబగునపుడు కడుపు మిక్కుటముగ శూలించుట తాకిన నోర్చుకుండుట భ్రమ చెమట గలుగుట యీ లక్షణములుగలది పైత్యగుల్మమని తెలియవలయు.

## శ్లేష్మగుల్మ లక్షణము.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] శీతజ్వరశ్చహృల్లాసః కాసో హృద్వేగగౌరవమ్।ఉన్నతం కఠినంతూక్తం కఫగుల్మస్యలక్షణమ్ ॥

తా. శీతజ్వరము వోకరింతలు దగ్గుగలుగుట బొమ్మదరుట శరీరము జడముగనుండుట గుల్మము పొడవుగ కఠినముగ నుండుట యీ లక్షణములుగలది శ్లేష్మగుల్మమని తెలియవలయు.

## ద్వంద్వసన్నిపాతగుల్మ లక్షణము.

శ్లో॥ [అశ్వినీకల్పే] మిశ్రితే ద్వంద్వజంగుల్మంసర్వలింగంత్రిదోషజమ్ । వాతపిత్తాధికేగుల్మే దాతవ్యశ్శిఖిబాడబః ॥

తా. వాతపిత్త వాతశ్లేష్మ పిత్తశ్లేష్మ లక్షణంబులంగలది ద్వంద్వగుల్మమనియు వాత పిత్తశ్లేష్మ లక్షణంబులంగలది త్రిదోషగుల్మమనియు తెలియవలయు. వీనియందు శిఖిబాడబరసము నొసంగవలయు. (పూర్వోక్త పంచగుల్మములలో ద్వంద్వత్రిదోషగుల్మము అసాధ్యంబులు. ఏకదోషజనిత గుల్మములు సాధ్యంబులు.)

## రక్తగుల్మ లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] ఆమగర్భస్స్రవేచ్చాథ యానారీ ముంచతి క్వచిత్। వాయుఃప్రగృహ్యతద్రక్తం రక్తగుల్మం కరోతిచ । పుంసాంచ రక్తఘాతేన రక్తపిత్తాధికేక్వచిత్ । పిత్తగుల్మం యథాచిహ్నం తద్వై వస్యాద్రుజాధికమ్ । సశూలం గర్భవత్పిండం గర్భవల్లక్షణం భవేత్ । చికిత్సేద్దశమేమాసేపుంసాంచేత్తత్క్షణేభవేత్। గతప్రసవకాలాయై నార్యా గుల్మశ్చసంభవేత్ । స్నిగ్ధస్విన్నశరీరాయై దద్యాత్స్నేహవిరేచనమ్॥

తా. స్త్రీ యపక్వగర్భము స్రవించినపుడుగాని లేక వోకానొకపుడు గర్భస్రావము జేయించికొనినపుడుగాని అపథ్యముసేయుటవలన వాతము ప్రకోపించిరక్త

మును జేర్చి రక్తగుల్మమును గలుగంజేయు. మఱియు పురుషులకురక్తఘాతమువలనగాని లేక వొకానొకపుడు రక్తపిత్తాధిక్యమువలనగాని రక్తగుల్మము జనించి పిత్తగుల్మ లక్షణ యుక్తంబై యుండు. ఐనను దానియందు వేదనమాత్రం బధికంబై శూల గర్భపిండాకారము గర్భలక్షణములు గలిగియుండు. రక్తగుల్మము స్త్రీకి జనించిన 10 మాసములు గడచినపిదప జికిత్సంజేయవలయు. పురుషునికైన తత్క్షణమున జికిత్సం జేయవలయు. మఱియు బ్రసవించిన స్త్రీల హితకరభోజనములు సేయుటచే తలుచుగ రక్తగుల్మము జనించు. తన్నివారణార్థంబై శరీరమునకు చమురుబట్టించి చెమటం దీయుటయేగాక స్నేహముచే విరేచనమును జేయింపవలయు.

శ్లో॥ [మతాంతరే] నవప్రసూతా హితభోజనాయా యాచామ గర్భం విసృజేదృతౌవా । వాయుర్హి తస్యాః పరిగృహ్యరక్తం కరోతిగుల్మం సరుజంసదాహమ్ । పైత్యస్య లింగేన సమాన లింగం విశేషణంచా ప్యపరంనిబోధ । యస్స్పందతేపిండిత ఏవనాంగై శ్చిరాత్సశూల స్సమగర్భలింగః। సరాధిరః స్త్రీభవ ఏవగుల్మో మాసేవ్యతీతే దశమేచికిత్స్యః॥

తా. నవీనముగ బ్రసవించిన స్త్రీ యపథ్యకర భోజనముల సేయుటవలన గాని అపక్వగర్భపాతమువలనగాని ఋతుకాలమున నపథ్యకర భోజనముల సేవించు టవలనగాని వాతము బ్రకోపించి ఋతుకాలరక్తమును గ్రహించి దాహపీడల గలు గంజేయుచు పూర్వోక్త పిత్తగుల్మలక్షణయుక్తంబై రక్తగుల్మమును గలుగంజేయు ఐనను దీనియందు మఱియొక విశేషము గలదు. అదెద్దియనిన యీ రక్తగుల్మము అవ యవయుక్తంబై చలింపక శూలతోగూడి గర్భలక్షణయుక్తంబై (అనగా ఋతువు డుగుట నోట్లో నీళ్ళూరుట స్తన్యముయొక్క యగ్రభాగము నల్లగనగుట యీ మొదలగు రోగస్వభావలక్షణయుక్తంబై) దీర్ఘకాలమువరకు గుండ్రముగ నేచలింపు చుండు యీ రక్తగుల్మము స్త్రీలకే జనించు. దీనియందు 10 వ మాసము గడచిన పిదప జికిత్సం జేయవలయు. (మఱియు దీనినేకొందరు గర్భమనియు మఱికొందరు రక్తగుల్మమనియు నచింతెదరు. ఈ సంశయము 19 మాసములు గడచుటకుముందు నివర్తిగాకుండుటచే నదివరకు చికిత్స జేయుంజనదు. మఱియు 9 లేక 10 వమాసము సాధారణముగ బ్రసూతికాలంబు. ఐననిది రక్తగుల్మమునందు భేదంబగు. కావున శ్లో॥ "యస్స్పందతే పిండిత ఏవనాంగైః" ఇత్యాది విశేషలక్షణములు గనుపించు

టవలన సంశయము నివర్తియగు. మఱియు గర్భమెల్లపుడు ప్రత్యేక అవయవముల వలన శూలను గలుగంజేయక చలింపుచుండు రక్తగుల్మము తద్వ్యతిరిక్తంబుగనుండు జ్వరము జీర్ణంబైన పిదప క్షీరపాన విరేచనములు హితకరంబులగు చందంబును 10 మాసములు గడచినపిదప సుఖసాధ్యంబగుటచే తదనంతరను చికిత్సింపవలయు నని జెప్పంబడియె. మఱియు గ్రంథాంతరమునందు శ్లో॥ "రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణమ్॥" అనగా రక్తగుల్మమునకు 10 మాసములు గడచిన పిద పనే పురాణత్వము సంభవించిన సుఖసాధ్యంబగునని జెప్పంబడియున్నది).

శ్లో॥ [గ్రంథాంతరే] ఋతుకాలేపి వాగర్భే స్మృతేరా దాహ
శూలవత్ ॥ రక్తగుల్మం ప్రజాయేత గర్భలింగాభి సూచకః ।
నార్యా లోహిత గుల్మంస్యా త్సూతికాలే గతేభిషక్ । చికి
త్సేత యథాశాస్త్రం శమయే న్నాత్రసంశయః ॥

తా. స్త్రీలకు ఋతుకాలమునందుగాని గర్భస్రావము గలిగినపుడుగాని దాహశూలయుక్తముగ రక్తగుల్మము జనించు. దానియందు గర్భలక్షణములే గలిగి యుండు. స్త్రీకి జనించిన రక్తగుల్మమునందు ప్రసవకాలముగడచినపిదపశాస్త్రోక్త ముగ చికిత్సంజేసిన నిస్సంశయముగ శమించు.

## అసాధ్య రక్తగుల్మ లక్షణము.

శ్లో॥ కూర్మోన్నతం సిరారుద్ధం గుల్మం బహుగదాలయమ్ ।
వివర్జయే ద్భిషగ్దూరా త్పాణ్యంఘ్రి నాభిశోభితా ॥

తా. రక్తగుల్మము తాబేలువలె నున్నతమైన నరములతో వ్యాప్తంబై జ్వరా ద్యుపద్రవములతోగూడి చేతులు కాళ్ళు బొడ్డు వాచియుండిన నాస్త్రీని వైద్యుండు చికిత్సయందు వర్జింపవలయు.

## రక్తగుల్మ చికిత్స.

శ్లో॥ అతిప్రవృద్ధ మస్రంతు భిన్నే గుల్మే నివారయేత్ ।
ప్రయత్నతో భిషక్తూర్ణ మసృగ్దర చికిత్సయా ॥

తా. రక్తగుల్మము పగిలిన రక్తం బధికముగ స్రవించు. దానియందు వైద్యు డు శీఘ్రముగ ప్రదర చికిత్సం జేయవలయు.

## అసాధ్యగుల్మ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] సంచిత। క్రమశో గుల్మో మహావాస్తు పరిగ్రహః। కృతమూల స్సిరానద్ధో యదాకూర్మ ఇవోన్నతః। దౌర్బల్యారుచి హృల్లాస కాసచ్ఛర్ద్య రతిజ్వరైః। తృష్ణా తంద్రా ప్రతిశ్యాయై రుజ్యతేన ససిద్ధ్యతి॥

తా. గుల్మము క్రమక్రమముగ వృద్ధిం జెంది యుదరమునందంతట వ్యాపించి ధాతుగతమూలముగలదై సిరలవలన వ్యాప్తంబై తాఁబేటివీఁపువలె పొడవై దౌర్బల్యము అన్నద్వేషము హృల్లాసము దగ్గు వాంతి అసంతోషము జ్వరము దప్పి తంద్ర పడిసెము మొదలగు లక్షణములు గలదై యుండిన నసాధ్యంబని తెలియవలయు,

శ్లో॥ [ఆయుర్వేదే] గృహీత్వాసజ్వరంశ్వాస ఛర్ద్యతీసారపీడితమ్।
హృన్నాభీ * హస్తపాదేషు సోధః క్షపతిగుల్మినమ్।
శ్వాసశ్శూలంపిపాసాన్న విద్వేషోగ్రంథిమూఢతా।
జాయతే దుర్బలత్వంచగుల్మినాం మరణాయవై॥

తా. వమనవిరేచనములవలన పీడితుడగు గుల్మరోగికి హృదయము నాభిహస్తము పాదములు అనువానియందు వాపును జ్వరమును గలిగిన మృతిజెందునని తెలియవలయు. మఱియు వుబ్బసము శూలదప్పి అన్నద్వేషముగలుగుట † గుల్మముయొక్క వుంట యకస్మాత్తుగ గనుపింపకుండుట శక్తినశించుట యీ లక్షణములుగల గుల్మరోగికి మరణం బాసన్నమైనదని తెలియవలయు.

## రక్తగుల్మ చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] అఫేనంహింగుసంయుక్తంరక్తగుల్మవినాశనమ్॥

తా. నల్లమందు యింగువ వీనిని సమభాగములుగ నూరి మాషయెత్తును ఆవు వెన్నతో 3 మండలములు సేవించిన రక్తగుల్మము హరించు.

* వస్తి. † అంతర్విద్రధి గుల్మము అనువానియొక్క స్థానము ఆకృతిసమానంబుగనుండుటవలన నెవ్విధభేదంబును గనుపించకుండు. ఐనను గుల్మముకుస్థిప్రమాణముగలదిగ విద్రధిగుల్మమునకన్న పెద్దదిగ నుండునని సుశ్రుతమునందు జెప్పఁబడియున్నయది. గుల్మము నిరాశ్రయంబైయుండుటవలనపాకవిహీనంబగు విద్రధి మాంసరక్తముల నాశ్రయించి యుండుటవలన పాకమును జెందు,

## రక్తగుల్మమునకు పారదాది వటికములు.

శ్లో॥ [పూజ్యపాదీయే] పారదంశిఖితుత్థంచ నేపాళంగంధకంసమమ్। ఆరగ్వధఫలంకృష్ణాం వజ్రక్షీరేణ పేషయేత్। * మాషమాత్రాంవటీంఖాదే త్స్త్రీణాంగుల్మోదరప్రణుత్ । † బింబీఫలరసంచానుపథ్యందధ్యోదనంహితమ్ । రక్తోదరంహరేత్తైస్తవకఠినంలేపనేనతు । రుధిరేతుప్రవృత్తేపిరక్తపిత్తహరీక్రియా। కార్యావాతరుజార్తానాం సర్వవాతహరీక్రియా ॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిజేసిన మైలుతుత్తము శుద్ధిజేసిన నేపాళములు శుద్ధిజేసిన గంధకము రేలగుజ్జు పిప్పళ్ళు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి బొంత జెముడుపాలతో ] దినము మర్దించి మాషమెత్తును (వుసిరిక పండ్లరసముతో గాని) లేక దొండపండు రసముతోగాని లేక (చింతాకురసముతోగాని) 3 మండలములు సేవించిన రక్తగుల్మము హరించు. పథ్యము పెరుగువంటకమును భుజింపవలయు. ఈ వటికల సేవనవలననే రక్తగుల్మము హరించు. అటుగాక తాయిదలెకఠినంబుగనుండిన లేపనమును చేయవలయు అదిపగిలి రక్తమే స్రవింపుచుండిన రక్తపిత్త ప్రకరణమున జెప్పంబడిన రక్తపిత్త చికిత్సలంజేయవలయు. వాతగుల్మమునందు వాత ప్రకరణమున జెప్పంబడిన సర్వవాతహర క్రియలంజేయవలయు.

## లశునాది కషాయము.

శ్లో॥ లశునంకింశుకంబిల్వం శ్రాపయిత్వాసహింగుకమ్ ।
ప్రాతః కాలేనిషేవేత రక్తగుల్మహరంపరమ్ ॥

తా. వెల్లుల్లి పాయలు మోదుగచెక్క మారేడువరుసుఅనువాని కషాయములో యింగువకలిపి ప్రాతఃకాలమున సేవించిన రక్తగుల్మము హరించు.

## కణాది కషాయము.

శ్లో॥ [రసరత్నాకరే] కణాశతాహ్వాద్వికరంజ దారుభార్జీకులుత్థంసతిలైస్సుపక్వమ్ । తథారసోనాయుతసిద్ధమంభస్స హింగుకల్కంహతరక్తగుల్మమ్ ॥

---

* ధాత్రీఫల రసైఃఖాదేత్ స్త్రీణాంరక్తోదరంహరేత్॥

† చించాదళ రసంచాను పథ్యం దధ్యోదనంహితమ్॥

తా. పిప్పళ్ళు సదాప క్రానుగుచెక్క నెమలిచెక్క సరళ దేవదారు గంటు భారంగి పులవలు నువ్వులు వెల్లుల్లిపాయలు వీనిని సమభాగములుగ కషాయముకాచి యింగువ కల్కముగ లిపి 4 మాసములు త్రాగిన రక్తగుల్మము హరించు.

## తిలాది కషాయము.

శ్లో॥ [మాధవనిదానే] తిలక్వాథోగుడ ఘృతవ్యోషభార్గి రజోన్వితః । పీతోర క్తభవేగుల్మే నష్టేపుష్పే చయోషితః ॥

తా. నువ్వుల కషాయములో బెల్లము నెయ్యి గలిపి త్రికటుకములు గంటు భారంగి పసపు అనువాని చూర్ణమును 4 మాడలయెత్తును గలిపి 4 మాసములు సేవించిన రక్తగుల్మమును నష్టరజస్సును హరింపంజేయు.

## రక్తగుల్మమునకు కరంజ లవణము.

శ్లో॥ [ఆయుర్వేదే] కరంజస్యత్వచంక్షుణ్ణాం ద్వితులాపరిసమ్మితామ్ । ద్విద్రోణేకాంజికేపక్త్వా తస్మిన్నష్టావశేషితే । లవణస్యచతుఃప్రస్థద్విప్రస్థలశునస్యచ । ప్రత్యేకమాఢకందద్యాదజాక్షీరస్యమస్తునః । దద్యాత్ప్రృథగ్ద్వికుడవం తైలస్యచ ఘృతస్యచ । నమ్యక్పా కేతుసక లేచూర్ణాన్యేతాని దాపయేత్ । సచిత్రకంత్రికటుకమజామోదాపునర్నవా । హింగుసౌవర్చలంచవ్యం యవక్షారంబిడంతథా । ముష్కకారుష్కకక్షారంతింత్రిణీబ్రహ్మవృక్షయోః । బ్రాహ్మీ సోమారగ్వథానాంస్నుహీక్షారం తథైవచ । జీరకద్వయసంయుక్తం చూర్ణమేషాంపలద్వయమ్ । కరంజలవణంనామ స్నిగ్ధభాండస్థితంచతత్ । గుల్మాష్ఠీలప్లీహశూలం రక్తగుల్మంవినాశయేత్ ॥

తా. 20 పలములు క్రానుగచెక్కను దంచి 2 ద్రోణముల ప్రమాణము కలిబోసి అష్టావశేషముగ కషాయముకాచి వడియగట్టి అందువుప్పు 4 ప్రస్థములు వెల్లుల్లి 2 ప్రస్థములు మేకపాలు 1 ఆఢకము పెరుగుమీదిమీగడ 1 ఆఢకము నూనె 1 కుడవము నెయ్యి 1 కుడవముగలిపి బాగుగ పాకముజేసి చిత్రమూలము త్రికటుకములు వోమము గలిజేరువేరు యింగువ సౌవర్చలవణము చెవ్యము యవక్షారముబిడాలవణము మొక్కము నల్లజీడి చింతమోదుగచెక్క నందూక బ్రహ్మి పుల్లతీగె రేకబొల్లి పూస

## గుల్మరోగనిదాన లక్షణ చికిత్సాదయః.

రేల జెముడు అనువాని క్షారములను జీలకఱ్ఱ నల్ల జీలకఱ్ఱ అనువానిని దినుసుకు 2 పలములచొప్పున గలిపి నేతితో మాగినపండ యంచునిచి సేవించిన గుల్మము అష్ఠీలము ప్లీహము శూల రక్తగుల్మము వీనినిహరింపంజేయు. (మఱియు 5 చిన్నములయెత్తు యింగువను ఆవువెన్నలో గలిపి సాయంప్రాతఃకాలముల సేవించిన రక్తగుల్మమును హరింపంజేయు.)

## వాతగుల్మశూలలకు శంఖద్రావకము.

శ్లో॥ [ఆయుర్వేదే] పత్రైకంపంచలవణం బాణంతుత్థంచఖర్పరీమ్।
పటకీకుడవార్ధంచ తదర్ధంనవసాగరమ్ । కాసీసంటంకణంసర్జ
యవక్షారంపలార్ధకమ్ । సర్వమేకత్ర సంయోజ్యం డమరు
యంత్రస్యమధ్యగే । చుల్ల్యాం ప్రరోహయేత్తత్తు జ్వాలయేత్ఖ
దిరేంధనైః । ద్రావితంతత్సమాదాయ తేజోరూపంజలప్రభమ్
దానయేదఖిలాన్ ధాతూన్ వరాటాంశ్చసంశయః । శంఖ
ద్రావఇతిఖ్యాతోగుల్మోదరహరఃపరః । భక్షితః కురుతేచైవ
కాయపుష్టింనిరోగతామ్ । వాతానాంసర్వశూలంచ పంచ
గుల్మం నిహంతిచ ॥

తా. పంచలవణములుదినుసు కొక్కొకపలముచొప్పున 5 పలములు శుద్ధిజేసిన మైలుతుత్తము 5 పలములు శుద్ధిజేసిన కఫరి 5 పలములువటిక ½ కుడవము నవాసాగరము ¼ కుడవము అన్నభేది పేల్చిన వెలిగారము సర్జక్షారము యవక్షారము యివి దినుసుకు ½ పలము యిట్టుల వీనినెల్ల చూర్ణముగావించియేకముజేసి 1 కుండలోవైచి దానికంఠమునకు దగిన సారాయిబట్టిని దగిలించి పొగపోకుండునట్లుల వానిసందుకు చీలమన్ను లేపనముజేసియెండించి సారాయిబట్టిపైభాగమున మఱియొకకుండను బోర్లించి సందులేకుండునట్లుల చీలమన్ను లేపనముజేసి యెండించుటచేడమరుకయంత్రమని పఱంగెడుదానిని పొయిమీదనునిచి చండ్రకట్టెలతో ½ జామువరకుపాకము సేయుచు పైకుండపై తడివస్త్రమును వేసి యుదకమును పోయుచుండిన పైసారాయిబట్టి యొక్క నొకతుండముగుండ బోయుచుండు యుదకమును మఱియొక తుండముగుండా తేజోరూపమై యుదకస్వరూపముగనుండు శంఖద్రావకమును స్రవించు దానిని గాజుకుప్పెలోగానిలేక గాజుగిన్నెలోగాని గ్రహించి ప్రతిదినము యొకగురి యెత్తును సోమపుపొట్టులోగలిపి దంతములకు తగలక అంగటిలో వేసుకొని మ్రింగిన-

రక్తగుల్మమును ఉదరములు వాతరోగములు సర్వశూలలు పంచగుల్మములు మొదలగు సర్వరోగముల హరింపజేయుటయేగాక శరీరపుష్టిని నిరోగత్వమును గలుగజేయు. మఱియు నీద్రావకములో సువర్ణాది సర్వధాతువుల గవ్వలవైచిన నిస్సంశయముగ ద్రవించు. (ఈ శంఖద్రావకమును 3 మండలములు సేవించిన యే యౌషధమువలన నివర్తింపక బాధింపుచుండు అసాధ్యశూలలు గుల్మములు హరించు. మఱియు దీనినే తూనిప్రతితూని వాతములయందును సేవింపదగును. దీని సేవనవలన కడుపులోమంట గలిగిన పెరుగన్నమును 3 కబళములు భుజింపవలయు.)

## శిఖిబాడబ రసము.

శ్లో॥ [నిత్యనాధీయే] మారితంసూతతామ్రాభ్రం గంధకంమాక్షికంసమమ్ । మర్దయేచ్చిత్రకద్రావై ర్యవక్షారయుతందినమ్ । త్రిగుంజంభక్షయేన్నిత్యం నాగవల్లీదళేనవా । వాతగుల్మహరఃఖ్యాతోరసోయంశిఖిబాడబః । హింగుసౌవర్చలంత్ర్యూషంసింధుదాడిమదీప్యకైః । పుష్కరాజాజిధాన్యాకై రమ్లవేతసచిత్రకైః । అశ్వగంధావచాచైవ నిర్గుండీసకచోరకైః । ప్రతిచూర్ణైః కర్షమాత్రైః ప్రస్థంప్రస్థంఘృతందధి । పాచ్యంఘృతావశేషంచపలార్ధమనుశీలయేత్ । వాతగుల్మంతథాశూల మసాహ్యంచవినాశయేత్ ॥

తా॥ రసభస్మము తామ్రభస్మము అభ్రకభస్మము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము యవక్షారము వీనినిసమభాగములుగ ఖల్వములోనునిచి చిత్రమూలరసముతో 1 దినము మర్దించి 3 గురిగింజల మాత్రలుజేసి యందొకదానిని తమలపాకుతోడ ప్రతిదినము సేవింపుచుండిన వాతగుల్మమును లేక యింగువ సౌవర్చలవణము త్రికటుకములు సైంధవలవణము దాడింబబెరడు వోమము పుష్కరమూలము జీలకఱ్ఱ కొత్తిమెర్లు పుల్లప్రబ్బలి చిత్రమూలము పెన్నేరుగడ్డ వసవావిలి కచోరములు అనువానిని దినుసుకు కర్షప్రమాణముచొప్పున చూర్ణముజేసి నెయ్యి 1 ప్రస్థము పెరుగు 1 ప్రస్థముబోసి ఘృతము శేషించునటులకాచి $\frac{1}{2}$ పల ప్రమాణముగల యీ ఘృతానుపానముతోడ సేవింపుచుండిన వాతగుల్మమును శూలను కడుపుబ్బగమును హరింపజేయు.

## గుల్మశూలలకు శంఖద్రావకము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] సైంధవంచయవక్షారం పటకీసురసారకమ్ । కాసీసం నవసారంచ సమభాగంతు కారయేత్ । మర్దయే ద్ఘటికామాత్రం పాచ్యం పాతనయంత్రకే । శంఖద్రావ రసోనామ సర్వవ్యాధి వినాశకృత్ । పంచకాసాన్ తథా శ్వాసాన్ క్షయరోగం సుదారుణమ్ । మన్యాస్తంభం కంఠ రోగం గుల్మశూల జ్వరాపహమ్ । అగ్నించ కురుతేదీప్తం. తేజోవృద్ధి బలప్రదమ్ ॥

తా. సైంధవలవణము యవక్షారము పటికసూరాకారము శుద్ధిజేసినఅన్నభేది నవాసారము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి 1 గడియ మర్దించి పాతనా యంత్రమునం దునిచి వండిన శంఖద్రావకము సిద్ధంబగు దీనిని వోమపుపొట్టుతో 3 తులను చొప్పున ప్రతిపూట సేవింపుచుండిన సర్వశూలలు (వాతగుల్మము రక్త గుల్మశూలలు .ఋతుశూల సప్తశూలలు) పంచకాసములు శ్వాసములు భయంకర మైన క్షయరోగము మన్యాస్తంభము కంఠరోగము గుల్మశూల జ్వరము వీనిని హరిం పంజేయును. మఱియు దీని సేవనవలన అగ్నిదీపనము తేజోవృద్ధి బలముగలుగు.

## పిత్తగుల్మమునకు డండామర రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతంసమంగంధం సూతాంశంమృత తామ్రకమ్ । పంచాంగం శాకవృక్షస్య ద్రవైర్మర్ద్యం దిన త్రయమ్ । సర్పాక్ష్యాశ్చ ద్రవైశ్చాపి ్న రుధ్వా లఘుపుటే పచేత్ । పంచధా భూధరేవాథ చూర్ణం నేపాళతుల్యకమ్ । * ద్విగుంజం భక్షయేచ్చాజ్యైః పిత్తగుల్మ ప్రశాంతయే । ద్రాక్షా హరీతకీక్వాథ మనుపానం ప్రకల్పయేత్ । రసో డండామరోనామ పిత్తగుల్మం నియచ్ఛతి ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము తామ్రభస్మము వీనిని సమభాగ ములుగ ఖల్వములోనునిచిగుమ్ముడు టేకుచెక్క దానికాయలు పువ్వులు ఆకులు వేరు అనువానిరసములతో 3 దినములుమర్దించి పిదపసర్పాక్షీరసములో 1 దినముమర్దించి

* త్రిగుంజం.

భూధరయంత్రమునందునిచి లఘుపుటంబిడవలయు ఇట్లుల 5 మార్లుమర్దించి5మార్లు లఘుపుటంబిడి చూర్ణముజేసి దానికి సమముగ శుద్ధిజేసిన నేపాళపు విత్తులగలిపి మర్దించి 2 లేక 3 గురిగింజలయెత్తును నేతితోగాని లేకద్రాక్షపండు కరక్కాయ అనుపాని కషాయముతోగాని 6 మాసములవరకు సేవింపుచుండిన పిత్తగుల్మములు నిశ్చయముగ హరించు.

## శ్లేష్మగుల్మమునకు విద్యాధర రసము.

శ్లో॥ గంధకం * తాళకంతాప్యం † మృతతామ్రం మనశ్శిలామ్ ।
శుద్ధసూతంచ తుల్యాంశం మర్దయే ద్భావయే ద్దినమ్ । పిప్ప
ల్యాస్తు కషాయేణ వజ్రీక్షీరేణభావయేత్ । నిష్కార్ధం
భక్షయేత్క్షౌద్రై ర్గుల్మంప్లీహం వినాశయేత్ । రసో విద్యా
ధరోనామ గోమూత్రంచ పిబేదను ॥

తా. శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన తాళకము శుద్ధిజేసిన సువర్ణమాక్షికము లేక తగరభస్మము తామ్రభస్మము లేక అభ్రకభస్మము శుద్ధిజేసిన మణిశిల శుద్ధిజేసినరసము వీనినిసమభాగములుగ ఖల్వములోనునిచి పిప్పలికషాయముతో 1 దినము మర్దించి భావనజేసి పిదప బొంతజెముడుపాలతో 7 దినములు భావనజేసి ½ నిష్కప్రమాణమంత వటికములుచేసి యందొకదానిని తేనెతో సేవించిన వెంబడిగ గోమూత్రమును త్రాగిన గుల్మము ప్లీహరోగము హరించు.

## కాంచనమోహన రసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] మృతంసూతం మృతంతామ్రం కాంచన్యా
మర్దయేద్ద్రవైః । అర్కవజ్రీ రసేనైవ దినాంతే వటకీకృతం।
గుంజైకం గుడసంయుక్తం తథాగంధ సువర్చలమ్ । నిష్కై
కం గుల్మశాంత్యర్థం రసః కాంచనమోహనః । విశాలా
కటుకాముస్తం కుష్ఠమింద్ర యవంసమమ్ । చూర్ణయే ద్దేవ
దారుంచ కర్షైకం మధునాలిహేత్ । గుల్మోదర జ్వరంతాప
మనుపానం నిహంత్యలమ్ ॥

* తాళత్రపుసం. † మృతాభ్రంచ.

తా. రసభస్మము తామ్రభస్మము వీనిని వుమ్మెత్తాకు జిల్లేడు బొంతజెముడు అనువాని రసములతో 1 దినము మర్దించి నిష్క ప్రమాణము బెల్లము శుద్ధి జేసిన గంధకము సౌవర్చలవణముగలిపి మరల మర్దించి గురిగింజంతమాత్రలుజేసి యందొక దానిని పాపరత్రికటుకములు తుంగము స్తైలు చెంగల్వకోష్టు కొడిసెపాల దేవదారు అనువాని చూర్ణములో కర్ష ప్రమాణమును తేనెలోగలిపి యీ యనుపానముతోడ సేవించిన గుల్మములు ప్లీహములు జ్వరము తాపము వీనిని హరింపంజేయు.

## * తూని ప్రతితూనుల లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] పక్వాశయాత్తుక్రమశ స్సమీరో వృద్ధో గుదోపస్థమతీవతుద్యాత్ । తూనీభవేత్సాపరివృత్య గచ్ఛన్స ఏవ యాతిప్రతితూని కేతి ॥

తా. విరుద్ధాహార విహారములవలన వాతము ప్రకోపించి క్రమముగ పక్వమూత్రాశయములంజెంది గుదోపస్థలయందు సూదులతో బొడుచుచటుల కడువేదనను గలుగంజేసిన తుని యనంబడు, ఈ తునియే గుదోప స్థలములయందు ప్రకోపించి * ప్రతిలోమముగ సంచరింపుచు పక్వాశయమును జెందిన ప్రతితూని యనంబడు.

## అష్ఠీలా ప్రత్యష్ఠీలా నిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] అష్ఠీలానాహలింగాత్తుగ్రంథిరూర్ధ్వసమన్వితః ॥ తిర్యక్తథాకృతిస్సైన ప్రత్యష్ఠీలాశిలోపమా ॥

తా. సంచరింపుచుగాని లేక సంచరింపక కఠినంబుగగాని యుండు గ్రంథి నాభికి క్రిందిభాగమున పొడవుగజనించు ఆనాహలక్షణముక్తంబై యుండిన అష్ఠిల యనంబడు. ఇదియే జఠరమున నడ్డముగ జనించి ఱాయివలె కఠినంబై వేదనతో గూడి వాత మలమూత్రముల నడ్డగింపుచుండిన ప్రత్యష్ఠిల యనంబడు.

శ్లో॥ ఇమావాతస్యగుల్మోక్త విధినాసముపాచరేత్ ॥

తా. పూర్వోక్తతుని ప్రతితుని అష్ఠిల ప్రత్యష్ఠిల వాతకులయందు గుల్మ చికిత్సలం జేయుటయేగాక శంఖద్రావకముయొక్క సేవనను సగా జేయింపవలయు

* ప్రతిలోమమున — క్రిందినుంచి పైకేగుట.

## వాతిక పరిణామశూల లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] ఆధ్మానాటోపరిణ్మూత్ర విబంధారతి వేపనైః ।
స్నిగ్ధోష్ణోపశమప్రాయం వాతికంతద్వదేద్బుధః ॥

తా. గడుపుబ్బరము కడుపులో గుడగుడశబ్దము మలమూత్ర ప్రతిబంధము అస్వస్థత కంపముగలిగి స్నిగ్ధోష్ణ పదార్థ సేవనవలన తఱుచుగ శాంతి జెందునది వాతిక పరిణామశూలయని తెలియవలయు.

## పైత్తిక పరిణామశూల లక్షణము.

శ్లో॥ తృష్ణాదాహారతిస్వేద కట్వమ్లలవణోత్తరం।
శూలంశీతశమప్రాయం పైత్తికంలక్షయేద్బుధః ॥

తా. దప్పి దాహము అస్వాస్థ్యము చెమటగలుగుట కారము పులుసు వుప్పు గలపదార్థములయందిచ్ఛగలుగుట శీతకర పదార్థములవలన శాంతి జెందుట యీ లక్షణములుగలది పిత్తజ పరిణామశూలయని తెలియవలయు.

## శ్లేష్మపరిణామ శూలలక్షణము.

శ్లో॥ ఛర్దిహృల్లాససంమోహం స్వల్పరుగ్దీర్ఘసంతతిః ।
కటుతిక్తోపశాంతంచ తచ్ఛ్లేష్మయంకఫాత్మకం ॥

తా. ఓకర హృల్లాసము యింద్రియమోహము మిక్కుటముగ గలుగుట కొంచెము వేదనగలుగుట శూల దీర్ఘకాలమువరసంతుట కారము వగరుగలపదార్థములవలన శాంతిజెందుట యీ లక్షణములుగలది కఫజ శూలయని తెలియవలయు.

## శూల నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] యానాభిఘాతాచ్చో కాచ్చాప్యతీభాషణ మైథునాత్ । రూక్షాన్నశుష్కశాకాచ్చ కషాయతిక్తసేవ నాత్ । తేనవాయుర్భవేత్క్రుద్ధః కురుతేశూలమష్టధా ॥

తా. గుఱ్ఱము మొదలగువానినెక్కి సంచరించుట అభిఘాతమును జెందుట దుఃఖించుట మిక్కుటముగ మాటలాడుట మిక్కుటముగ స్త్రీసంభోగము సేయుట రూక్షగలయన్నమును యెండినకూరలను కారము చేదుగలవస్తువులను మిక్కుటముగ సేవించుట యీ కారణమువలన వాతము ప్రకోపించి 8 విధములైన శూలలను గలుగంజేయు.

## వాతశూల లక్షణము.

శ్లో॥ హృత్పార్శ్వ పృష్ఠత్రికవస్తౌ ముహుస్తోదో ముహుశ్శమః ।
వర్షా శీతాగమే తీవ్రం కృద్ధం భవతి మారుతాత్ ।
అభ్యంగమర్దనస్వేదై స్నిగ్ధోష్ణై ర్భోజనైశ్శమేత్ ॥

తా. రొమ్ము పార్శ్వములు వీపు ముడ్డపూస వస్తి అనువానియందు బలుమారు శూలించి పలుమారు శమించుట వర్ష శీతకాలములయందు శూల మిక్కుటముగ ప్రకోపించుట యీలక్షణములు గలది వాతజశూలయని తెలియవలయు. ఇది అభ్యంజనము శరీరమర్దనము స్నిగ్ధోష్ణభోజనము అనువానివలన శమించు.

## పైత్యశూల లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] తృణ్మూర్ఛా స్వేదరుక్శోషా నాభి వస్తిషు
వేదనా । మధ్యాహ్నే చార్ధరాత్రేచ శూలం పైత్తాధికం
భవేత్ । స్వాదు శీతలమిష్టాన్నై శ్శమ శ్శీతాగమేభవేత్ ॥

తా. దప్పి మూర్ఛ చెమట పీడ శోషగలుగుట నాభి పొత్తికడుపు అనువానియందు శూలించుట మధ్యాహ్నకాలము అర్ధరాత్రి చకారమువలన అన్నము జీర్ణమయ్యెడికాలము శరత్కాలము వీనియందు మిక్కుటముగ శూల గలుగుట యీ లక్షణములుగలది పిత్తజశూలయని తెలియవలయు. ఇది రుచికరమై శీతకరమైన పదార్థసేవనవలన యిష్టాన్న సేవనవలన మఱియు శీతకాలమునందు శమించు.

## శ్లేష్మజశూల లక్షణము.

శ్లో॥ [చరకే] శ్వాసశ్చ కాసహృల్లాసౌ శూలం సూర్యోదయే
ఘనమ్ । వసంతే శిశిరే భుక్తే దూష్యతే కఫజం విదుః ॥

తా. ఉబ్బసము దగ్గు వోకరింతలుగలుగుట సూర్యోదయకాలమున మిక్కుటముగ శూలించుట వసంత శిశిర ఋతువులయందును భోజనానంతరమును మిక్కుటముగ ప్రకోపించుట యీ లక్షణములుగలది శ్లేష్మజశూల యని తెలియవలయు.

## ద్వంద్వ త్రిదోషశూల లక్షణము.

శ్లో॥ మిశ్రితం ద్వంద్వజంజ్ఞేయం కష్టసాధ్యం క్వచిద్భవేత్ ।
త్రిభిశ్చ లక్షణై ర్యుక్త మసాధ్యం సాన్నిపాతికమ్ ॥

తా. రెండేసి దోషలక్షణములంగలది ద్వంద్వశూల యనియు 3 దోషలక్షణములం గలది సన్నిపాతశూల యనియు తెలియవలయు. (మఱియు "ఏకదోషోత్థిత స్సాధ్యః" ఇత్యాది గ్రంథాంతరవచనమువలన యేకదోషమువలన జనించిన శూల సాధ్యంబు) 2 దోషములవలన గలిగిన శూల కష్టసాధ్యంబు. సన్నిపాతమువలన జనించినశూల అసాధ్యంబు.

శూలోత్పత్తి స్థానములు.

శ్లో॥ [గ్రంథాంతరే] వాతాత్మకం వస్తిగతం వదంతి పిత్తాత్మకం చాపి వదంతినాభ్యామ్ । హృత్పార్శ్వకుక్షౌ కఫ సన్నివిష్టం సర్వేషు దేశేషుచ సన్నిపాతాత్॥

తా. పొత్తికడుపుయందు వాతజశూలయు నాభియందు పిత్తజశూలయు రొమ్ముపార్శ్వము కుక్షి అనువానియందు శ్లేష్మజశూలయు పూర్వోక్త సర్వ ప్రదేశములయందు సన్నిపాతశూలయుం జనించు.

ఆమశూల లక్షణము.

శ్లో॥ [నిత్యనాథీయే] కఫశూలే యథా చిహ్నం తథాటోపస్య వర్ధనమ్ । అనాహశ్చ ప్రసేకశ్చ హ్యామశూలస్య లక్షణమ్॥

తా. శ్లేష్మశూలలక్షణయుక్తంబై యుండుట మిక్కుటముగ కడుపులో గుడగుడశబ్దము కడుపుబ్బరము (చకారమువలన కొంచె వోకరింతలు జడత్వము నిశ్చలత్వము) గలుగుట నోటియందు జొల్లుగారుట ఈ లక్షణములుగలది ఆమశూల యని దెలియవలయు.

పరిణామశూల లక్షణము.

శ్లో॥ [పూజ్యపాదీయే] భుక్తే జీర్యతియచ్ఛూలం తదేవ పరిణామజమ్ । వాతపిత్తకఫాధిక్యం విజ్ఞేయం పూర్వలక్షణైః॥

తా. భుజించిన యన్నము జీర్ణం బగునపుడు గలిగెడుశూల పరిణామశూల యనంబడు. దీనియందు వాత పిత్త శ్లేష్మాధిక్యములను పూర్వోక్త వాతాదిశూలల యొక్కలక్షణములవలన దెలియవలయు.

మృత్యుశూల లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] వాతజం శ్రవణేరక్తం నేత్రాబ్జేచహారిద్రతా । భ్రమోమూర్ఛాప్య నిద్రత్వ మతిమాత్రంచ మృత్యుకే॥

తా. శరీరమున నొప్పి మొదలగు వాతోపద్రవములుగలుగుట. చెవిలో సెత్తురు గారుట కన్నులు పచ్చనగుట తబ్బిబ్బులాడుట మూర్ఛగలుగుట నిదురబట్టకుండుట మూత్రం బధికముగ వెడలుట యీలక్షణములుగలది మృత్యుశూలయని తెలియవలయు

## పంక్తిశూల లక్షణము.

శ్లో॥ [మతాంతరే] వేదనాతి తృషామూర్ఛా వ్యానాహో గౌరవారుచీ। కాసశ్వాసౌచహిక్కాచ*పఙ్క్తిశూలస్యలక్షణమ్ ॥

తా. శరీరమున వేదన గలుగుట కడుదప్పి మూర్ఛ కడుపుబ్బసము జడత్వము అరుచి కాసశ్వాసములు యెక్కిళ్ళుగలుగుట యీలక్షణములు గలది పంక్తి శూల యని తెలియవలయు.

## శూలోత్పత్తి స్థానములు.

శ్లో॥ [రసరత్నాకరే] వాతాశ్రయే వాతజశూలజన్మనాభౌచ పిత్త ప్రభవంసదాహమ్ । వక్షస్థలేస్యాత్కఫజన్యజన్మ శూలస్య చిహ్నం ప్రవదంతి వైద్యాః ॥

తా. వాతశూల వాతస్థానము నాశ్రయించి జనించు, పిత్తశూల బొడ్డు నాశ్రయించి జనించి తాపముతో గూడియుండు, శ్లేష్మశూల ఱొమ్ము నాశ్రయించి జనించు.

## ద్వంద్వశూలోత్పత్తి స్థానములు.

శ్లో॥ వస్తౌ హృత్పార్శ్వ పృష్ఠేషు సశూలః కఫవాతికః ।
కుక్షౌ హృన్నాభిపార్శ్వేషు సశూలః కఫపైత్తికః ।
దాహజ్వరకరో ఘోరో విజ్ఞేయో వాతపైత్తికః ॥

తా. వస్తి ఱొమ్ముపార్శ్వములు వీపు అనువానియందు శ్లేష్మవాతద్వంద్వములవలన శూల జనించు, కుక్షి హృదయము నాభిపార్శ్వము అనువానియందు శ్లేష్మపిత్త ద్వంద్వములవలన శూలజనించు, వస్తినాభి అనువానియందు దాహజ్వర యుక్తంబై భయంకరమైన శూల వాతపిత్తమువలన జనించు.

* శూల స్యోపద్రవాః స్మృతాః.

## శూలసాధ్యా సాధ్యములు.

శ్లో॥ [భేషజకల్పే] ఏకదోషోత్థి తస్సాధ్యః కృచ్ఛ్రసాధ్యో ద్విదోషజః। సర్వదోషోత్థితో ఘోర స్త్వసాధ్యో భూ ర్యుపద్రవః। సర్వేష్వేతేషు శూలేషు హ్యామజం చాతిదారుణమ్ ॥

తా. ఏకదోషమువలన జనించిన శూల సాధ్యంబు, ద్వంద్వదోషమువలన జనించిన శూల కష్టసాధ్యంబు. త్రిదోషమువలనజనించిన భయంకరమై "శ్లో. వేదనాతితృషామూర్ఛా హ్యానాహో గౌరవారుచీ। కాసశ్వాసశ్చ హిక్కా చ శూలస్యోపద్రవాస్మృతాః ॥" అనగా వేదన కడుదప్పి మూర్ఛ కడుపుబ్బరము జడత్వము అరుచి శ్వాసకాసములు యెక్కిళ్ళు అని పలువిధములైన యుపద్రవములతో గూడి యుండు శూలలు అసాధ్యంబులు. మఱియు సర్వశూలలలో ఆమశూల కడు అసాధ్యంబు.

## వాతశూలకు ఉదయభాస్కర రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] భస్మసూతం మృతం చాభ్రం శిలా గంధక తాళకమ్ । హింగు కంకుష్ఠము స్తంచ తుల్యంచూర్ణం విభావయేత్ । స్నుహ్యుస్నుత్తస్యనిర్గుండీ * మహారాష్ట్రీద్రవైః పృథక్ । ప్రతిద్రావైర్దినంభావ్యంశుష్కంతద్గోళకీకృతమ్ । వస్త్రేబధ్వా మృదాలేప్యం శుష్కంకృత్వా పుటేపచేత్ । † చతుర్యామార్ధమాత్రేషు తమాదాయ విచూర్ణయేత్ । ‡ గుంజాష్ట ఘృతశుంఠిభ్యాం లేహ్యశ్శోదయ భాస్కరః । వాతశూలప్రశాంత్యర్థంతిలక్షారం † సకుష్ఠకమ్ । మధునా లేహయేచ్చాను మూలంవా కాకతుండజమ్ । పంచకోలాభయాక్వాథం పిప్పలీ చూర్ణసంయుతమ్ । పటుః కట్వ్యారు శూలేషుమన్దాగ్నౌచవిశేషతః। సదేయస్స్విష్టలవణోగుల్మేచ మలబంధనే । తైలయుక్తశ్చసర్వేషు వాతశూలంచనస్యతి ॥

* మహారాస్నా. † చత్తుర్థా బసమాత్రేణ.
‡ ద్వేగుంజే. † సకర్షకమ్.

తా. రసభస్మము అభ్రకభస్మము శుద్ధిజేసిన శిలాజిత్తు శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన తాళకము యింగువ కుంకుష్ఠము తుంగముస్తెలు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి చూర్ణముజేసి బొంతజెముడుపాలు వుమ్మెత్త వావిలి పెద్దములక అనువాని రసములలో ప్రతిదానిచే నొక్కొక దినము భావనజేసి యెండించి ముద్ద జేసి దానిపై బట్టజుట్టి మన్నుబూసి యెండించి మూకుళ్ళలోనునిచి చీలమన్ను లేప నముజేసి పాకమైనను జేయవలయు. లేక కుప్పెలోనునిచి 4½ ఝామువరకు పుట మైనను వేయవలయు. ఇటులజేసిన పిదప దానిని దీసి చూర్ణముజేసి 8 గురిగింజల యెత్తును నెయ్యి శొంఠి అనువాని యనుపానముతోడగాని కర్షప్రమాణము నువ్వుల క్షారము చంగల్వకోష్టు వీనిని తేనెలోగలిపి యీ యనుపానముతోడగాని లేక యెఱ్ఱగురిజవేరు చూర్ణానుపానము తోడగాని లేక పిప్పళ్ళు మోడి చవ్యము చిత్ర మూలము శొంఠి కరక్కాయ అనువాని కషాయములో పిప్పలిచూర్ణము గలిపిగాని సేవించిన వాతశూల హరించు. మఱియు పై యౌషధమును సైంధవలవణానుపాన ముతోడ సేవించిన నడుము తోడ అనువానియందలి శూల అగ్నిమాంద్యము వీనిని విశేషముగ హరింపంజేయు. మఱియు దీని నువ్వులలోగలిపి సేవించిన వాతగుల్మము మలబద్ధము వీనిని హరింపంజేయు. నూనెతోడ సేవించిన సర్వాంగవాతశూలలు హరింపంజేయును. (మఱియు దీనినే తుని ప్రతితుని అష్ఠిల ప్రత్యష్ఠిల అనురోగముల యందును సేవింపందగు.)

శూలదావానల రసము.

శ్లో॥ [మాధవనిదానే] చించాక్షార శ్శుద్ధశంఖచూర్ణం లవణ పంచకమ్। క్షారఃపంచాగ్ని సంభూతః పృథగర్ధపలాన్వితః। మరీచంమాగధీశుంఠీహింగుచద్విపలంతథా। పారదంగంధకం తామ్రం విషచార్ధపలంపృథక్।సర్వంజంబీరనీరేణ మర్దయేంత ద్దివసత్రయమ్। కోలప్రమాణాం వటికాం పంచగవ్యఘృతా న్వితమ్। లేహయేచ్ఛూలశాంత్యర్థం ఘృతాన్నం భోజనం తథా। లశునక్వథితం దేయందధ్యాజ్యగవ్యమేవవా. పథ్యం నిత్యం ప్రయుంజీత సర్వశూల నిబర్హణమ్। హృచ్ఛూలం పార్శ్వశూలంచ జీర్ణశూలంచ గుల్మజమ్। ఆనాహ ప్లీహ ముదర మశ్మరీ శర్కరాహరః। క్షయంచైవ ససందేహో

సేవయే ద్వ్యాధిహారకః। శూలదావానలో నామ్నా
పూజ్యపాదేన భాషితః॥

తా. చింతక్షారము శుద్ధిజేసిన శంఖభస్మము పంచలవణములు పంచాగ్నులక్షారము యివి దినుసుకు ½ పలము త్రికటుకములు యింగువ యివిదినుసుకు 2 పలములు శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన గంధకము తామ్రభస్మము శుద్ధిజేసిన నాభి యివి దినుసుకు ½ పలము యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో 3 దినములు మర్దించి రేగుబండంత మాత్రలుజేసి * పంచగవ్యముతోగాని ఘృతముతోగాని సేవించిన సర్వశూలలు ఆమ్మశూల పార్శ్వశూల గుల్మములు కడుపుబ్బరము ప్లీహరోగము వుదరములు శర్కరాశ్మరి క్షయము వీనిని నిస్సంశయముగ హరింపం జేయు. పథ్యము ప్రతిదినము నేతివంటకమును వెల్లుల్లిపాయల కషాయమును మేక పెరుగును గాని లేక ఆవుపెరుగునుగాని సేవింపవలయు.

శూలకుఠార రసము.

శ్లో॥ [శార్ఙ్గే] టంకణం పారదంగంధం త్రిఫలా వ్యోషతాళకమ్।
విషం తామ్రంచ నేపాళం భృంగ స్వరసమర్దితమ్।
ద్విగుంజమాత్రా వటికా మరీచే నార్ద్రకేణవా।
సర్వశూలంకుఠారోయం విష్ణుచక్ర మివాసురాన్॥

తా. వెలిగారము శుద్ధిజేసినరసము శుద్ధిజేసినగంధకము త్రిఫలములు త్రికటుకములు శుద్ధిజేసిన తాళకము శుద్ధిజేసిన నాభితామ్రభస్మము శుద్ధిజేసిన నేపాళములు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గుంటగలగరాకురసముతో మర్దించి 2 గురిగింజలంత మాత్రలుజేసి యందొకదానిని మిరియపుచూర్ణములో గాని లేక అల్లపు రసములోగాని సేవించిన "విష్ణుచక్ర మసురుల నాశనము జేయుభంగి" సర్వశూలల హరింపంజేయు.

పైత్యశూలకు ముస్తాది మండూరము.

శ్లో॥ [రసరత్నాకరే] మండూరం చూర్ణితంకృత్వా ముస్తా బదర మూలకం। కణాశుంఠీయవక్షారంపంచానాంసమచూర్ణకం।
చూర్ణతుల్యంచ మండూరం గోమూత్రాష్టగుణం భవేత్।

* పంచగవ్యమన-గోమయము గోమూత్రము పాలు పెరుగు నెయ్యి.

తత్తుల్యంచగవాంక్షీరం పచేన్మృద్వగ్ని నాశనైః । పిండితం కోలమాత్రంతు భక్షయేచ్ఛూలనుద్భవేత్ । ప్రాతర్మధ్యాహ్నరాత్రౌచ భక్షయేద్వటికాద్రయం । మాంసంపిష్టం చగుర్వన్నం మాషాదీంశ్చవివర్జయేత్ ॥

తా. తుంగముస్తెలు రేగువేరు పిప్పలి శొంఠి యవక్షారము వీనిని సమభాగములుగ చూర్ణము జేసి దానిని సమముగ మండూరచూర్ణమును గలిపి 8 రెంతలు గోమూత్రము గోమూత్రమునకు సమముగ ఆవుపాలుబోసి మృద్వగ్నితో మెల్లగ వండి రేగుగింజలంత మాత్రలుజేసి ప్రాతఃకాలమున మధ్యాహ్నకాలమున రాత్రికాలమున 2 మాత్రలు సేవింపుచుండిన శూలలుహరించు. సర్వశూలలయందు మాంసము పిండి వంటకములు జడాన్నము మినుములు మొదలగువాని వర్జింపవలయు.

## కుబేరాక్షాది చూర్ణము.

శ్లో॥ [సిందూరమణిదర్పణే] ధనదనయనమజ్జా టంకణైర్హింగు సింధూరుచకమరిచశుంఠీదీప్యపథ్యాకణానాం । క్రమశఇతిచవృద్ధ చూర్ణముష్ణాంబునాచజనయతిజఠరాగ్నింసర్వశూలం నిహంతి ॥

తా. గచ్చపలుకులు వెలిగారము యింగువ సైంధవలవణము మాదీఫలము మిరియాలు శొంఠి వోమము కరక్కాయ పిప్పళ్ళు వీనిని క్రమముగ హెచ్చించి చూర్ణముజేసి 4 మాడలయెత్తును వుష్ణోదకముతో సేవించిన సర్వశూలల హరింపం జేయుటయే గాక అగ్నిదీపనమును సగా గలుగంజేయు.

## గోమూత్ర మండూరము.

శ్లో॥ గోమూత్రసిద్ధం మండూరం త్రిఫలాచూర్ణసంయుతం ।
విలిహేన్మధుసర్పిర్భ్యాం శూలం హంతి త్రిదోషజం ॥

తా. గోమూత్రయుక్తముగ కాచి సిద్ధముజేయబడిన మండూరమునకు సమముగ త్రిఫలచూర్ణమును గలిపి తేనెతో గాని లేక నేతితో గాని సేవించిన త్రిదోషజ శూల హరించు.

## శ్లేష్మశూలకు శూలసింహవటికములు.

శ్లో॥ [ఆయుర్వేదే] విషాకర్షం వచాకర్షం త్రికటుత్రిఫలాచపట్ ।
భార్జీముస్తావిడంగానాం ప్రతికర్షంచ * చూర్ణయేత్ ।
గుడేనసర్వతుల్యేన గుటికాచణమాత్రకా ।
శూలసింహప్రయోగోఽయం కఫశూలహరంభవేత్॥

తా. అతివస వస త్రికటుకములు త్రిఫలములు గంటుబారంగి తుంగముస్తె లు వాయువిడంగములు చిత్రమూలము వీనిని దినుసుకొక్కొక కర్షము చొప్పున దంచి చూర్ణముజేసి దానికి సమముగ బెల్లముగలిపి మర్దించి సెనగలంత మాత్రలు జేసి సేవించిన శ్లేష్మశూల హరించు.

## ఆమశూలకు షణ్ముఖరసము.

శ్లో॥ [మాధవనిదానే] † శుద్ధసూతంసమంగంధం సూతాంశం మృతతామ్రకం । సౌవర్చలంచసూతాంశం జంబీరైర్దినసప్తకం । మర్దయేదాతపేతీవ్రేరుధ్వాలఘుపుటత్రయం । దత్వా దాయతుతచ్చూర్ణే సూతాంశంత్రికటుంక్షిపేత్ । షణ్ముఖోఽయంరసోనామ ‡ త్రిగుంజమామశూలజిత్ । ఏరండతైలం షడ్భాగం లశునస్యదశాష్టకం । ఏకంహింగుత్రిసింధూత్థం సర్వమేకత్రమర్దయేత్ । త్రినిష్కంభక్షయేచ్చాను చామ శూలప్రశాంతయే ॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిజేసినగంధకము తామ్రభస్మము సౌవర్చలవణము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో 7 దినములు మర్దించి తీక్ష్ణమైన యెండ సెండించి ప్రమిదెలలో నునిచి 3 లఘుపుటంబులిడి చూర్ణముజేసి రసమునకు సమముగ త్రికటుకచూర్ణముగలిపి 3 గురిగింజలయెత్తును భక్షించి వెంబడిగ 18 భాగములు వెల్లుల్లిపాయలు 1 భాగము యింగువ 3 భాగము సైంధవ లవణము వీనిని మర్దించి 3 నిష్కములయెత్తు నుంటజేసి 6 భాగములు లాముదములో గలిపి త్రాగిన ఆమశూల హరించు.

* చిత్రకమ్ † సూతం గంధం సమం శుద్ధం. ‡ త్రిగుంజం సర్వశూలజిత్.

## పరిణామశూలకు త్రివృతాది యోగము.

శ్లో॥ త్రివృత్కణాభయాచూర్ణం సగుడం చోష్ణవారిణా ।
జగ్ధ్వర్ధసముఖే సేవ్యం శూలంచ పరిణామజమ్ ॥

తా. తెగడ పిప్పళ్ళు కరకపప్పు వీనిని చూర్ణముజేసి ప్రాతబెల్లము గలిపి యుష్ణోదకముతో నుదయమున సేవించిన పరిణామశూల హరించు.

## సర్వశూలలకు సర్వేశ్వరవటికములు.

శ్లో॥ [మాధవనిదానే] విశ్వమేరండతైలేన హింగు సౌవర్చలాన్వితమ్ । మృతసూతకసంయుక్తం భక్షితంసర్వశూలహా ।
పంక్తిశూలం తథైవాన్నద్రవశూలంచ సర్వశః ।

తా. శొంఠి యింగువ సౌవర్చలవణము రసభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ఆముదముతో మర్దించి వల్లప్రమాణమంత మాత్రలుజేసి 1 మండలము సేవించిన పంక్తిశూల అన్నద్రవశూల మొదలగు సర్వశూలలు హరింపంజేయు.

## మృత్యుశూలకు క్షారయోగము.

శ్లో॥ [మాధవనిదానే] వంధ్యాలాంగలికామూలం శంఖంచ ద్విగుణంతయోః । త్రయాణాంభావయేచ్చూర్ణం త్ర్యహంజంబీరజద్రవైః । రుధ్వాగజపుటేపాచ్యంతత్క్షారంమరిచైర్ఘృతైః।
కర్షమాత్రం పిబేచ్ఛూలాత్తత్క్షణాన్ముక్తిమాప్నుయాత్ ॥

తా. గొడ్డుకాకరగడ్డ వన్నెచర్లగడ్డ యివి సమభాగములు శంఖచూర్ణము 2 భాగములు యింటిలవానిని ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో 3 దినములు భావనజేసి మూసటిలోనునిచి చీలమన్ను లెపనముజేసి గజపుటంబిడి యది క్షారంబగు దానిలో కర్షప్రమాణమును మిరియపుచూర్ణము నెయ్యి అనుపానిని ఘనుపానముతోడ సేవించిన మృత్యుశూల తత్క్షణమున హరించు.

## సర్వశూలలకు వైశ్వానరవటికములు.

శ్లో॥ సైంధవం నాగరం ముస్తానవభాగం పృథక్పృథక్ ।
ప్రత్యేకం లశునం హింగు కుబేరాక్షీత్రయం త్రయమ్ ।

ఏకాంశం భస్మసూతంచ త్రైలే నైరండజేనచ ।
క్వాథితం సర్వశూలఘ్నం ప్లీహా వైశ్వానరో భవేత్ ॥

తా. సైంధవలవణము శొంఠి తుంగముస్తెలు యివి దినుసుకు 9 భాగములు వెల్లుల్లి యింగువ గచ్చపలుకులు యివి దినుసుకు 3 భాగములు రసభస్మము 1 భాగము యిట్టుల వీనినెల్ల ఖల్వములోనునిచి చూర్ణము జేసి ఆముదములో గలిపి వండి మాత్రలు జేసి శక్త్యనుగుణ్యముగ సేవించిన (గుల్మము) సర్వశూలలు ప్లీహము వీనిని హరింపంజేయు.

## శూలాదులకు గజకేసరిరసము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] శుద్ధసూతం ద్విధాగంధం యామైకం మర్దయేద్దృఢమ్ । ద్వయోస్తుల్యం శుద్ధతామ్రం సంపుటేతన్నిరోధయేత్ । ఊర్ధ్వాధోలవణందత్వా మృద్భాండేధారయేద్భిషక్ । తతో గజపుటే పక్త్వా సాంగశీతంసముద్ధరేత్ । సంపుటం చూర్ణయేత్సూక్ష్మం పర్ణఖండే ద్విగుంజకమ్ । భక్షయేత్సర్వశూలార్తోహింగుశుంఠీసజీరకమ్ । వచామరిచజంచూర్ణంకర్షముష్ణజలైః పిబేత్ । అసాధ్యంనాశయేచ్ఛూలంరసోయంగజకేసరీ ॥

తా. శుద్ధిజేసిన రసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము 2 భాగములు యిటుల వీనిని ఖల్వములోనునిచి 1 ఝాము బాగుగ మర్దించి దీనికి 3 భాగములు శుద్ధిజేయబడిన తామ్రపుడబ్బిలోనునిచి వానిపైమూసి యొకకుండయడుగున సగమువరకు నుప్పుబోసి దానిమధ్యమున పైతామ్రపుడబ్బినునిచి మరల దానిపై యుప్పుబోసి మూతినిమూసి చీలమన్ను లేపనముజేసి గజపుటంబిడి సాంగశీతలమునదీసి డబ్బితోడ నూక్ష్మముగ చూర్ణముజేసి 2 గురిగింజలయెత్తును తమలపాకులోనునిచి భక్షించివెంబడిగ యింగువ శొంఠి జీలకఱ్ఱ వస మిరియాలు అనువానిచూర్ణములో కర్షప్రమాణమును వుష్ణోదకములో గలిపి త్రాగిన సర్వశూలలు అసాధ్యమైనశూలలు వీనిని హరింపంజేయు.

## శూలారి రసము.

శ్లో॥ రసగంధంసమంకృత్వా తామ్రంతుల్యంనియోజయేత్ । మరీచంనాగరంహింగువచాజాజ్యగ్నిమూలకమ్ । మార్కనస్వ

రసేనైవదినంసూత్స్నంవిమర్దయేత్ । బదరాస్థిప్రమాణేనవటి
కాఃకారయేద్భిషక్ । శూలంగుల్మముదావర్తం వాతరోగం
నిహంతిచ । రసశ్శూలారిరిత్యేష వహ్నిమంద్యనిభూదనః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము తామ్రభస్మము మిరియాలు శొంఠి యింగువ వస జాజికాయలు చిత్రమూలము వీనిని సమభాగములుగ ఖల్వము లోనునిచి గుంటగలగరాకురసముతో 1 దినము బాగుగ మర్దించి రేగుబండంత మాత్రలు జేసి 6 మాసములు సేవింపుచుండిన సర్వశూలలు గుల్మములు వుదావర్తము వాతరోగములు అగ్నిమాంద్యము వీనిని హరింపంజేయు.

## శూలాంతక రసము.

శ్లో॥ [నిత్యనాథీయే] మృణాలచందనంయష్టి గుళూచీ వాలుకం
తథా । ఏతత్సర్వం సమంచూర్ణం చూర్ణాంశం శర్కరాంక్షి
పేత్ । సిందూరం వల్లమాత్రేణ తండులోదకపానతః। పైత్య
శూలవిదాహాచ సర్వశూలం ప్రశామ్యతి ॥

తా. తామరతూండ్లు శ్రీగంధము యష్టిమధుకము తిప్పతీగ కూతురుబుడమ వీనిని సమభాగములుగ మూర్ణముజేసి దీనికి సమముగ పంచదారగలిపి వల్లప్రమాణము సిందూరయుక్తముగ గడగుతో సేవించిన పైత్యశూల తాపము సర్వశూలలు హరించు.

## ప్రక్కశూల చికిత్స.

క॥ ఇల్లిందయుర్త్తరేణుల । పల్లవరసమందు జాతిఫలజాపత్రుల్
వెల్లుల్లి భృంగిమేలకి । సుల్లభమావాలు పక్కశూలలు
మానున్ ॥

తా. ఇల్లిందకొనలరసము నాటూపు వుత్తరేణుకొనలరసము నాటూపు జాజకాయ జాపత్రి వెల్లుల్లి గుంటగలగర యేలకులు లవంగములు ఆవాలు వీనిని నూరి 3 పూటలు త్రాగిన ప్రక్కశూల హరించు.

## సర్వశూలలకు గజాంకుశము.

శ్లో॥ [ఆయుర్వేదే] నిష్కత్రయం శుద్ధసూతం ద్వినిష్కంశుద్ధ
టంకణమ్ ॥ గంధకం పంచనిష్కంచ ప్యేకనిష్కంచ ముస్త

కమ్ । చతుర్నిష్కంచనేపాళం తత్సమం మృత తామ్రకమ్।
సర్వతుల్యం తిలక్షారం వృక్షామ్లక్షారచిత్రకమ్ । తద్వత్స
లాశకక్షారం షణ్ణిష్కం త్ర్యూష సైంధవమ్ । యవక్షారం
ద్వినిష్కంచ బిడాసౌవర్చ్చకాచకమ్ । సముద్రలవణం చైవ
పిప్పలీచత్రినిష్కకమ్ । చిత్రమూలరసైర్యుక్తం దినైకంచ
విమర్దయేత్ । సప్తధా చణకక్షార మార్ద్రకద్రవమర్దితమ్।
ద్విగుంజాంవటికాంఖాదే దార్ద్రకస్యచవారిణా । గుల్మాష్ఠీలా
ప్లీహ శూల ప్రత్యష్ఠీలాతు నిర్జయమ్ । ఉదరంసప్తవృద్ధించ
శోభపాండ్వామయంతథా । సర్వరోగాన్ హరేచ్ఛీఘ్రం
రసశ్శూల గజాంకుశః ॥

తా. శుద్ధిజేసిన రసము 3 నిష్కములు శుద్ధిజేసిన వెలిగారము 2 నిష్కములు శుద్ధిజేసిన గంధకము 5 నిష్కములు తుంగముస్తెలు 1 నిష్కము శుద్ధిజేసిన నేపాళములు 4 నిష్కములు తామ్రభస్మము 4 నిష్కములు నువ్వులక్షారము 19 నిష్కములు చింతక్షారము చిత్రమూలక్షారము మోదుగక్షారము యివి దినుసుకు 6 నిష్కములు త్రికటుకములు సైంధవలవణము యవక్షారము యివిదినుసుకు 2 నిష్కములు బిడాలవణము సౌవర్చలవణము కాచలవణము సముద్రలవణము పిప్పళ్ళు యివి దినుసుకు 3 నిష్కములు సెనగక్షారము 7 నిష్కములు యిటుల వీనినెల్ల ఖల్వములోనునిచి చిత్రమూలరసముతో 1 దినము మర్దించి పిదప అల్లపురసముతో మర్దించి 2 గురిగింజలంత మాత్రలుజేసి యందొకదానిని అల్లపురసముతో 3 మండలములు సేవించిన పంచగుల్మములు అష్ఠీలము ప్లీహము అష్టశూలలు ప్రత్యష్ఠీలము తుని ప్రతితుని వుదరము సప్తవృద్ధులు శోఫ పాండువు మొదలగు సర్వరోగముల శీఘ్రముగ హరింపంజేయు (శూల గుల్మనివారణార్థంబై మహాగ్నికుమారమును సేవింపవలయు. పైజెప్పబడిన యౌషధములవలన శూలగుల్మములు నివర్తింపకుండిన యిక జెప్పంబడు శంఖద్రావకమును సేవింపవలయు.

## శంఖద్రావకము.

శ్లో॥ [ఆయుర్వేదే] త్రిక్షారంపంచలవణంపటకీసురకారకమ్ । కాసీ
సంనవసారంచ తిలచించాపమార్గకమ్ । ఏతానిసమభాగాని
ఘటిమాత్రంవిమర్దయేత్ । పాచయేన్మద్యయంత్రేణ మృదు
వహ్నౌతథాభిషక్ । శంఖద్రావరసోనామ సర్వశూలవినాశ

కృత్ । పంచకాసాన్ పంచగుల్మాన్ క్షయకాసాన్ వినాశయేత్ । మన్యాస్తంభం కంఠరోగం హృద్రోగం సర్వశూలజిత్ । అగ్నించ కురుతే దీప్తం తేజోవర్ణబలప్రదః ॥

తా. సర్జక్షారము యవక్షారము పటంకణక్షారము పంచలవణములు (అనగా సైంధవలవణము సౌవర్చలవణము బిడాలవణము కాచలవణము మంచిలవణము) పటికారాక్షారము. కాసీసము నవాసాగరము నువ్వులక్షారము చింతక్షారము ప్రత్తిరేణాక్షారము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి యొకఝాము మర్దించి కుండలో వేసి దళముగ చీలమన్నుబూసి మునుపటివలెనే సారాయిబట్టిని తగిలించి మృద్వగ్నిని వండిన శంఖద్రావకము సిద్ధంబగు. దానిలో $\frac{1}{2}$ తులమును వోమపుపొట్టులోగలిపి పండ్లకు తగలక అంగిటిలో వేసుకొని (6 మాసములవరకు) మింగుచుండిన పంచకాసములు పంచగుల్మములు క్షయకాసము మన్యాస్తంభము కంఠరోగము హృద్రోగము సర్వశూలలు వీనిని హరింపంజేసి అగ్నిదీపము తేజస్సు వర్ణము బలము అనువీనిని సగా కలుగంజేయు.

## మహాశంఖద్రావకము.

శ్లో॥ [మాధవనిదానే] రంభా చించాగ్నిభూపీలు కేతక్యపిత్థ ధైవచ । సాలకాలంచభూదాత్రీ శిగ్రుమూలహరిప్రియమ్। శరపుంఖీచనీలీచతిలకాష్ఠంచబర్బరా । అర్జునద్వయదారూచాప్యర్క శల్యపునర్నవమ్ । నిర్దిష్టావింశతిః క్షారాశ్శంఖద్రావసుపాచయేత్ । క్షారాశ్చవింశతిః ప్రోక్తాలవణానాంచపంచకమ్ । పటకీనవసారంచ క్షారద్వయత్రిటంకణం । తుత్థత్రయంతిలాతాళం గంధకంసర్జకారకం । పాషాణాచతు కాసీసం మూత్రవర్గంతథైవచ । భూక్షారంగృహధూమాఖ్యం సర్వంసంస్థాప్యయత్నతః । ఆమ్లవర్గైస్తథామాసం భావయేచ్ఛముహుర్ముహుః । తేజోయంత్రేవిధానేన నాకసిద్ధిం విచక్షణః । మూత్రవర్గంచతోయాభం వరాటీ శంఖకంద్రవేత్ । పారదేనచసంయుక్తం వాతరోగేచయోజయేత్ । గుల్మద్వాదశఖం...ని హృదరాణి తథైవచ । శీతజ్వరం

పురాణంచ శోఫంసర్వాంగమారుతమ్। ప్రమేహాన్ వింశతిం హంతి మూత్రకృచ్ఛ్రాంతథైవచ । గజవాజినరాణాంచపశు పక్షిమృగేషుచ । సర్వరోగహరం చైతత్కశ్యపేనచభాషితమ్ । శంఖద్రావ మిదం నామ్నా సర్వరోగేషు శస్యతే ॥

తా. అరటిపట్ట చింతచెక్క చిత్రమూలము ముచ్చతుమికి మొగిలి యేపిచెక్క కలిగొట్టు నేలయూసిరిక మునగవేరు కణిపిచెక్క ములు వెంపలి నీలిపువ్వులదంటువాయింట యేదుమద్ది నల్లమద్ది దేవదారు జిల్లేడు వుత్తరేణు గలిజేరు అనువానిక్షారములు పంచలవణములు పటిక నవాసాగరము యవక్షార సర్జక్షారములు వెలిగారము సురాకారము గురిజాకారము శుద్ధిచేసిన మైలుతుత్తము శుద్ధిచేసిన పాలతుత్తము శుద్ధిచేసిన కఫరితుత్తము శుద్ధిచేసిన రక్తమణిశిల శుద్ధిచేసిన తాళకము శుద్ధిచేసిన గంధకము సబ్బు పాషాణము అన్నభేది * మూత్రవర్గలో జెప్పబడిన 6 విధమూత్రములు చౌటిక్షారము కరుధూపము వీనినెల్ల సమభాగములుగ గ్రహించి అమ్లవర్గములో 1 మాసమువరకు పలుమారుభావనజేసి తేజోయంత్రమునం దునిచి వండిన్ మూత్రవర్గ తుల్యంబై నీరువలెనుండు శంఖద్రావక మొదుసును. అందు గవ్వలశంఖముల వేసిన ద్రవించు ఆశంఖద్రావకములో శుద్ధిజేసిన రసమునుగలిపి సేవించిన వాతరోగములును వోమపుపొట్టుగలిపి సేవించిన 12 విధములయిన గుల్మములును 12 వుదరమ్ములును శీతజ్వరములును పురాణజ్వర శోఫలును సర్వాంగవాతములును వింశతి మేహములును మూత్రకృచ్ఛ్రములును హరించు. ఇది యేనుగులకు గుఱ్ఱములకు నరులకు పశువులకు పక్షులకు మృగములకు గలుగు సర్వరోగములు హరింపంజేయునని కశ్యపమహర్షి వచించె. (తెల్లనిచవుకురు వుప్పుగవండి అందొక తులములో ½ తులము సురాకారము ¼ సేరు వుదకముగలిపి త్రాగిన వుమిచే వాంతులు గుల్మశూలలు హరించు.) ఈ శంఖద్రావకము సర్వరోగములయందు కడుప్రశస్తంబు.

## గుల్మాదులయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] కుళుత్థవాస్తుబృహతీ సపటోలపుసర్నవమ్ ।
పక్వకూశ్మాండకతక మిసిహింగుసజీరతమ్ ।
దవ్యం తక్రం పృశ్నికాళి ముడీనారంగబిల్వకమ్ ।
ప్లీహప్లీలోదరానాహా గుల్మవిద్రధి మిత్రకమ్ ॥

---

* ఆవు అశ్వము మేక యేనుగు గాడిద వొంటె నరుడు 6నిమూత్రములు.

తా. ఉలవకట్టు (శోటకూర) చక్రవర్తికూర పెద్దములక చిన్నములకపొట్ల కాయ గలిజేరుకూర ముదురుగుమ్మడుకాయ యింపుపుకాయ సదాపకూర యింగువ జీలకఱ్ఱ ఆవుచల్ల కోలపొన్న బోడతరము నారదబ్బకాయ మారేడుపండు ఇవి ప్లీహము అష్ఠీలము (ప్రత్యష్ఠీలము తుని ప్రతితుని) ఉదరము ఆనాహము గుల్మశూల విద్రధి అనువానియందు పథ్యకరంబులు.

గుల్మాదులయం దపథ్యము.

శ్లో॥ నింబధాన్యాకనిష్పావ శాలుకంపిష్టకైః కృతమ్ ।
సితపిండాలపిణ్యాకం మాంసంసూతనసంభవమ్ ।
అలాబూదధిచామ్లాని కఠినానిగురూణిచ ।
ప్లీహాష్ఠీలోదరానాహ గుల్మవిద్రధిశత్రవః ॥

తా. వేపపండు కొత్తిమెర్లు అనుములు తామర మొదలైన వానిగడ్డలు పిండి వంటకము తెల్లనిచారకంద తెలికపిండి నవీనమాంసము అనుగపుకాయ పెరుగు పులుసు కఠినద్రవ్యములు గురుకరద్రవ్యములు యివిప్లీహముఅష్ఠీలము (ప్రత్యష్ఠిలము) ఉదరము ఆనాహము గుల్మశూల విద్రధి అనువాని యందపథ్య కరంబులు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
ధ్రౌల్య మదాత్యయ నాసారోగ ప్రతిశ్యాయ
నాసికార్శ శిరోరోగ నిదాన తత్సాధ్యా
సాధ్య తచ్చికిత్సానుపాన పథ్యా
పథ్య లక్షణయుక్తం
ఏకోనవింశప్రకరణమ్.

---

శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

## — వి ం శ ప్ర క ర ణ ము. —

శ్లో॥ భైరవంభైరవాకారం వీరంవీరేశ్వరంప్రభుమ్ ।
రుద్రంరుద్రగణాధీశం వీరభద్రమహంభజే ॥

తా. భైరవుడనే పేరుగలవాడు భయంకర స్వరూపుడు శూరుడు వీరే రుడు జగత్ప్రభువు రుద్రుడు రుద్రగణాధిపతి అగువీరభద్రుని నేను భజించెదను.

శ్లో॥ శ్రీనీలకంఠ వంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుడు బసవరా పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను గ్రంథముయొక్క వింశప్రకరణమును వచింపుచున్నాడను.

శ్లో॥ [ఆయుర్వేదే] అథాస్య సంప్రవక్ష్యామి స క్షిప్తంసూక్త
ముత్తమమ్ । ఆయుర్వేదోపదేశేస్మిన్నున్మాదంతునిగద్యతే॥

తా. ఆయుర్వేదమున జెప్పంబడిన ప్రకారము వున్మాదనిదానము సంక్షిప్త బుగ వచించెద.

### ఉన్మాద నిదానము.

శ్లో॥ మదయంత్యుద్గతాదోషా యస్మాదున్మార్గమాశ్రితః ।
మానసోయమతో వ్యాధి రున్మాదఇతికథ్యతే ॥

తా. దోషములు వృద్ధింజెంది స్వమార్గమును విడనాడి అన్యమార్గము (అనగా మనోవహాదమనుల) నాశ్రయించుటవలన మనస్సునందు భ్రమజనిం యున్మాదము గలుగును. ఈ రోగము మానసిక దోషమువలన జనించు.

## ఉన్మాద భేదంబులు.

శ్లో॥ ఏకైకశస్సర్వశశ్చ దోషైరత్యర్థమూర్ఛితైః
మానసేనచ దుఃఖేన సపంచ విధ ఉచ్యతే।
విషాద్భవతి షష్ఠశ్చ యథా స్వంతత్రభేషజమ్।
సచాప్రవృద్ధ స్తరుణో మదసంజ్ఞాం బిభర్తిచ॥

తా. వాత పిత్త శ్లేష్మములు ప్రత్యేకములుగ ప్రకోపించుట వలనగాని లేక సన్నిపాత దోషమువలనగాని లేక మానసిక దుఃఖమువలనగాని వున్మాందబు 5 విధంబులగు మఱియు విషసంబంధమువలన 6 వదియగు నున్మాదము జనించు. దీని యందు తగుమైన చికిత్సలం జేయవలయు. ఇవి యధికముగ వృద్ధింజెందక తరుణంబులైన మదమని వచించెదరు.

## ఉన్మాద కారణము

శ్లో॥ చోరై ర్నరేంద్రపురుషైః కరిభి స్తథాన్యై విధ్వంసితస్య ధననాశకులక్షయైర్వా। గాఢంక్షతిర్మనసిజప్రహితోధికం వాజాయేత చోత్కటతరో మనసోవికారః॥

తా. చోరులు రాజకీయపురుషులు యేనుగులు పులిమొదలగు దుష్టజంతువులు అనువానివలనగాని ధననాశకులక్షయమువలనగాని మన్మథవికారము వలనగాని అంతఃకరణమున బలమైనఖేదముజనించి దానివలన బలిష్ఠమైనమనోవికారము జనించు.

## ఉన్మాదకారణ తత్సంప్రాప్తి.

శ్లో॥ విరుద్ధదుష్టాశుచిభోజనాని ప్రధర్షణం దేవగురుద్విజానామ్। ఉన్మాదహేతుర్భయహర్షపూర్వో మనోభిఘాతో విషమా శ్చచేష్టాః। తైరల్పసత్వస్యమలాః ప్రదుష్టా బుద్ధేర్నివాసం హృదయంప్రదూష్య। స్రోతాంస్యధిష్ఠాయమనోవహానిప్ర మోహయం త్యాశు నరస్య చేతః॥

తా. విరుద్ధ దుష్టాన్నమును (అనగా విషయుక్తాన్నమును) అమంగళకరాన్నమును సేవించుట దేవగురుబ్రాహ్మణుల దిరస్కరించుట భయము సంతోషము అను వాని సంబంధమువలన మనసునందు తంద్రగలుగుట విషమచేష్ట (అని వంకరగవడు

చుట మాటలాడుట మొదలగునవి బలవంతునితో యీడ్పులాడుట) ఇవి మొదలగు కారణములవలన నల్పసత్వగుణముగల పురుషునియొక్క వాతాదిదోషములు ప్రకోపించి వృద్ధింజెంది బుద్ధిస్థానము నుండు మనస్సును జెఱచి మనోవహ స్రోతస్సులం జెంది అంతఃకరణమును మోహింపంజేయు.

### ఉన్మాద స్వరూపము.

శ్లో॥ ధీవిభ్రమ స్సత్వపరిప్లవశ్చ పర్యాకులాదృష్టి రధీరతాచ। అబద్ధవాక్త్వంహృదయంచ శూన్యంసామాన్యమున్మాదగద స్యచిహ్నమ్ ॥

తా॥ భ్రమ మనశ్చాంచల్యముగలుగుట దృష్టిచలించుట భయముగలుగుట అసంబద్ధముగ మాటలాడుట హృదయము శూన్యంబగుట (అనగా విచారశక్తిలేకుండుట) యివి వున్మాదమున సామాన్యలక్షణంబులని తెలియవలయు.

### వాతజోన్మాద లక్షణము.

శ్లో॥ రూక్షాల్పశీతాన్నవిరేకధాతు క్షయోపవాసై రనిలోఽతివృద్ధః। చింతాదిదుష్టం హృదయం ప్రదూష్య బుద్ధింస్మృతిం చాపినిహంతిశీఘ్రమ్ ॥ అస్థానహాసస్మిత నృత్యగీతవాగంగవిక్షేపణరోదనాని। పారుష్యకార్శ్యారుణవర్ణతాచ జీర్ణేబలంచానిలజస్యరూపమ్ ॥

తా. రూక్షము అల్పము శీతలముగలయన్నమును సేవించుట విరేచనములు జేయించుట ధాతువులు క్షయించుట వుపవాసముసేయుట యీ కారణములవలన వాతంబధికముగ వృద్ధింజెంది చింతాదియుక్తంబైన మనస్సును గడుదుష్టయుక్తంబుగజేసి బుద్ధిస్మృతుల శీఘ్రముగ నశింపంజేయుట నిష్కారణముగ నవ్వుట నొకింత హాస్యముసేయుట ప్రసక్తములేకుండినపుడు నృత్యగీత భాషణములసలుపుట శరీరము కుదలించుట యేడ్చుట కఠినముగనుండుట శరీరము కృశించుట శరీరకాంతి యెఱ్ఱగ నగుట ఆహారము పరిపాకమును జెందుచుండ రోగబలమెచ్చుట యీ లక్షణములు గలది వాతజోన్మాదమని తెలియవలయు.

### పిత్తజోన్మాద లక్షణము.

శ్లో॥ అజీర్ణకట్వమ్లవిదాహ్యశీతై ర్భోజ్యైశ్చితం పిత్తముదీర్ణవేగమ్। ఉన్మాదమత్యుగ్రమనాత్మకస్య హృదిస్థితంపూర్వవదా

శుకుర్యాత్। అమర్ష సంరంభ వినగ్న భావా స్సంతర్జనాభిద్ర వణౌష్ణ్యరోషాః । ప్రచ్ఛాయశీతాన్న జలాభిలాషాః పీతా స్యతాపిత్తకృతస్య లింగమ్ ॥

తా. ఉడికియుడకకుండు భోజనమును కారము పులుసు విదాహము వుష్ణము గల భోజనమును సేయుటవలన అణగియుండు పిత్తము తీవ్రముగ లేచి అజితేంద్రియ పురుషునియొక్క హృదయమును జెంది పూర్వమువలెనే కడుయుగ్రమైనవున్మాదమును తత్క్షణమున గలుగంజేయు. దానివలన నేర్పు లేకుండుట ఆర్భాటమును సేయుట దిగం బరుడుగనుండుట పరుల భయపరచుట పరుగెత్తుట శరీరముష్ణముగనుండుట కోపమును జెందుట నీడలో గూర్చుండుటయందు శీతాన్నమును శీతలమును సేవించుటయం దిచ్ఛగలుగుట ముఖము పసపువర్ణముగనుండుట అను నీ లక్షణంబులు గలుగు.

## కఫజోన్మాద లక్షణము.

శ్లో॥ సంపూరణైర్మందవిచేష్టితస్య సోష్మా కఫోమర్మణిసంప్రవృద్ధః । బుద్ధిస్మృతించాప్యుపహంతిచిత్తం ప్రమోహయన్సంజనయేద్వికారమ్ । వాక్చేష్టితం మందమరోచకశ్చ నారీవివిక్తప్రియతాతినిద్రా । ఛర్దిశ్చలాలాచ బలంచభుక్తే నఖాదిశౌక్ల్యంచకఫాదికేస్యాత్ ॥

తా. తృప్తికరపదార్థముల భక్షించి శ్రమను జెందకుండు పురుషునియొక్క పిత్తయుక్తకఫము హృదయమున మిక్కుటముగ వృద్ధింజెంది బుద్ధి స్మృతి చిత్తము అనువానిని నశింపంజేయుటచే మోహింపంజేసి వున్మాదరూపవికారమును గలుగం జేయుటవలన వ్యాపారము (అనగా మాటలు మొదలగునవి) మందముగుట అన్నద్వేషము స్త్రీలయందును యేకాంతవాసమునందును యిచ్ఛగలుగుట కడునిద్ర వాంతి గలుగుట నోట జొల్లుగారుట భోజనానంతరము రోగము ప్రకోపించుట గోళ్ళు చర్మము మూత్రము నేత్రములు మొదలగునవి తెల్లగనుండుట యీ లక్షణములుగలది కఫజోన్మాదమని తెలియవలయు.

## సన్నిపాతోన్మాద లక్షణము.

శ్లో॥ యస్సన్నిపాత ప్రభవోతిఘోర స్సర్వైస్సమస్తైరపి హేతు

భిస్స్యాత్ । సర్వాణిరూపాణి బిభ్రతి తాదృగ్వ్విరుద్ధభైషజ్య
విధి ర్వివర్జ్యః ॥

తా. వాతాదిదోషములన్నియు తమతమ కారణములచే ప్రకోపించి సర్వ దోష లక్షణయుక్తంబై కడుభయంకరమైన సన్నిపాతోన్మాదమును గలుగంజేయు. కావున వాతాదిదోషములకై జెప్పంబడిన ప్రత్యేక చికిత్సలు పరస్పరవిరుద్ధంబుల గుటచె దానియందు జేయంజనదు. అయినను అనిర్దేశ్యకారణోత్పత్తిగల యీసన్ని పాతమునందు త్రిదోషహరమైన అమలకాదులచే చికిత్సింపవలయు.

శోకజోన్మాద లక్షణము.

శ్లో॥ చోరైర్నరేంద్రపురుషై రరిభి స్తథాన్యైర్విత్రాసితస్యధ
నబాంధవసంక్షయాద్వా । గాఢంక్షతేమన సిచప్రియయారి
రంసోర్జాయేతచోత్కటతరోమనసోవికారః । చిత్రంబ్రవీతి
చమనోనుగతం విసంజ్ఞో గాయ త్యథో హసతి రోదితిచాతి
మూఢః ॥

తా. దొంగలు రాజపురుషులు శత్రువులు యితరులు వీరివలన భయమును జెందుటవలనగాని లేక తనకిష్టురాలగు స్త్రీతో సంభోగము సేయుటయం దిచ్ఛయించుటవలనగాని అంతఃకరణము బలమై ఖేదమును జెందియుండ మనస్సునందు భయంకరమైన వికారము జనించి దానివలన పలువిధములుగ మాటలాడుచు మనోమర్మంబును తెలియబరచుట జ్ఞానము విపరీతంబగుట పాడుట నవ్వుట యేడ్చుట కడు మాఢ్యమును జెందుట యీ లక్షణములుగలది శోకజోన్మాదమని తెలియవలయు.

విషజోన్మాద లక్షణము.

శ్లో॥ రక్తేక్షణోహతబలేంద్రియభా స్సుదీనశ్శ్యావాననో విషకృ
తేన భవే ద్విసంజ్ఞః ॥

తా. నేత్రము లెఱ్ఱగనగుట బలము యింద్రియములు శరీరకాంతి నశించుట మిక్కుటముగ దీనుడౌట ముఖముపై నలుపుఛాయగలుగుట సంజ్ఞ నశించుట యీ లక్షణములుగలది విషజోన్మాదమని తెలియవలయు.

అసాధ్యోన్మాద లక్షణము.

శ్లో॥ అవాఙ్ముఖస్తూన్ముఖోవా క్షీణమాంసబలోనరః ।
జాగరూకోహ్యసందేహ ఉన్మాదేనవినశ్యతి ॥

తా. తల వంచికొనియుండుట లేక తల పైకెత్తుకొనియుండుట శరీరమాంసము బలము క్షయించుట నిదురబట్టకుండుట యీ లక్షణములుగల యున్మాదరోగి నిశ్చయముగ మృతిజెందు.

## భూతజోన్మాద లక్షణము.

శ్లో॥ అమర్త్యవాగ్విక్రమవీర్యచేష్టా జ్ఞానాదివిజ్ఞానబలాదిభిర్యః ।
ఉన్మాదకాలో నియతశ్చయస్య భూతోత్థమున్మాద ముదాహరేత్తమ్ ॥

తా. మనుజునకు వ్యతిరిక్తంబైనవాక్కు పరాక్రమము శక్తి శరీరవ్యాపారము తత్త్వజ్ఞానము శిల్పాదికజ్ఞానము స్మృత్యాదిజ్ఞానము మొదలగునవి యున్మాదకాలంబున నియతముగ గలిగిన భూతజోన్మాదమని తెలియవలయు. (భూతశబ్దమువలన నుత్తరోత్తర జెప్పంబడు. దేవతలను సగా దెలియవలయు.)

## భూతోన్మాద లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] ప్రలాపోబహుధాయస్య కృతంకార్యంచ విస్మరేత్ । గర్జతీవాదతేహంతిక్వచిత్తీక్ష్ణంచపాపకృత్ ।భూతోన్మాదోదితం చిహ్నం వాతోన్మాదేక్వచిత్స్మృతమ్ । రక్షయేచ్ఛృంఖలాబంధైః మూలేచాగాధయేత్కృతైః । సర్వాంగంతప్తలోహైర్వాభోభార్థం దర్శయేద్భయమ్ । పుత్రదారపితామాతాతస్యాగ్రేపాతయేత్స్మృతౌ । చోరరాజభయం చాస్యబోధయేద్వస్మృతంపురః । రసైర్ధూపాంజనైర్నస్యైస్స్నేహభోజ్యై రుపాచరేత్ ॥

తా. పలువిధములుగ ప్రలాపించుట చేసినపనిని మరచుట బొబ్బలిడుట విస్కారణముగ వాదించుట కొట్టుట వొకానొకపుడు మిక్కుటముగ పాపకృత్యముల జేయుట యీలక్షణములుగలది భూతోన్మాదమని తెలియవలయు అందు కొన్నిలక్షణంబులు వాతోన్మాదమునందును గలిగియుండు. ఇది నివర్తించుటకై సంకెళ్ళు వేయవలయును వెంట్రుకల నీడ్చి కట్టవలయు ఇనుము నెఱ్ఱగ గాల్చి ప్రజ్ఞగలుగుటకై సర్వాంగముల జూపించుటచే భయపరచవలయు. మఱియు ప్రజ్ఞగలుగు

నిమిత్తము వానియెనుట పుత్రుడు భార్య తండ్రి తల్లి మొదలగువారిని ద్రోయవ యు. మఱియు రసములు ధూపములు అంజనములు నస్యములు స్నేహయుక్తభో నము అనువానివలన జికిత్సింపవలయు.

## భూతోన్మాద లక్షణము.

శ్లో॥ అతీవహాసమల్లాసం వికారాన్ కురుతేబలాత్ ।
క్షణేస్వస్థః క్షణేమత్తో భూతోన్మాదస్యలక్షణమ్ ॥

తా. తఱుచుగానవ్వుట సంతోషమును జెందుట పలువిధకార్యములజేయు క్షణకాలము స్వస్థంబుగనుండుట క్షణకాలం బెరుగకుండుట యీ లక్షణములుగల భూతోన్మాదమని తెలియవలయు. (దీనియం దుత్తరత్ర జెప్పంబడు నస్యము 7 మార్లు జేయించుటయేగాక రాత్రులయందు మహేశ్వరధూపమునులోనికి నూరో దయ రససేవనను జేయించవలయు.)

## దేవగ్రహోన్మాద లక్షణము.

శ్లో॥ సంతుష్టశ్శుచిరతి దివ్యమాల్యగంధోనిస్తంద్రస్త్వవితథసం
స్కృతప్రభాషీ। తేజస్వీస్థిరనయనోవరప్రదాతా బ్రహ్మణ్యో
భవతినరస్సదేవజుష్టః ॥

తా. ఎల్లపుడు సంతోషముగనుండుట పవిత్రుడైయుండుట శరీరమున దివ పుష్పమాలికల ధరించుట గంధలేపనములు జేసికొనుట నిదురబట్టకుండుట సత్యము సంస్కృతమును మాటలాడుట తేజస్సుగలుగుట స్థిరదృష్టిగలుగుట వరములనొస గుట బ్రాహ్మణులయందు ప్రీతిగలుగుట యీ లక్షణములుగలది దేవగ్రహోన్మా మని తెలియవలయు. (దేవశబ్దమువలన గణమాతృకాదికములనుగూడ నెఱుంగందగు

## అసురగ్రహోన్మాద లక్షణము.

శ్లో॥ సంస్వేదీద్విజగురుదేవదోషవక్తా జిహ్మాక్షోవిగతభయోవి
మార్గదృష్టిః । సంతుష్టోనభవతిచాన్నపానజాతైర్దుష్టాత్మా
భవతి సదేవశత్రుజుష్టః ॥

తా. శరీరమున జెమటగారుట బ్రాహ్మణగురుదేవతలయందు దోషమునారో సించుట వక్రముగజూచుట భయపడకుండుట వేదవిరుద్ధమార్గమునందు బ్రవర్తించు

అధికముగ నన్నపానముల సేవించినను తృప్తిజెందకుండుట దుర్బుద్ధిగలుగుట యీ లక్షణములుగలిగిన అసురగ్రహోన్మాదమని తెలియవలయు.

## గంధర్వగ్రహోన్మాద లక్షణము.

శ్లో॥ హృష్టాత్మాపులినవనాంతరోపసేవీ స్వాచారః ప్రియపరిగీత
గంధమాల్యః। నృత్యన్వై ప్రహసతిచారుచాల్ప శబ్దంగంధర్వ
గ్రహపరిపీడితో మనుష్యః ॥

తా. మనస్సంతోషముగలుగుట యిసుకదిన్నెలు వుద్యానవనములు వీనియందు సంచరి[illegible] అనింద్యమైన యాచారము నాచరించుట దాన గంధ పుష్పముల యందిచ్ఛగలుగుట నృత్యము సలుపుట నవ్వుట మధురముగనల్పముగ మాటలాడుట యీ లక్షణములుగలది గంధర్వగ్రహోన్మాదమని తెలియవలయు.

## యక్షగ్రహోన్మాద లక్షణము.

శ్లో॥ తామ్రాక్షః ప్రియతనురక్తవస్త్రధారీ గంభీరోద్రుతగతిరల్ప
వాక్సహిష్ణుః । తేజస్వీవదతిచకిందదామి కస్మై యో యక్ష
గ్రహపరిపీడితో మనుష్యః ॥

తా. నేత్రము లెఱ్ఱగనుండుట సుందరమై సూక్ష్మమై యెఱుపురంగు గలదై యుండువస్త్రముల ధరించుటయం దిచ్ఛగలుగుట గంభీరముగ (ధీరముగ) నుండుట శీఘ్రముగనడుచుట మితముగమాటలాడుట ఓర్పు తేజస్సుగలుగుట యెవనికేది యిత్తునని వచించుట యీ లక్షణములుగలది యక్షగ్రహోన్మాదమని తెలియవలయు.

## పితృగ్రహోన్మాద లక్షణము.

శ్లో॥ ప్రేతానాంసదిశతిసంస్తరేషుపిండాన్ శాంతాత్మాజలమపి
చాపసవ్యవస్త్రః । మాంసేప్సుస్తిలగుడపాయసాభికామ
స్తద్భక్తోభవతి పితృగ్రహాభిజుష్టః ॥

తా. దర్భపై పితృదేవతలకు పిండమునిచ్చుట భ్రాంతినిజెందుట పైవస్త్రము నపసవ్యముగధరించి తర్పణమువిడుచుట మాంసభక్షణము నువ్వులు బెల్లము పరమాన్నము అనువానియందిచ్ఛ పితృభక్తిగలుగుట యీ లక్షణములుగలది పితృగ్రహోన్మాదమని తెలియవలయు. (దీనియందుగాని యితర భూతోన్మాదములయందుగాని రోగిగోరెడి సర్వపదార్థముల నివ్వందగు.)

## సర్పగ్రహోన్మాద లక్షణము.

శ్లో॥ యస్తూర్వ్యాం ప్రసరతి సర్పవత్కదాచి త్సృక్విణ్యౌ విలి
తి జిహ్వయా తథైవ । క్రోధాళుర్మధుగుడదుగ్ధ పాయసే
ప్సుర్జ్ఞేయో భవతి భుజంగ మేనజుష్టః ॥

తా. సర్పమువలె (అనగా బోర్లతో) భూమిపై నాకానాకపుడు ప్రా
లాడుట వెలపటి పెదవులను సర్పమువలె నాలుకతో నాకుట కడుకోపమున
డుట తేనె బెల్లము పాలు పాయసము అనువానిని సేవనయందిచ్ఛగలుగుట యీ
ణములు గలిగిన సర్పగ్రహోన్మాదమని తెలియవలయు.

## రాక్షసగ్రహోన్మాద లక్షణము.

శ్లో॥ మాంసాసృగ్వివిధసురావికార లిప్సు ర్నిర్లజ్జో భృశమతి
ష్ఠురోతిశూరః । క్రోధాళుర్విపులబలో నిశావిహారీ శౌచద్
ద్విడ్భవతి స రాక్షసైర్గృహీతః ॥

తా. మాంసము రక్తము పలువిధములైన మద్యములు అనువానినిచ్ఛయిం
లజ్జలేకుండుట కడునిష్ఠురముగ మాటలాడుట కడుశౌర్యము కోపము కడుబ
గలుగుట రాత్రులయందు మిక్కుటముగ సంచరించుట శుచిత్వమునందు మిక్కు
ద్వేషపడుట యీ లక్షణములుగలిగిన రాక్షసగ్రహోన్మాదమని తెలియవలం

## పిశాచజుష్ట లక్షణము.

శ్లో॥ * ఉద్ధస్తః కృశపరుష శ్చిర ప్రలాపీ దుర్గంధో భృశమశుచి
స్తథాతిలోలః । బహ్వాశీ విజన వనాంతరోపసేవీ వ్యాచేష్ట
భ్రమతి రుదన్ పిశాచజుష్టః ॥

తా. హస్తమును పొడవుగ నెత్తుట లేక దిగంబరుడుగనుండుట తేజస్సులే
డుట చిరకాలము వరకు తలుచుగ వదరుట శరీరమునకు దుర్గంధము వెడలుట కడునమం
ముగనుండుట అన్నపానములనిచ్ఛయించుట అన్నపానముల మిక్కుటముగ సేవించు
వనమునం దేకాంతముగనుండుట నిచ్ఛయించుట విరుద్ధచేష్టలు సేయుటరోదనము
యుచు సంచరించుట యీ లక్షణములుగలది పిశాచోన్మాదమని తెలియవలయు.

* ఉద్వస్త్రః.

(హింస క్రీడ సత్కారము అను 3 కారణములవలన గ్రహము సోకు అందు హింసించుటకై పట్టెడిగ్రహము నివర్తించుట యసాధ్యంబు.)

## దేవాదిగ్రహ గ్రహణకాలము.

శ్లో॥ దేవగ్రహాః పౌర్ణమాస్యా మసురా స్సంధ్యయో రపి ।
గంధర్వాః ప్రాయశోష్టమ్యాం యక్షాశ్చప్రతిపద్యథ ।
పితృగ్రహా స్తథాదర్శే పంచమ్యామపిచోరగాః ।
రక్షాంసిరాత్రౌపైశాచా శ్చతుర్దశ్యాంవిశంతిహి ॥

తా. దేవగ్రహము పౌర్ణమియందును అసురగ్రహము సంధ్యలయందును గంధర్వ గ్రహము తఱుచుగ అష్టమియందును యక్షగ్రహము పాడ్యమియందును పితృగ్రహము అమావాస్యయందును సర్పగ్రహము పంచమియందును రాక్షస గ్రహము రాత్రియందును పిశాచగ్రహము చతుర్దశియందును మనుజుల సోకు. (కావున ఆయా తిధులవలన నాయాగ్రహముల నెఱింగి తత్తదుపయుక్తశాంతి బలిదానముల నాయాతిధులయందు సేయుటకై జెప్పంబడియె.)

## శరీరాశ్రిత గ్రహాదృష్ట కారణము.

శ్లో॥ దర్పణదీవ్యథాచ్ఛాయా శీతోష్ణంప్రాణినోయథా ।
స్వమణింభాస్కరాంశుశ్చ యథాదేహంచ దేహధృక్ ।
విశంతినచదృశ్యంతే గ్రహా స్తద్వచ్ఛరీరిణామ్ ॥

తా. అద్దము మొదలగువానియందు ప్రతిబింబమును ప్రాణులయందు శీతోష్ణమును సూర్యకాంత మణులయందు సూర్యకిరణములును శరీరమున జీవుడును చేరు చందంబున ప్రాణులయొక్క శరీరమునందు గ్రహములుజేరి గనుపించకుండు.

## అపస్మార సామాన్య లక్షణము.

శ్లో॥ తమఃప్రవేశస్సంరంభో దోషోద్రేకాహతస్మృతిః ॥
అపస్మారఇతిజ్ఞేయో గదోఘోరశ్చతుర్విధః ॥

తా. చీకటి బ్రవేశించినటుల దోచుట వికారముగ నేత్రముల త్రిప్పుచు హస్తపాదముల విదలించుట దోష ప్రాబల్యమువలన జ్ఞానము నష్టంబగుట యీ లక్షణములుగలది భయంకరమైన అపస్మారమని తెలియవలయు. ఇది వాత పిత్త శ్లేష్మ సన్నిపాత భేదములవలన 4 విధంబులు.

## అపస్మార పూర్వ రూపములు.

శ్లో॥ హృత్కంపశూన్యతా స్వేదో ధ్యానంమూర్ఛాప్రమూఢ
తా । నిద్రానాశశ్చ తస్మిన్స్తు భవిష్యతి భవంత్యథ ॥

తా. హృదయమున కంపము గలుగుట యేమియు దోచకుండుట చెమట బట్టుట చింత మూర్ఛ యింద్రియ మోహము నిద్రాభంగము గలుగుట యివియు అపస్మారమునకు పూర్వరూపంబులు.

## వాతాపస్మార లక్షణము.

శ్లో॥ కంపతే ప్రదశేద్దంతా న్ఫేనోద్వామీశ్వసిత్యపి ।
పరుషారుణకృష్ణాని పశ్యేద్రూపాణి చానిలాత్ ॥

తా. వడకుట పండ్లుకొఱకుట నోటివలన నురుగు గారుట శ్వాసము గలుగుట మనుజులు కొఱిన్యము యెఱుపు నలుపువర్ణములు గలవారుగ గనుపించుట యీ లక్షణములుగలది వాతాపస్మారమని తెలియవలయు.

## పిత్తాపస్మార లక్షణము.

శ్లో॥ పీతఫేనాంగవక్త్రాక్షః పీతాసృగ్రూపదర్శనః ।
సతృష్ణోష్ణానలవ్యాప్త లోకదర్శీచపైత్తికః ॥

తా. నోటిలో పసుపుగ నురుగు గారుట శరీరము ముఖము నేత్రములు పసపు చాయగలవిగ నుండుట వస్తువులు పసపు యెఱుపువర్ణముగలవిగ గనుపించుట తృష్ణోష్ణయుక్తుండై యుండ నగ్నివలన జగత్తు వ్యాప్తంబై యుండునటులం గాంచుట యీ లక్షణములుగలది పిత్తాపస్మారమని తెలియవలయు.

## శ్లేష్మజాపస్మార లక్షణము.

శ్లో॥ శుక్లఫేనాంగవక్త్రాక్షః శీతో హృష్టాంగజోగురుః ।
పశ్యేచ్ఛుక్లాని రూపాణి ముచ్యతే శ్లేష్మికశ్చిరాత్ ॥

తా. నోటినురుగు శరీరము ముఖము కన్నులు తెల్లగనుండుట శరీరము చల్లగ నుండుట గగుర్పొడుచుట శరీరము జడముగనుండుట సర్వపదార్థములు తెల్లగ గనుపించుట (లేక తెల్లగనుండు పురుషుడు తనవద్దకి బరుగులిడుచు వచ్చునటులం గాంచుట) దీర్ఘకాలమునకు విడుచుట యీ లక్షణములుగలది శ్లేష్మజాపస్మారమని

తెలియవలయు. (శ్లేష్మజాపస్మారము దీర్ఘకాలముమీద విడుచుననుటవలన వాత పిత్తాపస్మారంబులు శీఘ్రముగ విడుచునని తెలియవలయు.)

## సన్నిపాతాపస్మార లక్షణము.

శ్లో॥ సర్వైరేతైస్సమస్తైశ్చ లింగైః జ్ఞేయస్త్రిదోషజః ।
అపస్మారస్సచాసాధ్యో యఃక్షీణస్యానవశ్చయః ॥

తా. పూర్వోక్తవాత పిత్తశ్లేష్మ లక్షణములంగలది త్రిదోషాపస్మారమని తెలియవలయు. ఇది యసాధ్యంబు. మఱియు క్షీణపురుషునికి జనించిన యపస్మారంబును జీర్ణంబైన యపస్మారంబును అసాధ్యంబులు.

## అసాధ్యాపస్మార లక్షణము.

శ్లో॥ ప్రతిస్ఫురంతంబహుశః క్షీణంప్రచలితభ్రువమ్ ।
నేత్రాభ్యాంచవికుర్వాణ మపస్మారోవినాశయేత్ ॥

తా. పలుమారు వణుకుట శరీరము కృశించియుండుట కనుబొమలు నెగర వేయుచు నేత్రములు వికారముగ త్రిప్పుట యీ లక్షణములుగలది యపస్మారరోగి యముని గాంచునని తెలియవలయు.

శ్లో॥ పక్షాద్వాద్వాదశాహాద్వా మాసాద్వాకుపితామలాః ।
అపస్మారాయ కుర్వంతి వేగం కించ దథోత్తరమ్ ॥

తా. దోషములు ప్రకోపించి 15 దినములకుగాని లేక 12 దినములకుగాని 1 మాసమునకుగాని అపస్మారమును గలుగంజేయు. (అందువాతాపస్మారము 12 దిన ములకుపిత్తాపస్మారము 15 దినములకుశ్లేష్మాపస్మారము 30 దినములకుజనించు "ద్వా దశాహానంతరంపక్ష" అనిచెప్పంబడియుండ దొలుతపక్షమును జెప్పుటవలన దీర్ఘ కాలమునకు దోషము వృద్ధిం జెందుచున్నదనియూహింపందగియున్నయది. "కించిద థోత్తరం" అనుపదమువలన దోషముతనతారతమ్యమువలన జెప్పంబడిన కాలమునకు ముందే వేగముగలదియగునని సూచింపంబడియె. ఐనను వేగమునుగలుగంజేసే యప స్మారముల కారంభమైయుండు దోషము సర్వకాలమునందు శరీరము నాశ్రయించి యుండ వేగమునుజేయక 12 దినముల కాలమునందు మాత్రవేగముచేయుటకుగార ణంబేద్దియని యూహింపందగియున్నయది. ఐనను "శ్లో॥ దేవేవర్షత్యపియథాభూమా జానికానిచిత్ । శరదిప్రతిరోహంతి తథావ్యాధి సముచ్ఛ్రియః॥" అనువచనప్రకా

రము విత్తనముపలన నంకురము జనించుటకు తేజస్సు వాయువు పృథివి వుదకము అనునవి సహాయంబులై యుండ మధ్యకాలమునజనింపక కాలవిశేషమువలనజనించు చందంబున దోషములును కాలానుగుణ్యముగ బ్రకోపమును జెందు. ఈ కారణంబులే చాతుర్థికాది జ్వరములయందును సంబంధించునని తెలియవలయు.)

## సామాన్య చికిత్స.

శ్లో॥ యచ్చోపదిశ్యతే కించ దపస్మారే చికిత్సితమ్ ।
ఉన్మాదే తచ్చకర్తవ్యం సామాన్యా ద్దోషదూష్యయోః ॥

తా. ఉన్మాదపస్మారములయందుదోషదూష్యములు సమానంబులుగనుండుట వలన నపస్మారమునకై జెప్పంబడిన సర్వచికిత్సల వున్మాదమునందును జేయందగు.

శ్లో॥ ఆశ్వాసయేత్సుహృద్వాక్యై ర్వా ప్రియాదిష్టవినాశనమ్ ।
దర్శయేదద్భుతంకర్మ తాడయేచ్చకశాదిభిః ॥

తా. ఉన్మాదముగలవాని నుత్తమమైన మాటవలన నూరడించవలయు. మఱియు వానికి ప్రియకరముగనుండువస్తువు నశించినదిగాని జెప్పవలయు లేక నద్భుత చేష్టల జూపించవలయు. కొరడాలు మొదలగువానిచే గొట్టవలయు.

శ్లో॥ కపిచ్ఛ్వథవాత ప్త లోహ తైలజలై స్స్పృశేత్ ।
వస్త్రాభిధానే కూపేవా సతతంచ నివేశయేత్ ।
పరస్పర ప్రతిద్వంద్వై రేభి రేవ శమంనయేత్ ।
జలాగ్నిద్రుమశైలేభ్యో విషమేభ్యశ్చ తంసదా ।
రక్షేదున్మాదినంచైవ సద్యః ప్రాణహరంహితత్ ॥

తా. ఉన్మాదముగలవానికి దురదగొండినిగానిలేక కాచిన యినుమును గాని నూనెనుగాని లేక నీళ్ళనుగాని తాకింపవలయు. లేక కాచిన లోహాదులను నోట లోపోయునటులనైనను భయముజూపవలయు. పైజెప్పబడిన పరస్పరవిరుద్ధకృత్యములవలన నున్మాదరోగిని స్వాధీనపఱచుకొనవలయు. మఱియు నీళ్ళు నిప్పు వృక్షములు పర్వతము విషమస్థలము అనునవి సద్యఃప్రాణహరంబులగుటచే వానివలన నున్మాదరోగిని సంరక్షింపవలయు.

## భూతభైరవ రసము.

శ్లో॥ రసస్సతాలస్సశిరస్సలోహ స్సాభ్రతోంజనంసార్క_మిదంహి

గంధమ్ । పిష్ట్వాజమూత్రేణసమంసమస్తాద్దేయోద్వౌ భాగౌథ బలిః పచేచ్చ । లోహేక్షణంహంతి ఘృతేనమాషోపస్మార మస్యోన్మదమానసత్వమ్ । పిబేదనుత్ర్యూషణహింగుయు క్తంసర్పిర్నృమూత్రేంరుచకేనసార్థమ్। భూతోన్మాదేషుసర్వే షురసోయంబూతభైరవః । స్వర్ణజైఃపంచభిర్బీజై ర్దేయస్సర్పి ర్విమిశ్రితః ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిచేసిన తాళకము శుద్ధిజేసిన మణిశిల లోహభస్మము సురమఖాయి తామ్రభస్మము శుద్ధిజేసిన గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి గొర్రెమూత్రముతో మర్దించి దీనికి రెండింతలు శుద్ధిజేసిన గంధకమును లోహపాత్రయందునిచి పైయౌషధములుగలిపి వండి 1 మాషమెత్తును నేతితోడ సేవించిన అపస్మారము వున్మాదము వీనిని హరింపంజేయును. దీని సేవనానంతరము త్రికటుకములు యింగువ అనువాని చూర్ణమును ఘృతాను పానముతోడగాని లేక సైంధవలవణమును నరమూత్రానుపానముతోడగాని లేక 5 వుమ్మెత్తవిత్తులను నేతియనుపానముతోడగాని సేవింపవలయును.

శ్లో॥ యేచస్యుర్భువిగుహ్యకాశ్చ ప్రమథాస్తేషాంసమారాధనమ్।
దేవబ్రాహ్మణపూజనంచ శమయే దున్మాద మాగంతుకమ్॥

తా. దేవయోని విశేషులగు గుహ్యులు ప్రమథగణములు యింద్రాదిదేవతలు బ్రాహ్మణులు వీర్లను పూజించుటచే ఆగంతుకోన్మాదము శమించు.

## అపస్మార గజాంకుశము.

శ్లో॥ హింగుసౌవర్చలంవ్యోషాణిగోమూత్రేణపృథగ్దినమ్ ।
చూర్ణితంనిష్కమాత్రంతుసూతరాజేనసంయుతమ్ ।
అజాజ్యేనతుదేయంస్యాత్సర్వోన్మాదవినాశనమ్ ।
గదితంసప్తరాత్రేణ హ్యాపస్మారగజాంకుశమ్ ॥

తా. యింగువ సౌవర్చలవణములు త్రికటుకములు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి గోమూత్రములో 1 దినము నానబెట్టి మరుదినము యెండించి చూర్ణముజేసి నిష్కప్రమాణము రసభస్మముగలిపి మేకనేతితో 7 దినములు సేవించిన సర్వోన్మాదములు అపస్మారము వినిని హరిపంజేయును.

## అపస్మారమునకు భూతభైరవ రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] మృతస్త్రితార్కలోహంచ తాళంగంధంమనశ్శిలామ్ । స్రోతోంజనంచతుల్యాంశం నరమూత్రేణమర్దయేత్ । తన్మోళద్విగుణంగంధం లోహపాత్రేక్షణంపచేత్ । పంచగుంజామితంఖాదే దపస్మారహరంధ్రువమ్ । హింగుసౌవర్చలంత్ర్యూషంనరమూత్రేణసర్పిషా । కర్షమాత్రంపిబేచ్చానురసోయంభూతభైరవః ॥

తా. రసభస్మము తామ్రభస్మము లోహభస్మము శుద్ధిజేసిన తాళకము శుద్ధిజేసిన గంధకము శుద్ధిజేసిన మణిశిల స్రోతోంజనము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నరమూత్రముతో మర్దించి ముద్దజేసి దానికి రెండింతలు శుద్ధిచేసిన గంధకమునుగలిపి యినుపగిన్నెలోనునిచి క్షణకాలమువండి 5 గురిగింజలయెత్తును నేతితోగాని లేక యింగువ సౌవర్చలవణము త్రికటుకములు అనువానిని నరమూత్రముతో నూరి కర్షమెత్తును నేతితోగాని సేవించిన అపస్మారము హరించు.

## అపస్మారమునకు ఇంద్రబ్రహ్మ వటికములు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] మృతంసూతాభ్రకంతీక్ష్ణ * మారంకాంస్యం మృతంసమమ్। పద్మకేసరసంయుక్తదినైకంమర్దయేద్ద్రవైః । † స్నుహ్యగ్నివిజయైరండ వచానిష్పావసూరణైః । నిర్గుండ్యాశ్చద్రవైర్మర్ద్యంతద్గోళంపాచయేత్పునః । కర్ణికాసర్షపోత్థేన తైలేనగంధసంయుతమ్ । యామంపక్త్వాసముద్ధృత్యచణమాత్రావటీకృతా । ఇంద్రబ్రహ్మవటీనామాభక్షయేదార్ద్రకద్రవైః । దశమూలకషాయంచకనాయుక్తంపిబేదను । అపస్మారంనిహంత్యాశుయథాసూర్యోదయస్తమః ॥

తా. రసభస్మము అభ్రకభస్మము లోహభస్మము యిత్తడిభస్మము కంచుభస్మము (లేక రజతభస్మము శుద్ధిచేసిన సువర్ణమాక్షికము శుద్ధిచేసిన వసనాభి పద్మకేసరములు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి బొంతజెముడుపాలు చిత్ర

---

* తారతాప్యపిషం. † స్నుహ్యగ్ని విజయైరండపథ్యా:—బొంతజెముడుపాలు చిత్రమూలము గంజాయి ఆముదపువేరు కరక్కాయ.

మూలము కరక్కాయ ఆముదపువేరు వస అనుపాను కంద వావిలి అనువాని రసము లతో ప్రతిదానిచే నొక్కొకదినము చొప్పున మర్దించి ముద్దజేసి దానిని మరల కుసుసునూనె ఆవనూనె గంధకతైలము అనువానితో 1 ఝామువండి దించుకొని సెనగగింజయెత్తును అల్లపురసముతోగాని లేక మారేడుగుమ్మడు దుండిలముతక్కలి కలిగొట్టు పిన్నపొన్న నక్కపొన్న పెద్దములక నేలములక పల్లేరుఅనువానిచెక్కల సమభాగములుగ దంచి కషాయముకాచి అందు పిప్పలి చూర్ణముగలిపి యా యను పానముతోడగాని సేవించిన "సూర్యుడుదయించుటచే నంధకారము దొలంగు భంగి" అపస్మారము శీఘ్రముగ నివర్తించు.

## అపస్మారములకు బ్రాహ్మీఘృతము.

శ్లో॥ [మాధవనిదానే] బ్రాహ్మీమ్ముండీ పచాకుష్ఠం సనీలోత్పల
పిప్పలీ । సైంధవంచసమంభావ్యం బ్రాహ్మీద్రావైస్త్రిసప్త
కమ్ । తస్మాచ్చతుర్గుణంచాజ్యం బ్రాహ్మీద్రావం ఘృతా
చ్చతుః । ఘృత శేషంపచేత్సర్వ మిదం బ్రాహ్మీఘృతంస్మృ
తమ్ । అపస్మారంహరత్యాశు సర్వరోగకులాంతకమ్ ॥

తా. బ్రహ్మదండి బోడతరము వస చెంగల్వకోష్టు నల్లకలువగడ్డ పిప్పలిసైంధవలవణము వీనిని సమభాగముగ చూర్ణముజేసి బ్రహ్మదండిరసముతో 21 మార్లు భావనచేసి ముద్దచేసి దానికి నాలుగింతలు నెయ్యి నేతికి నాలుగింతలు బ్రహ్మదండి రసముగలిపి ఘృతము శేషించునటుల గాచి సేవించిన అపస్మార (ఉన్మాదము) మొదలగు సర్వరోగముల శీఘ్రముగ హరింపంజేయు.

## బ్రాహ్మీ ఘృతము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] చతుష్షష్టిపలంబ్రాహ్మీ నిజద్రావంసమాహ
రేత్ । ద్వాత్రింశత్పలకంచాజ్యం త్రివృద్దంతీకటుత్రయమ్ ।
ఆరగ్వధంశంఖపుష్పం ప్రియంగుసవిళంగకమ్ । ప్రతికర్షంక్షిపే
చ్చూర్ణంపచేచ్చూర్ణేంద్ర ధేషుకే । పలమాత్రంపిబేన్నిత్యం
యావత్పలచతుష్టయమ్ ।భూతోన్మాద మపస్మారం బ్రాహ్మీ
ఘృతమిదంహరేత్ ॥

తా. మీదుగ చెక్కరసము 64 పలములు నెయ్యి 32 పలములు శుద్ధిచేసిన తెగడ నేలదంతి త్రికటుకములు రేలపట్ట కట్లవేరుపట్ట ప్రేంకణము వాయువిడంగ ములు వీనిని దినుసుకు కర్ష ప్రమాణము చొప్పున చూర్ణముచేసి నేతిలోగలిపి వండి 1 పలము మొదలు 4 పలములవఱకు రోగబలానుగుణ్యముగ ప్రతిదినము పానము జేయించిన భూతోన్మాదము అపస్మారము హరించు.

భూతోన్మాద చికిత్సా క్రమము

శ్లో॥ బుద్ధ్వాదోషంవయస్సాత్మ్యం దేశంకాలంబలాబలమ్ ।
చికిత్సతమితంకుర్యా దున్మాదే భూతదోషజే ॥

తా. భూతోన్మాదమున దోషము వయస్సు శరీరప్రకృతి దేశము కాలము బలము దౌర్బల్యము అనువానిని బుద్ధివలన బాగుగ నెఱింగి చికిత్సింపవలయును.

శ్లో॥ దేవర్షి పితృగంధర్వై రున్మత్తేషుచబుద్ధిమాన్ ।
త్యజేన్నస్యాంజనాదీని తీక్ష్ణాని కౄరకర్మచ ।
సర్పిః పానంసూర్యజప హోమమంత్రాదిరిష్యతే ॥

తా. దేవపితృ గంధర్వోన్మాదములయందు బుద్ధిమంతుడగువాడు నస్యము అంజనము మొదలగు తీక్ష్ణమైన క్రూరకర్మలవర్జించి ఘృతపానమువలన సూర్యజప హోమ మంత్రాదులవలన నుపచరింపవలయు.

శ్లో॥ పూజాబల్యుపహారశాంతివిష యోహోమేష్టిమంత్రక్రియా ।
దానంస్వస్త్యయనంవ్రతాది నియమస్సత్యజపో మంగళమ్ ।
ప్రాయశ్చిత్తవిధాన మంజలిరథో రత్నౌషధీ ధారణమ్ ।
భూతానామధిపస్య విష్టపపతే ర్గౌరీపతేరర్చనమ్ ॥

తా. పూజబలి కానుకశాంతి హోమము యాగములు మంత్రించడము దానము ఆశీర్వాదము వ్రతాది నియమములు జపము మంగళాచరణము ప్రాయశ్చిత్తము నమస్కారము రత్నములు ఔషధులు వీనిని ధరించుట భూతాధిపతియగు నీశ్వరుని పూజ వీనిచే భూతాదిగ్రహపీడను హరింపంజేయవలయు.

శ్లో॥ మాషైకంభక్షయే న్నిత్యం పిబేద్బ్రాహ్మీ ఘృతంహ్యను
సర్వభూత గ్రహాన్హంతి రసమానంద భైరవమ్ ॥

తా. మాషప్రమాణము ఆనందభైరవ రసమును బ్రాహ్మీఘృతానుపానము తోడ ప్రతిదినము సేవింపుచుండిన సర్వభూత గ్రహోన్మాదములు హరించు.

## హింగ్వాది ఘృతము

శ్లో॥ [బాహటే] హింగు సౌవర్చలం త్ర్యూషం పంచానాంపల పంచకమ్ । చతుష్షష్టిజలంచాజ్యం గవాంమూత్రంచతుర్గు ణమ్ । ఘృతశేషంపచేత్సర్వం తథాపానేప్రయోజయేత్ భూతోన్మాదమపస్మారం నాశయేద్బ్రహ్మరాక్షసమ్ ॥

తా. ఇంగువ సౌవర్చలవణము త్రికటుకములు వీనిని దినుసుకు 5 పలముల చొప్పున దంచి చూర్ణముజేసి నెయ్యి 64 పలములు నేతికి నాలుగింతలు గోమూత్ర ముగలిపి ఘృతమును శేషించునటుల కాచి సేవించిన భూతోన్మాదము అపస్మారము బ్రహ్మరక్షస్సు వీనిని హరింపంజేయు.

## భూతోన్మాదాపస్మారములకు విజయఘృతము.

శ్లో॥ [నిత్యనాధీయే] ఉగ్రగంధాపలం పంచపటోలం పర్పటం త థా । పిప్పలీశృంగబేరంచ పంచపంచపలంతథా । బ్రాహ్మీ రసశ్చప్రస్థార్థం ఘృతప్రస్థేవిపాచయేత్ । త్రిఫలాత్రికటూ శీరలసునం పంచకోలకమ్ । ఏతన్నిష్కంప్రయుంజీత యథా గ్నిబలమాత్రయా।భూతోన్మాదమపస్మారం వాతికంపైత్తికం జ్వరమ్।శ్లేష్మకం సాన్నిపాతంచ శీతకం విషమజ్వరమ్ । పాద మాత్రేణ నశ్యంతిప్రోచ్యతే విజయంఘృతమ్ ॥

తా. ఓమపుపొట్టు చేతిపొట్ల పర్పాటకము పిప్పళ్ళు అల్లము వీనిని దినుసుకు 5 పలములచొప్పున చూర్ణముచేసి అందు మోనుగచెక్క రసము ½ ప్రస్థము నెయ్యి ప్రస్థము త్రిఫలములు త్రికటుకములు వట్టివేరు వెల్లుల్లిపాయలు పంచకోలములుఅను వాని చూర్ణమును దినుసుకొకొక్క నిష్కము చొప్పున గలిపి ఘృతపక్వముగకాచి అగ్ని బలానుగుణ్యముగ సేవించిన భూతోన్మాదము అపస్మారము వాతపైత్తశ్లేష్మ సన్నిపాత శీత విషమజ్వరములు హరించు.

## గంధక పిష్టి.

శ్లో॥ గంధకంపలమాదాయ తులసీరసమర్దితమ్ । త్రిదినంగోజలే పాచ్యం డోలాయంత్రేప్రయోజయేత్ । తత్సమంపారదం దత్వాచార్ద్రికేణదినత్రయమ్ । అష్టమాంశేన నేపాళం తత్రవిన్యస్యవారిభిః । ఆర్ద్రికస్య త్ర్యహంమర్ద్యాం భవేద్గంధకపిష్టకమ్ । తత్పిష్టకం ప్రయుంజీత చతుర్వల్లప్రమాణకమ్ । సప్తవారప్రయోగేణ సోన్మాదతిమిరంజయేత్ । వాతశ్లేష్మాంతరాన్ రోగాన్ హన్యాదత్రనసంశయః ॥

తా. 1 పలము శుద్ధిచేసిన గంధకమును ఖల్వములోనునిచి తులసియాకు రసములో 3 దినములు మర్దించి ముద్దచేసి యెండించి 2 మడతలుగబట్టలలో మూటగట్టి గోమూత్రములో డోలాయంత్రమున వండి పైగంధకమునకు సమముగ శుద్ధిచేసినరసమునుచేర్చి ఖల్వములోనునిచి అల్లపురసములో 3 దినములు మర్దించి యెండించి ఔషధమునకు 8-వ భాగము శుద్ధిచేసిన నేపాళములగలిపిఅల్లపురసములో 3 దినములు మర్దించి కరాటములోనునిచి పూటకు 4 వల్లములయెత్తును బోడతరము బ్రహ్మదండి అనుపాని రసానుపానములోడ 7 దినములు సేవించిన తిమిరములో గూడియుండు యున్మాదములు వాతశ్లేష్మమువలన జనించిన రోగములు నిస్సంశయముగ హరించు. (మఱియు బ్రాహ్మీఘృతానుపానములోడగాని లేక పంచగవ్య ఘృతాను పానములోడగాని లేక విజయ ఘృతానుపానము లోడగాని లేక కల్యాణ ఘృతానుపానములోడగాని లేక దశమూల కషాయానుపానము లోడగాని లేక అల్లపు రసానుపానములోడగాని లేక పిప్పలితోడగాని సేవించిన సర్వోన్మాదములు హరించు. దీనియందు శీతకరద్రవ్యములు బఱ్ఱెనెయ్యి బఱ్ఱెపాలు బోడతరపుకూర అనుపానిని సేవించుట కడు ప్రశస్తంబు.)

## అపస్మారోన్మాదములకు విజయగుళికలు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] సూతంచ గంధకం లోహం విషం చిత్రకపత్రకమ్ । విడంగం రేణుకా ముస్తాచెలా గ్రంథిక కేసరమ్ । కటుత్రయంచ త్రిఫలా నేపాళం శుల్బభస్మకమ్ । ఏతాని సమభాగాని గుడద్విగుణ సంయుతమ్ । సర్వంతద్ఘుటికాం కృత్వా చణకానాం ప్రమాణతః । ఏకైకాం

భక్షయే న్నిత్యా తాసాం మధ్యే విచక్షణః । కాసేశ్వాసే క్షయేగుల్మే ప్రమేహే విషమజ్వరే । తృష్ణాయాం గ్రహణీ రోగే శూలపాండ్వా మయేషుచ । మూత్రకృచ్ఛ్రే మూఢవాతే గర్భరోగేచ దారుణే । క్రిమిరోగేచ మందాగ్నౌ పీనసేహృద్యుదరేషుచ । అర్శస్సుచాతిసారేషు కుక్షిరోగేగళ గ్రహే కంఠమాగదే హ్యద్రుజాయాం హిక్కాయామూర్ధ్వ వాతకే। అపస్మారేతథోన్మాదేరక్తవృద్ధౌచదారుణే। సర్వాంగేషుచకుష్ఠేషు నిఖిలాస్వశ్మరీషుచ । లూతాయామన్నిపాతేషుసర్పదష్టేచవృశ్చికే । హస్తపాదాదిరోగేషు సర్వేషు ఘుటికాహితా । జయాఖ్యాభక్షితాయేయం బ్రహ్మణాచోదితేశ్వరే ॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన గంధకము లోహభస్మము శుద్ధిచేసిన నాభి చిత్రమూలము ఆకుపత్రిక వాయువిడంగములు రేణుకలు తుంగముస్తెలు యేలకులు గ్రంధితగరము నాగకేసరములు త్రికటుకములు త్రిఫలములు శుద్ధిచేసిన నేపాళములు తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి చూర్ణముచేసి దీనికి రెండింతలు బెల్లముగలిపి 4 ఝామలు మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుచేసి ప్రతి దినమునందొక్కొకమాత్రను సేవించిన కాసము శ్వాసము క్షయము గుల్మము ప్రమేహము విషజ్వరము దప్పి గ్రహణి శూల పాండువు మూత్రకృచ్ఛ్రము మూఢవాతము భయంకరమైన గర్భరోగము క్రిమిరోగము మందాగ్ని పీనసము వుదరములు ఆర్శస్సు అతిసారము కుక్షిరోగము గళగ్రహము దురద రొమ్మునొప్పి యెక్కిళ్ళు ఊర్ధ్వవాతము అపస్మారము వున్మాదము దారుణమైన రక్తవృద్ధిరోగము సర్వాంగకుష్ఠము సర్వాశ్మరులు లూతసన్నిపాతము సర్పవృశ్చిక దుష్టవిషములు హస్తపాదాగులయందలి రోగము మొదలగువాని నన్నియు హరింపంజేయునని యీశ్వరునికి బ్రహ్మవచించె.

## అపస్మారోన్మాదములకు ప్రసిద్ధమైన నస్యములు.

శ్లో॥ [పూజ్యపాదీయే] పిష్ట్వాహ్యాసామార్గఫలానినస్యం గోవారిణాబుద్ధివిబోధనాయ । ఏవంకుసుంభస్వరసేనయుక్తంతమిస్రబృందంశమనేచ్ఛశీఘ్రమ్ ॥

తా. ఉత్తరేణువిత్తులను గోమూత్రముతోగాని లేక కుసుంబాపువ్వుల స్వరసముతోగాని నస్యము జేయించిన అపస్మారము వుస్మాదము శీఘ్రముగ హరించు.

శ్లో॥ [పూజ్యపాదీయే] త్రికటుంచిత్రకంచైవ లాంగలీంచేంద్రవా
రుణీమ్ । వచామధుకబీజానితథాపాఠానదీఫలమ్ । తాళకం
వత్సనాభంచాప్యంకోలక్షారయుగ్మకమ్ । ఏవంపంచదశ
ప్రోక్తాన్సమభాగాంశ్చ కారయేత్ । సూక్ష్మచూర్ణీకృతంచై
వనిర్గుండీతింత్రిణీరసైః । ఆర్ద్రకస్వరసైర్యుక్తంత్రివిధైశ్చవిచ
క్షణః । ఏవంనస్యంప్రదాతవ్యమర్కమూలరసేనచ । అపస్మా
రంచహృద్రోగంవాతసంకులమేవచ । ధనుర్వాతంగ్రహంచై
వాప్యుస్మాదంసన్నిపాతజిత్ । పూజ్యపాదకృతోయోగః స
రాణాంహితకారణాత్ ॥

తా. త్రికటుకములు చిత్రమూలము చన్నచర్లగడ్డ పాపరవేరు వస యిప్పగింజలు చిరుబొద్దివేరు సముద్రపాడవిత్తులు శుద్ధిచేసిన తాళకము శుద్ధిచేసిన నాభి పూడుంగోవలు సర్జక్షారము యవక్షారము యీ పదియైదుదినుసుల సమభాగములుగ చూర్ణముచేసి ఖల్వములోనునిచి వావిలియాకురసము చింతాకురసము అల్లపురసము అనువానితోగాని లేతజిల్లేడు వేళ్లరసముతోగాని మర్దించి తల్లు వేలునటుల వెలికల మంచముపై పరుండబెట్టి 4 దినములు నస్యము చేయించిన అపస్మారము ఱొమ్మునొప్పి వాతరోగము ధనుర్వాతము గ్రహదోషము వుస్మాదము సన్నిపాతములు (కొకిపోమాలు కుందేటితెగులు) మొదలగురోగముల హరింపజేయునని పూజ్యపాదమహాముని మానవహితార్థమై వచించె. (మఱియు యీనస్యముల చేయించుచు లోపలికి నౌషధసేవం చేయించుచుండిన అపస్మారములు వున్మాదములు హరించు)

ఉ॥ తెల్లమి నాలనేతను ధృతిందలవంటి జలంబు వోసియుం ।
జిల్లేడు నున్నచీల్కల విశీర్ణములం దొలగించి యందులో ।
వెల్లజముంచి వేచియును వేగి చూర్ణరసాన గల్పియున్ ।
సల్లలితంబు నస్యములు సల్పిన మానును దత్తురంబులున్ ॥

తా. (ఆదిత్యవారముతోగూడియుండు అమావాస్యనాడుగాని) లేక ఆదిత్యవారమునాడుగాని జిల్లేడు మిడతలదెచ్చి వానితలదీసి వానిగర్భములో మిరియముల

నిచి యెండించి చూర్ణముచేసి 2 సెనగ గింజలెత్తును ఖల్వములోనునిచి తెల్లపురస ముతో బాగుగనూరి యందు 3 నూనెబొట్లుగలిపి 4 మారులునస్యము జేయించుటయే గాక పూర్వోక్తౌషధములలో దేనియొక్క సేవననేనిచేయించిన అపస్మారమునున్మా దము హరించు. మఱియు పూర్వోక్త చతుర్విధ నస్యములు అపస్మారోన్మాదముల హరింపంచేయుటయందు ప్రసిద్ధంబులగుటచే వానిలో ప్రతిదానిచే 4 మారులు నస్య ముచేయించిన అపస్మారోన్మాదములు హరించు.

క॥ నింబఫల ఖండములలో । పంచిన చూర్ణంబు నల్లప్రత్తాకు
రసం । బుంబోసి మఱియు నొకమా । సంబుగ భుజియింప
మాను జాదసములు వే ॥

క॥ ఇల జీలకఱ్ఱ సొంటియుఁ ॥ దుల్యములను సమంబుగూర్చి
తుది జంబఫలం । బుల పులుసుగలిపి త్రాగినఁ ॥ దలకుచుఁ
జనిపోపుమేటి దత్తూరంబుల్ ॥

క॥ వెసనిమ్మకాయపిచెక్కలి । రసమును మిరియంబుగూర్చి
రమణనుగ్రోలగ । వసుధను న్మాదంబుల । పసచెడి భువి
మానిపోపుఁ బ్రజలకు నెల్లన్ ॥

క॥ తెల్లగలిజేరు వేరును । మొల్లంబుగ బ్రహ్మదండి మూడగు
కాయ । ల్లల్లపు రసమున నస్యము । సల్లలితముఁ జేయ
మానుఁ జాందసములు వే ॥

## అపస్మారములకు విజయపర్పటి రసము.

శ్లో॥ సూతగంధకతామ్రాణిసమభాగానికారయేత్ । శూతపాదే
నదాతవ్యం వత్సనాభం భిషగ్వరః । కృత్వా కజ్జలికాంతా
రంసూతతులం వినిక్షిపేత్ । గంధకం మర్దయిత్వాశ్చాత్కజ్జలీ
జాయతేతథా । ఘృతాభ్యక్తేతుతచ్చూర్ణం పచేదాయసభా
జనే । యేపం ద్రవత్వమాయాతి తతోమోచ దళేక్షిపేత్ ।
పచనేనోపదేశేన కర్తవ్యఃపర్పటీరసః । రోగశాంత్యైప్రయో
క్తవ్యో హ్యష్టగుంజాప్రమాణతః । ధత్తూర బీజసంయోగా
న్మహోన్మాదవిశోధకః । అపస్మారంనిహంత్యాశు వ్యోష

నింబ దళైస్సహ । పర్పటీ రసగుంజాష్టౌ బ్రాహ్మీఘృతసహ
న్వితమ్ । ఖాదయేద్రోగిణాంపై ద్యోహ్యపస్మారాపనుత్తయే

తా. శుద్ధిచేసినరసము శుద్ధిచేసిన గంధకము తామ్రభస్మము యివి సమభా
ములు శుద్ధిచేసిన వసనాభి రసమునకు 4 వ భాగము రజితభస్మము రసమునకు
భాగము యిటుల వీనిసెల్ల ఖల్వములోనునిచి కొటుకవలె మర్దించి పిదప దీనికి
సుగ శుద్ధిచేసిన గంధకమునుగలిపి మరల కొటుకవలెమర్దించి యినుపపాత్రలోక్షి
నొకింత నెయ్యిగలిపి వండిన యది ద్రవించు. దాని నరటాకులోనునిచి అప్పడ
వలె నిప్పలోగాని చూర్ణముచేసి 8 గురిగింజలయెత్తునువుమ్మెత్తవిత్తులు చూర్ణాను
నముతోడ సేవించిన గొప్పయున్మాదమును హరింపంజేయు. మఱియు త్రికట
ములు వేపయిగుళ్ళు అనువాని యనుపానముతోడ సేవించిన అపస్మారమును శీ
ముగ హరింపంజేయు మఱియు 8 గురిగింజలయెత్తుపర్పటీరసమును బ్రాహ్మీఘృ
నుపానముతోడ సేవించిన అపస్మారము హరించు.

శ్లో॥ బ్రాహ్మీశుంఠీ వచాకుష్ఠం నీలోత్పలక సైంధవమ్ ।
పిప్పలీ మపిసంచూర్ణ్య బ్రాహ్మీ ద్రావేణభావయేత్ ।
సప్తధా సవని తేన సంక్షిప్య విపచేద్ఘృతమ్ ।
నస్యే దున్మాదశాంత్యర్థ మపస్మారంచ నాశయేత్ ॥

తా. బ్రహ్మదండి శొంఠి వస చెంగల్వకోష్టు నల్లకలువ సైంధవలవణమ
పిప్పళ్ళు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి బ్రాహ్మీరసముతో 7 మార్లు భావ
చేసి వెన్నలోగలిపి ఘృతముగకాచి నస్యము చేయించిన వున్మాదము అపస్మారము
హరించు.

శ్లో॥ వరాహ కర్ణర క్తేన కర్కోట్యా నస్యమాచరేత్ ।
అథవా నరమూత్రేణ హ్యున్మత్త స్యాపినస్యతః ॥

తా. పందిచెవి రక్తముతో గొడ్డుకాకర గడ్డనునూరి నస్యము చేయించిన
అపస్మారము వున్మాదముహరించు. ఉమ్మెత్తవిత్తులను నరమూత్రముతోనూరినస్యము
చేయించిన వున్మాదము అపస్మారము హరించు.

శ్వేతాపరాజితాది నస్యము.

శ్లో॥ శ్వేతాపరాజితామూలం విజయా మూలమేవచ ।
నరమూత్రేణ సంపిష్య నస్యంవాతను దమ్భుతమ్ ॥

తా. తెల్లగంటెనవేరు కరకవేరు వీనిని నరమూత్రముతో నూరి నస్యము చేయిం చిన వాతాపస్మారము హరించు.

శ్లో॥ ఉన్మత్తకాసనాస్థీని ఘృష్ట్వా తేనేనవాకుచీమ్। శ్వేతాపరాజి తామూలం కర్ణేధార్యంసదాబుధైః । నిర్గుండీదండకంఛిత్వా హ్యపస్మారోవిముచ్యతే। పర్పటీరసగుంజాష్టౌ ధుత్తూరంబీజ పంచకమ్ । గోఘృతేనచసంయోజ్య ఖాదయేన్మాదనోదనే। సఘృతంమాషమన్నంచపాయసంఘృతముగ్ధకమ్ । నింబతైలం సమాదాయలింపేదాపాదమస్తకం । గుర్వన్నంపాయసంద ద్యాచ్ఛుష్కంశాకంచవర్జయేత్ । యద్వాసంరక్షయేత్తం చయావచ్ఛాంతింనగచ్ఛతి । మహేశ్వరాఖ్య ధూపంచ ధూపయేత్తత్సతతంనిశి ॥

తా. ఉమ్మెత్తవిత్తులు వేగిసవిత్తులు భావంచివిత్తులు తెల్లగంటెనవేరు వావిలి కొడలు వీనిలో దేనినైననునూరి చెవిలో నునిచికొనిన అపస్మారము హరించు మఱి యు 8 గురిగింజలయెత్తు పర్పటీరసమును 5 వుమ్మెత్తవిత్తుల చూర్ణమును ఆవునేతి లోగలిపి యీ యనుపానముతోడగాని లేక నేతితోగూడియుండు మినపకట్టు యొక్క యనుపానముతోడగాని నెయ్యి పాలు అనువాని యనుపానముతోడగాని సేవించిన వున్మాదము హరించు, మఱియు నున్మాదరోగికి పాదము మొదలు శిరము వరకు వేపనూనెను లేపము జేయుటయేగాక జడాన్నమును పాయసము నొసంగ వలయు. ఎండిన కూరల నొసంగరాదు. మఱియు నున్మాదము శమించువఱకు వున్మాదరోగిని కడుజాగరూకతతో గాపాడవలయు. రాత్రులయందును మహేశ్వ రధూపము నొసంగవలయు.

## మాహేశ్వర ధూపము.

శ్లో॥ శ్రీవేష్టదారు బాహ్లీకం ముస్తాకటుకకంనిశా । సర్షపా నింబ పత్రాణి చందనంత్రిఫలావచా । బృహతీసర్పనిర్మోక కార్పా సాస్థియవాతుషం । గోశృంగం బస్తరోమాణి బర్హిసింహం బిడాలవిట్ । ఛాగగోమమృతంచేతి బస్తమూత్రేణభావితం । ఏష మాహేశ్వరోధూప స్సర్వ గ్రహనివారకః ॥

తా. సర్జరసము దేవదారు యింగువ తుంగముస్తెలు కటుకరోహిణి పసపు ఆవాలు వేపాకు చందనము త్రిఫలములు వస నేలములక పాముకూసము ప్రత్తి విత్తులు యవలపొట్టు ఆవుకొమ్ము గొఱ్ఱెవెంట్రుకలు నెమలియీకెలు పిల్లివిష్ఠము మేక వెంట్రుకలు నెయ్యి వీనిని నేకముచేసి గోమూత్రముతో భావనచేసి ధూపము వేసిన సర్వగ్రహములు నివర్తించు.

భూతోన్మాదములకు మంత్రము.

జోరీజోరీ బ్రహ్మానుజోరీ ఫుపరే విఖుపణిరేపుఖు ।
జాయిచేవిఖు । ఉత్తరేనునఖాశే ।' తుజేశిద్ధు ।
దేవాగురువాచి । శిద్ధు । ఓంగురుప్రసాదం ॥

తా. అను నీ మంత్రముతో నిమ్మకాయల మంత్రించి తినిపించవలయు. మఱియు నీ మంత్రముతో వేడినీళ్ళను చన్నీళ్ళను మంత్రించి పోయవలయు.

శ్లో॥ ఇంద్రవారుణికా మూల మారనాళేన పేషితం ।
అపస్మార హరంనస్యం భూతప్రేతస్య కింపునః ॥

తా. పాపరవేరును కలితోనూరి నస్యముచేయించిన అపస్మారము (ఉన్మాదము) భూతప్రేతములు నివర్తించు. మఱియు యీ నస్యములను 6 మార్లు చేయించవలయు, అపస్మారోన్మాదరోగ సాధ్యాసాధ్యంబుల నెఱింగి సాధ్యంబులగువానికే చికిత్సింపవలయు. పూర్వోక్త ఔషధములు కష్టసాధ్యములగు యపస్మారోన్మాదముల సగాహరింపంజేయు. మఱియు నపస్మారోన్మాద నివారణార్థంబై పంచగవ్య ఘృతమును కల్యాణఘృతమును సేవింపందగు.

అపస్మారోన్మాదములయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] పత్తూరశాలిగోధూమాను ముద్గయూషమ్పృతాదయః। ధాత్రీపటోల కూశ్మాండ తండులీయక వాస్తుకం। కపిత్థం దాడీమంద్రాక్షా లఘుపిత్త హరాణిచ । ఉన్మాదే చిత్తవిభ్రంశే హ్యపస్మారే హితంవిదుః ॥

తా. పొన్నగంటికూర లేక నెమలిజుట్టాకు రాజనపుబియ్యము గోధుమలు పెసరకట్టు నెయ్యి మొదలగునవి వుసిరికకాయ పొట్లకాయ గుమ్మడికాయ తోటకూర చక్రవర్తిపుకూర వెలగపండు దాడింబపండు ద్రాక్షపండు లఘుకరద్రవ్య

ఘులు పిత్తహర ద్రవ్యములు యివి వున్మాదము చిత్తవిభ్రమ అపస్మారము అనువాని యందు పథ్యకరంబులు.

## అపస్మారోన్మాదములయం దపథ్యము.

శ్లో॥ మద్యం విరుద్ధాశనముష్ణభోజనం నిద్రాక్షుధాతృ ట్క్షుతవేగ ధారణమ్ ॥ తిక్తానితీక్ష్ణాని భిషక్సమాదిశే దున్మాదరోగోప హతోహితంగర్హితమ్ ॥

తా. మద్యము విరుద్ధాన్నము వుష్ణకర భోజనము వీనిని సేవించుట నిద్ర ఆకలిదప్పి తుమ్ములు మలమూత్రవేగము వీనినడ్డగించుట చేదు తీక్ష్ణముగల ద్రవ్యముల సేవించుట యివి యపస్మారోన్మాదములయం దపథ్యకరంబులు.

## మరణ సూచకములు.

క॥ [కాశీకండే] ఆయురవసానకాలం ॥ బేయనువునఁ దెలియ వచ్చునెఱఁగింపునుగాం । గేయయరిష్టాగ్గమనము । లేయప శకునములుసూచి యెఱుఁగంగఁదగున్ ॥

వ॥ అనినఁ గుమారుం డతని కిట్లనియె.

గీ॥ వామనాసాపుటమున నెవ్వాని కేని । గాలియుచ్ఛ్వాసనిశ్వా సగతిఁజరించుఁ । బింగళానాడినడువదు పెద్దయేని । వాడు మూఁడబ్దములకు నిర్యాణమొందు ॥

గీ॥ ఒండెమూఁడహోరాత్రంబు లొండెనేని । రెండహోరాత్ర ములుసంచరించు హేళి ॥ నరుని కెవ్వని కొక్కవత్సరముగాని । బ్రదుకఁడంద్రు సుధర్మిణీప్రాణనాథ ।

క॥ నాసాపుటయుగమున ని । శ్వాసోచ్ఛ్వాసానిలములుసరి యైనడచున్ । వాసరము లెవ్వనికిఁబది । మాసత్రితయమున వాఁడు మరణముఁబొందున్ ॥

క॥ ప్రాణానిలమెవ్వనికిని । ఘూర్ణపుటియుగ్మకమునఁబ్రవహింప కనం ॥ క్షీణమయి నోరవెడలునో । బ్రాణముతఁడుదొఱఁగు వాసరత్రితయమునన్ ॥

గీ॥ అదరిపాటెవ్వఁ డీక్షించు నాకసమున । హాటకపుఁగృష్ణపింగళుఁడైన పురుషుఁ । డాతనికి నవత్సరత్రయంబవధిసూపెఁ । బ్రాణాధారణమునకిల్వలాసురారి ॥

ఉ॥ తమ్మునునింద్రియంబునిజతోయమలంబులు నొండె నొండె మూ । త్రమ్ము మలమ్ము మమ్ము బలదార్ఢ్యము చాలకయెవ్వఁ డేనినా । క్కమ్ముడినుత్సృజించు నతఁడుండఁడు ప్రాణముతోడఁగూడియే । కమ్మగువత్సరమ్ము గడఁగాచిన పిమ్మట వాసరార్ధమున్ ॥

ఉ॥ కానఁడరుంధతిన్ ధ్రువునిఁగానఁడు విష్ణుపదత్రయంబును । గానఁడు మాతృమండలము గానఁడు గన్నులుగల్గియేనియే । మానవుఁడమ్మనుష్యునకు మాసములాఱు విరామమొందఁగాఁ । గానఁగవచ్చుఁ గుంభభవకాలుని బంధురసౌరవీధికల్ ॥

గీ॥ దృఢవివేకయరుంధతీ దేవిజిహ్వ । నాసికాగ్రంబు ధ్రువుఁడిల్వలాసురారి । విష్ణుపదమది భ్రూమధ్యవీధియనఘ । మాతృమండలమక్షి పద్మమునీంద్ర॥

సీ॥ అసితాదివర్ణంబు నాస్వాదిరసమును । నన్యథాభావంబునందెనేని । దంతోష్ఠకంధరాతాలుజిహ్వాగ్రంబు । లొండొకవర్ణంబునొందెనేని । కర్ణేంద్రియంబులు గనుసోయి కొలుకులు । ధూమధూమ్రత్వంబు దొరసెనేని । నాఖండలీయకంబను ధనుఃఖండంబు । నభముపై రేయిఁగన్పట్టెనేని । నాఱుమాసములకు మర్త్యుఁడస్తమించు । వడిగనే తెంచి యూసరవల్లి తొండ । పాదములనుండి తలదాఁకఁ బ్రాకెనేని । నతఁడు షాణ్మాసములఁ జూచు యముని మొగము ॥

గీ॥ జలకమాడినపిమ్మటఁ జరణములను । హృదయమున నీళ్ళు వేగంబయి గురఁబారు । దర్పణమునీడ దోఁచునాతామ్రకాంతి । నెవ్వనికి వాఁడు నాఱ్నెల్ల నేగుదవికి ।

వ. మఱియు ఛాయాప్రకంపంబు మతిభ్రంశంబు చంద్రద్వయ సూర్యద్వయదర్శనంబు పగలుతారకావీక్షణంబు రాత్రిదారకానభివీక్షణంబు గంధర్వనగరావలోకనంబు పిశాచనృత్తవీక్షణంబు శ్రవణధ్వనిహాని స్వప్నంబునందుఁ బిశాచఖరవాయస భూతప్రేత శునక గృధ్రగోమాయుబాధపాశురాశి యూపదండ వల్మీకారోహణంబు తైలాభ్యంగనముండనంబులు మరణసూచకంబులు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణ
నిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ
నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన
శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయ
ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
ఉన్మాదాపస్మారరోగ నిదాన తత్సాధ్యా
సాధ్య తచ్చికిత్సానుపాన పథ్యాపథ్య
లక్షణయుక్తం వింశ ప్రకరణమ్.



శ్రీ ర స్తు.

# బసవరాజీయము.

## ఆంధ్ర తాత్పర్యము.

### — ఏకవింశ ప్రకరణము. —

శ్లో॥ భూధరం మేరుకోదండం వేదాశ్వంపురనాశకమ్ ।
సర్వలోకపతింశంభుం లింగమూర్తిమహంభజే ॥

తా. భూమే రథముగాగలవాడు మేరుపర్వతమే ధనుస్సుగాగలవాడు వేదములే యాశ్వములుగాగలవాడు త్రిపురసంహారకుడు సర్వలోకమునకు ప్రభువు లింగస్వరూపుడు నగు యీశ్వరుని నేనుభజించెద.

శ్లో॥ శ్రీనీలకంఠ వంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహంవైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజని పేరొకానంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథముయొక్క ఏకవింశ ప్రకరణమును వచింపుచున్నాడను.

### భగందరోత్పత్తి.

శ్లో॥ [నిత్యనాథీయే] క్షుదార్తస్తునభుంజీత తృష్ణార్తో నపిబేజ్జలమ్।
తృష్ణార్తో జాయతే గుల్మీ క్షుదార్తస్తు భగందరీ ॥

తా. ఆకలిగలిగినపుడు భుజింప కుండుటవలన భగందరరోగంబును దప్పి గలిగినపుడుదకమును పానము సేయకుండుటవలన గుల్మరోగంబు జనించు.

### భగందర స్వరూపము.

శ్లో॥ [మాధవనిదానే] గుదస్యద్వ్యంగులేదేశే పార్శ్వతఃపిటికా ర్తికృత్ । భిన్నేభగందరోజ్ఞేయ స్సచపంచవిధోమతః ॥

తా. గుదమునకుప్రక్కన రెండంగుళముల ప్రదేశమున 1 కురుపుజనించి స్ఫుటముగ పోట్లతోకూడి పగిలిన భగందరమనంబడు. ఇది 5 విధంబులు.

## భగందర పూర్వరూపములు.

శ్లో॥ కటీకపాలనిస్తోద దాహకండూ రుజాదయః ।
భవంతి పూర్వరూపాణి భవిష్యతిభగందరే ॥

తా. నడుము తలపుర్రె వీనియందు పోట్లుగలుగుట మంట దురద మొదలగు ప్రద్రవములుగలుగుట యీలక్షణములవలన భగందరముజనించునని తెలియవలయు.

## భగందర భేదములు.

శ్లో॥ [ఆయుర్వేదే] వాతాద్భిన్నా రుజోవర్ణః పిత్తాద్రక్తో భగం
దరః । కఫాచ్ఛ్వేతో ఘనస్రావః కండూకఠినతాయుతః । శం
బూకావర్తవన్నాడీ పిటికా గోస్తనాకృతిః । బహువక్త
స్స్రివేద్గాఢః, క్రిమియుక్తస్త్రిదోషజః । ఔదాసీన్యాద్వ్య
థాప్యక్వం రేతోమూత్రపురీషకమ్ । వసావత్స్రివతేపక్వం
కష్టసాధ్యో భగందరః । త్రిదోషోత్థో వ్యసాధ్యశ్చ క్షతజశ్చ
విశేషతః । అథ సర్వప్రయత్నేన పాకః కార్యో భగందరే ॥

తా. పగిలియెఱ్ఱగ నుండిన వాతభగందరమనియు రక్తవర్ణముగనుండినపిత్త
గందరమనియు తెలుపు కడుస్రావము దురదగలదై కఠినంబుగనుండిన శ్లేష్మభగం
రమనియు నాడిన త్తగుల్లవలె జుట్టుకొని గోస్తనాకారమై పిటికలతోవ్యాప్తంబై
యుండిన శంబూకావర్త భగందరమనియు పెక్కురంధ్రములతోగూడి నిక్కుట
ుగ పులినీరునుగార్చుచు క్రిమియుక్తంబై యుండిన త్రిదోష భగందరమనియు తెలి
యవలయు. భగందరమును చికిత్సింపక నుపేక్షించుటచే పండి రేతో మూత్రపురీష
ుతి వసవలె స్రవింపంజేయు. ఇటులపండిన భగందరము కష్టసాధ్యము. త్రిదోషజ
గందర మసాధ్యము. క్షతజభగందరము కడునసాధ్యము. ఐనను భగందరములను
ర్వప్రయత్నములచే పండునటులం జేయవలయు.

## శతపోనక భగందర లక్షణము.

శ్లో॥ కషాయరూక్షై రతికోపితోనిలస్త్వపానదేశే పిటికాం కరో

తియామ్ । ఉపేక్షణాత్పాక ముపైతిదారుణం రుజాచభిన్నా రుణఫేనవాహినీ । తత్రాగమో మూత్ర పురీష రేతసాం వ్రణైరనేకైః శ్శతపోనకం వదేత్ ॥

తా. ఒగరు రూక్షగల పదార్థ సేవనవలన మిక్కుటముగ వాతము ప్రకోపించి గుదస్థానమున కురుపును గలుగఁజేయు. అది యుపేక్షింపబడుటవలన భయంకరమైన పాకముగలదై పగిలి పోటులోఁగూడి యెఱ్ఱనై నురుగులోఁగూడినచీమును స్రవింపఁజేయుచు ననేకవ్రణములుగలదై వానిఛిద్రములవలన మూత్రమలశుక్లముల స్రవింపఁజేయుచుండిన శతపోనక మనంబడు. జల్లెడవంటి ఛిద్రములు గలదియగుటంజేసి శతపోనకమని జెప్పంబడు.

## ఉష్ట్రశిరోధర భగందర లక్షణము.

శ్లో॥ ప్రకోపనైః పిత్త మతిప్రకోపితం కరోతిరక్తాం పిటికాం గుదాశ్రితామ్ । తదాశుపాకాహి మపూయవాహినీం భగందరం తూష్ట్రశిరోధరంవదేత్ ॥

తా. పిత్తకర పదార్థ సేవనవలన పిత్తంబంధకముగ ప్రకోపించి గుదస్థానమున వొంటె మెడతో సమానమైన యెఱ్ఱనికురుపును గలుగఁజేయు అదితీవ్రముగ పండి వేడిగ చీమును స్రవింపఁజేయు. ఇదియ ఉష్ట్రశిరోధర భగందర మనంబడు.

## పరిస్రావీ భగందర లక్షణము.

శ్లో॥ కండూయనో ఘనస్రావీ. కఠినో మంద వేదనః ।
శ్వేతావభాసః కఫజః పరిస్రావీ భగందరః ॥

తా. కఫజభగందరమున దురదగలుగుటవలనగట్టిగ చీము స్రవించుటకురుపు కఠినముగనుండుట వోకింతపోటుగలుగుట తెల్లగనుండుట యీ లక్షణములుగలది పరిస్రావీభగందరమని తెలియవలయు.

## శంబూకావర్త భగందర లక్షణము.

శ్లో॥ బహువర్ణరుజాస్రావాః పిటికా గోస్తనోపమాః ।
శంబూకావర్తవన్నాడీ శంబూకావర్తకోమతః ॥

తా. ఆవునండ్లవలె ననేకపురుపులుజనించి పలువిధములైన వర్ణములు వేదన స్రావముగలదిగ నుండుట వ్రణము నత్తగుల్లయొంవలి సుడితో సమానముగ నుండుట యీ లక్షణములుగలది శంబూకావర్తభగందరమని తెలియవలయు.

## ఉన్మార్గి భగందర లక్షణము.

శ్లో॥ క్షతాత్సుతిః పాయుగతావివర్ధదే హ్యుపేక్షణా త్స్యాఃక్రిమయోవిదార్యతే । ప్రకుర్వతేమార్గ మనేకధాముఖై ర్వ్రణై స్తమున్మార్గి భగందరంవదేత్॥

తా. ముండ్లు మొదలగువాని యభిఘాతమువలన గుదసమీపమునందు గలిగిన గాయము నుపేక్షించుటవలన వృద్ధిజెంది గుదమువరకు వ్యాపించి పురుగులలోగూడి గిలి యనేక ఛిద్రములుగల వ్రణములచే వ్యాప్తంబైయుండిన వున్మార్గిభగందర మనంబడు. (ఇదే క్షతజ భగందరమనియు జెప్పంబడు.)

## భగందర సాధ్యాసాధ్య లక్షణము.

శ్లో॥ ఘోరాస్సాధయితుం దుఃఖా స్సర్వఏవభగందరాః ।
తేష్వసాధ్య స్త్రిదోషోత్థః క్షతజశ్చ విశేషతః ॥

తా. సర్వభగందరము లసాధ్యంబులు వానిలో త్రిదోషజ భగందరమొకడు సాధ్యము క్షతజ భగందర మన్నిటికన్న మిక్కిలి యసాధ్యము.

## అసాధ్య భగందర లక్షణము.

శ్లో॥ వాతమూత్రపురీషాణి క్రిమయశ్శుక్రమేవచ ।
భగందరాత్ప్రసవంతి నాశయంతి తమాతురమ్ ।
తథాపి తస్యకర్తవ్యా చికిత్సా జీవితావధి ॥

తా. భగందరమువలన వాత మూత్ర పురీష క్రిమి శుక్రములు వెడలిన రోగి మృతి జెందునని తెలియవలయు. ఐనను జీవించియుండువరకు చికిత్సంజేయవలయు.

## రవితాండవ రసము.

శ్లో॥ [మాధవనిదానే] శుద్ధసూతం ద్విధాగంధం కుమారీ రస మర్దితమ్। త్ర్యహంతే గోళకంకృత్వా హిండికాంతే నిరోధ

యేత్। తయోస్సమేతామ్రపాత్రే శుద్ధేచ తామ్రులేపితే।త్తం భాండంభస్మనాపూర్య చుల్ల్యాం తీవ్రాగ్నినాపచేత్ । త్రియామాంతే సముద్ధృత్య చూర్ణయే త్స్వాంగ శీతలమ్ । జంబీరస్యద్రవైః పిష్ట్వా రుధ్వాస ప్తపుటేపచేత్ । గుంజైకం మధునాజ్యేన లిహ్యేద్ధంతి భగందరమ్। ముసలీ లశునంచాను ప్యారనాళయుతంపిబేత్ । కర్తవ్యం మధునాహారం దివాస్వాపంచమైథునమ్। వర్జయే చ్ఛీతమాహారం రసేస్మిన్ రవితాండవే ॥

తా. శుద్ధిచేసిన రసము 1 భాగము శుద్ధిచేసిన గంధకము 2 భాగములు వీనిని ఖల్వములోనునిచి కలబంద రసముతో 3 దినములు మర్దించి ముద్దచేసి పైరసగంధకములను సమముగ శుద్ధిచేసిన తామ్రమును గ్రహించి డబ్బిజేసి దానిలో నాముద్దనునిచి దానిపైమూసి సందులకు లేపనముచేసి హాండికా యంత్రమునందునిచి దానినిండా బూడిదెబోసి పొయ్యిమీదనునిచి తీవ్రాగ్నిచే 3 ఝాములువండి స్వాంగశీతలమున దీసి ఖల్వములోనునిచి చూర్ణముచేసి నిమ్మపండ్ల రసముతో 7 మార్లునూరి 7 మార్లు పుటంబిడి యందొక గురిగింజయెత్తును తేనెతోగాని నేతితోగాని లేక నేలతాటిగడ్డలు వెల్లుల్లిపాయలు అనుపానిని కలితోనూరి యీ యనుపానముతోడగాని సేవించిన భగందరము హరించు. ఈ రససేవన కాలంబున మధురాహారముల జేయవలయు. పగటినిద్ర స్త్రీసంగము శీతకరాహారములు అనుపానిని వర్జింపవలయు.

## భగందరములకు రసకర్పూర యోగము.

శ్లో॥ రసకర్పూరమాజ్యేన లిహ్యేద్ధంతి భగందరమ్ ।
ముసలీలశునంచాను ప్యారనాళయుతం పిబేత్ ॥

తా. రసకర్పూరమును నేతితో సేవించి వెంబడిగ నేలతాటిగడ్డలను వెల్లుల్లిపాయలను కలితోనూరి త్రాగిన భగందరము హరించు. (లేక తక్కలివేరు చూర్ణము నెల్లివేళ్ళచూర్ణము దినుసుకు 4 తులములు రసకర్పూరము ½ తులము యిట్టుల వీనిని ఖల్వములోనునిచి గూడపాల వేళ్ళరసముతో మర్దించి 80 మాత్రలుచేసి 40 దినములు రేపుమాపు ఆవునేతితోడ సేవించిన భగందరము లూత్రవణము హరించు.

## అపక్వభగందర చికిత్సాక్రమము.

శ్లో॥ స్రావ్యంర క్తంవ్రణేజాతే జలూరంవాప్రదాపయేత్ ।

లాంగలీకృష్ణదుత్తూర విషముష్టించ లేపయేత్ ।
నిర్గుండ్యాశ్ఛద్రవైః పిష్ట్వా లేపయేద్వార్కమూలకమ్ ।
అపక్వేజిర్యతేగ్రంథీ రక్తమోక్షేకృతేపివా ॥

తా. అపక్వమైన భగంధర వ్రణమున సారకాయబుఱ్ఱలు మొదలగువానిచే గాని లేక జలగలవలన రక్తముదీసి చన్నచర్లగడ్డ నల్లవుమ్మెత్త విషముష్టి అను వానిని నూఱిగాని లేక జిల్లేడువేళ్ళను వావిలియాకు రసముతోనూరిగాని లేపనము జేసిన మానును.

వాతభగందరములకు విళంగాది వటికములు.

శ్లో॥ విళంగేంద్ర యవంకృష్ణా స్త్రీభిర్ద్విగుణ గుగ్గులుమ్ ।
త్రిఫలాం గుగ్గులాంశాంచ ఘృతేన సహమేళయేత్ ।
భక్షయే న్మధునాకర్షం మారుతోత్థ భగందరే ॥

తా. వాయువిడంగములు కొడిసెపాల పిప్పళ్ళు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి దీనికి రెండింతలు శుద్ధిచేసిన మహిసాక్షి గుగ్గిలము గుగ్గిలమునకు సమము కరకతాండ్ర యుసిరికల చూర్ణము కలిపి నేతితో మర్ధించి కర్ష ప్రమాణమును తేనె యనుపానముతోడ సేవించిన వాత భగందరము హరించు.

పిత్తభగందర చికిత్స.

శ్లో॥ [ఆయుర్వేదే] పిత్తాధిక్యేప్రదాతవ్యోరసోయంరవితాండవః ।
వాకుచీ బీజచూర్ణంం చాప్యమస్యా దుష్టవారిణౌ ॥

తా. పూర్వోక్త రవితాండవరసములో భావంచివిత్తుల చూర్ణముగలిపి పుష్పోదకముతో సేవించిన పిత్తజ భగందరము హరించు.

శ్లేష్మభగందర చికిత్స.

శ్లో॥ సంమర్ద్యాజే కషోత్థస్య దాతవ్యో రవితాండవః ।
ఛాయాశుష్కం దేవదారు నిష్కార్ధం లవణంపలమ్ ।
పిష్ట్వా కోష్ణజలైః పీత్వా హ్యనుపానేన తంజయేత్ ॥

తా. నేతితో మర్దించబడిన పూర్వోక్తరవితాండవరసమును సేవించి దేవదారు చెక్కను నీడనెండించి చూర్ణముచేసి యందర్ధనిష్కములో 1 పలము ఉప్పుగలిపి వుష్ణోదకానుపానముతోడ సేవించిన శ్లేష్మభగందరము హరించు.

## జయంత్యాది చూర్ణము.

శ్లో॥ [అశ్వినీకల్పే] జయంతీం వాజయాం ఖాదే త్సద్యోహంతి త్రిదోషజమ్ ॥

తా. తక్కలివేరు కూరనెల్లి చెక్క వీనినిదంచి చూర్ణముచేసి సేవించిన త్రిదోషజ భగందరము తత్క్షణమున హరించు.

## యష్ట్యాది లేపనము.

శ్లో॥ యష్టికాచా మృతాశుంఠీ వటపత్రం పునర్నవా ।
జలైఃపిష్ట్వా ప్రలేపోయం పిత్తోత్థేతు భగందరే ॥

తా. అతిమధురము తిప్పతీగె శొంఠి మఱ్ఱియాకు గలిజేరు వీని నుదకముతో నూరి లేపనముచేసిన పిత్తజ భగందరము హరించు.

## శ్లేష్మభగందరమునకు కాంచనాద్యాది లేపము.

శ్లో॥ [ఆయుర్వేదే] కాంచని ద్విని శాముండీ మంజిష్ఠాచ శతావరీ ।
గంధకం ధాతకీపుష్పం తుల్యం లవణపంచకమ్ ।
కన్యా ద్రవయుతో లేపః కఫోత్థేచ భగందరే ॥

తా. దేవకాంచనము పసపు మ్రానిపసపు బోడతరము మంజిష్ఠి పిల్లిపీచర గంధకము ఆరెపువ్వు పంచలవణములు వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి కలుబందరసముతో నూరి లేపనముచేసిన శ్లేష్మజ భగందరము హరించు.

## విస్యందన తైలము.

శ్లో॥ సైంధవం చిత్రకందంతీం పలాపం చేంద్రవారుణీమ్ । గోమూత్రేష్టగుణేపచ్యాద్గాహ్యావష్టావశేషితమ్। క్వాథపాదంక్షిపే. తైలంకృష్ణాయసరజోఘృతమ్ । పచేత్తైలావశేషంచ తేనలేప్యం భగందరమ్ । అసాధ్యం సాధయత్యాశు పక్వం క్రిమికులాన్వితమ్ ॥

తా. సైంధవలవణము చిత్రమూలము నేలదంతి మోదుగపాపర వీనిని సమభాగములుగ దంచి చూర్ణముచేసి యెనిమిదింతలు గోమూత్రముగలిపి అష్టావశేషముగ కషాయముకాచి వడియగట్టిదానికి 4 వ భాగమునూనె నూనెకుసమము అయసాకాంత

చూర్ణము అయస్కాంతచూర్ణమునకు సమము నెయ్యికలిపి చిక్కగవండి లేపనముజేసిన అసాధ్యభగందరములు పురుగులతోగూడియుండు భగందరములు శీఘ్రముగ హరించు

## విడంగాది లేపనము.

శ్లో॥ [చరకే] విళంగం త్రిఫలాచూర్ణం పిప్పలీ మధుతైలకమ్ ।
లేపా ద్భగందరంహంత క్రిమియుక్తం నసంశయః ॥

తా. వాయువిడంగము త్రిఫలములు పిప్పళ్ళు వీనిని సమభాగములుగ దంచి చూర్ణముజేసి తేనె నూనెకలిపి లేపనముజేసిన క్రిములతోగూడియుండు భగందరములు (పులిసీరును గార్చెడి భగందరములు) నిశ్చయముగ హరించు.

## దార్వీకవర్తి.

శ్లో॥ స్నుహ్యర్క దుగ్ధదార్వీభి ర్వర్తింకృత్వా ప్రయోజయేత్ ।
భగందర వ్రణేశాంత్యై యోజ్యానాడీ వ్రణేషుచ ॥

తా. బొంతజెముడుపాలు జిల్లేడుపాలు వీనిలో మ్రానిపసపునూరి వస్త్రమునకు బట్టించి వర్తిజేసి భగందర నాడీ వ్రణములయం దునిచిన భగందరములు నాడీ వ్రణములు హరించు.

## నిశాది వర్తి.

శ్లో॥ నిశాం సైంధవసిద్ధార్థ క్షౌద్రగుగ్గులు సంయుతామ్ ।
వర్తి ర్భగందరేయోజ్యా తథానాడీ వ్రణేషుచ ॥

తా. పసపు సైంధవలవణము తెల్లావాలు గుగ్గిలము వీనిని సమభాగములుగ చూర్ణముచేసి తేనెలోకలిపి బట్టకు పట్టించి వర్తిజేసి భగందర నాడీ వ్రణములయందునిచిన భగందరములు నాడీవ్రణములు హరించు.

## శ్వానాస్థి లేపనము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] భూతాంకుశస్య మూలంతు ఖరరక్తేన సంయుతమ్ । శ్వానాస్థిలేపనాచ్చాథశీఘ్రంహన్యా ద్భగందరమ్ ॥

తా. భూతాంకుశపువేళ్ళను చూర్ణముచేసి అందు గాడిద నెత్తురునుగలిపి కుక్కయెముకలు చాది లేపనముజేసిన శీఘ్రముగ భగందరములు హరించు.

## కాలాగ్నిరుద్ర రసము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] శుద్ధసూతం సమంగంధం మృతనాగం సతుత్థకమ్ । జీరకం సైంధవం తుల్యం తిక్త కోశాతకిద్రవైః । పిష్టంతల్లేపనాద్ధంతి భక్షణాచ్చ భగందరమ్ । రసః కాలాగ్ని నామాయం ద్విగుంజం మృత్యుజిద్భవేత్ ॥

తా. శుద్ధిజేసిన రసము శుద్ధిజేసిన గంధకము నాగభస్మము శుద్ధిజేసిన మైలుతుత్తము జీలకఱ్ఱ సైంధవలవణము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి చేదుబీరాకు రసముతో మర్దించి 2 గురిగింజలయెత్తు మాత్రలుజేసి యందొక దానిని భక్షించుటయేగాక లేపనమును జేయుచుండిన మృత్యుతుల్యముగనుండు భగందరము (సర్వభగందర వ్రణములు) హరించు.

## సర్వవ్రణములకు రసరాట్టు

శ్లో॥ [సిద్ధరసార్ణవే] కస్తూరీ హిమ రశ్మికుంకుమసితా జాతీఫలం హాటకమ్ । చాంపేయంవృషహేమబీజవిజయా యష్టీజయంతీవిషమ్ । ప్రత్యేకంవల్లమానం ఘృతమధుసహితం లిహ్యమానందినాంతే ! కించిస్మార్భ్యాం భజంతే హరతిచ సమయే భక్షయే దిక్షుఖండాః । స్త్రీణాం గర్వాధికారం గమయతిసకలం వీర్యపాతంవ్రయాతి । లింగాం తోయాతి వృద్ధిం స్థిరతవపుషాం స్తంభకృద్యోని భగ్నమ్ । సర్వాంగిం సంధివాతం బహువిధ వ్రణతా గ్రంధిలూతా స్ఫుటంతి । పూయందుర్గంధ లూతాస్రవతిచ బహుళం తీవ్రదుఃఖేన యుక్తమ్। దాహంమోహంచతృష్ణాం క్షయ క్రిమికృశతాం పీనసం పాండురోగాః । గుల్మాధ్మానంచ శూలాగ్రహణి గుదరుజం కుష్ఠరోగం నిహంతి ॥

తా కస్తూరి పచ్చకర్పూరము కుంకుమపువ్వు పంచదార జాజికాయ స్వర్ణభస్మము నాగకేసరములు దొమ్మదోలుగడ్డ వుమ్మెత్తవిత్తులు గంజావిత్తులు యష్టిమధుకము తక్కలివిత్తులు శుద్ధిజేసిన నాభిసినిని దినుసుకు వల్లప్రమాణము చొప్పున ఖల్వములోనునిచి (రసకర్పూరము 1 భాగముగలిపిమర్దించి 2 వీసములురసకర్పూర

ముందునటుల మాత్రలుజేసి యందొకదానిని నేతితోగాని తేక తేనెతోగాని 4 మండలములు సేవించిన సర్వాంగ సంధివాతము బహువిధ వ్రణము గ్రంథులు లూత పగిలి చీముగారుట దుర్గంధమైనలూత అధికముగ చీముగారుట కడుదుఃఖము దాహము మోహము దప్పి క్షయము క్రిములు శరీరకృశత్వము పీనస పాండువు గుల్మము ఆధ్మానము శూల గ్రహణి భగందరము కుష్ఠువు వీనిని హరింపజేయు. మఱియు దీనిసేవనవలన నొకింతమూర్ఛగలిగిన వానినివారణార్థమై చెఱుకుతుంటను భక్షింపవలయు. మఱియు దీనిని సేవించెడివాడు దృఢశరీరిగనుండిన కడువీర్యస్తంభనముగలవాడై స్త్రీలతోరమించి వారిగర్వమును హరింపజేయుటయేగాక వృద్ధిజెందిన లింగముగలవాడై యోనినిభగ్నము సేయు.—(పథ్యము.పగటియందు ఆవుచల్లతోగూడి యుండు అన్నమును రాత్రియందుక్షీరాన్నమును చప్పిడివంటకమును సేవింపవలయు)

## వ్రణాంతిక రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] దరదంచైక భాగంతు షడ్భాగంచాపిగంధకమ్ । సూతరాజేనచైకేన తదర్ధంమృతనాగకమ్ । హంసపాది రసైర్మర్ద్యం పుటమేకంచ చూర్ణితమ్ । గుడాజ మరిచం మిశ్రం ప్రాతఃకాలేచ సేవయేత్ । వ్రణకీటక కుష్ఠాని మండలానిచ నాశయేత్ । వ్రణరాజ ఇతిఖ్యాతో దుష్టవ్రణ హరఃపరః ॥

తా. శుద్ధిచేసిన యింగిలీకము 1 భాగము శుద్ధిచేసిన గంధకము 6 భాగములు శుద్ధిచేసిన రసము 1 భాగము నాగభస్మము ½ భాగము యిటుల వీనిని ఖల్వములో నునిచి హంసపాదియాకురసముతో మర్దించి మాత్రలుచేసి యెండించి కుప్పెలోనునిచి లఘుపుటంబిడి సాంగశీతలమునదీసి చూర్ణముచేసి పూటకు 8 చిన్నముల యెత్తు 4 మండలములు బెల్లము ఆవునెయ్యి మిరియపుచూర్ణము అనువాని యనుపానముతోడ ప్రాతఃకాలమున సేవించిన వ్రణములు క్రిములు మండలకుష్ఠువు దుష్టవ్రణములు హరించు. (పథ్యము. చప్పిడివంటకము పాలన్నము వీనిని భుజింపవలయు.)

## యోగరాజ గుగ్గులము.

శ్లో॥ పిప్పలీపిప్పలీమూలం చవ్యచిత్రకనాగరైః । పాఠావిడంగేంద్రయవైః హింగుభార్గీవచాన్వితైః । సర్షపాతివిషాజాజీజీరకైః రేణుకాయుతైః । గజకృష్ణాజ మోదాచ కటుకా మూర్వా

మిశ్రితైః । సమభాగాన్వితై రేతై స్త్రిఫలాద్విగుణాన్వితైః ।
త్రిఫలాసహితై రేతై స్సమభాగంచ గుగ్గులుమ్ । ఏతచ్చూర్ణీ
కృతంశ్లక్ష్ణంమధునాచ పరిప్లుతమ్ । యోగరాజ ఇతిఖ్యాతో
భక్షయే త్ప్రాతరుత్థితః । అర్శాంసి వాతగుల్మాంచ పాండు
శోథ మరోచకమ్ । నాభీశూల ముదావర్తం ప్రమేహం
వాతశోణితమ్ కుష్ఠక్షయ మపస్మారం హృద్రోగం గ్రహణీ
గదమ్ । మహచ్ఛాప్యగ్ని మాంద్య చ శ్వాసకాస భగంద
రమ్ । సంతతా భ్యాసయోగేనవలీ పలితనాశనమ్ । రేతో
దోషం యోనిదోషం సర్వదోషం వినాశయేత్ ॥

తా. పిప్పళ్ళు మోడి చెవ్యము చిత్రమూలము శొంఠి శిరుబొద్ది వాయువిడంగ ములు కొడిసెవిత్తులు యింగువ గంటుభారంగి వస తెల్లావాలు అతివస జాజికాయ జీలకఱ్ఱ రేణుకలు గజపిప్పలి వోనము కటుకరోహిణి ఛాగదుంపలు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దీనికి రెండింతలు త్రిఫలచూర్ణము వీనికన్నిటియెత్తు శుద్ధిజేసిన మహిసాక్షీ గుగ్గిలముగలిపి బాగుగచూర్ణముజేసి తేనెపోసిన్రితొక్కి తానికా యలంతిమాత్రలుజేసి 4 మండలములు ప్రాతస్సాయంకాలముల సేవించిన అర్శస్సు వాతగుల్మము పాండువు శోఫలు అరుచి నాభిశూల వుదావర్తము ప్రమేహములు రక్తవాతము కుష్ఠువు క్షయము అపస్మారము హృద్రోగము గ్రహణి అగ్నిమాంద్యము శ్వాసము కాసము భగందరము ముడిమి శుక్రదోషము యోనిదోషము మొదలగు సర్వదోషముల హరింపంజేయు. ద్వతీయము దీనిని చిన్నమెత్తు సింధూరము సాపుసేరు నక్కపీటాకు రసము 1 తులము మిరియపుచూర్ణము అనువాని యనుపానముతోడ గాని పావుసేరు డొమ్మ డోలుగడ్డరసము 1 తులము మిరియపుచూర్ణము చిన్నమెత్తు సిందూరము అనువాని యనుపానముతోడగాని 4 మాసములు సేవించిన భగందర వ్రణములు మానును.

## వ్రణలక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] ఏకదేశోత్థితశ్శోథో వ్రణానాం పూర్వలక్షణ
మ్ । షడ్విధ శ్శ్వయథుప్పృథక్సర్వ రక్తాగంతు నిమిత్తజః ।
శోథాః షడేతే విజ్ఞేయాః ప్రాగుక్తై శ్శోథలక్షణైః ।
విశేషః కథ్యతేతేషాం పక్వాపక్వ వినిశ్చయే ॥

తా. వ్రణము జనించుటకు ముందేపైన నొకచో వాపుజనించి వాత పిత్త శ్లేష్మ సన్నిపాత రక్త ఆగంతుక భేదములవలన 6 విధంబు గలదిగనై పూర్వోక్త శోఫలక్షణయుక్తంబై యుండు. అట్లగుటంజేసి వానిపక్వాద్యవస్థల నిశ్చయించుటకు దగిన విశేషలక్షణంబుల వచియించెద.

## వ్రణపాక లక్షణము.

శ్లో॥ విషమం పచ్యతే వాతా త్పిత్తోత్థ శ్చాచిరంచిరమ్ ।
కఫజః పిత్తపచ్ఛోఫో రక్తాగంతూ సముద్భవః ॥

తా. వ్రణమువాతదోషమువలన విషముపాకము (అనగాకొన్నిస్థలములపండి పండకుండుట) గలదిగనుండు పిత్తదోషమువలన శీఘ్రముగపండు. కఫదోషమువలన చిరకాలముమీదపండు. రక్తఆగంతుకదోషమువలన పిత్తమువలెనే శీఘ్రముగపండు

## అపక్వ వ్రణ లక్షణము.

శ్లో॥ మందోష్మతాల్ప శోఫత్వం కాఠిన్యం త్వక్సవర్ణతా।
మందవేదనతాచైవ శోఫానా మామలక్షణమ్॥

తా. వాపును దాకిన నొకింత యుష్ణంబుగనుండుట వొకింతవాపు జనించి కఠినంబుగనుండుట ఛాయ వివర్ణముగానుండుట వొకింత పోటుగలిగి యుండుట యివియన్నియు అపక్వవ్రణలక్షణంబులని తెలియవలయు.

## పచ్యమాన వ్రణ లక్షణము.

శ్లో॥ తప్యతేదహనేనేవ క్షారేణేవచపచ్యతే । పిపీలికాగణేనేవ దహ్యతేభిద్యతేతథా । భిద్యతేచైవ శస్త్రేణ దండేనేవచ తాడ్యతే । పీడ్యతేపాణినేవాంత స్సూచీభిరివ తుద్యతే । సో షాచోషోవివర్ణ స్స్యా దంగుళ్యేవావపాఠ్యతే । ఆసనేశయనే స్థానే శాంతింవృశ్చికవిద్ధవత్ । నగచ్ఛేదా తతశ్శోఫో భవే దాధ్మాన వస్తివత్ ।జ్వర స్తృష్ణా రుచిశ్చైవ పచ్యమానస్య లక్షణమ్ ॥

తా. వ్రణముపక్వంబగుచుండ అగ్నితోగాల్చబడినటుల మండుట క్షారమును గీచినటుల చిమచిమలాడుట చేమలు గొరికినటుల నొప్పుటలేక శస్త్రముతో భేదింపంబడినటులగాని పీల్పంబడినటులంగానిలేక కఱ్ఱతోగొట్టంబడినటులగానిలేక చేతి

తో బిసుకంబడినటుల గాని లేక లోపల సూదులతో బొడువబడునటుల గానివేద నకలదై తాపముతో గూడియుండుట అగ్నిలో వేయించబడినటుల పీడగలుగుట వర్ణముమారుట వ్రేళ్ళతో జీల్చంబడి నటులుండుట కూర్చుండునపుడు పరుండునపుడు నిలువంబడియుండునపుడు తేలుగుట్టినటుల వేదనగలిగి యెల్లపుడు శమింపకుండుట వాపుబ్బుటవలన నీడుపబడిన వస్త్రిపలెనై జ్వరముదప్పి అరుచి అనువానియుక్తంబై యుండుట యీలక్షణంబులుగలది పచ్యమాన వ్రణమని తెలియవలయు.

## పక్వవ్రణ లక్షణము.

శ్లో॥ వేదనోపశమశ్శోఫో లోహితోల్పో నచోన్నతః । ప్రాదు ర్భావోవలీనాంచ తోదఃకండూ ర్ముహుర్ముహుః । ఉపద్ర వాణాంప్రశమో నిమ్నతాస్ఫుటనంత్వచః । వస్తావివాంబు సంచార స్స్యాచ్ఛోఫేంగుళిపీడితే । పూయస్య పీడయత్యేక మంతమంతేచ నీడితే । భక్తాకాంక్షా భవేచ్చైవ శోఫా నాం పక్వలక్షణమ్ ॥

తా. వేదనశమించుట వాపెఱ్ఱనై యొకింత ప్రసరించుట క్రుంగుట పొడిచి నటులుండుట పలుమారు దురదగలుగుట పిత్తమువలనగలిగిన దాహాద్యుపద్రవములు శమించుట వాపుయందు పల్లముబడుట చర్మముపగులుట వాపును వ్రేలితో నదిమిన వస్త్రియందుండు నీటివలె చీముయిటునటు చలించుట అవయవముయొక్క నొకప్రదే శమునణచిన చీములోనికేగుట అన్నమునందిచ్ఛగలుగుటయీలక్షణములవలనవ్రణము పక్వంబైనదని తెలియవలయు.

## దోషత్రయసంబంధ వ్రణపాకము

శ్లో॥ నార్తేనిలాద్రుగ్న వినానపిత్తం పాకఃకఫంవాపివినానపూయః।
తస్మాద్ధిసర్వేపరిపాకకాలే పచంతిశోథా స్త్రిభిరేవదోషైః ॥

తా. వాతములేకనే పోటును పిత్తములేకనే దాహంబునుకఫములేకనేచీము నుగలుగ నేరదు కావునసర్వశోఫలు పరిపాకకాలంబున త్రిదోషయుక్తంబై పండు. (రక్తపాక లక్షణం బెట్లనిన—శ్లో॥ “కఫజేషుచ శోఫేషు గంభీరం పాకమేత్య సృక్ । పక్వం స్నిగ్ధం తత స్స్పష్టం యత్రస్యాల్లిఙ్గన్నశోఫతా। త్వక్సావర్ణ్యం రుజోల్పత్వం ఘనస్పర్శత్వ మశ్మవత్ । రక్తపాక మిత్యబ్రూయాత్తం ప్రాజ్ఞోముక్త సంశయః॥” అనగా కఫజ వ్రణములయందు రక్తముగూఢముగ పాకము జెందుట

పక్వమైన పిదప సమపుగనుండుట వ్రణము స్పష్టముగ ద్రవించుట వివర్ణముగానుం డుట నొకింత వేదనగలుగుట తాకిన తాయివలెనుండుట యివి రక్తపాకలక్షణము లని వైద్యవేత్తలు నిస్సంశయముగ వచించెదరు.

పూయనిర్గమన పరిణామము.

శ్లో॥ కక్షం సమాసాద్య యథైవ వహ్ని ర్వాయ్వీరితః స్సందహతి ప్రసహ్య। తథైవపూయో ప్యవినిస్సృతోహి మాంసంసిరాస్నాయుచ ఖాదతీహ॥

తా. అగ్ని వాయువు సహాయముచే పొదరిల్లును భస్మముజేయు చందంబున చీమువెలిబడకుండుటచే వ్రణము తపించి మాంసము సిరలు స్నాయువులుఅనువానిని భక్షించు.

వ్రణవైద్య గుణదోషము.

శ్లో॥ ఆమంవిదహ్యమానంచ సమ్యక్పక్వంచలక్షణైః।
జానీయాత్సభవేద్వైద్య శ్శేషా స్తస్కరవృత్తయః॥

తా. వ్రణముయొక్క యపక్వ పచ్యమాన పాకావస్థల బాగుగ నెఱుంగువాడే వైద్యుండు తక్కినవారలు తస్కర వ్యాపారులని తెలియందగు.

అనిశ్చితవ్రణ వైద్యదోషము.

శ్లో॥ యశ్ఛిదత్యా మమజ్ఞానా ద్యశ్చపక్వముపేక్షతే।
శ్వపచావివమంతవ్యౌ తావనిశ్చిత కారిణౌ॥

తా. అజ్ఞానమువలన నపక్వముగనుండుట వ్రణము పక్వమైనదని యెంచి భిన్నపఱచెడివైద్యుడును లేక పక్వమైయుండు వ్రణము నుపేక్షించెడి వైద్యుడును చండాలురతో సమానులని తెలియవలయు.

శారీర వ్రణభేదము.

శ్లో॥ ద్విధావ్రణః పరిజ్ఞేయ శ్శారీరాగంతు భేదతః।
దోషైరాద్య స్తయోరన్య శ్శస్త్రాది క్షతసంభవః॥

తా. వ్రణము శారీర ఆగంతుక భేదములవలన 2 విధంబులు. అందు మొదటిదియగు శారీరమను వ్రణము వాతాదిదోషములవలన జనించు. 2 వది యగు ఆగంతుకవ్రణము శస్త్రాదుల గాయమువలన గలుగు.

## వాతికవ్రణ లక్షణము.

శ్లో॥ స్తబ్ధఃకఠినసంస్పర్శో మందస్రావోమహారుజః ।
తుద్యతేస్ఫురతిశ్యావో వ్రణోమారుతసంభవః ॥

తా. జడముగనుండుట తాకిన కఠినముగనుండుట కొంచెముగ స్రావము మిక్కుటముగ పోట్లుగలుగుట పొడిచినట్లుల వేదనతోగూడియుండుట స్ఫురించుట నల్లగనుండుట యీ లక్షణములుగలది వాతవ్రణమని తెలియవలయు.

## పైత్తికవ్రణ లక్షణము.

శ్లో॥ తృష్ణామోహజ్వరక్లేద దాహదుష్టావదారణైః ।
వ్రణంపిత్తకృతంవిద్యా ద్గంధైస్రావైశ్చపూతికైః ॥

తా. దప్పి మోహము జ్వరము చెమ్మ తాపముగలుగుట చీల్చబడినట్లుల వేదన గలుగుట కంపువేసుట దుర్గంధముగ స్రావముగలుగుట యీ లక్షణములుగలది పిత్త వ్రణమని తెలియవలయు.

## కఫజవ్రణ లక్షణము.

శ్లో॥ బహుపిచ్ఛోగురుస్స్నిగ్ధ స్తిమితోమందవేదనః ।
పాండువర్ణోల్పసంక్లేదీ చిరపాకీకఫోద్భవః ॥

తా. కడుజిగటగ జడము పట్టనుగ నిశ్చలముగ మందవేదన గలదిగ తెల్లని వర్ణము గలదిగనుండుట కొంచెముగ స్రావముగలుగుట దీర్ఘకాలము మీాన పండుట యీలక్షణములు గలది శ్లేష్మజవ్రణమని తెలియవలయు.

## రక్తజ ద్వంద్వజవ్రణ లక్షణము.

శ్లో॥ రక్తోరక్తస్రుతీరక్తాద్ద్విత్రిజస్స్యాత్తదన్వయైః ॥

తా. రక్తవర్ణముగలదై రక్తమును స్రవింపం జేయుచుండు వ్రణము రక్తజ వ్రణమనంబడు. ఏకదోష రక్తసంబంధములవలన జనించినది ద్వంద్వజవ్రణమనియు ద్విదోష రక్తసంబంధమువలన జనించునది సన్నిపాతజ వ్రణమనియు జెప్పంబడు.

## సుఖవ్రణ లక్షణము.

శ్లో॥ త్వఙ్మాంసజస్సుఖేదేశే తరుణస్యానుపద్రవః ।
ధీమతోభినవః కాలే సుఖసాధ్యస్సుఖవ్రణః ॥

తా. చర్మము మాంసము మర్మరహితస్థలములు అనువానియందుజనించి జ్వర తృష్ణాద్యుపద్రవరహితంబై యౌవనము యుక్తాయుక్త వివేకజ్ఞానముగల పురుషులకు హేమంత శిశిర కాలములయందు జనించినదియైయుండు నూతనవ్రణము సుఖవ్రణమని తెలియందగు ఇది సుఖసాధ్యంబులు.

## కృచ్ఛ్రసాధ్యాసాధ్యవ్రణ లక్షణము.

శ్లో॥ గుణైరన్యతమైర్హీనస్తతః కృచ్ఛ్రో వ్రణస్స్మృతః ।
సర్వైర్విహీనోవిజ్ఞేయస్త్వసాధ్యోనిరుపక్రమః ॥

తా. పూర్వోక్త "త్వఙ్మాంస జేత్యాది" శ్లోకోక్తగుణములలో తక్కువగ నుండు గుణములంగల వ్రణము కష్టసాధ్యంబనియు సర్వగుణరహితంబై యుండు వ్రణమసాధ్యంబనియు తెలియవలయు. ఇట్టియసాధ్యవ్రణములకు చికిత్సంజేయందగదు.

## దుష్టవ్రణ లక్షణము.

శ్లో॥ పూతిపూయాతిదుష్టాసృక్స్రావ్యుత్సంగిచిరస్థితిః ।
దుష్టవ్రణోతిగంధాది శ్శుద్ధలింగవిపర్యయః ॥

తా. దుర్గంధముగ చీమును చెడినరక్తమును స్రవింపంజేయుచు దీర్ఘకాలము వరకు పైననుబ్బుగ లోనబోలుగ నుండినదియై అసహ్యమైన గంధము వికారమైన వర్ణస్రావవేదనాయుక్తంబై శుద్ధవ్రణలక్షణ విహీనంబై యుండునది దుష్టవ్రణమని తెలియవలయు.

## శుద్ధవ్రణ లక్షణము.

శ్లో॥ జిహ్వాతలాభోతి మృదుశ్శ్లక్ష్ణస్స్నిగ్ధోల్పవేదనః ।
సువ్యవస్థో నిరాస్రావ శ్శుద్ధోవ్రణ ఇతిస్మృతః ॥

తా. నాలుకయొక్క పైభాగమువంటి కాంతిగలదిగ కడుమృదువుగనున్న స్నిగ్ధముగ నుండినదియై అల్పవేదనాయుక్తంబై వుప్పుమొదలగునవి లేక పొక్కులలో దోషరక్తాది స్రావరహితంబై యుండునది శుద్ధవ్రణమని తెలియవలయు.

## వ్రణరోహణ లక్షణము.

శ్లో॥ కపోత వర్ణ ప్రతిమా యస్యాంతాః క్లేదవర్జితాః ।
స్థిరాశ్చ పిటికావంతో రోహతీతమాదిశేత్ ॥

తా. చుట్టూపావురపిట్ట వర్ణముతో సమానంబై * క్లేదసహితంబై పగ వ్యాప్తంబైయుండు వ్రణము బాగుగ మొలుచునని తెలియవలయు.

## బాగుగ తేలిన వ్రణలక్షణము.

శ్లో॥ రూఢవర్త్మాన మద్గ్రంథి మశూన మరుజంవ్రణమ్ ।
త్వక్సవర్ణం సమతలం సమ్యగ్రూఢం తమాదిశేత్ ॥

తా. ముఖము బాగుగ నగుపడుట కురుపుపైనుబ్బువాపు పోట్లులేకుండుట-ముతో సమానవర్ణముగలదిగనుండుట నాలుకతోగాని, అరచేతితోగాని సమానముండుట యీలక్షణములుగల వ్రణము బాగుగ పండితేలినదనియు తెలియవలెం

## వ్రణకృచ్ఛ్రసాధ్య లక్షణము.

శ్లో॥ కుష్ఠినాంవిషజుష్టానాం శోషిణాం మధుమేహినామ్ ।
వ్రణాఃకృచ్ఛ్రేణ సిధ్యంతి యేషాంచాపి వ్రణేవ్రణాః ॥

తా. కుష్ఠువు విషము క్షయరోగము మధుమేహముగల పురుషునికి జనిం వ్రణము కష్టసాధ్యము. మఱియు వ్రణముపై మఱియొక వ్రణముజనించిన నదియు కష్టసాధ్యంబు,

## సాధ్యాసాధ్యవ్రణ లక్షణము.

శ్లో॥ వసాంమేదోథ మజ్జానం మస్తులుంగంచ యస్స్రవేత్ ।
ఆగంతుజో వ్రణస్సిద్ధ్యే న్నసిధ్యే ద్దోషసంభవః ॥

తా. క్రొవ్వు మేదస్సు మజ్జ మస్తకస్నేహము వీనిని వెడలింపంజేసెడి ము ఆగంతుక జనితంబైయుండిన సాధ్యంబు. దోషజనితంబైయుండిన నసాధ్య

* క్లేదమన—చెమ్మ.

## అసాధ్యవ్రణ లక్షణము.

శ్లో॥ మద్యాగుర్వాజ్య సుమనః పద్మచందన చంపకైః ।
సుగంధా దివ్యగంధాశ్చ ముమూర్షూణాం వ్రణాస్మృతాః ॥

తా. మద్యము అగురు నెయ్యి పుష్పము కమలము చందనము సంపంగిపువ్వు లేక చమత్కారిక పారిజాతాదిక పుష్పము అనువానియొక్క సువాసనను వెడలింపంజేయుచుండు వ్రణమువలన రోగి మృతిజెందునని తెలియవలయు.

శ్లో॥ [మతాంతరే] యేచమర్మసుసంభూతా భవంత్యత్యర్థ వేదనా ।
దహ్యంతే చాంతరత్యర్థం బహిశ్శీతాశ్చ యేవ్రణాః ।
దహ్యంతే బహిరత్యర్థం భవంత్యంతశ్చ శీతలాః ।
ప్రాణమాంస క్షయశ్వాస కాసారోచక పీడితాః ।
ప్రవృద్ధ పూయరుధిరా వ్రణాయేషాంచ మర్మసు ।
క్రియాభి స్సమ్యగారబ్ధా నసిద్ధ్యంతిచ యేవ్రణాః ।
వర్జయే దేవతాన్వైద్య స్సంరక్ష న్నాత్మనోయశః ॥

తా. మర్మస్థానమునజనించి కడువేదన గలుగంజేయుచుండువ్రణంబునులోప తాపము వెలపట శీతలముగ వ్రణంబును వెలపట తాపములోన శీతలముగల వ్రణంబును బలమాంసములు క్షయించి శ్వాసము దగ్గు అరోచకము అనువానితో గూడి విశేషపీడను గలుగంజేయుచుండు. వ్రణంబును మర్మస్థానమునందు జనించి చీమును రక్తమును మిక్కుటముగ గార్చుచుండు వ్రణంబును బాగుగ చికిత్సజేయంబడియు సాధ్యము గాకుండు వ్రణంబును యశస్సును గోరెడువైద్యుడు వర్జింపవలయు.

## వ్రణాపచారము.

శ్లో॥ వ్రణేశ్వ యథురాయాసా త్సచరాగశ్చ జాగరాత్ ।
తౌచరుక్చదివాస్వాపాత్తాశ్చమృత్యుశ్చమైథునాత్ ॥

తా. ఆయాసమువలన వ్రణమునందు వాపును జాగరణమువలన వాపును యెఱుపువర్ణమును పగటినిద్రింపుటవలన వాపునుయెఱుపువర్ణమును పోట్లును మైథునమువలన వాపును యెఱుపువర్ణమును పోట్లును మరణమును గలుగు.

## వ్రణవర్జ్య ద్రవ్యములు

శ్లో॥ [మాధవనిదానే] అమ్లదధిచశాకంచ మాంసమాసూప వారిజమ్ । జీరంగురూణివాన్నాని వ్రణీతు పరివర్జయేత్ ॥

తా. పులుసు పెరుగు ఆకుకూరలు జలజంతుమాంసము జీలకఱ్ఱ గురుక రాన్నములు వీనిని వ్రణరోగము గలవారు వర్జింపవలయును.

## వాతవ్రణమునకు మాతులుంగాది లేపము.

శ్లో॥ మాతులుంగాగ్ని మంథౌచ సురదారు మహౌషధమ్ ।
అంహిస్రాచైవరాస్నాచ ప్రలేపో వాతశోఫహః ॥

తా. మాదీఫలము కూరసెల్లి దేవదారు శొంఠి నారంజి సన్నరాస్న మువీనిని నూరి వ్రణమునందు లేపనము జేసినను లేక నివర్తిజేసి యెక్కించినను వాత వ్రణము మానును.

## గంభీరవ్రణమునకు అభయాది లేపము.

శ్లో॥ అభయాత్రివృతాదంతీ లాంగలీమధుసైంధవః ।
సుమవీపత్రధత్తూర కర్ణమోట కుశేరకాః ।
పృథగేతేప్రలేపేన గంభీరవ్రణశోషణాః ॥

తా. కరక్కాయ తెగడ నేలదంతి చెన్నచెర్లగడ్డ తేనె సైంధవలవణము కాకరాకు పుత్రైత్తాకు కర్ణమోట గద్దరాకు వీనిలో జేనినేని నూరి లేపనముజేసిన గంభీరవ్రణము శోషించు.

## మనశ్శిలాది లేపము.

శ్లో॥ మనశ్శిలా సమంజిష్ఠా సలాక్షా రజనీద్వయమ్ ।
ప్రలేపస్స ఘృతక్షౌద్ర స్త్వగ్విశుద్ధి కరస్స్మృతః ॥

తా. మణిశిల మంజిష్ఠి లక్క పసపు మ్రానిపసపు వీని చూర్ణమును నెయ్యి తేనె అనువానిలో గలిపి లేపనముజేసిన చర్మము శుద్ధంబగు.

## వ్రణక్రిములకు కరంజాది లేపము.

శ్లో॥ కరంజారిష్ట నిర్గుండీ రసోహన్యా ద్వ్రణక్రిమీన్ ॥

తా. క్రానుగ వేప వావిలి వీనిరసముల లేపనము జేసిన వ్రణము క్రిములు హరించు.

## పటోలాది కషాయము.

శ్లో॥ పటోలీనింబపత్రాణాం క్వాథస్సంశోధనేహితః ।
తత స్సంరోపణేశ స్త స్తిలానాం మధుకాన్వితః ॥

తా. చేదుపొట్ల వేపాకు వీనికషాయముతో వ్రణములగడుగుట ప్రశస్తముమఱి యూ నువ్వులకల్కములో తేనెగలిపి లేపనము జేసిన వ్రణములు కురుదుగట్టిమానును.

## చిరిబిల్వాది లేపనము.

శ్లో॥ చిరబిల్వ స్తథాదంతీ చిత్రకో హయమారకః ।
కపోత కంకగృధ్రాణాం మలలేపేన దారణమ్ ॥

తా, క్రానుగ చిత్రమూలము దంతిగన్నేరు అనువానివేళ్ళనుగాని లేకపావురపిట్ట రాపులుగు గద్ద అనువాని మలమునుగాని లేపనము జేసిన వ్రణము పగులును.

## దంతిమూలాది లేపము.

శ్లో॥ దంతీమూలక చిత్రత్వ క్స్నుహ్యర్క పయసాగుడః ।
భల్లాత కాస్థికాసీస సైంధవై ర్దారణ స్స్మృతః ॥

తా. దంతివేరు చిత్రమూలపుపట్ట బొంతజెముడుపాలు జిల్లేడుపాలు బెల్లము జీడివిత్తులు అన్నభేధి సైంధవలవణము వీనినినూరి లేపనముజేసిన వ్రణము పగులును.

## యవాది లేపము.

శ్లో॥ యవగోధూమ చూర్ణంచ సక్షారందారణం పృథక్ ।
హరిద్రాభస్మ చూర్ణాభ్యాం ప్రలేపో దారణఃపరః ।
అజవి ట్క్షారమృజ్యంచ ప్రలేపో వ్రణదారణః ॥

తా. యవలు గోధుమలు వీని పిండిలోక్షారముగలిపి లేపనముజేసినను లేక పసపు మసిలో సున్నముగలిపిగాని లేక మేకపెంటికల బూడిదక్షారములో సైంధవలవణమును జేర్చిగాని లేపనముజేసినను వ్రణము పగులును. ఇది కడుశ్రేష్టంబగు.

## ప్రక్షాళనము.

శ్లో॥ తతః ప్రక్షాళనే క్వాథః పటోలీ నింబపత్రజః ॥
అవిశుద్ధే శుద్ధేతు న్యగ్రోధాది త్వగుద్భవః ।
పంచమూలీద్వయంవా తే న్యగ్రోధాదిశ్చ పైత్తికే ।
ఆరగ్వధాదికోయజ్యః కఫజే సర్వకర్మసు ॥

తా. వ్రణము చేతిపొట్ల వేపాకు అనువాని కషాయముతోడను శుద్ధ అశ వ్రణములను మఱ్ఱిమొదలగువాని పట్టల కషాయముతోడను వాతవ్రణమును దశమ కషాయముతోడను పిత్తవ్రణమును మఱ్ఱిమొదలగు వానిపట్టల కషాయముతోడను క వ్రణమును రేల మొదలగువాని కషాయముతోడను గడుగవలయు.

## శోధన లేపనావిధి.

శ్లో॥ తిలసైంధవ యష్ట్యాహ్వా నింబపత్ర నిశాయుతైః ।
త్రివృన్మధుయుతైఃపిష్టైః ప్రలేపో వ్రణశోధనః ।
తిలకల్కః స్సలవణో ద్వే హరిద్రే త్రివృద్ఘృతమ్ ।
మధుకంనింపబత్రాణి లేపస్స్యాద్వ్రణశోధనః ॥

తా. నువ్వులు సైంధవలవణము అతిమధురము వేపాకు పసపు మ్రానిపస తెగడ వీనిని చూర్ణముజేసి తేనెతోమర్దించి లేపనముజేసిన వ్రణము శుద్ధంబగు మ యు నువ్వులకల్కములో ఉప్పు పసపు మ్రానిపసపు తెగడ అతిమధురము వేపా అనువానిచూర్ణమును నేతినిగలిపి లేపనము జేసిన వ్రణముశుద్ధంబగు.

## దుష్టవ్రణ లేపనము.

శ్లో॥ నింబకోలకపత్రాణి లేపస్స్యా ద్వ్రణశోధనః ।
నింబపత్రతిలైః కల్కో మధునాకృత శోధనః ।
నింబపత్రంతిలాదంతీ త్రివృత్సైంధవమాక్షికమ్ ।
దుష్టవ్రణప్రశమనో లేపశ్శోధన కేసరీ ॥

తా. వేపాకు రేగాకు అనువానినిగాని నువ్వులకల్కములో వేపాకుచూ మును తేనెనుగలిపి కాని లేక వేపాకు నువ్వులు దంతివేరు తెగడ సైంధవలవణమ అనువానిని తేనెతోగలిపిగాని లేపనము జేసిన దుష్టవ్రణము శమించు.

## నింబాది శోధనము.

శ్లో॥ నింబపత్రమధుభ్యాంతు యుక్తస్సంశోధనస్స్మృతః ।
ఏకంవా శారిబామూలం సర్వవ్రణవిశోధనమ్ ॥

తా. వేపాకు తేనె వీనినినూరి లేపనముజేసినను లేక సుగంధిపాల వేరునునూరి లేపనము జేసినను సర్వవ్రణములు శుద్ధంబులగు.

## పారదాది మలహార ఘృతము.

శ్లో॥ [ఆయుర్వేదే] రసగంధకయోశ్చూర్ణం తత్సమం మర్దశంఖకమ్। సర్వతుల్యంతుకంపిల్లం కించిత్తుత్థ సమన్వితమ్ । సర్వాం సంమేళయేద్ధత్వా ఘృతంసర్వ చతుర్గుణమ్ । పిచుపుతం ప్రదాతవ్యం దుష్టవ్రణ విశోధనమ్ । నాడీవ్రణ హరంచైవ సర్వవ్రణ నిషూదనమ్ । యేవ్రణానప్రశామ్యంతి భేషజానాం శతేనచ। అనేన తేప్రశామ్యంతి సర్పిషాస్వల్పకాలతః ॥

తా. రసము గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి కాటుకవలెనూరి దానికిసమముగ ముదారుసింగును గలిపి మర్దించి వీనికన్నిటికి సమముగ కంపిల్లము వొకింతమైలుతుత్తము గలిపి బాగుగనూరి దానికి నాలుగింతలు నెయ్యి గలిపి దానిలో ప్రత్తినిదడిపి వ్రణముపైనునిచిన దుష్టవ్రణము శుద్ధంబగుటయేగాక నాడీవ్రణమును సర్వవ్రణములనునశింపంజేయు. మఱియు ననేకౌషధములవలననగా శాంతిజెందకుండునట్టి వ్రణంబీ ఘృతమువలన స్వల్పకాలములో శాంతిజెందు.

## రసాది ఘృతము.

శ్లో॥ రసగంధక సింధూర రాళ కంపిల్లముర్ధకమ్ ।
తుత్థం ఖాదిరకంచూర్ణం సర్వంఘృత చతుర్గుణమ్ ।
యుక్త్వా సంమేళ్యపిచునా వ్రణేదేయం విజానతా ।
సర్వవ్రణ ప్రశమనం ఘృతమేత న్నసంశయః ॥

తా. రసము గంధకము సిందూరముసర్జరసము కంపిల్లము (గుగ్గిలము)ముదారసింగు మైలుతుత్తము కాచు వీనినిసమభాగములుగ చూర్ణముజేసి దానికి 4 గింతలు నెయ్యిగలిపి దానిలో ప్రత్తినద్ది వ్రణముపైవైచిన సర్వవ్రణములు నిశ్చయముగ హరించు.

## హస్తిదంత లేపము.

శ్లో॥ హస్తిదంతం జలేఘృష్టం బిందుమాత్ర ప్రలేపనమ్ ॥
అత్యంత కఠినేచాపి శోఫే పాచనభేదనమ్ ॥

తా. ఏనుగుదంతము నుదకముతో నూరి యందొక బిందువును వ్రణముయొక్క ముఖము పై నునిచిన కడు కఠినముగనుండు వ్రణము పండి పగులును.

## విడంగాది గుగ్గులు వటికములు.

శ్లో॥ విడంగ త్రిఫలావ్యోష చూర్ణం గుగ్గులునాసమమ్ ॥
సర్పిషా వటికాః కుర్యాత్ఖాదే ద్వాహిత భోజనః ।
దుష్టవ్రణాపచీ మేహ కుష్ఠ నాడీ విశోధనః ॥

తా. వాయువిడంగములు త్రిఫలములు త్రికటుకములు యివి సమభాగములు వీనికన్నిటికి సమము శుద్ధిచేసిన గుగ్గిలము యిట్టుల వీనినెల్ల నేకముజేసి ఖల్వములో నునిచి నేతితో మర్దించి యుండలుజేసి పథ్యముగనుండి సేవింపుచుండిన దుష్ట వ్రణము అపచి మేహము కుష్ఠువు నాడీవ్రణము వీనిని హరింపంజేయు.

## అమృతాది గుగ్గులము.

శ్లో॥ అమృతాపటోలమూలత్రికటు త్రిఫలాకృమిఘ్నానామ్ ।
కృత్వాసమభాగచూర్ణం తత్తుల్యోగుగ్గులుర్యోజ్యః ।
ప్రతివాసరమేకైకాం ఖాదేదక్షపరిమాణామ్ ।
జేతుంవ్రణవాతాస్రం గుల్మోదరపాండుశోఫాదీన్ ॥

తా. తిప్పతీగె చేదుపొట్లవేరు త్రికటుకములు త్రిఫలములు వాయువిడంగములు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దానికి సమముగ శుద్ధిజేసిన గుగ్గిలమును గలిపి మర్దించి అక్షప్రమాణము మాత్రలుజేసి యందొక దానిని ప్రతిదినము సేవింపుచుండిన వ్రణము వాతరక్తము గుల్మము వుదరము పాండువు వాపుహరించు.

## జాత్యాదిఘృతము.

శ్లో॥ జాతీపత్ర పటోల నింబ కటుకా దార్వీ నిశా శారిబా ।
మంజిష్ఠా భయ తుత్థ సిక్థ మధుకై ర్నక్తాహ్వ బీజైస్సమైః ।

సర్పిస్సిద్ధమనేన సూక్ష్మవదనా మర్మాశ్రితా స్స్రావిణో ।
గంభీరా స్సరుజో వ్రణా స్సగతికా శ్శుధ్యంతి రోహంతిచ ॥

తా. జాపత్రి చేదుపొట్ల వేప కటుకరోహిణి ప్రానిపసపు పసపు సుగంధిపాల వేరు మంజిష్ఠి కరక్కాయ మైలుతుత్తము మైనము అతిమధురము క్రానుగవిత్తులు వీనిని సమభాగములుగ దంచి కషాయముకాచి దానిలో నెయ్యిగలిపి చిక్కగవండి లేపనము జేసిన మర్మస్థానముపై జనించి యనేక సూక్ష్మ ముఖములవలన స్రావము చేయించుచు లోన నొప్పిగలదై లోననే చలించునదియైయుండు వ్రణము శుద్ధపఱుచుటయేగాక మానునటుల సగా జేయుచున్నయది.

సర్జకాది ఘృతము.

శ్లో॥ సర్జకాచ యవక్షారః కంపిల్లంచ హరేణుకా ।
టంకణం శ్వేతఖదిరం తుత్థచూర్ణంచ గోఘృతైః ।
సర్వం సమాంశం సంచూర్ణ్య మర్దయే త్పహరంద్వృఢమ్ ।
సర్జకాద్య మిదంసర్పి స్సర్వవ్రణ హరంపరమ్ ॥

తా. సర్జక్షారము యవక్షారము కంపిల్లము రేణుకవిత్తులు వెలిగారము తెల్లకాచు మైలుతుత్తము వీనినెల్ల సమభాగములుగ చూర్ణముజేసి ఖల్వములోనునిచి ఆవునేతిలో 1 ఝాము బాగుగమర్దించి లేపనముజేసిన సర్వవ్రణముల హరింపంజేయు. మఱియు నది క్రిములు దురద వీనిని నశింపంజేసి చర్మమునకు మంచి వర్ణమును (సగాగలుగంజేయు.)

లశునాది లేపము.

శ్లో॥ లశునే నాథవాదద్యా ల్లేపనం కృమినాశనమ్ ॥

తా. తెల్లగడ్డనునూరి లేపనముజేసిన క్రిములు నశించు.

నింబపత్రాది ధూపము.

శ్లో॥ నింబపత్ర వచాహింగు సర్పిర్ల వణసైంధవైః ।
ధూపనం కృమిరక్షోఘ్నం వ్రణకండూ రుజాపహమ్ ॥

తా. వేపాకు వస యింగువ నెయ్యి ఉప్పు సైంధవలవణము వీనిని చూర్ణము చేసి వ్రణములయందు ధూపము వేసిన క్రిములు రక్షస్సు వ్రణము దురద పీడ హరించు.

## వ్రణ లేపనములు.

శ్లో॥ సప్తదళదుగ్ధకల్కశ్శమయతి దుష్టవ్రణంప్రలేపేన ।
మధుయుక్తాశరపుంఖా సర్వవ్రణరోపణఃకథితా ।
పంచవల్కలచూర్ణైర్వా శుక్తిచూర్ణ సమాయుతైః ।
ధాతకీలోధ్రచూర్ణైర్వా లేపోరోపకః పరః ॥

తా. ఆకుజెముడుపట్టను పాలతోనూరి లేపనముజేసిన దుష్టవ్రణము శమించు. లే తెల్లవెంపలిచూర్ణమును తేనెలోగలిపి లేపనముజేసిన సర్వవ్రణములు మాంస పూరితంబులగు. మఱియు పంచవల్కల చూర్ణమునుగాని కప్పచిప్ప సున్నము ఆరె పువ్వు లొద్దుగు వీనిచూర్ణమును గాని లేపనముజేసిన వ్రణములుమారి మాంసపూరి తంబులగు.

## అయోరజాది లేపము.

శ్లో॥ అయో రజస్సకాసీసం త్రిఫలా కుసుమానిచ ।
ప్రలేపః కురుతేదార్వ్య సద్య ఏవ నవత్వచి ॥

తా. ఇనుపపొడి అన్నభేది త్రిఫలములు లవంగములు మ్రానిపసపు వీనిని నూరి వ్రణముయొక్క నూతనచర్మముపై లేపనముజేయుట హితకరంబు.

## ఆగంతుక వ్రణనిదానము.

శ్లో॥ [ఆయుర్వేదే] నానాధారా ముఖైశ్శస్త్రై ర్నానాస్థాన నిపాతితైః । భవంతినానాకృతయోవ్రణాస్తాంస్తాన్నిబోధమే ॥

తా. పలువిధములైన పదునుముఖములుగల నాయుధములచే శరీరముయొక్క పలువిధ స్థానములయందు తగులు దెబ్బలవలన జనించునట్టి పలువిధములైన నాకృతులుగల వ్రణముల వచించెద.

## ఆగంతుకవ్రణ భేదములు.

శ్లో॥ ఛిన్నంభిన్నం తథావిద్ధం క్షతం పిచ్ఛితమేవచ ।
ఘృష్టమాహుస్తథాషష్ఠం తేషాం వక్ష్యామిలక్షణమ్ ॥

తా. ఛిన్నము భిన్నము విద్ధము క్షతము పిచ్ఛితము ఘృష్టము అని వ్రణములు విధంబులు వాని లక్షణముల వచించెద.

### ఛిన్న లక్షణము.

శ్లో॥ తిర్యక్ఛిన్న మృజుర్వాపి యోవ్రణస్త్వా యతోభవేత్।
గాత్రస్య పాతనంతద్ధి ఛిన్నమి త్యభిధీయతే ॥

తా. శరీరమున నాయుధప్రహారముచే అడ్డముగ వక్రముగ లేక పొడవుగ నైన వ్రణము ఛిన్నమనంబడు.

### భిన్న లక్షణము.

శ్లో॥ శక్తికుంతేషు ఖడ్గాగ్ర విషాణై రాశయోహతః ॥
యత్కించి త్స్రవతేతద్ధి భిన్నలక్షణము.చ్యతే॥

తా. శక్తి (బల్లెము) కుంతము బాణము కత్తియొక్క కొన విషాణము (దంతము కొమ్ము) అను నాయుధములచే కోష్ఠమునందు పొడవంబడుటవలన నొకింత రక్తము స్రవించిన భిన్నమనంబడు.

### కోష్ఠ లక్షణము.

శ్లో॥ స్థానాన్యామాగ్ని పక్వానాం మూత్రస్య రుధిరస్యచ ।
హృదుండుకః పుప్పుసశ్చ కోష్ఠ ఇత్యభిధీయతే ॥

తా. ఆమ అగ్ని పక్వ మూత్ర * రక్తాశయములు బొడ్డు మలాశయము పుప్పుసము అను నీ స్థలంబులు కోష్ఠమనంబడు.

### కోష్ఠభేద లక్షణము.

శ్లో॥ తస్మిన్ భిన్నే రక్తపూర్ణే జ్వరో దాహశ్చ జాయతే ।
మూత్రమార్గ గుదాస్యేభ్యో రక్తం ఘ్రాణాచ్చగచ్ఛతి ।
మూర్ఛాశ్వాస తృషాధ్మాన మభక్తం చాంధసేవచ ।
విణ్మూత్ర వాతసంగశ్చ స్వేదాస్రావోక్షి రక్తతా ॥
లోహగంధి త్వమాస్యస్య గాత్ర దౌర్గంధ్యమేవచ ।
హృచ్ఛూలం పార్శ్వయోశ్చాపి విశేషం చాత్రమేశ్శృణు ।

* రక్తాశయమన—యకృత్ ప్లీహములు.

తా. కోష్ఠ భిన్నమై రక్తముచే నిండియుండ జ్వరము దాహము మూత్ర మార్గ గుద ముఖ నాసికములవలన రక్తస్రావము మూర్ఛ శ్వాసము దప్పి కడుపుబ్బరము అన్నద్వేషము మల మూత్ర వాతప్రతిబంధము మిక్కుటముగ చెమట నేత్రములయం దెలుపువర్ణము నోటియం దినుపవాసన శరీరదౌర్గంధ్యము హృదయము పక్కలు అనువానియందు శూల అను లక్షణంబులు కలుగు ఐనను దీనికన్ని విశేషముగా గలుగునట్టి లక్షణంబుల వచించెద.

## ఆమాశయ స్థితరక్త లక్షణము.

శ్లో॥ ఆమాశయసే రుధిరే రుధిరం ఛర్దయత్యపి ।
ఆధ్మాన మతిమాత్రంచ శూలంచ భృశదారుణమ్ ॥

తా. ఆమాశయమునందు రక్తము జేరియుండ రక్తవమనము మిక్కుటముగ కడుపుబ్బరము కడుభయంకరమయిన శూల గలుగు.

## పక్వాశయస్థ రక్త లక్షణము.

శ్లో॥ పక్వాశయ గతేచాపి రుజా గౌరవమేవచ ।
అధఃకాయే విశేషేణ శీతతాచ భవేదిహ ॥

తా. పక్వాశయమునందు రక్తము జేరియుండ శూలజడత్వము నడుముయొక్క క్రింది భాగమునందు విశేషముగ శీతలము గలుగు.

## విద్ధ లక్షణము.

శ్లో॥ సూక్ష్మాస్య శల్యాభిహతం యదంగం త్వాశయంవినా ।
ఉత్తుండితం నిర్గతంవాత ద్విద్ధ మితినిర్దిశేత్ ॥

తా. సూక్ష్మమైన ముఖముగల శల్యముచే ఆమాశయముగాని తక్కిన యంగములయందు పొడవబడుటవలన బైలువెడలిన శల్యము గలదిగాని ముఖముగలదిగ గాని నుండిన విద్ధమనంబడు.

## క్షతవ్రణ లక్షణము.

శ్లో॥ నాతిఛిన్నం నాతిభిన్న ముభయో ర్లక్షణాన్వితమ్ ।
విషమం వ్రణమంగేషు తత్క్షతం త్వభినిర్దిశేత్ ॥

తా. అంగము అతిభిన్నముగాక అతిచిన్నముగాకనుండుటచే ఛిన్నభిన్న లక్షణయుక్తంబై మిట్టపల్లములుగలదై యుండిన క్షతజవ్రణమనంబడు.

## పిచ్చితవ్రణ లక్షణము.

శ్లో॥ ప్రహార పీడనాభ్యాంతు యదంగం పృథుతాంగతమ్ ।
సాస్థిత ప్పిచ్చితంవిద్యా న్మజ్జార క్త పరిప్లుతమ్ ॥

తా. దెబ్బలవలనగాని బండిమొదలైన వానిచే నలుగుటవలనగాని అంగము విస్తరించి యెముకలతోగూడి మజ్జారక్తములయొక్క చేరిమిచే వ్రణభావముగలదై యుండిన పిచ్చిత మనంబడు.

## ఘృష్ట లక్షణము.

శ్లో॥ ఘర్షణా దభిఘాతాద్వా యదంగం విగతత్వచమ్ ।
ఉష్ణస్రావా న్వితం తద్ధి ఘృష్టమిత్యభి నిర్దిశేత్ ॥

తా. ఒరసికొనుటవలనగాని లేక అభిఘాతమువలనగాని శరీరముయొక్క పైచర్మము వీడి మంటతోగూడి రక్తముస్రవింపుచుండిన ఘృష్టమనంబడు.

## శల్యవ్రణ లక్షణము.

శ్లో॥ శ్యావంసశోథంపిటికాన్వితంచ ముహుర్ముహుశ్శోణితవాహి
నంచ । మృదూద్గతంబుద్బుదతుల్యమాంసం వ్రణంసశల్యం
సరుజంవదంతి ॥

తా. వ్రణము నీలవర్ణము వాపుగలసురుపులతో వ్యాప్తంబై పలుమారు రక్తమును స్రవింపంచేయుచు మృదువుగనుండినదై నీటిబుడ్గవలె పైకిలేచినటువంటి మాంసముగలదై వేదనతోగూడియుండిన శల్యవ్రణమనంబడు.

## కోష్ఠభేద లక్షణము.

శ్లో॥ త్వచోతీత్యసిరాదీని భిత్వావాపరిహృత్యవా ।
కోష్ఠే ప్రతిష్ఠితం శల్యం కుర్యాదుక్తానుపద్రవాన్ ॥

తా. శల్య మేదుచర్మములకు లోభాగమున ప్రవేశించి నరములు మాంసము లోను నరములు యెముకలు వీనిని భిన్నముజేసికొని లేక భిన్నము సేయకగాని కోష్ఠమును జెందిన కోష్ఠభేదమని తెలియవలయు. దానియందు పైజెప్పబడిన శల్యవ్రణోపద్రవంబులు గలుగు.

## అసాధ్యకోష్ఠభేద లక్షణము.

శ్లో॥ తత్రాంతర్లోహితంపాండు శీతపాదకరాననమ్ ।
శీతోచ్ఛ్వాసంరక్తనేత్ర మానద్ధం పరివర్జయేత్ ॥

తా. ఎవనికి రక్తములోన సంచితంబై పాండువర్ణముగ కాళ్ళు చేతులు చల్లగనుండునో శ్వాసముచల్లగ వెడలునో నేత్రము లెఱ్ఱనై యుండునో కడుపుబ్బరము గలిగియుండునో అట్టివారు యమాలయంబునకేగుదురని తెలియవలయు.

## మర్మక్షతసామాన్య లక్షణము.

శ్లో॥ భ్రమః ప్రలాపః పతనం ప్రమోహో విచేష్టనంగ్లానిరథో
ష్ణతాచ । స్రస్తాంగతామూర్ఛ నమూర్ధ్వవాతస్తీవ్రారుజో
వాతకృతాశ్చతాస్తాః । మాంసోదకాభంరుధిరంచ గచ్ఛేత్స
ర్వేంద్రియార్థోపరమస్తథైవ । దశార్ధసంఖ్యేష్వథవిక్షతే
షు సామాన్యతో మర్మసు లింగముక్తమ్ ॥

తా. భ్రమ తలుచుమాటలు భూమిపైబడుట యింద్రియ మనోమోహము గలుగుట కాళ్ళుచేతులు వివలించుట బడలిక వుష్ణముగలుగుట అంగసంధు లూడినటుల వేదనగలుగుట మూర్ఛ యెగయూపిరి వాతజన్య తీవ్రపీడ గలుగుట, రక్తము మాంసముకడిగిన నీళ్ళవలె ప్రవించుట సర్వేంద్రియ వ్యాపారము నశించుట యీ లక్షణములు సామాన్యముగ వుత్తరత్ర జెప్పంబడు మర్మములైన మాంససిరస్నాయు అస్థిసంధులయొక్క క్షతమువలన గలుగు.

## మర్మరహిత సిరావిద్ధ లక్షణము.

శ్లో॥ సురేంద్రగోపప్రతిమం ప్రభూతం రక్తం స్రవేత్తత్ క్షయ
జశ్చవాయుః కరోతిరోగా న్వివిధాన్యథోక్తాః సిరాసువి
ద్ధాస్వథవాక్షతాసు ॥

తా. సిరసు భేదించుటవలనగాని లేక దానియందు గాయమువగులుటవలన గాని యింద్రగోప పురుగువర్ణమువలె నెఱ్ఱనైనరక్తము మిక్కుటముగ స్రవించిన మర్మరహిత సిరావిద్ధమని తెలియవలయు. (మఱియు అరక్తక్షయమువలన వాతము బకోపించి పలువిధములైన ఆక్షేపకాదిరోగముల గలుగంజేయు.

## స్నాయువిద్ధలక్షణము.

శ్లో॥ కౌబ్జ్యంశరీరావయవావసాదః క్రియాస్వశక్తిస్తుములారుజశ్చ । చిరాద్వ్రణోరోహతియస్య చాపితంస్నాయు విద్ధంపురుషం వ్యవస్యేత్॥

తా. కుబ్జత్వము శరీరమునందు బడలిక పనిచేయుటకశక్తము కడువేదనగలిగి గాయము దీర్ఘకాలముమీద మాంసపూరితంబైన స్నాయువిద్ధమని తెలియవలయు.

## సంధివిద్ధ లక్షణము.

శ్లో॥ శోథాభివృద్ధిస్తుములారుజశ్చ బలక్షయః పర్వసుభేదశోథా। క్షతేషుసంధిష్వచలాచలేషు స్యాత్సర్వకర్మో పరమశ్చలింగమ్॥

తా. చలనముగాని లేక అచలనముగాని గలసంధులయందు గాయముదగుటవలన వాపుగలిగి వృద్ధిజెందుట మిక్కుటముగ వేదనగలుగుట నత్వముకోరవడు సంధులయందు భేదింపబడినటులనే పీడగలుగుట వాచుట యేపనిని జేయుటకు చకుండుట యీలక్షణములవలన సంధియందుగాయముతగిలినదని తెలియవలయు.

## అస్థివిద్ధ లక్షణము.

శ్లో॥ ఘోరారుజోయస్య నిశాదినేషు సర్వాస్వవస్థాసుచ నైతిశాంతిమ్ । భిషగ్విపశ్చిద్విదితార్థ సూత్రస్తమస్థి విద్ధంపురుషం వ్యవస్యేత్॥

తా. రేయుంబగలు భయంకరమైన పీడగలిగి జాగ్రతాది సర్వావస్థలయందు శాంతిజెందకుండిన వైద్యశాస్త్రవేత్తయగువాడు అస్థులయందు గాయముతగిలినదని తెలిసికొనవలయు.

## సిరాది మర్మవిద్ధ లక్షణము.

శ్లో॥ యథాస్వమేతాని విభావయేచ్చ లింగాని మర్మస్వభితాడితేషు ॥

తా. సిరాదిమర్మస్థానములయం దభిఘాతముగలిగిన పూర్వోక్తభ్రమ ప్రలాపాద్యాది లక్షణములవలన తెలిసికొనవలయు మఱియు చకారముచేత యీ లక్షణములును సామాన్యలక్షణంబులును గలుగునని తెలియందగు.

## మాంస మర్మవిద్ధ లక్షణము.

శ్లో॥ పాండు ర్వైవర్ణ్య స్స్పర్శితం నవేత్తి యోమాంసమర్మస్వభి
తాడితస్స్యాత్ ॥

తా. పాండురవర్ణము వైవర్ణ్యము స్పర్శజ్ఞాన శూన్యత గలవాడైయుండిన మాంసమర్మమునందు గాయముగలిగినదని తెలియవలయు.

## సర్వవ్రణోపద్రవములు.

శ్లో॥ విసర్పః పక్షఘాతశ్చ సిరాస్తంభోపతానకః ।
మోహోన్మాద వ్రణరుజా జ్వర స్తృష్ణా హనుగ్రహః ।
కాసశ్ఛర్ది రతీసారో హిక్కా శ్వాస స్సవేపథుః ।
షోడశోపద్రవాః ప్రోక్తా వ్రణానాం వ్రణవేదిభిః ॥

తా. విసర్పము పక్షఘాతము సిరాస్తంభనము అపతానకము మోహము ఉన్మాదము వ్రణమునందుపీడ జ్వరము దప్పి * హనుగ్రహము దగ్గు వాంతి అతిసారము యెక్కిళ్ళు శ్వాసము వణుకు అని పదియారుపద్రవంబులు వ్రణములయందు గలుగునని వ్రణవేత్తలగువారు వచించెదరు.

## ఆగంతుకవ్రణ చికిత్స

శ్లో॥ యష్టీమధుకయుక్తేనకించిదుష్ణేన సర్పిషా। మత్వాగంతువ్రణం వైద్యో వ్రఘృత క్షౌద్రసమన్వితమ్ । శక్త్యాక్రియాం ప్రయోక్తవ్యా పిత్తరక్తోష్మనాశినీ ॥

తా. ఆగంతుక వ్రణమునందు అతిమధుర చూర్ణమును నేతిలోగలిపి యొకింతయుష్ణముజేసి లేపనము జేయవలయు. మఱియు శక్తిని గుణ్యముగ నొకింత పిత్తకర రక్తశోధనకర పుష్టకర పదార్థములను నెయ్యి తేనె అనుపాని యుక్తముగజేసి రాత్రులయందుపచరింపవలయు.

## ఆగంతుకవ్రణ సామాన్య చికిత్స.

శ్లో॥ బుధ్వాగంతు వ్రణం వైద్యో ఘృతక్షౌద్రసమన్వితామ్ ।
శీతాంక్రియాం చరే దాశు రక్తపిత్తోష్మనాశినీమ్ ॥

* హనుగ్రహమన—కటిమర్లు కిట్టికొనుట.

తా. వైద్యుడు ఆగంతుక వ్రణలక్షణమును బాగుగ నెఱింగి రక్తపిత్తవృష్ణ నాశకర శీతకరక్రియలను నెయ్యి తేనె అనుపాని యుక్తముగ జేయవలయు.

శ్లో॥ క్రుద్ధేసద్యోవ్రణేకుర్యాదూర్ధ్వంచా ధశ్శోధనమ్ ।
లంఘనంచ బలంజ్ఞాత్వా భోజనాసృక్ప్రమోక్షణమ్ ॥

తా. ప్రకోపించియుండు ఆగంతుక వ్రణములయందు వమన విరేచన లంఘనభోజన రక్తమోక్షణముల వ్రణబలాను గుణ్యముగ జేయుంచవలయు.

## గౌరాది ఘృతము.

శ్లో॥ గౌరాహరిద్రామంజిష్ఠా మాంసీమధుకమేవచ । ప్రపౌండరీ కంహ్రీబేరంనతంముస్తంసచందనమ్ । జాతీనింబ పటోలంచ కరంజంకటుక రోహిణీ । మధూచ్ఛిష్టం మధూకంచ మహా మేదాతథైవచ । పంచవల్కలతోయేన ఘృతప్రస్థం విపాచ యేత్ । ఏతద్గౌరాదికంసర్పి స్సర్వవ్రణవిశోధనమ్ । ఆగం తుకాశ్చసహజా స్సుచి రోత్థాశ్చ యే వ్రణాః । నాడీవ్రణ శ్చవిషమో నశ్యంత్యేవ నసంశయః ॥

తా. గోరోచనము పసపు మంజిష్ఠి జటామాంసి అతిమధురము ప్రపౌండ రీకము కురువేరు గ్రంధితగరము తుంగముస్తెలు చందనము జాజి వేప చేతిపొట్ల కాగ్రనుగవిత్తులు కటుకరోహిణి మైనము యిప్ప మహామేద పంచవల్కములు వీనిని దంచి కషాయముకాచి అందొక ప్రస్థము నెయ్యిగలిపి ఘృతపక్వముకాచి లేపనము జేసిన సర్వవ్రణములు ఆగంతుకవ్రణములు సహజవ్రణములు దీర్ఘకాలముగనుండు వ్రణములు నాడీవ్రణములు దుష్టవ్రణములు వీనిని నిస్సంశయముగ హరింపంజేయు.

## జాత్యాది తైలము.

శ్లో॥ జాతీనింబ పటోలానాం నక్తమాలస్యపల్లవాః । సిక్థంమధు కం కుష్ఠంద్వేనిశే కటురోహిణి । మంజిష్ఠాపద్మకంలోధ్రమ భయానీలముత్పలమ్ । తుత్థకంశారిబాబీజం నక్త మాలస్య చతుష్పేత్ । ఏతానిసమభాగాని పిష్ట్వాతైలంవిపాచయేత్ । విషవ్రణ సముత్థేషు స్ఫోటకేషుచకచ్ఛుషు । కండూవిసర్ప రోగేషుకీటదష్టేషుసర్వథా । సద్యశ్శస్త్రప్రహారేషుదగ్ధవిద్ధక్ష

తేషుచ । నఖదంతక్షతే దేహే దుష్టమాంసావఘర్షణే । భక్షణార్థ మిదం తైలం హిందంశోధనరోపణమ్ ॥

తా. జాజియాకు వేపాకు చేలిపాట్లాకు కొత్తిసుగాకు మైనము అతిమధురము చంగల్వకోష్టు పసపు మానిపసపు కటుకరోహిణి మంజిష్ఠి పద్మకాష్ఠము లొద్దుగ కరక్కాయ నల్లకలువగడ్డలు మైలుతుత్తము సుగంధిసాలవేరు కానుగవిత్తులు వీనిని సమభాగములుగ గ్రహించినూరి కల్కముజేసి అందు తైలము గలిపి చిక్కగకాచి సేవించిన విషవ్రణము సర్వస్ఫోటకములు గజ్జి దురద విసర్పము పురుగుకాటు శస్త్రప్రహారమువలన తత్కాలమున గలిగిన గాయము కాలుటవలన గలిగిన గాయము పొడుచుటవలన గలిగిన గాయము నఖదంతములవలన గలిగిన గాయము శరీరమునందలి దుష్టమాంసమును భేదించుటవలన గలిగిన గాయము ఒరపిడివలన గాయము పరిశుద్ధమై మాంసపూరితంబయి మానును.

## దూర్వాదితైలము.

శ్లో॥ దూర్వాస్వరససంసిద్ధం తైలంకం పిల్లకేనవా ।
దార్వీ త్వచశ్చకల్కేనప్రధానం వ్రణరోపణమ్ ॥

తా. గరిక రసములోగాని కంపిల్ల రసములోగాని లేక మానిపసపు పట్ట కల్కములోగాని తైలముగలిపి చిక్కగకాచి లేపము చేసిన వ్రణముమాని మాంస పూరితంబగు యిది శ్రేష్ఠంబయినది.

## ఆమాశయ భేదోపచారము.

శ్లో॥ ఆమాశయస్థేరుధిరే వమనం పథ్యముచ్యతే ।
పక్వాశయస్థేదేయంచ విరేచన మసంశయమ్ ॥

తా. గాయము తగులుటవలన ఆమాశయమునందు రక్తము చేరియుండిన వమనమును పక్వాశయమునందు రక్తముచేరియుండిన నిస్సంశయముగ విరేచనమును చేయించవలయు.

## విపరీతకమల్ల తైలము.

శ్లో॥ సిందూరకుష్ఠంవిషహింగురసోన చిత్రబాణాం ఘ్రిలాంగలి కకల్క విపక్వతైలమ్ । పామిసాదమంత్రహుతహుంకృదితుష్టా

ఫేనఃక్లిన్న వ్రణప్రశమనో విపరీతమల్లః । ఖడ్గాభిఘాతగురుగండ మహోపదంశ । నాడీవ్రణవ్రణవిచర్చిక కుష్ఠపామాః। ఏతాన్నిహంతి విపరీతక మల్లనామతైలం యథేష్టశయనాస నభోజనస్య ॥

తా. సిందూరము చంగల్వకోష్టు నాభి యింగుక తెల్లులిపాయలు చిత్రమూలము తెల్లవెంపలి చెన్నచర్లగడ్డ హరిదళము మైలుతుత్తము ఏలాలు నల్లమందు వీనిలో తైలముగలిపి కాచి వ్రణములయందు లేపనముచేసిన సావ్రవముగల వ్రణముల శమింపంచేయు మఱియు విపరీతమల్లకమను నీతైల లేపనమువలన కత్తిగాయము పెద్దగంటులు భయంకరమైన వుపదంశము నాడీవ్రణములు వ్రణము విచర్చిక కుష్ఠువుగజ్జి హరించు. దీనియందు పథ్యనియమములు లేవు.

## సప్తవింశతి గుగ్గులము.

శ్లో॥ త్రికటు త్రిఫలాముస్తా విడంగా మృతచిత్రకమ్ । పటోలం పిప్పలీమూలం హపుషా సురదారుచ । తుంబురుం పుష్కరం చవ్యవిశాలా రజనీద్వయమ్ । బిడం సౌవర్చలంక్షారం సైంధవం గజపిప్పలీ । యావంత్యేతాని సర్వాణి తావద్విగుణగుగ్గులుః । కోలప్రమాణాంఃవటికాం భక్షయే న్మధునాసహ । కాసంశ్వాసం తథాశోఫ మర్శాంసిచ భగందరమ్ । హృచ్ఛూలం పార్శ్వశూలంచ కుక్షివస్తి గుదేరుజమ్ । అశ్మరీ మూత్రకృచ్ఛ్రించా ప్యాంత్రవృద్ధిం తథాకృమీన్ । చిరజ్వరోప సృష్టానాం క్షతోపహతచేతసామ్ । ఆనాహంచ తథోన్మాదంసర్వకుష్ఠో దరాణిచ । నాడీదుష్ట వ్రణాన్సర్వాన్ ప్రమేహాన్ శ్లీపదంతథా ! ధన్వంతరి కృతోహ్యేష స్సర్వరోగ నిషూదనః । సప్తవింశతికోనామ గుగ్గులుః ప్రతితో మహాన్ ॥

తా. త్రికటుకములు త్రిఫలములు తుంగముస్తెలువాయువిడంగములుశుద్ధి చేసిన నాభిచిత్రమూలము చేదుపొట్ల మోడిబోడతరము దేవదారు ధనియాలు పుష్కరమూలము చెవ్యము వెత్తిపుచ్చ పసపు మానిసపసపు బిడాలవణము సౌవర్చలవణము సర్జక్షారము యవక్షారము సైంధవలవణము యేనుగుపిప్పలి వీనినిసమభాగములుగ చూర్ణముచేసి

దానికి రెండింతలు శుద్ధిచేసిన గుగ్గిలమునుగలిపి మర్దించి రేగుగింజంత మాత్రలుచేసి తేనెతో సేవించిన సగ్గుప్పుబ్బసము వాపు మూలవ్యాధి భగందరము బొమ్మనొప్పి పార్శ్వశూల లోకడుపు పొత్తికడుపు గుదము అనువాని యందలి శూల అశ్మరి మూత్రకృచ్ఛ్రము అంత్రవృద్ధి క్రిముల పురాణజ్వరము గాయము కడుపుబ్బరము వున్మాదము సర్వకుష్ఠువులు సర్వోదరములు దుష్టనాడీవ్రణములు ప్రమేహము శ్లీపదము వీనిని హరింపంచేయు. ఇది సర్వరోగ వినాశనార్థంబై ధన్వంతరిచే జెప్పంబడియె. ఇది కడుశ్రేష్ఠంబయినది.

## * నాడీవ్రణ నిదానము.

శ్లో॥ యశ్శోథమామమతిపక్వము పేక్షతేజ్ఞో యోవావ్రణంప్రచు
రపూయమసాధువృత్తః । అభ్యంతరంప్రవిశతిప్రవిదార్యతస్య
స్థానానిపూర్వవిహితానితతస్సపూయః । తస్యాతిమాత్రగమ
నాద్గతిరిష్యతేతు నాడీవయ ద్వహతితేన మతాతునాడీ ॥.

తా. మూర్ఖమనుజుడు పండినవాపు నపక్వమనియెంచి యపేక్షించుట వలన గాని లేక చీమునిండియుండు వ్రణము నుపేక్షించుటవలన గాని దానియందు చీము పూర్వోక్తత్వఙ్మాంసాదిక స్థానములం జెంది భేదించి మిక్కుటముగ లోనికేగుటవలన యేకమార్గముగలదై దానివలన చీము నాడివలె గారుచుండిన నాడీవ్రణమనంబడు.

## నాడీవ్రణ భేదములు.

శ్లో॥ దోషైః ప్రిభిర్భవతిసా పృథగేకశ్చనం మూర్ఛితైరపిచ
శల్యనిమిత్తకోన్యా ॥

తా. నాడీవ్రణము వాతపిత్తశ్లేష్మ సన్నిపాత శల్యజమువలన 5 విధంబులు.

## వాతనాడీవ్రణ లక్షణములు.

శ్లో॥ తత్రానిలాత్పరుష సూక్ష్మముఖీ సశూలా ఫేనానువి ద్ధమధి
కం స్రవతిక్షపాసు ॥

తా. ముఖము రూక్షముగ సన్నగనుండుట శూలగలుగుట రాత్రులయందు మణుగుతోగూడిన స్రావము మిక్కుటముగ గలుగుట యీ లక్షణములుగలది వాత నాడీవ్రణమని తెలియవలయు.

---

* నాడీవ్రణమన — వారిపుండు.

## పిత్తనాడీవ్రణ లక్షణము.

శ్లో॥ పిత్తాత్తృష్ణాజ్వరకరీ పరి దాహయుక్తా పీతంస్రవత్యధికముష్ణ
మహస్సుచాపి ॥

తా. దప్పిజ్వరను దాహముగలుగుట చీము. పసపువర్ణము వుష్ణముగలదై పగటి
యందధికముగ స్రవించుట యీలక్షణములుగలది పిత్తనాడీవ్రణమని తెలియవలయు.

## కఫజనాడీవ్రణ లక్షణము.

శ్లో॥ శ్లేష్మాకఫా ద్బహుఘనార్జున పిచ్ఛిలాస్రా స్తబ్ధాసకండురరు
జారజనీప్రవృద్ధా ॥

తా. చీముగట్టిగ తెల్లగ బంకగ వెడలుట జడముగనుండుట కురద పీడగలు
గుట రాత్రులయందధికముగ చీముస్రవించుట యీ లక్షణములుకలది శ్లేష్మజనాడీ
వ్రణమని తెలియవలయు.

## శల్యజనాడీవ్రణ లక్షణము.

శ్లో॥ నష్టంకథంచి దనుమార్గముదీరితేషు స్థానేషు శల్యమచిరేణ
గతిం కరోతి । సాఫేనిలం మథితముష్ణ మసృగ్విమిశ్రం స్రా
వంకరోతి సహసాసరుజంచ నిత్యమ్ ॥

తా. కంటకాదిశల్యములు చర్మము మొదలగువానియందు ప్రవేశించి యగు
పడక నియమములైన వేగక్షయాది కారణ రహితంబులై సూక్ష్మమార్గముగలవై
శల్యజ వ్రణమునుగలుగంజేయు. దానియందు స్రావమునుజనుగ వేడిగ రక్తయుక్త
ముగ వెడలుటయేగాక మథించబడినటుల పోట్లును గలిగియుండు.

## సన్నిపాతజనాడీవ్రణ లక్షణము.

శ్లో॥ దాహజ్వర శ్వాసనమూర్ఛనవక్త్రశోషా యస్యాంభవంతి వి
హితానిచ లక్షణాని । తామాదిశే త్పవనపిత్తకఫ ప్రకోపా
ఘోరామ సుక్షయకరీ మివకాళరాత్రిమ్ ॥

తా. దాహము జ్వరము శ్వాసము మూర్ఛనోరెండుట అనులక్షణంబులునుపూ
ర్వోక్త వాతపిత్త కఫప్రకోపమువలనగలిగెడి లక్షణంబులును గూడియుండిన సన్ని

పాతజ నాడీవ్రణమని తెలియవలయు. ఇది భయంకరమైన ప్రాణములహరింపండే యుటయందు కాళరాత్రితో సమానంబైయుండు.

నాడీవ్రణసాధ్యాసాధ్య లక్షణము.

శ్లో॥ నాడీత్రిదోష ప్రభవా నసిద్ధ్యే చ్ఛేషాశ్చతస్రః ఖలుయత్న
సాధ్యాః ॥

తా. సన్నిపాతజ నాడీవ్రణం బసాధ్యము. తక్కినవి నాలుగును యత్నము వలన సాధ్యంబులగును.

నాడీవ్రణ సామాన్యచికిత్స.

శ్లో॥ నాడీనాం గతిమన్విక్ష్య శస్త్రేణోత్పాట్య కర్మవిత్ ।
సర్వవ్రణ క్రమంకుర్యా చ్ఛోధనా రోపణాదికమ్ ।
కృశదుర్బల భీరూణాం నాడీమర్మా శ్రితాతుయా ।
క్షారమాత్రేణ సంభిద్యా న్నశస్త్రేణ కదాచన ॥

తా. బుద్ధిమంతుడగు వైద్యుడు నాడిగతి నెఱింగి శస్త్రముచే దానింజీల్చి సర్వవ్రణములయందు చేయునటుల నే శోధన రోపణాదిక క్రియలం జేయవలయు. మఱియు కృశత్వమున సత్వహానిభయముగలవారలకు జనించిన నాడీవ్రణమునుమర్మ స్థలములయందు జనించిన నాడీవ్రణమును క్షారమువలన ఛేదనము చేయవలయునే గాని శస్త్రమువలన నెపుడును ఛేదనము జేయంజనదు.

వాతనాడీవ్రణ చికిత్సాక్రమము.

శ్లో॥ నాడీం వాతకృతాం సాధు పాటితాం లేఖయే ద్భిషక్ ।
ప్రత్యక్పుష్పీ ఫలయుతై స్తిలైః పిష్టైః ప్రలేపయేత్ ॥

తా. వాతజనాడీవ్రణమును శస్త్రముతోజీల్చి లేఖన క్రియంచేసి దానిపై తెల్లయుత్తరేణువిత్తులను నువ్వులనునూరి లేపనము చేయవలయు.

పిత్తజనాడీ వ్రణమునకు తిలాదిలేపము.

శ్లో॥ పైత్తికం తిలమంజిష్ఠా నాగదంతీ నిశాహ్వయైః ॥

తా. పిత్తజనాడీవ్రణమునందు నువ్వులు మంజిష్ఠి నాగదంతి పసపు వీనిని నూరి లేపనము సేయవలయు.

## కఫజనాడీవ్రణమునకు తిలాదిలేపము.

శ్లో॥ శ్లైష్మికం తిలయష్ట్యాహ్వానికుంభారిష్టసైంధవైః ॥

తా. కఫజనాడీ వ్రణమునందు నువ్వులు అతిమధురము నాగదంతి వేప సైంధవలవణము వీనిని నూరి లేపనము సేయవలయు.

## శల్యానాడీవ్రణమునకు తిలాదిలేపము.

శ్లో॥ శల్యజాంతిలమంజిష్ఠామధ్వాజ్యైర్లేపయేన్ముహుః ॥

తా. శల్యనాడీవ్రణమునందు నువ్వులు మంజిష్టి వీనిని తేనె నేతితోగాని నూరి పలుమారు లేపనము సేయవలయు,

## నాడీవ్రణచికిత్స.

శ్లో॥ అఘాతభగ్నంవిధిత్వాతుసేచయేచ్ఛీతవారిణా ।
పంకేనాలేపనంకార్యంబంధనంచకుశాన్వితమ్ ।
ఆలేపనార్థంమంజిష్ఠా మధుకంచామ్లపేషితమ్ ।
శతధౌతఘృతోన్మిశ్రంశాలిపిష్టంచలేపనమ్ ।
నాడీనాంగతిమన్విక్ష్యశస్త్రేణోత్పాట్యకర్మవిత్ ॥

తా. అభిఘాతాదికములవలన యెముకలువిరిగి దానిపై తొలుత శీతోదకమును బోసి తదనంతరము శస్త్రాదికములతో సిరలకపాయము గలుగకుండునటుల శరీరమున గుచ్చికొనియుండు శల్యములయుక్తితో దీసి దానిపై యెఱ్ఱమన్నును బూసి దర్భలనునిచి కట్టుగట్టి పిదప మంజిష్ఠిని అతిమధురమును నిమ్మపండ్లరసముతో నూరి లేపనముజేసి పిదప 100 మార్లు కడుగబడిన నేతితో బియ్యపుపిండిని గలిపి లేపనము జేయవలయు.

## జాత్యాదివర్తి.

శ్లో॥ జాత్యర్కశమ్యాకకరంజదంతీ సింధూత్థ సౌవర్చలయావశూకైః । వర్తిఃకృతాహంత్యచిరేణనాడీంస్నుక్షీరపిష్ట్వాసహా సైంధవేన ॥

తా. జాజి జిల్లేడు రేల క్రానుగ దంతివేరు సైంధవలవణము సౌవర్చలవణము యవక్షారము వీని నుదకముతో నూరి వస్త్రమునకు బట్టించి వర్తి చేసిగాని లేక జెము డుపాలలో సైంధవలవణమును నూరి వర్తి చేసిగాని వ్రణమునందునిచిన నాడీవ్రణము శీఘ్రముగ హరించు.

## నిర్గుండీ తైలము.

శ్లో॥ సమూలపత్రాంనిర్గుండీం పీడయిత్వారసేనతు ।
తేనసిద్ధంసమంతైలంనాడీదుష్టవ్రణాపహమ్ ॥

తా. వావిలి సమూలమునుదంచి రసమునుదీసి [illegible] సమముగ నూనెగలిపి తైలపక్వముగ కాచి లేపనముచేసిన దుష్టనాడీవ్రణము హరించు.

## నరాస్థి తైలము.

శ్లో॥ నరాస్థితైలలేపేనస్ఫుటితశ్శ్వయ్యతిత్రణః ॥

తా. మనుజునియొక్క యెముకలనూనెను లేపనముచేసిన వ్రణము పగిలి యెండును.

## విడంగాది గుగ్గులు.

శ్లో॥ విడంగత్రిఫలావ్యోష చూర్ణం గుగ్గులునా సమమ్ ।
సర్పిసాంవటికాంకుర్యాత్ఖాదేద్వాహితభోజనః ।
దుష్టవ్రణాపచీమేహ కుష్ఠనాడీవిశోధనః ॥

తా. వాయువిడంగములు త్రిఫలములు త్రికటుకములు వీనిని చూర్ణముచేసి దీనికి సమముగ శుద్ధిచేసిన గుగ్గిలము గలిపి నేతితో మర్దించి యుండలుచేసి సేవించిన దుష్టవ్రణము అపచి మేహము కుష్ఠువు నాడీవ్రణము హరించు. దీనియందు చప్పిడి పథ్యము నాచరింపవలయు.

## ఆరగ్వధాది వర్తి.

శ్లో॥ ఆరగ్వధనిశాకోలచూర్ణాజ్యక్షౌద్రసంయుతా ।
సూత్రవర్తిర్వ్రణేయోజ్యా శోధనీగతినాశినీ ॥

తా. రేల పసపు రేగుకాయ వీనిని చూర్ణముచేసి నెయ్యి తేనెగలిపిదానిలో నూలులో పేడిన వర్తినిపడిపి వ్రణములో నునిచిన వ్రణశుద్ధంబై దానిగతి హరించు.

## గుగ్గుల్వాది లేపము.

శ్లో॥ గుగ్గులుస్త్రిఫలావ్యోషై స్సమాంశై ర్జ్యాజ్యయోజితః ।
నాడీదుష్టవ్రణంచాపి జయేదపిభగందరమ్ ॥

తా. శుద్ధిచేసిన మహిసాక్షీ గుగ్గిలము త్రిఫలము త్రికటుకములు వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి నేతితోనూరి లేపనముచేసిన దుష్టనాడీ వ్రణమును భగందరమును హరింపంజేయు.

## సర్వవ్రణములయందు పథ్యము.

శ్లో॥ యవషష్టికగోధూమ పురాణాసితశాలయః । మసూరతువరీముద్గయూషశ్చమధుశర్కరాః । విలేపీలాజమండశ్చ జాంగలామృగపక్షిణః । ఘృతంతైలం పటోలంచ వేత్రాగ్రంబాలమూలకమ్। వార్తాకంకార వేల్లంచకర్కోటంతండులీయకమ్। ఏతత్పథ్యంసర్వే స్సేవ్యం యథావస్థంయథామలమ్ । వ్రణశోధేవ్రణేసద్యోవ్రణేనాడీవ్రణేషుచ ॥

తా. యవలు 60 దినములకు ఫలించిన వడ్లబియ్యము గోధుమలు నల్లని ప్రాతబియ్యము చిఱుసెనగలు కందులు పెసలు అనువాని యూషము తేనె పంచదార విలేపి పేలాలయొక్క మండము జాంగల దేశములోని పశుపక్షిమాంసము నెయ్యి నూనె పొట్లకాయ వెదురుమొలక లేతముల్లంగి వంకాయ కాకరకాయ పట్టుకాకరకాయ చిర్రికూర యివి వ్రణశోధనము వ్రణము సద్యోవ్రణము నాడీవ్రణము అనువాని యందు పథ్యకరంబులు. అట్లగుటంచేసి వానినాయారోగావస్థాభేదములదోషభేదముల నెఱింగి యథాయోగ్యముగ పథ్యమునందునిచి కొనవలయు.

## వ్రణములయందపథ్యము.

శ్లో॥ రూక్షామ్లశీతంలవణంవ్యవాయ మాయాసముచ్చైఃపరిభాషణంచ । ప్రియాసమాలోకనమహ్నినిద్రాం ప్రజాగరంచంక్రమణంనితాంతమ్ । శోకంవిరుద్ధాశనమంబుపానం తాంబూలశాకానిచపత్రవంతి । అజాంగలంమాంస మసాత్మ్యమన్నం వివర్జయేత్సంతతం ప్రయత్నాత్ ॥

తా. రూక్షము పులుసు శీతలము వుప్పుగల రసములు మైథునము శ్రమ బిగ్గరగ మాటలాడుట స్త్రీలంజూచుట పగటినిద్ర రాత్రులయందు జాగరణము కడు సంచారము శోకము విరుద్ధాశనము వుదకపానము. విదాహములగుఆహారలు జలచరజంతు మాంసము శరీర ప్రకృతి కనుగుణముగాని యన్నము యివియన్నియు వ్రణములయందపథ్య కరంబులగుటచేవానిని ప్రయత్న పూర్వకముగ వర్జింపవలయు.

## అగ్నిదగ్ధవ్రణ నిదానము.

వాక్యమ్॥ తత్ర స్నిగ్ధంరూక్షం వాశ్రిత్యద్రవ్యమగ్నిర్దహతి । అగ్ని
సంతప్తోహిస్నేహస్సూక్ష్మ మార్గానుసారిత్వాత్ । త్వగాదీన
నుప్రవిశ్యాశుదహతి । తస్మాత్స్నేహదగ్ధేధికారుజోభవంతి ।
తత్రప్లుష్టందుర్దగ్ధంసమ్యగ్దగ్ధం మతిదగ్ధంచేతి చతుర్విధంభవ
త్యగ్నిదగ్ధమ్ ॥

తా. అగ్నిస్నిగ్ధ రూక్షద్రవ్యాశ్రితంబై దహనము సేయు మఱియు అగ్నిచే తపింపబడినతైలము సూక్ష్మమార్గములవలన (అనగా రోమకూపములవలన) త్వఙ్మాంసాది సప్తధాతువులయందు బ్రవేశించి శీఘ్రముగ దహింపంచేయు. కావున స్నేహదగ్ధమున అధికమైన వేదనగలుగుట ఆయగ్నిదగ్ధము ప్లుష్టము దుర్దగ్ధము సమ్యగ్దగ్ధము అతిదగ్ధము అని 4 విధంబులు.

## విశేషజ్ఞానము.

శ్లో॥ తత్రవివర్ణమాత్రంప్లుష్య తేతత్ప్లుష్టమ్ । యత్రోత్తిష్ఠంతిస్ఫో
టాస్తీవ్రదాహవేదనాశ్చిరాచ్చోప శామ్యంతి తద్దుర్దగ్ధమ్ ।
సమ్యగ్దగ్ధ మవగాఢంతాళఫలవర్ణం సుస్థితం పూర్వలక్షణ
యుక్తమ్ । అతిదగ్ధంతు త్వఙ్మాంసావలంబన గాత్రవిశ్లేషణ
సిరాస్నాయు సంధ్యస్థివ్యాపాదనాతి మాత్రవేదనా జ్వర
దాహపిపాసా మూర్ఛాశ్వాసోప ద్రవాభవంతి । ఇత్యేవంప్లుష్టా
దిభేదేన వహ్నిదగ్ధశ్చతుర్విధో వ్రణోభవతి ॥

తా. అందు చర్మము వివర్ణంబగువరకు కాలిన ప్లుష్టమనియు కాలిన దాని బొబ్బలుగలిగి తీవ్రదాహవేదనాయుక్తంబై దీర్ఘకాలముమీద శాంతినొందిన దుర్దగ్ధమనియు లోతైనగాయములుగలదై తాటిపండుతో తుల్యమైనవర్ణముగలదై బొబ్బలే

వ్యాప్తంబై కడుదాహవేదనాయుక్తంబై యుండిన సమ్యగ్దగ్ధమనియు చర్మమాంసముల నహింపంచేయుటచే వాని నాశనటులంచేసి సిరలు స్నాయువులు సంధులు అస్థులు అనువానింజెరచి కడువేదనను జ్వరమును మంటను దప్పిని మూర్ఛను శ్వాసమును గలుగంచేసిన అతిదగ్ధమనియు తెలియవలయు. ఈ భేదములవలన అగ్నిదగ్ధ వ్రణము 4 విధంబులు.

## అగ్నిదగ్ధ వ్రణ చికిత్స.

శ్లో॥ ప్లుష్టస్యాగ్ని ప్రశమనే కార్యముష్ణం తథౌషధమ్ । శీతాముష్ణాంచతుర్దగ్ధే క్రియాంకుర్యాత్తతః । ఘృతాలేపన సేకాంస్తు శీతాన్యేవాస్య కారయేత్ । అతిదగ్ధే విశీర్ణాని మాంసాన్యుద్ధృత్యశీతలామ్। క్రియాంకుర్యాచ్చ తాంకాలే శాలితండుల ఖండనైః । తిందుక్యాశ్చ కషాయైర్వా ఘృత మిశ్రైః ప్రలేపయేత్ । సమ్యగ్దగ్ధేతు గాక్షీరి ప్లక్షచందన గైరికైః । సామృతైస్సర్పిషాయుక్తై రాలేపంగార యేద్భిషక్॥

తా. ప్లుష్టాగ్నిశమనార్థంబై వుష్ణకరౌషధముల లేపనము సేయవలయు. దుర్దగ్ధమున శీతకర క్రియలనుగాని లేక వుష్ణకర క్రియలనుగానిచేసి తదనంతరము ఘృతాదులయొక్క లేపనము సేచనము మొదలగు శీతకర క్రియలను చేయవలయు, అతిదగ్ధమున శిథిలంబై వ్రేలుచుండు మాంసమును ఛేదించి శీతకరక్రియను వరిబియ్యపు పిండిని నల్లతుమికిపట్ట కషాయముతోడంచేర్చి నేతినిగలిపి లేపనమును చేయవలయు. సమ్యగ్దగ్ధమున వెదురుప్పు మర్రి చందనము కావిరాయి తిప్పతీగె అనువాని కల్కములో నెయ్యిగలిపి కాచి లేపనము సేయవలయు.

## పథ్యాది లేపము.

శ్లో॥ పథ్యాకర్ద మజీరక మధుసిక్థకసర్జ మిశ్రితోలేపః ।
గవ్యం ఘృతమపహరతిచ పావక జనితం వ్రణంసద్యః ॥

తా. కరక్కాయ బురద జీలకఱ్ఱ అతిమధురము మైనము గుగ్గిలము వీనిని నూరిగాని లేక ఆవునేతినిగాని లేపనముచేసిన అగ్నిదగ్ధవ్రణము శమించు.

## సుధాది లేపము.

శ్లో॥ సుధాంపురాతనీందధ్నా వారిణాపరిపేషితామ్ ।
లేపనంతైల దగ్ధస్యవిస్ఫోటవ్యాధి నాశనమ్ ॥

తా. ప్రాతసున్నమును పెఱుగుమీఁది తేటనీరుతోనూరి లేపనముచేసిన వేసి నూనెవలన గలిగిన బొబ్బలు మానును.

## దగ్ధయవ చూర్ణము.

శ్లో॥ దగ్ధయవభస్మచూర్ణం తిలతైలాక్తం ప్రలేపనాదచిరాత్ ।
హరతి శిఖిదాహదగ్ధంభూయోభ్యంగా ద్వ్రణంనాశు ॥

తా. యవలనుగాల్చి మసిచేసి నువ్వులనూనెలోగలిపి పలుమారు లేపనము చేసిన అగ్నిదగ్ధవ్రణము శీఘ్రముగ మానును.

## చందనాది తైలము.

శ్లో॥ చందనం వటశృంగాశ్చమంజిష్ఠామధుకంతథా । ప్రపౌండరీకం దూర్వాచ పతంగం ధాతకీ తథా । ఏత్తైస్తైలంవిపక్తవ్యంగో క్షీరేణ సమాయుతం । అగ్నిదగ్ధేవ్రణేశ్రేష్ఠం తత్క్షణాద్రో పణం పరమ్ ॥

తా. చందనము మఱ్ఱిఊడకొనలు మంజిష్ఠి అతిమధురము ప్రపౌండరీకము గరిక రసకర్పూరము ఆరెపువ్వు అనువాని కల్కములో ఆవుపాలు నూనెగలిపి చిక్కగ తైలముకాచి లేపనముచేసిన అగ్నిదగ్ధవ్రణము తత్క్షణమున మాంసపూరితంబై మానును.

## పటోలాది తైలము.

శ్లో॥ సిద్ధంకషాయకల్కాభ్యాంపటోల్యాఃకటుతైలకమ్ ।
దగ్ధవ్రణరుజా స్రావదాహ విస్ఫోటనాశనమ్ ॥

తా. చేతిపొట్ల కషాయములోగాని లేక దాని కల్కములోగాని తెల్లావ నూనెనుగలిపి చిక్కగకాచి లేపనముచేసిన అగ్నిదగ్ధవ్రణమునందలి పీడ స్రావము మంటలు బొబ్బలు వీనిని హరింపంజేయు.

## మధూచ్ఛిష్టాది తైలము.

శ్లో॥ మధూచ్ఛిష్టంసమధుకంలోధ్రం సర్జరసంతథా ।
మూర్వాచందనమంజిష్ఠం పిష్ట్వా సర్పిర్విపాచయేత్ ।
సర్వేషామగ్నిదగ్ధానాం వ్రణరోపణముత్తమమ్ ॥

తా. మైనము అతిమధురము లొద్దుగ గుగ్గిలము గరిక చందనము. మంజిష్ఠి అనువాని కల్కములో నెయ్యికలిపి చిక్కగ కాచి లేపనముచేసిన అగ్నిదగ్ధవ్రణము లన్నియు మాంసపూరితంబులై మానును.

## లూతవ్రణ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] భ్రమశ్వాసజ్వరం దాహమూర్ఛాఘూర్ణం సకంపనం । శూలంద్దృష్టి ర్మహారౌద్రంలూతాః కుర్వ న్తి దేహినామ్ ॥

తా. భ్రమ వుబ్బసము జ్వరము దాహము మూర్ఛకలుగుట ఒడలు తిరుగుట శరీరము వణకుట శూల కనుభయంకరమైన దృష్టికలుగుట యీ లక్షణములుగలది లూతవ్రణమని తెలియవలయు. (దీనియందు వాత పైత్త శ్లేష్మ త్రిదోష భేదంబులు గలిగియుండు.)

## త్రిదోషజ లూత లక్షణము.

శ్లో॥ భ్రువోర్మధ్యే గళేహస్తే స్తనేకం ఠేచమూర్ధని ।
హృదిపృష్ఠేమర్మణీచ లూతస్స్యాత్తు త్రిదోషజః ॥
అసాధ్యా కష్టసాధ్యావా జ్ఞాత్వావైద్య ఉపాచరేత్ ॥

తా. కనుబొమలయొక్క మధ్యప్రదేశము గళము హస్తములు స్తనములు కంఠము శిరము హృదయము వీపు అను మర్మస్థలములయందు వ్రణములు జనించిన త్రిదోషలూతయని తెలియవలయు. వీనియొక్క అసాధ్య కష్టసాధ్యముల నెఱింగి వైద్యుడు చికిత్సింపవలయు.

## అసాధ్యలూత లక్షణము.

శ్లో॥ పక్వజంబూ ఫలాకారం తథారక్తం స్రవేద్యది ।
దంతోష్ఠం శ్యావలం యస్య లూతరోగీ నజీవతి ।
తథాపి తస్యకర్తవ్యా చికిత్సా జీవితావధి ॥

తా. నేరేడుపండు వర్ణముగలదై రక్తమును గార్చుచు దంతములు పెదవి నల్లనై యుండిన అట్టిలూతరోగి మృతిజెందునని తెలియవలయు. ఐనను జీవించియుండువరకు చికిత్సంజేయవలయు.

## వాతలూత చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] ఉత్పలం చందనంకుష్ఠం జీవంతీం శుంఠి పాటలామ్ ! మదనం బిల్వనిర్గుండీ దమనం బ్రహ్మదండికామ్ ।. నఖంచ తగరంచైవ వేతసం వరుణంతథా । జలేపిష్ట్వా ప్రలేపోయం వాతలూత నివారణమ్ ॥

తా. నల్లకలువ శ్రీగంధము చంగల్వకోష్టు మనుబాల శొంఠి కలిగొట్టు మంగవేరు మారేడు వావిలి దవనము బ్రహ్మదండి నఖము గ్రంధితగరము ప్రబ్బలి వులిమిడి వీనిని సమభాగములుగ నుదకముతో నూరి లేపనము చేసిన వాతలూతవ్రణము హరించు.

## వాతలూతకు లాంగల్యాది లేపము.

శ్లో॥ లాంగలీ భానుమూలంచ గృహధూమాజమూత్రకమ్ ।
దుత్తూరస్య ఫలేక్షిప్త్వా లేపోలూతవినాశకృత్ ॥

తా. చన్నచెర్లగడ్డ జిల్లేడువేరు కరుధూపము వీనిని మేకపంచితముతో నూరి వుమ్మెత్తకాయలోనునిచి వుటంబిడి నూరిలేపనము చేసిన వాతలూతవ్రణము మానును.

## పైత్తలూత చందనాది లేపము.

శ్లో॥ [ఆయుర్వేదే] చందనం చోత్పలం ముస్తాం లాంగలీం శుంఠి రేణుకామ్ । వాలుకం మధుయష్టించ కుసుంభ వల్కలా న్వితిమ్। తుల్యం పిష్ట్వా జలై ర్లేపః పిత్తలూతప్రశాంతయే ॥

తా. చందనము నల్లకలువదుంపలు తుంగముస్తెలు చన్నచెర్లగడ్డ శొంఠి రేణుకలు కూతురుబుడమ యష్టిమధుకము కుసుంబపట్ట వీనిని సమభాగములుగ నుదకముతో నూరి లేపనము చేసిన పైత్తలూతవ్రణము మానును.

## శ్లేష్మలూతకు శ్లేష్మాటకాది లేపము.

శ్లో॥ [చరకే] శ్లేష్మాట శారిబా ముస్తా వరుణంనాగపుష్పికామ్।
వహ్నిపాటల పాఠాశ్చ సలావంశత్వచంసమమ్ ।
జలైః పిష్ట్వా ప్రలేపోయం కఫలూత ప్రశాంతయే ॥

తా. విరిగిచెక్క గూడపాల తుంగముస్తెలు పులిమిడి నాగసంపంగి చిత్రమూలము కలిగొట్టు చిరుబొద్ది వీనిని సమభాగములుగ చూర్ణముచేసి దీనికి సమముగ వెదురు పీచుగలిపి పుష్పోదకముతో నూరి లేపనముచేసిన శ్లేష్మ లూతవ్రణము మానును.

## త్రిదోషజలూతకు మదనాది లేపము.

శ్లో॥ మలంకౌక్కుటపారావం హింగూ మదన తాళకమ్। వంశత్వగ్గిరకర్ణీంచ రేణుకంచమనశ్శిలామ్ । జలేపిష్ట్వా ప్రలేపోయం లూతం హంతి త్రిదోషజమ్॥

తా. కోడిపిష్టము పావురపిట్టపిష్టము యింగువ మ్రంగవేరు హారిదళము వెదురుపీచు తెల్లగంటెన రేణుకలు మణిశిల వీనిని సమభాగములుగ పుష్పోదకముతో నూరి లేపనముచేసిన త్రిదోషజ లూతవ్రణము మానును.

## జ్యోతిష్మతీ లేపము.

శ్లో॥ జ్యోతిష్మతీంచకర్కోటీ పల్లవంపేషయేజ్జలైః ।
లేపోలూతాన్నిహంత్యాశు సప్తరాత్రైర్నసంశయః ॥

తా. వెర్రిదుంతీగె డావరడంగిచిగుళ్ళు లేక చేదుబీరచిగుళ్ళు వీని పుష్పోదకముతో నూరి 7 దినములు లేపనముచేసిన త్రిదోష లూతవ్రణము నిస్సంశయముగ శీఘ్రముగ మానును.

## సర్పాక్షీ లేపము।

శ్లో॥ నరమూత్రేణసర్పాక్షీం పిష్ట్వాలేపంతుకారయేత్ ।
అసాధ్యాంసాధయేల్లూతాం త్రిదోషోత్థాం విసర్పిణీమ్ ॥

తా. సర్పాక్షీమూలమును నరమూత్రముతో నూరి లేపనముచేసిన అసాధ్యమైన త్రిదోష లూతవ్రణము మానును.

## గోజిహ్వాది లేపము.

శ్లో॥ గోజిహ్వాపల్లవాఃపాఠా మూలంతోయేనపేషయేత్ ।
లేపేననాశయేల్లూత మసాధ్యాంవిషజిహ్వికామ్ ॥

తా. బరివెంకచిగుళ్ళు చిరుబొద్దివేరు వీని పుష్పోదకముతో నూరి లేపనముచేసిన అసాధ్యమైన త్రిదోష లూతవ్రణము విషజిహ్వక మానును.

(జాజికాయ జాపత్రి పిప్పలి మోడి లవంగములు కాచు వోమము ఖురాసాని వోమము వీనిని సమభాగములుగ ఖల్వములోనుంచి 1 తులము రసకర్పూరము గలిపి వృష్ఠోనకముతో మర్దించి 2 పేసములయెత్తు రసకర్పూరము తూగునటుల మాత్రలుచేసి 2 మండలములు ప్రాతస్సాయంకాలముల నొక్కొక్క మాత్రచొప్పున ఆవునేతితో సేవించిన సర్వలూతావ్రణములు భగందరము గండమాల మేహవ్రణములు మొదలగు సర్వవ్రణములు హరించు. ఈ యౌషధసేవనకాలంబున చప్పిడి వంటకమును భుజింపవలయు. మఱియు భగందరవ్రణనివారణార్థంబై చెప్పంబడియుండు రవితాండవరసమును కాలాగ్నిరుద్రరసమును రసకర్పూరమును లూతావ్రణములయందును ప్రయోగింపందగు.)

(ఓం నమో భగవతే రుద్రాయ ఓంసురా మహాద్వీపమునివహా హుం సుర సుర అప్పహా నేనిక ప్రచనూక హానూవచమాను రహాణాంస్వాహా॥ అనుమంత్రముతో లూతావ్రణములను మంత్రింపవలయు. మఱియు సర్వౌషధముల నొసంగునపుడామంత్రము నే బఠింపవలయు.)

భుజపత్ర బంధము.

శ్లో॥ [మాధవనిదానే] కుంకుమంచందనంక్షీరైః పిష్ట్వామంత్ర
మిదంలిఖేత్। భూర్జపత్రేచతద్ధార్యంగళేవా బాహుమూల
కే। లూతాః హంతినసందేహో బంధేయేచ్ఛ్వేతసూ
త్రకైః॥

తా. కుంకుమ శ్రీగంధము వీనిని పాలతోనూరి భుజపత్రపాకుపై పైజెప్పబడిన మంత్రమునువ్రాసి దానిని మడచి తెల్లదారమున బంధించి మెడయందుగాని లేక సందిటియందుగాని గట్టికొనిన సర్వలూతావ్రణములు నిస్సంశయముగ హరించు.

* చల్ది చికిత్స

క॥ మురదాకుసింగువెన్నయు। నరవిగ మర్దించివేడ్కః జయ్యన
ధరణి। న్నరులకుఁగా)మినయప్పుడె। నురుచిరముగమామ
ముడికిపొన్నరులెల్లన్॥

క॥ ఆదొండవేరుగంధము। పాదుగనావాలముద్ధభక్షణచేయన్।
వేదేశునిక్రుపచేతను। నాదములేనట్టికప్పొగురుమూనన్॥

* చల్దియన—ముడికిపొన్నారి.

## మర్కటీ రోగోత్పత్తి.

శ్లో॥ [నిత్యనాథీయే] దేవేషుధావమానేషు హ్యంధకాసురసంయుగే। రుద్రకోపానలోత్పన్నా మర్కట్యో వేదనోత్కటాః॥

తా. తొల్లి దేవతలు అంధకాసురునితో యుద్ధముచేసినపుడు పరాజితులైనందున రుద్రకోపాగ్నివలన అత్యుత్కటమైన వేదనగల మర్కటీరోగములు జనించె. అవెవ్వియనిన.—

## మర్కటీరోగ భేదములు.

శ్లో॥ జిహ్వికా పద్మినీ నందా వాసినీ మోహినీ తథా ।
దాహినీ కాళరాత్రీచ క్షోభిణీ చాష్టసంఖ్యయా ॥

తా. జిహ్వక పద్మిని నంద వాహిని మోహిని దాహిని కాళరాత్రి క్షోభిణి అన మర్కటీరోగములు 8 విధంబులు.

## జిహ్వికామర్కటీలక్షణము తచ్చికిత్స.

శ్లో॥ సిద్ధార్థసదృశాకార జిహ్వికానామమర్కటీ ।
తృణధాన్యనిశాదార్విపిష్ట్వాతండుల వారిణా ।
తథాతస్యప్రదాతవ్యో లేపోయంవిషనాశనః ।
మంత్రేణశంభుదేవస్య దినేహోహంతితద్విషమ్ ॥

తా. తెల్లావాలవలె తెల్లనిపొక్కులు జనించిన జిహ్వకయను పేరంబరగు మర్కటియనంబడు. దానియందు దూసరిబియ్యము పసపు మ్రానిపసపు అనువానిని సమభాగములుగ పసిగడ్డుగుతోనూరి "ఓం హ్రాం హ్రీం ఫట్ స్వాహా" అనుశంభు దేవ మంత్రముతో నభిమంత్రించి లేపనముచేసిన జిహ్వకయను మర్కటీరోగము యొక్క విష మొకదినములో మానును.

## పద్మినీమర్కటీ లక్షణము.

శ్లో॥ రక్తదర్దురసంకాశం గాత్రంయస్య ప్రమృష్యతే ।
పద్మినీమర్కటీనామదాహః కండూర్విదాహితా ॥

తా. శరీరమున నెఱ్ఱనిదద్దువలె జనించి శరీరమునంతయు జెఱచి తాపము దురద మంటలు గలిగియుండిన పద్మినీమర్కటి యనంబడు.

## పద్మినీమర్కటికి పునర్నవాది లేపము.

శ్లో॥ పునర్నవోద్భవంమూలం సప్తపర్ణీంసమంతథా ।
గోమూత్రాక్షారనాశేన పిష్ట్వాలేపోవిషాపహః ॥

తా. తెల్లగలిజేరువేరు యేడాకులయరటివేరు సమభాగములుగ దంచి ఆవు పంచితముతోను కలిశోను నూరి "ఓం ముంచముంచ యితిస్వాహా" అను మంత్రముతో నభిమంత్రించి లేపనముచేసిన పద్మినియను మర్కటీరోగము హరించు.

## నందామర్కటీ లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] ఆగ్నేయస్ఫోటకాకారం యద్గాత్రంసా తునందికా । శూలదాహజ్వరంకంపంయాతిగాత్రంసవేదనమ్॥

తా. శరీరమున నగ్నిదగ్ధముతో సమానమైన బొబ్బలులేచుట తూల తాపము జ్వరము శరీరకంపము గలుగుట శరీరమునొచ్చుట యీలక్షణములుగలది నందయను మర్కటీరోగమని తెలియవలయు.

## నందామర్కటికి పద్మపత్రాది లేపము.

శ్లో॥ పద్మపత్రోశీరకంచ శ్వేతచందనముత్పలమ్ ।
శీతతోయేనపిష్ట్వాను లేపోమంత్రేణసుఖావహమ్ ॥

తా. తామరాకు వట్టివేరు శ్రీగంధము కలువగడ్డ వీనిలో దేని నేని శీతోదకముతోనూరి "ఓం స్వాహా భూర్భువస్వాహా హోంస్వాహా" అను మంత్రముతో నభిమంత్రించి లేపనముచేసిన నందయను మర్కటీరోగము హరించు.

## వాసినీమర్కటీ స్వరూపము.

శ్లో॥ వక్త్రంచపింగళం కృష్ణాజ్వాలితాగ్నినిభేక్షణా ।
వింశదంష్ట్రీమహారౌద్రీ వాసినినామమర్కటీ ॥

తా. ముఖము పింగళవర్ణముగలదిగ శరీరము నలుపువర్ణముగలదిగ అగ్నివలె జ్వలింపుచుండు నేత్రములుగలదిగ యిరువదికోరలుగలదిగ మహాభయంకరముగ నుండినది వాసినియను మర్కటీదేవతయని తెలియవలయు.

## వాసినీమర్కటీ లక్షణము.

శ్లో॥ ఆగ్నేయస్ఫోటకాశ్చైవ జాయంతేతద్విషాధికే ।
విధ్యంతిసర్వగాత్రాణి పూతిగంధముఖంభవేత్ ॥

తా. అగ్నితో దగ్ధంబైనటుల స్ఫోటకములు జనించి విషమించినపుడు శరీరంబంతయు సూదులతో బాడుచునటుల వేదనగలుగుట ముఖము దుర్గంధముగ నుండుట యీ లక్షణములుగలది వాసినియను మర్కటీరోగమని తెలియవలయు.

## వాసినీమర్కటికి ఈశ్వర్యాది లేపము.

శ్లో॥ ఈశ్వరీనింబపత్రాణి శ్వేతాకాశకుశా స్తథా ॥
కషాయైఃపంచభిర్ఘాతే తల్లేపశ్చసుఖావహః ॥

తా. ఈశ్వరి వేరు వేపాకు గరిక వేరు కుశదర్భ వేరు వీనిని సమభాగములుగ నుదకముతోనూరి యీడిగువ నుదహరించెడి పంచత్వక్కులకషాయముతో మర్కటీరోగమును గడిగి యభిమంత్రించి లేపనముచేసిన వాసినియను మర్కటీరోగము హరించు.

## పంచత్వక్కుల కషాయము.

శ్లో॥ ఉదుంబరవటాశ్వత్థ చూతప్లక్షసముద్భవాః ।
త్వక్పంచకకషాయేణ శివమంత్రశ్చినోదితః ॥

తా. మేడి మఱ్ఱి రావి మామిడి జువ్వి యను పంచత్వక్కుల దంచి కషాయము కాచి దానితో మర్కటీరోగమును గడుగవలయు. మఱియు దానిని "ఓం నమో భగవతే రుద్రాయ హరహర గచ్ఛతు విషంస్వాహా" అను మంత్రముతో నభిమంత్రించి పూర్వోక్తఔషధములను లేపనము సేయవలయు.

## మోహినీ మర్కటీ స్వరూపము

శ్లో॥ బహుపాదామహాకాయా బహురూపావిషోత్కటా ।
మోహినీనామ విజ్ఞేయా విద్ధో ధత్తేన జీవితమ్ ॥

తా. అనేకపాదములు గొప్పశరీరము పెక్కురూపములుగలదై కడువిషముతో గూడియుండునది మోహినీ మర్కటీదేవత యని తెలియవలయు. ఇది సోకిన మనుజుడు జీవింపడు.

## మోహినీ మర్కటీ లక్షణము.

శ్లో॥ రోమాంచోత్థజ్వరో దాహో స్వేదో నిద్రాండవర్ధనమ్ ।
రక్తాంగశ్చ్వయథుశ్చేతి తయాదష్టస్యలక్షణమ్ ॥

తా. గగుర్పాటు జ్వరము దాహము చెమట నిద్రాభంగముగలుగుట అండములు వృద్ధిం జెందుట శరీరము రక్తవర్ణముగనుండుట శరీరము వాచుట యీ లక్షణములవలన మోహినీమర్కటి సోకినదని తెలియవలయు.

## దాహినీ మర్కటీ లక్షణము.

శ్లో॥ అగ్నితుల్యాబృహత్పాదా మరంతాగరళోత్కటా ।
దాహినీదాపరాధీతా మూర్ఛాదాహోతిదారుణః ॥

తా. అగ్నివలెమండును గొప్పపాదములుగలదై మృత్యుప్రదంబై అత్యుత్కటమైన విషముతో గూడియుండునది దాహినీమర్కటి యనంబడు. అది సోకిన మూర్ఛ కడుభయంకరమైన దాహము గలుగు.

## మోహినీ మర్కటీ చికిత్స.

శ్లో॥ గర్దభాండప్రియంగూచ శ్వేతచందనచిత్రకమ్ ।
శిఖినీలోత్పలంచాపి త్వాలేపో హంతితద్విషమ్ ॥

తా. కలుజువ్వి (ధరణివేరు) పేంకణము శ్రీగంధము చిత్రమూలము మయూరశిఖి నల్లకలువగడ్డ వీనిని సమభాగములుగ నుదకముతో మెత్తగనూరి "ఓం నమోరుద్రాయ హేనవే గౌరీపతయే మహాపక్షి రాజాయ పక్షి పాతేనహర విషం స్వాహా" అను మంత్రముతో నభిమంత్రించి లేపనము చేసిన మోహినియను మర్కటీ రోగము హరించు.

## కాళరాత్రి మర్కటి స్వరూపము.

శ్లో॥ శుక్లాకృష్ణాఘుహాంఘ్రిశ్చ రోమాంచావిషవన్మదా ।
కాళరాత్రిస్తయాదష్టే నమంత్రంనచభేషజమ్ ॥

తా. తెల్లగాగాని లేక నల్లగాగానిమండుటబరువై పాదములు గలిగియుండుట రోమములు నిక్కబొడిచికొనియుండుట కడువిషతుల్యముగనుండుట యీలక్షణములు లది కాళరాత్రిమర్కటియని తెలియవలయు. ఇది సోకినమంత్రౌషధములు లేవు.

## క్షోభిణీ మర్కటీ స్వరూపము.

శ్లో॥ బహుపాదాన్వితా శ్వేతా రక్తపాదానచేక్షణా ।
క్షోభిణీపాచవిజ్ఞేయా స్ఫోటతోద వ్రణాదయః ॥

తా. అనేక పాదములతో గూడియుండుట తెల్లగనుండుట యెఱ్ఱని పాద ములు గలదిగనుండుట దృష్టిలేకుండుట యీ లక్షణములుగలది క్షోభిణీమర్కటి యని తెలియవలయు. ఇది సోకిన బొబ్బలు సూదులతో బొడుచునటుల వేదన వ్రణములు మొదలగునవి గలుగు.

## క్షోభిణీ మర్కటీ చికిత్సాక్రమము.

శ్లో॥ కషాయైః క్షాళనం త్వక్భి స్సింధు మధ్వాజ్యలేపనమ్ ।
పశ్చా చ్ఛిన్నేశ్వరీమూలం మధుపర్ణి శతావరీ ।
చందనోదక పిష్టానాం చందనం లేపనంహితమ్ ।
సమంత్ర మౌషధంప్రోక్తం మర్కటీ విషనాశనమ్ ॥

తా. మర్కటీరోగమును పంచత్వక్కులకషాయముతోగడిగి సైంధవలవణము ములో తేనె నెయ్యిగలిపి లేపనముచేసి తదనంతరము తిప్పతీగె యీశ్వరి వేరు గుమ్మడు వేరు పిల్లిపీచర అనువానిని సమభాగములుగ శ్రీగంధపురసముతోనూరి లేపనము చేసిన క్షోభిణియను మర్కటీరోగము హరించు. (మఱియు 8 విధములైనమర్కటీ రోగములయందు పూర్వోక్త ఔషధలేపనమును మంత్రాభిమంత్రముల నొక మండలముగాని లేక 2 మండలములుగాని చేయవలయు.) వానిచే మర్కటీరోగవిష ములు హరించు.

## అర్బుదరోగ నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] గాత్రప్రదేశే క్వచిదేవదోషా స్సంమూర్ఛితామాంస మసృక్ప్రదూష్య । వృత్తం స్థిరం మందరుజం మహాంత మనల్పమూలం చిరవృద్ధిపాకమ్ । కుర్వంతిమాంసో చ్ఛ్రయమత్యగాధం తదర్బుదంశాస్త్రవిదోవదంతి । అర్బుదే గ్రంథివ త్కుర్యా ద్వేధితం సుతరాం హితమ్ ॥

తా. ప్రకోపించిన దోషములు శరీరమునందేదైన నొకభాగమునమాంసరక్తములం జెఱచి గుండ్రమై స్థిరమైయొకింతనొప్పిగలదై గొప్పదియై లోతుగవ్యాపించిన

మూలముగలదై చిరకాలము మీాద వృద్ధింజెంది లోతుగలదైయుండు మాంసపు ముద్దను గలుగంజేసిన వైద్యవేత్తలు అర్బుదమని వచించెదరు. దీనియందు గ్రంధుల వలెనే సిరావేధనుసేయుట కడుహితకరంబు. (అర్బుదమన—పొరగడ్డ.)

## అర్బుదరోగ లక్షణము.

శ్లో॥ మృదుస్థూల స్తథాశోథః క్వచిద్గాత్రే ప్రకాశితః ।
సుజాత మర్బుదంజ్ఞేయం చిరాద్వృద్ధిశ్చ పాకకృత్ ।
భవే త్తం పాచయేచ్ఛోథం లేపనైః పాకకారకైః ।

తా. శరీరమునం దేదైన నొకభాగమును మృదువుగ గొప్పదిగనుండు వాపు జనించి మెఱయుచు చిరకాలము మీాదబాగుగ వృద్ధింజెంది పాకమునుజెందినఅర్బుద మనంబడు. దీనిని పాకోపయుక్తలేపనములవలన పాకము జేయించవలయు.

## అర్బుద భేదములు.

శ్లో॥ వాతేనపిత్తేన కఫేనచాపి రక్తేనమాంసేన చమేదసాచ ।
తజ్జాయతేతస్యచలక్షణాని గ్రంథేస్సమానాని సదాభవంతి ॥

తా. అర్బుదము వాత పిత్త కఫ రక్త మాంస మేదజములన 6 విధంబులు. వానియం దెల్లపుడు గ్రంథిలక్షణంబులే గలిగియుండు.

## రక్తార్బుద లక్షణము.

శ్లో॥ దోషఃప్రదుష్టో రుధిరం సిరాసు సంకుచ్య సంపీడ్య తతోస్య పాకమ్ । సాస్రావమున్నహ్యతి మాంస పిండం మాంసాం కురైరాచితమాశు వృద్ధమ్ । కరోత్యజస్రం రుధిరప్రవృద్ధి మసాధ్యమేత ద్రుధిరాత్మకంతు । రక్తక్షయోపద్రవ పీడి తత్వాత్పాండుర్భవేత్సో ర్బుదపీడితస్తు ॥

తా. ప్రకోపించినదోషము సిరలయందు రక్తమును సంకోచపఱచి (అనగా జేర్చి) పీడించుటచే మాంసపుముద్దను యెత్తుగజేసి యొకింత పండునట్లుగం జేయుట కొంచెముగ స్రావముగలదై మాంసపుమొంకురములతో వ్యాప్తంబై శీఘ్రముగ వృద్ధిం జెందునదియైయుండుటవలన యెల్లపుడు రక్తమునుగార్చుచుండుట రక్తము క్షయిం

చుటవలన అర్బుద పీడవల్లన శరీరము తెలుపుబారుట యీ లక్షణములుగలది రక్తార్బుదమని తెలియవలయు. ఇది యసాధ్యము.

## మాంసార్బుద లక్షణము.

శ్లో॥ ముష్టిప్రహారాదిభి రర్దితేంగే మాంసం ప్రదుష్టం జనయేద్ధి శోథమ్ । అవేదనం స్నిగ్ధ మనన్యవర్ణ మపాకమశ్మోప మమ ప్రచాల్యమ్ । ప్రదుష్ట మాంసస్య నరస్య గాఢ మేతద్భవేన్మాంస పరాయణస్య । మాంసార్బుదం త్వేత దసాధ్య ముక్తం సాధ్యేష్వ పీమానితు వర్జయేచ్చ ॥

తా. పిడిదెబ్బలు మొదలగు వానివలన అంగపీడితుడై యుండ దుష్టమైన మాంసము వేగనారహితంబై మినమినలాడుట చర్మసమానవర్ణముగలదై పాకరహితంబై తాయినలెగట్టిగ చలించనదియైయుండు వాపునుగలుగంజేసిన మాంసార్బుదమనంబడు. ఇది అసాధ్యము. ఈ మాంసార్బుదము మాంసము జెడినవానికి ప్రతిదినము మాంసమును భక్షించెడు వానికని తఱుచుగ జనించు. ఈ క్రింద జెప్పంబడు నర్బుదములు సాధ్యంబులైనను వర్జింపవలయు.

## అసాధ్యార్బుద లక్షణము.

శ్లో॥ సంప్రస్రుతం మర్మణియచ్చజాతం స్రోతస్సు వాయచ్చ భవేదచాల్యమ్ ॥

తా. మర్మస్థలములపై జనించి స్రావముతో గూడియుండు అర్బుదమును నాసాది మార్గములపై జనించియుండు అర్బుదమును మఱియు స్థిరముగనుండు అర్బుదమును అసాధ్యంబులు.

## అధ్యర్బుద లక్షణము.

శ్లో॥ యజ్జాయతేన్య త్ఖలుపూర్వజాతే జ్ఞేయం తదధ్యర్బుదమర్బుదజ్ఞైః ॥

తా. పూర్వము జనించిన యర్బుదము మీద వేరొక యర్బుదము జనించిన అధ్యర్బుద మనంబడు.

## ద్విరర్బుద లక్షణము.

శ్లో॥ యద్ద్వంద్వజాతం యుగపత్క్రమాద్వా ద్విరర్బుదం తచ్చ భవే దసాధ్యమ్ ॥

తా. ఏకకాలమునందుగాని లేక 1 దానికి వెనుకనొకటిగగాని రెండర్బుదములు సమీపములుగ జనించిన ద్విరర్బుద మనంబడు. ఇది యసాధ్యము.

అర్బుద పాకాద్యుత్పత్తి కారణము.

శ్లో॥ నపాకమాయాంతికఫాధికాద్వా మేదోబహుత్వాచ్చవిశేష తస్తు। దోషస్థిరత్వా ద్గ్రథనాచ్చతేషాం సర్వార్బుదా న్యేవ నిసర్గతస్తు ॥

తా. కఫముగాని లేక మేదస్సుగాని యధికములుగ నుండుటవలన దోషములు స్థిరములుగ నుండుటవలన దోషములు 1 దానితో నొకటిజేరుటవలన సర్వార్బుదములయందు స్వభావముగ పాకము గలుగకనుండు.

గంధాది లేపము.

శ్లో॥ గంగశిలా విశ్వౌషధవిడంగ నాగభస్మ భిస్సమైశ్చూర్ణమ్ । కృకలాస రక్తయుక్తంలే పాత్సద్యో ర్బుదధ్వంసి ॥

తా. గంధకము మణిశిల శొంఠి వాయువిడంగములు నాగభస్మము వీనిని సమభాగములుగ చూర్ణముజేసి తొండరక్తములోగలిపి లేపనముజేసిన తత్క్షణమున అర్బుదము హరించు.

యవక్షారాది లేపము.

శ్లో॥ లిప్త్వా యవక్షార విడంగబీజం గంధోపలైస్సార్ష పస్పృణీ కృత్తైర్యత్ । రక్తేన మిశ్రైస్సరటస్యసద్య స్త్వర్ధ్యర్బుదం శామ్యతి నాన్యథైతత్ ॥

తా. యవక్షారము వాయువిడంగములు వీనిని ఖల్వములోనునిచి వెన్నతో మర్దించి తొండరక్తమునందుగలిపి లేపనముజేసిన అధ్యర్బుదము తక్షణమునశించు. ఇది మఱియొక విధముగ నశింపదు.

హారిద్రాది లేపము.

శ్లో॥ హారిద్రాలోధ్రపత్తంగ గుడధూమ మనశ్శిలాః । మధుప్రగాఢో లేపోయం మేదోర్బుద హరఃపరః । ఏతామేవ క్రియాంకుర్యా దశేషాం శర్కరార్బుదే ॥

తా. పసపు లొద్దుగ రసకర్పూరము బెల్లము కరుధూపము మణిశిల వీనిని ఖల్వములోనునిచి మర్దించి తేనెలోగలిపి లేపనముజేసిన మేదోర్బుదము నశించు. ఈ క్రియచే శర్కరార్బుదమునందును జేయందగు.

## రౌద్ర రసము.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధసూతం సమంగంధం మర్దయేద్యామ
చతుష్టయమ్ । నాగవల్లీ బలాద్రావైః మేఘనాద పున
ర్నవైః । గోమూత్రైః పిప్పలీయుక్తైః మర్దయేద్ధ్యా పుటే
ల్లఘు । లిహేత్క్షౌద్రై రసోరౌద్రః గుంజామాత్ర మితం
భవేత్ । పారిజాతాంబుదం చైవ కాసమర్దంచ సక్షిపేత్ ।
నింబపత్రోద్భవైశ్చాథ తత్కల్కైః శుధ్యతిప్రణమ్ ॥

తా. శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన గంధకము వీనిని సమభాగములుగ ఖల్వము లోనునిచి 4 ఝాములు కొటుకవలె మర్దించి పిప్పలిచూర్ణమునుజేర్చి మర్దించి తమల పాకుల తోడిమెలకసము ముత్తవపులగము చిట్టిఖూర తెల్లగలిజేరు అనువాని రసము లలోను గోమూత్రమును మరల 4 ఝాములు మర్దించి లఘుపుటంబిడి గురిగింజయెత్తును తేనెతో సాయంప్రాతఃకాలముల సేవింపుచుండుటయేగాని పారిజాతపాకు తుంగముస్తెలు కసివెందాకు వేపాకు అనువానిని కల్కముజేసి కాచి లేపనముజేసిన అర్బుదములు హరించు.

## అర్బుదమునకు చిత్రమూలాది లేపము.

శ్లో॥ చిత్రకం చిరిబిల్వంచ శృంగిబేర పునర్నవమ్ ।
లాంగలీ శిగ్రుమూలంచ దంతీ లవణపంచకమ్ ।
సకణా మరిచం పిష్ట్వా గోమూత్రేణ ప్రలేపయేత్ ।
సర్వార్బుదా వినశ్యంతే నరోహంతి పునర్నృణామ్ ॥

తా. చిత్రమూలము క్రానుగవేరు అల్లము గలిజేరు చెన్నచెర్లగడ్డ మునగవేరు నేలదంతి పంచలవణములు పిప్పలి మిరియాలు వీనిని సమభాగములుగ ఆవుపంచి తముతోనూరి లేపనముజేసిన సర్వార్బుదములు హరించు మరల జనింపగు.

## గళగండ నిదానము.

శ్లో॥ నిబద్ధ శ్శ్వయథుర్యస్య ముష్కవల్లంబతేగళే ।
మహాన్వాయ దివాహ్రస్వో గళగండంత మాదిశేత్ ॥

తా. కంఠమునందు పెద్దదిగగాని లేక చిన్నదిగగాని నుండు వాపు జనించి వృషణమువలె వ్రేలుచుండిన గళగండ మనంబడు.

## గళగండ సంప్రాప్తి.

శ్లో॥ వాతఃకఫశ్చాపిగళేప్రదుష్టో మన్యేసమా శ్రిత్యతథైవమేదః।
కుర్వంతిగండం క్రమశస్స్వ లింగై స్సమన్వితం తంగళగణ్డ మాహుః ॥

తా. దుష్టములైన వాత కఫ మేదస్సులు గొంతునందలి సిరలజెంది క్రమముగ వృద్ధిం జెంది తమతమ లక్షణయుక్తంబై నొకయుంటను గల్గంజేసిన గళగండ మనంబడు. (ఇది వాతజ కఫజ మేదజములన 3 విధంబులు.)

## వాతిక గళగండలక్షణము.

శ్లో॥ సూచీవ్యథా కృష్ణ సిరావనద్ధ శ్శ్యావారుణో వాపదనాత్మకస్తు । పారుష్యయుక్త శ్చిరవృద్ధ్యపాకో యదృచ్ఛయా పాకమియాత్కదాచిత్ । వైరస్యమాస్యచతస్యజంతో ర్భవేత్తథా తాలుగళ ప్రశోషః ॥

తా. సూదులతో బొడుచునటుల పీడగలుగుట నల్లని సిరలతో వ్యాప్తంబైయుండుట నీలముగ లేక యెఱ్ఱగ కఠినముగ నుండుట చిరకాలము పెరిగి పాకము జెందకుండుట నొకానొకపుడు కారణములేకనే పండుట నోరువిరసముగ నుండుట లోపలిదౌడ గొంతెండుట యీలక్షణములుగలది వాతికగళగండమని తెలియవలయు.

## కఫజ గళగండ లక్షణము.

శ్లో॥ స్థిరస్సవర్ణో గురురుగ్రకండూ శ్శీతోమహాం శ్చాపికఫాత్మకస్తు । చిరాభివృద్ధింభజతేచిరాచ్చ ప్రపచ్యతే మందరుజఃకదాచిత్ । మాధుర్య మాస్యస్యచ తస్యజంతో ర్భవేత్తథా తాలుగళప్రలేపః ॥

తా. స్థిరముగ చర్మముతో సమానవర్ణముగలదై జడముగ కడుదురద యుక్తముగ చల్లగ పెద్దదిగ దీర్ఘకాలముమీద వృద్ధిపొందినదిగ దీర్ఘకాలముమీద నొకా

నొకపుడు పండునదిగనుండుట పండునపు డొకింత పోట్లుగలుగుట నోరు తీపిగనుం డుట లోదాడ గొంతు కఫముతో నలగంబడినటులుండుట యీ లక్షణములుగలది కఫజ గళగండమని తెలియవలయు.

## మేదజగళగండ లక్షణము.

శ్లో॥ స్నిగ్ధోగురుః । పాండురపూతిగంధో మేదోభవస్స్వల్ప రుజోతి కండూః । ప్రలంబ తేలాబువదల్పమూలో దేహానురూపక్ష యవృద్ధియుక్తః । స్నిగ్ధాస్యతాతస్యభ వేచ్ఛజంతో ర్గళేనుశబ్దం కురుతేచ నిత్యమ్ ॥

తా. మినమినలాడుచు జడముగ పాండురవర్ణముగ దుర్గంధముగ మందమైన పీడగలదిగ కడుదురదయుక్తముగ నుండుట స్వల్పమూలముగలదై సొరకాయవలె వ్రేలుచుండుట శరీరముక్షయించిన నదియును క్షయించుట వృద్ధిం జెందిన నదియును వృద్ధిం జెందుట ముఖము నూనెచే బూయంబడినటుల మినమినలాడుట మాటలాడు నపు డెల్లపుడు గొంతువలన నుపశబ్దము వెడలుట యీ లక్షణములుగలది మేదజగళ గండమని తెలియవలయు.

## అసాధ్యగళగండ లక్షణము.

శ్లో॥ కృచ్ఛ్రాచ్ఛ్వసంతం మృదుసర్వగాత్రం సంవత్సరాతీతమ రోచకార్తమ్ । క్షీణంచవైద్యో గళగండజుష్టం భిన్నస్వరం చాపివివర్జయేత్తు ॥

తా. కష్టముగ శ్వాసము నేని లేక సర్వశరీరము మృదువుగ నేని గళగండము జనించి 1 సంవత్సరకాలం బతిక్రమించియేని అరోచకం బేని శరీరక్షయం బేని స్వర భేదం బేనిగల గళగండరోగిని వైద్యుడు వర్జింపవలయు.

## సర్షపాది లేపనము.

శ్లో॥ సర్షపాశ్శిగ్రుబీజాని శణబీజాతసీయవాః ।
మూలకస్యచబీజాని తక్రేణామ్లేన పేషయేత్ ।
గండానిగ్రంథయశ్చైవ గండమాలాస్తథైవచ ।
ఆలేపాస్తేప్రశామ్యంతి విలయంయాంతివాచిరాత్ ॥

తా. తెల్లావాలు మునగవిత్తులు జనపవిత్తులు అగిసెవిత్తులు యవలు ముల్లంగి విత్తులు వీనిని పుల్లనిమజ్జిగతో నూరి లేపనముజేసిన గళగండము గ్రంధులు గండమాల శీఘ్రముగ నశించు.

మండూర లోహము.

శ్లో॥ మహిషీమూత్రవిమిశ్రంలోహమలం సుస్థితంఘృతమాసమ్ ।
అంతర్ధూమవిదగ్ధంమధునా గళగండనాశనంలీఢమ్ ॥

తా. లోహకిట్టమును మంటిపాత్రయందునించి బర్రెమూత్రముబోసి యొకమాసమువరకునిలిచిపిదపదానినినూరి గజపుటంబిడి తేనెతో సేవించిన గళగండముహరించు.

వాతగళగండమునకు నిచులాది లేపము.

శ్లో॥ నిచులంశిగ్రుమూలాని దశమూలమథాపిచ ।
ఆలేపనంవాతగండే సుఖోష్ణంసంప్రశస్యతే ॥

తా. ప్రబ్బలి మునగవేరు దశమూలములు వీనినినూరి యొకింతవెచ్చజేసిసుఖోష్ణముగ లేపనముజేసిన వాతగళగండము హరించు.

కఫజగళగండోపచారము.

శ్లో॥ స్వేదోపనాహైః కఫసంభవేపి కృత్వా క్రమంశ్లేష్మహరం విదధ్యాత్ ॥

తా. ఒత్తడము కట్టుగట్టుట శ్లేష్మనాశకరక్రియలు అనువానివలన కఫజగళగండము హరించు.

దేవదార్వాది లేపము.

శ్లో॥ దేవదారుర్విశాలాచ కఫగండేప్రలేపనమ్ ।
సంఘర్షనం శీర్షకశ్చ సర్వేగండ నకేహితాః ॥

తా. దేవదారు వెట్టిపుచ్చ అనువాని లేపనమును వమనము శిరోవిరేచనము అను వానిని సర్వగళగండములయందు జేయుట హితకరంబు.

మేదజగళగండ చికిత్సాక్రమము.

శ్లో॥ మేదస్సముత్థేత్ర యథోపదిష్టాం విధ్యేచ్ఛిరాం స్నిగ్ధతనోర్న

రస్య । శ్యామాసుధాలోహ పురీషదంతీ రసాంజనై శ్చాపి హితః ప్రలేపః ॥

తా. శాస్త్రోక్తప్రకారము స్నేహమును లేపనముజేసి సిరావేధంజేసి పిప్పలి సున్నము లోహకిట్టము నేపాళములు రసాంజనము అనువానిని నూరి మేదజ గళగండమునందు లేపనముజేయుట హితకరంబు.

శ్లో॥ శ్వేతాపరాజితామూల ప్రాతఃపిష్ట్వాపిబేన్నరః ।
సర్పిపానియతాహారో గళగండప్రశాంతయే ।

తా. తెల్లగంటెనవేరును నూరి ప్రాతఃకాలమున ద్రాగి నేతియన్నము నెల్లపుడు భుజింపుచుండిన గళగండము శమించు.

## తుంబి తైలము.

శ్లో॥ విడంగక్షారసింధూత్థ రాస్నాగ్నివ్యోషదారుభిః ।
కటుతుంబీఫలరసే కటుతైలంవిపాచితమ్ ।
చిరోత్థ మపినస్యేన గళగండం వినశ్యతి ।

తా. వాయువిడంగములు యవక్షారము సైంధవలవణము వస సన్నరాస్నము చిత్రమూలము త్రికటుకములు దేవదారు అనువానికషాయములో చేదుసొరకాయల రసము తెల్లావనూనె గలిపి చిక్కగాకాచి నస్యముజేయించిన చిరకాలముగనుండు గళగండము నిస్సంశయముగ హరించు.

## తుంబ్యాది తైలము.

శ్లో॥ తుంబీరసేన కటుకేన చతుర్గుణేన కల్కీకృతైర్మగధజాదిగణౌషధైశ్చ । తైలంశృతంహరతి దేహేషుగండమాలామత్యుల్బణా మపిగళే గళగండరోగాన్ ॥

తా. నాలుగింతలు చేదుసొరకాయరసములో పిప్పల్యాదిగణోక్త ఔషధముల కల్కమును దానికి సమముగ నూనెగలిపి చిక్కగాకాచి లేపనముజేసిన ప్రబలమైన గండమాల గళగండము హరించు.

## సూర్యావర్త్యాది లేపము.

శ్లో॥ సూర్యావర్తరసోనాభ్యాం గళగండోపనాహనమ్ ।

స్ఫోటాస్స్రావై స్సంప్రయాతి గళగండో నసంశయః ॥

తా. సూర్యావర్తము వెల్లుల్లి వీనిని నూరి ముద్దజేసి కట్టుగట్టిన బొబ్బలు స్రావము వీనితో గూడియుండు గళగండము నిస్సంశయముగ శమించు.

పలాశమూల లేపనము.

శ్లో॥ తండులోదకపిష్టేన మూలేనపరిలేపితః ।
పీతఃకర్ణేషపలాశస్య గళగండప్రశామ్యతి ॥

తా. మోదుగవేరును బియ్యపుకడుగుతోనూరి చెవులయందు లేపనము జేసిన గళగండము హరించు.

గండమాల భేదములు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] చత్వారః క్రిమిజారోగా కాయంతే గ్రంథిపూర్వకాః । హృదయేగండమాలాఖ్యం కంఠేజాతం తథైవచ కపోలగండమాలాచా వ్యుత్తమాంగేచజాయతే । దంతవ్రణంకటిజాతం శ్రవణేనాసగండకే । ఏతేదుర్గంధ సంయుక్తాశ్శ్వేతరక్త సమన్వితః । ఏతేషాంభేషజంచైవ కథ్యతే పూర్వవేదిభిః ॥

తా. క్రిములవలన గ్రంధిపూర్వకముగ 4 విధములైన రోగములు జనించు. హృదయమున జనించిన హృదయగండమాల యనియు కంఠమున జనించిన కంఠగండమాల యనియు చెక్కిటజనించిన కపోల గండమాలయనియు శిరమున జనించిన కపాలగండమాలయనియు జెప్పంబడు. మఱియు పంటియందు జనించిన దంతవ్రణమనియు కటిప్రదేశమున జనించిన కటివ్రణమనియు చెవిలోగలిగిన కర్ణవ్రణమనియు నాసికమున జనించిన నాసికావ్రణమనియు జెప్పంబడు. యివియన్నియు దుర్గంధ యుక్తంబులై చీమును గార్చుచు తెల్లగ యెఱ్ఱగనుండు వీనికి ఔషధము పూర్వులచే జెప్పంబడియె.

గండమాల లక్షణము.

శ్లో॥ కర్కంధుకోలామలకప్రమాణైః కక్షాంసమన్యా గళవంక్షణేషు । మేదఃకఫాభ్యాంచిర మందపాకైస్స్యాద్గండమాలా బహుభిస్సుగండైః ॥

తా. మేదస్సు కఫము అనువానివలన చంకలు భుజశిరములు పెడతల పెద్ద నరము కంఠము గజ్జలు అనువానియందు రేగుపండు మిరియాలు వుసిరికకాయ అను వాని ప్రమాణముగల పలువిధములైన గ్రంథులు జనించి సావకాశముమీద కొంచె ముగ పాకమును జెందిన గండమాల యనంబడు.

## గండమాలలకు త్రికటుకాది వటికములు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] త్రికటుసవిళంగంతు ప్రత్యేకం నవనిష్కకమ్॥
నారికేళంతథాపిష్టం పురాణగుడమేవచ ।
ప్రత్యేకం పలమాత్రంతు రసభస్మచ నిష్కకమ్ ।
ఏరండతిలతైలేన భల్లాతకచతుష్పలమ్ ।
మర్దయేత్పచనంకృత్వా మాషమాత్రంచదాపయేత్
గండమాలా వినశ్యంతి లవణామ్లాంచ వర్జయేత్॥

తా. త్రికటుకములు వాయువిడంగములు యివి దినుసుకు 9 నిష్కములు ప్రాతకొబ్బెర ప్రాత బెల్లము యివిదినుసు కొక్కొకపలము రసభస్మము 1 నిష్కము జీడిగింజలు 4 పలములు యిటుల వీనినెల్ల నేకముజేసి మెత్తగదంచి అందు 4 పల ముల ఆముదము 4 పలముల నూనెగలిపివండి మాషప్రమాణము మాత్రలుజేసి సేవిం చిన గండమాలలు హరించు. దీని సేవనకాలంబున వుప్పును పులుసును వర్జించి (కంది పప్పు ఆవునెయ్యి నల్లనివరివంటకము) అనువానిని భుజింపవలయు.

## విడంగాది చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] విళంగేంద్రయవానూలంమహానింబద్రుమ
త్వచః । తుల్యంచూర్ణజలైఃపీతం కర్షైకం గండమాలనుత్॥

తా. వాయువిడంగములు కొడిసెవేరు పెద్దవేపచెక్క దీనియూర్ధ్వభాగంబున (300 కరక్కాయల బెరడు) వీనిని సమభాగములుగదంచి చూర్ణముజేసి కర్షప్రమా ణమును వుదకానుపానముతోడ సేవించిన గండమాలలు హరించు.

## గండమాలలకు తాళకాది వటికములు.

శ్లో॥ [ఆయుర్వేదే] శుద్ధతాళంశిలాంశుద్ధాం యవక్షారంససైంధ
వమ్।దార్వీంసుధాంచూర్ణయేత్తు మాక్షికేణసమాయుతమ్।
నిష్కార్ధంఘృతయుక్తంచ కంఠరోగేషు దాపయేత్॥

శా. శుద్ధిజేసినతాళకము శుద్ధిజేసినశిలాజిత్తు యవక్షారము సైంధవలవణము ప్రామినపకపు సున్నమువీనిని సమభాగములుగ్రహించి తేనెతో మర్దించి అర్ధనిష్క ప్రమాణము మాత్రలుజేసి వేతి యనుపానముతోడ సేవించిన కంఠగండమాలలు హరించు.

కః పూనియెద్దుత్రిగడ్డలు । సూనెయుమిరియంబువండి సూరక
త్రాగ । న్మానుగనలువది దినములు । మానవతతి కెల్లగండ
మాలలుమానున్ ॥

కః మిరియంబునూనెవెల్లుల్లి । బతెబచ్చలి గడ్డనూర్చి భక్షిం
పంగన్ । మరిసల్లవడ్లపుముర్రో । గిరమతినంగండమాలకిల్మిష
మడఁగున్ ॥

కః వారిజపుచెక్కరసమును । భేరెన్నకసిందురంబుపిప్పలిమోడిం ।
గూరిచిసేవించినదా । మారూక్షై కుష్ఠుగండమాలలడంగున్ ॥

గీః మంగతెల్లవెలకి మరిచిత్రమూలంబు । నెమలిచెక్కగారసీలి
పుప్పి । పిప్పలియనుచూర్ణ మొప్పఁగా వెన్నదా । గ్రోల
వేగఁగండ మాలలడఁగు ॥

గీః కలియుగంబునమునున్నారు కరకకాయ । లించుకని చూడఁ
బోవక యింపుతోడ । మండలంబారగింప భూమండలమున ।
గండమాలలు కుష్ఠురోగములుమాను ॥

గీః గాలనెల్లిత్రికటుకమునల్లపుప్పియు । సమముగూర్చినూనెసమ
ముగూర్చి । త్రాగిభానువార త్రయముదధ్యన్నంబు । గుటవ
గండమాల లడఁగిపోనె ।

(ఈరెండు గీతపద్యములయందు జెప్పంబడిన యౌషధములలో పూటకు రెండుచిన్నములయెత్తు రసకర్పూరమును గలిపి వెన్న యనుపానముతోడ దంతము లకు దగలక మ్రింగుచుండిన గండమాలలు హరించు.)

గండమాలలకు గంధకాది లేపము.

శ్లోః [చికిత్సాసారసిద్ధసంగ్రహే] గంధకంపాదం తుల్యా మర్క

క్షీరేణసైంధవమ్ । పిష్ట్వాచ కాంచనీమూలం లేపోయం గండమాలహః ॥

తా. గంధకము రసము సైంధవలవణము దేవకాంచనపట్ట వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి జిల్లేడుపాలతో మర్దించి గండమాలలయందు లేపనము జేసి అగ్నియందు కాచిన గండమాలలు హరించు.

శ్లో॥ [నిత్యానాధీయే] ఇంద్రవారుణికా మూలం భానుదుగ్ధేశ్చ సైంధవమ్ । పిష్ట్వాలేపేనహంత్యాశు ముండీద్రావేణ వేపయేత్ । పిబేత్స ప్తదినంయష్టిం గండమాలావినశ్యతి ॥

తా. పాపరవేరును జిల్లేడుపాలతో నూరి అందు సైంధవలవణము కలిపి గండమాలలపై లేపనముజేసి నిప్పసెగయందు కాచిన గండమాలలు హరించు మరియు యష్టిమధుకమును బోడతరరసముతో నూరి 7 దినములు త్రాగిన గండమాలలు హరించు. (రసము గంధకము మైలుతుత్తము వీనిని సమభాగములుగ నేకముజేసి ఆవువెన్నతో మర్దించి గండమాలపై లేపనముజేసి సెగయందు కాచిన గండమాలలు హరించు.)

## గండమాలా ఖండనరసము.

శ్లో॥ కర్షంసూతంశుద్ధమస్య గంధకంత్వర్ధముత్తమమ్ । సార్ధకర్షం తామ్రభస్మమృతంకిట్టత్రికర్షకమ్ । వ్యోషామట్కార్ష తులితామ తార్థుసైంధవంస్మృతమ్ ॥ కాంచనారత్వచశ్చూర్ణం పలత్రయమితంక్షిపేత్ । పలత్రయం గుగ్గులోశ్చ శుద్ధస్యసమ హారేత్ । ఏతదుక్త్వాతుసంమేళ్యసురభీసప్పిషాదృణామ్ । గండమాలాఖండనోయం రసోమాషత్రయాత్మకః । భుక్తోపి హంతి గండాని గండమాలాంచ దారుణామ్ ॥

తా. శుద్ధిజేసినరసము 1 కర్షము శుద్ధిజేసిన గంధకము ½ కర్షము తామ్రభస్మము 1½ కర్షము మండూరము 3 కర్షములు శొంఠి 2 కర్షములు మిరియాలు 2 కర్షములు పిప్పలి 2 కర్షములు సైంధవలవణము ½ అక్షము దేవకాంచనపుచెక్కచూర్ణము 3 పలములు శుద్ధిజేసిన మహిషాక్షి గుగ్గిలము 3 పలములు యిటుల వీనినెల్ల క్రమముగ నేకముజేసిన ఆవునేతితో దంచి 3 మాషముల యెత్తు యుండలుజేసి సేవించిన భయంకరములైన గళగండము గండమాలలు హరించు.

## గంధకాది లేపనము.

శ్లో॥ గంధకంటంకణంసింధుం కాంచనీనవసాగరమ్ । సౌవర్చలం యవక్షారం కాచంరక్తంసువర్చికామ్ । శీతంరక్తంచ పాషాణం మూషకోత్థం నియోజయేత్ । నేపాలబీజమజ్జాంచ సమం జంబీరపేషితమ్ । శస్త్రైశ్ఛిత్వా ప్రదాతవ్యం వేష్ట్య మేరండపత్రకైః । ఏవంత్ర్యహాత్స్ఫుటత్యేవ దద్యాన్నం దాపయేత్తతః । గండమాలాపచీగ్రంథి ర్బహిర్నిర్యాతినాన్యథా ॥

తా. గంధకము వెలిగారము సైంధవలవణము పసపు నవాసాగరము సౌవర్చలవణము యవక్షారము కాచలవణము సింధూరము సర్జక్షారము కర్పూరము లక్క పాషాణము యెలుక చెవిపట్ట నేపాళపువిత్తులు వీనిని సమభాగములుగ ఖల్వములో నూరి యీ యౌషధమును 3 దినములు ఆముదపాకులను జెట్టి కట్టుగట్టిన గండమాల అపచి గ్రంథిపగిలి అందలిదోషము నిశ్చయముగ బైలువెడలు. మఱియు దీనియందు పెరుగన్నము నొసంగవలయు.

## కపాలగండమాల లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] కపాలగండమాలాతు హ్యుత్తమాంగేచ జాయతే । ఏతద్దుర్గంధ సంయుక్తా శ్వేతరక్త సమన్వితా ॥

తా. శిరమున గండమాలజనించి దుర్గంధయుక్తమై చీముగారుచు తెల్లగ యెఱ్ఱగనుండిన కపాలగండమాలని తెలియవలయు. (ఇది హరించుటకై యింగిలీకముయొక్క పొగవుబ్బనేని రసకర్పూరసేవననేని జేయందగు.)

సీ। రమణతో నాగసరపు గడ్డరసమును । వెన్నతోఁగూర్చి సేవింపవలయు । నురువజ్రనిలాకు నొగిమేకపాలతో । విశదంబుగాను సేవింపవలయుఁ । గడఁకతో విడివేళ్ళ వడిసూనెతో నండి । వేడుకతోను సేవింపవలయుఁ । బొసఁగ వెల్తురు వేళ్ళరసమును నూనెయు । మిరియంబుగూర్చి మెసఁగవలయుః । జౌటపుల తీగె గేస్సును సరిచినెత్తు । గురిజగారల వేళ్ళను గూర్చిమాన ।

మిరియమునుగల్పి సేవింప ధరణియందుఁ । బలుకపాలపుగం
డమాలలునడంగు ॥

తా. నాగసరపుగడ్డనునూరి పొంకంతముద్దజేసి వెన్నతో నొకమండలముగాని లేక 2 మండలములుగాని సేవించినను లేక వజ్రనీలానునూరి ముద్దజేసి నేకపాలతో సేవించినను కపాలగండమాలలు హరించు. ఈ 2 యౌషధముల సేవించునపుడు చప్పిడన్నమును నల్లవరియుగిరికెను భుజింపవలయు. పిడికెడు లవిడివేళ్ళను చిదియ గొట్టి సోలెడు నూనెగలిపి కాచి ప్రాతస్సాయంకాలముల నౌటాంసుప్రమాణమును 2 మండలములుసేవింపుచు లవిడియాకునూరి లేపనము సేయుచుండిన కపాలగండమాలలు హరించు. దీనియందు చప్పిడివంటకమును భుజింపవలయు. వెల్తురువేళ్ళ రసము పావుసేరు మిరియపుచూర్ణము 1 తులము నూనె 1 తులముగలిపి రేపుమాపు సేవనస్యములు జేయింపుచుండిన కపాలగండమాల హరించు. నాసికమునందు మంటగలిగిన కపాలగండమాల హరించెనని యెఱింగి నస్యములు వర్జించి చప్పిడివంటకమునే భుజింపంజేయుచుండవలయు. (చప్పిడి యన కందిపప్పుపొడి కూర నూనె నల్లవరివంటకము అనునవి) చెట్టిపుల్లతీగవేళ్ళు యెఱ్ఱగలిజేరువేరు పుట్టమీదిగాగె వేరు వీనినినూరి పావుసేరు రసముదీసి అందు నౌటాంసుప్రమాణము మిరియపుచూర్ణము గలిపి అమావాస్య మొదలు యూడమావాస్యలవరకు పానము జేయించవలయు. వమనము గానుండిన విడియాకు సేయవలయు. వీని సేవనానంతరం బొకగ్రాము గడచిన పిదప కొఱ్ఱపాలజావను త్రాగించవలయు తక్కిన దినములయందు పావుసేరురసములో నూనె 1 తులము మిరియపుచూర్ణము 1 తులముగలిపి ప్రతిదినమొసంగుచు చప్పిడి నాచరించునటులం జేయుచుండిన కపాలగండమాలలు హరించు.

(చాతరాసికూరలో పుష్ప పులుసుగలిపి వండి అన్నముతోఁజేర్చి కమికెడు భక్షించినను లేక గోగుకూరను పుష్ప పులుసుతోడవండి రేపుమాపు కమికెడుచొప్పున భక్షింపుచుండినను లేక రసపుబ్బునవేసినను గండమాలలు హరించు.)

సీ॥ బోడతరంబును బొన్నగంటియుఁ బిల్ల । పెసరగజ్జేరుబెంచెసగఁ
దెచ్చి । నలినమూలంబులు నాలుగు నాలుగు । సేరుల రస
ముగాఁ జేసియందు । సరిగాఘృతంబును ఛాగమూత్రంబు
ను । రెండుసేరులుగూర్చి వడి కల్కె । తలమీదఁ మూఁడు
జాములుపెట్టి యుష్ణోద । కముల స్నానంబునుగా నొసర్చి ।

యన్నమును దీయగూరయు ననుభవంబు । చేసిపథ్యము
చేసినఁ జెడుకపాల । గండమాలలు ధరణిప్రఖ్యాతముగను ।
మానవావళికెల్లను మాఁడుచుండు ॥

గండమాలామల యందు పథ్యము.

శ్లో॥ పురాణ ఘృతపానంచ జీర్ణలోహిత శాలయః । యవా ముద్గాః పటోలంచ రక్తశిగ్రు కటిల్లకమ్ । వాలిశాకంచ వేత్రాగ్రం రూక్షాణిచకటూనిచ । దీపనానిచసర్వాణిగుగ్గులుశ్శిలాజతు గళగండే గ డమాలా పచిగ్రంథ్యర్బుదాంతరే । యథాకోపం యథావస్థం పథ్యమేత త్ప్రకీర్తితమ్ ।

తా. ప్రాతనెయ్యి ప్రాతయెఱ్ఱబియ్యపుఅంటకము యవలు పెసలు పొట్లకాయ యెఱ్ఱమునగకాయ కాకరకాయ పొన్నగంటికూర వెదురుమొలక రూక్షకర ద్రవ్యములు కారద్రవ్యములు దీపనకర సర్వౌషధములు గుగ్గిలము శిలాజత్తు యివి గళగండము గండమాల అపచిగ్రంథి అర్బుదము అనువానియందు దోషానుగుణ్యముగ అవస్థానుగుణ్యముగ పథ్యకరంబులు.

శ్లో॥ [మతాంతరే] కులుత్థాస్సఘృతం సక్తుపథ్యంస్యా దండమాలికా ॥

తా. ఉలవలు నెయ్యి పేలపిండి గండమాలలయందు పథ్యకరంబులు.

గండమాలామలయం దపథ్యము.

శ్లో॥ దుగ్ధేక్షు వికృతీస్సర్వా మాంసంచా నూపసంభవమ్ ।
పిష్టాన్నమమ్లం మధురం గుర్వభిష్యంది కారిచ ।
గళగండం గండమాలా పచీ గ్రంథ్యర్బుదామయాః ।
చికిత్స న్నగదంకారో యత్నోర్ధ్వం పరివర్జయేత్ ॥

తా. పాలు బెల్లము పంచదార మొదలగు చెఱుకువలననైన ద్రవ్యములు అనూపదేశమాంసము పిండిఅంటకములు పులుసు తీపిగల పదార్థములు జడకరద్రవ్యములు కఫకరద్రవ్యములు యివి గళగండము గండమాల అపచి గ్రంథి అర్బుదము అనువానియం దపథ్యకరంబులు. అట్లగుటచే వానిని యత్నముగోరెడి వైద్యుడు వర్జింపఁజేయవలయు.

## కర్ణశూల లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] సమీరణశ్శ్రోత్రగతోన్యథాచరన్ సమం
తతశ్శూల మతీవకర్ణయోః । కరోతిదోషైశ్చ యథాస్వమా
వృత స్సకర్ణశూలః కథితోదురాసదః ॥

తా. కర్ణగతవాతము ప్రకోపించి ప్రతిలోమముగ నంతట సంచరింపుచు "ఏకకః ప్రకుపితోదోష స్సర్వానేవ ప్రకోపయేత్" అను న్యాయానుసరణి కఫపిత్త రక్తములం జెరచి వానితోఁగూడి తమతమ బలానుగుణ్యముగ "శ్లో॥ మూర్ఛా దాహో జ్వరశ్వాస. క్లమోఘ వమథు స్తథా । ఉపద్రవాః కర్ణశూలే భవంత్యేతే మరీషతః॥" అను వచనోక్తోపద్రవములతోగూడి కష్టసాధ్యమైన శూలను గలుగం జేయు. ఇదియ కర్ణశూలయనఁబడు.

## కర్ణనాద లక్షణము.

శ్లో॥ కర్ణస్రోత స్స్థితేవాతే శృణోతి వివిధాన్స్వరాన్ ।
భేరిమృదంగ శంఖానాం కర్ణనాదస్స ఉచ్యతే ॥

తా. వాతము చెవిలోనుండి శబ్దవాహిని సిరలసమీపంబున కేసుటవలన భేరీ మృదంగ శంఖాదిక శబ్దమువంటి పలువిధములైన శబ్దముల గలుగంజేసిన కర్ణనాద మనంబడు.

## బాధిర్య లక్షణము.

శ్లో॥ యదాశబ్ద వహంవాయు స్స్రోత ఆవృత్యతిష్ఠతి ।
శుద్ధిశ్లేష్మాన్వితోవాపి బాధిర్యం తేనజాయతే ॥

తా. వాయువు కఫముతోగలసిగాని కలియకగాని శబ్దవాహిని స్రోతస్సుల నడ్డగించుటవలన చెవుడు గలుగు.

## కర్ణక్ష్వేడ లక్షణము.

శ్లో॥ వాయుః పిత్తాదిభిర్యుక్తో వేణుఘోష సమంస్వనమ్ ।
కరోతి కర్ణయోః క్ష్వేడం కర్ణక్ష్వేడస్స ఉచ్యతే ॥

తా. వాయువు పిత్తాదులతోఁగలసి చెవిలో పిల్లనగ్రోవివంటి శబ్దమును గలుగంజేసిన కర్ణక్ష్వేడ మనంబడు.

## కర్ణస్రావ లక్షణము.

శ్లో॥ శిరోభిఘూయదథవానిమజ్జనాజ్జలేప్రపాకా దథవాపివిద్రధేః। స్రవేద్ధిపూయం శ్రవణోనిలార్దిత స్సకర్ణసంస్రావ ఇతిప్రకీర్తితః ॥

తా. శిరమునందు దెబ్బతగులుటవలనగాని లేక నీళ్ళయందు దుమికి మునుగుటవలనగాని లేక చెవిలోజనించిన విద్రధి పండియుండుటవలనగాని వాతప్రకోపించి చెవివలన చీముగార్చుచుండిన కర్ణస్రావ మనంబడు.

## కర్ణకండూ లక్షణము.

శ్లో॥ మారుతః కఫసంయుక్తః కర్ణే కండూం కరోతిచ ॥

తా. కఫయుక్తమైన వాయువు చెవిలో దురదగలుగంజేసిన కర్ణకండి వనంబడు.

## కర్ణగూథక లక్షణము.

శ్లో॥ పిత్తోష్మ శోషితశ్లేష్మా జాయతేగూథకః ॥

తా. పిత్తోష్ణముచే కఫమెండి గుబిలిగనైన కర్ణగూథ మనంబడును.

## కర్ణప్రతినాహ లక్షణము.

శ్లో। సకర్ణగూథో ద్రవతాం యదాగతో విలాయితో ఘ్రాణముఖంప్రపద్యతే । తదాసకర్ణ ప్రతినాహసంజ్ఞితో భవేద్వికార శిరసోర్ధభేదకృత్ ॥

తా. చెవియందుండు గుబిలి స్రవించిగానిలేక స్నేహస్వేదాదులవలన స్రవించిగాని ముక్కు నోరు ఆనువానివలన వెడలిన ప్రతినాహ మనంబడు. దీనివల అర్ధతలనొప్పి గలుగు.

## కృమికర్ణ లక్షణము.

శ్లో॥ యదాతుమూర్ఛన్త్యథవాపి జంతవ స్సృజంత్య పత్యాన్యథవాపిమక్షికాః । తద్వ్యంజనత్వాచ్ఛ్రవణో నిరుధ్యతే భిషగ్వరాద్యైః కృమికర్ణకోగదః ॥

తా. చెవులలో పురుగులు జనించి వ్యాపించుటవలనగాని లేక యీగపిల్లల బెట్టుటవలనగాని కర్ణమార్గము నడ్డగింపబడిన కృమికర్ణ మనంబడు.

## పతంగాది కీటక లక్షణము.

శ్లో॥ పతంగాశ్శతపద్యశ్చ కర్ణః స్రోతప్రవిశ్యహి । అరతింవ్యాకుల త్వంచభృశంకుర్వంతి వేదనామ్ । కర్ణోనిస్తుద్య తేతస్యతథా న్నై పుర్పురాయతే । కీటేచరతిరుక్తీవ్రా నిష్పందే మంద వేదనా॥

తా. మిడుత జెఱ్ఱి జోరీగ మొదలగునవి చెవిలో ప్రవేశించుటవలన నెమ్మది లేకుండుట ప్రాణములు వ్యాకులమును జెందుట మిక్కిలి వేదనగలుగుట చెవిలో బాడుచునట్లుండుట గులగులలాడుట పురుగులు సంచరింపుచుండిన తీవ్రవేదన గలుగుట సంచరింపక స్తబ్ధముగనుండిన వేదనతగ్గుట అను నీ లక్షణంబులు పతంగాదిక్రిములవలన గలుగు.

## కర్ణవిద్రధి లక్షణము.

శ్లో॥ క్షతాభిఘాత ప్రభవస్తువిద్రధి ర్భవేత్తథాతోష క్కృతోపరః పునః । నరక్త పీతారుణమస్ర మాస్రవే త్ప్రతోదధూమా యన దాహ చోషవాన్ ॥

తా. చెవియందు పుడక మొదలగువానిచేనేని లేక దెబ్బచేగాని గాయము దగులుటచేనేని వాతాదిదోషములచేనేని విద్రధిజనించిన కర్ణవిద్రధియనంబడు అది పగిలిన వాతాదిదోషక్రమముగ యెఱ్ఱగ లేక పసపువర్ణముగ లేక అరుణవర్ణముగ రక్తముస్రవించుట పొడిచి నట్లుండుట పొగవెడలు నట్లుండుట మంట శోష గలుగుట అనునీ లక్షణంబులుగలుగు.

## కర్ణపాక లక్షణము.

శ్లో॥ కర్ణపాకస్తు పిత్తేన క్లేదవిక్లేదకృద్భవేత్ ।
కర్ణ విద్రధిపాకాద్వా జాయతే చాంబుపూరణాత్ ॥

తా. పిత్తమువలన గాని లేక కర్ణ విద్రధి పండుటవలనగాని లేక చెవిలో నీళ్ళుజేరుటవలనగాని దౌర్గంధ్యము ద్రవత్వము అనువాని యుక్తముగ కర్ణపాక రోగము (అనగా కర్ణవ్రణము) గలుగు.

## పూతికర్ణ లక్షణము.

శ్లో॥ పూయం స్రవతివాపూతి సజ్ఞేయః పూతికర్ణకః ॥

తా. చెవులయందు దుర్గంధముగ చీము వెడలిన పూతికర్ణమనంబడు.

## కర్ణశోథార్బుదార్శ లక్షణము.

శ్లో॥ కర్ణశోథార్బుదార్శాంసి జానీయాదుక్త లక్షణైః ॥

తా. కర్ణశోథ కర్ణార్బుదము కర్ణార్శస్సు అనువాని లక్షణముల పూర్వము వలెనే తెలియందగు.

## వాతకర్ణరోగ లక్షణము।

శ్లో॥ [చరకే] నదోతిరుక్కర్ణ మదస్యశోషస్స్రావ స్తనుశ్చాశ్రవణం చవాతాత్ ॥

తా. వాత సంబంధమువలన చెవియందు నాదము మిక్కుటముగ పోట్లు చెవియందలి గుమిలిశోషించుట తేటగ స్రావము చవుడుగలుగు.

## పిత్తకర్ణరోగ లక్షణము.

శ్లో॥ శోథస్స రాగోదరణంవిదాహస్సపీతపూతిస్రవణంచపిత్తాత్ ॥

తా. పిత్తసంబంధమువలన చెవులువాచి యెఱ్ఱనగుట పగుళులు మంట వొకింత పసుపుచాయగ దుర్గంధము స్రావము అను నీలక్షణంబులు గలుగు.

## కఫజకర్ణరోగ లక్షణము.

శ్లో॥ వైశ్రుత్యకండూస్థిరశోథశుక్లాస్నిగ్ధాస్రుతిశ్లేష్మ*భవేతిరుక్చ

తా. కఫసంబంధమువలన విపరీతముగ వినుపించుట దురద వాపు కఠినముగ నుండుట తెల్ల బంకగనుండుట స్రావము మిక్కుటముగ పోట్లు అను నీలక్షణంబులు గలుగు.

## సన్నిపాతకర్ణరోగ లక్షణము.

శ్లో॥ సర్వాణిరూపాణిచసన్నిపాతాత్స్రావశ్చతత్రాధికదోషవర్ణః।

తా. సన్నిపాతసంబంధమువలన సర్వదోష లక్షణయుక్తంబై అధికముగ నుండు దోషవర్ణమైన స్రావము గలుగు.

* భవేల్పరుక్చ.

## కర్ణశోథ లక్షణము

శ్లో॥ సౌకుమార్యాచ్చిరోత్సృష్టే సహసాపి ప్రవర్ధతే ।
కర్ణశోథోభవేత్పాళ్యాం సరుజః పరిపోటవాన్ ॥

తా. సుకుమారములైన చెవితమ్మలకట్టి కొంతకాలమువరకు వృద్ధిపరచక నుపేక్షించి తదనంతరము శీఘ్రముగ వృద్ధిపరచుటకై యత్నించుటచే వానియందు వేదన పగుళ్ళు అనువాని యుక్తముగ వాపుజనించు నదియు కర్ణశోథ మనంబడు.

## పరిపోటక లక్షణము.

శ్లో॥ కృష్ణారుణ నిభ స్తబ్ధస్సవాతా త్పరిపోటికః ॥

తా. వాతసంబంధమువలన నల్లగ లేక యెఱ్ఱగ కఠినముగనుండు వాపు జనించి పగిలిన పరిపోటక మనంబడు,

## కర్ణోత్పాత లక్షణము.

శ్లో॥ గుర్వాభరణ సంయోగా త్తాడనాద్ఘర్షణాదపి ।
శోథః పాళ్యాంభవేచ్ఛ్వాసో దాహపాక రుజాన్వితః ।
రక్తోవార క్తపిత్తాభ్యా ముత్పాతస్సగదోమతః ॥

తా. చెవియందు భారముగల యాభరణముల ధరించుటచేనేని అభిఘాతముచేనేని లేక రుద్దుటచేనేని రక్తపిత్తములు ప్రకోపించి చెవితమ్మలయందు నీలము లేక యెఱుపుగలవాపును గలుగంజేయు. దానివలన మంట పాకము పోట్లుగలిగిన వుత్పాత మనంబడు.

## కర్ణోన్మంథక లక్షణము.

శ్లో॥ కర్ణం బలాద్వర్ధయతః పాళ్యాంవాయుః ప్రకుప్యతి ।
సకఫంగృహ్య కురుతేశోథం స్తబ్ధము వేదనమ్ ।
ఉన్మంథక స్సకండూకో వికారః కఫవాతజః ॥

తా. బలాత్కారమువలన చెవిరంధ్రమును వృద్ధిజెందించుటచే చెవియొక్క తమ్మెయందు వాతము ప్రకోపించి కఫముతోడజేరి కఠినమై మందవేదన గలవాపును గలుగంజేసి దానియందుదురదను సదా గలుగంజేయుచుండిన వున్మంథక మనంబడు. ఇది కఫవాత జన్యంబు.

కర్ణదుఃఖవర్ధన లక్షణము.

శ్లో॥ సంవర్ధ్యమానే దుర్విద్ధే కండూ దాహరుజాన్వితః ।
శోథో భవతి పాకశ్చ త్రిదోషో దుఃఖవర్ధనః ॥

తా. విరుద్ధస్థలమునందు చెవితమ్మను కుట్టి వృద్ధిపఱచుటచే దురద తాపము పోటు పాకము అనువానియుక్తము వాపును గలుగంజేసిన దుఃఖవర్ధమనంబడు. ఇది త్రిదోషమువలన జనించు.

కర్ణ పరిలేహి లక్షణము.

శ్లో॥ కఫాసృక్క్రిమిసంభూత స్సవిసర్పన్నిత స్తతః ।
లిహేచ్ఛ శష్కులీంపాలీం పరిలేహీత్యసౌస్మృతః ।

తా. చెవితమ్మెయందు కఫరక్త క్రిములవలన వాపుబనించి నంతట తిరుగుచు కర్ణపుటమునందు వ్యాపించి యందలిమాంసమును భక్షించిన పరిలేహియనంబడు.

కర్ణగండమాల లక్షణము.

శ్లో॥ [మాధవనిదానే] శ్రవణాంతర్వ్రణంజాతం క్రిమిదుర్గంధ సంయుతమ్ । తచ్ఛాంతర్థవం దిష్యామి భైషజ్యంలోకమోహనమ్ ॥

తా. చెవిలోవ్రణముజనించి క్రిమిదుర్గంధయుక్తంబై చీముగారుచుండిన కర్ణగండమాలయనంబడు. ఇదిహరించుటకై లోకమోహకరమైనయౌషధమునువచించెద.

శ్లో॥ భాషితం రేవణాసిద్ధె రస శ్శీతాంశు నామకః ।
అర్కా షత్రరసైః కర్ణే నిక్షేప్యంకర్ణరోగజిత్ ॥

తా. పండుజిల్లేడాకురసములో రేవణసిద్ధునిచే జెప్పంబడిన శీతాంశురసమును గలిపి యొకమండలము చెవిలోబోయుచుండిన అసాధ్యమైన కర్ణరోగము (అనగా చీముగారుట) హరించు.

భల్లాతకాది తైలము.

శ్లో॥ [మాధవనిదానే] భల్లాతకశిలాతాళం బిలజంమూత్రకుష్ఠకమ్ । పక్వతైలావ శేషంతు క్రిమిదుర్గంధహృద్భవేత్ ॥

తా. జీడివిత్తులు శిలాజిత్తు తాళకము చంగల్వకోష్టు వీనిని సమభాగము లుగ కల్కము జేసి అందునూనె గోమూత్రముగలిపి చిక్కగ తైలముకాచి చెవిలో బోయుచుండిన కృమిదుర్గంధములతో గూడియుండు కర్ణరోగము హరించు.

గీ॥ తామ్రభస్మాంబుశ్రవణ రంధ్రములనిడియు । నింబఫలసార మామీఁద నెమ్మిఁబోయ । నిశ్చయంబుగమానుమానితము గాను । జిరతరంబైన చెవిలోని చీములెల్ల॥

(గంధకతైలమునుగాని గుగ్గిలతైలమునుగాని చెవిలో వేయుచుండిన చీము గారుట మానును. పైకర్ణరోగముల యందౌషధములను 2 మాసములు చెవిలో బోయుచుండవలయు.)

గీ॥ హరిదళముమాదిఫలమును సమరభాగ । మూత్రమునమర్ద నముచేసిశ్రోత్రములను నిడియుఁదన్మాత్రమునుబోయనిఖిల జనుల । చెవులయందునుకారెడిచీముమాను ॥

క॥ చారుప్పానిమ్మపులుసును । నారూఢిగఁ గర్ణరంధ్రమందునఁ బోయ। న్నేరీతియైనచీములు। ధారుణిలోమానుసుమ్ముతథ్యం బరయన్ ॥

క॥ పెన్నేరుగడ్డరసమును। బన్నుగసల్లంపురసముబాగుగఁగ్రోలన్। రెన్నెల్లలోనమానును। జెన్నారఁగమురికిగల్గుచెవిలోచీముల్॥

## శృంగబేరాది తైలము.

శ్లో॥ శృంగబేరరసంక్షౌద్రం సైంధవంతైలమేవచ।
కటూష్ణంకర్ణయోర్ధార్య మేతత్స్యాద్వేదనాపహమ్ ॥

తా. అల్లపురసములో తేనె సైంధవలవణము తెల్లావనూనెగలిపి తైలము మిగులునటులకాచి కించిదుష్ణముగ చెవిలో వేసిన కర్ణశూలహరించు.

## లశునాది స్వరసము.

శ్లో॥ లశునార్ద్రకశిగ్రూణాం వరుణామూలకస్యచ ।
కదళ్యాస్స్వరసశ్శ్రేష్ఠః కటూష్ణఃకర్ణపూరణే॥

తా. తెల్లగడ్డలు అల్లము మునగ పులిమిడివేరు ముల్లంగి అరటి వీనిరసమును ఆవనూనెలోగలిపి కాచి కించిదుష్ణముగ చెవిలోవేసిన కర్ణశూల హరించు.

అర్కాంకురాది స్వరసము.

శ్లో॥ అర్కాంకురానమ్లపిష్టా న్సతైలాన్ లవణాన్వితాన్ ।
సన్నిదధ్యాత్సుధాకాండే పూరితేమృత్స్నయాన్వితే ।
పుటపాకేతయాస్విన్నం పీడయేదారసాగమాత్ ।
సుఖోష్ణంతద్రసంకర్ణే ప్రక్షిపేచ్ఛూలశాంతయే ॥

తా. జిల్లేడుచిగుళ్ళను నిమ్మసండ్లరసములో నూరి అందునూనె వుప్పు గలిపి కల్కముజేసి దీనిని తొలచబడిన పచ్చిబొంతజెముడు ప్రమానులోనునిచి దానిపై మూసి చీలమన్ను లేపనముజేసి పుటపాకమునందునిచి పక్వముజేసి రసమును పిండి కొని సుఖోష్ణముగ చెవిలోవేసిన కర్ణశూల హరించు.

అర్కపత్రి రసము.

శ్లో॥ అర్కస్యపత్రంపరిణామపీత మాజేనలిప్తంశిఖయోగతప్తమ్।
ఆపీడితస్యాంబుసుఖోష్ణమేవకర్ణేనిషిక్తంహరతేతిశూలమ్ ॥

తా. పండిన జిల్లేడాకులకు నెయ్యిపట్టించి చేతికినంటించుకొని నిప్పుమీద వెచ్చజేసి రసమును బిండికొని సుఖోష్ణముగ చెవిలోవేసిన కర్ణశూల హరించు.

స్యోనాక తైలము.

శ్లో॥ తైలంస్యోనాకమూలేన మందేగ్నౌవిధినాశృతమ్ ।
హరేదాశుత్రిదోషోత్థ కర్ణశూలంప్రపూరణాత్ ॥

తా. దుందిలపువేరు కల్కములో నూనెగలిపి మందాగ్నిలో పక్వముజేసి చెవిలోవేసిన త్రిదోషజ కర్ణశూల శీఘ్రముగ హరించు.

హింగ్వాది తైలము.

శ్లో॥ హింగుసైంధవశుంఠిభి స్తైలంసర్షపసంభవమ్ ।
విపక్వంహరతేవశ్యం కర్ణశూలంప్రపూరణాత్ ॥

తా. ఇంగువ సైంధవలవణము శొంఠి వీనికల్కములో తెల్లనియావనూనెను గలిపి పక్వముజేసి చెవిలోవేసిన నిశ్చయముగ కర్ణశూల హరించు.

## నాగరాది తైలము.

శ్లో॥ నాగరసైంధవమాగధిముస్తాహింగువచాలశునవంతిలతైలమ్ ।
అర్కసుపక్వపలాశరసేన కర్ణరుజంబధిరం వినిహంతి ॥

తా. శొంఠి సైంధవలవణము పిప్పలి తుంగముస్తెలు యింగువ వస వెల్లుల్లి గాయలు అనువానికల్కములో నువ్వులనూనె పండు జిల్లేడాకురసము మోదుగ సముగలిపి చిక్కగకాచి చెవిలో వేసిన కర్ణరోగము చెవుడు హరించు.

## అపామార్గ తైలము.

శ్లో॥ అపామార్గక్షారజలే బత్కృతకల్కేనసాధితంతిలజమ్ ।
అపహరతికర్ణనాదం బాధిర్యంచాపిపూరణాతః ॥

తా. ఉత్తరేణు క్షారోదకము వుత్తరేణుకల్కము వీనిలో నువ్వులనూనె లిపి చెవిలోవేసిన కర్ణనాదము చెవుడు హరించు.

## హింగ్వాది తైలము.

శ్లో॥ హింగ్వబ్దదారుమిసిమూలక భస్మభూర్జత్వక్క్షారసింధురుచకో
ద్భిదశిగ్రువిశ్వైః । సస్వర్జికాబిడవ చాంజననూతులుంగై
రంభారసైస్సమధుమూత్రమిదంవిపక్వమ్ । తైలంప్రసిద్ధమితి
తచ్ఛ్రవణామయఘ్నంకర్ణప్రణాదబధింత్వహరంగరాణామ్ ।
భూమిమస్తక శ్రవణశష్కులికాంత రాళశూలాపహం చరక
సుశ్రుతపూజితంచ ॥

తా. ఇంగువ తుంగముస్తెలు దేవదారు పెద్దసదాప ముల్లంగిభస్మము భుజ తము యవక్షారము సైంధవలవణము సౌవర్చలవణము అట్టుప్పు లేక పట్టుపుప్పు వస శొంఠి సర్జక్షారము బిడాలవణము * సురమతాయి మాదీఫలరసము అరటి ము మధుమూత్రము వీనికల్కములో నువ్వులనూనె గలిపి చిక్కగకాచి చెవిలో సిన కర్ణరోగము కర్ణనాదము చెవుడు కనుబొమలు శిరము చెవి చెవితమ్మ వీనియం శూల హరించునని చరక సుశ్రుత గ్రంథములయందు జెప్పంబడెను.

* సురమయన తురకలు సాధారణముగ అంజనము వేసికొనెడి నల్లతాయి.

## బిల్వాతైలము.

శ్లో॥ [మాధవనిదానే] గవాంమూత్రేణబిల్వాని పిష్ట్వాతైలంవిపాచయేత్ । పలంచ సదుగ్ధంచ తద్వ్యాధిన్య । హారంపరమ్ ॥

తా. బిల్వకాయను ఆవుపంచితములో నూరి అందుదకము మేకపాలు నూనె కలిపి కాచి చెవిలోవేసిన చెవుడు హరించు.

## దీపికాతైలము.

శ్లో॥ బృహతః పంచమూలస్య కాండాన్యష్టాందులానిచ ।
క్షౌమేణావేష్ట్యసంసిచ్య తైలేనా దీపయేత్తతః ।
యత్తైలం చ్యవతేతేభ్య స్సుఖోష్ణం తేనపూరయేత్ ।
జ్ఞేయం తద్దీపికాతైలం కుష్ఠదేవ తరో స్తథా ॥

తా. ఎనిమిదంగుళముల ప్రమాణముగల బృహత్పంచమూలముల కట్టగట్టి దానికి తెల్ల పట్టుగుడ్డనుజుట్టి నూనెలో బాగుగదడిపి వెలిగించి యందు స్రవించెడి తైలమును గ్రహించి సుఖోష్ణముగ చెవిలోవేసినను లేక చెంగల్వకోష్టు దేవదారు అను వానియందు పైప్రకారమే తైలమునుదీసి చెవిలోవేసినను చెవుడు హరించు.

## నిర్గుండ్యాది తైలము.

శ్లో॥ నిర్గుండిజాతీరవిభృంగరసోనరంబా కార్పాసశిగ్రుసురసార్ద్రికకారవేల్యః । ఏషాంరసేతిలభవంసవిషంసుపక్వంబాధిర్యనాక్రిమివేదనపూయముక్తే ॥

తా. వావిలి జాజియాకు జిల్లేడు గుంటగలగర వెల్లుల్లి అరటి ప్రత్తికాయ మునగ తులసి అల్లము కాకర అనువానిరసములో నువ్వులనూనెగలిపి అందొకింత వసనాభినివైచి సిద్ధముజేసి చెవిలోవేసిన చెవుడు కర్ణనాదను క్రిములు శూల చీముగారుట హరించు.

## బీజపూర రసము.

శ్లో॥ సర్జికా చూర్ణసంయుక్తం బీజపూర రసంక్షిపేత్ ।
కర్ణాస్రావ రుజాదాతు ప్రశస్తం నాత్రసంశయః ॥

తా. మాదీఫలరసములో సర్జక్షారమును గలిపి చెవిలోవేసిన కర్ణస్రావము. శూల మొదలగునవి నిస్సంశయముగ హరించు.

## సముద్రఫేన చూర్ణము.

శ్లో॥ సముద్రఫెన చూర్ణంతు న్యస్తం శ్రవణసంశ్రవే ।
పూయస్రావం వ్రణంసాంద్రం హంతిధ్వాంతమివాంశుమాన్ ॥

తా. సముద్రవునురుగు చూర్ణమును చెవిలోవేసిన "సూర్యు డంధకారమును హరింపంజేయు భంగి" చెవియందలి చీము వ్రణము బంక వీనిని హరింపంజేయు.

## సర్జత్వక్చూర్ణము.

శ్లో॥ సర్జత్వక్చూర్ణ సంయుక్త కార్పాసీ ఫలజోరసః ।
మధు సంమిశ్రితస్సాధు కర్ణస్రావే ప్రసస్యతే ॥

తా. ప్రత్తికాయలరసములో గుగ్గిలపుపట్టచూర్ణమును తేనెనుగలిపి చెవిలో వేసిన కర్ణస్రావము హరించు.

## కర్ణస్రావ చికిత్స.

శ్లో॥ జంబ్వామ్రపత్రం తరుణంసమాంశం కపిత్థకార్పాస ఫలంచ సార్థమ్ । ధృత్వారసం తన్మధునావిమిశ్రంస్రావాపహంసం ప్రవదంతితజ్జ్ఞాః । ఏతైశ్చ్రుతం నింబకరంజతైలం ససార్షపం స్రావ హరంప్రదిష్టమ్ ॥

తా. పండిననేరేడాకులను పండినమామిడాకులను సమభాగములుగ చూర్ణముజేసి అందు లేతవెలగకాయరసమును ప్రత్తికాయరసమును తేనెనుగలిపి చెవిలో వేసినను లేక పైద్రవ్యములతోడ వేప క్రానుగ అనువానినిజేర్చి అందు ఆవనూనెను గలిపి చిక్కగ కాచి చెవిలోవేసినను కర్ణస్రావము హరించు.

## కర్ణరోగమునకు రాస్నాది చూర్ణము.

శ్లో॥ [రసరత్నాకరే] రాస్నామృతైరండసురాహ్వవిశ్వం తుల్యం విచూర్ణ్యాథ విమిశ్ర్యఖాదేత్ । వాతామయాంకర్ణ శిరోగ దీచ నాడీవ్రణీచాపి భగందరీచ ॥

తా. సన్నరాష్ట్రము తిప్పతీగె ఆముదపువేరు దేవదారుశొంఠి వీనిచూర్ణము సమభాగములుగ జేర్చి సేవించినవాతరోగము కర్ణరోగము శిరోరోగము నాడీవ్రణ భగందరము హరించు.

క్రిమికర్ణ చికిత్స.

శ్లో॥ హరిరవిభక్తిర్వ్యోషానేకీకృత్యప్రకల్పయేద్బుధ్యా ।
వననాంతరసేనశ్రవణేపరిపూరయేన్మ్యక్త్యా ।
కర్ణజతాకానియుతంక్రిమికీటపిపీలికాస్తథాన్యేపి ।
విపతంతినిర్విశేషాఃకారండాశ్చాపిముండస్థాః ॥

తా. చన్నచర్లగడ్డ గంటగలగర త్రికటుకములు వీనినినూరి బట్టలోగ చెవిలో యుక్తిగబిండిన కర్ణములయందలి వల్ల కెత్తి పురుగులు కీటకములు చీమల తలలోని పురుగులు పూడిపడు.

కర్ణవిద్రధిచికిత్సాక్రమము.

శ్లో॥ విద్రధాయాశ్చకర్ణేపి విద్రధ్యుక్తంచికిత్సితమ్ ॥

తా. కర్ణవిద్రధియందు సామాన్యవిద్రధి చికిత్సం జేయవలయు.

ఆమ్రాది తైలము.

శ్లో॥ ఆమ్రజంబూప్రవాళాని మధూకస్యవటస్యచ ।
ఏభిస్తుమిశ్రితంతైలం పూతికర్ణగదంహరేత్ ॥

తా. మామిడి నేరేడు యిప్ప మఱ్ఱి అనువాని చిగుళ్ళకల్కములో తైలము గలిపి కాచి చెవిలో వేసిన చీముగారుట హరించు.

గంధకతైలము.

శ్లో॥ చూర్ణేనగంధక శిలారజనీభవేనముష్ట్యం శకేనకటుతైలక
లాష్టకంతు । ధత్తూరపత్రరసతుల్యమిదంవిపక్వం నాడీంజయే
చ్చిరభవామపికర్ణజాతామ్॥

తా. గంధకము మణిశిల పసపు వీనిని 4 రూపాయలయెత్తు చూర్ణముజేసి అందు 32 రూపాయలయెత్తు తెల్లావనూనె 33 రూపాయలయెత్తు ఉమ్మెత్తాకురసము గలిపి పక్వముజేసి చెవిలో వేసిన దీర్ఘకాలమునుండు కర్ణనాడీరోగము హరించు.

## భగందరరోగనిదాన లక్షణ చికిత్సాదయః.

### శతావరీ తైలము.

శ్లో॥ శతావరీవాజిగంధా పయస్యైరండబీజకైః ।
తైలంవిపక్వంసక్షీరం పాలీంసంవర్ధయేత్సుఖమ్ ॥

తా. పిల్లిపీచర పెన్నేరుగడ్డ ఆముదపువిత్తులు వీనిని పెరుగుమీది నీరుతో నూరి కల్కముజేసి అందు నూనె పాలు గలిపికాచి లేపనముజేయుచుండిన చెవిత మ్మెలు సుఖముగ వృద్ధింజెందు.

### జీవనీయ తైలము.

శ్లో॥ జీవంత్యాచాశ్వగంధార్క వాకుచీబీజసైంధవైః
హాలినీసురసాభ్యాంచ గోధాకంకవసాన్వితమ్ ।
తైలంవిపక్వమభ్యంగా దున్మధంనాశయేద్ధ్రువమ్ ॥

తా. పాలకూర పెన్నేరుగడ్డ జిల్లేడుపాలు భావంచివిత్తులు సైంధవలవణము చన్నచర్లగడ్డ తులసి వుడుము గద్ద అనువానిక్రొవ్వుల నేకముచేసి తైలములోగలిపి కాచి అభ్యంజనముజేసిన ఉన్మంధకము శీఘ్రముగ హరించు.

### కర్ణరోగమునందు పథ్యము

శ్లో॥ [మాధవనిదానే] గోధూమాశ్శాలయోముద్గా యవాశ్చాపి ఘృతంతథా । లోపోమయూరోహరిణ స్తిత్తిరిర్వనకుక్కుటః।
పటోలంశిగ్రువార్తాకం సునిషణ్ణాంకటిల్లకమ్ । రసాయనాని సర్వాణిబ్రహ్మచర్యమభాషణమ్ । ఉపయుక్తంయథాదోష మిదం అమయేహితమ్ ॥

తా. గోధుమలు వరిబియ్యము పెసలు యవలు నెయ్యి లాపుకపిట్ట నెమలి జింక తిత్తిరిపక్షి అడవికోడి పొట్లకాయ మునగ వంకాయ చెంచలికూర కాకర కాయ సర్వరసాయనములు బ్రహ్మచర్యము మాటలాడకుండుట యివి కర్ణమునందు దోషానుగుణ్యముగ పథ్యకరంబులు.

### కర్ణరోగమునం దపథ్యము,

శ్లో॥ దంతకాష్ఠంశిరస్నానం వ్యాయామంశ్లేష్మలంగురు ।
కండూయనంతుషారంచ కర్ణరోగపరిత్యజేత్ ॥

తా. దంతకాష్ఠము శిరస్స్నానము సంచారము కఫకరాన్నము జడాన్న గోపట మంచు వీనిని కర్ణరోగముగలవారు వర్జింపవలయు.

## ము ఖ రో గ ని దా న ము.

### ఓష్ఠరోగ సంప్రాప్తి.

శ్లో॥ [ఆయుర్వేదే] ఆనూపపిశితక్షీర దధిమాషాదిసేవనాత్ ।
ముఖమధ్యేగదాన్కుర్యుః క్రుద్ధాదోషాఃకఫోత్తరాః ॥

తా. జలచరజంతుమాంసము పాలు పెరుగు వుద్దులు మొదలగునట్టి పదార్థము లను మిక్కుటముగ సేవించుటచే కఫప్రధానమగు వాతాదిదోషములు ప్రకోపించి నోటియందు రోగముల గలుగంజేయు.

### ముఖరోగ సంఖ్య.

శ్లో॥ దంతేష్వష్టావోష్ఠయోశ్చ మూలేషుదశపంచచ ।
నవతాలునిజిహ్వాయాం పంచసప్తదశామయోః ।
కంఠేత్రయస్సర్వసరా ఏకషష్టిశ్చతుఃపరా ॥

తా. దంతరోగములు 8 పెదవిరోగములు 8 దంతమూలరోగములు 15 లో దౌడ రోగములు 9 నాలుకరోగములు 5 కంఠరోగములు 17 సర్వసరరోగములు 3 యిటుల ముఖరోగములు 65 విధంబులు.

### వాతిగోష్ఠరోగ లక్షణము.

శ్లో॥ కర్కశౌపరుషౌస్తబ్ధౌ కృష్ణౌతీవ్రరుజాన్వితౌ ।
దాల్యేతేవరిపాట్యేతే ఓష్ఠౌమారుతకోపతః ॥

తా. పెదవి గరగరలాడుట కఠినముగ జడముగ నల్లగనుండుట తీవ్రమైన పీడతో గూడియుండుట పగులుట చర్మమూడుట యీ లక్షణములుగలది వాతి కొష్ఠరోగమని తెలియవలయును.

### పైత్తికోష్ఠరోగ లక్షణము.

శ్లో॥ చీయేతేపిటికాభిస్తు సరుజ భిస్సమంతతః ।
సదాహపాకపిటికౌ పీతాభాసౌచపిత్తతః ॥

తా. పెదవుల యందంతట చిదుములు లేచి నొప్పుట పెదవులుమండుట పాకము నుజెందుట కురుపులు పసపువర్ణముగనుండుట యీ లక్షణములుగలది పైత్తికోష్ఠరోగమని తెలియవలయు.

## శ్లైష్మికోష్ఠరోగ లక్షణము.

శ్లో॥ సవర్ణాభిస్తుచీయేతే పిటికాభిరవేదనా ।
భవతస్తుకఫాదోష్ఠౌ పిచ్ఛిలౌశీతలౌగురూ ॥

తా. పెదవిచర్మముతో సమానవర్ణముగలదై చిదుములతో వ్యాప్తంబై యుండుట నొకింతనొప్పుట జిగటగనై చల్లగ జడముగనుండుట యీ లక్షణములు గలది కఫజోష్ఠరోగమని తెలియవలయు.

## సాన్నిపాతకోష్ఠరోగ లక్షణము.

శ్లో॥ సకృత్కృష్ణౌసకృత్పీతౌ సకృచ్ఛ్వేతౌతథైవచ ।
సన్నిపాతేనవిజ్ఞేయౌ వనేతపిటికాన్వితౌ ॥

తా. పెదవులొకానొకపుడు నల్లగ మఱియొకపుడు పసపుగ వేరొకపుడు తెల్లగ నుండుట పెక్కుచిదుములతో వ్యాప్తంబై యుండుట యీలక్షణములుగలది సన్నిపాత కోష్ఠరోగమని తెలియవలయు.

## రక్తజోష్ఠరోగ లక్షణము।

శ్లో॥ ఖర్జూరీ ఫలవర్ణాభిః పిటికాభిర్నిపీడితౌ ।
రక్తోపసృష్టౌరుధిరం స్రవతశ్శోణితప్రభౌ ॥

తా. పెదవిపై ఖర్జూరపుకాయతో సమానమైన వర్ణముగలకురుపులు జనించి రక్తముగారుట పెదవి రక్తమువలె నెఱ్ఱగనుండుట యీ లక్షణములుగలది రక్తజోష్ఠరోగమని తెలియవలయు.

## మాంసజోష్ఠరోగ లక్షణము.

శ్లో॥ మాంసదుష్టౌగురుస్థూలౌ మాంసపిండవదుద్గతౌ ।
జంతవశ్చాత్రమూర్చ్ఛంతి నరస్యోభయతోముఖాత్ ॥

తా. పెదవులు జడముగ స్థూలముగ మాంసపిండమువలె నుబ్బుగనుండుట రెండు పెదవులయందు తప్ప తక్కిన పెదవులయందు ఘరుగలుజనించుట యీ లక్షణములుగలది మాంసజౌష్ఠరోగమని తెలియవలయు.

## మేదజౌష్ఠరోగ లక్షణము.

శ్లో॥ సర్పిర్మండప్రతీకాశౌ మేదసాకండురౌగురూ ।
స్వచ్ఛంస్ఫటికసంకాశ మాస్రావంస్రవతో భృశమ్ ।
తయోర్వ్రణో నసంరోహేన్మృదుత్వంచసగచ్ఛతి ॥

తా. పెదవి పేరిన నేతివలె తెల్లగ దురదతోగూడినదిగ జడముగనుండుట పెదవియందు స్ఫటికమువలె స్వచ్ఛముగనుండుట స్రావం బధికముగగలుగుట పెదవిపైగలిగిన వ్రణమాంసపూరితము గానుండుట కఠినముగనుండుట యీ లక్షణములు గలది మేదజౌష్ఠరోగమని తెలియవలయు.

## అభిఘాత జౌష్ఠరోగలక్షణము.

శ్లో॥ ఓష్ఠౌపర్యవదీర్యేతే దీర్యేతేచాభిఘాతతః ।
గ్రంథితౌచతదాస్యాతాం కండూక్లేదసమన్వితౌ ॥

తా. పెదవిచుట్టు చీలుట పోట్లు గంట్లుగలుగుట దురదగలిగి బంకగనుండుట యీ లక్షణములుగలది అభిఘాతజౌష్ఠరోగమని తెలియవలయు.

## దంతమూలగత రోగములు.

## శీతాద లక్షణము.

శ్లో॥ శోణితందంతవేష్టేభ్యో యస్యాకస్మాత్ప్రవర్తతే
దుర్గంధీనిసకృష్ణాని ప్రక్లేదీనిమృదూనిచ ॥
దంతమాంసానిశీర్యంతే పచంతీచపరస్పరమ్ ।
శీతాదోనామసవ్యాధిః కఫశోణితసంభవః ॥

తా. దంతములనుండి యకస్మాత్తుగ రక్తము వెడలుట దంతములయొక్క మాంసము దుర్గంధమైన నల్లనై తడిసి మృదువై వీడుట వొకదంతముయొక్క పైమాంసము పండిన మరియొకదాని మాంసమును పండించుట యీ లక్షణములుగలది శీతాదమను దంతరోగమని తెలియవలయు. ఇది కఫరక్తమువలన గలుగు.

## దంతపుప్పుట లక్షణము.

శ్లో॥ దంతయో స్త్రిషువాయస్య శ్వయథుర్జాయతే మహాన్ ।
దంతపుప్పుటకోనామ సవ్యాధిఃకఫర క్తజః ॥

తా. 2 లేక 3 దంతమూలములయందు గొప్పగ వాపుజనించిన దంతపుప్పుట మని తెలియవలయు. ఇది కఫరక్తమువలన జనించు.

## దంతవేష్టన లక్షణము.

శ్లో॥ స్రవంతిపూయంరుధిరం చలాదంతా భవంతిచ ।
దంతవేష్టన్నవిజ్ఞేయో దుష్టశోణితసంభవః ॥

తా. రక్తము దుష్టంబగుటచే దంతములవలన చీము గారుచు కదలుచుండిన దంతవేష్టనమని తెలియవలయు.

## సౌషిర లక్షణము.

శ్లో॥ శ్వయథుర్దంతమూలేషు రుజావాన్ కఫరక్తజః ।
లాలాస్రావీసవిజ్ఞేయ స్సౌషిరోనామనామతః ॥

తా. కఫరక్తమువలన దంతమూలములయందు వాపుజనించి నొప్పిగలిగి సొల్లుగారుచుండిన సౌషిరమని తెలియవలయు.

## మహాసౌషిర లక్షణము.

శ్లో॥ దంతాశ్చలంతి వేష్టేభ్య స్తాలుచాప్యవదీర్యతే ।
యస్మిన్సర్వతో వ్యాధి ర్మహాసౌషిరసంజ్ఞికః ॥

తా. త్రిదోషమువలన దంతమూలములు కదులుట లోదౌడపగలుట యీ లక్షణములుగలది మహాసౌషిరమని తెలియవలయు.

## పరిదర లక్షణము.

శ్లో॥ దంతమాంసానిశీర్యంతే యస్మిన్ ష్ఠీవతిచాప్యసృక్ ।
పిత్తాసృక్కఫజో వ్యాధి ర్జ్ఞేయః పరిదరోహినః ॥

తా. దంతమాంసమునీడి యుమిసిన రక్తముపడిన పరిదరమని తెలియవలయు పిత్తరక్త కఫములవలన గలుగు.

## ఉపకుశ లక్షణము.

శ్లో॥ వేష్టేషుదాహః పాకశ్చ తాభ్యాందంతాశ్చలంతిచ ।
ఆఘాక్రృతాః ప్రస్రవంతి శోణితంమందవేదనాః ।
ఆధ్మాయంతేస్రుతేరక్త ముఖేపూతిశ్చజాయతే ।
యస్మిన్నుపకుశోనామ పిత్తరక్తకృతోగదః ॥

తా. దంతమూలముల నాశ్రయించియుండు మాంసమునందు తాపముజనించి జంటుటవలన దంతములు కదలుట ముఖమునువంచిన నొకింత వేదనగలిగి రక్తము పడుట రక్తముపడినపిదప మాంసముపండి మరలపొక్కుట నోటియందు దుర్గంధము వెడలుట పిత్త రక్త కృతవికార యుక్తంబై యుండుట యీ లక్షణములుగలది వుపకుశమని తెలియవలయు.

## వైదర్భ లక్షణము.

శ్లో॥ ఘృష్టేషుదంతమూలేషుసంరంభోజాయతేమహాన్ ।
భవంతీచపలాదంతా స్సవైదర్భోభిఘాతజః ॥

తా. దంతము నాశ్రయించియుండు మాంసమును దృఢముగ తోముటచే నధికముగ వాపుగలిగి దంతములు గదలుచుండిన వైదర్భమని తెలియవలయు. ఇది యభిఘాతమువలన గలుగు.

## ఖల్లీవర్ధన లక్షణము.

శ్లో॥ మారుతేనాధికోదంతో జాయతేతీవ్రవేదనః ।
ఖల్లీవర్ధనసంజ్ఞోవై జాతేరుక్చప్రశామ్యతి ॥

తా. వాతసంబంధమువలన పంటిపై మఱియొక పల్లుజనించుట అది గలుగనపుడు మిక్కుటముగ పోట్లుగలుగుట పెరిగిన వేదన శమించుట యీ లక్షణముల గలది ఖల్లీవర్ధమని తెలియవలయు.

## కరాళ లక్షణము.

శ్లో॥ శనైశ్శనైః ప్రకురుతే వాయుర్దంతసమాశ్రితః ।
కరాళాన్వికటాన్దంతా న్కరాళోనచసిధ్యతి ॥

తా. వాతము దంతమూలముల నాశ్రయించి మెల్ల మెల్లగ దంతముల వంకరగ జేయుచుండిన కరాళమని తెలియవలయు. ఇది యసాధ్యంబు.

## అధిమాంసక లక్షణము.

శ్లో॥ హానవ్యేపశ్చిమేదంతే మహాంశోథో మహారుజః ।
లాలాస్రావీకఫకృతో విజ్ఞేయోహ్యధిమాంసకః ॥

తా. దౌడకొనలో పంటిమూలమునందు లావుగ వాపుజనించి కడుపోట్లును గలుగంజేయుచు మిక్కుటముగ జొల్లుగార్చుచుండిన అధిమాంసకమని తెలియవలయు. ఇది కఫమువలన జనించు.

## నాడీవ్రణ లక్షణము.

శ్లో॥ దంతమూలగతానాడ్యాః పంచజ్ఞేయా యథేరితాః ॥

తా. నాడీవ్రణము వాత పిత్త కఫ సన్నిపాత ఆగంతుక భేదములవలన 5 విధంబులని జెప్పంబడియె. అవి దంతమూలములయందు జనించు. (మఱియు నిదివరకు జెప్పంబడిన 11 విధములైన దంతలక్షణంబులును 5 విధములైన నాడీదంత లక్షణంబులునుజేరి 16 విధంబులగు. ఐనను కదాళమనునది సుశ్రుతాచార్యుని మతమునం దధికంబగుటచే దాని లక్షణమును నిచట నుదహరింపంబడియె.

## దంతరోగములు.

## దాళన లక్షణము.

శ్లో॥ దీర్యమాణేష్వివరుజాయ స్యదంతేషు జాయతే ।
దాలనో నామసవ్యాధి స్సదాగతి నిమిత్తజః ॥

తా. దంతము పగలగొట్టబడినటుల పీడగలిగిన దాలన మనంబడు. ఇది వాతమువలన జనించు.

## కృమిదంత లక్షణము.

శ్లో॥ కృష్ణచ్ఛిద్ర శ్చలస్రావీ ససంరంభో మహారుజః ।
అనిమిత్త రుజోవాతా త్సజ్ఞేయః కృమిదంతకః ॥

తా. వాతసంబంధమువలన దంతములయందు నల్లని ఛిద్రములుగలిగి కదలుచు స్రావమును జేయించుచు వాపు మిక్కుటముగ పోట్లు నిష్కారణముగ నొప్పిగలిగిన కృమిదంతమనంబడు. (దీనియందునల్లనిఛిద్రములు క్రిములు దుష్టనత్త్వమువలనగలుగు)

## భంజనక లక్షణము.

శ్లో॥ వక్రంవక్రం ... దంతభంగశ్చజాయతే ॥
కఫవాతకృతోవ్యాధి స్సభంజనకసంజ్ఞితః ॥

తా. నోరు వంకరగనై దంతములు వీడిన భంజనక మనంబడు. ఇది కఫ వాత ప్రకోపమువలన జనించు.

## దంతహర్ష లక్షణము.

శ్లో॥ శీతరూక్ష ప్రవాతామ్ల స్పర్శ్యానామ సహేద్విజాః ।
పిత్తమారుత కోపేన దంతహర్ష స్సనామతః ॥

తా. శీతలము రూక్ష పులుసుగల పదార్థస్పర్శవలన గాలితగులుటవలన సహించుట కశక్యంబుగ నుండిన దంతహర్ష మనంబడు. ఇది పిత్తవాత ప్రకోపము వలన జనించు. (మఱియు నిది వాతజన్యంబైయుండినను వ్యాధిస్వభావమువలన నుష్ణమును సగా సహించుట కశక్యంబైయుండు.)

## దంతశర్కర లక్షణము.

శ్లో॥ మలోదంత గతోయస్తు పిత్తమారుత శోషితః ॥
శర్కరేవ ఖరస్పర్శా సాజ్ఞేయా దంతశర్కరా ॥

తా. దంతగతమలము పిత్త వాతములవలన శోషించుటచే నిసుకవలెగరగర లాడుచుండిన దంతశర్కర యనంబడు.

## కపాలికా లక్షణము.

శ్లో॥ కపాలేష్వివ దీర్ణేషు దంతానాం సైవశర్కరా ।
కపాలికేతి సాజ్ఞేయా సదాదంత వినాశినీ ॥

తా. పైజెప్పంబడిన దంతశర్కర (దంతమలము) చిల్ల పెంకులవలె పగిలిన దంతశర్కర యనంబడు ఇది యెల్లప్పుడు దంతముల నశింపంజేయుచుండు.

## శ్యావదంత లక్షణము.

శ్లో॥ యోన్సృజ్మిశ్రేణ పిత్తేన దగ్ధోదంత స్త్వశేషతః ।
శ్యావతాం నీలతాంవాపి గతస్స శ్యావదంతకః ॥

తా. రక్తయుక్తపిత్తమువలన దంతములయందంతట కాలినట్లు నల్లగాని లేక నీలముగాని యుండిన శ్యావదంత మనంబడు.

హనుమోక్ష లక్షణము.

శ్లో॥ వాతేనత్తై స్తైర్భావైస్తు హనుసంధి ర్విసంహతః ।
హనుమోక్ష ఇతిజ్ఞేయో వ్యాధిరర్దిత లక్షణః ॥

తా. వాతసంబంధమువలన అభిఘాతాదులవలన చెక్కిటిసంధులు వీడిన హనుమోక్ష మనంబడు. ఇది అర్దితలక్షణయుక్తంబై యుండు.

జిహ్వాగత రోగములు.

వాతజ లక్షణము.

శ్లో॥ జిహ్వానిలేన స్ఫుటితా ప్రసుప్తాభవేచ్చ శాకచ్ఛదనప్రకాశా॥

తా. నాలుకపగిలి మొద్దుపారి (అనగా రసజ్ఞానవిహీనంబై) మిట్టభూముల యందు జనించు. వృక్షములయొక్క యాకువలె గరగరలాడుచుండిన వాతజిహ్వాక మని తెలియవలయు.

పిత్తజ లక్షణము.

శ్లో॥ పిత్తేన పీతా పరిదహ్యతేచ దీర్ఘైస్సరక్తై రపికంటకైశ్చ ॥

తా. నాలుక పసపువర్ణముగలదై దాహయుక్తంబై పొడవై యెఱ్ఱగనుండు ముండ్లతో వ్యాప్తంబైయుండిన పిత్తజిహ్వాకమని తెలియవలయు.

కఫజ లక్షణము.

శ్లో॥ కఫేనగుర్వీబహులాచితాచమాంసోచ్ఛ్రయైశ్శాల్మలికణ్టకాభైః॥

తా. నాలుక జడముగ బూరుగముండ్లవంటి మాంసము మొలకలచే కడు వ్యాప్తంబుగనుండిన కఫజిహ్వాకమని తెలియవలయు.

అలాస లక్షణము.

శ్లో॥ జిహ్వాతలే యశ్శ్వయథుః ప్రగాఢస్సోలాససంజ్ఞః కఫర క్తమూర్తిః । జిహ్వాంసతుస్తంభ యతిప్రవృద్ధో మూలేజి హ్వాభృశమేతి పాకమ్ ॥

తా. కఫ రక్తములవలన నాలుకయందు భయంకరమైన వాపుగలిగిన అలసకమనంబడు. ఇది వృద్ధిజెందిన నాలుకయందు స్తంభనమును నాలుకయొక్క మూలమునందు మిక్కుటముగ పాకమును గలుగంజేయు. (ఇది అసాధ్యంబు.)

## ఉపజిహ్వాక లక్షణము.

శ్లో॥ జిహ్వాగ్రరూప శ్శ్వయథు స్సజిహ్వా మున్నమ్య జాతః కఫ రక్తమూర్తిః। లాలాకరః కండు యుతస్సచోష స్సాతూప జిహ్వా కథితాభిషగ్భిః ॥

తా. కఫరక్తమువలన నాలుకకొనవలె వాపుజనించి పొడవై మిక్కుటముగ జొల్లు గార్చుచు దురద మంటతోడం గూడియుండిన యుపజిహ్వాక మనంబడు.

## తాలుగతరోగములు.

## కంఠశుండి లక్షణము.

శ్లో॥ శ్లేష్మాసృగ్భ్యాం తాలుమూలా త్ప్రవృద్ధో దీర్ఘశ్శోథో ధ్మాతవ స్తిప్రకాశః। తృష్ణా కాస శ్వాస కృత్తం వదంతి వ్యాధిం వైద్యాః కంఠశుండీతి నామ్నా ॥

తా. కఫరక్తములవలన లోదౌడమూలమున నుబ్బిన వస్తివలె దీర్ఘమైన వాపుగలిగి దప్పి దగ్గు వుబ్బసమును గలిగియుండిన కంఠశుండి యనంబడు. (కంఠశుండియన —క్రిందినాలుక బడుకు.)

## తుండికేరి లక్షణము.

శ్లో॥ శోథ స్థూలస్తోదదాహ ప్రపాకీ ప్రాగుక్తాభ్యాం తుండికేరీ మతాతు ॥

తా. కఫరక్తమువలన శూల పోట్లు దాహము పాకము మొదలగువాని యుక్తముగ వాపుగలిగి మడపిప్పత్తికాయ యాకారముగలదిగనుండిన తుండికేరియనంబడు.

## అధ్రువ లక్షణము.

శ్లో॥ శోథ స్స్తబ్ధో లోహితస్తాలుదేశే రక్తాజ్జేయ స్సోఽధ్రువో రుగ్జ్వరశ్చ ॥

తా. లోదౌడయందు రక్తవికారముచే జడముగ యెఱ్ఱగనుండు వాపుజనించి పోట్లతోడంగూడ జ్వరముగలిగిన అధ్రువ మనంబడు.

కచ్ఛప లక్షణము.

శ్లో॥ కూర్మోత్సన్నో వేదనో శీఘ్రజన్మా రోగోజ్ఞేయః కచ్ఛప శ్శ్లేష్మణాత్ ॥

తా. కఫదోషమువలన తాబేటివీపువలె నుబ్బుగ వేదనాయుక్తముగ నుండు వాపు సావకాశముగ జనించిన కచ్ఛప మనంబడు.

అర్బుద లక్షణము.

శ్లో॥ పద్మాకారం తాలుమధ్యేతు శోథం విద్యా ద్రక్తా దర్బుదం ప్రోక్తలింగమ్ ॥

తా. లోదౌడ మధ్యమున రక్తదోషమువలన దామర మిద్దవలెవాపు జనించి అర్బుద నిదానోక్త రక్తార్బుద లక్షణయుక్తంబై యుండిన అర్బుద మనంబడు.

మాంససంఘాత లక్షణము.

శ్లో॥ దుష్టంమాంసం నీరుజం తాలుమధ్యే కఫాచ్ఛూనం మాంస సంఘాతమాహుః ॥

తా. లోదౌడమధ్యమున కఫదోషమువలన మాంసము దుష్టంబై యుబ్బి వేదనా రహితంబై యుండిన మాంస సంఘాతమనంబడు.

తాలుపుప్పుట లక్షణము.

శ్లో॥ నీరుక్స్థాయీ కోలమాత్రః కఫాత్స్యా న్మేదోయుక్తా త్పుప్పుట స్తాలుదేశే ॥

తా. మేదోయుక్త కఫముచే లోదౌడయందు వేదనారహితంబై స్థిరమై రేగుబండు ప్రమాణముగలదై యుండు వాపుజనించిన తాలుపుప్పుట మనంబడు.

తాలుశోష లక్షణము.

శ్లో॥ శోషోత్యర్థందీర్యతేచాపి తాలుశ్శ్వాసశ్చో గ్రస్తాలుశోషోనిలాశ్చ

తా. వాతమువలన లోదౌడ మిక్కుటముగ నెండి పగిలి భయంకరమైన శ్వాసము వెడలుచుండిన తాలుశోష మనంబడు.

### తాలుపాక లక్షణము.

శ్లో॥ పిత్తంకుర్యాత్పాకమత్యర్థ ఘోరం తాలుస్యేవం తాలు పాకం వదంతి ॥

తా. పిత్తప్రకోపముచే లోదాడ కడుభయంకరముగ పండిన తాలుపాక మనంబడు.

## కంఠగతరోగములు.

### రోహిణీ లక్షణము.

శ్లో॥ గళేనిలఃపిత్త కఫౌచమూర్ఛితౌ ప్రదూష్యమాంసంచ తథైవశోణితమ్ । గళోపసంరోధకరైస్తథాంకురైర్నిహంత్యసూన్వ్యాధిరయం హిరోహిణీ ॥

తా. కంఠమధ్యమున వాత పిత్త కఫములు ప్రకోపించి మాంసరక్తములం జెరచి కంఠముగడ్డగించెడి యంకురముల గలుగంజేసిన రోహిణియనంబడు. ఇది ప్రాణముల హరింపంజేయు.

### వాతజరోహిణీ లక్షణము.

శ్లో॥ జిహ్వాసమంతాద్భృశవేదనాస్తు మాంసాంకురాః కంఠ నిరోధనాయా । సారోహిణీవాతకృతా ప్రదిష్టా వాతాత్మకోపద్రవగాఢయుక్తా ॥

తా. నాలుకయంతటకడువేదనాయుక్తమైన మాంసము మొలకలు జనించి కంఠము నడ్డగించుటవలన కంపస్తంభాదిక వాతోపద్రవయుక్తంబైయుండిన వాతజరోహిణి యనంబడు.

### పిత్తరోహిణీ లక్షణము.

శ్లో॥ క్షిప్రోద్గమాక్షిప్రవిదాహపాకా తీవ్రజ్వరాపిత్తనిమిత్తజాతా॥

తా. శీఘ్రముగ జనించి దాహయుక్తంబై శీఘ్రముగ పండుటవలన తీవ్రజ్వరయుక్తంబైయుండిన రోహిణియనంబడు.

## కఫజరోహిణీ లక్షణము

శ్లో॥ స్రోతోనిరోధిన్యపిమందపాకా స్థిరాంకురాయూకఫసంభవాసా॥

తా. కంఠమార్గము నడ్డగించి చిరకాలమువీాద పండునదియై కఠినమైన మొలకలుగలదై యుండిన కఫజరోహిణియని తెలియవలయు.

## త్రిదోషజరోహిణీ లక్షణము.

శ్లో॥ గంభీరపాకిన్యనివార్యవీర్యా త్రిదోషలింగా త్రితయోత్థితాసా॥

తా. గంభీరపాకము (అనగా లోనచీము) గలదై ఔషధోపచారముల కశక్యంబైన పూర్వోక్త త్రిదోష లక్షణయుక్తంబై యుండునది త్రిదోషజ రోహిణి యనంబడు. (ఇది తక్షణమున ప్రాణముల హరింపంజేయు.)

## రక్తజరోహిణీ లక్షణము.

శ్లో॥ స్ఫోటైశ్చితాపిత్తసమానలింగాసాధ్యాప్రదిష్టారుధిరాత్మకాతు॥

తా. బొబ్బలవలన వ్యాప్తంబై పిత్తరోహిణి లక్షణయుక్తంబై యుండిన రక్తజరోహిణియని తెలియవలయు. ఇది సాధ్యము.

## కంఠశాలూక లక్షణము.

శ్లో॥ కోలాస్థిమాత్రఃకఫసంభవోయోగ్రంథిర్గలేకంటకశూకభూతః।
ఖరస్థిరశ్శస్త్రనిపాతసాధ్య స్తంకంఠ శాలూక మితి బ్రువంతి॥

తా. కంఠమున కఫమువలన రేగువిత్తు ప్రమాణముగల గ్రంధిజనించి ముండ్లు జలశూకములు వీనివలె వేదనను గలుగంజేయుచు గరగర కఠినముగనుండిన కంఠశాలూక మనంబడు. ఇది శస్త్రసాధ్యంబు.

## అతిజిహ్వా లక్షణము.

శ్లో॥ జిహ్వాగ్రరూప శ్శ్వయథుంకఫాత్తు జిహ్వోపరిష్టా దపిరక్త
యుక్తాత్ । జ్ఞేయోధి జిహ్వః ఖలురోగ ఏష వివర్జయే దా
గత పాకమేనమ్ ॥

తా. రక్తయుక్తకఫముచే నాలుకపైన వాపుజనించి నాలుకకొనవలె నుండిన అధిజిహ్వక మనంబడు. ఇది పండిన నసాధ్యంబు.

వలయ లక్షణము.

శ్లో॥ బలాసవాతసముచ్ఛ్రితంచ గ్రంథింకరోతి స్సగతిర్య । తంసర్వతైవా ప్రతివార్యవీర్యం వివర్జనీయం వదంతి ॥

తా. కఫముచే పొడవుగ నుబ్బుగ నుండు గ్రంధి జనించి దానివలలోన దిగక సర్వోపచారముల కనర్హంబై యుండిన వలయమనియు ముఖమున ఘటసర్పమనియు జెప్పంబడు. ఇది యసాధ్యము.

బలాస లక్షణము.

శ్లో॥ గలేతుశోధం కురుతః ప్రవృద్ధౌ శ్లేష్మానిలౌ శ్వాసరుజోపపన్నమ్ । మర్మచ్ఛిదం దుస్తరమేనమాహు ర్బలాసనిఘ్నావికారమ్ ॥

తా. ప్రకోపించిన కఫవాతములు కంఠమునందు వాపునగలుగుటవలన నుబ్బసముగలిగి కంఠమునొచ్చుచు మర్మస్థానమును భేదింపుచుండి బలాసమనంబడు. ఇది యసాధ్యంబు.

ఏకబృంద లక్షణము.

శ్లో॥ వృత్తోన్నతోంత శ్శ్వయథు స్సదాహ స్సకండురోపాకి మృదుర్గురుశ్చ । నామ్నైకబృందః పరికీర్తితోసౌ వ్యాధిః కఫక్షతజ ప్రసూతః ॥

తా. కంఠమునందు కఫరక్తములు బ్రకోపించుటవలన గుండ్రముగ నొకింత దాహయుక్తముగ దురదతో గూడినదిగనుండు వాపు లోనగలిగి పండి నొకింత మృదువుగ జడముగనుండిన యేకబృంద మనంబడు.

బృంద లక్షణము.

శ్లో॥ సమున్నతం వృత్తమమందదాహం తీవ్రజ్వరం బృందముదాహరంతి । తంచాపిపిత్త క్షతజప్రకోపా ద్విద్యాద్యదంపవనాత్మకంతు ॥

తా. కంఠమునందుబ్బుగ గుండ్రముగ తీవ్రదాహయుక్తముగజ్వరయుక్తముగ నుండు వాపుజనించిన బృందమనంబడు. ఇది వాతపిత్త రక్తప్రకోపమువలన

పొడుచునటుల వేదనతో గూడియుండు. ఇది బ్రుందమునం దవస్థా విశేషముగలది నుండుటంజేసి వేరుగ నెన్నంజనదు.

## శతఘ్ని లక్షణము.

శ్లో॥ వర్తిర్ఘనా కంఠ నిరోధినీయా చితాతిమాత్రం పిశితప్రరోహైః। అనేకరుక్ప్రాణహరీత్రిదోషాత్ జ్ఞేయాశతఘ్నీతుశతఘ్నిరూపా॥

తా. కంఠమునందు గుండ్రముగ పొడవుగ కఠినముగనుండు వాపు జనించి కంఠము నడ్డగించుట వాపునందు మాంసపు మొలకలు తీవ్రముగ మిక్కుటముగ జనించిన పోట్లు దాహము దురదమొదలగు పలువిధములైనపీడలతోగూడియుండుట మండ్లతో వ్యాప్తంబైన ఫిరంగివలెనుండుట యీలక్షణములుగలది శతఘ్ని యనం బడు. ఇది ప్రాణముల హరింపంజేయు.

## గిలాయు లక్షణము.

శ్లో॥ గ్రంథిర్గళేత్వామలకాస్థిమాత్రస్థిరోల్పరుగ్యాఃకఫరక్తయుక్తః। సంలక్ష్యతేసక్తమివాశనంచసశస్త్రసాధ్యస్తుగిలాయుసంజ్ఞః॥

తా. కంఠములో కఫరక్త సంబంధమువలన నుసిరికకాయవిత్తువంటి గ్రంధి జనించి కఠినంబై మందవేదనగలదై యన్నము మ్రింగిన ధారాళముగ దిగకుండు నటులం జేసిన గిలాయు వనంబడు. ఇది శస్త్రసాధ్యము.

## గళవిద్రధి లక్షణము.

శ్లో॥ సర్వంగళంవ్యాప్య సముత్థితోయ శ్వోథోరుజ స్సంతిచ యత్రసర్వాః । ససర్వదోషో గళవిద్రధిస్తు తస్యైవతుల్యాః ఖలు సర్వజస్య ॥

తా. త్రిదోషసంబంధమువలన వాపు కంఠమునందంతట జనించి పలువిధ వేదనలతోగూడి విద్రధిని దాహోక్త త్రిదోషలక్షణయుక్తంబై యుండిన గళవిద్రధియనంబడు.

## గళౌఘ లక్షణము.

శ్లో॥ శోథోమహానన్నజలావరోధి తీవ్రజ్వరోవాయుగతేర్నిహంత। కఫేనజాతో రుధిరాన్వితేన గళేగళౌఘఃపరికీర్త్యతేసౌ॥

తా. రక్తయుక్తకఫముచే కంఠమున ప్రబలమైన వాపుజనించి యన్నోదకములలోనం గ్రోలుట కశక్యంబై తీవ్రజ్వరయుక్తంబై వాతసంచార హితంబైయుండిన గళౌఘ మనంబడు.

## స్వరఘ్న లక్షణము.

శ్లో॥ యస్తామ్యమానశ్శ్వసితిప్రసక్తం భిన్నస్వరశ్శుష్కవిముక్త కంఠః । కఫోపదిగ్ధేష్వనిలాయనేషు జ్ఞేయ స్సరోగశ్శ్వసనాత్స్వరఘ్నః ॥

తా. కంఠమునందు వాతమార్గములు కఫముచే నడ్డగింపంబడుచుండ పలుమారు నేత్రములకు చీకట్లుగ్రమ్మి యెల్లపుడు శ్వాసమును విడుచుట స్వరము భేదించుట గొంతెండుట భుమిని బాగుగ మ్రింగుట కశక్యంబగుట యీ లక్షణములుగలది స్వరఘ్నమనంబడు. ఇది వాతజన్యంబు.

## మాంసతానక లక్షణము.

శ్లో॥ ప్రతానకాన్యశ్శ్వయథు స్సుకష్టో గళోపరోధం కురుతే క్రమేణ । సమాంసతా-నేతి బిభర్తి సంజ్ఞాం ప్రాణప్రణుత్సర్వకృతోవికారః ॥

తా. కంఠమునందు వాపు జనించి క్రమముగ కంఠమును వ్యాపించి యడ్డగించి-కడుకష్టమును గలుగంజేయుచు ప్రాణముల హరింపంజేయునది మాంసతానకమనంబడు. ఇది త్రిదోష జనితంబు.

## విదారీ లక్షణము.

శ్లో॥ సదాహతోదంశ్వయథుంసుతీవ్ర మంతర్గళేపూతివిశీర్ణమాంసమ్ । పిత్తేనవిద్యాద్వదనే విదారీంపార్శ్వే విశేషా త్సతు యానశేతే ॥

తా. కంఠమున పిత్తప్రకోపముచే తీవ్రముగ వాపుజనించి దాహము పోట్లు అనువానితోడంగూడి దుర్గంధయుక్తమై మాంసము వీడుచుండిన విదారి యనంబడు. ఇది పరుండెడి పార్శ్వమునందే విశేషముగ జనించు.

## సర్వసర లక్షణము.

శ్లో॥ స్ఫోటైస్సతోదైర్వదనంసమంతా ద్యస్యాచితం సర్వసర స్సవాతాత్ ॥

తా. వాతసంబంధమువలన నోటియందంతట బొబ్బలుగలిగి సూదులతో బొడుచునట్టుల పోట్లుగలిగియుండిన సర్వసరమని (అనగా ముఖపాకమని) తెలియవలయు

## పైత్తిక సర్వసర లక్షణము.

శ్లో॥ రక్తైస్సదాహైఃపిటకైస్సపీతైర్యస్యాచితంచాపిసపిత్తకోపాత్ ॥

తా. పిత్తప్రకోపమువలన ముఖమునం దెఱ్ఱగ పచ్చగనుండు కురుపులు జనించి మంటతోడం గూడియుండున పైత్తిక సర్వసరమని తెలియవలయు.

## కఫజ సర్వసర లక్షణము.

శ్లో॥ అవేదనైః కండుయుతైస్సవర్ణై రస్యాచితంచాపిసవైకఫేన॥

తా. కఫప్రకోపముచే నుండవేదన దురదగలిగి చర్మముతో సమానవర్ణము గల బొబ్బలు నోటిలో వ్యాపించిన కఫసర్వసరమని తెలియవలయు.

## అసాధ్య ముఖరోగ లక్షణము.

శ్లో॥ ఓష్ఠప్రకోపే వర్జాస్స్యుర్మాంసరక్తప్రకోపజాః । దంతిమూలేషువర్జ్యాతుత్రిలింగగతిసౌషిరా। దంతేషుచనసిధ్యంతి శ్యావదాలసభంజనాః ॥ జిహ్వాగతేష్వలాసశ్చ తాలవ్యేష్వర్బుదంతథా । స్వరఘ్నో వలయోబృందో బలాసశ్చ విదారికా। । గలౌఘో మాంసతానశ్చ శతఘ్నీ రోహిణీగళే । అసాధ్యాః కీర్తితాహ్యేతే రోగానవదశైవతు । తేషుచాపి క్రియాం వైద్యః ప్రత్యాఖ్యాయ సమాచరేత్ ॥

తా. ఓష్ఠరోగములలో మాంసజ రక్తజ త్రిదోషజములన 3 రోగంబులును దంతమూలగతరోగములలో సన్నిపాతము నాడీసౌషిరము అన 2 రోగంబులును దంతరోగములలో శ్యావ దాళన భంజనములన 3 రోగంబులును జిహ్వాకరోగములలో అలసమను నొకరోగంబును తాలుగతరోగములలో అర్బుదమను నొకరోగంబును కంఠగత రోగములలో స్వరఘ్న వలయ బృంద బలాస విదారిక గళౌఘ మాంసతానక శతఘ్నీ రోహిణి యను 9 రోగంబులును యీ చెప్పిన 19 రోగంబులసాధ్యంబులు. అట్లగుటంజేసి వానియందు జికిత్సంజేయునపుడు కుదురుట దుర్లభంబనిచెప్పి ఔషధమును వైద్యుడొసంగవలయు.

## తైలాది లేపనము.

శ్లో॥ తైలంఘృతం సర్జరసం ససిక్థం రాస్నాగుండ సైంధవగైరికం
చ। పక్వాసమాంశందళ నచ్ఛదానాం తద్భేదహంతా వ్రణ
రోపణంచ ॥

తా. నూనె నెయ్యి గుగ్గిలము మైనము సన్నరాస్నము బెల్లము సైంధవలవణము కావిరాయి వీనిని సమభాగములుగ నేకముచేసి తైలముకాచి పెదవులపై లేపనముజేసిన పెదవిపగుళ్ళు వ్రణమునందు మాంసము నిండును.

## రాళాది లేపనము.

శ్లో॥ రాళంమధూచ్ఛిష్ట గుడేనపక్వం తైలంఘృతంవా వినిహంతి
లేపాత్ । త్వక్కోదపారుష్య రుజోధరస్య పూయాస్రసస్రావ
మపిప్రహాణ్యాత్ ॥

తా. గుగ్గిలము మైనము బెల్లము వీనిలో నూనెగాని నెయ్యిగాని కలిపి కాచి పెదవులపై లేపనముజేసిన చర్మపీడ గరగరలాడుట పోట్లు చీము రక్తము గారుట వీనిని హరింపంజేయు.

## పిత్తోష్ఠరోగ చికిత్స

శ్లో॥ వేధంసిరాణాం వమనంవిరేకం తిక్తస్యపానం రసభోజనంచ।
శీతాః ప్రదేహాః పరిషేచనంచ పిత్తోపద్రుష్టే ష్వధరేషుకు
ర్యాత్ ॥

తా. పిత్తవికారముగల పెదవిరోగములయందు సిరావేదనను వమనము విరేచనము కటురసపానము రసయుక్తభోజనము శీతకరలేపనము పిత్తహరౌషధ కషాయములయొక్క పరిషేకము మొదలగు నుపచారములను జేయవలయు.

## సర్వోష్ఠరోగ సామాన్య చికిత్స

శ్లో॥ ఓష్ఠరోగే ష్వశేషేషు దృష్ట్వాదోష ముపాచరేత్ ।
తేషు వ్రణత్వం యాతేషు వ్రణవత్స ముపాచరేత్ ॥

తా. సమమైన పెదవిరోగములయందు దోషానుగుణ్యమైన చికిత్సలను లేక వ్రణంబైయుండిన వ్రణచికిత్సలను జేయవలయు.

## శీతాదరోగ చికిత్స.

శ్లో॥ శీతాదేహృతరక్తేతు తోయం నాగరసర్షపైః।
నిక్వాథ్య త్రిఫలాంవాపి కుర్యాద్గండూషధారణమ్ ॥

తా. శీతాదమను దంతరోగమున మునుపటివలెనే రక్తమునుదీసి శొంఠితెల్లావాలు అనువాని కషాయముతో గాని త్రిఫలకషాయముతో గాని * గండూషము సేయవలయు.

## కాసీసాది చూర్ణము.

శ్లో॥ కాసీసలోధ్రకృష్ణామనశ్శిలాస ప్రియంగుతేజోహ్వా।
ఏషాంచూర్ణంమధుయుక్ఛీతాదేపూతి మాంసహంఎమ్।
తైలంఘృతంవావాతఘ్నం శీతాదే సంప్రశస్యతే।

తా. అన్నభేది లొద్దుగ పిప్పలి మణిశిల ప్రేంకణము వెక్కుడు లేక వెణుకురతీగ అనువానిచూర్ణములో తేనెగలిపి లేపనముజేసినను లేకవాతహరతైలమును గాని లేక ఘృతమునుగాని లేపనముజేసినను దుర్గంధము గలిగి శిథిలమైయుండు మాంసము హరించు.

## దంతపుప్పుట చికిత్స.

శ్లో॥ దంతపుప్పుటకే కార్యం తరుణే రక్తమోక్షణమ్।
సపంచ లవణక్షార సక్షౌద్రః ప్రతిసారణమ్ ॥

తా. దంతపుప్పుటరోగమున తరుణావస్థలయందురక్తముదీసి పంచలవణముల క్షారమును తేనెలోగలిపి మెల్లగ రుద్దవలయు.

## దంతవేష్ట చికిత్స.

శ్లో॥ లోధ్రపతంగం మధుకం లాక్షాచూర్ణైర్మధుప్లుతైః।
గండూషే క్షీరిణో యోజ్యాస్సక్షౌద్ర ఘృతశర్కరా॥

తా. లొద్దుగ రసకర్పూరము అతిమధురము లక్క వీనిని చూర్ణముజేసి

* గండూషమన— ద్రవపదార్థములను ధరించి యుమ్మివేయుటయు

తేనెలోగలిపిగాని లేక * క్షీరవృక్షముల చూర్ణములో తేనెనెయ్యి పంచదారగలిపి గాని గండూషముజేయించిన దంతవేష్టరోగము హరించు.

## జీరకాది చూర్ణము.

శ్లో॥ జరణాలవణపథ్యా శాల్మలీకంటకానా మనుదినమను ఘృష్టం దంతమాలేషుచూర్ణమ్ । వ్రణదరణరుగస్ర స్రావచాంచల్యశోథాన్ ప్రణిహతిచ వివస్యా నంధ కారా నివాహౌ॥

తా. జీలకఱ్ఱ వుప్పు కరక్కాయ బూరుగముండ్లు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దానితో ప్రతిదినము దంతములను తోమిన "సూర్యుం డంధకారమును హరింపంజేయు భంగి" దంతవ్రణము దంతపుపగుళ్ళు పోట్లు రక్తస్రావముదంతచలనము వాపు వీనిని శీఘ్రముగ హరింపంజేయు.

## కణాది చూర్ణము.

శ్లో॥ కణాసింధూత్థ జరణం చూర్ణంతూర్ణం వ్యపోహతి ।
ఘరణా ద్దంతచాంచల్య వ్యథాశోథా స్రసంస్రవాన్ ॥

తా. పిప్పలి సైంధవలవణము జీలకఱ్ఱ వీనిని చూర్ణముజేసి దంతముల రుద్దిన దరితములు కదలుట పోటు వాపు రక్తస్రావము శీఘ్రముగ హరించు.

## భద్రముస్తాది వటికములు.

శ్లో॥ భద్రముస్తా భయావ్యోష విడంగా రిష్టపల్లవైః ।
గోమూత్ర పిష్టై ర్గుటికాం ఛాయాశుష్కాం ప్రకల్పయేత్ ।
తాన్నిదధ్యా న్ముఖేనిశ్యాం చలదంతాతురో నరః ।
నాతః పరతరంకించి చ్చలదంతస్య భేషజమ్॥

తా. తుంగముస్తెలు కరక్కాయ త్రికటుకములు వాయువిడంగములు వేపాకు వీనిని గోమూత్రముతోనూరి యుంటలుజేసి నీడ నెండించి రాత్రులయందు నోటియందువిడిచిన పరుండిననదంతములు గట్టియగు. దంతచలనమునందు దీనికంటె శ్రేష్టంబయిన యౌషధం బెద్దియు లేదు.

* క్షీరవృక్షములన — మఱ్ఱి మేడి రావి అంబాళము కలుజువ్వి అనునవి.

## సౌషిర చికిత్స.

శ్లో॥ సౌషిరే ధృతరక్తేతు లోధ్రముస్తా రసాంజనైః ।
సక్షౌద్రైశ్చ స్యుస్తే లేపాః గండూషే క్షీరిణోహితాః ॥

తా. సౌషిరమను రోగమున రక్తమునుదీసి లొద్దుగ తుంగముస్తెలు రసాంజనము అనువానిచూర్ణమును తేనెలోగలిపి లేపనముజేయుటయు లేక క్షీరవృక్షకషాయములో గండూషధారణమును జేయించుటయు హితకరంబులు.

## పంచలవణాదిచూర్ణ లేపము.

శ్లో॥ కాకోదుంబరికా పత్రైర్ఘర్షణం విస్రావయేద్భిషక్ ।
లవణైః క్షౌద్రయుక్తైశ్చ సవ్యోషైః ప్రతిసారయేత్ ॥

తా. బ్రహ్మమేడియాకులతో వ్రణమునుగుద్ది రక్తమును స్రవింపజేసి పంచలవణములు త్రికటుకములు అనువానిచూర్ణములో తేనెగలిపి మెల్లగ దంతములయందు రుద్దవలయు.

## వైదర్భ చికిత్స.

శ్లో॥ శస్త్రేణోత్కృత్య వైదర్భే దంతమూలాని శోధయేత్ ।
తతఃక్షారం ప్రయుంజీత క్రియాః స్సర్వాశ్చశీతలాః ॥

తా. వైదర్భమను దంతమూలరోగమును వస్త్రముతో జీల్చి రక్తస్రావము జేయించుటయేగాక క్షారలేపనమును సమస్తమైన శీతకరలేపనములను జేయవలయు.

శ్లో॥ ఉద్ధృత్యాధిక దంతంతు తతోవై సముపాచరేత్ ।
కృమిదంత చికిత్సాశ్చ విధిః కార్యో విజానతా ॥

తా. అధికముగనుండు దంతమును దీసివేసి కృమిదంత చికిత్సలం జేయవలయు

## అధిమాంసక చికిత్స.

శ్లో॥ ఛిత్వాధిమాంసం సక్షౌద్రైశ్చ రేతైశ్చూర్ణై రుపాచరేత్ ।
వచా తేజోవతీపాఠా సర్జకాయా వశూకజైః ।
క్షౌద్రం ద్వితీయం పిప్పల్యా కబలీ చాత్రకీర్తితమ్ ।
పటోల నింబత్రిఫలా కషాయ శ్చాత్రధావనః ॥

తా. అధిమాంసమను దంతిమూలరోగమును ఛేదించి దానిపైవస వెక్కుడు తీగ అగరుశొంతి లేక చిరుబొద్ది సర్జక్షారము యవక్షారము అనువాని కల్కములో తేనెగలిపిగాని లేక పిప్పలిచూర్ణములో తేనెగలిపిగాని నోటియందు ధరింపవలయు, మఱియు చేలిపాట్ల వేపత్రిఫలములు అనువాని కషాయముతోడ అధి మాంసమును గడుగవలయు.

## దంతవిద్రధి సామాన్య చికిత్స.

శ్లో॥ విద్రధ్యుక్తంచవిధిన ద్విదధ్యాద్ధంతవిద్రధౌ ।
శస్త్రకర్మనర స్తత్ర కుశలోనైవకారయేత్ ॥

తా. దంతవిద్రధియందు సామాన్య విద్రధియొక్క సర్వచికిత్సలం జేయవలయునేగాని శస్త్రకర్మను జేయంజనను.

శ్లో॥ స్నైహికోత్రహితోధూమో నస్యంస్నైహికమేవచ ।
రసారసయవాగ్వశ్చ క్షీరంసాంతానికంఘృతమ్ ।
శిరోవస్తిర్హితశ్చాపి క్రమోయశ్చానిలాపహః ॥

తా. దంతహర్ష రోగమున స్నేహయుక్తధూమము నస్యము స్నేహయుక్త మధురాదిరసములు మాంసరసము యవాగు పాలు సాంతానిక ఘృతము శిరోవస్తి వాతనాశకర చికిత్సలు వీనిని క్రమముగ జేయవలయు.

## కృమిదంత చికిత్స.

శ్లో॥ నీలీవాయుసజంఘా కటుతుంబీమూలమేకైకమ్ ।
సంచూర్ణ్యదశన విధృతం దశనకృమి పాతసంపాప్రిహః ॥

తా. నీలి వెలుమగంధి చేదుసొర వీని వేళ్ళను ప్రత్యేకముగ చూర్ణముజేసి దంతములయందునిచిన క్రిములు నశించు.

## శారిబాపర్ణ ధారణము.

శ్లో॥ పిష్ట్వాచశారిబాపర్ణ ధ్మఘందం తేషుధారయేత్ ।
పతంతిదంతకీటాశ్చ చాంచల్యంహరతిక్షణాత్ ॥

తా. తెల్లసుగంధి పాలాకులను నూరి ముద్దజేసి పండ్లయందదిమి యునిచి కొనిన క్రిములు శీఘ్రముగ నూడిపడి దంతములు గట్టియగు.

## కాసీసాది ఘుటికలు

శ్లో॥ కాసీసం హింగుసౌరాష్ట్రి దేవదారు సమంజసైః ॥
ఘుటికాం ధారయేద్దంత కృమిశూల హరాంపరామ్ ॥

తా. అన్నభేది యింగువ తోవరిమన్ను దేవదారు వీనిని సమభాగములుగ ...కముతోనూరి మాత్రలుజేసి దంతములపై నునిచిన క్రిమిదంతశూల హరించు.

## శర్కరా చికిత్స.

శ్లో॥ అచ్ఛిందందంతమూలాని శర్కరా ముద్ధరేద్భిషక్ ।
లాక్షాచూర్ణై ర్మధుయుతై స్తదస్తాం ప్రతిసారయేత్ ॥

తా. దంతమూలములయందు నొప్పిగలుగకుండునటుల వానిపైనుండు శర్క- (మలము) ను గీచితీసివేసి లక్కచూర్ణమును తేనెలోగలిపిమెల్లగ రుద్దవలయును.

## కపాలికా చికిత్స.

శ్లో॥ దంతహర్ష క్రియాంచాత్ర కుర్యాన్ని రవశేషతః ।
కపాలికా కృచ్ఛ్రతమా తత్రాప్యేషా క్రియాహితా ॥

తా. (దంతశర్కరయందును) కపాలికమను దంతరోగమునందును దంతహర్ష ...కై జెప్పంబడిన సర్వచికిత్సలం జేయవలయును.

## నాడీవ్రణ చికిత్స.

శ్లో॥ ఛిత్వామాంసాని శస్త్రేణ భవేయుః పరితోయది ।
ఉద్ధృత్యచ దహేచ్చాపి క్షారేణ జ్వలనేనవా ॥

తా. నాడీవ్రణమునందు చుట్టుమాంసంబుండిన శస్త్రముతో, ఛేదించి క్షార ...తో గాని అగ్నితోగాని కాల్చవలయును.

## దంతరోగసామాన్య చికిత్స.

శ్లో॥ దంతరోగేషు సర్వేషు శస్తోవాత హరోవిధిః ।
పక్వంతైలం కవోష్ణంచ శస్తంక బలధారణే ॥

**తా. సర్వదంతరోగములయందు వాతనాశకరచికిత్సలంజేయుటయేగాకవాత ...ద్రవ్యయుక్తముగ నూనెనుగాచి సుఖోష్ణముగనోటిలోధరించుట ప్రశస్తంబు.**

## లక్షాది తైలము.

శ్లో॥ తైలం లాక్షారసంక్షీరం పృథక్ప్రస్థమితః పచేత్। ద్రవ్యైః పలమితైరేతైః క్వాథైశ్చాపి చతుర్గుణైః। లోధ్రకట్ఫలమంజిష్ఠాపద్మకేసరపద్మకైః। చందనోత్పలయష్ట్యాహ్వైస్త్రి తైలం వదనేధృతమ్। చాలనం దంతచాలంచ దంతమోక్షంకపాలికామ్। శీతాద పూతివక్త్రంచా ప్యరుచింవిరసాస్యతామ్। హన్యాదాశుగదానేతాన్కుర్యాద్దంతానపిస్థిరాన్। లాక్షాదిక మిదంతైలం దంతరోగేషు పూజితమ్॥

తా. నూనె లక్కరసము పాలు వీనిని దినుసుకొక్కక ప్రస్థముచొప్పున గ్రహించి అందులోదుగ గుమ్మడుతేకు మంజిష్ఠి తామరయగరులు చందనము నల్లకలువగడ్డ అతిమధురముఅనువానియొక్క కషాయమునునూనెకు నాలుగింతలుకలిపి లొద్దుగ మొదలగు ద్రవ్యములయొక్క కల్కమును దినుసుకొక్కకపలముచొప్పున కలిపి చిక్కగ తైలముకాచి నోటియందు నునిచికొనిన చాలనము పండ్లుకదలుట ఆకాలమున దంతములూడుట కపాలికము శీతాదము పూతివక్త్రము అరుచి నోటి విరసత్వము వీనిని శీఘ్రముగ హరింపంజేయుటయేగాక దంతముల గట్టిపఱచు. ఇది దంతరోగములయందు కడుశ్రేష్ఠంబు.

## దంతరోగమునకు అరిమేదాది తైలము,

శ్లో॥ అరిమేదత్వచంతుల్ణాం పచేచ్ఛతపలోన్మితామ్। జలద్రోణేన తత్కాథం గృహ్ణీయాత్పాదశేషితమ్। తైలస్యార్ధాఢకందత్వా కల్కైఃకర్షమితైఃపచేత్। అరిమేదలవంగాభ్యాం గైరికాగరుపద్మకైః। మంజిష్ఠాలోధ్రమధుకైర్లాక్షాన్యగ్రోధముస్తకైః। త్వగ్జాతీఫలకర్పూరకంకోలఖదిరైస్తథా। పతంగధాతకీపుష్పసూక్ష్మైలానాగకేసరైః। కట్ఫలేనచసంసిద్ధం తైలంముఖరుజంజయేత్। ప్రదుష్టమాంసంచలితంశీర్ణదంతం చసౌషిరమ్। శీతాదందంతహర్షంచవిద్రధిం క్రిమిదంతకమ్। దంతస్ఫుటనదౌర్గంధ్యం జిహ్వాతాల్వోష్ఠజాంరుజమ్॥

తా. 100 పలముల నల్లతుమ్మపట్టను దంచి ద్రోణప్రమాణ ముదకములో పైకషాయము కాచి చతుర్థాంశము దించుకొని వడియగట్టి అందునువ్వులనూనె శ్లో అఢకము నల్లతుమ్మపట్ట లవంగము కావిరాయి కృష్ణాగరు పద్మకోష్ఠము మంజిష్ఠి లొద్దుగ అతిమధురము లక్కమట్టియూడకొనలు తుంగముస్తెలు లవంగపట్ట జాజికాయ కర్పూరము తక్కోలపుట్లు కాచు నీరుయిప్ప ఆరెపువ్వు సన్నయేలకులు నాగకేసరములు గుమ్మడు తేన అనువాని కల్కములు దినుసుకొక్కక కర్షము చొప్పునగలిపి చిక్కగకాచి నోటిలోధరించిన దంతముల యందలి కుళ్ళినమాంసము దంతములు కదలుట దంతములు విరుగుట సాషిరము శీతాదము దంతహర్షము దంతవిద్రధి క్రిమిదంతము దంతపుపగుళ్ళు దౌర్గంధ్యము నాలుక లోదౌడ పెదవి వీనియందలి రోగములన్నియు హరించు.

## కుష్ఠాది చూర్ణము.

శ్లో॥ కుష్ఠందార్వీలోధ్రమబ్దస్సమంగా పాఠాతిక్తా తేజనీపీతికాచ ।
చూర్ణంశస్తంఘర్షణేతద్ద్విజానాం రక్తస్రావంహంతికండూం
రుజంచ ॥

తా. చంగల్వకోష్ఠు ప్రమానిపసపు లొద్దుగ తుంగముస్తెలు మంజిష్ఠి అగరు శొంఠి లేక చిరుబొద్ది కటుకరోహిణి ఛాగ పసపు అనువాని చూర్ణముతో దంతముల తోమిన రక్తస్రావము దురద పోట్లు హరించు.

## జాతీపత్రాది చూర్ణము.

శ్లో॥ జాతీపత్రపునర్నవా గజకణాకోరంటకోష్ఠంనచా । శుంఠీభీష్య
నారీతకీతిలసముంశ్లక్ష్ణం భస్మశంచూర్ణయేత్ । తచ్చూర్ణం న
దనేధృతంవిజయతేదౌర్గంధ్యదంతవ్యథామ్ । చాంచల్యాస్య
మతిస్రవణశ్వయథుకండూకృమివ్యాపదః ॥

తా. జాజికాయలు గలిజేరు గజపిప్పలి గోరింట చంగల్వకోష్ఠు వస శొంఠి వోమము కరక్కాయ నువ్వులు అనువాని చూర్ణమును సమభాగములుగ గలిపి నోటిలోధరించిన నోటిదుర్గంధము దంతశూల దంతములుకదలుట దంతస్రావము వాపు పీడ దురద పురుగులు హరించు.

దంతరోగములయందు పథ్యము.

శ్లో॥ ఫలాన్యమ్లానిశీతాంబు రూక్షాన్నం దంతధావనమ్ ।
తథాపి కఠినంభక్ష్యం దంతరోగీ వివర్జయేత్ ॥

తా. పుల్లనిఫలములు శీతోదకము రూక్షాన్నము దంతధావనము కఠిన పదార్థ భక్షణము వీనిని దంతరోగి వర్జింపవలయు.

ఉపజిహ్వికా చికిత్స.

శ్లో॥ ఉపజిహ్వాంతు సంలిఖ్య క్షారేణ ప్రతిసారయేత్ ।
క్షీరం విరేకగండూష ధూమైశ్చాప్యనాముపాచరేత్ ॥

తా. ఉపజిహ్వక యందు లేఖన క్రియంజేసి క్షారలేపనము క్షీరపానము విరేచనము గండూషము ధూమపానము అనువానిచే నుపచరింపవలయు.

వ్యోషాది చూర్ణము.

శ్లో॥ వ్యోషక్షారా భయావహ్ని చూర్ణమే తత్ప్రఘర్షణమ్ ।
ఉపజిహ్వక శాంత్యర్థ మేభిస్తైలంచ పాచయేత్ ।
గృహధూమా రనాళేన క్వాథం సమధుసైంధవమ్ ।
పాణినా మర్దయేచ్చాస్య ముపజిహ్వాప్రశాంతయే ॥

తా. ఉపజిహ్వకరోగశమనార్థంబై త్రికటుకములు యవక్షారము కరక్కాయ చిత్రమూలము అనువానిచూర్ణములో దంతముల రుద్దవలయు. మఱియు పై ద్రవ్యముల నే తైలముకాచి గండూషము జేయవలయు. మఱియు కరధూపమును కలిలో గలిపి కాచి అందు తేనె సైంధవలవణముగలిపి వుపజిహ్వకయందు వ్రేళ్ళతో మర్దనముః జేయవలయు.

కంఠశుండ్యాది చికిత్స.

శ్లో॥ తుండికేర్యాం ధ్రువేకూర్మే సంఘాతే తాలుపుప్పుటే ।
ఏషఏవ విధిఃకార్యో విశేష శ్శస్త్రకర్మణి ॥

తా. తుండికేరి ధ్రువము కూర్మము సంఘాతము తాలుపుప్పటము వీనియందు శస్త్రకర్మము జేయుచు నెడ క్రిందజెప్పంబడు చికిత్సల విశేషముగ జేయవలయు.

శ్లో॥ స్నేహస్వేదా తాలుశోషే. విధిశ్చానిలనాశనః ॥

తా. తాలుశోషమునందు స్నేహములను స్వేదనక్రియలను వాతనాశకఔషధ సేవనను జేయవలయు.

శ్లో॥ తాలుపాకేతు కర్తవ్యం విధానం పిత్తనాశనమ్ ॥

తా. తాలుపాకమునందు పిత్తనాశకర చికిత్సల జేయవలయు.

గళశుండి ఛేదనవిధి.

శ్లో॥ అంగుష్ఠాంగుళిసందంశే నాకృష్య గళశుండికామ్ ।
ఛేదయే న్మండలాగ్రేణ జిహ్వోపరితు సంస్థితామ్ ॥

తా. నాలుకపైన జనించియుండు చిరునాలుకను అంగుష్ఠాంగుళులతో పట్టి యీడ్చి శస్త్రముతో ఛేదింపవలయు.

శుండీ ఛేదనానంతరోపచారము.

శ్లో॥ పిప్పల్యతి విషాకుష్ఠ వచామరిచ నాగరైః ।
క్షౌద్రయుక్తై స్సలవణై స్తతస్తాం ప్రతిసారయేత్ ॥

తా. చిరునాలుకను ఛేదించినపిమ్మట పిప్పలి అతివస చంగల్వకోష్టు వస మిరియాలు శొంఠి అనునాని చూర్ణములో తేనె వుప్పుగలిపి వ్రేలితో రుద్దవలయు.

రోహిణీ సామాన్య చికిత్స.

శ్లో॥ రోహిణీనాంతు సాధ్యానాం హితంశోణిత మోక్షణమ్ ।
వమనం ధూమపానంచ గండూషో నస్యకర్మచ ॥

తా. పంచరోహిణులలో సాధ్యంబగు దానియందు రక్తమునీసి వమనము ధూమపానము గండూష ధారణము నస్యకర్మఅను నుపచారముల జేయవలయు.

వాతజరోహిణీ చికిత్స.

శ్లో॥ వాతజాం తూర్ధ్వ తేర క్తే లవణైః ప్రతిసారయేత్ ।
సుఖోష్ణా స్స్నేహగండూషా న్ధారయే చ్చాప్యభీక్ష్ణశః ॥

తా. వాతజరోహిణియందు రక్తమునీసి లవణముతో రుద్దవలయు. మఱియు సుఖోష్ణముగ స్నేహగండూషమును పలుమారు ధరింపవలయు.

పిత్తజరోహిణీ చికిత్స.

శ్లో॥ విస్రావ్య పిత్తసంభూతాం సితాక్షౌద్ర ప్రియంగుభిః ।
ఘర్షయే త్కబలో ద్రాక్షా సరూపైః క్వథితైర్హితః ॥

తా. పిత్తజరోహిణియందు రక్తమునుదీసి పంచదార తేనె అనువాని ప్రేంకణ చూర్ణమునుగలిపి రుద్ది ద్రాక్ష ఖర్జూరపండు అనువాని కషాయమునుని యందు ధరింపంజేయవలయు.

రక్తజరోహిణీచికిత్స.

శ్లో॥ పిత్తవత్సాధయే ద్వైద్యో రోహిణీ రక్తసంభవామ్ ॥

తా. రక్తజ రోహిణియందు పిత్తరోహిణీ చికిత్సలం జేయవలయు.

కంఠశాలూక చికిత్స.

శ్లో॥ విస్రావ్య కంఠశాలూకం సాధయే త్తుండికేరివత్ ।
ఏకకాలేయ వాన్నంచ భుంజీత స్నిగ్ధమల్పశః ॥

తా. కంఠశాలూకమునందు రక్తముదీసి తుండికేరివలెనే చికిత్సింపవలయు మఱియు దీనియందొకింత ఘృతయుక్తముగ జేయంబడిన యవాన్నము నొకపూ భుజింపవలయు.

కఫజరోహిణీ చికిత్స.

శ్లో॥ అగారధూమకటుకైః కఫజాం ప్రతిసారయేత్ ।
శ్వేతావిడంగ దంతీషు తైలంసిద్ధం ససైంధవమ్ ।
నస్యకర్మణి దాతవ్యం కబలంచ కఫోచ్ఛ్రియే ॥

తా. కఫరోహిణియందు కరుమాపము కారముగల యౌషధములతో ర వలయు. తెల్లతులసి వాయువిడంగములు దంతివేరు అనువానితో తైలముకా యందుసైంధవలవణమునుగలిపి నస్యమును నోటియందుధారణమునుజేయించవలయు

అధిజిహ్వక చికిత్స.

శ్లో॥ ఉపజిహ్వక వచ్చాపి సాధయే దధిజిహ్వకమ్ ॥

తా. అధిధిజిహ్వక రోగమునందు వుపజిహ్వకరోగ చికిత్సం జేయవలయు

## భగందరరోగ నిదాన లక్షణ చికిత్సాదయః.

### ఏకబృంద చికిత్స.

శ్లో॥ ఏకబృందంతు విస్రావ్య విధింశోధన మాచరేత్॥

తా. ఏకబృందమునందు రక్తస్రావము జేయించి పిదప శోధనవిధిని సవలయు.

### బృంద చికిత్స.

శ్లో॥ ఏకబృంద మివప్రాయో బృందంచ సముపాచరేత్॥

తా. బృందమునందు యేకబృంద చికిత్సం జేయవలయు.

### గిలాయు చికిత్స.

శ్లో॥ గిలాయు శ్చాపియోవ్యాధి స్తంచశస్త్రేణ సాధయేత్॥

తా. గిలాయువునందు శస్త్రచికిత్సం జేయవలయు.

### గళవిద్రధి చికిత్స.

శ్లో॥ సమర్మస్థంతు సంపక్వం ఛేదయే ద్గళవిద్రధిమ్ ॥

తా. మర్మరహిత స్థలములయందు గలిగిన గళవిద్రధి పండియుండిన దానిని ఛేదింపవలయు.

### సర్వసర సామాన్య చికిత్స.

శ్లో॥ వాతా త్సర్వ సరంచూర్ణైర్లవణైః ప్రతిసారయేత్। తైలం
వాతహరై స్సిద్ధం హితం కబలనస్యయో। పిత్తాత్మకే
సరే శుద్ధకాయస్య దేహినః। సర్వః పిత్తహరఃకార్యో విధి
ర్మధురశీతలః। ప్రతిసారణగండూష ధూమసంశోధనానిచ।
కఫాత్మకే సర్వసరే క్రమం కుర్యా త్కఫాపహమ్॥

తా. వాతజ సర్వసరమనగా ముఖపాకమునం ... గాని నువ్వులనూనె శుద్ధి వాతనా
శౌషధ యుక్తముగ సిద్ధము జేయబడిన తైలం ... ధూమ నస్యముల జేయవల
యు. పిత్తజ సర్వసరమున తొలుత విరేచనము ... పిదప పిత్తహరమైన సర్వ

వధుర శీతకర చికిత్సం జేయవలయు. కఫజ సర్వసరమున * ప్రతిసారణ గండూష ధూమపాన శోధనములను సర్వకఫహర చికిత్సలను జేయవలయు.

## గళరోగ చికిత్స.

శ్లో॥ కంఠరోగేష్వ సృజ్మోక్షై స్తీక్ష్ణై ర్నస్యాదికర్మభిః ।
చికిత్సక శ్చికిత్సాంతు కుశలో ప్రసమాచరేత్ ॥

తా. గళరోగమునందు రక్తమునుదీసి తీక్ష్ణకరౌషధముల నొసంగి నస్యాది కర్మల జేయవలయు.

## మృద్వీకాది చూర్ణము.

శ్లో॥ మృద్వీకా కటుకావ్యోష దార్వీత్వ క్త్రి ఫలాఘనమ్ ।
పాఠారసంజనందూర్వా తేజోహ్వాతి సుచూర్ణితమ్ ।
క్షౌద్రియుక్తం విధాతవ్యం గళరోగే మహౌషధమ్ ॥

తా. ద్రాక్షపండు కటుకరోహిణి త్రికటుకములు మానిపసపు లవంగపట్ట త్రిఫలములు తుంగముస్తెలు అగరు శొంఠి లేక చిరుబొద్ది రసాంజనము గరిక వెక్కుడుతీగె అనువాని చూర్ణములో తేనెగలిపి గళమునందు లేపనము జేయవల యును. ఇది గొప్పయౌషధము.

## యవక్షారాది ఘుటికలు.

శ్లో॥ యవాగ్రజం తేజవతీం సపాఠా రసాంజనం దారు నిశాం స
కృష్ణామ్ । క్షౌద్రేణకుర్యా ద్ఘుటికాం ముఖేన తాంధారయే
త్సర్వ గళామయేషు ॥

తా. యవక్షారము వెక్కుడుతీగె అగరు శొంఠి లేక చిరుబొద్ది రసాంజనము మ్రానిపసపు పిప్పలి అనువానిచూర్ణములో తేనెగలిపి యుండలుజేసి నోటిలోనునిచి కొనిన సర్వకంఠములు హరించు.

* కల్క అవలేహ చూర్ణ భేదములచే ప్రతి సారణము 3 విధంబులు. కా వున వానిని వ్రేలికొనతో గ్రహించి నాలుకయందుగాని లేక నోటియందంతటగాని లేపనము జేయుటయు ప్రతిసారణ మనంబడు.

## ముఖపాకసామాన్య చికిత్స.

శ్లో॥ ముఖపాకేసిరావేధ శ్శిరశ్చవిరేచనమ్ ।
మధుమూత్రఘృతక్షీరై శ్శీతైశ్చకబళగ్రహాః ॥

తా. సర్వముఖపాకములయందు సిరావేధ శిరోవిరేచనమును జేయించి తేనె గోమూత్రము నెయ్యి పాలు శీతకరపదార్థములు అనువాని * కబళమును ముఖము నందు ధరింపవలయును.

## ముఖపాక చికిత్స.

శ్లో॥ పంచవల్కలజఃక్వాథ స్త్రీఫలాసంభవోథవా ।
ముఖపాకేప్రయోక్తవ్య స్సక్షౌద్రోముఖధావనే ॥

తా. పంచత్వక్కుల కషాయములోగాని త్రిఫల కషాయములోగాని తేనె గలిపి నోరునుగడిగిన ముఖపాకము హరించు.

## తిలాది గండూషము.

శ్లో॥ తిలానీలోత్పలంసర్పి శ్శర్కరాక్షీరమేవచ ।
సక్షౌద్రోదగ్ధవక్త్రస్య గండూషోదాహనాశనః ॥

తా. నువ్వులు నల్లకలువగడ్డ నెయ్యి పంచదార పాలు లొద్దుగ చూర్ణము వీనిని గండూషముచేసిన ముఖపాకము దాహము శమించు.

## యష్టిమధ్వాది తైలము.

శ్లో॥ యష్టీమధు పలమేకం త్రింశ న్నీలోత్పలస్యతైలస్య । ప్రస్థం తద్ద్విగుణపయో విధినా పక్వంతు నస్యేన । నిశిపదనస్యన్త్రా వంక్షపయతి గాత్రస్య దోషసంఘాతమ్ । వపు స్స్వర్ణత్వమ వశ్యంక్రమశో భ్యంగేన జంతూనామ్ ॥

తా. అతిమధురము 1 పలము నల్లకలువగడ్డలు 30 పలములునూనె 1 ప్రస్థ ముపాలు 2 ప్రస్థములు యిటుల వీనినెల్ల నేకముజేసి మందాగ్నితో తైలముకాచి రాత్రులయందు నస్యముచేయించిన ముఖస్రావము శరీరమునకు లేపనము జేయించిన శరీర దోషము హరించి బంగారువంటి కాంతిగలుగు.

* కబళమన—కల్కాదుల నోటినిండబోసికొని నమిలి యుమిశ్వేయుటయు.

### హరిద్రాది తైలము.

శ్లో॥ హరిద్రా నింబపత్రాణి మధుకం నీలముత్పలమ్ ।
తైలమేభి ర్విపక్తవ్యం ముఖపాక హరంపరమ్ ॥

తా. పసపు వేపాకు అతిమధురము నల్లకలువగడ్డ అనువాని కల్కములో తైలముగలిపి కాచి నోటిలో ధరించిన ముఖపాకము హరించు.

### ఖదిరాది ఘుటికలు

శ్లో॥ ఖదిరస్య తులాంతోయ ద్రోణే పక్త్వావ శేషితే ।
జాతీకోశైన పూగైశ్చ చాతుర్జాత మృగాండజైః ।
పృథక్కర్ష మితైః పిష్టై ర్మేళయిత్వా చణోపమాః ।
గుటీఃకృత్వా ముఖేధార్యా సానిహం త్యఖిలాన్ గదాన్ ।
జిహ్వోష్ఠ దంతవదన గళతాలు సముద్భవాన్ ॥

తా. 100 పలముల నల్లచండ్రపట్టను ఒకద్రోణప్రమాణ ముదకము పోసి యష్టమాంశముగ కషాయముకాచి వడియగట్టి అందు జాపత్రి కర్పూరము మంచివక్కలు లవంగపట్టయేలకులు లవంగపత్రి నాగకేసరములు కస్తూరి వీని చూర్ణమును దినుసుకు కర్షప్రమాణము చొప్పునగలిపి సెనగగింజలంత మాత్రలుజేసి నోటిలోనునిచికొని దాహరసమును మ్రింగుచుండినసర్వముఖరోగములు జిహ్వారోగములు పెదవి రోగములు దంతరోగములు [illegible]రోగములు హరించు.

### దంతవ్రణ లక్షణము.

శ్లో॥ [చరకే] దంతవ్రణం కపోలోత్థం ప్రాయః స్రవతిసంతతమ్ ।
ఏతద్దోషం సువిజ్ఞాయ తతః కర్మ సమాచరేత్ ॥

తా. చెక్కిట వ్రణముబుట్టి ఎల్లప్పుడు చీము గారుచుండిన దంతవ్రణమని తెలియవలయు. ఈదోషమును బాగుగ తెలిసి చికిత్సింపవలయు.

### వంధ్యా కర్కోటకీ లేపనము.

శ్లో॥ వంధ్యాకర్కోటకీమూలం గోమూత్రేణసుసంశ్రితమ్ ।
అర్కక్షీరేణ సంమిశ్ర్య మాతపే శోషయేత్త్రిధా ।

క్షారార్క దుగ్ధసహితం శోషమే ద్గంధలేపనమ్ ।
కపోల దంతవ్రణకం నాశయే న్నాత్రసంశయః ॥

తా. గొడ్డుకాకరగడ్డను ఆవుపేడతోవండి బిళ్ళలుగ కోసి జిల్లేడుపాలతో 3 మార్లు భావనజేసి యెండనెండించి పిదప వుప్పు జిల్లేడుపాలు వీనితో భావనజేసి మరల నెండించి గంధము దీసి 2 మాసములు లేపనము సేయుచుండిన చెక్కిట జనించిన దంతవ్రణము నిశ్చయముగ మానును.

శ్లో॥ [అన్యశాస్త్రే] గోక్షుర స్వరసంకర్ణే పార్శ్వే దంత వ్రణస్య చ । పూరితం శాంతయేత్యర్థ మిత్యుక్తం మునిపుంగవైః ॥

తా. దంతపార్శ్వమున వ్రణముగలిగిన నా ప్రక్కనుండు చెవిలో పల్లేరు రసమును పిండిన దంతవ్రణము శమించు. (మఱియు పల్లేరురసమును వ్రణముపై 2 దినములు పట్టించి పిదప చేనుబీరవిత్తుల గంధమునుగాని చిత్రమూలగంధమునుగాని లేపనముజేసిన దంతవ్రణము మానును. మఱియు కలిమేశ్వరపుచెక్కగంధమును భక్షణముసేయుచు దానినే వ్రణముపై లేపనముసేయుచుండిన 2 మాసములలో దంత వ్రణము మానును పథ్యము—చప్పిడివంటకమును ఆవు పెరుగును భుజింపవలయు. దంతవ్రణములయందు రసకర్పూరమును 2 మాసములు సేవింపుచు చప్పిడివంటకమును భుజింపవలయు.

క॥ తుందిలపుచెక్క ననుములఁ । బొందుగఁ బచనంబుచేసి భుజియింపదగు । న్నొందుగను మానిపోవును । దందడి నొప్పించుచున్న దంతవ్రణముల్ ॥

గీ॥ గొడ్డుకాకరచెట్టుల గడ్డనూనె । గూఢపాకంబుచేసియుఁ గ్రోలవలయు । సంశయంబేల యిదినిశ్చయమ్ము నుమ్ము । నరులబాధించు దంతవ్రణాలుమాను ॥

గీ॥ రమ్యమైనట్టి నాగసరంపుగడ్డ । వెన్నఁగూరిచి సేవింప వివిధదంత । వ్రణములన్నియుమాను భావలయమందుఁ । జిరతరంబుగఁ బథ్యంబు సేయుచున్న ॥

## దంతవ్రణ లక్షణము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] వాతేన దంతచలనం రక్త స్రవణముచ్యతే । క్రిమిణా పూయ పీడాచ దంతరోగే తథా భవేత్ ॥

తా. వాతదోషమువలన దంతములు కదలుచు రక్తము స్రవింపుచుండు. కృమివలన దంతముల నొప్పిగలిగి చీముగారును.

### కాళింగాది చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] కాళింగచించా విజయా మూలంపుంఖ్యా శ్వమారకమ్ । చలదంత దృఢత్వస్య ప్రత్యేకం దంతధావనాత్ ॥

తా. కొడిసెపాల చింతగింజలు తక్కలివేరు తెల్లవెంపలి గన్నేరు వీనిలో దేని నైన నూరి పండ్లుతోముకొనిన కదలుచుండు దంతములు గట్టిపడును.

శ్లో॥ [ఆయుర్వేదే] జాతీగోరంటపత్రం వా చర్వయేత్ప్రాతరుత్థితః । స్థిరాశ్చచలితాదంతా స్తత్కాష్ఠైర్దంతధావనాత్ ॥

తా. జాపత్రినిగాని లేక గోరింటాకునుగాని ప్రాతఃకాలమున నమలినను లేక వాని పుడకలతో దంతధావనముజేసినను (లేక ములుగోరింట మామిడి పచ్చిజిల్లేడు వీని పుడకలతో దేనితో నేని దంతధావనముజేసినను కదలుచుండు దంతములు గట్టిపడు. మఱియు విడెములో జీడిగింజలగలిపి విడెము సేయుచుండిన కదలుచుండు దంతములు దంతవ్రణములు చీముగారుట హరించు. ఇంగువను ఆవువెన్నతోడ 6 మాసములు సేవింపుచుండిన దంత శూలలు కృమిదంతములు కదలుచుండు దంతములు రక్తదంతములు హరించు.

### లాంగల్యాది యోగము.

శ్లో॥ తోయేన లాంగలీమూలం పిష్ట్వాంగుష్ఠే ప్రలేపయేత్ ।
దంతా న్నిర్యాంతినోచిత్రం కీలకా కౌతుకావహాః ॥

తా. చెన్నచర్లగడ్డ నుదకముతో నూరి దంతములయందు వ్రేలితో యద్దిన దంత శూలలు హరించి పురుగులూడిపడును. (తెల్లకాచును మైలుతుత్తమును నూరి పండ్లపై బూసి సెగయందు కాచిన దంతములు గట్టిపడుటయే గాక దంతశూలలను హరించు)

### జాతీపత్రాది చూర్ణము.

శ్లో॥ [మాధవకల్పే] జాతీపత్రపునర్నవా గజకణాగోరంటకుష్ఠంవచా । చవ్యంశుంఠిహరీతకీసమకృతంచూర్ణంముఖేధారయేత్ ।

వాతఘ్నం క్రిమిదంతశూలకఫజం సర్వామయం నాశయేత్ ॥
దుర్గంధాధి సమస్తదోషశమనం దంతశ్చ వజ్రాయతే ॥

తా. జాపత్రి గలిజేరు గజపిప్పలి ములుగోరింటచెంగల్వకోష్టు వసచవ్యము శొంఠి కరక్కాయలు వీనినిసమభాగములుగదంచి చూర్ణముజేసి దంతములయందు లేపనముజేసిన దంతవాతము క్రిములు దంతశూల చీము రక్తముగారుట దుర్గంధము దంతములు కదిలుట మొదలగు నుపద్రవంబులన్నియు శమించి దంతములు వజ్ర తుల్యంబులగు.

## ముఖరోగమునందు పథ్యము

శ్లో॥ [మాధవనిదానే] స్వేదోవిరేకోవమనంగండూషః ప్రతిసారణమ్ । కబలో స్సృక్స్రుతిర్నస్యం ధూమశ్శస్త్రాగ్నికర్మణి । తృణధాన్యా యవాముద్గా కుళుత్థా జాంగలోరసః । బహుపుత్రీ కారవేల్లం పటోలం బాలమూలకమ్ । కర్పూర నీరంతాంబూలం తప్తాంబు ఖదిరోద్ధృతమ్ । కటుతిక్తౌచ వర్గోయం [illegible]త్రంస్యా మ్ముఖరోగిణామ్ ॥

తా. చెమటతీయుట విరేచనమువమనము గండూషము ప్రతిసారము కబల ధారణము రక్తమోక్షణము నస్యము ధూమపానము శస్త్రకర్మ అగ్నికర్మ దూసరి బియ్యము లేక వెదురుబియ్యము యవలు పెసలు ఉలవలు జాంగలమాంసము నేల యుసిరిక చల్లపిల్లిగడ్డలు కాకరకాయ చేదిపొట్ల లేతముల్లంగి పచ్చకర్పూరము వుదకము విడెము నల్లతుమ్మకషాయము కారముచేదుగల రసములు యివి ముఖరోగ ములయందు పథ్యకరంబులు.

## ముఖరోగమునం దపథ్యము.

శ్లో॥ దంతకాష్ఠం స్నానమమ్లం మత్స్యమానూప మామిషమ్ ।
దధిక్షీరం గుడంమాషం రూక్షాన్నం కఠినాసనమ్ ।
అధోముఖేన శయనం గుర్వాభిష్యంది కారిచ ॥
ముఖరోగేషు సర్వేషు దివా నిద్రాంచ వర్జయేత్ ॥

తా. దంతకాష్ఠము స్నానము పులుసు మత్స్యములు అనూపము జంతుమాంసము పెరుగు పాలు బెల్లము వుద్దులు రూక్షాన్నము కఠినాసనము బోరగిలపరుండుట జడాన్నము పిండిపంటకము పగటినిద్ర యివి ముఖరోగమునం దపథ్య కరంబులగుటచే వానిని వర్జింపవలయు.

## తుండిర్వణ లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] శోఫాపూయంచ వేధశ్చ శల్యపాతం భవేద్యది।
తదేవ మునిభిఃప్రోక్తం తుండివ్రణ మితిధ్రువమ్ ॥

తా. వాపునొప్పికలిగి చీమునుగార్చుచు లోన శల్యము చివికియూడికల బారుటయే తుండివ్రణమని తెలియవలయు. (దీనియందును మఱియు సర్వవ్రణముల యందును రసపుబ్బ వేయవలయు.

## రస ఉబ్బ.

శ్లో॥ ఆకల్లకైలా సురపుష్పశుంఠి కృష్ణాస్త్రినిష్కాశ్చ రసం ద్వినిష్కమ్ । జ్యోతిష్మతీవై త్రిఫలా గుడస్య దీర్ఘస్య చత్వారి పలలాని యోజ్యం । సంమర్ద్యగాఢం ప్రహర ద్వయేన ద్వినిష్కమాత్రంచ ఘృతేనఖాద్యమ్ । నవాయురోగం సహస్రాని హంతి మర్మస్థితాః గ్రంథియుతాం స్తథైవ । ఉదుంబరం కాకణకంచకుష్ఠం కపాలకండూశ్చ తథానిహంతి ॥

తా. రసపుబ్బ 2 విధంబులుఅందు మొదటిది అక్కలకఱ్ఱ యేలకులు లవంగములు శొంఠి పిప్పళ్ళుఅనునవి దినుసుకు 3 జేసినిష్కములు శుద్ధిజేసిన పాదరసము వెఱ్ఱితులువిత్తులు యివి దినుసుకు 2 నిష్కములు త్రిఫలయులు బెల్లము పోముపుపట్టు యివి దినుసుకు 4 గేసిపలములు యిటుల వీనిని రోటిలోనునిచి 2 ఝాములు 2 రోకండ్లతో బాగుగదంచి 2 నిష్కముల యెత్తును నేతియనుపానముతోడ భక్షింపవలయు. యిటుల శ్లోకోక్త ప్రకారముజేసిన నోరుపట్టును గావున పైయౌషధముతోడ చేరెడు మంచివేపచెక్క గంధమునుగలిపి 2 రోకండ్లతో 1 ఝాముబాగుగ మర్దించి 18 యుంటలుజేసి 9 దినములు రేపుమాపు వేపచెక్క గంధములోపొదిగి 2 నిష్కములయెత్తును నేతి యనుపానముతోడ మింగించవలయు. యిదియ యొకవిధము రసపుబ్బ మఱియు వేపగంధములో పైద్రవ్యములను 10 చిన్నములయెత్తు శుద్ధిజేసిన గంధకమును $\frac{1}{4}$ సేరు బెల్లమునుగలిపి రోటిలో 1 ఝాముదంచి 18 యుంటలుజేసి రేపుమాపు 2 యుంటల చొప్పున 9 దినములు ఆవునేతితోడ భక్షింపవలయు యిదియు రెండవ విధముగురసపుబ్బ యీరెండు రసపుబ్బల సేవించునపుడు విశేషముసేయుచు గాలిలేనితావున నుండవలయు 10 యవదినమున నూరకుండి 11 వ దినమున ఆవునేతితో చలయంటికొని చప్పిడిపథ్యము సేయుచుండిన వాతరోగ

ములు మర్మస్థానములయందు జనించిన గ్రంథులు (వ్రణములు) వృషంబరకుష్ఠువు కాకణకుష్ఠువు కపాలకుష్ఠువు దురద చకౌరమువలన మండ డొక్కమండ పేరులేని వ్రణములు ఫరంగి రోగములు యినియున్నియు మానును. (యీయాయుబ్బ జేసిన పిదప 3 మాసములు పథ్యముగనుండి పిదప రసకర్పూరమును సేవింపవలయు.)

క॥ వరచిత్రమూలమూలము । మిరియంబును నూనెగూర్చి మేలు
గఁ బాకుఁ । బరపుగఁ గ్రోలినను భగం। దరమండలుమానుచుం
డుదంతగదంబుల్ ॥

గీ॥ మేదినినిజిత్రమూలము మేకపాల । వండితక్షీరములుఁగ్రోల
మండలములు । పథ్యముగఁ బాగ దుగ్ధాన్న పానములను।గొన్న
జనుడొక్కమండల కులనాణంగు ॥

సూతిపుంటె లక్షణము.

శ్లో॥ పక్షమధ్యేతు యజ్జాతం పూయస్రావో భవేద్యది ।
తన్నామమునిభిః పూర్వైః కూపవ్రణ మితిస్మృతమ్ ॥

తా. కంటికొలికివద్ద వ్రణమునించి నీరువలె చీము గారుచుండిన, కూపవ్రణ మని వచించిరి

చ॥ ముఱియుచు వజ్రనీలిరసము।స్తలియు న్గదువేగ రాగ ముం।తను
గడుమర్దనంబుగ ముదంబునఁ జేసియు నూతిపుంటెపైఁ । దన
రఁగఁ బెట్టికట్టియు నుతంబుగ మూరెడు చెక్క మేఁకపా।లనయ
ము గ్రోలమానును జవావళిరోచిన జాలరోగముల్ ॥

(ఈ నూతిపుంటియందు 40 దినములు కట్టుగట్టవలయు.)

జంతి రాజవ్రణ లక్షణము.

శ్లో॥ మధ్యే శరావరూపేణ జాతం ఛిద్ర శతైర్యుతమ్ । పూయ
శూలే ప్రవర్తేతే జంతికా వ్రణముచ్యతే । తదేవ పృష్ఠేయ
జ్జాతం రాజవ్రణ మితిస్మృతమ్ ॥

తా. వ్రణమధ్యభాగము నూకుడుమొక్క యాకారముగలదై శతచ్ఛిద్రములు గలదై చీమును గార్చుచు శూల శోషంగూడియుండిన జంతికావ్రణ మనంబడు. ఇదే వీపులో జనించిన రాజవ్రణ మనంబడు.

సీ॥ మహిషోష్ట్రతామ్రభస్మంబును గరకకాయల మసిసూరియు సలందియొకటి। సన్న పావలిసూర సరవిగాఁ బాకంబు చేసికట్టు నంబని చేయునొకటి। యుల్లి పాషాణంబు నిలపై డీజాజిని దంతవ్రణంబుల దాఁపదొకటి। దంతియాకు దెచ్చి ధన్యంబుగా నూరి కట్టుగట్టినను బోకడచునొకటి। యరయనీనాల్గువిధముల నౌషధముల। వైరమనిపించుజంతికవ్రణముకెల్ల। జగతినింతకుఁ బ్రతిచెప్ప సాటిలేదు। నరులకెల్లనుమాను నిర్ణయముగాను॥

## స్నాయుకవ్రణ లక్షణము.

శ్లో॥ దేహే గ్రంథిస్తు సంజాతః పూయంస్రవతి నిత్యశః।
తదేవమునిభిః పూర్వైః స్నాయుక వ్రణముచ్యతే॥

తా. శరీరమున కంతివలె జనించి గట్టిగ చీము నెల్లప్పుడు గార్చుచుండిన స్నాయుక వ్రణమని పూర్వీకులైన మునులు వచించిరి.

## స్నాయుకవ్రణమునకు గంధక తైలము.

శ్లో॥ అథవార్క స్నుహిక్షీరై ర్వస్త్రంలేప్యంతు సప్తధా।
గంధకం నవనీతేన పిష్ట్వావస్త్రం తు లేపయేత్।
తద్వర్తిం దీపితాంకుర్యాద్ధృతంధార్యా దథోముఖమ్।
తైలం తస్స్రవతేభాండేగాహ్యా యోగేషు యోజయేత్।
తత్తైలం రసమిశ్రంచ నాగవల్లీ దళేనచ।
భక్షయే త్స్నాయుకంహంతి సర్వవ్రణ హరంస్మృతమ్॥

తా. జమిలివస్త్రమును జిల్లేడుపాలు బొంతకెముడుపాలు అనువానిలో నేడేసి మార్లు నడిపి యెండించి దానియందు శుద్ధిజేసిన గంధకమును వెన్నతోనూరి పట్టించి వర్తిగజుట్టి దీపమున వెలిగించి తల్లక్రిందుగ బట్టిఅందువడిసెడు గంధకతైలమును గాజు గిన్నెలో దీసికొని 2 చిన్నముల యెత్తును తమలపాకున జరమి దానిపై చిన్న మెత్తు

క్షించి విడెము సేయవలయు. యిట్టుల 40 దినములు లేపుమాపు వేయుచుండిన స్నాయుకవ్రణము మొదలైన సర్వవ్రణములు మానును. (మఱియు స్నాయుకవ్రణ మున రసయుబ్బను సగాజేయందగు. (పథ్యముచప్పిడి)

## స్నాయుకవ్రణ చికిత్స.

శ్లో॥ పాతాళగరుడీమూలం పిబేద్స్నాయుకనాశనమ్ ॥

తా. దాసరివేరును నూరి సేవించిన స్నాయుకవ్రణము మానును.

శ్లో॥ [ఆయుర్వేదే] నృమూత్రైః కాంచనీంపిష్ట్వా లేపస్నాయు కజిద్భవేత్ । వార్తాకపత్రంన్నృమూత్రైః పిండంచాశ్వత్థపత్ర కే । సంతప్తంబంధయేచ్ఛీఘ్రం శమయేత్స్నాయుకంకిల ॥

తా. దేవకాంచనపు చెక్కను నరమూత్రముతో నూరి లేపనము జేసినను క వంగాకును నరమూత్రముతో నూరి ముద్దజేసి రావియాకులోనునిచి వెచ్చజేసి బ్బున కట్టుగట్టినను స్నాయుకవ్రణము మానును.

## స్తనవ్రణ లక్షణము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] వాతేన కఠినంశుక్లం స్తనంభవతి దారుణమ్। పూర్వోక్తేనప్రలేపేన సుఖోష్ణేన సుఖాపహమ్ । పైత్తాధిక్యే స్తనేరోగపీడా భవతిచారుణా । మూతేనకరవీరస్య శీతతోయేనపేషయేత్ । స్తనమాలేపయేత్తేన సుఖమాప్నోతిత త్క్షణాత్ । శ్వయథుశ్శ్యామ వర్ణశ్చ స్తనశ్చైవకఫాధికే । మధుయష్టింకఫేతోయైః పిష్ట్వాలేపే సుఖావహామ్ । సర్వే షాం స్తనరోగాణాం రక్తమోక్షః ప్రశస్యతే ॥

తా. కఠినముగ తెల్లగచూచుటకుభయంకరముగనుండిన వాతజస్తనవ్రణమని లియవలయు. దీనియందు పూర్వోక్త లేపనమును సుఖోష్ణముగ జేసిన మానును. నమునకడుపీడగలిగి వ్రణమెఱ్ఱనై యుండిన పిత్తజస్తనవ్రణమని తెలియవలయుదీని ందు గన్నేరువేళ్ళను శీతోదకముతో నూరి లేపనముజేసిన తక్షణమున మానును.

లేక జలగలతో రక్తమును దీయించినను మానును, వాచినల్లనై యుండిన శ్లేష్మ జస్తనవ్రణమని తెలియవలయు. దీనియందు యష్టిమధుకమును నీళ్ళతో నూరి లేప నము జేయవలయు. సర్వస్తనవ్రణములయందు రక్తస్రావము జేయించవలయు.

స్తనవ్రణ చికిత్స.

శ్లో॥ రసంవాశివబీజంవా బలితైలేన మిశ్రయేత్।
నాగవల్లీదళేపిష్ట్వా ఖాదయేత్తదనంతరమ్ ।
తాంబూలచర్వణంకృత్వా లవణామ్లానివర్జయేత్ ।
స్తనవ్రణానిహంత్యాశు నాసానాడీప్రశస్యతే ॥

తా. పైజెప్పంబడిన గంధకతైలమును తమలపాకున బట్టించి దానిపై పూ టనుచిన్ననొత్తు శుద్ధిజేసిన యింగిలీకమునుగాని లేక శుద్ధిజేసినరసమునుగాని నునిచి వ్రేలితో మర్దించి భక్షింపవలయు. యిటుల 40 దినములు రేపుమాపు సేవించివిడెము చేసిన స్తననాసా వ్రణములు మానును. దీనిని సేవించునప్పుడు ఉప్పును పులుసును వర్జింపవలయు. (మఱియు రెంకుమంపలములుయింగువను వెన్నలో గలిపి భక్షించిన స్తనవ్రణములు మానును.)

క॥ ఇమ్ముహిగంధకతైలము । తమ్ములపాకునను జరిమి తగఁజిన్నం బుల్ । నెమ్మదినింగిలికంబును ॥ దమ్ములముజ్జేయ మానుఁ దగఁజనుమాదల్ ॥

శ్లో॥ [శస్త్రవైద్యే] కరవీరస్యమూలంచ హ్యష్టమూత్రేణపేష యేత్ । తత్క్షణాత్స్ఫుటతేరక్తంశస్త్రైర్వాస్ఫోటయేద్భిషక్॥

తా. గన్నేరు వేళ్ళను ఆటపిట మూత్రముతో నూరి ముద్దజేసి కట్టుగట్టిన తక్షణమున పగిలి రక్తముగారి స్తనవ్రణము మానును. లేక శస్త్రముతో గీచియైనను రక్తమునుగార్చిన మానును.

వటాది కషాయము.

శ్లో॥ వటకోదుంబరాశ్వత్థ ప్లక్షకార్జునకత్వచః ।
తోయైశ్చతుర్గుణైఃక్వాథం పాదశేషంసమాహరేత్ ।
ఏతేన క్షాళయేన్నిత్యం స్రావపూయం హరేత్ స్తనే ॥

తా. మఱ్ఱిమేడి రావి జువ్వి యేరుమద్ది అనువాని పట్టల సమభాగములుగ దంచి దానికి వాలుగింతలునువకముబోసి నాలవభాగముగ కషాయముకాచి వడియగట్టి దానిచే ప్రతిదినము స్తనమాదల గడుగుచుండిన చీముగారుట మానును.

శ్లో॥ మధ్వాజ్య ద్రేవదారుంచ పిష్ట్వావర్తింప్రలేపయేత్ ।
పూయంస్రావ్య స్తనే క్షిప్త్వా రోపణం కురుతేక్షణాత్ ॥

తా. దేవదారుచెక్క తేనె నెయ్యి వీనితోనూరి వస్త్రమునకు బట్టించి వత్తిజేసి వ్రణమునందునిచిన గొమ్మునచీముకారి చనుమాదలు మానును. (మఱియు దీనియందు ధూపతైలలేపనమునుగాని తామ్రభస్మ లేపనమునుగాని జేయువలయు. చనుమాదలు గడుపైయుండిన రసకర్పూరమును 2 మండలములు సేవింపవలయు. మఱియు రసపుబ్బను జేయవలయు. (పథ్యము చప్పిడి.)

## గ్రంధి విసర్పులయందు శస్త్రకర్మ నిషేధము.

శ్లో॥ రక్తమేవాశ్రయ స్తస్య గ్రంథా శస్త్రహ తేతదా ।
శామ్యేద్గ్రంధివిసర్పిర్న నాత్రకార్యావిచారిణా ।
కఫవాతౌ శ్వాసకాసౌ శోషహిధ్మాతిసారకా ।
గ్రంథీనాంకురు తేమాలాం రక్తానాంతీవ్రకజ్వరమ్ ।
ఇత్యేవంగ్రంధివైసర్పి మోహమూర్ఛాంకరోతిచ ॥

తా. గ్రంధులు రక్తాశ్రితంబులై జనించుటంజేసి యాగ్రంధులను విసర్పిగ్రంధులను శస్త్రముజేయంజనదు అటుజేసిన నవి శమింప కుండుటయేగాక కఫవాతప్రకోపమువలన శ్వాసకాసములు శోష యెక్కిళ్ళు అతిసారము రక్తగ్రంధుల యొక్క వరుస తీవ్రజ్వరము మోహము మూర్ఛ మొదలగు నుపద్రవంబులతో గూడి కష్ట సాధ్యంబులగు.

శ్లో॥ [నిత్యనాధీయే] గ్రంథిఃపాషాణకఠినో యదినైవోపశామ్యతి । అథాస్యదాహ క్షారేణ రక్తంవాథవిమోక్షయేత్ ।
వారిభిస్సేచయేద్వైద్యః పాకతస్సర్వకర్మణి ॥

తా. గ్రంధులు రాయివలె కఠినంబులై శాంతిజెందకుండిన వానియందు దాహ క్షారకర్మలనుగాని లేక రక్తస్రావమునుగాని జేయవలయు. (అక్షారకర్మ మెద్దియనిన —సర్జక్షారములో క్రొత్తసున్నముగలిపి గ్రంధులనడుమ నూడుబొట్లనుంచవలయు.

ఈప్రకారము మూడుమారులుజేసిన నవిత్రణంబులగు. దానిపైపెరుగు వర్తినిదడిపి వేసినమానును. లేక వానియందు రక్తము నైనందీయవలయు. గ్రంధులన—కంతులు దీనికి జికిత్సవుత్తరేణు క్షారము వుమ్మెత్త కట్టెలక్షారము దాగ్గలి వేళ్ళక్షారము నల్ల యుప్పి కట్టెక్షారము క్రొత్తసున్నము వీనినిగలిపి కంతులనడుమ నొక బొట్టును 3 దిక్కుల 3 బొట్లనునిచిన వ్రణంబులగు. అవి కరగువరకు పెఱుగులో వర్తులదడిపి వేయవలయు. అవికరిగిన పిదప నీళ్ళవత్తుల వేయవలయు.

## గ్రంథులకు బృహత్యాది లేపము.

శ్లో॥ బృహతీచిత్రకంవ్యాఘ్రీ కణాసిద్ధార్థక స్తథా ।
స్నేహేనసిద్ధంకార్యంస్యా త్తీక్ష్ణంశుష్కస్యలేపనమ్ ।
సంశోష్యబహుశో గ్రంథీ న్విబధ్నీయాత్పునఃపునః ॥

తా. పెద్దములకవేళ్ళు చిత్రమూలము నేలములకవేరు పిప్పలి తెల్లావాలు వీనిని నూరి నూనెలోగలిపి వండి కొంచెముష్ణముగ లేపనముజేసి యెండించి కట్టు గట్టిన గ్రంధులు మానును. యిట్టుల పలుమారు జేయవలయు.

## పునర్నవాది లేపము.

శ్లో॥ పునర్నవార్కాభయశిగ్రుమూల కరంజసింధూత్థమహౌష ధానామ్ । కల్కంప్రలిప్తంపశుమూత్రపిష్టం గ్రంథ్యర్బుదం హంత్యపచించసద్యః ॥

తా. గలిజేరువేరు జిల్లేడువేరు కరక్కాయలు మునగవేరు క్రానుగవేరు సైంధ వలవణము శొంఠి వీనిని సమభాగములుగ ఆవుపంచితముతో నూరి కల్కముజేసి లేపనముజేసిన గ్రంథి అర్బుదము అపచి తక్షణమున మానును.

## పూతిరంజ లేపనము.

శ్లో॥ [మతాంతరే] మూలంపూతికరంజస్య చిత్రకంలవణంపర మ్ । ఉపలేప్యతథాపిష్టం సమస్తగ్రంథిభేదనమ్ ॥

తా. నెమలిచెక్క లేక నెమలడుగుచెక్క క్రానుగచెక్క చిత్రమూలము సైంధవలవణము వీనినినూరి లేపనముజేసి కట్టుగట్టిన సర్వగ్రంధులు పగులును,

## గళగ్రంధిస్వరూప తచ్చికిత్స.

శ్లో॥ గళేగ్రంధిశ్చ యోజాత స్తన్నామగళగ్రంధికమ్ ।
వఃక్షైరసఖాగ్రంనిష్కృష్య భిత్వాపిప్పలికాంచ దేత్ ॥

తా. గళములో గ్రంధి జనించిన గళగ్రంధి యనంబడు. దానిముఖమును గోరుతోగీచి పిప్పలి చూర్ణము పెట్టినమానును.

## శిరీషాది లేపము.

శ్లో॥ శిరీషంచశివాంశిగ్రుం పంచాంగంచయవస్యచ ।
అమ్లతక్రేటసంపిష్య గళగ్రంథింహరేత్వరమ్ ॥

తా. దిరిసెనపుచెక్క వుసిరికకాయ మునగపువ్వు దానియాకు వేరు పట్ట విత్తులు యవక్షారము వీనిని సమభాగములుగ పుల్లచల్లతోనూరి యుడికించికంఠమున లేపనముజేసిన గళగ్రంధులు (గళమున జనించిన కంతులు) మానును.

## వ్యోషాది కషాయము.

శ్లో॥ [మాధవనిదానే] వ్యోషాతిక్తావిషాపాఠా దారుముస్తాకళింగకా । గోమూత్రక్వథితాపేయా కంఠగ్రంథివినాశినీ ॥

తా. త్రికటుకములు చేదుబీరవిత్తులు అతివస శిరుబొద్ది మ్రానిపసపు తుంగ ముస్తెలు వెట్టిపుచ్చకాయ వీనిని గోమూత్రముతోనూరి కాచిత్రాగిన గళమునగలిగిన గడ్డలు (కంతులు) మానును.

## ముస్తాది కషాయము.

శ్లో॥ క్వాథ స్సముస్తాతి షపేంద్రదారుకళింగ పాఠాకటురోహిణీనామ్ । గోమూత్రసింహీ మధునాచయుక్తం పయోగళవ్యాధిషు సర్వజేషు ॥

తా. తుంగముస్తెలు అతివసపాపర వెట్టిపుచ్చాకుశిరుబొద్దివేర్లు కటుకరోహిణి అడ్డసరము వీనినిసమభాగములుగ గ్రహించినూరి గోమూత్రముతేనె పాలు వీనిలో కలిపి కాచి త్రాగిన కంఠమున జనించిన గడ్డలు మొదలగుసర్వరోగములుమానును.

## గళకీల స్వరూపము.

శ్లో॥ [చరకే] వాతదోషప్రభవః ప్రకాశతే జాయతే చగళకీలవర్ధనమ్ । దుఃఖమన్నమనిశంతుభుజ్యతే ప్యేవముక్తమథవైద్యపారగైః ॥

తా. వాతము ప్రకోపించి కంఠమునుజెందిన గళకీలకము (అనగా కప్పనాగరు) జనించు దానియందన్నమును భుజించిన దిగక ప్రతిదినము దుఃఖపెట్టుచు వెళ్ళివచ్చుచుండుట దీనిని వైద్యవేత్తలు గళకీలమని వచించెదరు.

## గళకీల చికిత్సాక్రమము.

శ్లో॥ స్తనయోరథ రేంగుళిత్రిసంఖ్యా మంతరాహుత భుజశ్చచేష్టయా । పాతయేచ్చగళకీలసంభవం పీరపిప్పలిరసశ్చభుజ్యతే॥

తా. గళకీలకమున 2 చనుమొనల క్రింద 3 వేళ్ళలోనుండి 2 చంకల ప్రక్కల వరకునడ్డముగ రక్తువేయవలయు. లోపలికిపీరపిప్పలిగంధకముల సేవింపంజేయవలయు

## విషముష్ట్యాది లేపము.

శ్లో॥ [మాధవనిదానే] విషముష్ట్యభయాశుంఠీ మధునాకర్షమాత్రకమ్ । గళరోగహరం వక్త్రే ధారయేద్దినసప్తకమ్ ॥

తా. విషముష్టిచెక్క కరక్కాయలు శొంఠి వీనిని దినుసు కొకకర్షప్రమాణము చొప్పున గ్రహించి తేనెతోనూరి 7 దినములు లేపనముజేసిన గళకీలకము నశించు.

## సైంధవలవణ లేపము.

శ్లో॥ లేపనోద్భానుమద్గేనసైంధవంగళకీలనుత్ ॥

తా. జిల్లేడుపాలుతో సైంధవలవణము నూరి లేపనముజేసిన గళకీలకమునశించు.

క॥ ఉదొంప వేరుగంధము । పొసగనావాలనుద్దభక్షణసేయన్ ।
జేడేసుపత్యంచేసిను । నాదములేనట్టికప్పనాగరు మానున్ ॥

### ఆస్యస్ఫోటలక్షణ తచ్చికిత్స.

శ్లో॥ [చరకే] స్ఫోటశ్చవిజ్ఞేయో లక్షణై ర్భిషజోత్తమైః ।
చందనంఘనసారశ్చ హ్యాస్యస్ఫోటవినాశనమ్ ॥

తా. నాలుకవిచ్చి పొక్కులవలెపొక్కిన ఆస్యస్ఫోట మనంబడు. దానియందు మంచిగంధములో 2 వీసములయెత్తు పచ్చకర్పూరమునుజేర్చి నేతితో సేవించిన ఆస్యస్ఫోటకము మానును.

### ఆస్యస్ఫోట లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] వాతాజ్జిహ్వోష్ఠయోశ్చైవ స్ఫోటభిన్నత్వమాప్నుయాత్ । తన్నామమునిభిః ప్రోక్తమాస్య స్ఫోటకసంజ్ఞికమ్ ॥

తా. వాతదోషమువలన నాలుక పెదవులు పొక్కినను లేక పగిలినను ఆస్యస్ఫోటకమని మునులు వచించిరి.

### ఆస్యస్ఫోట చికిత్స.

శ్లో॥ భల్లాతకీరసంచూర్ణం గళస్ఫోటే ప్రలేపయేత్ ।
లవణంగృహధూమంచ క్వాథయేత్కాంజికేనతు ।
గండూషంక్షౌద్రకంయుక్తం గళస్ఫోటహరంపరమ్ ॥

తా. జీడిచెక్క రసముతో సున్నమును నూరి లేపనముజేసిన ఆస్యస్ఫోటము హరించు. మఱియు ఉప్పుకరుధూపము వీనిలో కలిబోసి కషాయముకాచి తేనె గలిపి గండూషము జేసినను (పొట్లపండు పిప్పలి వీనిని గండూషముజేసినను) ఆస్యస్ఫోటము హరించు.

శ్లో॥ గైరికాంబుఘృతంతైలం నర్జసైంధవసిక్థకమ్ ।
వీరణంచయథాపక్వ మాస్యస్ఫోట వ్రణాపహమ్ ॥

తా. కావిరాయి కురువేరు నెయ్యి నూనె గుగ్గిలము సైంధవలవణము మైనము వట్టివేరు వీనిని పక్వముగవండి పెదవులపైబూసిన పగుళ్ళు (పొక్కులు) వ్రణము మానును.

## సిక్థకాది లేపము.

శ్లో॥ సిక్థకం ధూపకంతుత్థం కటుతైలం విపాచితమ్ ।
ఓష్ఠ పీడాదికం హంతి లేపనం వేదనాపహమ్ ॥

తా. మైనము గుగ్గిలము మైలుతుత్తము వీనిని ఆవనూనెలోవండి పెదవుల యందు వ్రాసిన పగుళ్ళు పొక్కులు వేదన మానును. (పెదవిరోగములయందు కఫపిత్తరోగచికిత్సం జేయవలయును. రసకర్పూరము సేవింపవలయు. మఱియు రస పుష్పము వేయవలయును.

## కీలక లక్షణము.

శ్లో॥ [గ్రహాకవనిదానే] జఘనే చకశాగ్రంథిర్మాంసమాప్నోతిసవ్యథా । ఆసనే గుదపార్శ్వేచ సర్వాంగే పిటికాభవేత్ ॥

తా. పిఱుఁదు నడుము భుజశిరములు ముఖము గుదపార్శ్వములు సర్వాంగములు వీనియందు గ్రంథులు జనించి నొప్పిలేకుండిన పులిపిట్లని తెలియవలయు.

## అశ్వత్థాది లేపము.

శ్లో॥ అశ్వత్థస్య త్వచోభస్మ చూర్ణేన సమమిశ్రితమ్ ।
నవనీతం ద్వయోస్తుల్యం మర్ద్యంతేన విలేపయేత్ ।
ఆననే గుదపార్శ్వేచ కటిస్థాః పిటికాజయేత్ ॥

తా. రావిచెక్కలకాల్చిన బూడిదె సున్నము వీనిని సమభాగములుగ గ్రహించి యీ 2 కి సమముగ వెన్నగలిపి మర్దించి ముఖము పాదపార్శ్వము నడుము వీనియందు లేపనముజేసిన పులిపిర్లు మానును. (మఱియు నక్కకేటాకురసము లేపనముజేసిన పులిపిర్లు మానును.)

## కీలక లేపనములు.

శ్లో॥ ఏవం చించారసైః పిష్టం సైంధవం లేపనాత్ ప్రత్యహమ్ ।
శిగ్రుమూల త్వచ సౌరియైః పిష్ట్వా లేపేన తం జయేత్ ।
పిష్ట్వాకాంచనం దాహంత్యాను చిత్రకం వాగవాంజలైః ।
నరమూత్రేణ సర్పాక్షీ పిష్ట్వా లేపేన తాం జయేత్ ॥

తా. చింతాకురసముతో సైంధవలవణమునునూరి 3 దినములు లేపనము జేసినను మునగవేరుపట్టనుదకముతోనూరి లేపనముజేసిన పులిపిర్లు మానును. మఱియు చిత్రమూలమును గోమూత్రముతోనూరి లేపనముజేసిన పులిపిర్లు దురద శీఘ్రముగ మానును. సర్పాక్షిని నరమూత్రముతోనూరి లేపనముజేసిన పులిపిర్లుమానును.

## కాలస్ఫోటాదిక లక్షణము.

శ్లో॥ [పూజ్యపాదీయే] కాలస్ఫోటో విషస్ఫోట స్సద్యోహాన్యాత్సవేదనః । కక్షగ్రంథి ర్గళగ్రంథిః కర్ణగ్రంథిశ్చ నాశయేత్ ।
ఆస్యజం స్ఫోటకంతీవ్రం రసభస్మచ నాశయేత్ ॥

తా. కాలస్ఫోటము విషస్ఫోటము జనించిన తక్షణముననే నంటను వేదనను గలుగంజేయు. చంకలో వ్రణముబుట్టిన కక్షగ్రంథి యనంబడు. కంఠమున వ్రణముబుట్టిన గళగ్రంథి యనంబడు. చెవి మొదలయందు వ్రణముబుట్టిన కర్ణగ్రంథి యనంబడు. ఇవియన్నియు మృత్యుప్రదంబులు. నోటవ్రణముబుట్టిన అస్యస్ఫోటమనంబడు. ఇదినివర్తించుటకై శ్లీపదరోగమునజెప్పంబడు. రసభస్మమును గాని లేక రసకర్పూరమును గాని అనుపానముతోడ సేవింపవలయు (లేకరసపుబ్బ సేనిజేయవలయు)

## కాలస్ఫోటహర లేపనము.

శ్లో॥ గుంజాపత్రే సితాయష్టి గవాం క్షీరేణపాయయేత్ ।
కాలస్ఫోటం నిహంత్యాశు మజ్జావా పుత్రజీవికా ॥

తా. గురిజాకు పంచదార యష్టిమధుకము వీనినినూరి ఆవుపాలతో సేవించినను లేక పుత్రజీవిగజ్జనునూరి లేపనముజేసినను కాలస్ఫోటము శీఘ్రముగ మానును.

## విషస్ఫోటహర లేపనము.

శ్లో॥ పుష్యార్కే కాకతుండాస్తు మూల మాదాయభక్షయేత్ ।
క్షౌద్రేణ స్ఫోటకంహంతి కింవాముండీ రసంపిబేత్ ॥

తా. పుష్యమి నక్షత్రము భానువారమునాడు గురిజవేరునుదెచ్చి దంచి చూర్ణముజేసి తేనెతో సేవించినను లేక బోడతరరసమును త్రాగినను విషస్ఫోటక వ్రణములు మానును.

దంతికోనలు 7 మిరియాలు వీనిని 7 నూనెబొట్లతోనూరి ¼ మండలము సేవించిన కక్షగ్రంథియందు సోనవలె నీరుగారును పిదప 10 చిన్నములయెత్తు మంచి యింగువను ఆవువెన్నలోగలిపి 2 మండలములు సాయంప్రాతఃకాలముల సేవింపుచుండిన కక్షగ్రంథి మానును. ఇటులనే గళగ్రంథి గండమాల కర్ణగ్రంథి అనువానియందును యింగువను సేవింపంవగు.

(రసము గంధకము మైలుతుత్తము కాచు వీనినిసమభాగములుగ ఖల్వములో నునిచి గల్లేరాకురసముతో మర్దించి యెండించి చూర్ణముజేసి ఆవునేతితోగలిపి కాకి యీకెతో లేపనము చేయుచుండిన: చెవిముడతయందు జనించిన వ్రణము మానును. ఆస్యస్ఫోటకములయందు రసకర్పూరమును 2 మండలములు సేవించిన ఆస్యస్ఫోటకము హరించుటయేగాక పైజెప్పబడిన సర్వవ్రణములు హరించు. పథ్యము—చప్పిడి వంటకమును భుజింపవలయు.)

## శ్లీపదరోగ నిదానము.

శ్లో॥ [మాధవనిదానే] ప్రస్థితోవంక్షణేవాపి అధఃకాయేకఫోల్బణః।
దోషజస్స్రావశ్శోఫ శ్శాలీనామాకృతి స్తథా ।
మేదో మాంసాశ్రితంశోఫం పాదే శ్లీపదముచ్యతే ॥

తా. కఫాధిక్యముగల వాతపిత్తశ్లేష్మములవలన గజ్జలయందు వాపుజనించి శరీరాధోభాగమున వ్యాపించి స్రావమును జేయునట్టివడ్లగింజల యాకృతిగలకురుపులతో వ్యాప్తంబై మేదోమాంసాశ్రితంబై పాదములయందు వ్యాపించిన శ్లీపదమనంబడు. (మఱియు "తచ్ఛ్లీపదంస్యాత్కరకర్ణనేత్ర శిశ్నోష్ఠనాసాస్వపికేచిదాహు" అనుగ్రంథాంతర వచనప్రకారము శ్లీపదము (హస్తముకర్ణము నేత్రములు మేఢ్రము పెదవి నాసికము అనువానియందును జనించునని కొందరువచించిరనుట.)

## శ్లీపదరోగ లక్షణము.

శ్లో॥ [అన్యశాస్త్రే] శ్లీపదంపాదవల్మీకం తత్రరక్తంవిమోక్షయేత్ । భక్షయేత్సూరణవటీ మర్శోరోగచికిత్సకే ॥

తా. కాలుపుట్టవలె పెరిగిన శ్లీపదరోగ మనంబడు. దీనియందు రక్తమును దీయవలయు. మఱియు అర్శోరోగమునందలి సూరణ వటికముల సేవించినశ్లీపదము మానును. ఈ సూరణవటికములు అర్శోరోగ ప్రకరణమున జెప్పంబడియున్నయది.

శ్లో॥ అత్యంతస్థూలజంఘోరు శ్లీపదో సాభిసర్వదై ః ।
అతిస్థూలతరంకృష్ణం వల్మీకమితికీర్తితమ్ ॥

తా. పిక్కలు తొడలు మిక్కుటముగ లావై యుండిన శ్లీపదమనంబడు. దానినే తొడారు గడ్డయనియు వచించెదరు. పిక్కలయందుగాని తొడలయందు గాని మఱియును లావుగలిగి నల్లనై యుండిన వల్మీకమనంబడు.

(హస్తపాదములుపగిలి గురదగలిగియుండిన శ్లీపదమనంబడు. ఇది నివర్తించుటకై గంధకతైలమును సేవింపవలయు. బోడతరరసము సేవించిన కాళ్ళుచేతుల పగుళ్ళుమానును. హంసపాదియాసరసము ½ సేరుమేకనెయ్యి నొటాను నిరియములు 1 తులము గలిపిసేవించిన కాళ్ళు చేతులపగుళ్ళు మానును. మఱియు వీనియందు గుగ్గిలతైలమునుగాని గౌరీపాషాణము వేపకొనలు వీనిని నూరిగాని 3 దినములు లేపనము సేయవలయు. మఱియు ప్రతిదినము తప్పక వేపాకునుడికించి కట్టవలయు.)

## శ్లీపద లక్షణము.

శ్లో॥ కరపాదాయదాక్రృష్ణా కండూతిస్ఫోటసంభవః ॥
తుషాచర్మయదాజాతం తదేవశ్లీపదంస్మృతమ్ ॥

తా. చేతులుకాళ్ళు నల్లనై దురదతో గూడి పగిలి చర్మము పొట్టువలెరాలు చుండిన శ్లీపదమని తెలియవలయు.

## శ్లీపద చికిత్స.

శ్లో॥ [బాహటే] పిశ్వాకణాభ్యాంక్వథితం గుళూచ్యాశ్నృతం సు
దారుక్వథితంపిబేద్వా । సమాక్షికంశ్లీపదకంనిహన్యాత్సిద్ధా
ర్థకాస్తస్యహితః ప్రలేపే ॥

తా. శొంఠి పిప్పలి తిప్పతీగ అనువాని కషాయములోగాని లేక దేవదారు చెక్కకషాయములోగాని తేనెగలిపి సేవించి తెల్లఆవాలను నూరి లేపనముచేసిన శ్లీపదము హరించు.

## అభయాది లేపము.

శ్లో॥ అభయాసర్జ పనాగరహింగునచాశి గ్రురవిమూలైః ।
దినకరవయసాపిష్టే. శ్లీపదనాశాయ లేపనంస్యాత్ ॥

తా. కరక్కాయలు తెల్లఆవాలు శొంఠి యింగువవస మునగజిల్లేడువేరు వీనిని సమభాగములుగ గ్రహించి జిల్లేడుపాలతోనూరి లేపనముజేసినను శ్లీపదము హరించు. (లేక గుగ్గిలతైలమును లేపనముజేసిన శ్లీపదముహరించు. మఱియు నిది నివర్తించుటకై గంధకకల్పమును సేవింపదగు. దీనియందు మొడనుచేతి పెద్దవ్రేలి గుంటకడ్డముగ యేడేండ్ల ప్రాతప్రత్తి కట్టెనుగాల్చి రక్షవేసిన శ్లీపదము మానును.)

శ్లో॥ [మాధవనిదానే] ఖదిరంసల్లకీదారు సక్షౌద్రం హరితాళక
మ్।గవాంమూత్రైస్సమంపిష్ట్వా పిబేచ్ఛ్లీ పదశాంతయే ॥

తా. ఖదిరసారము అందుగు దేవదారు శుద్ధిజేసిన తాళకము వీనిని సమభాగములుగ గోమూత్రముతోనూరి తేనెగలిపి సేవించిన శ్లీపదము హరించు.

శ్లో॥ రసకర్పూరమమృతం సేవయేత్సకలామయే ।
వంధ్యాచలభతేగర్భం మృతబంధ్యాచరక్షయేత్ ॥

తా. రసకర్పూరము అమృత తుల్యంబగుటచే సర్వరోగముల హరింపంజేసి గొడ్రాలకు మృతవంధ్యలకు గర్భధారణమునుగలుగంజేయు. కావున రసకర్పూరము తులము బెల్లము నాటూకు ప్రమాణము యీరెంటిని ఖల్వములోనునిచి 2 ఝాములు మర్దించి 80 మాత్రలుజేసి 40 దినములు ఆవునేతితో సాయంప్రాతః కాలముల మ్రింగి విడెముసేయవలయు. పథ్యము వరివంటకము మేకచల్ల ఆవుపాలు వీనిని భుజింపవలయు. ఇటుల పథ్యముగనుండి యొక మండలముగాని లేక 2 మండలములుగాని ఔషధమును సేవింపుచుండిన ఫిరంగిరోగములు వ్రణములు లూతవ్రణములు భగందరములు పురుషునికి జనించెడు పుండ్లు దంతవ్రణములు బహువిధవ్రణములు గ్రంథులు శిలపార్శ్వవ్రణములు చనుమాదలు పుండ్లు నూతిపుండ్లు కాళ్ళు చేతులు పగిలి దురదగల రోగములు నొప్పితోగూడియుండు వాతములు శూలతోగూడియుండు నేత్రవాతములు నాలుక నాశ్రయించిన రోగములు మేఢ్రవ్రణములు మర్మస్థలమునబుట్టిన వ్రణములు యివియన్నియు హరించుటయేగాక ఫిరంగివ్యాధులుగల స్త్రీలు గర్భోత్పత్తియైనను 4 వ మాసములోపల ప్రతిదినమొకపూట పైఔషధములో నొకమాత్రను ఆవునేతితోడ చప్పిడి పథ్యముగనుండి 1 మాసమువరకు సేవింపంజేసిన ఆస్త్రీయును గర్భస్థశిశువును నిరోగులై సుఖముగ నుందురని రసరత్నాకరమునందు జెప్పంబడియున్నయది.

సీ॥ అవనిపై (దిప్పతీ)గాకు రసంబును । గోఘృతంబునుగాని కూర్చివండి ॥ చేతలాశాకును జెన్నుగ శోధించి । గోఘృతంబునుగానికూర్చివండి । రేగొట్టిచెక్కనుబాగుగ దెప్పించి । గోఘృతంబును గానికూర్చివండి । పెద్దనూగ్నిచెక్కను బేర్మిలో దెప్పించి । గోఘృతంబును గానికూర్చివండి । యిట్టి యౌషధములయందు నేదియైన । సింధురంబున సేవింపస్త్రీల కెల్ల । జెడ్డవ్యాధులు మాని బాగుపడ్డవెల్ల । బ్రతుకకుండిన శిశువులు । బ్రతుకుచుంద్రు ॥

సీ॥ తనరువాలుష తైలమును వేపయీనెల ॥ రససిందురము గూర్చి మెసగనొకటి । మేలువెల్లుల్లి వేళ్లమిరియంబు నెయ్యిని । సిందురంబునుగూర్చి సేవనొకటి । మనుసిందురము కోల ముక్కియుమిరియంబు । పంచదారయు జేర్చి పానమొకటి । కారనుములు నూడుగవు వేరుగోఘృతం । బునవండిసిందు రంబుననునొకటి । భార్గియౌవాలు గోఘృతంబునసువండి । సింధురంబునుగూర్చి భక్షింపనొకటి । గర్భమైనట్టి మృతవంధ్యకాంతలెల్ల । కలితదీర్ఘాయుపుత్రులంగాంతురవుడు ॥

(పైజెప్పంబడిన 2 పద్యములలోని యౌషధముల గర్భమునిలిచిన 4 వమాసము మొదలొక మండలముగాని లేక 2 మండలములుగాని సేవించుటయేగాక చప్పిడిపథ్యము నాచరింపవలయు. చప్పిడియన — ఆవుపాలు నెయ్యి చాతలాసికూర సహదేవికూర అనువానితోడ నన్నమును భుజించుటయు.

సీ॥ శనివారముసవాసమునునుండిభానువా । రమునాడు గలగరరసమునూనె । సరిగూర్చి గంధకం బరతులంబును గల్పి భక్షించిశయ్యపై బవ్వళించి । పూనికుంపటిగాచిమూడవ జామున ! నీళ్ళాడిపథ్యంబు నెఱినొనర్చి । పౌసగభానుత్ర యంబునునాచరించియు । మూన్యమహా నేడవమాసమందు ।

ననుభవించిన కాంతలకవనిఁబుత్ర । వర్గముదయించు మఱి
శతవత్సరంబు । లాయువునుగల్గినట్టి యత్యధికబలుల । సంశ
యంబేలనిందుకు సాటిలేదు ॥

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణనిడి
మామిడి భగిసత్సంప్రదాయ కౌరార్య రామదేశిక శిష్యోత్తమ నమశ్శివాయ
సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన శిరోభూషణనీలకంఠ
కొట్టూరు బసవరాజ నామధేయ ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్రతాత్పర్యసహితే
భగందర వ్రణ శారీరవ్రణ ఆగంతుక వ్రణ నాడీవ్రణ అగ్నిదగ్ధవ్రణ లూతవ్రణ
మర్కటీరోగ అర్బుద గళగండ గండమాల కపాల గండమాల కర్ణ
రోగ కర్ణగండమాల ఓష్ఠ దంతమూలగత దంతవ్రణ తుండివ్రణ కూపవ్రణ జంతి
రాజవ్రణ స్నాయుక స్తనవ్రణ గళగ్రంథి గళకీల ఆస్యస్ఫోటకీలక
కాలస్ఫోట శ్లీపదరోగనిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య
తచ్చికిత్సానుపాన పథ్యాపథ్య లక్షణయుక్తం
ఏకవింశ ప్రకరణమ్.



శ్రీ ర స్తు

# బసవరాజీయము.

## ఆంధ్రతాత్పర్యము.

## — ద్వావింశప్రకరణము. —

శ్లో॥ జగత్కారణమీశానం జటామండలమండితమ్ ।
వ్యాఘ్రచర్మాంబరధరం లింగమూర్తిమహంభజే ॥

తా. జగత్కారణ భూతుడు జగత్పరిపాలకుడు జటా మండలాలంకృతుడు వ్యాఘ్ర చర్మమును ధరించినవాడు లింగస్వరూపుడు నగు పరమేశ్వరుని నేను భజియించెద.

శ్లో॥ శ్రీనీలకంఠ వంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహంవైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడు బసవరాజని పేరొంనంబడిన నేను వైద్యగ్రంథములలో కడు శ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథముయొక్క ద్వావింశ ప్రకరణమును వచింపుచున్నాడను.

### అజగల్లికా లక్షణము.

శ్లో॥ [ఆయుర్వేదే] స్నిగ్ధాస్సవర్ణా గ్రథితా నీరుజాముద్గసన్నిభాః ।
కఫవాతోత్థితాజ్ఞేయా బాలానామజగల్లికా ॥

తా. శిశువులకు కఫవాతమువలన పెసలయంత కురుపులు జనించి మినమినలాడుచు చర్మముతో సమానవర్ణముగ గుండ్రముగ వేదనా రహితముగనుండిన అజగల్లికమనంబడు.

### అజగల్లికా చికిత్స.

శ్లో॥ తత్రాజగల్లికామామాం జలౌకాభి రుపాచరేత్ ।
శుక్తిసౌరాష్ట్రికా క్షార కల్కైశ్చాలేపయేన్ముహుః ॥

తా. అజగల్లిక పండుటకుముందు జలగలనంటించి రక్తమునీసి దానియందు కప్పచిప్పసున్నము పటికారము అనువాని కల్కమును పలుమారు లేపనము చేయవలయు.

శ్లో॥ కఠినాంక్షారయోగైశ్చ ద్రావయేదజగల్లికామ్ ।
శ్యామాలాంగలికామూర్వా కల్కైరపివిలేపయేత్ ॥

తా. అజగల్లిక కఠినంబై యుండిన దానిపైక్షారమునుబూసి స్రావము జేయించి నల్లసుగంధిపాల చన్నచర్లగడ్డ చాగ అనువాని కల్కమును లేపనము జేయవలయు.

శ్లో॥ పక్వాంవ్రణవిధానేన యథోక్తేనప్రసాధయేత్ ॥

తా. అజగల్లికపండిన దానియందు యథోక్తముగ వ్రణచికిత్సం జేయవలయు.

## యవప్రఖ్యా లక్షణము.

శ్లో॥ యవాకారానుకఠినా గ్రథితామాంససంశ్రితా ।
పిటికాశ్లేష్మవాతాభ్యాం యవప్రఖ్యేతిచోచ్యతే ॥

తా. కఫవాతమువలన కురుపుజనించి యవవలె కఠినముగ గుండ్రముగ మాంసాశ్రితముగనుండిన యవప్రఖ్య యనంబడు.

## అంధాలజీ లక్షణము.

శ్లో॥ ఘనా మవక్త్రాంపిటికా మున్నతాంపరిమండలామ్ ।
అంధాలజీమల్పపూయాం తాంవిద్యాత్కఫవాతజామ్ ॥

తా. కఫవాతమువలన కఠినముగ ముఖవిహీనముగ వుబ్బుగనుండు కురుపులు జనించి వానిచుట్టు చిన్నగుల్లలు వ్యాపించి యొకింత చీముతో గూడియుండిన అంధాలజి యనంబడు.

## యవప్రఖ్యాంధాలజీ చికిత్స.

శ్లో॥ అంధాలజీంయవప్రఖ్యాం పూర్వంస్వేదైరుపాచరేత్ ।
మనశ్శిలాదేవదారు కుష్ఠైరేనాంప్రలేపయేత్ ।
పక్వాంవ్రణవిధానేన యథోక్తేన ప్రసాధయేత్ ॥

తా. అంధాలజీ యవప్రఖ్య || అనువానియందు దోలుత స్వేదనకర్మంజేసి పిప్పలి మణిశిల దేవదారు చంగల్వకోష్టు అనువానిని నూరి లేపనము జేయవలయు. అవి పండియుండిన యథోక్తముగ వ్రణచికిత్సం జేయవలయు.

## వివృతాపిటిక లక్షణము.

శ్లో॥ వివృతాస్యాం మహాదాహాం పక్వోదుంబరసన్నిభామ్ ।
హరిమండలాంపిత్తకృతాం వివృతాం నామతోవిదుః ॥

తా. పిత్తసంబంధమువలన నోరుదెరచికొని కడుదాహ యుక్తంబై పండిన యత్తిపండుతో సమానంబై చుట్టునున్న నిగుల్లలవలన వ్యాప్తంబైయుండిన వివృత పిటిక యనంబడు.

## వివృత ఇంద్రవృద్ధ గర్దభ జాలగర్దభ చికిత్స.

శ్లో॥ వివృతా మింద్రవృద్ధాంచ గర్దభే జాలగర్దభే ।
పైత్తికస్య విసర్పస్య క్రియయా సాధయే ద్భిషక్ ॥

తా. వివృత యింద్రవృద్ధ గర్దభ జాలగర్దభ మను రోగములయందు పిత్తవిసర్పమునకై జెప్పంబడిన చికిత్సం జేయవలయు.

శ్లో॥ పాకేతు రోపయే దాజ్యైః పక్వై ర్మధురభేషజైః ।
నీలిపటోలమూలాభ్యాం సాజ్యాభ్యాం లేపసంహితమ్ ॥
జాలగర్దభరూపంతు సద్యోహంతి సవేదనమ్ ॥

తా. పైజెప్పబడిన వివృతాదులు పండియుండిన వానియందు మధురౌషధములతో సిద్ధము జేయబడిన ఘృతలేపనమును జేయవలయు. మరియు జాలగర్దభమునందు నీలిచేదుపొట్లవేరు వీనిని నేతితోనూరిలేపనము చేసిన పోట్లుతక్షణమునహరించు.

## కచ్ఛపికా లక్షణము.

శ్లో॥ గ్రథితాః పంచవా షడ్వాదారుణాః కచ్ఛపోన్నతాః ।
కఫానిలాభ్యాం పిటికా జ్ఞేయా కచ్ఛపికా బుధైః॥

తా. కఫవాతమువలన 5 లేక 6 కురుపులవలన వ్యాప్తంబై తాబేటివీపువలె నున్నతమై భయంకరముగ నుండిన కచ్ఛపిక మనంబడు.

## చికిత్స.

శ్లో॥ కచ్ఛపీంస్వేదయేత్పూర్వం తతఏభిః ప్రలేపయేత్ ।
కల్కీకృతైర్నిశాకుష్ఠ శిలాతాళకదారుభిః ।
తాంపక్వాం సాధయేచ్ఛీఘ్రం భిషగ్వ్రణచికిత్సయా ॥

తా. కచ్ఛపికయందు మొదలుత స్వేదమునుదీసి పసుపు చంగల్వకోష్టు మణిశిల తాళకము దేవదారు అనువాని కల్కమును లేపనముసేయవలయు. మఱియు నది పండిన శీఘ్రముగ వ్రణచికిత్సం జేయవలయు.

## వల్మీక లక్షణము.

శ్లో॥ గ్రీవాంసకక్షాకరపాదదేశే సంధౌగళేవాత్రిభిరేవదోషైః ।
గ్రంథిస్సవల్మీకవదక్రియాణాంజాతః క్రమేణైవగతః ప్రవృద్ధిమ్ ।
ముఖైరనేకైస్స్రుతితోదవద్భిర్విసర్పవత్సర్పతిచోన్నతాగ్రైః ।
వల్మీకమాహుర్భిషజోవికారంనిష్ప్రత్యనీకంచిరజంవిశేషాత్ ॥

తా. మెడభుజశిరములు చంకలు హస్తములు పాదములు సంధులు కంఠము అను నీస్థలముల త్రిదోషమువలన పాముపుట్టవలె గ్రంథి జనించి చికిత్సింపబడకుండుటవలన నది మెల్ల మెల్లగ వృద్ధిం జెంది పెక్కుముఖములు స్రావము సూదులతో బొడుచునటుల వేదన వున్నతమైన ముఖములుగలదై విసర్పరోగమువలె ప్రసరించిన వల్మీక మనంబడు. దీనియం దౌషధోపచారము సేయుట కశక్యంబు. మఱియు జనించి చిరకాలంబైన నొకింత యుపచారంబైనను జేయుట కశక్యంబు.

## మనశ్శిలాది తైలము.

శ్లో॥ మనశ్శిలాసభల్లాత సూక్ష్మైలాగరుచందనైః ।
జాతీపల్లవకల్కైశ్చ నింబతైలంవిపాచయేత్ ।
వల్మీకంనాశయేత్తద్ధి బహుచ్ఛిద్రంబహువ్రణమ్ ॥

తా. మణిశిల జీడి సన్నయేలకులు అగరు చందనము జాజియాకులు అను వాని కల్కములో వేపనూనెగలిపి కాచి లేపనముజేసిన అనేకఛిద్రములతోగూడి బహువ్రణములుగల వల్మీకము హరించు.

## పనసిక లక్షణము.

శ్లో॥ కర్ణస్యాభ్యంతరేజాతాం పిటికా ముగ్రవేదనామ్ ।
స్థిరాం పనసికాంతాంతు విద్యాద్వాతకఫోత్థితామ్ ॥

తా. చెవిలోపల వాత కఫములచే పనసకాయవలె కఠినముగనుండు కురుపు జనించి మిక్కుటముగ పోట్లతోడం గూడియుండిన పనసిక మనంబడు. (మఱియు నిది చెవిపైటిభాగమునకు చుట్టు గలుగుచున్నదని భోజునిమతము.)

## చికిత్స.

శ్లో॥ భిషక్పనసికాపూర్వం స్వేదనైరపతర్పణైః ।
జయేద్విరారిపల్లేపైః శ్శిగ్రుదేవద్రుమోద్భవైః ॥

తా. పనసికయందు దొలుత స్వేదకర్మను అపతర్పణక్రియనుజేసి పిదప విదారికయందు జెప్పంబడు మునగ దేవదారు అనువాని పట్టల నుదకముతోనూరి లేపనము జేయవలయు.

## జాలగర్ధభలక్షణము.

శ్లో॥ విసర్పవత్సర్పతియః శ్శోథస్తనురపాకవాన్ ।
దాహజ్వరకరః పిత్తాత్సజ్ఞేయో జాలగర్ధభః ॥

తా. పిత్తముచే విసర్పమువలె వంతట వ్యాపించునదిగ గాని లేక నొకింత పండునదిగ గాని నుండు వాపు జనించి దాహము జ్వరము అనువానితో గూడియుండిన జాలగర్దభ మనంబడు.

## ఇంద్రవృద్ధ లక్షణము.

శ్లో॥ పద్మకర్ణికవన్మధ్యే పిటికాభి స్సమాచితామ్ ।
ఇంద్రవృద్ధాంతు తాం విద్యాద్వాతపిత్తోత్థితాం భిషక్ ॥

తా. కమలముయొక్క మిద్దెవలె మధ్యను 1 కురుపుజనించి దానిచుట్టు సన్ననికురుపులు వ్యాపించియుండిన యింద్రవృద్ధ మనంబడు. ఇది వాతపిత్తముల వలన గలుగు.

## గర్దభిక లక్షణము.

శ్లో॥ మండలం వృత్త ముత్సన్నం సరక్తం పిటికాచితమ్ ।

రుజాకరీం గర్దభికాం తాం విద్యా ద్వాతపిత్తజామ్ ॥

తా. గుండ్రముగ వుబ్బుగ యెఱ్ఱగనుండుకురుపులవలనవ్యాప్తంబైమండలములు గలిగి మిక్కుటముగ నొచ్చుచుండిన గర్దభికమనంబడు. ఇదివాతపిత్తములచే జనించు.

పాషాణగర్దభ లక్షణము.

శ్లో॥ వాతశ్లేష్మసముద్భూత శ్శ్వయథుర్హానుసంధిజః ।
స్థిరో మందరుజస్స్నిగ్ధో జ్ఞేయః పాషాణగర్దభః ॥

తా. వాతకఫములచే కట్టుమూర్ల సంధియందు కఠినముగ నుండమైన పీటగల దిగనుండు వాపుజనించి మినమిన లాడుచుండిన పాషాణగర్దభ మనంబడు.

పాషాణగర్దభ చికిత్స.

శ్లో॥ సురదారుశిలాకుష్ఠైస్స్వేదయిత్వా ప్రలేపయేత్ ।
కఫమారుత శోఫఘ్నో లేపః పాషాణగర్దభే॥ ॥

తా. తొలుత స్వేదకర్మంజేసి దేవదారు మణిశిల చెంగల్వకోష్టు అనువానిని నూరి లేపనము జేసినను లేక కఫవాత శోఫహర లేపనము జేసినను పాషాణగర్దభము హరించు.

ఇరివేల్లిక లక్షణము.

శ్లో॥ పిటకా ముత్తమాంగస్థాం వృత్తా ముగ్రజ్వరాన్వితామ్ ।
సర్వాత్మికాం సర్వలింగాం జానీయాదిరివేల్లికామ్ ॥

తా. త్రిదోషమువలన శిరముపై గుండ్రముగ కడుపీడా యుక్తముగ జ్వర యుక్తముగ త్రిదోషలక్షణయుక్తముగనుండు కురుపుజనించిన యిరివేల్లికమనంబడు.

చికిత్స.

శ్లో॥ పైత్తికస్య విసర్పస్య యాచికిత్సా ప్రకీర్తితా ।
తామేవ భిషగేతాంచ చికిత్సే దిరివేల్లికామ్ ॥

తా. ఇరివేల్లికమునందు పూర్వోక్త పిత్త విసర్ప చికిత్సలం జేయవలయు.

కక్షపిటికా లక్షణము.

శ్లో॥ బాహుకక్షాం సపార్శ్వేషు కృష్ణస్ఫోటాం సవేదనామ్ ।

పిత్తకోపసముద్భూతాం కక్షామిత్యభినిర్దిశేత్ ॥

తా. భుజము చంకలు భుజశిరస్సులు పార్శ్వసములు అనువానియందు పిత్తప్రకోపమువలన నల్లనికురుపుజనించి వేదనాయుక్తంబై యుండిన కక్షపిటికయనంబడు.

గంధనామ్నీ లక్షణము.

శ్లో॥ ఏకా మేతాదృశీం దృష్ట్వా పిటికాం స్ఫోటసన్నిభామ్ ।
త్వగ్గతాం పిత్తకోపేన గంధనామ్నీం ప్రచక్ష్యతే ॥

తా. పిత్తప్రకోపమువలన చర్మముపై పెద్దబొబ్బతో సమానమైనపిటికజనించిన గంధనామ్ని యనంబడు.

కక్షగంధపిటికా చికిత్స.

శ్లో॥ కక్షాంచ గంధనామ్నీంచ చికిత్సేచ్ఛ చికిత్సకః ।
పైత్తికస్య విసర్పస్య క్రియయా పూర్వముక్తయా॥

తా. కక్షపిటిక గంధనామ్ని అనురోగములయందు పూర్వోక్త పిత్తవిసర్పచికిత్సం జేయవలయు.

అగ్నిరోహిణీ లక్షణము.

శ్లో॥ కక్షభాగేషు యే స్ఫోటా జాయంతే మాంసదారణాః ।
అంతర్దాహజ్వరకరా దీప్తపావకసన్నిభాః ।
సప్తాహా ద్ద్వాదశాహాద్వా పక్షా ద్వాహంతిమానవమ్ ।
తా మగ్నిరోహిణీం విద్యా దసాధ్యాం సాన్నిపాతకీమ్ ॥

తా. చంకయందు మాంసమును వీడునటులం జేసెడి కురుపులు జనించి అంతర్దాహ తాపములుగలవై జ్వలింపుచుండు నగ్నివలె నెఱ్ఱనివియై యుండిన అగ్నిరోహిణియనంబడు. ఇది వాతాధిక్యంబై యుండిన 7 దినములకును పిత్తాధిక్యంబై యుండిన 12 దినములకును కఫాధిక్యంబై యుండిన 15 దినములకును రోగిని యమమందిరనివాసినిగ జేయు. ఇది త్రిదోషజనితంబగుటచే నసాధ్యంబు.

చికిత్స.

శ్లో॥ పిత్తవీ సర్పవిధినా సాధయే దగ్నిరోహిణీమ్ ।

రోహిణ్యాం లంఘనం కుర్యా ద్రక్తమోక్షణరూక్షణమ్ ।
శరీరస్యచ సంశుద్ధిం తాంతు వృద్ధాం పరిత్యజేత్ ॥

తా. అగ్నిరోహిణియందు పూర్వోక్తపిత్తవిసర్ప చికిత్సను తో(బో)లుత లంఘన రక్తమోక్షణములను రూక్షకరవిధిని జేయుటచే అగ్నిరోహిణిని హరింపం జేయుటయే గాక విరేచనాదిక్రియలను జేయవలయు. అది వృద్ధిం జెందిన వర్జింపవలయు.

చిప్పలక్షణము.

శ్లో॥ నఖమాంసమధిష్ఠాయ వాతపిత్తేచ దేహినామ్ ।
కుర్వాతే దాహపాకౌచ తం వ్యాధిం చిప్యమాదిశేత్ ॥

తా. వాతపిత్తములు నఖమాంసముల నాశ్రయించి దాహపాకములను గలుగంజేసిన చిప్యమనంబడు.

కునఖ లక్షణము

శ్లో॥ తదేవాల్పతరైర్దోషైః కునఖం పురుషం వదేత్ ।
అభిఘాతాత్ప్రదుష్టోయో నఖో రూక్షోసితః ఖరః ।
భవేత్తం కునఖం విద్యాత్కులీర మితి సంజ్ఞితమ్ ॥

తా. చిప్యమే యల్పదోషమువలన జనించిన కునఖ మనంబడు. మఱియు నఖము యభిఘాతమువలన దుష్టంబై రూక్షము నలుపువర్ణము కాఠిన్యముగలదై యుండిన కునఖ మనియు కులీర మనియు జెప్పంబడు.

చిప్య కునఖ చికిత్స.

శ్లో॥ చిప్యం రుధిరమోక్షేణ శోధనే నాప్యుపాచరేత్ ।
గతోష్మాణ మథైనంతు సేచయే దుష్ణవారిణా ।
శస్త్రేణాపి యథా యోగ్య ముచ్ఛిద్య స్రావయేత్తతః ।
వ్రణోక్తేన విధానేన రోపయేత్తు విచక్షణః ॥

తా. చిప్యమునందు రక్తమునుదీసి శోధనక్రియను జేయవలయు. రక్తమోక్షణానంతరమందలి యుష్ణత్వము వెడలిన పిదప నుష్ణోదకముతో సేకము సేయవలయు మఱియు యథాయోగ్యముగ దానిని శస్త్రముతో ఛేదించి రక్తమును స్రవింపంజేసి వ్రణచికిత్సంజేసి మాంసపూరితం బగునట్లుగం జేయవలయు.

హరిద్రాది కల్కము.

శ్లో॥ స్వరసేన హరిద్రాయాః పాత్రే కృత్వాయసే భయామ్ ।
ఘృష్ట్వా తజ్జేన కల్కేన లింపే చ్చిప్యం పునఃపునః ॥

తా. పసుపుస్వరసములో కరక-చూర్ణమును గలిపి దానిని యినుపపాత్రలో నునిచి మర్దించి చిప్యముపై పలుమాఱు లేపనము సేయవలయు.

కునఖ చికిత్స.

శ్లో॥ శ్లేష్మవిద్రధివచ్చైన కునఖం సముపాచరేత్తు ।
నఖకోటిప్రవిష్టేన టంకణే నచ శామ్యతి ॥

తా. కునఖమునందు శ్లేష్మవిద్రధి చికిత్సం జేయుటయేగాక గోళ్ళప్రక్కన వెలిగారచూర్ణము నునిచిన కునఖము నశించు.

అనుశయీ లక్షణము.

శ్లో॥ గంభీరా మల్పసంరంభాం సవర్ణా ముపరిస్థితాత్తు ।
పాదస్యానుశయీం తాంతు విద్యాదంతఃప్రపాకినీమ్ ॥

తా. పాదముపై చర్మసమానవర్ణముగ గంభీరముగ నొకింత యుబ్బుగనుండు కురుపు జనించి లోనపండిన అనుశయీ యనంబడు.

చికిత్సః

శ్లో॥ హరేదనుశయీం వైద్యః క్రియయా శ్లేష్మవిద్రధే ॥

తా. అనుశయీ యనురోగమున కఫవిద్రధికై జెప్పంబడియుండు చికిత్సం జేయవలయు. దానిచే యది హరించు.

విదారిక లక్షణము.

శ్లో॥ విదారీకందవద్వృత్తాం కక్షువం క్షణసంధిషు ।
విదారికా మితి వదే త్సరుజాం సర్వవేదనామ్ ॥

తా. నేలగుమ్ముడువలె గడ్డవలె గుండ్రముగ చంకలయందుగాని లేక జజ్జసంధుల యందుగాని గ్రంథిజనించి పీడతోగూడి సర్వదోషలక్షణయుక్తంబై యుండిన విదారిక మనంబడు. (ఇది సన్నిపాతమువలన జనించు.)

చికిత్స.

శ్లో॥ విదారికాయాం ప్రథమం జలౌకా యోజనం హితమ్ ।
పాటనంచ విపక్వాయాం తతో వ్రణవిధిః స్మృతః ॥

తా. విదారికయందు దొలుత జలగలనంటించి రక్తము స్రవింపంజేయుట హితకరంబు. మఱియు నది పండిన ఛేదించి వ్రణచికిత్సం జేయవలయు.

సామాన్యోపచారము.

శ్లో॥ జయే ద్విదారికాం లేపై శ్శిగ్రుదేవ ద్రుమోద్భవైః ॥
తా. మునగ దేవదారు అనువాని లేపనమువలన విదారిక హరించు.

శర్కరా లక్షణము.

శ్లో॥ ప్రాప్య మాంస సిరా స్నాయు శ్లేష్మ మేద స్తథానిలః ।
గ్రంథిం కరో త్యపా భిన్నో మధు సర్పి ర్వసా నిభమ్ ।
స్రవత్యా స్రావ మనిల స్తత్ర వృద్ధిం గతః పునః ।
మాంసం విశోష్య గ్రథితాం శర్కరాం జనయే త్తతః ॥

తా. కఫ మేదోవాతములు మాంస సిరాస్నాయువులయందు జేరి గ్రంథిరూపంబై పగిలి నెయ్యి క్రొవ్వు అనువాని తుల్యముగనుండు స్రావమును గలుగంజేయుచుండుటవలన వాతము పలుమాఱు వృద్ధింజెంది మాంసమును శుష్కింపంజేసి సన్న సన్నగ్రంథుల గలుగంజేసిన శర్కర యనంబడు.

శర్కరార్బుద లక్షణము.

శ్లో॥ దుర్గంధి క్లిన్న మత్యర్థం నానావర్ణం తత స్సిరాః ।
సృజంతి రక్తం సహసా త ద్విద్యా చ్ఛర్కరార్బుదమ్ ॥

తా. శర్కర జనించినపిదప నచ్చట సిరలవలన కడుదుర్గంధ క్లేదయుక్తముగ పలువిధవర్ణములుగ (అనగా ఘృతము మేదస్సు నసవలె) రక్తస్రావంబకస్మాత్తుగ గలిగిన శర్కరార్బుద మనంబడు.

చికిత్స.

శ్లో॥ మేదోర్బుద విధానేన నాశయే చ్ఛర్కరార్బుదమ్ ॥

తా. శర్కరార్బుదమును మేదార్బుదచికిత్సలచే హరింపంజేయవలయు.

## పాదదారి లక్షణము.

శ్లో॥ పరిక్రమణ శీలస్య వాయురత్యర్థరూక్షయోః ।
పాదయోః కురుతే దారీం సరుజాం తలసంశ్రితామ్ ॥

తా. మిక్కుటముగ నడుచుటవలన వాతసంబంధమువలన నరకాలుకడు రూక్షంబై పగిలి నొచ్చుచుండిన పాదదారిక మనంబడు.

## మధూచ్ఛిష్టాది లేపము.

శ్లో॥ మధూచ్ఛిష్ట వసామజ్జా ఘృతక్షార విమిశ్రితైః ।
సర్జాహ్వసింధూద్భవయో శ్చూర్ణం మాక్షికసంయుతమ్ ।
నిర్మథ్యకటుతైలాక్తం హితంపాద ప్రమార్జనే ॥

తా. మైనము క్రొవ్వు మజ్జ నెయ్యి క్షారముఅనువానిలో గుగ్గిలముసైంధవ లవణముతేనె తెల్లావనూనెగలిపి మర్దించి పాదములయందు రుద్దినపాదదారికహరించు.

## మదనాది లేపము.

శ్లో॥ మదనసైంధవగుగ్గులు గైరికాజ్యమధౌవాలకపంకవిలేపనాత్ ।
ప్రపుటితంత్వఖిలంచరణద్వయంవికచతామరసప్రతిమంభవేత్ ॥

తా. మంగకాయ సైంధవలవణము గుగ్గిలము కావిరాయి వట్టివేరు వీని చూర్ణములో నెయ్యి తేనె గలిపి లేపనముజేసిన కాలిపగుళ్ళుమాని తామరరేకుల వలె మృదువుగ నుండు.

## మధ్వాది లేపము.

శ్లో॥ మధుసిక్థకసైంధవఘృతగుడ మహిషాఖ్యపాలనిర్యాసైః ।
గైరికసహితై ర్లేపః పాదస్ఫుటనాపహస్సిద్ధః ॥

తా. తేనెమైనము సైంధవలవణము నెయ్యిబెల్లము మహిసాక్షిగుగ్గిలము తెల్ల ధూపము కావిరాయి వీనినేకముజేసి మర్దించి లేపనముజేసిన కాళ్ళపగుళ్ళుమానును.

## మదనాది లేపము.

శ్లో॥ మదనంచ నథాసిక్థం సాముద్రలవణం తథా ।

మహిషీ లవనీ తేన సంతప్తం లేపనే హితమ్ ।
సప్తాహా త్స్ఫుటితౌ పాదౌ జాయేతే కమలోపమౌ ॥

తా. క్రమంగ కాయమైనను సముద్రలవణము వీనిని బట్టెవెన్నలోగలిపియుడికించి 7 దినములు పూసిన కాళ్ళపగుళ్ళుమాని తామర రేకులవలె నగు.

కందర లక్షణము.

శ్లో॥ శర్కరో న్మథితేపాదే క్షతేవా కంటజాదిభిః ।
గ్రంధిః కోలవ దుత్పన్నో జాయతే కందరంతుతత్ ॥

తా. తాయిని త్రొక్కుటచేనేని లేక కాలియందు గుచ్చికొనిన ముల్లును దీయునపుడు లోన ముల్లువిరుగుటచేనేని గాయంబై రేగుబంకంత యుబ్బుగల గ్రంథి జనించిన కందర మనంబడు.

చికిత్స.

శ్లో॥ చ హేత్కందర ముద్ధృత్య తైలేన దహనేనవా ॥

తా. కందరమును ఛేదించి తీసి నూనెతోగాని అగ్నితోగాని కాల్చవలయు.

అలస లక్షణము.

శ్లో॥ క్లిన్నాంగుళ్యం తరౌ పాదౌ కండూదాహ రుజాన్వితౌ ।
దుష్టకర్దమసంస్పర్శా దలసంతం వినిర్దిశేత్ ॥

తా. దుర్వాసనగల బురద గలుగుటచే కాలియొక్క వేళ్ళసంధులయందలి మాంసముకుళ్ళి నీరుగార్చుచు దురద మంట పోట్లు అనువానితో గూడియుండిన అలసమనంబడు.

చికిత్స.

శ్లో॥ పాదౌసిక్త్వార నాళేన లేపనంత్వాలసేహితమ్। పటోలకుటజ నింబ రోచనామరిచై స్తిలైః॥క్షుద్రా స్వరసపిష్టేన కటుతైలేన లేపయేత్ । తతఃకాసీసకుటజ తిలచూర్ణైర్విచూర్ణయేత్॥

తా. అలసరోగమునందు దొంతకలిని పాదములయందుపూసి పిదప చేదుపొట్ల మణిశిల వేప గోరోచనము మిరియాలు నువ్వులు అనువానిచూర్ణములోములక

స్వరసమును తెల్లావనూనెను గలిపి తైలపక్వముగకాచి పాదముల లేపనముజేసి అన్నభేది మణిశిల నువ్వులు అనువాని చూర్ణముసు దానిపై నద్దవలయు.

## కరంజాది లేపము.

శ్లో॥ కరంజబీజం రజనీ కాసీసం పద్మకం మధు ।
రోచనా హరితాళంచ లేపోయ మలసేహితమ్ ।

తా. కానుగవిత్తులు పసుపు అన్నభేది పద్మకాష్ఠము తేనె గోరోచనము హరిదళము వీనినినూరి లేపనముజేసిన అలసకము హరించు.

## దారుణ లక్షణము.

శ్లో॥ దారుణా కండురారూక్షా కేశభూమిః ప్రపచ్యతే ।
కఫమారుత కోపేన విద్యాద్దారుణకంతుతత్ ॥

తా. కఫవాతప్రకోపమువలన వెంట్రుకలుండు ప్రదేశము భయంకరమైన దురదతోగూడి సన్నని కురుపులవలన వ్యాప్తంబై పండిన దారుణ మనంబడు. (ఇది కఫవాత ప్రకోప జనితంబైనను రక్తపిత్తసంబంధము లేకనే పాకము జెందకుం డుటంజేసి రక్తపిత్తసంబంధమును గలదై యుండు.)

## చికిత్స.

శ్లో॥ దుగ్ధేనఖ-ఖసంబీజం ప్రలేపాద్దారుణంహరేత్ ।

తా. పాలతో గసగసాలనునూరి లేపనము జేసిన దారుణము హరించు.

## కంటకార్యాది లేపము.

శ్లో॥ కంటికారీఫలరసైః స్తుల్యాంతైలం విపాచయేత్ ।
జపాపుష్పద్రవైర్వాథ తల్లేపోనాశుప్రణుత్ ॥

తా. నేలములకపండ్లరసమునకు గాని దాసానిపువ్వులరసమునకు గాని సమముగ నూనె గలిపి కాచి లేపనము జేసిన దారుణము హరించు.

## భృంగరాజ తైలము.

శ్లో॥ భృంగరాజరసేనైవ లోహకిట్టం ఫలత్రికమ్ ।
శారిబాంచపచేత్కల్కైః తైలందారుణనాశనమ్ ।

అకాలపలితం కండూ మింద్రలుప్తంచ నాశయేత్ ॥

తా. గుంటగలగరాకురసములో లోహకిట్టము త్రిఫలములు సుగంధిపాల వేరు అనువానికల్కమును తైలమునుగలిపి కాచి లేపనముజేసిన దారుణము అకాలమున వెంట్రుకలు నెరయుట దురద యింద్రలుప్తము హరించు.

## అరూంషిక లక్షణము.

శ్లో॥ అరూంషిబహువక్త్రాణి బహుక్లేదానిమూర్ధని ।
కఫాసృక్క్రిమికోపేన నృణాం విద్యాదరూంషికామ్ ॥

తా. కఫ రక్త క్రిమి ప్రకోపమువలన శిరమున ననేకముఖములుగల కురుపులుజనించి బంకగ స్రావము వెడలిన అరూంషిక మనంబడు.

## నీలోత్పలాది లేపము.

శ్లో॥ నీలోత్పలస్యకింజల్కై ర్ధాత్రీఫలసమన్వితః ।
యష్టీమధుకయుక్తశ్చ లేపాదన్యాదరూంషికామ్ ॥

తా. నల్లకలువ యగరులు వుసిరికకాయ అతిమధురము వీనినినూరి లేపనము జేసిన అరూంషిక హరించు.

## త్రిఫలాది తైలము.

శ్లో॥ త్రిఫలాసూ రజోయష్టి మార్కవోత్పలశారిబాః ।
సైంధవం పక్వమేతైస్తు లేపాద్ధన్యా దరూంషికామ్ ॥

తా. త్రిఫలములు అతిమధురము గుంటగలగర నల్లకలువ సుగంధిపాల సైంధవలవణము అనువానికల్కములోనూనెగలిపికాచి లేపనముజేసినఅరూంషికహరించు

## పిణ్యాకాది లేపము.

శ్లో॥ పురాణ మపిపిణ్యాకం పుషం కుక్కుటస్యచ ।
మూత్రపిష్టం ప్రలేపోయం శీఘ్రం హన్యాదరూంషికామ్ ॥

తా. ప్రాతగానుగపిండి కోడిపిష్ఠము వీనిని గోమూత్రముతో నూరి లేపనము జేసిన అరూంషిక శీఘ్రముగ హరించు.

## తారుణ్యపిటిక లక్షణము.

శ్లో॥ శాల్మలీకంటకప్రఖ్యాః కఫమారుతకోపజాః ।
జాయంతేపిటికాయూనాం జ్ఞేయాస్తాముఖదూషికాః ॥

తా. కఫవాత ప్రకోపమువలన యౌవన పురుషునియొక్క ముఖమున బూరగముండ్లవంటి కురుపులు జనించి ముఖఃకౌరముగనుండిన ముఖదూషిక యనంబడు. (ముఖదూషిక-యనగా మొటిమలు.)

## మంజిష్ఠాదితైలము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్షాః కపితన స్తథా। త్వచానాంషోడశపలం మూలచూర్ణప్రకల్పయేత్ । ద్విరష్టగుణితైస్తోయైఃపాచయేత్పాదశేషకమ్ । కషాయాంశంగవాం క్షీరంక్షీరార్ధతిలతైలకమ్ । మంజిష్ఠాద్వినిశాలోధ్ర తువరీతాళకంశిలా । లాక్షాగోరోచనాకుష్ఠం * కుంకుమం రజనీద్వయమ్ । గైరికంసిక్థకంతుత్థవటమర్జునవృక్షకమ్ । నాగకేసరకాలీయపద్మబీజంచ కేసరమ్ । పారదంగంధకంపత్రం త్వేచంచ ప్రతికార్షికమ్ । సర్వంపాచ్యం తైలశేషం మ్రక్షణాన్వ్యంగకాపహం । వదనం చంద్రతుల్యంస్యా త్సప్తరాత్రాన్నసంశయః ॥

తా. మఱ్ఱి మేడి రావి జువ్వి అంబాళము అనువానివేరు పట్టలదినుసుకు 16 పలములచొప్పున దంచి 1280 పలములునీళ్ళుబోసి చతుర్థాంశముగ కషాయముకాచి దానికిసమముగ ఆవుపాలు ఆవుపాలకుసమముగ నూనెగలిపి అందు మంజిష్ఠిపసుపు మ్రానిపసుపు లొద్దుగచెక్కతొవరిమన్ను ఆరిదళము మణిశిలలక్క గోరోచనము చెంగల్వకోష్టు కుంకుమపువ్వుపసుపు మ్రానిపసుపుకావిరాయిమైనముమైలుతుత్తము మఱ్ఱిచిగుళ్ళు యేరుమద్దిచెక్క నాగకేసరములు కృష్ణచందనముతామరవిత్తులు తామరయగరులు పాదరసము గంధకము ఆకుపత్రిక లవంగపుచెక్క అనువానిచూర్ణమును దినుసుకు కర్షప్రమాణముచొప్పున గలిపి చిక్కగవండి ముఖమునందు లేపనముజేసిన 7 దినములలో వ్యంగము హరించి ముఖము చంద్రునితో సమానముగ నుండు.

* తథాచ కుంకుమద్వయమ్.

ముఖమంగులకు చికిత్స.

శ్లో॥ [మాధవనిదానే] ముఖచ్ఛాయా తరంవంగ భస్మస్యాన్మాహిషంపయః । మాక్షికంతాళకంతుత్థం రాజావర్తం శిలాజతు । మహిషాక్షంశిలాసూతం తుల్యంక్షీరైస్తుమాహిషైః । సప్తాహంమర్దయేద్గాఢం వ్యంగఘ్నం కాంతివర్ధనమ్ । మహిషీ క్షీరమథిత మేతదుద్వర్తనంహితమ్ । ముఖవర్ణంకరస్త్రీణాం తిలకాలంచనాశయేత్ ॥

తా. వంగభస్మమును బర్రెపాలతోనూరి లేపనముజేసిన ముఖమంగుముఖము యొక్క నలుపుమాని గాంతిగలుగు. మఱియు స్వర్ణమాక్షికము తాళకము మైలుతుత్తము రాజావర్తము శిలాజిత్తు మహిసాక్షీ గుగ్గిలము మణిశిల పాదరసము వీనిని సమభాగములుగ బర్రెపాలతో 7 దినములు దృఢముగనూరి లేపనముజేసిన ముఖమంగులు హరించి కాంతిగలుగు. మఱియు బర్రెపాలను జిలికి వెన్నదీసి ముఖమున మర్దనముజేసిన స్త్రీలకు ముఖమంగులు హరించి ముఖకాంతి గలుగు.

శ్లో॥ [ఆయుర్వేదే]గాత్రీహరిద్రామంజిష్ఠా ఘృతంగౌరాశ్చసర్షపాః। పేష్యం గైరికసంయుక్త మజాక్షీరేణసంయుతమ్ ।
ఏతేనైవభవేద్వక్త్ర ముదయాదిత్యసన్నిభమ్ ॥

తా. పచ్చిపసుపు మ్రానిపసుపు మంజిష్ఠి నెయ్యి తెల్లావాలు కావిరాయి వీనిని మేకపాలతోనూరి ముఖమునందు లేపనముజేసిన బాలసూర్యునివంటి కాంతిగలుగు.

శ్లో॥ శోకక్రోధాదికుపితా ద్వాతపిత్తాన్ముఖేతనుమ్ ।
శ్యామలంమండలంవ్యంగం ముఖాదన్యత్రనీలికా ।
వ్యంగనీలద్వయోః కుర్యా ద్వ్యథా స్విన్నంసిరావ్యధామ్ ।
లేప్యం క్షౌద్రేణ మంజిష్ఠా ముసలీ మూలమేవచా ।
ప్రసుప్తకుష్ఠరోగోక్తం కుర్యాద్ధూమంచ వహ్నినా ॥

తా. శోకము కోపము మొదలగు వానివలన వాతపిత్తములు ప్రకోపించి ముఖమునందు సూక్ష్మమైన నల్లనిమండలములకు మంగులను గలుగంజేసిన ముఖమంగనియు యితరస్థలముల గలుగం జేసిన నీలకమనియు జెప్పంబడు. వీని నివారణార్థంబై స్వేదమును సిరావ్యధను జేయుటయేగాక మంజిష్ఠినిగాని తాటినేల తేక

గడ్డలనుగాని తేనెతోనూరి ముఖమునందు లేపనము జేసిన మంగులు నల్లనిమండలములు హరించు. ఆముఖదూషికలయందు తివిరి గలిగియుండిన కుష్ఠురోగ చికిత్సలను ధూమపానమును జేయవలయు.

శ్లో॥ [మాధవనిదానే] మహిషీక్షీరసంఘృష్టం రజనీరక్తచందనమ్।
కృతోలేపో నిహంత్యాశు * శ్యామికాం గండయోస్థితామ్॥

తా. పచ్చిపసుపు రక్తచందనము వీనిని బర్రెపాలతోనూరి లేపనముజేసిన ముఖమునందు చెక్కిళ్ళయందు నుండు నల్లనిమండలములు శీఘ్రముగ హరించు.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] సోమవల్లీరజన్యాథ హ్యశ్వక్షీరస్య లేపనాత్॥
మనశ్శిలాతథాలోధ్రం ద్వినిశ సర్షపాస్సమమ్।
వారిపిష్టాహితోలేపో వదనే * శ్యామికాం హరేత్॥

తా. భావంచివిత్తులు పచ్చిపసుపు వీనిని గుఱ్ఱపుసాలతో నూరి లేపనము జేసిన ముఖమునందలి నల్లని మచ్చలు (మొటిమలు) హరించు. మఱియు మణిశిల లొద్దుగచెక్క పచ్చిపసుపు మ్రానిపసుపు తెల్లావాలు వీనిని సమభాగములుగ నుదకముతో నూరి లేపనముజేసిన ముఖమునందలి నల్లనిమచ్చలు హరించు.

శ్లో॥ విశాలోగ్రముశీరంచ సర్పిస్సర్జరసంపయః।
ఏతానివటపత్రాని రజన్యా సహ పేషత్।
లేపోయం ముఖపాదేచ పద్మవత్కురుతేఛృతమ్॥

తా. పాపర నల్లనియతివస వట్టివేరు నెయ్యి సర్జరసము మఱ్ఱిచిగుళ్ళు పసుపు మ్రానిపసుపు వీనిని మేకపాలలోనూరి లేపనముజేసిన ముఖము పాదములు పద్మమువలె నుండును (లోనికి గంధకకల్పమును సేవింపవలయు.)

శ్లో॥ త్రిమాసే క్షుద్రరోగేషు నాశయే న్నాత్రసంశయః॥

తా. గంధకకల్పమును 3 మాసములు సేవించిన క్షుద్రరోగములన్నియు నిస్సంశయముగ హరించు.

## పలిత లక్షణము

శ్లో॥ క్రోధశోక శ్రమకృత శ్శరీరోష్మా శిరోగతః। పిత్తంచ కేశా న్పచతి పలితం తేనజాయతే। హతికంవిషమంరూక్షం పీతం

* మాక్షికామ్.

పిత్తాత్సికకంఫాత్ । సర్వరూపా న్వితం విద్యా త్సన్నిపాత సమన్వితమ్ । రూక్షం శ్లక్ష్ణంచ సూక్ష్మంచ జరాపలిత ముచ్యత్ ॥

తా. క్రోధము శోకము శ్రమ అనువానివలన శరీరోష్మపిత్తములు శిరమునందు ప్రవేశించి వెంట్రుకలపండునటులంజేసిన పలితమనంబడు. అత్తెఱంగున నే వాతపిత్త కఫములు శిరమునందుజేరి పలితమును గలుగంజేయు. అందు వాతప్రాబల్యమున వెంట్రుకలు అర్ధభాగము నల్లగ అర్ధభాగము తెల్లగ రూక్షముగనగు, పిత్తప్రాబల్యము వలన పీతవర్ణముగనగు, కఫప్రాబల్యమువలన శ్వేతవర్ణముగనగు, సన్నిపాతమువలన పూర్వోక్త సర్వలక్షణయుక్తంబై యుండు మఱియు వెంట్రుకలు రూక్షముగ నున్నగ సూక్ష్మముగ నుండిన జరాపలిత మనియెదరు.

## వలీపలితరోగ నిదానములు.

శ్లో॥ వలీపలితరోగాశ్చ వాతకోపాది సంచయాత్ ।
భైషజ్యం మునిభిశ్శాస్త్రం చంద్రోదయ ముదీరితమ్ ॥

తా. వాతాదిదోషములు ప్రకోపించి * వలీ † పలితములన 2 రోగముల గలుగంజేయు. వీనియందు చంద్రోదయము శ్రేష్ఠంబని మునులువచించిరి.

## హేమాద్రి రసము.

శ్లో॥ రసనిష్కం కాంతనిష్కం గంధకంచ ద్వినిష్కకమ్ ।
త్రిఫలాచ త్రినిష్కాస్స్యాస్సర్దితం కజ్జలీకృతమ్ ।
చూర్ణితం శాణమాత్రంతు సితా యుక్తంతు సేవితమ్ ।
సర్వరోగవినాశాయ వలీ పలితనాశనమ్ ॥

తా. శుద్ధిజేసిన రసము 1 నిష్కము కాంతభస్మము 1 నిష్కము శుద్ధిచేసిన గంధకము 2 నిష్కములు త్రిఫలములు 3 నిష్కములు యిట్లు వీనినెల్ల నేకము జేసి ఖల్వములోనునిచి కాటుకవలె మర్దించి 5 చిన్నములమొత్తును పంచదార యను పానముతోడ సేవించిన సర్వరోగములు వలీపలితములు హరించు.

(అయస్కాంతమును నేరేడుచెక్కరసముతో మర్దించి పుటంబులిడి పిదప గుంటగలగరాకురసములోను త్రిఫలరసముతోను మర్దించి పుటంబులిడి వెలిగారము తో మరల మర్దించి పుటంబిడి సేవించిన వలీపలితములు హరించు.

* వలీయన —శరీరము ముడతలు బడుట. † పలిత మన—వెంట్రుకలు నరయుట

## ముండీ తైలము.

శ్లో॥ [ఆయుర్వేదే] ముండీచూర్ణందశపలం పచేత్తోయేచతుర్గుణే।
అర్ధశేషం హరేత్తాన్క్వథం క్వాథార్ధం తిలతైలకమ్ ।
తైలశేషం పచేత్తేన నస్యం పానంచ కారయేత్ ।
పలితం యౌవనస్త్రీణాం మాసార్ధంచ నతిష్ఠతి ॥

తా. 10 పలములు బోడతరపుచూర్ణములో 40 పలముల నీళ్ళుగలిపి యర్ధభాగము శేషించునటుల కషాయముకాచి దాని కర్ధభాగము నూనెగలిపి చిక్కగ కాచి వడియగట్టికొని నస్యపానములు జేయించిన యౌవనస్త్రీలు వలీపలితములు 15 దినములలో హరించు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] శ్యామానింబ బలాలాజా లవణం క్వాథరోత్సమమ్ । తోయైె రష్టగుణై రేవ పాద శేషం సమాహరేత్ । తిలతైలం క్వాథపాదం తైలార్ధంమాహిషంఘృతమ్। స్నేహ శేషం పచేత్తేన నస్యేమాషం ప్రయోజయేత్ । బాలానాం వృద్ధనారీణాం యౌవనం కురుతేధ్రువమ్॥

తా. ప్రేంకణము వేము ముత్తవపులగము పేలాలుపుప్పు వీనిని సమభాగములుగ గ్రహించి 8 దింత లుదకముబోసి 4 వ భాగముగ కషాయముకాచి వడియగట్టి దానికి 4 వభాగము నూనె నూనె కర్ధభాగము బఱ్ఱెనెయ్యి గలిపి చిక్కగ తైలము కాచి వడియగట్టి మాషప్రమాణమును నస్యము జేయించిన యౌవనస్త్రీలు వృద్ధులు వీరి వలీపలితములు శీఘ్రముగ హరించు.

## నింబాది చూర్ణము.

శ్లో॥ కృష్ణనింబస్య పంచాంగం త్రిఫలాచ కటుత్రయమ్ । కాలాతిలా తథాక్రాంత వాకుచీ కృష్ణజీరకమ్ । నింబేస సమభాగంస్యా దౌషధం దశకంతథా । బిడాల పదమాత్రంతు భక్షయే త్ప్రాతరుత్థితః । రసాయన మిదంశ్రేష్ఠం మహా వింశతినాశనమ్ । అష్టాదశచ కుష్ఠాని కాసశ్వాస క్షయాని చ । కాయాగ్నే ర్వర్థనంచైవ వలీపలితనాశనమ్ ॥

తా. త్రిఫలములు త్రికటుకములు నల్లతెగడ నువ్వులు విష్ణుక్రాంతము భాషంచివిత్తులు నల్లజీలకఱ్ఱ దశమూలములు వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముజేసిదానికి సమముగ పెద్దవేము పంచాంగముల చూర్ణమునుకలిపిబిడాలపదక ప్రమాణమును ప్రాతఃకాలమునసేవించిన 20 మేహములు 18 కుష్టువులుకాసశ్వాసములు క్షయములు వలీపలితములు హరించి శరీరవృద్ధి అగ్నిదీపనము గలుగు.

వలీపలిత చికిత్స.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] కంటకారీ ఫలరసై స్తుల్యం తైలం విపాచయేత్ ।జపాపుష్ప ద్రవైః క్వాథం తల్లేపః పలితంహరేత్॥

తా. నేలములకపండ్లరసమునకు సమముగ నూనెగలిపి కాచి లేపనము జేసిననులేక దాసానిపువ్వులరసమును నుడికించి లేపనముచేసినను పలితములుహరించు.

శ్లో॥ [మాధవనిదానే] ద్వివిశే నవనితేన లేపాత్పలితకండునుత్ ।
నీలోత్పలంతిలాయష్టి సర్షపా నాగకేసరమ్ ।
ధాత్రీఫలం సమంపిష్ట్వా లేపాత్పలితనాశనమ్ ॥

తా. పసుపు మ్రానిపసుపు వీనిని వెన్నతోనూరి లేపనముజేసిన పలితము దురద హరించు. మఱియు నల్లకలువదుంపలు నువ్వులు యష్టిమధునిము తెల్లావాలు నాగకేసరములు వీనిని సమభాగములుగ గ్రహించి వుసిరికపండ్లరసముతో నూరి లేపనము జేసినపలితము హరించు.

శ్లో॥ [మాధవనిదానే] కార్పాసబీజమజ్జాంతు రవిక్షీరేణపేష ! యేత్ । తస్యలేపో నిహంత్యాశు పలితాంతు నసంశయః॥

తా. ప్రత్తివిత్తులలోని పలుకులను జిల్లేడుపాలతో నూరి లేపనము జేసిన పలితములు శీఘ్రముగ హరించు.

ఇంద్రలుప్తరోగ నిదానము.

శ్లో॥ క్రిమిభ్యః కేశనాశశ్చ తస్యానామేంద్రలుప్తకమ్ ।
తిద్భావశ్చ సువిజ్ఞేయో హైషజ్యేతు జయంతికా ॥

తా. క్రిములవలన వెంట్రుకలూడిన యింద్రలుప్తమనంబడు. దీనియందు తక్కాలి యాకురసమును త్రాగుటయేగాక వెంట్రుకలూడినస్థలమున యారసమును బూసిన వెంట్రుకలు వృద్ధియగు.

## ఇంద్రలుప్త లక్షణము.

శ్లో॥ రోమకూపానుగం పిత్తం వాతేనసహమూర్ఛితమ్ ।
ప్రచ్యావయతి రోమాణి తతశ్శ్లేష్మాసశోణితః ।
రుణద్ధిరోమకూపాంస్తు తతో న్యేషా మసంభవః ।
త దింద్రలుప్తం విజ్ఞేయం ఖాలిత్య మితి చాపరే ।

తా. పిత్తము వాతముతోఁగలిసి కుపితమై రోమకూపములయందు జేరుటవలన వెంట్రుకలూడును. కఫరక్తములు రోమకూపముల బంధించుటవలన మరల వెంట్రుకలు జనింపకుండును. అది యింద్రలుప్తము ఖాలిత్యము యనంబడు.

## చికిత్సలు.

శ్లో॥ త్రిఫలాం చోత్పలంకందం యష్టికాం భృంగజంరసమ్ ।
రసార్ధం తిలతైలంస్యా త్సక్వాతైలావశేషకమ్ ॥
తల్లేపా త్కేశవృద్ధిస్స్యా త్పునః పంచవిశేషతః ।
అమలక్యామూలచూర్ణం పిష్ట్వావట జటాంతువా ।
మర్దయిత్వా రసైర్లేప స్తూర్ణం కేశవివర్ధనమ్ ॥

తా. త్రిఫలములు నల్లకలువగడ్డలు యష్టిమధుకము వీనిని సమభాగములుగ చూర్ణము చేసి గుంటగలగరాకు రసముతోనూరి కల్కముజేసి అందు గుంటగలగరాకు రసము దానికర్ధభాగము నువ్వులనూనె గలిపి చిక్కగ తైలముకాచి 5 మార్లు తలయంటికొనిన వెంట్రుకలు వృద్ధియగు మఱియు వుసిరికవేరు మఱ్ఱియూడలు జటామాంసి వీనిని నూరి రసము పిండికొని తలయంటికొనిన కేశములు వృద్ధిం జెందు.

శ్లో॥ మహిషీ నవనీతేన ప్రత్యేకంచ ప్రలేపయేత్ ।
భృంగరాజ రసంతుల్యం పాచ్యం తైలావశేషకమ్ ॥

తా. బఱ్ఱెవెన్నను తలయంటికొనిన కేశములు వృద్ధిజెందు. లేక, గుంటగలగరాకురసములో నూనెగలిపి చిక్కగకాచి తలయంటికొనిన వెంట్రుకలు బాగుగ పెరుగును.

శ్లో॥ హస్తిదంతీ పలం ధాత్ర్యా తిలతైలేన పాచయేత్ ।
తేన భృంగీ సమాః కేశా స్థిరా శ్చాపి భవంతిచ ॥

తా. బలురక్కసిగడ్డ నేలసంపెంగవిత్తులు వసిరికపప్పు వీనిని నూరి కల్కముజేసి అందు నువ్వులనూనె గలిపి చిక్కగకాచి తలయంటుకొనిన వెంట్రుకలు తుమ్మెదల వలె నల్లనై మృదువుగ స్థిరముగనుండు.

శ్లో॥ కృష్ణగోమూత్రసంపిష్ట జపాపుష్పప్రలేపనమ్ ।
బహుకేశాన్వితం సాంద్ర మింద్రలుప్తం ప్రజాయతే ॥

తా. కరియావుమూత్రముతో దాసానిపువ్వులనూరి వెంట్రుకలూడిన స్థలమున లేపనముజేసిన యింద్రలుప్తమునందుకూడ దట్టముగ వెంట్రుకలు మొలచును.

శ్లో॥ [చరకే] ఇంద్రలుప్తేచేద్రయవై శ్శిరసశ్చవిలేపనాత్ । ఘృష్టేవన్ధ్యయవకాసీసం మనోహ్వాతుత్థకోమన్త్రైః । హన్యాద్దారురసైర్వాపిగుంజామూలఫలైస్తథా । తథాలాంగలికామూలైఃకరవీరరసేనవా । సక్షౌద్రక్షుద్రవార్తాకస్వరసేనవిచక్షణః ధుత్తూరకస్యపత్రాణి భల్లాతకరసేనవా । అథవామాక్షికం హంతితిలపుష్పార్ద్రకర్ణికైః । తైలక్షోహస్తిదంతస్య మషికా చౌషధంపరమ్ । కృష్ణగోమూత్రసంపిష్ట్యజపాపుష్పప్రలేపనమ్ । బహుకేశాన్వితంచిత్ర మింద్రలుప్తం ప్రజాయతే ॥

తా. కొడిసెపాలస్నుష్ణోదకముతో నూరి శిరమున లేపనముజేసినను లేక కొడిసెపాల అన్నభేది మణిశిలమైలుతుత్తము పిప్పలి వీనిని దేవదారురసముతో నూరిగాని లేక పెద్దగురిజవేరు దానివిత్తులు చెన్నచర్లగడ్డ వీనిని గన్నేరువేరురసముతో నూరి నేలములకరసములో తేనెనుగలిపిగాని లేక వుమ్మెత్తాకుచు జీడివిత్తులరసముతో నూరిగాని లేక నువ్వులపువ్వు అల్లము గంటెన వీనిని తేనెతో నూరిగాని యేనుగుదంతపు మసిని నూనెలో గలిపిగాని లేక (యేనుగుకొమ్ము సబావ పిప్పలి కరియావుపంచితము యేరుజాజిపువ్వు వీనినినూరిగాని) లేక దాసానిపువ్వులను కరియావుపంచితముతో నూరిగాని లేపనముజేసిన యింద్రలుప్తమునందు సగామిక్కుటముగ వెంట్రుకలు మొలచును.

భృంగరాజ తైలము.

శ్లో॥ [మాధవనిదానే] నీలీమూలనకషాయేతు బీజంఖదిరసారజమ్
నీలీమూలాంజవంకల్కం యష్టీమధుకమేవచ ।

మార్కవస్వరసప్రస్థం తైలప్రస్థంవిపాచయేత్ ।
అనేనలిప్తాః కేశాస్యుః మృదవః షట్పదైస్సమాః ।
ఇంద్రలుప్తహరం చైవ పాలిత్యంచైవ నాశయేత్ ।
తైలం రహస్యం పరమం వలీపలితనాశనమ్ ॥

తా. నీలివేళ్ళనునంచి కషాయము కాచి యందు చంద్రవిత్తుల చూర్ణమును నీలివేళ్ళు నల్లతుముకి యష్టిమధుకము అనువానికల్కమును 1 ప్రస్థము గుంటగలగరాకురసమును 1 ప్రస్థము నూనెనుగలిపి తైలపక్వముగ కాచి వెంట్రుకలకు లేపనము జేసిన యింద్రలుప్తము వలీపలితములు హరించి వెండ్రుకలు తుమ్మెదలవలె నల్లనై మృదువుగనుండు.

శ్లో॥ [పూజ్యపాదీయే] బృహతీఫలసంయుక్తం గుంజామూలఫలం తథా । తల్లేపే నశ్యతిక్షిప్ర మింద్రలుప్తమనేకధా ॥

తా. ములకపండ్లు గురిగింజవేరు గురిగింజలు వీనినినూరి లేపనము జేసిన పలువిధములైన యింద్రలుప్తములు శీఘ్రముగ హరించు.

## పద్మినీకంటక లక్షణము.

శ్లో॥ కంటకైరాచితంవృత్తం మండలంపాండుకండురమ్ ।
పద్మినీకంటక ప్రఖ్యైస్తదాఖ్యంకఫవాతజమ్ ॥

తా. దామరముండ్లవలె గుండ్రముగ పాండురవర్ణముగ దురదతో గూడినదిగనుండుమండలములుజనించిన పద్మినీకంటకమనంబడు. ఇదికఫవాతమువలన జనించు.

## చికిత్స.

శ్లో॥ పద్మినీకంటకేరోగే ఛర్దయే న్నింబవారిణా ।
తేనైవ సిద్ధంసక్షౌద్రం సర్పిః పాతుం ప్రదాపయేత్ ।
నింబారగ్వధకల్కైర్వా ముహురుద్వర్తనం హితమ్ ॥

తా. పద్మినీకంటకమున వేపకషాయముతో వమనము జేయించవలయు. మఱియు వేపకషాయములో నెయ్యిగలిపి కాచి తేనెవేసి సేవింపవలయు. మఱియు వేపరేలగుజ్జు అనువాని కల్కమును పలుమారు లేపనము జేయవలయు.

## నింబాది ఘృతము.

శ్లో॥ చతుర్గుణేన నింబోత్థ పత్రక్వాథేనగోఘృతమ్ ।
పచేత్తతస్తునింబస్య కృతమాలస్యపత్రజైః ।
కల్కైర్యాయాఃపచేత్సిద్ధం తత్పి బేత్పలసమ్మితమ్ ।
పద్మినీకంటకాదోగా న్మక్తో భవతి నాన్యథా ॥

తా. వేపాకు కషాయములో 4 వ భాగము ఆవునెయ్యికలిపి అందు వేప రేల అనువాని యాకుల కల్కమునుగలిపి ఘృతపక్వముగ కాచి అందు 1 పలమును త్రాగిన పద్మినీకంటకము హరించు.

## జంతుమణి లక్షణము.

శ్లో॥ సమముత్పన్నమరుజం మండలం కఫరక్తజమ్ ।
సహజం లక్ష్మచైకేషాం లక్ష్యోజంతుమణిః స్మృతః ॥

తా. కఫరక్తమువలన జనించినది మొదలు సమముగ వుబ్బుగ వేదనారహిత ముగనుండు మండలము శరీరమున జనించిన కొందరు లక్ష్మయనియు మఱికొందరు లక్ష్యమనియు వేఱుకొందరు జంతుమణి యనియు వచించెదరు (ఇది స్త్రీపురుషులకు జనించునట్టి స్థానవిశేషములవలన శుభాశుభఫలముల గలుగంజేయు.)

## మాష లక్షణము।

శ్లో॥ అవేదనం స్థిరంచైవ యస్మిన్గాత్రే ప్రదృశ్యతే ।
మాషవత్కృష్ణ ముత్పన్న మనిలా న్మాషమాదిశేత్ ॥

తా. వాతమువలన శరీరముపై వేదనారహితముగ కఠినముగ నల్లగ వొకింత నుబ్బుగ నుండుగంటు జనించి మినపగింజవలె నుండిన మాష మనంబడు. (మాష మన-పులిపిరికాయ.)

## తిలకాలక లక్షణము.

శ్లో॥ కృష్ణాని తిలమాత్రాణి నీరుజాని సమానిచ ।
వాతపిత్తకఫోద్రేకా త్తాన్విద్యాత్తిలకాలకాన్ ।

తా. వాతపిత్త కఫప్రకోపమువలన మచ్చజనించి నల్లగనువ్వుగింజంత ప్రమాణముగిలక్షై నొప్పిలేనిదిగ చర్మమునకు సమానముగ నుండిన తిలకాలక మనంబడు.

### జంతుమణి మాష తిలకాలక చ్ఛికిత్స.

శ్లో॥ చర్మకీలం జంతుమణిం మాషకా న్తిలకాలకాన్ ।
ఉత్కృత్య శస్త్రేణ దహే త్క్షారాగ్నిభ్యామశేషతః ॥

తా. చర్మకీలకము జంతుమణిమాషము తిలకాలకము వీనిని శస్త్రముతో ఛేదించి క్షారాగ్నికర్మల జేయవలయు.

### న్యచ్ఛలక్షణము.

శ్లో॥ మహద్వా యదివాత్యల్పం శ్యావంవా యదివాసితమ్ ।
నీరుజం మండలంగాత్రే న్యచ్ఛమిత్యభిధీయతే ॥

తా. శరీరముపై పెద్దదిగగాని చిన్నదిగగాని లేకనల్లదిగగానిలేక తెల్లదిగగాని వేదనారహితముగ గానియుండుమచ్ఛజనించిముఖనిహీనంబైయుండినన్యచ్ఛమనంబడు

### మంజిష్ఠాది తైలము.

శ్లో॥ మంజిష్ఠా మధుకం లాక్షా మాతులుంగశ్చ యష్టికా । కర్ష
ప్రమాణై రేతైస్తు తైలస్యకుడవంతథా । ఆజంపయస్తద్విగు
ణంశనైర్మృద్వగ్నిపాచేత్ । నీలికాపటికావ్యంగా నభ్యం
గాదేవనాశయేత్ । ముఖంప్రసాతోపచితం వలీపలితవర్జితమ్।
సప్తరాత్రప్రయోగేణ భవేత్కనకసన్నిభమ్ ॥

తా. మంజిష్టి యిప్ప లక్క మాదీఫలము అతిమధురము యివి దినుసుకు కర్షప్రమాణము నూనె 1 కుడవము మేకపాలు 2 కుడవములు యిటులవీనినెల్ల నేకముజేసి మందాగ్నిలో పాకముజేసి 7 దినములు అభ్యంజనముజేసిన నీలిక మొటిమలు మంగువలీ పలితములు వీనిని హరింపం జేయుటయేగాక ముఖము స్వచ్ఛముగ వెంట్రుకలు నల్లగ ముఖము స్వర్ణకాంతి గలదిగ నగు.

### వ్యంగ లక్షణము.

శ్లో॥ క్రోధాయాసప్రకుపితో వాయుఃపిత్తేనసంయుతః ।
ముఖమాగమ్యసహసా మండలంవిసృజత్యతః ।
నీరుజంతనుకంశ్యావం ముఖేవ్యంగంతమాదిశేత్ ॥

తా. కోపము శ్రమ అనువానివలన ప్రకోపించిన వాతపిత్తములో కలిసి ముఖముపై వేదనారహితముగ పలచగ శ్యామలవర్ణముగ నుండు మండలముల గలుగం జేసిన వ్యంగము (మంగు) యనంబడు.

## చికిత్స.

శ్లో॥ త్రిభువనవిజయాపత్రం మూలం స్థవిరస్య శింశుపాద్యైభిః ।
ఉద్వర్తనం విరచితం న్యచ్ఛవ్యంగాపహం సిద్ధమ్॥

తా. గంజాయియాకు దేవదారు యిరుగుడువేరు వీనినినూరి ముఖమునందు లేపనముజేసిన మచ్చలు వ్యంగము హరించు.

## వటాంకురాది లేపము

శ్లో॥ వటాంకురామసూరాశ్చ ప్రలేపాద్వ్యంగనాశనమ్ ।
వ్యంగేమంజిష్ఠయా లేపః ప్రశస్తో మధుయుక్తయా ॥

తా. మఱ్ఱిచిగుళ్ళు చిరుసెనగలు అనువానినిగాని మంజిష్ఠినిగాని తేనెతోనూరి లేపనముజేసిన వ్యంగము హరించు.

## వటపత్రాది లేపము.

శ్లో॥ వటస్య పాండుపత్రాణి మాలతీ రక్తచందనమ్ ।
కుష్ఠం కాలీయకంలోధ్రమేభిర్లేపం ప్రయోజయేత్ ।
యువానపిటికానాంతు వ్యంగానాంచ వినాశకః ॥

తా. పండి తెలుపుబారిన మఱ్ఱియాకులు జాజిచిగుళ్ళు రక్తచందనముచెంగల్వకోష్టు మాన్నిపసుపు లొద్దుగచెక్క అనువానికల్కమును లేపనముజేసిన మొటిమలు మంగు హరించు.

## నీలిక లక్షణము.

శ్లో॥ కృష్ణమేవం గుణం గాత్రే ముఖేవా నీలికాం విదుః ॥

తా. పైజెప్పబడినప్రకారము నల్లనిమండలములు శరీరముపైగాని ముఖముపైగాని కలిగిన నీలిక మనంబడు.

## కుంకుమాది తైలము.

శ్లో॥ కుంకుమంచందనంలోధ్రం పతంగంరక్తచందనమ్ । కాలీయక ముశీరంచ మంజిష్ఠా మధుయష్టికా । పత్రకంపద్మకం పద్మం కుష్ఠంగోరోచనంనిశా। లాక్షాదారుహరిద్రాచ గైరికంనాగ కేసరమ్ । పాలాశకుసుమంచాపి ప్రియంగుశ్చవటాంకురాః । మాలతీచమధూచ్ఛిష్టంసర్ష పాస్సురభిర్వచా।చతుర్గుణపయః పిష్టై రేతైరక్షమితైఃపృథక్ । పచేన్మందాగ్నినావైద్య స్తైల ప్రస్థద్వయోన్మితమ్ । వదనాభ్యంజనాదేత ద్వ్యంగం నీలి కయాసహ। తిలకం మాషకం త్వచ్ఛం నాశయే న్ముఖదూషి కమ్ । పద్మినీ కంటకంవాపి హరేజ్జంతు మణింతథా । విద ధ్యా ద్వదనంపూర్ణ చంద్రమండల సుందరమ్ ॥

తా. కుంకుమ కేసరములు చందనము లొద్దుగచెక్క రసకర్పూరము రక్త చందనము మ్రానిపసపు వట్టివేరు మంజిష్టి అతిమధురము లవంగపత్రి పద్మకాష్ఠము తామర చెంగల్వకోష్టు గోరోచనము పసుపు లక్క మ్రానిపసుపు కావితాయి నాగకేసరములు మోదుగపువ్వులు ప్రేంకణము మఱ్ఱిచిగుళ్ళు జాజి మైనము తెల్లావాలు తులసి వస వీనిని దినుసుకొక్కొక అక్షప్రమాణముగ గ్రహించినూరి 4 గింజలు పాలుబోసి కషాయముకాచి యందు 2 ప్రస్థములు నూనెగలిపి మందాగ్నితో పక్వముజేసి ముఖమునందు లేపనముజేయుచుండిన వ్యంగము నీలిక తిలకాలము మాషము వ్యచ్ఛము మొటిమలు పద్మినీకంటకము జంతుమణి వీనిని హరింపంజేసి ముఖమునందు చంద్రునివంటి కాంతిని గలుగంజేయు.

## పరివర్తక లక్షణము.

శ్లో॥ మర్దనా త్పీడనాద్వాపి తథైవా స్యభిఘాతతః । మేఢ్రచర్మ యదావాయుర్భజతేసర్వతశ్చరః । తదావాతోపసృష్టత్వా త్తచ్చర్మపరివర్తతే । మణేరధస్తా త్కోశస్తు గ్రంధిరూపేణ లంబతే । సవేదనం సదాహంచపాకంచ ప్రజతిక్వచిత్ । పరి

వర్తికేతితాం విద్యాత్సరుజాం వాతసంభవామ్। సకండూః
కఠినావాపి సైవ శ్లేష్మసముత్థితా ॥

తా. మేఢ్రమును రుద్దుటచేగాని లేక బిసుకుటచేగాని అభిఘాతమువలనగాని వ్యానవాయువు ప్రకోపించి చర్మమునందుజేరి చర్మమును వెనుకకు నీడ్చుటచే మేఢ్రకోశమువాచి మణిక్రిందగంటువలెనై వ్రేలాడుచు పోట్లు మంటలతోగూడి యొకానొకపుడు పండిన పరివర్తక మనంబడు ఇది వాతమువలన జనించిన పోట్లు గలుగు. కఫమువలన జనించియుండిన దురద కాఠిన్యము గలుగు.

సామాన్యోపచారము.

శ్లో॥ పరివర్తే ఘృతాభ్యక్తాం సుస్విన్నా ముపనాహయేత్ ।
త్రిరాత్రః పంచరాత్రంవా వాతఘ్నైశ్శాల్మలాదిభిః ।
తతోభ్యజ్య శనైశ్చర్మ వేశయేత్పీడయేన్మణిమ్ ।
ప్రవిష్టే చర్మణమణౌ క్లేదయేదుపనాహయేత్ ।
దద్యాద్వాతహరాంవస్తిం స్నిగ్ధాన్యన్నానిభోజయేత్॥

తా. పరివర్తకమునందు మేఢ్రమునకు ఘృతము బూసి చెమటందీసి వాతహరమైన శాల్మలాదులచే 3 దినములుగాని లేక 5 దినములుగాని కట్టుగట్టి పిదప ఘృతమునుబూసి మేఢ్రమణిని చర్మములో మెల్లమెల్లగ ప్రవేశింపంజేసి పిదప వాతహరములగు ద్రవ్యములచే కట్టుగట్టి వాతహరములగు ద్రవ్యములచే సిద్ధముజేయబడిన ఘృతాదులచేవస్తికర్మంజేసి స్నిగ్ధకరమైన యన్నము భుజింపంజేయవలయు.

అవపాటిక లక్షణము.

శ్లో॥ అల్పీయసీం యదాహర్షా ద్బాలాం గచ్ఛేత్స్త్రియంనరః ।
హస్తాభిఘాతా దథవా చర్మణ్యుద్వర్తితే బలాత్ ।
మర్దనా త్పీడనా ద్వాపి శుక్రవేగ విఘాతతః ।
యస్యావపాట్యతే చర్మ తాం విద్యా దవపాటికామ్ ॥

తా. సూక్ష్మమైన యోనిఛిద్రముగల స్త్రీతో బలాత్కారముగ రతికేళిం జేలుటచేనేని లేక చేతిదెబ్బచేనేని బలాత్కారమువలన మేఢ్రచర్మము వ్యత్యస్తంబగుటచేనేని పిసుకుటచేనేని అదురుటచేనేని శుక్రవేగము నడ్డగించుటచేనేని మేఢ్రచర్మము భిన్నంబై పీడను గలుగంజేసిన అవపాటిక మనంబడు.

## చికిత్స.

శ్లో॥ స్నేహ స్వేదైరిమాంవైద్య శ్చికిత్సే దవపాటికామ్ ॥

తా. అవపాటికయందు స్నేహస్వేదోపచారముల సేయవలయు.

## నిరుద్ధ ప్రకస లక్షణము.

శ్లో॥ వాతోపసృష్టే మేఢ్రేతు చర్మసంశ్రయతే మణిమ్ । మణి
శ్చర్మో తనద్ధస్తు మూత్రస్రోతో రుణద్ధిచ। నిరుద్ధ ప్రకసేతస్మి
న్మందధారమ వేదనమ్ । మూత్రం ప్రవర్తతేజంతో ర్మణిర్వి
ప్రీయతేనచ । నిరుద్ధప్రకసంవిద్యా త్సరుజం వాతసంభవమ్ ॥

తా. వాతసంబంధమువలన మేఢ్రపీడగలవాడైయుండ చర్మము వాని మేఢ్ర శిని మూసికొనుటవలన మూత్రమార్గము నడ్డగింపంబడి పోట్లు మంటలు లేక నే దుబింగువులుగ మూత్రము వెడలిననిరుద్ధప్రకసమనంబడు. ఇదివాతమువలనజనించు

## చికిత్స.

శ్లో॥ నిరుద్ధ ప్రకసేనాడీం లోహీ ముభయతో ముఖీమ్ ।
దార్వీంచ వాజతుకృతాం ఘృతాక్తాంసం ప్రవేశయేత్ ।
పరిషించే ద్వసాంమజ్జాం శింశుమార వరాహయోః ।
చుక్రతైలం తథాయోజ్యం వాతఘ్నద్రవ్యసంయుతమ్ ।
అహఃత్ర్యాలతరాం సమ్యగ్నాడీంగర్భే ప్రవేశయేత్ ।
భిత్వావా సేవనీంముక్త్వా సద్యఃక్షత వదాచరేత్ ॥

తా. నిరుద్ధప్రకసమునందు యినుము వెదురు లక్క అనువానిలో దేనిచే నేని కళలాకను 2 ముఖములుగలదిగ జేయించి నెయ్యిబూసి లోన బ్రవేశింపజేయు క దానినోరునుచెరచి మొసలిపంది అనువానియొక్క క్రొవ్వును మజ్జనువాతహర వ్యయుక్తముగ జేయబడిన చుక్రతైలమునుబోసి తదనంతరము సేవనియను నాడిని లి మిక్కుటముగ స్థూలించియుండు వాడిని ఛేదించి గర్భములో బాగుగ బ్రవే పంజేసి సద్యఃక్షతోపచారములం జేయవలయు.

## సన్నిరుద్ధ గుద లక్షణము.

శ్లో॥ వేగసంధారణా ద్వాయు ర్విహితో గుదసంశ్రితః ।
నిరుణద్ధి మహాస్రోత స్సూక్ష్మద్వారం కరోతిచ ।
మార్గస్య సౌక్ష్మ్యా త్కృచ్ఛ్రేణ పురీషం తస్య గచ్ఛతి ।
సన్నిరుద్ధ గుదంవ్యాధి మేనంవిద్యా త్సుదారుణమ్ ॥

తా. మలమూత్రాదివేగము సహించుటచే గుదాశ్రితవాతము ప్రకోపించి గుదము నడ్డగించి గుదద్వారమును సన్నముగ జేయు దానివలన మలము కడుకష్టముమీద వెడలు ఇదియ సన్నిరుద్ధగుద మనంబడు. ఇది కడుభయంకర మైనది.

## చికిత్స.

శ్లో॥ సన్నిరుద్ధ గుదే తైలై స్సేకోవాత హరైర్హితః ।
తథానిరుద్ధ ప్రకసే క్రియాపి కథితా హితా ॥

తా. సన్నిరుద్ధగుదమునంగు వాతనాశకర తైలసేచనము నిరుద్ధప్రకసమునందు జెప్పంబడిన సర్వక్రియలను జేయవలయు.

## అహిపూతన లక్షణము.

శ్లో॥ శకృన్మూత్ర సమాయుక్తే ధౌతే పానే శిశోర్భవేత్ ।
స్విన్నేవా స్నానమానేవా కండూరక్త కఫోద్భవా ।
తతః కండూయనాత్క్షిప్రం స్ఫోటాః స్రావశ్చ జాయతే ।
ఏకీభూతం వ్రణం ఘోరం తం విద్యా దహిపూతనమ్ ॥

తా. శిశువు మలమూత్రోత్సర్జనమును జేసినపిదప గుదమును కడుగకుండుటచే నేని చెమటను దుడువకుండుటచే నేని స్నానముజేయించిన పిదప దుడువకుండుటచే నేని రక్తకఫములు ప్రకోపించి దురదనుగలుగంజేయు. పిదప గోగుటచే శీఘ్రముగ కురుపులుజనించి స్రావమునుజేయుంచుటచే వొకటితోనొకటిజేరి విస్తరించు. ఇదియ అహిపూత మనంబడు. (ఈభయంకరమైన రోగము తరుచుగ శిశువులకే జనించు.)

## శంఖాది లేపము.

శ్లో॥ శంఖ సౌవీర యష్ట్యాహ్వై ర్లేపః కార్యో హిపూతనే ॥

తా. శంఖము సురమరాయి అతిమధురము వీనినినూరి లేపనము జేసిన అహిపూతనము హరించు.

పటోలాది ఘృతము.

శ్లో॥ పటోల పత్రత్రిఫలా రసాంజన విపాచితమ్ ।
పీతం ఘృతం నాశయతి కృచ్ఛ్రమప్యహిపూతనమ్ ॥

తా. చేతిపొట్లాకు త్రిఫలములు రసాంజనము అనువానికల్కములో ఘృతముగలిపి కాచి పానము జేసిన కష్టసాధ్యమైన అహిపూతనము హరించు.

వృషణకచ్ఛ లక్షణము.

శ్లో॥ స్నానోత్సాదన హీనస్యమలో వృషణసంస్థితః ।
యదా ప్రక్లిద్యతే స్వేదా త్కండూ స్సంజాయతే తదా ।
కండూయనా త్తతః క్షిప్రం స్ఫోటా స్స్రావశ్చ జాయతే ।
ప్రాహు ర్వృషణకచ్ఛూంతాం శ్లేష్మరక్తప్రకోపజాత్ ॥

తా. స్నానము జేయునపుడు వృషణమలమును బాగుగ గడిగికొనకుండుట వలన వృషణములయందు మలము జేరి చెమటవలన తేమగలదై మిక్కుటముగ దురదను గలుగంజేయు. దానిని గోకినతక్షణముననే పొక్కులు జనించి స్రావముగలుగు. ఇదియ వృషణకచ్ఛ మనంబడు. ఇది కఫరక్తమువలన జనించు.

సర్జాది లేపము.

శ్లో॥ సర్జాంబుకుష్ఠసైంధవసిద్ధార్థైః ప్రకల్పితో యోగః ।
ఉద్వర్తనేన నియతం శమయతి వృషణకండూతిమ్ ॥

తా. సర్జరసము వట్టివేరు చెంగల్వకోష్టు సైంధవలవణము తెల్లావాలు వీనిని యెల్లపుడు బూయుచుండిన వృషణములయందలి దురద హరించు.

కాసీసాది లేపము.

శ్లో॥ కాసీస రోచనా తుత్థ హరితాళ రసాంజనైః ।
అమ్లపిష్టైః ప్రలేపోఽయం ముష్కకండ్వహిపూతనే ॥

తా. అన్నభేది గోరోచనము మైలుతుత్తము హరిదళము రసాంజనము వీని నిమ్మపండ్లరసముతోనూరి లేపనముజేసిన అండవృద్ధి దురద అహిపూతనము హరించు

సూకరదంష్ట్రి లక్షణము.

శ్లో॥ సదాహో రక్తపర్యంత స్త్వక్పాకీ తీవ్రవేదనః ।
కండూనూన్జ్వరకారీచ సస్స్యాత్సూకరదంష్ట్రికః ॥

తా. చర్మము దాహయుక్తంబై యెఱ్ఱనైపండి తీవ్రవేదన దురద వాపు లేక వ్రణముగలదై జ్వరయుక్తంబుగ నుండిన సూకరదంష్ట్రి మనంబడు.

రాజీవాది కల్కము.

శ్లో॥ రాజీవమూలకల్కః పీతో గవ్యేన సర్పిషా ప్రాతః ।
శమయతి సూకరదంష్ట్రోద్భూతం జ్వరం ఘోరమ్ ॥

తా. ఎఱ్ఱదామరగడ్డలకల్కములో ఆవునెయ్యి గలపి ప్రాతఃకాలమున నెల్లపుడు సేవింపుచుండిన సూకరదంష్ట్రివలనగలిగిన భయంకరమైనజ్వరము హరించు.

రజన్యాది లేపము.

శ్లో॥ రజనీం మార్కవం మూలం పిష్టం శీతేనవారిణా ।
తల్లేపా ద్ధంతి విసర్పం వారాహ దశనాహ్వాయమ్ ॥

తా. పసుపుగుంటగలగర వేరు వీనిని శీతోదకముతోనూరి లేపనముజేసిన విసర్పము వరాహదంష్ట్రిము హరించు.

స్వరభంగ నిదానము.

శ్లో॥ వాతపిత్తే గళే జాతే స్వరభంగః ప్రజాయతే ।
ఏతదుక్తంతు పూర్వేణ వామదేవేన మానినా ॥

తా. వాతపిత్తములు ప్రకోపించి కంఠమును జెందిన స్వరభంగము గలుగునని పూర్వమునందు వామదేవుడను మునీశ్వరుడు వచించెను.

విభీతకాది చూర్ణము.

శ్లో॥ [మాధవనిదానే] విభీతకకణాముండీ సైంధవం తత్సమాంసమమ్ । గోమూత్రేణపిబేన్నిష్కం స్వరభంగప్రశాంతయే ॥

తా. తానికాయ పిప్పలిభోడతరము సైంధవలవణము వీనినిసమభాగములుగ చూర్ణముచేసి నిష్కమెత్తును గోమూత్రములోగలిపి త్రాగిన స్వరభంగము హరించు.

## ఆర్ద్రికాది చూర్ణము.

శ్లో॥ [ఆయుర్వేదే] ఆర్ద్రికంభృంగగోరంట వచాబ్రాహ్మీచవా
కుచీ। ఏలాచూర్ణం సమాంశేన ప్రత్యేకం వారిణాపిబేత్ ।
మాఘమాసే చతుర్దశ్యాం కృష్ణపక్షే ద్విసప్తకే । గాంధర్వో
జాయతే సమ్యక్కోకిలానాం స్వరో యథా ॥

తా. అల్లము గుంటగలగర గోరింట వస మండూకబ్రహ్మి భావంచివిత్తులు యేలకులు వీనిని సమభాగములుగచూర్ణముజేసి 1 పలము నుష్ణోదకములోగలిపిమాఘ బహుళచతుర్దశిదినము మొదలు 14 దినములు త్రాగిన కంఠస్వరము గాంధర్వకోకిల స్వరములతో సమానంబగు.

## సైంధవాది చూర్ణము.

శ్లో॥ సైంధవేంద్రయవంరాత్రౌ మరిచం చోష్ణవారిణా ।
పాయమే త్కర్షమాత్రంతు గళదోషప్రశాంతయే ॥

తా. సైంధవలవణము కొడిసెపాలమిరియాలు వీనిచూర్ణమును కర్షప్రమాణము వుష్ణోదకములోగలిపి రాత్రుల యందు త్రాగిన స్వరభంగము హరించు.

శ్లో॥ కరంజబీజమజ్జాచ ద్వినిష్కం చోష్ణవారిణా ।
గళదోషహరంపానే పథ్యాం క్షౌద్రకసంయుతామ్ ॥

తా. కానుగవిత్తులలోనిపప్పును 2 నిష్కములయెత్తునువుష్ణోదకములోగలిపి త్రాగినను లేక కరక్కాయచూర్ణమును తేనెలోగలిపి సేవించినను స్వరభంగము హరించు.

శ్లో॥ [సిద్ధసార్ణవే] అభయాంగంధకంక్షౌద్రం నింబబీజంసమాంశ
కమ్ । గళదోషహరంలేహ్యం సక్షౌద్రం పర్పటీరసమ్ ॥

తా. కరక్కాయ గంధకము వేపవిత్తులు వీనిని సమభాగములుగ చూర్ణము జేసి తేనెలోగలిపి సేవించినను పూర్వోక్తపర్పటీరసమును తేనెతోసేవించినస్వర భంగము హరించు.

శ్లో॥ [నిత్యనాథీయే] ధాత్రీఫలరసైః క్షీరైః పానంస్యాత్స్వరభం
గనుత్ । త్రిమాసే సేవయేన్నిత్యం స్వరభంగప్రశాంతయే ॥

తా. వుసిరికపండ్లరసమును పాలలోఁగలిపిత్రాగిన స్వరభంగము హరించు. స్వరభంగరోగనివారణార్థంబై చెప్పంబడినయౌషధమును3మాసములు సేవింపవలయు

వదనదుర్గంధ నిదానము.

శ్లో॥ కఫపిత్తే గళేజాతే వక్త్రే దుర్గంధసంభవః ।
తచ్ఛాంత్యర్థం వదిష్యామి భైషజ్యం లోకమోహనమ్ ॥

తా. కఫపిత్తములు ప్రకోపించి కంఠమును జెందిన నోటదుర్గంధము గలుగు. అది శమించుటకై ప్రశస్తమైన చికిత్సల వచించెద.

చికిత్స.

శ్లో॥ సర్వసోమాతులుంగస్య సంయుతో మధుసర్పిషా ।
తాలుదేశే ప్రదేయశ్చ చూర్ణితం సైంధవం తథా ।
గోజలైః క్వథితం పథ్యా మిసికుష్ఠకణాన్వితమ్ ।
వదనస్య దురామోదం నిహంతి పకీలితమ్ ।
ధృతంచ కాంజికం దోషే షరితో భక్షయే త్సితామ్ ।
తథా కృతే భవేదాస్యే దురామోదానుమర్దనమ్ ॥

తా. మాదీఫలరసములో తేనెగాని నెయ్యిగాని కలిపి త్రాగినను సైంధవలవణచూర్ణమును తాలుప్రదేశమునందునిచినను కరక్కాయలుసదాప చెంగల్వకోష్టు పిప్పళి వీనిని చూర్ణముజేసి గోమూత్రములోఁగలిపి కాచి త్రాగినను నోటిదుర్గంధము హరించు. లేకకలితో పంచదారగలిపి గండూషముజేసిన నోటిదుర్గంధముహరించు.

కుష్ఠాది వటికములు.

శ్లో॥ గోమూత్రే క్వాథయే త్కుష్ఠం వాలుకం సహరీతకీ ।
పిష్ట్వా ధార్యావటీః కృత్వా ముఖదుర్గంధనాశని॥

తా. చెంగల్వకోష్టుకూతుంబుడుకరక్కాయలు వీనిని చూర్ణముజేసిగోమూత్రములోఁగలిపి వండిసూరిమాత్రలుజేసి నోటినునిచకొనిన నోటిదుర్గంధము హరించు.

## లాజాది వటికములు.

శ్లో॥ లాజాజాతీఫలం పూగో మాక్షికంచ పిబేదను ।
శీతతోయం పలార్ధంచా ప్యాస్యదుర్గంధశాంతయే॥

తా. పేలాలు జాజికాయ పోకలు వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి తేనెతో మర్దించి మాత్రలఁజేసి భక్షించి వెంబడిగ ½ పలము శీతోదకమును ద్రాగిన నోటి దుర్గంధము హరించు.

## పులిపిర్ల విచానము.

శ్లో॥ వాతేన కఠినం పీతం జాయతే కంఘభేదనమ్ ॥

తా. వాతమువలన కఠినమై పచ్చగనుండు పులిపిర్లు జనించు.

## చికిత్స.

శ్లో॥ అశ్వత్థశ్యత్వచో భస్మ చూర్ణేన సమమిశ్రితమ్ ।
నవనీతం ద్వయో స్తుల్యం మర్ద్యం తేనవిలేపయేత్ ।
ఆననే గుదపార్శ్వేచ కటిస్థాః పిటికా జయేత్ ॥

తా. రావిచెక్కలబూడిదె కొత్తసున్నము వీనిని సమభాగములుగ గ్రహించివానికి సమముగ వెన్నగలిపి లేపనముజేసిన ముఖము గుదపార్శ్వము నడుము వీనియం దుండెడి పులిపిర్లు నశించు. (మఱియు నక్కపీటాకురసమును బూసిన పులిపిర్లు నశించు.)

## ఛాయారోగ నిదానము.

శ్లో॥ ఛాయారోగం ప్రవక్ష్యామి వాతదోషాదిసంభవమ్ ।
ఉత్తమాంగస్య కేశేషు రక్తరూపం ప్రజాయతే ॥

తా. వాతాదిదోషమువలన శిరమునందలి వెంట్రుకలు రక్తవర్ణంబులైన ఛాయారోగ మనంబడు.

## ఛాయారోగ చికిత్సలు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే]జపాపుష్పశతంహంతికృష్ణగోమూత్రలేపనాత్।
గుంజామూలఫలంచూర్ణం కంఠకారిఫలద్రవైః ।
తేనలేపోనిహంత్యాశు ఛాయారోగంసుదుస్సహమ్ ॥

తా. 100 దాసానిపువ్వులను కరియావు మూత్రముతో నూరి లేపనము జేసిన ఛాయారోగము హరించు. మఱియు గురిజవేరు గురిజవిత్తులు వీనిచూర్ణమును నేలములకపండ్లరసముతో నూరి లేపనముజేసిన అసాధ్యమైన ఛాయారోగము శీఘ్రముగ హరించు.

శ్లో॥ [శారీరే] భల్లాతకఫలద్రావై స్స్నుహిక్షారయుతైర్జయేత్ ।
కుంకుమం మరిచం చార్ధం పిష్ట్వా తైలేన లేపనాత్ ।
పక్త్వా తైలం నిహంత్యాశు లేపో జంబీరజద్రవైః ।
లాక్షా భల్లాతకం ముస్తా కుష్ఠ గుగ్గులు సర్పిషా ।
విడంగేన సమంచూర్ణం పిబే చ్ఛాయాహరం పరమ్ ॥

తా. జీడిపండ్లరసమును జెముడుక్షారములో గలిపిగాని లేక కుంకుమపువ్వు 1 భాగము మిరియాలు ½ భాగము యీరెంటినినూరి నూనెతో గలిపిగాని నిమ్మపండ్లరసములో నూనెను గలిపి కాచిగాని లేపనముజేసిన ఛాయారోగము హరించు. లక్క జీడిగింజలు తుంగముస్తెలు చెంగల్వకోష్టు గుగ్గిలము వాయువిడంగములు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి నేతితో గలిపి త్రాగిన చాయారోగము హరించు.

భల్లాతకాది లేపము.

శ్లో॥ [నిత్యనాథీయే] భల్లాతకంకృష్ణతిలాః కంటకారిఫలం సమమ్ ।
పిష్ట్వా తండులతోయేన లేపశ్ఛాయాం వినాశయేత్ ॥

తా. జీడివిత్తులు నల్లనువ్వులు నేలములకపండ్లు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి బియ్యపుకడుగుతో నూరి లేపనముజేసిన ఛాయారోగము హరించు.

శ్లో॥ భల్లాతకంచ బృహతీ గుంజామూలం కటిల్లకమ్ ।
మధునా సహలేపేన ఛాయారోగం వినశ్యతి ॥

తా. జీడివిత్తులు ములకవిత్తులు గురిజవేరు కాకరవేరు వీనిని సమభాగములుగ తేనెతోనూరి లేపనము జేసిన ఛాయారోగము హరించు.

అరోచక లక్షణము,

శ్లో॥ [మాధవనిదానే] వాతాదిభిశ్శోకభయాతిలోభ క్రోధైర్మనోద్నాశనరూపగంధైః । అరోచకాస్స్యుః పరిహృష్టదంత కషాయవక్త్రశ్చ । పతోనిలేన ॥

తా. వాతపిత్త కఫసన్నిపాత శోకభయ అతిక్రోధ లోభములవలన అంధ చకము జనించు ఇది జనించినపిదప మనోవేదన అన్నానిరూపకమైన దౌర్గత్యముగ్నో గలుగు. మఱియు అరుచి వాతజనితంబై యుండినదంతములు పులిసినట్లుగ నోరు వగరుగ నుండు.

## చి కి త్స లు.

శ్లో॥ కుష్ఠసౌవర్చలాజీర శర్కరా మరిచంబిడమ్।
ధాన్యైలాపద్మకోశీర పిప్పల్య శ్చందనోత్పలమ్ ।
లోధ్రతేజోవతీపథ్యా త్ర్యూషణం శయనాగ్రజమ్ ।
ఆర్ద్రదాడిమనిర్యాస స్సాజాజీ శర్కరాయతః।
ససైలమాక్షికాస్త్యేతే చత్వారః కబళగ్రహాః ।
చతురో రోచకాన్ ఘ్నంతి వాతాద్యేకజ సర్వజాన్॥

తా. చెంగల్వకోష్టు సౌవర్చలవణము జీలకఱ్ఱ మిరియాలు బిడాలవణమువీని ని సమభాగములుగ చూర్ణముజేసి అందు పంచదార అవనూనె తేనె అనువానినిసమ ముగకలిపి లేహ్యపక్వముగవండి ప్రాతస్సాయంకాలములయందు రేగుబండంత * కబళముజేసిన వాతారోచకమును దనియాలు యేలకులు తామరదుంపలు వట్టివేరు పిప్పళ్ళు శ్రీగంధము నల్లకలువగడ్డలు వీనిని సమభాగములుగచూర్ణముజేసి అందుపం చదార అవనూనె తేనె అనువానిని సమముగ గలిపి లేహ్యపక్వముగ వండిరేగుబం డంత కబళము జేసిన పిత్తారోచకమును లొద్దుగపట్ట వెక్కుడుతీగె కరక్కాయ శొంఠి పిప్పళ్ళు మిరియాలు యవక్షారము వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అం దు పంచదార అవనూనె తేనె అనువానిని సమముగ గలిపి లేహ్యపక్వముగ వండి రేగుబండంత ప్రాతస్సాయంకాలముల కబళముజేసిన కఫారోచకమును జీలకఱ్ఱ చూ ర్ణముజేసిన యం దల్లపురసము దాడిమపండ్లరసమును శుద్ధిజేసిన శిలాజిత్తు పంచదార అవనూని తేనె అనుమానిని సమముగ గలిపి లేహ్యపక్వముగ వండి రేగుబండంత కబళము జేసినను సన్నిపాతారోచకమును హరించు.

శ్లో॥ శమయతి కేసరమరుచిం పలవణఘృతమాశు మాతులుంగస్య।
దాడిమచర్వణమథ వాచరకో రుచికారిసూచియామాస॥

* కబళ మన— నోటియందు దునిచికొని నమలుటయు

తా. మాదీఫలకేసరములు సైంధవలవణము వీనినిసమభాగములుగ చూర్ణము జేసి అందు తగుమాత్రము నెయ్యిగలిపి ప్రాతస్సాయంకాలములయందు భక్షించినను లేక పుల్లదాడిమగింజలు బాగుగనమిలి భక్షించినను అరుచి శీఘ్రముగ నశించునని చరక సంహితయం దుదహరింపబడి యున్నయది.

శ్లో॥ శర్కరా దాడిమం చాథ ద్రాక్షా ఖర్జూరమేవచ ।
కేసరం మాతులుంగస్య సింధునా మధునాపివా ।
ఆస్యవైరస్య శమనం భక్షయే త్కర్షసమ్మితమ్ ॥

తా. దీపద్రాక్ష ఖర్జూరము మాదీఫలకేసరములువీనిని సమభాగములుగదంచి అందు శర్కర దాడిమపండురసము వైచి సైంధవలవణమునైనను తేనెనైననుగలిపి లేహ్యపక్వముగవండి అందొకకర్షమును సేవించిన అరుచి హరించి జిహ్వకు రుచి గలుగు.

శ్లో॥ విడంగచూర్ణం కర్షైకం క్షౌద్రై శ్చతుర్భిర్యుతమ్ ।
అసాధ్య మపి సంహన్యా దరుచిం వక్త్రధారణాత్ ॥

తా. 1 కర్షము వాయువిడంగముల చూర్ణమునందు 4 కర్షముల తేనెగలిపి కొంచెము వెచ్చచేసి గట్టియైనపిదప రేగుబండంతమాత్రలుజేసి యందొకమాత్రను పుక్కిట నునిచికొని దానిరసమును మ్రింగుచుండిన సాధ్యమైన అరుచి హరించు.

శ్లో॥ సితా వ్యోష కపిత్థానాం చూర్ణం క్షౌద్రేణ తద్వటీమ్।
సర్వారోచకశాంత్యర్థం ధారయే ద్వదనాంబుజే ॥

తా. శొంఠి పిప్పలి మిరియాలు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అందు శర్కర వెలగపండుగుజ్జు తేనెగలిపి పక్వముగవండి మాత్రలుజేసి పుక్కిట నునిచి కొని దానిరసమును మ్రింగుచుండిన సమస్తమైన అరుచులు నశించు.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగ్యవిహార పారీణనిధి
మామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య నామదేశిక శిష్యోత్తమ నమశ్శివాయ
సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన శిరోభూషణనీలకంఠ
కొట్టూరు బసవరాజ నామధేయ ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్ర
తాత్పర్యసహితే క్షుద్రరోగనిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య
తచ్చికిత్సానుపానయుక్తం ద్వావింశ ప్రకరణమ్.

శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

## — త్ర యో విం శ ప్ర క ర ణ ము. —

శ్లో॥ బాలచంద్రకళామౌళిం భుజగేంద్రవిభూషణమ్ ।
తారకం సచ్చిదానందం లింగమూర్తి మహం భజే ॥

తా. బాలచంద్రుని శిరమున ధరించినవాడును సర్పములే యాభరణములుగ గలవాడును జగత్తును ధరింపజేయువాడును సచ్చిదానందరూపుడును లింగస్వరూపుడునగు పరమేశ్వరుని నేను భజించెద.

శ్లో॥ శ్రీనీలకంఠ వంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశ మనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజని పేరొక్కనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయ మను నీ గ్రంథముయొక్క త్రయోవింశప్రకరణమును వచింపుచున్నాడను.

### విషనిదానము.

శ్లో॥ [బ్రహ్మగారుడే] అనేకవిషజీవానాం చూర్ణంముఖవిషైర్యుతమ్। మిశ్రితంనఖదంతైశ్చ లోహద్యం చూర్ణసంచయమ్ । కృత్రిమంతువిషంఖ్యాతం పక్షమాసా ద్విబాధతే । ఆలస్యం కురుతేజాడ్యం కాసశ్వాసబలక్షయమ్ । రక్తస్రావోజ్వర శ్శోభా పీతచక్షుశ్చలక్షణమ్ ॥

తా. అనేకవిషజంతువులు ముఖమునందు విషము గల సర్పాదిజంతువిషములు గోళ్ళు దంతములు లోహములు మొదలగువానిచూర్ణాదు లన్నాదులతోడ గలిపి యొసంగుటయ కృత్రిమవిషమనంబడు. ఇది 15 దినములకుగాని 1 మాసమునకు గాని విషమెక్కి బాధించును. దానిలక్షణము లెవ్వి యనిన-ఆలస్యము జాడ్యము

దగ్గు వుబ్బసము బలక్షయము రక్తస్రావము జ్వరము శరీరమునందు వావు నేత్రముల యందు పసుపువర్ణము అనునవియా.

భీమరుద్ర రసము.

శ్లో॥ మృతం స్వర్ణం శుద్ధసూతం శుద్ధంవై హేమమాక్షికమ్ ।
త్రయాణాం గంధకం తుల్యం మర్ద్యం కన్యాద్రవైర్దినమ్ ।
తచ్చూర్ణం ససిత క్షౌద్రం మాషైకం లేహయే త్సదా ।
వహ్నిమూలం శృతం క్షీరై రనుస్యాద్గరనాశనమ్ ।

తా. సర్వమాక్షికము శుద్ధిజేసినరసము శుద్ధిజేసిన హేమమాక్షికము యీ మూటికి సమముగ శుద్ధిజేసిన గంధకమును గలిపి కలబంధరసముతో 1 దినము మర్దించి నీడనెండించి మాషప్రమాణము మాత్రలుజేసి యందొకదానిని పంచదార తేనె అనువానియనుపానముతోడ సేవించి, వెంబడిగ పాలలో చిత్రమూలమును వైచి కాచిత్రాగిన కృత్రిమవిషము నివర్తించు.

శట్యాది యోగము.

శ్లో॥ [మాధవనిదానే] శటీ పుష్కరమూలంచ పాచ్యం పారావ పిత్తకమ్ । తత్పిబే చ్ఛీతలం పానే గరతృష్ణాజ్వరాపహమ్॥

తా. కచోరములు పుష్కరమూలము పావురపిట్టచేను వీనిని సమభాగములుగనూరి శీతోదకముతో ద్రాగిన కృత్రిమవిషములు దప్పి జ్వరము నివర్తించు.

అభయాది వటికములు

శ్లో॥ [మాధవకల్పే] వృషభూనింబపత్రాణి పటోలంచపలమ్ ।
తోయే చాష్టగుణేక్వాథం పాదశేషం సమాహరేత్ ।
క్వాథతుల్యం ఘృతంగవ్యం ఘృతార్ధ మభయారసం ।
ఘృతశేషం పచే త్సర్వం పానా ద్విషహరం ఘృతం ॥

తా. అడ్డసరము నేలవేము చేదుపొట్లాకు వీనిని దినుసుకు పలిమెడుచొప్పన దంచి 24 పలముల ఉదకముబోసి 4 వ భాగముగ కషాయముకాచి దానికి సమముగ ఆవునెయ్యి ఆవునేతికిసమముగ కరక్కాయలరసము గలిపి చిక్కగ వండి సేవించిన విషదోషము నివర్తించు.

## సర్పాక్షి యోగము.

శ్లో॥ [ఆయుర్వేదే] సమూలపత్రాం సర్పాక్షీం జలేన క్వథితాం పిబేత్ । నరమూత్రేణ్ చాపిష్టాం పిబేత్సర్వగరాపహా ॥

తా. సర్పాక్షి సమూలమును దంచియుదకములో వైచి కషాయముకాచి త్రాగినను లేక సర్పాక్షిని నరమూత్రములో నూరి త్రాగినను సర్వవిషములు నివర్తించు.

## విషచికిత్స.

శ్లో॥ [అశ్వినీకల్పే] న్యగ్రోధో రజనీకుష్ఠం పిష్ట్వాజ్యంగృహధూమకం । తండులీయకమూలేన కర్షంగరహరంపిబేత్ ॥

తా. మఱ్ఱి పసుపు చంగల్వకోష్టు కరుసూపము చిఱ్ఱివేరు వీనినిసమభాగములుగ నూరి కర్షప్రమాణమును నేతిలో గలిపి సేవించిన విషదోషము నివర్తించు.

శ్లో॥ [అన్యశాస్త్రే] శిరీషర మేఘనాదంచ నవనీతసమన్వితం । భల్లాతకం విషం హంతి లేపనేన క్షణా ద్ధ్రువం ।

తా. దిరిసనము చిఱ్ఱి జీడి వీనిని సమభాగములుగ నూరి వెన్నలో గలిపిలేపనము జేసిన విషము నిశ్చయముగ క్షణకాలములో నివర్తించు.

## కుక్కకాటునకు చికిత్సలు.

శ్లో॥ [భేషజకల్పే] గుడతైలార్కదుగ్ధస్య లేపశ్శ్వానవిషంహరేత్ । పిష్ట్వా రామార్గమూలంతుకర్షైకంమధునాలిహేత్ ।
శ్వానదష్టవిషం హంతి లేపాత్కుక్కుటవిష్టయా ।

తా. బెల్లము నూనె జిల్లేడుపాలు వీని నేకము జేసి లేపనముజేసినను కర్షప్రమాణము వుత్తరేణువేళ్ళనునూరి తేనెలోగలిపి భక్షించినను లేక కరచిన స్థలమున కోడి పిష్ఠమును లేపనము జేసినను వెఱ్ఱికుక్క (నక్క) విషము నివర్తించు. (గొడ్డుకాకరగడ్డను 40 దినములు సేవించినను లేక ములగ బోడతరము వీనిరసములో 3 నూనెబొట్లు గలిపి 40 దినములు త్రాగినను వెఱ్ఱికుక్క నక్కవిషములు నివర్తించు.)

శ్లో॥ [మాధవనిదానే]. నింబకుటజబీజాని చందనాం బుజకేసరం । క్షీరైః పిష్టం నిహంత్యాశు శ్వానమార్జాలజంవిషం॥

తా. వేపవిత్తులు కొడిసెవిత్తులు చందనము తామరగరులు వీనిని పాల నూరి త్రాగిన కుక్కకాటు (నక్కకాటు) పిల్లికాటుశీఘ్రముగ నివర్తించు. (. లము వెట్రుకలను మంగలములోవైచి మసిజేసి దానిలో నూనెగలిపి త్రాగి లేక శరీరమునకు కాకరాకురసము బూసికొని స్నానముజేసినను వెర్రికుక్క నక విషము నివర్తించు) కుక్కనక్క విషములయం దొకవత్సరమువరకు సప్పిడివ కమును భుజించుటయేగాక స్త్రీసంగమను ఆవాలు మామిడికాయ అనువా వర్జింపవలయు.

మూషకవిష చికిత్స.

శ్లో॥ [ఆయుర్వేదే] శిలా తాళకకుష్ఠంచ భావ్యం నిర్గుండిజద్రవై
పానం మూషకదష్టానాం దంతతీవ్రవిషం హరేత్॥

తా. శుద్ధిజేసిన శిలాజిత్తు శుద్ధిజేసిన తాళకము చంగల్వకోష్టు వీనినివావి కురసముతో నూరి భావనజేసి త్రాగిన యెలుకకాటు శీఘ్రముగ నివర్తించు.

శ్లో॥ చించాఫల సమాయుక్తం గృహధూమం ఫలార్ధకం।
పురాణాజ్యేన సప్తాహం లిహేదాఖువిషం హరేత్॥

తా. చింతగింజలు కరుధూపము యీ 2 ని నూరి ½ పలము ప్రాత నేతితో గలిపి భక్షించిన యెలుకగాటు హరించు.

శ్లో॥ శిరీషకుసుమం తక్రై ర్వత్సనాభయుతం పిబేత్ ।
విషం మూషకదష్టానాం శమ మాప్నోతి తత్క్షణాత్॥

తా. దిరిసెనపుపువ్వు శుద్ధిజేసినవాభివీనిని చల్లతోనూరి త్రాగిన యెలుక గాటుక తక్షణము నివర్తించు. (మఱియు వెంట్రుకలను త్రాడుగపేని ముడివే జిల్లేడుపాలలో 7 మార్లు తడిపి చుంచెలుక కరచిన స్థలమున గాల్చి దానిపై జిల్లేడ చెక్కపొడి నద్దిన చుంచెలుక గాటు నివర్తించు.

శ్లో॥ తోయైర్వా నాగరం నస్యం పిబేద్వా మృతసైంధవం ।
అర్కదుత్తూర మూలంవా జలపానే విషాపహం॥

తా. శొంఠి నుదకముతోనూరి నస్యము జేయించినను లేక శుద్ధిజేసినవాభి సైంధవలవణముతోనూరి త్రాగించినను లేక జిల్లేడు వుమ్మెత్త వీనివేరు నుదకము తో నూరి త్రాగించినను విషము నివర్తించు.

## వృశ్చిక విష చికిత్స.

శ్లో॥ కాకజంఘీయ మూలంచా ప్యార నాళేన పేషయేత్।
పానాద్వా లేపనా చ్చైవ విషం వృశ్చికజం హరేత్॥

తా. వెలుమసంధివేరును కలితోనూరి త్రాగినను లేక దానిని గంధము దీసి కరచినస్థలమున లేపనము జేసినను తేలువిషము నివర్తించు. (మతియు తంగేడుకొమ్మ రసమును త్రాగిన తేలు కరచుటచే.కలిగిన రక్తవమనము నివర్తించు.)

### ప్రభావతివటికములు.

శ్లో॥ హరిద్రానింబపత్రాణి పిప్పలీ మరిచానిచ। విళంగం భద్రముస్తాచి జీరకం విశ్వభేషజమ్। చిత్రకం సైంధవం కుష్ఠం విషంపాఠా హరీతకీ। ఏతాని సమభాగాని హ్యజామూత్రేణ పేషయేత్। చణప్రమాణా వటికా శ్ఛాయా శుష్కా శ్చకారయేత్। ఏకాముష్ణోదకైః పీత్వా విషూచీంచవ్యపోహతి। లూతవిస్ఫోటభేదంచగోమూత్రేణవిలేపయేత్। అష్టోత్రకేణ సేవేతసర్పదష్టవిషంహరేత్। మహారక్తప్రవాహేఘృశ్రీగంధేన సమంపిబేత్। అర్కక్షీరయుతంలేప్యం వృశ్చికాది విషంహరేత్। హంతిపుష్పంచ పటలం రంభాకందరసాన్వితమ్। కాకమాచీరసైః పీత్వా తిమిరాణి వినాశయేత్। నీలికామూరసై ర్వ్యక్తారక్తాంగత్వంవినాశయేత్। గుడేనమిశ్రితంభుక్త్వా వాతరోగంవినాశయేత్। భృంగరాజ రసైః పీత్వా శిరసో దాహన్ముద్భ్రశమ్। తండులోదక సంమిశ్రం కాసకృచ్ఛ్రాం వినాశయేత్। గోమూత్రేణయుతంపీత్వా ప్లీహరోగంవినాశయేత్। ఛాగక్షీరసమాయుక్తంవటికాంచాశ్వగంధికామ్। పీత్వా మండలపర్యంతం రాజయక్ష్మవినాశనమ్।

తా. మ్రానిపసుపు వేపాకు పిప్పలి మిరియాలువాయువిడంగములు భద్రముస్తెలు జీలకఱ్ఱ శొంఠి చిత్రమూలము సైంధవలవణము చంగల్వకోష్టు అతివసచిరుబొద్ది కరక్కాయ వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మేకపంచితముతోనూరి

పెసరగింజంత మాత్రలుజేసి నీడనెండించి యందొక దాని నుష్ణోదకముతో సేవించిన విషూచియు ఆవుపంచితముతో జాది లేపనముజేసిన లూత విస్ఫోటకవ్రణములును 8 మాత్రలుచల్లతో సేవించిన పాముకాటును చందనానుపానముతోడ ద్రాగిన నిష్కుటముగ రక్తము గారుటయు జిల్లేడుపాలతో జాది లేపనముజేసిన తేలుమొదలగువాని విషంబులును అరటిగడ్డరసముతో జాది నేత్రముల కంజనము వేసిన కంటిపువ్వులును పొరలును కొచిమూరుగసానుపానముతోడ సేవించిన తిమిరరోగంబులును నీలియాకురసముతోడ సేవించిన సర్వాంగము రక్తము స్రవించుటయు బెల్లముతోడ సేవించిన వాతరోగంబులును గుంటగలగరాకు రసానుపానముతోడ సేవించిన శిరము మండుట (తలనొచ్చుటయు) చిత్తిరాకు రసానుపానముతోడ సేవించిన కష్టసాధ్యంబు లగు దగ్గులును ఆవుపంచితముతోడ సేవించిన ప్లీహరోగంబును మేకపాలలో పెన్నేరుగడ్డ చూర్ణమును యీయౌషధమును గలిపి 1 మండలము వరకు సేవించిన రాజయక్ష్మయు నివర్తించు. (మఱియు నీప్రభావతివటికనులు తేలు పాము విషముల హరింపజేయుటయందు ప్రశస్తంబు.

## పులికోను చికిత్స.

క॥ వెలగయు నావయు ముద్దగ। గలయఁగ మర్దించి యదియు
ఖాదము సేయ। న్నిలలో మనుజులఁ గఱచిన। పులికోనుల
విషము విఱిగి పోవు మహాత్మా॥

## తాటిజెఱ్ఱికి చికిత్స.

గీ॥ ధారుణీచక్రమందునఁ దాటిజెఱ్ఱి। గొట్టెపామును మనుజులఁ
గుట్టెనేని। తెల్లచోటియు డకపెట్టి తేటసీరు। ద్రాగి యదిగొట్ట
వలయును దస్థలమున॥

## విషప్రతివిషములు.

సీ॥ ఊడుగ గన్నేర్ల కోగిఁ గరక్కాయలు పొత్తిగడ్డయు పొంటి
పొందుమీలు। జీడిగింజదలఁపఁ జెలఁగి మోదుగుపువ్వు
ధర జెముడుపాలకుఁ దంగెడాకు। ముసిడికి నేరేడు మొగిలి
చెక్కయుఁ బొంమఁ గర్పూరమునకును గలగరాకు। నేరేడు
పండ్లకు సెజిముగ్గమానకు నుసిరికపప్పు దా నుచితమగును।
దేవ కాజ్యమునకు ధీరత నుదకంబుఁ జిక్కఁ దమ్మ్మలమునఁ

జింతపండు । తాకినజీడికిఁ దగదూలకోవిల యమ్మొత్తవెట్టి
దా నుడుగువిధము । తామరచూర్ణము తగఁ బుల్ల పావిలి
పరఁగ నాక్షణమునఁ బచ్చికడుగు । తింత్రిణీఫలమునఁ దిల
కింపఁ పసుపును శెరుగుకు వేషెళ్ళు పెట్టమేలు। మామిడి జీడికి
మహానారికడపాకు క్షీరము సున్నమునకుఁ దిప్పతీఁగ। తెలిక
పిండికి సూనె తేటయటుకులునగు సైంధవలవణంబు సరస
మగును । శొంటిపిప్పళ్ళకు సౌరిదిమిర్యాలకు గ్రూలాటికడు
గును గ్రోలగుణము । కడఁగియనుములకెల్ల గంధంబుసిద్ధంబు
దూలింపదెగడకుఁ దుమ్మచెక్క । పెసలు బెల్లమునకుఁ
బసచల్లగుమ్మడి యఱుఁగవికూటికి సావయంద్రు । సూనె
యింగువకోప్పుగానఁ గేతకిరసం బడవిబీరకు స్తలమరి
యుండు । వత్సనాభులకెల్ల వరుసతో నాచిట్టి వెసఁ జేతరాసికి
విరిగినార । కందకుదములవాకంద మైవిలసిల్లుఁ బనసపంటికి
సొంటిబాగునాను । గనకబీజములకుఁ గడునిమ్మరసమును
జీలకఱ్ఱనిడుంపు చెన్నుమీఱఁ । గడునిమ్మపండ్లకు ఖర్జూర ఫ
లములు పొసఁగ సున్నమునకు బసుపుశుద్ధి । నారికేళము
నకు నలవరిబియ్యంబు మొనసి నువ్వులకెల్ల మొగలిరసము ।
జిల్లేడుపాలకు జెంచలిసీలాకు పాషాణములకెల్ల బత్తిగింజ ।
నల్లమందుకు సొంటి యల్లంబు సిద్ధంబు బలురక్కసికి నెల్ల
నులిమిడాకు । నేతికిఁ బులిచల్ల నేర్పుతో సంఘల్లు జిల్లకు
ద్రాగుడు జిల్లగింజి । లనుచు నుగ్రవిషంబుల నవనినడఁచుఁ ।
జెలఁగుచును నిర్విషంబులఁ జెప్పి రిట్లు । సిద్ధసారంబులందు
దాఁ జెలువ మైన । వైద్యశాస్త్రంబులందుల వరుసఁ దెలిసి॥

## సర్పదష్టలక్షణము.

శ్లో॥ [బ్రహ్మగారుడే] భ్రాన్తిర్మూర్ఛాతిసారశ్చ శూలం వాంతిశ్చ
కంపనమ్ । కాసశ్శ్వాసో తీవ్రదాహో లక్షణం గద్గదస్వరః ।

తా. భ్రాంతిమూర్ఛ అతిసారము శూలవాంతి వణుకు కాసశ్వాసములు తీవ్రమైన దాహము హీనస్వరము యీలక్షణములవలన పాముగరచినదని తెలియవలయు.

## పుత్రజీవియోగము.

శ్లో॥ పుత్రజీవీ ఫలే మజ్జా శీతతోయేన పేషయేత్ ।
లేపనే చాంజనే పానే నస్యే సర్వవిషాపహమ్ ॥

తా. పుత్రజీవికాయలలోని గుజ్జును శీతోదకముతోనూరి లేపనము జేసినను నేత్రముల కంజనము వేసినను లేక త్రాగినను లేక నస్యము జేయించినను సర్వసర్పదష్ట విషములు హరించు.

## విషహర చికిత్సలు.

శ్లో॥ స్థావరం జంగమం చైవ కృత్రిమం యోగజం తథా ।
నిష్కమాత్రం నసం దేహో కాలదష్టోపి జీవతి ॥

తా. స్థావర జంగమ కృత్రిమ విషములయం దొకనిష్కము పుత్రజీవి చేసము ప్రతిదినమును సేవింపుచుండిన సర్వమైన పాముల కాటు నివర్తించుటయేగాక కృష్ణసర్పాదుల కాటును నిస్సంశయముగ నివర్తించు.

శ్లో॥ ముసలీటంకణం పానే కాలదష్టోపి జీవతి ।
కటుకా ముసలీమూలం పబేత్తోయం విషాపహమ్ ॥

తా. నేలతాటిగడ్డరసములో వెలిగారము గలిపి త్రాగిన కృష్ణసర్పదష్టుడైనను జీవించు లేక చేదుబీరవేళ్ళు నేలతాటిగడ్డలు వీనినినూరి రసముదీసి త్రాగిన సర్వవిషములు హరించు.

శ్లో॥ జలేన లాంగలీకంద నస్యే సర్వవిషాపహమ్ ।
వారిణా టంకణం పీత మథ వార్కస్య మూలకమ్ ॥

తా. చన్నచర్లగడ్డ నుదకముతోనూరి నస్యము జేయించినను లేక తుంగగడ్డలు వెలిగారము వీనినినూరి త్రాగినను జిల్లేడువేరు నునూరి త్రాగినను సర్వవిషములు హరించు. (లేక నేలగుమ్ముడువేరు గంధమును భక్షించిన పేరులేని పాముల విషము హరించు లేక పాపరవేళ్ళరసమును గాని యీశ్వర చెట్టుసమూలరసమును గాని లేక చిత్తివేళ్ళరసమును గాని త్రాగిన విషములు నివర్తించు. కొసగుగడ్డను బిళ్ళలుగ దరిగి జిల్లేడుపాలలో 7 మార్లు భావనజేసి నీడ నెండించి చింతగింజంత భక్షించిన సర్వవిషములు హరించు.

శ్లో॥ ఇతి సర్పవిషాదీనాం సర్వస్థానగతే తథా ।
గోక్షీరై రజనీక్వాథం పిబే త్సర్వవిషాపహమ్ ॥

తా. ఆవుపాలలో పచ్చిపసుపుగలిపి కషాయముకాచి త్రాగిన సర్వస్థానముల జెందియుండు పాము మొదలగువాని విషము హరించు.

శ్లో॥ గోమూత్రై ర్నరమూత్రైర్వా పురాణేన ఘృతేనవా ।
హరిద్రా పానమాత్రేణ విషంహంతి చరాచరమ్ ॥

తా. పచ్చిపసుపుపొడిని గోమూత్రముతోగాని నరమూత్రముతోగాని ప్రాత నేతితోగాని సేవించిన స్థావర జంగమాది సర్వవిషములు హరించు.

శ్లో॥ అశ్వగంధా మేఘనాదో గోమూత్రే మహిషాక్షికమ్ ।
గృహధూమయుతం లేపో శివకంఠవిషాపహమ్ ॥

తా. పెన్నేరుగడ్డ చిత్తివేరు మహిసాక్షి గుగ్గిలము కరుధూపము వీనిని ఆవు పంచితముతోనూరి లేపనముజేసిన కాలకూటవిషముగూడ హరించు.

శ్లో॥ పంచాంగ మశ్వగంధాయాః ఛాగమూత్రేణ పేషయేత్ ।
లేపహా స్నేహసందేహో గోనసా విషనాశనమ్ ॥

తా. పెన్నేరుసమూలమును మేకపంచితముతోనూరి లేపనముజేసిన నాసరి పాము గరచినవిషము నిశ్చయముగ హరించు. (మఱియు అమావాస్య ఆదివారము నాడు భూతాంకుశపువేరునుదెచ్చి దాచి పాముగరచినచో గంధముదీసి అందు 3 నూనెబొట్లుగలిపి త్రాగిన సర్వవిషములు హరించు.)

శ్లో॥ కర్కటీమూలలేపేన సర్పదష్ట స్సుఖీ భవేత్ ॥

తా. ఆగాకరవేరును లేపనముజేసిన సర్పవిషము హరించు.

శ్లో॥ అలాబు బీజంచ కరంజ బీజం కోశాతకీ బీజ శిరీషబీజమ్॥
గోమూత్రపిష్టం సమేతదిష్టం పానాదినా సర్పవిషాపహారమ్॥

తా. చేదానుగపువిత్తులు కానుగవిత్తులు చేతిబీరవిత్తులు దిరిసెనపువిత్తులు వీనిని సమభాగములుగ నావుపంచితముతోనూరి ఆవుపంచితములో నేగలిపి త్రాగిన సర్వమైన పాములవిషము నివర్తించు.

శ్లో॥ శ్వేతార్కమూలం కుటజస్యమూలం కోశాతకీహింగువచా సమేతమ్ । అజేనమూత్రేణ కటుత్రయంచ పిష్టంవిషంహంత్యపికాలకూటమ్ ॥

తా. తెల్లజిల్లేడు వేరు కొండిసెపాల చేనుబీరవిత్తులు ఇంగువ వసత్రికటుకములు వీనిని సమభాగములుగ మేకపంచితముతో నూరి మేకపంచితముతోనే గలిపి త్రాగిన కాలకూటాది సర్వవిషములుహరించు (800 కరక్కాయాలభక్షించిన సమస్తమైన పాములవిషము హరించు.)

## నేత్రాంజనము.

(మండుపండొక భాగము మ్రుంగవిత్తులు 4 భాగములుమిరియాలు 1½ భాగము వీనిని నిమ్మపండ్లరసముతో మర్దించి కణికలుజేసి కలితోగాని నిమ్మపండ్లరసముతోగాని చాది కన్నులకుబెట్టిన సర్వమైన పాములవిషము సుఖజన్నులు నిశ్చయముగ హరించు.)

కం. సకలునకుఁ దక్షకునకును । బ్రకటముగ ననంతునకును బద్మకునకు వా। సుకి శంఖపాల కర్కో। టక ఘనపద్ములకు నాదటను వివరింతుఁ ॥

## అష్టఫణిపిదాన తద్విజాతుకౌషధంబులు.

(ఆదివారమునాడు గరచినపాము అనంతు డనంబడు. అది గరచినచోట దాపల విషముండును. కావున మోగాలుమీద ఆ ఆ ఆ అనుయక్షరముల వ్రాసి "అనంతహేలి హేలివిజయా విజయాయ స్వాహా" అనుమంత్రముతో నభిమంత్రించిన విషముదిగు. మఱియు నీమంత్రముతోడనే వుప్పును నూనెను మంత్రించి త్రాగించిన నాదివారమునాడు గరచిన అనంతుడనే పాముదిషము దిగును. సోమవారమునాడు గరచినపాము వాసుకి యనంబడు. అది గరచినచోట దాపల విషముండును. కావున మోకాటికీలుమీద ఆ ఆ ఆ అను యక్షరముల వ్రాసి "వాసుకి వాసుకి వాసుకి హేలి హేలి విజయాయస్వాహా" అనుమంత్రముతో మోకాలుమీద దిగమంత్రించి 5 కరక్కాయలచూర్ణములో నెయ్యిగలిపి మంత్రించి త్రాగించిన సోమవారమునాడు గరచిన వాసుకియనుపాముదిషము దిగును. మంగళవారమునాడు గరచినపాముపేరు తక్షకు డనంబడు. ఇది గరచినచోట వెలుపట విషముండును.

కావున కంఠస్థానమునందు లి లి లి అను బీజాక్షరములను వ్రాసి "తక్షక తక్షక తక్షక హేలి హేలి హేలి విజయాయ స్వాహా ఫట్ స్వాహా దిగు దిగు ఓం గురుప్రసాదమ్" అను మంత్రముతో మంత్రించి వేప్పాకును దాని చెక్కనునూరి రసముదీసి పైమంత్రముతో నభిమంత్రించి త్రాగించిన మంగళవారమునాడు కరచిన తక్షకుడనే పాము విషము దిగును. బుధవారమునాడు గరచినపాము కర్కోటకుడనంబడు. అది గరచినచోటి దాపల విషముండును. కావున నాభిస్థానమునందు హః అను యక్షరమును వ్రాసి "కర్కోటకా హిలి హిలి విజయా విజయా స్వాహా ఓం గురుప్రసాదమ్" అని నాభియందు దిగమంత్రించి వుప్పు మిరియాలు అనువాని నూరి నీళ్ళలో గలిపి యభిమంత్రించి త్రాగించిన బుధవారమునాడు గరచిన కర్కోటకుడను పాము విషము దిగును. గురువారమునాడు గరచినపాము పద్మకుడనంబడు. అది గరచినచోట వెలుపట విషముండును కావున ఆ అను బీజాక్షరమును బొమ్మన వ్రాసి "పద్మాఖ్యా హిలి హిలి విజయాయస్వాహా దిగు దిగు ఓం గురుప్రసాదమ్" అని బొమ్మన దిగమంత్రించి పెన్నేరుగడ్డరసమును నభిమంత్రించి త్రాగించిన గురువారము నాడు గరచిన పద్మకుడనుపాము విషము దిగును. శుక్రవారమునాడు గరచినపాము మహాపద్మకుడనంబడు అది గరచినచోట దాపల విషముండును. కావున కంఠమున ఆ అనే బీజాక్షరమును వ్రాసి "మహాపద్మకా హిలి హిలి విజయా స్వాహా" అను మంత్రముతో కంఠమున దిగమంత్రించి ప్రాతచింతపండును నీళ్ళలోగలిపి యభిమంత్రించి త్రాగించిన శుక్రవారమునాడు గరచిన మహాపద్మకుడనే పాము విషముదిగును. శనివారమునాడు గరచినపాము శంఖపాలకుడనంబడు. అది గరచినచోట దాపల విషముండును. కావున నేత్రముమీద ఓం అనే బీజాక్షరమును వ్రాసి "శంఖపాల శంఖపాల హిలి హిలి విజయా స్వాహా" అనుమంత్రముతో నేత్రములపై యభిమంత్రించి బెల్లమును నీళ్ళలోగలిపి యభిమంత్రించి త్రాగించిన శనివారమునాడు గరచిన శంఖపాలకుడనుపాము విషము దిగును. శనివారము ప్రొద్దుగూకగా గరచిన పాము సకలు డనంబడు. అది గరచినచోట దాపల విషముండును. కావున నడినెత్తిమీద ఓం అను బీజాక్షరమును వ్రాసి "కురి కురి హిరి హిరి విజయా విజయా స్వాహా" అను మంత్రముతో నడినెత్తిమీద మంత్రించి నెయ్యి అనుపకట్టు బెల్లము అనువాని నేకముజేసి యభిమంత్రించి త్రాగించిన శనివారమునాడు ప్రొద్దుగూకి గరచిన సకలు డనుపాము విషముదిగును. ఇట్టుల బ్రహ్మగారుడమనే శాస్త్రమునందు అష్టఫణినిదానంబులు తద్బీజాక్షరౌషధంబులు జెప్పంబడియె. బీజాక్షరము వ్రాసిన చోటనే మంత్రించవలయు.)

## సర్వపాములకాటుకు మంత్రము.

శ్లో॥ అథో నాగో నాళో చిత్రబారో బోడాతేరో జాతిజింటి పిరి
కావో సర్పకాటూ లూరేనో జ్యాణేత్రో జాతి ఈశ్వర
పార్వతిం కరో కోటికోటిఆజ్ఞ ।

ఊరికినుత్తరాన వృష్మగిరిపర్వతం సర్వతంమీదచెట్టు చెట్టుక్రిందపుట్ట పుట్టలో 300 ముచ్చుతేళ్ళు 400 నల్లతేళ్ళు 500 యెఱ్ఱతేళ్ళు 600 ఆనతేళ్ళు అందులో నొకతేలు నిప్పైవుట్టు నీరైదిగు మీగురువున్నల్లేరు నాగేంద్రుడాన చల్లగదిగు.

## తేలు మంత్రము.

శ్లో॥ యఃకృత్తికామూలమఖావిశాఖా సార్పాంతకార్ద్రాస్వభు
జంగదష్టః । స్వైన తేయేనసురక్షితోపి ప్రాప్నోతిమృత్యుం
భయదంమనుష్యః ॥

తా. కృత్తిక మూల మఖ విశాఖ ఆశ్లేష భరణి ఆర్ద్ర నక్షత్రములయందు పాముచే గరువఁబడినవాఁడు గరుత్మంతునిచే రక్షింపంబడినను మృతిజెందు.

(సర్వసర్పవిషములకు నాగముసిడినినూరి త్రాగింపవలయు.)

పొడపాముల విషమునకు చికిత్స:—తిప్పతీగవేరు నాగమల్లెవేరు వ్రాఁడుగవేరు పుట్టపొడరువేరు వస్త్రఘాలితపువేరు నీలివేరు తీగముషిణివేరు మిరియాలు వీనిని సమభాగములుగ నుదకముతోనూరి కుంకుడుగింజలంత మాత్రలుజేసి రేపు మాపు వొకొక్కమాత్ర నుష్ణోదకముతో సేవించిన పొడపాములవిషము హరించు. పథ్యము వేన్నీళ్ళన్నమును భుజింపవలయు.

వాపునకు చికిత్స:—జిల్లేడాకునుగాని మారేడాకునుగాని నూరి కలితో నుడకించి మాడేసికట్లుగట్టి పిదప దిరిసెనపాకు పుట్టపాదరాకు జిల్లేడాకు అనువానిరసములలో మిరియపుచూర్ణముగలిపి వాపుపై లేపనముజేసిన పాముకాటువలన గలిగిన వాపు నివర్తించును.

గాయమునకు చికిత్స:—జెముడువేరు పుట్టపొదవేరు జిల్లేడువేరు నాగమల్లెవేరు తీగముషిణివేరు పరిమవేరు ముషిణిచిగుళ్ళు వీనిని సమభాగములుగ గ్రహించి మెత్తగనూరి ముద్దజేసి చిట్లాముదములోగలిపి లేహ్యపక్వముగ నుడికించి అందు సురియాలుచెంగల్వకోస్టు కాచుఅనువాని చూర్ణము3 భాగములును సుగ్గిలచూర్ణము 3 భాగ

ంలు గలిపి మర్దించి గాయముపైనునిచ్చి కట్టుగట్టిన పాముకాటువలన గలిగిన గాయము మానును. కల్మషం బుండిన కోతమంగు వేయవలయు.

వుల్లిపాము కాటునకుచికిత్స.—తిప్పతీగె నాగముషిణివేరు మారేడువేరు ఇంగుపువేరు సెరిజవేరు నీలివేరు దిరిసెనపువేరు తెల్లజిల్లేడువేరు మిరియాలు వీనిని సమభాగములుగ నుదకముతో నూరి యింగుపు కాయగింజలంత మాత్రలుజేసి యం దొకదానిని సేవించిన వుల్లిపాము విషము నివర్తించు. పథ్యము.—చప్పిడి.

విషముకక్కుటకు చికిత్స.—కుంకుడువేరును నూరి కుంకుడుగింజంత సేవించిన విషము కక్కును.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణనిడి మామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్ర తాత్పర్యసహితే విషరోగ నిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన యుక్తం త్రయో వింశ ప్రకరణమ్.



శ్రీ ర స్తు.

# బసవరాజీయము,

## ఆంధ్రతాత్పర్యము.

—+—

## — చతుర్వింశ ప్రకరణము. —

శ్లో॥ అంబికాపతి మీశానం చంద్రశేఖర మచ్యుతమ్ ।
భస్మోద్ధూళితసర్వాంగం నీలకంఠ మహంభజే ॥

తా. పార్వతీవల్లభుడు జగన్నియామకుడు చంద్రుని శిరమున ధరించినవాడు నాశరహితుడు సర్వాంగముల భస్మమునలదికొనినవాడునగు నీలకంఠుని నేనుభజించెద.

శ్లో॥ శ్రీ నీలకంఠ వంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్య శిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడై బసవరాజని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడు శ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథము యొక్క చతుర్వింశ ప్రకరణమును వచింపుచున్నాడను.

### జ్వర కర్మవిపాకము.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] నీచస్థిత భానుదశా జ్వరదృఙ్నాశా శిరో
ర్తిరుష్ణాచ బంధనపీడాకారీ క్షీణేందుదశాపి సైవదుష్టఫలీ ॥

తా. నీచుడుగనుండు సూర్యదశయందును క్షీణచంద్రదశయందును నేత్రనాశము జ్వరము శిరోరోగము బంధనము భయంకరమైనపీడనుష్ణరోగము మొదలగునవిగలుగు.

శ్లో॥ సుహృద్బంధుసమాయోగో భూనిమిత్తం కలిర్భవేత్ ।
దేహపీడాజ్వరో వ్యాధిశ్శిఖమధ్యగతే బుధే । శనేరంతర్గతేప్యే
వమ్॥ తద్దోషకృతనిరాకృతయే జపహోమాదికం కుర్యాత్ ॥

తా. కేతుదశయందు బుధాంతర్దశ వచ్చియుండువపుడు స్నేహితులు బంధువులు అనువారి సంబంధము భూవిషయమునందు కలహము శరీరపీడ జ్వరము వ్యాధి గలుగు. మఱియు శనిదశయందు బుధాంతర్దశ వచ్చియుండగా పైఫలములే గలుగు. ఈయుపద్రవములు నివర్తించుటకై జపహోమాదుల జేయువలయు.

వాక్యమ్॥ [కర్మవిపాకే] యే పునః పూర్వజన్మని క్రూరాః పిశునా
స్తత స్తేన్యజన్మని సతతం జ్వరిణ స్స్యుః ॥

తా. పూర్వజన్మమునందు క్రూరుడై దుష్టుడై యుండువానికి తత్సంబంధ పాతకమువలన రెండవజన్మమునందు సంతతజ్వరము గలుగు.

## శీతజ్వర కర్మవిపాకము.

శ్లో॥ యే పునః క్రూరకర్మాణః పాపాః పిశునచేతసః ।
తే భవేయు స్సదా శీత జ్వరవంత స్తదేనసా ॥

తా. క్రూరకర్మలజేయువాడు పాపాత్ముడు కొండెకాడు యిట్టివారలకెల్ల పుడు శీతజ్వరము గలుగు.

## శీతజ్వర శమనోపచారము.

శ్లో॥ శాంతయే యుతసంఖ్యాకం ప్రకుర్యా త్ప్రయతో జపమ్ ।
జాతవేదసమంత్రేణ బ్రాహ్మణా భోజయే త్తతః ॥
సురామాంసోపహారాద్యై ర్బలి స్సర్వత్ర శస్యతే ।
సహస్రకలశస్నానం శతభోజన మేవచ ।
శీతజ్వరే పునః కుర్యా దభిషేకం హరే ర్బుధః ॥

తా. పైజెప్పబడిన శీతజ్వరశమనార్థంబై "జాతవేదసే" అనుమంత్రమును పదివేలమార్లు జపించి బ్రాహ్మణభోజనము గాని లేక మద్యము మాంసము అనువాని వలన బలిదానమును గాని జేయించవలయు. లేక వెయ్యికలశముల యుదకము దేవునికి నభిషేకమును సేయవలయు. లేక 100 బ్రాహ్మణులకు భోజనంబైన నిడవలయు. లేక విష్ణువునకభిషేకమునైనను జేయించవలయు.

శ్లో॥ సహస్రకలశస్నానం రుద్రేణేశస్య కారయేత్ ।
బ్రాహ్మణా న్భోజయే చ్ఛక్త్యా జపేద్ద్వై జాతవేదసమ్ ॥

తా. శివునికి వెయ్యికలశములచే రుద్రాభిషేకము జేయించి శక్త్యనుగుణ్యముగ బ్రాహ్మణులకు భోజనంబిడవలయు లేక "జాతవేదసే" అనుమంత్ర జపము నేని జేయించవలయు.

## జ్వర వైదికోపచారము.

శ్లో॥ వేదానాం శ్రవణం హితస్య చరణం విప్రస్య సంతర్పణమ్ ।
కృష్ణస్య స్మరణం శుభస్య కరణం ద్రవ్యస్య సంతర్పణమ్ ।
అశ్వత్థభ్రమణం సురత్నధరణం దీనస్య సంరక్షణమ్ ।
హన్యా దష్టవిధం జ్వరం కుముదినీనాథో యథోగ్రంతమః ॥

తా. వేదశ్రవణము హితకార్యము బ్రాహ్మణభోజనము శ్రీకృష్ణస్మరణము శుభకార్యము ద్రవ్యదానము అశ్వత్థప్రదక్షిణము ఉత్తమరత్నధారణము దీనులపోషించుట అను నుపచారములు "చంద్రుడంధకారము నశింపజేయుమాడ్కి" అష్టవిధ జ్వరముల నశింపజేయు.

శ్లో॥ సహస్రనేత్రస్యసహస్రబాహో స్సహస్రవక్త్రస్య సహస్ర
మూర్ధ్నః । సహస్రపాదస్యసహస్రనామ్నస్సహస్రనామ్నాం
పఠనం జ్వరఘ్నమ్ ॥

తా. వెయ్యినేత్రములు బాహువులు ముఖములు శిరములు పాదములు నామములుగల విష్ణుసహస్రనామపఠనము జేసిన జ్వరమునశించు.

శ్లో॥ గణేశ్వరోవా గరుడేశ్వరోవా గౌరీశ్వరోవా దివసేశ్వరోవా।
మహేశ్వరీ వా కులదైవతంవాతత్పూజనంతజ్జ్వరినాంప్రశస్తమ్॥

తా. గణేశుడు విష్ణువు శివుడు సూర్యుడు గౌరి లేక కులదేవత యనువారిలో నెవరినేని బూజించుటవలన జ్వరమునశించు.

## అతిసార కర్మవిపాకము.

శ్లో॥ స్వార్థాగ్నిం శమయే ద్యస్తు సోతిసారయుతో భవేత్ ।
అగ్నిరశ్మీత్స్రుచంజప్త్వా దశాంశంజుహుయాత్తిలాన్ ।
సర్పిషా చాప్లుతా న్దద్యా ద్ధిరణ్యం బ్రాహ్మణాయవై ।
అగ్నిరశ్మీతియమృత్వా తారతమ్యేనవాజపేత్ ॥

తా. బ్రాహ్మణులు మొదలగువారిస్మార్తాగ్ని నార్పినవానికిఅతిసారరోగము నించు. దానిశమనార్థంబై "అగ్నిరశ్మి" అనురుచమును రోగ తారతమ్యము నెఱింగి పించి ఘృతయుక్తముగ తిలలతో దశాంశహోమము బ్రాహ్మణునకు సువర్ణదాన ను జేయవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] అతిసారీస భవతియ స్త్రేతాగ్నివినాశకః । సువర్ణేనాథతామ్రేణ కుర్యాత్ప్రతికృతిం బుధః । వహ్నేశ్శక్త్యనుసారేణపలేనార్థేనవాపునః । తథాజ్వాలాకులాంగ క్తచందనేనవిలేపితామ్ । రక్తవస్త్రేణసంవీతాం నేమపస్యా పరిసంస్థితామ్ । రక్తమాల్యైశ్చసంఛన్నాం ముక్తాదామపరిష్కృతామ్ । కనకాచలవర్ణాభాం ద్వాదశార్కనిభాంశుభామ్ । బ్రహ్మచర్యాన్వితే విప్రే కర్మనిష్ఠేగ్నిహోత్రిణి । అంగులీయకవస్త్రాద్యై ర్యాభిషితేతాంనివేదయేత్ । మంత్రేణానేనవిధివదగ్నిప్రీత్యర్థమాదృతః ॥

తా. అగ్నిత్రయమును నశింపంజేయువానికి అతిసారము జనించు. దానిని వారణార్థంబై సువర్ణపర్వతముతో సమానమైన కాంతి ద్వాదశ సూర్యులవంటి కాంతిగల అగ్నిప్రతిమను శక్త్యనుగుణ్యముగ ½ పల మెత్తుబంగారుతో గాని తామ్రముతో గాని మేషవాహనయుక్తముగ చేయించి రక్తచందనను యెఱ్ఱవస్త్రము యెఱ్ఱని పుష్పమాలికలు ముత్తియములహారము అనువానితో నలంకరించి పిదప బ్రహ్మచారిని గాని లేక కర్మనిష్ఠుడగు ఆహితాగ్ని విప్రునిగాని యుంగరములు వస్త్రములు మొదలగువానిచే నలంకరించి పూజించి "శ్లో॥ త్రేతారూపాగ్నిరీడ్యస్త్వమంతశ్చాసిహైనృణామ్ । త్వంవేద్యప్రాక్తనంపాప మతిసారం వినాశయ । ఏవం కృతాపరస్సమ్యగతిసారం వ్యపోహతి । నీరుజస్సుఖీ నిత్యం దీర్ఘ మాయుశ్చ విదంతి॥" అనుమంత్రముతో దానము జేయవలయు.

శ్లో॥ [గ్రంథాంతరే] స్త్రీహంతా వాతిసారీస్యా దశ్వత్థారోపయేద్దశ। దద్యాచ్ఛశర్కరాధేనుం భోజయేచ్ఛతంద్విజాన్ ॥

తా. స్త్రీహత్య జేసినవానికి అతిసారరోగము జనించు. తన్నివారణార్థంబై

ర్పణమును జేయవలయు. (శర్కరాధేనుదాన విధానము రాజయక్ష్మ ప్రకరణమున జెప్పంబడియున్నది.)

## సంగ్రహణీ కర్మవిపాకము.

శ్లో॥ అనన్యగతికాం భార్యా మదుష్టాం కారణం వినా।
పరిత్యజతి యః సోపి గ్రహణీరోగవా న్భవేత్॥

తా. * అనన్యగతిగలదై పవిత్రముగనుండు భార్యను కారణములేకనే వర్జించెడు దుష్టునుజూనకు సంగ్రహణి రోగముజనించు.

## సంగ్రహణీరోగ శాంతి।

శ్లో॥ శివసంకల్పసూక్తస్య జపస్యాత్తత్రశాంతయే। అష్టోత్తరసహస్రంహోహిరణ్యాంచతథామధు। దద్యాద్విత్తానుసారేణ సౌరమంత్రజపస్తథా। ధేనుంసలక్షణాందద్యా ద్వస్త్రాభరణసంయుతామ్। కుమస్వేసీం గుణోపేతాంబ్రాహ్మణాయ కుటుంబినే। వత్సాభరణ సంయుక్తాం వస్త్రాభరణేనచ॥

తా. సంగ్రహణీ రోగశమనార్థంబై శివసంకల్ప సూక్తమును 1008 మార్లు జపించి బ్రాహ్మణులకు సువర్ణమును తేనెను శక్త్యనుసారముగ నొసంగవలయు. అటులనే సౌరమంత్రమునుకూడ జపింపవలయు. మఱియు సలక్షణ వస్త్రాభరణయుక్తంబై గుణసంపత్తి పాలుగలగోవును వస్త్రాభరణములచే నలంకరింపబడిన నాయావుదూడను కుటుంబియగు బ్రాహ్మణునకు దానం బివ్వవలయు.

## గుదరోగ కర్మవిపాకము.

శ్లో॥ సురాలనోదలేవాపి సకృద్ద్వేషంకరోతియః। గుదరోగోభవే త్తస్య పాపరూపస్సదారుణః। మాసంసురార్చనేనైవగోదానద్వితయేనచ। ప్రాజాపత్యేనచైకేన శామ్యంతిగుదజారుజః॥

తా. దేవాలయమును గాని లేక పుష్కరమునుగాని నశింపంచేసిన వానికి భయంకరమైన గుదరోగము జనించు. తన్నివారణార్థంబై 1 మాసము దేవపూజను జేసి 2 గోదానములను ప్రాయశ్చిత్తార్థముగ నొక ప్రాజాపత్యకృచ్ఛ్రముగ నివ్వవలయు.

---

* గత్యంతరము లేక.

## అర్శోరోగ కర్మవిపాకము.

శ్లో॥ దత్వాథ వేతనం యోఽధ్యే త్యాదాయాపిచ వేతనమ్ ।
అధ్యాపయేచ్చ జుహుయా ద్వాద్రోగీ యుతో భవేత్ ॥

తా. వేతనమునిచ్చి యధ్యయనము చేసినవానికిగాని లేక వేతనము దీసికొని యధ్యయనము జెప్పినవానికిగాని లేక ద్రవ్యమును దీసికొని హోమముచేసిన వానికి గాని అర్శోరోగము జనించు.

## స్వర్ణధేను దానము.

శ్లో॥ బోధాయనోక్తమథవా స్వర్ణధేనుం ప్రకల్పయేత్ । సౌవ ర్ణీం గాం ప్రకుర్వీత పలేనార్ధపలేనవా । పిత్తశాత్యానకుర్వీత కుర్వన్నేవ ఫలం లభేత్ । స్వర్ణశృంగీ రౌప్యఖురాం నానా వస్త్రై రలంకృతామ్। గ్రహణాం ప్రీణనార్థాయ నవధాన్యాని నిక్షిపేత్ । హోమస్తుపూర్వవ త్కార్యో గోవిందః ప్రియ తామితి।ఇదంవిష్ణుః ప్రతద్విష్ణుః విష్ణోర్నుకమితి బ్రువన్ । సమి ధాజ్య చరూన్హుత్వా పూర్ణాహుత్యం తమాచరేత్ । తత స్నాతశ్శుచిరోగీ బ్రాహ్మణం వేదపారగమ్। శ్రుతవృత్తోపసం పన్న మనుద్వేగకరంనృణామ్ । భక్త్యాయుక్త స్సమానీయ పూజయేత్ప్రీతిపూర్వకమ్ । అంగుళీయకవస్త్రాద్యై రుపాన చ్ఛత్రకై రపి । మంత్రేణానేన హ్యాశిష్యై దద్యాద్రోగి జి తాత్మవాన్ । గోవిందం మనసాధ్యాయ న్గవాంమధ్యేస్థితంవి భుమ్ । బర్హాపీడేన సంయుక్తం వేణువాదనతత్పరమ్ । గోపీ జనైః పరివృతం వన్యపుష్పావతంసకమ్ । గోవిందగోపీజనవ ల్లభేశ కంసాసురఘ్న త్రిదశేంద్రవంద్య । గోదానతృప్తః కు రుమే దయాళో ప్యర్శస్సు నాశం కుపితారివర్గ । దానే నానేనవిధివ దర్శసో జాయతే క్షయః ॥

తా. 1 పలము బంగారుతోగాని లేక ½ పలము బంగారుతోగాని ఒక గోవును జేయించి దానికి బంగారుకొమ్ములు వెండిగిట్టలుకల్పించి వస్త్రపు

లతో నలంకరించి షోడశోపచారములచే బూజించి నవగ్రహప్రీత్యర్థముగ నవధాన్యములనునిచి నవగ్రహములబూజించి "ఇదంవిష్ణుః ప్రతద్విష్ణుః విష్ణోర్నుకమ్" అను మంత్రత్రయముచే సమిధాజ్యచరువుల 1008 మార్లుగాని లేక 108 మార్లుగాని రోగతారతమ్యానుగుణముగ విష్ణుప్రీత్యర్థమై హోమముజేసి పూర్ణాహుతినొసంగి హోమమునుపరిపూర్తిజేసి తదనంతరము రోగిస్నానముజేసి పరిశుద్ధుడై వేదపారంగుడును శాస్త్రజ్ఞానాచారసంపన్నుడు శాంతుడునగు బ్రాహ్మణునికి అంగుళీయాభరణవస్త్ర ఛత్రోపానహములనొసంగి గంధపుష్పాదులచే బూజించి విష్ణుభక్తిగలవాడై "గోవింద మనసాధ్యాయన్" అనుమంత్రముచే స్వర్ణధేనువు నవగ్రహధాన్యములను దానము జేసిన జ్వరరోగము నివర్తించు.

## మందాగ్ని హారవిధి.

శ్లో॥ మందోదరాగ్నిర్భవతి సతిద్రవ్యేనవైయజేత్ ।
ప్రాజాపత్యత్రయం కృత్వా భోజయేత్సశతంద్విజాన్ ॥

తా. ద్రవ్యముండునపుడు వైశ్వదేవాది నిత్యయజ్ఞముల చేయకుండినవానికి అగ్నిమాంద్యరోగము గలుగు. తన్నివారణార్థంబై 3 ప్రాజాపత్య కృచ్ఛ్రప్రాయశ్చిత్తముల జేసికొని 100 బ్రాహ్మణులకు భోజనం బిడవలయు.

శ్లో॥ [పారాశర్యే] గోమాంసభక్షకోమందజఠరాగ్నిర్భవేన్నరః ।
ప్రాజాపత్యంచరేత్కృచ్ఛ్రమతికృచ్ఛ్రం తథైవచ ।
అగ్నిమంత్రం జపేన్నిత్యం శ్రీసూక్తంచవిచక్షణః ॥

తా. గోమాంసమును భక్షించినవానికి అగ్నిమాంద్య రోగముగలుగు. తన్నివారణార్థంబై ప్రాజాపత్యకృచ్ఛ్ర అతికృచ్ఛ్ర ప్రాయశ్చిత్తములం జేసికొని అగ్నిరక్షింతి అనుమంత్రమును శ్రీసూక్తమును జపింపవలయు.

శ్లో॥ [కర్మవిపాకసంగ్రహే] అకారణంగరందత్వా ప్రమారయతియఃపునః । సమందాగ్నిర్భవే దేవ మృతకల్పశ్చ జాయతే। యాతేరుద్రేతిసూక్తేన చరుంచజుహుయాద్ఘృతమ్। అష్టోత్తరశతం సమ్యక్తత్పాప స్యాపనుత్తయే । తామగ్నివర్ణామితి చ జపేత్సూక్తం సహస్రకమ్ । భోజయే ద్బ్రాహ్మణాన్సమ్యక్ కృత్వాదింశ త్పుష్టిర్భవేత్ ॥

తా. నిష్కారణముగ నొకనికి విషంబిడి చంపినవాడు అగ్నిమాంద్యరోగ పీడితుడై మృతతుల్యుడై జనించు. తద్దోషనివారణార్థంబై "యాతేరుద్ర" అనుసూక్తముచే అన్నాజ్యములతో అష్టోత్తరశత హోమమును జేయవలయు మఱియు "తామగ్నివర్ణాం" అను సూక్తమును సహస్రసంఖ్య జపముజేసి నలువది బ్రాహ్మణులను సంతర్పణము జేసిన సుఖము గలుగు.

## పాండురోగకర్మ విపాకము.

శ్లో॥ దేవద్విజద్రవ్యహారీ పాండురోగీ భవేన్నరః ।
కృచ్ఛ్రాతికృచ్ఛ్రే కుర్యాచ్చ చాంద్రాయణ మతంద్రితః ।
కుర్యాత్కూష్మాండహోమంచ స్వర్ణచంద్రేణ వాససీ ।
బ్రాహ్మణేభ్యో యథాశక్తిః పాండురోగస్య శాంతయే ॥

తా. దేవబ్రాహ్మణులద్రవ్యము నపహరించినవానికి పాండురోగము జనించు తన్నివారణార్థంబై కృచ్ఛ్రాతి కృచ్ఛ్ర చాంద్రాయణ కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తములగాని కుంశ్మాండ హోమమునుగాని జేయవలయు. లేక చంద్రప్రతిమను స్వర్ణముతో జేయించి దానితోడ వస్త్రద్రవ్యముల శక్త్యనుగుణముగ బ్రాహ్మణున కియ్యవలయు.

## శిరోవేదనాసహిత పాండురోగహరవిధి.

శ్లో॥ అగ్నిష్టోమాదికర్మాణి ప్రక్రమ్య నసమాపయేత్ ।
సః పాండురోగీ భవతి శిరోవేద వాన స్తథా ।
కృచ్ఛ్రాతికృచ్ఛ్రే కుర్యాచ్చ చాంద్రాయణ మతంద్రితః ।
శతంచ భోజయే ద్విప్రా న్మృష్టాన్నేన యథేప్సితమ్ ॥

తా. అగ్నిష్టోమాదికర్మలనారంభించి పరిసమాప్తి జేయకుండినవానికికపాలశూలయుక్తముగ పాండురోగము జనించు. తన్నివారణార్థంబై కృచ్ఛ్రాతికృచ్ఛ్ర చాంద్రాయణ ప్రాయశ్చిత్తములనుగాని 100 బ్రాహ్మణులకుమృష్టాన్నయుక్తముగ సంతర్పణముగాని జేయింపవలయు.

## కామలారోగ కర్మవిపాకము.

శ్లో॥ కామలీ భక్తచోరస్స్యాత్తస్య వక్ష్యామి నిష్కృతిమ్ ।
కుర్యాచ్చ పక్షిరాజానం విష్ణో ర్వాహన ముత్తమమ్ ।

సువర్ణేన యథా శక్త్యా పక్షయోర్మౌక్తికద్వయమ్ ।
నాసికాయాం తథా వజ్ర ముత్తరీయంచ రాజతమ్ ।
ఏవం కృత్వా గరుత్మంతం ఘృతద్రోణోపరి న్యసేత్ ॥
శ్వేతవస్త్రేణ సంవేష్ట్య శ్వేతమాల్యైః ప్రసమర్పయేత్ ।
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞో వైష్ణవో ధర్మపారకః ।
బ్రాహ్మణ స్త్వర్చితో భక్త్యా యజమానేన శక్తితః ।
ఉపచారైః షోడశభి ర్ద్విజ మభ్యర్చయే త్తథా ।

తా. అన్నమును దొంగిలించినవానికి కామలారోగము జనించు. తన్నివారణార్థంబై యజమానుడు తనశక్త్యను గుణముగ బంగారుతో విష్ణువాహనమైనగరుడపక్షిని జేయించిదాని 2 రెక్కలపై 2 ముత్తియములగట్టించి నాసికమున 1 వజ్రమును జెక్కించి రజితవస్త్రముతో నలంకరించి ద్రోణప్రమాణ ఘృతముపైనునిచి తెల్లని వస్త్రమును ధరింపంజేసి తెల్లనిపువ్వులచేతను షోడశోపచారములచేతను గరుత్మంతుని పూజించి సర్వశాస్త్రతత్త్వజ్ఞానముగలిగి ధర్మపఠనము సేయునట్టి విష్ణుభక్తుని శక్త్యనుగుణ్యముగ వస్త్రాభరణాదులచే నలంకరించి దానము సేయవలయు.

## ప్రతిమా దానము.

శ్లో॥ పీతాంగః కామలారోగః కపాలముసలాన్వితః ।
పూజావిధానం త్వాతంక దేవీందద్యాత్ చ సాధవే ॥

తా. కామలారోగపీడితుడు కాంతియందు పసపుఛాయగలదిగ హస్తములలో కపాల ముసలముల ధరించునట్టిదిగనుండు ఆతంకదేవీప్రతిమను జేయించి దానిని పూజించి బ్రాహ్మణునకు దాన మొసంగవలయు.

## రక్తపిత్త కర్మవిపాకము.

శ్లో॥ మద్యపో రక్తపిత్తస్స్యాత్సదద్యాత్సర్పిషా ఘటమ్ ।
మధు నోర్ధఘటంచైవ సహిరణ్యాం విశుద్ధయే ॥

తా. మద్యపానము సేయువానికి రక్తపిత్తరోగము జనించు. తన్నివారణార్థంబై 1 కుండనిండ ఘృతమును దానితో నరకుండ తేనెను సువర్ణయుక్తముగ దానము జేయవలయు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] చంద్రక్షేత్రే యదా భౌమో జాయతే మనుజస్తదా । రక్తపిత్తేన దుర్నామ్నా నానావ్యాధి సమాకులః ॥

తా. జననకాలమున చంద్రక్షేత్రమున అంగారకుడుండిన రక్తపిత్తము అర్శస్సు మొదలగు పలువిధరోగములు జనించు.

శ్లో॥ [మతాంతరే] రక్తపిత్తం జ్వరం దాహ మగ్నివాయ్వో రుపద్రవమ్ । లభతే నాత్ర సందేహ శ్చంద్రమధ్యే యదా కుజః । భౌమమంత్ర జపః కార్యో హోమః ఖాదిరజై స్తిలైః । ఘృతేనచ సమాయుక్తైః దానం రక్తవృషస్యచ ॥

తా. చంద్రమధ్యమున కుజుడువచ్చియుండ రక్తపిత్తము జ్వరము దాహము అగ్నివాతము అనువానియొక్క యుపద్రవంబులు గలుగు. తన్నివారణార్థంబై అంగారక మంత్రజపమును చంద్రసమిధలు నువ్వులు నెయ్యి అనువానితో హోమమును యెఱ్ఱనియెద్దు దానమును జేయువలయు.

## జ్యోతిశ్శాస్త్రోక్త చికిత్స.

శ్లో॥ బిల్వచందనబలాశణపుష్పై ర్హింగుబూకఫలినీ వకులైశ్చ । స్నానమద్భిరిహ మగ్నియుతాభి ర్భూమిజదోషనివారణమాశు॥

తా. బిల్వము చందనము ముత్తవపులగము శణపుష్పము హింగుళము నల్ల అత్తి పాగడకాయలు అనువాని యుక్తముగ నుడికమునుగాచి స్నానముజేయించిన చంద్రస్థానగత అంగారకదోషము శమించు.

## క్షయరోగకర్మ విపాకము.

శ్లో॥ బ్రహ్మహా క్షయరోగీ స్యాత్ క్షయీ స్యాత్ క్షేత్రమారణే ॥

తా. బ్రహ్మహత్యవలనగాని క్షేత్రము తోట స్త్రీలు మొదలగువానిని నశంపంజేయుటవలనగాని క్షయరోగము జనించు.

## కదళిదానము.

శ్లో॥ కారయేత్కదళీం దివ్యాం పత్రైస్సర్వత్ర సంయుతామ్ ఫలపూగేన సంయుక్తాం సువర్ణస్య పలేనతు । యథా విధ

వతః కుర్యాద్వస్త్రైణా వేష్ట్యసూత్రకైః। బ్రాహ్మణాన్భోజయే
చ్చాపి భక్ష్యైర్నానావిధైశ్శుభైః। హోమంచ కారయేత్తత్ర
పూర్వవద్బ్రాహ్మణేనచ। తస్మై తాంకదళీం దద్యాద్వస్త్రాలంకా
రపూర్వకామ్। పూజితాయదరిద్రాయ వ్రతస్థాయాత్మ వేదినే
ధర్మజ్ఞాయాతిదాంతాయమంత్రేణానేన శాంతయే। హిర
ణ్యగర్భపురుష పరాత్పరజగన్మయ। రంభాదానేన దేవేశ క్ష
యం కుపయమేప్రభో। పుణ్యాహవాచనం కార్యం బ్రాహ్మణై
ర్వేదపారగైః। శిష్టైరిష్టైర్బంధుభిశ్చసహభోజనమాచరేత్॥

తా. క్షయరోగి శక్త్యనుగుణముగ పలను బంగారుతో చుట్టు ఆకులు కాయలు పువ్వులు గలిగియుండునటుల సుందరమైన యరటిచెట్టును జేయించి దానిచుట్టు వస్త్రమునుజుట్టి దారముతో బంధించి పలువిధ పక్వాన్నములతోడ బ్రాహ్మణులకు భోజనం బిడిహోమునుజేసి అలంకారపూర్వకముగ పూర్వోక్తమైనయరటిచెట్టును దరిద్రుడు వ్రతస్థుడు ఆత్మజ్ఞుడు శాంతుడునైన బ్రాహ్మణునిపూర్వోక్త హిరణ్యగర్భాది మంత్రములతో బూజించి దాన మొసంగినపిదప వేదపారగులగు బ్రాహ్మణుల తోడ పుణ్యాహవాచనమును నుత్తమ బ్రాహ్మణ యిష్టబంధు పంక్తిభోజనమును జేయవలయు.

## బ్రహ్మచర్యాది యోగము.

శ్లో॥ ధర్మశాస్త్రాణ్యవిజ్ఞాయ ప్రాయశ్చిత్తం దదాతియః।
రాజయక్ష్మా భవేత్తస్య రోగఃపీడాతి దారుణః।
పూర్వోక్తేన విధానేన ప్రదద్యాత్ప్రతిరూపకమ్।
రాజయక్ష్మా కృశతను శ్శంఖోపాసిత తర్జనిః।
తథా త్రినేత్రో దంష్ట్రాభ్యాం తరుణో హేతి భిర్యుతః॥

తా. ధర్మశాస్త్రము దెలియక ప్రాయశ్చిత్తమును విధించెడివానికి కడుభయంకరమైన పీడగల రాజయక్ష్మ జనించు. తన్నివారణార్థంబై పూర్వోక్తవిధానముతో కృశమైనశరీరముగలదై తర్జనితో శంఖమును బట్టికొనునట్టుగ 3 నేత్రములుకలదిగ కోరపండ్లతో నునులునదిగ తరుణావస్థగలదిగ ఆయుధముల ధరించినదిగ నుండు క్షయరోగ ప్రతిమనుజేయించి దానముజేయవలయు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] బ్రహ్మచర్యేణదానేనతపసా దేవతార్చనైః।
సత్యేనాచారయోగేన రవిమండల సేవయా ।
వైద్యవిప్రార్చనాచైవ రోగరాజో నివర్తతే॥

తా. బ్రహ్మచర్య దానము తపము దేవపూజ సత్యము ఆచారము సూర్య పూజవైద్య బ్రాహ్మణపూజ అనువానివలన క్షయరోగము నివర్తించు.

శ్లో॥ [గ్రంథాంతరే] కుష్ఠకండూవికారైశ్చక్షయరోగభగందరైః।
గజాదివాహనభయం భవేద్యర్క యుతే బుధే ॥

తా. జననకాలమున సూర్యక్షేత్రమునందు గాని లేక సూర్యునితో గాని బుధుడు సంబంధించియుండిన కుష్ఠువు దురద క్షయము భగందరము లేక యేనుగు మొదలగు వాహనములవలన భయము గలుగు.

## దేవపూజాది యోగము.

శ్లో॥ చంద్రక్షేత్రే యదా చాంద్రి ర్జాయతే యస్య జన్మని ।
సజాతః క్షయరోగీస్యా త్కుష్ఠాదీనిచ పాండుతా ॥

తా. చంద్రక్షేత్రమునందు బుధయోగంబుండు లగ్నంబున జనించిన వానికి క్షయరోగంజేని కుష్ఠువు పాండు మొదలగు రోగంబులేని జనించు.

## శాస్త్రార్థము.

శ్లో॥ నిత్యం స్వదేవ పూజా ర్త్యౌషజ గురుభక్తి ఛాగమాంసప
యోశ్నన్ జీవతి యక్ష్మీ చిరం ధృతిమాన్ ॥

తా. ప్రత్యహము యిష్టదేవతాపూజ ఔషధము దేవగురుభక్తి మేకపోతు మాంసభక్షణము క్షీరపానము అనువానివలన క్షయరోగి చిరకాలము జీవించు.

## గీతాద్యుపాయము.

శ్లో॥ గీతవాదిత్రకై స్త్విష్టైః ప్రియస్తుతిభి రేవచ ।
హర్షణాశ్వాసనై ర్ద్విజై ర్యర్ధయాణాం సముపాసనైః ॥

తా. గీతవాద్యములు యిష్టకరపదార్థము ప్రియకరమైనస్తుతి ఆనందకరపదార్థములు పూరడింపుమాటలు ప్రత్యహము గురూపాసన అను నుపాయంబులవల క్షయరోగము శమింపజేయవలయు.

## కాస కర్మవిపాకము.

శ్లో॥ ద్రవ్యాణి చాల్పసారాణాం స్తేయంకృత్వా న్యవేషతః ।
చరే త్సాంతపనం కృచ్ఛ్ర మిత్యేవం మను రబ్రవీత్॥

తా. దుర్బలులయొక్క ద్రవ్యమును దొంగిలించువారికి కఫరోగము జనించు. తన్నివారణార్థంబై సాంతపనకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తముల జేసికొనవలయునని మనువు వచించె.

శ్లో॥ [అన్యశాస్త్రే] త్రపుహరీచ పురుషో జాయతే శ్లేష్మలస్సదా ।
ఉపోష్య దివసంసోపి దదా త్పలశతంత్రపు ॥

తా. తగరమును దొంగిలించినవానికి కఫరోగము జనించు. తన్నివారణార్థంబై 1 దినముపవాసము జేసి 100 పలములయెత్తు తగరమును దానము జేయవలయు.

శ్లో॥ [మతాంతరే] నిత్యానుష్ఠాన విముఖః కఫరోగీ భవేన్నరః ।
పరాభవం సమాప్నోతి త్యాహ భగవా న్యమః ।
తచ్ఛాంతయే మాసమేకం యావకం భక్షయే న్నరః ।
సహస్రనామ పాఠశ్చ హోమశ్చాష్టోత్తరాయుతమ్ ।
నామమంత్రేణ కుర్వీత చర్వాజ్యంచ హవిర్భవేత్॥

తా. సంధ్యావందనాది నిత్యకర్మలు చేయకుండినవానికి కఫరోగము జనించు. మఱియు కఫమువలనగాని లేక శత్రువులవలనగాని పీడగలుగునని యముడువచించె. తన్నివారణార్థంబై 1 మాసమువరకు యావకాన్నభోజనమును విష్ణుసహస్రనామ పఠనమును నామమంత్రములతోన న్నాజ్యయుక్తముగ * అష్టోత్తరాయుతహోమమును జేయవలయు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] రవికర్కటకేజాతే బుధేనసందృష్టకోవిగత
నేత్రః। కఫమారుతరోగార్తః పరస్వహారీవిలోలమతిచేష్టః॥

తా. జననకాలమున కర్కాటకరాశియందు సూర్యుడుండి బుధదృష్టియును గలిగియుండిన నష్టదృష్టిగలవాడుగ నేని కఫవాతరోగయుక్తుడుగ నేని లేక దొంగ. నను చంచలబుద్ధిగలవాడుగ నేని చంచలకర్మల జేయువాడుగ నేని నగు.

* పది వేలగు ౧౦,౧౦౮.

## హిక్కా- కర్మవిపాకము.

శ్లో॥ యఃకృత్వాబ్రాహ్మణోభుంక్తేస్నానహోమజపాదికమ్ ।
సహిక్కారోగ సంయుక్త స్తత్పాప స్యోపశాన్తయే ।
చాంద్రాయణత్రయంకుర్యా త్త్రీన్ కృచ్ఛ్రాంశ్చసమాచరేత్ ॥

తా. స్నానము హోమము జపాదికర్మల సేయక భోజనము జేసిన బ్రాహ్మణు నకు హిక్కారోగము గలుగు తద్దోషనివారణార్థంబై 3 చాంద్రాయణములను 3 ప్రాజాపత్య కృచ్ఛ్రప్రాయశ్చిత్తములను జేయవలయు.

## శ్వాస కర్మవిపాకము.

శ్లో॥ కృతఘ్నో జాయతే మర్త్యః కఫవాన్ శ్వాసకాసవాన్ ।
ఉష్ణజ్వరీచ నిత్యంహి పిత్తరోగ సమన్వితః ।
చాంద్రాయణ త్రయం కుర్యా త్పంచాశ ద్విప్రభోజనమ్ ।
విష్ణోర్నామజపం కుర్యా త్పంచాశ ద్విప్రభోజనమ్ ।
విష్ణోర్నామజపం కుర్యా త్తథాచైవ ద్విజోత్తమాన్
పూజయే ద్భోజయే ద్దద్యా దక్షిణా స్స్వవమానసః ॥

తా. కృతఘ్నుడుగ నుండువానికి కఫము శ్వాసము దగ్గు వుష్ణజ్వరము పిత్త రోగము గలుగు. తన్నివారణార్థంబై 3 చాంద్రాయణ ప్రాయశ్చిత్తముల జేసి 50 బ్రాహ్మణులకు భోజనంబిడి విష్ణునామములను జపించి బ్రాహ్మణులను బూ జించి వానికి యథాశక్తిగ దక్షిణమ దానము సేయవలయు.

శ్లో॥ [హేమాద్రి] కురుక్షేత్రాది దేశేషు కాలేషు గ్రహణా
దిషు। మహాదానాని గృహ్ణీయా న్నిషిద్ధాన్యశ్వవాస్వయమ్ ।
అపాత్రభూతో దాతృభ్యో విషిద్ధేభ్యశ్చ మానవః ।
సపాపాశ్వాస కాసైశ్చ కుక్షిస్థ కృమిభి స్తథా ।
కండూత్యాచైవ పీడ్యేత తద్రోగస్య ప్రశాంతయే ।
మహిషీం యమదైవత్యాం దద్యా ద్విత్తానుసారతః ।
కామ్యం యద్దీయతే దానం తత్సమగ్రం సుఖావహమ్ ।
అసమగ్రంతు దోషాయ భవతీహ పరత్రచ ।

జపే న్నారాయణ స్యాథ నామ్నాం చైవ సహస్రికమ్ ।
హిరణ్యాం రక్తనాసాంసి పంచాశ ద్విప్రభోజనమ్ ।
సహస్రకలశస్నానం ప్రకుర్యా ద్రోగశాంతయే ॥

తా. కురుక్షేత్రాది పుణ్యదేశముల గ్రహణాదీ పుణ్యకాలములయందు షోడశ మహాదానములుగాని నిషిద్ధమైతరణీ గోదానాదులగాని బొందినను అనర్హుడై దానమును బొందినను నిషిద్ధులగువారలవలన దానమును బొందినను అట్టివారలకు గజ్జి శ్వాసము కాసము కుష్ఠిరోగము కృమిరోగము దురదగలుగు. తన్నివారణార్థంబై యాముదేవతాక మహిషీదానమును తనవిభవానుసారముగ జేయవలయు. కామ్యకర్మను సంపూర్ణముగ జేసిన సుఖముగలుగు. సంపూర్ణముగాకుండిన దుఃఖకరంబగుటయేగాక నిహపరములయందును దోషహేతువగు. మఱియుసహస్రనామ జపమునుసువర్ణరక్తవస్త్రదానములు 50 బ్రాహ్మణులకు సంతర్పణమునుసహస్రకలశస్నానమును జేయించవలయు. దానివలన రోగము శమించు.

శ్లో॥ [కర్మకాండే] పిశునో నరకస్యాంత్యే జాయతే శ్వాసకాసవాన్ । ఘృతం తేన ప్రదాతవ్యం సహస్ర పలసంఖ్యయా ॥

తా. కొండెకాడు నరకాంతమునందు శ్వాసకాసరోగియై జనించు. తన్నివారణార్థంబై 1000 పలముల నెయ్యిని దానము జేయవలయు.

## అరుచి కర్మవిపాకము.

శ్లో॥ శ్రద్ధాహీనో ధనీప్యదాతా దానరతిర్వా తామస గుణాద్వితోయః । సోరుచిమాన్ శూలీవా జాయతే తస్యప్రాయశ్చిత్తం కృచ్ఛ్రమతికృచ్ఛ్రమ్ । చాంద్రాయణం వ్యస్తంసమస్తంవావ్యాధితారతమ్యేనకుర్యాత్ । అత్రాశక్తౌధంచనిత్యం పంచాశ ద్బ్రాహ్మణభోజనం ప్రతిదిన మిష్టాన్నమేవ కారయేత్ । అతాప్యశక్తౌ జపంహోమం తథాతీర్థం స్నానం వాపి సమాచరేత్ । తీవ్రవైరాగ్య సంయుక్తః కుర్యాద్బ్రాహ్మణ భోజనమ్ ॥

తా. ధనవంతుడైయుండి శ్రద్ధాహీనముగ అదాతగ లేక దానముజేసినను తామసదానపరుడుగ నుండువానికి అరుచియేని శూలయేని గలుగు తన్నివారణార్థంబైకృచ్ఛ్రఅతిక్రచ్ఛ్రచాంద్రాయణముల సంపూర్ణముగగాని లేక నాయారోగ

తారతమ్యమునకు దగినటుల ప్రాయశ్చిత్తమునుగాని జేయవలయు. మఱియు నీ ప్రాయశ్చిత్తము జేయుట కశక్తుడై ధనికుడుగనుండువాడు ప్రతిదినము 70 బ్రాహ్మణులకు పిండివంటకములతోడ భోజనంబిడవలయు. ధనవిహీనుడుగనుండువాడు జప హోమతీర్థస్నానముల జేయవలయు. తీవ్రవైరాగ్యమును ధరించి బ్రాహ్మణులకు భోజనం బిడిన రోగ విముక్తుం డగు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] అతిపరిభూతశ్రవణస్సహజయుతో మానవో భవతి। జీవేమందాగ్నివిజితో దుశ్చిత్తకః పాపకర్మాచ। దుశ్చికిత్సస్థానస్థితగురోః ప్రాగుక్తజపహోమ స్నానాదికం విదధ్యాత్।

తా. జన్మకాలమున సహజస్థానమునందు క్రూరగ్రహములుండినను లేక గురు సహజస్థానమునందు క్రూరగ్రహము లుండినను మందాగ్ని పాపకర్మ శత్రువునిచే జయింపబడుట దుశ్చిత్తగలవాడుగ జనించు. దుశ్చికిత్సస్థాన స్థితగురు దోషనివారణార్థంబై పూర్వోక్త జపహోమాదిక్రియలం జేయవలయు.

## ఛర్దిరోగ కర్మవిపాకము.

వా॥ యోబ్రాహ్మణాయ కేశకీటకాకసార మేయాద్యుపహతమన్నం జానన్నేవ ప్రమాదాత్ప్రియచ్ఛతి సచ్ఛర్దిమానన్యజన్మని।

తా. బ్రాహ్మణులకు వెంట్రుకలు పురుగులు కాకులు కుక్కలుఅనువాని వలన దుష్టంబైన యన్నమును ఉన్మత్తుడై బుద్ధిపూర్వకముగ నొసంగెడివానికి మఱియొకజన్మమున ఛర్దిరోగము జనించు.

వా॥ విశ్వాసఘాతకీఛర్ది యుక్తోభవతి తదువశాంతయే। పంచాశద్బ్రాహ్మణ భోజనంకారయేత్ । అన్నదానంచ యథాశక్త్యాజ్యయుక్తంచ కుర్యాత్ । తతఉపశాంతి ర్భవతి॥

తా. విశ్వాసఘాతము జేయువానికి ఛర్దిరోగముజనించు తన్నివారణార్థంబై 50 బ్రాహ్మణులకు భోజనం బిడవలయు. మఱియు శక్త్యనుగుణ్యముగఘృతయుక్తముగ అన్నదానమును జేయవలయు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] రిపుస్థానేయదాస్యాతాంచంద్రశుక్రౌతతో భవేత్ । ఛర్దిమార్గమనుజస్త్రష్టా యుక్తోవాప్యవలోకితే।

క్షీణచంద్రావలోకీతు షష్ఠస్థానస్థితో బుధః । శుక్రబాధోప
శాంతయే బుధస్య పూర్వోక్తమేవ సకలం జపాదీ విదధ్యాత్ ॥

తా. జననకాలమున 6 వ యింటిలో చంద్రశుక్రులుండిన లేక। వారల దృష్టికలిగియుండినను ఛర్దిరోగంబేని తృష్ణారోగంబేని జనించు లేక బుధుడు 6 వ స్థానమునందుండి వానికి క్షీణచంద్రునిపై దృష్టికలిగియుండిన ఛర్దిరోగంబేని లేక తృష్ణారోగంబేని గలుగు. శుక్రబుధదోషనివారణార్థంబై పూర్వోక్త జపాదులనన్నిటిని చేయవలయు.

## తృష్ణాకర్మ విపాకము.

శ్లో॥ పథిచాధ్వ పరిశ్రాంతం బ్రాహ్మణం గా మథాపివా ।
నపాయయే జ్జలం యస్తు సతృష్ణా మూర్ఛితో భవేత్ ॥

తా. బ్రాహ్మణుడుగాని ఆవుగాని మార్గమునందు బడలికచే దప్పివలన పీడింపంబడియుండ ఉదకము నొసంగకుండువానికి తృష్ణ మూర్ఛజనించు.

శ్లో॥ పానీయం పాయసం భక్త్యా శర్కరాఘృతసంయుతమ్ ।
ఇదమావశ్యతో దేయం మూర్ఛా తృష్ణోపశాంతయే ॥

తా. ఉదకము పాలు పంచదార లేక ఘృతము అనువాని బ్రాహ్మణులకు ముఖ్యముగ నొసంగిన (తానును భుజించిన) మూర్ఛ తృష్ణ హరించు.

## దాహరోగ కర్మవిపాకము.

వా॥ యఃపునరగ్నౌ క్షిపతి తంకపిలానామగ్రహో గృహ్ణాతి । తత్క్ష
ణా జ్వరశూలసర్వాంగదాహ పీతనయనశ్చ భవతి । బలించ
నిశిచతుష్పథే పిష్టలాజాపిణ్యాక రుధిర తిలాశ్వ గన్ధపుష్పై
ర్మిశ్రేణ దద్యాత్ ॥

శ్లో॥ గృహ్ణీష్వచ బలించేమం కపిలాఖ్య మహాగ్రహ ।
ఆతురస్య సుఖం సిద్ధిం ప్రయచ్ఛత్వం మహాబల ।

తా. అగ్నియందు నుమివేయువానికి కపిలనామకమను గ్రహముసోకి పీడించుటచే తత్క్షణమున జ్వరము శూల సర్వాంగదాహము నేత్రములయందు పసపువన్నెము అనుపద్రవంబులుగలుగు. తన్నివారణార్థంబై 4 త్రోవలమధ్య పిండిపేలాలు గానుగ

పిండి రక్తను నువ్వులు పెన్నేరుగడ్డ పువ్వులు అనువాని యుక్తముగ "గృహీత్వచ బలించేమం" అనుమంత్రముతో బలినివ్వవలయు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] తనౌభవతిభూపుత్రో రంధ్రే భవతిభాస్కరః।
జన్మకాలే యదా యస్య సదాహజ్వరవాన్భవేత్ ॥

తా. జన్మలగ్నమున అంగారకుడు అష్టమస్థానమున సూర్యుడుండిన దాహజ్వరము గలుగు.

## ఉన్మాదరోగ కర్మవిపాకము.

శ్లో॥ మోహయిత్వా పరాన్యస్తు భుంక్తే వస్తు విగర్హితమ్ ।
సోన్మాదవాతయుక్తస్స్యాత్కృచ్ఛ్రంచాంద్రాయణంతథా ।
కుర్యాత్సారస్వతంనామ జపేద్బ్రాహ్మణతర్పణమ్ ॥

తా. 2 వ మనుజునికి మోహము గలుగంజేసి నింద్యమైన వస్తువుచు భక్షణ జేయించినవానికి ఉన్మాదము వాతపీడగలుగు, తన్నివారణార్థంబై చాంద్రాయణ కృచ్ఛ్రప్రాయశ్చిత్తమునుగాని సరస్వతీనామ జపమునుగాని జేయుటయేగాక బ్రాహ్మణ సంతర్పణమును జేయవలయు.

## అపస్మార కర్మవిపాకము.

శ్లో॥ గురౌ స్వామినివర్తేయః ప్రతికూలం సమాచరేత్ ।
సోపస్మారీ భవేత్తత్ర కుర్యాచ్చాంద్రాయణం నరః ॥

తా. గురువులేకస్వామి వీరలవద్దనుండి ప్రతికూలముగనడచువానికి అపస్మారరోగముగలుగు. తన్నివారణార్థంబై చాంద్రాయణ ప్రాయశ్చిత్తముల జేయవలయు.

శ్లో॥ బ్రాహ్మణ శ్వాసరోధేన హ్యపస్మారీ భవేన్నరః ।
వక్ష్యే తస్య ప్రతీకారం దానహోమక్రియావిధిమ్ ॥

తా. బ్రాహ్మణునియొక్క శ్వాసమును బంధించినవానికి అపస్మారము గలుగు. దాని నివారణార్థంబై దానహోమక్రియాదుల జేయవలయు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] శనిభూసుత దినవాథావిధనస్థాయస్య జన్మకాలే స్యుః । నానావ్యాధివధాద్యైః పీడాం చాపస్మారసంభవాం తస్య ॥

తా. జన్మకాలమున శని అంగారకుడు సూర్యుడు అష్టమస్థానమునందుండిన పలువిధములైన రోగములుగాని అపస్మారముగాని గలుగు. తన్నివారణార్థంబై గ్రహతృప్త్యర్థముగ పూర్వోక్త జపాది సర్వోపచారములం జేయవలయు.

## వాతవ్యాధి కర్మవిపాకము.

శ్లో॥ దేవానాం బ్రాహ్మణానాంవా ధనాపహరణాత్తథా ।
స్వామిద్రోహా ద్వాతరోగీ భవేత్తస్యాపి నిష్కృతిః ॥

తా. దేవ బ్రాహ్మణులయొక్క ధనము నపహరించుటవలనగాని స్వామి ద్రోహమువలనగాని వాతరోగము జనించు. కావున దానికి పరిహారము జేయవలయు.

## వాతరోగహర విధి.

శ్లో॥ గురు ప్రత్యర్థితాంయాతో వాతరోగీ భవేన్నరః ।
నామమంత్రేణ కుర్వీత జపం హోమంచ శాంతయే ॥

తా. గురువును ద్వేషించువానికి వాతరోగముగలుగు. తన్నివారణార్థంబై వృత్తగోత్తర జెప్పంబడు అచ్యుత అనంత గోవిందాదినామ మంత్రములతో జపం హోమముల జేయవలయు.

## ధనుర్వాతహర విధి.

శ్లో॥ అనిచ్ఛంత్యాక్షతాంయస్తుహ్యుపభుంక్తే పరస్త్రియమ్ । బలా దాక్రమ్య సనర స్సర్వసంధిషు వేదనామ్ । తీవ్రామాప్నోత్య రుచిమార్గ ధనుర్వాతయుతో భవేత్ । జ్వరీ తదుప శాంత్యర్థం మహిషీదాన మాచరేత్ । కృచ్ఛ్రాతి కృచ్ఛ్రౌ కుర్వీత చాంద్రాయణ మథాపరమ్ । సూర్యనామజపంచైవ శక్త్యా బ్రాహ్మణతర్పణమ్ । నామత్రయం జపేన్నర్గోరోగశాంత్యర్థ మాత్మనః । సహస్రనామకంచాపి స్తోత్రం నమ్య గ్విధానతః। అచ్యుతానంతగోవిందే త్యేకన్నామత్రయంద్విజః । అయుత త్రితయావృత్త్యా జపే ద్రోగస్య శాంతయే ॥

తా. ఇచ్ఛయించని అక్షతయోనిగలపరస్త్రీతో బలత్కారముగ సంగమము జేయువానికి సర్వసంధులయందు తీవ్రవేదన అరుచి ధనుర్వాతముజ్వరము మొదలగు

ోగములు గలుగు. తన్నివారణార్థంబై మహిషీదాన కృచ్ఛ్ర అతికృచ్ఛ్ర చాంద్రాయణ ప్రాయశ్చిత్తములను సూర్యనామజపమును శక్త్యనుగుణ్యముగ బ్రాహ్మణసంతర్పణమును నామమంత్రజపమును సహస్రనామజపమును విధాన పూర్వకముగ జేయుటయేగాక అచ్యుత అనంత గోవింద అను 3 నామమంత్రముల 30,000 మార్లు జపము జేయవలయు.

## పక్షవాతహర విధి.

శ్లో॥ సభాయాం పక్షపాతీచ జాయతే పక్షఘాతవాన్ ।
నిష్కత్రయ మితం హేమ సదద్యాచ్చ ద్విజాతయే ।
శ్రాద్ధంచ వైష్ణవం కుర్యా దాత్మనోహిత మిచ్ఛయా ।
సప్తధాన్యాని దద్యాచ్చ గోదానం తత్రకారయేత్ ॥

తా. సభయందు పక్షపాతము జేయువానికి పక్షాఘాతవాతముగలుగు. తన్నివారణార్థంబై 3 నిష్కములయెత్తు బంగారును బ్రాహ్మణునికి దానముజేసి వైష్ణవశ్రాద్ధమును సప్తధాన్యదానమును గోదానమును జేయవలయు.

## రక్తవాతహర విధి.

శ్లో॥ రక్తవస్త్ర ప్రవాళానాం హారీస్యాద్రక్తవాతవాన్ ।
సవస్త్రాం మహిషీం దద్యా త్పద్మరాగ సమన్వితామ్ ॥

తా. ఎఱ్ఱనివస్త్రములను పగడములను దొంగిలించువానికి రక్తవాతముగలుగు తన్నివారణార్థంబై పద్మరాగములతోడ వస్త్రయుక్తముగ మహిషీదానమును జేయవలయు.

## రక్తవాత రక్తపిత్తహర విధి.

శ్లో॥ సవర్ణా గమనే వాత రక్తవాన్ జాయతేనరః। సవర్ణాగమనే వాత పిత్తవానపి జాయతే। లక్ష్మీనారాయణా రూపం సువర్ణేన ప్రకల్పయేత్ । పలేన వాతదర్ధేన తదర్ధేనాథవా పునః।
లక్ష్మీనారాయణంరూపం సర్వదా సర్వకామికమ్ ॥

తా. సవర్ణ స్త్రీగో సంగమముజేయువానికి వాతరక్తరోగంబైనిలేక వాతపిత్తరోగంబైనిగలుగు. తన్నివారణార్థంబై 4 లేక 2 లేక 1 రూపాయయెత్తు బంగారుతో

లక్ష్మీనారాయణ ప్రతిమను జేయవలయు. మఱియు యీలక్ష్మీ నారాయణ ప్రతిమను సర్వకాలములయందును సర్వకామవిషయముల యందును దానము జేయందగు.

## వాతపిత్తహర విధి.

శ్లో॥ లశునం గృంజనం తాలఫలం వాశ్నాతి యోద్విజః ।
సవాత పిత్తరోగీచ భవే చ్చాంద్రాయణం చరేత్ ॥

తా. వుల్లుల్లి గంజాయి లేక తాటిఫలము వీనిని భక్షణము నేయు బ్రాహ్మణునికి వాతపిత్తరోగములు గలుగు. తన్నివారణార్థంబై చాంద్రాయణ ప్రాయశ్చిత్తముల జేయవలయు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] అతిమారుతరోగార్తోపరస్వహారీవిలోలమతి
చేష్టః । కర్కటసంస్థేభానౌస్వపుత్రదృష్టేపుమాన్ పిశునః ॥

తా. జననకాలమున కర్కాటకరాశియందు సూర్యుడుండిన శని వీక్షణమును గలిగియుండిన కొంటెతనము వాతరోగము చోరవృత్తి చంచలచిత్తము గలుగు.

శ్లో॥ వాతపిత్తోద్భవా పీడా హీనజై రుగ్రవిగ్రహః ।
విదేశ గమనంచాపి సౌరిమధ్యే యదా శిఖీ ॥

తా. జననకాలమున శనిమధ్యమునందు కేతుసంబంధము గలిగియుండిన వాతపిత్తరోగము గలుగు. మఱియు హీనజాతివలన భయంకరమైన కలహంబేని పరదేశగమనంబేని గలుగు.

## ఆమవాత కర్మవిపాకము.

వా॥ హుతాగ్నినిర్వాతకోహ్యామవాతవా నితివచనాత్ ।
తమ క్తదోషశాంతయే అయుతసంఖ్యాకోగాయత్రీజపః ॥

తా. హోమాగ్ని నార్పిన వానికి ఆమవాతము జనించు. తన్నివారణార్థంబై 10,000 మార్లు గాయత్రీజపమును జేయవలయు.

వా॥ [జ్యోతిశ్శాస్త్రే] అష్టమోగురురామస్య కర్తాచేతివచనాత్ ।
అష్టమస్థానస్థితగురుజని తామవాతరోగోపశాంతయే ః తత్ప్రీ

తయేపూర్వోక్తమేవజపహోమపూజాదానాదికంకుర్యాత్ ।
తేనోపశామ్యతి ॥

తా. జననకాలమున అష్టమస్థానమునందు బృహస్పతియుండువానికి ఆమవాతముగలుగుతన్నివారణార్థంబై పూర్వోక్తజపహోమపూజాదానాదుల జేయవలయు.

## అజీర్ణశూల కర్మవిపాకము.

శ్లో॥ శూద్రస్యైవతుభుక్త్వాన్న మవ్రతస్య ద్విజస్యచ ।
శూలవ్యాధిర్భవే న్నిత్య మజీర్ణా చ్చాతిపీడితః ॥

తా. బ్రాహ్మణుడు శూద్రాన్నముగాని లేక దుర్వృత్తిగ బ్రాహ్మణాన్నమునుగాని భుజించిన నెల్లప్పుడుశూల అజీర్ణము గలుగు.

## ప్లీహశూల.

శ్లో॥ విశ్వాసవిషదాతాచ ప్లీహవాన్ జాయతేనరః ॥

తా. తనయందువిశ్వాసముగనుండువానికివిషంబిడుటవలనప్లీహశూలగలుగు.

## జఠరశూల.

శ్లో॥ శ్రుతాధ్యయన సంపన్నం యాచితా రమ కించనమ్ ।
బ్రాహ్మణం దాంతి మాహూయ దానార్థంన దదాతి యః ।
సభవేజ్జఠరీ శూలీ తథాధ్మా నీ చ కర్హిచిత్ ॥

తా. వేదాధ్యయనము సేయువాడు శ్రోత్రియుడు యాచకుడు దరిద్రుడు శమదమాది సాధనయుక్తుడునగు బ్రాహ్మణునిపిలపించి దానము జేయకుండినవానికి వుదరశూల కడుపుబ్బరము గలుగు.

## శమనము.

శ్లో॥ కృచ్ఛ్రాతి కృచ్ఛ్ర చాంద్రాణి సకుర్యా ద్రోగయుక్తయే ॥

తా. జఠరశూలగలవాడు కృచ్ఛ్ర అతికృచ్ఛ్ర చాంద్రాయణ ప్రాయశ్చిత్తములజేసిన యది నివర్తించు.

## అరుచి శూల.

వా॥ శ్రద్ధాహీనో ధనవాన్ దానేష్వరతి స్తామసదాసీ వాయస్సోరుచిమాన్ శూలీ జాయే తాత్రైపవిస్తారః ॥

తా. ధనవంతుడుగానుండువాడు శ్రద్ధాహీనముగగాని లేకతామసముగగాని దానముజేసిన అరుచి శూల గలుగు.

శ మ న ము.

శ్లో॥ చాంద్రాయణం చాతికృచ్ఛ్రం ప్రాజాపత్య మథాపరమ్ ।
హోమాద్య పిచకుర్వీత వ్యాధ్యాదే రను రూపతః ॥

తా. అరుచి శూలగలవాడు చాంద్రాయణ అతికృచ్ఛ్ర ప్రాజాపత్య ప్రాయశ్చిత్తములగాని రోగ తారతమ్యానుగుణ్యముగ హోమాదులగాని జేయవలయు.

శ్లో॥ సాక్షా ద్ధంతి గవాదీని యః పునర్జన నాంతరే ।
శిరోరోగీ శ్రోత్రరోగీ శూలీ చారుచిమా న్భవేత్ ॥

తా. ఆవునుగాని లేక బ్రాహ్మణులు మొదలగువారినిగాని జన్మాంతరమున స్వయముగ జంపినవానికి మస్తకశూల లేక అరుచిగలుగు.

శ మ న ము.

శ్లో॥ ఏత న్నివృత్తయే వర్షం ద్వివర్షంవా త్రివర్షకమ్ ।
చరేద్ఘృత వ్రతం చాంతే గోహిరణ్యాదికం దిశేత్ ॥

తా. పూర్వోక్తమైన గోహత్యాదిదోషములు నివర్తించుటకై 1 సంవత్సరం లేని లేక 2 సంవత్సరంబులేని ఘృతవ్రతమునుజేసి అంత్యమున బ్రాహ్మణునికిఆవును సువర్ణమును దానము జేయవలయు.

కటిశూల కర్మవిపాకము.

శ్లో॥ గోగామీ కటిశూలిస్యా త్తస్య చాంద్రాయణం తథా ।
కృచ్ఛ్రం వై చాతి కచ్ఛ్రంచ జపం సౌరంచనిర్దిశేత్ ॥

తా. గోగమనము చేయువానికి కటిశూలగలుగు. తన్నివారణార్థంబై చాంద్రాయణ కృచ్ఛ్రాతి కృచ్ఛ్రములనుగాని సౌరజపమునుగాని జేయవలయు.

క ర్ణ శూ ల.

శ్లో॥ మైథునం శ్రూయమాణో త్వితరోః కర్ణశూలీ భవేత్తు సః ।
స్యా చ్చైవ బధిరః కించి త్కపాలే సహ్యశబ్దవాన్ ॥

తా. మాతాపితృమైధునము నాకర్ణించువానికి కర్ణశూలగాని చెవిటితనము గాని లేక కపాలమున అసహ్యమైన శబ్దముగాని గలుగు.

శ మ న ము.

శ్లో॥ నిష్కవింశతికం దద్యా ద్బ్రాహ్మణాయకుటుంబినే ।
విష్ణుప్రకాశకా న్మంత్రా న్జపే ద్రోగోపశాంతయే ॥

కర్ణశూల శమించుటకై కుటుంబియగు బ్రాహ్మణునికి 20 నిష్కముల యెత్తు సువర్ణదానముగాని లేక విష్ణుదేవతా మంత్రజపమునుగాని జేయవలయు.

హ స్త శూ ల.

శ్లో॥ పూర్వజన్మని నాస్తిక్యా త్సంధ్యాది రహితోద్విజః ।
హస్తశూలీ సంభవతి నిష్కద్వాదశకం దిశేత్ ॥

తా. జన్మాంతరమున నాస్తికుడై సంధ్యాదికర్మల జేయకుండిన బ్రాహ్మణునికి హస్తశూలగలుగు. తన్నివారణార్థంబై 12 నిష్కములయెత్తు బంగారమును దానము జేయవలయు.

శ మ న ము.

శ్లో॥ భోజయే ద్బ్రాహ్మణా న్ఛక్త్యా జపే త్సౌరం హిరణ్యదః ॥

హస్తశూలగలవాడు శక్త్యనుగుణ్యముగ బ్రాహ్మణులకు భోజనంబిడి సువర్ణమును దానముజేసి సౌరజపమును జేయవలయు.

న య న శూ ల.

శ్లో॥ నగ్నాం పరస్త్రియం దృష్ట్వా సూర్యం నాస్తమ యోదయే।
నేత్రశూలీ భవే త్సోపి నేక్షితుం క్షమతే దిశః ॥

తా. నిర్వాణముగ నుండునపుడు పరస్త్రీని చూచెడువానికిగాని లేక ఉదయాస్తమయకాలముల సూర్యావలోకము జేసెడివానికిగాని నేత్రమునందు శూలరోగముగలుగు, దానివలన దిక్కుల జూచుట కశక్యంబగు.

శ మ న ము.

శ్లో॥ వర్గోత్తమే నోహి మంత్రేణ జపస్స్యా దష్టచాయుతమ్ ।
వయస్సుపర్ణా ఇతిచ మంత్రైస్సించేచ్ఛ వారిణా ॥

తా. నేత్రశూలరోగి "వర్ష్చమేదేహి" అను మంత్రమును 10008 మా జపించుటయే గాక "వయస్సుపర్ణా" అను మంత్రముతో అభిషేకము సగా జేయ వలయు.

## శూలకర్మ విపాకము.

శ్లో॥ శూలీ పరోపతాపేన జాయతే వపుషా తనుః ।
సోన్నదానం ప్రకుర్వీత తథా రుద్రం జపే చ్ఛుదః ॥

తా. పరునికిదుఃఖముగలుగజేసెడువానికి శూలరోగముజనించి శరీరముకృశి చు. తన్నివారణార్థంబై అన్నదానముగాని లేక రుద్రజపమునుగాని జేయవలయు

## అనాహ ఉదావర్తకర్మవిపాకము.

వా॥ దేవద్విజక్షేత్రతటాకవల్మీకకూపాదీనాంయోభేదనం కరోతి తం వాయసోనామగ్రహో గృహ్ణాతి । తల్లక్షణ మాధ్మానో దావర్తి జ్వరారుచిమార్గా పాదదాహించ జాయతే ॥

తా. దేవబ్రాహ్మణుల భూమిఁ వపహరించిన వానికిని చెరువులు పుట్టలు బా వులు మొదలగువాని నశింపంజేసిన వానికిని వాయసమను గ్రహముసోకు. దానివల కడుపుబ్బరము ఉదావర్తము జ్వరము అరుచి అరకాలియందుమంట అనువనిగలుగ

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] మధ్యేపాపగ్రహ యోశ్చంద్రే మదనేస్థితే ర్కజేదంతోః। శ్వాసక్షయవిద్రధిగుల్మప్లీహాదిపీడిత స్సనరః ॥

తా. జననకాలమునందు పాపగ్రహమధ్యమున చంద్రుడుండి సప్తమస్థా మున శనియుండిన శ్వాసము విద్రధి గుల్మము ప్లీహము మొదలగు రోగములు గలుగ

## గుల్మరోగ కర్మవిపాకము.

శ్లో॥ గురుప్రత్యర్థి తాంయాతో గుల్మవాన్ జాయతేనరః ।
ఆచరే త్తన్నివృత్యర్థం మాసమేకం పయోవ్రతమ్ ॥

తా. గురుతిరస్కారకార్యము జేయువానికి గుల్మరోగము జనించు. అ నివారించుటకై 1 మాసము పయోవ్రతము జేయవలయు.

## హృద్రోగ కర్మవిపాకము.

శ్లో॥ ఉదక్యా వీక్షితం భుక్త్వా జాయతే కృమికోదరః ।

గోమూత్రయావకాహార స్సప్తరాత్రేణ శుద్ధ్యతి ।

తా. రజస్వలగానుండు స్త్రీ యవలోకనముజేసిన యన్నమును భుజించుట వలన ఉదకమున క్రిములుజనించు. అదినివర్తించుటకై 7 దినములు గోమూత్రమును యవధాన్యమును భుజింపవలయు.

శ్లో॥ అభక్ష్య భక్షణేచ్చైవ జాయంతే కృమయో హ్యాది ।
అథవా తద్విశుద్ధ్యర్థ ముపోష్యం భీష్మపంచకమ్ ॥

తా. అభక్ష్యపదార్థములను భుజించుటవలన ఉదరమున క్రిములు జనించు, తన్నివారణార్థంబై భీష్మపంచక ముపవాసమును జేయవలయు.

శ్లో॥ గజేచ నిహతేవా శ్వే కృమికుక్షిస్తు జాయతే ॥

తా. ఏనుగును లేక గుఱ్ఱమును జంపినవానికి ఉదరమున క్రిములు జనించు.

శ్లో॥ మృతేభర్తరి యా నారీ నీలీవస్త్రం పరిధారయేత్ ।
సామృతా నరకంయాతి కృమికుక్షి స్తతః పరమ్ ॥

తా. పెనిమిటి మరణానంతరమున నీలివస్త్రమును ధరించిన స్త్రీ మరణానంతరము నరకము ననుభవించి 2 వ జన్మమున కడుపులో క్రిమిపీడగలదై జనించు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] పాటితస్యాదయోహిబుకేనిర్వాహనబాంధవాద్రిసతిసౌఖ్యమ్ । బాల్యే వ్యాధితదేహోనఖరో మధగో భవే త్సౌరిః ॥

తా. జననకాలమునందు 4 వయింటిలో శనిగ్రహంబుండిన యొ్మ్మనొప్పి బంధుపీడ భార్యాసౌఖ్యము బాల్యమునందువ్యాధినఖకేశధారణముగలవాడై యుండు

మూత్రకృచ్ఛ్ర కర్మవిపాకము.

శ్లో॥ గురుజాయాభి గమనా న్మూత్రకృచ్ఛ్రః ప్రజాయతే ।
తేనాపి నిష్కృంతిః కార్యా శాస్త్రదృష్టేన వర్త్మనా ।
పశుయోనౌచ గమనా న్మూత్రకృచ్ఛ్రం ప్రజాయతే ।
తిలపాత్ర త్రయంచైవ సదద్యా దాత్మశుద్ధయే ॥

తా. గురుభార్య సంగమము జేసినవానికి మూత్రకృచ్ఛ్రము జనించు. తన్నివారణార్థంబై శాస్త్రమున జెప్పంబడియుండు ప్రకారము శాంతిచేయవలయు. పశుమైధునము చేయువానికి మూత్రకృచ్ఛ్రము జనించు. కావున నాత్మశుద్ధ్యర్థము 3 తిలపాత్రలదానము జేయవలయు.

శ్లో॥ [జ్యోతిశ్శాస్త్రే] జన్మకాలే యదాయస్యస్తరేభవతిభాస్కరః।
రాహుయుక్తః ప్రకురుతే మూత్రకృచ్ఛ్రాదికాం రుజమ్ ॥

తా. జన్మకాలముల సప్తమస్థానమునందు శనిరాహువులుగలవానికి మూత్రకృచ్ఛ్రాది రోగములు జనించు.

## అశ్మరీ కర్మవిపాకము.

వా॥ పరస్త్రీగామీ హ్యపస్మారీ భవత్యశ్మరీవాన్ ॥

తా. పరస్త్రీగమనము సేయువానికిఅపస్మారముగాని అశ్మరీమూత్రకృచ్ఛ్రముగాని జనించు.

## శమనము.

వా॥ స్వర్ణదానం కార్యం తస్య సర్వరోగే దానస్యోక్తత్వాత్ ॥

తా. కావున వాని నివారణార్థమై స్వర్ణదానమును జేయవలయు.

వా॥ [జ్యోతిశ్శాస్త్రే] శూలప్రమేహపీడిత మశ్మర్యుపహతమూన నంచాపిజనయతిరవిణాదృష్టో జీవగ్రహేచాంద్రజః పురుషమ్ । గురుగ్రహావర్తమానరవిదృష్ట బుధజనితాశ్మరీరోగ ప్రతీకార పూర్వకంబుధప్రీతయే పూర్వోక్తమేవ జపాదికంకుర్యాత్ ॥

తా. జననకాలమునందు గురువుతోడ బుధుడుండి సూర్యునిచే జూడంబడుచుండిన శూల ప్రమేహము అశ్మరీరోగముగలుగు. కావున వాని శమనార్థంబై బుధగ్రహ ప్రీత్యర్థము పూర్వోక్తజపాదుల జేయవలయు.

## ప్రమేహ కర్మవిపాకము.

శ్లో॥ చాండాలీగమనాత్సర్వ ప్రమేహవ్యాధిమాన్భవేత్ ।
క్షుత్పిపాసాతురశ్చైవ జాయతే తస్య నిష్కృతిః ।
చాంద్రాయణత్రయం కుర్యా ద్యవమధ్యం తథా పరే ।
జుహుయాత్సర్పిషాచైతాన్ జపేన్మంత్రాన్ సమాహితః ॥

వాక్యమ్॥ ఇద మాపః ప్రవహ తేతి ॥

తా. చండాల స్త్రీగమనము జేయువానికి సర్వమేహ రోగములుగాని అకలిదప్పి అను రోగములుగాని జనించు. కావున వాని శమనార్థంబై 3 యవసుధ్య చాంద్రాయణ ప్రాయశ్చిత్తముల జేసి రెండవదినమున "ఇదమాపః ప్రవహత" అను మంత్రజపమును మఱియు నీమంత్రముతోడనే సహస్రాజ్యహోమముల జేయవలయు.

## శూలమేహ కర్మవిపాకము.

శ్లో॥ తిర్యగ్గామీ సశూలేన ప్రమేహేన యుతో భవేత్ ।
కుర్యాత్సాంతపనాదీని ప్రాయశ్చిత్తం యథావిధి ॥

తా. ఆవు గొఱ్ఱెను మొదలగు జంతువులను మైధునము జేసిన వానికి శూల మేహము జనించు. తన్నివారణార్థంబై యథావిధిగ సాంతపనాది ప్రాయశ్చిత్తముల జేయవలయు.

## వాతమేహ కర్మవిపాకము.

శ్లో॥ పర్వవ్యవాయీ మనుజః కన్యాగామీ తథైవచ ।
వాతప్రమేహయుక్తస్స్యాత్కుర్యాచ్చాంద్రాయణత్రయమ్॥

తా. అమావాస్య పౌర్ణమ మొదలగు పర్వతిథులయందు స్త్రీసంగమముగాని లేక కన్యాసంగమముగాని జేయువానికి వాత మేహము జనించు. తన్నివారణార్థమై 3 చాంద్రాయణ ప్రాయశ్చిత్తముల జేయవలయు.

## మధుమేహ కర్మవిపాకము.

శ్లో॥ మధుమేహీ మాతృగామీ సతతం జాయతే నరః ।
పితృభార్యాభిగామీచ జలమేహీ నరాధమః ।
యోగచ్ఛేద్భగినీం నిత్య మిక్షుమేహీభవేన్నరః ।
ప్రాయశ్చిత్తంక్రమాదత్ర*షడ్వర్షాణ్యథపంచచ ।
త్ర్యబ్దమిత్యాచరేత్తస్య క్తతో రోగాత్ప్రముచ్యతే ।

తా. మాతృగమనము జేసినవానికి మధుమేహమును చవతితల్లిగమనవ వానికి జలమేహమును సహోదరీగమనము జేసినవానికి యిక్షుమేహమును

వాని నివారణార్థమై జెప్పంబడిన ప్రాయశ్చిత్తములను క్రమముగ 6 5 3 సంవత్సరములు జేయవలయు.

ఉదర కర్మవిపాకము.

శ్లో॥ యో బ్రహ్మవిష్ణురుద్రాణాం మధ్యే చైకం విభావయేత్।
సాధయే దుదరవ్యాధి యుక్తో భవతి మానవః ॥

తా. ఎవడు బ్రహ్మ విష్ణు రుద్రులలో నొకని నేని యధికముగ భావించి సాధించెడినో అట్టివానికి వుదర రోగముగలుగు.

శ మ న ము.

శ్లో॥ కుర్యా త్కృచ్ఛ్రం చాతికృచ్ఛ్రం చాంద్రాయణ మథాపరం।
సహస్రకలశస్నాన మీశ్వరస్యతు కారయేత్॥

తా. ఉదరరోగ నివారణార్థంబై కృచ్ఛ్ర అతికృచ్ఛ్ర చాంద్రాయణాది ప్రాయశ్చిత్తములను రుద్రునికి 1000 కలశములతో నభిషేకమును జేయవలయు.

జలోదర కర్మవిపాకము.

శ్లో॥ రాజ్ఞావాతు నియుక్తేన నియుక్తో ధర్మనిశ్చయే ।
పురోహితః ప్రాడ్వివాక స్సచివో వాన్యథా చరేత్।
జలోదరత్వం ప్రాప్నోతి తస్య వక్ష్యామి నిష్కృతిమ్ ॥

తా. ధర్మనిర్ణయమునకై నియమింపబడిన రాజుగాని లేక రాజుచే నియమింపబడిన పురోహితుడుగాని న్యాయాధిపతిగాని మంత్రిగాని న్యాయవిరుద్ధముగ జరిగించిన జలోదరము గలుగు. దానికి శాంతిని వచించెద.

శ మ న ము.

శ్లో॥ పయసా వర్తయే న్మాస త్రితయం వ్రత ముత్తమమ్ ।
సహస్రకలశస్నానం మహాదేవస్య చైవహి ।
భోజయేచ్ఛ శతం విప్రా న్ముచ్యతే కిల్బిషా త్తతః ॥

తా. జలోదర శమనార్థంబై 3 మాసములు పయోవ్రతమును మహాదేవునకు సహస్రకలశ స్నానమును జేయించి 100 బ్రాహ్మణులకు భోజనంబిడవలయు.

## ఉదర కర్మవిపాకము.

శ్లో॥ గర్భపాతనజా రోగా యకృత్ప్లీహజలోదరాః ।
తేషాం ప్రశమనార్థాయ ప్రాయశ్చిత్త మిదం స్మృతమ్ ॥

తా. గర్భపాతము గలుగజేయుటచే యకృత్ప్లీహ జలోదరములు జనించు. వానిశమనార్థమై ప్రాయశ్చిత్తమును వచించెద.

## శమనము.

శ్లో॥ ఏతేషు దద్యా ద్విప్రాయ జలధేనుం విధానతః ।
సువర్ణరౌప్యతామ్రాణాం పలత్రయ సమన్వితామ్ ॥

తా. పైజెప్పబడిన రోగశమనార్థంబై బ్రాహ్మణులకు విధ్యుక్తముగ 3 పలములయెత్తు బంగారు నేని వెండి నేని తామ్రము నేని జలధేనువుతోడ దానము సేయవలయు.

## ప్లీహోదర కర్మవిపాకము।

శ్లో॥ భృతకాధ్యాపకోయస్తు కన్యాదూషణతత్పరః ।
ప్లీహవాన్ సంభవే ద్విప్రో జపే చ్ఛ్రీసూక్త మేవహి ॥

తా. వేతనముదీసికొని యధ్యయనము జెప్పెడువాడును కన్యాదూషణముజేసెడివాడును ప్లీహరోగపీడితుండగు తచ్ఛమనార్థంబై శ్రీసూక్తజపమునుజేయవలయు

## శమనము.

శ్లో॥ అయుతత్రయసంఖ్యాకం ప్లీహోదరవిముక్తయే ।
ప్రత్యృచంచ భవేద్ధోమ శ్చరుణా సర్పిషా పృథక్ ॥

తా. ప్లీహోదరముగలవాడు 30000 మార్లు శ్రీసూక్తజపమును జేయవలయు. మఱియు ప్రతిఋక్కుచేత అన్నాజ్యముల ప్రత్యేక ప్రత్యేకముగ హోమముజేయవలయు.

## శోఫ కర్మవిపాకము.

శ్లో॥ అరామే మార్గే నదీతీరే ఛాయాయాం పులినే నరః ।
మూత్రం పురీషం వల్మీకే యత్త్యజంచే జ్జలేపివా ।

శ్వయథువ్యాధి మాప్నోతీ త్యేవ మాహ సదాశివః ।
ఇంద్రంవఇతి మంత్రంహి జపే దష్టోత్తరాయుతమ్ ।
ఆపోహిష్ఠే తి హోమస్స్యా చ్చరుణా సర్పిషాయుతమ్ ॥

తా. పర్వతము మార్గము నదీతీరము నీడ యినుకగిన్నె పుట్ట జలము అను వానియందు మూత్రమునుగాని మలమునుగాని విసర్జనము సేయువానికి శోఫరోగము గలుగునని మహాదేవుడు వచించె. తద్దోష శమనార్థంబై "ఇంద్రంవఇతి" అను మంత్రముతో 10008 అష్టోత్తరజపమును "ఆపోహిష్ఠేతి" అనుమంత్రముతో అన్నాజ్య హోమములను జేయవలయు.

శోఫహర ప్రతిమాదానము.

శ్లో॥ శోఫః పంచకర స్త్రీక్ష్ణో దశాస్య శ్శరచాపధృక్
దధానం ఛురికాం ఘంటాం కులిశంచ కృశ స్తథా ॥

తా. శోఫరోగమున 5 చేతులు 10 ముఖములు, క్రూరత్వము బాణముధనుస్సు కత్తి గంట వజ్రము అనువానిని ధరించుకొని శరీరము కృశించి యుండునటులరోగ ప్రతిమంజేసి దానము జేయవలయు.

గళగండ కర్మవిపాకము.

శ్లో॥ గళగండీ గణద్రవ్య హర్తా భవతిమానవః । దానేనత త్ప్రతీకారం వక్ష్యామి శృణుభాస్కర । మాణిక్యం పద్మరాగంచ వజ్రమౌక్తికమేవచ । వైడూర్యం పుష్యరాగంచ నీలంమరకతం తథా । ఏభి ర్మాలాంప్రకుర్వీత సూత్రస్యపరాజితమ్ । అలాభే మౌక్తికా దన్య తమైర్మాలాం ప్రకల్పయేత్ । సర్వత్ర రాజతంసూత్ర మిణి వేదే ప్రకల్పితమ్ । తామ్రపాత్రే వినిక్షిప్య తిలానా ముపరిన్యసేత్ । తిలానాంచ పరీమాణం ద్రోణపంచక మిష్యతే ॥

వాక్యమ్॥ తత ఊర్ధ్వంనవగ్రహాది మహాశాంతిం కుర్యాత్ ।రత్న మాలాంపూజయిత్వా వేదశాస్త్రవిదే బ్రాహ్మణాయదద్యాత్ ॥

తా. సముదాయ ద్రవ్యము నపహరించువానికి గళగండరోగముగలుగు.తన్ని వారణార్థంబై మాణిక్యము పద్మరాగము వజ్రము ముత్యములు వైడూర్యము

పుష్పరాగము ఇంద్రనీలమణి పచ్చలు అను వానినిగాని వానిలో దారకెడివానిని గాని వెండితీగెలో జేర్చి మాలికజేసి తామ్రపాత్రయందు పైగు ద్రోణములయెత్తు నువ్వులుబోసి దానిపైని యామాలికనునిచి నవగ్రహాది మహాశాంతింజేసి పూజించి వేదశాస్త్రసంపన్నుండగు బ్రాహ్మణునికి దానము జేయవలయు.

## గండమాల కర్మవిపాకము.

శ్లో॥ అధ్యాపయతిశిష్యాంస్తు యః ప్రతార్యగురు స్తథా। శిష్యో గురుంవంచయిత్వా యోధితేశ్శృణుతస్యచ। జాయతే గండ మాలాఖ్యోరోగ స్తదుపశాంతయే। అభక్ష్యపానపాయీవా గండమాలీభ వేన్నరః। కృచ్ఛ్రత్రయంప్రకుర్వీత చాంద్రా యణ మథాపరమ్। అష్టోత్తర సహస్రంతు జపే త్పురుష సూక్తకమ్। సౌరమంత్ర జప స్తద్వ చ్ఛక్త్యా బ్రాహ్మణ భోజనమ్। ఇతికృత్వా నరస్సమ్య గ్గళగండా ద్విముచ్యతే॥

తా. గురువు శిష్యునివంచించి యధ్యయనము జెప్పుటవలనగాని లేక శిష్యుడు గురువునువంచించి యధ్యయనము జేయుటవలనగాని లేక అభక్ష్య భక్షణములవలన గాని మద్యాదిపానములవలనగానిగండమాలజనించు. తన్నివారణార్థంబై 3 కృచ్ఛ్రములు లేక చాంద్రాయణము అష్టోత్తరసహస్ర పురుషసూక్తజపములేక అష్టోత్తరస హస్ర సౌరమంత్రజపము బ్రాహ్మణసంతర్పణమొదలగు నుపకారముల రక్త్యనుగుణ్యముగ జేయవలయు.

## శ్లీపద కర్మవిపాకము.

శ్లో॥ స్వగోత్రాంయాంభిగమనా చ్ఛ్లీపదీ జాయతే నరః।
యోన్యా మసృక్ప్ర స్రవతి తత్రచాంద్రాయణం చరేత్।
మాసం పయోవ్రతంచైవ తస్మాద్రోగా త్ప్రముచ్యతే॥

తా. స్వగోత్రస్త్రీతో సంగమము జేయువానికి శ్లీపదరోగము జనించ మఱియు స్త్రీస్వగోత్ర పురుషునితో సంగమముజేసిన యోనివలన రక్తస్రావమగు ను. వాని శమనార్థంబై చాంద్రాయణ ప్రాయశ్చిత్తమును 1 మాసమువరకు పయోవ్రతమును జేయవలయు.

## శ్లీపదరోగ ప్రతిమాదానము.

శ్లో॥ శ్లీపదస్త్రీపదః కుంఠః పతేత్తూర ధనుర్ధరః ॥

తా. పాదములు కుంఠత్వము యేనుగుకాలుగలదై దిగుబడునటుల నుండునట్టి శ్లీపదరూప ప్రతిమను జేయించి దానము జేయవలయు.

## మస్తకవ్రణ కర్మవిపాకము

శ్లో॥ జాత్యుత్తమస్త్రీగమనా జ్జాయతేమస్తకవ్రణః ।
తత్పాతకవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యవ్రతం చరేత్ ॥

తా. ఉత్తమజాతిగల స్త్రీతో సంగమము జేయువానికి శిరమున వ్రణముగలుగు. తద్దోషనివారణార్థంబై ప్రాజాపత్య వ్రతమును జేయవలయు.

## భగందర కర్మవిపాకము.

శ్లో॥ స్వగోత్ర స్త్రీప్రసంగేన జాయతేచ భగందరీ । తేనాపి నివృత్తిఃకార్యా మేషీదానేనయత్నతః । దేవానాం యో ముఖంహవ్య వాహన స్సర్వపూజిత । తస్మాత్త్వంవాహనం పూజ్యం దేవైస్సేంద్రైర్మహర్షిభిః । భగందరః పూర్వకర్మ విపాకోత్థంతుయన్మమ । తత్సర్వం నాశయక్షిప్రం సౌఖ్యం చాపి ప్రవర్ధయ ॥

తా. స్వగోత్రస్త్రీతో సంగమముజేయువానికి భగందరముగలుగు. తన్నివారణార్థంబై (బంగారుగిట్టలు వెండికొమ్ములు మొదలగువానితో నలంకరింపబడిన) మేకను "దేవానాం యోముఖ హవ్య" అనుమంత్రముతో స్తుతించి దానముజేయవలయు.

## ఉపదంశ కర్మవిపాకము.

శ్లో॥ మాతృగామీ భవేద్యస్తు తస్యలింగం విపశ్యతి ।
చాండాలీ గమనేచైవ హీనకుష్ఠః ప్రజాయతే ।
తస్యప్రతి క్రియాంకర్తుం కుంభముత్తరతో న్యసేత్ ॥

వా॥ తత్రోపరికుబేరప్రతిమాం సౌవర్ణీం కృష్ణవస్త్రావృతాంమాల్యభూషితా మావాహనాది షోడశోపచారైః ప్రత్యహం

పూజయేత్ । అథర్వవేదపారాయణంకుర్యాత్ । సమాప్తేపా రాయణే ప్రతిమాంబ్రాహ్మణాయ దద్యాత్ । దానమంత్రతః ।

శ్లో॥ నిధీనా మధిపోదేవ శ్శంకరస్య ప్రియస్సఖా ।
సౌమ్యాశాధిపతి శ్శ్రీమాన్ మమపాపంవ్యపోహతు ।
ఇమంమంత్రం సముచ్చార్య ప్యాచార్యాయ యథావిధిః ।
దద్యాదేవం హీనకుష్ఠీ లింగనాశీచ శుద్ధ్యతి ॥

తా. మాతృగమనము సేయువానికి లింగనాశనముగలుగు. మఱియు చండాల స్త్రీగమనము సేయువానికి శ్వేతకుష్ఠువుగలుగు. తద్దోషనివారణార్థంబై అగ్నికి ఉత్తరదశయందు కలశముస్థాపించి దానిపై బంగారుతో కుబేర ప్రతిమంజేసి యునిచి నల్లనివస్త్రముగట్టి పుష్పమాలికలచే నలంకరించి ప్రతిదిన మావాహనాది షోడశోపచారములచే బూజించి దానికెదురుగ అథర్వణవేదపారాయణమును జేసి సమాప్తియైన పిదప యాప్రతిమను "నిధినా మాధిపో దేవేత్యాది" మంత్రముతో యథావిధిగ నాచార్యునికిదానముజేసినహీనకుష్ఠము లింగనాశనరోగము నివర్తించు.

కుష్ఠరోగ కర్మవిపాకము.

శ్లో॥ పరుషం భాషతేవ్యర్థం సఃత్వద్దోష యుతోభవేత్ ।
చాంద్రాయణ త్రయం కుర్యాత్ప్రదద్యా దౌషధానిచ ।
వైద్యకోక్తాని విప్రాయ శక్త్యా బ్రాహ్మణభోజనమ్ ॥

తా. కఠోరముగ వ్యర్థముగ మాటలాడువానికి కుష్ఠురోగముగలుగు. తన్నివారణార్థంబై 3 చాంద్రాయణ కృచ్ఛ్రములజేసి వైద్యశాస్త్రమునందు జెప్పంబడియుండు నౌషధములను శక్త్యనుసారముగ బ్రాహ్మణుని కివ్వవలయు. మఱియు శక్త్యనుసారముగ బ్రాహ్మణ సంతర్పణమును జేయవలయు.

దుశ్చర్మత్వ హరము.

శ్లో॥ గురుతల్పగ దోషాచ్చ గవిమైథునదోషతః ।
దుశ్చర్మాస్యా దసౌకుర్యా ద్గురుతల్పాతి దోషతః ।
చాంద్రాయణ త్రయంకుర్యా త్తతోదోషా త్ప్రముచ్యతే

తా. గురుభార్యతోగాని లేక గోవుతోగాని సంగమము జేయువానికి కుష్ఠుగలుగు. తన్నివారణార్థంబై 3 చాంద్రాయణముల జేయవలయు.

## ముఖరోగ కర్మవిపాకము.

శ్లో॥ కూటసాక్షీ భవేద్వక్త్రి రోగీ శోణితపిత్తవాన్ ।
కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ కుర్వీత చాంద్రాయణ మథాపరమ్ ।
కుర్యాత్కూశ్మాండ హోమంచ గాయత్రీ మయుతంజపేత్ ।
దద్యా ద్ధిరణ్యంవ్రీహీంశ్చ ముఖరోగస్య శాంతయే ॥

తా. తప్పుసాక్ష్యము జెప్పెడువానికి ముఖరోగము రక్తపిత్తరోగములగును. తన్నివారణార్థంబై కృచ్ఛ్ర అతికృచ్ఛ్ర చాంద్రాయణ ప్రాయశ్చిత్తముల జేసికొని కూశ్మాండహోమమును పదివేలమారులు గాయత్రీ జపముజేసి సువర్ణమును ధాన్యమును దానము జేయవలయు.

## కర్ణరోగ కర్మవిపాకము.

శ్లో॥ మాతాపితృ గురూణాంచ దేవబ్రాహ్మణయో స్తథా ।
శృణోతి నిందాంబుద్ధ్యా యః కర్ణాభ్యాం తస్యశోణితమ్ ।
పూయంచైవ స్రవత్యస్య శాంతిః కృచ్ఛ్రచతుష్టయాత్ ।
హిరణ్య రక్తవస్త్రాణాం దానా ద్బ్రాహ్మణ భోజనాత్ ।
జపాద్ధోమాచ్చ భవతి సౌరమంత్రేణ శక్తితః ॥

తా. తల్లితండ్రి గురువు దేవతలు బ్రాహ్మణులు మొదలగువారి నిందను బుద్ధిపూర్వకముగ వినుచుండినవానికి చెవియందు రక్తము చీము స్రవించు తన్నివారణార్థంబై 4 ప్రాజాపత్య కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తములంజేసి బంగారును యెఱ్ఱనివస్త్రమును దానముజేయుటయేగాక బ్రాహ్మణసంతర్పణను శక్త్యనుసార్యముగ సౌరమంత్ర జపహోమములను జేయవలయును.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణనిడిమామిడి భగిసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ నమశ్శివాయ సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన శిరోభూషణ నీలకంఠ కొట్టూరు బసవరాజ నామధేయప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్ర తాత్పర్యసహితే క్షుద్రరోగనిదాన తల్లక్షణ తత్సాధ్యాసాధ్య తచ్చికిత్సానుపాన యుక్తం ద్వావింశ ప్రకరణమ్.

శ్రీ ర స్తు.

# బ స వ రా జీ య ము.

## ఆం ధ్ర తా త్ప ర్య ము.

—— ప ం చ వి ం శ ప్ర క ర ణ ము. ——

శ్లో॥ విశ్వనాథం జగన్నాథం లోకనాథం జగద్గురుమ్ ।
సర్వజ్ఞం పార్వతీనాథం లింగమూర్తి మహంభజే ॥

తా. సకలప్రపంచమునకు ప్రభువు జంగమ ప్రపంచమునకు ప్రభువు స్థావర ప్రపంచమునకు ప్రభువు జగద్గురువు సర్వజ్ఞుడు లింగమూర్తిస్వరూపుడునగుపార్వతీ పతిని నేను భజించెద.

శ్లో॥ శ్రీనీలకంఠ వంశాబ్ధి చంద్రమా బసవాహ్వయః ।
వక్ష్యామి వృషరాజీయ మహం వైద్యశిఖామణిమ్ ॥

తా. నీలకంఠవంశమనెడి క్షీరసముద్రమునకు చంద్రుడైబసవరాజని పేర్కొనంబడిన నేను వైద్యగ్రంథములలో కడుశ్రేష్ఠంబైన బసవరాజీయమను నీగ్రంథము యొక్క పంచవింశప్రకరణమును వచింపుచున్నాడను.

### పారదోత్పత్తి.

శ్లో॥ [ఆయుర్వేదే] స్కందాత్తారక హింసార్థం కైలాసే ప్రార్థిత స్సురైః । కరుణాత్మా మహాదేవః పార్వతీవల్లభశ్శివః । రతే శంభోఃచ్యుతం రేతో గృహీతంవహ్నినాముఖే । క్షిప్తం తేన చతుర్దిక్షు కూపాణాం తత్పృథక్పృథక్ । సౌమ్యాది దిక్త్రియస్యాంత ర్గౌరీశాపా న్నకార్యకృత్ । పశ్చిమా యాంతు యత్క్షిప్తం దిశితత్సర్వకార్యకృత్ । ఏషోత్పత్తి స్సమాఖ్యాతా పారదస్య మనీషిభిః ।

తా. తారకాసురవధార్థమైకుమారస్వామినిజనింపజేయువలయునని కరుణాత్ముండును మహాదేవుండును పార్వతీవల్లభుండునునగు శివస్వామిని దేవతలు వే

లగు సమస్తదేవతలు ప్రార్థింప నతండు కుమారస్వామి జనన నిమిత్తార్థమై పార్వతితో సంభోగము జేయ వీర్యము పతనంబయ్యె. దానినగ్ని గ్రహించి భరింపనేరక భూమియందు విడచిన నది నలుదిక్కులయందు వెవ్వేరుగ వ్యాపించె. అందుత్తర ప్రాగ్దక్షిణదిశలయందు పడినరసముగౌరీశాపముచే నిష్ఫలంబగుటంజేసి నదియే కార్యమునందు నుపయోగింపకుండు. పశ్చిమదిశయందు పడినరసము సమస్తకార్యములయందుపయోగించు ఇత్తెఱంగున రసోత్పత్తిక్రమము నాయుర్వేదవేత్తలచే జెప్పంబడియె.

## రసభేద తల్లక్షణములు.

శ్లో॥ రసావిప్రస్సితోరక్తః క్షత్రియః పీతరుగ్విశః । శూద్రఃకృష్ణ ఇతిప్రోక్తో వర్ణభేదాచ్చతుర్విధః । బ్రాహ్మణః కల్పయతే కల్పే గుటికాయాంచ బాహుకః । ధాతువాదే తథావైశ్య శ్శూద్ర శ్చేరకర్మణి । అంతస్సునీలో బహి రుజ్వలాంగో మధ్యాహ్న సూర్యప్రతిమప్రకాశః । శస్తోథధూమ్రః పరిపాండురశ్చ చిత్రస్తుయోజ్యో రసకర్మసిద్ధ్యై ॥

తా. పాదరసము వర్ణభేదములచే 4 విధంబులు అందు తెల్లగనుండునది బ్రాహ్మణజాతియనియు యెఱ్ఱగనుండునది క్షత్రియజాతియనియు పచ్చగనుండునది వైశ్యజాతియనియు నల్లగనుండునది శూద్రజాతియనియు జెప్పంబడు. వానిలో బ్రాహ్మణజాతి కల్పవిషయమునందును క్షత్రియజాతి గుటికలయందును వైశ్యజాతి ధాతువాదమునందును శూద్రజాతి ఇతరకర్మలయందు నుపయోగించు. మఱియు లోన నీలవర్ణము వెలపట చాకచక్యముగలదై మధ్యాహ్న సూర్యునితో సమానమైన కాంతిగలదై ధూమ్రవర్ణము తెలుపువర్ణము చిత్రవర్ణముగలదై ప్రశస్తముగనుండు రసమును సర్వౌషధములయందు నుపయోగింపందగు.

## రస మాహాత్మ్యము.

శ్లో॥ అథాన్య త్సంప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్త ముత్తమమ్ ।
అయుర్వేదోపదేశేస్మిన్ రసశుద్ధిర్నిగద్యతే । శుష్కేంధన
మహాగ్నౌఘం యద్వద్దహతి పావకః । తద్వద్ధాతుగతా న్వ్యాత

సూతదోషాస్త్రయోదశ । దర్శనా దస్యరాజస్య బ్రహ్మహత్యా వ్యపోహతి । స్పర్శనా న్నాశనో దేవి గోహత్యాం నాత్రసంశయః । కింపున ర్భక్షణా ద్దేవి ప్రాప్యతే పరమం పదమ్ । దోషహీనో రసో బ్రహ్మ మూర్ఛితస్తు జనార్దనః । మారితో రుద్రరూపస్స్యా ద్బద్ధస్స్యాచ్చ మహేశ్వరః । వేధకో దేహలోహాభ్యాం సూతస్స్యాత్తు సదాశివః ॥

తా. ఇక నాయుర్వేదమున జెప్పంబడిన ప్రకారము రసశుద్ధిని వచించెద "యెండినకట్టెల సమూహము నగ్నిహోత్రుడు దహింపంజేయు భంగి" ధాతుగత దోషముల పాదరసము దహింపంజేయు ఐనను రసమునందు 13 దోషంబులుగలవు మఱియు రసమును దర్శించుటవలన బ్రహ్మహత్యజనితదోషము నివర్తించు. దాని స్పర్శనమువలన గోహత్యజనిత దోషము నిస్సంశయముగ నివర్తించు. దాని సేవనవలన స్వర్గాదిపరమపదములుగలుగు. దోషరహితమైన రసము బ్రహ్మస్వరూపము మూర్ఛజెందింపబడిన రసము విష్ణుస్వరూపము భస్మముజేయబడిన రసము రుద్రస్వరూపము బంధింపబడిన రసము మహేశ్వరస్వరూపము దేహలోహములచే వేధింపబడిన రసము సదాశివస్వరూపము.

రసనామభేద లక్షణ తత్ప్రయోజనము.

శ్లో॥ పారదో రసధాతుశ్చ రసలోహో మహారసః । చతుర్విధో రసో జ్ఞేయో రసేంద్ర ఇతిభేదతః । ఆకృష్ణ శ్చపలో రూక్షో రసేంద్రః పరికీర్తితః । పారదశ్శుకవర్ణస్స్యా త్కించిత్కాల ఇవాదృతః । ఆపీతకాంతి రూక్షశ్చ విదుర్బుధాః । రసేంద్రో మయూర పింఛికాకారో రసకశ్చ విదుర్బుధాః । రసేంద్రో రసకర్మార్థః పారదో రోగనాశనః । సూతకస్స్వర్ణకార్యార్థే రసో యోజ్యో రసాయనే ॥

తా. పారదము రసధాతువు రసలోహము మహారసము అనునవి పారదనామంబులు. ఆరసము రసేంద్రము పారదము సూతకము రసకము అని 4 విధంబులు. అందొకింత నల్లగ చంచలముగ రూక్షముగనుండునది రసేంద్రమనియు చిలుకవన్నె గలదై యొకింత నలుపువర్ణముగనుండునది పారదమనియు నొకింత పచ్చనై రూక్షముగ

మండునది సూతకమనియు నెమలిపింఛపుఛాయ గలిగి యుండునది రసకమనియు చెప్పంబడు. రసేంద్రమనుదానిని రసకర్మలయందును పారదమనుదానిని రోగహర క్రియలయందును సూతకమనుదానిని సర్వక్రియలయందును రసకమనుదానిని రసాయనమునందును గ్రహింపందగు.

## రసదోషాష్టకము.

శ్లో॥ [మాధవనిదానే] ఉండినంచాపికౌటిల్య మనవర్తంచసంకరమ్।
షండత్వ పంగుకారిత్వ సమలత్వగురుత్వతః ।
సవిషత్వంచ సూతస్య చాష్టదోషాః ప్రకీర్తితాః॥

తా. ఉండినదోషము కౌటిల్యదోషము అనవర్తదోషము సంకరదోషము షండత్వదోషము పంగుదోషము బరువెగనుండుటవలన మలదోషముసవిషత్వదోషము అని 7 దోషములురసమునందుండు. (ఈదోషములుగలరసమును శుద్ధిజేయక ఔషధములలో బ్రయోగించినను లేక సేవించినను రోగములు జనించు. అవెవ్వియనిన.—)

## దోషాష్టకయుక్త పారదసేవ జనితరోగములు.

శ్లో॥ ఉండినే శూలదోషస్స్యా త్కౌటిల్యేస్యా త్కపాలరుక్ ।
అనవర్తే భ్రమశ్చైవ సంకరే ధాతుసంకరః ।
షండత్వే స్యాదసంతాన పంగుత్వే । దాహకుష్ఠకృత్ ।
మలేజ్వరశ్చ మూర్ఛాచ విషత్వేచ క్షయో భవేత్ ॥

తా. ఉండిన దోషమువలన శూలయు కౌటిల్యదోషమువలన కపాలరోగంబును అనవర్తదోషమువలన భ్రమయు సంకరదోషమువలన ధాతు సాంకర్యంబును గలుగు. షండత్వదోషమువలన సంతానము గలుగకుండు. పంగుత్వదోషమువలన దాహంబేని కుష్ఠురోగంబేని గలుగు. మలదోషముషలన జ్వరము మూర్ఛగలుగు విష దోషమువలన శరీరము క్షయించు.

## రసదోషాష్టకము.

శ్లో॥ [ఆయుర్వేదే] నాగోవంగోమలోవహ్ని శ్చాంచల్యంచవిషం గిరిః । అసహ్యాగ్ని ర్మహాదోషా నిసిద్ధాః పారదే స్థితాః ॥

తా. రసమునందు నాగ వంగ మల వహ్ని చాంచల్య విషగిరి అసహ్యాగ్ని ) 8 విధములైన దోషంబు లుండు.

## రసదోషాష్టక జనితరోగములు.

శ్లో॥ జాడ్యం గండ స్తమోనాగా త్కుష్ఠం వంగా ద్రజోమలాత్ ।
దాహో వహ్నే ర్బీజనాశ శ్చాంచల్యాన్మరణం విషాత్ ।
గిరే స్స్ఫోటాగ్న్యసహాతా దోషా న్మోహోభిజాయతే ।
విషం వహ్ని ర్మలశ్చేతి దోషా ముఖ్యత మాస్త్రయః ।
ఇమే మరణసంతాప మూర్ఛానాం హేతవః క్రమాత్ ।
యౌగికౌ నాగవంగా ద్యౌతౌ జాడ్యాధ్మానకుష్ఠదా ॥

తా. రసమునందలి నాగదోషమువలన జాడ్యముగండమాల తామసముగలు గు. వంగదోషమువలన కుష్ఠువును, మలదోషమువలన రజస్సును, అగ్నిదోషమువలన దాహమును, చాంచల్యదోషమువలన శుక్రనాశనమును, విషదోషమువలన మరణం బును, గిరిదోషమువలన శరీరమున పొక్కులును, అసహ్యాగ్నిదోషమువలన మోహ మును గలుగు. ఈ 8 విధములైన దోషములలో విష వహ్ని మలములను 3 దోష ములు ముఖ్యంబులు. అట్లగుటచే నవి మరణము సంతాపము మూర్ఛ అనువానిని క్రమముగ గలుగంజేయు. మఱియు నాగ వంగ దోషములు యోగార్థముగలవి యగుటంజేసి జాడ్యాధ్మాన కుష్టువుల గలుగంజేయు.

## రసస ప్త కంచుక దోషములు.

శ్లో॥ నాగోవంగో మలాగ్ని విషగిరి చపలా స్సప్త సూతస్య దో షాః । నాగా ద్గండాలిరోగం జనయతి బహుశః కుష్ఠవంగేచ వంగాత్ । జ్ఞాత్వా జ్ఞానం మలాస్యా న్మరణ మపివిషాద్దాహ మోహాచ వహ్నేః । జాడ్యంశైలాశ్చ వీర్యచ్యుతి రపిచప లాత్పారద ధ్దశ్శ్యలితేన ॥

తా. రసమునందు నాగ వంగ మల అగ్ని విష గిరి చపలము లన సప్తకం చుక దోషములు గలవు. అందు నాగదోషమువలన గండమాలయు వంగదోషము వలన కుష్ఠువును మలదోషమువలన అజ్ఞానమును విషదోషమువలన మరణంబునుఅగ్ని దోషమువలన దాహమోహములును గిరిదోషమువలన జాడ్యమునుచపలదోషమువలన వీర్యనాశనమును గలుగు. కావున రసమునందలి సప్తకంచుకదోషములు నివర్తించు టకై దానిని శుద్ధిజేయవలయు.

### రససప్తకంచుకదోష తజ్జనితరోగములు.

శ్లో॥ నాగంవంగ మలంవహ్నిశ్చాంచల్యంచ గిరిర్విషమ్ । పారద
కంచుకాస్సప్తసంతినైసర్గికాయుతః । ఏతేతు సప్తదోషాశ్చ
కుర్వంతి ప్రాణసంకటమ్ । నాగేన జాయతే గండం కుష్ఠం
వంగేన జాయతే । విషదోషాద్భవేన్మృత్యుర్గిరి కేజాడ్య
తామపి । కంచుకే హన్యతే వీర్యం తస్మాద్దోష వివర్జితః ॥

తా. పాదరసమున నాగ వంగ మల అగ్ని చాంచల్య గిరి విషధములను 7 సప్తకంచుకదోషంబులు స్వాభావికముగ గలిగియుండు. కావున నట్టి సప్తవిధ దోషంబులుగల రసమువలన ప్రాణసంకటముగలుగు. మఱియు నాగదోషమువలన గండమాలయు వంగదోషమువలన కుష్ఠువును విషదోషమువలన మరణంబునుగిరిదోష మువలన జాడ్యంబును కంచుకదోషమువలన వీర్యనష్టంబును గలుగు. కావున నట్టి దోషములుగల యశుద్ధమైన రసమును వర్జింపవలయు.

### రసశుద్ధాశుద్ధ గుణములు.

శ్లో॥ దోషహీనో యదాసూత స్తదా మృత్యుజరాపహః ।
సాక్షాదమృతమప్యేష దోషయుక్తో రసో విషమ్ ॥

తా. శుద్ధిచే దోషరహితంబైనరసము మృత్యువును ముదిమిని హరింపంజేయు టయేగాక ప్రత్యక్షముగ నమృతతుల్యంబై యుండు. దోషయుక్తరసము విషముతో సమానంబై యుండు.

శ్లో॥ తస్మాద్దోష నివృత్త్యర్థం రసశుద్ధిర్విధీయతే ॥

తా. కావునదోషమునివర్తించుటకై రసమునకు శుద్ధివిధింపబడుచున్నయది.

### రసశుద్ధి క్రమము.

శ్లో॥ రసోగ్రాహ్యస్సునక్షత్రే పలానాం శతసమ్మితమ్ ॥
పంచాశత్పంచవింశద్వా దశపంచైక మేనవా ।
పలాదూనోనకర్తవ్యో రససంస్కార ఉత్తమైః ॥

తా. రసమును మంచినక్షత్రమున 100 పలములు గాని 50 పలములు గాని 25 పలములుగాని 12 పలములుగాని 5 పలములుగాని 1 పలముగాని గ్రహించి సంస్కారము జేయవలయు. ఐన 1 పలమునకు తక్కువగ జేయంజనదు.

## రససంస్కార మంత్రము.

శ్లో॥ అఘోర ఇతిమంత్రేణ రససంస్కార పూజనమ్ ॥

తా. అఘోరమంత్రముచే రసమును బూజించి సంస్కారము చేయవలయు.

శ్లో॥ అమంత్రిత పదార్థానాం తేజో నిఘ్నంతి భైరవాః ।

తా. అమంత్రితపదార్థమునందలి తేజస్సును భైరవు లపహరింతురు.

## రసదోషాష్టక నివర్తకోపాయము.

శ్లో॥ అథాత స్సం ప్రవక్ష్యామి దోషాష్టక నివారకమ్ । ఇష్టకా రజనీచూర్ణై ష్షోడశాంశై రసస్యచ। మర్దయే త్తప్త ఖల్వేన జంబీరోత్థై ర్ద్రవై ర్దినమ్ । కాంజికే క్షాళయేత్సూతం నాగదోషం విముంచతి । విశాలాంకోలచూర్ణేన వంగదోషో వినశ్యతి రాజవృక్షో మలంహంతి చిత్రకో వహ్నిదూషణమ్ । చాంచల్యం కృష్ణధత్తూర స్త్రీఫలా విషనాశనమ్ । కటు త్రయం గిరిం హంతి హ్యసహ్యాగ్నిం త్రికంటకః ॥

తా. ఇక రసమునందలి అష్టదోష నివర్తకోపాయమును వచించెద.—రసమునకు 16 వ భాగము యిటుకపొడిని పసుపుపొడిని జేర్చి నిమ్మపండ్లరసముతో 1 దినము తప్తఖల్వమున మర్దించి కలితోగడిగిన రసమునందలి నాగదోషము నివర్తించు రసమునకు 16 వ భాగము పాపరవేరు వూడుగవేరు అనువాని చెక్కల చూర్ణమునుజేర్చి నిమ్మపండ్లరసముబోసి యిగిరి పొడియగువరకు మర్దించి కలితోగడిగిన రసమునందలి వంగదోషము నివర్తించు. రేలవేరుచెక్క నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితోగడిగిన రసమునందలి మలదోషము నివర్తించు చిత్రమూలపుచెక్క చూర్ణము నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితోగడిగిన అగ్నిదోషము నివర్తించు నల్లయుమ్మెత్తవేరుచెక్క నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితోగడిగిన చాంచల్యదోషము నివర్తించు. త్రిఫలచూర్ణము నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితోగడిగిన విషదోషము నివర్తించు. త్రికటుకచూర్ణమును నిమ్మపండ్లరసము వీనితో రసమును మర్దించి కలితోగడిగిన గిరిదోషము నివర్తించు. పల్లేరువేళ్ళచూర్ణము నిమ్మపండ్లరసము వీనితో రసము మర్దించి కలితోగడిగిన అసహ్యాగ్నిదోషము నివర్తించు.

## తప్తఖల్వ లక్షణము.

శ్లో॥ ఖల్వే లోహ మయే వాథ పాషాణో త్థే పృథాపివా ।
అజా శకృ త్తుషాగ్నిశ్చ భూగర్భే త్రితయంక్షిపేత్ ।
త స్యోపరిస్థితం ఖల్వం తప్తఖల్వ మితిస్మృతమ్ ॥

తా. ఇనుములోగాని నల్లజవపరాతిలోగాని ఖల్వమునుజేయించి యేకాంత గృహమున గుంటత్రవ్వి యందు మేక పెంటికలు వుముక అగ్నివైచి సెగతగులున టుల దానిపై ఖల్వము నునుచుటయ తప్తఖల్వ మనంబడు.

## రసగత సర్వదోష నివర్తకోపాయము.

శ్లో॥ ప్రతిదోషం కలాంశేన తత్రచూర్ణం సకన్యకమ్ । సువస్త్రగలితం ఖల్వే సూతే క్షిప్త్వా యథా క్రమమ్ । ప్రత్యేకం ప్రత్యహం యత్నా త్స ప్తరాత్రం విమర్దయేత్ । ఉద్ధృత్యారనాళేన మృద్భాండే క్షాళయే త్సుధీః । సర్వదోష వినిర్ముక్త స్సప్తకంచుకవర్జితః । జాయతే శుద్ధసూతోయం యోజయే ద్వైద్య కర్మణి ॥

తా. రసప్తకంచుకదోషనివారణార్థంబైపై జెప్పంబడిన ద్రవ్యములలో ప్రతి దానియొక్క 16 వ పాలు చూర్ణమును కలుబందనుగలిపి నొక్కొక్కదినము చొప్పున 7 దినములు నిమ్మపండ్లరసముతో రసమునుమర్దించి మంటిపాత్రలోనునిచికలితోగడిగి ఆరనిచ్చి మంచివస్త్రములోబోసి ఖల్వములో ప్రత్యేక ప్రత్యేకముగ 7 మార్లు పిడచ వలయు. కలితోగడుగునపుడు రసము నురుగువలె తేలును. కాపునదె క్రిందపోకుండా పదిలముగగడుగవలయు. ఇటులంజేసిన రసమునందలిసర్వదోషములు సప్తకంచుకదోషములు నివర్తించి రసము శుద్ధంబగు అట్టిదాని నౌషధములలో ప్రయోగింపవలయు.

## రసగతదోష తదుపద్రవములు

శ్లో॥ [గ్రంథాంతరే] మలశిఖి విషనామానో రసస్య నైసర్గికా స్త్రయోదోషాః । మూర్ఛాంకులేన కురుతే శిఖినాదాహం విషేణ మృత్యుంచ ॥

తా. రసమునందు మల శిఖ విషముల 3 దోషంబులు స్వాభావికముగ గలిగియుండు. అందు మలదోషమువలన మూర్ఛ శిఖిదోషమువలన దాహము విష దోషమువలన మృత్యువుగలుగు.

## రసశుద్ధి.

శ్లో॥ గృహకన్యా హంతిమలం త్రిఫలా శిఖిచిత్రకమ్ ।
విషంహన్యా త్త్రికోణేన మర్దయే త్సప్తవారకమ్ ॥

తా. కలుబంవపలుకులిగురువరకు 7 మార్లురసమును మర్దించి నీళ్ళగడిగినమల దోషంబును త్రిఫలచూర్ణముతో 7 మార్లు మర్దించి నీళ్ళగడిగిన శిఖిదోషంబును చిత్రమూలపుచెక్కచూర్ణముతో 7 మార్లుమర్దించి నీళ్ళగడిగిన విషదోషంబునుహరించు.

శ్లో॥ ఇష్టకాచూర్ణ మాదాయ ఖల్వే మర్ద్యం రసం ద్రవైః ।
విషాగ్ని రాజవృక్షస్య కృష్ణాచూర్ణై రసంద్రవైః ।
కుమార్యాస్త్రిఫలానాంచ కతకస్యచ గోక్షురైః ।
యదిసంశోధితంసూతం సర్వకర్మసు యోజయేత్ ॥

తా. తొలుతరసమును ఖల్వములోనునిచి యిటికపొడితో మర్దించి కడుగవలయు. ఇటులనే అతివస చిత్రమూలము రేల పిప్పలి అనువానిచూర్ణములలో కలుబందరసమును గలిపి మర్దించి నీళ్ళగడుగవలయు. మఱియు త్రిఫలములు యిందుపుగింజలు పల్లేరువేళ్లు అనువానిని ప్రత్యేక ప్రత్యేకముగ చూర్ణముజేసి ప్రత్యేక ప్రత్యేకముగ నిమ్మపండ్లరసము కలుబందరసముగలిపి మర్దించి నీళ్ళగడిగిన రసము శుద్ధియగు. అట్టిదానిని సర్వయోగములయందు బ్రయోగింపంజను.

శ్లో॥ రాజీరసోనమాషాయాం రసంక్షిప్త్వావిబంధయేత్ । వస్త్రేణ డోలికాయంత్రేస్వేదయేత్కాంజికైస్త్ర్యహమ్ । దినైకం మర్దయేత్సూతం కుమారీసంభవైర్ద్రవైః । తథాచిత్రకజైః క్వాథైర్మర్దయేదేకవాసరమ్। కాకమాచీరసైస్తద్వద్దినమేకం చమర్దయేత్ । త్రిఫలాయాస్తతఃక్వాథైఃరసోమర్ద్యఃప్రయత్నతఃతతస్త్రైఃపృథక్కుర్యాత్సూతంప్రక్షాళ్యకాంజికైః ।తతః క్షిప్త్వారసంఖల్వే రసాదర్ధంచసైంధవమ్ । మర్దయేన్నింబుకరసైర్దినమేకమనారతమ్ । తతోలాంజీరసోనశ్చ ముఖ్యైశ్చనవసాగరః । ఏతైరససమైస్తద్వ త్సూతోమర్ద్యస్తుషాంబునా । తతస్సంశోష్యచకాంభంకృత్వాక్షిప్త్వాచహింగునా । ద్వేధా

లీసంపుటేభూత్వా పూరయేల్ల వణేనచ । అథ స్థాలీం తతో
ముద్రాంనద్యాద్ధృఢతరాంకబుధః । విశోషాగ్నింవిధాయాథో
నిషించేదంబునోపరి । తత స్తుకుర్యా త్తీవ్రాగ్నింతదధః ప్రహార
త్రియమ్ । ఏవం నిపాతయే దూర్ధ్వం రసో దోషవి వర్జితః।
అథోర్ధ్వంపిటరీమధ్యే లగ్నో గ్రాహ్యోరసోత్తమః ॥

తా. ఆవాలు వెల్లుల్లి యీ రెంటినినూరి మూసజేసి అందు పాదరసముబోసి దానిపై వస్త్రముగట్టి డోలాయంత్రములో కలితోడ 3 దినములు పాకముజేసి పిదప యీపాదరసమునుదీసి ఖల్వములోబోసి కలుబందరసము చిత్రమూల కషాయముకాంచి యాకుఅనువాని రసములలో ప్రతిదానిచే నొక్కొక దినమును త్రిఫలకషాయముచే 1 దినమునుమర్దించి కలితోగడిగి ఖల్వములోభోసి దానికర్ధభాగము సైంధవలవణము గలిపి నిమ్మపండ్లరసముతో 1 దినము మర్దించి పిదప ఆవాలు వెల్లుల్లినవాసాగరము అనునీ 3 ద్రవ్యముల పాదరసమునకు సమముగ జేర్చి ముకనీరులో ముద్దయగువఱకు మర్దించి బిళ్ళజేసి యెండించి దానిపై యింగువనునూరి లేపనముజేసి కుండలోనునిచి దానిపై ఉప్పుబోసి మఱియొక కుండను బోర్లగిలనూసి దళముగ చీలమన్ను లేపనము జేసి యెండనెండించి పొయిమీదనునిచి పాకము జేయవలయు. పైకుండకు వేడిమి తగిలిన యీపాదరసము కరిగి క్రిందపడును. కావున పైకుండపై నుదకమును బోయుచు గాఢాగ్నితో 3 ఝాములు వండవలయు ఆదిచల్లారిన చీలమన్ను నుపాయముచే దీసి పైకుండయందంటుకొనియుండు రసమును దీసికొనవలయు. ఈ రసము దోషరహితంబై శుద్ధంబుగనుండు.

శ్లో॥ కుమార్యాశ్చ నిశాచూర్ణైః ర్దినం శూతం విమర్దయేత్ ।
పాచయేత్పాతనాయంత్రే * శుద్ధోభవతిపారదః ॥

తా. పాదరసములోకలుబందపలుకులుపసుపుపొడిగలిపి యొకదినముమర్దించి బిళ్ళజేసి దానినటక సంపుటములోనునిచి సందులేకుండునటుల దానిమూతినిమూసి వస్త్రమృత్తికల లేపనముజేసి యెండ నెండించుటచే పాతనాయంత్రమని పఱంగెడు దానిని పొయిమీదనునిచి దానిపై మఱియొక యటికను బోర్లగలమూసి దానిపై తగుమాత్రముగ పమరుగట్టి శీతోదకమును బోయుచుండవలయు. అది యుష్ణమైన దానిందీసి పారబోసి మరల శీతోదకమును బోయవలయు. ఇట్లులం జేయుచుండిన

* శుద్ధంచ వినియోజయేత్.

రసము పైకుండయందు మంచువలె వ్యాపించు. పిదప ఆ పాతనాయంత్రమునకు కేయంబడియుండు చీలమున్ను నుదకములో పడిసి తీసి పైకుండనంటియుండు రసము నెండించి గీచి తీసికొని బట్టను పిడచవలయు. ఇత్తెరంగున నే 2 లేక 3 మారులు పాతనాయంత్రమునందిడి పక్వము జేసి తీసికొనిన రసముశుద్ధంబగు. అట్టిదానిని సర్వౌషధములం బ్రయోగింపంజను.

## ఇంగిలీకములో రసముదీయు విధము.

శ్లో॥ [గ్రంథాంతరే] * పారిభద్రరసైః పేష్యం హింగుళంయామ మాత్రకమ్ జంబీరాణాం ద్రవైర్వాథపాచ్యపాతనయంత్రకే తతః సూతంయోజయే ద్యోగే సప్తకంచుకవర్జితమ్ ॥

తా. 4 పలములు యింగిలీకము 1 ఝాము వేపవేరు చెక్క రసముతో గానిలేక నిమ్మపండ్ల రసముతో గాని మర్దించి పాతనాయంత్రమునందిడి పాకము జేసిన సప్తకంచుక దోషరహితమైనరసముజనించు. అట్టిరసము నౌషధములలో బ్రయోగింపంజను.

## రసాజీర్ణ మూలకోపద్రవములు.

శ్లో॥ [మాధవకల్పే] క్షారంతీక్ష్ణం భూరిచామ్లం చవర్జ్యంసూతో జీర్ణో జాయతేతేన యస్మాత్ । సూతేజీర్ణేనాభిశేషశూలం దాహోమాంద్యంజాడ్యమాలస్యనిద్రా । సత్వత్యాగోజాయతేబుద్ధినాశ స్తస్మాజ్జీర్ణే కన్యకాంగవమాజ్యమ్ ॥ గంధం చామ్లం మృద్వికాం సేవయేద్వా సూతో జీర్ణస్సర్వదోషోపశాంతిః ॥

తా. ఉప్పు తీక్ష్ణకరపదార్థములు పులుసు వీనినధికముగ సేవింపంజనదు. అధికముగ సేవించిన రసము జీర్ణముగాక బొడ్డుక్రింద శూలించుట వొడలుమండుట అగ్నిమాంద్యము జాడ్యము ఆలస్యము నిదుర సత్వత్యాగము బుద్ధినాశనము మొదలగు నుపద్రవంబులుగలుగు కావున రసము జీర్ణించుటకును కలుబంద రసముతో నావు నెయ్యిని గలిపిగాని లేక పుల్లని కందములగాని లేక దీపద్రాక్షపండునుగాని సేవింపుచుండిన రసాజీర్ణమువలన గలిగిన సర్వదోషములు నివర్తించు.

---

* నింబపత్ర

## శిరోగత రసదోష నివర్తకోపాయము.

శ్లో॥ [చరకే] కార్పాసదళనిర్యాసై స్తండులీయరసేనవా ।
అభ్రికంజీరకై ర్యుక్తం లోహచూర్ణం సశర్కరమ్ ।
రసవేధవినాశార్థం కుర్యాద్వై భసజ్య ముత్తమమ్ ॥

తా. పైడిప్రత్తియాకు రసములోగాని చిర్రివేళ్ళరసములోగాని అభ్రకసిందూరము జీలకఱ్ఱ పంచదారగలిపి సేవించిన రసవేధలు నివర్తించు. మఱియు పైడిప్రత్తియాకురసములోగాని చిర్రివేళ్ళరసములోగాని లోహభస్మము జీలకఱ్ఱ పంచదారగలిపి 2 మండలములు సేవించిన రసవేధలు నివర్తించు. ఇది యుక్తమైనది.

## రసమెక్కినందుకు చికిత్స.

ఉ॥ [పంచపాది] ఆరయదూడియాకురసమందున నేయియుఁబంచదారయు ॥ న్గూరిచియున్నరీచమును గూరిచి గ్రోలినమీఁద శైత్యపు। న్నీరును వేఁడినీళ్ళతగనిత్యమునున్జలమాడిపథ్యము। న్వారక నెయ్యిజావయు నవశ్యముసేవయొనర్ప నెక్కిన । న్నారదరోగగర్వములు భంగముగాచును ధారుణీస్థలిన్ ॥

(ఈ పద్యములోని యౌషధమును 2 మండలములు సేవింపవలయు.)

చం॥ [పంచపాది] నృపతరుపల్లవంబులును నిర్మలమైనను రూబతైలము । న్విపచన మొప్పఁజేసియును వేమును రెండుతులాల నెత్తున। త్యపటుగతిన్నరీరమున నద్దియు నెండనునుండి స్నానము । న్విపులముగానొనర్చియును వేఁడియుఁ బథ్యము కొఱ్ఱ గంజిచేఁ । గపటపు సూతరోగముల గర్వములన్నియుమాను నిద్ధరన్ ॥

(ఈ పద్యములోని యౌషధమును 2 మండలములు సేవించినను లేక గంధక తైలమును సేవించినను రసవేధలు మానును.)

## రసతాపహర లేపనములు.

శ్లో॥ [ఆయుర్వేదే] ధాత్రీకుమారీ సర్పాక్షీ కూశ్మాండం భృంగరాజకమ్ । కాకమాచీమేఘనాదా రంభాకందంసజీరకమ్ ।

కార్పాసంచామ్రతాచైవ జంబుకాబింబతండులమ్ । నవనీతే
సమంలేప్యంచందనే రసతాపనుత్ ॥

తా. ఉసిరికపప్పు కలుబంద సర్వాక్షి బూడిదెగుమ్మడుకాయ గుంటగలగర నల్లకాచి చిత్రికేరు అరటిగడ్డ జీలకఱ్ఱ పైడిప్రత్తియాకు తిప్పతీగ నేరేడుచెక్క దొండాకు పసిగడుగు వీనిలో సమభాగములుగ రసముదీసి వెన్న మంచిగంధముగలిపి శరీరమున లేపనముజేసిన రసతాపము నివర్తించును.

రసతాపనివర్తకోపాయము.

శ్లో॥ [మాధవనిదానే] జమ్బ్వాత్వక్త్రిఫలాం బింబ కుమారీచ స
మంపిబేత్ ।రసతాపంమహాఘోరం నాశయేచ్ఛ సుఖీభవేత్॥

తా. నేరేడుచెక్క త్రిఫలములు బొండాకు కలుబంద వీనిలో సమభాగములుగ రసముదీసి త్రాగిన కడుభయంకరమైన రసజనిత శరీరతాపము నివర్తించు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] కుమారీరససంయుక్తం జీరకంతండులీయకమ్।
కార్పాసబీజకంచైవ నవనీ తేన పేషయేత్ ।
చందనేన సమంకృత్వా ప్యాలేపోరసతాపనుత్ ॥

తా. జీలకఱ్ఱ చిత్రి ప్రత్తిగింజలు వెన్న మంచిగంధము వీనిని సమభాగములుగ గ్రహించి కలుబంద రసముతోనూరి శరీరమున లేపనముజేసిన తలకెక్కిన రసతాపములు నివర్తించు.

రస మంత్రము.

[నిత్యనాథీయే] ఓంగోరుకుగోరుకునాథం । అటుగట్టునానాశిచోళు
సాగసుచాత్పకోటికిర్కిణి । దేవిఆకుకోటురుం । రాః ।ధరణి।
హరణి। ఘృటకాభరణి ।సకలదేవి। సకనపూజాపాదం।పాద
రసం । కీర్తాయం । సూర్తాం । గూడాతాం । నారాయణతాం
అల్గాతాం । తర్తిణితాం । తిర్తాతాం । మహాతిర్తాం। గోరు
గోరుకునాథం ॥ అనునీమంత్రముచే నభిమంత్రించి యౌషధ
సేవనను లేపనౌషధముల నభిమంత్రించి లేపనములను
జేయుంచవలయు.

రసతాపములయందు పథ్యము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] రసజనితవిదాహ శ్శీతతోయావగాహో మలయజఘనసారై ర్లేపనంమందవాతాః । తరుణదధిచతక్రం నారికేళీఫలాంబు । శిశిరమధురసాన్యశీ తిమస్నంప్రశస్తమ్ ॥

తా. పాదరసముకలన తాపముగలిగిన శీతోదకములో స్నానముజేయుట శ్రీగంధ కర్పూరముల లేపనము జేసికొనుట చల్లనిగాడ్పులు తీయనిపెఱుగు చల్లనారి కడపుకాయనీరు శీతకరరసములు మధురరసములు చల్లనివంటకము అనువానిని సేవించుట ప్రశస్తంబు.

రసౌషధ సేవనయందు పథ్యము.

శ్లో॥ [మాధవనిదానే] గోధూమజీర్ణ శాల్యన్నంగవ్యంక్షీరఘ్నృతం దధి । తండులీయక ధాన్యాకం పటోలాలాబుసైంధవమ్ । అభ్రోదకంముద్గ రసంమాంసం జాంగలజంహితమ్ । ఉద్గారే సతిచాత్యర్థంకృష్ణామీనాక్షీజీరకమ్ । అభ్యంగమనిలక్షోభే తైలైర్నారాయణాదిభిః । ఆర్తిత శ్శీతతోయేన మస్తకేపరి షేచనమ్ । తృష్ణాయాం నారికేళాంబు ముద్గయూషం సశర్కరమ్ । ద్రాక్షా దాడిమకర్పూరకదళీ నాంఫలంహితమ్ । రసవేధానివృత్యర్థం దధిక్షీ రేక్షుశర్కరాః । శైత్యోపచారై రన్యైశ్చకర్తవ్యంస్యా ద్యథోచితమ్ ॥

తా. గోధుమలు ప్రాతబియ్యపువంటకము ఆవునెయ్యి ఆవుపాలు ఆవుపెరుగు చిర్రికూర ధనియాలు పొట్లకాయ అనుగపుకాయ సైంధవలవణము మేఘోదకము పెసలకట్టు జాంగలమాంసము అనువానిని సేవించుట మిక్కుటముగ వమనంబులైన పిప్పలి పొన్నగంటికూర జీలకఱ్ఱ అనువానిని సేవించుట వాతవికారముగలిగిన నారాయణతైలము మొదలగువానిచే నభ్యంజనముజేయుట పీడకలిగిన శీతోదకములో శిర స్స్నానముజేయుట దప్పిగలిగిన నారికేళోదకము పంచదారతోగూడియుండు పెసర కట్టు ద్రాక్షపండు దాడిమపండు పచ్చకర్పూరము అరటిపండు పెఱుగు పాలు చెఱకు పంచదార యితరములైన శైత్యోపచారములు మొదలగువాని యథోచిత ముగజేయుట యిట్టి యుపచారములచే రసతాపము నివర్తించు.

## రసౌషధ సేవనయం దపథ్యము.

శ్లో॥ త్యజేత్కూష్మాండవార్తాకం వేత్రాగ్రంకారవేల్లకమ్ । మాషేస్నపూరనిష్పావం * కులుత్థా న్సర్ష పా స్తిలాన్। బృహతీరాజికాబిల్వం దివా నిద్రాంచ మైథునమ్ । లంఘనోద్వ ర్తన స్నానం తామ్రచూడం సురాసవమ్ । జలమాంసారనాళంచ భోజనంకదళీదళే। కాంస్యకం గురు విష్టంభితీక్ష్ణోష్ణంచ భృశం త్యజేత్ ।అపథ్యం సూతరాజస్య పురా ప్రోక్తం మహర్షిభిః ॥

తా. గుమ్మడుకాయ వంకాయ వెదురుపోట్లు కాకరకాయ మినుములు పెసగలు అనుములు వులవలు ఆవాలు నువ్వులు ములకకాయ నల్లావాలు మారేడు కాయ పగటినిద్ర స్త్రీసంగమము లంఘనము శరీరమర్దనము స్నానము కోడిమాంసము కల్లుఆసవము జలమాంసము కలిఅరటియాకులలోభుజించుట కంచుపాత్రములో భుజించుట గురుకరపదార్థములు మలబంధకరపదార్థములు తీక్ష్ణకరద్రవ్యములు వుష్ణకరద్రవ్యములు యివి రససేవనజేయువారల కపథ్యకరంబులు.

## గంధకోత్పత్తి.

శ్లో॥ శ్వేతద్వీపే పురాదేవ్యా స్త్రీరేక్షీర పయోనిధేః। క్రీడంత్యా స్సఖిభిస్సార్థ మభవ త్ప్రస్ముతంరజః । బహుళంత్రదజోతీవ సుగంధిసుమనోహరమ్ । క్షీరాబ్ధే వేతుసాధ్యాయ ద్దుకూలం రజసాన్వితమ్ । ధౌతంచ సఖిభి స్తత్ర తజ్జాతంగంధకం రజః । క్షీరాబ్ధి మథనే చాథా పృమ్నతేన సహోత్థితమ్ । నిజగంధే నతాన్ సర్వాన్ హర్ష యామాస దానవాన్। తతోదేవగణై రుక్తం గంధకాఖ్యో భవత్వయమ్ । రసస్య బంధనార్థాయ జారణాయ భవత్వయమ్ । యేగుణాః పారదే ప్రోక్తా స్తేచె వాత్ర భవంత్యపి । ఇత్యేవం గంధకోనామ విఖ్యాతః క్షితి మండలే । బలినా సేవితః పూర్వం ప్రభూత బలహేతవే । వాసుకేః కర్షక స్తస్య తన్ముఖ జ్వాలవాద్గుణితమ్ । వాసోగంధకగంధాఢ్యాః సర్వతో మిశ్రితంతతః ॥

* కులుత్థాన్ లవణంతిలాన్—అనగావులవలు ఉప్పు నువ్వులు.

తా. తొల్లి క్షీరసముద్రతీరమునందలి శ్వేతద్వీపమునందు చెలికత్తెలతోడ పార్వతీదేవి క్రీడింపుచుండ రజస్వలయైనందున కడుసుగంధముగ మనోహరముగ నుండునట్టి రజోయుక్తవస్త్రమును చెలికత్తెలు క్షీరసముద్రమునం దుదికినందున రజస్సు గంధకముగనయ్యె. అది క్షీరాబ్ధి మథనకాలంబున నమృతముతోడ నుత్పన్నంబయ్యె. మఱియు నది తనవాసనవలన సకల దైత్యులకు సంతోషము గలుగం జేసె. దేవతలు దీనికి గంధకమను పేరుబెట్టి రసబంధనార్థంబు జారణార్థంబు నుపయోగించుకటుల రసమునకుగల గుణంబులన్నియు దీనియందునుగలిగి యుండునటుల నాశీర్వాదముజేసిరి. అదిమొదలు దీనికి భూమండలమున గంధకమని ప్రఖ్యాతిగలిగె. దీనిని పూర్వకాలంబున బలిచక్రవర్తి బలకరార్థము భక్షణముజేసె పిదప మథనకాలమునందు వానుకి నీడ్చునపుడు వాని ముఖజ్వాలలవలన గంధకముకరిగి భూమియందంతట చెదరె. అదిమొదలు గంధకము భూమండలంబున లభించుచున్నయది.

## గంధక లక్షణము.

శ్లో॥ గంధశ్చతుర్విధంప్రోక్తో రక్తఃపీతస్సితోఽసతః । రక్తోహేమక్రియాసూక్తశ్శుకతుండనిభోవరః । పీతశ్చమలనాశాఖ్యో శ్రేష్ఠోరసరసాయనే । శ్వేతోత్రఘుటికాంప్రోక్తో లేపనేలోహమారణే । సుదుర్లభస్తు కృష్ణశ్చ సజరామృత్యునాశనః ॥

తా. గంధకము యెఱుపువర్ణము పసుపువర్ణము శ్వేతవర్ణము కృష్ణవర్ణముగలది యగుచు 4 విధంబులు. అందు రక్తవర్ణముగలదై చిలుకముక్కువంటి కాంతిగలదై యుండునది స్వర్ణక్రియయందుపయోగించు. అదికడుప్రశస్తంబు. పసుపువర్ణముగలది రసాయనోపయుక్తంబు. శ్వేతవర్ణముగలది ఘుటిక లేక లోహమారణములయందుపయోగించు. కృష్ణవర్ణముగలది జరామృత్యువులబోకడుచు. ఇదిదొరుకుట దుర్లభము.

## గంధకనామములు.

శ్లో॥ [గ్రంథాంతరే] వైగంధకస్సుగంధశ్చ గంభీరోగంధకోబలీ॥

తా. వైగంధకము సుగంధకము గంభీరము గంధకము బలి అనునవి గంధక నామంబులు.

## శోధనయోగ్యగంధక లక్షణములు.

శ్లో॥ కపికచ్ఛునిభచ్ఛాయో నవసీతసమప్రభః ।

సమ్మృదుః కఠినస్స్నిగ్ధ శ్శ్రేష్ఠో గంధక ఉచ్యతే ॥

తా. దురదగొండివిత్తులతో సమానముగ వెన్నతోసమానమైన కాంతిగలదిగ మృదు కఠిన స్నిగ్ధములుగనుండు గంధకము శ్రేష్ఠంబు.

## గంధక శుద్ధి.

శ్లో॥ సాజ్యభాండే పయః క్షిప్త్వా ముఖం వస్త్రేణ బంధయేత్ ।
తత్పృష్ఠే చూర్ణితం గంధం క్షిప్త్వా శరావేణ రోధయేత్ ।
భాండం నిక్షిప్య భూమ్యంతరూర్ధ్వే దేయం పుటం లఘు ।
తతః క్షీరే ద్రుతం గంధం శుద్ధం యోగేషు యోజయేత్ ॥

తా. నేతికుండలో పాలుబోసి దానిమూతికి వస్త్రముసుగట్టి దానిపై గంధకచూర్ణముబరచి యాకుండమూతిని మూకుడుచే మూసి చీలమన్ను లేపనముచేసి యెండించి మూకుడువరకు 1 గుంటలోపాతి దానిపై యేరుపిడకలతో లఘుపుటం బిడిన యందలి గంధకముకరిగి పాలలో ప్రవహించు. పిదప దానిని స్వాంగశీతలమున దీసి యౌషధములలో ప్రయోగించికొనవలయు.

శ్లో॥ ధుత్తూర కేతకీలింగైః కుమార్యాథ పునర్నవైః ।
మేఘనాదైశ్చ గోక్షీరైర్ఘృతేన సుధుగంధకమ్ ।
శోధనైర్నిర్మలం సర్వ యోగేషు పరివర్తయేత్ ॥

తా. గంధమును వుమ్మెత్తాకు మొగలిచన్ను లింగపొట్లకలు బంచగలిజేరు చి(
అనువాని రసములలోను ఆవుపాలు నెయ్యి వీని అనువానితోను భూయంత్రము పక్వముచేసిన శుద్ధియగు. దానిని సర్వయోగములయందు నుపయోగింపందగు.

## గంధక తైలము.

శ్లో॥ అర్కక్షీరైః స్నుహీక్షీరైర్వస్త్రం లేప్యం తు సప్తధా ।
గంధకం నవనీతేన పిష్ట్వా వస్త్రం ప్రలేపయేత్ ।
తద్వర్తిర్జ్వలితా దండే ధృత్వా గంధార్ధ్యా హ్యధోముఖమ్ ।
తైలం పతేదధో భాండే గ్రాహ్యం యోగేషు యోజయేత్

తా. జిల్లేడుపాలు బొంతజెముడుపాలు అనువానిలో వస్త్రము నేడే తడిపి యెండించి గంధకమును వెన్నతోనూరి దానిపై లేపనముజేసి లావుగవ

దీపములో వెలిగించి దృఢముగ తలక్రిందుగ బట్టుకొని దానికడుగున 1 పిడతనునిచిన యందు గంధకతైలము స్రవించు దానిని సర్వౌషధములయందు గ్రహింపందగు.

## గంధక కల్పము.

శ్లో॥ [దేవీశాస్త్రే] వాతారితైలసంయుక్తం గుగ్గులు త్రిఫలాన్వితమ్ । గంధకం రసరసంయుక్తం జరావ్యాధి వినాశనమ్ । మాసమాత్ర ప్రయోగేణ శృణువక్ష్యామి తద్గుణాన్ । అర్శోభగందర శ్చైవ తథాశ్లేష్మ సముద్భవః । అష్టాదశచ కుష్ఠాని రాజయక్ష్మాశ్రైనచ । ఆమవాతశ్చ గుల్మంచ తథా సర్వవ్రణానిచ । నశ్యంతి వ్యాధయస్సర్వే గంధకస్యప్రభావతః । షణ్మాసస్య ప్రయోగేణ శృణువక్ష్యామి తత్ఫలమ్ । హంసవర్ణాశ్చ యేకేశావలీ చైవావలంబిని । తత్క్షణాన్నేన తుల్యశ్చ వృద్ధోపి తరుణాయతే । దివ్యదృష్టి సమాయుక్తో జీవే దాచంద్రతారకమ్ । ఆకుంచిత ఘనంకేశా దీర్ఘదృష్టిశ్చజాయతే । చలాదంతా మందదృష్టి ర్బలశుక్రాది సంక్షయః । నిర్జిత్యయావనంయాతి భ్రమరా ఇవ మూర్ధజాః । దివ్యదృష్టి ర్మహాతేజా వరాహాఇవకర్ణయోః । చక్షుపాతార్క్ష్యతుల్యోసౌ బలేనబలివిక్రమః । దృఢదంతోవజ్రకాయో ద్వితీయ ఇవశంకరః । తస్యమూత్రపురీషేణ శుల్బం భవతి కాంచనమ్ ॥

తా. ఆమునమున గుగ్గిలము త్రిఫలములు గంధకము పాదరసము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మర్దించి యొకమాసమువరకు శరీరబలాను గుణ్యముగ సేవింపుచుండిన ముదిమి అర్శస్సు భగందరము శ్లేష్మరోగములు 18 కుష్ఠువులు రాజయక్ష్మ ఆమవాతము గుల్మము సర్వవ్రణములు మొదలగు రోగములన్నిటిని గంధకము తనప్రభావమువలన క్షీణింపంజేయు. మఱియు దీనిని 6 మాసములు సేవించిన నరుడు దేవతలతో సమానుండై చంద్రనక్షత్రంబు లుండువరకు జీవించుటయేగాక నెరసిన వెంట్రుకలు వ్రేలాడుచుండుచర్మము కదలుచుండుదంతములు దృష్టిమాంద్యము బలక్షీణము శుక్రక్షయము అనువానినన్నిటిని బోకడచి యావనమును గలుగంజేయు.

ముడిచికొనియుండు వెంట్రుకలు దట్టముగ పెరిగితుమ్మెదవలె నల్లగనుండును. దృష్టి దివ్యముగ నుండుటయేకాక మహాతేజస్సుగలవాడై పందివలెనె నూక్ష్మమైన దివి కిడిగలవాడుగ గరుత్మంతునితో సమానమైన దృష్టిగలవాడుగ బలములోచక్రవర్తి తో సమానుడుగ దృఢదంతములు వజ్రదేహము గలవాడుగ రెండవశంకరునితో తుల్యుడుగనుండు. మఱియు వానిమలమూత్రములవలన నిశ్చయముగ తామ్రబంగా రంబు లుత్పన్నంబులగు.

## శుద్ధగంధక గుణము.

శ్లో॥ శుద్ధోగంధో హరేద్రోగాన్ కుష్ఠమృత్యుజరాదికాన్।
ఆగ్నికారీ మహానుష్ణో వీర్యవృద్ధిం కరోతిచ ॥

తా. శుద్ధిజేయబడిన గంధకము కుష్ఠువు మృత్యువు ముదిమి మొదలగువానిని నశింపం జేయుటయేగాక అగ్నిదీపనమును మిక్కుటముగ నుష్ణమును వీర్యవృద్ధిని గలుగంజేయు.

## అశుద్ధగంధక దోషము.

శ్లో॥ అశుద్ధగంధం కురుతేచ కుష్ఠం తాపం భ్రమం పిత్తరజం తథైవ। రూపం సుఖం వీర్య బలం నిహంతి తస్మాద్విశుద్ధో వినియోజనీయః ॥

తా. అశుద్ధగంధకము కుష్ఠువు తాపము భ్రమ పిత్తరోగము వీనిని గలుగం జేయుటయేగాక రూప సుఖ వీర్య బలముల నశింపంజేయు. కావున ఔషధముల యందు శుద్ధిజేయబడిన గంధకమునే జేర్చవలయు.

## ఇంగిలీక శుద్ధి.

శ్లో॥ [గ్రంథాంతరే] హింగుళం స్తన్యపయసా మర్దితం శుద్ధిమాప్నుయాత్ । జంబీరఫలజద్రావైః స్సర్వంశుద్ధి ర్భవిష్యతి ॥

తా. ఇంగిలీకమును చనుపాలతోను నిమ్మపండ్లరసముతోను మర్దించిన శుద్ధి యగును. పిదప దానినౌషధములలో నుపయోగింపంజను.

## ఇంగిలీక గుణము.

శ్లో॥ హింగుళ స్సర్వదోషఘ్నో దీపనోతిరసాయనః ।
సర్వరోగ హరోవృష్యో జారణే లోహమారణే ।
హింగుళం మధురంతిక్త ముష్ణవాత కఫాపహమ్ ॥

తా. ఇంగిలీకము సర్వదోషముల బోకడచి అగ్నిదీపనమును గలుగంజేయునటయేగాక సర్వరోగహర రసాయనోపయుక్తముగ వీర్యవృద్ధికారిగ జారణలో మారణోపయుక్తముగ మధురముగ వగరుగ వృష్ణవాతమును బోకడచునదిగనుండు.

## అశుద్ధ ఇంగిలీక దోషము.

శ్లో॥ అశుద్ధో దరదఃకుర్యా త్కుష్ఠంక్లైబ్యం క్లమంభ్రమమ్ ।
మోహంచ శోధయే త్తస్మా చ్ఛుద్ధంవైద్యస్తు హింగుళమ్ ॥

తా. అశుద్ధమై యింగిలీకము కుష్ఠువు పుంస్త్వహాని శ్రమ భ్రమ మోహము వీనిని గలుగంజేయు. కావున దానిని శుద్ధిజేయవలయు.

## తాళకోత్పత్తి.

శ్లో॥ సంధ్యాయాం నరసింహేన హిరణ్యకశిపుర్హతః ।
తస్యచ్ఛవిసమోతాళ స్సత్కక్షా లేఖనాశ్రితః ॥

తా. తొల్లి నరసింహమూర్తి సాయంకాలమున హిరణ్యకశిపుడను పేరుగల దైత్యునివధించి వానిచంకల గీచినంతున వానితోసమాన కాంతిగల తాళకముత్పన్నంబయ్యె

## తాళక భేదములు.

శ్లో॥ హరితాళం ద్విధాప్రోక్తం పత్రాఖ్యం పిండసంజ్ఞితమ్ ।
* తత్పత్రహీనం పిండాఖ్యం తయోః పూర్వం గుణాధికమ్॥

తా. తాళకము పత్రాఖ్యము పిండికము అన 2 విధంబులు. వానిలో పత్రాఖ్యమనునది గుణాధిక్యముగలదిగ పిండాఖ్యమనునది హీనగుణముగలదిగ నుండు.

## తాళక నామములు.

శ్లో॥ హరితాళ మలంతాళం గోదంత నటభూషణమ్ ।
పిండాలకం విస్రగంధం పింజరం కనకప్రభమ్ ॥

తా. హరితాళమలము తాళము గోదంతము నటభూషణము పిండాలకః విస్రగంధము పింజరము కనకప్రభము అనునవి హరిదళ నామంబులు.

* తయోరాద్యంగుణైశ్శ్రేష్ఠ తతో హీనగుణంపరమ్.

## తాళక శుద్ధి.

శ్లో॥ తాళకం కణశః కృత్వా దశాంశేనచ టంకణమ్ ।
జంబీరాణాం ద్రవైః క్షాళ్యం కాంజికైః క్షాళయేత్పునః ।
వస్త్రే చతుర్గుణే బధ్వా డోలాయంత్రే దినంపచేత్ ।
సచూర్ణేనారవాళేన దినం కూశ్మాండజై రసైః ।
తిలతైలైః పచేద్యామం యామంచ త్రిఫలాజలైః ।
త్రివారం తాళకం భావ్యం పిష్ట్వా మూత్రైశ్చ కాంజికైః ।
ఏవం ద్వాదశధాపాచ్యం శుద్ధం యోగేషు యోజయేత్ ॥

తా. తాళకమును రేకులుగ నొలిచి దానికి పది భాగము వెలిగారముగలిపి నిమ్మపండ్లరసముతోను కలితోనుగడిగి 4 మడతలుగల గుడ్డలో మూటగట్టి డోలా యంత్రమున కలి సున్నపునీళ్ళుబోసి దానిచే 1 దినము గుమ్మడుకాయరసముతో 1 దినము నువ్వులనూనెలో 1 ఝామువండి పిదప త్రిఫలరసముతో నొక్కొక ఝాముచొప్పున 3 మార్లును గోమూత్రముతో నొక్కొక ఝాముచొప్పున 3 మార్లును కలితో నొక్కొక ఝాముచొప్పున 3 మూడుమార్లు భావనముజేసి డోలా యంత్రమున వండవలయును. ఇత్తెరంగున 12 మార్లు వండిన తాళకము శుద్ధియగు. అట్టి దాని నౌషధములలో బ్రయోగింపఁజను.

## తాళకభస్మము.

శ్లో॥ సదళంతాళకంశుద్ధం పునర్నవారసేన । ఖల్వేవిమర్దనే దేకందినసంపశ్చా ద్విశోషయేత్ । సంశోష్యగోళకంతస్య కుర్యాత్తంచవిశోషయేత్ । తతః పునర్నవాక్షారై స్థాల్యర్థం తుప్రపూరయేత్ । తత్రతంగోళకం ధృత్వా పునస్తేనైవ పూరయేత్ । ఆకంఠంవిరతంతస్య పిధానంధారనేన్ముఖే । దినాన్యంతర శూన్యాని పంచవహ్నిం ప్రదీపయేత్ । స్థాలీం చుల్ల్యాం సమారోప్య క్రమాదహ్నిం వివర్ధయేత్ । ఏవం తుమ్రియతేతాళం మాత్రాతస్యైవర ... । అనుపానా న్యనేకాని యథాయోగ్యం ప్రయోజ...

తా. శుద్ధిజేసిన తాళకమును రేకులుగ నొాంచి గలిజేరురసముతో 1 దినము మర్దించి యుండజేసి యెండించి దానిని బిళ్ళవలె చిన్నబిళ్ళలుగ మంటిపాత్రలో నునిచి దానికంఠమువరకు గలిజేరురసమునుబోసి దానిపైమూసి 5 దినము లహోరాత్రములు పొయిమీదనునిచి క్రమాగ్నులతో నెడతెగక వండిన తాళకము భస్మంబగు. అం దొకగురిగింజయెత్తు ననుపానవిశేషములతో సేవించిన సర్వరోగముల హరింపంజేయు.

* తాళకగుణము.

శ్లో॥ శ్లేష్మవాతవిషరక్తభూత ష్ఠ్రుద్దీకసంచశీతలరుజాపహమ్ ।
స్నిగ్ధముష్ణకటుకంచ లేఖనం కుష్ఠహారిహరితాళముచ్యతే ॥

తా. తాళకము శ్లేష్మము వాతము విషము రక్తదోషము భూతదోషము వీనిని హరింపం జేయుటయేగాక అగ్నిదీపనమును గలుగంజేసి శీతపీడను బోకడచు నదిగస్నిగ్ధముగ ఉష్ణముగ కారముగ లేఖనకారిగ కుష్ఠువునుహరింపంజేయునదిగనుండు

అశుద్ధతాళకదోషము.

శ్లో॥ అశుద్ధం తాళమాయుఘ్నం కఫమారుతమేహకృత్ ।
తాపస్ఫోటాంగసంకోచం కురుతే తేనశోధయేత్ ॥

తా. అశుద్ధతాళకము ఆయువును క్షయింపం జేయుటయేగాక కఫము వాతము మేహము శరీరతాపము స్ఫోటకములు అంగసంకోచము వీనిని గలుగంజేయు. కావున దానిని శుద్ధిజేయువలయు.

మణిశిలభేదము.

శ్లో॥ మనశ్శిలా త్రిధాప్రోక్తా శ్యామాంగీ కరవీరకా ।
ద్విఖండాఖ్యాచతా సాంతు లక్షణాని నిబోధమే ।
శ్యామా హింగుళవద్రక్తా కించిత్పీతా విదీప్తికా ।
కరవీరారక్తవర్ణా స్వర్ణరూపాణిభారయుక్ ।
కించిద్రక్తాచ గౌరాచ ద్విఖండా భారవత్తరా ।
త్రివిధా సుచశ్రేష్ఠాస్యాత్కరవీరా మనశ్శిలా ॥

---

* తాళకమన హరిదళము.

తా. మణిశిల శ్యామాంగి కరవీర ద్విఖండములని 3 విధంబులు. అందు యింగిలీకమువలె నెఱ్ఱగ నొకింతపచ్చగ కాంతిహీనముగ నుండునది శ్యామాంగి యనియు యెఱ్ఱగ మూర్ణముతో సమానముగ కడుబరువుగనుండునది కరవీరమనియు నొకింత యెఱ్ఱగ పచ్చగ కడుబరువుగ నుండునది ద్విఖండమనియు జెప్పంబడు. వానిలో కరవీరమనునది శ్రేష్ఠంబు.

### మణిశిల శుద్ధి.

శ్లో॥ [గ్రంథాంతరే] సూక్ష్మవస్త్ర ద్వయోపేతం మనో గుప్తాను
బాధనమ్ । వాచయే చ్ఛాగమూత్రేణ దోలయంత్రే దిన
త్రయమ్ । పచన-కురుతేహ్యత్ర శుద్ధిర్భవతినిశ్చయమ్ ॥

తా. మణిశిలను సన్నమైన జమిలిబట్టనమూటగట్టి మేకపంచితముతో 3 దినములు డోలాయంత్రమున వండిన నిశ్చయముగ శుద్ధియగు.

శ్లో॥ అగస్త్యపత్రతోయేన శృంగిబేరరసేనచ ।
భృంగతోయేనపచ్యేత భావితం సప్తధాశిలా ॥

తా. మణిశిలను అగిసియాకు అల్లము గుంటగలగర అనువాని రసములతో వేడేసిమార్లు వండి నేడేసిమార్లు భావనజేసిన శుద్ధియగు.

### గౌరీపాషాణ శుద్ధి.

శ్లో॥ ద్విపలం గౌరిపాషాణం మర్ద్యం జంబీరవారిణా ।
పిష్టం కృత్వా పటే బధ్వా దోలాయంత్రేణ బుద్ధిమాన్ ।
శిలా తుగోదకేపాచ్యం భవే చ్ఛుద్ధి ర్వినిశ్చయః ॥

తా. 2 పలములు గౌరీపాషాణమును నిమ్మపండ్లరసముతో మర్దించి ముద్దజేసి జమిలిబట్టన మూటగట్టి సున్నపునీళ్ళతో డోలాయంత్రమున 2 జాములు వండిన శుద్ధియగు.

### ఉల్లపాషాణ శుద్ధి.

శ్లో॥ ఉల్లిపాషాణ సంబుద్ధిం వక్ష్యతే శాస్త్రనిశ్చితమ్ ।
చూర్ణీకృతంపటేబధ్వా శిలాతుగోదకేనచ ।
దోలాయంత్రేదినైకంతు పాచితంచ విశుద్ధ్యతి ॥

తా. ఉల్లిపాషాణమును చూర్ణముజేసి జమిలిబట్టన మూటగట్టి డోలాయంత్రమున సున్నపునీళ్ళతో 1 దినము వండిన శుద్ధియగు.

శ్లో॥ [అగ్నిమతే] మధునాపాచయేద్యామం శనైర్మృద్వగ్నినా
తతః । ఉల్లిపాషాణ శుద్ధిశ్చ భవే దేవం విశారదః ॥

తా. ఉల్లిపాషాణమును తేనెలోవేసి యొకఝామము మందాగ్నితో మెల్ల మెల్లగ వండిన శుద్ధియగు.

## దొడ్డిపాషాణ శుద్ధి.

శ్లో॥ గోమూత్రే దొడ్డిపాషాణం డోలాయంత్రే దినత్రయమ్ ।
పక్త్వాబద్ధ్వా తతోపాచ్యాం సమ్యక్ఛుద్ధి ర్భవిష్యతి ॥

తా. దొడ్డిపాషాణమును చూర్ణముజేసి జమిలిబట్టన మూటగట్టి ఆవుపంచితములో డోలాయంత్రమున 3 దినములు వండిన శుద్ధియగు.

## * విమలభేదము.

శ్లో॥ విమలం త్రివిధంప్రోక్తం హేమాఖ్యం తారపూర్వకమ్ ।
కాంస్యపూర్వం తథాచాల్య ల్లక్ష్యతే సర్వకామదమ్ ॥

తా. స్వర్ణమాక్షికము రౌప్యమాక్షికము కాంస్యమాక్షికము అన విమలము 3 విధంబులు. ఇవి సర్వకామ్యముల నిచ్చును.

## విమల లక్షణము.

శ్లో॥ వర్తులః కోణసంయుక్త స్స్నిగ్ధశ్చ ఫలకాన్వితః ।
మరుత్పిత్తహరో వృష్యో విమలశ్చ రసాయనః ॥

తా. రౌప్యమాక్షికము గుండ్రముగ కోణయుక్తముగ దట్టముగ పలకలుగ వాతపిత్తముల హరింపజేయునదిగ వీర్యవృద్ధికారిగ రసాయనోపయుక్తముగనుండు.

## విమల శుద్ధి.

శ్లో॥ వాసాపునర్నవాసిందు వారకంయస్యకస్యచిత్ ।
రసేన స్వేదితంయామం విమలం నిర్మలం భవేత్ ॥

* విమల మన — మాక్షిక భేదము.

తా. విమలమును అడ్డసరము గలిజేరు వావిలి అనువాని రసములలో దేనితో నైని డోలాయంత్రమున 1 దినము వండిన శుద్ధియగు.

శ్లో॥ [గ్రంథాంతరే] పాట నాద్విమలంభిన్నం సూక్ష్మవస్త్రేణ
బంధయేత్ । అవిమూత్రే కాంజికే చ పృథక్క్వథితవారిణి ।
డోలాయంత్రే చతుర్యామం పాచయే చ్ఛుద్ధిమాప్నుయాత్ ॥

తా. విమలమును పగలగొట్టి సన్నపుబట్టన మూటగట్టి గొర్రెపంచితములోను కలిలోను ప్రత్యేక ప్రత్యేకముగ 4 ఝాములు డోలాయంత్రమున వండిన శుద్ధియగు.

## మాక్షికోత్పత్తి తద్భేదాములు.

శ్లో॥ [ఆయుర్వేదే] మాక్షికో ద్వివిధశ్చైవ మాక్షికస్తారమాక్షికః।
తత్రాద్యః కన్యకుబ్జోత్థో దశవర్ణసువర్ణకః ।
భిన్నదేశో పితారోన్యః పంచవర్ణసువర్ణకః ।
పాషాణబహుళశ్చాన్యో గుణైరల్పతరోపినః ॥

తా. స్వర్ణమాక్షికము తారమాక్షికము అన మాక్షికము 2 విధంబులు. మొదటిది కన్యాకుబ్జమున జనించు. అది పదియవవన్నెబంగారుతో సమానంబై కోణరహితంబై) యుండు. తారమాక్షికము భిన్నదేశమునజనించు. ఇది 5వ వన్నెబంగారముతో సమానముగ బహుళమైన పాషాణముగలదిగ అల్పగుణకారిగ నుండు.

## మాక్షిక నామములు.

శ్లో॥ [నిఘంటౌ] ఆవర్తంమధుతుత్థంచాతాపిజంధాతు మాక్షి
కమ్ । తాప్యమాక్షికధాతుశ్చ మాక్షికంహేమమాక్షికమ్ ॥

తా. ఆవర్తము మధుతుత్థము తాపిజము ధాతుమాక్షికము తాప్యమాక్షికము మాక్షికము హేమమాక్షికము అనునవి మాక్షికనామంబులు.

## * మాక్షికశుద్ధి.

శ్లో॥ ఏరండతైలలుంగాంబు సిద్ధం శుద్ధ్యతి మాక్షికమ్ ।
పక్వంవా కదళీకందతోయేన ఘటికాద్వయమ్ ।
తప్తంక్షిప్తం వరాక్వాథే శుద్ధిమాయాతిమాక్షికమ్ ॥

* మాక్షిక మన—నిమ్మ.

తా. మాక్షికమును చూర్ణముజేసి బట్టవమూటగట్టి ఆముదము మాదీఫల రసము అరటిగడ్డరసము అనువానిలో ప్రతిదానిచే 2 గడియలు డోలాయంత్రము వండిన మాక్షికము శుద్ధియగు. లేక మాక్షికమును నిప్పులోకాచి త్రిఫలకషాయములో వేసినను శుద్ధియగు.

(1) పలము మాక్షికమును తేనెతోమర్దించి ముద్దజేసి జనుమిబట్టన మూటగట్టి వులవకట్టు గోమూత్రము కలి వీనితో 1 జాము ప్రత్యేక ప్రత్యేకముగ డోలాయంత్రమున వండిన శుద్ధియగు.

మాక్షికమును కలిశో 1 దినము డోలాయంత్రమున నుడికించి చూర్ణముజేసి దానిని నొకపాత్రములోవేసి తేనె నెయ్యిబోసి 1 దినంబునిచి సన్నగ చూర్ణముజేసి యినుపపాత్రలోవైచి తేనె నెయ్యిబోసి 1 దినమువండి జెముడుపాలలో 1 దినము భావనజేసి యెండించి నెయ్యి తేనెతో 1 దినము మర్దించి అంధమూషలోనునిచి వంపిన నందు గురివిందచాయవలె సత్త్వము దిగును.

## మాక్షిక సత్వపాతనము.

శ్లో॥ ఏవంశోధితేన తైలేన గుంజా క్షౌద్రంచ * టంకణమ్ ।
మర్దితం తస్యవాపేన సత్త్వం మాక్షికజం భవేత్॥

తా. ఆముదము గురివిందపలుకులు తేనెవెలిగారము వీనినిజేర్చి నూరి మాక్షికముపై అన్నిలోనునిచి యూదిన నందు సత్త్వము దిగును.

## మాక్షిక గుణము.

శ్లో॥ శుద్ధంహితాప్యం సకలామయఘ్నం రసాదిధాతూంశ్చ వరం ప్రపుష్యేత్ । దుర్మేహ దేహక్షయహారకంచ గుణోత్తరం వృష్య రసాయనాగ్ర్యమ్ ॥

తా. శుద్ధమైన మాక్షికము సర్వరోగములు హరింపంజేసి రసాది ధాతువృద్ధిని గలుగంజేయునదిగ దుష్టమేహమును శరీరక్షయమును హరింపంజేయునదిగ గుణకారిగ వీర్యవృద్ధికారిగ రసాయనోపయుక్తముగ నండు.

శ్లో॥ సువర్ణ మాక్షికం స్వాదు తిక్తం వృష్యం రసాయనమ్ ।
చక్షుష్యం వార్తిహృత్కంఠ పాండుమేహ విషోదరమ్ ।

* వర్కయేత్.

ఆర్శశ్శోథ విషం కండూ త్రిదోషా నపినాశయేత్ ॥

తా. సువర్ణమాక్షికము రుచికరము వగరుగ వీర్యవృద్ధికారిగ నేత్రహితకారిగ నుండును. లింగావర్తి కంఠరోగము పాండువు ప్రమేహము విషదోషము వుదరము మూలవ్యాధి వాపువిషరోగము దురద త్రిదోషము వీనిని హరింపజేయునదిగనుండు.

## అపక్వమాక్షికదోషము.

శ్లో॥ మందానలత్వం బలహానిముగ్రాం విష్టంభితా నేత్ర గదాన్ సకుష్ఠాన్ । మాలస్య భేదప్రణపూర్వకంచ శుద్ధ్యాది హీనం ఖలుమాక్షికంతు ।

తా. అశుద్ధమాక్షికము అగ్నిమాంద్యము బలహాని మలబద్ధము నేత్రరోగము కుష్ఠువు శిరోవ్రణము వీనిని గలుగంజేయు.

## కాసీసభేదములు.

శ్లో॥ వాలుకాఖ్యం పుష్పపూర్వం కాశీసం ద్వివిధం స్మృతమ్ ।
శ్యామ పాండురవర్ణంచ ద్వయోః పూర్వం గుణాధికమ్ ॥

తా. వాలుకాసీసము పుష్పికాసీసము లన కాసీసము 2 విధంబులు. అందు మొదటిది నలుపువర్ణము 2 ది పాండువర్ణగలదిగనుండు. వానిలో మొదటిది గుణాధిక్యతం జెందియుండు.

## కాసీస నామములు.

శ్లో॥ కాసీసం ధాతుకాసీసం పాంసుకాసీస కేసరమ్ ।
అన్యం మాల్యరసం పుష్ప కాసీసం నేత్రభూషణమ్ ॥

తా. కాసీసము ధాతుకాసీసము పాంసుకాసీసము కేసరము అన్నమాల్యరసము పుష్పకాసీసము నేత్రభూషణము అనునవి కాసీసనామంబులు.

## కాసీస శుద్ధి.

శ్లో॥ సకృద్భృంగాంబునాస్విన్నం కాసీసం నిర్మలం భవేత్ ॥

తా. కాసీసమును గుంటగలగరాకురసములో వండిన శుద్ధియగు.

* కాసీస మన—అన్నభేది.

## కాసీస సత్త్వ పాతనము.

శ్లో॥ చతుర్విధంతుకాసీసం రక్తపీతసితాసితమ్ । మర్దయేత్పృత్థక్ నలిక్తకోశాతకీద్రవైః । కాసమర్ద ద్రవైశ్చాపి మిత్రపంచక సంయుతమ్ । సత్వంచయష్టికాయంత్రేధ్మాతేసత్వంవినిశ్చితమ్

తా. ఎఱుపు పసుపు తెలుపు నలుపు వర్ణభేదమువలన కాసీసము 4 విధ బులు. వానిని మనిషి గుఱ్ఱము నెమలి ఆవుమత్స్యము అనువాని చేదలుతో ప్రత్యే ప్రత్యేకముగ మర్దించి పిదప చేతిబీరాకురసము కసివెందాకురసము తేనె నెయి వెలిగారము గురివిందపలుకులు బెల్లము అనువానితోడనుమర్దించి బిళ్ళజేసి యష్టికా యంత్రమునందునిచి యూదిన సంగు సత్త్వము వెడలు. (దానిని చూర్ణముజే పుటంబులిడిన సిందూరించు.)

## కాసీస గుణము.

శ్లో॥ కాసీస మమ్లం చక్షుష్యం కేశఘ్నం కుచరంజనమ్ ।
గరశ్లేష్మ హరం వాత వ్రణదోష వినాశనమ్ ॥

తా. కాసీసము పుల్లగ నేత్రహితకారిగ వెంట్రుకల నశింపంజేయునదిగ స్తనరంజనకారిగ విషశ్లేష్మ వాత వ్రణదోషముల హరింపంజేయునదిగ నుండు.

## గైరిక భేదములు.

శ్లో॥ గైరికం త్రివిధం తత్ర రక్తంస్యా త్స్వర్ణగైరికమ్ ।
పాషాణగైరిక చైకం తేషాం పూర్వం గుణాధికమ్ ॥

తా. రక్తగైరికము పూర్ణగైరికము పాషాణగైరికములనఁ* గైరికము 3 విధ . అందు మొదటిది గుణాధిక్యంబుగలదిగ నుండు.

## గైరిక శుద్ధి.

శ్లో॥ గైరికంతు గవాం దుగ్ధై ర్భావితం శుద్ధి మాప్నుయాత్ ॥

తా. గైరికము ఆవుపాలతో భావనజేసిన శుద్ధియగు.

* గైరిక మన—కావిఱాయి.

## గైరిక సత్వపాతనము.

శ్లో॥ గైరికం రక్తవర్గేణ పీతవర్గేణ భావితమ్ ।
సప్తాహం మర్దయేద్యామం మిత్రపంచక సంయుతమ్ ।
ఆధ్మాతం యష్టికాయంత్రే సత్వం ముంచతినిర్మలమ్ ॥

తా. కావితాయిని మంజిష్ఠి కుంకుమపువ్వు లక్క దాడింబకాయ రక్తచందనము దాసనము యెఱ్ఱగన్నేరు అను రక్తవర్గములతోడను కుసుంబ మోదుగు పసుపు మంజిష్ఠి మ్రానిగోరింట అను పీతవర్గములతోడను నేడేసి దినములు భావన జేసి తేనె నెయ్యి వెలిగారము గురువిందపలుసులు బెల్లము అను మిత్రపంచకముతోడ 1 జాముమర్దించి బిళ్ళజేసి యష్టికాయంత్రమునందునిచి యూదిననందు నిర్మలముగ సత్వము వెడలు.

## గైరిక గుణము.

శ్లో॥ గైరికం మధురంనేత్రం దీపనం రక్తపిత్తజిత్ ।
వాంతితాప విషఘ్నంచ రజస్తంభ బలప్రదమ్ ॥

తా. కావితాయి మధురముగ నేత్రహితకారిగ అగ్నిదీపనకారిగ రక్తపిత్తముల హరింపంజేయునదిగ వాంతి జ్వర విషదోషముల బోనడచునదిగ రజస్తంభనకారిగ బలకారిగనుండు.

## అంజన భేదములు.

శ్లో॥ [చరకే] పుష్పనీలరసస్రోత సౌవీరపదపూర్వకమ్ ।
అంజనంపంచధాప్రోక్తం లక్షణాదిక్రమేణచ ॥

తా. పుష్పాంజనము నీలాంజనము రసాంజనము స్రోతోంజనము సౌవీరాంజనము అన అంజనములు లక్షణాదిక్రమమువలన 5 విధంబులు.

## టంకణ శంఖ వరాటాంజన గైరిక కాసీస భుజగశుద్ధి.

శ్లో॥ జంబీరాణాంద్రవేచైవ మాతపేధారయేద్దినమ్ ।
శుధ్యంతిటంకణంశంఖం వరాటాంజనగైరికమ్ ।
కాసీసంభుజగంచైవ శుద్ధంయోగేషుయోజయేత్ ॥

తా. వెలిగారము శంఖము గవ్వలు సౌవీరాంజనము పుష్పాంజనము నీలాంజనము స్రోతోంజనము రసాంజనము కావితాయి అన్నభేది భూనాగము అనువానిని

నిమ్మపండ్లరసములో నైచి 1 దినము సూర్యపుటంబిడిన శుద్ధియగు. అట్టివాని నౌషధములలో బ్రయోగింపంజను.

అంజనపంచక శుద్ధి.

శ్లో॥ అంజనానివిశుధ్యంతి భృంగజస్వరసేసచ ॥

తా. పూర్వోక్త అంజనపంచకమును గుంటగలగరాకు రసముతో భావనజేసిన శుద్ధియగు.

అంజనపంచక గుణము.

శ్లో॥ పుష్పాంజనంసితంశుద్ధం హిమంసర్వాక్షిరోగజిత్ ।
నీలాంజనంకృష్ణవర్ణం నేత్రదోషక్షయాపహమ్ ।
* రసాంజనంతుపీతాభం విషనేత్రవికారనుత్ ।
స్రోతోంజనంపాండువర్ణంచాక్షుషంసర్వరోగజిత్ ।
సౌవీరంరక్తవర్ణంచ నేత్రకండూవిషాపహమ్ ॥

తా. పుష్పాంజనము తెల్లగ శుద్ధముగ శీతలముగ సర్వనేత్రరోగములహరింపంజేయునదిగ నుండు. నీలాంజనము నల్లగ నేత్రదోషము క్షయము వీనిని బోనడచునదిగ నుండు. రసాంజనము పచ్చగ విషదోషమును నేత్రరోగమును బోనడచునదిగ నుండు. స్రోతోంజనము పాండురవర్ణముగ నేత్రహితకారిగ సర్వరోగముల బోనడచునదిగనుండు. సౌవీరాంజనము యెఱ్ఱగ కంటిదురదను విషదోషమునుహరింపంజేయునదిగనుండు.

శిలాజతూత్పత్తి.

శ్లో॥ [గ్రంథాంతరే] నిదాఘేఘర్మసంతప్తా ధాతుసారంధరాధరాః । నిర్యాసవత్ప్రముంచంతి శిలాజతుప్రకీర్తితమ్ ॥

తా. పర్వతము యెండచే తపింపబడుటవలన అందలి ధాతుసారము బందవలె స్రవించిన శిలాజిత్తు యనంబడు.

* రసాంజనోత్పత్తియెట్లనిన—దార్వీక్వాథమజాక్షీరే పాదపక్వం యదాఘనమ్ । తదారసాంజనం ఖ్యాతం నేత్రయోః పరమంహితమ్ ॥

శిలాజిత్తు భేదము.

శ్లో॥ శిలాజతుద్వివిధాప్రోక్తంచ గోమూత్రంగోరసాయనమ్ ।
కర్పూరపూర్వకంచాన్య ద్రక్తంచ పాండురంపరమ్ ॥

తా. గోమూత్రశిలాజిత్తు కర్పూరశిలాజిత్తు అని శిలాజిత్తు 2 విధంబులు అందు మొదటిది గోమూత్రవర్ణ తుల్యముగనుండు. కర్పూరశిలాజిత్తు యెఱుపుగ గాని తెల్లగ గానియుండు. అందు తెల్లనిది శ్రేష్ఠంబు.

శ్లో॥ క్షారామ్లగుగ్గులోపేత మూత్రవేష్ఠాపయేద్దినమ్ ।
స్వేదయేద్ఘటికామాత్రం శిలాజతువిశుద్ధ్యతి ॥

తా. శిలాజిత్తు సర్జక్షారము యవక్షారము టంకణక్షారము నిమ్మపండ్లరసము గుగ్గిలచూర్ణము వీనితో 1 దినము యెండించిభావనజేసి 1 గడియ వండిన శుద్ధియగు.

కర్పూరశిలాజిత్తు శుద్ధి.

శ్లో॥ కర్పూరశిలధాతుశ్చ మృణాళ రసమర్దితః ః
అథవోత్పలజై ర్యామం సమ్యక్శుద్ధి ర్భవిష్యతి ॥

తా. కర్పూరశిలాజిత్తును తామరతూండ్ల రసములోగాని కలువగడ్డలరసముతోగాని యొకజాము మర్దించిన శుద్ధియగు.

శ్లో॥ గోదుగ్ధ త్రిఫలాక్వాథై ర్భృంగద్రావై శ్చమర్దయేత్ ।
ఆతపేదినమేకైకం తచ్ఛుష్కంశుద్ధ తాంవ్రజేత్ ॥

తా. కర్పూరశిలాజిత్తు నావుపాలు త్రిఫలకషాయము గుంటగలగరాకురసః వీనితో 1 దినము యినుపఖల్వమున మర్దించి యెండకెండించిన శుద్ధియగు.

శ్లో॥ శిలాజిత్ పలమాత్రంచ మర్ద్యంచోత్పలజై రసైః ॥
ఆతపేఘటికాస్సప్త శుద్ధిర్భవతినిశ్చయమ్ ॥

తా. 1 పలము శిలాజిత్తు కలువగడ్డలరసముతో 7 గడియలు భావనకై యెండకెండించిన శుద్ధియగు.

శ్లో॥ శిలాజతో షోడశాంశం మృద్వీకా యష్టి చందనమ్ ।
నారికేళోదకంక్షిప్త్వా శిలాయంత్రేణపాచయేత్ ।

తదుద్ధృత్యాతపేశోష్యం తత్ర ద్రోగానుసారతః ।
సేవనాత్సర్వరోగఘ్నం కాంతిపుష్టి బలప్రదమ్ ॥

తా. శిలాజిత్తునకు 16 వభాగము దీపద్రాక్షను యష్టిమధుకమును శ్రీగంధ మునుగలిపి నారికడపుకాయసీళ్ళతో డోలాయంత్రమున నుడికించిదానిందీసి యెండ కెండించి యనపాన విశేషములతో సేవించిన సర్వరోగముల హరింపంజేయుటయే గాక శరీరకాంతిని పుష్టిని బలమును గలుగంజేయు.

శిలాజిత్తు గుణము.

శ్లో॥ శుద్ధోయంగిరితప్తకందరభవః పాండుప్రమేహజ్వర ప్లీహ శ్లేష్మ మరుద్భవాగ్నిసద నత్వద్దోషశోషాపహా । యక్ష్మో న్మాదకశోఫశర్కర కృమిహృన్మూలామ్ల పిత్తాపహా । నశ్యే చ్చోదరకామిలాశ్మరిజరాకృచ్ఛ్రంచ పామాపహా ॥

తా. శుద్ధిజేయబడిన శిలాజిత్తు పాండువు ప్రమేహము జ్వరము ప్లీహము శ్లేష్మరోగము వాతరోగము అగ్నిమాంద్యము వస్తువు శోష రాజయక్ష్మవున్మాదము శోపశర్కర కృమిరోగము బొమ్మనొప్పి మూలము ఆమ్లపిత్తము వుదరము కామిల అశ్మరిముదిమి మూత్రకృచ్ఛ్రము గజ్జి వీనిని హరింపంజేయు.

అశుద్ధశిలాజిత్తు దోషము.

శ్లో॥ అశుద్ధందాహమూర్ఛాంచ భ్రమపిత్తాస్రశోణితమ్ ॥
శిలాజతు ప్రకురుతేమాంద్య మగ్నేశ్చవిడ్గ్రహమ్ ॥

తా. అశుద్ధశిలాజిత్తు దాహము మూర్ఛ భ్రమ పిత్తరక్తము రక్తవికారము అగ్నిమాంద్యము మలబద్ధకము మొదలగువానిని గలుగంజేయు.

శుద్ధశిలాజత్తు పరీక్ష.

శ్లో॥ వహ్నౌక్షిప్తాన్నభవేద్యస్తు లింగాకారోహ్యధూమకః ।
తృణాగ్రేనాంభసిక్షిప్తే వ్యాప్రోగలతితంతువత్ ।
గోమూత్రగంధంమలినం శుద్ధంజ్ఞేయంశిలాజతు ।
సాధారణరసం కేచి ద్రసకర్మోపయోగిచ ।
పూర్వశాస్త్రానుసారేణ వక్ష్యేతేలక్షణాదికమ్ ॥

తా. అగ్నిపైవేసినపొగ వెడలకుండుట పాకకాలమునందు లింగాకారమును జెందుట తృణాగ్రముతో నెత్తి యుదకములో వేసిన తంతువలె క్రిందవ్యాపించుట గోమూత్రమువంటి వాసనవెడలుట యిట్టి లక్షణములవలన శుద్ధశిలాజత్తని తెలియవలయు. ఈ శిలాజిత్తును సాధారణరసమని కొందరు వైద్యశాస్త్రజ్ఞులు వచించెదరు. కావున దీనిని రసస్థానమున నుపయోగింపంజనను.

## సాధారణ రసములు.

శ్లో॥ కంపిల్లోలవణంగౌరీ పాషాణోనవసాగరమ్ ।
దరదోవహ్నిజారశ్చ గిరిసింధూరమేవచ ।
కేదారశృంగిచేదష్టౌ సాధారణ రసాస్స్మృతాః ॥

తా. కంపిల్లము సముద్రలవణము గౌరీపాషాణము నవాసాగరము యింగిలీకము వహ్నిజారము గిరిసిందూరము * కేదారశృంగి అననీ 8 యు సాధారణరసంబులు.

## కంపిల్ల నామములు.

శ్లో॥ [నిఘంటు]గిరిమృద్రైరికంధాతూరక్తాశ్మారక్తశాంతికృత్ ॥

తా. గిరిమృత్ గైరికధాతు రక్తాశ్మరి రక్తశాంతి అనునవి కంపిల్ల నామములు.

## కంపిల్ల భేదము.

శ్లో॥ [గ్రంథాంతరే] ఇష్టకాచూర్ణసంకాశం సవిరేకోహికథ్యతే ।
సౌరాష్ట్రదేశఖనిజం కంపిల్లమితికీర్తితమ్ ॥

తా. సౌరాష్ట్రదేశముయొక్క గనియందు జనించినది కంపిల్లమనంబడు. అది యిటుకపొడివలెనుండును. మఱియునదే విరేచనోపయుక్తంబుగనుండు.

## కంపిల్ల శుద్ధి.

శ్లో॥ స్వేద్యంహారీతకీక్షారే కంపిల్లం శుద్ధితాంవ్రజేత్ ॥

తా. కంపిల్లమును చూర్ణము జేసిబట్టనమూటగట్టి డోలాయంత్రమున కరక్కాయల రసముతో గాని లేక కలితో గాని నుడికించిన శుద్ధియగు.

---

* ముదారసింగు.

కంపిల్ల గుణము.

శ్లో॥ కంపిల్లకో విరేకీస్యా త్కటూష్ణో వ్రణనాశనః ।
కఫకాసా ర్తిహారీచ జంతుకృమిహరోలఘు ॥

తా. కంపిల్లము విరేచనకారిగ నొకింత కటూష్ణముగలదిగ వ్రణము దగ్గు పుప్పుసము జంతువులు క్రిములు వీనిని హరింపంజేయునదిగ లఘుకారిగనుండు.

బోళ శుద్ధి.

శ్లో॥ పలమాత్రం కృష్ణబోళం రక్తంవామర్ది తంతతః ।
ఆతపేకాంజికేయామం భావ్యంశుద్ధిర్భవిష్యతి ॥

తా. 1 పలము నల్ల బోళమునుగాని లేక యెఱ్ఱబోళమునుగాని కలితోమర్దించి ఒ యెండ నెండించిన శుద్ధియగు.

మస్తకి శుద్ధి.

భావయేదాతపేతథా ।
శుద్ధిర్భవతిమస్తకి ॥

తా. మస్తకిని నిమ్మపండ్లరసముతోగాని లేక నరమూత్రముతోగాని యొక ాము భావనజేసి యెండనెండించిన శుద్ధియగు.

కఫరి శుద్ధి.

మాత్రంచ చూర్ణంకృత్వా విమర్దయేత్ ।
తేస ప్తయామం డోలాయంత్రేపచేత్తథా ।
యంచ పాచయేచ్ఛుద్ధిమాప్నుయాత్ ।
ుత్రం పాచయేత్కఫరీశుచిః ॥

కఫరిని చూర్ణముజేసి జమిలిబగుడ్డయందు మూటగట్టి ను గోమూత్రములో 2 జాములును డోలాయంత్రమున ని నావు నేతిలో గలిపివండిన శుద్ధియగు.

### మైలుతుత్థ శుద్ధిః

శ్లో॥ మయూరతుత్థం సంమర్ద్యం సధ్నాచ సహయోజయేత్ ।
లోష్టే సప్తం కృతం చాథ శుద్ధిర్భవతి నిశ్చయమ్ ॥

తా. మైలుతుత్థమును పెరుగుతో మర్దించి బిళ్ళజేసి పెంకులో నునిచి వెచ్చ దీసిన శుద్ధియగు.

శ్లో॥ తుత్థస్య టంకణం పాదం చూర్ణయే న్మధు సర్పిషా ।
తుత్థేన మిశ్రితం ధ్మాతం కోష్ఠయంత్రే దృఢాగ్నినా ।
ద్రావితం ముంచతి సత్త్వం శుకతుండసమప్రభమ్ ॥

తా. మైలుతుత్థమునకు 4 వభాగము వెలిగారము గలిగి చూర్ణము జేసి దానిని తేనె నెయ్యిలో జేర్చి కోష్ఠయంత్రమునందిడి దృఢాగ్నిలో నునిచి యూదిన ద్రవించి యందు అసత్త్వము వెడలు. ఆసత్వము చిలుకముక్కు వన్నెతో సమానముగనుండు.

### పాలతుత్థ శుద్ధి.

శ్లో॥ పలమాత్రం క్షీరతుత్థం చూర్ణం కృత్వా విమర్దితమ్ ।
పటేబధ్వా శిలాచూర్ణ తోయే పాచ్యం విశుద్ధ్యతి ॥

తా. 1 పలము పాలతుత్థమును నూరి చూర్ణముజేసి జమిలిబట్టిన మూటగట్టి సున్నపునీళ్ళతో వండిన శుద్ధియగు.

### గవ్వలు శంఖములు వీనిశుద్ధి.

శ్లో॥ [ఆయుర్వేదే] వరాటశంఖం గోమూత్ర కూశ్మాండకరసద్ర
వైః । ఆమ్లే స్సకాంజిభిశ్చ దోలా స్విన్నంచ శుద్ధ్యతి ॥

తా. గవ్వలు శంఖములు వీనిని గోమూత్రము గుమ్మడుకాయరసము పండ్లరసము కలి అనుపానితో డోలాయంత్రమున వండిన శుద్ధియగు.

### సర్జక్షార శుద్ధి.

శ్లో॥ సర్జక్షారం కాంజికేన మర్దయే ద్ఘటికాద్వయమ్ ।
అథవాచ గవాం మూత్రే శుద్ధి ర్భవతి నిశ్చయమ్ ॥

తా. సర్జక్షారమును 2 ఘడియలు కలితోగాని లేక గోమూత్రముతోగాని మర్దించిన శుద్ధియగు.

సర్జక్షారగుణము.

శ్లో॥ సర్జక్షారోఽగ్నిజననం గుల్మశూల నివారణమ్ ॥

తా. సర్జక్షారము అగ్నిమాంద్యము గుల్మము శూల వీనిని హరింపంజేయు.

యవక్షార శుద్ధి.

శ్లో॥ యవక్షారం విమర్ద్యాథ తండులోదక మిశ్రితమ్ ।
ఆతపే ఘటికామాత్రం క్షిపేచ్ఛుద్ధి ర్భవిష్యతి ॥

తా. యవక్షారమును పసిగడుగుతో 1 గడియ మర్దించి యెండ నెండించిన శుద్ధియగు.

యవక్షార గుణము.

శ్లో॥ దీపనం కఫవాతఘ్నం యవక్షారం వ్రణాపహమ్ ॥

తా. యవక్షారము అగ్నిదీపనమును గలుగంజేయుటయేగాక కఫవాత వ్రణముల హరింపంజేయు.

పంచలవణ శుద్ధి.

శ్లో॥ [ఆయుర్వేదే] సైంధవం కాంజికేభావ్యం భవే చ్ఛుద్ధిర్ఘటీ
ద్వయే । అథవా ఛాగమూత్రేణ పాచితం శుద్ధి మాప్ను
యాత్ । నింబనీరేణసౌవర్చం భావయే చ్ఛుద్ధి మాప్ను
యాత్ । బిడాలవణకంత క్రేభాయే చ్ఛుద్ధిమాప్నుయాత్ ।
లవణంకాచకం జ్ఞేయం తింత్రిణీజలఆతపే । సముద్రలవణం
లోష్ఠే త ప్తంకుర్యా త్త్రియామకమ్ । సమ్యక్ఛుద్ధంభ వేద్దై
ద్య స్త్వౌషధేషు ప్రయోజనేత్ ॥

తా. సైంధవలవణమును 2 ఘడియలు కలితోభావనజేసి యెండించినను లేక గొఱ్ఱెపంచితముతో వండినను శుద్ధియగు. సౌవర్చలవణమును నిమ్మపండ్లరసముతో భావనజేసి యెండ నెండించిన శుద్ధియగు. బిడాలవణమును పులిచల్లతో

భావనజేసి యెండనెండించినశుద్ధియగు. కాచలవణము చింతాకురసముతో భావనజేసి యెండనెండించిన శుద్ధియగు సముద్రలవణమును పెంకులోబోసి 3 జాములు వేయించిన శుద్ధియగు. ఇటుల శుద్ధిజేయబడినవాని నౌషధములలో బ్రయోగింపందగు.

శ్లో॥ [మతాంతరే] లవణాని క్షాళితాని సక్షారే ణాంభసాతపే ।
శోషితాని విశుద్ధ్యంతి విజ్ఞేయం వైద్యపారగైః ॥

తా. పంచలవణమును లక్షారోదకముతో గడిగి యెండనెండించిన శుద్ధియగు.

### పంచలవణ గుణములు.

శ్లో॥ లవణం పంచధాభిన్నం సైంధవాదివిభేదతః । సైంధవంచిక్కణం స్నిగ్ధం। ఫలకం శ్రేష్ఠముచ్యతే। విశీర్యమాణఫలకం పాటలోనచశస్యతే । సైంధవం కఫవాతఘ్నం నిద్రాకుక్షిరుజాపహమ్ । సౌవర్చలంకృష్ణరక్తం గుల్మశూలరుజాపహమ్। కించిత్పిత్తంబిడాపాండు కుక్షిరోగరుజాపహమ్ । కాచోత్థం కాచవర్ణంచకుక్షిరోగవినాశనమ్। సాముద్రంకుక్షిరోగఘ్నం సర్వవాతవినాశనమ్ ॥

తా. లవణములు సైంధవాది భేదమువలన 5 విధంబులు. సైంధవలవణము నున్నగ ఘనముగ పలుకుగనుండు. ఇది ప్రశస్తమైనది. తనంతట తానే పలుకులై * పాటలవర్ణము గలదై యుండు. సైంధవలవణ మప్రశస్తంబు. ఇది కఫ వాత నిద్ర కుక్షిరోగముల బోకడచు. సౌవర్చలవణము కృష్ణరక్తవర్ణముగలదిగ నుండుటయే గాక గుల్మ శూలరోగముల హరింపంజేయు. బిడాలవణము పాండురవర్ణముగ నుండుటయే గాక యొకింత పిత్తకారిగనుండు. ఇది కుక్షిరోగము శరీరపీడను బోకడచు కాచలవణము కాచవర్ణముగలదిగ నుండుటయే గాక కుక్షిరోగమును బోకడచు. సద్రలవణము కుక్షిరోగమును సమస్త వాతరోగములను బోకడచు.

### త్రికటుక శుద్ధి.

శ్లో॥ [చింతామణౌ] శుంఠీంనిస్త్వక్కృతాంచాథశిలాక్షారంవిలేపయేత్ । నిత్యపేదాతపేయామంసమ్యక్ఛుద్ధి ర్భవేద్ధ్రువమ్ ।

* ఎక్కుడు తెలుపుకలిసిన యెఱుపువర్ణము.

వై దేహీంచిత్రకరసే * హ్యేత పేభావయేత్తథా । సమ్యక్ఛుద్ధి
ర్భవేదేతాం రసయోగేషుయోజయేత్ । మరీచమమ్లతక్రేణ
భావితంఘటికాత్రయమ్ । లోహేఽత స్తప్తకృతం శుద్ధిర్భవతి
మారిచమ్ ॥

తా. శొంఠిపైబెరడునుదీసి క్రొత్తసున్నముబట్టించి జాము యెండనెండించిన శుద్ధియగు. పిప్పలిని చిత్రమూలరసముతో 2 గడియలు భావనజేసి యెండనెండించిన శుద్ధియగు. మిరియముల పులిచల్లతో 3 ఘడియలు భావనజేసి పెంకులోబోసి వేయించిన శుద్ధియగు. ఇట్టుల శుద్ధిజేయబడినవానిని రసౌషధములయందు జేర్చుకొనవలయు.

## గజపిప్పలి శుద్ధి.

శ్లో॥ కాంజికే భావితాయామం శుద్ధా వారణపిప్పలీ ।
అజామూత్రేణభావ్యేత శుద్ధిర్భవతి నిశ్చయమ్ ॥

తా. గజపిప్పళ్ళను కలితోగాని లేక మేకపంచితముతోగాని 1 జాము భావనజేసి యెండనెండించిన శుద్ధియగు.

## నల్లమందు శుద్ధి.

శ్లో॥ [సిద్ధసంగ్రహే] గజకర్ణదలేబధ్వాప్య ఫేనం శోధయేద్భిషక్
డోలాయంత్రే పయఃపూర్ణే పాచితం యామమాత్రకమ్ ॥

తా. నల్లమందును బలురక్కసియాకులో నునిచి మూటగట్టి యావుపాలలో డోలాయంత్రమున 1 జాము వండిన శుద్ధియగు.

## ఇంగువ శుద్ధి

శ్లో॥ [చింతామణౌ] పద్మపత్రరసేయామ మాతపేభావితంవిదుఃప
రామఠం శుద్ధిమాప్నోతి రసయోగేషు యోజయేత్ ।

తా. ఇంగువను తామరపాసరసముతో 1 జాము యెండన భావనజేసిన శుద్ధియగు. అట్టిదానిని రసయోగములలో నునిచికొనవలెను.

* నిఘ్ఘేషు ఘటికాద్వయమ్॥

## జీలకఱ్ఱ శుద్ధి

శ్లో॥ ద్విజీరం కాంజికేతాపే క్షిపే ద్యామద్వయంపునః ।
తతోగ్నిహి క్వచి త్తప్తం కృత్వ శుద్ధి ర్భవిష్యతి ॥

తా. జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ అన నీరెంటిని కలిలోదడిపి 2 ఝాములు యెండ నెండించి యొకంత వేయించిన శుద్ధియగు.

## ఆముదపువిత్తులు నేలదంతివిత్తులు వీనిశుద్ధి.

శ్లో॥ గంధర్వహ స్తబీజాని నారికేళోదకాంతరే ।
యామమత్వ కృతేచ్ఛుద్ధి ర్దంతిబీజం పచే త్తథా ॥

తా. ఆముదపువిత్తులు నేలదంతివిత్తులు వీనిపై పొట్టుదీసి టెంకాయనీళ్లలో 1 ఝాము వండిన శుద్ధియగు.

## ముష్టివిత్తుల శుద్ధి

శ్లో॥ బీజాని విషముష్టేశ్చ ఛిల్లికా మూలజేరసే ।
పాచితం త్రిఘటీమాత్రం శుద్ధిర్భవతినిశ్చయమ్ ॥

తా. ముష్టివిత్తులను కత్తితోడ తునుకలుగజేసి చిల్లివేళ్ళరసములో 3 ఘడియలు వండిన శుద్ధియగు.

## నేపాళ శుద్ధి

శ్లో॥ నిస్త్వచంచైవ నేపాళం కుమారీరసజేనచ ।
గుడోదకేన గోక్షీరై ర్గోఘృతేన పృథక్పృథక్ ।
పాచితం శుద్ధిమాప్నోతి వైద్యశాస్త్రవినిశ్చితమ్ ॥

తా. నేపాళములపై పొట్టువొలిచి యందల యగరులందీసి కలబంద పానకము ఆవుపాలు ఆవునేతిలో ప్రత్యేక ప్రత్యేకముగ నుడికించిన శుద్ధియగు

## వసనాభి శుద్ధి.

శ్లో॥ విషంతు ఖండశః కృత్వా వస్త్రఖండేన బంధయేత్ ।
గోమూత్రమధ్యేనిక్షిప్య స్థాపయే దాతపేత్ర్యహమ్ ॥
గోమూత్రంతు ప్రదాతవ్యం నూతనం ప్రత్యహం బుధైః

త్ర్యహాత్తీతేతముద్ధృత్య శోషయేన్మృదు పేషయేత్ ।
శుధ్యత్యేవంవిషంచైవ యోగ్యంభవతిచార్తిజిత్ ।

వసనాభిని తునకలుగ కత్తిరించి బట్టలో మూటగట్టి యొకకుండలోవైచి అందు వసనాభి మునుగునటుల గోమూత్రముబోసి 3 దినము లెండలో నుండవలయు మఱియు సంకయుందలి గోమూత్రమును ప్రతిదినము నుదిసివేసి క్రొత్తగ గోమూత్రమును బోయుచుండవలయు. ఇటుల 3 దినములుజేసి 4 వ దినంబున వసనాభిని వెలికిదీసి చక్కగ నెండించిన శుద్ధియగు. దీనినౌషధములయందు జేర్చునెడ చక్కగ చూర్ణముజేసి చేర్చవలయు. ఇది సర్వపీడల బోకడచు.

## సర్వద్రవ్య శుద్ధులు.

శ్లో॥ క్షీరాజ్యగంధకంశుద్ధ్యే త్తాళంకూశ్మాండజైర్ద్రవైః । ఆరనాళేదతుత్థంతు జంబీరామ్లేమనశ్శిలా । మయూరతుత్థంలుంగామ్లే గోమూత్రేణవిషంహరేత్ । దంతిబీజానిపయసాకుళుత్థేనతుమాక్షికమ్ । అజామూత్రేణవై క్రాంతంటంకణంకాంజికేనతు । జంబీరామ్లేనముత్తారం దరదం తేనశుధ్యతి। తీక్ష్ణం గోమూత్రకైశ్శుధ్యే న్మండకంత్రిఫలారసైః । కృష్ణేరిమేకో జంబూత్వగ్రసైర్ధా త్రీఫలస్యచ । ఆతపేశోషయిత్వాచా ప్యయోవారితరంభవేత్ । గైరికంతుగవాందుగ్ధే భావితంశుద్ధముచ్యతే। అంజనానివిశుధ్యంతిభృంగస్వరససేచనాత్ । నరమూత్రే చాఖువిషం పచే ద్దోలాఖ్యయంత్రకే । మూమమాత్ర విశోష్యాథగోక్షీరేభావితంశుచిః । గౌరీపాషాణకం ప్రోక్తం రసబంధపురస్సరః । హరిద్రాస్వరసేస్విన్నో గంధామేన పరిశుధ్యతి ॥

తా. గంధకము ఆవుపాలు ఆవునెయ్యి వీనిలోనుడికించిన శుద్ధియగు తాళకమును రేకలుగనొలిచి గుమ్మడికాయనీరులోనుడికించిన శుద్ధియగు. మైలుతుత్తమును కలితోనూరి నెత్తునగువరకు కాల్చిన శుద్ధియగు. మణిశిలను నిమ్మపండ్లరసముతో నుడికించిన శుద్ధియగు. పాలుతుత్తమును మాదీఫలరసముతో నూరి నెత్తునగువరకు గాల్చిన శుద్ధియగు. వసనాభినిగోమూత్రముతో 3 దినములు నానబెట్టిన శుద్ధియగు. (నేపాళములు) నేలవంతివిత్తులు వీనిని పైపొట్టుదీసి పాలతోనుడికించిన శుద్ధియగు. మాక్షిక

ము మ పులవకట్టులో నుడికించిన శుద్ధియగు వైక్రాంతమును మేకమూత్రముతో వండిన శుద్ధియగు. వెలిగారమును కలితో నూరి కాల్చిన శుద్ధియగు. ఉమ్మెత్తవిత్తులు నిమ్మపండ్ల రసములో నానబెట్టినశుద్ధియగు. ఇంగిలీకమును నిమ్మపండ్లరసముతో నూరి యెండించిన శుద్ధియగు. ఇనుమునుగాని లేక చిట్టెమునుగాని గోమూత్రముతో కాచిన శుద్ధియగు ఉక్కును త్రిఫలకషాయముతో కాచిన శుద్ధియగు. ఇనుము ఉక్కు వీనిని నల్లతుమ్మ చెక్కరసము నేరేడు చెక్కరసము ఉసిరికపండ్లరసము అనువానితో నూరి యెండనెండించిన శుద్ధియగు. పిదప దానిని చూర్ణముజేసి నీళ్ళపై వైచిన తేలును. కావిఱాయి నావుపాలతో భావనజేసిన శుద్ధియగు అంజనపంచకముల గుంటగలగరాకురసముతో భావనజేసిన శుద్ధియగు ఉల్లిపాషాణము నరమూత్రముతో 1 జాము డోలాయంత్రమున వండి యావుపాలలో భావనజేసి యెండించిన శుద్ధియగు. గౌరీపాషాణమును రసబంధపురసములతో 1 జాము వండి పసుపునీరునుచల్లి యావిరికొల్పిన శుద్ధియగు.

## ద్రవ్యశుద్ధి ఉపరసమాలిక.

శ్లో॥ [ఆయుర్వేదే] శాలిధాన్యామ్ల సంఘృష్ట మభ్రకం శుద్ధ మిష్యతే। విషంత్రిరాత్రముషితం గోమూత్రే శుద్ధిమీరితమ్। అక్షాంగారైః క్షిప్త గోమూత్రే క్షిప్తే త్తప్తాయసంమలమ్। పురాతనం భూమికండం సప్తవారంవిశుధ్యతి। పలాశద్రవతాళాభ్యాంవంగం భస్మీభవేత్క్షణాత్। శిలార్కదుగ్ధతో నాగం తామ్రమమాజ్యేన గంధకాత్। స్త్రీస్తన్యేహింగుళంతీక్ష్ణం తారంస్నుక్షీరతాపనాత్। నాగభస్మశిలాభ్యాంతు హేమధాత్వాదయస్తథా। అజామూత్రేణలోహంతు శిలాగోమూత్రభావితా కఫకీవరమూత్రేణ భావితాశుద్ధముచ్యతే। మాక్షికంకదళీతోయైః పాచయేత్తుభిషగ్వరైః। క్షీరేణటంకణంచాథ గంధకంతు విపాచయేత్। కూశ్మాండనీరేత చ తుత్థంజంబీరజైర్ద్రవైః। దీప్యకంచూర్ణతోయేన జంబీరవారిణా।సప్తాహంగవ్యతక్రస్థానిశుద్ధాస్యాద్వారాక్షీరంచమాషయూషాభ్యాం భావ్యేహింగుళటంగ్ధికామృతాముస్తా వాసారిష్టకమూలకైః। త్రి

యేన గుగ్గులుం శోధయేద్భిషక్ । అనుక్తానిచ సర్వాణిగో
మూత్రేణ విభావయేత్ । జంబీరనీరై స్సప్తాహం భావ
యిత్వావిశుధ్యతి ॥

తా. అభ్రకమును వడ్లు పులికడుసు వీనితో రుద్దిన శుద్ధియగు. వసనాభిని గో మూత్రములో 3 దినములు నానబెట్టిన శుద్ధియగు. ఇనుమును భూమిలోని ప్రాతచిట్టె మును తానికట్టెనిప్పులలో 7 మార్లు కాచి 7 మార్లుగోమూత్రముతో చల్లార్చిన శుద్ధియగు వంగమును మోదుగురసము తాళకము వీనితో నూరి పుటంబులిడిన భస్మంబగు. నాగ మును మణిశిల జిల్లేడుపాలు వీనితో నూరి పుటంబులిడిన భస్మంబగు. గంధకము ను నేతి తో నూరి తామ్రముపై లేపనముజేసి పుటంబులిడిన తామ్రము భస్మంబగు. ఇంగిలీక మును చనుబాలతో నూరి పుటంబిడిన భస్మంబగు. వెండి నెఱ్ఱగకాల్చి బొంతజెముడు పాలలో నద్దిన శుద్ధియగు నాగభస్మము మణిశిలవీనితో స్వర్ణాదిధాతువులు భస్మంబు లగు. లోహమును గొఱ్ఱెపంచితముతో పుటంబులిడిన భస్మంబగు. శిలాజిత్తు గోమూ త్రముతో శుద్ధంబగు. కఫరినివరమూత్రముతో భావనజేసిన శుద్ధియగు. మాక్షికమును అరటిరసముతో వండిన శుద్ధియగు వెలిగారమును పాలతో వండిన శుద్ధియగు. గంధక మును పాలతో వండిన శుద్ధియగు. తాళకమును గుమ్మడుకాయ నీరుతో వండిన శుద్ధి యగు. మైలుతుత్తమును నిమ్మపండ్లరసముతో వండినశుద్ధియగు. ఓమమును సున్నపు నీళ్ళతో వండిన శుద్ధియగు. గౌరీపాషాణమును నిమ్మపండ్లరసముతో వండిన శుద్ధియగు. గవ్వల నావుచల్లతో 7 దినములువండిన శుద్ధియగు. ఇంగిలీకము వెలిగారము వీని నావు పాలతోను మినుపట్టెతోను భావనజేసిన శుద్ధియగు. గుగ్గిలమును ములక పిప్పతిగె తుంగముస్తెలు అడ్డసరము వేప అనువాని వేళ్ళరసముతోను త్రిఫలకషాయముతోను వండిన శుద్ధియగు. మఱియు జెప్పంబడని సర్వద్రవ్యముల గోమూత్రము నిమ్మపండ్ల రసము వీనిలో ప్రతిదానిచే నేడేసి దినములు భావనజేసిన శుద్ధియగు.

* కంకుష్ఠ భేదము.

శ్లో॥ నాళీకం రేణుకంచేతి కంకుష్ఠం ద్వివిధంమతమ్ ।
నాళీకంపీతవర్ణం చాప్యన్యం నీలం ప్రభం భవేత్ ॥

తా. నాళీకము రేణుకము అన కంకుష్ఠము 2 విధంబులు. అందు పచ్చిగ ండునది నాళీకమనియు నీలముగ నుండునది రేణుకమనియు జెప్పంబడు.

* కంకుష్ఠమన — మదారుసింగు.

## కంకుష్ఠ శుద్ధి.

శ్లో॥ కంకుష్ఠం శుద్ధి మాయాతి త్రిధా విశ్వాంబుభావితమ్ ॥

తా. కంకుష్ఠమును శొంఠిరసముతో 3 మార్లు భావనజేసిన శుద్ధియగు.

## కంకుష్ఠ గుణము.

శ్లో॥ కంకుష్ఠం తిక్తకటుకం * వీర్యే చోష్ణం ప్రకీర్తితమ్ ।
† వ్రణోదావర్తశూలఘ్నం గుల్మప్లీహగదాపహమ్ ॥

తా. కంకుష్ఠము వగరు కారము వుష్ణవీర్యము గలదిగ (కడు లేఖనకారిగ) వ్రణము వుదావర్తము శూల గుల్మము ప్లీహము (రసశోషము జంతువులు) వీనిని పోగడచునదిగా నుంతు.

## స్వర్ణాది సర్వలోహనామములు.

శ్లో॥ శుద్ధంలోహం కనకరజతం భానులోహాశ్మసారమ్ । పూతి
లోహద్వితయముదితంనాగవంగాభిధానమ్ । మిశ్రంలోహం
పిత్తళం కాంస్యవర్తంధాతుర్లోహోత్థావికారా స్త్రధైతే ॥

తా. బంగారు వెండి తామ్రము యినుము 2 విధములైన పూతిలోహములు నాగము వంగము అన నీ 8 శుద్ధలోహంబులును యిత్తడి కంచు వార్తలోహము ధాతులోహము అన 4 మిశ్రలోహంబులును ధూవికారంబులు.

శ్లో॥ [మతాంతరే] స్వర్ణంతారం తామ్రనాగం వంగంకాంతంచ
తీక్ష్ణకమ్ । ముండాంతమష్ట ధాలోహం కాంస్యారంఘోషకం
త్రిధా । ఉపలోహాస్సమాఖ్యాతామండూరోముండకిట్టకమ్ ।
ఏతద్ద్వాదశధాలోధ్యా మార్యాస్తాప్యాః పుటాదిషు ॥

తా. బంగారు వెండి త్రామ్రము నాగము తగరము కాంతము పుక్కు యినుము అననీ 8 అష్టలోహంబులనియు కంచుయిత్తడి ఘోషకము అననీ 3 లోహముతోడ నామద్వయముచేవెలయు. మండూరము ముండకిట్టమను చిట్టెమును జేర్పుటచే నాలుగుగనయ్యెడిలోహములు కృత్రిమలోహములనియు వుపలోహములనియు జెప్పంబడుచుండగు. ఈ 12 విధములైన లోహములను శుద్ధిజేసి పుటంబులిడుటచే భస్మము జేయ[illegible]ందగు.

* తీక్ష్ణోష్ణంచాతిలేఖనమ్. † గుల్మోదావర్త శూలఘ్నం రసజంతు [illegible]ణాపహమ్.

## సర్వలోహ శుద్ధి.

శ్లో॥ త్రిక్షారం పంచలవణం తప్త్వా చామ్లేన భావయేత్ ॥
కాంస్యారఘోషపత్రాణి తేనపత్రాణిలేపయేత్ ॥

తా. సర్జక్షారము యవక్షారము వెలిగారముపంచలవణములుఫీనిని నిమ్మపండ్ల రసముతోనూరి కంచు యిత్తడి ఘోషము అనువాని రేకులపై లేపనముజేసి నిప్పులోగాని నిమ్మపండ్లరసములో నద్దిన నవి శుద్ధియగు.

శ్లో॥ తైలే కుళుత్థే గోమూత్రే హ్యారనాళామ్లతక్రకే ।
స్వర్ణాదిసర్వలోహానాం శుద్ధి ర్భవతి నిశ్చయమ్ ॥

తా. బంగారుమొదలగు సర్వలోహముల రేకులనుకాచి నువ్వులనూనెవులవ కట్టు గోమూత్రము పుల్లనికలి పులిచల్లఅనువానిలో ప్రతిదానియందు నేడేడుమార్లు నద్దిననవి శుద్ధియగు. మఱియు సీసము తగరము అన నీరెంటిని నేడేడుమార్లు కరిగి నువ్వులనూనె మొదలగువానిలో నేడేడుమార్లు బోసిన శుద్ధియగు.

## సర్వలోహభస్మక్రమము.

శ్లో॥ రుద్ధ్వా గజపుటేపక్త్వా శుద్ధమాయాతి నాన్యథా ।
తామ్రపర్ణవదేణ తేషాం కృత్వా సర్వత్ర యోజయేత్ ॥

తా. శుద్ధిచేయబడిన సర్వమైన లోహరేకులను సమభాగముగ శుద్ధిచేసిన గంధకమును గ్రహించి జిల్లేడుపాలతో నూరి వానిపై లేపనముజేసి మూషలోనునిచి తామ్రమువలెనే గజపుటంబులిడిన సర్వలోహములు భస్మంబులగు. ఆట్టిభస్మముల సర్వప్రయోగములయం దునిచికొనందగు.

## నవలోహవివరము.

శ్లో॥ సువర్ణం రజతం తామ్ర మయో నాగంచ వంగకమ్ ।
రీతికా కాంస్యవర్తాని లోహా నవ తథా విధుః ॥

తా. సువర్ణము రజితము తామ్రము యినుము సీసము తగరము యిత్తడికంచు వర్తలోహము అనునవి నవలోహంబులు.

## సువర్ణ నామములు.

శ్లో॥ [నిఘంటౌ] స్వర్ణంసువర్ణకనకో జ్జ్వలకాంచనానికల్యాణహాటకహిరణ్యమనోహరాణి। గాంగేయగైరికమహారజతాగ్నివీర్య రత్నాంగహేతుతపనీయకభాస్కరాణి ॥

తా. స్వర్ణము సువర్ణము కనకము ఉజ్జ్వలము కాంచనము, కల్యాణము హాటకము హిరణ్యము మనోహరము గాంగేయము గైరికము మహారజతము అగ్నివీర్యము రత్నాంగహేతు తపనీయకము అనునవి సువర్ణ నామంబులు.

శ్లో॥ [మతాంతరే] జాంబూనదం జాతరూపంహిరణ్యంహేమహాటకమ్ । చామీకరం చారుపుష్పం సువర్ణ స్వర్ణ కాంచనమ్ । తపనీయం శాతకుంభం రుక్మం కనకమేవచ । మహారజతమాగ్నేయం గాంగేయం భర్మ కర్బురమ్ ॥

తా. జాంబూనదము జాతరూపము హిరణ్యము హేమము హాటకము చామీకరము చారుపుష్పము సువర్ణము స్వర్ణము కాంచనము తపనీయము శాతకుంభము రుక్మము కనకము మహారజతము ఆగ్నేయము గాంగేయము భర్మము కర్బురము అనునవి సువర్ణ నామంబులు.

## సువర్ణశుద్ధి.

శ్లో॥ [చింతామణౌ] సువర్ణం రక్తమృత్స్నాచ లేపితం తాత్యసుధ్యతి । తత్సువర్ణందళంకృత్వా సూక్ష్మంకుర్యాద్విచక్షణః । జంబీరనీరేణ హేమమాక్షికంమర్దితంభిషక్ । తద్దళేలేపితం దంతపుటందేయంశరావకే । భస్మీభవతి శీఘ్రేణనాత్రకార్యావిచారణా ॥

తా. బంగారు నెఱ్ఱమన్నులో పొదిగి కొలిమిలో నూదినశుద్ధిగు దానిని సన్నపు రేకులుగజేయించి దానిపై హేమమాక్షికమును నిమ్మపునూరి లేపనముజేసి యెండించి మూకుడులోనునిచి దానిపై మఱియొ మూసి మూడుచీలమన్ను లిచ్చి 3 గజపుటంబులిడిన బంగారుభస్మం

## సువర్ణసింధూర విధి.

శ్లో॥ తద్భస్మ రవిదుగ్ధేన చాశ్వత్థత్వగ్ద్రవేణచ ।
హింగుళంభస్మతుల్యంచ దత్వాతుల్యంవిమర్దయేత్ ।
మర్కటీమూలజద్రావై ర్హంసపాదిరసేనచ ।
మర్దయేచ్చతుర్యామా ఘ్ పుటమారణ్యకోత్పలైః ।
కరిసంజ్ఞంపంచ దేయం సింధూరంభవతిధ్రువమ్ ॥

తా. ఆ బంగారు భస్మమును జిల్లేడుపాలతోను రావిచెక్కలరసముతోను మర్దించి యాంనిగారు భస్మమునకు సమముగ శుద్ధిజేసిన యింగిలీకమునుజేర్చి ఖల్వము లోనునిచి తీటకాసెల వేళ్ళరసము హంసపాదియాకు రసము అనువానితో 4 జాము లు మర్దించి యేరుపిడకలతో 5 గజపుటంబులిడిన సువర్ణము శీఘ్రముగ సిందూరించు.

## ప్రకారాంతర సువర్ణభస్మము.

శ్లో॥ శుద్ధంస్వర్ణదళంకృత్వా చెకుక్రస్వరసేనచ ।
గంధకంమర్దితంచాత్ర దశైకుర్యాద్విలేపనమ్ ।
ఆతపేతాపయే త్తీవ్రే తద్విలేప్యమూహుర్ముహుః ।
అరణ్యోత్పలకేదత్వా పుటమేకంశరావకే ।
గంధంతత్సర్వపాదాంశం పునర్దత్వాఋకేరసే ।
పునఃపుటత్రయేపాచ్యం భస్మీభవతిహాటకమ్ ॥

తా. శుద్ధిజేసిన బంగారును రేకులుగ జేయించి వానిపైశుద్ధిజేసిన గంధకము చెఋకురసములోనూరి లేపనముజేసి యెండనెండించవలయును. ఇటుల 7 మార్లు లేప నముజేసి యెండించి మూకుడులోనునిచి చీలమన్నులిచ్చి యేరుపిడకలతో 1 గజపు టంబిడిసాంగశీతలమువదిసియారేకులకు 4 వభాగము శుద్ధిజేసినగంధకమును గ్రహించి చెఋకురసముతోనూరి 7 మార్లుబట్టించి యెండించి యేరుపిడకలతో 3 గజపుటంబు లిడబంగారుభస్మాబగు. (ఇట్టిభస్మమును క్షయరోగములయందు దుపయోగింపందగు.)

## స్వర్ణ భస్మము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] హేమ్నః పాదం మృతం సూతం పిష్ట్వామ్లేన కేనచిత్ । పత్రే లిప్త్వా పుటేభిశ్చా దష్టభిర్మ్రియతే ధ్రువమ్॥

తా. శుద్ధిజేసిన బంగారును రేకులుజేయించి సన్నముగ టంకణపు రేకులవలె నూత్నముగ కత్తిరించి దానికి 4 వ భాగము రసభస్మముజేర్చి నిమ్మపండ్లరసముతో మర్దించి రేకులపైలేపనముజేసి యెండనెండించి ప్రమిదెల సంపుటములోనునిచి చీలమన్నులిచ్చి పుటంబిడి సాంగశీతలమునదీసి యీసువర్ణపురేకులకు 6 వ భాగము రసభస్మముగలిప నిమ్మపండ్లరసముతో మరలమర్దించి 8 పుటంబులిడిన సువర్ణము శుద్ధభస్మంబగు.

శుద్ధిజేసిన బంగారు 1 భాగము శుద్ధిజేసిన రసభస్మము 2 భాగములు. ఇటుల వీని నేకముజేసి యొచకముతో మర్దించి యందలి నీరునువడసి ముద్దజేసి దానికర్ధభాగము శుద్ధిజేసిన గంధకమును యింగిలీకమును జేర్చి ప్రమిదెలోనునిచి చీలమన్ను లేపనముజేసి పుటంబిడిన భస్మంబగు. పిదప దానికి $\frac{1}{4}$ భాగము శుద్ధిజేసిన గంధకమును యింగిలీకమునుజేర్చి 2 పుటంబులిడిన బంగారము శుద్ధముగ భస్మంబగు.)

## స్వర్ణ ద్రుతి.

శ్లో॥ ఇంద్రగోపకసూతంతు దేవదాళీఫలద్రవైః ।
భావితం చైకవింశాహం ద్రుతే హేమ్ని ప్రదాపయేత్ ॥
కించిత్కించిత్ప్రయోగేణ యావత్తిష్ఠతి సూతవత్ ॥

తా. ఇంద్రగోపపురుగులపాదరసము వీనిచూర్ణమును దేవదాళి ఫలరసముతో 21 మార్లుభావనజేసి పిదప సువర్ణభస్మమునుకరిగి రసమువలె ద్రుతియగువరకు యీ చూర్ణమునుకొంచెకొంచెముగ వేయుచుండవలయు.

## సువర్ణభస్మగుణము.

శ్లో॥ [ఆయుర్వేదే] మూర్ఛ్వాహ్వాచ యక్ష్మాణం గ్రహణీంచ విశేషతః । నాశయేత్సర్వరోగాంశ్చ సాధ్యాసాధ్యాంశ్చ సత్వరాః । తత్తద్రోగానుపానేన ప్రయుంజీత భిషగ్వర

తా. సువర్ణభస్మము నానా రోగానుపానములతోడ నొసంగిన బుద్ధై సాధ్యాసాధ్యంబులగనుండు సర్వరోగములహరింపం జేయుటయే వున్మాదము రాజయక్ష్మగ్రహణి అనువానిని విశేషముగ హరింపంజేం

శ్లో॥ [గ్రంథాంతరే] సువర్ణంతుభవేత్స్వాదు తిక్తంస్నిగ్ధంహిమంగురు । బుద్ధవిద్యాస్మృతికరం విషహారిరసాయనమ్ ॥

తా. శుద్ధిసువర్ణభస్మము వగరుగ శీతకారిగ జడముగ బుద్ధి విద్యాస్మృతుల గలుగంజేయునదిగ రసాయనమువలన విషమును బోకడచునదిగనుండు.

స్వర్ణ భస్మహర రోగములు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] ఏతద్భస్మసువర్ణజంకటుఘృతో పేతంద్విగుంజోన్మితమ్ । లీఢంహంతినృణాంక్షయాగ్నిసదనంశ్వాసంకాసారుచిమ్ । ఓజోధాతువివర్ధనంబలకరంపాండ్వామయధ్వంసనమ్। పథ్యంసర్వవిషాపహంహరంగరందుష్టగ్రహాణ్యాద్రిజిత్ ॥

తా. సువర్ణభస్మము 2 గురగింజలయెత్తును కటుకరోహిణీఘృతము అనుపానితోడసేవించిన క్షయాగ్నిమాంద్య శ్వాసకాసారుచుల హరింపంజేయుటయే గాక ఓజోవృద్ధినిధాతువృద్ధిని బలమును శరీరారోగ్యమును గలుగంజేసి పాండువుసర్వవిషదోషము కృత్రిమవిషదోషము దుష్టగ్రహణి అనువానిని హరింపంజేయు.

సువర్ణ భస్మ గుణము.

శ్లో॥ [నిత్యనాధీయే] స్నిగ్ధం మేధ్యంవిషగరహరంబృంహణంవృష్యమగ్ర్యం । యక్ష్మోన్మాదం ప్రశమనం రోగజాల ప్రమాథిం। మేధాబుద్ధిస్మృతిసుఖకరం సర్వనేత్రామయఘ్నం । రుచ్యం దీప్తంప్రశమనపరంస్వాదుపాకంసువర్ణమ్ ॥

తా. సువర్ణభస్మము స్నిగ్ధముగ పరిశుద్ధముగ విషకృత్రిమవిషముల బోకడుచునదిగ శరీరపుష్టికారిగ కడువీర్యవృద్ధికారిగ రాజయక్ష్మోన్మాదముల హరింపంజేయునదిగ రోగసమూహమును బోనడచునదిగ మేధబుద్ధిస్మృతి సుఖంబుల గలుగంజేయునదిగ సర్వనేత్రరోగముల బోనడచునదిగ రుచికారిగ అగ్నిమాంద్యమును బోనడచునదిగ పాకమువలన రుచికరముగ నుండు.

అశుద్ధసువర్ణ భస్మ గుణము.

శ్లో॥ సౌఖ్యంవీర్యంబలంహంతి రోగంవర్ణంకరోతిచ । అశుద్ధమమృతంస్వర్ణం తస్మాచ్ఛుద్ధంచమారయేత్ ॥

తా. అశుద్ధమైన సువర్ణభస్మము సౌఖ్య వీర్యబలముల బోనడచుటయేగాక రోగమును దుష్టమైన వర్ణమును గలుగంజేయు. కావున బాగుగ శుద్ధిజేయబడిన సువర్ణమునే భస్మము జేయవలయు.

## హేమపరీక్ష.

శ్లో॥ ఘృష్టేకుంకుమసంకాశం ఛేదేసింధూరసన్నిభమ్ ।
శిరీషపాకకందాహే మార్దవే సికతోపమమ్ ।
స్వాదుస్స్నేహనిభంస్నిగ్ధం పారదేనసమంగురు ।
బహుమూలమితిఖ్యాతం స్వర్ణంషడ్విధలక్షణమ్ ॥

తా. ఒరసినకుంకుమవలె నెఱ్ఱగనుండుట ఛేదించిన సింధూరమువలెనుండుట కాచినదిరిసెనపు పువ్వువంటి పాకముగలదై యిసుకవలె మృదువుగనుండుటరుచి మెఱపు స్నిగ్ధముగలదిగనుండుట పాదరసమువలె బరువుగనుండుట వెలయధికముగ నుండుట యీ 6 లక్షణములు స్వర్ణమునందుండు.

## రజత నామములు.

శ్లో॥ [నిఘంటౌ] రూప్యకంరజతంతారంత్రపుభీరుధిరాహ్వయమ్ ।
కలధౌతంతప్తరూపం రుధిరంచంద్రహాసకమ్ ॥

తా. రూప్యకము రజతము తామగము త్రపుభీ రుధిరాహ్వయముకలధౌతము తప్తరూపము రుధిరముచంద్రహాసకము అనునవి రజతనామంబులు.

## రజతశుద్ధి.

శ్లో॥ [చింతామణౌ]అథరౌప్యదళంవంధ్యాకర్కోటీకందకద్రవైః।
భావితంసప్తవారంచ శుద్ధిర్భవతినిశ్చయమ్ ॥

తా. వెండిరేకుల కొలిమిలోకాచి గొడ్డుకాకరగడ్డరసములో 7 మార్లు శుద్ధియగు.

## రజత భస్మము.

శ్లో॥ తచ్ఛుద్ధంరజతంకృత్వా దళంసూక్ష్మంభిషగ్వరై ।
సీమంతినిస్తన్యదుగ్ధే మర్దితంకాకమాచికమ్ ।

విలేపితంతథాశోష్యం పుటమేకంచ మూషమా ।
పాచ్యంవారళిసంజ్ఞేన భస్మీభవతి నిశ్చయమ్ ।
అథవాస్వర్ణవత్కార్యా ద్రాష్యంభస్మీభవే వేద్ధ్రువమ్ ॥

తా. శుద్ధిజేసినసన్నని వెండిరేకుల పైకొకమాక్షికమును చనుబాలతో మెత్తగ నూరి పలుమారు పూసి యెండించి వజ్రమూషములోనునిచి యెరుపిడకలతో గజపుటంబిడిన వెండిభస్మంబగు. లేక బంగారువలెనే పుటంబులిడినను వెండిభస్మంబగు.

* రజత సింధూరము.

శ్లో॥ సమంతద్భస్మ దరదం బర్బరాణాంస్మృతంజలైః ।
అర్కక్షీర పటక్షీరై ర్హంసపాది దురాలభైః ।
గుడోదకైః పృథఙ్మర్ద్యం పృథక్సప్త పుటంగజే ।
సింధూరం భవతిజ్ఞేయం సర్వకర్మసు యోకయేత్ ॥

తా. రజతభస్మమునకు సమముగ శుద్ధిజేసినయింగిలీకమునుజేర్చి తుమ్మచెక్క కషాయముజిల్లేడుపాలు మఱ్ఱిపాలు హంసపాదియాకురసము దూలగొండివేళ్ళరసము బెల్లపురసము అనువానిలో ప్రతిదానిచేనొక్కొకదినము చొప్పున మర్దించి 7 గజపుటంబులిడిన రజతభస్మము సిందూరిం ము.

రజత ద్రుతి.

శ్లో॥ శతధా నరమూత్రేణ భావయే ద్దేవదాలికామ్ ।
తచ్చూర్ణ వాపమాత్రేణ ద్రుతిస్స్యా త్స్వర్ణ తారయోః ॥

తా. దేవతాడిని నరమూత్రముతో 100 మార్లు భావనజేసి దానిచూర్ణమును రజతభస్మములో పలుమారువేయుచు నూదుచుండిన బంగారు వెండి వీనియందు ద్రుతి వెడలు.

రౌప్యభస్మాను పానములు.

శ్లో॥ భస్మీభూతం రజతమమలం తత్సమంవ్యోమభానుస్సర్వై
స్తుల్యం త్రికటుకవరం సారమాజ్యేనయుక్తమ్। లీఢంప్రాతః

క్షుపయతిస్ఫణాంయత్క్షపాండూదరార్శ । శ్వాసాన్కాసాన్
తిమిర జహరంపిత్తరోగాన శేషాన్ ॥

తా. నిర్మలమైన రజతభస్మమునకు సమముగ అభ్రికమును తామ్రమునుజేర్చి వానికన్నిటికి సమముగ త్రికటుకచూర్ణమును నెయ్యిగలిపి ప్రాతఃకాలమున సేవించిన క్షయను పాండువు వుదరము అర్శస్సు శ్వాసము కాసము తిమిరరోగము పిత్తరోగము వీనిని హరింపంజేయు.

## రౌప్యభస్మ గుణము.

శ్లో॥ రౌప్యంశీతం కషాయంచ స్నిగ్ధంవాతహరంగురు ।
రసాయన విధానేన సర్వరోగాపహారకమ్ ॥

తా. రజతభస్మము శీతకారిగ కాషాయముగ స్నిగ్ధముగ వాతమును హరింపజేయునదిగ బరువుగ రసాయనమువలన సర్వరోగముల హరింపంజేయునదిగనుండు.

శ్లో॥ [రసరత్నాకరే] రౌప్యంస్నిగ్ధంకషాయామ్లం విపాకే మధురం
పరమే । వయస స్థాపనంవృష్యం లేఖనం వాతపిత్తజిత్ ॥

తా. రజతము స్నిగ్ధముగ కషాయముగ పుల్లగ విపాకమువలన మధురరసము గలదిగ విరేచనకారిగ వయస్థాపనకారిగ వీర్యవృద్ధికారిగ లేఖనక్రియంజేయునదిగ వాతపిత్తముల బోనడచునదిగనుండు.

శ్లో॥ [ఆయుర్వేదే] రౌప్యంవిపాక మధురం తువరామయఘ్నం
శీతంసరం పరమ లేఖనకంచవృష్యమ్ । స్నిగ్ధంచ వాతకఫజి
జ్జఠరాగ్నిదీప్తే ర్బల్యప్రదం స్థిరవయస్కరణంచహృష్యమ్ ॥

తా. రజతము విపాకమువలన మధు... గ ఒగరుగ రోగమును బోనడచునదిగ శీతలముగ విరేచనకారిగ వుత్తమమైన లేఖనక్రియాకారిగ వీర్యవృద్ధికారిగ స్ని... ముగ వాతకఫముల హరింపంజేయునదిగ జఠరాగ్నికి దీపమును గలుగంజేయు; బలకారిగ వయస్థాపనకారిగ సుఖకారిగనుండు.

## అశుద్ధ రౌప్యభస్మ గుణము.

శ్లో॥ ఆయుస్సుఖం బలంహంతి తారం వీర్యంచశుక్రజిత్
అశుద్ధ మమృతందారం శుద్ధంకార్య మతోబుధైః

తా. అశుద్ధరజతభస్మము ఆయువు సుఖము బలము వీర్యము శుక్రము బోనడచు. కావున దానిని శుద్ధముగనే జేయవలయు.

* తామ్ర నామములు.

శ్లో॥ [నిఘంటౌ] తామ్రమహాదుంబరంశుల్బంపవిత్రంబ్రహ్మవర్ధనమ్ రక్తలోహంమ్లేచ్ఛముఖంత్ర్యంబకంమిహిరాహ్వయమ్ ॥

తా. తామ్రము ఔదుంబరము శుల్బము పవిత్రము బ్రహ్మవర్ధనము రక్తహము మ్లేచ్ఛముఖము త్ర్యంబకము మిహిరాహ్వయము అనునవి తామ్రనామంబు

శ్లో॥ [గ్రంథాంతరే] తామ్రమహాదుంబర శుల్బం తపనేష్టముదుంబరమ్ ॥ త్ర్యంబకంచాను విందంచ రవిలోహంరవిప్రియమ్॥

తా. తామ్రము ఔదుంబరము శుల్బము తపనేష్టము వుదుంబరము త్ర్యంబకము అనువిందము రవిలోహము రవిప్రియము అనునవి తామ్రనామంబులు.

తామ్ర దోషము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] అశుద్ధతామ్రం వక్ష్యామి తామ్రంచైవ మహావిషమ్ । విషస్యైకదోషస్స్యాదష్టౌదోషాశ్చశుల్బే భ్రమోమూర్ఛా విదాహశ్చ ఛర్దిః క్లేదనస్వేదనే । సంతాపశ్చారుచిశ్చాష్టౌ శుల్బేదోషా భవంతి తే ॥

తా. అశుద్ధతామ్రమున భ్రమ మూర్ఛ విదాహము ఛర్దిక్లేదము స్వేదః సంతాపము అరుచి అన 8 దోషంబులుండు. అట్లగుటచే నొకదోషముగల విషః కన్న తామ్రమే విషంబు.

అశుద్ధ తామ్ర దోషము.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] అశుద్ధతామ్ర మాయుఘ్నం కాంతిఘ్నంసధాతుహా।వాన్తిమూర్ఛాభ్రమోద్రేకనానారుక్కుష్ఠశూలకృత్

తా. అశుద్ధతామ్రమువలన ఆయుఃక్షయము కాంతినశించుట రసరక్తమాంసాస్థిమజ్జశుక్ల మేదోజ్జ్వలన సప్తధాతునాశనము వాంతి మూర్ఛ భ్రమ నానావిధరోములు కుష్ఠువు శూలగలుగు; అట్లగుటచే దానిని శుద్ధిజేయవలయు.

* తామ్రమన—రాగి.

## తా మ్ర శు ద్ధి.

శ్లో॥ [చికిత్సాసారసిద్ధసంగ్రహే] తైలతక్రాది శుద్ధస్య తద్దోషవి నివృత్తయే । శుల్బస్య శోధనంప్రాజ్ఞై ర్విశేషా త్సముదాహృతమ్ । స్నుహ్యర్క క్షీరలవణ కాంజకై స్తామ్రపత్రకమ్ । లిప్త్వాప్రతాప్య నిర్గుండీ రసై స్సించే త్పునఃపునః । వారా ద్వాదశ రాహత్వం లేపనా త్తామ్రసించనాత్॥

తా. ఖరీదుదుడ్లనుగాని వారాణసిచెంబులనుగాని రేకులుగజేయించి కొలిలోకాచి నువ్వులనూనె పులిచల్ల మొదలగు వానిలో నద్దుటచే తామ్రదోషమును నడచి పిదప బొంతజెముడుపాలు జిల్లేడుపాలు పంచలవణములు కలి వీనిని యీ ఏలపై ప్రత్యేకప్రత్యేకముగమూసి ఝొండించి కొలిమిలోకాచి వావిలియాకురసలో నద్దవలయు. ఇటుల ప్రతిదానినిబూసి కాచి 12 మార్లు అద్దిన తామ్రము ్ంబగు. (మఱియు తామ్రమును 12 మార్లుకాచి చింతాకురసములోను తామ్రనకు హేమమాక్షికమునునూరి పట్టించి వావిలాకురసములోను అద్దవలయు.)

## తా మ్ర శు ద్ధి.

శ్లో॥ గోమూత్రేణ పచే ద్యామం తామ్రపత్రం దృఢాగ్నినా ।
శుధ్యతే నాత్రసందేహో మారణం కథ్య తేధునా ॥

తా. తామ్రపురేకుల గోమూత్రములోవైచి దృఢాగ్నిలో 1 ఝాముకాచిన ్యగు. ఇక దానిమారణమును వచియించెద.

## తామ్ర భస్మము.

శ్లో॥ సూక్ష్మాణి తామ్రపత్రాణి శ్రుత్వాసంస్వేద యేద్బుధః। వాసర త్రయమమ్లేన తతః ఖల్వే వినిక్షిపేత్। పాదాంశం గంధకం దత్వా యామ మమ్లేన మర్దయేత్। తత ఉద్ధృత్య పత్రాణి లేపయే ద్ద్విగుణేనచ । గంధకే నామ్లపిష్టేన తస్యకుర్యాచ్చ గోళకమ్।తతఃపిష్ట్వాచమీనాక్షీంచాంగేరీంవాపునర్నవామ్ తత్కల్కేనబహిర్గోళం లేపయే ద్ద్వ్యంగుళోన్మితమ్ । ధృ తద్గోళకంభాండే శరావేణచరోధయేత్ । వాలుకాభి

ర్యాథ విభూతి ర్లవణాంబుభిః । ధృత్వాభాండే ముఖేముద్రా
తతశ్శుల్ల్యాం విపాచయేత్ । క్రమవృద్ధ్యాగ్నినాసమ్యగ్యావ
ద్యామచతుష్టయమ్ । స్వాంగశీతం సముద్ధృత్య మర్దయే
త్సూరణద్రవైః। యామైకంగోళకంతచ్చనిక్షిపేత్సూరణోదరే।
మృదోవలేపఃకర్తవ్యో సర్వతోంగుళమాత్రకః। పాచ్యంగజ
పుటేక్షిప్తంభస్మలింభవతినిశ్చితమ్। వమనంచవిరేకంచభ్రమం
క్లేదమథారుచిమ్।విదాహస్స్వేహముల్లేకం దంనకరోతికదాచన ।

తా. తామ్రమును పలుచనగ రేకులనుజేయించి 3 దినములు నిమ్మపండ్లరసములో నుడికించి యాపండి దీసి ఖల్వములోనునిచి దానికి 4 వ భాగము గంధకమునుగలిపి నిమ్మపండ్లరసముతో 1 జాము మర్దించి యా తామ్రరేకుల ఖల్వములో నుండి దీసి పిదప దానికి రెండింతలు గంధకమును నిమ్మపండ్లరసముతోనూరి యా రేకులపైబూసి యెండించి యారేకులమడిచి యుంటగజేసి దానిపై పొన్నగంటి పులిచింత తెల్లగలిజేరు అనువాని కల్కములను రెండంగుళముల ప్రమాణము దళముగనుద్దపై లేపనముజేసి యెండించి మూకుళ్ళలోనునిచి చీలమన్ను లేపనముజేసి వాలుకాయంత్రమునందిడి దాని కంఠమువరకు నిసుకబోసి దానిపైబూడిదె ఉప్పు వీళ్ళుచల్లి కుండమూతినిమూసి చీలమన్నుబూసి పొయిమీదనునిచి 4 జాములు క్రమముగ అగ్నిని వృద్ధిజేయుచు పాకముజేసి సాంగశీతలమునదీసి కందగడ్డరసముతో 1 జాము మర్దించి యుంటజేసి కందగడ్డలోనునిచి యాకందగడ్డపై నొకయంగుళప్రమాణము చీలమన్నుబూసి గజపుటంబిడిన తామ్రము బాగుగభస్మంబగు. దీనివలన వాంతి భ్రాంతి భ్రమ క్లేదారుచి విదాహస్నేహ ఉల్లేకాదములు గలుగకుండు.

## తామ్ర భస్మము.

శ్లో॥ సూక్ష్మంతామ్రదళంవిమర్ద్యపటునాతూరేణజంబీరజై । స్తప్తా
మర్ద్యసుదోతదర్కపయసాలిప్త్వాదళేస స్తథా । నిర్గుండ్యంబు
హిమంరసేంద్రగళితం గంధేనముగ్ధేనత। త్తుల్యేనాథ మృతం
భవేత్సుపుటితం పంచామృతేవత్రిధా ॥

తా. తామ్రమును పలుచనగ రేకులుజేయించివానిపైపంచలవణములను త్రిక్షారములను నిమ్మపండ్లరసముతోనూరి లేపనముజేసి యెండించి 7 మార్లు కాచి వావిలి

యాకురసములోనద్దవలయు పిదపవానిపై జిల్లేడుపాలుపట్టించి 7 మార్లుకాచివావిలి యాకురసములోనద్దవలయు. (పిదప హేమమాక్షికమునునూరి పట్టించి నిప్పులోకాచి వావిలియాకురసములోనద్దవలయు.) ఇటులజేసిన తామ్రము శుద్ధియగు పిదప యా తామ్రమునకు సమముగ రసమును గంధకమును గ్రహించి జిల్లేడుపాలతోనూరి యా రేకులపైపట్టించి పుటంబిడిన తామ్రము భస్మంబగు. ఆ తామ్రభస్మమును పంచా మృతముతో మర్దించి 4 పుటంబులిడిన నంవలి అష్టవిధదోషంబులు హరించు.

### తామ్రభస్మ గుణము.

శ్లో॥ తామ్రంతిక్తంచ మధురం కషాయం లేపనంలఘు ।
విషపాకం సరంశీతం మారణం కఫపిత్తజిత్ ॥

తా. తామ్రభస్మము వగరుగ మధురముగ కషాయముగ లేపనకారిగ లఘువుగ విషపాకముగలదిగ విరేచనకారిగ శీతకారిగ కఫపిత్తరోగముల హరింపంజేయు నదిగ నుండు.

శ్లో॥ [మతాంతరే] వాంతిభ్రాంతి వివర్జ్యకం జ్వరరుజా కుష్ఠాని
పాండ్వామయమ్ । శూలంమేహ గుదాంకురా నిలగదాన్
యుక్తానుపానైర్జయేత్ । భుక్తంస్థౌల్య జరాగ్ని మాంద్య
శమనో వంధ్యాశ మోవత్సరాత్ ॥

తా. వాంతిభ్రాంతివివర్జితంబగుటచే శుద్ధమైన తామ్రభస్మమును యుక్తాను పానముతోడ సేవించిన జ్వరము పీడ కుష్టువు పాండువు శూల మేహము గుదరోగ ము వాతము స్థౌల్యరోగము ముదిమి అగ్నిమాంద్యము అనువానిని హరింపంజేయుట యేగాక 1 సంవత్సరము సేవించిన వంధ్యాత్వమునుకూడ బోనడచు.

### అశుద్ధ తామ్రభస్మ దోషము.

శ్లో॥ శుల్బాంతనానయతి దోష మశేషధాతూన్ రోగాన్ కరోతి వి
విధాంశ్చ నిహంతి కాంతిమ్ । కుష్ఠంరుజంచవిషమాన్ కురుతే
విశేషాన్ పాకేనహీనసుహవాంతివిరేచనంచ। హంత్యాయు
రుచ్చైః కురుతేవితాపం మూర్ఛాంవిధత్తే హరతేచశుక్రమ్।
నానాగదానాంచనహేతుకారీ హ్యశుద్ధశుల్బస్సచజీవహర్తా॥

తా. అశుద్ధతామ్రము సర్వధాతుశోషము పలువిధములైనరోగములు కొం నాశనము కుష్టువు విషజ్వరము వాంతి విరేచనము ఆయుఃక్షయము సంతాపమ మూర్ఛ శుక్ర నాశనము అనువానిని గలుగంజేయుటయేగాక యనేక రోగములకి సహాయకారియై తుదకు ప్రాణముల హరింపంజేయు.

శ్లో॥ అథాన్యత్సంప్రవక్ష్యామి సంక్షిప్తంసూక్తముత్తమమ్ ।
ఆయుర్వేదోపదేశేస్మిన్ తామ్రశుద్ధిర్నిగద్యతే ॥

తా. ఆయుర్వేదమున జెప్పంబడిన ప్రకారము తామ్రశుద్ధిని వచించెద.

శ్లో॥ గృహకన్యారసేనైవ భావయిత్వాపునఃపునః । తతస్తప్తం మేఘనాదే భావయిత్వాపునఃపునః । గంధకార్కక్షీరలేపం కృత్వాకృత్వా పుటత్రయమ్ । చూర్ణీభవతితత్తామ్రంపునః ఖల్వేపిమర్దయేత్ । ఫలత్రయకషాయేణ తతోనిక్షిప్య మూషయోః । పునర్మర్ద్యం క్రమేణైవ దత్వాషోడశధా పుటమ్ । అనంతరంక్షీరసర్పిర్మధుమూత్రైర్ముహుర్ముహుః । భావయిత్వాపుటందేయంప్రత్యేకంసప్తసప్తచ గృహకన్యారసేనైవ భావయిత్వాపునఃపుటమ్ । దత్వావిచక్షణశ్చూర్ణంతద్భవేన్నాత్రసంశయః । ఏతైర్వివిధసంస్కారైశ్ఛర్దిదాహభ్రమంహరేత్ । వ్యోషైరేరండతైలేన కాంజికేనాథవా పునః । నిష్కేణసమ్మితేచూర్ణం గుల్మశూలప్రశాంతయే । ప్రయోగస్సర్వరోగాణాం క్రమపథ్యేనచేదను ॥

తా. రాగి రేకుల 7 మార్లు కాచి కలుబందరసములో 7 మార్లును పొన్నగంటి రసములో 7 మార్లును వద్దిన శుద్ధియగు. పిదప యారేకులపై శుద్ధగంధకమును జిల్లేడు పాలతో నూరిపట్టించి 3 పుటంబులిడిన భస్మంబగు పిదప యాభస్మమును ఖల్వములో పోసి త్రిఫలకషాయముతో మర్దించి ముద్దజేసి రెండించి మూసలోనునిచి పుటంబిడ వలయు. ఇట్లేయంగున క్రమముగ 16 మార్లుమర్దించి 16 పుటంబులిడి ఆవుపాలు ఆవు నెయ్యి తేనె గోమూత్ర అనువానిలో ప్రతిదానిచే నేడేసిమార్లు మర్దించి మూసలో నునిచి యేడేసి పుటంబులిడ్ పిదప కలుబందరసముతో మర్దించి పుటంబిడవలయు. ఇట్టిసంస్కారములు జేయబడిన తామ్రభస్మమువలన ఛర్దిదాహభ్రమలు గలుగకుండు

మఱియు రూకయెత్తు తామ్రభస్మమును మృదువుగ మర్దించి నిమ్మ ప్రమాణము త్రికటుకచూర్ణాను పానముతోగాని ఆముదముతోగాని కలితోగాని క్రమపథ్యముగ నుండి సేవించిన గుల్మశూలలు సర్వరోగములు హరించు.

## తామ్రసిందూరము.

శ్లో॥ తతోభస్మరవిక్షీరై ర్హంసపాదిరసేనచ ।
న్యగ్రోధదుగ్ధేజాక్షీరే కపికచ్ఛూద్రవేణచ ।
అశ్వత్థవల్కలక్వాథే ప్లక్షక్వాథేనమర్దయేత్ ।
ముహుర్ముహుస్సప్తపుటాః కుర్యాద్వారణసంజ్ఞయా ।
సూర్యోదయసమంవర్ణం సిందూరంభవతిధ్రువమ్ ।
వాంతిభ్రాంతివిరేకంచ నకరోతి కదాచన ॥

తా. తామ్రభస్మమును ఖల్వములోబోసి జిల్లేడుపాలు హంసపాదియాకురసము మఱ్ఱిపాలు మేకపాలు దూలగొండివేళ్ళరసము రావిచెక్క కషాయము జువ్విపట్ట కషాయము అనువానిలో ప్రతిదానిచే మర్దించి యేడేసి గజపుటంబిడిన బాలసూర్యునివలె సిందూరించు. దీనివలన వాంతి విరేచనములు గలుగకుండు.

## తామ్రభస్మ గుణము.

శ్లో॥ తామ్రంతీక్ష్ణోష్ణమధురం కషాయంశీతలంసరమ్ ।
కఫపిత్తక్షయంపాండు కుష్ఠఘ్నంచరసాయనమ్ ।
శ్లేష్మపిత్తహరంచైవ సర్వరోగనివారణమ్ ।
వ్రణానిశూలమర్శాంసి మందాగ్నించవినాశయేత్ ॥

తా. తామ్రభస్మము తీక్ష్ణము ఉష్ణము మధురము కషాయము శీతలము సరము గలదిగ కఫ పిత్త క్షయ పాండుకుష్ఠముల హరింపంజేయునదిగ రసాయనోపయుక్తముగ శ్లేష్మపిత్తముల సర్వరోగముల హరింపంజేయునదిగ వ్రణము శూల అర్శస్సు అగ్నిమాంద్యము వీనిని వశింపంజేయునదిగ నుండు.

## కాంస్య నామములు.

శ్లో॥ కాంస్యఘోషప్రకాశంచ కాంస్యఘోషశ్చసంస్మృతే-

తా. కాంస్యము ఘోషము ప్రకాశము కాంస్యఘోషము అనునవి కాంస్య నామంబులు.

## కాంస్య గుణము.

శ్లో॥ కాంస్యంకషాయానురసం విశదంలేఖనంసరమ్ ।
దృష్టిప్రసాదనంరూక్షం తిక్తంపిత్తకఫాపహమ్ ॥

తా. కాంస్యభస్మము కషాయము పరిశుద్ధముగ లేఖనకారిగ సరముగ నేత్రహితకారిగనుండుటయేగాక రూక్షముగ సగరుగ పిత్తకఫముల బోనడచునదిగనుండు.

## కాంస్య శుద్ధి.

శ్లో॥ తింత్రిణీపత్రజద్రావైః కాంస్యంభావ్యంత్రివారకమ్ ।
తతఃకులుత్థయూషేణ కాంస్యంశుద్ధంభవిష్యతి ॥

తా. కంచును కాచి చింతాకురసముతో 3 మార్లు వులవకట్టులో 3 మార్లు నద్దిన శుద్ధియగు.

## కాంస్య భస్మము.

శ్లో॥ శుద్ధంకాంస్యందళంకృత్వా సమభాగంబలిందదేత్ ।
మర్దితంచార్కదుగ్ధేనచాతపే తాపయేత్పునః ।
మర్దితంసప్తవారేణ రవిదుగ్ధేపునఃపునః ।
వజ్రమూషగతం కాసనోత్పలభూపుటే ।
ఏవంసప్తపుటందత్వా కాంస్యభస్మభవేద్ధ్రువమ్ ॥

తా. శుద్ధిజేసినకంచును సన్నముగ తునకలుజేసి దానికిసమముగ గంధకమును గ్రహించి జిల్లేడుపాలతోనూరి లేపనముజేసి యెండనెండించి వజ్రమూషములోనునిచి యేరుపిడకలతో భూపుటంబిడవలయు. ఇటుల 7 మార్లు కంచుకుసమముగ గంధకమును గ్రహించి జిల్లేడుపాలతోనూరి లేపనముజేసి వజ్రమూషలోనునిచి యెండించి యేరుపిడకలతో 7 పుటంబులిడిన కాంస్యము భస్మంబగు.

## కాంస్య సిందూరము.

శ్లో॥ తద్భస్మార్ధంచ దరదం తదర్ధం శుద్ధగంధకమ్ । తదర్ధంపారదందత్వా వటక్షీరేణమర్దయేత్ । హంసపాదిరసాశ్వత్థ వల్కల

క్వథితై రపి । బర్బరత్వక్కషాయేణపాలాశత్వగ్రసేనచ । మక్కటీమూలజరసై ర్మర్దితంచముహుర్ముహుః । పునర్జంబీరనీరేణమర్ద్యంసప్తపుటేపచేత్ । పుటేవారణ సంజ్ఞేచ విశ్వాకర్మపుటేపివా । బాలసూర్యోదయసమం సిందూరభవంతి ధ్రువమ్ ॥

తా. కాంస్యభస్మమును ½ భాగము యింగిలీకమును దానికి ½ భాగము శుద్ధగంధకమును దానికి ½ భాగము శుద్ధరసమునుజేర్చి మర్రిపాలు హంసపాదియాకు రసము రావిచెక్క కషాయము తుమ్మచెక్క కషాయము మోదుగచెక్కరసము దూలగొండి వేళ్ళరసము నిమ్మపండ్లరసము అనువానిలో ప్రతిదానిచే నొక్కొకమారు మర్దించి యొక్కొక గజపుటముచొప్పున 7 మార్లు గజపుటంబు లిడినను లేక కోలిమిలోనునిచి యూదినను కంచుభస్మము బాలసూర్యునివలె సిందూరించు.

## కాంస్యభస్మ గుణము.

శ్లో॥ కాంస్యంకషాయముష్ణంచ లఘురూక్షంచతిక్తకమ్ ।
కఫపిత్తరుజాంహంతి చాయుర్దేహబలాపహమ్ ॥

తా. కాంస్యభస్మము కషాయము ఉష్ణముగ లఘువుగ రూక్షముగ చేగరుగ నుండుటయేకాక కఫపిత్తరోగములహరింపంజేయునదిగ ఆయుర్దేహ బలకారిగ నుండు.

శ్లో॥ రీతికాయుగళంరూక్షం తిక్తంచలవణాంపరమ్ ।
శోఫఘ్నం పాండువాతఘ్నం బలవీర్యవివర్ధనమ్ ॥

తా. రాజరీతి కాకతుండి అన 2 విధములైన యిత్తడిభస్మము రూక్షముగ చేగరుగ ఉప్పగనుండుటయేగాక శోఫ పాండు వాతముల హరింపం జేయునదిగ బలవీర్యకారిగ నుండు.

## అశుద్ధకాంస్య దోషము.

శ్లో॥ అశుద్ధమమృతంలోహ మాయుర్హారిరుజాకరమ్ ।
హృత్పీడాందేహతాపంచ తస్మాచ్ఛుద్ధంచమారయేత్ ॥

తా. అశుద్ధమైన కాంస్యభస్మము ఆయుఃక్షయము పీడ బొమ్మనొప్పి శరీర తాపము అనువానిని గలుగంజేయు. కావున బాగుగా శుద్ధిజేయబడిన కంచుచే భస్మము సేయవలయు.

శ్లో॥ [నిఘంటౌ] రీతికాకటుతీక్ష్ణంచ గుల్మమేహకఫాస్రజిత్ ।
సతిక్తలవణంభేది పాండుత్వక్క్రిమివాతజిత్ ॥

తా. ఇత్తడిభస్మమును కారముగ తీక్ష్ణముగ గుల్మ మేహ కఫరక్తదోషముల హరింపంజేయునదిగ వగరుగ వుప్పుగ విరేచనకారిగ పాండు చర్మదోషము క్రిమి వాతములబోనడచునదిగ నుండు.

ఇత్తడి నామములు.

శ్లో॥ పీతలోహంసింహలకం కపిలం సౌఖ్యమారకమ్ ।
వర్తలోహంత్రిలోహంచ రాజరీతి ర్మహేశ్వరీ ॥

తా. పీతలోహము సింహలకము కపిలము సౌఖ్యము ఆరకము వర్తలోహము త్రిలోహము రాజరీతి అనునవి యిత్తడినామములు.

శ్లో॥ [మతాంతరే] రీతికాపిత్తళాపీత లోహశ్శైవలకంచతత్ ॥

తా. రీతిక పిత్తళ పీతలోహము శైవలకము అనునవి యిత్తడినామములు.

ఇత్తడిభస్మ గుణము.

శ్లో॥ రీతికాయుగళం రూక్షం తిక్తంచలవణంరసే ।
శోధనంపాండురోగఘ్నం క్రిమిఘ్నం వీర్యవర్ధనమ్ ॥

తా. రాజరీతి కాకతుండి అనుద్వివిధమైన యిత్తడిభస్మము రూక్షముగ ఒగరుగ ఉప్పగ శోధనకారిగ నుండుటయేగాక పాండు క్రిముల హరింపంజేసి వీర్యవృద్ధిని కలుగంజేయు.

కాంతి లక్షణము.

శ్లో॥ యత్పాత్రేస్థే ప్రవిశతిజలే తైలబిందుర్న దత్తోహింగో ర్గంధం విసృజతిజలంతి క్తతాంనింబకల్కః । పాచ్యందుగ్ధం భవతిశిఖరాకారకంనైతిభూమిం । దగ్ధాంగాస్స్యస్సజలచణకాః కాంతలోహం తదుక్తమ్ ॥

తా. కాంతపాత్రయందుదకముబోసి తైలబిందువునువైచిన వ్యాపించకుండుట వుదకము యింగువయొక్క వాసన వేసుట నిమ్మపండ్లరసములో కాంతపాత్ర నునిచిన

వగరుగనుట మఱియు నా కాంతపాత్రలో పాలుకాచిన పొంగిపైఁబడక దాని లోనే బడుట కాంతపాత్రనుకాచి సెనగలతడిపి దానిలోవేసిన సెనగలపై పొట్టు కాలిపోవుట యిట్టిలక్షణములుగలది కాంతలోహమనంబడు.

## కాంత శుద్ధి.

శ్లో॥ జంబీరజారనాళేచా ప్యామ్లతక్రేచ కాంతకమ్ ।
క్షిప్త్వా సప్తాతపే దేయం కాంతశుద్ధి ర్భవేత్సుధీః ॥

తా. నూడంటురాయిని నిమ్మపండ్లరసము కలి పులిచల్ల అనువానిలో ప్రతి దానియందు నేడేసి మార్లువేసి నేడేసిగడియలు యెంఢనెండించిన శుద్ధియగు.

## కాంత భస్మము.

శ్లో॥ తచ్ఛుద్ధంకాంతపాదాంశం గంధకంచ దధే ద్భిషక్ ।
అర్కక్షీ రేవిమర్ద్యాథ శిరాభేదిరసేనచ ।
పలాశత్వగ్రసేనైవ మర్ధ్యంగజపుటేపచేత్ ।
ఏవంపుటత్రయేపాచ్యం కాంతంభస్మభవేద్ధ్రువమ్ ॥

తా. శుద్ధిజేసిన కాంతమునకు 4 వ భాగము గంధకమును గ్రహించి జిల్లేడు పాలుకొండపిండి వేళ్ళరసము మోదుగచెక్కరసము అనని మూటిచేవేర్వేరుగ మర్దించి 3 గజపుటంబులిడిన కాంతము భస్మంబగు.

## కాంతసిందూరము.

శ్లో॥ తద్భస్మార్ధంచదరదం దత్వాఖల్వేవిమర్దయేత్ ।
కపికచ్ఛూమూలరసే మర్దందివసత్రయమ్ ।
రక్తమృత్స్నావజ్రమూషాం కృత్వాతస్యాంతరాక్షిపేత్ ।
వస్త్రమృత్తికయాలేప్యా పాచ్యంగజపుటత్రయమ్ ।
కాంతం బాలోదయసమం సిందూరంభవతిధ్రువమ్ ॥

తా. కాంతభస్మము ½ భాగము యింగిలీకముసుశేర్చి దూలగొండివేళ్ళరస ముతో 3 దినములు మర్దించి యెఱ్ఱగ మంటితో జేయబడిన వజ్రమూషలో నునిచి 3 చీలమన్నులిచ్చి 3 గజపుటంబులిడిన బాలసూర్యునివలె కాంతము సిందూరించు.

## కాంత ద్రుతి.

శ్లో॥ సృగాలమేషకూర్మాది శల్యానిచశిలాజితు ।
ఏతత్సర్వంచూర్ణయిత్వా సుత ప్తేకాంతచూర్ణకే ।
భావయేద్ద్రవ తాంయాతి యథాసూతంసునిర్మలమ్ ॥

తా. నక్క గొఱ్ఱె తాబేలు మొదలగువాని యెముకలను శిలాజిత్తును చూర్ణముజేసి కాంతచూర్ణము బాగుగాకాచి నీరగువరకు యాచూర్ణమును కొంచెకొంచెముగ వేయుచుండిన రసమువలె నిర్మలముగ ద్రుతి దిగును.

## కాంతభస్మ గుణము.

శ్లో॥ కాంతాయఃకమనీయకాంతి జననంవాతామయారోచకమ్ ।
యక్ష్మఘ్నంకఫనాశనంగరహరం దోషత్రయంనాశయేత్ ।
నానాకుష్ఠనిబర్హణం బలకరం వృష్యంవయస్తంభనం । సర్వ
వ్యాధి హరంరసాయనవరంభూమామృతంనాపరమ్ ॥

తా. అయస్కాంతభస్మము శరీరకాంతినిగలుగంజేయుటయేగాక వాతరోగము అరుచి రాజయక్ష్మకఫరోగము కృత్రిమవిషము త్రిదోషము పలువిధములైనకుష్ఠరోగములు వీనినిహరింపంజేసి బలవీర్యవృద్ధివయఃస్తంభనములగలుగంజేయు. మఱియు నిది సర్వవ్యాధుల బోగొట్టునట్టి రసాయనంబును భూమియందమృతంబునై యుండు.

శ్లో॥ [మతాంతరే] కాంతాయఃకమనీయ ముత్తమతరం శస్తంచి
రాయుష్యదం। స్నిగ్ధంమేహహరం త్రిదోషశమనంశూలాది
మూలాపహమ్। గుల్మప్లీహమసృగ్ధరక్షయహరం పాండూ
దరవ్యాధినుత్। తిక్తాఢ్యం హిమవీర్యకాంతిజననం కుష్ఠప్రమే
హాన్ జయేత్ ॥

తా. కాంతభస్మము మనోహరముగ కడుశ్రేష్ఠంబైనదిగ ప్రశస్తమైనదిగ దీర్ఘాయువును గలుగంజేయునదిగ మేహపిటికా త్రిదోష శూల మూల గుల్మప్లీహ అసృగ్ధరక్షయపాండువుదరములహరింపంజేయునదిగ నుండుటయేగాక స్నిగ్ధముగ తికరుగ శీతవీర్యముగలదిగ శరీరకాంతికారిగ కుష్ఠప్రమేహములహరింపంజేయునదిగ నుండును.

## కాంతాభ్రకసిందూర గుణము.

శ్లో॥ [దేవీశాస్త్రే] కాంతాభ్రంకఫవాతపిత్త జనితంక్షీణంచప్లీహో
పహం। శుక్లాస్థిస్రవరక్తపిత్తవికృతాన్నానావిధానామయాన్
ఛర్దింహృద్రుజనామవాత మరుచింమూర్ఛాం శిరోవిభ్రమ
మ్। పాండుంవింశతిమేహజాంచవికృతింయోన్యామయంగుల్మ
జమ్। కాసశ్వాసహలీమకాగ్నిశమనం శూలాతిసారంగరమ్ ।
నానాక్షి ప్రభవాంగదాహహరణం కంఠప్రరోగాన్ జయేత్ ।
కుష్ఠోన్మాదమపస్మృతి వ్రణహరంక్షుద్రామయం విద్రధిమ్ ।
వృద్ధింసప్తవిధంహలీమక గదంహన్యాత్తథానాహకమ్ ॥ వా
తంపిత్తకఫజ్వరంగుదగదంశోషంగ్రహణ్యామయం వైసర్పిం
వినిహంతి వాతరుధిరం స్థౌల్యామయం కామలామ్ । నానా
రోగహరానుపాన సహితం యద్వ్యాజరాన్నాశయేత్ । వృ
ష్యంపుష్టికరంరసాయనవరం । జత్రూర్ధ్వ రోగాన్ జయేత్ ।
దంతానాంద్రఢతాంకరోతి చికురాన్ భృంగైస్సమాన్ కు
ర్వతే । యేదేవాహ్యమృతం యథాచమనుజా రక్షేచ్ఛతం
చాయుషమ్ । మేధాబుద్ధివివర్ధనం శుభకరం వర్ణప్రదంశ్రీక
రమ్। పార్వత్యావృషభధ్వజేనకథితంకాంతాభ్రసిందూరకమ్॥

తా. కాంతాభ్రకము కఫవాత పిత్తజనిత కృశత్వప్లీహరోగముల హరింపఁ జేయునదిగ శుక్లదోషము అస్థిస్రావము రక్తపిత్తవికారము మొదలగు నానావిధరోగములను వాంతి రొమ్మునొప్పి ఆమవాతము అరుచి మూర్ఛ తలదిరుగుట పాండువు 20 మేహములవలన గలిగినవికారము యోనిరోగము గుల్మము కాసశ్వాసము హలీమకము అగ్నిమాంద్యము శూల అతిసారము కృత్రిమవిషదోషము పలువిధములైన నేత్రరోగములు శరీరతాపము కంఠరోగము కుష్ఠువు ఉన్మాదము అపస్మారము వ్రణము క్షుద్రరోగములు విద్రధి సప్తవృద్ధులు హలీమకము ఆనాహము వాతపిత్త కఫజ్వరములు మూలరోగము శోషగ్రహణి విస్పరి వాతరక్తము స్థౌల్యము కామిల అనువానిని హరింపఁ జేయునదిగ నుండుటయేగాక వానిని యుక్తానుపానములతోడ సేవించిన సర్వరోగము

ఊతు ముదిమిని హరింపంజేసి వీర్యవృద్ధిని శరీరపుష్టిని గలుగంజేసి జత్రూర్ధ్వగత రోగములఁబోనడచు. కాంతాభ్రకములు శ్రేష్ఠమైన రసాయనంబులు. కాంతాభ్రకసిందూరము దంతములకు దృఢమును వెంట్రుకలకు తుమ్మెదలవంటి వర్ణమునుగలుగం జేయు మఱియు "అమృతము దేవతల రక్షించుచందంబున" మనుజులను 100 సంవత్సరములవరకు కాంతము రక్షింపుచుండు. మఱియు దీనివలన మేధాబుద్ధిశుభము వర్ణము సంపత్తుగలుగు. ఈ కాంతాభ్రక సిందూరములను శివుడు పార్వతికి నుపదేశించె.

## లోహశుద్ధి.

శ్లో॥ [చింతామణౌ] లోహసిందూరశుద్ధ్యాది వక్ష్యతే శాస్త్రసమ్మతమ్। సూక్ష్మంమార్ణీకృతం లోహం తిలతైలేన పాచయేత్ । తథోదకకౌళయుతం బర్బురత్వగ్రసే పునః । పాచ్యంతీవ్రాతపేక్షిప్తంలోహశుద్ధిర్భవిష్యతి ॥

తా. లోహపొడిని నూనెలోవైచియుడికించి నూనెబోవునటుల గడిగి తుమ్మచెక్కరసముతో నుడికించి యొకజాము యెండనెండించిన శుద్ధియగు.

## లోహభస్మవిధి.

శ్లో॥ తతోభస్మవిధింవక్ష్యే తల్లోహంమర్దయేత్పునః ।
జంబూత్వచోద్రవైర్మర్ద్యం పాచితంతద్రసేనచ ।
తతశ్చామలకద్రావైస్తింత్రిణీ దళజైరపి ।
శిగ్రూత్వచరసైర్వాపి గవాంమూత్రేముహుర్ముహుః ।
పాచితం మర్దితంలోహం రుధ్వాగజపుటేనచ ।
భస్మీభవతితల్లోహం రసయోగేషుయోజయేత్ ॥

తా. శుద్ధిజేసిన లోహపొడిని మెత్తగనూరి నేరేడుచెక్కరసముతో 2 జాము లుడికించి మరలమర్దించవలయు. ఇత్తెరంగున నే దాని నుసిరికరసము చింతాకురసము మునగపట్టరసము ఆవుపంచితము అనువానిలో ప్రతిదానిచే నుడికించి మర్దించి మూసలోనునిచి చీలమన్ను లేపనము జేసి గజపుటంబిడిన భస్మంబగు. ఇట్టి లోహభస్మము రసయోగములలో నుపయోగింపంజను.

## లోహసిందూరము.

శ్లో॥ [చింతామణౌ] తద్భస్మ త్రిఫలాద్రావై ర్మర్ద్యంమర్ద్యంపు నఃపునః । న్యగ్రోధదుగ్ధార్క దుగ్ధైర్మర్దితంస ప్తవాసరమ్ । పాచ్యంగజపుటేవాపి విశ్వకర్మపుటేపివా । త్రిచత్వారిపుటం దద్యాత్సిందూరంభవతిధ్రువమ్ ॥

తా. లోహభస్మమును త్రిఫలరసము మఱ్ఱిపాలు జిల్లేడుపాలు అనువానిచే 7 దినములు మర్దించి గజపుటంబిడవలయు. ఇత్తెరంగున మర్దించి 7 గజపుటంబు లిడినను లేక కొలిమిలోనునిచి యూదినను లోహము సిందూరించు.

## లోహ శుద్ధి

శ్లో॥ [ఆయుర్వేదే] తాపయిత్వాతథాంగారే లోహపత్రం పునః పునః । నిర్వాపయేద్గవాంమూత్రే తతశ్చూర్ణంసముద్ధరేత్ । గోమూత్రేత్రిఫలాక్వాథేలోహమార్ణంతత పచేత్ । పంచా శచ్ఛపుటేతాభ్యాం సుశుద్ధంజాయతేయథా । మత్స్యాక్షీ చేంద్రవారూణీ హంసపాది కషాయకమ్ । దుత్తూర చ్ఛద పత్రాణాంద్ర వేణదర వేనచ ॥

తా. తాటితొట్టిలో గోమూత్రముబోసి యందుపుఱ్ఱ రేకుల నెఱ్ఱగ బోల్చి యద్దుచుండిన యా రేకులు తునకలుగ తునిగి యాతొట్టిలోబడు. పిదప గోమూత్ర మును దడపియుంచలి పుఱ్ఱపొడినిదీసికొని పెంకులోబోసి గోమూత్రముతో నెఱ్ఱగ వేయించవలయు. ఇటులగోమూత్రముతో 7 మార్లును త్రిఫలకషాయముతో 7 మా ర్లును వేయించి ఖల్వములోబోసి గోమూత్రము త్రిఫలకషాయము అనువానితో ముద్దగ నూరి 10 గజపుటంబులును పొన్నగంటి పాపర అనువానిని రసములతో నూరి 10 గజపుటంబులును వేయవలయు. పిదప దానికి 10 వ భాగము యింగిలీకమునుజేర్చి హంసపాదియాకు కషాయముతో మర్దించి 10 పుటంబులును వుమ్మెత్తాకురసము అడ విమల్లెపూలరసము అనువానితోమర్దించి పదేసి పుటంబులును వేయవలయు. (ఇటుల నేబదిపుటంబులిడి లోహమునకు 10 వ భాగమునుజేర్చి పంచదాగపానకముతో మర్దించి బుధ్యనుసారముగ పుటంబులిడిన లోహము శుద్ధముగ భస్మంబగు.)

## లోహద్రుతి.

శ్లో॥ గంధకం రక్తలవణం తుల్యం దేయం పునఃపునః ।
ధ్మాతానాం లోహచూర్ణానాం సర్వేషాం ద్రావకం పరమ్ ॥

తా. గంధకము యెఱ్ఱవుప్పు వీనిని సమభాగములుగ చూర్ణము జేసి దానిని లోహభస్మములలో పలుమారు వేయుచు నగ్నిలో నుంచియూదుచుండిన లోహము ద్రవించు. మఱియు గంధకము యెఱ్ఱవుప్పు అనువానిచేతనే సర్వలోహములును ద్రవించు.

## లోహభస్మ గుణము,

శ్లో॥ [రసరత్నాకరే] మృతాని లోహాని చ సేవితాని నిఘ్నంతి యుక్తాని మహామయాని। అభ్యాసయోగాద్దృఢదేహసిద్ధిం కుర్వంతి రుగ్జన్మజరావినాశమ్ ॥

తా. లోహభస్మసేవనవలన బలిష్ఠమైన రోగములు హరించు. మఱియు లోహభస్మము నెల్లపుడు సేవింపుచుండుటవలన శరీరదార్ఢ్యము గలుగుటయేగాక సకల రోగోత్పత్తిని ముదిమిని బోనడచు.

శ్లో॥ [నిత్యనాథీయే] ఆయుర్వీర్యం బలం దత్తే పాండుమేహం చ కుష్ఠజిత్ । ఆమవాతహరం లోహం వలీపలితనాశనమ్ । ఆయసం పాండురోగఘ్నం తీక్ష్ణం చ దీపనమ్ ॥

తా. లోహభస్మము ఆయుర్వీర్యబలముల గలుగంజేయునదిగ శరీరపాండువు మేహకుష్ఠువు ఆమవాతము ముదిమి పాండురోగము అనువానిని హరింపంజేయునదిగ తీక్ష్ణముగ వుష్ణముగ దీపనకారిగనుండు.

శ్లో॥ [ఆయుర్వేదే] లోహం జంతువికార పాండుపవన క్షీణత్వపిత్తామయ । స్థౌల్యార్శోగ్రహణీవికారకఫజిచ్ఛోఫప్రమేహప్రణుత్ । గుల్మప్లీహవిషాపహం బలకరం * కుష్ఠాగ్నిమాంద్యాపహం । సౌఖ్యాలంబి రసాయనం మృతిహరం దృష్టేశ్చ కాంతిప్రదమ్ ॥

* కాంతాజనానందకమ్॥ స్త్రీలకానందకారిగ.

తా. లోహభస్మము జంతువికారము పాండువు వాతము క్షీణత్వము పిత్త రోగము స్థౌల్యము మూలరోగము సంగ్రహణి కఫము వాపు ప్రమేహము గుల్మముప్లీహము విషదోషము కుష్టువు అగ్నిమాంద్యము అనువానిని హరింపజేయునదిగ సౌఖ్యకారిగ శ్రేష్ఠమైన రసాయనముగ మృత్యువును కొనడచునదిగ దృష్టిప్రదముగ నుండు.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] ఆమవాత హరణేషు శోభనం పామమేహగద
నాశనేగజః । ముష్టకుష్ఠపలితాస్రవాతజిత్స్యాజ్జరామృతివలీ
వినాశనమ్ । కామలాకబలిత క్షతక్షయ పాండు పాండురసు
దేహమేహహా । రూప సంపదముపైతి మానవో లోహ
మస్వహమహోలిహన్భిషక్ ॥

తా. లోహభస్మము ఆమవాతము పాండువు మేహకుష్టువు వలీపలితములు రక్తవాతము ముదిమి మరణము వళులు బోమిల క్షతక్షయము పాండురోగము శరీర పాండు వర్ణము మేహము। వీనిని నశింపజేయుటయేకాక ప్రతిదినము దాని సేవనం జేయువారికి రూపాతిశయమును గలుగంజేయు.

## అశుద్ధలోహం దోషము.

శ్లో॥ షండత్వకుష్ఠామయ మృత్యుదం భవే ద్ధృద్రోగశూలాకురు
తేశ్మరీంచ । నానారుజానాంచ తథాప్రకోపం కరోతిహృ
ల్లాసమశుద్ధలోహమ్ । జీవహారి మదకారిచాయ సందేహ
హానిమథ తాప కృద్ధ్రువమ్ । పాటవంతెనుతే శరీరకే దారు
ణాంహృదిరుజాంచయచ్ఛతి ॥

తా. అశుద్ధలోహము నపుంసకత్వము కుష్టువు మృత్యువు హృద్రోగము శూల అశ్మరి పలువిధములైన రోగములు తత్ప్రకోపము హృల్లాసము (ఓకరింతలు) ఆయుః క్షయము మదము దేహహాని తాపము అశక్తత హృదయమున దారుణమైన పీడను గలుగంజేయు.

## కిట్ట నామములు.

శ్లో॥ [నిఘంటౌ] తీక్ష్ణంశస్త్రాయసంశస్త్రం పిండంపిండాయసంశివ
మ్ । లోహకిట్టంతుకిట్టం స్యాల్లోహచూర్ణమయోమలమ్ ॥

తా. తీక్ష్ణము శస్త్రాయసము వస్త్రము పిండము పిండాయసము శివము లోహకిట్టము లోహచూర్ణము అయోమలము అనునవి చిట్టెపు నామములు.

కిట్టశుద్ధి.

శ్లో॥ అయోంగారైర్ధమేత్కిట్టం లోహజంతద్గవాంజలైః ।
సేచయేత్తద్ధృతం తప్తం తత్సప్తవారం పునఃపునః ।
మండూరోయం సమాఖ్యాత శుద్ధంతీక్ష్ణం నియోజయేత్ ।

తా. చిట్టెమును కొలిమిలోనునిచి దానిబొగ్గుల నిప్పుతోనూరి యెఱ్ఱగకాల్చి తొట్టిలో గోమూత్రముబోసి యందు 7 మార్లు చల్లార్చిన చిట్టిశుద్ధియగు చిట్టకుండు దానిని మరలకొలిమిసయూది గోమూత్రముతోనద్దిన చిట్టిశుద్ధంబగు. దీని నే మండూరమనియెదరు. ఈమండూరము నౌషధములయందుపయోగింపంజను.

కిట్ట మండూరము.

శ్లో॥ గోమూత్రే త్రిఫలాక్వాథై స్తచ్ఛోధ్యం పాచయేచ్ఛనైః । లోహకిట్టే సుతప్తేతు యావత్తజ్జీర్యతిస్వయమ్ ।
తజ్జీర్ణం గ్రావభిఃపేష్యం మండూరం తంప్రయోజయేత్ ॥

తా. పైప్రకారము శుద్ధిజేయబడిన చిట్టెమును గోమూత్రములోను త్రిఫల కషాయములోనువైచి యాకషాయము శోషించువఱకు మెల్ల మెల్లగవండి దానిందీసి కొని తొట్టిలోబోసి గోమూత్రముతో 50 మార్లు రుబ్బి 50 పుటంబులును త్రిఫల కషాయముతో 50 మార్లు రుబ్బి 50 పుటంబులును వేసిన మండూరము సిద్ధంబగు.

మండూర గుణము.

శ్లో॥ కిట్టంకటూష్ణం క్రిమిహృత్పురాణంపాండుశోఫజిత్ ।
క్షయాదిసర్వరోగఘ్నం సంస్కారాత్సర్వరోగజిత్ ॥

తా. బాగుగ శుద్ధిజేయబడిన చిట్టెము కారముగ వుష్ణముగనుండుటయేగాక క్రిములు పురాణజ్వరములు పాండుశోఫలు క్షయము మొదలగు సర్వరోగముల హరింపంజేయు.

మండూర గుణము.

శ్లో॥ యేగుణామారితేముండేతేగుణాముండకిట్టకే ।
తస్మాత్సర్వత్రమండూరంరోగశాంతౌనియోజయేత్ ॥

తా. మండూరము లోహభస్మసమానగుణముగలది యగుటంజేసి సర్వరోగములయందు దానినే ప్రయోగింపంజను.

## లోహవిశేష గుణము.

శ్లో॥ [ఆయుర్వేదే] కిట్టా ద్దశగుణం ముండంముండా త్తీక్ష్ణంశతో
న్మితమ్ । తీక్ష్ణాల్లక్షగుణంకాంతం భక్షణాత్కురుతేబలమ్।
తస్మాత్కాంతం సదాసేవ్యం జరామృత్యుహరంపరమ్ ॥

తా. మండూరముకంటె ముండలోహము పదింతలు గుణాధిక్యంబుగ ముండలోహమునకన్న వుక్కు నూరింతలు గుణాధిక్యంబుగ వుక్కుకన్న కాంతము లక్ష గుణాధిక్యంబుగ బలాధిక్యమును గలుగంజేయునదిగ నుండు. కావున కాంతము నెల్లపుడు సేవింపుచుండిన ముదిమి మృత్యువు హరించు. (ఉక్కువలెనే యినుప శుద్ధిని తద్భస్మాదులను జేయందగు.)

## ఇనుము పేళ్ళు

శ్లో॥ [నిఘంటౌ] ముండం ముండాయసంలోహ మయస్సారంశిలో
ద్భవమ్ । ఆయసంకృష్ణలోహంచహాయంకృష్ణాయసంతథా।

తా ముండము ముండాయసము లోహము అయస్సారము శిలోద్భవము ఆయసము కృష్ణలోహము హాయము కృష్ణాయసము అనునవి యినుము పేళ్ళు.

## ఇనుపభస్మ గుణము.

శ్లో॥ చక్షుష్యం కృష్ణంలోహంతు కషాయం లేఖనం లఘు ।
తీక్ష్ణోష్ణతిక్తకటుకం కుష్ఠరోగనివారణమ్ ॥

తా. కృష్ణలోహము నేత్రహితకారిగ కషాయముగ లేఖనకారిగ లఘువుగ తీక్ష్ణముగ వుష్ణముగ వగరుగ కారముగ కుష్ఠురోగమును పోకడచునదిగ నుండు.

శ్లో॥ [నిత్యనాథీయే] ముండీరకం హితకరం కఫవాతశూలమూల
ప్రమేహగదకామిలపాండుహారి । గుల్మామవాతజఠరా శ్రీహా
రంప్రదీప్తం శోభావహం హృదిగదం ఖలుకోష్ఠశుద్ధిమ్ ॥

తా. ఇనుపభస్మము హితకరముగ కఫవాత శూల మూల ప్రమేహ కామిల పాండు గుల్మ ఆమవాతము హరింపంజేయునదిగ జఠరపీడను పోకడచునదిగ దీపనకారిగ శోఫ భ్రామ్మునొప్పి వీనిని నశింపంజేయునదిగ కోష్ఠశుద్ధికారిగ నుండు.

భస్మసిందూర పరీక్ష.

శ్లో॥ నధూమోనాపి వై వర్ణ్య గంధంచా ప్యగ్నిసంయుతమ్ ।
గురుర్లఘుతరం తోయే సిందూర భస్మలక్షణమ్ ॥

తా॥ నిప్పుపై వేసిన పొగ వెడలకుండుట వేరువర్ణమును జెందకుండుట వాసన లేకుండుట శబ్దము జేయకుండుట జడముగనుండుట వుదకముపైవైచిన చులకనగ తేలుట యిట్టిలక్షణములుంగల సిందూరభస్మములు పరిశుద్ధంబులని తెలియవలయును.

తీక్ష్ణ ద్రుతి.

శ్లో॥ సురదాలిభవంభస్మ నరమూత్రేణ గాలితమ్ ।
త్రిస్స ప్తవారం తత్క్షార వాపా త్తీక్ష్ణ ద్రుతి ర్భవేత్ ॥

తా. దేవదాళిబూడిదె 21 మార్లు నరమూత్రమున వడియగట్టి క్షారముగ వండి తీక్ష్ణలోహము కాచు దానిపై నాక్షారమును వేయుచుండిన తీక్ష్ణము ద్రవించి ద్రుతివలెనగు.

లోహాష్టక ద్రుతి.

శ్లో॥ గంధకం కాంతపాషాణం చూర్ణయిత్వా సమంసమమ్ ।
ద్రుతేచైవ ప్రతీవాపో దేయో లోహాష్టకం ద్రవేత్ ॥

తా. గంధకము కాంతము పాషాణము వీనిని సమభాగములుగ చూర్ణముజేసి అష్టలోహభస్మముల కొలిమిలోనూది యీచూర్ణమును కొంచెకొంచెముగ వేయుచుండిన అష్టలోహములయందు ద్రుతి జనించు.

లోహ ద్రుతి.

శ్లో॥ దేవదాల్యా రసై ర్భావ్యం గంధకందినస ప్తకమ్ ।
తేన ప్రవాపమాత్రేణ లోహా స్తిష్ఠంతి సూతవత్ ॥

తా. దేవదాళిరసముతో గంధకము 7 దినములు భావనజేసి లోహభస్మమును మినియూది దానిపై నా గంధకమును కొంచెకొంచెముగ వేయుచుండిన లోహాదరసమువలె ద్రవించు.

మును పులవకట్టులలో నుడికించిన శుద్ధియగు వైక్రాంతమును మేకమూత్రముతో వండిన శుద్ధియగు. వెలిగారమును కలితో నూరి కాల్చిన శుద్ధియగు. ఉమ్మెత్తవిత్తులు నిమ్మపండ్ల రసములో నానబెట్టిన శుద్ధియగు. ఇంగిలీకమును నిమ్మపండ్లరసముతో నూరి యెండించిన శుద్ధియగు. ఇనుమును గాని లేక చిట్టెమును గాని గోమూత్రముతో కాచిన శుద్ధియగు ఉక్కును త్రిఫలకషాయముతో కాచిన శుద్ధియగు. ఇనుము ఉక్కు వీనిని నల్లతుమ్మ చెక్కరసము నేరేడు చెక్కరసము వుసిరికపండ్లరసము అనువానితో నూరి యెండనెం డించిన శుద్ధియగు. పిదప దానిని చూర్ణము జేసి నీళ్ళపైవైచిన తేలును. కావిఱాయి నావుపాలతో భావనజేసిన శుద్ధియగు అంజనపంచకముల గుంటగలగరాకురసముతో భావనజేసిన శుద్ధియగు ఉల్లిపాషాణమును నరమూత్రముతో 1 జాము డోలాయంత్ర మున వండి యావుపాలలో భావనజేసి యెండించిన శుద్ధియగు. గౌరీపాషాణమును రసబంధపురసముతో 1 జామువండి పసుపునీరునుచల్లి యావిరికొల్పిన శుద్ధియగు.

## ద్రవ్యశుద్ధి ఉపరసమాలిక.

శ్లో॥ [ఆయుర్వేదే] శాలిధాన్యామ్ల సంఘృష్ట మభ్రకం శుద్ధ
మిష్యతే। విషంత్రిరాత్రముషితం గోమూత్రే శుద్ధిమీరితమ్।
అశ్మాంగారైశ్చ గోమూత్రే క్షిపేత్తప్తాయసంమలమ్। పురా
తనం భూమికందం సప్తవారంవిశుధ్యతి। పలాశద్రవతాళ్యాం
వంగం భస్మీభవేత్క్షణాత్। శిలార్కదుగ్ధతో నాగం
తామ్రమమ్లాజ్యేన గంధకాత్। స్త్రీస్తన్యేహింగుళంతీక్ష్ణం
తారంస్నుక్షీరతాపనాత్। నాగభస్మశిలాభ్యాంతు హేమ
ధాత్వాదయస్తథా। అజామూత్రేణలోహంతు శిలాగో
మూత్రభావితా కఫకీనరమూత్రేణ భావితాశుద్ధముచ్యతే।
మాక్షికంకదళీతోయైః పాచయేత్తుభిషగ్వరైః। క్షీరేణటం
కణంచాథ గంధకంతు విపాచయేత్। కూశ్మాండనీరేతాళం
చ తుత్థంజంబీరజైర్ద్రవైః। దీప్యకంచూర్ణతోయేన గౌరీం
జంబీరవారిణా।సప్తాహంగవ్యతక్రస్థావిశుద్ధాస్యాద్వరాటికా।
క్షీరంచమాషయూషాభ్యాం భావ్యేహింగుళటంకణే। నిద
గ్ధికామృతాముస్తా వాసారిష్టకమూలకైః। త్రిఫలాక్వాథతో

## సీసపు పేళ్ళు

శ్లో॥ [నిఘంటౌ] సీసకంతు జడంరంగం సీసకం నాగసంజ్ఞకమ్ ।
యోగేష్టం నాగముదరగ స్తీరకం పరిపిష్టకమ్ ॥

తా. సీసము జంతుజడము రంగము సీసకము నాగసంజ్ఞ యోగేష్టము నాగము వుదరము తీరకము పరిపిష్టకము యివి సీసపుపేళ్ళు.

## అశుద్ధ నాగవంగ దోషము.

శ్లో॥ [నిత్యనాథీయే] పాకహీనౌనాగవంగౌకుష్ఠగుల్మరుజాకరౌ ।
మే పాండూదరో * వాత కఫమృత్యుక రౌకిల ॥

తా. అశుద్ధనాగవంగములవలన కుష్ఠుపు గుల్మము పీడ మేహము పాండువు వుదరము వాతరోగము శ్లేష్మరోగము మరణము గలుగు. కావున నాగవంగముల శుద్ధముగ జేయవలయు.

## నాగ శుద్ధి.

శ్లో॥ నిర్గుండి మూలచూర్ణేన సార్కదుగ్ధేనలేపయేత్ ।
నాగపత్రంతు తచ్ఛుష్కం ద్రావయిత్వా నిషేచయేత్ ।
నిర్గుండీ ద్రవమధ్యేతు తతః పత్రంతు కారయేత్ ।
లిప్త్వాద్రావ్యం పునస్సేచ్యం సప్తవారం విశుద్ధ్యతి ॥

తా. సీసపురేకులపైన విలిచూర్ణమును జిల్లేడుపాలతో బాగుగనూరి లేపనము జేసి యెండించి పిదప దానినికరగించి వావిలియాకురసములోబోయవలయు. ఇటుల 7 మార్లు సీసపురేకులకు లేపనము మొదలగువానిని చేసిన సీసము శుద్ధియగు.

## నాగవంగ శుద్ధి.

శ్లో॥ [చింతామణౌ] తిలతైలేచగోమూత్రేహ్యారనాళామ్లతక్రకే
కుళుత్థకేర విక్షీరే ఛాగక్షీరే ముహుర్ముహుః ।
దాలితౌనాగవంగౌద్వావేతే నద్యాలేన శుద్ధ్యతి ॥

---

* వాతకఫపిత్తకరౌకిల.

తా. నాగవంగములకరగించి నూనె ఆవుపంచితము కలి చల్ల వులవకట్టు జిల్లేడుపాలు మేకపాలు అనువానిలో ప్రతిదానియందు నేడేసిమార్లు బోసిన నాగ వంగములు శుద్ధియగు.

## నాగభస్మ విధీ.

శ్లో॥ తతోనాగం లోష్టమధ్యే వాసాదార్వాజమోదకే ।
తాపయే ద్వాసకా కాష్ఠై ర్భస్మీభవతి తత్క్షణాత్ ॥

తా. శుద్ధిజేయబడిన సీసమును పెంకులో బోసి అడ్డసరపాకురసమును అజా మోదరసమును పోయుచు అడ్డసరపుకట్టెతో వేయింపుచుండిన సీసము భస్మంబగు. (లేక శుద్ధిజేయబడిన సీసపు రేకులకు కలుబందరసము 7 మార్లుబూసి యెండించి మూకుడులోనునిచి కలుబందపలుకులు వేయుచు నడ్డసరపుకట్టెతో వేయింపుచుండి సీసము భస్మంబగు.)

## నాగసిందూరము.

శ్లో॥ తద్భస్మవాసకరసే హ్యజామోదాద్రవేణచ ।
ముండీరసే తథామర్ద్యం పచే ద్దశపుటే తథా ।
ఫణివల్లిరసై ర్మర్ద్యం పున ర్దశపుటే పచేత్ ।
రుద్ధ్వా గజపుటేపాచ్యం సిందూరం భవతిధ్రువమ్ ॥

తా. నాగభస్మమును ఆడ్డసరము అజామోదవోమము బోడతరపాకు అను వానిరసములతో 10 మార్లు మర్దించి ప్రమిదెలలోనునిచి చీలమన్ను లేపనముజేసి 10 గజపుటంబులను తమలపాకు రసముతో 10 మార్లుమర్దించి 10 గజపుటంబులను వేసిన నాగభస్మము సిందూరించు.

## నాగసిందూరవిధి.

శ్లో॥ [ఆయుర్వేదే] చించాత్వగ్భస్మ పాదాంశం దత్వాతేనాగేవి
పేత్ । పాదయోగ్లోహపాత్రేణ సిందూరంజాయతేశుభ
భస్మనా పూర్వవన్నాగం శాకస్య వారిజస్యచ । సి
జాయతేదివ్యం యథేష్టంనాత్రసంశయః॥ రక్తశా
ర్గ కుటజస్యాతు భస్మకమ్ । చతుర్థాంశం దత్వా

దర్వ్యైనిఘర్ష యేత్। చండాగ్నినాదికై కంతు దద్యామర్ద్యం దినత్రయమ్ । పూర్వవల్లోహపాత్రేతు సిందూరం జాయతే శుభమ్ ॥

తా. నాగమునుకరిగించి దానికి 4 వభాగము చింతబెరడుచూర్ణమును గలిపి లోహపాత్రలో వేయించిన సిందూరిం ము. మఱియుపూర్వమువలెనే నాగభస్మమును బూడిదెపొకసుక్షారములో వేయించిన నిస్సంశయముగ సిందూరించు. నాగమునుకర గించిదానికి 4 వభాగము*రక్తశాకి వృత్తకేణకొడిసె అనువాని బూడిదెలనుగలిపి యినుపపాత్రలోబోసి 1 దినము గాఢాగ్నియందునిచి యినుపగెరిటతో రుద్దుచుం డినభస్మంబగు దానిని పైబూడిదలతోడనే 3 దినములు రుద్దుచుండిన సిందూరించు.

## సీసభస్మ గుణము.

శ్లో॥ శతనాగబలంధత్తే మృతనాగో రుజాపహః ।
ఆయుః కాంతిం వీర్యవృద్ధిం కురుతే సేవయేత్సదా ॥

తా. నాగభస్మము 100 యేనుగుల బలమును గలుగంజేసి సర్వరోగముల హరింపంజేయుటయేగాక ఆయుర్వృద్ధిని కాంతిని వీర్యవృద్ధిని గలుగంజేయు కావున దాని నెల్లపుడు సేవింపు చుండవలయు.

శ్లో॥ సీసం పుష్టికరం వాత పిత్తశ్లేష్మ రుజాపయేత్॥

తా. సీసము పుష్టిని గలుగంజేయునదిగ వాత పిత్త శ్లేష్మరోగముల హరిం పంజేయునదిగ నుండు.

## వంగ శుద్ధి.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] కార్పాసార్కకరంజధూర్తమునిజై ర్భల్లాతగుంజాగ్నికై స్స్నుగ్వ్రజీహయగంధసూరణఫలై ర్మూలైశ్చ పత్రైః ఫలైః। తత్రోక్త బహుతప్తఖర్పరగతంవంగంనిషించే న్ముహుః, యావత్పంచదినాంచశుద్ధ్యతిభిషగ్యోగేన దామోజయేత్॥

* ఎఱ్ఱని లేకు.

తా. వంగభస్మము తీక్ష్ణముగ వుష్ణముగ రూక్షముగ వాతప్రకోపకారిగ మేహశ్లేష్మ క్షయ మేహక్రిముల బోకడచునదిగ నుండు.

లోహాష్టకభస్మవిధి.

శ్లో॥ వంగంపలాశద్రవతాళకేన నాగంపయస్యార్క మనశ్శిలేన ।
శుల్బంహ్యజాక్షీరకగంధకేన తీక్ష్ణంచనాగంపయహింగుళేన
తారండవజ్రీపయమాక్షికేన హేమంశిలావర్తకనాగభస్మనా॥

తా. వంగము మోదుగరసము తాళకము అనువానివలనను, నాగము జిల్లేడుపాలు మణిశిల అనువానివలనను తామ్రము మేకపాలు గంధకము అనువానివలనను, ఉక్కు నాగము అనునీరెండును జిల్లేడుపాలు యింగిలీకము అనువానివలనను, రజతము బొంతజెముడుపాలు మాక్షికము అనువానివలనను, సువర్ణము మణిశిల నాగభస్మము అనువానివలనను భస్మంబగు.

శ్లో॥ తాళేనవంగందరదేనతీక్ష్ణంనాగేనహేమంశిలయాచనాగమ్ ।
శుల్బంతథా గంధవరేణ నిత్యం తారంచ మాక్షికవరేణహన్యాత్ ॥

తా. తాళకముచే వంగంబును యింగిలీకముచే లోహంబును సీసముచే సువర్ణంబును మణిశిలచే సీసంబును గంధకముచే తామ్రంబును మాక్షికముచే రౌప్యంబును

హేమాదిభస్మ పరీక్షగుణము.

శ్లో॥ హేమం కపోతకంఠాభ మభ్రకం గతచంద్రకమ్ ।
వాంతి భ్రాంతి హరంతామ్రంలోహం వారితరం శుభమ్॥

తా. సువర్ణభస్మము పావురపిట్టకంఠవర్ణముతో సమానముగ అభ్రకభస్మము తళుకులులేనిదిగ తామ్రభస్మము వాంతి భ్రాంతివర్జితముగ లోహభస్మము నీళ్ళపై తేలునదిగ నుండిన పరిశుద్ధంబులని తెలియవలయు.

హేమభస్మాది శేషాణి ఉత్థానరహితాంచ ।
నాన్యతో సాగుణాః కుర్యాద్భవేయు ర్వ్యాధిహేతవః ॥

తా. హేమాది భస్మములు యితరమైన భస్మములు మరల జనింపకుండిన గుణమును ఐశ్వర్యవృద్ధిని గలుగంజేయు. జనించిన రోగహేతువగు.

తా. వంగభస్మము తీక్ష్ణముగ వుష్ణముగ రూక్షముగ వాతప్రకోపకారిగ మేహశ్లేష్మ క్షయ మేహక్రిముల బోకడచునదిగ నుండు.

లోహాష్టకభస్మవిధి.

శ్లో॥ వంగంపలాశద్రవతాళకేన నాగంపయస్యార్క మనశ్శిలేన ।
శుల్బంపయ్యజాక్షీరకగంధకేన తీక్ష్ణంచనాగంపయుహింగుళేన
తారందవజ్రీపయమాక్షికేన హేమంశిలావర్తకనాగభస్మనా॥

తా. వంగము మోదుగరసము తాళకము అనువానివలనను, నాగము జిల్లేడు పాలు మణిశిల అనువానివలనను తామ్రము మేకపాలు గంధకము అనువానివలనను ఉక్కు నాగము అనునీరెండును జిల్లేడుపాలు యింగిలీకము అనువానివలనను, రజతము బొంతజెముడుపాలు మాక్షికము అనువానివలనను, సువర్ణము మణిశిల నాగ భస్మము అనువానివలనను భస్మంబగు.

శ్లో॥ తాళేనవంగందరదేనతీక్ష్ణంనాగేనహేమంశిలయాచనాగమ్ ।
శుల్బంతథా గంధవరేణ నిత్యం తారంచ మాక్షీకవరేణహన్యాత్ ॥

తా. తాళకముచే వంగంబును యింగిలీకముచే లోహంబును సీసముచే సువర్ణంబును మణిశిలచే సీసంబును గంధకముచే తామ్రంబును మాక్షికముచే రౌప్యంబును

హేమాదిభస్మ పరీక్షగుణము.

శ్లో॥ హేమం కపోతకంఠాభ మభ్రకం గతచంద్రకమ్ ।
వాంతి భ్రాంతి హరంతామ్రంలోహం వారితరం శుభమ్॥

తా. సువర్ణభస్మము పావురపిట్టకంఠవర్ణముతో సమానముగ అభ్రకభస్మము తళుకులులేనిదిగ తామ్రభస్మము వాంతి భ్రాంతివర్జితముగ లోహభస్మము నీళ్ళపై తేలునదిగ నుండిన పరిశుద్ధంబులని తెలియవలయు.

శ్లో॥ హేమభస్మాది శేషాణి ఉత్థానరహితాంచ ।
హాన్యతో సౌగుణం కుర్యాద్బవేయు ర్వ్యాధిహేతవః ॥

తా. హేమాది భస్మములు యితరమైన భస్మములు మరల జనింపకుండిన సగుణమును ఆయుర్వృద్ధిని గలుగంజేయు. జనించిన రోగహేతువగు.

## సప్తధాతుభస్మ పరీక్ష.

శ్లో॥ సర్వమేవం మృతంలోహ ధ్మాతవ్యం మిత్రపంచకైః।
ఇత్యేవంస్యా న్నిరుత్థానం సేవ్యవారితరం భవేత్ ॥

తా. సర్వలోహభస్మములలో మిత్రపంచకమునుచేర్చి యూదిన మరల జనింపకనుదకముపైవైచిన తేలుచుండిన పరిశుద్ధంబులనియెఱింగి దానిని సేవింపవలయు.

## మిత్రపంచకము.

శ్లో॥ గుడగుగ్గులుగుంజాజ్య సారఘై ష్టంకణం సమమ్ ।
జీవనంమృతధాతూనాం వైద్యశాస్త్రే ప్రకీర్తితమ్ ॥

తా. బెల్లము గుగ్గిలము గురిగింజ నెయ్యి తేనె మఱియు వెలిగారముపీనితోడ మృతలోహముల చేర్చి కొలిమిన యూదిన యవిమరల జనించునని వైద్యశాస్త్రము నందు జెప్పంబడియున్నది.

శ్లో॥ [మతాంతరే] మధుగుడఘృతగుంజాటం కణాంపంచమిత్రకమ్॥
తా. తేనె బెల్లము నెయ్యి గురిగింజ వెలిగారముఅనునవి మిత్రపంచకములు.

## నిరుత్థాపనము.

శ్లో॥ గంధకంచోత్థితంభస్మ తుల్యంఖల్వే విమర్దయేత్ ।
దినైకంకన్యకాద్రావై రుధ్యాగజపుటేపచేత్ ।
ఇత్యేవంసర్వలోహానాం కర్తవ్యంతునిరుత్థితమ్ ॥

తా. జనించిన భస్మమును గంధకమును సమభాగములుగ గ్రహించి కలబందరసముతో 1 దినము మర్దించి మూకుళ్ళలోనునిచి చీలమన్ను లేపనముచేసి గజపుటం బిడుటచే సర్వలోహముల మరల జనింపకుండునటులం జేయవలయు.

## సూతాదిభస్మ గుణము.

శ్లో॥ సూతాద్గుణానంతకకోటివజ్రేహ్యభ్రే సహస్రంకనకేశతైకమ్।
కాలేగుణాశీతితదర్ధకాంతే కాప్యేచతుష్షష్టిజడేతదర్ధమ్ ॥

తా. రసమునకన్న వజ్రమునందు అనంతకోటి గుణములును అభ్రకమునందు 1000 గుణంబులును సువర్ణమునందు 100 గుణంబులునులోహమునందు 80 గుణంబు.

లును కాంతమునందు 40 గుణంబులును రజతమునందు 64 గుణంబులును సీసమునందు 82 గుణంబులును గలిగియుండు.

అభ్రక భేదములు.

శ్లో॥ పినాకందర్దురంనాగం వజ్రంచేతి చతుర్విధమ్ ।
పినాకాద్యాస్త్రయోవర్జ్యా వజ్రంయత్నాత్సమాహరేత్ ॥

తా. పినాకము దర్దురము నాగము వజ్రము అని అభ్రకము 4 విధంబులు. అందు పినాకము మొదలు 3 అభ్రకంబులు వర్జ్యంబులు. వజ్రాభ్రకము శ్రేష్ఠంబగుటచే దానిని గ్రహింపవలయు.

వజ్రాభ్రక పరీక్ష

శ్లో॥ వజ్రాభ్రకంతువహ్నిస్థం నకించిద్వికృతింప్రజేత్ ।
తస్మాద్వజ్రాభ్రకంయోజ్యం వ్యాధివృద్ధత్వమృత్యుజిత్ ॥

తా. అభ్రకమును నిప్పులోనునిచియుంచిన కొంచెమైనను వికారము జెందకుండిన దానిని వజ్రాభ్రకమని తెలియవలయు. ఇది రోగము ముదిమి మృత్యువు వీనిని హరింపంజేయు. కావున దానినే గ్రహింపవలయు.

అభ్రక శుద్ధి

శ్లో॥ జామేద్వజ్రమభ్రకంవహ్నౌ తతఃక్షీరేనిషేచయేత్ ।
భిన్నపత్రంతుతత్కృత్వా మేఘనాదామ్లజద్రవైః ।
భావయేదష్ట యామంత దేవంశుధ్యతిచాభ్రకమ్ ॥

తా. వజ్రాభ్రకమును మూకుటిలోబోసి కొలిమిన నెఱ్ఱగ నగునరకు యుంచి పాలలో చల్లార్చి రేకులుగ నొలిచి చిఱ్ఱియాకు తిప్పాకు చింతాకు అనువాని రసములలో 8 ఝాములు భావనచేసిన వజ్రాభ్రకము శుద్ధియగు.

ధాన్యాభ్రక విధి.

శ్లో॥ అథవాభ్రస్యభాగోద్వౌ ముస్తాశైవ్రకంజలైస్సహ ।
త్రిదినంస్థాపయేత్కాత్రేసూక్ష్మం కృత్వాప్రపేషయేత్ ।
బధ్వాధాన్యయుతంవస్త్రే మర్దయేత్కాంజికైస్సహ ।
అధోయద్గళితంసూక్ష్మం శుద్ధంధాన్యాభ్రకంభవేత్ ॥

తా. అభ్రికము 2 భాగములు తుంగముస్తెలు 1 భాగము యిటుల వీని నేకము చేసి 1 భాండములోవైచి తుంగుదకము బోసి 3 దినములు నానబెట్టి మెత్తగ రుబ్బి కొత్తబట్టలో కొంచెకొంచెముగ నునిచి చేరతోసివడ్లువేయుచు కలినిబోయుచు దానికి క్రింద నొకకుండనునిచి గంజియున్న మును రుద్దునటులరుద్దిన అభ్రికముకరిగి మురికివలె క్రిందికుండలోదిగును. బట్టలోవడ్లుమాత్రము నిలుచును. బానలోదిగినదానిని తేరని చ్చినపైన నల్లగ తేలును. ఆనల్లనినీళ్ళను వడియజేసి కుండలోనుండు శుద్ధమైనధాన్యాభ్రికమును విభూతివలెవడియగట్టిగాని కలియిరుగునటులకాచిగాని గ్రహించవలయు

శ్లో॥ అథావ్యత్సం ప్రవక్ష్యామి సంక్షిప్తంసూక్తముత్తమమ్ ।
ఆయుర్వేదోపదేశేస్మిన్ వ్యోమభస్మ నిగద్యతే ॥

తా. ఇకనాయుర్వేదమున జెప్పంబడినప్రకారము అభ్రికభస్మమునువచించెద

అభ్రిక భస్మము.

శ్లో॥ [ఆయుర్వేదే] కృత్వాధాన్యాభ్రికంతత్తు శోషయిత్వావిమర్దయేత్ । అర్కక్షీరై ర్దినంఖల్వే చక్రాకారంతుకారయేత్ । వేష్టయేదర్కపత్రైశ్చ సమ్యగ్గజపుటేపచేత్ । పునర్మర్ద్యంపునః పాచ్యంసప్తవారం ప్రయత్నతః । తతోవటజటాక్వాథై స్తద్వద్దేయంపుటత్రయమ్ । మ్రియతేనాత్రసందేహ స్సర్వరోగేషుయోజయేత్ । మృతంత్వభ్రంహరేన్మృత్యుం జరాపలితనాశనమ్ । అనుపానైశ్చసంయుక్తం తత్తద్రోగహరంపరమ్ ॥

తా. ఇటుల ధాన్యాభ్రికమును జేసినపిదప దానిండినియెండించి ఖల్వములో బోసి జిల్లేడుపాలతో 1 దినముగుర్దించి సన్నపువడియములు చేసి యెండించి నూాపటి కడుగున జిల్లేడుకులపరచి యందభ్రికవడియములనునిచిదానిపైజిల్లేడాకులనువరుసగ పరచి దానిపై మఱియొక మూపుడునుమూసి చీలమన్ను లేపనముజేసి గజపుటంబిడి సాంగశీతలమునదీసి మరల పైరసములచేత నేరుబ్బి వడియములు చేసి యెండించిమును పటివలెనే యాకులబరచి పైప్రకారమే 7 గజపుటంబులిడి సాంగశీతలమునదీసి మఱ్ఱి యూడలకషాయముతో మరలమర్దించి వడియమునుజేసి మునుపటివలెనే యాకులబరచి దానిపైమూపుడుమూసి 7 గజపుటంబులిడిన ధాన్యాభ్రికముభస్మంబగు. దీనిని

సర్వరోగముల యుంగునిచి కొనందగు. మఱియు నభ్రకభస్మము నాయారోగాను పాన విశేషములతో సేవించిన మృత్యువు ముదిమి వీనిని హరింపంజేయు.

## అభ్రక సిందూరము.

శ్లో॥ ఇత్థం కేచిన్మతం ప్రాహుర్ధ హనస్యచమారణమ్। భేకరాజరస
శ్చైవాప్యహిశాకరస స్తథా । అశ్వగంధాసనిర్గుండీ రుదంతి
విజయా ద్రవైః । శతావర్యారసైశ్చ వాప్యాటరూషరస స్త
థా। బలాచాతిబలాచైవ శాల్మలీసత్వమేవచ । కూశ్మాండక
రసైశ్చైవ ముస్తాయారసపనచ । విదారివరకందంచ తులసీ
రుదనంతథా । భల్లాతకరసైశ్చైవ ద్రాక్షాఫలరస స్తథా ।
కటుంబరారసైశ్చాప్యర్కక్షీరంతథైవచ । ఉశీరంవాలు
కంకుష్ఠం తథాలోహితపుష్పకమ్ । చంపకః కాకమాచీచ
గోక్షురంశతపత్రికా దాడిమీకపికచ్ఛూకే ధాత్రీఫలరస
స్తథా । పునర్నవాతథాబ్రాహ్మీ చిత్రకస్యరస స్తథా ।
ముండీరసశ్శిరీషస్య గుడూచ్యాస్స్వరస స్తథా । అభ్రకస్య
పుటేదేయం ప్రత్యేకైకరసేనచ । హన్యాన్తే సర్వరోగాణి
తమసంభాస్కరోయథా ॥

తా. అభ్రకమారణవిధిని మఱికొందరు వచించు తెలంగాణ్లనిన—గుంటలగ గర బ్రహ్మదండివేరు పెన్నేరుగడ్డ వావిలాకు దూలగొండి గంజాయియాకు పిల్లిపీరచ వేళ్ళు అడ్డసరపాకు ముత్తవపులగ పువేళ్ళు పెద్దముత్తవ పులగపువేళ్ళు అనువాని రస ములతోడను బూరుగబంక కల్కముతోడను గుమ్మడుకాయ నీళ్ళతోడను తుంగ ముస్తెలు నేలగుమ్ముడుగడ్డ తులసియాకు మంగవేళ్ళు జీడివేరు ద్రాక్షపండు కటుక రోహిణి [రుద్రజడ] అనువాని రసముతోడను జిల్లేడుపాలు వట్టివేరు కురువేరు చంగల్వకోష్టు వసపువ్వు సంపంగివేరు అనువాని కషాయములతోడను కామంచి పల్లేరువేరు తామరగడ్డ దాడిమాకు దూలగోవెలవేరు వుసిరికపండు గలిజేరువేరు మండూక బ్రహ్మిచిత్రమూలము బోడతరము దిరిసెనపువేరు తిప్పతీగ అనువాని రసముల తోడను ప్రత్యేకప్రత్యేకముగ అభ్రకమును మర్దించి బిళ్ళజేసి యెండించి ప్రతిదానిచే నొక్కొక గజపుటము చొప్పున పుటంబులిడిన అభ్రకము సిందూరించు అని "సూర్యుండంధకారమును బోకడచుభంగి" సర్వరోగముల బోనడచు.

## శతపుటాభ్రక సిందూరము.

శ్లో॥ [గ్రంథాంతరే] పునర్నవా మేఘనాద ద్రవైర్ధాన్యాభ్రకం దినమ్ మర్ద్యంగజపుటేపాచ్యంచిచాసారణజైఃపునః। ద్రవైర్ముస్తాభవైర్మర్ద్యంపృథగ్దేయంపుటత్రయమ్। కాసమర్దరసైః పంచగోమూత్రైస్త్రిఫలైరపి । స్యగోధకాథకైర్మర్ద్యం కుర్యాద్దశపుటంపునః । షట్సుజంబీరనీరేణ గోక్షీరేణపుట త్రయమ్। ఏవమర్కదళైర్వేష్ట్య దేయంరుద్ధ్వాచసంపుటేత్ శతధాటితం భస్మజాయతేపద్మరాగవత్ । నిశ్చంద్రంజాయతే హ్యభ్రంసుధాయోచేషుయోజయేత్ ॥

తా. ధాన్యాభ్రకమును గలిజేరు మట్టి అనువాని రసములచే ప్రత్యేకముగ నొకొక్కదినము మర్దించి 2 గజపుటంబులిడవలయు. పిదప దానిని చింతాకు కంద గడ్డ తుంగముస్తెలు అనువాని రసములతో వేర్వేరుగ మర్దించి 3 గజపుటంబులును కసివెంద్రాకురసముతో మర్దించి 5 గజపుటంబులును గోమూత్రము త్రిఫలకషాయము వీనితో ప్రత్యేకప్రత్యేకముగమర్దించి 5 పుటంబులునుమఱియూడలకషాయముతో మర్దించి 10 పుటంబులును నిమ్మపండ్లరసముతో మర్దించి 6 పుటంబులును ఆవు పాలతో మర్దించి 3 పుటంబులును వేయవలయు. ఇటుల పుటంబులిడిన పిదప అభ్రక మును బాగుగమర్దించి వడియములు జేసి యెండించి జిల్లేడాకులలో నునిచి మూకుడు బోర్లెట్టి పైనమూకుడుమూసి చీలమన్ను లేపనముజేసి కెంపువలె నెఱ్ఱగ వచువఱకు 100 గజపుటం బిడవలయు. ఇటులంజేసిన అభ్రకము నిశ్చంద్రకముగ సిందూరిం దానిని సర్వరోగములయందు బ్రయోగింపంజను.

శ్లో॥ [సిద్ధరసార్ణవే] ముస్తాక్వాథేన ధాన్యాభ్రంపంచవింశత్పుటే పచేత్ । గోమూత్రైస్త్రిఫలాక్వాథైః పక్వావై పూర్వవత్పచేత్ । పంచవింశత్పుటైరేవం కాసమర్ద ద్రవైఃపచేత్। దేయంపుట త్రయంక్షీరైర్మర్దయేచ్చ పుటేపుటే । నిశ్చంద్రంజాయతేహ్యభ్రం జరామృత్యురుజాపహమ్ ।

తా. ధాన్యాభ్రకమును తుంగముస్తెల కషాయముతోమర్దించి 25 పుటంబులును గోమూత్రముత్రిఫలకషాయము వీనితోమర్దించి ప్రత్యేకముగ 25 పుటంబులు

కసివెందాకు రసముతో మర్దించి 25 పుటంబులను పాలతో మర్దించి 100 పుటంబులను వేసి పిదప లెస్సగమర్దించి వడియములుజేసి యెండించి వానిని జిల్లేడాకులలో గట్టి మూకుళ్ళలోనునిచి గజపుటంబులిడిన తశ్చంద్రకముగ అభ్రకము సిందూరించు. దానిని సేవించిన ముదిమి మృత్యువు సర్వరోగములు హరించు.

శ్లో॥ [మతాంతరే] ధాన్యాభ్రకంద్రవైర్మర్ద్యంమత్స్యాక్షీతులసీ
ద్రవైః। మూలజైఃకోకిలాక్షస్య కుమారీశ్వేతమూర్వయోః।
వ్యాఘ్ర్యాఃపునర్నవాయాశ్చదినమేతద్విమర్దయేత్ । కుండ
లాఖ్యైఃపుటైస్సప్తగజేపిష్ట్వాపచేత్పునః। తద్వత్పంచామృ
తైఃపాచ్యం పిష్ట్వాపిష్ట్వాతుసప్తధా । ఏవంనిశ్చంద్రితాం
యాతి సర్వరోగేషుయోజయేత్ ॥

తా. ధాన్యాభ్రకమును పొన్నగంటి తులసి గొలిమిడివేళ్ళు కలబంద తెల్ల చాగ వ్రాకుడు గలిజేరు అనువాని రసములచే ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దించి వడియములుచేసి యెండించి మూకుళ్ళలోనునిచి చీలమన్ను లేపనముజేసి యేడేసి గజపుటంబులిడవలయు. పిదప దానిని పంచామృతములో మర్దించి యేడేసి పుటంబు లిడవలయు. ఇటులజేసిన నిశ్చంద్రకమువలె అభ్రకభస్మంబగు. దానిని సర్వరోగములయందు ప్రయోగింపవలయు. (అభ్రకభస్మము సిందూరించిన పిదప దాని నమృతీకరణము జేయవలయు. ఎట్లనిన.)

## అభ్రకామృతీకరణము.

శ్లో॥ వక్ష్యేషాంఘాతితాభ్రాణా మమృతీకరణం శృణు ।
త్రిఫలోత్థకషాయస్య పలాన్యాదాయషోడశ ।
గోఘృతస్యపలాన్యష్టౌ మృతాభ్రస్యతథాదశ ।
ఏకీకృత్యలోహపాత్రే పాచయేన్మృదువహ్నినా ।
ద్రవేజీర్ణేసమాదాయ సర్వరోగేషుయోజయేత్ ॥

తా. అభ్రకభస్మమునకు అమృతీకరణమును వచించెద. 16 పలముల త్రిఫల కషాయమును 8 పలముల ఆవునెయ్యిని 10 పలముల అభ్రకభస్మమును లోహపాత్ర లోవైచి యేకముచేసి మృద్వగ్నియందు ద్రవ మిగురువరకు కాచి గ్రహింపవలయు. అట్టి దానిని సర్వరోగములయం దుపయోగింపందగు.

## అమృతీ కృతాభ్రిక గుణము.

శ్లో॥ అనుపానం వినాప్యాభ్రిం జరామృత్యు రుజాపహమ్ ।
యోజయే దనుపానై ర్వా తత్తద్రోగ హరంపరమ్ ॥

తా. పైప్రకారమమృతీకరణము చేయబడిన అభ్రికమును అనుపానరహిత ముగ సేవించిన ముదిమి మృత్యువు సర్వరోగములు వీనిని హరింపంజేయు. మఱియు అభ్రకసిందూరమును అనుపానవిశేషములతో సేవించిన సర్వరోగములహరింపంజేయు

## అభ్రిక భస్మ గుణము.

శ్లో॥ మృతంచాభ్రిం హరేద్రోగా న్జరామృత్యు మనేకధా ।
సేవితం దేహదార్ఢ్యం చ రూపంవీర్యం వివర్ధయేత్ ॥

తా. శుద్ధమైన అభ్రకభస్మము మృతువు ముదిమి మొదలగు సర్వరోగముల హరింపంజేయుటయేగాక శరీరదార్ఢ్యమును వీర్యమును గలుగంజేయు.

శ్లో॥ అభ్రిపత్రంతు రోగఘ్నం ఖరత్వం జరనాశనమ్ ।
మృదుసత్వం మృత్యునాశం ద్రుతిసత్వ మతంద్రతామ్ ॥

తా. అభ్రకపుపత్రములు రోగముల హరింపంజేయు. ఖరత్వము ముదిమిని బోనడచు. మృదుసత్వముమృత్యువునుబోనడచు. ద్రుతిసత్వము ఆలస్యమునుబోనడచు

## అభ్రిక గుణము.

శ్లో॥ గౌరీతేజః పరమమమృతం వాతపిత్తక్షయఘ్నం ప్రజ్ఞాబోధి ప్రశమితజరం వృష్య మాయుష్యమగ్ర్యమ్ । బల్యంస్నిగ్ధం రుచిదమకఫం దీపనం శీతవీర్యం తత్తద్యోగై స్సకలగద హృద్వ్యోమ సూతేంద్రబంధీ ॥

తా. అభ్రకభస్మము కడు అమృతతుల్యంబుగ వాత పిత్తక్షయములను ముదిమిని హరింపంజేయునదిగ బుద్ధిప్రదముగ వీర్యవృద్ధికారిగ ఆయుర్వృద్ధి బలముల గలుగంజేయునదిగ స్నిగ్ధముగ రుచికారిగ యింద్రియనిగ్రహమును కఫమును హరింపం జేయునదిగ దీపనకారిగ శీతవీర్యముగలదిగ రసబంధనకారిగ నుండు.

## అశుద్ధాభ్రక దోషము.

శ్లో॥ పీడాంవిధత్తే వివిధాంనరాణాం కుష్ఠంక్షయం పాండుగదంచ శోఫమ్ । హృత్పార్శ్వపీడాశ్చకరోత్యశుద్ధం భ్రమాహితం జాఠరవహ్నిహృత్స్యాత్ ॥

తా. అశుద్ధాభ్రకసేవనవలన పలువిధములైన పీడ కుష్ఠువు క్షయము పాండువు శోఫ హృదయ పార్శ్వములయందు పీడ భ్రమ అగ్నిమాంద్యము గలుగు.

## అభ్రకభస్మానుపానములు.

శ్లో॥ అభ్రకంతు నిశాచూర్ణంమధునా సహమిశ్రితమ్ । శతావరీ చూర్ణయుక్తం సర్వమేహేషుయోజయేత్। అభ్రకంకాంత సంయుక్తం నవనీత విమిశ్రితమ్ । సర్వవ్యాధి హరంపుంసాం కాంతివీర్యబలప్రదమ్ । అభ్రకం సైంధవంద్రాక్షా మరీచేన విమిశ్రితమ్ । ఉష్ణోదకేన తత్పీత్వా సర్వాజీర్ణ నిబర్హణమ్ । అభ్రకం రసభస్మస్యా న్మిశ్రితం మధునాలిహేత్। అత్యుగ్ర సన్నిపాతఘ్నం మూర్ఛితంస్యా త్సముద్ధరేత్ । అభ్రకం మాగధీచూర్ణకలిద్రుమఫలానిచ । చూర్ణమేతత్సమోపేతం శ్లేష్మరోగనిబర్హణమ్ । అభ్రకం తామ్రభస్మస్యాన్మిశ్రితం విజయాసహ । యోజితంమాతులుంగస్యఫలేనస్వరసేనచ । సర్వశూలంనిహంత్యాశు కథితంశూలపాణినా । అభ్రకంరస సింధూర ॥శితంహేమభస్మనా । సమభాగంప్రకల్ప్యైతరసే నార్ద్రేణ ॥ ॥జయేత్। క్షయంచ క్షయపాండుంచ క్షయం నాశంచకుంభకమ్ । జయేన్మండలపర్యంతం పూర్వకర్మవిపా కతః । అభ్రకంచహరీతక్యా శ్చూర్ణంగోమూత్రపేషితమ్ । గోమూత్రేణ పిబే న్నిత్యం మండలా త్పాండురోగజిత్। ద్విగుణం సేవితం శోఫా కుంభకామిల యాసహ । నశ్యంతి త్రిగుణంసేవ్యం వాదిశే త్పథ్యభోజనమ్ । అభ్రకం లోహ భస్మస్యా చ్ఛివారస విమర్దితమ్ । త్రింశత్పుటంపునర్దేయం

తద్రసేనపునఃపునః । లవంగమధుసంయుక్తం ధాతువృద్ధికరం
పరమ్ । సహస్రనారీరమతే పురుషోవీర్యవాన్భవేత్ । అభ్ర
కంచజపాపుష్ప రసేన సహభావయేత్ । శతధాచతథాజాజీ
కుసుంబస్వరసేనచ । శతధా మల్లికాపుష్ప స్వరసేభావయే
ద్దృఢమ్ । శతధాశరపుష్పస్యభావయేత్స్వరసేనచ । శతధా
పంచకైఃపుష్పైస్స్వరసేభావయేద్భిషక్ । తదభ్రకంభాగ
మేకం కుంకుమంతుద్విభాగకమ్ । సురాకారం త్రిభాగంస్యా
చ్చతుర్భాగంచ చందనమ్ । ఏతత్సర్వం సమంకృత్వామృగ
నాభిర్విశేషతః । హిమాంబునామర్దితంస్యాచ్చతుర్వల్లమితం
భవేత్ । మధునా సేవితంనిత్యం యథేష్టాహార భోజనైః ।
క్షీరాన్నందాపయేత్పథ్యంద్రాక్షాఖర్జూరజంఫలం । భక్షయే
చ్ఛర్కరాదీన్స్వాత్వి బేన్నిత్యమతంద్రితః । ఆపాదమస్తకాం
గానిలేపయేద్వరచందనమ్ । ఏవంసేవితమానంద సర్వాపిత్తం
విశోధయేత్ । అభ్రకంవజ్రభస్మస్యా త్సంయోగంకురుతే
భిషక్ । మృగనాభిరసైర్మర్ద్యం సేవితంమాష మాత్రకమ్।
మాషమాత్రంజయేన్మృత్యుంవలీపలితనాశనమ్ । సర్వరోగా
న్జయేత్ప్రాజ్ఞోబలవాన్వీర్యవాన్భవేత్ । అభ్రకంకలధౌతస్య
భస్మముక్తాఫలస్యచ । తస్మిన్ప్రవాళ భస్మాపి భస్మమౌక్తిక
మేవచ। తారాతామ్ర భస్మంచభస్మవైక్రాంతమేవచ। ఏతై
ర్భస్మసమంచైవ వ్యోమభస్మ విమిశ్రితమ్ । సర్వపుష్పరసై
ర్భావ్యం మాషమాత్రంసహార్ద్రకైః । సర్వరోగనివృత్యర్థం
దాపయేత్కరుణాకరమ్ । మధునాశ్లేష్మరోగస్య వాతస్యైర
రండతైలకైః । పిత్తస్యసితసంయుక్తం పాండుశోఫస్యమూ
త్రకే।ఘృతేన శ్వాసకాసేచ శ్లేష్మరోగస్యమాగధీ। ముస్తా
నాగరయుక్తంచా ప్యతిసారంవినాశయేత్ ॥

తా. అభ్రకభస్మమును పసుపు చూర్ణము తేనె చల్లపిల్లిగడ్డలచూర్ణము అను
పానితోడ సేవించిన సర్వమేహములు హరించు. అభ్రకభస్మమును కాంతభస్మము

వున్న అనువానితోడ సేవించిన సర్వరోగములహరింపంజేసి శరీరకాంతిని వీర్యము బలమును గలుగంజేయు. అభ్రకభస్మమును సైంధవలవణము ద్రాక్షపండు మిరి ములు పుష్పోదకము అనువానితోడ గలిపిసేవించిన సర్వాజీర్ణములు హరించు. అభ్ర కభస్మమును రసభస్మము తేనె అనువానిలోగలిపి సేవించిన అత్యుగ్రసన్నిపాతము మూర్ఛహరించు. అభ్రికభస్మమునకు సమముగ పిప్పలీచూర్ణమును తాడికాయలచూ ర్ణమును గలిపి సేవించిన శ్లేష్మరోగములు హరించు. అభ్రికభస్మమును తామ్రభస్మ కరక్కాయమాదీఫలరసము అను వానితోజేర్చి సేవించిన సర్వశూలలు నివర్తిం నని శివుడు వచించె. అభ్రికభస్మమునకు సమముగ రససిందూరమును సువర్ణభ మును గలిపి అల్లపురసముతో 1 మండలము సేవించిన పూర్వజన్మకర్మపరిపాక వలన క్షయము క్షయపాండువు శరీరక్షయము కుంభకామిల హరించు. అభ్రికభ ము కరకచూర్ణము వీనిని గోమూత్రముతోనూరి గోమూత్రముతోడ 1 మండల వరకు సేవింపుచుండిన పాండురోగము హరించు. రెండింతల అభ్రికభస్మము 1 భాగము కరకచూర్ణమును గలిపి గోమూత్రముతో నూరి గోమూత్రముతోడ సేవించిన పాండుశోఫలును మూడింతల అభ్రికభస్మములో 1 భాగము కరకచూర్ణ గలిపి గోమూత్రముతో నూరి గోమూత్రముతోడనే సేవించిన పాండుశోఫకుంభ మిలలును హరించు. దీనియందు పథ్యభోజనముల వైద్యుడు విధింపవలయు. అభ్ర భస్మములో లోహభస్మములుగలిపి కరక్కాయరసముతో మర్దించి 30 పుటంబుల లవంగములు తేనె అనువాని యనుపానముతోడ సేవించిన పురుషుడు వీర్యవృద్ధి వాడై 1000 స్త్రీలతో రమించు. అభ్రికమును దాసనపువ్వు జాజిపువ్వు కుసుం పువ్వు మల్లెపువ్వు కుక్కవాయింటపువ్వు అనువాని రసములలో ప్రతిదానిచే నూ భావనల చొప్పున 700 భావనలుజేసి యందొకభాగమును గ్రహించి అందు 2 భా ములు కుంకుమపువ్వును 3 భాగములు సురాకారమును 4 భాగములు చందనమ 10 భాగములు కస్తూరిని గలిపి శీతోదకములో మర్దించి 4 వల్లములంత మాత్రలు తేనెతో ప్రతిదినము సేవింపుచు యథేష్టాహారభోజనములను పాలన్నమును ద్రా పండు ఖర్జూరపండు పంచదార మొదలగువానిని ప్రతిదిన మాలస్యముజేయక సే పుచుండుటయేగాక పాదము మొదలు శిరమువరకు చందనమును బూసికొనిన లోమమును గలుగంజేసి సర్వపిత్తరోగముల హరింపంజేయు. అభ్రికభస్మమ వజ్రభస్మమును చేర్చి కస్తూరి నీళ్ళతో మర్దించి మాషప్రమాణమును సేవిం మృత్యువు ముదిమి సర్వరోగములు వీనిని హరింపంజేయుటయే గాక బలవీర్యవ గలుగంజేయు. సువర్ణభస్మము ముత్తియములభస్మము పగడభస్మము సర్వమా భస్మము రజతభస్మము తామ్రభస్మము వైక్రాంతభస్మము వీనికన్నిటికి సమవ

అభ్రకభస్మమును గలిపి దాసనపువ్వు జాజిపువ్వు కుసుంబాపువ్వు మల్లెపువ్వు నుక్కా-వాయింటపువ్వు మొదలగు సర్వపుష్పరసములతో భావనలుజేసి మాషప్రమాణమును అల్లపు రసానుపానముతోడ సేవించిన సర్వరోగములు నివర్తించు. ఈ యోగము కరుణాకరమని జెప్పంబడు. దీనిని తేనెతో సేవించిన శ్లేష్మరోగములును ఆముదముతో సేవించిన వాతరోగములును పంచదారతో సేవించిన పిత్తరోగ పాండుశోఫ బహుమూత్రములును ఘృతముతో సేవించిన శ్వాసకాసములును పిప్పలితో సేవించిన శ్లేష్మరోగములును తుంగముస్తెలు శొంఠి అనుపానితో సేవించిన అతిసారములును హరించు.

## అభ్రకానుపానములు.

శ్లో॥ [చరకే] నిశ్చంద్రిక మృతం యోగ్యం సేవ్యం సర్వగదేషుచ। పిప్పలీ శర్కరాయుక్తం వాతపిత్త జ్వరాపహమ్ । ఘృతేన గృహధూమేన గగనంచిప్పి కాసహమ్ । పంచసారేణగగనం విషమజ్వరజిద్వరమ్ । చాతుర్జాతంత్రిరాత్రంతు సన్నిపాతం హరంపరమ్ । తథావై సన్నిపాతఘ్నం వాతఘ్నం రక్తపిత్త జిత్ । వాసారసేన గగనం * కాసశ్వాసం దురాపహమ్ । క్షయరోగ హరంశీఘ్రి మశ్వగంధి విసర్పిషు । మయూర పింఛక్షారేణ మధునా ఛర్దిలుంఠనమ్ ॥ కపిత్థ ఫలసారేణ హిక్కారుచి హరంపరమ్ । భల్లాతకేన గగన మర్శోరోగ హరంపరమ్ । ముస్తానాగరక్వాథేన సర్వాతీసారనాశనమ్ । ఇతిసాంగానుపానాభ్రం సర్వరోగహరంపరమ్ ।

తా. తరుకులు లేకుండు అభ్రకభస్మమును సేవించిన సర్వరోగములు హరించు. మరియు అభ్రకభస్మమును పిప్పలి పంచదార అనుదానితోడ సేవించిన వాతపిత్త రములును, నెయ్యి కరుధూమము అనువానితోడ సేవించిన చిప్పి కాసమును, ంచసారములతోడసేవించిన విషజ్వరములును, చాతుర్జాతకచూర్ణానుపానముతోడ దినములు సేవించిన సన్నిపాత వాతరక్తపిత్తములను, అడ్డసరపాకురసముతో సేవిం నఅసాధ్యమైన కాసశ్వాసములును, పెన్నేరుగడ్డ చూర్ణముతో సేవించిన క్షయ

* అర్శోరోగ హంత్రంపరమ్.

విసర్పిరోగములను, వెములియాకె భస్మము తేనె అనువాని యనుపానముతోడ సేవించిన ఛర్దియు, వెలగగుజ్జుతో సేవించిన హిక్కారుచులను, జీడిగింజలకషాయముతో సేవించిన అర్శోరోగంబును తుంగముస్తెలు శొంఠి అనువాని కషాయముతో సేవించిన సర్వాతిసారములును హరించు. ఈ యనుపాన విశేషములతోడ అభ్రకభస్మమును సేవించిన సర్వరోగములు నివర్తించు.

### రసాష్టాదశసంస్కార వివరణము.

శ్లో॥ స్వేదనం మర్దనం మూర్ఛోత్థాపనం పాతనం త్రిధా ।
బోధనం నియమంచైవ దీపనం చానువాసనమ్ ।
మారణం జారణంచైవ సారణం ప్రతిసారణమ్ ।
క్రమణం వేదనంచైవ దేహే యోగేచశస్యతే ॥

తా. స్వేదనము మర్దనము మూర్ఛనము ఉత్థాపనము అధఃపాతనము తిర్యక్పాతనము ఊర్ధ్వపాతనము బోధనము నియమము దీపనము అను వాసనము మారణము జారణము సారణము ప్రతిసారణము క్రమణము వేదనము శరీరయోగము అనునవి రసాష్టాదశ సంస్కారంబులు.

### స్వేదన విధి

శ్లో॥ తూర్యూషణం లవణంరాజీ రజనీ త్రిఫలార్ద్రకమ్ । మహాబలా నాగబలా మేఘనాదఃపునర్నవా । మేషశృంగీచిత్రకంచ నవసారం సమంసమమ్ । రసస్య షోడశాంశేన సర్వంయుంజ్యాత్పృథక్పృథక్ । ఏతత్సమస్తంవ్యస్తంవా పూర్వామ్లైశ్చప్రపేషయేత్ । లింపేదనేనకల్కేన వస్త్రేద్వ్యంగుళిమాత్రకమ్। తన్మధ్యే నిక్షిపేత్సూతం బధ్వాతత్ర దినంపచేత్ । డోలాయంత్రేమ్లసంయుక్తే జాయతే స్వేదితోరసః।

తా. త్రికటుకములు వుప్పుఆవాలు పసుపుత్రిఫలములు అల్లము పెద్దముత్తవపులగము నాగముత్తవపులగము చిరిశికూర తెల్లగలిజేరువద్ది చిత్రమూలమునవాసాగరము అనువానిలో ప్రతిద్రవ్యమునుగాని అందుదొరికినవానినిగాని రసమునకు 16 వ భాగముగ్రహించి ప్రత్యేకముగ గాని సముదాయముగ గాని కలితోనూరి వస్త్రముపై

అంగుళప్రమాణము లేపనముజేసి దానిమధ్యమున పాదరసమునుబోసి వస్త్రములో గట్టిగ దానిని డోలాయంత్రమునదగిలించి కలితో 1 దినమువండుటయ స్వేదమనంబడు.

## మర్ధన విధి.

శ్లో॥ భిషగ్భిర్మర్దయేచ్చూర్ణైర్మిళిత్వా షోడశాంశతః ।
సూతస్య గాలితేవ స్త్రైర్వక్ష్యమాణ ద్రవాదిభిః ।
గృహధూమేష్టికాచూర్ణం తథాదధిగుడాన్వితమ్ ।
లవణా సురియుక్తం క్షిప్త్వాసూతం విమర్దయేత్ ।
జీర్ణాభ్రకం తథాజీర్ణ బీజసూతం తథైవచ ।
గృహ్ణాతి నిర్మలోరోగాన్ గ్రాసేగ్రాసే విమర్దితః ॥

తా. కరుధూపము యిటికెరాయిపొడి పెరుగు బెల్లము పుష్పా ఆవాలు జీర్ణాభ్రకము వీనిలో ప్రతిదాని చూర్ణమును రసమునకు 16 వ భాగముచేర్చి మర్దించి రసమును వస్త్రములోబోసి పిడిచిన నిర్మలమై శీఘ్రముగ రోగముల హరింపంజేయు.

## మూర్ఛన విధి.

శ్లో॥ సహకన్యా మలంహంతి త్రిఫలా వహ్నినాశినీ ।
చిత్రమూలం విషంహంతి తస్మాత్తంచ ప్రయత్నతః ।
మిశ్రితం మర్దయేత్సూతం సప్తవారేణ మూర్ఛయేత్ ॥
ఇత్థం సంమూర్ఛితస్సూతో దోషశూన్యః ప్రజాయతే ॥

తా. కలుబంద పాదరసమునందలి మలదోషమును త్రిఫలములు వహ్నిదోషమును చిత్రమూలము విషదోషమును హరింపంజేయు. కావున మిశ్రితపాదరసమును కలుబంద త్రిఫలములు చిత్రమూలము అనువానిరసములతో ప్రతిదానిచే యేడేసిమార్లు మర్దించిన రసము మూర్ఛంజెందు. ఇటుల మూర్ఛంజెందినరసము దోషరహితంబు.

## ఉత్థాపన విధి.

శ్లో॥ జలైస్స్విన్నోరనాళైర్వా క్షాళనాదుత్థితో భవేత్ ।
అథవా పాతనాయంత్రే పాకనాదుత్థితో భవేత్ ।
ఉత్థితః కాంజిక క్వాథైః క్షాళనీయ సుతఃవరమ్ ॥

తా. పాదరసమును వృష్ణోదకముతో గాని వృష్ణముగనుండు కలితో గాని కడిగి దీసికొనిన వృత్థితంబగు లేక ఊర్ధ్వపాతపాయంత్రమునందును వృత్థితంబగు. ఉత్థాపనానంతరము రసమును వృష్ణముగనుండి కలితో గడుగవలయు.

ఊర్ధ్వపాతన విధి.

శ్లో॥ భాగాస్త్రయోారసస్యార్క చూర్ణమంశాంశనింబకమ్ । తతస్సంమర్దయేద్యావత్తావదాఽయాతిపిండతామ్ । తత్పిండంతలభాండస్థ మూర్ధ్వభాండే జలంక్షిపేత్ । కృత్వాలంబాలకే యంత్రే దత్వావార్ద్రిం హిమోదకమ్ । సంరోప్యచాగ్నిం మధ్యస్థం చతుర్యామంహిబోధయేత్ । యుక్త్యోర్ధ్వభాండ సంలగ్నం గృహ్ణీయాత్పారదంతతః । ఊర్ధ్వపాతనమిత్యుక్తం భిషగ్భి స్సూతశోధనే । సనూత భాండవివర మన్య ద్గలతి భాండకే । తథాసంధి ర్ద్వయోాఃకార్యా పాతినా యంత్రయంత్రకే। యంత్రప్రమాణంపదనాద్గురోర్జ్ఞేయంవిచక్షణః॥

తా. పాదరసము 3 భాగములు జిల్లేడుపట్ట చూర్ణము 1 భాగము యిటుల వీనినిగ్రహించి అందొకింత నిమ్మపండ్లరసముబోసి యుండగ నగువరకు మర్దించి దాని నధస్థిత భాండమునందునిచి పైభాండమునం దుదకముబోయుటచే డమరుకాయంత్రమన పఱగెడుదానిని పొయిమీదనునిచి పైభాండమునందు శీతోదకముబోయుచు 4 ఝాములు మధ్యమాగ్నితో వండి పైపండ నంటియుండు రసమును యుక్తితో గ్రహింపవలయు. రసశోధన విషయమున జేయంబడు నీక్రియనే ఊర్ధ్వపాతన మని యెందరు. ఊర్ధ్వపాతనాధస్థిత భాండముఖములో పైభాండముయొక్క ముఖమును జేర్చి బాగుగ సంధిలేపనము జేయవలయు. యంత్రప్రమాణమును గురుముఖమువలన దెలిసికొనవలయు.

అధఃపాతన విధి.

శిగ్రుశిఖిభిర్లవణాసురిసంయుతైః। నష్టపిష్టరసంకృత్వా
ర్ధ్వభాండకే । ఊర్ధ్వభాండోదరంలిప్త్వా చాధో
క్షిపేత్ । సంధిలేపంద్వయోాఃకృత్వా తద్యంత్ర

భువిపూరయేత్। ఉపరిష్టాత్పుటేదత్తే జలేపతతిపారదః।
అధఃపాతనమిత్యుక్తం సిద్ధాద్యైస్సూతకర్మణి ॥

తా. త్రిఫలములు మునగ చిత్రమూలము వుప్పు ఆవాలు వీనితోడ రసమును జేర్చి రసము గలియువరకు ఖల్వమున మర్దించి డమరుకయంత్రముయొక్క పైపాత్రలోభాగమున దానినిబూసి క్రిందిపాత్రయం దుదకముబోసి ఆరెండుపాత్రల జేర్చి సంధులకు బాగుగ చీలమన్ను లేపనముజేసి యెండించి యాపాత్రనుభూమిలో పూడ్చి దానిపై పుటంబిడవలయు. ఇటుల చేసిన రసము జలముందు క్రిందిపాత్ర యందు బడు. దీనిని సిద్ధాదులు రసకర్మయందు అధఃపాతనమని వచించె.

## తిర్యక్పాతనము.

శ్లో॥ ఘటేరసో వినిక్షిప్య సజలంఘటమన్యకమ్। తిర్యఙ్ముఖం ద్వయోఃకృత్వా సమ్ముఖంరోధయేత్సుధీః। తద్వైవచుల్యాం సంస్థాప్య యత్నతస్తం తతోభిషక్। రసస్య జ్వాలయే ద్వహ్నింయావత్సూతోజలంవిశేత్। తిర్యక్పాతనమిత్యుక్తం సిద్ధైశ్చ్యవార్జునాదిభిః। మిశ్రితౌనాగవంగౌచరసేవిక్రయహేతుతః। తాభ్యాంస్యాత్కృమిదోషస్తు తన్ముక్తిఃపాతనత్రయాత్। ఏవంసుసంస్కృతస్సూతః పాతనావిధియత్నతః। సర్వదోషవిముక్తోజాయతేనాత్రసంశయః॥

తా. యంత్రమునకు తగినటుల నొకింత నిడుపుగనుండు కుండలగ్రహించి అందొక దానిలో పాదరసమును మఱియొకదానిలో యుదకమునుబోసి అడ్డముగను నిచి వానినిచేర్చి సంధులకు చీలమన్ను లేపనముచేసి రసముబోసిన కుండను పొయి మీద నడ్డముగయుక్తితో నునిచిపాతనముజేసిన రసము నీళ్ళలోబ్రవేశించు. దీనినే నాగార్జునుడు మొదలగు సిద్ధులు తిర్యక్పాతనమని వచించెదరు. ఇటుల యుక్తిచే త్రి మార్లు తిర్యక్పాతనము చేయుటవలన రసమునందలి నాగ వంగ క్రిమిదోషములు నివర్తించు. ఈతిర్యక్పాతనవిధివలన రసమునందలి సర్వదోషములు నిస్సంశయముగ హరించు.

బోధనము.

శ్లో॥ ఏవంకదర్థితస్సూతః షండత్వమధిగచ్ఛతి ।
తన్ముక్తయేస్యక్రియతే బోధనంకథ్యతేహితత్ ॥

తా. పైప్రకారము శోధింపబడిన పాదరసమునందు షండత్వ దోషం బుండు. అది నివర్తించుటకై బోధనక్రియను వచించెద.

బోధనము.

శ్లో॥ కదర్థ్యనేనైవనపుంసకత్వ మేనంభవేదస్యరసస్యపశ్చాత్ ।
వీర్యప్రకర్షాయచభూర్జపత్రైస్స్వేదవ్యోలేసైంధవచూర్ణగర్భే॥

తా. రసమునకు పైజెప్పంబడినసంస్కారమువలన షండత్వదోషము గలుగు. తన్నివారణార్థంబును రససామర్థ్యము వృద్ధిజెందుటకును రసమును భూర్జపత్రము వుదకము సైంధవలవణమును అనువానితో పాకము జేయవలయు.

నియమనము.

శ్లో॥ సర్పాక్షీచించకావంధ్యా భృంగాబ్దకనకాంబుభిః ।
దినంసంస్వేదితస్సూతో నియమాత్థిరతాంవ్రజేత్॥

తా. పాదరసమును సర్పాక్షీ చింతగొడ్డుకాకరగుంటగలగర తుంగముస్తెలు వుమ్మెత్త అనువానిరసములతోగాని లేక కషాయములతోగాని 1 దినమువుండిననియమనమనంబడు.

సందీపనము.

శ్లో॥ కాసీస పంచలవణం తదూర్ధ్వంనింబుకంరసమ్ । క్షిప్త్వాక్షిప్త్వాథదాతవ్యంతాద్యక్సైంధవఖేటకమ్। గర్తేకృత్వాధరా గర్భేదత్వాసైంధవ సంయుతమ్ ॥ దూలినష్టాంగుళింత్వా రాజికామరిచానిచ। ద్వాశిగ్రుబీజమేకత్రటంకణేనసమన్వితమ్ ఆలోడ్యకాంజికేడోలా యంత్రేపాచ్యందినైస్త్రిభిః । దీపనం జాయతేసమ్యక్సూతరాజస్యజారణే ॥

తా. అన్నభేది పంచలవణము వీనిని గ్రహించి దానిపై పలుమారు నిమ్మపండ్ల రసమునుబోసి సైంధవలవణగడ్డను పగలగొట్టి అందు సైంధవలవణముతోడ పాదరసమును జేర్చి దానిపై పూర్వోక్త సైంధవలవణమును నిమ్మపండ్ల నంటించి దానిపై 8 అంగుళముల దూళినంటించి మునగవిత్తులు చేదుమునగవిత్తులు వెలిగారము అవనీమూటిని నూరి కుండకు లేపనముజేసి అందుకలిబోసి దానిమధ్యమున డోలాయంత్రముతో 3 దినములు వండిన రసము జారణ సంస్కారమునందు దీపనమగు.

(రసమున కష్టాదశ సంస్కారములు జెప్పంబడి యుండినను "స్వేదోమర్దిత మూర్ఛనాస్థితిరతః పాతోఽపిబేదన్వితో। బోధస్సంయమనం ప్రదీపనమితి సృష్టా ష్టధా సంస్కృతిః। అస్యాసర్వ రసోపయోగి కతయాత్వాన్య నవిన్యస్యతే। గ్రంథేస్మిన్ ప్రకృతోప యోగనిరహో ద్విష్టార భీత్యాథవా॥" అను గ్రంథాంతర వచన ప్రకారము స్వేదన మర్దన మూర్ఛన ఉత్పాతనపాతన బోధన సంయమన ప్రదీపన ములన 8 సంస్కారములు సర్వోపయోగంబు లగుటచే జెప్పంబడియె. తక్కిన 10 సంస్కారములు ఔషధోప యోగంబులు గాకుండుటం జేసియు, గ్రంథవిస్తర భీతిం జేసియు జెప్పంబడనయ్యె.)

## రస భస్మము.

శ్లో॥ దత్వావింశతి భాగకేజలధిజేసూతస్యభాగంద్ర్ఢంఖల్వేమర్ద్య
చకాంజికేనసతతంయద్వాతతశ్చాంబునా । ఉద్ధృత్వాపిచసి
క్షిపేచ్ఛపుటయేదేవం యథేష్టోరసస్సాముద్రైశ్చ సుమార్య
తేచలవణై శ్చేవంప్రకారేణచ ॥

తా. 1 పలము శుద్ధిజేసిన రసములో 1 పలము సముద్రలవణమును కలిపి యావియిగురువరకు మర్దించవలయు. ఇట్లైఅంగున 20 పలముల సముద్రలవణ మిగురు వరకు పాదరసమును కలిశోమర్దించి హాండికా యంత్రమునందునిచి పాకముజేసిన రసభస్మంబగు. ఆరసభస్మమును దీసికొని భస్మముగాకుండురసమును మరలలవణము కలి అనువానితో మర్దించి హాండికా యంత్రమునందునిచి పాకముజేసిన యారసము భస్మంబగు. రసము భస్మంబగువరకు పైప్రకారమే మర్దనపాకముల జేయవలయు. (భస్మమైనరసమును గ్రహించు తెఱంగెట్లనిన—రసభస్మమును తీయనినీళ్ళను ఖల్వములో బోసిమర్దించి యొకకుండలోబోసి దానినిండా యుదకముబోసి 8 జాములు చేరనిచ్చి యంపలి యుదకమును వడిసిన క్రింద తెల్లగ రసభస్మము నిలిచియుండు.

అందు మరల నువకముబోసి బాగుగ కలిపి నీళ్ళు తీయుగనగువరకు వండి క్రిందనుండు రసభస్మమునుదీసికొని ఖల్వమున నెండించి గంతపుకరాటములో నునిచికొనవలయు. ఆట్టిరసభస్మము ½ తులము జాజికాయ 1 తులము జాపత్రి 1 తులము లవంగములు 1 తులము పిప్పలి 1 తులము వాయువిడంగములు 1 తులము వోమము 1 తులము బెల్లము 4 తులములు ఇటుల వీనినెల్ల నేకముజేసి మర్దించి మాత్రలుచేసి యందొక్కొకదానిని సాయంప్రాతఃకాలముల యందావునేతిలో సేవించి చపిఎడిపథ్యము నాచరింపుచు ఆవుచల్లను త్రాగుచు నుండవలయు. దానివలన సర్వరోగములు హరించు.)

శ్లో॥ శుద్ధసూత స్తదర్ధంతు శుద్ధగంధకఏవచ ।
తయోఃకజ్జలికాంకుర్యా ద్దినమేకం విమర్దయేత్ ।
మృత్కర్పటలిప్తాయాం కుప్యాంకజ్జలికాంక్షిపేత్ ।
వాలుకాయంత్రకేపాచ్యా యావద్దిన చతుష్టయమ్ ।
గృహ్ణీయాదూర్ధ్వసంలగ్నం సిందూరంరససన్నిభమ్ ॥

తా. శుద్ధిచేసినరసము 1 భాగము శుద్ధిజేసిన గంధకము ½ భాగము యిటుల వీనినెల్ల నేకముజేసి కజ్జలిగ 1 దినము మర్దించి గాజుసప్పెలోనునిచి చీలమన్ను లేపనముజేసి యెండించి వాలుకాయంత్రము నందిడి 4 దినములు పాకముచేసి స్వాంగశీతల మునదీసి గాజుసప్పె గొంతునంటియుండు రససిందూరమును గ్రహింపవలయు.

శ్లో॥ ధూమసారంరసంతోరీ గంధకంనవసాగరమ్ । యామైకంమర్దయేదమ్లై ర్భాగంకృత్వాసమంసమమ్ ॥ కాచకుప్యాంవినిక్షిప్య తాంచమృద్వస్త్రముద్రయా । విలిప్యపరితోవ స్త్రీముద్రాంద త్వాచసోషయేత్ । అధస్సచ్ఛిద్రపిఠరీ మధ్యేకుప్యాంనివేశయేత్ । పిఠరీంవాలుకాపూరై ర్భృత్వాచాకూపికాగళమ్ । నివేశ్యచుల్ల్యాంతదధఃకుర్యాద్వహ్నింశనైశ్శనైః। తస్మాదప్యధికంకించి త్పావకంజ్వాలయేత్క్రమాత్ । ఏద్వాదశభిర్యామైర్మ్రియతేసూతకోత్తమః । స్ఫోటయేత్స్వాంకశీతంచా పూర్వార్ధ్వకం గంధకంజయేత్ ॥ అధస్థం మృతసూతంచ సర్వకర్మసుయోజయేత్ ॥

తా. కరుషూపము శుద్ధిచేసినరసము పటికారము శుద్ధిచేసిన గంధకము సహా సాగరము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి నిమ్మపండ్లరసముతో 1 ఝాము మర్దించి గాజుకుప్పెలోనునిచి దానినోటికి బిరడవేసి చీలమన్ను లేపనముచేసి యెండించి చిట్టికి క్రిందిభాగమున దబ్బనముతో రంధ్రముచేసి యాచట్టిమధ్యమున గాజుకుప్పెనునిచి కుప్పెగొంతువరకు నిసుకబోసి యాచట్టిని పొయిమీదనునిచి లఘ్వగ్నితో పాకము జేయుటయేగాక క్రమముగ నగ్నిని హెచ్చింపుచుండవలయు. ఇత్తెరంగున 12 జాములు పాకముచేసి స్వాంగశీతలమున కుప్పెనుదీసికొని యుక్తితో పగలగొట్టి దానినోటియందంటియుండు గంధకమును పరిగ్రహించి క్రిందనుండు రసభస్మమును దీసికొని సర్వకార్యములయం దుపయోగించుకొనవలయు.

శ్లో॥ [మతాంతరే] కాకోదుంబరికాదుగ్ధే రసంకించిద్విమర్దయేత్।
తద్దుగ్ధఘృష్టహింగోశ్చ మూషాయుగ్మంప్రకల్పయేత్।
క్షిప్త్వాతత్సంపుటేసూతం తత్రముద్రాంప్రదాపయేత్।
ధృత్వాతంగోళకంప్రాజ్ఞో మృన్మూషాసంపుటేభిషక్।
పచేన్మృదుపుటేనైవ సూతకోయాతిభస్మతామ్॥

తా. శుద్ధిచేసిన రసమును ఖల్వములోబోసి బ్రహ్మమేడి పాలతో యొకింత మర్దించి పిదపఇంగువను బ్రహ్మమేడి పాలతోనూరి 2 మూసలుచేసి యందొకదానిలో నొకింత మర్దించిన పైపాదరసమునునిచి దానిపై 2 వ మూసనుమూసి బాగుగ నేర్చి యుంటచేసి మూకుళ్ళలోనునిచి చీలమన్ను లేపనముజేసి యేరుపిడకలతో లఘుపుటంబిడిన రసముభస్మంబగు.

శ్లో॥ అపామార్గస్యబీజానాం మూషాయుగ్మంప్రకల్పయేత్।
తత్సంపుటేన్యసేత్సూతం మర్కదుగ్ధవిమిశ్రితమ్।
ద్రోణపుష్పీప్రసూనాని విడంగమిరిమేదకమ్।
ఏతచ్చూర్ణమధశ్చోర్ధ్వం దత్త్వాముద్రాంప్రదాపయేత్।
తంగోళంముద్రయేత్సమ్యక్ మృన్మూషాసంపుటేసుధీః।
ముద్రాందత్త్వాశోషయిత్వా తతోగజపుటేపచేత్।
ఏవమేకపుటేనైవ జాయతేసూతభస్మకమ్॥

తా॥ ఉత్తరేణువిత్తులనూరి 2 మాసలుచేసి అందొకదానిలో తుమ్మిపూలు వాయువిడంగములు నల్లతుమ్మపట్ట అనువాని చూర్ణమునువైచి శుద్ధిచేసిన రసమును జల్లేడుపాలతో మర్దించి యాచూర్ణముపై బోసి దానిపై తుమ్మిపూలు మొదలగు వాని చూర్ణమునువైచి మఱియొక మూసనుమూసి సంధులకు చీలమన్ను లేపనముజేసి మంటి మూసలోనునిచి దానిపై మఱియొక మూసనుమూసి సంధులకు చీలమన్ను లేపనముజేసి యెండించి గజపుటంబిడిన రసముభస్మంబగు.

## రససిందూరము.

శ్లో॥ పలద్వయంశుద్ధరసం పలార్ధంశుద్ధగంధకమ్। కర్షార్ధంనవసారంచ జంబీరేణ విమర్దయేత్ । కాచకుప్యాం క్షిపేచ్చైవ మృత్కర్పట్యాచసప్తథా । విలిప్యకాచకుప్పీంతాం మాతపే శోషయేద్బృధమ్ । ఛిద్రభాండేతతోకుప్పీం న్యసేత్సికతయంత్రకే। కుప్పీకాకంఠమానేసపూజయేదిష్టదేవతామ్। పంచభోజ్యాకుమార్యశ్చతతశ్చుల్యాంవినిక్షిపేత్ । పచేద్యామాష్టకం చైవ కుప్పీ కాంచక్షణేక్షణే । సంశోధ్యపాచయేద్యంత్రేస్వాంగశీతంసముద్ధరేత్ । గ్రాహ్యంచదరదాకారం దేవదానవదుర్లభమ్ । సేవయేద్రోగనాశాయతతోరోగానుపానతః । వల్లం వా వల్లయుగ్మంవా మధునా కణయాసహ । సేవితంకామినీకామం దర్పయేద్రతికౌతుకమ్ । వీర్యబంధకరశ్శ్రీఘ్రం మోహామదవినాశనమ్ । సిందూరంహరవీర్యసంభవమిదం రూక్షాగ్నిమాంద్యాపహమ్ । యక్ష్మాదిక్షయపాండుశోఫముదరంగుల్మప్రమేహాపహమ్ । శూలప్లీహవినాశనం జ్వరహరం దుష్టవ్రణాన్నాశయే దర్శాంసిగ్రహణీ భగందర గ్రహం ఛర్ది త్రిదోషాపహమ్ ॥

తా. శుద్ధిచేసిన రసము 2 పలములు శుద్ధిచేసిన గంధకము ½ పలము నవాసాగరము ½ కర్షము యిట్టుల వీని నేకముగేసి కజ్జలిగ మర్దించి నిమ్మపండ్ల రసముతో నూరి గాజుకుప్పెలోనునిచి దానిపై 7 మార్లు చీలమన్ను లేపనముచేసి బాగుగ నెండ యెండించి ఛిద్రముగల వాలుకా యంత్రమునందునిచి యాగాజుకుప్పె కంఠమువఱకు

గుకబోసి యిష్టదేవతా పూజచేసి 5 కుమారికల కన్నంబిడి పొయిమీద నునిచి నుమారుకుప్పెను పరీక్షించు 8. జాములు పాకముచేసి స్వాంగశీతలమున దేవదైత్యు ప దుర్లభంబై యింగిలీకమువలె నెఱ్ఱగనుండు రససిందూరమును గ్రహింపవలయు. స్త్రీ రససిందూరములో 1 లేగవల్లముల ప్రమాణము నాయాశోగోక్తాను పానము డనేని తేనె పిప్పలి అనువాని తోడనేని సేవించిన సర్వరోగముల హరింపం యుటయేగాక స్త్రీలకు శీఘ్రముగ సంతోషమును జూపించునట్టి వీర్యబంధన రిగ స్త్రీమదమును హరింపంజేయునదిగనుండు. మఱియు పాదరసమువలన జనిం న నీసీందూరము రూక్ష అగ్నిమాంద్యము యక్ష్మ క్షయము పాండువు శోఫ ఉద ము గుల్మము ప్రమేహము శూల ప్లీహము జ్వరము దుష్టవ్రణము అర్శస్సు గ్రహణి గందరము గ్రహదోషము వాంతి త్రిదోషము అనువానిని హరింపంజేయు.

శ్లో॥ పలమాత్రంరసంశుద్ధం తావన్మాత్రంతుగంధకమ్ । విధివత్క
జ్జలీంకృత్వా న్యగ్రోధాంకురవారిణా । భావనాత్రితయం
దత్వా స్థాలీమధ్యేనిధాపయేత్ । విధాయకచ్ఛపీయంత్రే
వాలుకాభిఃప్రపూరయేత్ । దద్యాత్తదనుమందాగ్నింభిష
గ్యామచతుష్టయమ్ । జాతాతేరససిందూరం తరుణారుణ
సన్నిభమ్ । అనుపానవిశేషేణకరోతివివిధాన్గుణాన్ । క్షయ
కుష్ఠమరుత్పిత్త మేహఘ్నం పాండునాశనమ్ ॥

తా. శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన గంధకము యీరెంటిని సమముగ చేర్చికజ్జ లిగ మర్దించి చిత్రియూడల కొనలరసముతో 3 భావనలుజేసిపాత్రలోనునిచికచ్ఛ పయంత్రమునందిడి దానిలో నిసుకబోసి పొయిమీదనునిచి 4 జాములు మందాగ్ని తో పాకముచేసిన బాలసూర్యునివంటి కాంతిగల రససిందూరము జనించు. దాని ననుపానవిశేషములతో సేవించిన పలువిధములైనగుణములు గలుగంజేయుటయేగాక క్షయము కుష్ఠువు వాతపిత్తమేహము పాండువు వీనిని సగాహరించు.

## రసకర్పూరోత్పత్తి.

శ్లో॥ రసభస్మచయన్మూర్ఛా పూర్వక్షపాతంచజాయతే ।
సర్వౌషధానాంసమ్మిశ్రం సర్వరోగహరంపరమ్ ।
గుంజాప్రమాణంసేవేత వలీపలితనాశనమ్ ।
తద్భస్మరసభేదైశ్చ రసకర్పూరసంజ్ఞకః ॥

తా. మూర్ఛజెంది ఊర్ధ్వపాతమువలన జనించు రసభస్మమే రసకర్పూర మనంబడు. దీనిని సర్వౌషధముల యందుచేర్చి సేవించిన సర్వరోగముల హరింపం జేయు. మఱియు గుంజాప్రమాణమును సేవించిన ముదిమిని హరింపంజేయు. ఈభస్మము రసభేదంబగుటచే కర్పూర మనంబడు.

## రసకర్పూరసేవనచే హరించురోగములు.

శ్లో॥ రసకర్పూరమమృతం వాతాశీతివినాశనమ్ ।
కుష్ఠాష్టాదశభేదంచ మేహవింశతినాశనమ్ ।
వ్రణాదిదుష్టరక్తాని భగందరమహోదరమ్ ।
గ్రహణీంగుల్మమానాహ క్షయంహిధ్మాంచనాశయేత్ ।
శ్లేష్మాదిపీనసాజీర్ణ రక్తపిత్తంచనాశయేత్ ।
అర్శాంసివిషజాలంచ మహాకర్పూరసేవయా ॥

తా. రసకర్పూరము అమృత తుల్యంబగుటచే అశీతివాత అష్టాదశకుష్ఠ వింశతి మేహ దుష్టవ్రణాది దుష్టరక్త భగంధర మహోదర గ్రహణీ గుల్మ ఆనాహ క్షయ హిధ్మ శ్లేష్మాది పీనసాజీర్ణ రక్తపిత్తార్శ విషసమూహముల హరింపంజేయు. కావున మహాకర్పూరమునే సేవింపవలయు.

## నవరత్న నామంబులు.

శ్లో॥ కురువిందమౌక్తికంవజ్రం వైడూర్యంశక్రనీలకమ్ ।
పుష్పరాగంమరకతం గోమేధిక ప్రవాళకమ్ ।
నవరత్నంక్రమాచ్ఛోధ్యం మారయేద్విని యోజయేత్ ॥

తా. కురువిందము మౌక్తికము వజ్రము వైడూర్యముశక్రనీలకము పుష్పరాగ మరకతము గోమేధికము ప్రవాళము అనునవి నవరత్న నామంబులు వానిని క్రమముగ శుద్ధి భస్మముచేసి ఔషధములయం దుపయోగింపందగు.

## అశుద్ధరత్న గుణము.

శ్లో॥ అశుద్ధరత్నంవిస్ఫోట తాపభ్రమరుజాకరమ్ ।
బలహానింవీర్యనాశం తస్మాద్రత్నానిశోధయేత్ ॥

తా. అశుద్ధమైన రత్నములు విస్ఫోటకను తాపను భ్రమ పీడ దౌర్బల్యము రక్తనాశనము అనువానిని గలుగంజేయు. అట్లగుటచే వానిని శుద్ధిచేయవలయు.

## మాణిక్య శుద్ధి.

శ్లో॥ అశ్వమూత్రాంతరేభావ్యం త్రిదినంచబలాతపే।
తథోష్ణవారిణాక్షాళ్యం రత్నశుద్ధిర్భవిష్యతి ॥

తా. కెంపులను గుఱ్ఱపుమూత్రములోవేసి 3 దినములు మంచియెండ యం దునిచి భావనజేసిన యుష్ణోదకముతో గడిగిన శుద్ధియగు.

## * మాణిక్య భస్మము.

శ్లో॥ తన్మాణిక్యంరవిక్షీరే దివసత్రయభావితమ్।
శరావేత్రిపుటంపాచ్యం భస్మీభవతితత్క్షణాత్॥

తా. శుద్ధిచేసిన కెంపులను జిల్లేడుపాలతో 3 దినములు భావనజేసి మూకు డ్లలోనునిచి చీలమన్ను లేపనముజేసి యేరుపిడకలతో 3 పుటంబులిడిన మాణిక్యము భస్మంబగు.

## మాణిక్య గుణము.

శ్లో॥ మాణిక్యంశిశిరంస్నిగ్ధంమధుకాంతికరంలఘు।
దీపనంవృష్యమాయుష్యం మనోజ్ఞంగ్రహదోషనుత్॥

తా. కెంపు శీతలముగ స్నిగ్ధముగ మధురముగ కాంతికరముగ లఘువుగ అగ్నిదీపనకారిగ వీర్యవృద్ధికారిగ ఆయుర్వృద్ధికారిగ మనోజ్ఞముగ గ్రహదోషముల బోనడచునదిగనుండు.

## మౌక్తిక నామములు.

శ్లో॥ [నిఘంటు]ముక్తాఫలంమౌక్తికంశుక్తిజంస్యాత్తారాకారాతౌ
తిలామౌక్తికాచ। అంభస్సారంశీతలంనీరజంచ నక్షత్రంస్యా
ద్బిందురత్నంచరత్నమ్।

* మాణిక్యమన — కెంపులు.

తా. ముక్తాఫలము మౌక్తికమును శుక్తిజము తారాకారము తౌతిలము నుక్తికము అంభస్సారము శీతలము నీరజము నక్షత్రము బిందురత్నము రత్నము అనునవి ముత్తియముల పేళ్ళు.

మౌక్తిక శుద్ధి.

శ్లో॥ కుండలీఫలజద్రావై ర్భావితందివసత్రయమ్ ।
అథవాతింత్రిణీద్రావై శ్శుద్ధిర్భవతిమౌక్తికమ్ ॥

తా. ముత్తియముల తెల్లవుప్పి పండ్లరసముతోగాని చింతపండుపులుసుతోగాని (కుంకుడుపండ్లరసములోగాని) భావనలుచేసిన శుద్ధియగు.

మౌక్తిక భస్మము.

శ్లో॥ శుద్ధముక్తాఫలశ్వేత బృహతీఫలజద్రవైః ।
భావితంభూపుటేపాచ్యం భస్మశుద్ధంభవిష్యతి ॥

తా. శుద్ధిచేసిన ముత్తియముల తెల్లములక పండ్లరసముతో భావనచేసి మూకుళ్ళలోనునిచి చీలమన్ను లిచ్చి భూపుటంబిడిన శుద్ధభస్మంబగు.

మౌక్తిక గుణము.

శ్లో॥ ముక్తాఫలంహిమంసర్వం తీక్ష్ణం చోష్ణంగదాపహమ్ ।
దీపనంవస్తిశూలఘ్నం మనోజ్ఞంగ్రహదోషనుత్ ॥

తా. ముత్తియములు శీతలముగ సర్వభంగము బోనడచునదిగ తీక్ష్ణముగ వుష్ణరోగములం బోనడచునదిగ అగ్నిదీపనకారిగ వస్తిశూలను బోనడచునదిగ మనోజ్ఞముగ గ్రహదోషమును బోనడచునదిగ నుండు.

అశుద్ధవజ్ర గుణము.

శ్లో॥ హృత్పార్శ్వపీడాశ్వయథు కుష్ఠగుల్మరుజాకరమ్ ।
పాండుతాపగురుత్వంచ తస్మాచ్ఛుద్ధంచయారయేత్ ॥

తా. అశుద్ధవజ్రములు హృత్పార్శ్వములయందు నొప్పివాపు కుష్ఠువు గుల్మము పాండువు తాపము జడత్వము అనువానిని గలుగంజేయు. కావున శుద్ధిచేయబడిన వజ్రములనే భస్మముచేయవలయు.

## వజ్రభేదములు.

శ్లో॥ శ్వేతరక్తంపీతకృష్ణం ద్విజాద్యావజ్రజాతయః ॥

తా. తెల్లనివర్ణముగల వజ్రము బ్రాహ్మణజాతియనియు యెఱ్ఱనివర్ణముగల వజ్రము క్షత్రియజాతియనియు పీతవర్ణముగల వజ్రము వైశ్యజాతియనియు కృష్ణ వర్ణముగల వజ్రము శూద్రజాతియనియు జెప్పంబడు.

## వజ్ర గుణము.

శ్లో॥ రసాయనంభవేద్విప్ర శ్శుభ్రింసిద్ధ్యష్టదాయకమ్ ।
క్షత్రియోమృత్యుజిద్రక్తం వలీపలితరోగహా ।
ద్రవ్యకారీభవేద్వైశ్యః పీతందేహస్యజాడ్యకృత్ ।
కృష్ణశ్శూద్రోరుజాంహంతి వయస్తంభంకరోతిచ ॥

తా. తెల్లనివర్ణముచే బ్రాహ్మణజాతియని పలుకఁబడువజ్రము రసాయనముల యందుపయోగించిన అష్టసిద్ధులుగలుగు. రక్తవర్ణముచే క్షత్రియజాతి యనంబడు. వజ్రము మృత్యువును ముదిమిని రోగములను హరింపంజేయు. పచ్చనివర్ణముచే వైశ్య జాతి యనంబడు. వజ్రము ద్రవ్యకారిగ నుండుటయేగాక శరీరజాడ్యమును గలుగం జేయు. నల్లనివర్ణముచే శూద్రజాతి యనబడును. వజ్రము రోగములబోనడచి వయ స్తంభనమును గలుగంజేయు.

## వజ్రజాతి నిర్ణయము.

శ్లో॥ పుంస్త్రీనపుంసకంచేతి లక్షణేనతులక్షయేత్ ॥

తా. వజ్రములయొక్క పురుష స్త్రీనపుంసక భేదముల వానిలక్షణములవలన తెలియవలయు.

## వజ్రలక్షణ తద్గుణము.

శ్లో॥ సువృత్తాఃఫలసంపూర్ణా స్తేజోయుక్తాబృహత్తరాః ।
పురుషాహీరకా స్తేచ రేఖాబిందువివర్జితాః ।
రేఖాబిందుసమాయుక్తా షడస్రా స్తేస్త్రియస్స్మృతాః ।
త్రికోణాశ్చసుదీర్ఘాశ్చ విజ్ఞేయా స్తేనపుంసకాః ।

* పూర్వపూర్వమిమే శ్రేష్ఠాః పురుషారసబంధకాః ।
శరీరకాంతిజనకాః భోగదావజ్రయోషితః ।
నపుంసకాహ్యల్పవీర్యాః కాముకాన్సత్వవర్జితాః ॥

తా. గుండ్రముగ సంపూర్ణమైన పలకలుకలదిగ తేజోవంతముగ పెద్దదిగ రేఖలు బింధువులు లేనిదిగనుండు వజ్రము పురుషజాతియనియు రేఖలు బింధువులు వీనితోగూడి 6 కోణములుగలదై యుండువజ్రము స్త్రీజాతియనియు 3 కోణములు గలదై నిడుపుగ నుండువజ్రము నపుంసక జాతియనియు తెలియవలయు. వానిలో ముందు ముందుది శ్రేష్ఠంబు. అందు పురుషవజ్రము రసబంధన కారిగనుండు. స్త్రీ వజ్రము శరీరకాంతికారిగా భోగకారిగనుండు. నపుంసకవజ్రముఅల్పవీర్యముగలదిగ కాముకులకు సత్వమును బోనడచునదిగనుండు.

## స్త్రీత్వాది జాతిభేదమువలన వజ్రప్రయోగము.

శ్లో॥ స్త్రీతుస్త్రీణాంప్రదాతవ్యం క్లీబేక్లీబంతథైవచ ।
సర్వేషాంసర్వదాయోజ్యః పురుషోబలవత్తరః ॥

తా. స్త్రీలకు స్త్రీవజ్రమును నపుంసకులకు నపుంసకవజ్రమును సమస్తమైన వారికి పురుషవజ్రమును ప్రయోగించిన బలవత్తరంబుగ నుండు.

## వజ్రశుద్ధి.

శ్లో॥ గృహీత్వాహ్ని శుభేవజ్రం వ్యాఘ్రీకందేవినిక్షిపేత్ ।
మహిషీవిష్ఠయాలిప్త్వా కరీషాగ్నౌవిపాచయేత్ ।
నిశాయాంతుచతుర్యామం † నిశాంతేచాశ్వమూత్రకైః ।
సేచయేత్పాచయేదేవం సప్తరాత్రేణశుధ్యతి ॥

తా. వజ్రముల శుభకరమైనదినము గ్రహించి నేలములక వేరులోనునిచి యెనుపపేడలోపొదిగి ప్రాతయెరుపువుముక అనువానితో రాత్రికాలంబున 4 జాము పుటంబిడి ప్రాతఃకాలమున గుఱ్ఱపుమూత్రములోవేసి వానిందీసికొని మునుపటి లెనే నేలములక వేరులోనునిచి 4 జాములు రాత్రియందు పుటంబిడి వానిందీసి గుఱ్ఱపుమూత్రములో వేయవలయు. ఇటుల 7 దినములుజేసిన వజ్రములుశుద్ధియగు.

---

* సర్వేషుపురుషాశ్శ్రేష్ఠాశ్శధకారసబంధకాః. † యామిన్యంతే.

శ్లో॥ కుళుత్థకోద్రవక్వాథై ర్దోలాయంత్రేవిపాచయేత్ ।
వ్యాఘ్రీకందగతంవజ్రం సప్తాహాద్విమలంభవేత్ ॥

తా. వజ్రముల నేలములక వేరులోనునిచి ఉలవలు ఆళ్ళు అనువానికషాయములతో డోలాయంత్రమున 7 దినములువండిన వజ్రములు శుద్ధియగు.

శ్లో॥ మేఘనాదశమీశ్యామా శృంగీమదనకోద్రవమ్ ॥
కుళుత్థవేతసంచాఖు కర్ణ్యై సింధువారకమ్ ।
ఏతేషాంచజలక్వాథై ర్వజ్రంజంబీరగంమధ్యగమ్ ।
డోలాయంత్రేత్ర్యహంపాచ్య మేవంవజ్రంవిశుద్ధ్యతి ॥

తా. వజ్రముల నిమ్మపండులోనునిచి చిర్రి జమ్మి తెగడ కర్కాటకశృంగము ఆళ్ళు ఉలవలు ప్రబ్బలి యెలుకచెవియాకు (అవిసె) వావిలి (ఈశ్వరివేరు) అనువానికషాయములతో డోలాయంత్రమున 3 దినములువండిన వజ్రములుశుద్ధియగు.

## వజ్ర భస్మము.

శ్లో॥ త్రివర్గనాగవల్ల్యస్తు కార్పాసారూఢమూలికాః ।
పిష్ట్వా తన్మధ్యగం వజ్రం కృత్వామూషాం నిరోధయేత్ ॥
పచేద్గజపుటేతచ్చ క్రియతే సప్తధాపుటైః ॥

తా. మూడేండ్లతమలపాకులు ప్రత్తివేళ్ళు వీనినినూరి ముద్దజేసి దానిలో శుద్ధిచేసిన వజ్రములనునిచి యీముద్దను * అంధమూషలోబెట్టి 7 గజపుటంబులిడిన వజ్రములు భస్మంబగు.

శ్లో॥ వజ్రం మత్కుణరక్తేన సప్తధా పరిభావితమ్ ।
వేష్టయేద్బదరీపత్రై రుద్ధ్వా గజపుటేపచేత్ ।
పునర్లేప్యం పునస్తాప్యం సప్తధా క్రియతేచ తత్ ।

* అంధమూషాతు కర్తవ్యా గోస్తనాకారసన్నిభా.
సైవ ఛిద్రాన్వితా మధ్యే గంభీరా సారణోచితా.

తా. వజ్రములు నల్లి నెత్తురుతో 7 మార్లు భావనజేసి రేగాకులలోపొదిగి పైన చీలమన్ను లేపనము జేసి మూసలోనునిచి వానిపై చీలమన్ను బూసి 7 గజపుటంబులిడిన వజ్రములు భస్మంబగు.

శ్లో॥ శుద్ధవజ్రంనజవల్లీ రసేనపరిభావితమ్ ।
వజ్రమూషాంతరేక్షిప్త్వా భస్మీభవతితత్క్షణాత్ ॥

తా. శుద్ధిచేసిన వజ్రముల నల్లేరురసములో 1 దినము నానబెట్టి వజ్రమూషలో నునిచి చీలమన్ను లేఫనముచేసి యేరుపిడకలతో గజపుటంబిడినవజ్రములు భస్మంబగు.

వజ్రభస్మ గుణము.

శ్లో॥ వజ్రమాయుర్బలంరూపం దేహసౌఖ్యంకరోతిచ ।
సేవితంహంతిరోగాంశ్చ మృతవజ్రంనసంశయః ॥

తా. వజ్రభస్మము ఆయువు బలము రూపము శరీరసౌఖ్యము వీనిని గలుగం జేయుటయేగాక దానిసేవనవలన సర్వరోగముల నిస్సంశయముగ హరింపంజేయు.

వైక్రాంతోత్పత్తి.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] దేవ్యాహతే మహాదైత్యే మహిషాసురసంజ్ఞకే । అస్యరక్తంతుపతితం యత్రయత్రస్థితంభువి । తత్ర తత్రతువైక్రాంతంవజ్రాకారంమహారసః । వింధ్యస్యదక్షిణా వాసేచ త్తరేవాస్తిపర్వతః । నికృంతయతిలోహాని తేనవైక్రాంతమిష్యతే ॥

తా. మహిషాసురుడను నామముగల మహాదైత్యుని దేవి సంహరించునపుడు వాని రక్తముపడిన స్థలమునందంతట వజ్రాకారమైన వైక్రాంతము జనించె. ఆవైక్రాంతపర్వతములు వింధ్యపర్వతమునకు దక్షిణభాగమునందు వుత్తరభాగమునందు న్నయవి. ఇది లోహముల భేదించునట్టి శక్తిగలవియగుటంజేసి వైక్రాంతమనంబడు.

వైక్రాంత లక్షణము.

శ్లో॥ అష్టకంచాష్టఫలక షట్కోణమసృణోగురుః ।
శుద్ధమిశ్రితవర్ణశ్చ యుక్తోవైక్రాంతఉచ్యతే ॥

తా. 8 భేదములు 8 పలకలు 6 కోణములు అమృతగుణము శుద్ధవర్ణము బరువు మిశ్రితవర్ణముగలది వైక్రాంత మనంబడు.

## వైక్రాంత భేదములు.

శ్లో॥ శ్వేతోరక్తశ్చపీతశ్చ నీలఃపారావతప్రభః ।
శ్యామలఃకృష్ణవర్ణశ్చ కర్బూరశ్చాష్టమోమతః ॥

తా. వైక్రాంతము తెలుపు యెరుపు పసుపు నీలము పావురపిట్టవర్ణము శ్యామలవర్ణము కృష్ణవర్ణము కర్బూరవర్ణము అనువర్ణ భేదములచే 8 విధంబులు.

## వైక్రాంత శుద్ధి.

శ్లో॥ త్రిక్షారైఃపంచలవణై ర్వపామూత్రామ్లకద్రవైః ।
మత్స్యతైలేఘృతైతైలే ప్యేరండేకాంజికాన్వితే ।
సప్తాహండోలికాయంత్రే వ్యాఘ్రీకందగతంపచేత్ ।
సర్వవర్ణంతువైక్రాంతం శుద్ధిమాయాతినిశ్చయమ్ ॥

తా. త్రిక్షారములు పంచలవణములు వసస ప్తవిధమూత్రములు అమ్లపంచకము మత్స్యతైలము నెయ్యి నూనె ఆముదము కలి వీనిని డోలాయంత్రమునచేర్చి నేలములక వేరుతోలచి అందువైక్రాంతముల నునిచివండిన సర్వవర్ణములుగల వైక్రాంతములు శుద్ధియగు.

## వైక్రాంతశుద్ధి తద్భస్మవిధి.

శ్లో॥ వైక్రాంతంవజ్రవచ్ఛోధ్యం నీలంశ్వేతంచలోహితమ్ ।
హయమూత్రేణతత్సించే త్తప్తంతప్తంత్రిసప్తధా ।
తతశ్చోత్తరవారుణ్యాః పంచాంగేగోళకేక్షిపేత్ ।
రుద్ధ్వాపుటేపాచ్య ముద్ధృత్యగోళకేపునః ।
క్షిప్త్వారుద్ధ్వాపుటేవేవం సప్తధాభస్మతాంవ్రజేత్ ॥

తా. నల్లగగాని తెల్లగగాని యెఱ్ఱగగాని యుండు వైక్రాంతములవజ్రమువలెనే శుద్ధిజేయవలయు. మఱియు వైక్రాంతము నెఱ్ఱగ 21 మార్లుకాచి గుఱ్ఱపుమూత్రములో 21 మార్లువేసిచల్లార్చిన శుద్ధియగు. పిదప దుష్టావుసమూలమును మ

నూరి దానిలో శుద్ధిచేసిన వైక్రాంతములనునిచి యీముద్దను మూషలోనునిచి దానిపై మఱియొక మూసనుమూసి చీలమన్ను లేపనముచేసి గజపుటంబిడి సాంగశీతలమున దీసి మరలవైక్రాంతముల పైప్రకారమే దుష్టుపుముద్దలోనునిచి యీముద్దను మూస లోబెట్టి దానిపై మఱియొక మూసను మూసి చీలమన్ను లేపనముచేసి 7 గజపుటంబు లిడిన వైక్రాంతము భస్మంబగు.

## వైక్రాంత భస్మము.

శ్లో॥ [సిద్ధవిద్యాభూః] వైక్రాంతవజ్రవచ్ఛోధ్యం ధ్మాతంసిక్తంచ
మూత్రకే। వజ్రవన్మృతిమాయాతి వజ్రస్థానేసయోజయేత్ ।

తా. వైక్రాంతమును వజ్రమువలెనే కొలిమినయూది గుఱ్ఱపుమూత్రములో నద్దుటచే శుద్ధిచేసిన వజ్రమువలెనే భస్మముచేసి వజ్రస్థానమున నుపయోగింపందగు.

## వైక్రాంత ద్రుతి.

శ్లో॥ కేతకీస్వరసంగ్రాహ్యం సైంధవంస్వర్ణపుష్పికా ।
ఇంద్రగోపకసంయుక్తం స్వరభాండేవినిక్షిపేత్ ।
సప్తాహంస్వేదయేత్తస్మిన్ వైక్రాంతంద్రవతాంవ్రజేత్ ॥

తా. మొగలిచన్నులరసము సైంధవలవణము రేలపువ్వు * యింద్రగోప పురుగులు వీనితోడ వైక్రాంతమునుజేర్చి బంగారుపాత్రలో నునిచి 7 దినములు పాక ముచేసిన వైక్రాంతము జనించు.

## వైక్రాంత సత్వము.

శ్లో॥ వైక్రాంతంవజ్రకందంచ స్నుహ్యాశ్చపయసాసహ ।
మహిషీనవపీతేన సక్షౌద్రంమర్దయేద్దినమ్ ।
పూర్వవద్ధమనాత్సర్వ మింద్రగోపనిభంభవేత్ ॥

తా. శుద్ధిచేసిన వైక్రాంతము 1 భాగము బొంతజెముడుగడ్డ చూర్ణము 1 భాగము యిటుల వీని నేకముజేసి బొంతజెముడుపాలతో 1 దినము బఱ్ఱెవెన్నతో 1 దినము తేనెలో 1 దినము మర్దించి బిళ్ళజేసి కోష్ఠయంత్రమునందునిచి ఊదినయిం ద్రగోప పురుగులచాయవలె సత్వముదిగును. (లేక వైక్రాంతమును 2 భాగములు

* ఇంద్రగోపపురుగులు — అనగా ఆరుద్రపురుగులు.

అభ్రకద్రావకము 1 భాగము యిటుల వీని నేకముజేసి మర్దించి బిళ్ళజేసి కోష్ఠయం త్రమునం దునిచి యూదిన సత్త్వముదిగును.)

## వైక్రాంత గుణము.

శ్లో॥ ఆయుఃప్రదంచ రసబంధకరంచవృష్యర వహ్నిప్రదంనిఖిల
రోగమదాపహారి। దోషత్రయాపనయనం విషదోషహారి
వైక్రాంతకంఖలువపుర్బలలోహకారీ॥

తా. వైక్రాంతము ఆయుర్వృద్ధిని రసబంధనమును వీర్యవృద్ధిని అగ్నిదీపమును గలుగంజేసి సర్వరోగ త్రిదోష విషదోషముల హరింపంజేయునదిగ శరీరబ కారిగ లోహవేధనకారిగ నుండు.

## వైడూర్య నామములు.

శ్లో॥ వైడూర్యం కేతురక్తంచ కైతవం వాలవాయజమ్ ।
ప్రావృష్యం భద్రలోహంచ భద్రశబ్దాంకురస్తథా ॥

తా. వైడూర్యము కేతురసక్తను కైతవము వాలవాయజము ప్రావృష్యము భద్రలోహము భద్రశబ్దాంకురము యివి వైడూర్యనామములు.

## వైడూర్య శుద్ధి.

శ్లో॥ వైడూర్యం వాజిమూత్రేణ కూశ్మాండ స్వరసేనచ ।
భావితం ద్విదినం చాథ శుద్ధి ర్భవతి నిశ్చయమ్ ॥

తా. వైడూర్యము గుఱ్ఱపుమూత్రములో 1 దినము గుమ్మడుపండురసములో 1 దినము నానబెట్టిన శుద్ధియగు.

## వైడూర్య భస్మము.

శ్లో॥ తద్వైడూర్యం శిలాభేది రసేన పరిభావితమ్ ।
విశ్వకర్మపుటే దగ్ధ్వా తీవ్రాగ్నా వజ్రమూషయా ॥
తతో గజపుటేపాచ్యం భస్మీ భవతినిశ్చయమ్ ॥

తా. శుద్ధిచేసిన వైడూర్యములను * పిండికొండవేళ్ళరసముతో భావనజేసి కొలిమినియూది వజ్రమూషలోనునిచి దానిపై మఱియొకమూస మూసి చీలమన్ను లేపనముజేసి గజపుటం బిడిన వైడూర్యము భస్మంబగు.

## వైడూర్య భస్మ గుణము.

శ్లో॥ వైడూర్యం వజ్రతుల్యంతు సర్వరోగా న్వ్యపోహతి ॥

తా. వైడూర్యమువజ్రతుల్యముగ సర్వరోగములహరింపంజేయునదిగనుండు.

## నీల శుద్ధి.

శ్లో॥ ఖరమూత్రాంతరో క్షిప్త్వా నీలం తీవ్రాతపే క్షిపేత్
భావితం దినమేకంచ నీలం శుద్ధం భవిష్యతి ॥

తా. నీలముల గాడిదెమూత్రములోవైచి 1 దినముతీక్ష్ణమైనయెండను భావన చేసిన శుద్ధియగు.

## నీల భస్మము.

శ్లో॥ తన్నీలం లక్షితం జీవాద్రవేభావ్యం త్రియామకమ్ ।
విశ్వకర్మపుటే దగ్ధ్వా భస్మీ భవతి తత్క్షణాత్ ॥

తా. శుద్ధిజేసిన నీలములను ఆక్షీపంజాకురసములో 3 ఝాములు నానబెట్టి వజ్రమూషలో బోసి కొలిమినియునిచి యూదిన తత్క్షణమున నీలములు భస్మంబగు.

## నీల గుణము.

శ్లో॥ నీలం శీతం గురు స్నిగ్ధం మధురం పిత్తనాశనమ్ ॥

తా. నీలము శీతలముగ జడముగ స్నిగ్ధముగ మధురముగ పిత్తనాశనకారిగ నుండు.

## పుష్యరాగ శుద్ధి

శ్లో॥ పుష్యరాగం ఛాగమూత్రై ర్భావ్యంశుద్ధం భవిష్యతి
తత్పుష్యరాగం పాషాణభేది ద్రావేణ భావితమ్ ।
విశ్వకర్మపుటే దగ్ధ్వా భస్మీ భవతి తత్క్షణాత్ ॥

* ఇదే పిండిబండయనియు జెప్పంబడు.

తా. పుష్పరాగముల మేకపంచితములో 1 ఝాము నానబెట్టిన శుద్ధియగు. శుద్ధిజేయబడిన పుష్పరాగముల కొమ్మన బెండియాకురసములో భావనజేసి మూకు ళ్ళలోనునిచి చీలమన్నులిచ్చి కొలిమిన యూదిన తక్షణమున భస్మంబగు.

## పుష్పరాగ గుణము.

శ్లో॥ పుష్పరాగం పుష్టికరం శ్లేష్మలం గురుశీతలమ్ ॥

తా. పుష్పరాగము పుష్టికారిగ శ్లేష్మకారిగ జడముగ శీతలకారిగనుండును.

## మరకత నామములు.

శ్లో॥ [నిఘంటౌ] స్మృతోజాత్యా మరకతో రౌహిణే యోను
రక్తకమ్ । హరిన్మణిశ్చ సౌవర్ణం బుధరత్నం శుకధ్వజమ్ ।
గరళాయు ర్వాయువశం గురుదం రుద్రసమ్మతమ్ ।

తా. మరకతము రౌహిణేయము అనురక్తకము హరిన్మణి సౌవర్ణము బుధ రత్నము అంశుకధ్వజము గరళాయువు వాయువశము గురుదము రుద్రసమ్మతము అను నవి మరకత నామంబులు.

## మరకత శుద్ధి.

శ్లో॥ క్షిప్త్వా విదారికందాంతః పుటే కౌక్కుటసంజ్ఞకే ।
పాచితం చాథతంసీత్వా భవే న్మరకతంశుచిః ॥

తా. పచ్చల తొలిచిన నేలగుమ్ముడు గడ్డలోనునిచి దానిపై చీలమన్నుజేసి కుక్కుటపుటంబిడి సాంగశీతలమున దీసిన శుద్ధియగు.

## మరకత భస్మము.

శ్లో॥ తతో మరకతంక్షుద్రా రసేన పరికల్పయేత్ ।
పాషాణ భేదిద్రావేణ మర్దితంచ శరావకే ।
పుటమేకం తతఃపాచ్యం భస్మీభవతితద్ధ్రువమ్ ॥

తా. శుద్ధిచేసిన పచ్చల వాకుడురసములో భావనజేసి కొండపిండి- ముతో మర్దించి బిళ్ళజేసి యెండించి మూకుళ్ళలోనునిచి చీలమన్నుబూసి టంబిడిన భస్మంబగు.

మరకత గుణము.

శ్లో॥ హరితం విశదం కాంతం లఘుగ్రాహి త్రిదోషజిత్

తా. పచ్చలు పరిశుద్ధముగ మనోహరముగ లఘువుగ మలబద్ధకారిగ త్రిదోషముల బోనడచునదిగ నుండు.

గోమేధిక శుద్ధి

శ్లో॥ తతో గోమేధికం వాజి మూత్రే భావ్యం దినత్రయమ్
తతో విదారిస్వరసే భావ్యం శుద్ధిర్భవిష్యతి.

తా. గోమేధికమును గుఱ్ఱపుమూత్రములో 3 దినములు నానబెట్టి పిదప నేల గుమ్మడుగడ్డ రసములో నానబెట్టిన శుద్ధియగు.

గోమేధిక భస్మము.

శ్లో॥ శుద్ధగోమేధికం కృష్ణ దుత్తూర ద్రావభావితమ్ ।
విశ్వకర్మపుటేదగ్ధ్వా త్రివారం భస్మ చాప్ను యాత్

తా. శుద్ధిచేసిన గోమేధికముల నల్లయుమ్మెత్తాకు రసములో 3 మార్లు * భావనజేసి కొలిమిలోనునిచి యూదిన భస్మంబగు.

గోమేధిక భస్మగుణము.

శ్లో॥ గోమేధికం కఫహరం దీపనం బలవర్ధనమ్ ॥

తా. గోమేధికము కఫమును హరింపం జేయుటయే గాక అగ్నిదీపనమును బలమును గలుగంజేయు.

ప్రవాళ నామములు.

శ్లో॥ [నిఘంటౌ] ప్రవాళోంగారకమణి ర్విద్రుమో మాబోధిపల్లవః ॥

తా. ప్రవాళము అంగారకమణి విద్రుమము బోధిపల్లవము అనునవి ప్రవాళ నామంబులు.

* భావనయన — నానబెట్టుట.

## ప్రవాళ శుద్ధి.

శ్లో॥ జంబీరనీరాంతరేణ భావితంయామమాత్రకమ్ ।
ఉష్ణోదకేక్షాళయిత్వా శుద్ధంభవతి విద్రుమమ్ ॥

తా. పగడముల నిమ్మపండ్లరసములో 1 ఝాము నానబెట్టి యుష్ణోదకముతో గడిగిన శుద్ధియగు.

## ప్రవాళ భస్మము.

శ్లో॥ తద్విద్రుమం రవిక్షీరై ర్భావితం దివసత్రయమ్ ।
ఏవం గజపుటేపాచ్యం భస్మీ భవతి తత్క్షణాత్ ॥

తా. శుద్ధిచేసిన పగడముల జిల్లేడుపాలలో 3 దినములు నానబెట్టి మూకుడ్లలోబోసి చీలమన్నులిచ్చి గజపుటంబిడిన తత్క్షణమున భస్మంబగు.

## ప్రవాళ గుణము.

శ్లో॥ ప్రవాళం రక్తపిత్తఘ్నం రక్తాతీసారనాశనమ్ ।
ప్రదరం రక్తశూలఘ్నం గ్రాహీపైత్త వినాశనమ్ ॥

తా. పగడము రక్తపిత్త రక్తాతిసార ప్రదర రక్తశూల పైత్యరోగముల హరింపంజేయుటయేగాక మలబద్ధకారిగనుండు. (పగడభస్మములో మామిడిచెక్క రసము 3 నూనె బొట్లు గలిపి సేవించిన రక్తకుసుమములను; ఆరెచెక్క రసముపంచదార జీలకఱ్ఱగలిపి సేవించిన కుసుమములును; చింత చిగురు 7 మిరియముల చూర్ణముగలిపి సేవించిన తెల్లచీరెలను; ఆరెచెక్కరసముగలిపి సేవించిన తెల్లచీరెలను హరించు. పథ్యముచప్పిడి.)

## రోగానుక్రమణిక.

శ్లో॥ ఆమదోష వ్యారేచాతి సారేచ గ్రహణీకృశే । క్రిమిదోషే
రక్తపిత్తే సృగ్దరే కామిలాహలీ । పాండురోగే క్షయేగుల్మే
జఠరార్శాంసివిద్రధిః । మూత్రకృచ్ఛ్రాశ్మరీమేహే వృద్ధ్యా
మప్యుపదంశకే । శ్వాసకాసేచ హిక్కాయాం ఛర్ద్యాం తృష్ణా
హృద్రామయే । శూలోదావర్త ఆనాహే మారుతే వా

శోణితమ్ । కుష్ఠే విసర్పిశోఫేచ శ్లీపదేచ మదాత్యయే । తున్యష్ఠీలక సోమేచ కర్ణనాసా గళస్థితే । ముఖరోగే శిరోరోగే నయనామయకే వ్రణే । వ్రణేచ వివిధేచైవ భగందర గదేతథా । గ్రంథ్యర్బుద గదేక్షుద్రే స్ఫోటకే గుహ్యకే గదే । వంధ్యాదోషే గర్భదోషే గర్భిణీ సకలామయే । ఆమోదరే ప్లీహరోగే స్థౌల్యరోగేచ మర్కటీ । విషూచ్యాం వహ్నిమాంద్యేచా జీర్ణే వై కాయదోషజే । జ్వరాశ్చ స.. దోషాశ్చ సన్నిపాతాస్త్రయోదశ । సూతికా బాలరోగాః మున్మాదాపస్మృతావపి । మదమూర్ఛా గ్రహగదే సన్న్యాస సక గదేపిచ । ఇంద్రలుప్తే వలీరోగే ఛాయారోచే ఫిరంగికే స్వరభంగామయే లూతే చామ్లపిత్త గదేపిచ । తథావరణ పైత్తేచ విశ్వే భుజగదంశనే । మూషకాది విషాద్రోగే కృతిమా కృతిమేవిషే । చికిత్సాశ్చాపిపథ్యాని బీజపాషాణ హేతుకే । పరిపాక స్సర్వరోగే పథ్యాపథ్యం చికిత్సితమ్ । రసలోహ విధిర్యత్ర రోగవర్గో యథాక్రమమ్ । అసాధ్య సాధ్యరోగాశ్చ ప్రోక్తాస్సత్యంనసంశయః । శ్రీనీలకంఠవంశాబ్ధి చంద్రమాంబసవాహ్వయః । అవోచంవృషరాజీయమహం వైద్యశిఖామణిః । పంచవింశత్ప్రకరణైర్యుక్తంవిద్వన్మనోహరమ్ । కలౌహితకరంనౄణాం సర్వరోగనివారకమ్॥

టీ. ఆమాతిసారము జ్వరాతిసారము అతిసారము గ్రహణి కార్శ్యరోగము కృమిరోగము రక్తపిత్తము అసృగ్ధరము కామిల హలీమకము పాండువు క్షయము గుల్మము జఠరరోగము అర్శస్సు విద్రధి మూత్రకృచ్ఛ్రము అశ్మరి ప్రమేహము వృద్ధి రోగము వుపదంశము శ్వాసము కాసము మొదలగు శ్లేష్మరోగములు యెక్కిళ్ళు ఛర్ది తృష్ణ హృద్రోగము శూల వుదావర్తము ఆనాహము వాతరోగము రక్తవాతము కుష్ఠువు విసర్పి శోఫ శ్లీపదము మదాత్యయము తుని ప్రతితుని అష్ఠీలా ప్రత్యష్ఠీలా సోమరోగము కర్ణరోగము నాసారోగము గండమాల (గళరోగము) ముఖరోగము శిరోరోగము నేత్రరోగము మండి డొక్కమండి వదనదౌర్గంధ్యము దంతరోగము చనుమాడలు జంతుకవ్రణము మురికిసొన్నారినూతిపుండు కరపాదరోగము అస్థిస్రావము

మొదలగు నానా వ్రణములు భగంధరము గ్రంథి అర్బుదము క్షుద్రరోగము కాలస్ఫోట విషస్ఫోటకములు అస్యస్ఫోటకము గుహ్యరోగము వంధ్యాదోషము గర్భదోషము గర్భిణీరోగములు ఆమరోగము వుదరము ప్లీహము (జలకూర్మము) స్థౌల్యరోగము మర్కటీరోగములు విషూచి అగ్నిమాంద్యము జీర్ణము కాయదోషము జ్వరములు సప్తవిధదోషములు అష్టధాతునిదానము మూత్రపరీక్ష త్రయోదశసన్నులు ప్రసూతి రోగము బాలరోగము వున్మాదము అపస్మారము మదము మూర్ఛ గ్రహదోషము సన్న్యాసకము యింద్రలుప్తము వలీరోగము ఛాయారోగము ఫిరంగిరోగము సర్వ భంగము లూతవ్రణము అమ్లపిత్తము ఆవరణపిత్తము సర్పవిషములు యెలుకవిషము స్థావరజంగమవిషములు అశుద్ధపారద పాషాణదోషములు రసలోహశుద్ధ్యాదులు నవలోహభస్మ తద్గుణంబులు సర్వరోగపరిపాకంబులు రోగసాధ్యాసాధ్యంబులు చికిత్సానుపాన పథ్యాపథ్యంబులు మొదలగువాని నన్నిటిని గలిగియుండునటుల నీలకంఠవంశ క్షీరసముద్రమునకు చంద్రుడనై వైద్యశిఖామణియను బిరుదుచే వాసి కెక్కిన బసవరాజను నేను కలియుగమున నరులకు జనించు సర్వరోగ నివారణార్థంబై 25 ప్రకరణంబులుగల వృషరాజీయమను నీగ్రంథమును సత్యముగ నిస్సంశయముగ పండితమనోహ్లాదకరముగ రచియించినాడను.

ఇతి శ్రీ నీలకంఠ చరణారవింద తీర్థప్రసాద పారావారభోగవిహార పారీణనిడి
మామిడి భగసత్సంప్రదాయ కారాధ్య రామదేశిక శిష్యోత్తమ నమశ్శివాయ
సత్పుత్ర పవిత్ర కవితాచాతురీధురీణ వైద్యజన శిరోభూషణకంఠ
కొట్టూరు బసవరాజ నామధేయ ప్రణీత శ్రీ బసవరాజీయే ఆంధ్ర
తాత్పర్యసహితే రసగంధకాది ద్రవ్యశుద్ధి ద్వాదశలోహ
శుద్ధి తద్భస్మసింధూర ద్రుతిక్రమ తత్సేవనానుపాన
మృతలోహ మృతికరణ హేమాది పరీక్షాక్రమా
భ్రకశుద్ధి తద్భస్మ నిశ్చంద్రికా మృతీకరణ
నవరత్నశుద్ధి తద్భస్మక్రమ తత్సేవనా
గుణాదియుక్త పంచవింశ
ప్ర క ర ణ మ్.

---

**బసవరాజీయనామక వైద్యశాస్త్రం సంపూర్ణమ్.**